


# సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు

డాక్టర్. కే. ఎన్. కేసరి

సంపుటము 2.] [సంఖ్య 1.

లోధ్ర ముద్రాలయము, మద్రాసు

1929

౦॥ చందా రు. 4. విడిపత్రిక అ. 6.

# గృహలక్ష్మి

స్త్రీల ఆయురారోగ్య ఐశ్వర్యముల పెంపొందించుట కేర్పడిన

సచిత్ర మాస పత్రిక.

సంపుటము 2. మార్చి 1929. సంచిక 1.

## విషయసూచిక.

# గృహలక్ష్మి.

## స్వవిషయము

"గృహలక్ష్మి" కొక వత్సరము గడచినది. ఒకమాసమునకన్న యింకొక మాసము యెక్కువ కళలతో వెలుగుచువచ్చినది. ఆంధ్రసోదర సోదరీమణుల యాదరణ కెంతేయు పాత్రమై యే ఆశయములతో ప్రారంభింపబడినదో ఆ యాశయములను చాలవరకు నెరవేర్పగలిగినది.

ఆంధ్రమున స్త్రీలకై ప్రత్యేకముగ ప్రచురింపబడుచున్న పత్రిక లేని కారణముననే మేమీ "గృహలక్ష్మి" ప్రచురణమునకు గడంగియుంటిమని చదువరులెఱుంగుదురు. స్త్రీలయొక్క ఆరోగ్యము, విద్య, సద్వర్తన, గృహనిర్వహణము—యివి యెప్పుడభివృద్ధినంది సక్రమమార్గమునబడునో అప్పుడే జాతియు దేశమును బాగుపడగలవు. ఆదిని స్త్రీలయందు విద్య తక్కువగనున్నది. చదువుకొనినవారలలోకూడ చాలమంది ప్రాథమికవిద్యలతోడనే విద్యల ముగించియుండిరి. ఆ కారణమున అట్టి సోదరీమణుల కున్నత సందేశముల నంద జేయవలయునని లలితపదభూయిష్ఠమై సులభగ్రాహ్యమైన ఆంధ్రపత్రిక అవసరము. ఉన్నతాదర్శములను మా సోదరీమణులయెడ నెంతవరకుంచగలిగితిమో, యెంతవరకువారికి సుపథముల జూపగలిగితిమో యెంతవరకు వారిహక్కులకొరకై సంఘనాయకులతోడను ప్రభుత్వముతోడను పోరాడి ఫలముల బడయగలిగితిమో చదువరులే నిర్ణయించవలసియున్నది.

ఆంధ్రరాష్ట్రమందన్ని ప్రాంతములనుండియు పత్రికయొక్క ఆవశ్యకతను గురించియు పత్రికయొనరించుచున్న మహత్తరకృషిని గురించియు చాలమంది సోదర సోదరీమణులు మాకార్యాలయమున కనేక లేఖలను వ్రాసి వలయునంత ప్రోత్సాహ మొసంగియున్నారు. వారల కెంతయు కృతజ్ఞులమైయున్నారము.

ఆంధ్రసోదరీమణులు తమ సారస్వత సత్తువగు గద్యపద్య వ్యాసరాజముల నొసంగి పత్రికా ప్రచురణ కెక్కుడు సహాయ మొనరించినందులకు వారందరికిని నమస్కృతులు.

ఆంధ్రసోదర సోదరీమణులు పెక్కుమంది చందాదారులుగ చేరి వలయునంత ప్రోత్సాహ మొసగియున్నందులకు వారలు వందనీయులు.

ఆదిని యెట్టిపవిత్రాశయములతో మేమీపత్రికాప్రచురణమునకు గడంగితిమో అట్టి మార్గాన్వేషణమునకు వలయుసందేశముల నంద జేయుటకే పత్రిక యింకముందు కృషి పాటుపడగలదు. కనుక ఇదివరకు ప్రోత్సాహ మొసంగిన ఆంధ్రసోదర సోదరీమణులేగాక యింకను వందల కొలదిమంది వలయు సహాయమును చేయుదురుగాక యని కోరుచున్నారము.

"గతవత్సరపు పంట ఘనమైనదైన
అలరంగవలె నంతకధిక మీయేట"

చెన్నపురి.

సంపాదకుడు.

# స్త్రీలు : జాతీయత

రాజకీయ విషయములయందు స్త్రీలు పాల్గొనుటయా యను సమస్యగురించి వాదనల సల్పువారు నేడెందరో భారతదేశమున కలరు. ఆదియందు వారలకు తగిన సమాధాన మొసంగవలసిన బాధ్యత సర్వవిధసంస్కారము నాసించు భారతీయసంస్కారాందోళన చేయు వారలయందున్నది. పాశ్చాత్య దేశములయందు స్త్రీలు వ్యాయామక్రీడలయందేమి, వ్యర్తకమందేమి, ఉద్యోగములందేమి, రాజకీయములయందేమి పురుషుల కెంతమాత్రమును వెనుబడమన్నరీతిని సంచరించుచుండుటను చదువరు లెరుంగుదురు. ఆకారణముచేత పాశ్చాత్యదేశము లభివృద్ధినొందుచున్నవా లేక అధోగతి పాలగుచున్నవా యనువిషయముగురించి యించుక నాలోచింపవలసియున్నది. నిజముగ నిదియొక సమస్య. ఎట్లు నిర్ణయించి చెప్పుటకు యిది సమయముకాదని మామనోగతాభిప్రాయమైనను ప్రస్తుతపు పోకడల గమనించుటనుబట్టి ఫలాఫలముల గురించి కొలది సూచనల గావింప బూనుకొనెదము. పురుషులతో సర్వవిధములగు వృత్తులందును వ్యవహారములందును స్త్రీలు పోటీచేయుట కిదివరకే పూనుకొని యుండిరి. రాజకీయ పారిశ్రామికాది విషయములయందు స్త్రీలు పురుషుల పథమున కడ్డురాకుండ నుండవలయునని భారతదేశమందలి పురుషులెట్టి కట్టుదిట్టముల గావించిరో అట్టికట్టుదిట్టములనేగావించి పాశ్చాత్యులుకూడ దాటిరాగూడని నిర్ణయస్థానములని 'బిరులు' గీసి యుండిరి. ఎక్కుడు కట్టుడులకులోను గావింపబడియుండిరి. స్త్రీలే స్వయముగ నియమముల నల్లంఘింప వలసివచ్చినది. ఏనాడు పాశ్చాత్య స్త్రీలిట్లు తమ యభివృద్ధికై పాటుపడ ప్రారంభించిరో నాటినుండి నేటివరకును తమపట్టినపట్టు విడువకుండ నూతన పథమని తలచిన ప్రతివిషయమునను కొంతయభివృద్ధి కనుపఱచియున్నారు.

భారతదేశమందలి స్త్రీలలోకూడ నేడు సంస్కారము తలసూపియున్నది. కాని యీదేశమందలి స్త్రీలు పాశ్చాత్యస్త్రీలవలె స్వయముగ నాదియందంత కష్టముల పాలు పడవలసిన యవసరము లేక పోయినది. స్త్రీలు బానిసలవలె యింటపడియుండవలయునని వాదించువారు నేటికిని కొలదిమందియున్నను సంస్కారహృదయులగు చాలమంది పురు

షులు స్త్రీలయభివృద్ధి నాసించి తీవ్రప్రయత్నముల నొనరించుటయేగాక నలయు సహాయ మంతటిని గావించిరి. నేడు భారత నారీమణులు తమంతట తామే తమ [illegible] యభివృద్ధికై పాటుపడుటకు సన్నద్ధులై యుండు టానందదాయకము.

ఈకారణముచేతనే పదివత్సరములకు యిప్పటికి భారత వ్యవహారములలో యెంతేని మార్పు కానుపించుచున్నది. భారతీయులలో నూతన భావములు, దేశభక్తి మున్నగు సద్గుణ జాలములభివృద్ధి నొందుచున్నవి. విద్యాగంధము గలిగి స్వాతంత్ర్య [illegible] మున కలవడిన స్త్రీలుగల గృహములు ధనలోప ముండినను కలకలలాడుచు ఉన్నతాశయముల నిడుకొని వర్ధిలుచున్నవి. పురుషులు విద్యావంతులై యుండి స్త్రీలు చదువనన నెట్టిదో యెరుంగకయున్న గృహములయందేదియో యొక కొరత కానవచ్చుచునేయుండును. గృహనిర్వహణమందో, బంధుసన్మానమందో, ప్రజాహితకార్య నిర్వహణమందో లోపములు కానుపించుచునే యుండును. విద్యావతులున్న గృహములయం దీలోపములుండగా నుండవని నొక్కి వక్కాణింపవచ్చును.

స్త్రీలుగానిండు పురుషులు గానిండు మిడిమిడిజ్ఞానము గలిగియున్నచో వారుచేయు కార్యము మంచిదో చెడ్డదోయను విషయముగురించి సరిగ నాలోచింపజాలరు. అందు వలననే అర్థజ్ఞానముగలవారు యితరదేశీయుల నాగరకతలగానిండు ఆచారములగానిండు గమనించి, వాటియందలి చెడ్డల గమనింపకుండనే అనుసరించుటకు పూనుకొనియెదరు. అట్లు గాకున్నచో తామనుసరించుచున్న ఆచారములలో చెడ్డవైనవియున్న వానిని మూలకుత్రోసివేయుటకైన ప్రయత్నింపరు. ఈకారణములవలన జాతీయత నశించుటయు దేశభక్తియడుగంటుటయు తటస్థించుచున్నది.

మొత్తముమీద విషయనిర్ణయమునకు గడంగుటకన్న ఒక్క భారత దేశము గురించియే ముఖ్యముగ ఆలోచింతము. భారతదేశమందు ప్రస్తుతము జాతీయత చాల వరకు నశించినదని చెప్పవచ్చును. దేశీయమహాసభ మున్నగు రాజకీయ సంస్థలిందులకే మూడువంతులు ప్రయత్నించుచున్న వనవచ్చును. భారతదేశమున జాతీయత పునరుద్ధరింప బడవలయుననినను అది గృహములనుండియే ప్రారంభింపబడవలయును. అందులకు గృహిణులే ముఖ్యముగ పూనుకొనవలయును. నాగరకతా చిహ్నములు గలిగి, విద్యాపరిజ్ఞానముగల తల్లి ఉగ్గుపాలతో జాతీయత కలిపి బిడ్డలకు పట్టుటకవకాశము గలదని నొక్కి వక్కాణింపవచ్చును. జోలపాటలలో జాతీయత గురిపింపవచ్చును. కట్టుగుడ్డలతో స్వదేశ

వస్తువులపై అభిమానమును బుట్టింపవచ్చును. నిత్యవర్తనమందున్న తాశయముల నాదర్శముగా నిడుకొనులాగున చేయవచ్చును. చిన్నచిన్న పాఠములఁజెప్పు సమయాన స్వదేశాభిమానము గలిగింపవచ్చును. అట్టితరిబీదునందిన ప్రతిబాలుడును ముందు ముందు భారతదేశమందు వ్యవహరింపవలసిన పురుషుడగుచుండును. ఈకారణమున దేశమందు జాతీయత త్వరలో వ్యాప్తముకాగలదు.

నిజముగ దేశహితమును గోరువారు స్త్రీలకునలయు సౌకర్యములను గలిగించి వారలకు జ్ఞాన సముపార్జనకు వలయు నవకాశముల నేర్పరచుటవసరమని మా యభిప్రాయము. అందువలన దేశమున జాతీయభావములు త్వరలో ప్రజలయందు వ్యాప్తి నందుటయేగాక గాఢముగ నాటుకొని పోవును.

జాతీయవిషయములయందు పురుషు లెంతటి శ్రద్ధ వహించుచున్నారో స్త్రీలుకూడ నంతటి శ్రద్ధనే వహించగలరు. ఏనాడు స్త్రీలు అర్హస్థానముల బడసి తాము నిర్వహింపవలసిన కార్యక్రమము నెరుంగ గలుగుటకు తగినస్థితికి రాగలిగెదరో ఆనాటి నుండియే భారతభూమి జాతీయభావపూరితమై అభివృద్ధినందగలదని ప్రతి భారతజీవియు నెరుంగవలయును.

## పతిభక్తి

పతి భక్తి సతులకుఁ బరమ శీలంబు
పతి భక్తి సతులకు భాగ్యమూలంబు
పతి భక్తి సతులకుఁ బరమభూషణము
పతి భక్తి సతులకు భాగ్యపోషణము
పతి భక్తి సతులకు భయనివారణము
పతి భక్తి నిఖిల శోభనకారణంబు
పతి భక్తి నింతికిఁ బడయంగరాని
యాతు లిత పుణ్యంబు లవియొండుఁ గలవు?

—గౌరన మంత్రి

# కలకంఠకంటికన్నీరు

"ఆంధ్రసాహిత్య సరస్వతి" కవిరత్న నరసింహశాస్త్రిగారు

వసంతకాలమున మావిగున్ననుజేరి బాలరసాలపల్లవముల మనసార మెసవి యానందమున హాయిగా గానాలాపనముసేయు కలకంఠి బాలికంగాంచి యానందించుటకు మారు మృగయుఁడు శరములగాడ నేసి కంటఁదడి వెట్టింపఁ జేయుచున్నాఁడు. ఎంతటి కర్కశహృదయము! అక్కటా! ప్రశాంతమయమగు గానసుధ నానుట మాని కంటనీరొలికించుటయు నానందమే? వాల్మీకిమానిచంద్రుఁడు లీలామాధురిం జవిజూచుచుండిన 'క్రౌంచయుగ్మము' నకారణముగాఁ బరితపింపఁజేసిన పుళిందునిగాంచి "శాశ్వతీస్సమాః నిషాదమాగమః"—యని కోపోద్దీపితుఁడై శపించెను. ఆ పరితాపకర[illegible] దృశ్యముంగాంచినపుడా కరుణాస్వరూపుని నవనీతహృదయము కరగిపోయినది. క్రౌంచముతోఁబాటు తానును కంట దడివెట్టుచున్నాఁడు. కరుణామయులహృదయములు కుసుమకోమలములు! కావుననే 'సూరిదాసు' గారు "సంతహృదయ నవనీతసమాన"— యని స్వర్ణాక్షరంబులఁ దమరామాయణంబున లిఖించియున్నారు.

దాంపత్యప్రణయమెంతటి ప్రబలమైనది! భార్యాభర్తల నాజన్మము—జన్మజన్మాంతరములయందును ప్రేమపాశముచే బంధించి ముగ్ధులఁ గావించివైచుచున్నది. పారావత మిథునములు ప్రేమగీతములచేతనే యానందించుచున్నవి. భృంగముభృంగికిని భృంగిభృంగమునకును మకరందధారలఁ బంచిపెట్టుచున్నది. ప్రణయమాహాత్మ్య మట్టిది!

కలకంఠులు పువ్వులకన్న మెత్తనివారు. వారిహృదయములు నవనీతముకన్న మెత్తనైనవి. వారిపల్కులు కలకంఠ కూజితములకన్న మార్దవమును, మధురమును, మంజులమును, మానసానందకరమునై యున్నవి. నేఁడేల! వారి ప్రత్యంగము ముగ్ధత్వమును ప్రణయమును విరజిమ్మజాలియున్నది.

వారిప్రేమ మెంతటి విశుద్ధమైనది! పరిణయమైనదాది భర్తృ చరణకమలములనే పూజించుచు, నాతని దివ్యమంగళ విగ్రహమునే హృదయపీఠమున స్థాపించుకొని యారాధించుచు, విశ్వమును సైతము మఱచియుండును. అలనాఁడు 'శకుంతల' భర్తృధ్యానైకపరాయణ యగుటచేతనే 'దూర్వాసుని' శాపానలమునకుఁ బాత్రకావలసి వచ్చెను. అయిననేమి! అప్పటియామె యానందము శాశ్వతమైనది. అనిర్వాచ్యమైనది. నిజనాథుని సేవయందెట్టి విపత్తు ఘటిల్లిననేమి? ఆనందప్రదమే. "నాథా! నీవులేని యయోధ్యానగరము ఘోరారణ్యసీమ, నీతోడి అరణ్యవాసము అయోధ్యానగర వాసముకన్న ఆనందప్రదమైనది"—అని సీతామాతపల్కి ఆదర్శప్రాయయయ్యెను. 'సుశీల' కుష్ఠువీడి తొడఁగు భర్తను పలువిధముల సహించి ధన్యయయ్యె. భర్తృసేవయందలి యాశయట్టిది.

అంగరాగముల స్వీకరించుచో 'ననసూయ' తోడ సీతామతల్లి "అవ్వా! శ్రీరామచంద్రునకు నే నిరంతర యావనవతినై యుండుట కరంబు ప్రియంబగుట మీవరంబు భక్తిపూర్వకముగా స్వీకరించుచున్నాను" అని పల్కెను. సతియెప్పుడును తన నాథుని సంతోషమునకై పాటుపడుచుండును. తానెన్ని విధములఁ గై సేతలొనరించుకొనినను తనకొఱకు కాదు కాని సౌందర్య పిపాసియైన పురుషుని తృప్తికొఱకే. నాథుఁడారగించువఱకుఁదా నారగింపదు. భర్తశయనించుచో నాతని సేవ యొనర్చుచు నాతఁడు నిదురించువఱకుఁదా నిదురింపదు. ప్రభాత కాలమున భర్త కన్న మున్న మేల్కాంచి కాలోచిత కృత్యములాచరించి కుంకుమ శోభితయై భర్తను భక్తితో మేలుకొలుపును. పనివడిసేయును. సర్వ విధముల నాతని సంతృప్తి బరచుటకు యత్నించును. కథాకథన మేల? ఆతని యానందమే తన యానందము! ఆతని సంతాపమే తన సంతాపము! ఆతఁడే ప్రత్యక్షదైవము ప్రాపు పడుగడ ఆశ్రయము సర్వము! "ఆర్తార్తే ముదితే హృష్టా ప్రోషితే మలినాకృశా మృతేమ్రియేతయానారీ సాస్త్రీజ్ఞేయాపతివ్రతేతి" అని స్మృత్యుక్తి.

పుట్టినదాది నల్లారుముద్దుగాఁ బెంచి పెద్దజేసి విద్యాబుద్ధులు గఱపిన తమ్మెంతగనో ప్రేమించుచు నేసమయమున నేదివలసినఁ దెచ్చియిచ్చుచుఁ బువ్వులఁబెట్టు సోదరుల—తమకుఁ దోడునీడయైన సెలియండ్ర—సర్వులను సర్వమును విడనాడి భర్తపై ప్రేమచేఁ గలకంఠులు సంతోషముతో భర్తయింటికి వచ్చుచున్నారు. అట్టి సతీమణులఁ

పురుషులేరీతిఁ బ్రేమించవలయునో, సంతసపెట్టవలయునో యెఱుంగవలయు నింత మాత్రమేనా? "ఇయంగేహే లక్ష్మీః" అని శ్రీరామమూర్తి నుడివియున్నాఁడు. సతీమతల్లిక యింటికరుదెంచిన "గృహలక్ష్మి". మన శుభాశుభములు—సిరిసంపదలు—నామెపై నాధారపడియుండును.

తళుకు బెళుకులతోఁ జెంతఁజేరిన కురంగశాబకమును—బాహుశాఖ సధిరోహించి 'నాధా నాధా' యనుచు ముద్దుగా ప్రణయగానము నొనరించు శుకశావకమును—ప్రేమతోఁ జెంగట జేరి ఫించము విప్పి ప్రణయనర్తన మొనరించు మయూరాంగనను—నొప్పించుటొక యానందమా? శౌర్యమా? నమ్మి చెంత జేరిన సతిగొంతు కోయుటయుఁ బురుష లక్షణమా? అట్టి ప్రేమధనుల వంగిన, లేచిన, తుమ్మిన, దగ్గిన, కూర్చుండిన, నిలుచుండిన, తప్పుబెట్టి నిష్కారణముగా నొప్పించు పాషండుని గృహమున సిరియెట్లుండఁగలదు? ఎన్నఁటికి నుండనొల్లదు! ఉండనొల్లదు! కలకంఠము నొప్పించిన పుళిందునకుఁ గల్గిన శాపమునకన్న కలకంఠుల నొప్పించు పాషండులకు వేయిరెట్లు తీవ్రముగాఁ గలుగవలసియున్నది.

"కలకంఠకంఠి కన్నీరొలికిన సిరియింటనుండ నొల్లదు సుమతీ"

మదనపల్లి

కవిరత్న నరసింహశర్మ.

# నాగరికత

శ్రీమతి రాళ్లభండి సీతాలక్ష్మమ్మ గారు

హిందూ కుటుంబములలో యిప్పటి కాలపు నాగరికతలను జూడ ఆశ్చర్యమును, దుఃఖమును గలుగజేయుననుటకు సందియము లేదు. జీవితయాత్రకు ముఖ్యముగా కావలసినవాటిలో భోజనము, వస్త్రాలంకారములు, నడవడిక నిరాడంబర మగునదిగా నుండవలెను.

అప్పుదీసి పక్వాన్నము దినుటలో ప్రయోజనము లేదు. ఆహారము ఆరోగ్యకరమై మితమైనదిగా నున్న యెడల రోగములు రావు. వెలగల శాకవర్గములును, పాయసాన్నములును అనారోగ్యమేగాని ఆవశ్యకముగాదు. అనావశ్యక భోజనము అప్పుదీసి జేసిన నెంతయో, భాగ్యముండి జేయుటయు నంతియే. సాధారణముగా హిందూ కుటుంబములలో భోజనమునకుగాను జేయు దుర్వినియోగము చెప్పతరముగాదు. మిక్కుటముగా తిని, తిన్నంత బారవేయుట యొక క్రొత్త సంగతిగాదు. పులినిజూచి నక్కవాత బెట్టుకొన్నట్లు భాగ్యవంతులని చెప్పబడు కొందరు జేయు దుర్వినియోగమును బీదలు సహా ఋణము జేసియైనను దుర్వ్యయము జేయుచున్నారు. ఇట్లు చేయకున్న తమకు గౌరవముండదని వారి భావము. ఏదో కొంత ప్రతిష్ఠార్జితముగల వారెందరో యీ ఆహార బాటునకులోనై తమకుగల కించిదాస్తిని ధారబోసికొని భిక్షాటన మొనరింపవలసిన వారలగుచున్నారు. ఇట్టి అనవసర వ్యయములలో మొట్టమొదటిది కాఫీపానీయము. స్త్రీ బుద్ధిశాలియగు పట్ల యిట్టి దుర్వ్యయము నిలుపుదల గావింపదగినదే. దీనికై జేయు వ్యయము దుర్వ్యయమని ఒక్క మాటలో జెప్పనతీరదు. నిత్యకృత్యములలోగాని, వివాహాదిసమయములలోగాని కాఫీపానీయము మన దేశములో అనావశ్యకమని చెప్పకతప్పదు. చలిదేశస్థులకది రుచించునేమోగాని ఉష్ణదేశస్థులగు మనకది యనావశ్యకమె గదా? కాఫీనీళ్లను త్రావుట ప్రస్తుతకాలమునకు నాగరికతయైనది. మన తాత ముత్తాతలు కాఫీనీళ్లను త్రావుచుండిరా? దానిని పానము జేయుటవలన దేహారోగ్యమా? రెండునుగావు. మనబుద్ధిహీన

తయే కారణము. పెద్దవారలకిది కొంతకాలమునకు మూత్రవ్యాధిని తెచ్చిపెట్టును. పిల్ల వాండ్రకు కడుపులోగడ్డ మొదలగువ్యాధులను గల్పించును. బీదవారికి సుఖమునుగాని తెచ్చును. భాగ్యవంతులు దానివలన దుర్వ్యయులగుదురు. భాగ్యవంతులమాట యటుండ నిండు. సామాన్యజీవనులకది యొకతలక్రిందిగుండు. వారు సంపాదించు స్వల్పధనములో కనీసము మూడవవంతు, పాలు, చక్కెర, కాఫీగింజలు వీటికిజాలదు. మిగిత రెండుభాగ ముల వేతనముతో కుటుంబమును బోషించుటెట్లు? భవిష్యత్తునకాధారముగా వీరు ఆర్జించుటెలాగు? తలనొప్పియని త్రాగువారుకొందరు. మాయింటివారు త్రాగుదురని త్రాగువారుకొందరు. సోదరీమణులారా, నాగరికత కాఫిద్రావకములో నవసరములేదు. మితాహారమును గృహములందు వాడుకజేయుచు కాఫీని యిట్లు విడిచి ఆరోగ్య భాగ్యమును పెంపొందజేయ వలయును.

స్త్రీల కలంకారము ముఖ్యమేగాని యోచించిజూచిన విలువగల నిగనిగలాడు రంగుల బట్టలు, అమూల్యాభరణములు అలంకారమునకు ముఖ్యములుగావు. స్త్రీలకు గుణమే యలంకారము. శుభ్రమగు వస్త్రమెంతయో అలంకారము. గొప్ప అంచులు గలిగి, మురికియై, ఉదుకబడజాలని పెట్టెచీకుడు బట్టలు శ్లాఘ్యనీయములు గాజాలవు. వెలస్వల్పమైనను, శుభ్రమగు వసనము గట్టి ముఖమున కుంకుమ బొట్టు దాల్చు స్వచ్ఛ భాషిణియగు స్త్రీని జూచినంత మాత్రముననె జూపరికాహ్లాద మొదవుటయెగాక ఆమెయెడనామె కెన్ని బ్రణామము లిడినను తనివి తీరదు. ఇట్లుగాక విలువగల నలిగిన వస్త్రముల ధరించి, పెట్టెడు సొమ్ముల నొడలిపై జారవైచికొని పాడుముఖముతో వస్తువేసిన పలాల్పు త్రేగు చిటమటలాడు స్త్రీనిజూచిన అసభ్యత గోచకమానదు.

స్త్రీలకు అలంకారము లన్నిటిలో ముఖ్యమగునది మంచి నడనడికే, గృహస్థునకు సుగుణవతియగు భార్యయే యలంకారము. ఇట్టి సుగుణ భూషణియే గృహిణియనియు గృహలక్ష్మియనియు ననబడదగినది. కులకాంతలు తమ భర్తలనే దైవముగా నమ్మెదరు. భర్తకు సమానమైన వస్తువు వారికి గోరదగినదేదియు ప్రపంచములో లేదు. మంచినడవడికలు నేర్చుకొని జీవించు వారరుదు. బాల్యమందు తలిదండ్రులును, యౌవ్వనమందు భర్తయు అత్త ఆడుబిడ్డలును, స్త్రీలకు గుణముల గరుప

నలసినవారు. తమ యింటికి గోని తెచ్చిన కోడలిని అత్తలు, ఆడుబిడ్డలు, మంచి నడవడి కలది, పనిపాటలను నుంచి గౌరవముతో గరపి, సుగుణవతులుగ జేయగల బాధ్యతవారిపై యున్నది. అట్లు చేయ లేనివారు నారదాది నరకమున కతిథులుకాగలరు "షట్కర్మ యుక్తా కులధర్మపత్నీ" యన్నట్లు భర్తకు మంచినడవడికలుగల పత్ని యావశ్యకమైనది. రావణ సంహారానంతరము లోకాపవాదమున సీతను గోల్పోయిన శ్రీరాముడు అశ్వమేధ యాగమును సీత లేనిదే చేయుటకు యోగ్యత లేనివాడై మాయాసీతను గల్పించి యాగపూర్తి చేసినట్లు ఉత్తర రామాయణములో జెప్పబడిన కథయందరికి తెలిసినదే. పుట్టినయింటికిని మెట్టినయింటికిని కీర్తి తెచ్చువారు గుణవంతులగు స్త్రీలే. అట్టికీర్తి గడించునట్లు బుద్ధిగరుపదగినవారు అత్తలు ఆడుబిడ్డలు. అత్తలు తమ కోడండ్రను తాముగన్న కూతుండ్రవలెను, ఆడుబిడ్డలు తాము పురదండ్రను తమ చెల్లెండ్రవలెను, భావించి బుద్ధులు గరపవలెను. అట్లు జేసినచో వారు మోక్షమును బడయగలరు. తాముగన్న కూతురత్తవారింట గష్టపడుచున్న నెట్లార్తి చెందుదురో తమకోడండ్ర విషయమునట్లేగదా? ఇతరులు నీకెట్లు జేయవలయునని నీవు కోరుదువో నీవును వారికట్లే జేయుము. గృహిణి తన భర్తకుగల సుఖదుఃఖములను సమానముగా భరించవలెను. శక్తికిమించిన వస్త్రాభరణములను తెమ్మని తన భర్తను నిర్బంధింప తగదు.

చిత్తూరు

బాళ్లభండి సీతాలక్ష్మమ్మ.

# బాలవితంతు విలాపము

మంగిపూడి వేంకటశర్మగారు

తన మనోహరు నింగితమెఱింగి వర్తిల్లు
    మెలఁతల కీయింతి మేలుబంతి
తన యత్తమామలందున బత్తిపచరించు
    చర్యకీ బోటి వజ్రాలపేటి
తన బావల మఱందులను మన్ననలుచేయు
    పనులకీ కొమ్మ బల్ పట్టుఁగొమ్మ
తన యాఁడుబిడ్డలఁ దనిపి వాసికెక్కు
    ముదితలకీ మించు బోఁటిరాణి

చుట్టపక్కాల సురభియై పుట్టినిల్లు
మెట్టి నిలువన్నె వెట్ట నీమేఁటిబొట్ట
యనఁగ మెచ్చంది కాపురంబాచరింప
నోచనైతిని నిర్భాగ్యనీచనైతి.

చుట్టాల యిండ్లలో శుభశోభనము లంచు
    నీడుగా జోడుగా నేగు సిరియు
దాంపత్యతాంబూల తరుణంబు లంచు బల్
    హారువుగా మురువుగా నరుగుసిరియు
తిరునాళ్ల దేవుళ్ల దరిసెనంబు లటంచు
    నలువుగాఁ జెలువుగా నడుచుసిరియు

పరిగంగ స్నానాల సమయాలటంచు మేల్
పొలుపుగా బులుపుగాఁ బాపుసిరియు

బాలిసా లంచు మరి కన్యాధారలంచు
మించు వేడ్కను బీటల మీఁదఁ జేరి
యింపుగా సొంపుగాను జెంపెసఁగు సిరియు
గగన కుసుమంబె నా మనుగడకు నకట!

భోగినాఁడట్టి మోదమునఁ దలంటుకొని గో
రంటాకు నిడుకొను నట్టి వేడ్క
పువ్వంబుగాఁ జన్నిబువ్వంబు వేగు జా
మున లేచి ప్రీతితోఁ దినెడుఁ వేడ్క
చెలువారు పండు వెన్నెల బైట జతకత్తె
లను గూడుకొని యాటలాడు వేడ్క
ప్రొద్దుప్రొద్దున నోమునునోచి హాయనా
తెలమి నైదువల కందించు వేడ్క

బెడఁగు జడవైచి పువ్వులుముడిచి జిలుగు
చలువవలువలు దాల్చి సంజలను వెడలి
హాయులు మీరంగ నుయ్యాలలూగు వేడ్క
యట్టి తొల్లింటి నిక నెట్టు లనుభవింతు!

పెండ్లికి ముందుగాఁ బెద్దలు నాచేతఁ
గావింపఁజేసిన గౌరిపూజ
పెండ్లికాలమునందు వేదమంత్రాలతోఁ
జేసిన ద్విజుల యాశీర్వచనము
మినుకును గుత్తికంటును స్పృశించిన పుణ్య
సాధ్వీమణులచేతి చల్లఁదనము

పరిపూర్ణ సౌభాగ్యభాగ్యంబు జాతకం
బుల వ్రాసినట్టి జ్యోతిష్యులవచస్సు

మోద మిగురెత్త మాయమ్మ మ్రొక్కఁ జేయ
మించుప్రేమను నన్ను దీవించినట్టి
పెద్దలయుఁ బేరటాండ్రయుఁ బెంపులెల్ల
నాయభాగ్యాన వ్యర్థమైపోయె నకట!

సకల విద్యలయందు శారదయన మించి
యెవరి మానసము మెప్పించుదాన
సదనకృత్యముల వైశద్యంబుఁ జూపించి
యెవ్వరి మనసు రంజించుదాన
చాతుర్యచర్యలఁ జాకచక్యముఁజూపి
యెవ్వరి మదిఁ గరఁగించుదాన
సరసశృంగార వైఖరులెల్ల వెలయించి
యెవరి చిత్తంబుఁ జొక్కించుదాన

కైతలరహించి సంగీతకలన మెరసి
యెవరి సొగియించుదాన హా! యెల్లఁజెడియె
నెవరినలరింప నేర్పులెల్ల నేర్చి
నానొ యామేలిక జగానఁగానఁ గాన!

మందహాసమ! రాకుమా! యింకనావంక
నాకును నీకు ఋణంబుచెల్లె!
ఉత్సాహమా! క్రొత్తయ్యునికినిఁ జూచుకో!
ధూణ్యఁగియ్యుండఁగ లేవు క్షణికమైన

సంతోషమా! మన సంబంధములు తీరె!
నీమేనితోడ నిన్నెనయ లేను
ఆనందమా! పోతివమ్మ! హా! నను బాసి
రావుగా! జన్మాంతరంబుదాక

సౌఖ్యమా! నీవు నేనును శత్రువులము
పొమ్ము! పో పొమ్ము! మనకింక పొత్తు లేదు
భోగినై భోగముల కెల్ల మూలమైన
జీవితేశుండె సన్న్యాసినిఁ జేసెఁగాన!

ఫలమేమి సుహాసకలికల సృజియించి
సౌభాగ్యమును వ్రాయఁజాలవేని?
ఉపాయమేమి సౌందర్యలహరుల సృజియించి
సౌభాగ్యమును వ్రాయఁజాలవేని?
సరాగమేమి సుప్రభాభాసల సృజియించి
సౌభాగ్యమును వ్రాయఁజాలవేని?
రసమేమి శృంగారరాసుల సృజియించి
సౌభాగ్యమును వ్రాయఁజాలవేని?

ప్రతిభ గలవాఁడవఁట! మంచి చతురుఁడవఁట!
ఖ్యాతికినిఁ దగ్గ చేతలే ధాత! నీకు
మొదలె ఛాందసుఁడవుగదా ముదిమి మదిరెమొ
చెడెనో! మాయమ్మ శారద చెప్పలేదొ?

అఖిలలోకముల కిష్టార్థంబు లిచ్చి నీ
తల్లి శ్రీలక్ష్మి రంజిల్లుచుండ

ఆపదోద్ధారకుండై దయాళుండవు నీ
తండ్రి చక్రధరుండు తనరుచుండ

సరసుండు సుకుమారి స్మరుండు నీతమ్ముండు
మిథునంబులనుగూర్చి మెరయుచుండ

ఆశ్రితావలికి విద్యాబుద్ధు లిచ్చి నీ
దేవి వాగ్దేవి వర్ధిల్లుచుండ

ఆల్మగల నెడఁబాపి సౌఖ్యములఁబోసి
శోకముల దాపెదవ దయాశూన్య హృదయ!
తెలియవోగాక యీకాల తీరు దాక
నీకపూజ్యతసుమ్మ! నాళీకజన్మ!

తణుకు

మంగిపూడి వేంకటశాస్త్రి

# భారతరమణి

అంపల్లి శేషగిరిరావుగారు, బి. యె.

"ఎచ్చట స్త్రీలు పూజింపఁబడుదురో అచ్చట దేవతలు క్రీడింతురు. ఎచ్చట పూజింపఁబడరో అచ్చట అన్నిక్రియలు ఫలములేనివగుచున్నవి" అని మనువు చెప్పినాఁడు.

మనువుచెప్పినాఁడు. అవును. నిజమే. భారతీయునికొఱకే. కాని భారతీయుఁడు స్త్రీని దేవిగఁదలఁచి పూజించుసంగతి విస్మరించి చాలకాలమైనది. అతఁడు స్త్రీస్వభావమును అనుమానించినాఁడు; అనుమానించి ఆమెను అవమానించినాఁడు. ఇంటి నాలుగు గోడలనడుమ స్త్రీని ఆమెను ఖైదుచేసినాఁడు; అంధకారమునఁ జెరలాడించినాఁడు. ఆపంజరకీరమునకు వంటయిల్లే వైకుంఠమైనది కుటుంబమే కైలాసమైనది. శ్రమయెఱుఁగక కుటుంబవ్యక్తులను సేవించుటలో నాస్వార్థత్యాగిని జీవితముగడపినది. అంతియేకాని సంఘజీవికకేపనిచేయుటకును ఆమెకు అవకాశము లేకపోయినది. అట్టిచో నిఁక దేశము మాటతలఁచుటకే వీలులేదుకదా!

విద్యలేక, వికాసములేక ఇట్లు పరాభవింపఁబడిన స్త్రీ పతనమునొందినది. ఫలమేమి కల్గినది? పతనమునొందిన స్త్రీ తేజస్సుప్రదాయిని; పతనమునొందిన స్త్రీ వహ్నిసాక్షికముగు సఖ్యమున జన్మాంతమువఱకు తనపార్శ్వవర్తిని—అయియుండఁ బురుషునిబుద్ధికి ఉద్గమనశీలమెక్కడ? అతని ఆదర్శములకు ఔన్నత్యమెక్కడ? తనతనయులకు ఉద్గమనశీలమగుబుద్ధి, ఉన్నతమగు నాదర్శము లేకుండుటవలన శతాబ్దములనుండి భారతమాతదైన్యము ద్రవ్వెడు కన్నులతో నధోముఖమైయున్నది.

ఈ ప్రబోధసమయమునందు హిందూదేశమునకు ముఖ్యావసరము లేవియని సమయ సాంఘికుని ప్రశ్నింపుము. దానికి అతఁడు విద్యావతియైన తల్లి, విద్యావతియైన భార్య, అని ఘోషించును. జాతి నాగరకతా బీజములను పెంచి పోషించును ఆదిశక్తి తల్లి; జాతి మూర్తికి రూపసిద్ధినిచ్చి తన్మహనీయస్థితి నిల్పు శిల్పిని భార్య. లాలన మెఱిఁగిన తల్లి చేతులతోడనే బిడ్డకు అక్షరాభ్యాసము కావలయును. ముగ్ధమోహనమైన భార్య మాటలతోడనే పురుషునకు ఉత్సాహచైతన్యములు కలుగవలయును. మాతృదేవి వాక్కులు ప్రేమపూరితములైనంత మాత్రమునఁ జాలదు, ఆమె సంకల్పములు గంభీరములు గావలయును. అర్ధాంగి చిఱునవ్వు చిగురులు దొడఁగినంత మాత్రమునఁ జాలదు; ఆమె దృక్కులు తమోభేదకములు గావలయును.

గృహస్థాశ్రమమున నూతనముగఁ బ్రవేశింపఁబోవు యువకుఁడు సంఘసేవ, [illegible] స్వతసేవ, దేశసేవ, మానవసేవ, చేయ నుత్సాహముతో నుఱకలు వేయుచున్నాఁడు. కాని ఆ యుత్సాహము అచిరకాలముననే చల్లారిపోవుచున్నది. ఉత్సాహము చల్లారి పోయిన అతనికిఁక కార్యశౌర్య మెక్కడ? ఇట్లగుటకుఁ గారణమేమి? తల్లులును, భార్యలును విద్యావతులు కాకపోవుటయే. విద్యావతిగాని తల్లికి లాలించు నేర్పేకాని [illegible] బెంచు యోగ్యతలేదు. విద్యావతిగాని భార్యకుఁ బ్రేమ చిలికించు [illegible] న్యము ప్రసాదించు ఉత్సాహములేదు. సంఘసేవకుఁడు, సారస్వతాభ్యుదయుఁడు, దేశోద్ధారకుఁడు, మానవ కల్యాణమూర్తి, కావలసిన యువకుఁడే కారణమున ఆత్మ [illegible] మును ఆరాధించు పూజారి యగుచున్నాఁడు; ఉన్నతమునుండి [illegible] చున్నాఁడు.

ఏనాఁడు బిడ్డకు అక్షరాభ్యాసము చేయు యోగ్యత తల్లికిఁ గల్గునో, ఏనాఁడు పురుషునకుఁ గార్యశౌర్యము ప్రసాదించు నుత్సాహము భార్యకుఁ గల్గునో ఆనాఁడు భారత యువకులకీ పూజారితనము తొలఁగిపోవును. అప్పుడు భారతసంఘము అభ్రంకషమైన ఉత్తమ పథమునందును.

కావున స్త్రీకి అట్టియోగ్యత, అట్టి ఉత్సాహము కల్గించుటకు భారతదేశమున నేఁడొక విపుల ప్రయత్నము జరుగుచున్నది. అందు మన ఆంధ్రభూమియందలి అట్టి విపుల ప్రయత్నమునకు కాకినాడయందలి స్త్రీజాతీయ విద్యాలయమును 'హిందూసుందరి' అను స్త్రీల మాసపత్రికయు; రాజమహేంద్ర వరమునందలి సనాతన స్త్రీవిద్యాలయమును, వైశ్యసేవాసదనమును; గుంటూరునందలి శారదానికేతనమును; నెల్లూరునందలి [illegible] దేవి బాలికా విద్యాలయమును; మద్రాసునందలి హిందూయువతీ శరణాలయమును, 'గృహలక్ష్మి' అను స్త్రీల సచిత్రమాసపత్రికయు నిదర్శనములై యున్నవి.

ఈ స్త్రీవిద్యాసంస్థలు చేయుకార్యమును భూషించి పోషింపవలసిన భారము ఆంధ్ర గ్రంథకర్తలపై నిలచియున్నది. అనుకరింపఁదగిన రమణీమణుల చరిత్రలను రచియించి స్త్రీజనములు పఠించుటకు యోగ్యమైన గ్రంథములు లేనిలోపము నివారించి [illegible] మమును వారు ప్రోత్సాహింప వలసి యున్నది.

రాజమండ్రి

ఆంధ్ర శేషగిరిరావు.

# చంటిబిడ్డ లెందు కేడ్చెదరు?

శ్రీమతి దేవరాజు పద్మావతిగారు

చంటిబిడ్డలయేడ్పులు పిల్లలఁగనిన అనుభవజ్ఞులకుతప్ప యితరులకు తెలియుట బహు దుస్తరము. నోరువచ్చినవారి మాటకేమిగాని, నోరురాని వారేడ్చిన యెందు కేడ్చుచుండిరో, ఆయేడ్పునకు గలకారణమేమో, అదియె ట్లుపశమింపబడునో, గోడుపు మొదలుపెట్టిన కొంతకాలమువరకు తెలియనే తెలియదు. అది తెలుసుకొనుట అనునది ఊహామాత్రమేగాని నిజముగా తెలుసుకొనుటగాదు. అనేక విధములగు నాలోచనలు తట్టుట సహజము. ఉపశమన కారకములలో యేచివరకార్యమువల్ల యేడుపు కట్టునో అదేకారణముగా బోలునని భావింతురు. ఇది మానవనైజమని చెప్పక తప్పదు. నా అనుభవమునుబట్టి యేడుపునకు గలకారణములలో కొన్నిటినిమాత్రము యీదిగువ పేర్కొనుచున్నాను.

1. విరేచనము సకాలమున యథారీతిని గాకుండుట.

2. చలికాలమైనయెడల తగిన వెచ్చదనమిచ్చు ఉన్నిగుడ్డలు మొదలగు ఉపకరణములు లేకుండుట.

3. కడుపులో నొప్పిగా నుండుట.

4. ఒడలు దురదగాగాని, చికాకుగాగాని, సకాలమున స్నానము చేయించకుండుటచే గలిగిన లోపమైయుండుట.

5. సమయమున పాల నీయకుండుట.

6. దృష్టి దీయకుండుట.

7. కొందరు వెచ్చని పాలనేగాని చల్లనివి త్రాగరు. అది తెలుసుకొనక తీపి తక్కువగాబోలునని, ఆ చప్పదనము పోవు నిమిత్తము పంచదార మొదలగునవి కలిపి లేనిపోని దురలవాటుల నభ్యాసపఱచి వీలుగానప్పుడు అవి మానుచుండుట.

8. పక్కలుమారు సమయమగువరకు బైట బట్టల నారవేసి అవి తిరిగితెచ్చి పక్క వేయుట.

9. పొడిగుడ్డలనుగాని, చీమలు మొదలగునవి లేని మంచి గుడ్డలనుగాని పక్కగా వేయకుండుట.

10. మూత్రముచే దడిసిన గుడ్డలను బద్ధకముచేతగాని, పొడిగుడ్డలు లేకగాని బుద్ధితక్కువచేతగాని, తీసి ఆరిన గుడ్డలను పఱువకుండుట.

11. గాఢమైన నిద్రపోవలయునను సంకల్పముచే మసలిన నీళ్లుపోసి శరీరమును పాముచేసి దురదలచేత నేడ్పించుట.

12. కడకు యేడుపునకుగల నిజమైన కారణమును కొందరు తల్లులు గుర్తించక యేడుపు ఆరంభమగుట తడవుగా పాలను కుడువబెట్టి అనవసరపుటలవాటులు గలిపి వీలు గానప్పుడు అనిమాని యేడ్పించుట.

ఈపై కారణముల వల్లనేగాక, మఱికొన్నిటివల్లగూడ చంటిపిల్లలు యేడ్చుచుండుట మనము చూచుచునే యున్నాము. ఆయేడుపులకు గల కారణములను తెలుసుకొనవలయునని తెలివితక్కువ గల తల్లులకు తోచదు. అది పిల్లల చెరుపునకే కడకు కారణమగును. ఆకారణమున తమ పిల్లలవల్ల తమకు సౌఖ్యములేదు. సరిగదా పొరుగింటివారి సౌఖ్యములకు సహితము భంగమొనర్చిన వారలై యింట భర్త వల్లను బైట యిరుగు పొరుగువారి వల్లను అనేక అపనిందలపాలుగావలసి వచ్చును. గాన పిల్లల సౌఖ్యము ముఖ్యముగా గమనించుటయందు నేమరుపాటు జెందవీలులేదు. వారు నవ్విన మనము నవ్వుట, వారు పలుకులాడిన మన మానందించుట, వారు యేదైనను చికాకుచేత యేడ్చిన, అది తెలుసుకొనలేక మనము సహితము వారితోపాటు యేడ్చుట జరుగుచున్నది. గాన పిల్లల తల్లులందరు పైకారణముల గమనించి వారల ఆనందమే తమ ఆనందముగాను, వారిసౌఖ్యమే తమ సౌఖ్యముగాను భావించుకొని సంచరించుట శ్రేయస్కరము.

చంటిపిల్లలకు విరోచనము సకాలమున గాకుండుటకుగల కారణములలో ముఖ్యమైనది తల్లియిచ్చుపాలుగాని, లేక డబ్బాలపాలుగాని, అయియున్నది. పోతపాల్లు అనారోగ్యమని అందరికిని విదితమైనవిషయమే. అయినను పిల్లలకు తగినంత పాల్లుండనట్టి కారణములచే పోతపాల నభ్యాసముచేతురు. నాగరికతా లక్షణముల్లు ప్రబలి కొందరు

నవనాగరికులు అతిసుకుమారములగు తమశరీరమార్దవ సౌన్దర్యములు చెడునని నవమాసములు మోసి కన్న తమపిల్లలకు తమపాలనిచ్చుటమాని దాదులచేత పాలిప్పించుట గాని, డబ్బాలపాలు పోసిగాని, ఆవుపాలచేతగాని పెంతురు. స్వాభావికముగా పాలు లేనివారు అట్లుచేసిన సవ్యముగాయుండెడిగాని పాలున్నవారు అట్లుచేయుట తమపిల్లలయెడల గొప్ప నేరముచేయుచుండిరని చెప్పకతప్పదు. ప్రకృతివిరుద్ధములగు నవనాగరికతా బుద్ధులననుసరించి భగవంతుడుసహితము నూతికినగము చెందిన స్త్రీలుగా పిల్లలకు తగినంత పాలనుగలవారుగా సృజించుట లేదు. పిల్లలకు పాలిచ్చుటయనునది అనాగరికుల లక్షణమైనచో వారియురోజములు మేక మెడ క్రింది స్తనముల భాతి యేగదా! వారినట్లుంచి యెంతలాభమో పాలివ్వని తల్లుల కివియుండియు అంతియే లాభము. [illegible] డిప్పుడొచ్చినది గాని పూర్వమునుండి వచ్చినదిగాదు. పశువులుసహితము చేపుటకిష్టము లేని తమ లేదూడలకై అఱచుచు పరువెత్తిపోయి పాలను నోటికందించునేగాని గడ్డినైనను మేయవు. మనప్రస్తుత యీనాగరికతా దుర్నయము పశువులకన్న హీనమైన స్వభావమును నిరూపించుచున్నది. స్త్రీ కుండవలసిన సహజ స్త్రీత్వము లేనిచో అది స్త్రీయని యెట్లనిపించుకొనును? గాన పిల్లలతల్లులు తప్పక పాలున్న యెడల తమపాలనే పిల్లలకిచ్చుచుండవలయును. శిశువుల నిమిత్తమేర్పరచినపాలను వారికివ్వకపోయినచో అది స్త్రీలకే భంగము. అట్లుచేయుట యనునది కొన్ని లేనిపోనిజబ్బులకు కారణమగుచున్నది. తల్లిపాలు లేనివారికి ఆవుపాలు శ్రేష్ఠము. మేకపాలు ఆరోగ్యము, ఉత్తమము. ఇవి రెండును [illegible]. గానతప్పక తల్లిపాలు లేని సమయములపై జంతువులపాలు పట్టవచ్చును. డబ్బాపాలు అనారోగ్యమని పిల్లలతల్లు లందరికిని తెలిసినవిషయమేగాన విశేషించి వ్రాయ లేదు. బ్రిటిష్‌గవర్నమెంటు యిండియా ప్రవేశించినదాదిగా యీపోతపాలు వినియోగము విశేషించినది. ఇంకను విశేషించుచున్నది.

పిల్లలకు ప్రతిమూడేసి గంటల కొకమారు పాలిచ్చుచుండిన చాలును. పిల్లల యొక్క శ్వాశకోశశక్తి ననుసరించి వుక్కిరి బిక్కిరిగాకుండునట్లుగా పాలను యివ్వవలెను. ఒక తడవ కెంతసేపు ఎంతపాల నిత్తురో అదేప్రకారము తరువాతను పట్టవలెనుగాని యేడ్చిన ప్రతిదఫా విశేషించి పాలను యివ్వరాదు. పిల్లలేడ్చుటకు అనేక కారణము లుండునుగాన పాల నిమిత్తమే యేడ్చుచుందురని తలంచుట పొరబాటు. ప్రతిమాటును పాలనిచ్చుచుండినచో చివరకదే అజీర్ణరోగముగా పరిణమించి బల్లలు మొదలగు రోగములకు మార్గదర్శియగును.

శీతోష్ణస్థితిగతుల ననుసరించి పిల్లల శరీర పోషణ గావించుచుండవలెను. వేసవి కాలమున సాయంత్ర సమయమప్పుడు గాలివీచుచుండినచో పలుచని బట్టలను బనియనుల మోస్తరుగా కుట్టించి తొడగవచ్చును. దేహమును బిగువుగా పట్టియుండు మేజోళ్లనుగాని, బూట్సులనుగాని, టోపీలనుగాని, చొక్కాలనుగాని తొడగరాదు. విశేషము శరీరమునకు గాలి, ఎండ తగులునట్లుగా దుస్తులుండవలెను. చీకటి స్థలముల పిల్లల నెప్పుడును యుంచరాదు. వర్షాకాలమున ఒక మోస్తరు వెచ్చని బట్టలనే తొడగవలయును. విశేషించి నీళ్లుపోయరాదు. జలుబు చేయునని అసలు మానరాదు. వారలారోగ్య పరిస్థితుల జాగ్రత్తగా గమనించి నీళ్లుపోయుచుండవలెను. శీతకాలమున వెచ్చనివున్ని, ఫ్లానలు, బట్టలను, కంబళ్ళను వాడుచుండవలెను. వెచ్చగాయుంచుటకే యుపకరణము నైనను వాడవచ్చునుగాని అతి జాగ్రత్తగామట్టుకు మసలుచుండవలెను. కొందరు తల్లులు మంచముల క్రింద కుంపట్లను వాడుదురు. వాటివెచ్చదనముచే పిల్లలు యేడ్చుచుందురు. తల్లులు భరించినంత వేడి పిల్లలు భరించలేరుగదా! అది తెలియక పాలకోసమేగాబోలని క్రిందకుంపటిమాట యిసుమంతయు యోచించక పాల నివ్వనారంభింతురు. అదియెంత తెలివిమైనదో వారే తెలుసుకోవలెను. వారల యేడ్పులకు యేయే కారణములు అనుమానములుగా తోచునో వాటిని వెంటనే నివారణ చేసుకొనుట ముఖ్యము. చేయికాలిన వెనుక చేయునదేమున్నది?

కొందరు చంటిబిడ్డలు కడుపునొప్పిచే గుక్కపెట్టి యేడ్చుచుందురు. అది కడుపునొప్పియని మొదట తెలియక దిష్టి తగిలెను గాబోలునని దిష్టితీయుదురు. ఆకలి గాబోలునని పాలుపట్టుదురు. పాలకోసమే అయినయెడల అవియిచ్చిన వెంటనే త్రాగి యూరకొందురుగాని అది కారణముగాకున్న నూరకొను టెట్లు? ఊరకొనక చెప్పగలరా? పాపము యేదియు చేతగాని అజ్ఞానస్థితి. నోరులేనిచిన్న పిల్లల పెంపు, అతికష్టము. అట్టి శిశువుల బాధ తెలుసుకొనుటకు అనుభవము, గ్రంథ పరిచయము, విజ్ఞానమేగాని వేరు సాధనములేదు. అతిశయమైనరోదన మెవ్వారు గావింతురో వెంటనే కడుపు కాచుట మంచిది. కడుపునొప్పి అయిన గట్టిగానున్న ఆ కడుపు మెత్తపడి బాధ నివారణతో బాటు రోదన మంతరించును. కడుపు కాచుటకు నాగరికతకు సంబంధ మేదియులేదు గాన పిల్లలకు కడుపుకాచుట యుచితము.

నీళ్లుపోయుట బద్ధకించిన చికాకుచే యేడ్చుచుందురు. గోరు వెచ్చని నీరు ప్రతి దినముగాని, రోజువిడిచి రోజుగాని మితముగా పోయుట మంచిది. సకాలమున స్నానము చేయించకుండుటయు పిల్లల యేడ్పున కొక కారణమే.

దిష్టితీయుట అనునది మనలో అనాదినుండి వచ్చుచుండిన ఆచారమైయున్నది. చిన్న పిల్లలకే గాక పెద్దవారలకు సహితము దృష్టితీసెదరు. చిన్న పెద్దయను విచక్షణ యేల? భగవంతునికే పూరేగింపున కవతల దిష్టితీసి పారపోయుట ఆచారమైయుండ కన్నపిల్లలకు తల్లులు దిష్టితీయుటలో తప్పేమియు లేదు. కొందరు విద్యావతులు దిష్టితీయుటకు సిగ్గుపడు దురు. కొందరు హేళనచేయుదురు. బయటవారు చూచుటే దిష్టిగా తలంచరాదు. సర్వ కాలమును చూచుచుండిన యింటివారి కన్నులు సహితము దిష్టిస్వభావము గలవే గాన ప్రతినిత్యము సాయంత్రమున దిష్టితీయుట, పొగవేయుట, మొదలగు ఆచారములను విడనాడక పిల్లల ఆరోగ్యమును యెక్కువగా గమనింతురు గాక.

కొందరు పిల్లలు వెచ్చనిపాలనే గాని త్రాగరు. ఆ యభ్యాసము తల్లులనుండి వచ్చును. ఏకారణముననో పాలు త్రాగక యేడ్చుచుండిన చల్లగా యుండుటచే గాబోలు నని భావించి ప్రతిదఫా అవి వెచ్చబెట్టి పట్టుచుందురు. అప్పటికిని త్రాగకున్నచో చాల దని యెంచి పంచదారం గలుపుదురు. ఈ దురభ్యాసములు వారలకు పుట్టుకతో వచ్చి నవిగావు. ఏడుపు కారణమును తెలుసుకొనజాలక అనవసర దురభ్యాసములకు లోను చేయుదురు. వెచ్చబెట్టే యివ్వవలసినచో తల్లిపాలు మాత్రము వెచ్చబెట్టనలదో! అందులో సహితము పంచదార గలుపవలదో! గనుక మొదటినుండి లేని అలవాటును తెలివి తక్కువచేసి పిల్లలకు మప్పరాదు. ముఖ్యముగా పంచదార మప్పుట గొప్పతప్పు.

చంటిపిల్లల బట్టలను పక్షులుపారు సమయమువరకు బయట ఆరబెట్టియుంచరాదు. "పక్షులుపారుట" యనునది బట్టలమీద రెట్టవేయుటను భయమునగాదు. పక్షులు సాయంత్రసమయమున ఆకసమున తిరుగుచు క్రిందనారవేసిన చంటిపిల్లల బట్టలనుచూచి నచో, ఆదృష్టిసోకిన మాత్రమున మరి ఆబట్టలు పిల్లల కనుపయోగములుగాన అవిమరిగి వాడంగూడదు. వాడినచో ఆపక్షిదోషమునుతగిలి, అనారోగ్యవంతులై, అనేకరోగములకు గురియగుదురు. అవికుదురుట బహుకష్టము. ముఖ్యముగా యీదోషము అనుమాన వంతుల నెక్కుడుగా బాధించుచున్నట్లు చూడనగును.

మూత్రములోనానిన గుడ్డలను పొడిగుడ్డలులేకగాని, బద్ధకముచేగాని ఆరవేయక పిల్లల నేడ్పించుచుందురు. అట్లువేయనిచో ఆమూత్రోపరిభాగమునుండి ఒకవిధమైన దుర్గంధము బయలువెడలి తల్లి, పిల్లల, నిద్దరిని అనారోగ్యవంతులనుగా చేయును. మూత్రములోపడుకొనిన శిశువులపిరుదులు చిన్నచిన్నకురుపులకు గురియై, దురదలచే యేడ్చుచుందురు. వాటికి పసుపునూనె కలిపి తరువాత మందుతయారు చేయుదురు. గాని ముందుగా జాగ్రత్తపడిన యుత్తమముగదా!

పిల్లలు బాగుగ గాఢమైన నిద్రపోవలయునని మసలునీళ్లనుపోసి వారల శరీరమును చెఱుతురు. అది చాలతప్పు. ఒకప్పుడు ఆ వేడికి వారలకు ఊపిరి సహితము ఆడదు. విశేషముగా నిద్రపోవుటయు ఆరోగ్యమునకు భంగకరమే. గాన గాఢ నిద్ర పిల్లలు చెంద వలయునని తలంచుట తల్లులతప్పు. గాఢనిద్రవల్ల సోమవచ్చును. "బాలానాంరోదనం బలమ్" అని కొందరు మూఢులు ప్రత్యేకము రోజుకు గంట రెండుగంటలు నిర్ణయముగా శిశువులను యేడ్పించుచుందురు. ఆనిర్ణయము, నిర్ణయాతీతమై తమకేగాక పొరుగువారికి సహితము విసుగుజనించును. పిల్లల మూలమున అటువంటి చెడ్డమాటలను యితరులవలన వినకుండునటుల వారల ఆరోగ్యమున కనుగుణముగా తల్లులు మెలంగుచుండిన యుచితము. భయంకరములగు వస్తువులను పిల్లలకు చూపరాదు. పళ్లురాని సమయములో గట్టివస్తువులు చేతికియ్యరాదు.

ఖరగ్పూరు

దేవరాజు పద్మావతి.

# కాంతా-కనకములు

## ముద్దా విశ్వనాథము గారు

వీటమ్మకడుపు బంగారమయిన శాస్త్రులు, ఎంతనుభవంమీద సంపుటీ చేశారోగాని, తరిచి తరిచి ఆలోచిస్తున్నకొద్దీ మహాచిత్రంగా తోస్తున్నాయి ఈ రెండు ముక్కలున్నూ. మానుష జీవితమంతా ఈ రెండు పదాల్లోను యిమిడ్చారు పెద్దలు. వినడానికి చాలా ఆనందంగా వున్నాయి. ఉచ్చరించడమునకు యింపుగా ఉన్నాయి.

'కాంత'—అన్నారు. అంటే ఆడుది అని అందరికీ తెలుసు. "అబ్బాయీ! నీకు పెళ్లిట్రోయి" అని చూడండి, అయిదేళ్ల పిల్లాడితోటి. వాడికేంతెసిలిందో, ఏవిటో కాని, మనస్సులో ఒకవిధమైన ఆనందం, సిగ్గుతోచి ముసిముసినవ్వు నవ్వుకుంటూ తలవంచుకొని "పోదూ" అంటూ జవాబివ్వకుండా గిరుక్కున పారి పోతున్నాడు. ఆకోమలమైన వయస్సులో వాడేమనుకొని ఉంటాడో ఆలోచించండి. తనతోటి ఆడుళో డానికి స్నేహం మరొకళ్లొస్తారు గదా అని తలచి వుంటాడు.

ఈ కాలంలో తరుణవయస్కుడైన బ్రహ్మచారి విద్యార్థి దశలోనే స్వానుభవంగా స్త్రీ విషయకమైన సంగతులు అనేకం అవలీలగా తెలుసుకుంటున్నాడు. "Life is blank without a mate" మొదలైన ఇంగ్లీషు వాక్యాలు కృషిచెయ్యగా సహచరురాలిని సంపాదించాలనే గాఢాభిప్రాయం కలుగుతూంది. కాని పాశ్చాత్య పద్ధతి అనుసరించాలనే సరదాచేత పెళ్లిమాట కదిపినప్పుడల్లా "మా Principal చూడు 45 years ఉన్నాయి. ఇంకా bachelor గానే ఉన్నాడు. ఈ Summer vacation లో పెళ్లి చేసుకుంటాట్ట. ఆయన £ 2000 లు లండన్లో బ్యాంకులో వేశి ఉంచినాడుట. నాకు earning capacity వచ్చేదాక ఈ topic నాదగ్గర move చెయ్యకు" అని పైకి అంటూంటాడు.

భార్య వియోగమై, సంతాన హీనుడై, ఎనిమిదో పదినడుస్తూన్న శాస్త్రుల్లుగారు "ఎల్లాగయ్యా మరి, 'అపుత్రస్యగతిర్నాస్తి' అన్నారు. ఏయీడుదో కుర్రదాన్ని కట్టుకుని ఒక్కనలుసుని కని నాపేరును భూమి మీద పారేస్తే వంశక్షయం కాకుండా ఉంటుంది. ఈ ఇల్లూ గట్రాచూసుకుంటాడు. నాకు సంసార ఘూచీ వదలి పోతుంది" అని విలపిస్తున్నాడు.

కనుక ప్రతివాళ్లూ "కాంత" కావాలనే కోరుతున్నట్టుంది. అందరికీ అవసరమనే తోస్తూంది. జీవితంలో, సాలుకినాలుగు రూపాయిలు పంపి అనేక చిత్రములతో "గృహలక్ష్మి" పత్రిక తెప్పించుకో గలం గాని, నాలుగువేల రూపాయిలకిమ్మత్తు కనకం యిచ్చుకున్నా అనుగుణ్యమయిన గృహలక్ష్మి లభ్యపడు తుందా అని సంశయం, ఈ సంగతి అల్లా ఉంచండి మళ్లావద్దాం.



మన వాళ్లన్న ముక్క ఏమిటి? రెండోది?—"కనకం"—అప్పుడు పుట్టిన బిడ్డక్కూడా తెలుసు, దీనిఅర్థం, విలువానూ. దీనిని చక్కగా నిరూపించాడు, ఒక ఆధునిక కవి ఈ క్రింది పద్యంలో.

గీ. కలుషభూయిష్ఠమగు కలికాలమందు
జనవశీకరణైకసాధనము ధనము
గాని, బుద్ధియుఁ గులము యోగ్యతయుఁగావు!
ధరను ధనమొండె ప్రత్యక్ష దైవతంబు!

ఈ ధనంయొక్క ఆవశ్యకత క్రింది పద్యంలోనెప్పగా పొందు పరుపబడింది.

సీ. పరిణయమును ధ్రువ పఱచుటకర్థంబు,
" పెండ్లాడుకొనుటకు విత్తగరిమ
పిదప గర్భాధాన విధికివిత్తము, పురి
టికి నామకరణంబునకును డబ్బు,
బిడ్డకుఁ జదువు చెప్పించుట కర్థంబు,
పెంచి పెద్దను జేయ విత్తరాసి,
క్రతువుల నర్థంబు, వ్రతముల విడిముడి,
సన్యాసిభిక్షకు స్వాపతేయ,

గీ. మపరకర్మంబులను ద్యుమ్న, మవల మాసి
కావళులను హిరణ్యంబుగాదె
నవ్వుటకు నేడ్చుటకు ద్రవిణంబువలయు

* *

కనక తెల్లవారింది మొదలు పొద్దు గుంకేదాకా ధనం. పుట్టింది మొదలు చచ్చేవరకు ధనం. బతికున్న వాళ్లు దేవులాడ్డం బాగానే వుంది. మాదిగ భూషడు డప్పు వాయిస్తుంటే దెబ్బదెబ్బకి "ధనం, ధనం" అని మోగుతుందుట ఆ ప్రాణంలేని చర్మంకూడా. ఇటువంటి ధనంకోసం ప్రతివాళ్లూ ఆలోచిస్తున్నారు, ఉపాయాలు. ఈ సాధనాలేవిటో, ఎంతవరకు వుపచరిస్తున్నారో ముందెప్పుడేనా తెలుసుకుందాం.

ఈ సందర్భంలో "కాంతాకనకములు—సుఖ దుఃఖ భాజకములు" అని ఒకమాట విసిరినారు పెద్దలు. "కనకం" అంటే ఎక్కడలేని ఉత్సాహం తెచ్చిపెట్టుకుని భుజాలెగరేశినాం. "కాంత" అంటే చంకలు కొట్టుకున్నాం. "సుఖం" అనేటప్పటికీ ఆనందంలో మునిగిపోయాం. ఆఖరుముక్క పలకడానికే అసహ్యంగాను, భయంగాను ఉంది. "దుఃఖం" ట. ఈ మూడింటిని తుడిచి పెట్టుతూ ఆఖరున ఈ మాట తగిల్పించాడు దిక్కుమాలిన దేవుడు. లేకపోతే ఎంతో హాయిగా ఉండివుందుం. ఈ సంగతేమిటో కాస్త విమర్శిద్దాం.

వెనక యేమన్నాం? "ఎంతసొమ్ము వెచ్చించినా, అనుగుణ్యమయిన కాంత దొరుకుతుందా" అని. ఇప్పుడు తెలుసుకునే ముఖ్యాంశం యిది. మనదేశంలో ఉన్న యిన్నికోట్ల ప్రజలలోను "అనుకూలదాంపత్యం" ఎందరిలో ఉంది? అనగా, నిష్కల్మషమైన ప్రేమతో 'చిలకా గోరింకల్లాగు' వుండే దంపతు లెంతమంది? పెళ్లి అయినంత మాత్రాన్న భార్యాభర్తలు ఇష్టాగోష్ఠిగా ఉన్నారని ఎవరైనా నిర్ధారణగా సాహసించి చెప్పగలరా? "లేదు, లేదు" అని ఆకాశవాణి గంభీరంగా పలుకుతూంది. ఈ సంగతి ప్రతిదంపతులకూ తెలుసును, మనస్సుల్లో అయినా. Platforms మీద బల్లగుద్ది lectures ఇచ్చే Social Reformers అనే వారికి స్వానుభవమే. దేశోపకారం కోసం సభలలో గర్జన వాదములు చేసేవారికి గోచరమే. అయితే యేం. అందరూ గణపతి బొడ్డులో వేలెట్టి, తేలుకుట్టినా మర్యాదకోసం ఏమి యెరగనట్టుండక తప్పదు. ఇందుకు కారణాలు ముందు బోధపడతాయి.

ఈ "కాంతాకనకములు" దుఃఖభాజకము లెట్లానో కొంచెం తెలుసుకుందాం. దుఃఖం ఎప్పుడువస్తుంది మనిషికి? బాధకలిగితేను. 'బాధ' అంటేయేమిటి? తనకు హితవుగాని హాంశం. చిన్నబిడ్డ ఆకలివేస్తే ఏడుస్తాడు. యువకుడు పరీక్ష Fail అయితే ఆత్మహత్య చేసుకుందామా అన్నంతవరకు మనస్సులో కుందుతాడు, పరీక్ష Pass అయినవాడికి ఉద్యోగం దొరక్కపోతే మనశ్చింత. నౌఖరి దొరికినవాడికి పనివత్తిడివల్ల వ్యాకులత. లుబ్ధుడుకి ఒకదమ్మిడి ఖర్చుపెట్టాలంటే ప్రాణకంటకం. బ్రహ్మచారికిపెళ్లికోసం దేవుల్లాట. గృహస్థుకి ఎల్లాగురా బాబూ ఈసంసారం యీదడం అనిపెనగులాట. కొడుకులుంటే కూతుళ్లు లేరని ఆలాపన. కుమార్తెలుపుట్టితే అల్లుళ్లకోసం చింత. భూస్వాములకి తాలూకాబోర్డు ప్రెసిడెంటుషిప్పు నెగ్గకపోతే నిద్రపట్టదు. కోడిపందెముల్లో ఓడిపోతే అదోవిచారం. ఈవిధంగా ప్రతిస్థితిలో ఉంటున్నప్రాణికీ, ఏదోవిధమైన బాధఉండక తప్పడంలేదు.

ఇప్పుడు మనము ప్రస్తావించుతున్న "దాంపత్య" విషయంలో ప్రతిదినము మనకు గోచరమవుతున్న సాధకబాధకాలేవిటో ఆలోచిద్దాం.



పొద్దున్న 8 గంటలకి ఆదరాబాదరా అని ఉడికీఉడకని మెతుకులు నోట్లోవేసుకుని వెళ్లిన అయ్యగారు ఆఫీసులో దొరగారిచ్చినతిట్లు మారుమాటలేకుండా జేబులో వేసుకుని, చచ్చిసున్నమై, మధ్యాన్నం టిఫిను లేక కళ్లు లోతుకిపోయి, గుక్కెడు మంచినీళ్లచుక్కలు భార్యచేతితో యిస్తే ఆనందంపడి దస్సితీర్చుకుందామని చప్పుచప్పున యింటికివెళ్లబోతూంటే, దొడ్డిగుమ్మందరికి వచ్చేటప్పటికే కొంపలోవినబడుతున్నాయి పెద్దకేకలు. భర్తగారు కుడికాలు గుమ్మంలో పెట్టేసరికి భార్య అందుకుంది "ఏవండోయ్, మీరు వీళ్లమీద కేసుపెడతానని వొట్టుపెట్టుకుంటేనేకాని నేను నూతులోపడతాన"ని అరుస్తూ

వస్తూంది. భర్తకు యిదివరకున్న సాహం ఏమయిందో! ఆఫీసులోపడిన ఆరాటం ఈసందర్భంలో కనుపించనేలేదు. ఇన్నింటినీ మించిన కొత్తబాధ ప్రవేశించింది. "ఏమిటిది సంగతి" అన్నాడు వణుకుతూ భయంతోటి. "నేను మొదటే చెప్పాను, మీబూడిద గుమ్మడిపాదు మాపాకమీదికి పాకుతూందని, అప్పుడూరుకుని తీరా ఇప్పుడు మానడిమప్పమీది కెక్కి యిల్లుధ్వంసంచేస్తే, మేమేనా అంతచేతకాని వాళ్లం. పైగా, మడుపుమీద కాయలు కనబడ్డంలేదని ఇదొకవాదా? అని ఈరీతిగా పొరుగువాళ్లతోటి పేచీపడుతూంది యిల్లాలు.



ఒక పంతులుగారు పకోడీలు, కాజపటకులు పొట్లాలు కట్టించి జేబులో పెట్టుకొస్తున్నాడు, భార్యాకోసం, ఆఫీసునుంచి వచ్చేటప్పుడు. తమాషాగా ఊరించి యిద్దామని ఆయన అభిలాష. ఆవిడ ప్రతిదినంవచ్చి "ఇవ్వేళ నాకేం తెచ్చా"రంటూ జేబులు తడమడం మామూలు. నేడదేమో వసారాలోపట్టె కింద పడుకుంది, పంతులు వచ్చేసరికి. మెల్లిగా బుజంతట్టి 'లెమ్మని' బుజ్జగిస్తున్నాడు. కాశ్శేపు వూరుకుని తారాజువ్వలాగు లేచిందావిడ. "ఇదిగో ఇదే చెప్పడం, మీ అమ్మయినా ఉండాలి, నేనైనా వుండాలె, ఈ యింట్లో. ఏదో వకటి సెటిల్చెయ్యండిప్పుడు. ఆవిడను వేరుచెయ్యడానికి శక్తిలేకపోతే ఈ సాయంత్రం బండిలో దిగబెట్టెయ్యండి నన్ను పుట్టింటికి. ఈ మాత్రం చక్కబెట్టుకో లేనివాళ్లు పెళ్లియెందుకు చేసుకోవాలి?" అని పట్టుపట్టి యేకరువు పెడుతూంది.

ఈదృష్టాంతద్వయం సంసార సముద్రములో ఒక్క రేణువు. గృహచ్ఛిద్రాల్లో లెక్కకురానిది. **Civilised and educated circles** లో జరిగే తమాషాలు మహా **refined** గాను **delicate** గాను వినోదంగా వుంటాయి. **Mrs,** గారు **acquaintance** తో **discourse** చేస్తుంటే పంతులుగారు **surprise visit.** కొందరు అన్నీచూస్తూ ఏమీ యెరగనట్టుండి, పైకి మాత్రం **chastity** ని గురించి **lectures** కొడ్తారు. 80 యేళ్లు గడచిన నాలుగో పెళ్లి **retired officer** కూడా వీర్య స్తంభనమునకు యేమయినా ప్రశస్తమయిన లేహ్యం దొరకుతుందేమో అని పత్రికలలో ప్రకటనలు వెదకుతుంటాడు. పాపం, చేతులు వణుకుతూ నెరిసిన వెంట్రుకలు కనబడకుండా వారానికి రెండుసార్లు **hair dye** వేసుకుంటాడు. కాంతని సంతోష పెట్టాలనే భ్రాంతిచేత. ఈ మోస్తరు చిత్రాలు ఏకర్వు పెట్టితే ఎన్ని పత్రికలైనా ఎంత కాలమయినా చాలవు!

## దీనికంతా కారణమేమిటి?

తరుచుగా చర్చింపబడుతున్న విషయాలు, స్త్రీవిద్య లేకపోవడం, అతిబాల్యవివాహాలు, కన్యాశుల్కం, వరవిక్రయం, వగైరా అననుకూలదాంపత్యానికి కా[illegible]లో చెవుల్లు, గింగురుమంటున్నాయి.

పురుషులకంటికి 'స్త్రీ' యొక్క అద్భుతమహిమ గోచరమవడంలేదు. స్త్రీపురుషులన్నారు. భార్యాభర్తలు-తలిదండ్రులు-పార్వతీ పరమేశ్వరులు-లక్ష్మీనారాయణులు-ఇంగ్లీషులోకూడా Lectures ఇచ్చేటప్పుడు 'Ladies and Gentlemen' అని Address చేస్తారు. చూశారా యెవరుముందో! కనిపెట్టండి స్త్రీయొక్క ఘనత. రైలులో Female Compartment ఏర్పరచారు. ప్రదర్శనాలలో "స్త్రీలకు ప్రత్యేకస్థలం" బొమ్మలాటకెడితే, సంబంధంలేనివాళ్లు ఇట్టేకలిపించుకుని "ఒరేయి, నీకుబుద్ధిలేదూ? చుట్టపొగవదుల్తావ్, ఆడవాళ్లు కనపడ్డంలే" అని స్త్రీలపక్షాన్ని వాదించుతారు. సినిమాకు వెళ్లేటపుడు మొగాళ్లు తోడతొక్కిట్లో ఊపిరాడక దేవుల్లాడుతుంటే, ఎన్నిటికెట్లయినా అణుమాత్రం శ్రమలేకుండా (తమ ఆధిక్యతకు చిరునవ్వునవ్వుకుంటూ) చిటుకలో తెస్తారు కాంతలు.

కాంత ఆధిక్యత తెలిసికొనగలిగినప్పుడే మగవానికిముక్తి, దేశానికి బాధావిముక్తిన్నీ. "స్త్రీ" మహాస్వరూపమని పెద్దలు వాడివడపోశారు. సరే, శాస్త్రాలన్నీ ప్రక్షిప్తాలని prove కాబడుచున్న ఈ రోజుల్లో మనకాగొడవొద్దు. స్త్రీయొక్క ఆధిక్యత ప్రత్యక్షంగా కనిపెడుతునేవున్నాం. ఎంతప్రగల్భాలు కొట్టేహోదాగల పురుషుడైనా స్త్రీ అరచేతిలో పిచ్చుకే. ఆఫీసులో చెలాయించే Strictness, Discipline కి యిక్కడ exception చెప్పవలసిందే. పాఠకులారా! మనశరీరంలోనే ఇరుప్రక్కలు Symmetrical గా లేవే? కుడిచేతికున్నంత బలం ఎడమచేతికేదీ? (పురచేతివాటంవున్న కొద్దిమందికితప్ప). అలాంటిది స్త్రీపురుషులు సమానంగా ఎట్లావుంటూరు? అన్నివిధములా, కాంతయే ఆధిక్యతగలదని నిర్ధారణవుతునేవుంది. ఆమెకు తన అభీష్టంనెరవేర్చుకో గలిగిన సామర్థ్యంవుంది. ఆమెకుగల స్వేచ్ఛ, బాధ్యత మగవానికిలేదు.

జన్మంతరించాలంటే కర్తవ్యమేవిటి మరి, పురుషుడికి? సంసారసాగరానికి 'చుక్కాని'— ఇహపరసౌఖ్యదాయిని—మోక్షసాధకం అయిన "గృహలక్ష్మి"ని లోబరుచుకోవలె. అధికార ప్రమత్తత ప్రలాపంచేగాదు. భయపెట్టికాదు, బెదరగొట్టికాదు. ఇష్టప్రవర్తనవల్ల—సరియైన జ్ఞానవికాసం కలగచెయ్యడంవలన—తనమనస్సు కనిపెట్టి కాంత చరించేటట్టు పురుషుడు తరిఫీదు చెయ్యడంచేతను. దీనిపేరే "మనస్తత్వశాస్త్రం (Psychology). ఇదియే మనోవికాసం అభివృద్ధిచేసి సంసారసుఖంచే కూర్చేది. మనుష్యునిజీవితం సార్థకం చేసేది. ఈమహిమ కొందరికి పుట్టుకలోనే యిమిడివుంటుంది. కొందరికి స్వానుభవంగా తెలుస్తుంది. దీని ఆధిక్యతనుగురించిన వివరాలు మరొకప్పుడు తెలుసుకుందాం.




భర్తను సుఖపెట్టగలిగిందీ, మెప్పింప గలిగిందే "స్త్రీవిద్య". పురుషుని కిష్టంలేనపుడు భార్య Vakil పనిచేసి నెలకు రు. 500 లు తెస్తేమాత్రం యేంసార్థకం? మనోభేదాలతో సంసారం ముందు కొస్తుందా? మద్రాసులో blocks తయారుచేసే మామిత్రుడున్నాడు. ఆయన భార్య విద్యావతికాదు. B.A. degree సంపాదించలేదు. అభ్యాసంచేత భర్త యిచ్చిన pencil sketches ink చెయ్యడం, బ్లాకులు తయారుచేశే process చక్కగా అలవరుచుకుంది. ఆయన కూతురున్ను అదే నేర్పుతున్నది... చదువరులారా! ఆకుటుంబము యొక్క సౌఖ్యంవర్ణించడానికి యెవరితరం? పురుషునికి కుడిచెయ్యిగావున్న అటువంటి నారీమణులు గదా "స్త్రీరత్న తగినవారు!

ఈ మనస్తత్వ పరిశోధనాజ్ఞానం సహజంగా కలగవలసిందే. లేదా స్వానుభవంగా తెలుసుకోవలసిందే. School లో ఉపాధ్యాయులు బోధించరు. భార్యాభర్తలు ఒకరిమనస్సు కనిపెట్టి ఒకరు నడిచినప్పుడే సంసారసుఖం. "కాంత" అనుగుణ్యంగావుంటేనే కాయకష్టాలుపడి ఆర్జించిన "కనకం" సార్థకంలోకివస్తుంది. పాశ్చాత్య నాగరకతా ప్రభావంవల్ల తాత్కాలికంగా కలుగుతున్న మార్పులు, శాశ్వతం అనుకో కూడదు. మనం "భారతీయులం" అని జ్ఞాపకముంచుకోవాలె. హిందూ దేశపుస్త్రీలంతా కల్లు కొంపాలుచుట్టు కొని బయలుదేరి "సైమన్—go back" అని గోలుపెట్టినంత మాత్రాన్ని సంసారసౌఖ్యం పెరగదు. "ఇంటగెలిచి రచ్చగెలవ మన్నారు." "Back to our old simple Hindu life" అని భారత స్త్రీలంతా పురుషులిని గోలుపెట్టవలె. "Oh! you luxuries! We do not want you" అని emphatical గాక్రియారూపకంగా బహిష్కరించాలి. పురుషుని లోపాలు నిముషంలో కట్టు పడతాయి, కాంత గట్టిగాతలుచు కుంటే. కాంతకు స్వేచ్ఛ ఎంత ఎక్కువో, అంతకు ఎన్నోమడుగులు బాధ్యత వున్నది. సంసారం "సుఖ" భాజకంగానీ "దుఃఖ" భాజకంగాని చేసే వ్యక్తి స్త్రీలోనే అంతర్భూతమైవుంది. "కనకం" సార్థకంచేసినా వ్యర్థంచేసినా ఆమెకొరకే. సంసారం చక్కగానడవడం, దేశం బాగుపడడం "స్త్రీ" ఇష్టానిష్టాలలోవుంది. కనుక ఎప్పుడును స్త్రీని రంజింపచేయ్యడానికే అన్ని విధములా పురుషుడు ప్రయత్నించాలె.

గాంధిగారి స్వీయచరిత్ర చదివినంతమాత్రాన ముక్తిలేదు. మనస్వీయచరిత్రం మనంచదువుకోవాలి. ఒక్కొక్కళ్లు చిన్నతనంనుంచీ చేసినమంచిపనులు, లోపాలు నెమరుకితెచ్చుకోవాలె. దాన్నిబట్టి ముందుజీవిత కర్తవ్యం నిర్ణయించుకోవాలి. ప్రతివారున్ను సత్యాన్వేషణంతో 'మనస్తత్వ పరిశోధన' మొదలెడితే ఇపుడు జరుగుచున్నన్ని ఘోరాలుండబోవు. 'అనుకూల దాంపత్యాలు' తప్పక అమరుతాయి. నేడే ఈనిముష మే—మనస్సుకాస్త నిశ్చలంగావుంచుకుని న్యాయపరిశీలనతో ఆలోచించితే కొద్దిరోజులకే మనలోమార్పుకలిగి తీరుతుందని ముమ్మాటికే చెప్పవచ్చు. అప్పుడే 'కాంతాకనకములు' సుఖభాజకములవుతాయి. అంతా మన చేతిలోపని, మరికొన్ని ముఖ్యాంశాలు వివరంగా విమర్శిద్దాం ముందు. ఇప్పటికి శెలవు మరి!

మేలుపాక.

ముద్దా విశ్వనాథం.

# బాల్యవివాహ సమస్య

శ్రీమతి గుంశాల రాజామణిగారు

శ్రీ హరవిలాస శారదాగారు సామ్రాజ్య శాసనసభలో బాల్యవివాహ నిషేధ చట్టమునుగురించి వారి యభిప్రాయములను పత్రికలద్వారాచర్చచేసిరి. ...న సాంఘిక మతాచారములు చాలదుస్థితిలో యున్నవనుమాట యెల్లరకును తెలిసినవిషయమే. పూర్వాచారపారాయణులీ విషయమున, మార్పులను, నిరోధింప ప్రయత్నించుట సహజమే. కాని విద్యాధికులు, రాజకీయవేత్తలు, ప్రజాప్రతినిధులు, ముందంజవేయుచు నీవిషయమును నిరోధించుట మిక్కిలి సంతాపకరము. దేశమున అన్నిపక్షముల వారును శాసనవిషయమున చర్చించి తమ యభిప్రాయము వెల్లడించు చున్నారు. ఈ విషయమున స్త్రీలు ముందంజ వేయుచున్నారు.

ఈ సమస్య హిందూజాతులలో అల్పసంఖ్యాకులగు బ్రాహ్మణవైశ్యజాతులకే సంబంధించియున్నది. వీరు హిందూదేశ జనసంఖ్యలో నూటికి 3-వ వంతుగా యున్నారు. మిగిలిన 97 మందికి అంత నిర్బంధముగా కనబడలేదు. శ్రీశారదాగారు బాలికకు 14 సం॥ లోపునను, బాలునకు 18 సం॥ లోపున వివాహము చేయకూడదని శాసనము తెచ్చిరి.

ఇప్పుడు మనదేశములో కొన్ని భారతసంస్థానములు బరోడా, మైసూరు, భరత పూర్, మండ్వీ, కాశ్మీరము, రాజకోట సంస్థానములు యీచట్టము అమలులో బెట్టినవి.

ఈ సమస్య అన్నిపక్షములవారును, అన్నిజాతులవారును ముఖ్యముగా బ్రాహ్మణ వైశ్యజాతులవారును, యిదివరకే కొన్నిమార్పులను చేసియుండిన, యిది శాసన సభయందు రానేరదు. సతి (సహగమనము) కేవలము శాసనమువల్ల అంతరించలేదు. ఆ హీనదుస్థితి, హైన్యదశ, హీనదురాచారము నల్ల అంతరించినది. అట్లనే యీకాలమున యీ బాల్యవివాహముకూడ యీహీన దురాచారమువల్ల పోవచ్చునుగాని యెవ్వరు ప్రధాననాయకుడు లేనందున ముందంజ వేయలేకున్నారు. కాబట్టి శాసనముగా మారిన

ఈ మనస్తత్వ పరిశోధనాజ్ఞానం సహజంగా కలగవలసిందే. లేదా స్వానుభవంగా తెలుసుకోవలసిందే. School లో ఉపాధ్యాయులు బోధించరు. భార్యాభర్తలు ఒకరినొకరు కనిపెట్టి ఒకరు నడిచినప్పుడే సంసారసుఖం. "కాంత" అనుగుణ్యంగావుంటేనే కాయకష్టాలుపడి ఆర్జించిన "కనకం" సార్థకంలోకివస్తుంది. పాశ్చాత్య నాగరకతా ప్రభావంవల్ల తాత్కాలికంగా కలుగుతున్న మార్పులు, శాశ్వతం అనుకో కూడదు. మనం "భారతీయులం" అని జ్ఞాపకముంచుకోవాలె. హిందూ దేశపుస్త్రీలంతా నల్ల జెండాలుచ్చుకొని బయలుదేరి "సైమన్—go back" అని గోలుపెట్టినంత మాత్రాన్ని సంసారసౌఖ్యం కలగదు. "ఇంట గెలిచి రచ్చగెలవ మన్నారు." "Back to our old simple Hindu life" అని భారత స్త్రీలంతా పురుషులిని గోలుపెట్టవలె. "Oh! you luxuries! We do not want you" అని emphatical గా క్రియారూపకంగా బహిష్కరించాలి. పురుషుని లోపాలు నిముషంలో కట్టుపడతాయి, కాంత గట్టిగాతలుచు కుంటే. కాంతకు స్వేచ్ఛ ఎంత ఎక్కువో, అంతకు ఎన్నోమడుగులు బాధ్యత వున్నది. సంసారం "సుఖ" భాజకంగానీ "దుఃఖ" భాజకంగాని చేసే వ్యక్తి స్త్రీలోనే అంతర్యామియైవుంది. "కనకం" సార్థకంచేసినా వ్యర్థంచేసినా ఆమెకోరకే. సంసారం చక్కగానడవడం, దేశం బాగుపడడం "స్త్రీ" ఇష్టానిష్టాలలోవుంది. కనుక ఎప్పుడును స్త్రీని రంజింపచెయ్యడానికే అన్ని విధములా పురుషుడు ప్రయత్నించాలె.

గాంధిగారి స్వీయచరిత్ర చదివినంతమాత్రాన ముక్తిలేదు. మనస్వీయచరిత్రం మనంచదువుకోవాలి. ఒక్కొక్కళ్లు చిన్నతనంనుంచీ చేసినమంచిపనులు, లోపాలు నెమరుకితెచ్చుకోవాలె. దాన్నిబట్టి ముందుజీవిత కర్తవ్యం నిర్ణయించుకోవాలి. ప్రతివారున్ను సత్యాన్వేషణంతో 'మనస్తత్వ పరిశోధన' మొదలెడితే ఇపుడు జరుగుచున్నన్ని ఘోరాలుండబోవు. 'అనుకూల దాంపత్యాలు' తప్పక అమరుతాయి. నేడే ఈనిముష మే-మనస్సుకాస్త నిశ్చలంగావుంచుకుని న్యాయపరిశీలనతో ఆలోచించితే కొద్దిరోజులకే మనలోమార్పుకలిగి తీరుతుందని ముమ్మాటికే చెప్పవచ్చు. అప్పుడే 'కాంతాకనకములు' సుఖభాజకములవుతాయి. అంతా మన చేతిలోపని, మరికొన్ని ముఖ్యాంశాలు వివరంగా విమర్శిద్దాం ముందు. ఇప్పటికి శెలవు మరి!

మేలుపాక. ముద్దా విశ్వనాథం.

కుటుంబములు శిథిలమైపోయినవి. ఈప్రౌఢ వివాహపద్ధతి భారతజాతికి తరుణోపాయము వంటిది. అందువలన తమ కుచితమైనవరుని సంపాదించుటకు వారికి కావలసినంత అవకాశము లభించును.

52 సం॥ వృద్ధబ్రాహ్మణుడు 10 సం॥ పసిపాపను పరిణయమాడి ఆమె శీఘ్రముగ ఋతుమతి కావలయునని తీవ్ర ప్రయత్నములు గావించెనని యిటీవల నే "సమదర్శిని" పత్రికయందు గాంచినాము. ఆతని కృత్యములు హిందూ ఛాందస సంఘమునకు తప్పుగా కనబడ లేదు కాబోలు! ఆపసికూనకు ఎంత శీఘ్రముగా వైధవ్యమబ్బునో చదువరు లూహించెదరు గాక! ఒక వేళ కొమరులను కన్నను వారు ఎంత దుర్బలులో కూడ తెలియనగును.

వైద్యుల అభిప్రాయము కూడ బాల్య వివాహములవల్ల చాలకీడు దేశమునకు వాటిల్లుననియే.

బాల్య వివాహ నిషేధమువల్ల కొంతవరకు వితంతువుల సంఖ్య తగ్గును.

ఇక శాస్త్రములు రజస్వలానంతర వివాహముల నొప్పుకొనియేయున్నవి. ఇది నిర్వివాదాంశము. అయినను యీదురాచారము ఎట్లువచ్చెను? మహమ్మదీయ కాలములో జీవితాశయములు చాలమెండుగ నుండెను. అప్పటి ప్రభుత్వమున, ధనము, జీవితములకు నిలుకడలేక ఎప్పుడు ఏ విపత్తువచ్చునో అని భీతిచే తల్లి తండ్రులు తమ బిడ్డలకు శీఘ్రముగ, వివాహముచేయ నిశ్చయించిరి. బ్రిటిషుప్రభుత్వమున యీ క్రూరాచారము యింకను నుండుట అసమంజసముగా యున్నది.

మనువు ప్రౌఢవివాహముల నాటంకపరుపలేదు. రజస్వలానంతర వివాహము శాస్త్ర సమ్మత మనికూడ నుడివెను. ఆయాకాలపు ఋషులు ఆయాకాలమునకు అనుకూలముగ శాస్త్రములు రచించిరి. పరాశరుడవి యొప్పుకొనలేదు. మనువు పూర్తిగ నొప్పుకొనెను. మన దేశమునకు, మనజాతికి, మనమతమునకు, మన నాగరికతకు, నెంతయు కళంకమును ప్రసాదించు భారతశక్తినంతయు పీల్చిపిప్పి చేయుచున్న బాల్యవివాహములు అమూలాగ్రముగ ఛేదించుటకు ప్రయత్నింపవలయుగదా!

ఇక శాస్త్ర వాదములకు అంతములేదు. ఒకస్మృతిలోయున్న విషయము మరియొక దానిలో నుండదు. స్మృతులకు అనేక వ్యాఖ్యానములు గలవు. ఒక పండితుని వ్యాఖ్యానము యింకొక పండితునికి సరిపడదు. శాస్త్ర విషయములు అన్నికాలము వారికి నిర్బంధపరచి

యుండలేదు. ఆయాకాల పరిస్థితుల కనుగుణ్యముగా ఆయాకాలపు ఋషులు వ్యాఖ్యానములు వ్రాసియున్నారు. ఆకాలము వేరు, యీకాలము వేరు, ఆకాలములో లేని సాంఘిక పరిస్థితులు ఎన్నియో నేడుగలవు. అప్పటి ఆచారములు సాంప్రదాయములు వేరు; నేటి మన ఆచార సాంప్రదాయములు వేరు. మానవుడు వృద్ధిగాంచుచున్నాడు. అతనితో సాంఘిక పరిస్థితులన్నియు పరిణామము నొందుచున్నవి. స్మృతులు, శృతులు, శాస్త్రములన్నియు తాము చెప్పినటులనే నడుచుకొనవలయునని యెన్నటికిని నిర్బంధింపజాలవు.

ఇప్పుడు బ్రాహ్మణ సంఘములలో అక్కడక్కడ చాటుచాటున రజస్వలానంతర వివాహములు చేయుచున్నారు. పూర్వకాలమందు కూడ రజస్వలానంతర వివాహములుండెడివి.

భారతదేశము ప్రేమాధారమైన అనుకూల దాంపత్యమున కెంతేని ఖ్యాతినార్జించి యున్నది. భారత నారీమణులు తమ హృదయాధినాదు లెంతటి కష్టములయందిమిడి యున్నను, ఎట్టి హైన్యదశయందున్నప్పటికి తాము మనసార వాంఛించిన వారలనే పరిణయ మాడిరి. రాణి సంయుక్త పృధ్వీరాజును వరించి తండ్రివలదనినను ఆయననే పెండ్లియాడి పుట్టినింటికిని మెట్టినింటికిని ఖ్యాతిదెచ్చుచు కాపురముచేసి తుదకు భర్తకై రణరంగమున ప్రాణములు వీడెను.

1850 సం॥ బాసుగారు రజస్వలానంతర వివాహములు సామ్రాజ్య శాసనసభలో పెట్టి శాసనముగా చేయలేదా? స్త్రీ పునర్వివాహచట్టపు బిల్లుపెట్టినప్పుడు శాసనముగా యుండలేదా? అట్టి సాంఘిక చట్టములయందు ప్రభుత్వమువారిని మనమే యిదివరకు జోక్యము కలుగు చేసికొనినప్పుడు యిపుడేల యీశారదాగారి వివాహచట్టమునకు మనము ఆటంకపఱచవలెను. శ్రీశారదాగారి బిల్లునకు నిర్బంధ శాసనముకూడ కలదు. అట్టివి నిర్బంధించకూడదని మరికొందరు చెప్పుచున్నారు. గాని మన సాంఘికాచారములు అట్టి నిర్బంధ దశలోనేయున్నవి. నిర్బంధముచేసినగాని యీ దురాచారము నశించదు.

# నీటి వైద్యము

జలమువలన ననేకరోగములు నయమగును. సమస్తరోగములు జలమువలననే నయమగునను జర్మను పండితుని సిద్ధాంతానుసారము మన దేశమం దనేకులు నీటివైద్యమును చేయుచున్నారు. దానినే తొట్టిస్నానములని నుడువుదురు. ప్రాతః స్నానము సర్వరోగనివారణమనియు, సర్వపాపపరిహారమనియును ఆరోగ్యసాధనమనియు పెద్దలు చెప్పియున్నారు. ఆంధ్ర దేశమున ప్రాతఃస్నానమొనర్చు యాచారము బ్రాహ్మణులయందు మాత్రముండెను. కాని యిటీవల యదితగ్గినది. మద్రాసు కలకత్తా మొదలగు ప్రదేశములయందు చదువుకొనివచ్చిన విద్యార్థులు ఉషఃకాలమున గాకున్నను స్నానానంతరమె కార్యరంగమున బ్రవేశింపుచున్నారు. ఇది శుభసూచకమేగాని స్త్రీల యందుమాత్ర మీయభ్యాసముతప్పిపోయినది. ప్రాతఃస్నానమును మఱచినారనుట యతిశయోక్తిగాదు. ప్రాతఃస్నానము వలన నారోగ్యము వృద్ధియగునని వేరుగనుడువుట యనావశ్యకము. శరీరమునకు మెరుగుగ కొబ్బరినూనెను పూసి సూర్యోదయమునకు పూర్వము తలనిండ చన్నీటస్నానము చేయవలయును. చలివేయదు. పిల్లలకుగూడ నటుల చేయించిన యెడల తలయందు పేలు, పుండ్లు, గజ్జి, దురద మొదలగునవి క్రమక్రమముగ నశించును. శరీరమునకు బలముగలుగును. మనస్సు వికసించును. కావున నాంధ్రదేశ మందలి స్త్రీలయభివృద్ధికై పాటుబడుస్త్రీలీ విషయము బోధించి, తల్లులు పిల్లల యారోగ్య సాధనకు గడంగవలయును.

(1) తలపోటు, తలనొప్పివలన బాధపడుచుండువారు శిరమున జలముధారగను పోయవలయును. అందువలన బాధతగ్గును.

(2) ముక్కునుండి నెత్తురుకారుచుండిన శీతలజలమును నాసికతోడ పీల్చవలయును. అందువలన నిది సాధారణముగ నయమగును.

(3) ప్రతిదిన ముదయమున శీతల జలమును నాసికతోడ పీల్చిన యెడల 'పీనస' 'స్వరభంగము' దగ్గుమొదలగునవి దొలంగును.

(4) వాతరోగులు, అజీర్ణగ్రస్తులు మలద్వారమున శీతల జలమును పిచికారి చేసిన మిక్కిలి మేలుగలుగును.

(5) ఉదరమునందు బాధయేర్పడినయెడల వేడినీటి కాపుబెట్టవలయును. అందువలన శీఘ్రముగ నా బాధ తొలగును.

(6) విరోచనబద్ధముగలవారు శయనించునప్పుడు శీతలజలమును, నిద్దుర లేచగనే వేడినీటిని ద్రావుచుండిన యెడల మలబద్ధము నశించును.

(7) పొంగు, ఆటలమ్మ, స్ఫోటకము మొదలగు చర్మరోగములవల్ల బాధపడు వారికి శీతల జలమున తడిపిన వస్త్రమును గప్పవలయును. అందువలన వారికా బాధ చాలవరకు లాఘవమగును.

(8) వేడినీటిని ద్రావినయెడల వాంతియగును.

(9) శిశువులకు ఝాడ్పులు వచ్చినప్పుడు తలకు నంచుగడ్డను లేక శీతల జలమును ప్రయోగించిన యెడల మిక్కిలి మేలుగలుగును.

(10) స్పృహతప్పి పడిపోయినవారి మోముపైన చన్నీటిని గొట్టిన వానికి వెంటనే స్పృహవచ్చును. దెబ్బతగిలినచోట తడిగుడ్డచుట్టుట మంచిమార్గము.

(11) చేతులుకాళ్లు కొంగర బోవుచుండినయెడల శీతలజలమును ధారగబోయ వలెను. లేకకల్లును పట్టివేయవలయును. అందువలన బాధచాలవరకు తగ్గును. మిక్కిలి దెబ్బతగిలి పడిపోయిన రోగిని పరుండబెట్టి తలయొకింత క్రిందుగ నుండునట్లుచేసి వేడి నీటితో కాచినయెడల మిక్కిలి మేలుకలుగగలదు.

భూపతనమైన శిశువులకు శ్వాశనిరోధమందు సమయమున నీటివైద్యముపకరించును. ఒక భాండమందుష్ణజలమును, మఱియొక భాండమందు శీతల జలమునుంచి ఆశిశువును ప్రథమమున యుష్ణజలమున కంఠమువరకును ముంచి యొకనిముసముంచి పిమ్మట శీతలజల మందు కంఠమువరకుముంచి యొకనిముసము వరకునుంచి దీసినయెడల శ్వాసవిడచును.

వాతరోగిని ప్రథమమున మంచి వేడినీటియందును, తర్వాత శీతలజలమందును ముంచినయెడల మిక్కిలి మేలుగలుగును. పడిశము బాధనందువారికి వేడినీటిస్నానము మిక్కిలి యుపకారి.

# పాశ్చాత్య స్త్రీల స్థితిగతులు

"నేనెల్లవేళలను పత్రికలను చదువుచుండుదానను. నేనీ మారుమూలగ్రామమందుండి డెబ్బదియైదువత్సరములు గడపియున్నను యేదేశమందే ప్రాంతమునందేయే మార్పులు జరుగుచున్నవియో నేను నిత్యము గమనించుచుండెడిదానను. అందునను నాసోదరీమణులయొక్క యభివృద్ధి యెటులున్నదో ప్రత్యేకశ్రద్ధతో తిలకించుచుండెడిదానను. ఇదివరలో యేకొలదిమందిస్త్రీలో ప్రాముఖ్యతకు వచ్చుచుండుటయు వారలగురించి పత్రికలును పురుషులును యెక్కువగ పొగడుచుండుటయు నేనెరుగుదును. అందువలన నాయాకాలములయందు పేరుగడించియుండిన స్త్రీలనామములను నేను జ్ఞప్తియందుంచుకొనుదానను. నేడన్ననో పరిస్థితులు పూర్తిగమారిపోయినవి. నేడెక్కువమంది స్త్రీలు ప్రాముఖ్యతలోనికి వచ్చుచున్నారు. అందువలన నేడు చదివినస్త్రీల ధన్యనామములుగాక రేపటిదినమున ప్రఖ్యాతనామము లెన్నియో కానబడనున్నవి. ఆకారణాన వారినందరిని జ్ఞప్తియందుంచుకొనుట నాకుశక్యముకాకున్నది. ఆకారణమున నాకెంతయు కంగారుగానున్నది." అని ఒక వృద్ధపాశ్చాత్య నారీమణి ఒకసంభాషణా సమయమున మాతోననియున్నది. ఈయమ చెప్పినచొప్పున పాశ్చాత్య దేశములయందలి మహిళామణులలో నెంతేని సంస్కారము జరుగుచుండుటయు చాలమంది అభివృద్ధికివచ్చి గౌరవజీవనముల గడపుచుండుటయు మనమెరుగుదుము. ఇట్టిమార్పు ప్రాచ్యదేశములయందు కూడ యేలకలుగరాదని కొందరు ప్రశ్నింపవచ్చును. అందులకిదివర కొసంగిన సమాధానమునే మరల నొసంగవలసియుండును. పాశ్చాత్యదేశములయందలి స్త్రీలందరును విద్యనభ్యసించియుండి దేశీయ వ్యవహారములయందు పురుషులకు సహాయపడుచుండుటకు వారలవాటుపడియున్నారు. ఆకారణమున స్త్రీలాదేశమున ప్రాముఖ్యతకు వచ్చుచున్నారు.

స్త్రీల స్థానము నొక ఉన్నత స్థితికి గొనిరా గతవత్సరము పెక్కువును ప్రయత్నములు జరిగియున్నవి. 1918-వ సంవత్సరములో స్త్రీలకు రాజకీయ వ్యవహారములయందొసంగబడిన సమహక్కులయొక్క విజయోత్సవము ప్రతి వత్సరమును గావింపబడుచుండుటను చదువరులెరుంగుదురు. గతవత్సరమీ యుత్సవ మతివైభవముగా గావింపబడినది. స్త్రీలకనారోగ్య కరముగనుండునను తలంపుతోనేనియు యేవృత్తికిగాని స్త్రీలుపనికిరారను శాసనమును మాత్రమును గావింపరాదనియు అది స్త్రీలకు గౌరవలోపమనియు న్యూయార్కునందలి జాతీయసంఘము తీర్మానించి అమెరికా ప్రభుత్వమును చాలవరకు ఒప్పించినది. లండను నగరమందలి కొన్ని వైద్యాలయములు ఆవిద్యయందు విద్యార్థినులకు తరిబీదు నియ్యమని ఆటంకముల నిడియుండగ, లండను మహిళాసంఘ మావిషయమై తీవ్రప్రయత్నముల గావించి ఆయాటంకమును తొలగింప గలిగినది. ఇంగ్లాండు దేశములో కొలదిగ పోలీసు ఉద్యోగినులు నియమింపబడి యుండుటచేతనే కొంత ఆందోళనబయలుదేరుటయు అటుతరువాత నదిచల్లబడుటయు జరిగినది. ప్రస్తుతము యెక్కువ స్త్రీలీశాఖయందు జేర్చుకొన బడవలయునని ఆందోళనను స్త్రీలు సాగించు చున్నారు. మహిళాసంఘములు చేయుచున్న ఆందోళనంత యెక్కువగా గమనింపవలసిన యగత్యములేదని ఉన్న పోలీసోద్యోగులు పట్టుబట్టియున్నను మహిళాసంఘములు మాత్రము తమయాందోళనను మాన లేదు.

గతవత్సరములో జరిగిన రెండు బై యెలక్షనులలో యిరువురుస్త్రీలు పార్లమెంటు సభ్యత్వముల బడసిరి. పార్లమెంటునందీ వత్సరమున గల స్త్రీలసంఖ్య 8 నైనను ఇంగ్లాండునందుగల మూడురాజకీయ పక్షములును 55 మంది స్త్రీలను ఎన్నికలకు నిలువబెట్టి యున్నవి.

వీరిలో కార్మికపక్షమందెక్కుడు స్త్రీలున్నారు. స్థానిక సంస్థలయందు యెక్కుడు స్త్రీలు అధ్యక్ష ఉపాధ్యక్ష స్థానముల నాక్రమించి ఆయాసంస్థలవ్యవహారములను చక్కగ నిర్వహించుచున్నారు.

సాధారణముగ ప్రసవ స్త్రీల మరణసంఖ్య యూరపుఖండమందంతటను యెక్కువగ నున్న కారణమున మహిళాసంఘము లీవిషయమై యెక్కువప్రచారమును గావించి యున్నవి. వైద్యాలయములయందు స్త్రీల కెక్కువ సదుపాయములు గలుగులాగున గావింపబడెను.

కళాభివృద్ధికిగాను స్త్రీలుచాల కృషి సల్పియున్నారు. ఎలిజబెత్ స్కాట్ కన్య ప్రఖ్యాతివహించిన విగ్రహములను చిత్రించి శిల్పకళా నైపుణ్యతకు ప్రత్యేక బహుమతుల బడసియున్నది. నూతనముగ నిర్మింపబడనున్న షేక్స్పియరు నాట్యమందిరాలంకార మంతయు మహిళామణుల హస్తగతమైనది. అట్లాంటిక్ వైమానిక ప్రయాణమును గౌరవ ప్రదముగ ఇయర్ హార్టు కన్యసాగించియున్నది. ఈమెయేగాక యింకను ఇరువురు సతీతిలకములు వైమానిక గమన నైపుణిని ప్రదర్శించి యుండిరి.

గతవత్సరములో మువ్వురు ప్రఖ్యాతనారీమణులు స్వర్గస్థలైరి. రాజకీయరంగమున తీవ్రముగ పాటువడిన పాంక్ హర్స్టు సతీమణి మరణించినది. ఆమెజీవితము త్యాగసమన్వితము. ఆమెజీవితమంతయు మహిళోద్యమమునకే ధారవోసియున్నది. సంఘసేవ యొనరించుటలో ప్రఖ్యాతివహించిన జెబ్ కన్య స్త్రీలకై పాటుపడుచునే ప్రాణముల వీడినది. ఈయమయొనరించిన మహోన్నత కృషిఫలితముననేడు యూరపియను దేశములలో ననేక శిశుసంరక్షణాలయములు నెలకొల్పబడి సాగింపబడుచున్నది.

లోకమున నున్నతపదవి కోరువారలు జీవశక్తి కార్యసిద్ధులను పొందగోరువారు హిప్నాటిజము మెస్మరిజము మొదలగు నపూర్వ రహస్యములు తెలియగోరువారు—లోకోపకారముకొరకు

స్వామి ప్రేమానంద గారు వ్రాసిన **'వశీకరణతంత్రము'**




అను సత్యాద్భుతగ్రంథమును తక్షణమే తెప్పించుకొని చదివి లాభము పొందుడు. ఇందు, కోరినవారిని పెండ్లి యాడుట, భార్యాప్రేమను పొందుట, ప్రేమాభివృద్ధి, స్త్రీసమాజమున గౌరవము పొందుట, స్త్రీపురుషుల లోపములను కనుగొనుట, పోగొట్టుకొనిన మిత్రస్నేహమును మరల చేపట్టుట, సోమరిపిల్లలకు చురుకు పుట్టచేయుట, పెండ్లికిముందుగ పెండ్లికూతుప్రేమను సంపాదించుట, ప్రియములేని పెండ్లిని ప్రీతికరముగ చేయుట, పురుషుని వశీకరించుట స్త్రీని వశ్యము చేయుట, విరుద్ధులైన బంధువుల ప్రీతిని సంపాదించుట, అధికారి యనుగ్రహమును సంపాదించుట, దేశనాయకుడగుట, మానవ వశ్యము, జీవజంతువుల వశ్యము, ఉచ్చాటన, ఆకర్షణ, మోహన, స్తంభన, విద్వేషణ, మారణ, శాంతిప్రయోగములు మొదలగు 100 విషయములు సులభశైలిలో లిఖింపబడినవి. ఇంతవరకు నుపయోగమైన యీ యమూల్యగ్రంథము నింతవర కెవరును తెలుగుభాషయందు వ్రాయలేదని ధైర్యముతో చెప్పుచున్నాము. ఎన్నియో మర్మములు! అన్నియు రహస్యములు! మర్మములు—రహస్యములు—వశీకరణములు—చదువచదువ చూడచూడ అత్యద్భుతములు!!! ఈగ్రంథము యొక్కన కెక్కువిలువ కలదియనుటయం దతిశయోక్తి లేదు.

పైన వివరింపబడిన విషయము లిందు లేవని నిరూపింతురేని ఈపుస్తకమునకు మీరిచ్చిన వెల మీకు త్రిప్పివేయబడును. అంతకన్న నెక్కుడుగ నీగ్రంథముయొక్క మహత్వమునుగూర్చి వేరేమి చెప్పవచ్చును? ఈ యమూల్యగ్రంథరాజమును సకలజనులు చదువుటకుగాను యేర్పరచిన వెల రూ 3-0-0.

ఎం. ఎస్. రాములు అండు కంపెని, పుస్తకవ్యాపారులు, రాయపురము, మదరాసు.

# స్వర్ణలత

## డాక్టర్ గంగూలీగారి సాంఘిక నవలానువాదము

### పదునొకొండవ ప్రకరణము

పాఠకులకు నూతనముగ పరిచయ మొనరింపబడిన విప్రదాస బెనర్జీ కుటుంబము నటనుంచి, యిల్లు, భార్యా బిడ్డలను విడచి ధనార్జనాసక్తుడై కలకత్తా నగరమును జేరియుండిన విధుభూషణు నొక్కమారు తిలకింతము. గ్రామజీవనమున కలవడియుండిన విధుభూషణునకు కలకత్తాయంతయు నూతనముగ కన్పట్టుచుండెను. విశాలమగు వీధులు, మోటారుబండ్లు, ట్రాముకారులు, తమతమ పనుల కేగుచుండిన జనప్రవాహములు యివియన్నియు ఆతనిని కొంతవరకు ముగ్ధుని గావించెను గాని దారిని బోవుచుండిన ఒక చిన్నిబాలుని గాంచినంతనే విధుభూషణునకు తన ముద్దు గోపాలుడును మృదుల వర్తనియగు సరళయు జ్ఞప్తికివచ్చిరి. అంతటితో ఆతడు భావికర్తవ్యమును గురించి యాలోచించుటకు గడంగెను. "ఈమహా నగరమున నేనెవ్వరిని గాని యెరుంగను. ఎవ్వరి కడ కేగి యెటులవగుట?" అని తనలో తాననుకొన దొడంగెను.

విధుభూషణుడు కలకత్తా నగరమున యేమి చేయగలడు? ఆతడు చిన్ననాట నుండియు కష్టపడుట కలవడియుండలేదు. ఇంక ఆతడభ్యసించిన సంగీత మొక్కటియే యున్నది గాని ఆతని మనస్సు దుఃఖపూరితమైయున్న సీసమయమున సంగీతమువలన జీవించుట కాతడియ్య కొనడు. ఉత్సాహములేని సమయమున సంగీతము వైపునకు దృష్టిపోదు.

ఆలోచనలతో మూడుదినములు గడచిపోయెను. సత్రమునందు పరుండుట కింక యెడముండదు. ఎట్లులైనను ఒక యుద్యోగము చూచుకొనవలయును. దాన తలదాచుకొనుట కెడముకూడ లభింపగలదు. మనస్సు గట్టిపరచుకొని కుటుంబ పోషణమున కని యెంతటిపని నేనియు చేయవలయునని విధుభూషణుడు నిశ్చయించుకొనెను. వెంటనే ఒక రాజ వీధిని బడిపోవుచు వీణాది సంగీత పరికరముల నమ్ము అంగడినిగాంచి అటకేగి కడుం గడు వినయముతో యెవరేని సంగీతము చెప్పించుకొన నిష్టమున్నవారున్నారా యని యడిగి తెలిసికొని అక్కడివారు చెప్పిన గృహమున కేగి మాసమున కైదురూపాయల వంతున రెండు గృహములయందు సంగీతము చెప్పుటకు విధుభూషణుడు ఘనుకొనియెను.

రెండు గృహముల విద్య గరపుటవలన వచ్చిన పదిరూపాయలలో నొక్క కాసైనను నాతడు ముట్టవీలులేదు; ఆ మొత్తమును గృహమున కంపవలయును, ఆతడందులకే యింత దూరము రావలసివచ్చెను అట్టి యెడనున అందుండి ధనము తనకై వెచ్చించుట కాతని మనమెట్లు లంగీకరించును? తనకగు ఖర్చులకు వలయు ధనము నార్జించుకొనుట కిక ప్రయత్నింపవలయును. గోపాలుని, సరళను దృష్టియందుంచుకొని ఆతడు తన ప్రయత్నములను సాగించుచుండెను.

## పండ్రెండవ ప్రకరణము

కాల మెల్లవేళల నొక్క రీతిగా నుండదు. ఒకనాడు కలకలలాడు మోములతో ముద్దుపల్కులతో యింటినిండ జనులతో శోభాయమానముగ నుండుచుండిన శశిభూషణ విధుభూషణుల గృహము నేడు కళావిహీనమైయున్నది. విధుభూషణు డుదరపోషణార్థమై కలకత్తా కేగెను. శశిభూషణుని మరదలు సరళయు, ఆమె కొమరుడును నిత్యోత్సాహినియై యుండెడి శ్యామలయు వేరుగనొక చిన్నగృహమున దుఃఖజీవితమును గడపుచున్నారు. ఇంక శశిభూషణు డుద్యోగ మొనరించి గృహమున కలసి వివర్ణవదనముతో వచ్చి యొక మూలకూరుచుండును. ఆతని బిడ్డలు కామినీవిపినులుకూడ మునుపటివలె ఆడుకొనుట లేదు. ప్రమద తనమందిరమందే యెక్కువకాలము గడపుచుండెను. ప్రమదతల్లి వంట యింటపనుల చక్కబెట్టుచు తన కొమరునకు వలయు తినుబండములనన్నింటిని తయారు చేసి యిచ్చుచుండెను. ఇంక ప్రమద మేనమామ యేదియో ఆంతరంగికోద్దేశముతో వచ్చియున్నట్లుగ ముప్పొద్దులును కడుపునిండ భోజనముచేయుచు కుటిలభ్రూయుగ మధ్యంబుతో అరుగుపైని కూరుచుండును. ఈవిధమున శశిభూషణుని గృహము కళ దప్పిపోయినది.

శశిభూషణున కెక్కడలేని విచారమును గలిగినది. ఏమిచేయుటకును ఆతనికి తోచదాయెను. తుంటరియగు ప్రమదసోదరుడు కామినీవిపినుల వెంటనిడుకొని యిరుగు పొరుగులందుగల గృహములు చొరబడి పండ్లుమున్నగువాటిని దొంగలించుట మొదలిడెను. ఈతనివలన పాపమా చిన్న బిడ్డలిరువురునుకూడ పాడగుచుండుటను గాంచి శశిభూషణుడు హృదయమందెంతగనో గుందుచుండెడివాడు. కాని యేమిలాభము? ఆతడేమియనుటకును యిష్టపడకుండెను.

ఒక్క మాసముదినములకే ప్రమద తానొనరించిన కార్యమువలన తనకుటుంబమున కొనగూడుచుండిన నష్టమును గుర్తింపగలిగినది. ఒకవంక తనయిరువురు బిడ్డలును చెడుమార్గముల బడుచుండిరి. ఇంటనెంతయుండిన నంతయు నాకరగుచుండెను. అంతియె

గాక వంటయింటియందలి మూసువంతులుపనిని తానేస్వయముగ చేయవలసి వచ్చుచుండెను. పైగ తానుకోరిన నగలకు వలయుధనము మిగలనికారణమున భర్తనేమియు అనలేకయుండెను.

మరియొక మాసముదినములు గడచినవి. పుట్టింటివారిమీద ప్రమదకు విరక్తి బుట్టెను. కాని ఆమె వారినింటినుండి వెళ్లిపోవలసినదిగ ననలేదు. అనకున్నచో వారు కదలువారుకారు. సోదరుడు గదాధరుని దుండగములు దినదినమునకును యెక్కువయుగుచుండెను.

ప్రమద తనలోతాను తర్కించుకొనుచు ఒకనాటిరాత్రి చల్లగాలికని వసారాలో పరుండెను. పగలంతయు కార్యాలయమందే పనిజేసియుండుటచే కసుడస్సియుండిన శశిభూషణుడు పడకకుర్చీయందే నిద్దురవోయెను.

ప్రమదమేనమామ కదియేసమయము. ఆతడు మెల్లగలేచి గదాధరుని సహాయమున పడకటిల్లుసొచ్చి ప్రమద నగలుండిన కర్రపెట్టెను చంకనిడుకొని బయలుదేరెను. ఆకసమంతయు అంధకార బంధురమైయుండెను. బాటయెటనున్నదో యెటుబోయిన యెక్కడకేగునో యనికూడ తెలియకుండెను. దొంగలుమాత్రమా యంధకారమును లెక్కసేయలేదు. సాధ్యమైనంత త్వరితగతిని ముందున కడుగులిడుచుండిరి.

అట్టిసమయమున ప్రక్కవీధినుండి కుక్కమొరుగసాగెను. అంతటితో ప్రమదకు మెలకువజనించెను. ప్రమద వడివడిగ పడకటింటిలోనికేగి గోడనువెలుగుచుండిన దివ్వెనించుక హెచ్చించెను. ఆమెకుజరిగినది తెలిసినది. ఒక్కగంతున ప్రమద పెద్దకేకతో బయటికివచ్చి భర్తనుతట్టిలేపుచు "అయ్యో, యింకను మొద్దునిద్దురేనా! మనలక్ష్మినిని యెవరో యెత్తుకపోయిరి! లెండు! వెతకుడు! దొంగలు!! దొంగలు!!!" అని కేకలు వేయుచు 'మామా, గదాధరా! యెక్కడ?' అనుచు వారు మామూలుగా శయనించుస్థలమున కేగిచూడ అటవారు కానరారైరి. "అయ్యో నాకొంపతీసిరి!" అని గుండెబాదుకొనుచు తనవెంట యితరులు వచ్చుచున్నదియు లేనిదియు గమనింపకుండ ప్రమద యొకదివ్వెబట్టుకొని ఒకబాటబట్టి పరుగిడజొచ్చెను.

నగలకై ప్రమద నిత్యమును భర్తతో తగవులాడుచుండెడిది. ఇంకను యెక్కువ నగలు చేయించుకొనుట కవకాశముండునుగదాయను ఆసతోడనే మరదిసంసారము నీయమ యింటినుండి వెడలగొట్టించినది. అట్టినగలు దొంగలపహరించుటను సహింపగలదా?

ప్రమద అరగంటకాలము పరుగిడినది. ఎవరో యిరువురు పరుగిడుచున్నట్లు ఆచీకటిలో గనపయ్యెను. ఆమె దొంగలు పట్టుపడనున్నా రనుకొనుచుండెను. దారికడ్డముగ ప్రవహించుచుండిన కాలువవద్దకువచ్చుసరికి దొంగలు కాలువనీటిలోనికి దిగియుండిరి. ఒక్కనిముస మాలసించిన ఆమెయాభరణముల సంగిలిన త్రనయాప్త బాంధవులు పారిపోయెదరు. ఇంక ఆలసించుటవలన లాభములేదు. ప్రమద ప్రవాహమును దుమికినది. ఈతరాకున్నను ముందునకు ధైర్యముగ అడుగులిడినది. మేనమామపట్టియున్న నగల పెట్టెను చేతబట్టినది. కాని యేమిలాభము? ఒక అడుగుముందునకు గాని వెనుకకుగాని వేయజాలనిస్థితియందు ప్రమదయుండెను. ఆమెకుత్తుకవరకును జలముండెను. ఈతరాదు. యేమిచేయగలదు? నీరుమ్రింగి ప్రాణాంతకస్థితికి వచ్చియుండెను.

దూరమునుండి వలదు వలదని వారించుచుండిన భర్త పరుగు పరుగునవచ్చి ప్రమదను పైకిదీసి ప్రథమ చికిత్సల గావించెను.

ప్రమద కొనగూడిన కష్టములను శ్యామల మూలమున నెఱింగిన సరళ 'అయ్యో! ఆమె కెంత కష్టము వాటిల్లినదని పశ్చాత్తాపపడుచు వెంటనే ఆమెనుచూడ నేగెను.' ప్రమద జ్వరముచే బాధపడుచుండెను. ఆమెకువలయు సపర్యలచేయు వారొక్కరును కానబడ లేదు. సరళహృదయయగు సరళగుండె కరగి నీరైనదనవచ్చును. ప్రమద దుస్థితి కెంతయు సరళ చింతిల్లుచు ఆమెకు వలయు సపర్యల గావించి కామినీవిపినుల బుజ్జగించి వారలకాహారమునిడెను. సరళ ఉదయమేవచ్చి వలయు సహాయమంతయు గావించి స్వగృహమున కేగి అట గోపాలునకు అన్నమిడి బడికంపి తిరిగివచ్చి రాత్రి తొమ్మిదిగంటల వరకటనే యుండి అనంతరము గృహమున కేగుచుండెడిది.

ఇట్లు మూడుదినములు గడచినవి. ఆమెకు దాహమువేయ 'అమ్మా'యని పిలచెను. సరళ "అక్కయ్యా యేమి కావలయును? దాహమా?" యనుచు ముందునకు వచ్చెను. ప్రమద ఒకమారు కనులుతెరచి సరళను చూచినది. ప్రమద హృదయములో గలుగుచుండిన మార్పంతయు సరళ గ్రహించినది. కొలదిగ కాచిననీళ్లతో ప్రమద పెదవుల తడపుచు, 'అమ్మ యెక్కడికో వెళ్లిపోయినది. తిరిగివచ్చునను కొందును' అని నెమ్మదిగ బలికెను.

[అనువాదకుడు:—వసవిహారి]

# రజస్వల

బాలికయొక్క జీవితమందు రజస్వలయగుటతోడనె చాల మార్పు ఒనగూడును. రజస్వలయగుటతోడనె యౌవన దశప్రారంభమైన దనవచ్చును.

రజోసంబంధమైన దానికి రజస్వలయను నామకరణము గావింపబడియున్నది. ప్రతిమాసమున శుక్లపక్ష దివసములందు స్త్రీలు రజస్వలయగుదురు. ఈరజస్వలకును శుక్లపక్షదినములకును సంబంధమేలకలిగినదో యనువిషయమింకను పరిశోధింపబడి యుండ లేదు. స్త్రీలు రజస్వల మామూలుగ ప్రతి యిరువది యెనిమిది దినములకు ఒకసారి యగు చుందురు.

రజస్వలయగుట యన నాయువతి గార్హస్థ్య జీవనమున కవసరమగు మార్పు నొందినదని యర్థము—ఈరజస్వలయగుటకు తరుచు శీతోష్ణస్థితి గతులే చాలవరకు కారణము ఉష్ణదేశములయందు బాలికలు త్వరితముగ రజస్వల యయ్యెదరు. ఈ క్వేటరు నానియున్న దేశముల యందలి బాలికలు 11 మొదలు 14 సంవత్సరముల లోపుననే ఋతుమతులయ్యెదరు. అంతయెక్కు డుష్ణతయు అంతయెక్కుగు శీతలమునుగాక సమాన మగు నేడి చలువగల దేశములయందలి బాలికలు 13 మొదలు 16 వత్సరములలోపున ఋతుమతులయ్యెదరు. కేవలము శీతలదేశములయందుండు బాలికలు 15 మొదలు 20 వత్సరములలోన ఋతుమతులయ్యెదరు. ఈపైన జెర్కొనిన యంశము ననుసరించి ఉష్ణమెంత యెక్కువయైయుండిన బాలికలంత త్వరలో ఋతుమతులయ్యెదరని తెలియు చున్నది. అంతియెగాక సముద్రపు పల్లమునుండి భూప్రదేశముయొక్క యెత్తుననుసరించి కూడ ఋతుకాలము దగ్గరయగుచుండును.

ప్రపంచమందలి ఆయాప్రధాన నగరములలోని బాలికలు యేయేవయసునందు ఋతుమతులయ్యెదరో "ప్లాస్" అనునతడు "మెడికల్ సైన్సు" లో నీ క్రింది విధమున వ్రాసియున్నాడు

| పట్టణము | సగటున రజస్వల ప్రారంభమగువయసు | |
|---|---|---|
| | ఏండ్లు | మాసములు |
| స్వీడనులోని లాప్‌లాండ్ | 18 | 0 |
| క్రిస్టియానా | 16 | 8 |
| కోపెన్‌హాగన్ | 16 | 9 |
| మ్యూనిచ్ | 16 | 5 |
| గొట్టిన్‌జన్ | 16 | 2 |
| వియన్నా | 15 | 8 |
| బెర్లిన్ | 15 | 7 |
| స్టాక్‌హోమ్ | 15 | 6 |
| మాన్‌చెస్టర్ | 15 | 6 |
| వార్సా | 15 | 1 |
| లండను | 15 | 1 |
| | 14 | 9 |
| పారిస్ | 14 | 7 |
| | 14 | 5 |
| మెడీరా | 14 | 0 |
| మాంట్‌పిల్లర్ | 14 | 2 |
| కార్ఫ్యూ | 14 | 0 |
| మార్సేల్సు | 13 | 11 |
| కలకత్తా | 12 | 0 |
| ఈజిప్టు | 10 | 0 |

శీతోష్ణస్థితియైన యనంతరము వేరువేరు తెగలయందలి బాలికలు వేరువేరు వయసులయందు ఋతుమతులగుచుందురు. అమెరికాయందలి జ్యూ జాతిబాలికలు సాధారణముగా పన్నెండువత్సరముల ఆరుమాసములకు ఋతుమతులగుచుందురు. అమెరికాయందలి మరియే యితరజాతివారును యింతత్వరగా రజస్వలకారు. ప్రపంచమునగల పురాతనపు తెగలకు జెందినసంఘములయందలి స్త్రీల రజస్వలల మధ్య వ్యవధియెక్కువగ నుండును. ఈసందర్భమున హేవలక్ ఎల్లిస్ వ్రాసిన యీక్రిందివిషయము గమనార్హమై యున్నది.

"ఎస్కిమోల వాసస్థలము, దానియొక్క శీతోష్ణస్థితిగతులు మున్నగు విషయములు మన కెంత వింతగ కానుపించుచుండునో వారి ఋతుసంబంధమగు వివరములు కూడ అంత వింతగ కన్పట్టుచుండును. ఉత్తరధృవ యాత్ర సలిపియుండిన కుక్ అను నాయన ఎస్కిమోల జీవితాంశముల బాగుగ తెలిసికొనియెను. ఈ జాతి వారు 19 యేండ్లకు గాని ఋతుమతులు కారు. సూర్యరశ్మి కొంచమేనియు లేని మాసములందును, శీత కాలమందును ఎస్కిమో స్త్రీలు బహిష్టుకారు. గ్రీన్‌లెండు దేశమందలి స్త్రీలు ప్రతి మూడుమాసములకు ఒక్కొక్కమారు కొందరు సంవత్సర మంతటికిని యే రెండుమూడుమారులో బహిష్టు అయ్యెదరని వెల్‌ఫ్యూగారు చెప్పియున్నారు. ఫారోదీవుల యందలి స్త్రీలలో బహిష్టు తరుచు నిలిచి పోవుచుండునని తెలియుచున్నది. సెమోయిక్ తెగవారిలో నీ బహిష్టు అనునదియున్నను రక్తస్రావము గమనింపదగినంత యుండదని కారణాన యీ తెగ స్త్రీలు బహిష్టు అగుటయే లేదని వైద్యులు నిర్ణయించియున్నారు. ఉత్తర అమెరికా దేశమందు గల రెడ్ ఇండియన్ తెగకు చెందిన స్త్రీలలోని బహిష్టు చిహ్నము చాల స్వల్పముగ నుండును. టెర్రాడెల్ ఫ్యూగోయందలి దిగంబర స్త్రీలలో చాలమంది ప్రతి ఆరుమాసములకును ఒక్కమారు బహిష్టు అగుచుందురు."

జీవన మార్గమును సాంఘిక నియమములును ఆధారపడి కూడ నీ రజస్వలయగు వయసు నిర్ణయింపబడగలదు. ఈ యంశమునకు కొంద రాశ్చర్యపడవచ్చును. కాని యించుక దీర్ఘముగ యాలోచించు నెడ యిందలి యదార్థత బోధకాగలదు. తరువాత ఆయావ్యక్తులయొక్క చిత్తవృత్తులమీద కూడ నాధారపడియున్నది. నగర జీవనము, వారువారు తినుచుండు ఆహార పదార్థములు, మున్నగువాటిమీద కూడ నీ రజస్వలా సమయ మాధారపడియుండును. శ్వేత దేహములు, తెల్లని వెంట్రుకలు, నీలికనులు గల బాలికలకన్న నల్లని శిరోజములు, కాటుకకనులు, చామనచాయ దేహములు గల బాలికలు ముందుగ రజస్వల యయ్యెదరని డాక్టర్ కిశ్చిగారు చెప్పుచున్నారు. వారే యీక్రింది యంశములకూడ నిట్లు గ్రంథస్థము గావించియున్నారు.

"రజస్వలా సమయము సాంఘికజీవన విధానముమీద కూడ నాధారపడియుండును. జీవనోపాధికై దినమంతయు కష్టపడు కుటుంబముల యందునకన్న సంపన్న గృహముల యందలి బాలికలు త్వరగా ఋతుమతులయ్యెదరు.

"చిన్న పట్టణములలోనకన్న పెద్ద నగరముల యందుండు బాలికలు త్వరలో ఋతుమతులయ్యెదరు. పారిస్ నగరమందు బాలికలు 14 వత్సరముల ఆరుమాసములకు పుష్ప

వతులైనచో ఆపరిసరములయందున్న గ్రామములలోని బాలికలు 14 వత్సరముల 9 మాసములకు ఋతుమతులగుచున్నారు.

"ఈ ఋతుమతులగుటలో తల్లికని పిల్లకును కొంతసంబంధముకూడ యున్నది. రజస్వలాసమయమున తరుచు బాలికలయందీ చిహ్నములగుపడును.

తాత్కాలికముగ ముఖమింతుక వివర్ణమగును. సిగ్గునును చెక్కుల కెగబ్రాకును. కనులచుట్టును యించుక నల్లనిచక్రము లుదయించును.

"వెన్నెముక యందించుక బాధ, నడుమునొప్పి, పొత్తికడుపు మృదువగుట, మూత్రాశయ ప్రాంతమున ఒకవిధమగు ఉద్రేకము, వక్షస్థలమించుక ఉబియుట, నీరసము, ఆయాసమునకు మెడమొసగుట, యెట్టిపనిచేయుటకుగాని యిష్టములేకయుండుట, మూత్రద్వారమునుండి ద్రవస్రావము, మున్నగునవి రజస్వలా సమయమున తరుచు బాలికలయందు కన్పట్టును.

"ఆసమయముననే మామూలునకువలె పదార్థములు జీర్ణముకావు. మలబద్ధము, శీతభేది, గుండెదడలోనమార్పు, దేహమందలి ఉష్ణమందొక విధమగుమార్పు మున్నగునవి కూడ కలుగును. సంఘమునుండి దూరముగ నుండవలయునను తలంపు, యించుక అశాంతి, తలనొప్పి మున్నగునవికూడ ప్రాప్తించును.

"రజస్వలానంతరము కొంతకాలమువరకు ప్రతిమాసమును బహిష్టు సక్రమకాలములయందగుచుండుట యనునది యుండదు. ఈయంశ మెరుగని తలిదండ్రులు కొంత కంగారుపడియెదరుకాని అట్టిదేమియు అవసరములేదు. కొంతకాలమునకు బహిష్టు సక్రమకాలములయందే యగుచుండును.

"రజస్వలానంతరము బాలికయొక్క దేహమందనేక మార్పులుదయించును. బాలిక దేహమించుక బరువగును. శరీరము చక్కని ఆకృతిదాల్చును. ఒకవిధమగు నూతన కళ ఆమెయందు కానుపించును. ఇంతవరకును ఒకయాకృతికి వచ్చియుండని యూరువులు స్త్రీలకుండవలసిన యాకృతినందును. అంతటితో బాలిక యువతిగా నారంభించిన దనవచ్చును.

నాటినుండియు బుద్ధి ఆలోచనలయందుకూడ మార్పుజనించును. ఇదివరకుగల 'చంటిబిడ్డ చేష్టలు' అంతర్ధానమగును. ఇంతవరకు గంతులువేయుచుండిన యామె కొంత శాంతపథమునబడును. అనంతరము క్రమముగ ననుసరించి గార్హస్థ్య జీవనపథమునందుగల మంచి చెడ్డల నెరుంగుటయెగాక బాధ్యతలగూడ గమనించి వర్తించుచుండును.

# సుకన్య

శ్రీమతి కొంగర అన్నపూర్ణమ్మ గారు

శర్యాతియను రాజొకండుగలడు. అతనికి సుకన్యయను కుమారిగలదు. నర్మదానదీ తీరంబునకు తననాల్గువేల కాంతాజనంబులతో విహరించిపో వచ్చియుండెను. భృగుపుత్రుడగు చ్యవనమహాముని పెక్కు వేలేండ్లు తపమొనర్చుటచే తనువంతయు వల్మీకంబుచే గప్పబడి, మనుష్యుడని బోల్చుట కశక్యముగానుండెను.

అట్టితఱి సుకన్య నెచ్చెలిబృందముతో దిరుగాడుచు చ్యవనవల్మీకాంతికక్షోణి కచ్చెరువందుచుండ దివ్యభూషణభూషితయగు తనూవైభవముచే దిశలవెలిగించు నారాజకుమారినిగాంచి చలితమానసుడై ముని యీరెలుంగున తపోబలకలితుడై బిల్చెను.

సుకన్యయు నాస్వరంబెద్దియో తెలియంజాలక వల్మీకంబుపై మెఱయుచున్న చ్యవనచక్షువులంగాంచి యవి నేత్రములని తెలియక కంటకాగ్రంబున వానిపై బొడిచెను.

దాన నాముని విగతనయనుండై కోపించి శర్యాతిసైన్యంబునకు మూత్రపురీష నిరోధంబుగా శపించెను. అదియంతయు శర్యాతివిని యేమహామహూన కెవరెట్టి కీడు గావించిరోయని వారినడిగి కారణంబరయజాలక విచారమనస్కుడైయున్న తండ్రి కడకు సుకన్యయరుదెంచి వినయవిధేయతలంజూపి యిట్లనియె.

"తండ్రీ! మిడుగుఱుబురువులవలె నొకపుట్టమీద మెఱయుచుండు మెఱుగులమీద బొడిచితిని. ఇదియ నేజేసిన యపచార" మని విన్నవించెను.

శర్యాతి తక్షణముననే పుట్టకడకేగి భార్గవునింజూచి "మునిశ్రేష్ఠుడా! నాతనయ తెలిసియు తెలియక మీకపకృతిరొయినర్చె గాన సైచి రక్షింపు"మని ప్రార్థించిన యామునీంద్రుడు, "శర్యాతీ! భవత్పుత్రి యౌవనగర్వంబుచే కన్నుగానకిటుచేసి నాకీర్తి దొలగించె.

గాన దీనిని సతిగా గైకొన్నపుడే నాకోపము మీశాపముదీరును. అట్లుచేయగలవేని చేయుము. లేదేని పొమ్ము" అని చెప్పిన, వయోవృద్ధుడనియైన దలంపక శర్యాతితన కూతును తపస్విపరేణ్యునకిచ్చి తనసేనానిరోధంబు బాపికొని తనపురంబునకుం జనియె.

రాజకుమారి చ్యవనుని జీవితేశ్వరునిగా భావించి భక్తితత్పరయై నిత్యము నుపాసింపుచు, పంచాగ్నులంగొల్చుచు, వేదవిదులగు బ్రాహ్మణులను దేవతాశ్రేష్ఠులను స్తోత్రములనుజేయుచు యౌవనప్రౌఢను ప్రకాశించుచుండెను. అట్లుకొంతకాలము జరిగిన తదుపరి అశ్వినీదేవత లరుదెంచి, స్నానమాచరించిపోవు నాజలజాక్షిని వీక్షించి "ఓకాంతామణీ! తనుప్రకాశముచే సర్వదిశలను ప్రకాశింపజేయు నీవెవ్వరిదానవు? ఎవరిపంపుననిట్లు చరించుచుంటివి? మాకోరిక లీరికలెత్తునట్లు నీచరితము సంశయింపక దెల్పుము" అనిన నాసత్యులకు సుకన్యయిట్లనియె.

"ఓదివ్యులారా! నేను శర్యాతియనురాజు పుత్రిని. భృగుకుమారుడగు చ్యవనునకు పత్నిని. పేరు సుకన్య" అని తన చరితము దెలుపగా నాదస్రులు తెగనవ్వి తమ్మెరింగించి యావనితా శిరోమణిదిక్కు మొగమై విచారము దోప నిట్లని బల్కిరి. "కాటికికాళ్లు చాచుకొనియున్న యీముదుసలికి భార్యవుగానేల? నిజముగా విచారించిన నినుగన్న తండ్రికి లేశమైన బ్రేవులయందు దయయున్నచో యీతపస్వికి యిచ్చియుండడు. బోటిరో! నీచరితము విన్న ఎటువంటి వారికైన విచారము గల్గును.

దేవలోకములలోగూడ నిన్ను బోలిన దానిని కని విని యెరుంగము. బంగారమును నిరసించు నీతనుచ్ఛాయకు భూషణములు నీకుందగవని దూరము బోయినట్లయ్యె! అడవిగాచినవెన్నెలంబోలి యీవృద్ధుని—శరీరమంతయు శుష్కించిన వానిని—భోగములన్నిటిని త్యజించిన వానిని—బట్టియుండుట మేలుగాదు. గాన వేఱొక్కని వరింపుము." అనిన కవలకు నాతన్వి యిట్లనియె.

"అయ్యలారా! నాకు చ్యవనునియందే మహాప్రీతి. వేఱొక్కని వరింపనొల్ల. మీరిట్లు తలంచుట ధర్మముగాదు." అనిన సుకన్యకు ఆసత్యులిట్లనిరి.

"ఓవనితా! మేము దేవభిషగ్వరులము. నీభర్తను నవరూపయౌవనుడగునట్లు చేసెదము"యని చెప్ప నామె తనపతికడకుజని జరిగిన యుదంతము విన్నవింప నాతండు వల్లెయన తిరిగివచ్చి "మీరుజెప్పినట్లు నాభర్తను నవరూపసంపన్నుని జేయు"మన వారలు చ్యవనుని "యీసరోవరమునందు గ్రుంకు లిడు"మని దెల్పిరి. ఆముని యట్లెజేసెను. ఆదేవ భిషగ్వరులుగూడ నందే మునిగిరి. ముగ్గురు నొకేరూపమునొందిరి. అశ్వినీదేవతలు "మాలో నొక్కొకరినే దడబడక వరింపు"మన నామె మనోవాక్కాయ కర్మంబులచే చ్యవనునే వరించెను. రూపయౌవననేత్రసంపన్నుండైన చ్యవనుండు మిక్కిలి సంతోష స్వాంతుడయ్యెను. సుకన్య కృతజ్ఞతాపూర్వక నమస్కృతయై" అయ్యలారా! మీదయచే నాజీవితేశ్వరుడు నవయౌవన నేత్ర సంపన్నుడయ్యెను." చ్యవనుడు రూపవంతుడౌట విని శర్యాతిరాజువచ్చి కూతును జామాతనుగాంచి ఆనంద భరితుడయ్యెను. శర్యాతిచే నొక యజ్ఞముజేయించి అశ్వినీదేవతలను చ్యవనుడు సోమనిధులం జేసెను!

మనసోదరి సుకన్య తన సౌఖ్యమును పరిత్యజించి, తనతండ్రియొక్క సౌఖ్యమునకై తన్ను అర్పించుకొని, సేనాసమూహమునకు సుఖమునుగూర్చి, యాతపోధనునే మనోవాక్కాయ కర్మలచే జీవితేశ్వరునిగా సేవించి, తన పతిభక్తిచే భర్తను కన్నులుగల్గిన రూపవంతునిజేయ సామర్థ్యముగల్గినదాయెను. పతివ్రతల కసాధ్యమేదిగలదు?

# జగోస్లావాకియా స్త్రీలు

జగోస్లావాకియా దేశము—

జర్మనీ, ఆస్ట్రియా, హంగరి, రుమేనియా, పోలెండు దేశముల నానియున్నది. పైనజేర్కొనబడిన కొన్ని రాజ్యములయందలి భాగములొకటిగా జేర్చబడుటచే నీరాజ్యమేర్పడినది. ఈరాజ్యము యిరువదిరెండు జిల్లాలుగ విభజింపబడినది. ఈదేశమున చతురపుమైలు ఒకటికి 248 మందివంతున దేశమందు 1921-వ సంవత్సరపు జనాభాబట్టి 13,595,816 మంది జనులున్నట్లు తెలియుచున్నది. ఈజనసంఖ్యలో జర్మనులు, రుథేనియనులు, మార్బర్లు, జగోస్లోవాకులు మున్నగు తెగలవారున్నారు. అందరికన్న జగోస్లోవాకుల సంఖ్యయే యెక్కువయుండుటచేతను ఆతెగవారిచే ఆక్రమింపబడిన ప్రదేశమెక్కువ యుంటచేతను ఈదేశమునకు జగోస్లోవాకియా నామమువచ్చినది.

ప్రభుత్వము—

ప్రజాస్వామ్యమైపై నాధారపడియున్న రిపబ్లిక్ గవర్నమెంటు దేశమును పాలించుచున్నది. పరిపాలనాది విషయములగురించి వలయు నిర్ణయములను గావించుటకు చేంబర్ ఆఫ్ డిప్యూటీస్ (300 ల సభ్యులు), సెనేట్ (150 మంది సభ్యులు) అను రెండుసభలు గలవు. ఈరెండుసభలకును వోటింగుపద్ధతినే ప్రతినిధులెన్నుకొనబడుచున్నారు. వోటింగు విషయమున సమానమగు హక్కులుగలవు. దేశమందలి ప్రతిస్త్రీపురుషుడును వోటుచేసి తీరవలయును.

దేశసంరక్షణార్థమై 150,000 ల సంఖ్యగల సైనికదళమున్నది. ఇదియుగాక ప్రతి యువకుడును రెండుసంవత్సరములకాలము సైన్యశిక్షణము నందవలయును.

ఈదేశమున బంగారము, రాగి, వెండి, ఇనుము, సీసము, ఉప్పు, రేడియము గనులు విరివిగానున్నవి. కిరసనాయిలు నూతులుకూడ చాలకలవు. దేశమందు



స్త్రీలు తమ యందచందముల ననుసరించి రంగులగు దుస్తులను ధరింతురు. ఈయువతి తన శరీరచ్ఛాయ ననుసరించి రంగులసేరి దుస్తులగావించు కొన్నది.

ప్రజలు వ్యవసాయమునకు యెక్కువ ప్రాముఖ్యత నొసంగుచున్నారు. ఈదేశము, ఆటవస్తువులు, గాజు సామానులు, వ్యవసాయ పరికరములు, కాగితము, తోలువస్తువులు మున్నగు పరిశ్రమల కెక్కువ శ్రద్ధను జూపుచు వాటియందు పలుయు ఖ్యాతి నార్జించుచున్నది.

దేశమున తొమ్మిదివేల మైళ్ల అయో మార్గముకలదు. టెలిఫోను, తంతివార్త నిర్మాణ ములు విరివిగానున్నవి.

ఈదేశమునకు ప్రేగ్ (ప్రహా) నగరము ముఖ్యపట్టణము. బ్రెగో, జన్, బ్రిటిస్ లావియా, ఒలోమాన్, కొయిస్, మొరోకా, స్లీ, లిబ్రీస్ నగరములు విరివిగా వ్యాపారమును సాగించు చున్నవి.

నాగరికత—

జగోస్లొవాకియా యందనేక తెగలుండినను ప్రధానమైనది జగోస్లొవాకియను లును బోహేరుయనులునై యున్నారు. ఈరెండు తెగల వారును యూరపుఖండమున కంతటికిని విపరీతముగ కానుపించు విజ్ఞానమును గలిగియున్నారు. వీరియందు ప్రాచ్య దేశమందలి పద్ధతులును ఆచారములును కొంతవరకు కానుపించుచుండును. ఆదిని చుట్టు ప్రక్కలనున్న దేశములయందలి నాగరకత యున జగోస్లొవాకియా ప్రజలకుకిట్టెడిదికాదు. ఆకారణమున ప్రజలస్థితి గతులందెట్టి మార్పుగాని కన్పట్టెడిదిగాదు. దీనిని గమనించిన కొందరు మేధావంతులు లోపమును సవరించుటకుగాను ప్రేగ్ నగరమున 14వ శతాబ్దాంత మున నొక బ్రహ్మాండమగు విశ్వకళా పరిషత్తును నెలకొల్పిరి. నాటినుండియు ప్రజలలో

కొంత సంస్కారముదయించెను. స్వతస్సిద్ధముగ తమకుగల యాచారములకు వలయు మార్పుల గావించుకొని జీవన పథములనించుక సుఖవంతము గావించుకొనిరి.



జగోస్లోవాకియా యువతికి లేసులయెడగల వ్యామోహమింతింతగాదు. ఈయువతి దుస్తులందు లేసులేని భాగములేదనియే చెప్పవలయును.

నేడే జగోస్లోవకియా దేశము చుట్టునున్న దేశముల కేయంశమునగాని తీసిపోక సకల సంపదలతో తులదూగుచున్నారు. జగోస్లొవాకియాయందలి భూములుమిగుల సారవంతమై యుండినను పరిశోధనాప్రయత్నములు మానకుండ ఆదేశీయులు నూతన మార్గముల ననుసరించి వ్యవసాయమును సాగించి మాన్యులునకన్న యెక్కువ ఫలితమును బడయుచున్నారు. వ్యవసాయ మెటు లభివృద్ధినంది యున్నదో అట్టులే పెద్దపరిశ్రమలును యీ దేశమున అభివృద్ధి నందియున్నవి

వ్యాయామ విధానములు—

ఈ దేశీయులగురించి మాటలాడు నపుడు ముఖ్యముగ సొలోక్ తెగకుచెందిన వారలే యెక్కువగనున్న కారణమున వారినిగురించియే ముఖ్యముగ తీసికొనెదము. సొలోకీయులకు రోమ్, గ్రీక్ వ్యాయామ పద్ధతుల యెడ నెక్కువ అభిలాష గలిగియున్న కారణమున ఆపద్ధతులనే ప్రధాన క్రీడలుగ నిన్న మొన్నటివరకును అనుసరించు చుండిరి. గ్రీసు దేశములోనుండు విశాలవ్యాయామ మందిరములు (ఆంఫీథియేటర్సు) యీదేశమందు నేటికిని గలవు.

నేడు దేశమందలి బాలబాలిక లందరికిని వ్యాయామము కవాత్ మున్నగు దేహారోగ్య కరమగు విధానములు నేర్పబడుచున్నవి. విద్యల నభ్యసించు చుండిన బాలికలు ఒక్కొక మారు బారులుదీరి ప్రధాన నగరముయందలి రాజబాటలగుండా పోవుచుండగ చూచుట కెంతయో యందముగనుండును. దేశమందలి కార్పతేనియన్ పర్వతప్రాంతముల నివసించు బాలురకు యుద్ధ విధానమంతయు ఆటలక్రింద గావింపబడి నేర్పబడుచున్నది.

ప్రతివత్సరమున కొకమారు వేలకొలదియు యువకులు ప్రధాన నగరమగు జగోస్లావాకియాయందు వ్యాయామ ప్రదర్శనమును సాగింతురు. ఇందులకు ప్రభుత్వమెంతయు సహాయపడుటయెగాక వలయు ప్రోత్సాహమంతటిని గావింతురు.

మతము—

ఈదేశమందన్ని ప్రాంతములను క్రైస్తవమతము వ్యాప్తినందియున్నది. కొండ చరియలయందున్న అనాగరిక తెగలును క్రైస్తవప్రార్థనాలయ ప్రాంతమునకువచ్చు నెడ కడుంగడు భక్తిశ్రద్ధలతో వర్తించును. దారిపొడవున నెన్ని దేవళములున్నను విసుగనకుండ తమిళదేశీయులెట్లు మోకరించుట నభినయించెదరో అట్లులే యీపర్వతప్రాంతవాసులు భక్తితో ఆలయముల ప్రాంతములకు వచ్చిన సమయాన తమ శిరములనుండి టోపీలనుదీసి వినయముగ నడచిపోవుదురు.

దుస్తులు, ఆభరణములు—

జగోస్లావాకియా దేశమందలి పురుషులు ధరించు దుస్తులయందంత మార్పుగాని పద్ధతులుగాని కానరావు. ఈదేశమందలి పురుషులు షరాయిలు, చొక్కాలు, పైన చిన్న వేస్టుకోటు, కాళ్లకు పాదరక్షలు, తల కున్నిటోపీ ధరింతురు.

స్త్రీలుమాత్రమట్లుగాక పలువిధములగు దుస్తుల ధరింతురు. నగలయెడ నీదేశీయుల కెట్టివ్యామోహముగాని లేదనియేచెప్పవచ్చును. స్త్రీలు లేసును విరివిగా నుపయోగింతురు. గ్రామములయందలి సంపన్న గృహములలోని స్త్రీలు మోకాలుదిగని పొట్టిగౌనులను ధరింతురు. చేతులు సీలమండవరకును కప్పబడి యుండును. శిరోజములు వెనుకముచ్చటగ ముడివేయబడియుండును.



జగోస్లోవాకియా స్త్రీ బిడ్డనింటవిడచి పొలమునందు భర్తకుసహాయము చేయనేగజాలదు. అటులని పొలమునకుపోకుండకూడనామెయుండ లేదు. తల్లులు పొలములకేగు సమయమున పసిబిడ్డలవెంటనిడుకొని పోయి నాలుగుకర్రముక్కలతో తాత్కాలికముగ నుయ్యేలను తయారుచేసి బిడ్డనందు పరుండబెట్టెదరు.

జగోస్లోవాకియా దేశపు యువతికి వివిధవర్ణములయెడ యెక్కువమక్కువ. ఆకారణాన నామెసాధారణముగ

ఒకటికెక్కువయగు వర్ణములనుపయోగించి సింగారించుకొనును. నగరములయందలి యువతులు మోచేతినుండి అధమము ఆరంగుళముల వెడల్పుగలలేసు నుపయోగింతురు. వీరివస్తులు ప్రాచ్య దేశమందలి ప్రాచ్యప్రతీచీ సమ్మిళితమగు నవీన వస్త్రాలంకారములకు కొంత పోల్చవచ్చును. ఈదేశీయులు వివాహసమయములయందును సాధారణ సమయములయందును ధరించు దుస్తులయందు చాలవ్యత్యాసముండుటచే పెండ్లి దుస్తులు ధరించువారు నూతనముగ కానుపించెదరు. ఈపద్ధతి యిపుడిప్పుడే ప్రాంతబడుచున్నది.

ఇటీవల యువతులు జర్మనీ ఫ్రాంసు దేశములయందలి గౌనుల ననుసరించి తమ రంగులను, లేసును విరివిగ నుపయోగించి చక్కగ నలంకరించుకొనుచున్నారు.

గ్రామజీవనము—

స్త్రీపురుషులకు సమానమగు ఓటింగు అధికారమున్న కారణమున పల్లె, పట్టణముల యందలి స్త్రీలకు విద్య యొక్కవిధముగనే యున్నదనవచ్చును. అందరును విద్యల నభ్యసింతురు. గ్రామములయందలి స్త్రీలు గార్హస్థ్యజీవనమును సుఖవంతముగ నొనరించుచున్నారు.

స్త్రీలు వ్యవసాయ మందు పురుషులకు సహాయ మొనరించుచున్నారు. తల్లులు తమ బిడ్డలను పొలములకు గొనిపోయి వృక్షచ్ఛాయలందు తాత్కాలికముగ నొక యుయ్యెలను తయారుజేసి అందుపండబెట్టి ఆ పసినిసుంగుల గాంచుచునే పనులనుత్సాహముతో చేయుచుందురు.

# విధ్యుక్తధర్మము

కామేశ్వరరావుగారు

స్త్రీలు విద్యనభ్యసించుట పురుషులతోడ్పాటునకేగాక తమజీవితమందలి కంటక సదృశములగు ప్రవర్తనాపరిణామములను చక్కఁబఱచుకొనుటకు గూడనని తెలియనగును. పురుషుఁడొక్కఁడు ప్రాకృత ధర్మమనుసరించి తన సంసారమును తానే స్వయముగ సంరక్షింపవలసి యున్నను అట్టి విధానము శాశ్వతఫలప్రదానమైనదికాదు. ఒకకుటుంబమున నల్వురైదుగురాడు బిడ్డలుగల పురుషుఁడున్నచో, పూరుషుఁడైన వారితో సమవయస్కుఁడైనచో నాసంసారమేరీతిని కాలముఁ బుచ్చవలెను? పురుషుఁ డెదిగి పెద్దవాఁడై స్వకాయకష్టమున ధనమార్జించి సంసారభారము భరించుదనుక నీస్త్రీలు స్వగృహాంతస్సీమను క్షుదాగ్నిచేఁ జావవలసినదేనా? లేక విద్యాదిలలితకళానిస్సారు లగుటచే పరగృహములకేగి పొట్టఁబోసికొను నుపాయ మెఱుఁగవలసినదా?

పవిత్రతమంబగు భారతీ గర్భంబున సమాదృశులై బుట్టినతోడి కాంతా సమాజమును, విద్యాగంధమెఱిఁగి తత్ఫలప్రదాయకసద్విధాన మెఱుఁగకపోవుటచే, ధనవంతులగు మానినీ మణుల నిస్సారదృక్కులఁ జూడవలసిన ధర్మమా భారతావని యందు పూర్వధర్మశాస్త్రకర్తల యభిమతము! కాదు.

శక్తిమంతులగు సంపన్నులు పేదసంసారముల కుపాధిఁగల్పింప సమర్థులు. విద్యాధనమూర్తులగు వేత్తలు ధనరాజులచేఁ బోషింపఁబడి దారిద్ర్య విమోచకంబగు నట్టియు, శుభప్రదంబగునట్టియు, ననేక ప్రాణసంరక్షణాధారమైనట్టియు సద్విద్యను యిరువురు పురుషుల కుపదేశించుటకంటె బహుళసంసారభారనిర్వాహురాలైన ఒక్కస్త్రీ కుద్బోధించుట దేశదారిద్ర్య మడంచుటయే!

పురుషుఁడొక్క యధికారిచెంత నుద్యోగమొనరించి గృహమున కరుదెంచుసరికి నాతనిశ్రమ నివారించుపట్ల సహజపాతివ్రత్యప్రభావయగు స్త్రీయొనరించు పరిచర్యచే నాతఁడు పరితృప్తిఁజెందునపుడైన నాతఁడాయర్ధాంగి విలువనెఱుఁగఁగల్గెనా? లేదు!

తనభార్య విద్యావిహీనయేయగుఁగాక! తాను తనసంసారసాగర మీదుట స్వశక్తికర్ణధార ణచేగాదు; లోపాలోపములను నిజప్రేమావాహినిచే క్షాళితమొనరించి దుర్భరదారిద్ర్య సమాన్వితగృహము నానందసీమగా మార్చునది స్త్రీవ్యక్తియే!

విద్యావిహీనయైన స్త్రీ నిజగృహమునందు సోమరివలె గూర్చుండియే పురుషున కన్నివిధముల నానందమొనగూర్చునపుడు విద్యావతియగుచో నామె గృహమును మఱింత సంతోషనిలయముగఁ జేయునుగాని యిప్పుడు తమపత్నుల ప్రవర్తన సంకుచితదృష్టితోఁ జూచు పురుషుల యభిప్రాయానుసారము భర్తృపదారవిందసేవ నుఱచి యాతనిఁ దృణీ కరించునా? అది యసంభవము.

ఆమె విద్య నభ్యసించి పతిసేవయు, పసి సంరక్షణము, స్వశరీరమానసిక సంపద్వి యోగమును బాగుగ గమనించును. దాన నింట గృహలక్ష్మి నా సలక్షణయగును.

విద్య నేర్చిన స్త్రీలు సద్గ్రంథరచనకు గడంగి స్వదేశ-స్వజననిగూఢపవిత్రోదంత ముల బహిర్గత మొనరించి తాదృశవనితాలోకమునకుఁ దోడ్పడుట ప్రథమ సుకృతము, లలితకళల నభ్యసించి స్వకుటుంబ పోషణ మొనర్చుకొనుచు తమవంటి స్త్రీలకు నావిద్య నేర్పుచు తద్విధమున వారి కుపాధిగల్పించి భర్తృహృదయనివాసులగుట రెండవ విధా నము; శౌర్యధనులై యథారీతిని వ్యాయామసంస్కారులై సమయము నీక్షించి శత్రు రాజిని బరిమార్పఁబతికి తోడ్పాటు మూడవాంశము! గావున స్త్రీలు సాధ్యమైనంత వరకు విద్య నభ్యసింపుట కనుమతివడసి భర్త నొక దైవమూర్తిగ భావించి పవిత్రభారతావని యందు తమ శాశ్వతకీర్తి చంద్రికల నాచంద్రతారార్క మలంకరింతురుగాక!



కొందరు బాలవితంతువుల పథము—

బాల్యవివాహము లొనరించు ఆచారముగల భారతదేశములో బాలవితంతువుల సంఖ్య యెక్కువగానుండుటలో ఆశ్చర్యపడవలసిన యగత్యమంతగాలేదు. ఇటు లన్యాయముగ తమసౌఖ్యములను గోలుపోయిన అనాథబాలికలు కడకుయెట్టి రహస్యవర్తనలకు గడంగుచున్నారో తెలుపుచు పునర్వివాహములయొక్క యావశ్యకతను నొక్కివక్కాణించుటకు "విడోస్ కాస్" ఈక్రింది నిజాంశములకు ప్రచార మొసంగుచున్నది.

సెడక్ గంజ్ జిల్లాలో ఒకహిందూ సర్దారుయొక్క కోడలు వితంతువాయెను. పునర్వివాహముచేయ నామె తనయిష్టము వెలిబుచ్చినను తనవారలు వినకుండుటనుగాంచి ఆమె యిస్లాముమతమున ప్రవేశించి నూనెవర్తకమును చేయువానికొమరుని వివాహమాడెను. ప్రస్తుత మీయిద్దరును ఆయువతియొక్క మొదటిమామగారియింటికి యెదురుగ నివసించుచున్నారు. అందువలన గలుగుచున్న అవమాన మింతింత యని వేరుగచెప్ప నవసరము లేదు.

ఒక వితంతువు రహస్యవర్తనవలన లాహూరు నగరమున ప్రసవించెను. ఆచిన్నిశిసువును తుదముట్టించుట కామెకు మనస్సు రాకుండెను. అందువలన ఆబిడ్డను అనార్కలీవద్ద నొక పదిరూపాయల నోటుతో వదలి వెడలిపోయెను. ఎవ్వరైనను దయదలచి బిడ్డను పెంచెదరేమో యని యామె యుద్దేశపడెను.

కార్నల్ నగరమున ఒక వితంతువు ప్రసవించెను. తన బిడ్డను చంపుట కిష్టములేని యామె ఋషీకేశమునందలి స్వర్గ యాశ్రమమందు విడచిపెట్టెను. పోలీసు లీసంగతి యెరింగి వాకబుపై ఆవితంతువును పట్టుకొని న్యాయస్థానమున కీడ్చిరి. ఆమె చెప్పిన మాటలబట్టి ఆమె వర్తన మెంత మాత్రమును

తప్పు కాదనియు ఆమె హృదయమందు జనించిన మాతృప్రేమయే ఆమెనట్లు చేయించినదనియు తెలిసినది. పదునారు పత్సరముల ప్రాయముగ విలంతువైన యొక బాలిక తనకు పునర్వివాహము గావించవలసిన దని తల్లిదండ్రుల నెన్నియో మారులు బ్రతిమాలినది. తల్లిదండ్రులు లాకు వాక్యములను లెక్క సేయ లేదు. కడ కామె వ్యభిచారిణియై పాపపు జీవనమునకు గడంగినది.

### మహారాష్ట్ర నాటక కళ—

బొంబాయి విశ్వవిద్యాలయస్థాపనము తోడను ఎల్సియా కన్యారాకతోడను మహారాష్ట్ర నాటకరంగ మభివృద్ధి నందగలిగియున్నదనియు విద్యావంతులు చాలమంది రంగస్థలముల గౌరవింప మొదలిడిరనియు ఆర్. ఎల్. రావుగారు 'త్రివేణి'లో నీక్రింది విధమున వ్రాసియున్నారు.

బొంబాయి విశ్వ విద్యాలయస్థాపనముతోడనే రాష్ట్రమందలి విద్యాసంస్థలు ఈనాటక కళాభివృద్ధికి పూనుకొన్నవి. అంతటితో మహారాష్ట్రమున నాటకసంఘమన్ని ప్రాంతములలోను బయలుదేరినది. బొంబాయియందలి ఎల్ఫిన్‌స్టన్ కళాశాలయందు కాళిదాస ఎల్ఫిన్‌స్టన్ సంఘమను పేర నొకనాటక సంఘ మాదిని స్థాపింపబడినది. ఈసంఘమువారు మొట్ట మొదట శాకుంతల నాటకమును ప్రదర్శించిరి. ఈప్రదర్శనమునకని చాల ధనము వ్యయపరుపబడినది. నాలుగువందల రూప్యముల విలువగల సాల వృక్షముయొక్క బెరడు మదరాసు నగరమునుండి రప్పింపబడెను. అంతియేగాక పూనా నగరము నుండి మూడు సామాను రైలు పెట్టెలతో పూలచెట్లు రప్పింపబడెను.

తరువాత ఎల్సియాకన్యవచ్చి దిగినది. ఈమె తన సహచరలతో కలసి పూనానగరమందలి దక్కన్ కళాశాలయం దాదినొక నాటకమును ప్రదర్శించినది. ఆమె ప్రదర్శించిన నాటకములందు పౌడరు పూతలు వింతదుస్తులు మున్నగు పరికరముల యవసరము లేకపోయెను. కనింగాంచిన వారు యిట్టినాటకము నాడుటవలన యెంతేని లాభముకలదను తలంపుతో అందులకై పలయుప్రయత్న ములను గావింప దొడంగిరి. అప్పటినుండియు విద్యార్థికులు సంస్కృత నాటకములను (మృచ్ఛకటిక ముద్రారాక్షసము మొదలైనవి) ప్రదర్శింప మొదలిడిరి.

తరువాత తర్జుమానాటకములు బయలుదేరినవి. షేక్సుపియరు, షెరిడన్, మోలియేరు మున్నగు పాశ్చాత్య గ్రంథకర్తల నాటకములు మహారాష్ట్రములలోని కనుపదింపబడినవి. నాటక రంగస్థలములయందనేక మార్పులు గావింపబడినవి. ఆసమయమున కొల్హాపురమందలి రాజారామ్ కళాశాలయ-ధ్యుద్యోగి యైన రాజారాముగారు గావించిన కృషియెంతయు సంస్తవనీయమై యొప్పుచున్నది.

### స్త్రీలు—గ్రామపునర్నిర్మాణము—

ఎఫ్. ఎల్. బ్రేనుగా రాంగ్లమున రచియించిన "భారత దేశములోని గ్రామపునరుద్ధారణము" అను పుస్తకముపైన "బొంబే కోఆపరేటివ్ జర్నల్" యీక్రింది విమర్శను గావించియున్నది.

గ్రామపున రుద్ధారణ మొనరించుటకని ప్రారంభింపబడిన సంస్థలు తీవ్రముగ పరిశోధనల గావించుట లోననే యెక్కువకాలమును వినియోగించుచున్నవి. సాంఘిక, నైతిక, ఆర్థికాది విషయములయందు పూర్తిపరిశోధనల నొనరించుటకీ సంఘము పూనుకొనును. ఈ పరిశోధనలు పూర్తియగుటలోననే ప్రచారకులును ప్రజలును అలసి విసుగునొందెదరు. ఈగ్రంథమును వ్రాయుటకు పూర్వము బ్రేన్ గారు గ్రామపరిస్థితులను పూర్తిగ తెలిసికొనిరి. చాలగ్రామములయందలి ప్రజాజీవనము సంఘభావ విరహితమైయున్నది, కొంత అధికారముతో కూడుకొనిన సంఘము లేర్పరుపబడినగాని కొన్నికొన్ని గ్రామములు బాగుపడజాలవు. బ్రేన్ గారియొక్క పట్టుదలమీదనే గ్రామాలోచనాసంఘములు స్థాపింపబడినవి. ఈయన కష్టఫలితముగనే కొన్నిజిల్లాబోర్డులు వ్యవసాయము, పరపతిసంఘములు విద్యాసంస్థలు మున్నగునవి గ్రామములయందు నెలకొల్పబడుటకు తగిన శ్రద్ధతీసికొన్నవి.

ముందు అధికఫలవంతమగు వ్యవసాయమును సాగించవలసిన యువకులుత్పన్నమగుటకు కారణమగు గ్రామముల యందలి స్త్రీలలో నూతనోత్తేజముదయింపవలసియున్నదని బ్రేన్ గారు పేర్కొనియున్నారు. గ్రామములయందలి సాంఘిక జీవన పథము సంస్కరింపబడవలసిన యవసరమెంతేని గలదు. ఆరోగ్య మార్గములననుసరించి స్త్రీ పురుషులు జీవింపవలయును. వీరల మధ్య కొంత చలనముదయింపజేయవలయునన్నచో విద్యావతులై గ్రామజీవన సౌఖ్యముల పట్ల యుత్సాహమును జూపగల స్త్రీ లెంతేని యవసరము. ఈ విషయమున గ్రామ పునర్నిర్మాణమునకు పూనుకొను వారు కొంత యాలోచనను సాగించవలయును.

## వివాహితలు; ధనమునకై యుద్యోగములు—

బ్రిటిషు పత్రికలొక్కొక్క సమయమున ఒక్కొక సమస్యపై తీవ్రముగ చర్చల సాగించుచుండుట నెల్లరెఱుంగుదురు. వివాహితలగు స్త్రీలు ధనమునకై యుద్యోగముల నొనరించుటయా యను విషయమై నేడా పత్రికలు చర్చించుచున్నది. ఆచర్చనంతటిని 'లిటరరీడైజస్ట్' యిట్లువ్యక్తపరచుచున్నది.—

లండను నగరమందుద్యోగ మొనరించుచు కొంత వేతనమును సంపాదించుచుండిన నొక యువతిని గాంచి "పురుషుడు నీయొక్క పోషణకును నీకువలయు సహాయమునకును పాటుపడవలయును" అని ఒక ముదుసలి యనెను. ఆసమయమున ఆముదుసలి యొక్కయు ఆయువతియొక్కయు హృదయముల యందు గల యభిప్రాయము లెట్టివై యుండునో మనము కొంచెము బాగుగ ఆలోచించిన గ్రహించ గలము. "నాభర్త తాను గడించి తెచ్చిన ధనములో నేనింటపని చేసినందులకుగాను కొంత ధనమిచ్చునందువా?" యని ఆయువతి ముదుసలిని ప్రశ్నించెను. ఈ సంభాషణాంశమును మే యెడింగ్టన్ యెక్స్ప్రెస్‌లో వ్రాసియుండెను. ఈ విషయమై పలువురు పలువిధములగు నభిప్రాయములను గలిగియుండిరి, ఈ విషయమై ఎథెల్ మేనన్ అనుకవయిత్రి ఈమే యెడింగ్టన్ అభిప్రాయముల కెంత

మాత్రమును అంగీకరించుటలేదు. వివాహమాడిన స్త్రీ ఆధనమునకై యుద్యోగ మొనరించుట యన సంసార జీవమును విచ్ఛేద మొనరించుట యనియు యిది సంఘ నిర్మాణమున కెంతయు ముందు ముందు ముప్పు తేగలదనియు తెలిపియున్నది. దేశమున యీ యిరువురి యభిప్రాయములకును అనుకూలతను చూపువారలు సమ భాగములుగ నుందురని మాయభిప్రాయము.

## విద్య, వివిధప్రాంత సందర్శనము—

పూర్వకాలమున గురుకులాశ్రమ పద్ధతి భారతదేశమందుండెడిది. ఆదినములలో విద్యలబడసిన ప్రతి యువకుడును వివాహమాడుటకు ముందుగ దేశమందలి ముఖ్యమగు పుణ్యక్షేత్రములను సందర్శింప వలయుననెడి నియమ ముండెడిది. అందువలన ఆకాలము లోని యువకులు తమ దేశమందేయే ప్రాంతము లెటులున్నవో గ్రంథముల ద్వారా తెలిసికొనుటయె గాక స్వయముగ చూచుచుండెడివారు. ప్రస్తుతము విశ్వ విద్యాలయపు కార్యక్రమములో నీవిధ ప్రాంత సందర్శనము కూడ చేర్పబడవలయుననెడి యాందోళన యిటీవలనే ప్రారంభింపబడినది.

విద్యార్థులు దేశమందలి ముఖ్య ప్రాంతములను తిలకింపవలయుననియెడి నియమము విశ్వవిద్యాలయ కార్యక్రమమం దుండవలయును. ప్రయాణీకుల నెక్కువగ నాకర్షించుటకుగాను గ్రేట్ ఇండియన్ పెనిన్సులర్ రైల్వేవారు ప్రయత్నములను గావించియున్నారు. కరపత్రములు, వివరముల దెలుపు సచిత్ర గ్రంథములు, ప్రకటనలు, ఫిలిములు మున్నగు వాటిని గురించి విరివిగా ప్రకటించుటయు, ప్రదర్శించుటయు ముఖ్యముగ తలంచి అట్లు గావించుచున్నారు. ఈరైలు కంపెనీవారు విద్యార్థులకని ఒక ప్రత్యేకపు రైలుబండిని నిర్మించిరి. ప్రథమ వత్సరము నూటయేబదిమంది బాలురును 40 బాలికలును యీరైలునందు ప్రయాణముచేసియుండిరి. ఈరైలునందు కొంతమంది యుపాధ్యాయులుకూడ గలరు. విద్యార్థినుల సౌకర్యముల దిలకించుటకని యిరువురు దాదు లందుగలరు. అన్ని విధములగు భోజన సదుపాయములును గావింపబడియున్నది. ఈ విషయమై ప్రభుత్వ విద్యాశాఖవారు వలయు సహాయము గావింపవలసియున్నది.

## సుందరనయనములు—

సర్వేంద్రియములలోనను నయనములు ప్రధానమైనవి. కనులు తమ కళలను గోలుపోయిన యెడల యెంతటి సుందరవదన మైనను అనాకర్షణీయమగును. కనులకు

దృష్టిమాంద్యము గలిగిన దానివలన యెంతేని కష్టముకలుగును. నయనములు తమ కళను గోలుపోకుండ నుంచుకొన వలయుననిన అనుసరింప దగిన విధాన మొకటికలదని యొక వైద్యుడెరింగించుచున్నాడు.

కనుల నెంతేని జాగరూకతతో కాపాడుచుండవలయును. కనులెప్పుడు అలసినవని తోచిన అప్పుడే వలయు విశ్రాంతి నొసంగవలయును. చల్లనినీటిలో ఆసమయమున కడుగుటవలన ప్రావశ్యకము కూడును.

పరిస్థితుల ననుసరించి కనులయొక్క శక్తి కూడ తరుచునిర్ణయింప బడుచుండును. అవసరమగుచో కృత్రిమసహాయముతో వాటిని సంరక్షింపవలయును. సుందరనయనములుగల చాలమంది స్త్రీలు సినిమాలు, నాటకములు మున్నగుప్రదర్శనముల కేగుసమయమున సులోచనములను ధరించుచుండుటయు యితరసమయములయందు వాటినుపయోగింపకుండ నుండుటయు మనమెరుంగుదుము. స్త్రీపురుషులు సాధ్యమగునంతవరకు సులోచనముల కలవడకుండనుండుటయే యుత్తమము. అటులనుటవలన చత్వారి మొదలగునవున్నవారు కూడ అద్దముల నుపయోగింపరాదనుట కాజాలదు. కనులకు యేమాత్రమైన బలహీనతయైన యేర్పడుచున్నట్లు తోచినచో వెంటనే ఆబలహీనతను తగ్గించగల చికిత్స నొసర్ప వలయును. నయనములు కాంతివంతమై యుండవలయుననికూడ ప్రతిస్త్రీయును వీక్షాభ్యాసముల గావించుచుండవలయును. ఉదయమైదునిముసములును, సాయంత్రమైదునిముసములును యీ వీక్షాభ్యాస వ్యాయామము నలవరచుకొన్నచో ఒక్కమాసము దినములలో కనులకుగలుగు బలహీనత మొదటియవస్థయందు పోగలదు. ఈ వ్యాయామము నలవరచుకొను సమయమున స్త్రీలు విశాలముగ తెరువబడియున్న గవాక్షమున కెదుటనిలువబడి, చేతుల నడుముపైనుంచి, నాసికద్వారా మంచిగాలిని లోనికి పీల్చవలయును. అనంతరము అరచేతులు శిరమునకుపైగ కలయునట్లుగ యెత్తవలయును. తరువాత నెమ్మదిగ గాలిని బయటికి విడువవలయును.

కునుకుచు, మూతలుపడుచు, చలించుచుండు నయనములందముగ నుండవు. చూపులు నిశ్చలములై యుండవలయును. ఇందుల కలవాటుకాని వారేదియో యొకవస్తువు యెడదృష్టిని కేంద్రీకరించి చూచుచుండుట కలవాటు గావించుకొన వలయును. ఇందుల కద్దముపై చిన్నకాగితపు తునకనంటించి దానినే చూచుచుండవచ్చును. పద్ధతి ననుసరించి చూచుటలో ఆతురత యెంతమాత్రముచూపరాదు.

రైలు ప్రయాణీకుల సంఘము—

ప్రయాణీకు లెల్లరకు అసౌకర్యములన్ని స్థలముల జరుగుచున్నవి. పురుషులు స్వేచ్ఛగ తిరుగువారు కాబట్టి వారు తమకు కావలసిన సౌకర్యములను గలుగజేసికొను

చున్నారు. స్త్రీలకట్టి వసతులు లేనందున, వారు యిబ్బందులకులోను గావలసిన వారగుదురు. ఇట్టి యెడనున, తుమ్మపూడియందు ఆంధ్రదేశ రైలు ప్రయాణీకుల సంఘమొకటి యేర్పడుట శుభసూచకము. ఈసంఘముయొక్క ఆశయములగూర్చి కార్యదర్శి యిట్లువ్రాయుచున్నాడు.

రైలు, మోటారు, మరితరబండ్లలో ప్రయాణము చేయు ప్రయాణీకులకు తటస్థించుచున్న ఇబ్బందులను, అసౌకర్యములను కనుగొని, వాటిని నివారణచేయ ప్రయత్నము చేయుటకై ఈసంఘము స్థాపింపబడినది. స్త్రీలకు, వలయుస్థలమునందు గాని, ప్రత్యేకస్థల నిర్ణయములోగాని, టిక్కెట్లు అమ్మస్థలములుగాని మరితర సౌకర్యములు ఏవియు చక్కగానుండుటలేదు. సౌకర్యములన్నిటికిని కలుగజేసుకొన వలయునని మిక్కిలి కృషిచేయవలయును. ఇందుకుగాను స్త్రీలెల్లరు తోడ్పడి వారివారికిగలుగుచున్న ఇబ్బందులనుగూర్చియు వాటినిర్మూలనమునకు వలయు సౌకర్యములెవ్వియో తెలుపుచుండవలయునని కోరెదను. సంఘమునజేరినను జేరకపోయినను వారివారికి గలుగుచున్న అసౌకర్యములను మాకు తెలిపి వలయు సౌఖ్యములను కలుగజేసుకొనుదురు గాత!

# వనితాలోకము

౩. సాముయెలుకన్య—

ఈమె తిరువాన్కూరు వైద్యశాఖాసంఘ సభ్యురాలు. శస్త్రచికిత్స, ఓషధీపరిజ్ఞానశాస్త్రములయం దున్నత విద్య బడయుటకై ఇంగ్లాండునకు వెళ్లియుండియిటీవలనే భారతభూమికి తిరిగివచ్చెను. విక్టోరియా ఆసుపత్రి కధిపతిగ కొన్నాళ్లును, తిరువాన్కూరు వైద్యశాలయందు డెప్యూటి సర్జనుగ కొన్నాళ్లునుయుండిరి. లండను స్త్రీ శిశువైద్యశాలయందు ప్రత్యేక శిక్షణను బొందెను.

శ్రీమతి వై. వి. రంగనాయకి అమ్మగారు—

ఈయమ పశ్చిమ గోదావరి విద్యాసంఘమునకు సభ్యురాలుగ నెన్నుకొనబడెను.

శ్రీమతి శ్రీరామ భగీరథి అమ్మగారు—

చెంగల్పట్టు జిల్లా విద్యాసంఘమున కీమె సభ్యురాలుగ నెన్నుకొనబడినది.

శ్రీమతి పి. గౌరమ్మగారు—

బళ్లారి వాస్తవ్యులగు పి. శివరావు, బి. ఏ, బి. ఎల్., ఎం. ఎల్. సి. గారి సతీమణియగు శ్రీమతి పి. గౌరమ్మగారిని మాధ్యమిక బాలికాపాఠశాల ఆలోచన సంఘమునకు సభ్యురాలుగ ప్రభుత్వము వారెన్నుకొనిరి.

శ్రీమతి శివజానకి అమ్మగారు—

గవర్నమెంటు వారీమెను, శ్రీరంగమునకు గౌరవన్యాయాధిపతిగ నియమించిరి.

కీ. శే॥ శ్రీమతి రతీబాయి జిన్నాగారు—

శ్రీమతి జిన్నాసతీమణిగారి మరణవార్త వినుటకెంతయు చింతిలుచున్నారము. ఈమెతండ్రి సర్ డిన్షా పెటిటుగారు. వయసు 30 సం॥ లు. 1917 సం॥ న మహమ్మదాలీ జిన్నా, ఎం. ఎల్. ఏ. గారిని వివాహమాడిరి. కొలది దినములుగ వ్యాధిగ్రస్థయై యుండిరి. మరణించునప్పటికి భర్త ఢిల్లీలోనుండెను. ఈమె దేశసేవాతత్పరతయు, త్యాగము నెఱుంగని వారుండరు.

గులాబాయి. హెచ్. ముకుందరావుకన్య—

కీ. శే. రాయబహదూరు ముకుంద రామచంద్రరావుగారి మనుమరాలు. ఇందూరు జూనియరు మహారాణియగు ఇందిరాబాయిగారి సమీప బంధువు. గత సంవత్సరము బొంబాయి విశ్వకళాశాలయందు ఆంగ్లభాషయందు ప్రథమతరగతిలో బి ఏ. పరీక్షనిచ్చెను. విశ్వవిద్యాలయ సంఘమునకు సభ్యురాలగు నట్టిగౌరవమును పొందిన ప్రథమ హిందూ యువతి యీమెయే. బొంబాయి విల్సనుకాలేజిలో ఆంగ్లబోధకురాలుగ నున్నది.



అమెరికాలో బాల్యవివాహములు—

బాల్యవివాహపిశాచము మన హిందూదేశమందేగాక, పాశ్చాత్యదేశములందు కూడ కానవగుచున్నది. అమెరికాలో 16 సం॥లకు లోబడిన వయసుగల బాలభార్యలు 350,000 కలరు. ఇంకను బాల్యవివాహములు పెరుగుచునేయున్నవి. వీటి నాపుదలకుగాను ప్రబలప్రయత్నములు జరుగుచున్నవి. పెన్సిలువేనియా 16 సం॥ లోబడిన బాలికల వివాహము నిషేధించుచున్నది.

* * * *

అమడసోదరులు—

లండనులో యిటీవల యిరువురు అమడసోదరులు ప్రాణత్యాగము చేసికొనిరి. ఇందలి విశేషమేమన, దేహములు వేరుగాని వారి భావము లొక్కటే. వారొకే విధమున ఆలోచింతురు. ఒకడారంభించిన వాక్యమును రెండవవాడు ముగించును. ఇరువురును ఒక్కశయ్యయందే మరణించి యుండిరి.

* * *

విద్యుచ్ఛక్తి కత్తి—

నెత్తుటిని స్రవింపనీయక, నొప్పిని కలుగజేయక, కండరముల తెగకోయు యంత్రమొకటి కనిపెట్టబడినదని 'లాంసెట్' పత్రికవలన తెలియుచున్నది. ఈ యంత్రమున గల

విద్యుచ్ఛక్తి తీక్షణతవలన కండరములకు ఉష్ణమెక్కును. రక్తనాళములు గట్టిపడి నెత్తురు స్రవించదు.

* * * *

శిశువులకు స్వర్గము—

అన్ని దేశములందును పసి పిల్లలను కొట్టుట వాడుకైయున్నది. కాని సయామునందు మాత్రము పిల్లలు దెబ్బలు తినుటయన నేదియో యెఱుగరు. ఒక కఠినపుమాట ఎవరైన పలికిన చాలును, తోడనే వారుకంట తడిపెట్టుదురు. అంతటి మెత్తనిహృదయులు. చిన్నప్పటినుండి సయామి బాలురు పెద్దల నడవడిక గమనించి ఆరీతి ప్రవర్తింతురు. ముఖ్యముగ వారు పాటించునది మాతాపితృపూజ, గురుసన్మానము, గురుభక్తి మొదలగునవి. అన్ని దేశము లిట్లుండిన కొఱత యెద్దియుండును?

* * * *

ముద్దుల ప్రభావము—

ముద్దులిడికొనుట సర్వ సాధారణమగు విషయము కాని కొన్ని దేశములందు కోట్లకొలది జనులకు, ముద్దుల విషయము తెలియదు. వారు దానిని ఆచరణకు గొనిరారు. ఎస్కిమోలు, మడగాస్కరు, టైరాడెల్, ఫ్యూజీదేశీయులు, కొన్ని ఆఫ్రికా తెగలవారు ముద్దులిడరు. భార్యాభర్తలు సరసమాడునపుడు తమ నాసికలు, చెక్కిళ్లు, కుడిచెవులు, మొదలగు వాటిని ఒండొంటితో నొరసికొందురు. లేక చేతులతో ఒకరి నొకరు గుద్దుకొందురు.

యుద్ధము నిలపినగాని ముద్దులియ్యమని తమ భర్తల ధిక్కరించి ఆథెన్సు యువతులొక యుద్ధమునే నిలుపగల్గిరి. క్లియోపాట్రాయను స్త్రీయొక్క ఆలింగనాసౌఖ్యము కొరకై ఆన్తోనీయను నాతడు రాజ్యాంగస్థితినే మార్చెను. ఈ కాలమున ముద్దిడుట అనారోగ్య కరమని కొందరు వాదించెదరు. రష్యాలో సోవియటు కమీషను ముద్దులిడుకొనరాదని ప్రచారము సలుపుచున్నది.

* * * *

నిదురలేమిచే మరణము—

మనుజుని ఆరోగ్యమునకు వలసినవి ఆహారము, శుభ్రమగు వాయువు, జలము, నిదుర మొదలగునవి. వీటితో ఆహారము లేకున్నను నిదుర ముఖ్యమని సర్ జాన్

ఆర్మ్‌స్ట్రాంగు అను వైద్యుడనెను. నిదుర ఒకవారమువరకు పోకూడదని నిశ్చయించిన ముగ్గురు బాలురలో ఒకడు నాల్గవనాడును యింకొకడు ఐదవనాడును మూడవవాడు ఏడవనాడును మరణించిరి. కాబట్టి ఆరోగ్యమునకు, జీవించుటకు, నిదుర ముఖ్యమైనది.

*　　　*　　　*　　　*

గోబి అడవి జంతువు—

గోబీయెడారి మంగోలియాయందుకలదు. ఈయెడారియందు 25 అడుగులపొడవును, భుజములవఱకు 14 అడుగుల ఎత్తును, 10 టన్నులు బరువు, అనగా రెండేనుగుల బరువును గల యొక అడవి జంతువు అస్థిపంజరము భూమిని త్రవ్వగా లభించినది. ఇంతకంటె అవయవ పరిమితి హెచ్చైనమృగ ముండదని యనెదరు.

ఇట్టి జంతువు సుమారు 9 కోట్ల సంవత్సరములకు పూర్వము జీవించి యుండునని తలచెదరు.

# అఖిలభారత మహిళా సభ

శ్రీమతి ఆ. భాస్కరమ్మ గారు

అఖిల భారత మహిళా సాంఘిక విద్యావిషయిక సంస్కరణ మహాసభ జనవరి నెల 3–వ తేది మొదలు 8 వ తేది సాయంకాలము వరకు పాట్నానగరమున జరుపఁబడినది. సభ 3 వ తేదినుండే ప్రారంభింపఁబడినను, ఒకటి రెండు తేదులలో స్థాయీసంఘ సభలుండుటవలన మన యాంధ్రదేశ పక్షమున స్థాయీసంఘ సభికురాలనగు నేను డిసెంబరు 31 వ తేది రాత్రి 8 గంటలకు కలకత్తాలో బయలుదేరితిని. జనవరి 1 వ తేది తెల్లవారుజామున పాట్నా చేరితిని. అక్కడ చలివిస్తారముగా నున్నది. వాతావరణ మంతయు పొగక్రమ్మినట్లున్నది. నేలయంతయు వర్షముకురిసినట్లు తడిసియున్నది. తెల్లవారుజామున 5 గంటలకు, ఆచలిలో ఆమంచులో కొంచమైనను జంకక, బద్ధకించక యాహ్వాన సంఘమువారు ప్రతినిధుల నాదరించి తీసికొని వెళ్లుటకు వచ్చిరి. అప్పుడు దిగిన వారము ముగ్గురము మాత్రమే మమ్ములను బస్సునందెక్కించుకొని ప్రతినిధుల కొఱకు నియమింపఁబడిన బసకు చేర్చిరి. మా కొఱకు స్టేషనుకు వచ్చినవారు స్త్రీలు, యౌవ్వనవతులు, ఉన్నత విద్యావతులు, గొప్పయింటి బిడ్డలుకూడా పురుష సహాయ మేమీలేదు. వారేకూలీలను మాట్లాడి సామానులను బండిలో వేయించిరి. ప్రప్రథమపు ఈదృశ్యమే నాకు కొంతవఱకానందమును, నాశ్చర్యమును గలుగజేసినది. మాకొఱకేర్పఱచిన యిల్లొక దివ్యభవనము. అదియొక మహమ్మదీయ బారిష్టరు గృహము. ఆయన వృద్ధుఁడయినను నవివాహితుఁడును ఉదార స్వభావుఁడునగు నాతఁడు స్వార్థమును పరిత్యజించి యత్యంత విలువగల సోఫాలు, కుర్చీలు, నిలువుటద్దములు మొదలగు సామానులతో సహా తనగృహమును ప్రతినిధులకొఱకిచ్చి వేసి తాను మరియొక యద్దెయింటికివెళ్లి పోయెను. గృహమట్లుండ అంత పరిశుభ్రమైన సొగసైన, విలువయైన సామానుల నెవరైన పాడుచేయుదురేమో యను సందేహ మించుకైన లేకుండ నావిధముగా నొసఁగినవారి యౌదార్యము కొనియాడఁదగినది. అక్కడకు వచ్చిన ప్రతినిధులుకూడా నున్నతకుటుంబీకులు, విశేష విద్యావతులు, పిల్ల

జెల్లలు లేకుండా వచ్చిన వారగుటచే జాగ్రత్తగానే వాడుకొనిరి గాని యేమియు పాడు చేయలేదు. సదుపాయములన్నియు చాలాబాగుగనుండెను. ఏవిధమైనలోటును కనఁబడలేదు. స్వగృహముల యందుకంటె గూడ యెక్కువ సౌఖ్యమునే పొందితి మనుటలో కాంచెమైన నతిశయోక్తిలేదు.

1-వ తేది యుదయము 9 గంటలకు స్థాయీసంఘసభ (Standing Committee Meeting) అనిరి. 9 గంటలలోపున అందరు సిద్ధపడి సరిగా 9 అయేసరికి సమావేశమయి కార్యమునకు ప్రారంభించిరి. ఈ స్థాయీసంఘమున అధ్యక్షురాలు, కార్యదర్శిని కోశాధ్యక్షురాలు గాక భారతదేశమందు సభాసాకర్యార్థ మేర్పఱచుకొనిన 29 రాష్ట్రములలో రాష్ట్రమున కొక్కరు చొప్పున నెన్నుకొనఁబడిన 29 గురు సభికురాండ్రుకలరు. వారిలో 4 గురు కారణాంతరములచే సభకురాలేక పోయిరి. కొందఱానాటి సభకురాలేదు. 17 గురు మాత్రము వచ్చిరి. సభ ప్రారంభమగు సమయమున అనేక విషయములను గుఱించి చర్చలు జరిగినవి. వానిలో మిక్కిలి ముఖ్యమయినది 'నిబంధనము' (Constitution). దీని కిదివరలో 'అఖిలభారత మహిళా విద్యా విషయక సంస్కరణ మహాసభ (The All India Women's Conference on Educational Reform) అని పేరుండెడిది. దానికి సాంఘికము కూడా చేర్చు టత్యావశ్యకమని మాకుతోఁచి దానిని కూడా చేర్చవలయునని కొందఱ మంటిమి. దానిని చేర్చినచో నది రాజకీయమునకు చెందును, ప్రభుత్వపు టుద్యోగులు వచ్చుటకు వీలుండదు, ఈ సభ పూర్వమువలెనే కేవల విద్యా విషయకము గానే యుండవలయునని కొందఱు వాదించిరి. ఒకదినమంతయు యీ వాదనతో సరి పోయినది. చివరకు సాంఘికము కూడా చేర్చుట కంగీకరించి 'అఖిలభారత మహిళా సాంఘిక విద్యా విషయిక సంస్కరణ మహాసభ' (The All India Women's Conference on Educational and Social Reform) అని మార్చిరి. రెండవది ఈ సభకు మూలధనము 50,000 రూపాయలున్నవి. దానిని రెజిష్టరు చేయించుటా మానుటా అనుట గురించి కూడా తీవ్ర వాదనలు జరిగినవి. చివరకు రెజిష్టరు చేయుటకే నిశ్చయించిరి. ఈ విధముగా రెండుదినములు పగలు 9 మొదలు 12 గంటలు, మరల 1 మొదలు 5 గంటలవరకుఁగల కాలము చాలక రెండవనాటి రాత్రి 9 గంటలవరకుఁగూడ సభ జరుపవలసివచ్చినది.

3 వ తేదీ కన్ని ప్రాంతములనుండి ప్రతినిధులు వచ్చిరి. మనభారత దేశము నందలి ఉత్తరమున కాశ్మీరమునుండి దక్షిణమున తిరునల్వేలి, తిరువాన్కూరు వర కును, తూర్పున కలకత్తానుండి పడమర సింధుదేశముయొక్క చివరవరకును గల స్త్రీలు చాలామంది వచ్చిరి. ఒక్కొక్క రాష్ట్రముయొక్క ప్రతినిధులను వేరు వేరుగా పేర్లు పిలచి వారివారి కొఱకేర్పఱచిన స్థలములలో కూర్చుండఁజేసిరి. మొత్తము ప్రతినిధుల సంఖ్య 150. వీరుగాక 50 మంది వరకు ప్రేక్షకులు వచ్చిరి. ఆదినము ఉదయము 9 మొదలు 12 గంటలవరకు ప్రతినిధుల సభ జరిగినది. సాయంకాలము 5 గంటలకు సభా ప్రారంభోత్సవము. దీనికి పురుషులను గూడా నాహ్వానించిరి. ఈసభ క్రొత్తగా కట్టఁ బడిన సెనేటుహాలులో జరిగినది. హాలంతయు స్త్రీపురుషులతో నిండిపోయినది. గవ ర్నరుగారి భార్య ప్రారంభోపన్యాస మొసఁగినపిదప అధ్యక్షురాలగుమండీరాణీగారు హిందీభాషలో చక్కని యుపన్యాసమును చదివిరి. మిసెస్ అహమ్మదాలీ, మఱికొందఱు స్త్రీలు ఉపన్యసించిన పిదప కార్యదర్శిని కమలాదేవి సంవత్సర కార్యనివేదికను చదివి వినిపించెను. మొదటి రెండు సంవత్సరములకంటె యీసంవత్సరము కార్యనివేదికలో అభివృద్ధియెక్కువగా కనఁబడినది. జాతీయ కీర్తనతో సభముగింపఁబడినది. రాత్రి 6-30 నుండి మరల ప్రతినిధుల సభ జరిగినది. 4, 5 తేదీలు ఉదయము 9 మొదలు 12 గంటలవరకును, మధ్యాహ్నము 2 మొదలు 4 గంటలవరకును సభలు జరిగినవి. ఒకదిన మొకధనికు రాలును, రెండవదినము పాట్నాక్లబ్బువారును, మూడవ దినము మండీ రాణిగారును సభికుల కందఱకు టీపార్టీల నొసంగిరి. 6 వ తేది యుదయము 8 గంటలకు బయలుదేరి 150 మంది ప్రతినిధులము పాట్నాకు 60 మైళ్లదూరములో నున్న నాలంద యందలి ప్రాచీన విశ్వ విద్యాలయ శిధిలములను చూచుటకువెళ్లితిమి. మేమక్కడ చేరుసరికి 12 గంటలయినది. అక్కడ మాకు ఫలహారాదుల నొసగుటకు మండీరాణీగారేర్పాటు చేసిరి. చంద్రగుప్తుడు, అశోకుఁడు నాటియీ శిథిలములనుచూచి సాయంకాలమునకు మరల యిల్లుజేరితిమి. 7 వ తేదీ యుదయముతో సభలు ముగించి మధ్యాహ్నమందఱమూ కలసి పాట్నాయందలికాలేజి ఇండస్ట్రీసు, ఖుదాబక్షు లైబ్రరీ చూచుటకు వెళ్లవలయునని కార్యక్రమపట్టికలో ప్రచుర పఱచిరిగాని తీర్మానములు సగ మైననూ ముగియకుంటచే ఆమధ్యాహ్నమునందు కూడ సభలు జరుపవలసి వచ్చి నది. మాయాంధ్ర ప్రతినిధులమ్దందఱము ఆదినము సాయంకాలమే మామా యూళ్లకురా బయలుదేరవలసి వచ్చుటచే మధ్యాహ్నము సభకు వెళ్లుట మాని వానిని

చూచుటకు వెళ్లితిమి. ఇంచు మించుగా ప్రతి తీర్మానము మీదను వాదోపవాదములు జరుగుచునే వచ్చినవి. ఆవాదనలు కొన్ని సమయముల యందు విసుగు తెప్పించినను మొత్తంమీద తమాషాగానే యున్నవి.

అక్కడ వారు చేసిన యేర్పాట్లు మొదలగునవి మిగుల స్తుతిపాత్రములు. సభలు, విహారములు, టీపార్టీలు మొదలగునవన్నియు నేర్పఱచిన వేళకు కొన్ని నిమిషములైనను యించుమించు లేక అతిఖచితముగా జరుపఁబడినవి. మనవాళ్లలో పురుషుల సభలే అనుకొన్న వేళకు ఒకటిరెండు గంటలైనను వ్యత్యాసము లేకుండ జరుగుట బహుఅరుదు. అట్టియెడ స్త్రీలింత సకాలములో జరుపుట నిజముగ వింతయైన సంగతి. ప్రతివిషయము యంత్రపు పనివలె జరిగినది కాని యేవిధమైన తారుమారుగాని, కంగారుగాని, వ్యత్యాసముగాని యేమియు లేవు. ప్రతివారును వారివారి పనుల నీతినిపుణతతోడను, శ్రద్ధతోడను నడపిరి. ఈ విషయములన్నిటిలో నుత్తర హిందూస్థాన స్త్రీలు దక్షిణదేశీయుల కంటె చాలా ముందున్నట్లు గన్పట్టినది సభలో ఉపన్యాసములన్ని చాలావరకు ఆంగ్లభాషలో జరిగినవి. కొంతమంది మాత్రము హిందీలో వ్రాసుకొనివచ్చి చదివిరి. ఈ రెండు భాషలుతప్ప మరియొకభాష వాడలేదు. ఎక్కువ కొద్దిపాటిలోపములున్నను మొత్తము మీద సభ చాల జయప్రదముగ జరిగినది.

# స్త్రీవిద్య

శ్రీమతి వెలువోలు వసంత కుసుమావతి గారు

గీ॥ వేదఋక్కులు రచియించు వెలదులుండ
సరసకావ్యాలు నిర్మించు జాణలుండ
ధైర్యవిత్తమ్ము వెదజల్లు తరుణులుండ
స్త్రీకి విద్య నిషేధింప సిగ్గుగాదె!

గీ॥ భరతయుద్ధమ్ము ప్రేరేచె భామయొకతె
శ్రీశివాజినిఁ బ్రభువుగాఁ జేసె నొకతె
వీరపల్నాటి యుద్ధమ్ము విప్పె నొకతె
విద్యలేకున్న వీరిట్లు వెలయఁ గలరె!

గీ॥ విద్య నేర్చిన తల్లులు బిడ్డలకును
మొదటి నుండియుఁ జాలసద్బోధ కఱపి
వీరబుధులుగ వారిఁగావింపఁ గలరు
కాన స్త్రీవిద్య దూరంగఁ గాదుమీకు!

గీ॥ సచివుఁడుగ నుండవలయు యోజనల వేళ
జననిగా నుండవలయు భోజనము వేళ
భార్యయని; ధర్మవేత్తలు పల్కుచుంద్రు
చదువులేకున్న నీరీతి సలుపఁ గలరె!

గీ॥ విద్య నేర్చిన వారలు విరివి జ్ఞాన
వార్తలన్ వ్రాయు నేర్పును బడయఁగల్గి
జగతి మాహాత్మ్యముల నెన్నొ సలుపుకతన
బాలికావిద్య దూరంగఁ బాడియౌనె!!




దేవదాసీ బిల్లు—

మదరాసు నగరమునను రాష్ట్రమందునను స్వార్థపరులగు కొంతమంది తీవ్రఖండనమునకును వ్యతిరేక ప్రచారమునకును కారణమైన దేవదాసీబిల్లు కడకు రాష్ట్రీయ శాసనసభ యందామోదింపబడు టెంతయు సంతోషకరము. ఈ బిల్లు ఆమోదింపబడుటకు శాసనసభయొక్క ఉపాధ్యక్షురాలగు శ్రీమతి డాక్టర్ ముత్తులక్ష్మిరెడ్డిగారి నెంతయు కొనియాడవలసియున్నది. ఎంతటి ప్రతిఘటనలు వచ్చినను, కొందరు దుర్మార్గులు యెంతటి పరుసవాక్కులాడినను లెక్కసేయకుండ పట్టినపట్టు విడువకుండ న్యాయమ స్వాయముగ శాసనసభయందు ప్రవేశపెట్టియుండిన బిల్లును సక్రమముగ నడపించి కడకు జయపతాక నెగురవేయ గలిగెను. శాసన సభయందీ బిల్లు విషయమగు చర్చవచ్చినప్పుడు యే సత్యమూర్తిగారో తప్ప మిగిలిన వారందరును అనుకూలముగనే యభిప్రాయము నొసంగియుండిరి. ఇట్టి సహాయ మొనరించి సంస్కారమునకు సహాయపడియుండిన శాసన సభ్యులెల్లరు వందనీయులు.

బిల్లు ఆమోదింపబడినది గదా! ఇంక దేవుని మాన్యములు మనపాల బడినవి! ఇంక మన మెట్లు వర్తించినను వర్తింపవచ్చునని యీ సంఘపు స్త్రీలు తలంపరాదు. ఇందులకువలయు కట్టుదిట్టములను గావించుటకు దేవదాసీ సంఘ నాయకులు శ్రద్ధవహించవలసి యున్నది. ఈ విషయమున పై సంఘమును ఆ సంఘ మందలి నాయకులును తగిన రీతిని చరింతురుగాక!

మైసూరు ప్రభుత్వము—

దేశమునకు కళంక మాపాదింప జేయుచుండిన దేవదాసీ సంఘముయొక్క దుర్వర్తనమును పోగొట్టవలయునను తలంపుతో మైసూరు ప్రభుత్వమువారుకూడ నొక శాసనమును గావించియుండు టెంతయు సంస్తవనీయము.

ఆ సంస్థానమందలి దేవదాసీలుకొంతమంది, దేవస్థానములందు సేవయొనరించెద మనియు అందుల కనుమతి యొసంగవలసినదనియు కోరియున్నప్పటికిని ఆ ప్రభుత్వము అంగీకరింపలేదు. దేవదాసీసంఘమువా రనుభవించుచుండిన భూములు వారికే యొసగ బడినవి. ఇంకముందు దేవళములందు వారెట్టి నాట్యమును గాని యాడరాదని ప్రభుత్వము వారు శాసించిరి.

బీహారు స్త్రీలు ఓటింగు అధికారము—

సుమారు ఐదువత్సరములనుండి బీహారు రాష్ట్రమందు మహిళోద్యమము తీవ్ర ముగ సాగింపబడుచున్న దనవచ్చును. ఆ కారణముచేత ఆ రాష్ట్రపు సోదరీమణులలో కొంత చలన ముదయించినది. విద్య వ్యాప్తి నందినది. మహిళాసంఘములు నెలకొల్ప బడినవి.

ఈ యభివృద్ధిని దిలకించిన శ్రీగోదావరీశ మిశ్రగారు స్త్రీలకు ఫ్రాంఛైజు ఒసంగబడ వలయునని తెలుపు నొక తీర్మానమును ఆరాష్ట్రీయ శాసనసభయందు ప్రవేశపెట్టిరి. ఆ తీర్మానము మీద కొంత వఱకు చర్చ జరిగిన యనంతరము ఓటింగుజరిగినది. తీర్మాన మునకు 47 మంది అనుకూలముగను 14 మంది వ్యతిరేకముగను వోటుచేసిరి. శ్రీమిశ్ర గారి తీర్మానము గెలుపొందినది.

భారత దేశోన్నతికి కారణము కాగల విషయముల గురించి చర్చ జరుగు సమయ మున ఉత్తర హిందూస్థానపు మహమ్మదీయులు వింత వాదనలు గావించుట కలవడి యుండుట మాకాశ్చర్య కారణ మగుచున్నది. స్త్రీలకు వోటింగు అధికార మెంతమాత్ర మును పనికి రాదని ఓటుచేసియుండినది 14 మంది మహమ్మదీయులే యని విని చదువరు లాశ్చర్య మందెదరు.

స్త్రీలు-వారసత్వము—

హిందూన్యాయచట్టమందు స్త్రీలకే మాత్రపు వారసత్వపుహక్కులుగాని గావింపబడి యుండలేదు. ఆస్తి విషయమగు విభజనలు గావింపబడు సమయమున పురు షుల యొక్క హక్కే గమనింపబడుచున్నది గాని స్త్రీలకెట్టి యవకాశమును యొసంగు చుండుటలేదు. న్యాయమను పేర స్త్రీలకు గావింపబడుచుండిన యన్యాయమును గురించి యెనిమిది దీర్ఘవత్సరముల కాలము తీవ్రచర్చలు జరిగియుండుటను చదువరు లెరింగియె యుందురు. కడకీ యన్యాయమును తొలగించుటకని యొక సవరణ తీర్మానము భారత

శాసనసభయందునను, స్టేట్ కౌన్సిలు నందును ప్రవేశపెట్టబడి ఆ రెండు సంస్థలచేతను ఆమోదింపబడుటయు జరిగియున్నది. ఇంక వైస్రాయి తన యనుమతి నొసంగవలసి యున్నది. ఇటీవల యీ బిల్లు విషయమున అసెంబ్లీయందు జరిగియుండిన చర్చ వినువారికి చాల నవ్వురాక మానదు. నేటికిని ప్రపంచ మెట్లేగుచున్నదో గమనించకుండ ప్రాత నియమములనే సాగించవలయునని పట్టుబట్టి వాదించు వారు కలరని అసెంబ్లీయందలి కొలది మంది సభ్యులవాదన ఋజువు చేయుచున్నది. కాని యీ బిల్లు విషయమై అనుకూలాభిప్రాయ మెక్కువయున్న కారణముననే అంతఅల్లరి లేకపోయినది. ప్రభుత్వమీ విషయమున త్వరలో వలయు అనుమతి నొసంగి స్త్రీలకుకూడ కొంత వారసత్వపుహక్కును నొసంగు టుత్తమము.

బాలికాపాఠశాలలు—

ఆంధ్ర దేశములో జాతీయవిద్య నొసంగు బాలికాపాఠశాలలు లేవనియే చెప్ప వచ్చును. భారత దేశమందలి గుజరాత్, బంగాళము మున్నగు రాష్ట్రములందు జాతీయ బాలికాపాఠశాల లెన్నెని నెలకొల్పబడి సక్రమముగ నడుపబడు చుండుటను మన మెరుంగుదుము. మన రాష్ట్రములో యిట్టి సత్కార్యమునకు పూనుకొనువారి సంఖ్య కడుంగడు స్వల్పము. నేడు తెలుగుజిల్లా లన్నింటికిని కలిపి యే యొకటి రెండు పాఠశాలలో తప్ప యెక్కువలేవు. ఉన్న సంస్థలును స్వార్థాశముల కెక్కువ ప్రాముఖ్యతనిచ్చు కార్యనిర్వాహకులు యెక్కువగనున్న స్థలములయందరాచకములు జరుగుచుండుటను బట్టి ఆ సంస్థలు తీవ్ర విమర్శకు గురియై ప్రజానురాగమును కూడ గోలుపోవుచుండుట శోచనీయము.

జాతీయ విధానముల ననుసరించి విద్యల నభ్యసించిన బాలికలు దేశమందెంత యెక్కువగనున్న దేశభక్తులు కూడ అంత యెక్కువగ నుందురు. సంస్కార విషయమున ముందంజవేయు ఆంధ్రరాష్ట్ర మీ విషయమున యెక్కువ శ్రద్ధ వహించి పాటుపడవలసి యున్నదిగ ఆంధ్ర సోదర సోదరీమణులను హెచ్చరించుచున్నారము.

సైమను సంఘము—

భారతీయుల యభిప్రాయములకు విరుద్ధముగ బలవంతముగ పంపబడియుండిన స్టాట్యుటరీ రాయల్ కమీషను గతనెల 18 వ తేదిన మదరాసు నగరమునకు వచ్చి నప్పుడు మదరాసు వింతదృశ్యమును ప్రదర్శించినది. హర్తాలు చాల చక్కగ జరిగినది.

ఒక్కయంగడియేనియు ఆదినమున తెరువబడియుండలేదన్న అతిశయోక్తి కాజాలదు. పోలీసు బందోబస్తు అపరిమితమై యున్నకారణమున ఒకప్రాంతమువారు యింకొక ప్రాంతమున కేగుటకవకాశము లేకపోయినది. సైమను బహిష్కారవాదులు "సైమనుగారు పొండు" అనుచు కేకలిడుచు ప్రధాన వీధులందు గావించియుండిన యుత్సవ మొంతయు ఆకర్షణీయమై ప్రజోద్దేశమును వెల్లడిగావించి యున్నది. కొంతమంది రాజధానియందలి యితర ప్రాంతములనుండి వచ్చి సైమనుగారికి స్వాగత మొసంగిరికాని కొంతపలుకుబడియు ప్రఖ్యాతియు గలిగియుండిన మదరాసులోని రాజకీయ సంస్థలెవ్వియు సైమనును సహకారమును వాంఛించియుండలేదు.

ఆఫ్ఘనిస్థానము—

ఆఫ్ఘనిస్థానపు రాజకీయములు యింకను ఒకస్థిర రూపమునకువచ్చి యుండలేదు. కాబూలుగద్దెకై కేలుసాచినవారిప్పుడు నలువురున్నారు. ఈనలువురిలోనను ఆదిని అమీరై సక్రమ ప్రభుత్వమును సాగించుచుండిన అమానుల్లాగారును, కాబూలు నాక్రమించి తన యిష్టమువచ్చినట్లు నిరంకుశ ప్రభుత్వమును సాగించుచుండిన బచ్చాసాకోయును చాల ముఖ్యము. తాత్కాలికముగ కాండహారునగరమున దర్బారును సాగించుచుండిన అమీర్ అమానుల్లాఖాన్‌గారు మాతృదేశముయొక్క గౌరవము పోవుటయున నెంత మాత్రమును సహింపరు. ఆకారణముచేతనే కాబూలు నగరమందలి విదేశీయకార్యాలయములు ఆఫ్ఘనిస్థానమును విడచిపెట్టుచుండగ దాన దేశమునకు జరుగుచుండిన నష్టమును అగౌరవమును గ్రహించి ఆ విదేశీకార్యాలయములను అమనుల్లాగారు కాండహారమున కాహ్వానించియున్నారు. ఈయభిప్రాయమును బ్రిటిషువారుతప్ప మిగత విదేశీయులందరును అంగీకరించి అందులకు వలయు ప్రయత్నములను గావించుచున్నారని తెలియుచున్నది.

ఇంకత్వరలోననే ఆఫ్ఘను రాజకీయములు సక్రమముగ పరిణమింప గలవనిపించుచున్నది. నిన్న మొన్నవరకును అమానుల్లాగారియొక్క పలుకుబడి ననుమానించుచుండిన జర్మను పత్రికలు అమానుల్లాఖాన్ గారుత్వరలో ఆఫ్ఘనిస్థానమున కంతటికిని అధిపతి కాగలరని తెలుపుచున్నవి. నాదర్ ఖాన్‌గారు అమానుల్లాఖాన్‌గారికి సహాయ మొనరింపనున్నారు. టర్కీదేశమునుండి కొంతమంది సైనికాధ్యక్షులు బయలుదేరిరని యింకొకవార్త విననగుచున్నది. రష్యానుండి యిటీవలనే కొందరు వైమానికులు

రాచకార్యములకని కాందహారమునకువచ్చి యున్నారు. ఈయంశముల నన్నింటి నొకచోనుంచి దిలకించు నెడ ఆఫ్ఘనిస్థానమునకు శుభదినములు సమీపముననే యున్నవని గ్రహింప వీలగుచున్నది.

ఆత్మగౌరవ మహాసభ:—

గతనెల 17,18-వ తేదీలయందు చెంగల్పట్టు నగరమున శ్రీ సౌందర్య పాండ్య నాడారుగారి యధ్యక్షతక్రింద జరిగియుండిన తమిళ రాష్ట్రీయ ఆత్మగౌరవ మహాసభ యందు గావింపబడియుండిన తీర్మానములలో యే యొకటి రెండో తప్ప మిగత తీర్మానము లన్నియు ఆంధ్రసోదర సోదరీమణులకు వింతగ తోపకమావు. ఏదియేని సంస్కారము వాంఛించు సమయమున అంశములకు వలయు విధానముల నరయవలయును. అదియు గాక అట్టి సంస్కారమువలన ప్రజలయందు గలుగబోవు మార్పువలన గలుగు ఫలితమును సంస్కారప్రియులు ప్రజల కెరింగింపవలయును. ఈ సభయందు పాల్గొనిన వారిలో చాల మంది తా మొనరించుచుండిన తీర్మానము లెట్టివో వాటిని గావించుటవలన ముందెంతటి సంచలన ముదయింపనున్నదో, ముందుముందీ తీర్మానాంశములుగ నాచరణ యందుంచుట యన నెంతటి మహత్తరకార్యమో కొంచమేని యూహించియున్నట్లు కానుపించదు. భారతీయులయందు—అందునను హిందూ సంఘమందు సంఘ సంస్కార మవసరము. అందులకని యెట్టి ఫలితములగాని నొసంగజాలని యంశముల కెక్కువ ప్రాముఖ్యత నొసంగుచు వానిని తీర్మానముల గావించుట మాకాశ్చర్య కారణమగుచున్నది. తిలకము లుంచరాదనియు, సంస్కృత, హిందీభాషలు పాఠశాలలయందు గరుపబడరాదనియు తీర్మానించుటలో యేటిన్యాయమున్నదో పాఠకులే యూహింపవలసినదిగ కోరుచున్నారము. కేవలము సంఘ సంస్కార విషయములయందు మార్పునొసగూర్చు తలంపుతోడనే యీ సంఘము బయలుదేరియున్నటులు ఆదిని ప్రకటింపబడుటయు అనంతరము సైమను సంఘమునకు స్వాగత మొసంగుట ఆత్మగౌరవమునకు లోపము గలిగింపదని తీర్మానించుటలో గల యర్థము మాకు గోచరించుటలేదు. దేశమందలి ప్రఖ్యాత సంఘములన్నియును సైమను బహిష్కార మవసరమని సాధ్యమైనంతవరకును తమ నిర్ణయముల నాచరణ యందుంప ప్రయత్నించుచుండ యీ యాత్మగౌరవ మహాసభవారు సైమను సంఘమునకు స్వాగతమీయ తీర్మానించియుండు టెంతమాత్రమును న్యాయము కాజాలదని నొక్కివక్కాణింపగలము. ఫలరహితమగు నిట్టి తీర్మానములు చేయుటకు బదులు యీసభాకార్య నిర్వాహకులు కొంతవర కుపయోగపడగల విషయముల గురించియే చింతన మొనరించు టెంతయు సమంజసము.

మదరాసు యువకులు—

ఇది యువకుల యుగమనవచ్చును. అన్ని దేశముల యందలి యువకులును తమ తమ దేశములయొక్క స్థితిగతుల మార్చుటకు ప్రయత్నించుచుండుటను పత్రికా పాఠకు లెరింగియే యుందురు. మనదేశమందును శ్రీయుతులు నారిమెన్, సుభాషచంద్ర బోసు గార్లవంటి పలుకుబడిగల యువకుల నాయకత్వముక్రింద బొంబాయి, బెంగాలుమున్నగు రాష్ట్రములయందలి యువకులు దేశాభ్యుదయమునకై పాటుపడుచుండుటను మన మెరుంగుదుము. అట్టి యెడనున చెన్నరాష్ట్రమందలి—అందునకు ముఖ్యముగ మదరాసు నగరమందలి యువకులు తగిన నాయకుడు లేనికారణమున చీలిపోయి ఒకరికొకరు వ్యతి రేకముగ పత్రికలయందునను సభలయందునను వాదోపవాదములను సాగించుట శోచ నీయము. మదరాసు నగరమందలి యువకులు నేడు రెండుపక్షములక్రింద చీలిరాజకీయ ములయందు పాలుగొనుచుండుటెంత మాత్రమును సమంజసముగ కానుపించుటలేదు. ఈచీలికలు సైమను సంఘము మదరాసున కింకొక పక్షము దినములలోరానున్నదనగ బయలుదేరినది. ఇందులకు యువకులేకారణమా? ఇటులని మేమెంతమాత్రము చెప్పజాలము. నగరమందలి రాజకీయ నాయకులే యీచీలికకు కారణము. తమ మనములందుగల స్వార్థోద్దేశములకు ప్రదాన్యమొసంగు తలంపుతో యువకులను దరిదీసి వారికి లేనిపోని మంతనములు గావించి వారిద్వారా తమకార్యములను నెరవేర్చుకొన ప్రయత్నించు చున్నారు. ఇందువలననే మదరాసు యువకులలో చీలిక లేర్పడుట తటస్థించినదని ఘంటాపథముగ చెప్పవచ్చును.

మదరాసు యువకులీ సందర్భమున కొంతయాలోచన నొనరింప వలయును. రాజ కీయ నాయకుల గౌరవము పలుకుబడి యెంతవరకుండినను వారి యొక్క ప్రధానోద్దేశము లెట్టివో వాటిననుసరించుటవలన ఒనగూడు మంచిచెడ్డలెవ్వియో యెరింగి అనంతరము ఆకార్యసాధనకు పూనుకొన వలసి యున్నది.

మూడవతరగతి టిక్కెట్లు—

గతవత్సరము భారతదేశమందలి ప్రఖ్యాతకర్మాగారములన్నింటి యందునను దీర్ఘ కాలమువరకు వ్యాప్తినందియుండిన సమ్మెలుసాగియున్నవి. ఆకారణమున 1926–27సంవత్సర మందునకన్న గతవత్సరము వర్తకము కొంత తక్కువ జరిగియున్నది. ఐనను ప్రభుత్వమున కిదివరకు వచ్చెడి లాభములో కొలది తక్కువగనే గతవత్సరము కూడ వచ్చియున్న

యట్లు శ్రీరావుగారు అసెంబ్లీయందు తెలిపియున్నారు. రైల్వే వ్యవహారములు పెరిగిపోవుచున్నవి గాన అందులకై అదనపు సభ్యుల నియమింపబడు టవసరమని ఆసందర్భముననే పేర్కొనియున్నారు. వ్యవహారము లెక్కువయగుచున్నవను నెపమున నూతనోద్యోగి నియామక సంబంధమగు వ్యవహారముల గురించియే ముచ్చటించిరి గాని రైల్వేటిక్కెట్టు ధరలను తగ్గించు విషయమై మాటలాడియుండరైరి. ప్రస్తుతము మూడవతరగతి టిక్కెట్టు ధరలు యెక్కువగ నున్నవనియు అవి తగ్గింపబడవలెననియు యెంతయో కాలమునుండి ఆందోళన సాగింపబడుచునే యున్నది. ఆ విషయమై గతవత్సరముకూడ కొంత చర్చ అసెంబ్లీయందు జరుగుటయు మొదటి రెండు తరగతుల యందును ప్రయాణ మొనరించు వారికి లభించు విధమునకు ధరలుతగ్గింపబడుటయు జరిగియున్నది. త్వరలో భారత దేశమందలి రైలు మార్గములన్నియు ప్రభుత్వమునకు రానున్నవి. ఆ సందర్భమున ప్రజల సౌఖ్యముల నరయవలసిన ప్రభుత్వము టిక్కెట్లు ధరలను—అందునను ముఖ్యముగ మూడవతరగతి టిక్కెట్టు ధరలను తగ్గించవలసియున్నది. ఈ విషయమై రైల్వేబోర్డు తగిన యేర్పాటుల గావించవలసియున్నది.

# రెండవ సంచిక

## ఏప్రిల్

# మూడవ సంచిక

## మే

# నాలగవ సంచిక

## జూన్



త్రివర్ణ చిత్రము:— వనకుసుమము

ఛాయా పటములు:— 1. ఫ్రెంచి ఆఫ్రికా స్త్రీ 2. అల్జీరియను యువతి

3. నీగ్రో స్త్రీ 4. మాలెనూర్-ఖ నాట్యకర్త్రి 5. యశోద, కృష్ణుడు

# అయిదవ సంచిక

## జూలై



త్రివర్ణచిత్రము:—ఉమర్ ఖాయం

ఛాయాపటములు:—1,2,3 అన్నామీదేశ స్త్రీలు 4. మరుగుజ్జు

5. శ్రీమతి శ్యామకుమారి నెహ్రూ 6. శ్రీమతి కమలాబాయి లక్ష్మణరావుగారు

# ఆఱవ సంచిక

## ఆగస్టు



త్రివర్ణపటము—గాన మాధురి

ఛాయాపటములు—ఆస్ట్రేలియులు 4 చిత్రములు, స్త్రీత్వము 2 చిత్రములు

# ఏడవ సంచిక

## సెప్టెంబరు



త్రివర్ణపటము:—బుద్ధుని త్యాగము

ఛాయాపటములు:—బ్రెజీలియనులు, 4 చిత్రములు, స్త్రీత్వము 2 చిత్రములు

# ఎనిమిదవ సంచిక

## అక్టోబరు



త్రివర్ణచిత్రము:—మాతృప్రేమ.

ఛాయాచిత్రములు.:—

శ్రీకాళికాదేవి—మైసూరు చాముండి పర్వతమునగల మహానంది—మైసూరు రాజగృహదుర్గపు సింహద్వారములు—దసరా కాలమున దీపములచే శృంగారింపబడిన మైసూరు రాజగృహము—శ్రీ చాముండీశ్వరి ఆలయము—డాక్టరు బిసెంటుగారు—మదరాసు విశ్వవిద్యాలయపు బి. ఏ. పరీక్షయందు పట్టభద్రులైన స్త్రీలు—శ్రీదుర్గ—శ్రీరాధామాధవులు—స్నానఘట్టము—మధుర స్వర్ణాలయము, బృందావనము శ్రీమతి సేతుపార్వతీబాయిగారు—శ్రీ అనంతపద్మనాభస్వామి—తదితర పటములు.

# తొమ్మిదవ సంచిక

## నవంబరు



త్రివర్ణచిత్రము:—బుద్ధుడు-మన్మథపరాజయము.

ఛాయాచిత్రములు:—6.

# పదియవ సంచిక

## డిశంబరు

# పదునొకండవ సంచిక

## జనవరి

# పన్నెండవ సంచిక

## ఫిబ్రవరి




# సచిత్ర మాసపత్రిక

సంపాదకుఁడు

డాక్టర్. కే. ఎన్. కేసరి

సంపుటము 2.] [సంఖ్య. 2

ఆంధ్ర ముద్రాలయము, మద్రాసు

1929

సం॥ చందా రు. 4.　　　　విడిప్రతి అ. 6.

# గృహలక్ష్మి

స్త్రీల ఆయురారోగ్యముల పెంపొందించుటకేర్పడిన

సచిత్ర మాస పత్రిక.

సంపుటము 2.　　　　ఏప్రెలు 1929.　　　　సంచిక 2.

## విషయసూచిక

PRINTED AND PUBLISHED BY

DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

గృహలక్ష్మి.

# నవజీవన పథము

ఆదిని ప్రపంచమంతటికిని రెండే తెగలున్నయట్లును అందొక తెగ ప్రాచ్య ప్రాంతములకును యింకొక తెగ ప్రతీచీభూభాగములకును పోయినట్లును చరిత్రకారు లిదివరలో నిర్ణయించి యున్నను ప్రస్తుత సమయమున యింకను సాగింపబడు చుండిన పరిశోధనల ఫలితముగ నీ ఆదిమ తెగలు రెండేగాక యింకను మెక్కువ కలవని తలంచుటకు తగిన యవకాశములు జనించుచున్నవి. ఈ తెగల నిర్ణయమునకు పరిశోధకులు ముఖ్యముగ సమాధులనుండియు అడవిప్రాంతములనుండియు త్రవ్వబడి యుండిన పుర్రెలయాకృతి నాధారముగాగొనియే తెగలను నిర్ణయించుచున్నారు. మానవ జాతి మొదట మధ్యఆసియాయందే ప్రారంభమైనదని ఆదిమ శాస్త్రీయ కారులు రచియించి యుండుటచే ఆయంశమే సత్యముగ గ్రైకొని తమపరిశోధనల నితరులుగావించి యున్నారు.

ప్రస్తుత సమయములయందు నూతన దేశములు, ద్వీపములు కనుగొనబడుచున్నవి. ఆయాప్రాంతములయందు దొరకుచున్న మానవజాతులయొక్క మృతశేషములు నేడు దొరకుచున్న కారణమున ప్రపంచమునకంతటికిని ఆదిమ తెగలు రెండేయుండెడివని తలంచుట పొరపాటనియు యింకను గమనింపదగిన తెగలు మరిరెండు మూడుకలవనియు తెలుచున్నది. ఆదిని బయలుదేరియున్న తెగలు ప్రపంచమందలి అన్నిప్రాంతములకును ప్రాకి ఆయాకాలములయందు నాయకులైయుండినవారి యిష్టప్రకారము ఆయాదేశముల యందు నివాసము లేర్పరచుకొన్నవి. నాటినుండియు ఆదినిగల కొలది తెగలును ఆయా

శీతోష్ణస్థితిగతుల మూలమున కొన్ని మార్పులకు లోనైనది. ఆమార్పుల ననుసరించియే ఆచారవ్యవహారములు, వస్త్రధారణము, ఆహారము మున్నగునవన్నియు మారుట తటస్థించినది.

ఆదిని కేవలము శక్తి మీదనే యాధారపడియుండిన మానవజాతి నేడు యుక్తిమీద శక్తిని గోలుపోవుచున్నదన వచ్చును. ఈ కారణమున నూతన మానవజాతి నిర్మాణ మవసరమనియు లేకున్న ప్రపంచ మింక ముందంత సుఖదాయకమై యుండదనియు కొంతమంది దీర్ఘాలోచన మొనరించుచున్నారు. ఇది సుసాధ్యమో దుస్సాధ్యమో యను విషయమును గురించిన యాలోచన మొనరించుట మనపనిగాదు. అట్టి యాలోచనల గావించు వారి ప్రయత్నము లెట్టులు ఫలించునో మనము వేచియుండవలయును.

ప్రధానవిషయములను కొలదిగ పరిచయ పరచుకొనిన యనంతరము భారత దేశమును గురించి యించుక యాలోచింతము. భారతదేశమందలి జాతులన్నియు "నా నాటికి తీసికట్టు నాగంభట్టు" అన్నటులు క్రమక్రమముగ దేహారోగ్యమును గోలుపోయి, కళావిహీనములగుచున్నవి. నాగరకతాభివృద్ధి నాగరకతాభివృద్ధియని యెలుగెత్తి యరచువారె గాని జాతియొక్క శక్తి ఆరోగ్యాదుల గురించి గమనించు వారే కానబడుచుండుట లేదు. రాష్ట్రీయ ప్రభుత్వములు ఆరోగ్యశాఖ నొకదానిని నెలకొల్పియున్నను అందువలన వలయునంత కార్యము సాధింపబడుచుండుట లేదని చెప్పవలసివచ్చినందుల కెంతయు చింత వొడముచున్నది. తాతలకన్న తండ్రులును, తండ్రులకన్న తామును, తమకన్న తమ బిడ్డలును శక్తి హీనులగుచున్నారు. ఇట్టి యదనున కర్తవ్యాంశము నరయవలసియున్నది.

నాగరికతయే—అందునను పాశ్చాత్య నాగరకతయే—జాతి ఆరోగ్యజీవనమేగాక జాతీయజీవనముకూడ సన్నగిల్లుటకు కారణమని బాబూ ప్రఫుల్ల చంద్రరాయిగారివంటి అత్యుత్తమ మేధావంతులును దేశసేవాపరాయణులును అభిప్రాయపడి యుండుటను చదువరు లెరుంగవలయును. ఇటులనిరిగదా యని పాశ్చాత్య వాసనలుగల యెట్టియంశముగాని అనుసరింపబడరాదని చెప్పుచున్నటులు తలంపరాదు. జాతీయజీవనమార్గము మరువకుండ అవసరమగునంతవరకును పాశ్చాత్యపద్ధతులలో ఉత్తమమగువాటిని గమనించి ఆ రెంటికిని కొంతమైక్యతనుగల్పించి కాలానుసారముగ ఉత్తమపథనిర్మాణమును గావించుకొనవలయునని వారు కోరుచున్నారు. ఆవిధమగు జ్ఞానమును వ్యాప్తిగావించుటకే ఆమహనీయులు తమజీవితముల ధారవోయుచున్నారు.

పాశ్చాత్య పరిపాలనాఫలితముగ భారతనారీమణులయం దుదయించిన మార్పేమి? మధ్యకాలమందు స్త్రీలలో నశించియుండినవిద్య మరల వ్యాప్తిలోనికి వచ్చుచున్నది. అటులనే స్త్రీలు వంటయిల్లుదాటి బయటికిరారాదను నిషేధము క్రమముగ పోవుచున్నది. మూఢాచారములు కొంతవరకు నశించుచున్నవి. కాఫీ, టీ, మున్నగు పాశ్చాత్య సాంప్రదాయాచారములు గృహములకెగబ్రాకి ప్రముఖస్థానము వహించుచున్నవి. శోభకుగాను భారతనారీలోకముచే ధరింపబడుచుండిన తిలకము నేడు నశించుచున్నది. కొందరు హిందూసంఘోద్ధారకుల మని చెప్పెడి పెద్దలు వలయు సమాధానముల నొసంగకున్న కారణమున కొందరు విప్లవమునకు గడంగుచున్నారు.

ప్రస్తుతము విద్యల బడయుచుండిన స్త్రీలు గృహవ్యవహారముల నించుకేనియు నెరుంగకున్నారు. ఇంక గృహములయందు మంచిచెడ్డలను తిలకించుచుండు స్త్రీలు విద్యాగంధము లేకుండనున్నారు అందువలన యీరెండు తెగలయందుండు వారిలోనవు లోపము కాననగుచున్నదిగాన దానిని తొలగింప ప్రయత్నింపవలసి యున్నది.

బొట్టుమానుట, కేశముల పాశ్చాత్యాంగనలవలె కత్తిరించుకొనుట, స్వభాషల మాని తామేగాక తమబిడ్డలచేగూడనింట ఆంగ్లభాష మాట్లాడించుట యిదియంతయు వాంఛనీయముకాదు.

అటులని పాశ్చాత్య పద్ధతులతో మనకేమి యని యూరకొనరాదు. కాలము మారుచుండును; దానితో ఆచార వ్యవహారములు, నియమములును మారుచుండును. మనమేల మార్పవలయునని యూరుకొనునెడ మంచికి బదులు చెడుగే యెక్కువ సంఘమందు ప్రవేశించును కనుక కాలానుగుణ్యముగ సంఘమందు అవసరమగు మంచి మార్పులు గావించి నవజీవనపథ నిర్మాణమునకు సంస్కారులు నాయకులు పూనుకొనవలసియున్నది.

# సంగీతము

## శ్రుతిసోదరులు

పూర్వము రాగములు మూడు విధములుగా నుండెడివి. వాటికి "ఘన, నయ, దేశి" అను పేర్లొసగబడెను.

ఘనరాగము:—నాభినుండి సలుపబడుగాన క్రియకలదియు, యుద్ధరంగమందు మహాశూరునిబోలి గాంభీర్యము చెందినదై యుండునది ఘనరాగమనబడును. పూర్వాచార్యులు (అనగా భరత మహాముని, కశ్యపమహర్షి, మతంగుడు, నారదుడు, తుంబురుడు, ఆంజనేయుడు, రావణుడు, నందికేశ్వరుడు, అర్జునుడు, దత్తిలుడు మొదలుగువారు) 10 రాగములను ఘనరాగములని చెప్పినారు. అవియేవన — 1 నాట, 2 గౌళ, 3 వరాళి, 4 ఆరభి, 5 శ్రీరాగము, 6 కేదార, 7 నారాయణగౌళ, 8 రీతిగౌళ, 9 సారంగనాట, 10 జాళి.

నయరాగము:—వినువారి మనస్సున విశేష రంజకత్వమును కలుగజేయునది నయరాగమన బడును. దీనినే రక్తిరాగమనియు, మార్గరాగమనియు నందురు. పురుషులను స్త్రీలు తమ రూపలావణ్యాదులచేతను, ఇంపుమాటల చేతను, వీక్షణాములచేతను మోహింపజేయు చందమున, ఈనయరాగములు వినువారి మనస్సును పరవశము నొందజేయునని చెప్పబడియున్నది.

దేశ్యరాగము:—ఉత్తరదేశమునుండి సంగ్రహింపబడిన కొన్నిరాగ కళలతో స్ఫురింపజేయునది దేశ్యరాగమన బడును. ఉదా —ఫరజు, ఖమాసు, కాఫీ, దర్బారు, మొదలగునవి.

రాగరసములు:—రాగములకు రసములుకూడ యేర్పరుపబడెను. కొన్నిరాగములచే శృంగార రసమును, కొన్నిరాగములచే హాస్యరసమును, మరికొన్నిరాగములచే కరుణారసమును; ఇట్లురాగములను పాడి నవరసములను కల్పింప వచ్చునని గ్రంథములలో చెప్పబడియున్నది. శృంగార రసమునకు భూపాళరాగమును, హాస్యరసమునకు వసంతరాగమును, కరుణారసమునకు ఘలమంజరియును, వీరరసమునకు నాటరాగమును, భయానక

రసమునకు మాళవిరాగమును, శోక రసమునకు ముఖారియును, రౌద్రరసమునకు భైరవియును, అద్భుతరసమునకు బంగాళారాగమును, శాంతరసమునకు అన్నిరాగములు పాడవచ్చునని గ్రంథస్తమతము. మరియును, సంపూర్ణరాగములు వీర, శృంగార, కరుణ హాస్యరస ప్రతిపాదకములు. షాడవరాగములు యుద్ధమునందు వీరరస ప్రధానముగు నటుల నుపయోగింపవలయును. ఔడవరాగములు, శత్రు, వ్యాధి, భయ, శోకవినాశనమందును, గ్రహశాంతి ప్రయోజనాది కర్మలయందు ఉపయుక్తములు. అనగా రసయుక్తములయిన రాగములనుబట్టి పద, కీర్తనాదులయొక్క భావార్థములబట్టి రాగముల నుపయోగింపవలయును.

## మరియొకవిధమగు రాగవిభజనము.

| పురుషరాగములు. | | కులములు. | వేదములు. | రసములు. | గుణములు |
|---|---|---|---|---|---|
| 1 | భైరవి | బ్రాహ్మణ | సామ | రౌద్ర | రాజసము |
| 2 | భూపాల | ,, | ,, | శృంగార | ,, |
| 3 | శ్రీరాగం | క్షత్రియ | యజస్సు | భీభత్స | తామసము |
| 4 | ఫలమంజరి | ,, | ,, | కరుణ | ,, |
| 5 | వసంత | వైశ్య | ఋక్ | హాస్య | సాత్వికము |
| 6 | మాళవము | ,, | ,, | భయానక | ,, |
| 7 | బంగాళా | శూద్ర | అధర్వణ | అద్భుత | రాజసము |
| 8 | నాట | ,, | ,, | వీర | ,, |

## స్త్రీరాగములు.

దేవక్రియ, మేఘరంజి, కురంజి—ఇవి భైరవిరాగమునకు భార్యలు
బిలహరి, మలహరి, భాండీ—భూపాల రాగమునకు భార్యలు
ఆంధాళీ, భల్లాతీ, సాహుళీ—శ్రీ రాగమునకు భార్యలు
దేశీ, ముఖారి, లలిత—ఫలమంజరి రాగమునకు భార్యలు
రామక్రియ, వరాళి, గౌళ—వసంత రాగమునకు భార్యలు
గుండక్రియ, ఘూర్జరి, జౌళి—మాళవ రాగమునకు భార్యలు
కళ్యాణి, అహిరి, సావేరి—బంగాళ రాగమునకు భార్యలు
ఘంటారవము, కాంభోజి, శంకరాభరణము—నాట రాగమునకు భార్యలు

జాతిరాగములు:—భైరవికి కన్నడా; భూపాలమునకు దేశాక్షియు, దేవగాంధారియు; శ్రీరాగమునకు దేశి; ఫలమంజరికి అసావేరి; వసంతకు మోహన; మాళవమునకు హిందోళము; బంగాళకు భోగి; నాటకు వేళావళి. ఇవి జాతిరాగములు.

సంకరరాగములు:—ఉదాహరణము—మేఘరంజి, మలహారి, మందారి, ఘూర్జరి, ఘంటారవము, లలిత, గౌళ, సావేరి.

పుత్రరాగములు:—కాఫీ, రేగుప్తి, నీలాంబరి (భైరవి); మారువ, రామగిరి, (భూపాలం); సారంగ, మందారి (శ్రీరాగము); సౌరాష్ట్రి, కేదార (ఫలమంజరి); ముఖారి, లలిత, తోడి, ధన్యాసి, నారాయణి, గౌరి (వసంత) పంతువరాళి, వరాళి, గౌళ (మాళవము); పూర్వి, సావేరి, బేగడ, జౌళి (బంగాళా); మనోహరి, యమున (నాట). ఇవి పుత్రరాగములు.

మిత్రరాగములు:—నామచిహ్నముచే వ్యవహరింపబడునవి మిత్రరాగములు. ఉదా:—

మల్లారు:—సామంత మల్లారు, గౌడ మల్లారు, చెంచుమల్లారు.

భైరవి:—ఆనందభైరవి, వసంతభైరవి, ఆదిభైరవి మొదలగునవి.

కాంభోజి:—యదుకుల కాంభోజి, గుమ్మకాంభోజి, గోపికా కాంభోజి మొదలగునవి.

వరాళి:—నాగవరాళి, పున్నాగవరాళి, పంతువరాళి, శోకవరాళి, వసంతవరాళి మొదలగునవి.

నాట:—ఛాయానాట, గంభీరనాట, సారంగనాట, సాళంగనాట, ప్రతాపనాట, అహిరినాట, ఇందు సారంగనాట మొదలగునవి.

గౌళ:—మాయామాళవ గౌళ, ఛాయాగౌళ, ఈశగౌళ, రీతిగౌళ, నారాయణ గౌళ, కేదారగౌళ మొదలగునవి.

శుద్ధరాగములు:—శాస్త్రోక్త నియమ ప్రకారముగ సంకరములేక ఒకేరాగకళతో స్ఫురింపజేయునది శుద్ధరాగమని పేరు. ఉదా:—కళ్యాణి, కాంభోజి, దేవక్రియ, వరాళి, ముఖారి మొదలగునవి.

ఛాయాలగ (సాలగ) రాగములు:—అన్యరాగచ్ఛాయలను స్వీకరించుకొనివచ్చు రాగములు ఛాయాలగములనబడును. ఉదా:—బిలహరి, కాఫి, అహిరి, దేశి, రామక్రియ మొదలగునవి.

మరియు ఈరాగములకు కాల నిర్ణయముగలదు. తెల్లవారుఝామున 3 ఘంటలు మొదలు 6 ఘంటలవరకు దేశాక్షి, దేవగాంధారి, భాండీ, ధన్యాసి, నాదవ, దేవక్రియ, గౌరి, భూపాలము మొదలగునవి పాడదగినవి.

ఉదయము 6 ఘంటలు మొదలు 9 ఘంటలవరకు కురంజి, సాహుళీ, ఘంటారవము, రామక్రియ, బిలహరి, మలహరి, ముఖారి, యమున, కేగుప్తి, భైరవి, అను యీ రాగములను పాడదగినవి.

పగలు 9 ఘంటలు మొదలు 12 ఘంటలవరకు మేఘరంజి, సారంగ, భల్లాతి, మధ్యమావతి, దేశి, నీలాంబరి, మంగళదేశిక, శ్రీరాగము మొదలగునవి పాడదగినవి.

మధ్యాహ్నము 12 ఘంటలు మొదలు 3 ఘంటలవరకు మోహన, కళ్యాణి, కాఫీ, గూర్జరి, శంకరాభరణము, పూర్వీ, వసంత, మొదలగునవి పాడదగినవి.

సాయంకాలము 3 ఘంటలు మొదలు 6 ఘంటలవరకు నారాయణి, హిందోళము, సౌరాష్ట్రి, తోడి, గౌరి, వరాళి, పంతువరాళి, హుసేని, మాళవి, లలిత, మొదలగునవి పాడదగినవి.

సాయంకాలము 6 ఘంటలు మొదలు రాత్రి 9 ఘంటలవరకు, వేళావళి, కాంభోజి, సావేరి, బేగడ, పున్నాగ, నాట మొదలగునవి పాడదగినవి.

రాత్రి 9 ఘంటలు మొదలు 12 ఘంటలవరకు గుండక్రియ, మనోహరి, మంగళకైశిక, కేదార, అహిరి, అసావేరి, బంగాళా, జౌళి, మొదలగునవి పాడదగినవి.

రాత్రి 12 ఘంటలుమొదలు తెల్లవారుఝామున 3 ఘంటలవరకు జోగిని, చిత్రవేళ, కర్ణాట, సురటి, మంజరి మొదలగునవి పాడదగినవి.

రాగాలాపనయందు 10 విధములగు లక్షణములు గలవు. అవియెవన:—

1 గ్రహము:—గ్రహస్వరమని తాత్పర్యము. రాగములకుగాని, లేక సంగతులకు గాని ప్రారంభమైయున్న స్వరము గ్రహస్వరమనబడును. రాగములకు షడ్జమునే గ్రహాంశన్యాసముగ గొనవలయునని కొందరి మతము.

2 అంశము:—అంశస్వరమని తాత్పర్యము. రాగమునైనగాని, సంగతులనుగాని పాడునపుడు రాగకళనుచూపుటకై మాటి మాటికి వచ్చెడి స్వరము అంశస్వరమనబడును.

3 న్యాసము:—రాగములలోనైనను, సంగతులలోనైనను గల చివర స్వరము న్యాస స్వరమనబడును.

4 మంద్రము:—మంద్రగతిగ పాడబడు స్వరము. ధ్వనిని తగ్గించి సన్నగ పాడబడు స్వరము మంద్రమనియు, మంద్రస్థాయియందు పాడబడు స్వరము మంద్రమనియు, మతభేదము బొందెను.

5 తారము:—ఉచ్చస్వరము. ఉచ్చమైన ధ్వనితో పాడబడు స్వరము తారమనియు, తారస్థాయిలోని స్వరములే తారస్వరములనియు వ్యవహరింపబడెను.

6 అపన్యాసము:—మధ్యలో ముగించెడి స్వరము. ఒకరాగమును పాడునపుడు మధ్య మధ్యలో ముగించెడి స్వరము అపన్యాస మనబడును.

7 సన్న్యాసము:—ఒక రాగమును పలుఖండములుగ విభజించి పాడునపుడు ఆయా ఖండములను ముగించుట సన్న్యాస మనబడును.

8 విన్యాసము:—ఖండములకవయవమైన స్వరమని భావము. ఒక రాగమును పలు ఖండములుగ విభజించి పాడునపుడు ఆయాఖండములలో రాగకళను జూపుటకై మాటి మాటికి ప్రయోగించెడిస్వరము విన్యాసమనబడును.

9 అల్పత్వము:—రాగములో స్వల్పప్రయోగము గలస్వరము. ఈయల్పత్వము అనభ్యాసము, లంఘనమని రెండువిధములు. అందు అనభ్యాసమనగా ఒకస్వరమును ఏదోయొకసమయమున నుచ్చరించుట. లంఘనమనగా ఒకస్వరమును మధ్యలోవిసర్జించి దానికి డాసినస్వరమునకు దాటుట,

10 బహుత్వము:—రాగములో పలుమారుప్రయోగింపబడు స్వరము. ఇది అభ్యాసమనియు, అలంఘనమనియు రెండువిధములగుచున్నది. అభ్యాసమనగా ఒకస్వరము ఎడ తెగక మాటిమాటికి ఉచ్చరించుట. అలంఘనమనగా రాగములోనెప్పుడు విడువక పాడబడుస్వరము.

# అత్తవారింటికిఁబోయెడు ఆఁడుబిడ్డకు

సీ॥ పాటించి కొలువుము భవనదైవతముల
సవతులఁ గొనియాడు సఖులఁబోలె
నారాధనము సేయు మత్తమామల నెప్డుఁ
బరిజనంబులమీఁదఁ గరుణగలుగు
మలుగకు కోపించినపుడు నాథునితోడ
మదిలోన నుబ్బకు మన్ననలకుఁ
దోడికోడండ్రతోఁగూడి మాడిచరింపు
దాసీజనముఁ బ్రోవు తల్లికరణి

తే॥ బ్రాహ్మణులయందు గురులందు బంధులందు
భక్తివిశ్వాస సౌహార్దపటుత నెఱపు
భవ్యపతిదేవతాచారపరమపుణ్య!
ధర్మ మేనుఱకుండుమా తల్లికాన!

——"శృంగారనైషధము" నుండి

ఉ॥ చిత్తమెఱింగి భర్తకును సేవలుసేయుట ధర్మమమ్మ లో
కోత్తర! యత్తగారి కెదురుత్తర మెత్తకు మమ్మ యమ్మరో!
యెత్తకు వంచినట్టితల యియ్యమ తొయ్యలులందు నంత య
త్యుత్తమురాలు మేలనఁగనుండుట భూషణమమ్మ కోమలీ!

క॥ కలవారిపడుచు ననుచుం
దెలిపెడు సూ నడకచేత దీనులఁ బతులీ
పులు గొంచెమిడినఁ బదివేల్
ఫలియించె నటంచుగాసి పదరెదు సుమ్మీ.

——"పాంచాలీపరిణయము" నుండి

# మాతాశిశు సంరక్షణము

## అమెరికా యందలి ప్రచారమార్గము

ఆరోగ్యము—అందునను ముఖ్యముగ మాతాశిశువుల ఆరోగ్యము—కాపాడబడు టెంతయు అవసరము. ఇందులకై యిపుడిప్పుడే అన్నిదేశములును యెక్కువ శ్రద్ధను వహింపుచున్నవి. నిన్న మొన్నటివరకును శిశుమరణముల పేరునడసిన అమెరికా జర్మనీ మున్నగు దేశములయందు గావింపబడుచున్న ప్రచారఫలితముగ యీమరణముల సంఖ్య చాలవరకు తగ్గినది. ఇందులకా దేశములందలి ప్రభుత్వములు కొంతవరకు పూనుకొని యున్నవి. ఆవిషయముల గురించి ఆంధ్ర సోదర సోదరీమణు లెఱుంగు టవసరము.

ముఖ్యముగ నీసమయమున అమెరికాదేశమందలి పరిస్థితుల నించుక పరికింతము. ఆ దేశమున మాతాశిశువులయారోగ్యమును కాపాడుటకై "షెప్పర్డు టౌనర్ ఆక్టు" అనుపేర నొకచట్టము తయారుగావింపబడి కొంతవరకు ఆచరణలోనికి గొనిరాబడినది. ఈచట్టము 1921 వ సంవత్సరములో గావింపబడినను పరిస్థితులొక్కమారుగా మాఱియుండని కారణమున యిట్టిచట్టముండినను లేకయున్నను ఒక్కటియేయని కొంతమంది యభిప్రాయపడుచున్నారుకాని చట్టము గావింపబడిన నాటినుండియు సాగింపబడుచు వచ్చిన ప్రచారమును వీరు గమనింపకున్నారు.

ఎవరియభిప్రాయ మెటులున్నను అమెరికా మహిళాసంఘములు మాత్రము యీచట్టముయొక్క యావశ్యకత యెంతేని కలదనియు యింకను యెక్కుడు ప్రచారమును సాగించుటకు వలయు ధనసౌకర్యముల గల్పింప వలయుననియు ప్రభుత్వమునకు విన్నవించుచున్నవి.

ఈచట్టము ననుసరించి ఫెడరలు ప్రభుత్వములు ప్రతియేటను కొంతధనమును యీ ప్రచారమునకని ఓటుచేయుచుండును. దీనికి ప్రజల విరాళములు చేర్పబడుచుండును.

16 వత్సరముల క్రితము శిశుసంరక్షణాలయోద్యమము ప్రారంభమైనది. ఆ సమయమున దేశమున ప్రతియేటను ఎందరు శిశువులు జన్మించుచున్నారో ఎందరు మరణించుచున్నారో తెలిసెడిది కాదు. అంతియెగాక సాంఘిక పరిస్థితులెట్టులున్నవో ఎఱింగిన వారు అరుదై యుండిరి.

శిశువులయారోగ్య సంఘములు ప్రారంభమైన నాటినుండియు ఆరోగ్యము, గర్భధారణాది విషయముల గురించి స్త్రీలకును, శిశువుల గురించి తల్లులకును బోధలుగావింపబడుచున్నవి.

ఈప్రచారకసంఘములయందు స్త్రీలే యెక్కువగ పనిచేయుచున్నారు. కరపత్రములు, చిన్నగ్రంథములు మున్నగువాటిని ప్రచురించుట, తల్లులకు ఆయాప్రాంతముల కనుకూలించు సలహాల నొసంగుచుండుట మొదలైన కార్యక్రమమును ఆచరణయందుంచుటలో స్త్రీలు మెక్కువ శ్రద్ధ వహించి పాటుపడుచున్నారు.

షెప్పర్డు టౌనర్ పద్ధతియందు కొలది లోపములుండుట మాత్ర సత్యమెయయ్యును అంతకన్న మంచికార్యక్రమనిర్ణయ మింతవరకు గావింపబడి యుండలేదు గనుక అంతవరకు నిదియే ఆచరణ యందుంచి కల కొలదిఫలితమునొందుట మంచిదని స్త్రీల సంఘములు పట్టుబట్టియున్నవి. ఈపద్ధతి ననుసరించి ఆరోగ్యశిక్ష అవసరమగు వారలకే యొసంగబడుచున్నది. ఈచట్టానుసారముగ ప్రస్తుతము 27 కార్యాలయములు నెలకొల్పబడి యున్నవి. ఈసంఘములు ముఖ్యముగ శిశువులయారోగ్యము, గర్భవతుల విషయమున పాటుపడుచున్నవి.

1921 వ సంవత్సరమునుండియు గల లెక్కలనించుక పరిశీలింపవచ్చును. ప్రతి వెయ్యిమంది శిశువులకును 76 మంది 1921 వ సంవత్సరములో మరణించిరి. 1924 వ సంవత్సరములో యీమరణముల సంఖ్య 73 నకు తగ్గినది. అటుతరువాత అనగా 1927 వ సంవత్సరములో 65 నకు వచ్చినది. ఈప్రచారమువలన నంతలాభములేక యున్నది గాన అనవసర వ్యయమనుటంత సమంజసముగ లేదు. ఈప్రచారమవసరమా అనవసరమా యను విషయమై కొందరభిప్రాయముల దెలిసికొన వలయునని తల్లులనడుగ నూటికి 90 కెక్కువమంది యీప్రచారములేని యెడల నెక్కువలాభమున్నది గాన యింకను విరివిగ సాగించుటవసరమని తెలిపియుండిరి.

ఈ చట్టమున్నది గాన ప్రభుత్వమే దీనిని గైకొనునని గాని ప్రభుత్వము ఆరోగ్య శాఖలేకుండ జేసికొనవచ్చునని గాని యెవ్వరును చెప్పియుండలేదు. ప్రభుత్వ సహాయ ముండినను దీనికి ప్రజల సహాయమే యెక్కువగలదు. గాననిది ప్రజల సంస్థక్రింద నున్నది.

అమెరికాయందలి నల్లజాతుల మధ్య ఆరోగ్య ప్రచార మవసరము. ఆకారణమున యీసంస్థయాజమాన్యము క్రింద నొక నీగ్రో డాక్టరు దాదులు కొంతమందికి తరిబీదు నొసంగుటయెగాక వారిద్వారా ప్రచారముకూడ చేయించుచున్నాడు.

విజ్ఞానవంతులందరును యీపద్ధతియొక్క ప్రాశస్త్యతనెంతేని కొనియాడియున్నారు. ఆకారణమున అమెరికాదేశమువారలింక ముందీ సంస్థకెక్కువ సహాయ మొనరింపనున్నట్లు వినబడుచున్నది.

[భారతదేశమున కూడ సంస్కారప్రియులు జాతీయసంస్థలకు యిట్టి సత్కార్య మును సాధించునెడ దేశదౌర్భాగ్యము చాలవరకు తీరునని మాయభిప్రాయము. ప్రచారము ఫలితముల నొసంగగల దనుట పైయంశమురూఢి పరచుచున్నది. గృ॥సం॥]

# విషాదగీతము

మొగల్తూరు శివయ్య గారు

అది విషాదాగ్ని కీలల నార్పదంచు
అది మనోవ్రణముఁ గాల్చునర్చియంచు
అదియె నావ్యథోద్దీపనమౌ నటంచు
నే నెఱుంగుదు; నైన నాయెమ్మెకాని
నక్కటా! చూడఁగలనో మఱొక్కమాఱు!

ఏమనోహర సౌందర్యహృద్యరేఖ
మున్ను మద్భాగ్యరమయంచుఁ బొంగినానొ
అన్యమేతన్మనోజ్ఞలావణ్య సరసి
నసదృశోజ్జ్వలలీల నోలాడెడిఁ గద!
ఏ హృదంతర ప్రణయంపు టెల్లలందు
విమలరాగంపు వెన్నెలల్ విరిసినానొ
ఏ వినిర్మల విశ్వాసభావసీమ
నొక్కనాఁడు నాయదియంచు నుబ్బినానొ
ఆ పవిత్రపుఁ బ్రేమరాజ్యము మదన్య
లోలదృక్శాసనమ్ముల నేలెడిఁ గద!

*　　　*　　　*

ఐన నదియేమొ నాదుశోకాన వాని
మూర్తిఁ బొడగాంచు కొఱకె వాపోవుచుంటి
ఏలకో గ్రుడ్డితనమున నిపుడుసైత
మతివియోగార్తిఁ దద్దర్శనాభిలాష
నెన్నరానట్లు దపియించుచున్నదాన!

కలిగినను,—దాన విశ్రాంతి గలుగదంచు
దానిచేఁ దాపభారమ్ము మానదంచు
నెఱుఁగుదుఁ, గాని; ఐన నాయెమ్మెకాని
నక్కటా! కాంచఁగలనే మఱొక్కమాఱు!

# భగవంతుడు

ముద్దా. విశ్వనాదం గారు

పూర్వమొకప్పుడు తురుష్క పరిపాలనములో నొకచక్రవర్తివద్ద కొక 'కాజీ' (గవర్నరు) వచ్చెను. కాజీకుండియున్న మతాభిమానమునకు చక్రవర్తి సగౌరవముగ నాదరించి, యతనిసామర్థ్యము పరిశీలింపగడంగె. స్వతహాగా చక్రవర్తి విద్వాంసుడుకాడుగాని గవర్నరు స్థానమాక్రమింప నుద్యుక్తులైయున్న మరియొకరు ఈవిషయమై సలహానిచ్చిరి. కాజీ చక్రవర్తియెదుట నిలచియుండ నీక్రిందిప్రశ్నలు వేయబడెను. "భగవంతుడే దిక్కునకు తిరిగియుండును? ఎచ్చటకూర్చొనియుండును? ఏమిభుజించును? ఆతడు చేయుపనియేమి?" ఈప్రశ్నలకు సరియైన సమాధానమిచ్చుచో గొప్పపదవి నిచ్చెదనని చక్రవర్తిచెప్పెను. రాజుగారివద్దనుండివచ్చిన ప్రశ్నలుచాలకష్టముగనుండి తీరునని కాజీ యనుకొనెను సరే, చక్రవర్తిని ముఖస్తుతులచే మెప్పింపగల చతురతగల్గియుండుటచే కాజీ పైప్రశ్నలకు జవాబిచ్చుట కెనిమిదిరోజులు గడువుకోరెను.

ఎనిమిదిదినములవరకు కాజీ దీర్ఘాలోచనజేసె కాని యేమియు జవాబు స్ఫురింపలేదు. రాజునకు తృప్తికరముగ యెట్లుజవాబిచ్చుట? ఆఖరురోజువచ్చెను, కాని కాజీకి ప్రశ్నలకుత్తరము మాత్రమురాదయ్యె, అపుడతడు కాలహరణము చేయుటకై నస్వస్థతగ యున్నట్టు నటించెను. కాజీ సేవకుడతనివద్దకువచ్చి "సంగతియేమి? అట్లుంటిరేల?" యని పృచ్ఛించెను. "అవతలకుపొమ్ము-నన్నువిసిగించకు-నేను చావసిద్ధముగ నుంటిన"ని సేవకుని కసరెను. అందులకాతడు "దయయుంచి సంగతిదెల్పుడు; తమకణుమాత్రము బాధ గలుగకుండ నా యసువులనర్పింప సంసిద్ధుడ"నని మాటువల్కె. అంత కాజీ జరిగిన వృత్తాంతముదెల్పెను. ఈ సేవకుడు అత్యల్పమైన నౌఖరియందుండెను కాని కాజీకి శిష్యుడు, మంచిజ్ఞానవేత్త. రాజుగారిప్రశ్నలకు జవాబీతనికి తెలియును. వెంటనే తానుజవాబు చెప్పుటకు వెళ్లెదననియు, ఇటుల చక్రవర్తిపేర నొకచీటివ్రాసి యిమ్మనియు, రాజునకు తృప్తిగలేకున్న, కాజీబదులు తానేచనిపోవుదుననియు, యజమానితో వాక్రుచ్చెను. కాజీ యనుమానింపుచుండునంతలో రాజువద్దనుంచి యొకబంట్రౌతు వర్తమానము

తెచ్చెను. కాజీ భయకంపితుడై వణకుచు సేవకుని పోయిరమ్మనిపనిచెను. సేవకుడు తలచింపి గుడ్డలుధరించి, చక్రవర్తిదరికి నిర్భయముగవెళ్లి, "అయ్యా, మీకేమికావలయును? మీరడుగదలచిన విశేషమేమి?" యనెను. అంతరాజు "నీయజమానినడిగిన ప్రశ్నలకు నీవుత్తరమివ్వగలవా?" యనియడిగెను. అంతనాసేవకుడిట్లనియె, "జవాబిచ్చెదను, కాని యొక్కసంగతి. ప్రశ్నలువేయువాడు శిష్యుడు, సందేహనివృత్తిగావించు యతడు గురువు. ముసల్మాను మతాచారముగ నీవువర్తింతువని నమ్మెదను. శాస్త్రవిధిననుసరించి నేనగ్రస్థాన మాక్రమింపవలె, నీవు దిగువకూర్చుండనగు." రాజందులకు సమ్మతింప, పండితుడు (సేవకుడు) అమూల్యాభరణాలంకృతమైన సింహాసనముపై నధిష్ఠించె. చక్రవర్తి క్రింది మెట్టుపై కూర్చుండెను. "మరొక్కయంశము. మీ జవాబులు నాకు తృప్తికరముగ లేకున్న, మిమ్ము చంపెదన"ని రాజనెను. "ఆసంగతి తెలిసియే యున్నద"ని పండితుడు మారువల్కె.

మొదటిప్రశ్న, "భగవంతుని యునికెద్ది?"

పండితులు గోవు నొక దానిని తే నియమించి యిట్లనియె. "ఈ ఆవుకు పాలున్నదా?" "ఉన్న"దని రాజనెను. "ఎక్కడయున్నది?" "పొదుగులో"నని రాజుత్తరమిచ్చెను. అంత పండితుడు "అదియే పొరబాటు, ఆవునంతను పాలాక్రమించుకొని యున్న" దనెను. అటుపై కొద్దిగ క్షీరము తేబడెను. "ఈ పాలలో వెన్నయున్నదా?" "ఉన్నద"నిరి. "ఎక్కడ యున్నది తెల్పు"డని పండితుడు ప్రశ్నించెను. ఎవ్వరును జవాబివ్వలేక పోయిరి. అంతట నాతడిట్లు చెప్పదొడగె. "ఈ పాలలో వెన్నయున్నదని ఒప్పుకొనెదరు, కాని ఏమూల నున్నదీ చెప్పలేకున్నారు. నిశ్చయముగ పాలంతలోను వెన్న యిమిడియున్నది. అదే రీతిగ, వెన్న పాలంతటిలో నెట్లిమిడియున్నదో, పాలుగోవు శరీరమంత నెట్లాక్రమించుకొని యున్నదో, భగవంతుడు అట్టులే ప్రపంచమంతటను వ్యాపించియున్నాడు. పాలువలయునపు డావు పొదుగునుండి ఎట్లు పిదుకుచుంటిమో, భగవంతుడు కావలసినచో మన హృదయము నట్లే పిదుకవలె. ఏమిరాజా! నీ ప్రశ్నకు జవాబువచ్చినదా?" చక్రవర్తి "సరే" యనెను. 'దేవుడు స్వర్గలోకములో నెక్కడనో యున్నాడని' యిదివరకు రాజువద్ద చెప్పుచుండిన శాస్త్రవేత్తల పాఠములు పొల్లులయ్యెను.

అంత రెండవ ప్రశ్నవచ్చె. "ఈశ్వరుడేదిశకు చూచుచుండును? తూర్పునకా? పడమరకా? ఉత్తరమునకా? దక్షిణముకా?

ఇదికూడ చిత్రమైన ప్రశ్నయే. ఒక క్రొవ్వొత్తి తెచ్చి దీపము వెలిగించ నాజ్ఞాపింప బడెను. అపుడు పండితులు "దీపము నలుదిశలను హెచ్చుతగ్గులు లేక యెట్లు ప్రకాశించుచున్నదో, యటులనే మనలో (క్రొవ్వొత్తివలె) నున్న భగవంతుడన్ని దిక్కులకు వ్యత్యస్త మణుమాత్రము లేక ప్రసరించు" నని బోధపఱచెను.

తరువాత విషయము, "భగవంతుడేమిపని చేయుచుండును?"

అందులకు పండితులు "సరే, కాజీనిటకు రప్పింపు"మనెను. అంతట తన (సేవకుని) యజమాని (కాజీ) వచ్చి భృత్యుడు సింహాసన మధిష్ఠించుటగని యచ్చెరు వొందెను. అపుడు పండితుడు కాజీని తానున్నస్థాన మాక్రమింప నియమించె. చక్రవర్తిని కాజీ స్థానమున కూర్చుండబనిచి, తాను రాజుస్థలము నాక్రమించి, యిటుల చెప్పగడంగెను. "ఇట్లు యెల్లప్పుడు పరిస్థితులు మార్పుటయే భగవంతునిపని. పండితుని రాజుగాను, రాజును కాజీగాను, కాజీని పండితునిగాను మార్పులు గావించుటయే యతని కర్తవ్యము. ఇదియే లోకములో మరల మరల జరుగుచున్నపని. ఒక కుటుంబమట్టె వృద్ధిబొందుచున్నది. ఇట్టె పేరులేకుండ పోవుచున్నది. ఆ ఘనతను మరియొక రనుభవించుచున్నారు. కొంతకాల మొకొక్కడు దుచ్ఛదశనందుచున్నాడు తిరిగి మరియొక డాస్థానముకు వచ్చుచున్నాడు. ఎన్నిదినములైనను, యెన్నివత్సరములయినను జరుగుచున్న చర్యయిదియే. ఇటులనే యెల్ల కాలమీ ప్రపంచమున మార్పులు గలుగుచున్నవి.

అంతటినుండియు పండితుడు (భృత్యుడు) కాజీపదవి ననుభవింపుచుండెను.

—(శ్రీ రామతీర్థ.)

# శారద లేఖలు

సౌభాగ్యవతియగు కల్పలతకు.

నెచ్చెలీ,

నీవు వ్రాసిన యుత్తరములు నిన్ననే వచ్చి చూచితిని. నీకు జాబు వ్రాయుటకే నాకు సిగ్గగుచున్నది. ఏమందువా? ఇకనుండి తప్పక వ్రాయుదునని నీకు వాగ్దత్తము సేయుటయు ఆమఱునాఁటే నీకు సకాలమున వ్రాయజాలక పోవుటయు పలుమాఱులు తటస్థించుచున్నది. శారదకు, మాటలకు చేతలకు దూరమని నీవు తలంతువేమోయని నాబిడియము కాని యిది స్వయంకృతాపరాధముకాదు. దక్షిణ దేశయాత్ర జేసెడు భాగ్యము నాకింతలో లభించునని నేను స్వప్నమందైన తలంపలేదు. దైవికముగ క్షణములో తటస్థించినది. ఆనాడు నీకు లిఖించుచున్న లేఖనర్థాంతరముననే విడిచి తక్షణమే యాత్రకు సన్నద్ధనైతిని. వైకుంఠైకాదశి నాటికి శ్రీరంగమున కేగవలెనని పయనించెడు నాటి మాతలంపు కాని చేరలేకపోతిమి. కాన యూరక చెన్నపట్టణమున నాదినమేల గడుపవలెనని కాంచీపురమున కేగితిమి. ఉన్నతోన్నత ప్రాకార గోపురావళులతోడను, విశాలమైన రాచబాటతోడను ఒప్పారు కాంచీపురము పూర్వ వైభవమును చాటుచుండెను. కాంచీపురము విష్ణుకంచి, శివకంచియని రెండుభాగములుగా నున్నది విష్ణుకంచిలో స్వామి వరదరాజులు ఆయన భార్య లక్ష్మీదేవి. శివకంచిలో స్వామి ఏకామ్రనాథుడు ఆయన దేవేరి కామాక్షీదేవి. దశమినాటి రాత్రి ఎనిమిది గంటలకు మేము కంజీవరమేగు నప్పటికి ఏకామ్రేశ్వరుని యాలయములో గొప్ప యుత్సవము జరుగుచుండెను. వెంటనే యాస్వామి దర్శనము సేయనేగితిమి. వెలలేని యాభరణములతో నలంకృతులైన కామాక్షీ యేకామ్రనాథులు మాకక్కడ ప్రత్యక్షమైరి. ఆదివ్యమూర్తుల కన్నారగాంచి చేతులార నమస్కరించి మనసార సేవించి హృష్టచిత్తులమైతిమి. ఆదేవాలయమందే నాకొక మిత్రురాలు గన్పడెను. ఆమె పుట్టినిల్లా యూరని యెఱుగుదును గాని యామె నప్పుడు చూడగల్గుదునని మాత్రము తలంపలేదు. దైవికముగనే యట్టి భాగ్యము గలిగెను. ఆమె మమ్ము ప్రేమతో తన యింటికి

దోడ్కొని వెళ్లి సకల సౌకర్యముల గూర్చి సత్కరించెను. ఎఱుక పిడికెడు ధనమని సామ్యమందు రిదియే కాబోలునని యనుకొంటిని.

నాడు లేచి ప్రాతఃకృత్యములను దీర్చుకొని సర్వతీర్థమను పుష్కరిణిలో స్నానము గావించి కచ్ఛపేశ్వర యేకామ్రేశ్వర కామాక్షీ యాలయములకేగి ఆయాదేవతల దర్శించి ఆనాడూరేగవచ్చిన స్వాములందఱను దర్శించి రెండు గంటలకు విష్ణు కంచికి వెళ్లితిమి. మేము వెళ్లునప్పటికి వరదరాజస్వామివారికి తిరుమంజనము (స్నానము) జరుగుచుండెను. బిందెలతో కుమ్మరించెడు పాలధారలు శిరస్సునుండి ధణధణ పడుచుండ పాలలో మునిగియున్న స్వామిని దర్శించితిమి. అటనుండి అమ్మవారి యాలయము లోని కేగుచుండ నొకమూల కొందఱు జనులు గుంపులుగా కూడియుండుట మా కగుపించెను. అదియేదియో నరయ మేమును నటకేగి చూడ నచ్చట మిద్దెకు వెండి పైడి బల్లులు అంటించబడి యుండెను. ఆ బల్లులకు క్రిందుగా నొక నిచ్చెనపై నెక్కి చేతితో ముట్టిన వారు తలకొక యణాయును, క్రిందనుండియే యర్చకుడా బల్లులపైకి గుడ్డ నెగుర వేయ ఆగుడ్డ ముట్టిన వారొక యర్ధణాయును నీయవలెనట. ఆ బల్లులను తాకి వచ్చిన వారికి బల్లిపాటు దోషముండదట. ఆ వినోదమును రెండు నిమిషముల పాటు నిలువబడి చూచితినే గాని నేను అర్ధణాగాని అణాగాని వ్యయపరచుకొనలేదు. అటనుండి అమ్మ వారి ఆలయములోని కేగ ఆమెకును స్నానమే జరుగుచుండెను. అయ్యవారి స్నానము చూడవచ్చును గాని అమ్మ వారి స్నానము చూడరాదట! కాన అమ్మవారి దర్శనము మాకుకాలేదు. ఆనాడు యేకాదశి యగుటవలన నూరేగింపు నిమిత్తము మణి మయాభరణములతో నలంకరింపబడిన యుత్సవ విగ్రహముల కడనే స్వామిని దేవేరిని గూడ చక్కగా చూచుట కలిగినది.

వరదరాజస్వామివారి యాలయములో దర్శనీయమైన మండప మొకటియున్నది. ఆ మండపములోని ప్రతి స్తంభముపైనను భారత భాగవత రామాయణాది పౌరాణిక గాథలెల్ల బొమ్మలుగా చెక్కియున్నవి. నల్లరాతితో చెక్కబడిన యాప్రతిమలు సజీవము లన్లెంతయో కౌశలముగ నిర్మింపబడియున్నవి. పౌరాణికగాథలే గాక అశ్వారూఢులగు యోధులును, శత్రుమర్దనము సేయుచున్న రాజుల ప్రతిమలును అలనాటి యోధులయు, ప్రభులయు యాకృతులను స్పష్టీకరింపుచు నెంతయో నిపుణముగ నిర్మింపఁబడియున్నవి. ముష్కరులైన తురుష్కులు శిథిలపఱచిన విగ్రహములుగూడ కొన్ని యున్నవి. కాని అవి

అత్యల్పమని చెప్పవలెను. కాకతీయ ప్రతాపరుద్ర కృష్ణదేవరాయాది ఆంధ్ర రాజన్యులు, యవనసేనావాహిని దక్షిణ హిందూదేశమును చొరకుండ చేసిరి. ఆనాడాంధ్రులోడ్చిన రక్తమువలననే నేడు దక్షిణ హిందూదేశమందైన పురాతనకట్టడములను ఆలయములను జూచు భాగ్యము యావద్భారతీయులకు గల్గినది. దేవాలయములను మసీదులుగను హిందువులను మహమ్మదీయులుగను మార్చి ఉత్తర హిందూదేశ మంతెయు బీభత్సముగ జేసిన ముష్కరతురుష్కుల యుద్ధతినణచి దక్షిణ హిందూదేశము యవనహస్తగతము కాకుండ కాపాడిన మనయాంధ్ర వీరుల పరాక్రమాతిశయము సంస్తవనీయమైనది. ఆంధ్రులిందులకు గర్వించవలసినదే. కాంచీపురము చాలకాలము పల్లవరాజధానియై యుండుటచే పల్లవరాజులు కట్టించిన దేవాలయములు పెక్కులున్నవి. పల్లవరాజులు శివభక్తులు. కాన శివకంచి యందలి దేవాలయములన్నియు దాదాపుగా వారు కట్టించినవే. వరదరాజస్వామివారి ఆలయము కృష్ణదేవరాయలు కట్టించెనని యక్కడివారు చెప్పిరి కాని అది యెంతవఱకు నిజమో! మేము తరువాత చూచిన క్షేత్రము చిదంబరము. అచ్చటి స్వామి నటరాజు. ఆయనదేవేరి శివకామసుందరి. నటరాజ స్వామికి ఆర్ద్ర నక్షత్రమునకు గొప్ప యుత్సవము జగుగును. మేము వెళ్లునప్పటికి ఆర్ద్రదర్శనము రెండు దినములు మాత్రమే యుండెను. కాన పరిషజ్జనముచే పురము క్రిక్కిరిసి యుండెను. నటరాజస్వామి శ్రీమంతులగు నాటుకోటి సెట్లకు యిష్టదైవమగుటచే గాబోలు శ్రీమంతుడుగనే యున్నాడు. స్వామికి గల యాభరణములన్నియు రత్నాభరణములే. వాహనములన్నియు బంగారు వాహనములే. ఒక్క వాహనములేగాదు. దేవాలయపు వైకక్ష్యేమి, ధ్వజస్తంభ మేమి, అంతయు బంగారుమయము. నాడు వాన బాధ యధికముగా నున్నను జనసమ్మర్దముగా నున్నను నటరాజ స్వామిని బాగుగనే దర్శించితిమి. కాని చిదంబర రహస్యమును మాత్రము చూడలేదు. ఒక సాలగ్రామమునందు కర్పూర హారతిచేసి చూడ నటరాజస్వామి యగుపడునట. దానిని ఉత్సవము మూడుదినములు చూపరట కాన మేము చూడలేదు. అటనుండి కుంభకోణమున కేగితిమి. అచటి స్వామి కుంభేశ్వరుడు. ఆయన భార్య మంగళాంబ. చిదంబరములోనే కావేరి పాతుయగు కొల్లడమున్నది. కాన అచ్చటినుండియే పచ్చని పైరులు ఫలవృక్షములు చక్కగా కన్పడ జొచ్చినవి. దాని కంటె చక్కగా నున్నది కుంభకోణము. కుంభకోణము కావేరీతీరమగుటచే పచ్చని తోటల తోడను చక్కని జలప్రవాహముల తోడను శుభ్రజలప్రపూర్ణములగు పుష్కరిణులతోడను చూడ సొంపుగానున్నది. కుంభేశ్వరాలయమే గాక సారంగపాణి దండ

పాణి, రామస్వామి మున్నగు యితర దేవాలయములు గూడ చాలయున్నవి. అక్కడ నుండి తంజావూరు వెళ్లితిమి. తంజావూరు చారిత్రక ప్రసిద్ధమైన నగరము. చోళరాజులకు రాజధాని. అచ్చటి ప్రసిద్ధమైన బృహదీశ్వరాలయము చోళరాజులు కట్టించినదే. బృహదీశ్వరాలయపు గోపురమువంటి గోపురము మఱి యెచ్చటనులేదు. దాని నీడ భూమిపై పడదట. అది శిల్ప శాస్త్రజ్ఞుల నైపుణియని యచ్చటి వారందురు. ఆ గోపురపు ప్రశస్తిని విని విదేశీయులు గూడ దానిని చూడ వత్తురట. ఆ యాలయములోని నందిగూడ చాల యద్భుతముగా నున్నది. ఆదేవాలయపు గోపురము మీదను మండప స్తంభముల మీదనున్న ప్రతిమలు చిత్తరువులు ప్రాచీనుల శిల్పకళానిపుణతను చాటుచున్నవి. ఆదేవాలయమే గాక తంజావూరిలో చూడదగిన విశేషములు మఱికొన్ని యున్నవి. అందు ముఖ్యమైనవి పూర్వరాజుల కోటలు, రాజమందిరములు, వారి ఆయుధములు, వాహనములు, వారి చిత్తరువులు మున్నగునవి. వానినెల్ల మేము చూచితిమి. తిరుమలనాయుని దర్బారు మందిర మెంతయో రమణీయముగ నుండి నిన్ననేడు నిర్మించినట్లు క్రొంగ్రొత్తగ నున్నది. తిరుమలనాయుని శిలాప్రతిమగూడనందు గలదు. తిరుమలనాయుని చిత్తరువులే గాక మహారాష్ట్ర ప్రభువుల చిత్తరువు లనేక మందు గాంచితిమి. తంజావూరు మహారాష్ట్ర పాలన కెప్పుడు వశమైనదో జ్ఞాపకములేదు. ఆ విషయము తెలిసికొను నిమిత్తము చరిత్రను జదువ నుద్యమించుచున్నాను. ఇంతియే గాక తంజావూరు కోటలో మఱియొక చూడదగిన మందిరమున్నది. అది సరస్వతీమహల్ అను పేరుగల ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము. ఈ గ్రంథాలయమున అసంఖ్యాక తాళ పత్రి గ్రంథము లుండుటచే కవులకు, పండితులకు చారిత్రక పరిశోధకులకు నిది పెన్నిధిగానున్నది. అచ్చట కొందఱుద్యోగులుండి శిథిల గ్రంథములకు ప్రతులు వ్రాయుచున్నారు. మఱికొందఱేకాంతమున గూర్చుండి ప్రాచీన గ్రంథ శోధనము గావించుచున్నారు. వారు బహుశః గ్రంథ పరిశీలనకై గ్రామాంతరములనుండి వచ్చినవారై యుండనోపు. ఖిలములై జీర్ణములై పోయిన పూర్వరాజ చరిత్రములను కవి పండిత జీవితములను నెఱుకపరచుచు భారతీయులకు ముఖ్యముగా దక్షిణ హిందూదేశీయులకు నమూల్య ప్రయోజనము గలిగించుచున్నది. తంజావూరు పాలకులలో మన తెలుగువారు గూడ నుండుటచే ఆనాడు వారు వ్రాయించిన గ్రంథములు శాసనములు మున్నగునవి మన ఆంధ్రుల చరిత్రము నెఱుగుట కెక్కువగా దోడ్పడుచున్నవి. మిత్రమా! తంజావూరియందు మన ఆంధ్రులు చూచి సంతోషింపవలసిన విశేషములు పెక్కులున్నను దురదృష్టవశమున ఆనాడు వాన యధికముగా

నుండుటచే తనివితీర చూడజాలక పోతిమని చెల్లెలికి చింతిల్లుచున్నాను. అటనుండి మధురకు వెళ్లితిమి. మధుర ప్రాచీన నగరము. పాండ్యరాజులకు రాజధాని. నగరములోని మీనాక్షీదేవ్యాలయము సుప్రసిద్ధమైనది. అచ్చట దేవికే ప్రసిద్ధి యెక్కువ. కాని మీనాక్షి సుందరేశ్వరుని భార్య యగును. మీనాక్షీదేవ్యాలయము యొక చిన్న నగరమువలె నున్నది. ఆయాలయ పుణ్యక్షేత్రమున లేని వస్తువులేదు. పుష్పములు, పండ్లు, బొమ్మలు, పటములు, నగలు, వస్త్రములు, పాత్రములు, కిరాణములు మున్నగు సమస్తవస్తు దుకాణములందే యున్నవి. గుడ్డ తీసుకొనిన వారివారికి బొంబాయి పోవలె కొనవలసిన బాధ లేకుండ నచ్చటనున్న కుట్టు యంత్రములకు లెక్కలేదు. కాని అవి అన్నియు చేతి యంత్రములు. కాలితో త్రొక్కెడి కుట్టు యంత్రములేవియుగాని కానరా నున్నవి యేలనో. చెన్నరాజధానిలో చెన్నపురి తరువాత మధురయే పెద్ద పట్టణము కాన నీటి కొళాయీలు, విద్యుద్దీపములు, మోటారుకారులు మున్నగు నాగరికతా సూచ కరములచే పట్టణము కలకల లాడుచుండును. మీనాక్షీ ఆలయముగూడ విద్యుద్దీపములచే ధగధగమని ప్రకాశింపుచుండును. మీనాక్షీదేవికి గూడ సంపదకు కొదువలేదు. విలువైన రత్నాభరణములును పసిడివాహనములును బహుళముగనున్నవి. అయినను మూల విగ్రహము దర్పములేక సౌమ్యముగనుండును. శుక్రవారమునాటిరాత్రి యామె దర్శనమే దుర్లభము. కాని దేవికృపవల్ల మాకానాడు గూడ యనాయాసముగనే దర్శనమొసంగెను.

మధురలోగూడ నొక రాజమందిరమున్నది. అది ధర్మానాయుడు కట్టించినదట. తంజావూరిరాజైన తిరుమలనాయుడును మధురరాజైన ధర్మానాయుడును మామయల్లుం డ్రట. తంజావూరి రాజమందిరముకంటె వేయిరెట్లధిక శిల్పకళానిపుణతను ప్రకటింపు చున్నది మధురరాజమందిరము. పదునారడుగుల చుట్టుకొలతగల పెద్దపెద్ద స్తంభములు గల యారాజమందిరమందుగల శిల్పచాతుర్యమేమి చెప్పుదును? లతావితానములేమి? పుష్పమంజరులేమి? పక్షిజాతములేమి? మనుష్యప్రతిమలేమి? ప్రతిశిల్పము యథాతథముగ నచ్చొత్తినట్లుండెను. కల్యాణమండపమని యొకభాగముచూపిరి. అచ్చట పనితన మరయుటకు రెండుకన్నులు చాలవనిపించినది. దానికంటె రమణీయముగానున్నది శయ్యా మందిరాంతర్భాగము. ఆయద్భుత శిల్పకళాభవన మరయుటచే విస్మయమును సంతస మును గలుగుటయేగాక నధికముగు విషాదముగూడ గలిగినది. అట్టియద్భుత శిల్పకళా

సౌందర్యమునకునికిపట్టులైన యున్నతోన్నత గోపురప్రాకారహర్మ్యావళుల నిర్మించిన యాశిల్పులిప్పుడేరీ! ఆప్రభువులిప్పుడేరీ! ఎట్టికళలునశించినవి? ఎట్టికళాకుశలు రస్తమించినారు! ఎట్టిరాజ్యములు గూపడినవి! ఎట్టిరాజులు దివంగతులైనారు! భూతవృత్తాంతమును వర్తమానముతో బోల్చిచూచిన మానసము దుఃఖసంతప్తమై నేత్రము లశ్రుసంసిక్తము లగునుగదా; అలనాడు రాజదర్బారులచే పూజితంబైన యాశిల్పకళామందిర మిప్పుడు దొరతనమువారి కచ్చేరీలకాశ్రయమైయున్నది. ఆదివ్యమందిరము కట్టుటకు ముప్పదైదు వత్సరములు పట్టెనట! సొమ్మెంత వ్యయమయ్యెనో!

మధురలో మనస్త్రీలు మోజుపడి కొనుక్కొనెడి వంటసామానులు పిండివంటలచ్చి ముట్లు అత్యధికముగాగలవు. రంగులద్దకమునకిక మధురఖ్యాతి సుప్రసిద్ధమేగదా.

అచటినుండి రామేశ్వరమున కేగితిమి. రామేశ్వరమొక చిన్నగ్రామము. పాడి పంటల సౌభాగ్యమేమూలను గానరాదు. ఇసుకతిప్పలు, తాటిచెట్లు, మొగలిపొదలు, నాగజెముళ్లుగలిగి మాజన్మస్థానమగు వాగర్త యెట్లుండునో అదియు నట్లేయున్నది. దక్షిణ దేశపు దేవాలయము లన్నిటివలెనే రామేశ్వరపు ఆలయముగూడ గొప్పదేకాని పనితన మేమియు నంతగాగానరాదు. రామనాధపురపు రాజుల విగ్రహములును భక్తులవిగ్రహ ములును నచ్చటచ్చటనున్నవి.

ఒక్కదేవాలయపు ఆవరణయందే చతుర్వింశతి (24) తీర్థములున్నవి. అవిగాక ఊరివెలుపలగా లక్ష్మణతీర్థమను మఱియొకతీర్థమున్నది. రామేశ్వరము వెళ్లినవారు మొట్టమొదట లక్ష్మణతీర్థమందు స్నానముచేసి ప్రాయశ్చిత్తాదులు గావించుకొనిన వెను కనే యాత్రార్హతగలుగును. మేమును అట్లేచేసితిమి. తరువాత ధనుష్కోటికి వెళ్లితిమి. ధనుష్కోటికి రామేశ్వరమునుండి రైలుమీదవెళ్లవలెను. ధనుష్కోటివద్ద సముద్రుడు నిస్తరంగుడై యుండును. రత్నాకరమహోదధియను నుభయసాగర సంగమనిచెప్పుదురు. కాని ఆయుభయసాగర సంగమమెచ్చటనో నాకుకానరాలేదు. అక్కడ యాత్రికులెల్లరు నూతనవస్త్రధారులై స్నానముగావింతురు. అచ్చటస్నానముచేసివచ్చి రైలులోనెక్కి పియర్ స్థానమునకువెళ్లితిమి. అచ్చటవిదేశమునుండి వచ్చుయాత్రికులను స్టీమరులోనుండి రైలులో కెక్కించుకొనుటకు రైలువంతెనమీదుగా స్టీమరువద్దకేగును. సముద్రమచ్చట అగాధముగానున్నది. కాన తరంగము లుత్తుంగముగా నచ్చుచుండెను. మేమాప్రదేశమున కేగునప్పటికి దాదాపు పదునొకండు గంటలగుటచే నాపట్టపగటి యెండలో నీలమేఘ

శ్యామలకాంతులతో సాగరజలము రమణీయమై కన్పట్టుచుండెను. స్వచ్ఛములగు ధవళకాంతు లీనెడు ఫేనములతోగూడి యువ్వెత్తుగ దూకెడి యాతరంగము పోటుపాటులకు విస్మయ జనకముగనుండుటయేగాక భయంకరముగగూడ నుండెను. రైలునిలిచియుండుటచే మాకా సాగరభంగములను యోధులునడచినట్లు బారుబారులై చనుదెంచు ఫేనమాలికలను చూచుటకే సరిపోయెను. ఈలోపుగ తోలుపెట్టెలు, పరుపుచుట్టలు, కాఫీఫ్లాస్కులు, టిఫిన్ క్యారియరు మొదలగు నాగరికపు ప్రయాణవస్తువులతోను హ్యాట్లు, బూట్లు, సూట్లు, కంటియద్దములు చేతికట్టులు మున్నగు అలంకారములతోడను స్వదేశీయులగు నాగరికు లెందరో మాబండిలోనికెక్కిరి. అంత మాబండికదలెను.

ధనుష్కోటినుండి వచ్చినవెనుకనే యెవరైనను దేవాలయములో నభిషేకములు అర్చనలు మున్నగునవి చేయవలెను. మేమును అట్లేచేసితిమి. దక్షిణదేశపు దేవాలయము లన్నిటను పూజాపురస్కారము లన్నిటికిని టిక్కెట్లు. టిక్కెట్టులేక రైలులోనికెట్లెక్క నీయరో, నాటకమునకెట్లు రానీయరో, ప్రదర్శనములనెట్లు చూడనీయరో, అట్లే టిక్కెట్టు లేక దేవాలయము లోనికిగూడ రానీయరు. సమస్తహైందవులును సాధారణముగా దర్శించిపూజించి పరితృప్తినందవలసిన దేవాలయములు ఆధునిక నాగరికమర్యాదలనుబట్టి ప్రదర్శనములవంటి శాలలుగా మారిపోయినవి. అనగా సంపత్తిగలవారికే స్వామిదర్శన మన్నమాట. రుసుములేక స్వామి నిర్మాల్యపు పూరేకైన లభింపదు. స్వామిదర్శనము కేవల మీటిక్కెట్లతోడనేకాదు. లంచపంచము లిచ్చుటకుగూడ పాల్పడవలెను. ఇన్నిపాట్లుపడిన మీదట స్వామిదర్శనము. దక్షిణదేశముననేగాని యిట్టియనుచితపద్ధతులు ఉత్తర హిందూస్థానమున లేవనిచెప్పుదురు. సుప్రసిద్ధమైన కాశీక్షేత్రమున విశ్వేశ్వరుని ప్రతిమాను స్వయముగాతాకి పూజింపవచ్చునట. దక్షిణదేశ దేవాలయములయందు పైవిధముగా నిర్బంధములును ప్రజాపీడయు పేదలనిరసనమును మిక్కుటముగానుండుటచే స్వామిసాన్నిధ్య మున జనులకు నిజముగా కలుగవలసిన ఆస్తిక్యభావము శూన్యమగుచున్నది. పైపెచ్చు అచ్చటి అక్రమములు పీడలు దౌర్జన్యములు చూచుటచే మనస్సునందొక విధమగుకల్లోల మును, అసహ్యతాభావమునుగూడ గలుగుచున్నది. సగుణోపాసన పామరజనులు తరించుటకై యవసరమని కొందఱువాదింతురు. అదినిజమేనని యొకవిధముగా నంగీ కరించినను దేవతామందిరములలో నుండవలసినంత పవిత్రతయు, శాంతిశ్రద్ధలును లేమిం జేసి నేటి హిందూదేవాలయములు ఏకొలదినుంది జనులజీవనోపాధికో సాధనములగు

చున్నవే కాని జనసముదాయమునకు జ్ఞానభక్తివైరాగ్యములను ప్రసాదించు పవిత్రస్థానములుగా నుండుటలేదు. దక్షిణదేశపు దేవాలయములకు పూర్వరాజదత్తసంపత్తియే యధికముగాగలదు. మఱియు పూర్వమువలె నడువవలసిన బాధలేకుండా యేర్పడిన నేటి ప్రయాణ సౌకర్యములవలనగూడ పూర్వముకంటె యాత్రికులనేక రెట్లధికముగా వచ్చుచున్నారు. ఇందువలనగూడ దేవస్థానములరాబడి యధికమైనది. కాని ఘోరమైన టిక్కెట్లవిధానము దేవస్థానములందు తొలగించిన బాగుగానుండును. స్వామికర్పించెడు దక్షిణలు జనులభక్తిశ్రద్ధలనుబట్టియు పేదభాగ్యములనుబట్టియు యథాశక్తిగ నుండవలెను గాని నిర్బంధముగా నుండుటయనుచితము. ఇందువలన పేదలెక్కువ శ్రమపడుచున్నారు. దాదాపొక సంవత్సరముక్రిందట నేనొక ప్రసిద్ధదేవాలయమున కేగితిని. అచ్చటికి వ్యాధిచే బాధపడుచున్న యొక పేదరాలేతెంచెను. అణా మూడుపైసలిచ్చినగాని యచ్చట కర్పూరహారతి సేయరని యామె తెలిసికొని యాడబ్బులను కొబ్బరికాయయు కర్పూరమును దీసికొని దేవాలయమునకేతెంచెను. కాని అణాటిక్కెట్టు కొనుక్కొనినగాని లోనికిబోవుటకు వలనుపడదని ద్వారరక్షకు లామెను లోనికిబోనీయక నడ్డగించిరి. ఆమె పేదరాలనని వారినెన్నియోవిధముల ప్రార్థించెను. కాని వారు విడువలేదు. కాన ఆమె తనవద్దడబ్బులలోని యణా పెట్టి టిక్కెట్టుకొనుక్కొని లోనికేతెంచెను. అణావ్యయమై పోవుటచే నామెవద్ద కానీమాత్రమేయుండెను. కాన ఆకానితో కర్పూరహారతిచేయుటకు అర్చకుడు నిరాకరించెను. "పేదరాలనునాయనా! అణా ద్వారం వద్ద తీసుకున్నారునాయనా! నాలుగేండ్లనుంచీ రోగంతో తీసుకుంటూ ఈస్వామిదర్శనంచేస్తే రోగంపోతుందని గంపెడాశతో ఎంతోదూరాన్నుంచి వచ్చానునాయనా! ఈకానిడబ్బుతీసుకొని కొంచెం కర్పూరహారతిచెయ్యిస్వామీ, పేదరాలికిచేస్తే నీకు పుణ్యంఉంటుందిస్వామీ" అనియాస్త్రీ యర్చకుని యెంతయోదీనముగ వేడుకొనెను. "డబ్బులేకుండా యీగుళ్లోకి యెందుకువచ్చావు. ఊరికే కర్పూరహారతి చేయడానికి నీవుపెట్టిననౌకరు లెవ్వరూలేరు. ఛో!ఛో! అని ఆ యర్చకుడు రూక్షవీక్షణుడై కఠినముగాపలికెను. వారు అర్చకులుగా నుండకున్నచో యింతకంటె దయాశీలురుగా నుండెడివారేమో! ఆసందర్భమును పరికింపుచు కొంతసేపు నేనచటనే నిలువబడితిని. ఆయర్చకుని మనస్సుకరుగలేదు. ఆకర్పూరహారతిచేయక నాస్త్రీకి సంతుష్టి కలుగునట్లుగలేదు. అప్పుడాయర్చకునితో "ఆడబ్బులునేనిస్తాను. ఆమెకు కర్పూరహారతి చేయండి" అనినేనంటిని. ఆయర్చకునకు నామీదగూడ కోపమువచ్చెను. "మీకెందుకు మీరువెళ్లండి నేను చేసేదిలేదు." అనితీవ్రముగా బలికెను. "ఎందుకుచేయరు, మీకు కావ

లచినది డబ్బులేగదా ఆడబ్బులెవరిసైతేమీ కేమి చేయండి" అని నేనంటిని. అప్పుడువిప్రవర చప్పునచల్లారెను. ఐదుకానులకొరకు పేదరాలిపై తానుచేసిన కార్పణ్యమునకు అతనికో వతనికే సిగ్గుగలిగినది. అప్పుడాతడు నెమ్మదైనపలుకులతో 'నేనేనోకేస్తా. పొమ్ము అమ్మణ్ణి గుళ్లోకివెళ్లండి అమ్మా' అనెను. ఇంక నెందులకని నేనీవలకువచ్చి వేసితిని. ఆవలనేను అమ్మణ్ణి గుడియందుండగా కర్పూరహారతిచేసినాడని ఆస్త్రీవచ్చి నాతోచెప్పెను. ఈవిధము దేవతలు నేడు దౌర్జన్యపరులగు మానవులచేతిలో జిక్కి భక్తజనసులభులు గాకున్నారు. నేడు స్వామిదర్శనము కావలెనన్నచో నెబ్జిటోపీలో, యూనిఫారంస్రెస్సులో కావలెను. లేదా అయిశ్వర్య సమృద్ధియైన నుండవలెను. ఈరెండును లేనివారిగతి దైవకాలి గతియే. రామేశ్వరమునుండి ప్రతివారును తప్పక తెచ్చుకొనునవి గవ్వలు. రామేశ్వరము నందుతప్ప మరెచ్చటను గవ్వలు శంఖములు దొరకవు. అచ్చటగూడ గవ్వలంగళ్లైదాకు కంటె నెక్కువగలేవు. ఆయంగళ్లచుట్టును వివిధదేశపుస్త్రీలెట్లు మూగియుందురో ఆ చోద్యమునుచూచి తీరవలెను. ఆడవారి బేరమగుటచేతను, ఏవిధముగానైనను తీసికొనక మానరను విశ్వాసముచేతను గవ్వలతిప్రియముగ నమ్ముదురు. ఎనిమిది యాటగవ్వల తుదిధర నాలుగణాలు. అధిక వెలగానున్నను అయిదులు, పదులు, రూకలుపెట్టి ప్రతిస్త్రీయును గవ్వలుతీసికొని వెళ్లుచునేయుండును. రామేశ్వరము వెళ్లెదమనిన గవ్వలు తెచ్చిపెట్టుడనుటయు, వెళ్లివచ్చితిమనిన గవ్వలు తెచ్చినారాయని యడుగుటయు మనదేశమందు పరిపాటియైనమాట, కాని యీగవ్వలవలనగల ప్రయోజనమేమి? జూదమువంటి ఆటను ఆడి విలువలేనికాలమును వ్యర్థముచేసికొనుటయేగదా. నేడుస్త్రీలు దేశహితార్థముచేయ వలసినకార్యములు నేర్చుకొనవలసిన విద్యలు లలితకళలు యెన్నియోయుండ యీగవ్వ లాటలాడ నెవ్వరిచ్చగింతురు? నాకు దానిపై బొత్తిగా మోజులేదు. అయినను యాత్రా చిహ్నముగా కొన్నిగవ్వలు కొనక నాకును తప్పినదికాదు. తాటియాకులతో సొగసుగా నల్లబడిన బుట్టలు పెట్టెలుగూడ నచ్చట విరివిగాదొరకును. గవ్వలు పటములుకొనిన వారా బుట్టలనుగూడకొని వాని నాబుట్టలలోపెట్టుకొని యిండ్లకు తెచ్చుకొందురు.

రామేశ్వరమునందు గంధమాదనపర్వతమను పేరుతో నొకయిసుక తిప్పయున్నది. దానిపై రాతితో మలిచిన రామపాదచిహ్నములు గల చిన్న ఆలయమొకటిగలదు. దానిపైకెక్కినచో నడుమ బిళ్లవలె రామేశ్వరపు లంకయు దానిచుట్టును భూపురశ్రీ మణితాల్చిన యింద్రనీలముల మొలనూలు వగిది సాగరమును మనోహరముగా గన్ప

ట్టును. అదిచూడదగిన దృశ్యమే. అటనుండి మేము క్రిందికి వచ్చుచుండ ఎనుబదేండ్లు దాటిన వృద్ధురాలును నామెతో మఱియిద్దఱును మాకెదురైరి. ఆవృద్ధురాలు మిక్కిలి దుర్బలముగానుండి కన్నులు తేలిపోవుచుండ మిక్కిలి ఆయాసపడుచు నడుచుచుండెను. ఆకృతులనుబట్టి వారు ఉత్తర హిందూస్థానము వారని తెలియుచున్నను ఏప్రాంతమువారో తెలిసికొనవలయునని నెడి కుతూహలముతో "మీ దే దేశ"మంటిని. "నేపాళదేశ"మని యా వృద్ధురాలనెను. నాకు మహాశ్చర్యమయ్యెను. ఎక్కడి శీతనగము! ఎక్కడిసేతువు! నిండు వార్ధక్యమున నావృద్ధురాలి నావిధముగా నీడ్చుకొని వచ్చిన మతవిశ్వాసము పుణ్య కాంక్ష అత్యద్భుతముగదా! ఆకృతులలో భేదమున్నను, ఆచారములలో మార్పు లున్నను, భాషలలో భిన్నత్వమున్నను, వేషములోవ్యత్యాసమున్నను, ఆసేతుశీతనగ పర్యంతముగల యావద్భారతీయుల నైక్యపఱచుచున్నదేది! మత సూత్రమేగదా? మతము మానవునకు ప్రాణముకంటె నుత్కృష్టమైనది.

కల్పలతా! వ్రాయవలసిన విషయములు పెక్కులున్నను లేఖా విస్తరభీతి లేఖినిని వెనుకకీడ్చుచున్నది. ఇప్పటికే లేఖ పరిమితిని మించినది. కానయింకొక్క మాటతో ముగించెదను. మిత్రమా! మేమీ విధముగా హిందూదేశపు సుప్రసిద్ధక్షేత్రములలో నొక్కటైన రామేశ్వర క్షేత్రమందు ద్వాదశదినములు గడపి పర్వతవర్ధనీ రామలింగేశ్వరుల పలుమాఱు సేవించి అనంతపద్మనాభస్వామిని దర్శింపకుతూహలము గలుగుటచే నచ్చటికేగుటకై రామేశ్వరమునుండి మధురకువచ్చి అక్కడనుండి త్రివేండ్రము వెళ్లు బండినెక్కితిమి. త్రివేండ్రమువెళ్లుచు మార్గ మధ్యమున మేముచూచిన మొదటిక్షేత్రము తెంకాశీకి సమీపముననున్న కుర్తాళం. ప్రకృతి శోభావిభాసితంబై నేత్రపర్వంబైన యార మణీయ ప్రదేశమును గూర్చిముందువ్రాసెదను.

మిత్రురాలు

శారద.

# భిక్షువు

కొచ్చర్లకోట కామేశ్వరరావుగారు

బలము సృక్కించి, చిత్తమ్ముఁ గలఁచివేయు
నీ దురంతదారిద్ర్యమ్ము కెంతకాల
మీ విధమ్మున పీడించునేమొ తెలియఁ
జాల నక్కట!
ఇదియేమి కాలగుణమొ!
భాగ్యమెల్ల నశింప విభావరులను
శాంతియనునది లేక నేకాంతమతిని
ఏడ్చినా నెలుంగెత్తి నా యేడ్పు నెవ్వ
రాలకింతురు?
నన్ను విహాయసమున
జాలిఁగన్గొని మెలమెల్లఁ దూలిపోవు
తారకాసముదయమొండె దక్క——!

* *

"భోజ్యమే లేక శుష్కించిపోయి వేఁగు
ఆర్తుఁడను! రక్షణ మొసంగు" డనుచు నేను
వీధి వీధులఁ బనివడి వేఁడుకొంటి!
కాని నిర్మలిప్త శుభరేఖ నానియుంటి!

* * *

వీఁక నీల్గితి! విస్రబ్ధమెడలె సుఖము!
ఎంతగా విలపించిన నేమి ఫలము?
దుస్తరానంతకల్లోల దుఃఖవీచి
మునిఁగి మరణించి
పరలోకమునకుఁ బోవ

విధిగ జనియించునేమొ నాహృదిని శాంతి!

*  *

శాంతి నొసఁగని యిట్టి

శ్మశానజగతి

నిలుపుటెట్టుల జీవాలు?

నిలుపలేను!

విముఖతన్ జెంది ప్రాణాలు విడుతమన్న!

— విడువలేను!

*  *

తొంటి నిర్విషబాంధవ్య ధృతినడఁచి
ప్రాణములకంటెఁ దీపియా పత్నిరోసి

సుతులబాసి

*  *

పోవఁజాలదీ యసుఋ!

పుంశ్చలట్లు

నటన లొనరించి యున్మత్తు నటులఁ జేయు!

*  *

ఉత్సవంబేల? నుత్సర్గ మొందనేల?
జీవమా! తఱలుము దయచేసి శాంతి!

*  *

ఏల నేడ్చింతు వీక్షుద్ర బేలభిక్షు?
నుదరపోషణోదగ్ర వాంఛోపలబ్ధి.

# స్త్రీలు—ఆంధ్రనాటక రంగము

పరుచూరు సుందర వరదులుగారు

నాటకరంగమున స్త్రీలు పాత్రములను గైకొనుటకు కొందఱాక్షేపణము చెప్పె దరుగాని నాటకకళావిర్భావమున కది మిక్కిలి యావశ్యకము. మానినులు నాటకశాల నెక్కుటకావశ్యకము, హేతువు, రెండునుగూడ గలవు. ఇదిపూర్వాచార విరుద్ధముకాదు. ఇతరభారతీయ నాటకరంగములన్నిఁటికన్న పాత్రధారణ విషయమున నాంధ్రనాటక రంగమే వెనుకఁబడియున్నది (?) స్త్రీ పాత్ర నిర్వహణము ఆంధ్రనటకుల కొక విధముగ దుస్తరమగుచున్నదనిగూడ నుడువనగును. ఆంధ్రులలో పురుషుల లక్షణ ములు ప్రత్యేకింపబడినట్లు కానుపించుచుండును. ఆంధ్రయువకులు సహజముగ సన్న గను—పొడవుగను—అంగవైశాల్య సంయుక్తముగను—నుండి స్త్రీ లక్షణములకు దూరులైయున్నవారు. కాన ఆంధ్రులు స్త్రీ పాత్ర నిర్వహణమున మొట్టమొదట రూపప్రచురణముననే భంగపాటొందు చున్నారు

లలిత కళలు రెండువిధములు: అవి దృశ్యములు—శ్రావ్యములు. నాటకకళ వీఁటి రెంటియొక్క మిళితము. శ్రావ్యభాగమునకంటె దృశ్యభాగ మత్యంత ముఖ్యతమమైన నది. అట్టిదృశ్యభాగముననే సంపూర్ణ సంతృప్తి నొసఁగ జాలనప్పుడు రెండవ ఖండము నెంత వైదుష్యముతోఁ బ్రదర్శించినను ప్రేక్షకుల మెప్పుబడయ జాలరు. ఆంధ్రనట కులలోఁ బురుషులు స్త్రీ పాత్రముల ధరించి ప్రశంసాపాత్రముగ సవిమర్శకముగ బ్రద ర్శించిన వారిని వ్రేళ్లమీఁద లెక్కింపవచ్చును. రూపప్రకటన మొక్కటే గాక భావ ప్రకటనముగూడ బురుషునికి కష్టమే. స్త్రీ సహజకోమలగాత్రి, మృదుమధురవచోనైపుణి; సరళమనోనివృత్తి. లజ్జ, శృంగారేచ్ఛ, అవ్యాజప్రేమ, మున్నగునవి ఉత్తమస్త్రీకి సామాన్య లక్షణములు. వారి మనములెంతయు నిశిత కో[illegible] పురుషుని స్వభావము తల్లక్షణ వ్యతిరిక్తము. అట్టిచో బురుషుడు స్త్రీ పాత్రమును నిర్వహించ గలుగుటలోని కష్టము నాటక కళారసాస్వాదుల కందఱికిని సువ్యక్తము. స్త్రీనైజమునకును పురుషస్వభావ

మునకును వ్యతిరిక్తాంతరాయము నాయికాపాత్ర నిర్వహణములోఁ బురుషునికడ్డువడు చున్నది. శృంగార భావములను పురుషులొక విధముగ జూపుదురు. స్త్రీల గంభీర హృదయములు పురుషునికి సాధారణముగ బోధపడవు; అందువలన వారిపాత్ర స్వభావ చేష్టలను నటుఁడు ప్రేక్షకులయెదుటఁ బ్రదర్శింపజాలడు. ఇందులకింతవరకు ప్రచురితములై యున్న నాటక విమర్శనలే నిదర్శనము.

ఒక్కటి యించుక పరిశీలింతము. శకుంతలపాత్ర నొక యువకుడు చక్కగ నిర్వ హించినట్లు చెప్పబడెను. శకుంతల ముగ్ధయగు నాయిక. నాయికలందరిలో శకుంతల వింతయగు ప్రకృతిగలది. రోషరుధిరప్రవాహాయుతమగు రాచప్రకృతి—పట్టుదల, గాంభీర్యము, మున్నగు రాజర్షి లక్షణములు ఆమెయందిమిడియున్నవి. భిన్నదేశ భిన్న ప్రకృతులు గలిగిన తల్లిదండ్రులు జన్మకారకు లిద్దఱుగూడ నుత్తమ కళా విలాసలోలురు కాని యీయమ భిన్నవాతావరణమునందుఁ బెరింగినది. నిరంతర వేదఘోష, మున్యా శ్రమ శాంత ప్రకృతి, యివియన్నియు నీమె నొక విచిత్ర వ్యక్తిగ జేసినవి. ఈసాధ్వీ మతల్లి భూమికను గైకొని రసపోషణము గావించుకొనుచు పాత్రౌచిత్యమును రక్షించు టకు సామాన్య వైదుష్యముచాలదు. యువకుడగు ఆపాత్రధారికడ స్త్రీలక్షణము లొప్పుల కుప్పలుగనున్నవి. ముగ్ధత్వము చాలినంత యున్నది. అతని పాత్ర నిర్వహణమున కెంతయు నబ్బురపడి చూచుచుండువారు చాలమంది కలరుకాని భావప్రకటన విషయములో శృంగార రసప్రకటనములో స్త్రీలోకభిన్నచర్యయే వారియందును గాన్పించినది. శకుంతలా దుష్యంతుల ప్రథమ సమాగమమునందును దుష్యంతుఁ డాశ్రమమువీడి చనునప్పుడు శకుంతల దర్భ తనపాదమును గ్రుచ్చుకొనినదను మిషమీద నిలిచి వెనుదిరిగి నాయకుని సౌందర్య రసమును గ్రోలుసందర్భమునను భావప్రకటనములఁ జేయుట మిక్కిలికష్టము. మొదటి సందర్భమున ప్రేక్షకులకు జూపుట యొకింత సౌలభ్యమగు నేమోకాని రెండవ సందర్భము మిగుల గంభీర భావయుత మైనది. ఇచ్చట కాలికి దర్భ గ్రుచ్చుకొనినట్లును అభినయము చేయుటయేగాక ఆచేష్టలన్నియు రాజును జూచుటకు కల్పింపఁబడిన వ్యాజ ములని ప్రేక్షకులకుఁ దనయభినయముల వలననే బోధపడునట్లునటింపవలయును. ఇది ~~యభినయములోని యభినయము~~. ఇందులకు విపుల భావరచనాశక్తియు, ఆంగికాభినయ వైదుష్యమును మిక్కిలియవసరము. అందుతోఁబాటు స్త్రీలక్షణములుగూడ నవసరము. స్త్రీపాత్రమును స్త్రీలు నిర్వహించుటలోను, పురుషులు నిర్వహించుటలోను భేదము

గలదు. ఇట్టిభేదమంతరించి నిజమగు కళాస్వరూపమును ఆంధ్రులు గాంచవలయునన్న స్త్రీలు నాయికా పాత్రములను ధరించుటకంటె నితరమార్గములు లేవు. "రోషనార" ప్రదర్శనమునందుగూడ నిట్టి కష్టము లనేకములు గోచరించుచున్నయవి. అష్టావధ విద్యాప్రవీణయగు జహ్వారీభాయి పాత్రమును నిర్వహించుటలో ఒకరిద్దరు పేర్గాంచి యున్నను వారి ప్రదర్శనములో నామెకుండవలసిన స్త్రీసహజవ్యక్తిత్వము బయలుపడ కున్నది. నిపుణతతో నాయికాపాత్రల ధరించి మెప్పించగల యువకులు కొందరున్నను యీయల్పసంఖ్యాకులు విశాల ఆంధ్రనాటక భావిరంగమున కెంతవరకు వన్నె దేగలరను విషయమాలోచనీయము.

స్త్రీలకు నాట్యమొక భూషణముగ నాదికాలమునుండి భావింపఁబడుచుండెనట్లు ఆధారములుగలవు. మహాభారతకాలములో అనగా నించుమించు క్రీస్తుకుపూర్వ మిరువదవ శతాబ్దమునాఁటికి రాజకుమారికలు నాట్యవిద్యయం దారితేఱినవారుగనుండి రనుట కాధారములుగలవు. విరాటనగరాధిపతి యనుంగు పుత్రికయైన ఉత్తర బృహన్నల వేషధారియగు నర్జునునియొద్ద నాట్యకళ నభ్యసించుచుండినట్లు భారతమునఁగలదు. ఈయాధారమునుబట్టి యప్పటి నాట్యకళా స్వరూపము నొకించుక తెలిసికొనుట కవకాశ మేర్పడుచున్నది. ఆకాలములో నాట్యకళాపరిషత్తు లుండినవనియు రాజకుమారికలా పరిషత్తులకుపోవుట కిష్టపడనందుచే నింటివద్దనే యుపాధ్యాయుల నేర్పఱచికొని కళాభ్యాసము గావించుచుండిరనియు నూహింపవీలగుచున్నది. చరిత్రకాలమందుగూడ నిట్టినిదర్శనములు కొన్నిగలవు. నాంది ప్రస్తావన మనవారువ్రాయుచుండు తెరఁగే స్త్రీలు నాటకకళాప్రత్యక్షమున కాదికాలమునుండి తోడ్పడుచుండిరను యుదంతమును స్థిరీకరింపగలదు. స్త్రీలు యితరులచే జూడబడకూడదను పూర్వసిద్ధాంత మీదినములలో గమనించువారు కాకున్నను ఆసిద్ధాంతమునకు మినహాయింపునుగూడ పూర్వులే నిర్వచించియున్నారు. శ్రీరామచంద్రమూర్తి "అంతఃపురకాంతలను, వేడుకలందును, శుభకార్యములయందును, విషాదసమయములందును, నందఱు స్వేచ్ఛగజూడవచ్చును" అనినుడివియున్నాఁడు. నాటకప్రదర్శనమొక వేడుకగాన నిట్టిసందర్భములందు స్త్రీలు రంగస్థలము నలంకరించుట ధర్మవిరుద్ధము కాజాలదు.

ఇఁక ప్రస్తుతకాలములోఁ బ్రపంచమునఁబుట్టు ప్రతివ్యక్తియు నేదో వ్యాపార మభిలషించుచుండుటచే నాటక కళోపాసనము స్త్రీలకు తగిన పనియని తలఁపఁబడు చున్నది. స్త్రీలు రంగమును ప్రకాశించినచో నవినీతి ప్రబలమగునని తలఁచుట కెట్టి యవ

కాలములును లేవని విదేశ, స్వదేశ, నాటకరంగముల నొకింత సేపు సింహావలోకన మొనర్చి నచో తేటపడగలదు. విద్యావతులగు యువతులు కళను కళాభివృద్ధికి యారాధింప వలయునని సిద్ధాంతముతో నాటకరంగమును ప్రవేశింపవలయును. విద్యావంతులు నాటకరంగ మలంకరించిననే గాని నాటకకళ సర్వతోముఖ వికాసమునంద జాలదు.

ప్యారిసు నగరమందలి నాట్య కళాపరిషత్తులోఁ ప్రతివత్సరమును వేలకొలఁది నాట్యకత్తెలు ప్రత్యేక శిక్షనుబడసి ఫ్రెంచి నాటకరంగము నుద్ధరించుచున్నారు. ఇంగ్లండు, అమెరికా దేశములందు గూడ నీకళ దినదిన మభివృద్ధిని గాంచుచున్నది. నాయికా పాత్రములను పురుషులు గైకొనవలసిన యావశ్యకత వారికి లేదు. నాటకములందు పాల్గొనుచుండు నా పాశ్చాత్య వనితలు గౌరవ కుటుంబములకు జెంది గౌరవ జీవన మొనర్చుచున్నారు.

ఆంధ్రనాటక రంగమునందు సూత్రమును ధైర్యముతోఁ బ్రవేశపెట్టిన శ్రీయుత బళ్లారి రాఘవాచార్య దంపతు లెంతయు ప్రశంసింపఁదగినవారు. శ్రీయుత రాఘవా చారిగా రిటీవల విజయవాడ పురమునందు "చాచా" ప్రదర్శనమునందు తమ సతీమణి, పుత్రిక మున్నగు నువిదల సాయమునుగొని ఆంధ్రవనితలకు మార్గదర్శకులైరి. కృష్ణా మండల న్యాయాధి కారులగు శ్రీయుతులు రామారావుగారి పుత్రిక శ్రీమతి లలితాంగి కన్యగారు నాటకకళను తమ యభిమాన కళగాగైకొనిరి. గతవత్సరము బెంగుళూరునందు శ్రీరాఘవాచారి దంపతుల ప్రదర్శనమును వీక్షించిన శ్రీమహాత్మాగాంధిగారు స్త్రీలు నాటక రంగములందు పాల్గొనుట తప్పనిసరియని హేతుపూర్వకముగ నిరూపించియున్నారు. ప్రోత్సాహ కరమగు ప్రత్యక్ష ప్రమాణములు మనకన్నులయెదుట నెన్నియేని జరుగు చున్నవి. కావ సందియము లేక నావశ్యకతయు, మరొకవంక హేతు పూర్వక సమర్థన మ్మును అండగా గలిగిన యీ యావశ్యక కర్తవ్యమును ఆంధ్రవనితామతల్లులు నెరవేర్చి, ఆంధ్రనాటకరంగ భావిభాగ్యోదయమునకు తోడ్పడుదురు గాఁత

# శబరి

సాహిత్యసరస్వతి వావిలాల గోపాలకృష్ణయ్యగారు

ప్రార్థన

నల్లనివాఁడు పద్మనయనంబులవాఁడు, మహాశుగంబులున్
విల్లునుదాల్చువాఁడు, గడువిప్పగు వక్షమువాఁడు మేలు పైఁ
జల్లెడువాఁడు, నిక్కినభుజంబులవాఁడు, యశంబుదిక్కులన్
జల్లెడువాఁడు, నైన రఘుసత్తముఁ డిచ్చుత మాకభీష్టముల్.

—భాగవతము.

## రంగము ౧

[శబరి యెఱుకులకులమున జన్మించిన యమాయకపు సుజన్మ. శబరి రాజమర్యాదలుగాని, తదితరగౌరవములుగాని యొనరించువిధము తెలియఁగదు. శబరి బోయపిల్లవాండ్రు, పల్లెవాండ్రు సాధారణముగ నరణ్యమునఁజేయు మర్యాదలకన్న నుపచారములకన్న నెక్కుడేమియు నెఱుఁగదు. కాని, శబరికిఁగొలదిగ, బ్రజ్ఞానముమాత్రము గలదు. మతంగాది మహామునుల కుపచారంబొనరించి వారి యాదరణానుగ్రహములకుఁ బాత్రురాలాయెను. వారీ శబరి సుజన్మురాలనియు, భవపాశనాశము బొందఁగలదనియుఁ దమదివ్యదృష్టిఁ బరికించిరి. తామేమియు నీమె కధికవిషయములను బోధించకైరి. శ్రీరామచంద్రాగమనము మాత్రమెఱుక బఱచిరి. శ్రీరామచంద్రమూర్తి పిత్రాజ్ఞాపరిపాలనార్థమై సీతాలక్ష్మణసహితుఁడై యేతెంచుననిరి. భార్యావియోగము శ్రీరామునకు సంభవించుననిరి. సీతాన్వేషణార్థమేతెంచుచు దారిలో శ్రీరామసౌమిత్రులు కబంధుని వధింతురనిరి. కబంధువధానంతరము శ్రీరామసౌమిత్రులీ పంపాతీరమున కేతెంతురనిరి. అప్పుడు వారిని గౌరవింపుమనిరి. వారివలన శబరి జన్మసాఫల్యమును బొందుననిరి. అటుల శబరి కుపదేశించి మతంగాదిమునిపుంగవులు యదేచ్ఛఁజనిరి. తదాది శబరి శ్రీరామచంద్రదర్శనార్థియై, తదేకధ్యాననిమగ్నయై యసీచ్యాభిముఖియై శ్రీరామచంద్ర సౌమిత్రులరాకకై యెదురుఁజూచుచుండెను—శబరి నివాసము పంపాసరస్తీరారామవిహారమున నొకకుటీరమున—మతంగాశ్రమమున— శబరి కూర్చుండియుండెను. శబరి ప్రాయమెనుబదివర్షములుగ నుండును. నెరసిన తలవెంట్రుకలు పూసలపేర్లు మెడనిండాయుండును. అది ప్రాతఃకాల సంధ్యాసమయము.]

## శబరి

"శ్రీరఘురామ! చారుతులసీదళధామ! శమక్షమాది శృం
గార గుణాభిరామ! త్రిజగన్నుతశౌర్యరమాలలామ! దు
ర్వారకబంధరాక్షస విరామ! జగజ్జనకల్మషార్ణవో
త్తారకనామ! భవ్యగుణ! దాశరథీ! కరుణాపయోనిధీ!"

— గోపన.

రామా! నిత్యసత్యధామా! దుష్టశాత్రవ విరామా! జగదభివృద్ధినామక రాకా నిశాకరసోమా! శ్రీరమాకరగ్రహణమానసోల్లాసితకామా!

గురుజను లెంతయో మిగుల గూరిమితోడుతఁ జెప్పియుండిరో
సరసిజపత్ర! నీవిచటఁజాలక కాలమునుండి సౌఖ్యతఁ
వరలుచునుంటివం చిటకు వచ్చెద వంచును, నేను నీకుగా
తెరవులఁగాచి వేచితిని దీర్పుము నాదగు కోర్కెలన్.

దేవా! రామా! నీవరుదెంతువని యస్మద్గురువర్యు లానతిచ్చినది మొదలు నామనం బెంతగ సంతససాగరమున లీనమాయెనో నేనెఱుఁగ జాలకుంటిని! జయ సీతారమణా!

"కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథువర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁజూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికిమ్రొక్కు శిరము శిరము
విష్ణునాకర్ణించు వీనులు వీనులు
మధువైరిఁదవిలిన మనము మనము
భగవంతువలగొను పదములు పదములు
పురుషోత్తమునిమీది బుద్ధి బుద్ధి
దేవదేవుని జింతించు దినము దినము
చక్రహస్తుని బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁజెప్పెడి గురుఁడు గురుఁడు
ధరణి హరిఁజేరుమనియెడి తండ్రి తండ్రి!"

— భాగవతము

జగద్రక్షాదక్షా! శ్రీరామమూర్తిని-ఆర్తత్రాణపరాయణుఁడగు శ్రీరామమూర్తిని-అనంతకోటి బ్రహ్మాండ నాయకుండైన శ్రీరామమూర్తిని-దేవదేవాది దేవసంపూజిత పాదపద్ముఁడగు శ్రీరామమూర్తిని-చరాచరవస్తురూపకుఁడైన శ్రీరామమూర్తిని-సృష్టిస్థితి

లయకారణ భూతుఁడగు శ్రీరామమూర్తిని-ఆశ్రితజనకల్పభూజంబగు శ్రీరామమూర్తిని-దురదృష్టాదృష్టదాయకుఁడగు శ్రీరామమూర్తిని-కమలాక్షీకళత్రుడగు శ్రీరామమూర్తిని-రాజాధిరాజపూజిత, సేవితమణిపాదుఁడైన శ్రీరామమూర్తిని-జగదంతర్యామియైన శ్రీరామమూర్తిని-హరిహరహిరణ్యగర్భాత్మకుఁడైన శ్రీరామమూర్తిని-విశాలాపారభవాబ్ధిపోతమగు శ్రీరామమూర్తిని-స్మరింపని జన్మమొక జన్మమా! అట్టి జన్మంబెన్నఁటికైన నవధినందఁగలదా-అంతమును గాంచఁగలదా?

"సంసార జీమూత సంఘంబు విచ్చునే
చక్రిదాస్య ప్రభంజనము లేక!
తాపత్రయాభీలదావాగ్ను లారునే
విష్ణుసేవామృత వృష్టిలేక!
ఘనవిపద్గాఢాంధకారంబు లడఁగునే
పద్మాక్షునుతి రవిప్రభలు లేక!
సర్వంకషా ఘౌఘ జలరాసులింకునే
హరిమనీషా బడబాగ్ని లేక!
నిరుపమాన పునరావృత్తి నిష్కళంక
ముక్తినిధిఁ గానవచ్చునే ముఖ్యమైన
శార్ఙ్గకోదండ చింతనాంజనము లేక
తామరసగర్భునకునైన ధరణినెందు!"

— భాగవతము.

రామా! నీవనంతుఁడవు-నీవనాద్యుఁడవు-నీ వరూపివి-నీవు సురూపివి—నీవు చిద్విలాసుఁడవు-నీవు మాయామానుషుఁడవు-నీ వసంఖ్యాకభూతకోటి పరిరక్షణుఁడవు—నీవ మాల్యాభరణ భూషితుఁడవు!

రామా, నీవెక్కడ? నేనెక్కడ? అనంతకోటి బ్రహ్మాండమండల మండనాయమాన నాయకమండలుండవగు నీవెక్కడ—సర్వశూన్యరాలనగు నేనెక్కడ? రాజాధిరాజ మహారాజపూజిత పాదనీరేజుఁడగు చక్రవర్తి కుమారుఁడవైన నీవెక్కడ—నేను—చూడ నసహ్యాకరంబగు నేను—కుడువఁగాని నోటులకుఁ బెట్టగాని యన్నంబులేని నేను—పరుల కుపకారమను మాటయే నెఱుఁగనినేను-—సప్తర్షి స్తోత్రసంపూజిత దివ్యచారిత్రు

డవగునీవు—చూడగంటకంబగు పాలపూసలుఁ దాల్చిననేను—నవరత్నఖచితచంద్రహాసా లంకృతుఁడవగునీవు—భక్తజనపారిజాతుఁడవగునీవు—మౌనిపుంగవుల పాదరేణువునైనఁ గనుల గాంచఁజాలని నేను—మౌనిజన హృదయస్థ నుతులనందిన నీవు—కామితార్థ ప్రదాయకుండవగునీవు—గొప్పవాఁడవగు నీకును—అధమురాలనగు నాకు నెట్టిసంబంధము అని ఎవరేనియందురా? వందారు జనమందారమా!

"మందారమకరంద మాధుర్యమున దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మలమందాకినీ వీచికలఁదూఁగు
రాయంచ సనునె తరంగిణులకు,
లలితరసాలపల్లవఖాదియై సొక్కు—
కోయిల సేరునే కుటజములకు
పూర్ణేందుచంద్రికాస్ఫురిత చకోరక
మరగునే సాంద్రనీహారములకు
నంబుజోదరి దివ్యపాదారవింద
చింతనామృతపాన విశేషమత్త
చిత్తమేరీతి నితరంబుఁ జేరనేర్చు
వినుతగుణశీల! మాటలు వేయు నేలని"

— భాగవతము.

క్షమింపుము. నీవటులఁ దలంతువా! నేనే పొఱబడుచున్నదానను. సుజనరక్షా దక్షులరైన తామటులఁదలంతురా! భవదీయ నామసన్మంత్ర జపమునకన్నను నింకొక వేదపఠన మున్నయదియా? నీమహిమను గొనియాడ నేరితరము?

నీనామమంత్రంపు నియతిచేతనె కదా
వాల్మీకికావ్యంబు వ్రాయఁగలిగె!
నీపాదధూళిగా పరికించి జూడంగ
కఠినపాషాణంబు కాంతయగుట!
నీచేత నంతంబు నేర్పుమీరఁగ గాంచి
మొఱటుకబంధుఁడు మోక్షమందె!
నీరూపమేని వర్ణింపలేని గుహుండు
వీక్షింపడేయా త్రివిష్టపంబు!

వినుము! శ్రీరామ! నిన్ను నే వినుతిఁ జేతు
నన్నుఁ గరుణించి, దయసెంచి, తెన్నుఁ జూపు,
మింక నిలువగ నిచ్ఛయే! సంకటంపు
నిలయమగు నిట్టి నికృష్టనివసథముఁ.

రామా! ఇంకను రా నాలసించెద వేల? మహాత్మా సౌమిత్రీ! మీ యన్నకు నీవైనఁ జెప్పి యిటకుఁ దోడ్కొని రారాదా! అయ్యో! ఎంత యపచార మాచరించితిని. క్షమింపుము. స్వామీ! క్షమింపుము!!

తామ మహా సాధ్వీమతల్లియగు సీతను-నిత్యసత్యవ్రతశీలయగు సీతను-రాక్షస కుల వినాశ కారణభూతురాలగు సీతను, ఎడఁబాసితిరి కదా? ఆహా! ఏమి! మీ మాయా మానుషనాటక ప్రదర్శన నైపుణ్యము! సర్వముఁ బుట్టింప, పెట్టింప, గిట్టింప సమర్థులగు మీరు అనంతకోటిజీవరాసుల జీవితంబుల లిఖియించుమీరు-రామా! యొకరికైనఁ గానుపింపక వందరికర్మలను నారసి వానికిఁదగు ఫలంబులను లిఖియించునీవు-మాయామానుషావతారుఁడ వగునీవు-నీ భార్యయగు సీతను గాంచలేక బోయితివా! రామా! ప్రపంచమున ధర్మమును బునరుద్ధరింప నీవెన్నెన్ని యిడుమలఁ గుడుచుచుంటివి? రామా! నీవుపితృాజ్ఞా పాలకుండ వనుటకుఁదగిన వాఁడవు. పాపసంహారా! జనని యాజ్ఞాపాలకులనుటకు నీవును, నీ సోదరుఁ డగు సౌమిత్రియునే సిద్ధమైనవారు. దాశరథీ! సౌమిత్రీ! నీవే స్వార్థత్యాగి యనుటకుఁదగిన వాఁడవు. జననియాజ్ఞ మేరకు జనకునాజ్ఞఁ బరిపాలింప నన్నతోఁడ నడవులకే తెంచిన నిన్నుఁ గాంచఁ గల్గినచో నేనెంత పుణ్యాత్మురాల నయ్యెదనో కదా! అన్నా! సౌమిత్రీ! నీ వెంత ధన్యుఁడవు. నిజముగ నీవే భ్రాతవు, తనయన్నకై తనరాజ్యమును వీడి-భర్మహర్మ్యంబు లను వీడి-పంచభక్ష్య పరమాన్నంబుల గుడుచు స్వగృహంబులను వీడి-హంసతూలికా తల్పంబులను వీడి-కటికశిలలనే హంసతూలికా తల్పంబులుగాఁబరిగ్రహించి-ఆరణ్యకమైన యాకలములతో నమర్పఁబడిన యొకచిన్న పర్ణశాల ప్రాంగణమే భర్మహర్మ్య సమంబుగఁ దలంచి-తన జనని బోధించిన

"రామం దశరథం విద్ధి
మాం విద్ధి జనకాత్మజమ్
అయోధ్యా మటవీం విద్ధి
తాత! గచ్ఛ తేతి యథాసుఖమ్"

అను మాటలను మఱువక సీతమ్మను దల్లిగను, రామయ్యను దండ్రిగను, దలంచి ప్రత్యూషంబున జరుపఁబడవలసిన మాతాపితరుల పూజలకు బదులు సీతారాముల బూజఁ గావించి ధన్యతనందుచుండిన నీ జన్మమే ధన్యము.

అమ్మా! సీతా! లోకైకప్రపూతా! లోకోద్ధరణార్థము వసుంధరకు జన్మించి జనకునకుఁ బ్రియపుత్రికవై జయావలంబియగు శ్రీరామచంద్రుని కరంబును జేనంది ప్రియుఁడు వలదన్ననుఁ బతి యెచటనున్నఁబడఁతియు నచటనే యుండుట ధర్మమని బోధించి రామునననుసరించి, దండకారణ్యమును బ్రవేశించి-మేటి యనసూయాదిమహాపతివ్రతామ తల్లుల యాశీర్వచనంబుల నంది నేడాయసురునిచేతఁ జిక్కితివా! తల్లీ! నీ జీవిత మెంతగఁ జింతా సాగరవిలీనమాయెను! అమ్మా, చింతిలకుము. శ్రీరాముఁడువచ్చి నీదుఃఖ సాగరమును బంధించును. సేతువుఁగట్టును. దుఃఖమునుండి దరిఁజేర్చును. తల్లీ! ధైర్యము వహింపుము.

అయ్యో! ఎంతయాలసించితిని! శ్రీరామలక్ష్మణులరుదెంచున దింకొక జామునకే గదా! వారలసివత్తురు. వారికేదేని ఫలాహారంబు లొసంగఁజాలకుండిన నెంతి యపచారము వాటిల్లును. క్షమింపుడు! రామా సౌమిత్రీ! మీకొఱకై కొన్నిఫలంబుల సేకరింతును.

(లేచి చెట్లవైపున కేగి)

ఆహా! ఏమా గున్నమామిడి వృక్షముయొక్క యందము! ఏమా రసాలతరు శృంగారము! ఆగున్నమామి ఫలములు రుచియైనవో యీరసాలము రుచ్యమైనదో నేను చవిఁజూచి సేకరింతుఁగాక!............ ..(పొంతనున్న వృక్షములకడకేగి)...... ఈ గున్నమామిడి పండెంత యందముగానుండి కనుదోయికి విందొనర్చుచున్నయది. దీనినిఁ జవిఁజూచెద...(ఫలమునొక దానియందొక వైపుకొఱికి)....ఛీ! ఇది యందముగను మాత్రమేయున్నదికాని యంతరుచికరముగ...మధురముగా లేదు. ఆ రసాలమును బరీక్షించెద! (రసాలముకడకేగి ఫలముఁగోసి రుచిఁజూచి) ఆహా! ఏమిరుచి!! ఏమిరుచి!!! రసాలమును మాటయీఫలంబునకు దక్కినదిగాని తక్కినవానికి దక్కునా? చెల్లునా? ఈఫలమును భుజించిన మా శ్రీరామచంద్రమూర్తి యలసటను మఱచిపోవఁగలడు. (తల నెత్తి ప్రక్కనజూచి) అదిగో! యాదానిమ్మపండు కనులకెంత యింపుఁగొలుపుచున్నయది. (దానిని సమీపించి యొకపండునుఁగోసి) ఈపండు బాగుగాఁబండుటఁజేసి కాఁబోలు పొట్టవిచ్చుకొనియున్నది. ఇందొకగింజను దిని బాగుండిన దీని నిటనుంతు. పుల్లదానిమ్మ యైన విసర్జింతును. (కొన్నిగింజలనుదిని) ఆహా! నాయానందమునకు మేరయేలేదు! ఈఫల

మునఁగల గింజలఁదిని శ్రీరాముఁడు నన్ను మన్నింపకుండునా! ఈఫలములను జవిఁజూచి నను గుఱించి సౌమిత్రి శ్రీరామునకుఁజెప్పి నాకు దైవసాన్నిధ్య మిప్పించునా! ఇచటమాత్రమేఁగాక నీయరణ్యంబునం దంతటఁగలయ వెదకి యెందెందేయే సుభోజనములగు ఫలంబులుఁ గల్గో వానినెల్లఁదెచ్చి శ్రీరామచంద్రమూర్తి కర్పింపఁ బ్రయత్నముఁ జేయుచుండెదను. (అటు నిటుఁజూచి) అదిగో కదళిమాకు (త్వరగా నటువైపునకుఁ బోవును).

## రంగము ౨

[ శ్రీరామలక్ష్మణులు సీతావియోగానంతరము, సీతాన్వేషణార్థులై బయల్వెడలి, మార్గమధ్యమున జటాయువుఁగాంచిరి. జటాయువు సీతనెత్తుకొని పోవుచున్న రావణు నడ్డగించి, వానితోఁబోరి తన రెక్కలుఁ బోగొట్టుకొని, ప్రాణావశిష్టుఁడై పడిపోయెను. రాముని రాకకై యెదురుఁజూచి వచ్చినదే తడవుగ రావణుఁడు సీతనెత్తుకొని పోయెనని తెలిపి విగత జీవుఁడాయెను. జటాయువునకు నుత్తరక్రియలను నిర్వర్తించి రామలక్ష్మణులు దక్షిణాభిముఖులై బయలుదేరి మార్గమధ్యమమునఁ గాంధణజన్ముఁడైన కబంధునను మడియఁ జేసిరి. కబంధువు మరణానంతరము తన నిజచరిత్రఁజెల్పి శబరి శ్రీరామ నిరీక్షణమున నున్నదనియు నామె జన్మసాఫల్యం బొందుసమయమేఁతెంచినదనియుఁజెప్పి దక్షిణదిశఁ జూపి యథేచ్ఛఁ జనియె. అదికారణముగ శ్రీరామలక్ష్మణులు కబంధునాశ్రమమునుండి శబర్యాశ్రమాభిముఖులై చనుచుండిరి. దారిలో జలాశయ మొకటి కానుపింప నట ముఖప్రక్షాళనం బొనరించిరి. ముందు రాముఁడేగుతెంచెను. వెనుక కొలది తడవునకు లక్ష్మణుఁ డేగుదెంచుచుండెను—అది ప్రాతఃకాలము. అప్పటికి రెండు ఘడియలప్రొద్దెక్కెను—రామలక్ష్మణులు వల్కలాజినంబుల ధరించి మునిపుంగవులవోలె వేషధారణం బొనరించుకొనిరి. శ్రీరాముఁడు ముందుకు నడచుచుఁ దటాబున నిలచును. రామలక్ష్మణులవద్ద కోదండములుండును].

### రాముఁడు

లోకైకపూతా! సీతా! నన్నిటులొంటి డించి పోయితివా! అకటా! ఆమాయలేడి నీకన్నులకెక్కడ దాపరించె—దాపరించెఁబో—ఆలేడినిఁ గాంచినంతనే దానిని సాకవలయునను కోర్కె నీకేల గలిగె—కలిగెఁబో—అద్దికావలయునని నాకుఁ జెప్ప నేనెన్ని విధముల వలదన్నను వినక బలవంతపెట్టనేల—బలవంతపెట్టితివిపో—నేను మొండికి వేయకఁ దెచ్చి యొసంగుదునని నీకోర్కెకు సమ్మతింపనేల—సమ్మతించితిపో—దానిని వెన్నంటనేల—వెన్నంటితిపో—అది యనేక కాననంబుల ద్రిప్పనేల? ఎట్టకేలకు నాచేత హతమగుటేల—హతమగుచునది యఱువనేల—ఆయఱుపును విని నీవుభయమంది సౌమిత్రిని నిష్ఠురంబులాడి పంపనేల? అంత నీవొంటిగనుండుటఁగాంచి యాదొంగ నిను

దొంగిలనేల? హతవిధీ! రాజ్యంబును వీడియు నీకీసౌఖ్యంబేలయను పాఠమును బోధింప నెంచి యీయంతర్నాటకంబునకు సూత్రధారుఁడవైతివా? నామనం బెంతగఁ గుదుటఁ బఱచుకొందమనియే యనుకొన్న గుదుటఁ బడదే? సీతా—— అయ్యో—— సీతా! సీతా! సీతా!!

నీవు లేకున్న జన్మంబు నిష్ఫలంబు
నీవు కలిగిన యడవియే నిఖిలమగును
నీవు లేకున్న సౌధంబు నీటిసమము
లనెడు పలుకులు నేడేమి యయ్యొ సీత!

నామనం బమిత వ్యాకులమందుచున్నయది. సౌమిత్రి నీరుత్రాగి వత్తునని వెడలి రెండుఘడియలు కావచ్చినది. ఇంకనురాలే దేమి కారణంబో?

సౌమిత్రి

(మునివేషధారుఁడగు సౌమిత్రి ప్రవేశించును) అన్నా! ఏమో యోచించు చుంటివి?

రాముఁడు

ఏమియును లేదు సోదరా! నీవింత యాలసించుట కేమియు నశుభము సంప్రాప్తించలేదు కదాయని——?

సౌమిత్రి

అన్నా! నేనొనరించిన యాలస్యమేమియును లేదే? నేను ముఖప్రక్షాళనం బొనరించి వచ్చుచుంటిని. (తనలో) శ్రీరాముఁడు సీతామహాసాధ్వీవిరహంబును భరింపఁ జాలక చింతించుచుండనోపు. అందుచే నేనెంతో యాలసించినటుల నీమహామహునకుఁ దోఁచియుండనోపు. (ప్రకాశముగా) అన్నా! ముందునకు నడచుదమా?

[సశేషము]

# కెంపులడ్డిగ

శ్రీమతి పద్మావతీ శ్రీరామ్‌గారు

ఆ పాడుముండ, మీమేనత్త కెంపులడ్డిగను మనకెవ్వరికైన నీయక, నేలకో ఆకోమటి కిచ్చి అమ్మిసొమ్ముజేసి ధర్మములకిమ్మన్నది. ఆ అడ్డిగ, తరతరములుగా మీ తండ్రిగారివంశములో యుండినది. మీతండ్రియెంత జేల! దానిని నాకిప్పించక, తన చెల్లెలికి స్త్రీధనము క్రిందదిగబెట్టాడు. పోనీ ఆవిడయైన, వైధవ్యమువచ్చినదని, ఆనగను నాకో, నాబిడ్డలకో యివ్వరాదా?" అని విసుగుకొంటు అన్నది ఆదిలక్ష్మి. ఆదిలక్ష్మమ్మ ఆపెపెనిమిటి శంకరశాస్త్రి, వారికుమార్తెలు, సునీత, వైదేహి, వారిఅల్లుడు శోభనాద్రి విందారగించుచుండిరి. వైదేహి వారి పెద్దకుమార్తె. ఒకముదుసలివానికి మూడవపెండ్లి కిచ్చినందున, చిన్నప్పుడే ఆమెకు వైధవ్యము ప్రాప్తించెను. శోభనాద్రి సునీతభర్త. అతడు బీదవాడు. వారములుతిని, స్కాలర్ షిప్ సహాయమునచదివి, వకీలుపనికివచ్చెను. సునీత జాతకములో ఆరుద్రనక్షత్ర లోపమున్నదనియు, ఆపెను పెండ్లాడువానికి ఆనక్షత్రలోపము లేనియెడ, ఆపెకును వైదేహిగతి ప్రాప్తించుననియు, ఎవ్వరును ఆపెను పెండ్లాడలేదు. వయస్సు మీరినది, శోభనాద్రికి దిక్కెవ్వరులేరు. ఎంతయోఆలోచించి, సునీతను వాని కిచ్చిరి. వైదేహికి, ఆదిలక్ష్మికి, శోభనాద్రినిచూచిన, అలక్ష్యము, అసూయకూడను. వారములతిన్న తక్కువజాతివాడనియు, సునీతను నూతిలోత్రోసినట్లును వారనుకొను చుండిరి. సమయముదొరికినప్పుడెల్ల వైదేహి నిర్దాక్షిణ్యముగా ఎత్తిపొడుపు మాటలాడు చుండెడిది. సునీతకును శోభనాద్రికిని అన్యోన్యప్రేమ; అనురాగము. అందుచేవారిరువురు యితరులుతమ్మెట్లు చూచినను లక్ష్యపెట్టకయుండిరి. తనభార్య సౌఖ్యమునుజూచి ఓర్వ లేమిచే వైదేహి తన్ను ద్వేషించుచున్నదని శోభనాద్రియెరుగును. శంకరశాస్త్రి రిటైర్డు డిప్యూటీకలెక్టరు. పింఛనుతోను సౌఖ్యముగా కాలముగడపుచుండెను. ఏవిచారమును పెట్టుకొనడు. పెద్దకుమార్తె వైధవ్యము ఒకవిధమున మంచిదనేభావించెను. వంటకత్తె వేరుగనక్కరలేదు. తాను ఆదిలక్ష్మిశయ్యాగృహమున హాయిగనుండవచ్చును పాపము! ఆదిలక్ష్మి పనిచేయచాలదు. అందుచేత వైదేహి ఎంతయోసహాయ్యముగనున్నది యింట.

"అవునే, అమ్మ! ఆ కెంపులడ్డిగను మనము తీసుకొన్న బాగుండును" అని అందుకొన్నది వైదేహి. 'అడ్డిగలన్న నాకును ప్రియమే' అని ఆసంభాషణలో కలసికొన్నది సునీత. "అవును, పాపము దానికి ఒకనగయైనను, వైనముగా లేదు. కొనియిచ్చిన బాగుండును" అని ఆదిలక్ష్మమ్మకూడ పలికెను. వడలపర్వము దాటి, క్షీరాన్న పర్వములో యున్న శంకరశాస్త్రి "అవును. అదిచాల వెలగలది. మరియు ప్రాతకాలపు నాటిది, మాతల్లిగారి అవ్వకు, అవ్వ దినములనుండి మావంశములో యున్నది. మాతల్లి నాచెల్లెలి కిచ్చినది. అదితిరిగి మన వంశములోనికి వచ్చిన బాగుండును. అయితే పైకము నాదగ్గర లేదు. ఇన్సురెన్సు ప్రీమియములు కట్టుటకే నాపింఛను సరిపోతుంది. బ్యాంకిలో పైకము తాక కూడదు గదా" అని త్రేపు తేల్చుతూ అన్నాడు. శోభనాద్రి కేమియుతోచలేదు చెప్పుటకు. అంతలోగా ఆదిలక్ష్మమ్మ "సునీతకు నగలేలేవు. పెండ్లిలో అసలేలేదు; సంసారమునకు పోయి అయిదారేండ్లయింది. బిడ్డగడ్డలేక పోయినా, నగలన్నా వుండకూడదూ! యిప్పుడే సంసారము పెద్దదికాకమునుపే నగలు చేయించితేనే, చేయించినట్టు. అదీగాక, వక్కీలు ఉద్యోగములో అప్పుడప్పుడే చేయించుకో పోయిన ముందు చాల కష్టము. మీ తండ్రి 15 రూపాయల జీతముమీద క్యాంపు గుమాస్తాగా యున్నప్పుడు, మేము బత్త్యాలమీద సంసారము జరిపి, నెలకొక సవరముకొని, కాసులదండ, కంటె, గజ్జెల పట్టెడ, సందిబొందె, చేయించుకొన్నా" అని ఒక లెక్కగు యిచ్చింది. ఆమె మతము దీపమున్నప్పుడే యిల్లు చక్కబెట్టుకో వలయుననేది. మగడుపోయిన నగలున్న అమ్ముక తినవచ్చునని ఆమె మూఢనమ్మకము. ఈ మాటల సవ్వడంతాగమనించినాడు మన శోభనాద్రి. 'ఆ నగను నాచేత కొనిపించవలయునని వీరందరి వుద్దేశమును. నాకు వరకట్నమైన యివ్వలేదు యీ ముసలాయన. బోలెడు డబ్బెట్టుకొన్నాడు బ్యాంకిలో. ఏం? కొని యియ్యకూడదూ కూతూరికి! నేను ప్రాక్టీసు మొదులెట్టి 5,6 సంవత్సరములు కాలేదు. కమీషను క్రింద, లాజర్నల్సుకు చందాలు, గుమాస్తాల జీతములు, గౌరవార్థమై కట్టు రాబడిపన్ను క్రింద ఖర్చైపోతుంది నా ఆర్జనంత. మిగిలింది మోటారు పెట్రోలుకు క్లబ్బు చందాకు సరిపోతుంది. నేనగలెట్లు తేనూ" అని తనలో అనుకొంటూ "మామగారూ! ఆ అడ్డిగెలెంతధరలో వుండును?" అనిఅడిగెను. "ఎంత, నాలుగు వేలో ఐదు వేలో. మావంశము వారుకొనిన యెడల తగ్గించి యిమ్మని విల్లులో వ్రాసిందికూడానూ నాచెల్లె". "ఈ గెడ్డివారి కేసు తెగి, ఫీజు వస్తేకొని పెట్టాను" అని కొంచెము ధైర్యముగా శోభనాద్రన్నాడు. "ఆహా! మాటలచే కోటలు గట్టవచ్చు. వక్కీళ్లకు మాటలు మంచినీళ్లు మర్యాద.

కొని యిచ్చిన నాటికి చూతము" అని హేళనముగా వైదేహి పలికినది. శోభ నాద్రికి కోపము, రోషము హెచ్చి కండ్లెఱ్ఱ జేసుకొని, "ఏదో నాచేతనైనది చేసి నాభార్య కిచ్చెదను" అనెను. సునీత యిదంతయు జూచి, భ్రతిమించి రాగములో బడ్డదే వ్యవహారము అని యెంచి 'నాకు అడ్డిగ అక్కరలేదు. పై సంవత్సరము చూచుకోవచ్చును" అని సమాధాన పరుపజూచెను. తనపరువు కాపాడుకోవలయునని శోభనాద్రి యెంచి 'ముత్తయ్యశెట్టిని ఆ నగను తీసుకొని రమ్మనెద'నని చేయి కడుగుకొని టెలిఫోను వద్దకు పోయెను.

౨

ముత్తయ్య అడ్డిగను తీసుకొని శంకరశాస్త్రి యింట జేరినాడు. కూటములో అందరు జేరిరి. శెట్టిగారు నగను బైటికితీసి "యిదిగోనండి, మీచెల్లెగారి యక్షింతలు. రాళ్లునుంచిప్రాతవి, ఏమీ లోపములేదు. వేరెవ్వరైనకొన్న అది మీవంశములోనుండి పోవును. మీరుకొనకపోతే మరెవ్వరండి దీనిని తీసేవారు" అని నగను ఆదిలక్ష్మమ్మ చేతిలో బెట్టాడు. ఆవిడయు దానిని సునీతి మెడలోవైచి "దీనిమెడకు కొలతజెట్టి చేసినట్లున్నదే. ఏమండి అల్లుడుగారూ; చూచారా! ఆకెంపులెంత ప్రకాశించుచున్నవో" అని అల్లునితో అన్నది. సునీత మోము కొంత వికాసము చెందినది. అయినను తనభర్త యీనగను కొనగలడా అని ఆలోచన సునీతకు తట్టినది. నగలపై ఆమెకు ఆశయుండినను తనభర్తపైప్రేమ అంతటికంటెక్కువ. వానికష్టముల నాలోచించినది. "నాకిప్పుడక్కరలే" దన్నది. "నీకు కావలయునన్నమాత్రము, తీసియిచ్చుటకు, యిక్కడెవరును సిద్ధముగలేరు. నేను నీ పెండ్లప్పుడే యంటినే, యీతనికిచ్చుటకన్న, ముదుసలి సాహుకారికిచ్చుటమేలని? నామాట నిజమైనది. నీకేమి సుఖము అబ్బినది; అడ్వొకేటు భార్యయనుటయేకాని ఏది? చిల్లిగవ్వంత నగ తీసియిచ్చుటకు నీభర్తకు గతిలేదు" అని తనకసుపునుంటంతయు వెలిబోసికొనెను వైదేహి. శోభనాద్రికి పట్టరానికోపము. పాపము ఏమిచేయగలడు! అయినను వారిని అవమానపరుపవలెననియెంచి "శెట్టిగారూ, ఎంతమదింపు ఆనగ?" యని అడిగెను. మీరువారికుటుంబపు వారేగనుక మీకుఅసలు వెలకుయివ్వగలననెను. అప్పుడు శోభనాద్రి, 'సరే దానినినాకిమ్ము' అనెను. సునీత దీనినంతయు గమనించినది. పాపము ఏమియు చెప్పుటకు నోరాడలేదు. తనభర్త అంతసొమ్ము తేలేడని తెలుసును. ఏమిచేయగలదు? తలవంచుకొని దుఃఖించినది!

## ౩

ఇదంతయు జరిగిన నాలుగురోజులకుముందే ఒక కక్షిదారునికి రావలసినపైకము ఐదువేలు కోర్టులో డిపాజిట్టుక్రింద యుండెను. తన ఫీజు మినహాయించుకొని యిచ్చుటకై దానిని శోభనాద్రి కక్షిదారునికి జెప్పలేదు. అతనికొక దురుద్దేశము పుట్టినది. నాలుగు వేలు అడ్డిగకై యిచ్చి ఆవలెట్లయిన సరిజేసుకొనెదమని నిశ్చయించుకొనెను. డబ్బే! దానిని మనము వాడకూడదను తలంపురాలేదు. ధర్మాధర్మము, న్యాయాన్యాయము మనస్సునకుతోచలేదు.

## ౪

శోభనాద్రి ఆఫీసుగదిలో మడతకుర్చీపైన కూర్చున్నాడు. ఏమియో ఆలోచనలో మునిగియుండెను. సునీత, కాఫీపలహారముల దెచ్చినదిగూడ గమనింపలేదు. ఇంతలోగా కక్షిదారుడు ప్రవేశించి ఏమండీశాస్త్రిగారూ! జడ్జిమెంటు ఎప్పుడో అయిపోయిందట! ఎదురుపార్టీవారు మనబాకీనిగూడ కోర్టులోకట్టినారట! నాకేదియు తెలుపలేదే! పైకము యిట్లపారవేయండి. నాకుచాలా అక్కరగాయున్నదండి” అనియడిగెను. వానికేదో సమాధానముచెప్పి, యికరెండురోజులలో తనకురావలసిన ఫీజు లెక్కజూచుకొని మిగత యిచ్చెదనని క్లయంటును పంపివేసెను. ఇదంతయు సునీతవిని, లోగుట్టుగ్రహించినది. కేవలము ఆడంబరముకొరకును, తనవారుచేసిన పోరునకోర్వలేక యితరుల డబ్బుతో తనకాయడ్డిగను కొనియిచ్చెనని ఆమెచింతించినది. తనతో ఒకమాటకూడ చెప్పనేలేదు కదా తనభర్తయని మఱింతమనస్సు నొచ్చుకొన్నది. కేవలము నగలధరించు బొమ్మ క్రిందికి తేల్చనేయనియు చింతించినది. శోభనాద్రి కేమియుతోచలేదు, మొద్దువలె కుర్చీలోకూలి ఆలోచనలోమునిగినాడు. భార్యతో డబ్బువిషయము ఆలోచించుట యవమానము, తనగౌరవమునకు లోపమని అతనితలంపు. ఒక్కటేయోచనతో యున్న త్తునివలెయుండెను. రెండుదినములలో ఐదువేలు ఎట్లుదెచ్చుట యతనికితోచలేదు. ఆకలి అడుగంటినది. క్లబ్బుకుపోవడము, కోర్టుకుపోవడము మానివేసినాడు. సునీతతో ఏదో ఒకటిరెండుమాటలు మాట్లాడడము. ఒకమెతుకుతినడము, ఆఫీసుగాములోనికి పోయి, ఒక్కటేఆలోచన. క్లయంటుపెట్టినవాయిదా రెండుదినాలుగడచినవి. నక్షత్రకుని వలె వాడుదిగబడ్డాడు. అతనికి, తానుజబ్బుగాయున్నాననియు, కోర్టుకుగూడ పోలేదనియు

సమాధానముచెప్పి, యికరెండురోజులలో రమ్మనెను. భార్యతోఆలోచించి, అడ్డిగను కుదువబెట్టిగాని, అమ్మికాని పైకమును చెల్లింతమను తలంపువచ్చినను దానిని లెక్కించలేదు. భార్యకేల ఉద్యోగసంబంధమగు కష్టములు; దానికీవంట, వార్పు, బిడ్డలు, కాన్పులు ఆసమాచారములేకాని నాకష్టసుఖములతో పనిలేదని శోభనాద్రి తలంపు. తాను డబ్బు తెచ్చుయంత్రము (A mere money getteng machine) తనభార్య శిశోత్పత్తియంత్రము (Child producing machine) అని ఆతని దృఢనమ్మకము.

## ౫

ఒక్కదినము అడ్డిగలోని రాయియొకటియూడిపడెను. దానిని బాగుచేసికొనిరమ్మని సునీత భర్తకిచ్చెను. అది తన చేతిలోనికి వచ్చినతోడనే, ఒక తలంపు తట్టెనుశోభనాద్రికి. ఆయడ్డిగను తాకట్టువెట్టి పైకముతెచ్చి, క్లయింటుకిచ్చి, మిగత పైకముతో Imitation రాళ్లడ్డిగదెచ్చి సునీతకిచ్చి, తన ప్రాక్టీసు బాగుగావచ్చినతోడనే, కెంపులడ్డిగను తెచ్చినవ్వ వచ్చునని తలచెను. ముత్తయ్య దగ్గరకుపోయి యీ సమాచారమంతయు సవిస్తరముగా తెలిపెను. అతనును దానికియ్యకొనెను. మరుసటిరోజు ముత్తయ్యశెట్టి గుమాస్తా, Imitation నగనుతేగా, శోభనాద్రింట లేనందున సునీత దానిగైకొని పరీక్షించెను. తాను దానిలో వేసిన "సు" అనుగుర్తులేదు. నివ్వెరబోయి గుమాస్తాను అడుగగా. ఆతను లోగుట్టంతయు దెలియజెప్పెను. సునీతకు పట్టరాని కోపము, దుఃఖమువచ్చెను. కోమటియు, వాని గుమాస్తాయు, తన భర్తకు తనకన్న యాప్తులైరియని. ఆహా! నన్ను కేవలము తెలివిలేని స్త్రీయని యెంచెనే, వారికష్టములకు నాకుభాద్యతలేదా? వారు విచారముతో క్రుంగుచుండగా నేను నగలతో కులుకుటయా అని విచారించెను. సాయంత్రము శోభనాద్రింటికి వచ్చినతోడనే, యడ్డిగను కోమటితెచ్చి యిచ్చెననెను. లోపలి గుట్టు కను గొన్నదా, అని సునీత ముఖమువైపు చూచెను. లోరహస్యము తెలసినట్లుగా సునీత సూచించలేదు.

## ౬

శంకరశాస్త్రికి షష్టిపూర్తి యుత్సవము. శోభనాద్రి, సునీత భోజనమునకుబోయిరి. సునీత రవ్వలడ్డిగను ధరియించెను. భోజనమైనది. అందరు కూటములో ముచ్చటలాడు చుండిరి. మాటల సవ్వడిలో వైదేహి "వెంకయ్య మామా! సునీత కెంపులడ్డిగను చూచితిరా? మొన్ననే అల్లుడుగారు కొనిపెట్టినారు. దానిని కొంచెము పరీక్షింపుడు.

మీరెంత మతింపువేయుదురో చూతము” అనినది. వెంకయ్య టాకరుకంపెనీలో సర్వీసు గలవాడు. రాళ్లు మదింపులో పేరుగన్నవాడు. శోభనాద్రికి గుండెలో రాయిపడ్డది. కొంప మునిగె ననుకొన్నాడు. పదిమందిలో పరువుపోతుందని యెంచి, ముఖము తెల్లబోయెను. సునీత అడ్డిగను తీసియిచ్చినది. వెంకయ్య ఒక నిముషము చూచి “ఏమండీ, వక్కీలు గారూ? మోసపోతిరే, యిది యిమిటేషను అడ్డిగలు, ఏబదిరూపాయలు చేసును” అనెను. ఆదిలక్ష్మి శంకరశాస్త్రి నివ్వెరబోయిరి. “అయ్యో, పాపము, అల్లుడు నాలుగు వేలనిచ్చిరే, మాచెల్లెలు యేమార్చినదా, లేక యాకోమటి మోసమా” అన్నారు. “లేదు, లేదు. మనవక్కీలు అల్లుని కుట్రయిది. అడ్డిగలకు నాల్గు వేలనివ్వలేక యిమిటేషన నగనుకొని సునీత కిచ్చినాడు అని తన బాణమును ప్రయోగించినదై దేహీ. శోభనాద్రి కేమియుతోచలేదు. తాను కూర్చున్నచోటు బ్రద్దలై తన్ను దిగమ్రింగిన బాగుండునని తలచెను. యింతలో సునీత పక్కునవ్వి “ఎంత తెలివిలేని మాటలంటిరి. అవునిది Imitation రాళ్లే. ఈమధ్య మైలాపూరులో మాయింటి చుట్టుపట్లదొంగల పోరెక్కువైనది. నాభర్తగారు, నగలన్నిటిని బ్యాంకిలోయుంచి, దానికి బదులీ యిమిటేషను యింటిలోబెట్టిరి. నిజము తెలియక, ఎంత మాటలంటిరి. అక్కయ్యా! యిక మీయింటిలోయుండగూడదని” శోభనాద్రి కడకు పోయి, “యింటికిపోయెదమురం”డని బండిలోనెక్కిరి. పోయిన ప్రాణాలువచ్చినాయి శోభ నాద్రికి. వానివైపు చూచి ఒక్కచిరునవ్వు నవ్వింది సునీత.

౭

కారులో ఆలింగనమొనర్చాడు శోభనాద్రి, సునీతను. “సునితా, నేను నీక్షమాపణ వేడెద. నేను నీయెడ మహాపరాధము జేసితి” అని గద్గదస్వరముతో పలికెను. కొన్ని కన్నీళ్లనుకార్చినాడు. సునీత ఒక్కముద్దుతో కన్నీళ్లను తుడిచి “ప్రాణేశ్వరా, మీరు మీసంసార కష్ట సుఖములను నాకు జెప్పనైతిరిగా? కోమటి ముత్తయ్య నాకన్న మీకు పరమాప్తుడయ్యెనే, నేను మీసహపత్నినికాదా? భార్యయనగా, నగలగై కొనుటకు, బిడ్డలనిచ్చుటకు, చీరలు ధరించుటకేనా? మీకష్టములకు నాకు బాధ్యతలేదా? మీ కష్టములు నాకష్టములు-మీనష్టములు నానష్టములు. ప్రాణముపోయినకాయమేటికి? మీరు నాప్రాణనాథులు. మీరు ప్రాణము-నేనుకాయము. మీరు బాగున్నకదా నాసౌఖ్యము. అట్టిదానియెడనా మీరు రహస్యములు దాచుట? నేను తెలివి హీనననియెంచితిరా? మీరు అడ్డిగలకై పడ్డశ్రమలన్నియు తెలియును. మీపనన్ను అలక్ష్యముచేసి, మీ కష్టములను నాతో చెప్పరైతిరి. నాకునగలుహెచ్చా మీరు సౌఖ్యమనుభవించుటహెచ్చా? అని యింకనేదో చెప్పబోయెనుగాని, శోభనాద్రి, ఆపైనోటమాటరానీయక, ఆమె పెదవులపై తనపెదవులుంచి, పెద్దముద్దిట్టాడు. ఆశ్చర్యమునకు తిరిగిచూచాడు డ్రైవరు. అయ్యగారు అమ్మగారేకమైయున్నారు! దేహములోను—మనస్సులోనూ!

# గోపూజ

యేజెళ్ల శ్రీరాములు చౌదరి

హిందూ స్త్రీలకు గోవులు పరమ పూజనీయములైనవి. ప్రాచీనకాలమున గృహమేధులకుగల సంపద గోసంపదయే కాని ధనసంపదగాదని తెలుపుటలో నతిశయోక్తి లేదు. ఎంతసామాన్య సంసారియైనను కనీసమొక యావునైన తనయింటనుంచి పోషించకుండనుండడు. గాననే పసిపిల్లయు, పాడిపశువును గృహాలంకారములను లోకోక్తి ఏర్పడినది. పసిపిల్లయు, పాడి యావునులేని యిల్లు యిల్లు కాదనియే పలువురు తలంచుచుందురు. ఈ రీతిగా మానవులకును, గోవులకును అవినాభావసంబంధ మేర్పడినది. సాలగ్రామము, తులసీ బృందావనము, అగ్ని, గోవు ననునవి పూర్వాచార పరాయణులకు పరమ పూజ్యములు. ఉదయమున నిదురలేవగానే గోవుముఖమునుజూచిన పిమ్మట గోప్రదక్షిణ మొనరించుట ప్రబలమగు నాచారముగనున్నది. గోప్రదక్షిణము, భూప్రదక్షిణ తుల్యమను నమ్మకము గలవారెందరో గలరు. పుణ్యస్త్రీలు గోవును మహాలక్ష్మియని పసుపు కుంకుమలతోను, పుష్పదామాదులతోను, నలంకరించి నిత్యమును ముఖ్యముగా కొన్ని ప్రత్యేక దినములందు నారాధించెదరు. నైష్ఠికులు దేవపూజ సలుపు నపుడు పంచామృతాభిషేక మొనరించుట ముఖ్యవిధిగానున్నది. పంచామృతమునకు ఆవుపాలు, ఆవునెయ్యి, ఆవుపెరుగు ప్రధాన ద్రవ్యములుగానున్నవి. ప్రాయశ్చిత్త విధికిగూడ పంచగవ్యము ముఖ్యము. ఇందును గోమయ, గోమూత్రాదులు ప్రధాన ద్రవ్యములు. భక్తులు భక్తిభరితులై స్వయముగ లేత పచ్చికలను గ్రహించి శ్రద్ధతో గోవులకును, గోవత్సములకును, చేతులార మేపి అందువలన తమకు తరుణోపాయము కలుగునని నిక్కవముగా నమ్ముచున్నారు. చక్కగా పెంచబడిన గోవృషభముల సుందరాకృతు లత్యంత దర్శనీయములై యలరారుచుండును. గోపూజ అత్యంతము ప్రబలిన కతముననే ఆబోతులను దైవార్పణ మొనరించి స్వేచ్ఛగా వదలు పద్ధతి ఏర్పడినది. వృషభములను బాగుగా పెంచి చక్రాంకిత మొనర్చి భగవదర్పితమని వదలివేసెదరు. అట్టి వృషభము లూరకరి సొమ్ములుగావు. గ్రామస్థులందరును వానిని పరమభక్తితో చూచుచు వానికి గ్రాసమిడుచుందురు. అవి స్వేచ్ఛగా గ్రామవీధులలోను, పొలములలోను చరించుచు మేయుచుండును.

ఇష్టమువచ్చిన యింటిగుమ్మముకడ నిలిచినంతనే గృహలక్ష్మి అతిథిసేవ యొనరించు నటులే యీ ఆబోతునుగూడ నాహారపానీయాదులను భక్తిపూర్వకముగ నొసంగి పంపుచుండును. వాని నారగించి ఆవృషభరాజము మందగమనమున వెడలిపోవుచుండును.

గోవు కనుపడగానే నమస్కరించి ప్రదక్షిణమునుజేసిన స్త్రీకి సప్తద్వీపములతో గూడిన భూమికి ప్రదక్షిణముచేసినంత పుణ్యముకలుగును. గోవుల హుంకారధ్వనిచేతను, దృష్టిప్రసారముచేతను, పాపమునశించునుగాన ప్రతిగృహిణియు గోవులను జూడవలయును. స్పృశింపవలయును. ఏగృహిణియొక్క గృహము లేగలతో గూడిన గోవులచే నలంకరింపబడుచుండునో వారికి పాపమెట్లుకలుగును? చతుస్సముద్రముల మధ్యనుండు తీర్థములును, సరస్సులును, గోవులశృంగోదకముచే స్నానముచేసిన పుణ్యము పదియారవభాగమునైనను బొందజాలవు. గోవులమెముకలపైనుండి దాటకూడదు. గోవులకు గోకుట ధన్యమగుపని. అది గోదానమిచ్చినంత ఫలమును గలిగించును. గోవులను భయరోగాదులనుండి బాగుగ రక్షించుట నూరుగోవుల దానమిచ్చినఫలమును గూర్చును. గోవులను రక్షించుచుండవలెను. బాలించుచుండవలెను. పూజించుచుండవలెను. సర్వలోకములకును దల్లియగు గోవునెవ్వరుకొట్టుదురో వారు తప్పక రౌరవాదినరకములలో బడుదురని వేదములుచెప్పుచున్నవి. గోవులకొమ్ముల మొదట నిత్యము బ్రహ్మయు, విష్ణువునుండును. కొమ్ముల చివరనస్థావరమును, జంగమములునగు సర్వతీర్థములు ఉండును. శిరస్సునడుమ సర్వభూతమయుడగు మహాదేవుడుకలడు. లలాటాగ్రమునందు పార్వతియు, నాసికయందు కుమారస్వామియు, నాసాపుటములయందు కంబళుడు, అశ్వతరుడు ననుసర్పములును, చెవులయం దశ్వినీ దేవతలును, కన్నులయందు సూర్యచంద్రులును, దంతములందు వాయువులన్నియు, నాలుకయందు వరుణుడును, హుంకారమునందు సరస్వతియు, గండములయందు యముడు, కుబేరుడును, పెదవులయందు రెండుసంధ్యలును, మెడయందు దేవేంద్రుడును, కక్షప్రదేశమునందు రాక్షసులును, వక్షస్థలమునందు సాధ్యులును, పిక్కలయందు నాలుగుపాదములుగల ధర్మదేవతయు, డెక్కలనడుమ గంధర్వులును, డెక్కలదను పన్నగులును, డెక్కలవెనుకప్రక్కను అప్సరస్త్రీలును, పృష్టభాగమునందు ఏకాదశరుద్రులును, సంధులయందు పసువులును, పిరుదులయందు పితృదేవతలును, తోకయందు చంద్రుడును, వాలమునందు పిండీభూతములై సూర్యరశ్ములును, గోమూత్రమునందు గంగానదియును, గోమయమున యమునయు, పాలయందు సరస్వతియు, పెరుగులో నర్మ

దయు, నేతియందు బ్రాహ్మణుల గురువగు నగ్నిభగవానుడును, రోమములయందు ఇరువది యెనిమిదికోట్ల దేవతలును, ఉదరమునందు కొండలు అడవులు మొదలగువానితో గూడిన భూమియు, అవయవములయందు పూర్ణములగు నాలుగుసముద్రములును, మేఘములును నివసించునని గోసంరక్షణ మను గ్రంథము తెలియజేయుచున్నది.

ప్రతిగృహిణియు తనపాడిపశువగు కామధేనువునకు సరియైనవేళకు ఆహారమిచ్చి దానికితగిన ఉపచారములు చేయుచుండు టవసరము. అట్లుప్రవర్తించినచో తమసంసారము దేదీప్యమానముగా వృద్ధిలోనికిరాగలదు. బస్తీలకు చుట్టుప్రక్కలనున్న పల్లెటూళ్లస్త్రీలు తమ ఆవు, గేదెలపాలు, పెరుగు, నెయ్యి మజ్జిగలను ఆయాబస్తీలయందున్న కోమట్లు, బ్రాహ్మణులు, మహమ్మదీయులు, తదితరుల కమ్మి లాభము బొందుచున్నారు. ఈయమ్మక మునకు వచ్చినధనమును తమచిన్నబిడ్డలకు చొక్కాలు, లుంగీలు, పరికిణీలు, తమకు రవికెలు కుట్టించుకొని వాడుకొనుచున్నారు. కొందరు యువతులు కాసులపేరు, బంగారు మురుగులు మొదలగువస్తువులు పెరుగుపాలు అమ్ముకొని సంపాదించి ధరించి ముద్దు లొలుకు మొగంబులతో వ్యాపారముజేయుచుందురు. కాబట్టి సోదరీమణులందరు గోవులను జక్కగా కాపాడుచు తగిన ఆర్జన సంపాదించగలందులకును నేను ప్రార్థించుచున్నాను.

# స్వర్ణలత

(డాక్టర్ గంగూలీగారి సాంఘిక నవలానువాదము)

పదమూడవ ప్రకరణము

బిడ్డల సద్వాంఛల కనుకూలముగ వర్తించుట తల్లిదండ్రుల ధర్మము. ఆకారణమున విప్రదాస బెనర్జీ చేయునదిలేక స్వర్ణలతా హేమచంద్రుల వెంటనిడుకొని కలకత్తా నగరమునకువచ్చి ఒక చిన్ని గృహము నద్దెకుదీసికొనెను. వంటచేయుటకును బిడ్డలసౌఖ్యముల నరయుటకును ఒకదాసినేర్పాటు చేసినను ఇంక ఆ చిన్న గృహవ్యవహారములను చక్కగ నిర్వహించుటకును తన బిడ్డల విషయమై తగిన శ్రద్ధ వహించుటకును ఒక సద్వర్తనముగల యాతడు కావలసియుండెను. తన యుద్యోగకాలమంతయు నగరముల యందే గడపియుండిన విప్రదాస బెనర్జీకి నగర జీవితమందెంత మాత్రమును యిష్టము లేక యుండెను. ఆకారణమున గ్రామమునకేగి శాంతయుత జీవనమును గడుపవలయునన్న వాంఛగాఢముగ గల బెనర్జీ కలకత్తా నగరముచ తనకు గల మిత్రులందరితోడను తనకు కావలసిన మనిషి విషయమై తెలిపియుండెను. అందుమీద ఒకనాటి యుదయము వృద్ధుడగు పెన్షన్ ఉద్యోగియు మిత్రుడునగు కిరణశంకర బాబు ఒక యువకుని వెంటనిడుకొని విప్రదాస బెనర్జీగృహమునకు వచ్చెను. వృద్ధులగు నాయిరువురును తమ చిన్ననాటి చెయిదముల గురించి కొంతరకును ముచ్చటించిన యనంతరము కిరణశంకర బాబు తాను వెంటనిడుకొనివచ్చియున్న నాతడు చాలవిశ్వాసపాత్రుడనియు, సద్వర్తనుడనియు పేరు విదుభూషణుడనియు యితనిక్రింద బిడ్డలను వదలిన నెంతయు బాగుగనుండుననియు అందుమీద నిత్యము తానుకూడ యోగక్షేమముల నరయుచుందుననియు బెనర్జీ కెరింగించెను.

విప్రదాసబెనర్జీ ప్రపంచముతోగల తన దీర్ఘపరిచయఫలితముగ గడించియుండిన జ్ఞానము నుపయోగించి విదుభూషణునియొక్క వర్తనమనుకూలముగ నుండగలదని మనస్సు తృప్తి పరచుకొని ఆనందమున మిత్రుడు చెప్పిన చొప్పున విదుభూషణునికి తన యిరువురు బిడ్డలను ఒప్పజెప్పెను.

విదుభూషణుడు గృహమున జేరిన యనంతరము విప్రదాస బెనర్జి కలకత్తా నగరమున ఒకమాసము దినములుండి విదుభూషణుని వర్తనమును పూర్తిగ గమనించి సంతృప్తి జెందెను. ఆదినములయందు విదుభూషణుడు తన బాధ్యతల చక్కగ నిర్వహించుచుండుటయెగాక స్వర్ణలతకు సంగీతము చెప్ప దొడంగెను. దీనింగాంచిన బెనర్జి అపరిమితానంద భరితుడాయెను. ఒకనాడు భోజనముకడ కూరుచున్న యనంతరము విదుభూషణుని తన కుటుంబవివరముల దెలుపవలసినదిగ బెనర్జి కోరెను. అదియంతయు విషాదపూరితమనుచు విదుభూషణుడు తన భార్య, కొమరుడు, శ్యామల తన అన్నగారి సంసారము అన్నింటిని గురించియు యజమాని కెరింగించెను. యజమాని అంతయు నాంతముగ నాలించి అనంతరము భోజనమును పూర్తిగావించెను.

కొలది దినముల యనంతరము విప్రదాసు బెనర్జి స్వగ్రామమున కేగెను.

## పదునాల్గవ ప్రకరణము

విదుభూషణుని గ్రామము వీడి చాలదూరము వచ్చియుండిన మనము సరళ కష్టము లెట్లులున్నవో గోపాలుడేమి చేయుచున్నాడో గ్రహింపకుండిన పేదలయెడ నిర్లక్ష్య భావమును వహించిన వారమయ్యెదము. సరళ జీవనమందు మార్పు కానుపించకుండెను. భర్తగ్రామమువీడి అప్పటికి సుమారు పండ్రెండు మాసములు గడచెను. శ్యామలవద్ద గల కొలది ధనమును మొదటి రెండుమాసములకే సరిపోయినది. అనంతర మెటులు జీవించుట. గోపాలుడు బడికి పోవుచుండెను. ఆతనికి బడిజీతము, పుస్తకములు మున్నగువాటికి ధనము కావలసియుండెను. నిత్యకృత్యములకును ఆహారమునకును ధనమవసరము. అందులకై చాలప్రయత్నముపై నొక ధార్మికవర్తనుడు సరళకు ఋణమొసంగెను. ఆరుమాసములు గడచిన యనంతరమునుండియు విదుభూషణుడు ధనము పంపుచుండెను. కాని ఆవచ్చుదానితో ఋణము తీర్చుటయే యగుచుండెను. సరళకష్టములు యింకను తీరుటలేదనియే చెప్పవచ్చును. కాని సరళ తన కష్టముల గురించి ఒక్కమారేనియు భర్తకు వ్రాసి ఆతనికి మరింత మనోవ్యాకులతను గలిగించియుండలేదు. గృహమందెల్లరును సౌఖ్యముగ నున్నారనియు దూరదేశమందున్న తామెట్లున్నదియు తెలుచు వ్రాయుచుండవలెననియు ఆ మహాసాధ్వి వ్రాయుచుండెడిది. కాపురమునకువచ్చినదాది కలియో గంజియో త్రావుచు భర్తయు తానును ఒక్కచోటనే యుండుచు వచ్చిరి కాని ఒకరి నొకరు విడచియుండలేదు. అట్టి దంపతులకు నేడు వేరుగ నుండవలసివచ్చినందుల కామెయెగాక అనుకూల సౌఖ్యదాంపత్యపవిత్రమార్గమునకానంద మందు ప్రతిస్త్రీపురుషులును విచారింపకమానరు. "అమ్మా! నాన్నయేడి! నాన్నయేడి!" యని తలచు గోపాలుడు

తల్లికడ యేడ్చుచుండెడివాడు. ఆసమయములయందు సరళ కోమకు నోదార్చుటకు చాల ప్రయాసపడవలసి యుండెడిది.

* * *

ఆదివారము. మధ్యాహ్నము భోజనానంతరము విదుభూషణుడు స్వర్ణలతా హేమ చంద్రులను చెరియొక్క ప్రక్క నిడుకొని వారు వేయుచుండు ప్రశ్నలకు సమాధాన మొసంగుచు సంతసించుచుండెను. ఇంతలో తపాలాబంట్రోతు ఉత్తరము నొక దానిని గైకొనివచ్చి విదుభూషణున కందించెను. ఉత్తరముపై విలాసమును దిలకించిన స్వర్ణలత ఆయుత్తరము తన తండ్రినుండి వచ్చినదని సంతోషమున బలికెను.

విదుభూషణు డుత్తరమును చించెను. అందున్న మూడు జాబులలో ఒక దానిని స్వర్ణలతకును, రెండవ దానిని హేమచంద్రునకును యిచ్చి మూడవ యుత్తరమును తాను చదువుకొనియెను.

విదుభూషణు డుత్తరమును పూర్తిచేయు సరికి స్వర్ణలత "మామగారు! యెప్పుడు (మేనమామయను అర్థముతో) తీసుకొనివత్తురు అత్తయ్యను?" అనియనుచు సంతోషమున గంతులిడ నారంభించెను. ఆనందపారవశ్యుడై యుండిన విదుభూషణుడు మాటలాడ జాలకుండెను. ఆతడు స్వర్ణలతా హేమచంద్రుల శిరముల మూర్కొనియెను.

పదునైదవ ప్రకరణము

విప్రదాస బెనర్జి యుత్తరానుసారము విదుభూషణుడు స్వగ్రామమున కేగి సరళ, గోపాలుడు, శ్యామలను వెంట బెట్టుకొని కలకత్తాకు తిరిగివచ్చెననియు అటు తరువాత కొన్నివత్సరములు గడచినవనియు పాఠకులకు వివరముగ తెలుప నవసరము లేదని మా యభిప్రాయము.

గోపాలుడు పెరిగి పెద్దయైనాడు. స్వర్ణలతయు విద్యావతియై హృదయమందు గోపాలుని వరించి ఆతనిమైత్రి నాసించియుండెను. దూరముననున్నను తండ్రియగు విప్ర దాసు బెనర్జీ స్వర్ణలతయొక్క హృదయాభిప్రాయమును గ్రహించెను. కలకత్తాకు వచ్చిన సమయమున నొక శుభదినమున వృద్ధుడగు విప్రదాసు స్వర్ణలతా గోపాలుర బిలచి వారిచేతులగలపి "భార్యాభర్తలై శాంతయుత సౌఖ్యములగడ పెదరుగాక" యనిదీవించెను.

సంపూర్ణము.

మనవి:—డాక్టర్ గంగూలీగారి నవలయందలి గాధను చాలవరకు మార్చి క్లుప్తీకరించియున్నందులకు పాఠకులు నన్ను మన్నింతురుగాత!

—వ. న. వి. హా. ర్తి

# శిశువుల వమనవ్యాధి

## యలమంచి శ్రీరాములు గారు

(సారస్వతసేవాసమితి)

శిశువులకు వాంతివ్యాధి గల్గుట సర్వసాధారణము. ఏనాఁడో యొకనాఁడు ఈవమనవ్యాధి బాధపడని శిశువుండుటరుదు. అయినను అదియేదో సామాన్యమగు వ్యాధిగదా అని నిర్లక్ష్యము చేయుట యెంతమాత్రము తగదు. మన దేశమందలి జననీజనకులు ఈవ్యాధిచేఁగల్గుచున్న ఘోరనష్టములను దురదృష్టవశమున గుర్తింప నేరకున్నారు. పిల్లలు పాలను కక్కుట సహజమేగదా అని యుపేక్షచేయుచున్నారు. దాని ఫలితముగ నీ సామాన్యవ్యాధియే పెక్కుమంది బిడ్డలకు మరణకారణమగుచున్నది.

ఆరోగ్య సంరక్షణ విషయమున మనమెంత ఉదాసీనతవహించి యున్నారమో వ్రాయుటకు నాకున్న భాషచాలదు. ఇఁక శిశుపోషణ విషయమై మనలో పెక్కురజ్ఞులనుట ఉత్ప్రేక్షగాదు ఎంతమాత్రముకాదు. మనము చిన్నతనములోనే బిడ్డల తండ్రులమగుచున్నారము గాని సున్నితములగు వారిజీవితముల నెట్లు కాపాడ వలసియుండునో గుర్తించుటయు లేదు; అందులకై యత్నించుటయు లేదు. నేఁడు మనదేశమందలి శిశుమరణముల సంఖ్యను విన్నపుడు గుండె గుభిల్లుమనును. బీదదగు భారతవర్షమున ప్రతివత్సరము మరణించుచున్న శిశువుల సంఖ్య ప్రపంచమున మఱియే యితర దేశముతోను బోల్చుటకు వీలులేనంత యెక్కువగనున్నది. అందులకుఁగల కారణముల నన్నింటిని ఈవ్యాసమునఁ జర్చింపదలంపలేదు.

పిల్లలకుఁగల్గు నీవమనవ్యాధి మరణములకుఁ గారణములగు ననేక వ్యాధులకు ప్రారంభలక్షణము. వమనము లనేక కారణములచేత శిశువులకువచ్చును. ఎక్కువగా పాలనిచ్చుటయు నెక్కువసార్లు పాలనిచ్చుటయు అనారోగ్యవతులు పాలనిచ్చుటయు వమనములగుటకుఁ గారణమగును. అందువలన జీర్ణమగుటకు తగువ్యవధి యుండునట్లు బిడ్డవయస్సును గమనించి తగుమాత్రము పాలనీయవలెను. అనారోగ్యవతియగు స్త్రీ పాల నిచ్చుట మంచిదికాదు. పాలను విడిచిన బిడ్డలకు వమనములు తగుల్కొనినయెడల నెక్కువగా తినుటకు వారికిఁ బెట్టు టయు లేక జీర్ణముకాని చక్కెర కలసిన ఆహారమును వారికిచ్చుటయు కారణమని గుర్తింపవలెను. ఆవుపాలను గేదెపాలను త్రాగు బిడ్డలకు వమనవ్యాధి కలిగినయెడల ఆజంతువుల పాలలో క్రొవ్వుయును తోడుకొనుపోవు స్వభావము ఎక్కువగానున్నదని తెలిసికొనవలెను. అట్టిపాలను శిశువులు సులభముగ జీర్ణముచేసికొననేరరు. అట్టి యెడల పరిమాణము స్వల్పముగను వ్యవధి యెక్కువగను ఉండునట్లు గమనించి పాలనీయవలెను. అట్టి పాలలో జలములేక 'బార్లీ' కలిపియిచ్చుట పెక్కురకుమంచి ఫలితము నిచ్చును. లేదా అట్టి పశువుపాలు మాని మఱొక పశువుపాలు గైకొనుటమంచిది.

న్యూయార్కు నగరమందు శిశువైద్యములోఁ జేరొందిన 'డాక్టర్ హోల్టు' అను నాయన రచించిన గ్రంథమున 'వమనము' అను నధ్యాయమున నిట్లు రచించెను. "శిశువులకుగల్గు వివిధవ్యాధులకు నిదియొక

విశేషలక్షణముగానున్నది. పెక్కుసుంది బిడ్డలలోనిది ప్రథమలక్షణముగాఁ గనఁబడుచుండును. కనుక నీవ్యాధి సంబంధమగు జ్ఞానము ప్రతివానికి నత్యంతావసరము. శిశువులకు, ముఖ్యముగ నప్పుడే జనించిన శిశువులకు, స్వల్ప కారణములచేతనే యీ వ్యాధి లంకించుకొనుచున్నది.

(1) భరింపఁగలిగ నంతకంటె నెక్కువ పాలతో జీర్ణకోశమును నింపుటచే, పాలతోనింపిన కొలది సేపటిలోనే పాలు యథాస్థితిలోనుండగనే ఆపాలను కక్కివేయుదురు. ఒకొక్కపుడు ఆపాలు కొలఁది మార్పు నొందవచ్చును. ఇది, యేవ్యాధికిని ప్రాథమిక లక్షణముకాదు. ఇట్టి వమనము సాధారణముగా పాలుత్రాగిన వెంటనే బిడ్డను కడుపుట యెత్తుకొని నలుపుట మున్నగు కొంచెము తగ్గించి త్రాగించినచో నీ వమనములు శాంతించును. ఇట్టి వమనములకు మందు వాడ నవసరములేదు. ఈయవలసినంతకంటె నెక్కువ పాలనిచ్చుటవలన గదా యీవమనము కలిగినదని గుర్తింపవలెను. పాలనిచ్చుటలో తగినంత వ్యవధియుండ వలెను. మనదేశములో పాలనిచ్చుటలో కాలనిర్ణయములేదు. ఆఁకలి అయినపుడు మాత్రమే పిల్లలేడ్చెదరు అనునమ్మిక మనదేశస్త్రీలకున్నందున వారేకారణమున నేడ్చినను పాలనిచ్చి శాంతింపఁజేయ జూతురు. కొందఱు స్త్రీలు తమ గృహకృత్యము లెప్పుడు ముగిసిన నపుడు పాలనిచ్చుచుందురు. దీనిచే పిల్లలకు సరియగు వేళకు పాలు దొరకవు. ఒకొకపుడు ముందుగను మఱియొకపుడు ఆలస్యముగను పాలుదొరకును. దీనిచేఁగొన్నిగంటలు ఒకొకపుడు పస్తుండవలసి వచ్చుచున్నది. బర్మాదేశమందలి కార్మిక తరగతులవారు పిల్లలు నిదుర మేల్కొన కుండ యుండుటకై నల్లమందు తినిపించి కూలికై యిలువీడి పోవుదురు. అట్టి దురభ్యాసము మనప్రాంతముల లేనందులకు సంతసింపవచ్చును. కొందఱు స్త్రీలు జబ్బుగానున్న తమ బిడ్డల కెక్కువగను తఱచుగను పాల నిచ్చుచో త్వరలో జబ్బుకుదురునని నమ్ముచున్నారు. అందుకు మారుగ వారివ్యాధిని బలపఱచుట యిట్టి యెడల జరుగుచున్నది. చిన్నబిడ్డలు వ్యాధినుండివిముక్తులై కోలుకొనక పూర్వమే తిరిగి మితిమించిన ఆహారము నిచ్చుట వారికి వ్యాధి తిరుగబెట్టును. వ్యాధిగ్రస్తులు వ్యాధినుండి విముక్తి నొందినను అప్పటివారి శరీరశక్తి ననుసరించి వారు జీర్ణము చేసికొనఁగల్గినంత ఆహారమునే యీయ వలసి యుండును గాని యెక్కువగ నీయ రాదు. దినములవెంట నాహారమును క్రమక్రమముగ వృద్ధిచేయవలెను.

6 మాసములలోపు శిశువులకు ప్రతి రెండుగంటలకును అంతకుమించి సంవత్సరములోపు పిల్లలకు 3, 4 గంటలకొకసారియు పాలనీయవలెను. సంవత్సరముదాటి రెండుసంవత్సరములలోపు పిల్లలకు 4 గంటల వ్యవధిలేకుండ ఆహారమొసఁగరాదు. రాత్రులయందొకసారిమాత్రమే పాలనీయవలెను. అదియును రాత్రి 11 గంటలకు లోపలమాత్రమే పాలనీయవలెను. ఈవిధమగు నలవాట్లు మొదటినుండియు గమనించుచుండుచో బిడ్డ ఆరోగ్యముగనుండుటయేగాక వమనవ్యాధి కెపుడు గురికాదు. ఏడ్చినపుడెల్ల పాలనీయరాదను సంగతి మఱువతగనిది. ఇట్లు గమనించిన పిల్లలజీర్ణకోశము ప్రేవులు వానిపని నవి సక్రమముగా నెఱవేర్చఁగలుగుచుండును. ఎక్కువ లేక తఱచు పాలనిచ్చుట మోయలేనిబరువును జీర్ణకోశముమీఁదను ప్రేవులమీఁదను వేయుటయే.

ఆఱుమాసములుదాటిన పిల్లలను ప్రతి 3 లేక 4 గంటలకొకసారి పాదములమీఁద గూర్చుండఁబెట్టు కొనుచో వారు మలమూత్రముల విసర్జింతురు. అందులకలవాటు పడుదురుగనుక శయ్యమీద మలమూత్రముల విడువరు. ఇట్టిచక్కని అలవాటులను పాశ్చాత్యస్త్రీలు వారిబిడ్డలకు చేయుచు ఆరోగ్యమును కాపాడు చుండుటకూడ ఆదేశమున శిశుమరణముల సంఖ్యతక్కువగానుండుట కొకకారణము.

(2) జీర్ణాశయములో వాయువునిండినందున పొట్టఉబ్బును. అందువలన పాలుత్రాగినవెంటనే కక్కుదురు, శిశువులు పాలుత్రాగునపుడు ముఖ్యముగ పీకెపాలుత్రాగునపుడు వాయువు జీర్ణాశయములోఁజేరును,

అట్లువాయువు జీర్ణాశయములోనికి పోకుండునట్లు తల్లి శ్రద్ధవహింపవలెను. కొలదిగా పాలున్న స్తనము లేక పీకెను చప్పరించునపుడు వాయువులోనికిఁబోవును. వాయువును ఆహారమును ఒకేసారికేసికొనునప్పుడుకూడ యిట్టిస్థితి సంభవించును. వాయువుతో నిండియున్నందున పొట్టయుబ్బి పాలనుకక్కుచున్నదని తెలిసినవెంటనే బిడ్డను పరుండఁబెట్టి కొంతసేపు నిద్రపోనీయవలెను.

శిశువుల అజీర్ణవ్యాధి:— ఈవ్యాధిచే పాలుత్రాగిన ఒకటిరెండు గంటలలో కక్కుదురు. ఇట్లుకక్కిన పాలలో జీర్ణాశయములోని కొన్నిరసములు కలసియుండును; సాధారణముగ శ్లేష్మముకూడనుండుటకలదు. రోగము ముదిరినచో పైత్యరసముయొక్కయు రక్తముయొక్కయు బిందువులుకూడ కలసియుండును. బిడ్డకుఁగొలఁదిగ జ్వరముకూడ ఆవహించును. ఇట్టిస్థితిలో నెంతమాత్ర ముపేక్షపనికిరాదు. వైద్యుని తోడ్పాటు వెంటనే పొందవలెను. ఈలోపుగ అద్దుడు కాగితమునుండి వడియకట్టిన స్వచ్ఛమైన సున్నపునీరు ఒకచిన్న గరిటెడు చొప్పున ప్రతిసారియు ఇచ్చుపాలలోఁగలిపి యీయవలెను. లేదా ప్రతిసారి 3 నుండి 5 గ్రైనులవఱకు సోడా 'సాయిట్రాస్' కలిపి యీయవలెను.

(3) జీర్ణాశయముయొక్క దిగువభాగముతో ప్రేవుల సంయోగము చేసిన సంభవించును. ఇది ప్రేవుల సంబంధమగు వ్యాధి. దీనిచే మాటి మాటికి బిడ్డలు కక్కుదురు. ఇట్టిది తేలికగ కుదురునది కాదు. పెద్ద పెద్ద వమనము వెళ్లుటయు జ్వరములేకుండుటయు నీవ్యాధి లక్షణములు. బిడ్డ మిక్కిలిగ నేడ్చును. ఇది కఠినమగు వ్యాధి. వెంటనేవైద్యుని పిలువనంపవలయును.

(4) ప్రేవులలోని అవరోధము:— ఈవ్యాధి సోకిన ప్రతిశిశువునకును వమనములు పెద్దవిగనే వెళ్లిపోవుచుండును. అయినను కొందఱకీ వ్యాధిలో వమనములే యుండవు. ఈయవరోధము సాధారణముగ పుట్టుకలోనే యుండును. జీర్ణకోశముయొక్క క్రిందిభాగమున చిన్నప్రేవుయొక్క ఆరంభములోని ముడుతలో ఈయవరోధము కలుగును. పాలుత్రాగినవెంటనే కక్కివేడలును. వమనము వెడలునప్పుడు ఆయాసముండును. వమనములో నొకప్పుడు పైత్యరసమును మలమును వెడలుట కూడకలదు. ఇది కఠినమైన వ్యాధి. కుదురుట కష్టము. మంచి వైద్యుని తోడ్పాటవసరము.

(5) ప్రేవులనంటి యుండెడి సన్నని పొర పుండుపడుట ఈవ్యాధివచ్చినచో మాటిమాటికి వాంతులు వచ్చును. 'ఎపిండిసిటిసు' అనువ్యాధికిగూడ యిదియే లక్షణము. జ్వరముకూడ యుండును. వైద్యుని తోడ్పాటు నొందవలయును.

(6) వివిధ విధములగు నాడీసంబంధమగు వ్యాధులు:—శిశువుల తలలో వాపుపుట్టినచో 'మెనింజాయిటిస్' అనువ్యాధివచ్చును. వమనము వచ్చునపుడు మిక్కిలి ఆయాసపడుదురు. పాలు ఇచ్చినను ఈయకపోయినను పిల్లలు ఈవ్యాధియున్నచో వమనముచేయుచునే యుందురు అనఁగా నిట్టి వమనమునకును ఆహారమునకును నెట్టి సంబంధము లేదని గుర్తింపవలెను. వైద్యుని తోడ్పాటవసరము.

(7) ఇతరజ్వరములలోను విషపడిసెము చలిజ్వరము మున్నగు వ్యాధులు వచ్చుటకుఁ బూర్వమును వమనములగును. చంటిబిడ్డలకు మాత్రమేగాక ఎదిగిన వయస్కులగు బాలబాలికలకును ఈస్థితి కలుగును. అతి జాగ్రతగఁజూచి లక్షణముల కనిపెట్టవలెను. వైద్యునితోడ్పా టవసరము.

(8) రక్తములో అనేక విధములగు విషపదార్థములు చేరినందున వమనములు వచ్చును. త్రాగిన పాలనుండి లేక తిన్న ఆహారమునుండి విషపదార్థములు ఉదరములోఁ బ్రవేశించినపుడు జీర్ణకోశముచేతనో ప్రేవుల

చేతనో అడ్డుకొనఁబడి వమనములు పుట్టును. మూత్రాశయ సంబంధమగు వ్యాధిచే వమనములు కల్గినచో మూత్రపరీక్షచేఁ దెలిసికొనవచ్చును. ఇతరకారణములచేఁ దెలిసికొనవచ్చును. ఇతరకారణములచే విష పదార్థములు జీర్ణాశయములో నిలువయున్నందున వమనములు గలిగినచో వమనములను బరీక్షించి తెలిసి కొనవచ్చును. అట్టిస్థితిలో తఱచుగను ఎక్కువగను జలమును త్రాగనీయవలెను. అందువలన తఱచు మూత్రము వెలువడును. ఆమూత్రమునుండి విషపదార్థములు కొంతభాగము పోవును.

(౯) కంఠనాళమున కుత్తేజము కలిగినందున కూడ కొందఱకు వాంతి వెడలును. బిడ్డలు సర్వదా నోటి యందు వేలుపెట్టి ఆడుటచే నిట్టిస్థితి సంభవించును. జీర్ణాశయములో సూక్ష్మజీవులు పుట్టుటచేతఁగూడ వమనవ్యాధి కలుగును. ఈ వ్యాధికి దాసిమ్మ ఆకురసపు బొట్లు 15, 20-శుభ్రమైన సున్నపునీటితో లేక కొంచెము కొబ్బరిపాలతో నిత్యము ఉదయము కొన్నిదినము లిచ్చినచో మంచి ఫలితము కలుగును.

దంతములు వచ్చునపుడు వమనములు వెళ్లును. ఇది ప్రమాదమైనదికాదు. అయినను వైద్యునడిగిన మందునిచ్చును.

(10) అభ్యాస వమనవ్యాధి:—ఇదిఅలవాటుచేఁ బీడించును. పూర్వమొకపుడు వమనవ్యాధిఁ గాంచుకొని అది అభ్యాసమైపోయి సదా వేధించుచుండును. కొందఱు బిడ్డలు ఇష్టములేని వస్తువును తినినంతనే కక్కుదురు. అప్పటినుండి కొన్నిదినములవఱకు ఆ వ్యాధి పీడించును. కనుక నేవస్తువుతినినందున వారికి వమన వ్యాధి కలిగినదో గమనించి అట్టి వస్తువులను బెట్టకుండ జాగ్రతవహింపవలెను. అట్లు ఇష్టములేని వస్తువులను తినవచ్చి వమన మునకుఁ గారణమైనచోఁ దరువాత సామాన్య కారణముచేతఁగూడ వమనములు కల్గును. కొందఱు పుష్టికర పదార్థము తినినంతనే కక్కుటగూడ కలదు.

(11) పురాతన వమనవ్యాధి:—దీనికిగూడ అభ్యాసమే ముఖ్యకారణము. విషపడిసెవ్యాధివలనఁగూడ యిదియేర్పడును. పెద్దదగ్గుచే గూడ వమనములు పుట్టును. క్రమముగా చిన్నదగ్గువచ్చినంతనే వమనముపుట్టును. దీనికిముందుగా దగ్గురాకుండ వైద్యునిచే మందునిప్పింపవలెను. వమనవ్యాధి యేతెరగతికిఁ జెందినదో యేలవచ్చి నదో యేస్థితిలోనున్నదో గమనించి వైద్యులు మందునిత్తురు. అప్పుడే ఆవ్యాధి నయమగును.

వమనములగుచుండుచో నశ్రద్ధచేయక వెంటనే వైద్యునితోడ్పాటు నొందు టత్యంతావసరము. సాధా రణముగ జీర్ణాశయముయొక్కయు ప్రేవులయొక్కయు లోపములచేతనుకూడ వమనవ్యాధి కలుగుచుండును. అదికూడ యెఱింగియుండవలెను. వమనవ్యాధియొక్క ఆరంభస్థితిలో శుభ్రముచేసిన సున్నపునీటిని లేక ఒక చిటికెడు 'సోడాసాయిట్రేటు'ను కొలఁదివేఁడిగానున్న నీటితోఁగాని శీతలజలముతోఁగాని కలిపి దినమునకు 3, 4 సార్లు త్రాగించిన మంచిలాభము కల్గును. మలబద్ధముతోఁగూడిన అజీర్ణమైనచో నిత్యము ఒక ఔన్సు గ్లిసరిను ఒకడ్రాము వేఁడినీటితోఁగలిపి యెనిమాచేయవలెను. తగిన శ్రద్ధతీసికొనినచో వమనవ్యాధినుండి రక్షణనొందవచ్చును.

# వసంతుడు

బి. జయగోపాలరెడ్డిగారు

భూలోక ద్యులోకముల సుగంధముచే నింపు ఓ వాసంతమా! ఎట్లు నిన్ను స్తుతింతు?

*　　*　　*　　*

చంపక మందార వనంబులనుండి పుష్పసౌరభములు గైకొని వాటిభారమును మోయజాలక మోయుచు కడు అలయుటచే కాబోలు, మృదుమందగమనమున వేంచేయుచున్నాడవు. కాలాహాల సమవిషముల గ్రక్కుచుండు కాకోదర దంష్ట్రీ యాఘాతమునకైన వెఱవక, శ్రీగంధపు వృక్షములనుండి పరిమళముల గైకొనివచ్చుట యెవ్వరికొఱకు? ఆ పరిమళానందమును నీవుమాత్రమే యనుభవించుచున్నాడవా? కాదుకాదు. అందు యిసుమంతయైన దాచుకొనక దానముచేసి, సకలజనుల హృదయనౌకలను గంధసింధువున ఆనంద తరంగ హిల్లోలములపై నాట్యమాడునట్లు సల్పుచున్నాడవే! ఎంతటినిర్భయు! ఎంతటి ఆత్మపరిత్యాగము! ఎంతటి పరసేవాపరాయణత!

*　　*　　*　　*

ఆహా! యీ తరులతాదులు యేల మందహాసము నొనర్చుచున్నవి? కోకిలలు నిరంతరము మృదుగానము సల్పుటయేల? యువతీయువకుల హృదయస్థలములేల యింత ఆనందభరములు? వీటికన్నిటికిని కారణభూతమగునది యేదియో మహోత్సవమైయుండనోపు... తెలిసినది తెలిసినది: ప్రకృతికిని వసంతునికిని జరుగుచున్న పరిణయ మహోత్సవమై యుండవలయు. ఒకపరి తిలకింపుడు! ప్రకృతిసుందరి యెంతలజ్జావతి యగుచున్నది! తన ప్రియుని ఆగమనము కోకిల కాకలి కలకలములచే తెలిసికొని, ముఖమును దాచుకొనుటకు కాబోలు, నూతనపల్లవ అవగుంఠనమును దాల్చుచున్నది! కాని మన ఋతురాజుకడ యీ మేలి ముసుగుల మఱుగులు వ్యర్థములు. తనమలయమారుతములచే ముసుగునువదల్చి ప్రకృతిముఖభాతిని పరికించుచు తన్మయత్వము నొందుచున్నాడు.

*　　*　　*　　*

మదనుడు తన ఆక్షేలనము కొఱకు బాణముల వెదకివెదకి విసిరివేసారెను. ఖిన్ను డాయెను. వసంతుడు తన మిత్రుని మనోక్లాంతిని తీర్చుటకై తన ప్రియురాలికి పవనునిచే సందేశముననంప, ప్రకృతియు తన ప్రియుని చెలికాని నిరుత్సాహమును బాపుటకై, పుంఖానుపుంఖములగు పుష్పముల పుష్పబాణుని పాదములకడ యుంచెను. ఇంతకాలము నుండియు వెదకుచుండిన యుద్ధసామగ్రి దొరకినది. ఇక కామదేవుని ఆనందమునకు నిరోధమెద్ది? తన సంపూర్ణ సామర్థ్యమును ప్రదర్శించుటకై ప్రపంచ దండయాత్రకు బయ ల్వెడలెను. పంచశరుని సుమశరములకు బలియైన ప్రాణులసంఖ్య యతీతమని తిరుగ చెప్పవలయునా?

మన్మథ వసంతులు పరమమిత్రులైనను, వారి స్వభావములు వేఱు. ఒనరించు కార్యములు వేఱు. ఒకడు వజ్రహృదయుడు. ఇతరుల వేధించి, వారు కష్టపరంపరల భారము క్రింద చితికి నలిగిపోవుచుండ, చూచుచు సంతసమును పట్టజాలక చిరునవ్వుద్వారా వెలిబుచ్చు కటికిదుర్మార్గుడు. మరియొకడు తన దయాశీలత చేతను, భూరిదానములతోడను, పరుల బాధలచూచి యిసుమంతయైన యోర్వజాలక, కంటనీరుగార్చుచు, తనసర్వస్వమును పరిత్యజింప సమర్థుడు.

కేవల వ్యతిరేక స్వభావములు కొన్నికొన్ని వేళల, అప్పటి పరిస్థితుల ప్రభావము సామీప్య సంబంధపు సూత్రములచే కట్టువడుట స్వాభావికము. అమృతము హాలాహలము ఒకే గర్భమున జన్మించినవి గావా? సుగంధము కృష్ణసర్పము ఒకే వృక్షముపై ఆధార పడియుండుట లేదా? అలాగుననే యేకసమయమునందు నాట్యరంగము నలంకరించు వీరలు యీ మన్మథ వసంతులు. దారుణ అగ్నివర్షమును కురిపించుభానుడు, శీతల అమృతమును వర్షించు సోముడు సోదరులుగారా? ఆహ్లాదపరచు వసంతమును, విసిగించు గ్రీష్మమును ప్రక్కప్రక్క తిరుగు ఋతువులుగావా? పూర్వజన్మ సుకృతముచే వీరిద్దరునుగూడ పరమ బంధువులైరి.

*  *  *  *

వసంతుడా, ఎంతటిది ఓయి నీదయ! తలచుకొన్నంతనే ఒడలు పులకరించు చున్నదే! క్రైస్తవుల మతగ్రంథమగు బైబిలునందు, ఏసుక్రీస్తు గ్రుడ్డివారికి కండ్లను, మూగవారికి వాక్కును, చనిపోయినవారికి అసువులను యిచ్చినట్లుల చదివియున్నాము,

కాని దీని సత్యాసత్యముల జ్ఞానము మాకులేదు. పురాణగాథయనియు అవిశ్వసనీయమనియు త్రోసివుచ్చిన సత్యమును నీప్రభావ మహాత్మ్యముచే ప్రత్యక్షముగ చూపుచున్నాడవే!

*   *   *   *

శరదృతువున పర్ణములు జీర్ణించినవై రాలిపోగా, మృతప్రాయముగానుండు వృక్షాదులకు నీవు నూతన ప్రాణము నొసగి చిగురుటాకులచే నలంకరించు చున్నాడవు.

కంఠస్వరము పోగొట్టుకొని సంవత్సరమంతయు మూగవలె పడియుండు కోకిలకు నీవు స్వరమునిచ్చి మృదువుగ పాడించుచున్నాడవు.

పత్రములు వికసింపమి అంధువువలె నిరాశజెందు కోరకమునకు నేత్రమ్ములనొసగి, దాని కమ్మని తావుల నల్దిక్కుల వెదజల్లుచున్నాడవు.

కాన నీమహాత్మ్యముచే ఏసుదేవుని అతిశయించిన వాడవైతివి. అందులకు సందియములేదు.

ఇట్టిదానకర్ణుడవు, స్వార్థపరత్యాగి వగుటచేతనేగదా, మానవులు, మృగములు, పక్షులు, తరులతాదులు నీరాకకై యెదురు చూచుచుండుట!

*   *   *   *

రాకరాక వచ్చిన మాఅతిథీ! మాసమ్మానమును గైకొనుము. మమ్ములధన్యులగావింపుము.

# ఆశీర్వచనము

బాలకవి నేమాని వాసుదేవమూర్తిగారు

సీ॥ చదువువార కెంతో సంతసంబును గూర్ప
దగునట్టి మంచి పద్యములతోడ,

చూచిచూడఁగ నెంతో చోద్యంబుగల్గించి
తమియింపజేయు చిత్రములతోడ,

పూర్వులచరితముల్ పూసగ్రుచ్చినయట్లు
చక్కఁగాఁదెల్పు, వ్యాసములతోడ,

సారంబుగానుండు సాంఘికంబులుగల్గి
ఘనకీర్తిగాంచెడు కథలతోడ,

గీ॥ నిండి పత్రికలన్నిట మెండుకీర్తి
బడసితివి బాల్యమున, నింక బడయగలవు,
అమ్మ! గృహలక్ష్మి! వర్ధిల్లు మమ్మ సతము
ఆయురారోగ్యములుగల్గి యవనియందు

# విధాతృస్తుతి

శ్రీమతి మల్లెసద్ది అచ్చమ్మగారు

విస్తృత సరోజపీఠికా వేదియందు,
వాణి తానగూర్చుండి యపారప్రీతి,
వీణతంత్రులు మీటుచు విశ్వగీతి,
కాంతతుల్ వెతల్ మ్రాన్పరాగ ప్రతీతి,
మఱచిపోవక భూలోక మాన్యసమితి,
కనకనిర్మిత ఘంటంబు కరమునందుఁ,
గాంతులనుజిమ్మ మోహవిభ్రాంతిపరులఁ,
జేయు వేల్పులమధ్య వీక్షించిదయను,
మూర్ఖజనసంఘ విచ్ఛేదమూలమగుచు,
శిష్టమానుషరక్షణఁ జేయుచుండి,
లోకనాటకదర్శన లోలుఁడగుచు,
బ్రహ్మయనుపేర సృష్టించి ప్రాణికోటి,
వేడ్కతోఁ బెంచుచుండె విష్ణువనెడి,
నామసంస్మరణాఘ వినాశమొంద
శివునిపేరున వీరల శిరముద్రుంచి
స్వీయమహిమను బ్రకటించు వీర్యవంతు
చిత్రగతులను బచరించు చిత్ప్రకాశు
భారతీశునమింతు నపారభక్తి.



కెమాల్ పాషా : మహిళాసంస్కారము

టర్కీ దేశమందలి మార్పులనుగురించి యిదివరలో ఒకమారీపత్రికయందే వివరములు తెలుపబడియున్నవి. అందు ముఖ్యముగ పరదాపద్ధతి యేమహనీయుని కృషిఫలితముగ నంతరించినదో అదియెట్లు క్రమముగ గలిగినదియో "గోలకొండపత్రిక" యందొకరీ క్రిందివిధమున వ్రాయుచున్నారు.

స్త్రీల యభివృద్ధికై కెమాల్ పాషా అవలంబించిన పద్ధతులు ముఖ్యముగా గమనింప దగినవి. స్వాతంత్ర్య వాయువుల పీల్చుటకు వీరి నితడు నిర్బంధించలేదు. నేటివరకు స్త్రీలు పర్దాతీసి వేయ వలయుననెడి చట్టమేమియు కల్పింపబడలేదు. వినయ విధేయతలతో ప్రార్థనలతో వీరికి దేశస్థితి సంఘస్థితి బోధించెను. తమ సహజసౌందర్యము బట్టలతో కప్పిపుచ్చుటన్యాయమని వారికెరిగించెను. సుల్తానుల కాలములలో స్త్రీలందరు నల్లరంగుగలిగిన సంచియొకటి తమశరీరములకు తగిలించుకొని యవసర సమయములందు నావలికి వెళ్లుచుండిరి. చూచువారికి వీరు భూతములుగా గోచరించుచుండిరి. ఈసంచిని వీరు పెచ్చె (బురాఖా) యని వ్యవహరించుచుండిరి. ఎంత సౌందర్యవతియైనను, యెన్ని ఆభరణములు శరీరముపైనున్నను, రాచకన్యగాని లేక సుల్తాను భార్యయైనను, పిల్లగాని ముసలిదిగాని ప్రతివారు యీభయంకరమైన సంచిని తగిలించుకొనవలసి యుండెను.

కొంతకాలమునకు తర్వాత దుస్తులలో నొకవిధమైన మార్పు సంభవించెను. కాన్స్టాన్టి నోపిల్ యందు మరికొన్ని ప్రాంతములందలి ధనికస్త్రీలు నల్లనిపట్టుకుడ్డా వేసుకొని నల్లని రంగుగలిగిన టోపియొకటి తలకుబెట్టుకొనుచుండిరి. ముఖముపై నొకవిధమైన పల్చని జాలిగుడ్డ పర్దగానుండుటకు వేసుకోగలిగిరి. రానురాను యిదియొక జాతీయదుస్తుగా మారిపోయెను. దీనిలో సహితము మార్పుగలుగుట మొదలయ్యెను.

పరిస్థితులబట్టి ముఖముపై వేయబడు జాలిగుడ్డ ద్రోసివేసినను దుస్తులుమాత్రము యథాప్రకారముగా యవియే వాడబడుచుండెను. కాని రెండుసంవత్సరములకు పూర్వము పూర్తిగా యీదుస్తులే మారిపోయినవి. శిరములపై మాత్రమొక విధమైనటోపి ధరింపబడుచున్నది. టోపియని యనుటకు వీలులేదు

ఒకసుందరమైన గుడ్డ తలపైచుట్టబడి వెనుకభాగమున ముడివేయబడుచున్నది. ఈగుడ్డ లేక నషియనుల పట్టుపట్టాను తుర్కీస్త్రీలు బషివిక్ అని వ్యవహరించెదరు. గాజీయొక్క యుత్తర్వుననుసరించి యీపట్టు పట్టాసహితము మూలకు త్రోయబడుచున్నది. డాన్సు సమయములందుగాని లేక వేరేదైన ప్రజాహిత కార్యములందు సమయము చిక్కినవెంటనే గాజీ స్త్రీలతో 'మీరా గుడ్డపేలికలు చించివేసిన యున్నకల వలెనుండి తీరెద'రని పలుకగనే వీరివాక్యముల శిరసావహించి తీసిరి. పలువురు గుడ్డపేలికల కట్టుకొని యుండు స్త్రీలతో గాజినాట్యమాడడని దేశీయులకు దెలియపరచెను. చీరములపై ప్యాటుపెట్టని స్త్రీలతో యీతడుకలిసి మాటయైనను మాటలాడడు.

దేశమునందింత యభివృద్ధి కలుగుచున్నను కొందరింకను ముఖములపై పర్దావేసుకొనుట గలదు. ఈపద్ధతి యనుసరించి వారు సహజముగా వయసుచెల్లిన వారైనను లేక పాశ్చాత్య వస్త్రములకొనుట కశక్తులైన యుండెదరు.

స్త్రీలనుండి పర్దాపద్ధతి నశించగనే దేశము బాగుపడినది. దీనితో తుర్కీస్త్రీల యభివృద్ధి ప్రారంభ మైనది. ప్రస్తుతము దేశమునందు స్త్రీలయుపయోగార్థము వాడబడు పెట్టెబండ్లుగాని, పర్దాబండ్లుగాని కనబడనే కనబడవు. కాన్స్టాంటినోపిల్ నందంతయు బహిరంగముగా టాపుకోసిన మోటారుకార్లే నేడు కనబడుచుండును.

*　　*　　*

### నాయకులలో రాజీ—

కలకత్తా కాంగ్రెసు సమయమునకు దేశమందలి కాంగ్రెసు నాయకులలో రెండు పక్షములు బయలుదేరినవి. ఒకటి అధినివేశ స్వాతంత్ర్యవాదులు, రెండు సంపూర్ణస్వాతంత్ర్యవాదులు. ఇట్టి చీలికవచ్చుటను గమనించిన మహాత్మాగాంధీ మున్నుగాగల నాయకులందరును యీ రెండు పక్షములకును సఖ్యత యేర్పడవలయునని యెంచి అధినివేశాంశమునకు కొన్ని షరతుల నంటించి రాజీకుదిర్చిరి. ఈ విషయమై శ్రీ ప్రతివాది భయంకరం రంగాచార్యులుగారు ఫాల్గుణమాసపు 'భారతి'లో నీ క్రింది విధమున వ్రాయుచున్నారు.

> కలకత్తా కాంగ్రెసులో నామోదింపబడిన రాజీతీరుమానము విషయమున స్వాతంత్ర్యవాదు లవలంబించిన వైఖరి గొంత పరీక్షింతము. తన మొదటి తీరుమానమునకు అయ్యంగారి పక్షము తీవ్ర ప్రతిఘటనము జూపినప్పుడు గాంధీజీ మరియొక తీరుమానము దేవలసివచ్చెను. ఇరుపక్షములకు నెన్నియో చర్చలు రాయబారములు జరిగినపిమ్మట, గాంధీ, మోతీలాలుగారలు కాంగ్రెసు నాయకత్వము విడిచి పెట్టెదమనిచెప్ప, దాని కంగీకరింపక త్రాడు లాగిలాగి తుదకది తెగిపోవ సిద్ధమగనున్నప్పుడు, మహాత్ముడు తమ వాదపద్ధతి నతితీవ్రముగ నిరసించినపయి స్వాతంత్ర్య వాదులు రాజీ కంగీకరించిరి. రాజీ తీరుమానము వెలువడినది. విషయనిర్ధారణసభలో మహాత్ముని తీరుమానమును అయ్యంగా రామోదించిరి. తమ పక్షమునకు జెందిన ప్రముఖులందరితో, జవహర్లాలు, సుభాష్‌బోసు, మున్నగువారితో సంప్రతించియే తామా తీరుమానము నంగీకరించినట్లు గూడ వారు ప్రకటించిరి. ఇంతటితో వివాద

మంతరించినదని యందరు పలికిరి. కాని స్వాతంత్ర్యవాదు లూరకుండలేదు. మహాసభలో తీరుమానము నెగ్గినప్పుడు వారు ప్రత్యేకముగా దమ సంఘమును సమావేశపరచి రాజీ తీరుమానమునకు సవరణ నుపపాదించుటకు తీరుమానించిరి. ఈ సంఘసభలో నధ్యక్షులగు అయ్యంగారు తాము తీరుమానము నంగీకరించుటకు ముందు పక్షసభ్యులందరితో నాలోచించి వారి యంగీకారము బడసి యుంటినని మూడునాలుగు సారులు తమ చర్య సమర్థించుకొనిరి. కాని లాభములేక పోయెను. ఆయన సమర్థనము సరికాదని యెవ్వరును సమాధానము చెప్పలేదు. సరికదా, ఆయన నొకమూలకు త్రోసివైచి మీయిష్టము వచ్చినట్లు మీరు చేయవచ్చును, మాపక్షము పక్షమంతయు తీరుమానమును బ్రతిఘటించి తీరునని సమాధానము చెప్పిరి. తుదకు తీరుమానము బ్రతిఘటించి తమ పట్టుదల ప్రకటించిరి. తమ సవరణ పోయినను పట్టుదల మాత్రము స్పష్టపరచుకొనిరి. నెహ్రూనివేదికయెడ స్వాతంత్ర్యవాదుల బాధ్యత యొక్క పరిణామము ప్రస్తుతమున కీరీతిగ ముగిసినది.

* * * *

గర్భవతులనుసరింప వలసిన విధులు—

ఆరోగ్యమునకని అనుసరింపవలసిన విధులు—అందునను స్వల్పములై కానుపించున వెన్నియోకలవు. గర్భవతులు ముఖ్యముగ ఆరోగ్యవిధులయెడ కొంత యెక్కువ శ్రద్ధ వహింపవలయును. ఈయంశముల గురించి కృష్ణదాసులాలు వితలదాసు అడ్జాగారు (ఎం. బి. బి. ఎస్) యిట్లు వ్రాయుచున్నారు.

(1) స్త్రీలు గర్భవతులగుట యొక ప్రమాదకరమగు విషయమని తలంచ కూడదు. అది స్త్రీలకు సహజకరమైనదియే గాని, అసహజముగా పరిణమించుటకుగూడ నవకాశము కలదు.

(2) హైజీను నియమములను శ్రద్ధగా ననుసరింపవలెను. పుష్టినిచ్చుశక్తి పదార్థములనే తినవలెను. మితిమీరి యేపనిని చేయకూడదు. ఉద్రేకమును కలిగించు పదార్థము లనవసరము.

(3) నోటిలోని పళ్లనుపరిశుభ్రముగా నుంచవలెను. అవసరమైనచో దంతవైద్యునిచే చికిత్స చేయించుకొనవలెను. అందువలన శిశువునకు హానికలుగునని తలచుట గొప్పపొరబాటు. పళ్లను శుభ్రముగా నుంచుట వలనను, పళ్లకు చికిత్స చేయించుటవలనను కడుపులో శిశువు సరిగా పెరుగుట కెట్టి అభ్యంతరమును కలుగదు.

* * * *

ఇంగ్లాండు దేశము—కేంద్రగ్రంథాలయములు—

పైశీర్షికతో గ్రంథాలయ సర్వస్వమందొక చిన్నవ్యాసమును వ్రాయుచు ఆంధ్ర గ్రంథాలయాభివృద్ధికిగాను అవసరములుగ కొన్ని సలహాలను శ్రీదాసు త్రివిక్రమరావుగారీ క్రింది విధమున జేర్కొనియున్నారు.

(1) ఒకతాలూకాలోగల గ్రంథాలయములన్నియు పరస్పరసహాయము జేసికొనుట. (2) పెద్ద గ్రంథాలయము ఒకతాలూకాకుగాని, రెండుతాలూకాలకుగాని కేంద్రగ్రంథాలయముగ నేర్పడుట. (3) పెద్ద పట్టణములందలి గ్రంథాలయములు మండలగ్రంథాలయములగుట. (4) వీటి అన్నింటికి పైన కేంద్రగ్రంథాలయముండుట. (5) ప్రత్యేకవిషయిక గ్రంథాలయములు—ఈప్రకారము ఇంగ్లాండులో గ్రంథాలయములు ఏర్పడిన బాగుండునని నిర్ణయించిరి.

ఈప్రకారము ఏర్పడుటవలన కేంద్రగ్రంథాలయమును ప్రత్యేక విషయిక గ్రంథాలయములును మండల గ్రంథాలయమునకు తోడ్పడగలవు. మండలగ్రంథాలయములు తాలూకా గ్రంథాలయములకు తోడ్పడ గలవు. తాలూకాగ్రంథాలయములు గ్రామగ్రంథాలయములకు తోడ్పడగలవు. ఇదిబాగుగ వ్యాప్త మగుటకుగాను అన్ని గ్రంథాలయములకును గలిపి గ్రంథముల సమష్టిజాబితా నొకదానిని తయారు చేయుటయు, గ్రంథాలయముల పుస్తకములను పంపుటకుగాను, పోస్టలు రేట్లను తగ్గించుటయు అత్యంతావశ్యకములు. ప్రభుత్వమువారి నిరంకుశపద్ధతికి లోనుగాకుండ స్వతంత్ర పద్ధతిమీదనే ఇట్టిపద్ధతి నడుపుట శ్రేయస్కరము.

వందలకొలది గ్రంథాలయములుగల ఆంధ్రదేశమందీ పద్ధతిని నడపిన జయప్రదము కావచ్చును.

* * *

నెల్లూరు అనాధ శిశు శరణాలయము—

అనాధశిశు శరణాలయములు ఆంధ్రదేశమున ఒకటి రెండుకన్న యెక్కువలేవు. అట్టిసమయమున ఆంధ్రసోదర సోదరీమణు లట్టి ప్రజాసంస్థలకు వలయు సహాయ మొసరింప వలయును. నెల్లూరు అనాధ శిశుశరణాలయ కార్యదర్శి శ్రీ ఎం. ఎస్. నరసింహారావుగారు గౌ॥ ముత్తయ్య మొదలియారుగారు శరణాలయ సందర్శన మొసరించిన విషయమును గురించి యిట్లు వ్రాయుచున్నారు.

గౌ॥ మంత్రి యస్. ముత్తయ్యమొదలియారుగారు, జిల్లాజడ్జి నారాయణరావునాయుడుగారిని, మునిసిపల్ చేర్‌మెన్ తిక్కవరపు రామిరెడ్డిగారిని, వెంటనిడుకొని తే 11-1-29 దిన సాయంత్రం 4-30 గంటకు నైశరణాలయమును దర్శించిరి. అచ్చట బాలురనుగురించి మంత్రిగారు ప్రేమతో విచారించిరి. అచ్చటనుండు అనాధశిశువుల సంఖ్య 22 అనియును అందులో నెక్కువమంది ఆది మాంధ్రు లనియును, బడికిపోవు వయసుగల బాలురందరికిని, మునిసిపల్ పాఠశాలలో విద్యగరపబడుచున్న దనియును, శరణాలయ కార్యదర్శి విశదపరచెను. జిల్లాజడ్జిగారు ఫలహారములను పంచిపెట్టగా సదరు శిశువులు సంతోషముతో నెగురులాడిరి. శిశుశరణాలయముయొక్క తెలుగు నివేదికను, మంత్రిగారికి కార్యదర్శి యిచ్చెను. మంత్రిగారు దానిని చదువునట్లు దయతో వాగ్దానమొసంగిరి. సదరు శిశు శరణాలయము యెక్కువ పోషణకుగాను ప్రభుత్వపు గ్రాంటును ఇప్పించవలసినట్లు కోరగా తమ యొక్క సానుభూతిని చూపగలనని మంత్రిగారు బదులుచెప్పిరి. అప్పుడే కొంత తమ స్వంతి విరాళము నిచ్చిరి. మంత్రిగారు తమయొక్క నిగర్వమును, మర్యాదను ఎల్లరియెడ జూపి నెల్లూరివాస్తవ్యుల పొగడ్త

లను బోధించిరి. శిశుశిక్షాలయమునకు వారిరాక, వారియొక్క దయను సుహృద్భావమును విశదపరచెను. కౌన్సిలు కార్యదర్శియైన శ్రీయుత మాణిక్యవేలు నాయకరుగారుగూడా వారితోడ నరుదెంచిరి. విజిటర్సు పుస్తకమునందు, శిశుశిక్షాలయమును గురించి మిక్కిలి మెచ్చుకొనుచు ప్రజల సహాయమునకై హృదోద్బోధనసలిపిరి.

*　　　*　　　*

## సాంఘిక రాజకీయ సమస్యలు—

సాంఘిక విషయముల గురించి పాటుపడు వారు రాజకీయముల గురించియు, రాజకీయముల గురించి పాటుపడువారు సాంఘిక విషయముల గురించియు చింతన మొనరింపరాదని కొందరు తలంచుచున్నారు కాని వీటిరెంటికిని సంబంధముకలదని తలచువారు కొందరును, సంఘము సంస్కరింపబడిననే గాని రాజకీయముగ ముక్తియుండదనియు తలంచువారు కొందరు కూడకలరు. ఈ యంశమును గురించి "ట్రిబ్యూన్" సంపాదకులు శ్రీబాబూ కాళీనాథరాయిగారు 'వేదిక్ మాగజీన్'లో నిట్లువ్రాయుచున్నారు—

> ఒకదేశము సాంఘికముగ వెనుకబడి యుండి రాజకీయ విషయములయందు ముందున కడుగిడజాలదు, అట్టులే రాజకీయముగ బానిసత్వము ననుభవించుచున్న దేశము సాంఘిక విషయములయందు ముందునను రాజాలదు. ప్రస్తుతము భారతదేశమం దుదయించియున్న సంచలనమును గమనించిన వారలు కొంత వరకు తృప్తినందగలరు. మానవునకు వ్యక్తిత్వ మెట్టులున్నదో మొత్తము దేశమునకుగూడ నట్లులే ఒక ప్రత్యేకత "ఆత్మ పరిజ్ఞానము" నుండును. ప్రతి యుద్యమమునకును ఆత్మకును దగ్గరసంబంధము గలదు. బానిసదేశమం దుదయించు అన్నియుద్యమములకువలెనే సంఘసంస్కరణోద్యమము కూడ చాల ప్రతిఘటనలకు లోనౌను. సంస్కారము పనికిరాదు పనికిరాదను వాదనలను సాగించువారు చాలమంది బయలుదేరెదరు. ఆసమయములయందును అక్కడక్కడ కొలదిమంది బయలుదేరి కలకొలది భేదాభిప్రాయములను పాటింపకుండ తమ యాదర్శముల కనువగు జీవితమును గడపుచుందురు. కాని చాల మంది తమ రాజకీయనాయకు లొసంగు అభిప్రాయముల ననుసరించియే సాంఘిక విషయములయందు కూడ వర్తించుచుందురు. అట్టి పరిస్థితులలో గావింపబడు సంఘసంస్కారము పాలిత దేశముయొక్క ఆచారముల ననుసరించుటకే కారణ మగుదయించునుగాని స్వదేశముయొక్క వ్యక్తిత్వమున కెట్టియుపకారముగాని యుండదు. ఇదివరలో ఆయా దేశములయందు ప్రబలియుండిన స్వతంత్ర భావముల ననుసరించి సంఘసంస్కార వ్యవహారములు నిర్మింపబడియుండును. ఆసాంఘిక వ్యవహారములే జాతీయజీవనముయొక్క పునాదియని చెప్పవచ్చును. అట్టియెడ రాజకీయనాయకులు జాతీయసాంఘిక దృక్పథమును గలిగియుండవలయును. రాజకీయనాయకులు రాజకీయ విషయములందెంత శ్రద్ధవహించుచుందురో అంతటిశ్రద్ధనే సాంఘిక విషయములయందుకూడ వహింపవలయును. అందువలన జాతియొక్క— ముఖ్యముగ భారతజాతియొక్క—జీవనమార్గము సంస్కరింపబడగలదు. సంపూర్ణ సాంఘికసంస్కార మొనగూడిననేగాని సంపూర్ణమగు స్వాతంత్ర్యము భారతదేశమునకలవడదని నొక్కివక్కాణింపవచ్చును.

*　　　*　　　*

సహకారమన నేమి?—

ఈ విషయమునుగురించి శ్రీ గంగరాజు రఘునాథరావుగారు 'సుజాత'లో నిట్లు వ్రాయుచున్నారు.

సహకారమను పదమునకు శాస్త్రజ్ఞులు పెక్కు నిర్వచనములు జేసియున్నారు. వానిసారాంశమంతయు నొక్కటియే. కొందఱు వ్యక్తులు సరిసమానమగు హక్కులతో, తమ ఆర్థికస్థితి అభివృద్ధిపరచుకొనుటకై నొకసంఘముగ నేర్పడుటయే సహకార మనబడును. కొందఱు వ్యక్తులనగ ఒకజాతి వారైనను, ఒక సంఘము వారైనను, ఒక వృత్తివారైనను, ఒకగ్రామము వారైనను, నుండవచ్చును. సరిసమానమగు హక్కులనగ దీనిలో సభ్యులుగ నుండువారిలో హెచ్చుతగ్గులు లేవు. అందఱికిని సమానమగు నధికారముగలదు. ధనికుడు, బీద అను వ్యత్యాసము లేదు. ఆర్థిక దుస్థితియందు సంఘముగ జేరువారు మూలధనము లేమిచే ధనసంపాదనము చేయజాలకున్నారు. ఎన్నియోకష్టములు అనుభవించుచున్నారు. ఇట్టివారు సంఘముగజేరి తమ పరిస్థితులు బాగుపరచుకొనవచ్చును. సహకారము యొక్క ముఖ్య సూత్రము ప్రేమయు, త్యాగమును నైయున్నవి. ప్రేమలేనిది పరస్పర మైత్రి కలుగ జాలదు. త్యాగము చాల ముఖ్యమయినది. సహకారమువలన ప్రతివ్యక్తి సంఘముకొఱకును, సంఘము ప్రతివ్యక్తికొఱకును, పాటుపడును.

## రసవాహిని

బులుసు రామజోగరావుగారు

రసమతి గర్భగీతి, కవిరక్షిత రత్న విశాలశీత, న
ర్మసఖ భయాభిమాన గుణమానిని, సిగ్గునతాండవించి, యా
దెస ఇసుమంతకాంచి నవదివ్యమనోరమ సల్కరింప, పెం
పెసగ, విలంబకాల మధు హేమరతీశ్వరు నంటిమాటికిన్.

వంగుచు వ్రాలె విందుల, వివాహములం జొర్రిక్రొత్తమిన్కుల
జ్జెంగుల బారులో మొదటి జీవరమామణి కంటబిల్చి, మా
యంగుల, దండియోధవర యాశయమంగళ కన్యకాత్మచే
వంగిల, ప్రేమపాశభర పార్శ్వ ముమానునిచూచి నవ్వుచున్.

# వనితాలోకము

జ్యోతిర్మయి గంగులి కన్య, ఎం. ఏ.—

ఈమె సంఘసేవాపరాయణ. ఈమె తండ్రియగు కీ. శే. ద్వారకనాథ గంగులీగారు సాధారణ బ్రహ్మసమాజ స్థాపకులలోనొకరు. అబలాబంధ బను పత్రికకు పంపాదకులు. ఈపత్రికయందు స్త్రీల యౌన్నత్యమునుగూర్చియు. దేశభక్తి గూర్చియు నిర్భయముగ తనయభిప్రాయముల వెల్లడించుచుండిరి. తల్లియగు శ్రీమతి కాదంబిని గంగులియు విద్యాధికురాలు; వైద్యవృత్తిని జేకొన్న ప్రథమ బెంగాలిగ్రాడ్యుయేటు. జ్యోతిర్మయితలిదండ్రులామెను సంఘసేవయొనర్ప నియమించిరి. ఆమెయు తనశక్త్యానుసారముగ దలిదండ్రుల ఆజ్ఞను పాలించుచున్నది. ఈమెకు బెంగాలీసాంఘిక సేవాసదనమునందును, సరోజనలినీ మెమోరియలు సంఘమునందును జోక్యముగలదు. కవితాధోరణిగలది. ఇటీవలనే మదరాసునందు జరిగిన అస్పృశ్యతానివారక సంఘమున కధ్యక్షులుగనుండిరి.

స్త్రీవిద్యకై మనసార పాటుపడుచు, జ్యోతిర్మయిగారు, తనసోదరీమణులకు విద్య గఱపుచున్నారు.

1915–వ సం॥ నుండి అనేకకళాశాలలో అధ్యాపకురాలుగనుండిరి. ఇపుడు కలకత్తాయందలి విద్యాసాగర బానిభవన్ అనువితంతుస్త్రీ శరణాలయమునకు ప్రాణమువంటిదై అందలి స్త్రీలకు ఉపధ్యాయినిగ నున్నది.

ఈయమ కొళంబో, జలంధరులందున్నపుడు కార్మికులకెక్కుడు సహాయమొనర్చినది. ఈమె వల్లనే సిలోనునందు పసిపిల్లలు తోటలయందు పనిచేయుట మాన్పబడెను. అదిగాక హిందూ సంగీత చిత్రకళాశాల యొకటినిగూడ స్థాపించెను.

శ్రీమతి వైద్యాలంకృతి రంగుబాయిగారు—

బెంగాలు మహారాష్ట్రి ఫార్మసీకి యజమానియు, జిల్లాస్కూలు బోర్డునకు సభ్యురాలును అగువైద్యాలంకృతి రంగుబాయిగారు బెల్గాం మునిసిపలు సంఘమునకు సభ్యురాలుగ నెన్నుకొనబడిరి.




బర్ద్వాను యువరాజగు మహారాజ నంబియారును, వారిభార్యయు.



డాక్టరు. మిస్. డి. ఎం. సటూరు.



శ్రీమతి దాడిబా మెహాత,

శ్రీమతి తాడీబాయిగారు—

అహమదునగరపు జిల్లా సెషన్సు జడ్జిగారిభార్య. అహమదునగరు బాలికాభటుల సంఘమునకు అధ్యక్షురాలుగ నెన్నుకొనబడిరి.

డాక్టరు మిస్. డీ. యం. సటూరుగారు బి. ఏ. ఎం. బి. బి. ఎస్—

మదరాసు వెల్లింగ్‌డన్ ప్రభ్వీగారి స్త్రీవైద్య కళాశాలయందు ఉపధ్యాయిని. ఈవత్సరమే యీమె వైద్యపరీక్షయం దుత్తీర్ణ అయినది. వేపేరి ప్రెసంటేషన్ కాన్వెంటు నందును, పిమ్మట క్వీన్ మేరి కళాశాలయందును, ప్రెసిడెన్సి కాలేజియందును చదివి అనేక గౌరవములు పొందిరి.

శ్రీమతి చందాబాయిగారు—

ఎం. ఎల్. ఏ గనుండిన నారాయన్ దాసుగారి జ్యేష్ఠకుమారి. చంద్రకుమార్ జెయిన్ అను ఆరా జమీందారుగారి కోడలు. వివాహమయిన కొంతకాలమునకే భర్త మరణించెను. అప్పటినుండి పరదాపద్ధతిని సరకుగొనక స్వవిద్యాభివృద్ధికై పాటుపడినది. సంస్కృతమునందును: జైనుల వేదాంతమునందును ప్రవీణతగలదు. తన సోదరీమణుల కుపయుక్తమగుటకుగాను హిందీభాషయందు, ఉపదేశరత్న మాల, సౌభాగ్యరత్న మాల, నిబంధరత్నమాల, మహిళారత్నమాల, మొదలగు పుస్తకముల రచించెను. ఇదిగాక తన సంపాదకత్వమున జైన మహిళాదర్శయను మాసపంచికను ప్రచురించు చున్నది. మరియు ధర్మపురమున శ్రీ జైన బాల విశ్రామమను దివ్యభవనమును కట్టించి, అందు జైన స్త్రీలకు విద్యాబుద్ధుల గఱపుచున్నది.

శ్రీమతి సునీతి మిత్రగారు—

ఈమె దేశసేవా పరతంత్ర. కలకత్తా విశ్వవిద్యాలయమునందు బి. ఏ. పరీక్షనిచ్చిన వెనుక కొన్నాళ్లు బెంగాలునందలి పాఠశాలల తనిఖీచేయుఉద్యోగమునునుండిరి. మహాత్మా గాంధిగారు ప్రచారముచేసిన అసహాయోద్యమము **(Non cooperation movement)** ననుసరించి, యీపనిని వదలుకొని, స్త్రీలయందు విద్యావ్యాప్తికల్గుటకును, సంఘోపకారమునకును పాటుపడినది. లక్నో మునిసిపలు కమిషనరుగ యిపుడీమె యెన్నుకొనబడి నందులకు సంతసించు చున్నాము. ఇట్టి సాధ్వీమ తల్లులు ముందంజవైచి భారతదేశమును వన్నెకుదెత్తురుగాక!




ప్రతి సంవత్సరమ ను అడవిజంతువులవలన 3,000ల జనులును, పాము కాటుచేత 25,000ల జనులును, యిండియా యందు మరణించుచున్నారట!!

*　　　*　　　*　　　*

దోమలకు 22 పండ్లున్నవట. సూక్ష్మదర్శన యంత్రముతో చూడవచ్చును.

పక్షవాతమునకు దోమకాటు—

పక్షవాతమును దోమలకాటువలన కుదుర్చవచ్చునని హాలెండు ద్వీప నివాసియగు జె. ఎస్. మార్షలుగారను చున్నారు. ఒకవిధమగు దోమచే మొట్టమొదట మలేరియా జ్వరముగల నొకనిని కుట్టునట్లుచేసి, పిమ్మట అదే దోమచే పక్షవాతముగల రోగిని కుట్టునట్లు చేసినయెడల, తోడనే ఆ జ్వరముచేత పక్షవాతము నయమగునట.

14 సం॥లలో 22 భాషల నేర్చుకొనుట—

లీడ్సు రైల్వేపనియందుండు హార్బీరాబిన్సన్ అను నాతనికి 22 భాషలు తెలియునట. ఇంగ్లీషు, ఫ్రెంచి, యిటాలియను, రష్యన్, జర్మను, స్పానిష్, డేనిష్ భాషల మాటాడగలడు. గ్రీకు, డచ్, పెర్షియన్, ఎస్పరాంటో, స్వీడిష్, పోర్చుగీస్, బల్గేరియన్, చైనీసు, హిందూస్థాని, అరాబిక్, టర్కిష్, లాటిన్, నార్వీజియన్, రష్యన్, సెర్బియన్, జపానీస్ భాషలందు చదువను వ్రాయను నేర్చినవాడు ఐరోపా సంగ్రామమునకు పూర్వమీతనికి యింగ్లీషు లేటిను మాత్రము తెలిసియుండెను. ఒకనాడు రైలుబండి యందొక ఫ్రెంచి కథల పుస్తకము దొరుకగా, నిఘంటువు సహాయమున దానిని చదువనేర్చెను. విరామమున్నప్పుడెల్ల అతడు విద్యాభివృద్ధి గావించుకొనుచుండెను,

అడవియందు దేవాలయములు—

ఒరిస్సానగరపు అడవులయందు రెండు పురాతనపు దేవాలయములను, ప్రొఫెసరు రకాల్‌దాసు బెనర్జీగారు కనుగొనిరి అవి క్రీ. శ. 8-వ శతాబ్దము నాటివియని తెలియుచున్నది. జాత్ నగరమున 11 అడుగుల పొడవునుగల్గి నల్లరాతితో చెక్కఁబడిన బుద్ధవిగ్రహ మొకటి సైతము కనుగొనబడెను

అప్పుసభార్యను తిరుగకోరుట—

ఆంటోనియో క్రిస్టొఫేరోయను సంగీతగాడు ల్యాన్సుహోటలునందు పనికత్తెగనున్న యొక స్త్రీని వివాహమాడెను. కొన్నాళ్లకా స్త్రీ తనభర్తకు స్నేహితుడైన పిస్తాఫాయను మరొకనిపై మరులుకొన్నది. భర్తతోడనే ఆమెను ఆ స్నేహితునికి 260 ఫ్రాంకులకు (సుమారు 26 రూప్యములు) అమ్మె కొన్నాళ్లుకాగానే వానియొద్దకు పోయి తనభార్యను అప్పగించుమని కోరెను. ఆమె ఒప్పుకొననందున తుపాకితో ఆమెను కాల్చి చంపెను. పారిసుకోర్టు వారు నేరస్థునికి 8 సం॥ల కఠినశిక్ష విధించిరి.




భారతనారీమణులు—రాజకీయములు—

మొదటిమారునకు వలెగాక సైమనుసంఘ సభ్యురాలైన శ్రీమతి సైమనుగారు తమ భర్తతో వచ్చియున్న సంగతిని చదువరులిదివరకే యెరింగియుందురు. అందు ముఖ్యముగ సైమను సతి భారతదేశమందలి మహిళోద్యమమును గురించి కొంత శ్రద్ధవహించియున్నట్లు అటనట ఇంగ్లాండు పత్రికలలో ప్రకటింపబడుచున్న వార్తలబట్టి తెలియుచున్నది. భారత నారీమణులు పురుషులతోబాటు సరిసమానముగ ప్రజాహిత సంస్థలయందు ప్రవేశించి పాటుపడ వలయుననియు అంతవరకుగాని భారతసోదరీమణులలో గమనింపదగిన యంతటి సంస్కారము జరుగదనియు ఆమె యభిప్రాయముగ ప్రకటింపబడియున్నది. స్త్రీలు స్థానిక సంస్థలయందు కూడ పాలుగొనుచుండ వలయునని కూడ నీయామె తెలిపియున్నది.

సైమను సతీమణి తెలిపియుండిన విషయము సత్యగర్భితమైనను ఆమె గమనింపవలసిన యంశములెన్నియో గలవని మా యభిప్రాయము భారతదేశమందలి పురుషులందే విద్య అంతగ ప్రబలియుండని యీ దినములయందు స్త్రీలలో మరింత తక్కువగ విద్య వ్యాప్తినంది యుండుటను సంగతిగురించి వేరుగ చెప్పనవసరములేదు. ఆదిని దేశమందలి స్త్రీ పురుషులలో విద్య వ్యాప్తినందవలయును. విద్య వ్యాప్తినందునెడ పురుషులతోబాటు స్త్రీలును ప్రజాహిత సంస్థలయందు జోక్యము తమంత తామె కలుగజేసికొనియెదరని మా యభిప్రాయము. ఆదిని ప్రభుత్వము భారతదేశమందలి విద్యావ్యాప్తికి పాటుపడవలయును. అందునకు ప్రస్తుతము వెచ్చింపబడుచున్న ధనమునకన్న యెక్కువ ధనము వెచ్చింపబడుటకు భారత ప్రభుత్వ మవకాశ మొసంగవలసియున్నది. భారత నారీ

మాఁలు ప్రజాహిత సంస్థలయందు ప్రవేశింపవలెనని చెప్పుటకు బదులు ప్రభుత్వము స్త్రీలలో విద్య వ్యాప్తి నొందుటకు వలయు ప్రయత్నములు గావించు టెంతయు నవసరమని తెలిపియుండిన మే మెక్కుడు సంతసించి యుండెడివారము.

సత్సలహాలాయివి!—

భారత ప్రభుత్వము తరపున దక్షిణాఫ్రికాయందు ఏజంటు జనరల్‌గ కొంతకాలము పనిజేసియుండిన గౌ॥ శ్రీనివాసశాస్త్రిగా రాదేశమందలి భారతీయుల కష్టనివృత్తికిగాను యెంతటి కృషి యొనరించియుండినను స్వదేశమునకు తిరిగివచ్చు సమయమున వారు ప్రదర్శించియుండిన వర్తన తీవ్రవిమర్శకు యెంతయు పాత్రమైయున్నదని నిర్భయముగ చెప్పవచ్చును. కేప్‌టౌన్ నగరమున గావింపబడిన యొకసభయం దుపన్యసించుచు దక్షిణాఫ్రికా భారతీయులు యూనియన్ ప్రభుత్వమున కనుకూల వర్తనమును ప్రదర్శింపవల యునుగాని దక్షిణాఫ్రికనులతో కలసి వ్యవహరింపరాదని సలహా యిచ్చియున్నట్లు విన నగుచున్నది. పాశ్చాత్య దేశీయుల వర్తనను గమనించు ప్రతివానికిని పాశ్చాత్యులకు ప్రతీచీఖండ వాసుల యెడనుండు అభిమాన మెట్టిదై యుండునో స్పష్టముకాగలదు. శ్వేత జాతులకు పరిపాలనాధికారముండ వలయుననియు రంగు జాతులు వారి హస్తముల క్రింద బానిసలై మెలంగవలయుననియు యెల్లవేళలను వారు తలంచుచుందురు. ఆయంశము నెరింగియు యెరుంగనట్లు శ్రీశాస్త్రిగారు వర్తించుటసంతాపకరము. ఏనాటికిగానిండు, రంగు జాతుల మధ్య సఖ్యత సౌమ్యభావములును వృద్ధిపొందవచ్చును కాని ప్రాచ్యప్రతీచీ ఖండ వాసులమధ్య విశ్వసింప దగినంతటి సఖ్యత వెలయునని తలంచుటకు వీలుకానుపించుట లేదు. అందువలన దక్షిణాఫ్రికా యందలి భారతీయులు దక్షిణాఫ్రికనులతో సఖ్యత వహించి యుండవలసియున్నది. స్వార్థముతో కూడుకొన్న యేకారణముచేత వీరిట్టిసలహా నొసంగ వలసి వచ్చెనో మాకు బోధపడుట లేదు.

దక్షిణాఫ్రికా కాంగ్రెసు అధ్యక్షస్థానము—

దక్షిణాఫ్రికాకు చాలకాలముక్రిందట ఆహ్వానముమీదనే వెళ్లియుండిన భారతీయుల యిబ్బందులను తొలగించుటకని సంయుక్త ప్రయత్నములను సాగించుటకుగాను ఆదేశ మందలి భారతీయులు కాంగ్రెసు మహాసభ నొకదానిని నెలకొల్పి సాగించుచున్నారు. ఈమహాసభ గాంధీ మహాత్ముడు, స్మట్సునేనాని మున్నగు మహనీయుల యాశీర్వాదముల నంది దినదినాభివృద్ధి నందుచున్నదని చదువరుల కెరింగింప నెంతయు సంతసించు చున్నా

రము. నాలుగువత్సరములక్రిందట ఆదేశమునకేగి చాలవరకు రాయబారమును విజయ
వంతముగ సాగించియుండిన శ్రీమతి సరోజనీదేవియే దక్షిణాఫ్రికా భారతీయుల కాంగ్రెసు
మహాసభయొక్క శాశ్వతాధ్యక్షురాలుగా నియమింపబడియున్న విషయమెల్లరెరుంగు
దురు. తమ ప్రజాహిత జీవనమందలి సగమున కెక్కువ వత్సరముల నాదేశమందే
గడపియుండిన మహాత్మాగాంధీగారుకూడ శ్రీమతి సరోజనీదేవిగారియొక్క కృషిఫలితముల
కెంతయు నాశ్చర్యపడుచుండ గా॥ శ్రీనివాసశాస్త్రిగారు తమ సేవాపరాయణత
యందును, ఫలితములందును లోపములున్నట్లుగ ప్రచారము గావించి తమకుగల
యుద్యోగపు పలుకుబడిపై పూర్ణముగ నాధారపడి శ్రీదేవిగారికి యధ్యక్షత గౌరవమింక
ముందులేకుండ జేయుటకన్న హేయమగు కార్యమింకొకటియుండదని చెప్పినందులకు మా
సోదర సోదరీమణులు మన్నింతురుగాత. ఉద్యోగమాత్రులైన యనంతరముకూడ ఆదేశమందు
కొంతయధికారము చెలాయింపవలయునన్న అధికారతృష్ణ వీరికెక్కువగనున్న కారణ
మునసే వీరింతటికార్యమునకు పూనికొనిరని నొక్కి వక్కాణింపగలము.

సైమన్‌సంఘము చేయునదేమి?—

సైమనుసంఘ సహకారము సహకారమని పలవించినవారికి చాలనిరాశగలిగించు
నొకవిషయము సర్ జాన్ సైమనుగారి నోటినుండియే వెడలియుండుట కడుంగడు శోచ
నీయము. ఉదకమండలమందలి శీతలవాయువుల కానందముగ్ధులైన సైమనుగారు తమ
నిర్ణీత కార్యక్రమమునంతటిని పూర్తిగ వెలిబలికియుండిరి. సైమనుసంఘము భారతదేశ
మందలి అన్నిసంఘముల కడనుండియు సాక్ష్యములనుగైకొని తదనుసారముగ 'న్యాయము
నాధారపడిన' యొక నివేదికను (రిపోర్టు) తయారుగావించి దానిని పార్లమెంటు యెదుట
నుంచుదురు. పాపము తమతమమొరల న్యాయముగ నాలించిన సైమనుసంఘమువారు
రాజ్యాంగప్రణాళికను తయారుచేయు సమయమున వలయు సహాయమును చేయుదురని
గంపెడాసతోనున్న వారికీవార్త యొక సమ్మెటపెట్టువంటి దనుటలో అతిశయోక్తిలేదు.
అట్టి సమయమున భారతీయుల కళ్లనీళ్లను తుడుచుటకే సైమను సహకార కేంద్ర
సంఘమును రాష్ట్రీయ సహకార సంఘములును నియమింపబడినవని గ్రహించుట
కింకేమి కష్టము!

ఎక్సైజుమంత్రి వింతవర్తనము—

"ఎక్సైజుమంత్రిగారి త్రాగుడు తత్వము" (పోలసీ)అను శీర్షికక్రింద తీవ్రముగ
విమర్శింపబడి యుండిన జస్టిసు మంత్రివర్గమునకును, మద్యపాన నిషేధ ప్రచారమునకని

పదివేల రూపాయలను వెచ్చింప తలంపడిన స్వతంత్ర మంత్రివర్గమునకును ఆంత్రరంగి కోద్దేశముల యందెట్టి భేదముగాని కానుపించుటలేదని చెప్పవచ్చును. "ఎడమచేయి తీయుడ"ని జస్టిసుపక్షము చెప్పిన దానినే 'పుర్ర చెయితీయుడ'ని స్వాతంత్రమంత్రివర్గము చెప్పుచున్నది. జస్టిసుపక్షము ప్రభుత్వమున కెక్కుడయాగ్రహము వచ్చునోయను భయమునకులోనై మద్యపాన నిషేధ ప్రచారము యిరువదివత్సరములలో పూర్తిగావింపబడగలదని కాలపరిమితి పెట్టియుండ స్వతంత్ర మంత్రివర్గము తమిళచాకచక్యమును ప్రదర్శించు చమత్కార పథముననుసరించి బహిష్కరణకని పదివేలు ఖర్చుపెట్ట నిశ్చయించి ఆపదివేల ప్రచారమువలనను ఎక్సైజు రెవిన్యూకెట్టి కొరతగాని రాకుండ జేయుటకని వలయు కట్టుదిట్టములగావించి ప్రజలకనుల దుమ్ముగొట్ట ప్రయత్నించియున్నది. మద్యపాద నిషేధవిధానమును పట్టుదలతో సాగించుటకు తమ కవకాశము లేదనియు అందువలన తామీసందర్భముననేమియు చేయజాలమనియు తమ చేతగానితనమును వీరు ప్రకటించియుండినసెంతయు బాగుగనుండెడిదిగాని ప్రజల నొకవిధముగ మభ్యపరుప ప్రయత్నించుటెంతమాత్రము సమంజసముగ కానుపించుటలేదు.

జగదీశచంద్రుని సుభాషితము—

నేడు భారత దేశమున నానాశాఖలయందలి నాయకులయందునను లోపములున్నవని చెప్పసాహసించినందులకు మమ్ములను మన్నింతురుగాక. ఇట్టివిషయమును నిర్భయముగ కాగితమున కెక్కించుటకు వలయుధైర్యస్థైర్యముల నొసంగినది శ్రీజగదీశ చంద్రుని సంభాషితమె. హిందూమహాసభవారిటీవల తప్పని పరిస్థితులేర్పడియున్న కారణాన కొలదిగ రాజకీయములయందు పాల్గొనుచున్నారుకాని వారు సాంఘికాభివృద్ధియే పరమావధియని ముఖ్యముగ తలంచుచుండిరి. ఇటులనే మతముతప్ప వేరేమియు ముఖ్యము కాదని కిలాఫత్ సంఘమువారు నిర్ణయించుకొనిరి. సాంఘికసమత్వ మలవడిన వెనుకనే రాజకీయములని దక్షిణ యిండియా యందలి కొన్ని బ్రాహ్మణేతర సంఘములభిప్రాయపడియున్నవి. ఇట్టులే రాజకీయములు చక్కబడు నెడ సాంఘికవిషయములు వాటియంతనవియే చక్కబడునని రాజకీయసంఘము లభిప్రాయపడుచున్నవి. ఇందువలనయెంతేని నష్టము వాటిల్లుచున్నదని శ్రీజగదీశచంద్రబోసుగారి టీవల కలకత్తానగరమున విశ్వవిద్యాలయ కళాశాలయందుపన్యసించుసమయమున వెలిబుచ్చియున్నారు... మత, రాజకీయ సాంఘికశాఖలయందన్నింటియందునను ఒక్కమారే సంస్కారమవసరమని

తెలుపు వీరివాక్యాంశము లెంతయు గమనార్హమైయున్నవి. అన్ని శాఖలయందునను ఒక్క మారుగనే సంస్కారము పగూడు నెడ దాన యెక్కువలాభము గలదను విషయమును భారతదేశాభివృద్ధినాశించు ప్రతివారును గమనించుటవసరము.

వ్యభిచారదురాచారము—

నగరములయందు వ్యభిచారమే వృత్తిగా సాగించుసంఖ్య దినదినముకును హెచ్చి పోవుచుండుట శోచనీయము. నగరములయందలి వ్యభిచార గృహములసంఖ్య యెక్కువ యగుచున్నది. ఈసందర్భమున బొంబాయినగరమందలి నాయకులు తగినశ్రద్ధవహించి పాటుపడుచుండుటను పాఠకులెరింగియే యుందురు. ప్రభుత్వసంస్థలయందలి నాయకులేగాక ప్రజాసంఘములును యీవిషయమై తగినశ్రద్ధవహించి పాటుపడుచున్నవి.

అట్టియెడనున మదరాసునగరమేల యీవిషయమున వెనుకబడియున్నదో మాకు బోధయగుటలేదు. మదరాసు నాయకు లీసమస్యపట్లయించుకేనియు శ్రద్ధవహించుట లేదు. ఆకారణమున వ్యభిచారగృహము లపారమై సుఖజాడ్యము లపరిమితముగ వ్యాప్తి నందుచున్నవి. ఇదివరలో జినీవానుండివచ్చిన విచారణసంఘమువారిని లెక్కలకును నేటిలెక్కలకును యెంతేని వ్యత్యాసముండునని మాయభిప్రాయము. మదరాసునాయకులు_ముఖ్యముగ పురపాలకసంఘసభ్యు లీవిషయమై వలయు శ్రద్ధవహింతురుగాక.

స్త్రీలు : ఫాక్టరీలు—

ఫాక్టరీలు, గనులు మున్నగువాటియందు స్త్రీలు పనిచేయుటవలన వారల యారోగ్యమపారముగ .. [illegible]వునవియు ఆకారణమున చట్టమందువలయు కట్టుదిట్టములు గావింపబడవలెననియు యిదివరలో ఆందోళన గావింపబడుటయు అందుమీద స్త్రీలనొక్కమారుగా పనులనుండి నిలపివేయుటకు పూనుకొనినచో దేశమున దారిద్ర్యము వ్యాపించుననియు అందులకు ఫాక్టరీలయందలి స్త్రీలసంఖ్య క్రమముగ తగ్గింపబడుటకు ప్రయత్నములు గావింపబడవలెననియు యిదివరలో నిర్ణయింపబడినది. అందుల కనుగుణ్యముగు ఫాక్టరీ చట్టములో కాలానుగుణ్యమై అవసరమగు మార్పులు గావింపబడవలయును. ఈసందర్భమున నియమింపబడిన ప్రత్యేక విచారణసంఘముయొక్క సవరణచట్టము రెండవమారా మోదమునకు బొంబాయి శాసనసభయందు ప్రవేశపెట్టబడియున్న సమయమున మిల్లు యజమానులగు కొందరు సభ్యులొక్కుమ్మడి సవరణచట్టమునందలి యంశములను పూర్తిగ విమర్శించి యిట్టిచట్ట మనవసరమనిబలికిరి. మిల్లులందు పనిచేయుచున్న స్త్రీకి మగాడువార

ములు విశ్రాంతి నొసంగవలెననియు ఆదినములకు వేతనముగ దినమునకొక యర్ధరూపాయ వంతున నియ్యవలెననియు చట్టమందుగలదు. మిల్లులయందు పనిచేయు స్త్రీలసంఖ్య తగ్గిపోవలయునని ప్రజలుకోరుచున్నారు. అందులకుగాను యిట్టిచట్టములవసరము. స్త్రీలను యెక్కువగ మిల్లులయందుపయోగించు యజమానులు యిట్టిషరతులు విధింపబడునెడ వారిసంఖ్య క్రమముగ తగ్గింతురు.

పోలీసుశాఖవారి చర్యలు—

ఇటీవల పోలీసువారు వింత పథము ననుసరించుచున్నారు. ఎచ్చోచూచినను రాజకీయ నాయకులను వారంటులైన చూపకుండ అరెస్టు చేయుచున్నారు. ఒకొక్క రాష్ట్రములో నొకొక్కమారు పలుతావులయందు అరెస్టు నొక్క మారుగనే గావించుచున్నారు. ఇటులు అరెస్టుల గావించుటను గురించి మేమేమియు చెప్పజాలము కాని వారలపై నెట్టినేరారోపణలను గాని గావింపకుండుట కొంత అసహ్యకరముగ నున్నది. దొంగలబట్టిన రీతిని హటాత్తుగా అరెస్టుచేసి ప్రజలయందు పలుకుబడి గల వారిని గైకొనుటవలన దేశమం దశాంతియె ప్రబలును గాని అదియెన్నంటికిని తగ్గదు. ఈ యంశమును ప్రభుత్వ మెంతత్వరలో గమనించిన నంతమంచిదని మాయభిప్రాయము.

# గ్రంథములు

## తీర్థయాత్రా ప్రదర్శిని—

శ్రీ ఇరంకి నరసింహమూర్తిగారిచే వ్రాయబడిన "ఆసేతుకైలాసపర్యంత సంపూర్ణ భారతదేశ సవ్యప్రదక్షిణ తీర్థయాత్రాప్రదర్శిని" యను గ్రంథము మా కార్యాలయము చేరినది. తీర్థయాత్రల నెట్లు గావించుటయో యేయేమార్గముల ననుసరింపవలయునో యేయేప్రాంతముల నెట్టియాచారములుండునో మున్నగు విషయములన్నియు నిందువివరముగ వ్రాయబడియున్నవి. గ్రంథకర్త స్వయముగ దేశమందలి అన్నిప్రాంత సంచారమొనరించి స్వయముగ చూచివచ్చిన యంశములనే గ్రంథస్తము గావించియుండెను. గ్రంథకర్త కేవలము పుణ్యస్థలములకేబోయిరాక ప్రాచీన కళాస్థానములగు అజంతా, ఎల్లోరామున్నగు గుహాప్రాంతములకేగి యుండెను. ఈగ్రంథము తీర్థయాత్రల నొనరింప నుత్సాహముగల ఆంధ్రసోదరసోదరీమణుల కెక్కువ యుపయోగింపగలదు. గ్రంథమువెల ఒకరూపాయి. ప్రతులువలయువారు (పశ్చిమ గోదావరిజిల్లా, భీమవరము తాలూకా, వీరవాసరంపోస్టు.) తోలేరుగ్రామమందలి గ్రంథకర్తకు వ్రాయవలయును.

## సీతారాముల పాటలు—

శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవికృత "సీతారాముల పాటలు" గ్రంథము మా కార్యాలయము చేరినది. ఇందుమొత్తము 132 పాటలుగలవు. ఇంతవరకును ఆయాగృహములయందు అందునను ముఖ్యముగ స్త్రీలచే పాడబడుచుండు పాటలవరుసల ననుసరించియిందలి పాటలు వ్రాయబడియున్న కారణమున పాడుకొను వారికి వరుసలను పట్టుటలో క్రొత్తయుండదు. గ్రంథమువెల ఎనిమిదిఅణాలు. ప్రతులువలయువారు బెజవాడ గాంధీనగర్‌నందలి గుడిపూడి రామరావుగారికి వ్రాయవలయును.

## శ్రీకృష్ణవేణీ మహాత్మ్యము—

గ్రంథకర్త శ్రీమద్దులపల్లె గురుబ్రహ్మశర్మ గారిచే నర్సారావుపేటనుండి ప్రకటింపబడిన "కృష్ణవేణీ మాహాత్మ్య" మొక పద్యకావ్యము. ఇందలికథాంశము "స్కాందపురాణాంతర్గత సహ్యాద్రిఖండస్థమగు కృష్ణా మహాత్మ్యము"నుండి గైకొనబడినది. శ్రీముదుపట్ల విశ్వనాథశాస్త్రిగారిచే ప్రకటింపబడిన పైగ్రంథము ననుసరింప బడినట్లు గ్రంథకర్త తెలిపియున్నాడు. శ్రీశైల పూర్వభాగమునగల తీర్థముల కన్నింటికిని ప్రస్తుతముగల నామములను గ్రంథకర్త పేర్కొని యున్నారు. గ్రంథమువెల ఎనిమిది అణాలు. వలయువారు ఆంధ్రవిద్యా భారతీ నిలయము, మురికిపూడిపోస్టు, నరసాపురం తాలూకా అని వ్రాయవలయును.

మొగలాయి దర్బారు—

శ్రీ మొసలికంటి సంజీవరావుగారిచే ఆంధ్రీకరింపబడి రాజమహేంద్రవరమునుండి శ్రీ అద్దేపల్లి లక్ష్మణ స్వామి నాయుడుగారిచే సరస్వతీ గ్రంథమండలియొక్క 31-వ కుసుమముగ వెలువరింపబడిన మొగలాయి దర్బారు (తృతీయభాగము)యొక్క కథాంశము గురించిగాని అనువదింపబడిన పద్ధతి విధమును గురించిగాని యెక్కువగ వ్రాయనవసరము లేదు. ఇదివరకు వ్రాసియుండిన మొదటి రెండుభాగములను చదివినవారు యీతృతీయ భాగముయొక్క చక్కదనమును గ్రహింపగలరు. శైలిసులభమై యిది స్వతంత్ర గ్రంథము వలె కన్పట్టుచున్నది. కథాంశము రసవంతమై అద్భుత సంఘటన సంయుతమై యున్నది. వెల రు 1-8-0.

శ్రీసంజీవరావుగారు ఆంధ్ర సంజీవనీ గ్రంథ మాలా కుసుమములుగ విశాఖపట్టణము నుండి ప్రకటించి యుండిన చరిత్ర సంబంధమగు "బక్సారుయుద్ధము" 0-10-0, ప్లాసీయుద్ధము (0-4-0) గ్రంథములు కూడ మాకార్యాలయము చేరినవి. ఏవిధమున ఆంగ్లేయులు భారతదేశమందు మకామువేయ ప్రయత్నించిరో యీ గ్రంథములందు వ్రాయబడియున్నది.




సచిత్ర మాసపత్రిక

సంపాదకుఁడు

డాక్టర్. కే. ఎన్. కేసరి

సంపుటము 2.] [సంఖ్య. 3

లోధ్ర ముద్రాలయము, మద్రాసు

1929

From M.R.Ry. A. Narayana Rao Garu, B.A., LL.B.,
President, Taluk Board, Penukonda.

To The Editor,
Grihalakshmi, Telugu Monthly Journal,
Post Box, 752, Egmore, Madras.

RLC No. 261 29 dated 8-4-1929.

Sir,

The Board has in its resolution No. 586, dated 23-3-29 sanctioned to subscribe for the supply of 5 copies of the Journal "Griha Lakshmi." Please supply the journals to the Head Masters of the following schools and submit a bill for payment of the annual subscription due for the same.

1. Penukonda Hindu Girls School. 2. Hindu Girls School. Madakasira. 3. Hindu Girls School, Amarapuram. 4. Hindu Girls School, Hemavathy, 5. Hindu Girls' School, Agali.

(Sd.) A. NARAYANA RAO.
*President.*

---

L. Dis. No. 2897 of 1928-29 dated 4th April 1929.

From
M.R.Ry. Rao Sahib V. Sree Ramulu Naidu Garu,
Chairman, Municipal Council, Ongole.

To The Editor,
Grihalakshmi, Post Box, 752, Egmore, Madras.

Sir,

The Council sanctioned the supply of one copy of monthly Journal "Grihalakshmi" to the Municipal Higher Grade Girls' School for one year with effect from 1-4-29. Please, therefore, supply the same every month to the Headmistress of the said school. A bill may be sent to me for payment.

(Sd.) CHAIRMAN.

---

Dis. No. 455/Rp. T. B. of 1929 dated 7th March, 1929.

From
M.R.Ry. B. Venkataratnam Choudari Garu, M.L.C.,
President, Taluk Board, Ramachandrapuram.

Sir,

I have the honour to request that you will be kind enough to supply the magazine to the Headmasters of the marginally noted girls schools for one year and send the bill to this office after the completion of the year.

1. Alamur girls, 2. Artamuru, 3. Biccavole, 4. Chelluru, 5. Dangeru, 6. Draksharama. 7. Editha. 8. Kapileswarapuram. 9. Kotipalli, 10. Konkuduru, 11. Kulla, 12. Mondapet, 13. Pandalapaka. 14. Pasalapudy, 15. Ramachandrapuram, 16. Somaeswaram, 17. Tapaeswaram, 18. Vedurupaka, 19. Chodavaram, 20. Anaparty, 21. Machavaram, 22. Voolapalli.

I have the honour to be,
Sir,
Your most obedient servant,
(Sd.) PRESIDENT.

Extract from the minutes of proceedings of the
Vellore Taluk Board
passed at its meeting held at Vellore on the
14th March, 1929.

Resolution No. 27.

The President moves the Board to purchase a copy of the Telugu Monthly Journal, Grihalakshmi on payment of annual subscription of Rs. 4/- for use of the Board Girls Schools at Odugathur and Agaram.

---

SANCTIONED.

---

D. Dis, No. 186 T. B. of 1929.
Copy communicated to the Editor, Grihalakshmi, Post Box No. 752, Egmore, Madras.
Vellore Taluk Board's Office,
Vellore, dated 19th March 1929. Sd. for President.

---

From The President, Taluq Board.
Gooty.

To
The Editor,
Grihalakshmi, Post Box 752, Egmore, Madras.
Ref. Gl. No. 524/29 dated 1-4-1929.

Sir,
Please supply me with one copy of the Journal "Grihalakshmi". The Taluq Board, Gooty, has sanctioned its supply for one year from 1-4-29.

Sd. President.

---

From M. R. Ry. Ch. Koteswara Row Pantulu Garu, B.A.,
President, Taluk Board, Narasarowpet.

To The Editor,
The Grihalakshmi, Egmore, Madras.
Resc, No. 714/GL of 29 dated 2—4—29.

Sir,
Please be good enough to supply your Telugu monthly journal, one copy to each of the Headmasters of Board Girls schools, Vinukonda and Chilakaloorpet, for one year from April 1929 and the bill for their cost may be sent to this office in duplicate for payment.

Sd. President.

సం|| చందా రు. 4. విడిసంచిక అ. 6.

# గృహలక్ష్మి

స్త్రీల ఆయురారోగ్యములను పెంపొందించుట కేర్పడిన

సచిత్ర మాస పత్రిక.

సంపుటము 2. మే నెల 1929. సంచిక 3.

## విషయసూచిక.

PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

గృహలక్ష్మి.

# ప్రభుత్వము-స్త్రీల యభివృద్ధి

ప్రజలయొక్క క్షేమమును కాపాడుటకు, వలయు సాధారణ సౌఖ్యములుండు లాగున చేయుటకును, వారివారి హక్కులను కాపాడుటకును ప్రభుత్వ మేర్పడి యున్నది. ఒక దేశమువారు యింకొక దేశము వారిని పీడించుసమయములయందు వలయు కట్టుదిట్టములను గావించుట ప్రభుత్వము విధ్యుక్తధర్మములలో నొకటిగ తలంచుచున్నది. ప్రజల సౌఖ్యమనగ స్త్రీ పురుష సౌఖ్యమని యర్థమే కాని ఒక్క పురుషులయొక్క సౌఖ్యమే యని మాత్ర మర్థము చెప్ప వీలులేదు. ప్రపంచ సౌఖ్యమునకు స్త్రీ పురుషులిరువురును పాటుపడవలయునే గాని యీ రెండు శాఖలలో యేయొక శాఖ పాటువడినను అందువలన లాభముండదు.

ప్రభుత్వము పురుషులయొక్క యభివృద్ధి కెంతటి శ్రద్ధచూపునో స్త్రీల సౌకర్య మునకును అభివృద్ధికిని అంతయే శ్రద్ధ వహించవలయును. ప్రస్తుతము ప్రపంచమందలి అన్ని రాజ్యములయందలి వ్యవహారముల నొకమారు దిలకించు నెడ న్యాయమను పేర మహిళామణుల కెంతటి యన్యాయము జరుగుచున్నదో తెలియగలము. ఏ దేశమును తిల కించినను స్త్రీలకు సరియగు స్థాన మింతవర కొసంగబడియుండనట్లు తెలిసికొననగును. ప్రస్తుత మన్ని దేశములయందునను మహిళామణులు లోకైవిధమగు ఆదర్శమునకై ప్రబోధ మొనరించుచున్నారు. అమెరికాదేశమందలి స్త్రీలు ప్రభుత్వమందు పురుషులతో పాటు

సరిసమానమగు హక్కులు తమకును కావలయునని పోరాడుచుండుటయే గాక తమ పట్టుదలను నెగ్గించుకొనియున్నారు. ఇంగ్లాండునందు ఉద్యోగము లాదిగాగల విషయముల యందు ప్రస్తుతము తమకు గల లోపమును తొలగించుకొనుటకు తీవ్రప్రయత్నముల గావించుచున్నారు. టర్కీదేశమున స్త్రీలలో సంపూర్ణమగు మార్పునకు వలయు ప్రయత్నములు గావింపబడుచున్నవి. చీనాదేశమందలి యువతులు ఆదేశముయొక్క రాజకీయ వ్యవహారములను చక్కబరచుటకు పాటుపడుచున్నారు. పారసీక దేశమున స్త్రీలు అభివృద్ధికని యిపుడిప్పుడే శాంత మార్గముల ననుసరించి సంస్కార ప్రయత్నములను గావించుకొనుచున్నారని వినుటకు సంతసము. ఇంక భారత దేశ విషయముల గురించి ప్రత్యేకముగ నిట చెప్పుట పిష్టపేషణమె యగునుగాన దానిని వదలి భారత మహిళామణుల యభివృద్ధికిగాను ప్రభుత్వమెట్టి ప్రయత్నములను జేయుచున్నదో యను విషయమును గురించి కొంతవరకు విచారింతము.

రాష్ట్రములయందలి గవర్నరులును వారి వారి సతీమణులును ఢిల్లీయందలివైస్రాయియు ప్రజాహిత సంస్థలపట్ల చాలశ్రద్ధ వహింపుచు భారతదేశాభ్యున్నతికి పాటుపడుచున్నారని కొందరు చెప్పటను మేమనేకమారు లాలించియున్నారము. కాని ఈచక్రవర్తియొక్క ప్రతినిధులు చేయుచున్న సహాయము నించుక పరిశీలింతము. ఎక్కడేని యొక శిశుశరణాలయము తెరుపబడినదన ఆసంస్థయొక్క ప్రారంభోత్సవమును యేగవర్నరో లేక గర్నరు సతియో నెరపును. ఆప్రారంభోత్సవ సమయములయందు గవర్నరుగాని ఆయన సతిగాని ఆప్రజాహిత సంస్థకు యేబదిరూప్యములో అంతకుమించిన యేవందరూప్యములో తమ విరాళముగ నిచ్చెదరు. దానితో నెంతకార్యము సాగగలదు? ఎంతవరకా సంస్థ ప్రజలకు సహాయము చేయగలదు? సంస్థయొక్క ప్రారంభోత్సవమును జరిపినది చక్రవర్తి ప్రతినిధియైనను సంస్థ పోషింపబడునది భారతీయులచేతనే యనువిషయమును మనము మరువరాదు.

కాని ఇదియంతయు ప్రభుత్వముయొక్క సహాయమని మనమెట్లనుకొనుట? మార్చినెలలో దేశమందుగల వివిధరాష్ట్రములందలి శాసనసభలును సమావేశమైనవి. ఆసమయముననే భారతశాసనసభయు స్టేట్ కౌన్సిల్ను సమావేశమైనవి. వత్సరమంతలో జరిగియున్న సమావేశములన్నింటికన్న ఈమధ్య జరిగియుండిన బడ్జట్ సమావేశ మెంతయు ముఖ్యమైనది. ముందువత్సరము యేయేశాఖల కెంతెంతధనము వినియోగింప బడవలయు

నన్నవిషయము గురించి తీవ్రమగు చర్చలు గావింపబడినవి. ఆసమయములయందు స్త్రీలస్థానముగురించి గాని వారియభివృద్ధినిగురించి కాని యించుకేనియు చర్చగావింపబడి యున్నట్లు చెప్పుట కవకాశ మొదవదు. పండిత మోతీలాల్ నెహ్రూగారు భారతదేశ భావిరాజ్యాంగ విధానమునుగురించి తీర్మానమునొకటి వచ్చియుండిరి, అందు స్త్రీలకు ఓటింగు హక్కులొసంగబడి యున్నయట్లు యిదివరకే చెప్పబడియున్నదని కొందరు శాసనసభ్యులు చమత్కార వాదనలను సాగింపవచ్చునుగాని భారతమహిళలు కేవలమా ధానముతో సంతృప్తి నొందజాలరు. మహిళామణుల యభివృద్ధి విషయమున భారత శాసన సభయందలి అన్నిపక్షములవారును అశ్రద్ధనే ప్రదర్శించియుండిరి. అట్లనే రాష్ట్రీయశాసనసభ్యులును వర్తించిరి. విద్యాశాఖ విశాలమైనది గాని అందుకువలయు చర్చ ప్రస్తుతము జరుగజాలదు, యింకముందు జరుగు సమావేశములయందు స్త్రీవిద్యాది విషయములగురించిన చర్చలు జరుపబడుననికూడ కొందరుచెప్పవచ్చును. గంటలకొలదిబడి యుపన్యసింప శక్తిగలవారు తమయుపన్యాస సమయములయందొక నాలుగువాక్యములు స్త్రీలనుగురించి మాటలాడిన నేమిపోవును? మిగత సమస్యలట్లె ప్రజాప్రతినిధులగు శాసనసభ్యులు యెంతటి శ్రద్ధవహించుచుండినను యీవిషయమున మాత్రము యెట్టిశ్రద్ధను గాని వహించియుండలేదని చెప్పవలసి వచ్చినందులకు చింతిల్లుచున్నారము.

ప్రజాప్రతినిధులను గురించి కొంతవరకు చర్చించితిమిగాన యింకముందు ప్రభుత్వ మెంతవరకు భారతనారీమణుల యభివృద్ధికిగాను పాటుపడియున్నదో యించుక పరీక్షింతము. ప్రజాసంరక్షక చట్టము వోడింపబడియుండినను దానిని తిరుగ భారతశాసనసభయందు ప్రవేశపెట్టుటకు శ్రమపడియుండిన ప్రభుత్వము, గౌరు, శారదాగార్ల బిల్లులపైన ప్రజాభి ప్రాయ మవసరమని తలంచి విచారణసంఘముల నేర్పరచి కాలయాపన మొనరించుచున్న సంగతినెల్ల రెరుంగుదురు. అట్టిప్రభుత్వము రాష్ట్రీయ శాసన సభలలో గానిండు, భారత శాసనసభలో గానిండు—స్త్రీల విషయమున పెదవి మెదపి యెరుంగదని నిర్భయముగ చెప్పగలము. తాలూకా బోర్డులు, జిల్లాబోర్డులు, పురపాలక సంఘములు, విద్యా సంఘములు మున్నగువాటియందు కొంతమంది స్త్రీలకు సభ్యత్వముల నొసంగుటతోడనే తన పని తీరినట్లుగ ప్రభుత్వము తలంచుచున్నదా? బాగుగ ఆలోచించునెడ బయట బడువిషయ మిదియెయని చెప్పవచ్చును. కాని ఇట్టి వట్టి గౌరవముల వలన భారత మహిళామణులెట్లు అభివృద్ధికి రాగలరు? ప్రస్తుతము వాంఛింపబడునది మొత్తముస్త్రీల

యొక్క యభివృద్ధి. అందులకై ప్రభుత్వము పూనుకొనవలయును. దేశమందలి బాలికా పాఠశాలల సంఖ్య నేడు చాలతక్కువగనున్నది. స్త్రీల ఆరోగ్యస్థితి గతులు చాలవరకు వెనుకబడియున్నవి. స్త్రీలసాంఘిక స్థానము చక్కబరుప బడవలయునన్న ఆందోళన బయలుదేరియున్నది.

ఈ విషయములన్నింటి పట్లనెవ్వరు శ్రద్ధవహింపవలయును? ప్రభుత్వమే యిందులకు పూనుకొనవలయును. ప్రజల కష్టనష్టముల దిలకించి అందులకు వలయు సంస్కారముల గావించుబాధ్యత ప్రభుత్వముమీదనున్నది. ప్రస్తుతము బ్రిటిషుఇండియా ప్రభుత్వము చూపుచున్న అశ్రద్ధ యింతటితోనేనియు యింకిపోవలయును భారత మహిళామణుల యభివృద్ధి కవసరమగు కార్యముల గావించుటకు ప్రభుత్వము పూనుకొనవలసి యున్నది.

# వీరమాతలు

సింగంపల్లి వెంకటాద్రిగారు

భారతమాత గర్భమున నిర్వక్రమ పరాక్రమ శీలురగు నారీమతల్లు లెందరో జనన మొందిరి. వీరిచరిత్రములు నవరత్నములతో సువర్ణపత్రములపై స్థగిత మొనర్చవలసియున్నది. వీరి నామములు చేష్టలు చిరస్మరణీయములు. స్త్రీలు అబలలనుట అవివేకము. వీరవనితామణులలో కొందఱి చరిత్రము లిట వ్రాయ నభిలషించుచున్నాను.

## దుర్గావతి

పదునాఱవ శతాబ్దమధ్యమున నర్మదానదీతీరమున నొక హిందూరాజ్యమును దుర్గావతియను నారీమణి పాలించుచుండెను. 1564-వ సంవత్సరమున మొగలులు ఆమె రాజ్యమును ముట్టడించిరి. ఆ ప్రభ్వీణి ధైర్య మవలంబించి సర్వసైన్యముల సమకూర్చి స్వీయాధిపత్యమున శత్రువులతో సమర మొనర్ప సాహసించెను. ఎంతకాలమో తీవ్రముగ బ్రతిఘటించెను. కాని దురదృష్టవశమున నామెకంటికి ప్రబలమగు గాయము తగులుటచే రణరంగమునుండి మరలుట తటస్థించెను. తోడనే సైన్యములును పారిపోసాగెను. శత్రువు లామెను వెంటాడ జొచ్చిరి. దుర్గావతి యీసంగతి కనుగొని మానరక్షణార్థమై మావటివానిచేతనున్న అంకుశముగైకొని యద్దానితో ప్రాణత్యాగ మొనర్చెను. 'బోటికి మానము ప్రాణము' అనునది సత్యోక్తియే!

## చాంద్ సుల్తానా

మొగల్ ప్రభువులు అహమద్‌నగరమును 1595-వ సంవత్సరమున ముట్టడించిరి. ఆసమయముననే రాజ్యము చిందరవందరగానుండెను. ఐనను చాంద్ సుల్తానా తనచాకచక్యము వలన రాజ్యమునంగల చిక్కులన్నిటిని చక్కబెట్టుకొని సైన్యముల బ్రోగుజేసి మొగలులతో డీకొన జాలెను. రాజప్రాసాదమునుండి రణరంగమునందలి పరిస్థితులు జాగరూకతతో కనుగొనుచు వచ్చెను. కొంతవడికి తన సైనికు లపజయ మొందుటజూచి

సహింపజాలక కవచమునుదాల్చి కరవాలముఁబూని పగతురపై కొదమసింగమువలె నుఱికి అత్యంత సాహసముతో పోరాడజొచ్చెను. నిజసైన్యముల పరిపరివిధముల ప్రోత్సహించెను. యుద్ధము చాలాకాలము జరిగియుండెను. కాని కొంతకాలమునకు ఫిరంగుల ప్రేల్చుటకై సాధారణముగానుపయోగించు సీసపుగుండ్లు నిశ్శేషమైపోగా చేయునదిలేక కోశాగారముననున్న వెండి బంగారు నాణెముల కరగించి గోళముల తయారుచేయించి ప్రయోగించెనట! అవియును కొంతకాలమునకు చాలకుండుటంజేసి తన శరీరముపైనున్న సర్వాభరణముల వినియోగించి గోళముల తయారుచేయించి యుద్ధముఁగొనసాగించెనట! విశేషకాలము పోరుజరుగుటచే మొగలుల సైన్యములుఁ సన్నగిలుట సంభవించెను. అంతట సంధిపొసగెను: చాంద్‌సుల్తానా రాజ్యము శత్రుస్వాధీనముఁగాకుండ కాపాడి సత్కీర్తినొందెను.

## నూర్జహాన్

నూర్జహాన్ అనుపదమునకు జగజ్జ్యోతి యనియర్థము చెప్పవచ్చును. ఈమె జహాంగీరు పట్టమహిషి. జహాంగీరుతో బాటు యీమె నామమును నాణెములపై ముద్రింపబడు చుండెను. జహాంగీరు దుర్వ్యసనలోలుడు. ఆకారణమున నూర్జహాన్ రాజ్యతంత్రము నడపువచ్చెను. ఆమెభర్త 1620-వ సంవత్సరమున మహాబత్‌ఖానను వానిచే యోడింపబడి ఖైదీగచేయబడెను. అపుడు నూర్జహాన పురుషవేషముదాల్చి అశ్వారోహణ మొనర్చి శత్రుశిబిరమును జొచ్చి ప్రాణనాథుని బంధవిముక్తునిగ జేయ సాహసించెను. ఆమె ధనుర్బాణముల చేబూని వీరమాతవలె విజృంభించి సైనికుల ప్రోత్సహించుచు ఘోరముగ యుద్ధమొనర్చెను. ఇట్లు యుద్ధము జరుగుచుండగా నొకానొక దినమున ఆమె యధిష్టించిన మదగజము యమునానదీ ప్రవాహమునంబడి మృతినొందుట తటస్థించెను. ఆమెయు ప్రమాదస్థితి యందుండెను. భటులిదిగుఱు తెటింగి ఆమెను రక్షింపజూచిరి. ఆమె యెట్టి భయసంశయములులేక వామాంకముపై నాసీనుడైయున్న దౌహిత్రుని శరీరమున గ్రుచ్చుకొనిన బాణమును నెమ్మదిగ తీసివేయుచుండెను. భగవదనుగ్రహమున వీరిరువురును తీరమును చేరగల్గిరి. అంతటితో యూరకొనక ధైర్య సాహసముల బూని సైన్యముల బలపఱచి మహాబత్‌ఖాను నోడించి ప్రాణనాథుని బంధ విముక్తునిగజేసి కృతకృత్యురాలయ్యెను.

## కృష్ణకుమారి

కృష్ణకుమారి రాజపుత్ర స్త్రీ. ఉదయపురాధీశ్వరుని కొమరిత. జగన్మోహిని. ఈమెను చేపట్టుటకు కొందఱో రాజకుమారులు యత్నించి విఫలులైరి. కొందఱు రాణావు రులు మొంగోలరుతో యుద్ధము లొనర్చి మృత్యువాతబడిరి. వేర్వేఱ రాజపుత్ర రాజ్యమంతయు సంక్షోభమునకు గురియాయెను. ఈ యశాంతినాపుటకు మంత్రియగు రాణా సర్వశక్తులను వినియోగించెను కాని ప్రయోజనము లేకుండెను. తుదకీ సంక్షోభమునకు కారణాభూతమైన కృష్ణకుమారిని సంహరింప నాతడు నిశ్చయించుకొనెను. ఈదారుణ కృత్యమును నిర్వర్తించుటకై విశ్వాస పాత్రులగు కొందఱు రాజభటులు నియోగింపబడిరి. రాజాజ్ఞ యనుల్లంఘనీయము కదా! ఖడ్గధారులగు భటులు కృష్ణకుమారి ముఖ పద్మమును వీక్షించుట తోడనే పశ్చాత్తాప హృదయులై చంప చేతులాడక కన్నీరు కార్చుచు తిరిగిపోవుచువచ్చిరి. పాపము వారందఱు రాజదండనమునకు పాత్రులైరి. తుదకామె సోదరియగు చంద్ బాయ్ ప్రోత్సహింపబడెను. చంద్ బాయి కృష్ణకుమారి కడకేగి విషపూరితమగు నొక సువర్ణపాత్రము నొసంగి ఉదయపుర రాజ్యక్షేమార్థమై ప్రాణముల త్యజించుట భావ్యమని బోధించెను. పాపము! షోడశవర్ష ప్రాయురాలగు నాపూర్ణేందువదన పాత్రము చేబూని కొంతవడి భగవన్నామసంకీర్తన మొనర్చి "ఓ పాత్రమా! నానవయో రూప సౌశీల్యములు నీకు సమర్పించుచున్నదాన" అని పలుకుచు నెట్టి కొంకు జంకులు లేక నాపరమసాధ్వి విషమును గ్రోలి ప్రాణముల పరిత్యజించెను. లోకములో సుందరియై పుట్టుటయు గొప్ప తప్పిదము కాబోలు! తల్లీ! కుమారీ నీ జీవితము ధన్యతము. నీనామము ప్రాతఃస్మరణీయము! ఈ విషాదాంత నాటకము పందొమ్మిదవ శతాబ్దారంభమున జరిగియుండెను.

## తులసీభాయ్.

పదునెనిమిదవ శతాబ్దముననను పందొమ్మిదవ శతాబ్దముననను పిండారీలను వారు దేశమంతటిని కొల్లగొట్టుచువచ్చిరి. పిండారీలు తమ భార్యాబిడ్డలతో గుఱ్ఱములపైనను, ఒంటెలపైనను వచ్చి గుంపులుగుంపులుగా బయలుదేరి దండయాత్రలు సాగించెడివారు. 1817 వ సంవత్సరమున మహీద్ పురప్రాంతమును కొల్లగొట్టసాగిరి. మహీద్ పురాధీశ్వరియగు తులసీభాయ్ గజముపై నధిరోహించి శత్రువుల చెండాడుచు తనధైర్యస్థైర్యముల

వేవిధములఁ బ్రకటించుచువచ్చెను. దురదృష్టవశమున ఆమెయధిష్ఠించిన గజేంద్రమునకు బ్రబలమగు గాయముతగులుటచే నదిబెదరి ఘీంకారమొనర్చుచు, స్వాధీనమునకురాక పరుగిడజొచ్చెను. ఆసంధిగ్ధావస్థయందు పాపమొక బాణము తులసీభాయ్ వక్షస్థలమున నాటుటచే నామె వీరస్వర్గము ప్రవేశింప తటస్థించెను. ఈమె యుద్ధముచేయుచున్నంతవరకు పంచశరద్వయస్కుఁడగు బాలుఁడొకఁడు ఆమె వామాంకముపై నాసీనుడై యుండెనని ప్రతీతి. అతఁ డామె దత్తపుత్రుఁడట! పిల్లలనిన తల్లులకెంతటిప్రేమ! ఆదత్తపుత్రుని సోదరియగు భీమాభాయ్ వింశద్వత్సరియగు వీరకాంత. ఆమెయు రణరంగమున ఉత్తమాశ్వము నధిష్ఠించి కరవాలముబూని మహిషాసురమర్దనివలె విజృంభించి కిరాతులగు నా పిండారీలను తుత్తినియలుగావించి చిన్నితమ్ముని రాజ్యమును రక్షింపగల్గెనట! ఏమీ భీమాభాయ్ సాహస విక్రమములు.!

## సుల్తానా రిజియా

ఈమె ఢిల్లీసామ్రాజ్యమును 1236–1239 వరకు పాలించెను. ఈమె పరిపాలన మత్యంత సౌష్టవముగనుండెనని ప్రసిద్ధి. నిత్యము రాజచిహ్నములు ధరించి సింహాసనాసీనయై సకలకార్యములు నిర్వర్తించుచువచ్చెను. ఈమె సామంతప్రభువుల నాహ్వానించి వారితో స్వయముగా రాజ్యాంగ విషయములగుఱించి సంప్రదించుచుండెడిది. కొంత కాలమున కామెకును సర్దారులకును వైషమ్యములు కలిగెను. సర్దారులామె పైయుద్ధమునకు తారసిల్లిరి. ఆమెయు విజృంభించి పోరాడి పరాజితుల చేయుచువచ్చెను. కాని ఒకపర్యాయము ప్రాణముల గోల్పోవలసివచ్చెను. స్త్రీలు పురుషులకు తెలివి తేటలయందేమి, సాహస విక్రమములయందేమి యెంతమాత్రము తీసిపోజాలరు.

# ప్రాచీన భారతరమణి

## ఆమె ప్రముఖస్థానము.

పి. ఎస్. వి "టైమ్సు ఆఫ్ ఇండియా" సచిత్రవారపత్రికయం దిట్లు వ్రాయుచున్నారు:

"ఉయ్యాల నూపు హస్తమే యావద్భూభాగమును పాలన మొనరించు"నని లిఖించి యుండిన పాశ్చాత్య కవిశేఖరుల శాశ్వత సద్వాక్యములు పశ్చిమఖండములకే గాక యెక్కువగ ప్రాచ్యఖండముల పట్లకూడ నుపయోగింపబడవచ్చును. ప్రాచీన సంస్కృత కవిపుంగవులు స్త్రీని పద్మముతోడను, ఆమెయొక్క పలుకులని పుష్పసౌరభముతోడను పోల్చియున్నారు. అంతియెగాక స్త్రీ శక్తిస్వరూపిణియనియు దివ్యతేజో నిలయ యనియు కూడ గ్రంథస్థము గావించియుండిరి. "స్త్రీలు పూజింపబడినచో దేవతలు సంతుష్టినందెదరు" అని ధర్మశాస్త్రనిర్మాత, స్మృతికర్త మనువు నిర్వచించియున్నాడు. ప్రాచీన భారతరమణి సంఘమం దున్నతగౌరవముల నందుచుండెడిని. కొన్ని వేలయేండ్ల క్రితము విజ్ఞానము నీప్రాచీన దేశమున వెదచల్లియుండినది నారీమణియె యని నొక్కివక్కాణింప వచ్చును.

స్త్రీస్థాన మిదివరలో యెట్టిదైయుండెనో ప్రస్తుతస్థాన మెట్లున్నదో యను విషయమును గురించి చాల చెప్పబడియున్నది. స్త్రీ గురించి వ్రాయబడియుండిన వ్రాతలు చాలవరకు సత్యదూరములు గావింపబడినట్లును, పురుషుడు స్త్రీని మధ్యకాలమున అనుమానముతో దిలకించినట్లును యిదివరలో పలుమారులు చెప్పబడియున్నది. నిజముగ ఆదిమ పరిస్థితులే ప్రస్తుత కాలమువరకును ప్రబలియుండిన హిందూసంఘము చిన్నభిన్నములు కాకుండ ఉన్నతాశయములతో నిలచియుండెడిదని చెప్పవచ్చును. ప్రతీచీఖండము యొక్క నాగరకతకు మూలస్థానమగు ప్రాచీన గ్రీసుదేశమందలి స్త్రీలకు సామాన్య జీవనహక్కులు లేలేకుండ గావింబడియున్న సమయమున భారతరమణీమణి కొన్ని ఆస్తి హక్కులను గలిగి గౌరవస్థానము వహించియుండినది.

వైదిక పౌరాణిక ఆధునిక కాలముల మధ్య, మహమ్మదీయుల దండయాత్రలు వచ్చినవి. ఆసమయముననే కొన్ని పిచ్చియభిప్రాయములు భారతీయులలో ప్రవేశించి

యున్న కారణమున భారత స్త్రీయొక్క గౌరవస్థానమంతరించుటయు దౌర్భాగ్యస్థితి కలుగుటయు తటస్థించినది. మహమ్మదీయులు దేశమందు ప్రవేశింపగనే హిందూమతమునకే నష్టము వాటిల్లుచున్నదని గగ్గోలుపెట్టి సాంఘిక మతనియమములయందు నూతన నిబంధనలను ప్రవేశపెట్టిరి. ఆర్యమత సంబంధమగు నాగరకతాచారములన్నియు అంతటితో మటుమాయమగుటయు అనర్థహేతువులగు నూతనాచారములు ప్రజలపైన చొప్పింపబడుటయు తటస్థించినది. మతమనుపేరిట మతగురువులని చెప్పుకొనుచుండిన వారు ప్రజలనెంతేని నిర్బంధించెడివారు.

* * *

నిన్నటి తప్పిదము

స్త్రీల మానమర్యాదలను కాపాడు తలంపుతో అవలంబింపబడియుండిన పద్ధతుల మూలమున ఆమెయొక్క గౌరవ హక్కులకే నష్టమువాటిల్లినది. అందువలన నిన్నటి తప్పిదము నేడు సవరింపబడవలసియున్నది. బాల్యవివాహాచరణము, సతి, నిర్బంధవైధవ్యము మున్నగునవన్నియు నా నీలిదినముల ఫలితములె. ఈపాడు పద్ధతులను తొలగించుటకు గావింపబడుచుండిన ప్రయత్నములెల్ల రెరుంగుదురు. ఏబదివత్సరముల క్రితము గావింపబడియుండిన ప్రభుత్వ చట్టముల వలన స్త్రీలకుండిన అడ్డంకులు చాలవరకు తొలగిపోయినవి. ఛాందసాచారములవలన వచ్చిన కత్తెరబోను యొక్క శక్తి చాలవరకు నశించినది.

వేదయుగమందు స్త్రీ, కుటుంబమందును, సంఘమందును యెక్కువ పలుకుబడిని గలిగియుండెను. స్త్రీలు విద్యల నభ్యసించుటకును తమ హక్కుల గాపాడుకొనుటకును యెట్టి యాటంకములు గాని యుండెడివి గావు. ఆకాలమందలి స్త్రీ లున్నతవిద్యల నందెడివారు. స్త్రీలచే వ్రాయబడిన కొన్ని భాగములు వేదముల యందున్నవని యిందులకు తార్కాణముగ జెర్కొనబడుచున్నది. వేద విషయములయం దత్యున్నత జ్ఞాన సముపార్జన మొనర్చి పండిత ప్రకాండులమని చెప్పుకొనుచుండిన ఆకాలపు మేధావంతులతో సరిసమానముగ వాదనల సల్పిన గార్గి, మైత్రేయి, మున్నుగాగల నారీలలామలు భారత స్మృతిపథము నెన్నంటికిని దాటిపోరు.

ఆ కాలమందలి మత సంబంధమగు కర్మకాండ నాచరణయందుంచుటలో స్త్రీలు పురుషులతో పాటు సమానమగు హక్కులను గలిగియుండిరి. యజ్ఞము అగ్నిపూజ మున్నగునవి జరుపబడు సమయముల స్త్రీలు తమ విధ్యుక్త ధర్మముల నిర్వహించుచుండెడివారు. సోమయాన సమయముల ననుసరింపవలసిన విధుల నన్నింటిని స్త్రీలే

నిర్వహించుచుండిరి. గార్హస్థ్య సంబంధమగు కార్యము లన్నింటియందును స్త్రీలు పురుషులతో బాటు సమాన హక్కుబాధ్యతలను కలిగియుండిరి. పతిపత్నులు-తమ గృహమందు జరుపబడవలసిన కర్మకాండ సమయములయందు పురోహితులై మెలంగుటయు పావనాగ్నిహోత్రము ప్రవిమలమై వెలుగుచుండుటకు తగిన యేర్పాటులను స్త్రీ యాచరించుటయు ఆదినములలో మామూలైయుండెడిది.

అత్తపోరు తక్కువ

గృహనిర్వహణమందు స్త్రీ రాణివలె సర్వవిషయములయెడలను అధికారము చెలాయించుచుండెడిది. పాశ్చాత్య కుటుంబమునకువలె భార్య, భర్త, శిశువు అను మూడు వ్యక్తులతోడనే ఆర్యకుటుంబము పూర్తికాదు. ఒక ఆర్యకుటుంబమునందు పైన జెప్పినిన మూడువ్యక్తులేగాక గృహయజమాని మాతాపితలు, అన్నదమ్ములు, అక్కచెల్లెండ్రు మున్నగు వారందరునుందురు. గృహమందలి ప్రతివ్యక్తియు యువతియగు గృహిణి యొక్క యధికారము నంగీకరించి ఆమె చేయు యేకార్యమునకుగాని అడ్డంకుచెప్పకుండుట ఆచారమైయుండెను. నేడు హిందూకుటుంబములయందు "అత్తపోరు" అధికమైయుండు కారణమున గృహజీవన మందుండవలసిన ఆ సౌఖ్యభావములు అంతరించుటయేగాక సౌఖ్యమననేమియో కానబడకుండ నైపోయినది.

వివాహసమయమున వరుడు వధువునుద్దేశించి యుచ్చరించుమంత్రములు ఆమె యొక్క హక్కులెంతవరకుగలవో తెలియజేయుచున్నవి. ఆ మంత్రములయందు ఆదర్శ ఆర్యగృహిణియొక్క జీవితము నిర్వచింపబడియున్నది. అనుపమాన సౌఖ్యతేజోమయ జీవితమును, బిడ్డలను ప్రసాదించవలసినదిగను ఆదినములందలి భార్యాభర్తలు ప్రార్థించుచుండెడివారు. గోగణమును చక్కగజూచుట ఆర్యగృహిణియొక్క ధర్మములలో నొకటియై యుండెడిది. నాటికిని నేటికిని గ్రామములందలి హిందూనారీమణులు గోవుల యెడశ్రద్ధవహించుట ఆచారమైయున్నది.

వేదయుగము నెంతటివైమర్శిక దృష్టితో తిలకించినను ఆదినములయందు సంఘమందు హిందూస్త్రీ కత్యున్నత గౌరవముండెడిదనియే తేలుచున్నది. పురుషునితో సమానమగుబాధ్యత, హక్కు గలిగి ఆమె వర్తించుచుండెడిది. ఆర్యులు అనుపమాన నైతికపథమును నిర్మించుకొనిరి. బహు భార్యాత్వమును శాస్త్రము లంగీకరించియున్నవి కాని నాటి ఆర్యులు యేకపత్నీవ్రతులై హాయిగ కాలము గడపుచుండెడివారు.

# నిశీథము—నిర్యాణము

అష్టావధాని వడ్డాది సీతారామాంజనేయులు గారు, కవితాసమితి

ఓ నిగూఢ నిశీథమా! నేను నీ వి
చిత్ర నామంబుఁ దోఁచిన్నఁ జిత్తమదరి
ఈ ప్రశస్త వితానమా నీ ప్రశస్తి
నీ వినీల మనోహర త్రివిలాస
భానురాంబరగోళముల్ భయదవృత్తి
నీవు క్రమింగదవని తపించితినె కాని
అస్తమయ భాస్కరుని కిరణాళిఁ దోఁగి
మందదీప్తి వెలుంగు హిమప్రజాప
టాంతరస్థుడౌ భృగుఁడు విహాయసమునఁ
దారకావ్రాతమును గూడి తేఁరుచుండ
నహహా! మానవ దృగ్వీధి నతివిచిత్ర
మగుచు సృష్టియపారమై నెగడుచుండఁ

గని, విమర్శించి, గ్రహియింపఁగలిగి నాఁడ
భాస్కరా! ఇట్టినీయంశు పటలమందె
ఘనతమము డాఁగెనని యను కొనునెవఁడు?
పలుకకపు టల్పజీవాళిఁ బగటివేళఁ
గనుపడఁజేయు పెక్కు కామహర్గ్రహగణముల
కీవు చర్మాంధులను జేసి నావటంచు
భావగతినెఱుంగఁగఁజాలు వాఁడెవఁడు?
నిశయె మనకెంతయును దర్శనీయముగద!
కాన, సంక్షోభపడి యాత్రమూని యింక
మృత్యువునకోడి పాటిపోనేల మనసు!
నెల్లు రేయిట్లు కను బ్రోమి వేయునేని
జీవితమ్మిది మనల వంచింపకున్నె!!

# యెరుక

జి. యస్. భ్రమరాంబగారు, యువతీ హితామండలి.

హిందూసంఘమునందు వనితాలోకము నాగరికతాభివృద్ధిని గాంచుచున్న కొలదిని, ఆచారవ్యవహారములందున మూఢనమ్మకములయందును మనసున కొంత మార్పును గనపరుచుకొనుట భావ్యాభివృద్ధి కరములని చెప్పుట అతిశయోక్తికాదు.

మన స్త్రీలలో ప్రత్యేకము వ్యాప్తిజెంది నేటిదనుక మూఢవిశ్వాసముతో మనో వీధుల నాట్యము సల్పుచున్న మరియొక పెద్దవ్యాధి యెరుక, సోదె, ప్రశ్నె, శకునము యిత్యాదులు. ఇవి అన్నియు ఫలాప్తిని నొక్కటే యయినను, విధానములు వేరుకనుక వాటి రీతులించుక విమర్శింతును.

భర్త దూరదేశములనున్న పడుచులు, పొరుగూళ్లలో జబ్బుపడియున్న తమ ఆప్త బాంధవుల క్షేమవార్తాశ్రవణులైన విదుషీమణులు, దగ్గిర బంధుగుల ఆస్తినిగురించి దాయాది స్త్రీలు, యిట్లా తమ భావినిగురించి ఆతురతగలవారు వ్యాజ్యములను గురించి, వివాహదత్త స్వీకారాది సంబంధబాంధవ్యములను గురించియు ప్రశ్నించుచుందురు. ఆమెయు తన నోటికివచ్చిన దంపుళ్లపాటను పాడుచు దనయుక్తిచేత వారడుగదలచుకొన్న ప్రశ్నయు వానికి వారు శంకించుచున్న మేలుకీడులను, తత్ఫలావాప్తులను ప్రశ్నార్థ సూచకముగా వారినోటనే చెప్పించి యేదియో సంతుష్టి సూచకముగుంపరిచి, తివ్వోడు బియ్యము దక్షిణ యిత్యాదులు గొంపోవును.

తరువాత యెరుక; ఇదియును పైవిధానమును బోలినదేకాని యీమెకడ తంబూరా గాని తదితర వాద్యముగాని యుండదు. ఒక గంపను మాత్రము చంకనిడుకొని వచ్చును. అందుకొన్ని రాతికుప్పెలు, విభూతిగుండ, పసుప్రవేళ్లు మాత్ర ముండును. ఈమె, మాంకాళమ్మ, మహాగౌరి, కంచికామాక్షుల కృపాతిరేకమున వారు తననోట పలికించిన భావిఫలస్థితులు చక్కగ నెరిగింతుమని మాయజాలముచేసి వారిని వశీకృతుల

నొసర్చి విత్తము గొంపోవును. తరువాత నూనెగుడ్డల వాడు. సాధారణముగ యీ జాతిలో స్త్రీలుండరు. వీరు ఎల్లప్పుడును (యాచనా సమయముల) నూనెల తడసి యాకెన మకిలి గుడ్డలను ధరించి, వానిపై నొక (లాయరు గౌనువంటి) నూనెగౌను ధరించి గవ్వలు గచ్చకాయలు హారములుగ ధరించి, టుంబ్, టుంబ్ మను నొక వింత వాద్యముతో ప్రత్యక్షమగుదురు. ఫలమడుగ దలచిన వాకితని రావించి కూర్చుండజేసి ఆనూనె గౌను కొంగున కొంత నూనెను బోసి తక్కిన దాతని యెదుట దీపమును వెలిగించవలయును. ఆత డంతట పది చిలుక పలుకులు పలికి, దీపమార్పి ఆ నూనెను తనబుడ్డిలో పోసికొని మరిరెండు డబ్బులను గూడ సంగ్రహించుకొని పోవును.

సన్నపాటి గజము పొడవగు వేణుదండమున కొక చివర పెద్దసొరకాయబుఱ్ఱ నదికించిన తంబూరాబుఱ్ఱను మూపుపైధరించి తంత్రీస్వన మాలపించుచు 'సోదోయమ్మ సోదె చెబుతా'నని యరచు యానాది, మాదిగ, యెరుకపడుచులు వీధులందు తిరుగుచుండుట మనము దిన దినము చూచుచునే యున్నారము.

తరువాత వీరందరిని గూడ మ్రింగి పుట్టినవాడు బుడబుడక్కివాడు. ఈతడు ఇంద్రజాల మహేంద్రజాల, టక్కు టమార విద్యలనేర్చిన మాయలమారి; మోసకారి. ఈజాతిలోగూడ స్త్రీలుండరు. ఈతని చేతిలో నొక 'బుడ బుడ బుడక్కి బుడక్' మను వింతశబ్దమిచ్చు చిన్నిపరికరముండును. దానిని చెవులు గింగురెత్తునట్లు మాటి మాటికి మ్రోగించుచు, యెనుటివారి మాటచొరనీక 'అంబాపల్కవే జగదంబా పల్కవే కంచి కామాక్షీ పల్కవే గరుడ మహాలక్ష్మి పల్కవే' యని మాయదేవతా స్తోత్రమున చెవినిల్లు కట్టుకొని పోరి కొంత పరిదానము గొంపోవును. ఈతడు తన్నెవ్వరు పిలిచి భావిని ప్రశ్నింపకున్నను తన యెదుటబడిన ప్రతివానిని పరికించి నలువ విధాత్మకము నిరసించి శాసించి పల్కును. భ్రమపడినవారతని జేరుదురు. యీతడు తన దండకము మొదలిడి పచీరగుడ్డనో రవికపాతనో గొనిపోవక తీరడు.

తరువాత బావాజీ అనగా బైరాగివేషమూనినసాధు; ఈతడు ఒడలెల్ల విభూతిపూసికొని గోచిపాత, మూపున కృష్ణాజినము, చేతదండము కమండలువుధరించి జడలుగట్టినచింపిరి తలతో ప్రత్యక్షము. ఈజాతిలో దక్షిణదేశమున స్త్రీలుగూడ నుందురు. కృష్ణాగోదావరి జిల్లాలలో అరుదు. ఈరకము సాధువులు అంత నసాధువులు. ఈతడు మహాశాస్త్ర పారంగతునివలెను, మహాత్యాగ శీలునివలెను, వైరాగ్య మూర్తివలెను, గానుపించును. కాని మనమొకసారి మనయూరి బయటనున్న చెరువుగట్టున సత్రములోపల దిలకించిన వీని

సత్సంతానము భార్యాశోభస్కారము నగుటయును. ఉదయమునకే లేచి ఆవాచివోటితో నోటిచుట్టతో త్రిపుండ్రముల ధరించి వ్యాసమహర్షివలె సంచరించును. ఈ మహా వేషధారి, వంచక మహర్షి వృత్తాంత మెరుగక మనవారు ఆశ్చర్యపడి చేతులు చూపుదురు కొందరు, ప్రశ్నలడుగుట మొదలైన పిచ్చిపనులను జేయుదురు. ఇటీవల చెన్నపట్నములో ప్రస్తావించిన దిగంబర సన్యాసి ఘోరహత్యలు (గృహలక్ష్మి సంచిక) చదివిన మోసముల తెలిసికొనైన నీ జగద్వంచకుల మాయా వాగురులందు జిక్కకుందురుగాక.

తరువాతకోయజాతి 'మామలు'. వీరిలో మగవానిని 'మామా' యనియు, ఆడువానిని 'అత్తా' యనియుసంబోధింప వలయునట. వీరు బహు అసాధ్యులు. వీరిచే మోసపోయి ఆజన్మాంత దుఃఖమునందిన వారి చరిత్రముల నేను స్వయముగా వినియుంటిని. వీరితో సంభాషణము బహు ప్రమాదకరము. వీరును సోదెపడుచులవలెనే మొకాళ్ళదాకా ధరించి, గోచిపాతధరించి చేతికి వనమూలికలను కండకపియముల ధరించి నడుము కట్టినజుట్టును ముడివైచి పెద్దకుంకుమ బొట్టును పెట్టుకొని చంకను మరియొక సంచుల పంచినిగొని యాచనకువత్తురు. వీరిని యిండ్లలో చూడగనే పిలువనీయక మే, తప్పని సరియైనచో కొన్ని బియ్యపు గింజల నొసంగియో ఎంత శీఘ్రముగ పంపివైచిన నంత మంచిది. అట్లుకాక యించుక తావిచ్చి వారిని జేరనిచ్చితిమా ముప్పుముంచుగాక తీరదు. పైని పేర్కొనిన యెరుకత, సోదెపడుచు, బుడబుక్కల, బైరాగి వేషధారుల కున్ననూ ఉండకపోయిననూ, అనాగరికులగు యీకోయజాతి వారికి మంత్రములు కొండదేవతా ప్రసన్నత ఉండితీరును. దానివల్ల నయిననూ కాక పోయిననూ వీరు మన భూతకాలము నించుక గ్రహించి దానినిబట్టి కొంత భవిష్యత్తు చెప్పి, తమదేవతా మాహాత్మ్య మించుక నెరుక పరచుటకుగాను పసుపును పంచదార చేయుట, మట్టిని బెల్లము చేయుట, మొదలైన గారడీవిద్యల జూపి అబలల మనస్సుల నిట్టివశము జేసికొని తరువాత పిచ్చినమ్మకములను గలిగించి, బిడ్డమందు, గొడ్డుమందు, ఇత్యాది ఘోర విషయముల కనువైన నుపదేశము లొనర్చి వలసినంతధనము దోచుకొని కడకేమైన ముప్పును గూడ దేగల సమర్థులు.

భారతీయ సోదరీబృంద మీ విషయములలో కడుజాగరూకతతో మెలంగునుగాక. తమ భర్తలకును, అత్త, ఆడుపడుచులకును కనుగ్రాని యీ బైరాగి కోయజాతుల నమ్మి ప్రాణోపద్రవకరములగు వారిచ్చు మందుల సేవించి, తాయతులధరించి, రక్షలకట్టుకొని, దీక్షలగైకొని, సేవలుచేసి మోసపోకుందురుగాక.

పైనుదహరించిన మృషావేషధారుల దౌర్మార్గ్యనటనమం దిసుమంతయును సత్యము లేదు. అదివట్టి శశవిషాణము. ఫలము మృగ్యము. ఒకవేళ సూచాయగా కనుపించిననూ అదివట్టి మనోభ్రాంతియేగాని వేరుకాదు కోటివిద్యలు కూటికొరకే యని యేదోయొక నెపమును వేషములుగాని యివి భగవత్సంకల్పములుగావు; వీరు దేవదూతలునుగారు.

‘భం’ ‘భం’ మని శంఖమూది ‘గణ’ ‘గణ’ గంటవాయించు జంగముదేవరకును, తంబురా వాయించి తైతక్కలాడు సాతానిస్వామికిని, వీరణమువాయించి శివమూను గణాచారికిని, భస్మధారియైన సన్యాసికిని బుడబుక్కలవానికిని దేవతాప్రసన్నము, భగవత్సందర్శనమే కలిగినయెడల ఈ వీధులవెంబడి పడికాపులేమి, సత్రపు మెతుకులేమి, శుష్కోపవాసములేమి? నిరంతరనీచ దరిద్ర దేవతా వీక్షనమేమి? కల్లకల్ల. ఇట్టి జగద్వంచకులు భరతమాతకెంతయు భారముగదా! ఇట్టిమాయాకైతవవేషధారులను ప్రభుత్వమేల శాసించదు?

ఇట్టి దురన్యాయములకు పాల్పడి నాశనమొందినవారి చరిత్రము లనేకములు. నాసోదరీమణు లట్టివాటిని ప్రత్యక్షముగ నెరుంగుదురు. వాని నెల్ల స్త్రీపత్రికాముఖమున నే నారీలోకమున కెరిగించి మేలొనగూర్తురు కాక.

# బాలవితంతు విలాపము

మంగిపూడి వేంకటశర్మగారు

## II

చిన్నారి నారివై చెన్నారెడునుగాక
రహిగుల్క నేర్చునే రమణుబాసి?

బిత్తరి చిత్తరై పెంపు బెంపునుగాక
రహిగుల్క నేర్చునే రమణుబాసి?

చిత్రాల సీమవై చెలగుచుండును గాక
రహి గుల్క నేర్చునే రమణుబాసి?

చదురుల కుదురైన చదురాలగును గాక
రహిగుల్క నేర్చునే రమణుబాసి?

శీలశాలినివై ప్రకాశించుగాక
నీతివిస్ఫీతవై సంచునించుగాక
సతుల తలమానికంబుగా బ్రతుకుగాక
రహిగులుక నేర్చునే ప్రాణరమణుబాసి?

కులకాంతతో గూడి కులికెడువానికి
విధురుని చింత లేవిధిని దెలియు?

తులలేని సిరులతో తులతూగు వానికి
నిరుపేద కష్ట మేకరణి దెలియు?

స్వాతంత్ర్య భాగ్య విస్ఫీతుడౌ వానికి
బానిస బెడదలే భాతి దెలియు?

భూసురుడై పుట్టి మురిసెడు వానికి
మాలని దొసగులే మాడ్కి దెలియు?

ప్రాణపతితోడ సుఖియించు భాగ్యవతికి
బాలవిధవల దుఃఖమే భంగిదెలియు?
నింగితజ్ఞాన మించుకంతేని లేక
నోరికొలదులు నుడువుచున్నారు గాక

మున్ను పెద్దలు చేసియున్న యాచారాలు
మాకర్మవశమున మారెగాక!
ఐచ్ఛికాలై వివాహంబులు చెల్లవే
నిర్బంధములువచ్చె నేడుగాదె!
బ్రహ్మచారులవలె బ్రహ్మచారిణులును
వేలాదిగాతొల్లి వెలయలేదె!
బ్రహ్మవాదినులైన బ్రహ్మచారిణులను
పెద్దలందరు గౌరవింపలేదె!

స్త్రీలకు స్వయంవరంబులు చెల్లలేదె!
నేటికి మనీషగోల్పోయి పాటిదప్పి
తప్పుదారుల జరియించి యొప్పుదరిగి
తెలియరోగాక ద్విజకుల తిలకులార!

అందరు యోగినులై చరింపగలేరు
బ్రహ్మచర్యంబు పైపయిని లేదు
ఇంద్రియనిగ్రహం బెంత వారికిగల్గు?
భక్తిపుట్టుకదోనె పట్టువడదు
యతికైన వైరాగ్యమతి దుర్లభంబౌను
చలచిత్తమొకమాత్ర జక్కబడదు
అనుభవింపక యిచ్ఛ యణగారునది కాదు
బుద్ధియంకెకురాదు బోధవలన

శీలరక్షకు జాలు వశిత్వసిద్ధి
సాధనంవల్ల పూర్వవాసనలవల్ల
గాని యావశ్యకముజూచి కలుగ జెప్పుడు
గాన నిర్బంధ పద్ధతి మానరయ్య.

నిర్బంధములు పెట్టి నిలిపిన మాత్రాన
మా మనోరథములు మరలు నోకో?
కట్టుబాటులు చేసి కష్టపెట్టిన మాత్ర
మా యభిలాషముల్ మాయునోకో?
మా రూపురేఖలు మార్చి వేసిన మాత్ర
మా కోరికలు మాటుమణగు నోకో?
మఱెన్నింటి ప్రొద్దుల మాడ్చిన మాత్రాన
మాయిచ్చలు కృశించి మరుగునోకో?

కలుగనేరాదు కాంక్షలు కలిగెనేని
ననుభవింపక నశియింప వజునికైన
నేల నిర్బంధ నరకాలపాలు చేసి
యేడిపించెద రికజాలి జూడరయ్య.

సృష్టిపై ఖదిజూడ శృంగారమేతోచు
శుకశారికాదుల సొలపెతోచు
హరిణాదులను మనోహరలీలలేతోచు
తరులతాదుల స్నేహసరణితోచు
ఈడుజోడులజూడ వేడుకలేతోచు
చుట్టాలవగజూడ సొగపెతోచు
కోడండ్ర జాడల జూడ ముచ్చటెతోచు
తల్లిదండ్రులయెడ జూడ తమియెతోచు

ఎల్లవాతావరణ మిట్టు లేక సరణి
చిత్తముల కోరికలపేరి చిచ్చురేపి
నిలువునదహించుచుండంగ నిమిషమైన
మదినిలుప శక్యమే బాల విధవ కకట.

రంగుచీరలు దాల్ప రాదంటిరే కదా
విధిగ నెందరు మానివేసినారు?

రైకలు ధరియింప రాదంటిరే కదా
విధిగ నెందరు మానివేసినారు?

ముప్పూట భుజియింప బోలదంటిరి కదా
విధిగ నెందరు మానివేసినారు?

పువ్వులు ముడువంగ బోలదంటిరి కదా
విధిగ నెందరు మానివేసినారు?

కురులు పెంచుకొనుట కూడదంటిరి కదా
విధిగ నెంతమంది విడిచినారు?
ఎవరు నొల్లనట్టి యీఘోరనిర్బంధ
విధు లికేల తీసివేయరయ్య!

మగవారు బొడ్డున మాణిక్యములతోడ
బుట్టిరే మేమట్లు పుట్టలేదె?

భోగముల్ పొందంగ పురుషులే యోగ్యులే
యబలల కిట్టి యోగ్యతయె లేదె?

మగవారలకు మారు మనువు న్యాయంబైన
నాడువారలకు న్యాయంబుకాదె?

పురుషుల కొక ధర్మమును స్త్రీల కింకొక్క-
ధర్మంబనుట విరుద్ధంబుకాదె?

దైవముఖమును జూచిన ధర్మమేదో
తోచదే దుఃఖవార్ధి దోగుచున్న

మాకు గలిగిన యాపద మాన్పించి
శాశ్వతయశస్సుగనరే ద్విజన్ములార!

ఆడువారనంగ నస్వతంత్రలటంచు
వాదులాడుట వట్టిసోదికాదె?

ఆడుదే గృహరాజ్య మరలేక పాలించు
రాణియంటయె సత్యవాణికాదె?

ఆడుది గట్టిగా ననుకొన్న కార్యంబు
జరుగనిదొక యుదాహరణకలదె?

ఆడుదానిష్టంబు ననుసరింపక యింటి
వాడుచేసెడు దొక్కపనియు గలదె?

ఆడువారలకష్టంబు లాడువారె
చూడకుండుట మానోము సొంపుగాదె!
గట్టిగా మీరుతలచిన గడియలోనె
తప్పవేమాకు కష్టాలు తల్లులార!

శారద మైత్రేయి సరసవాణులమించు
ఘనవిదుషీమణి గణముతోడ

సతియరుంధతి సీత సావిత్రి యనసూయ
లనియెన్నదగు సతీమణులతోడ

విదులాంబ కుంతి ద్రౌపది జిజా మల్లమ
లకు సాటి వీరమాతృకలతోడ

సత్యభామ సుభద్ర ఝాన్సి రుద్రమ లట్టి
వీరనారీమణీ వితతితోడ

నాచి వెంగమ మొల్లల ద్రోచిపుచ్చు
సరస కవితారమాధురంధరులతోడ
భాగ్యములతోడ శుభపరంపరలతోడ
భరతఖండంబు సర్వదా మురియుగాక!

# తల్లి

వడ్లమూడి వేంకటరత్నముగారు

మాతృస్థాన మతి పవిత్రము. అత్యున్నతము అంతటిగౌరవము హిందూసంఘమున మఱియొకరికిలేదు. ఆమె ప్రేమమయి, ఆనందమయి. ఆప్రేమ నిర్వ్యాజము. ఆయానందము పవిత్రము. కనుకనే యాపదవికి స్త్రీలెల్లరు నభిలషించుచుందురు. ఆస్థానము నొందలేని స్త్రీలకు మఱిసంతసములేదు. ఎంత సంపదయయినను, ఎంతవిద్యయయినను వారి యావిచారమును మాన్పలేవు. వారికి సంఘమునందు గౌరవములేదు. శుష్కించిన మొఱడు వంటి గొడ్రాలను బిరుదమును వారికొసంగెదరు.

హిందూసంఘమున—స్త్రీలకుస్వాతంత్ర్యమీయక పురుషులకు దాసురాండ్రనుగఁజేసిన హిందూసంఘమున—నీమెకెంతటి గౌరవము గలదా? "మాతృదేవోభవ" అని హిందూమత ముపదేశించును. తల్లిని దైవమువలెఁజూడుము అనుటనిశ్చయమే; తండ్రిని గురువును సయితమటులనే చూడుమనుటవలన నామెకున్న విశేషగౌరవము ప్రస్ఫుటము గాదు కాని మహాభారతకారుఁడు 'జనకుం డధికుఁ డుపాధ్యాయునకుఁబదిమడుంగు లెక్కడుర్వీనాథా జనకునకు దశగుణంబులు జననిగురుత్వమున" నని చెప్పి స్పష్టపఱచినాఁడు. మనువుసయితము "సహస్రంతుపితౄన్ మాతాగౌరవేణాతిరిచ్యతే" యని ముక్తకంఠముతో వక్కాణించినాఁడు. ఇటులనే యొక పాశ్చాత్యగ్రంథకర్త 'తల్లి సమస్తప్రపంచముతోఁ దులదూగును" అని యుద్ఘాటించినాఁడు. వీనిని గమనించినచో లోకమున తల్లికొసంగిన గౌరవము మనకు బోధపడఁగలదు. ఆపదవియందలి యుత్కృష్టత నూహింపఁగలము.

బాధ్యతయున్నచోట ఫలముండును గౌరవముండును. బిడ్డయెడల నామెకున్న బాధ్యతనుబట్టియే యంతటి గౌరవ మామెకీయఁబడినది. శిశువులయెడలఁదల్లికిఁ దక్కయితరులకు బాధ్యత లేకపోలేదు, కానియామెల్లరి బాధ్యతలకంటెఁ దల్లికిఁగలబాధ్యత యధికము. అదియపరిమితమునునగును.

అయినచో నామె బాధ్యతయేమి? శిశువు లేడ్చినప్పుడెల్లఁ బాలిచ్చుటయు, స్నానము చేయించుటయు, నేదేనియపాయము కలిగినప్పుడు దానినితొలగించుటయునె కాదా?

కాదు కాదు. ఆమె బాధ్యత లీమాత్రములుగావు. ఇవియేయైనచో దాసీలుకూడ నీపని చేయఁగలరు. మాతృకర్తవ్యమల్పముకాదు. పిల్లలు కలిగినంతమాత్రముననే మాతృత్వము ఫలింపనేరదు. అయినచో పశువులకును మానవులకును భేదముండకుండును.

మఱియామె కర్తవ్యమేమి?

„గుణిగణగణనారంభే నపతతికఠినీసు సంభ్రమాద్యస్య తేనాం బాయదుసుతినీ వద వంధ్యాకీదృశీభవతి" (ఏ వనితకుమారుఁడు గుణవంతుడు కాఁడో యావనితను పుత్రవతి యని చెప్పరాదు. ఆమెయే పుత్రవతియైనచో మఱిగొడ్రాలెవతె?) అని యొకరు చెప్పియున్నారు. ఇటులనే యొక సుప్రసిద్ధ హిందీకవియు "నతరు బాంఝభలి బాది బియానీ" అనియున్నాఁడు. అనఁగా కుమారుఁడు గుణవంతుడుగానిచో నాతల్లి గొడ్రాలు. ఆపుత్రుఁడు శత్రువు అని యర్థము. దీనిని బట్టి మాతృత్వము శిశుప్రసవము చేతనే కలుగదనియు నాబిడ్డను గుణవంతునిగఁ జేయుటయందే సార్థకమగుననియుఁ దేలుచున్నది.

బిడ్డల గుణాగుణములకుఁ దల్లియే యాధారము. పసిబిడ్డఁడు తల్లి చేయఁదలంచుకొనినట్లుమాఱును. తడిమట్టి ముద్ద యథేష్టముగ మార్పవీలగునట్లు పసిబిడ్డయును మార్పవీలగును. పరిస్థితులు మొదలగువానివలన నొకకొంత పరివర్తనము జరుగుచున్నను తల్లి వలననే యతని స్వభావము నిర్ణీతమగును. తల్లి వివేకవతియైనచో వ్యతిరేక పరిస్థితులను దొలఁగించి యనుకూలావకాశముల నేర్పఱుపఁగలదు. షాజీ మహమ్మదీయ సేవాలంపటుఁడైనను జిజాబాయియే తన కుమారుఁడగు శివాజీని హైందవ ధర్మరక్షకునిగ—అకళంక దేశభక్తునిగ—ఛత్రపతిగఁ—జేసినది. జిజాబాయియే లేకున్నచో, పెద్దవాఁడైనచో నతనికే తెలియును లెమ్మని నేటిమన వెఱ్ఱితల్లుల వలె నామె యుపేక్షించినచో ఢిల్లీసామ్రాజ్యాధిపతియగు నౌరంగజేబుచక్రవర్తియంతటి వానిని నాట్యమాడించిన మన శివాజీ మహారాజు—విజాపురాధినాథుని మున్నెఁడు నీళ్లు ద్రావించి యొకరేవు పట్టించిన మన శివాజీ మహారాజుండెడి వాఁడా? తల్లియగు దేవల్దేవి శిక్షణము లేకున్నచో నపారబలుఁడును, శూరకులావతంసుఁడును తమకుఁ బ్రత్యర్థియునగు పృథ్వీరాజునకు వెఱపును, వెఱఁగును గలుగునట్లు అతని నెదిర్చి, యతని సైన్య సముద్రమును దద్దరిల్లఁ జేసిన ఆల్హాఊదలులు, అల్పవయస్సుననే-యంతటి శౌర్యనిధులు కాఁగల్గెడివారా? నేఁటికిని సప్తమహర్షులచే ప్రదక్షిణములంగొనుచు నిశ్చలపదమునొందిన ధ్రువకుమారుని యుద్యమమునకుఁగారణము తల్లి ప్రోత్సాహముగాదా? ఇట్లెన్నేని చెప్పగలము. ప్రహ్లాదుని యంభోజగర్భాదులభ్య

సింపఁగలేని హరిభక్తికిఁగారణ మెవ్వరు? ధర్మజ భీమసేనాదులును తలలువాల్చి చేతులు మొగుడ్చవలసి వచ్చిన పద్మవ్యూహ ప్రవేశకౌశల్యము నభిమన్యునకుఁ బట్టువఱచిన దెవ్వరు? ఎప్పటిమాటలోనేల? కరంచందు గాంధిని ధర్మభ్రష్టత నొందకుండ, స్వధర్మాచరణపరాయణునిగ నొనర్చితన్మూలమున భారతదేశమును పునరుజ్జీవింపజేసి యాతనిని మహాత్మునిగ నొనర్చినదెవ్వరు? తల్లిగదా! కనుకనే తల్లికంత గౌరవమున్నది. ఆమె బాధ్యతనాలోచించినచో నాగౌరవ మొక లెక్కలోనిదిగాదు. ఆమె గౌరవము నాసించఁబోదు. కాని సంఘము మాత్ర మామెను పూజింపక తప్పదు; ఆమెకు ఋణపడక తీఱదు. అట్టితల్లి దేవతతో సమానమని సాధింపఁబూన నక్కఱలేదు. అట్టితల్లియే నిజముగఁదల్లి. ఆమె బిడ్డను పెంచుటలోఁగల కష్టమును లెక్కింపదు. ఆ కష్టమామెకుఁగష్టముగనే తోఁపదు. తనచక్కఁదనమునకు వంకర వచ్చునేమోయని బిడ్డను పాలడబ్బాల పాలు సేయదు. తననాగరకతకు భంగము గలుగునేమోయని శిశువును దాసీలచేతిలోఁ బెట్టదు. పెద్దవాఁడైన వెనుకవానికే బుద్ధివచ్చును లెమ్మని తన ధర్మమును కాలమునెత్తిపైఁ బెట్టదు. నొసట వ్రాసినట్లేజరుగునని మెట్టవేదాంతమునూని! తనబాధ్యతను దైవముపై నెట్టదు. ఆమె తన కర్తవ్యమునుమానదు. తన సుఖమునామె యాలోచింపదు. తన ప్రేమకు ప్రతిఫలము నామె లెక్కసేయదు. తన బిడ్డ బాగే యామె బాగు. బిడ్డయందంత ప్రేమగలవారు మఱిలేరు. తండ్రి బిడ్డయందు తల్లివలె లీనముకాలేఁడు; అతనికది యసాధ్యము. కనుకనే రామకృష్ణ పరమహంస యొకమాఱు "భగవంతుని తండ్రియనినైనను తల్లియనినైనను తలంపవచ్చును. ఏలనన నిరువురి ధర్మములు నతనియందున్నవి. కాని బిడ్డయందు తల్లికున్న ప్రేమ తండ్రికుండదు. అమ్మాయని పిలిచి నప్పుడామెకుఁగల్గు నానందము, ప్రేమ, వాత్సల్యము, తండ్రీ యని పిలిచినప్పు డాయనకుఁగలుగఁబోదు. కనుక నే నెప్పుడును భగవానుని మాతృరూపముననే ధ్యానముసేయుచుందును." అని చెప్పినాఁడు. అట్టితల్లులు మన దేశమున కవసరముగాదా? దేశమునం దుత్సాహము ప్రసరింపక, విజ్ఞానము వ్యాపింపక, కర్తవ్యదీక్ష ప్రబలక యట్టితల్లులు విరివిగనుండరనుట నిశ్చయమే. ఆయోగ్యత గల్గుటకును తల్లులే ప్రధానకారణము.

# అశ్వినీ దేవతలు

పాశ్చాత్య దేశములందు సక్రమవైద్యచికిత్సయననేమియో తెలియని సమయముననే భారతదేశమం దాయుర్వేదవైద్యముదయించి అభివృద్ధినంది చాల ఉపయోగకారిగ నుండెననట నిర్వివాదాంశము. పూర్వకాలము ఉదరమందు పుండ్లు బయలుదేరినను శస్త్రముచేసి బాగుచేయుచుండెడు అలవాటు భారతదేశమున నుండెడిదని యిటీవలనే పరిశోధకులు కనిపెట్టియున్నారు. ఒకానొకకాలమం దత్యున్నతస్థితి నంది యుండిన నీ ఆయుర్వేదము క్రమానుగతముగ చాలవరకు నశించిపోవుట భారతదేశము యొక్క దౌర్భాగ్యముగాక వేరేమి? ఆయాకాలములయందు వనములకేగి మూలికల గుణప్రభావములను పరిశోధించుచుండిన వైద్యరాజులెందరో యీభూమిని జీవించి మరణించియున్నారు. వేదయుగమునుండియు మనదేశమున వైద్యులున్నయట్లు తెలియుచున్నది ఆమహనీయుల జీవితాంశములు లభ్యమగునంతవరకును యీపత్రికయందు ప్రకటితమగుచుండును.

ఆదియందు అశ్వినీదేవతలగురించి కొలదిగ జెప్పనెంచు.

జననము

దేవశిల్పియగు త్వష్టకొక చక్కని కొమరితయుండెను. పేరు సరణ్యు. యుక్తవయస్కయగునామె నెవ్వరికిచ్చుటయా యని యాలోచించినతండ్రి కడకు సూర్యునకిచ్చి వివాహముగావించెను. సూర్యు డందమున మిన్నయైనను తనతీక్ష్ణ కిరణములతో యెదుటి వస్తువుల మండించువాడౌటచే కుసుమకోమలగాత్రయగు సరణ్యు భయమున తనయాకృతినొప్పు నింకొకయువతిని సూర్యునికడకంపి తా నాడుగుఱ్ఱమై పారిపోయెను. ఇదియెంతకాలము దాగగలదు? కడకు సూర్యదేవునకు తనవద్దనున్నది సరణ్యుకాదని తెలియవచ్చెను. సూర్యుడు యెటులైనను తనసతిని వెదుకవలయునని కృతనిశ్చయుడాయెను. తనభార్య అశ్వాకృతిదాల్చెనని యెరింగిన సూర్యదేవుడుకూడ అశ్వమైయెల్లప్రదేశముల వెదకి తనసతియున్నయెడ మెరింగెను. ఆ యాకృతినే ఆదంపతులిరువురును కొంతకాలము గడపిరి. ఆసమయమున నాయిరువురకు కవలపిల్లలు జనించిరి. వారే అశ్వినీదేవతలు. (ఋగ్వేదము ౧౦-౧౭-౧-౨) ఈయిరువురును యెల్లవేళల నొక్కచోటనే యుండెడివారు. ఋగ్వేదమందీ యశ్వినీదేవతలయొక్క అత్యద్భుతమగు చేయిదము లనేకములు శ్లోకములలో వర్ణింపబడియున్నవి.

అశ్వినీదేవతలు దేవలోకమందలి వైద్యులై శస్త్రచికిత్స, వైద్యము మున్నగు ఆయుర్వేదాంశములగురించి విపుల గ్రంథములను రచియించిరని చెప్పబడియున్నది. వీరు దేవ దానవ ఘోరసంగ్రామ సమయమున కాళ్లు విరిగిన దేవతలకు యినుపకాళ్లమర్చి యుద్ధమున కనుపుచుండెడివారని చెప్పబడియున్నది. నూతన దంతపంక్తినమర్చుట, నేత్రములను తగిలించుట, మున్నగు మహోన్నతకార్యముల చేయుచుండెడివారు. రణరంగమున మొండెములనుండి వేరైన శిరముల నొకచోజేర్చి వురల ప్రాణప్రతిష్ఠ చేసెడివారు. తౌగ్ర్యుని సముద్రమునుండి రక్షించిరి. అగ్నిగాలిన అత్రికి సుఖమొనగూర్చిరి. కావికి, గవ్యునకును కన్నులు ప్రసాదించిరి. తొడపోయిన విశ్వలకు యినుపతొడయమర్చిరి. శుష్కించి ఒట్టిదైన శయునఋషి గోవునకు పాల నొసంగిరి. అధర్వణుడగు దధ్యకఋషికి అశ్వశిరము దవిలించి ఆతనికడ గుప్తమైయున్న మధు విద్యను సంపాదించిరి.*

దేవతల అసూయ

దినదినమునకును అశ్వినీదేవతలయొక్క పలుకుబడియు ఖ్యాతియు అపరిమితమగుచుండెను. దీనింగూర్చి కొందరు దేవతలు యీర్ష్యజెంది, అశ్వినీదేవతల నెట్లులైనను అవమానము పాలుగావింపవలెనని నిశ్చయించి వారిపై లేనినేరముల నారోపించి జాతినుండి అశ్వినీ దేవతలను వెలివైచిరి. అంతియెగాక వారు హవిర్భాగములను గొనకుండ కట్టుదిట్టములు గావించిరి. ఆ సమయాన చ్యవనమహర్షి జరాభారమున బలహీనుడై కృంగుచు కడుంగడు నిడుముల గడుచుచుండెను. చ్యవనఋషియొక్క అనారోగ్యత నెరింగిన అశ్వినీదేవతలాఋషిసత్తమునికడకేగి తాము తయారుకావించియుండిన నొక లేహ్యము (చ్యవనప్రాశ) నొసంగి ఆ చ్యవనుని .కెక్కడలేని తేజస్సును కలిగించి బాలయావనము నొసరించిరి. చ్యవనమహర్షి పరమానందభరితుడాయెను. అశ్వినీదేవతలపైన గల వెలిని తొలగింప నాతడు వారికి మాటయిచ్చి ప్రత్యేకముగ నొక క్రతువు గావించి తత్క్రతువున కశ్వినీకుమారులకూడ నాహ్వానించి యఘ్యపాద్యాదు లొసంగి సన్మానించెను.

వేదిక నలంకరించిన దేవతల మధ్య కూరుచుండిన ఇంద్రుడీచేయిదమును దిలకించి ఆగ్రహోయత్తచిత్తుడై తా నవమానింపబడెనని తలంచుచు నిర్ఘాతమును ప్రయోగించి క్రతు

---

* పై విషయములన్నియు ఋగ్వేదము ౧. మం. సూక్త ౪౬, ౪౭, ౧౧౭, ౧౧౬, ౧౨౦ ములనుండి సేకరింపబడినవి.

భంగ మొనర్పహస్తమును పైకెత్తెను. ఎత్తిన దేవేంద్రుని హస్త మాత్రక్షణమే పక్షవాతం బున ద్రాలెను. ఆయదనున ప్రతిభాశాలురగు అశ్వినీకుమారులు ఇంద్రుని కడకేగి వలయు చికిత్సగావించి పక్షవాతమును నిర్మూలించి ఇంద్రుని మన్ననలనందిరి. దానితో వెలినుండి వారువిముక్తులైరి.

ఒకమారు రుద్రుడుయజ్ఞపశువుయొక్క శిరము ఛేదించెను. దీనింగాంచిన దేవతలు మహాపరాధము జరిగినదని తలచుచు అశ్వినీదేవతల ప్రార్థింప వారాశిరమును మొండెము నొకచోనుంచి ఆయువు పోసిరి. నాటినుండివారికికూడ హవిర్భాగములందుచుండెడివి.

ప్రతిభాశాలురగు అశ్వినీకుమారులవద్దగల మహిమాతిశయముల గాంచి ఇంద్రుడాయుర్వేదము నభ్యసింప నారంభించెను. సూర్యపుత్రులు యెట్టికపటమును లేకుండ ఆయుర్వేదము నంతటిని నాతనికి సాంగోపాంగముగ నెరిగించిరి. దాన నాతనుకూడ మహాపండితుడాయెను.

వీరివైద్య గ్రంథములు యిక్కాలమున కానబడవు.

వేదమునందు చెప్పబడిన యశ్వినీదేవత లెవ్వరన్నవిషయమై చర్చజరిగియుండెను.

అశ్వినులనగా అశ్వములుగల పుణ్యవంతులైన గొప్పరాజులని జౌర్ణభావ ఋషి యభిప్రాయము.

అశ్వీను లెవరన భూమ్యాకాశము లనికొందఱు; అహోరాత్రము లనికొందఱు; సూర్యచంద్రులనికొందఱు; పుణ్యముచేసినయిద్దరు రాజులని ఐతిహాసికులును చెప్పెదరు*

అశ్వినీదేవతలు గుఱ్ఱముయొక్క నాశికనుండి పుట్టిరి గనుక నాసత్యులనియు పేరు. వీరు మిక్కిలిచక్కనివారు. వీరియిద్దఱకు అశ్వినౌ, నాసత్యౌ, దస్రౌ అన్న పేళ్లున్నను పెద్దవానికి నాసత్యుడనియు, చిన్నవానికి దస్రుడనియు, విడిగ పేళ్లున్నట్లు కానవచ్చెడిని. (మహా. అనుశా. అ. ౧౫౦. శ్లో ౧౮) పాండురాజుపత్నికి వీరివలన నకుల సహదేవులు కలిగిరి.

వేదములబట్టి అశ్వినీదేవతలు శస్త్రచికిత్సలాది ఉత్కృష్టవైద్యవిధానముల నెరిగిన వారని తెలియుచున్నది. వీరియొక్క జీవితాంశములు గాని చిహ్నములుగాని లేకుండుట కడుంగడు శోచనీయము.

---

*నిరుక్తము. 12-1.

# స్త్రీ—పురుషుడు

స్త్రీ పురుషుల తత్వములందు కొంత వ్యత్యాసమున్నదని అందరెరుంగుదురుగాని గూరాయీ విషయములయందు భేదములు కలవని యింతవరకెవ్వరును వివరముగ తెలిపియుండలేదు. కాని యిటీవలనే డాక్టర్ విల్ డురాంట్‌గారు "ది అమెరికన్ మాగజీన్"లో నొకవ్యాసము వ్రాసియుండిరి. అందలి విషయములు అమెరికాదేశమందలి స్త్రీలసంఘములచే నెక్కువగ చర్చగావింపబడినవి. డాక్టర్ డురాంట్‌గారివ్యాస మీాక్రింద పొందుపరుపబడియున్నది.

(1) పురుషుడు స్త్రీని గ్రహించుటకన్న సూక్ష్మముగ స్త్రీయే పురుషుని భావములను గ్రహింపుచుండును.

(2) ప్రకృతి శాస్త్రిసంబంధమును పరిశీలించినను స్త్రీయేముఖ్యమైన శాఖగా కాను పించుచుండును.

(3) పురుషుడు ధైర్యస్థైర్యములు గలిగి వర్తించుచుండును

(4) పురుషు డహంకారపూరితుడు; దార్ఢ్య సహిత వర్తనుడు.

(5) పురుషుడు చురుకైనవాడు; స్త్రీ సోమరి. "స్త్రీ యెంత యెక్కువగ్రహింపు గలిగిన అంతయెక్కువ సోమరితనమున కలవాటుపడును".

(6) ప్రేమ వర్షముల గురియించుటలో స్త్రీ పురుషుని మించిపోవును స్నేహబంధముల పెంచుటలోకూడ స్త్రీ పురుషునికన్న మిన్న.

(7) స్త్రీ సంఘవిషయములయందు చొరబడుటకు యిష్టపడును; పురుషుడు శాంతియుత యేకాంత జీవనము నాసించు చుండును

(8) స్త్రీకి "వాగుడుతత్వ"మెక్కువ. రహస్యముల దాచుటలో నామెజల్లెడవంటిది.

(9) స్త్రీ ఆచారముల బాటించును; అనుసరణమన నామె కెక్కువయిష్టము, వివిధ రూపముల దుస్తులను ధరించుటయన ఆమె కెక్కువయిష్టము.

(10) ఒక స్త్రీకిని యింకొక స్త్రీకిని గలభేదము, ఒక పురుషునికిని యింకొక పురుషునికిని గల భేదమునకన్న చాలతక్కువ.

(11) సాంఘికానుమతికై స్త్రీ యెల్లవేళలను యెదురు చూచుచుండును. ఏ సమస్య గురించియైనను ఆయమ చాలవరకాలోచించును. నైతిక జీవితముయెడ నామె కపరిమితమగు గౌరవము

(12) మతవిషయములయందు స్త్రీకెక్కువ పట్టుదలగలదు. పురుషుడు సంశయాత్ముడై యుండును.

(13) ఆలోచనచేయుటయందనుపమానప్రతిభ పురుషునికిగలదు గాని, తెలివితేటలు స్త్రీకన్న పురుషునకుతక్కువయె.

(14) స్త్రీ, ధీవిశాలత్వమందు పురుషునికన్న మిన్న యెట్లో అట్లే కార్యాచరణమందు కూడ స్త్రీ శీఘ్రగమనమును ప్రదర్శించును. "30 వత్సరములకు తక్కువ వయసుగల పురుషుడు 20 వత్సరముల స్త్రీతో సమవర్తియై మెలంగజాలడు".

(15) స్త్రీ త్వరితముగ రజస్వలయగును; పురుషుడు సంపూర్ణముగు పరిపక్వమందిననే గాని అట్టిస్థితికిరాడు

(16) గౌరవప్రదమని తలంపబడు బింకమును స్త్రీ ప్రదర్శింపుచుండును.

(17) స్త్రీలలో అనుపమాన మేధస్సుగల వారి సంఖ్య యెంత తక్కువయో అట్టులే పూర్ణముగ తెలివిహీనలైన వారిసంఖ్యయు నంతతక్కువయె.

(18) స్త్రీ కళాభివృద్ధికవకాశ మొసంగును గాని కళాసృష్టికి మాత్రము తోడ్పడదు.

(19) ఈపైన పేర్కొనబడిన భేదములు మధ్యవచ్చినవియెగాని జన్మతః సిద్ధించియుండలేదు

# సీమవంకాయ.

సీమవంకాయ ఆదిని దక్షిణ అమెరికా దేశముననే యుండెడిది. బంగాళాదుంపలు, పొగాకు మున్నగునవి ఆదిని ప్రపంచమంతటికి ఒక ప్రాంతమందేయుండి క్రమేణ దిగంతములవరకు నెట్లు వ్యాప్తినందినవో అట్లులే సీమవంకాయ కూడ నేడు ప్రపంచమంతటను వ్యాప్తినందియున్నది.

ఈ సీమవంకాయను పాశ్చాత్యులు 'టొమేటో' అందురు. ఉత్తర హిందుస్థానీయులు 'విలాయతీ బైగన్' (విదేశపు వంకాయ) అందురు. అరవసోదరులు దీనినే 'సీమెయ్‌తక్కాలి' యందురు.

## వ్యాప్తి

నేడీ సీమవంకాయలు యూరపుఖండమంతట నేగాక అమెరికా సంయుక్తరాజ్యము, జపాను, చీనా, పారసీకము, టర్కీ, భారతదేశములయందుకూడ పండింపబడుచున్నవి. కాని భారతీయులు పాశ్చాత్యులవలె యీఫలము నంతయెక్కువగ ఉపయోగించుట లేదు. ఈ సీమవంకాయను చూడనివారే చాలమంది యుందురనికూడ చెప్పవచ్చును. ఈ కాయయందొక విధమగు వాసనగలదనియు, దీని నారగించుటకు వెగటుగ నుండుననియు కొందరనుచుండుటయు కలదు. ఇట్టివారు తమ కలవాటులేని నూతనవస్తువుల యొక్క గుణముల నున్నదియున్నట్లుగ గమనించుటకు యిష్టములేదని చెప్పవచ్చును.

సీమవంకాయయొక్క విలువ దినదినమునకును యెక్కువయగుచున్నది. ఇంగ్లండులో విపరీతముగ నిదిపంట పెట్టబడుచున్నను ఆదేశమందలివారి కది సరిపోవుటలేదు. ఈ కారణమున ప్రతి ఓడలోనను అమెరికాదేశమునుండి సీసారేకుడబ్బాలయందు భద్రపరుపబడిన వేలకొలదిపౌనుల సీమవంకాయలు ఇంగ్లాండుదేశమునకు దిగుమతి గావింపబడుచున్నవి. ఇట్లు భద్రపరచి యమ్ముటయేగాక యీ సీమవంగపండ్లను పలువిధముల పచనముచేసి డబ్బాలకెక్కించి యెక్కువ వెలలకు అమ్ముట పాశ్చాత్యదేశములయందు మామూలైయున్నది. ఇంగ్లాండునుండి దిగుమతిచేయబడిన 'టొమేటోసాస్' 'టొమేటో అండ్ బీన్సు' అను పదార్థములు మనదేశమునకుకూడ యూరపియనుల యుపయోగార్థము దిగుమతి గావింపబడుచున్నవి.

## గుణము

ఈ సీమవంకాయలయందు దేహమున కమితారోగ్యము నొసంగగల మహత్తర పదార్థములగు విటమినులు విస్తారముగనున్నవి. ఈ విటమినులు దేహదార్ఢ్యమునకును ఆరోగ్యమునకును అవసరము. ఈ యుత్కృష్ట పదార్థములు సీమవంకాయ యందున్నంత యెక్కువగ మరి యే యితర శాకాహారములయందుగాని లేవు. అందువలన నీ సీమ వంకాయల నెంత యుపయోగించిన నంతమంచిది.

మలబద్ధకముచే కష్టపడువారి కిది ఆరోగ్యమైన భోజనపదార్థము. ఇందుండు పులుసు అరోచకమును పోగొట్టును. రక్తమును శుద్ధిచేయును. అన్నాశయమునందుండు పురుగులను చంపును.

శగరోగముగలవారికి యీ పండురసము చాల యుపయోగమైనది. మేహ శాంతిని చలువను చేయును.

## పాక విధానములు.

సీమవంకాయ ననేకవిధముల పచన మొనరింపవచ్చును. పచ్చికాయలను వంకాయలకువలె చిన్నముక్కలుగ తరిగి ముద్దకూరవండి నిమ్మరసము కొలదిగపిండి వాడుటొక విధము. ఈ కాయ నిలువుగ ముక్కలుకోసి పులుసులో వేసికొనెదరు. ఈ రెండు విధముల వండుటచే యీకాయయొక్క ప్రత్యేకపు రుచి గమనించుట కవకాశముండును. సీమవంగపండ్లను పలువిధముల నుపయోగింతురు. అందు ముఖ్యమగు ఒకటి రెండువిధ ములనే యిట బేర్కొనుట యుత్తమము. సీమవంగపండ్లనుకోసి కొందరు ధప్పళములో వేసి కొందురు. దేశమం దన్నిప్రాంతములలోనను మాంసాహారులు సీమవంగపండ్లను మాంస ముతో కలిపి వండెదరు. వంగదేశమం దీపండ్లు తరుచు చేపలతోకలిపి ఎక్కువగ భుజింతురు. వంగదేశమునకు బంగాళాదుంపయం దెంతప్రీతియో యీ సీమవంకాయల యందుకూడ నంతప్రీతియేయని చెప్పవచ్చును. అందువలననే ఆ రాష్ట్రమందలి ప్రతి గ్రామ మందును యెక్కడోయొకచోట సీమవంకాయలు పండింపబడుచుండును. కొందరు సీమవంగపండ్లు పచ్చడిచేయుదురు. ఈ వంగపండ్లను ముక్కలు ముక్కలుగతరిగి ఒక పళ్లెరమందుంచి పచ్చిమిరపకాయలు, అల్లము, కొత్తిమిరి, సన్నగతరిగి అందు కలిపి పిసికి ఉప్పువేయుదురు. ఇందుకొలదిగ చింతపండుకూడకలిపిన కలిపెదరు. ఇది యిష్టా యిష్టములమీద నాధారపడియున్నది. సీమవంగపండ్ల పోచినపచ్చడినే ఆంగ్లేయులు

'సాస్' అనియెదరు. సీమవంగపండ్లను నాలుగుముక్కలుగతరిగి అందు నీరుల్లి, పచ్చిమిరప కాయలు, అల్లము, కొత్తిమిరి, పైన చేర్కొనబడిన దానికివలెనే జేర్చి చిక్కని చింత పండుపులుసు అందుజేర్చియుంచవలయును. అనంతరము పొయ్యిమీద కళాయిపూయ బడిన పాత్రనుంచి అందు కొంచము నేయికాని నూనెగాని వైచి మరగిన యనంతరము యెండుమిరపకాయలు, నీరుల్లి, ఆవాలు, కరివేపాకు, మున్నగు పోపు పదార్థములువేసి చక్కగ వేగిన యనంతరము యిదివరకు సిద్ధముగ చేసియుంచిన సీమవంగపండ్ల ముక్క లను అందుపోసి చక్కగ ఉడుకనియ్యవలయును. లభ్యమైనచో బటానీకాయలనందు వొలువకుండ వేసిన రుచిగనుండును.

పండించు విధము

సీమవంగ భారతదేశమందలి అన్నిప్రాంతములలోనను పైరుపెట్టవచ్చును. అదియు గాక వ్యాపారమునకని తోటలయందు వేయుటయెగాక వీటిని ప్రతిగృహమందును పండింప వచ్చును. శీతలదేశములయందు సీమవంగ గాజుచే కప్పబడిన యిండ్లలో పెంపబడుచున్నవి. ఇందులకు శీతోష్ణస్థితియే కారణము. ఇట్టి కృత్రిమవిధానముల యవసరము మనదేశ మున లేదు.

ఈ మొక్కలనాటుటలోగాని పెంచుటలోగాని యెట్టికష్టమునులేదు. మెరకభూమి యా పల్లపుభూమియా యనువిచక్షణ యనవసరము. రాతినేలగా సారవంతమగు భూప్రదేశములన్నియు యిందులకనుకూలించును. వలయునంత జలసదుపాయము మాత్రమే యవసరము.

విత్తనముల సేకరించుటకు మనము సాధారణముగ బజారునందు కొనుపండ్లను దీసి కొని వచ్చి అందలి గింజలను యెండబెట్టి వాటి నుపయోగించుటవలన లాభములేదు. బజారున అమ్మబడు సీమవంగపండ్లు దోరపక్వము దాటినయనంతరమే కోసి నగరము లకు అమ్మకమునకు దీసికొనివత్తురు. ఆకారణమున అందలి విత్తనములు వలయు నంత సత్తువను గలిగి యుండవు. ఆదిని సీమవంగచెట్లను గృహములయందు పెంచుట కిష్టమున్నవారు మొదట నీవిత్తనములను వ్యాపారులవద్దనుండి రప్పించవలయును. అర్థరూపాయకో లేక పదియణాలకో ఒక ఔన్సు గింజల నిచ్చెదరు. ఆగింజలు వచ్చినయనంతరము ఒక చిన్నఅకుమడిని తయారు చేయవలయును. ఇందు కొంత సార వంతమగు యెరువును చేర్చుటుత్తమము. మట్టియెంతటి మృదువుగగావించిన నారు

## సీమవంకాయ.



ఈ చిత్రమునందుగల సీమవంకాయ పరిమాణము పెద్దగోళీని మించియుండదు. లక్కవర్ణముగల యీపండ్లయందు గుంజు అంత ఉండకపోవుటయేగాక అంత రుచికరముగకూడ నుండదు. ఆకారణమున దీనిని బల్లలపై అలంకారమునకుంచుచున్నారు.

సీమవంకాయ.



సీమవంకాయలలో అనేకరకములున్నవి. పైనగల
రకము యెక్కువగ పండింపబడుచున్నది.

అంతటి బలమైనదిగ బయలు దేరును. నారు మడియందలి మొక్కలు ఆరు లేక యెనిమిది అంగుళముల యెత్తున కెదిగినయనంతరము మడినిండ నీరిడి భూమిని మెత్తపరచి అనంతరము మొక్కలను జాగ్రత్తగ మడినుండి వేరు చేయవలయును. తరువాత యింతకు ముందుగనే సిద్ధము చేసియుంచిన భూమిని బాగుగపశ్వెనొనర్చి రెండేసి యడుగులకొక్క మొక్కవంతున నాటవలయును. ఇట్లు నాటుభూమిని సెమెంతగుల్లగ గావించిన నంతమంచిది.

సీమవంగ మొక్క తీగయాకృతిని యెదుగును. అటులు యెదుగుచున్న మొక్కను భూమిని ప్రాకనిచ్చినచో ముందు కాపునకు చెడుగు జనగూడును. బయలుదేరిన పిందెలు మురిగి పోవును. అట్టిది జరుగకుండ చేయుటకు కొన్ని ప్రాంతములలో సన్నని వెదురుబద్దలతో రెండు లేక రెండున్నర అడుగులయెత్తునకు పందెరవేసి అందుపైన నీమొక్కలు ప్రాకు లాగున జేసెదరు. ఈ పందెర నిర్మాణము వలన కొంత శ్రమగలదు గాన ఆపద్ధతికి బదులు ప్రతిమొక్క ప్రక్కను నాలుగైదడుగుల పొడువుగల వెదురుబద్దను మొక్కనునిలువగట్టుట ఉత్తమము. ఇట్లుచేయుటచే పువ్వుగాని పిందెగాని కుళ్లుట తటస్థింపదు.

చెన్నరాష్ట్రమందు సీమవంగ జూలైనుండి డిసెంబరు మాసాంతము వరకును పండింపవచ్చును. ఒక్క ఔన్సుగింజలకు 1,500 ల మొక్కలు తయారగును. నాలుగు ఔన్సుల గింజలతో ఒక యకరము నింప వచ్చును. అరువది లేక అరువది యైదు దినములలో కాపు కాయును.

సీమ వంకాయలలో పలురకములున్నవి. వానిలో చాలభాగము యెరుపువన్నెను గలిగి యుండును. ఒక్క రకము మాత్రము పసుపువన్నెను గలిగి యుండును. ఆకృతి వర్ణము, పరిమాణము యెటులున్నను గుణమన్నిటియందు నొక్కటియె.

ఇట్టి యుపయుక్త మగు ఫలమును ప్రతిగృహమందును పండించుకొని లాభమందెదరుగాక.

# బాలింత సంగమ్మ*

ఆంధ్ర శేషగిరిరావుగారు, సారస్వత సమాజము.

విద్యానగర రత్నసింహాసనాధీశ్వరుఁడైన ప్రౌఢదేవరాయల సరదారులలో గోన కాటారెడ్డి ఎన్నికగన్న వాఁడు. కులమునకు ఆతఁడు తెలగ. అతనిది మిడిమెళ్ల గోత్రము. కాటారెడ్డిచేసిన సేవకు మెచ్చి రాయలవారు ముగదత్తి, రాయచూరు అను గ్రామములందు కోటలు నిర్మించుటకు ఆతనికి ఆజ్ఞనిచ్చిరి.

రాజాజ్ఞ తలనిడుకొని కాటారెడ్డి మొదట ముగదత్తిలో కోటకట్టుటకు ప్రారంభము చేసెను. పని చురుకుగా జరిగెను. బురుజులుతీరి కోట అచిరకాలముననే పూర్తియయ్యెను. అనంతరము కాటారెడ్డి రాయచూరు గ్రామమున కోటకట్టుటకు మొదలిడెను.

శుభముహూర్తమున దుర్గనిర్మాణమునకు శంకుస్థాపన జరిగెను. పునాదులు ఏర్పడినవి. గోడలు లేచినవి. కాని బురుజుపని తుదముట్టలేదు. పూర్తి కాకుండగనే అదినేల కూలెను. అంతమాత్రమున కాటారెడ్డి నిరుత్సాహపడలేదు. తిరిగి పని ప్రారంభముచేసెను. కాని ఈ మాఱుకూడ బురుజు నిలబడలేదు. రెడ్డికి అనుమానము తోఁచెను. అయినను మఱల నాతఁడు బురుజుపని రెట్టింపు కట్టుదిట్టములతో చేయించెను. కాని కార్యము లేక పోయినది.

తిరిగి బురుజు నేలమట్టమయ్యెను. ఇట్లు నాలుగు అయిదు సారులు జరిగెను. అందుతో కాటారెడ్డికి అనంతమగు విచారముకలిగెను. తుదిప్రయత్నముగా ఆతఁడు మఱల బురుజు నిర్మించుటకు దొరకొనెను. అప్పుడచ్చట పనిచేయుచున్నవారిలో నొక కాపువానికి శివమెత్తెను. ఆవేశము కనుపించిన పురుషుఁడు కాటారెడ్డితో నిట్లు పలికెను.

"నే నొక మహాశక్తిని. చిరకాలముగా నేనీ ప్రదేశము నాశ్రయించుకొని యున్నాను. బలియిచ్చి నన్ను తృప్తిపఱచిగాని మీ రిచ్చట కోట గట్టలేరు. మీరు నాకు బలి ఈయనికారణమున బురుజును కూలద్రోయుచున్నాను. నాకు సాధారణమైన

* అపూర్వమైన ప్రాణత్యాగ మొనర్చిన రమణీమణి-చరిత్ర.

బలితో సంతృప్తికల్గదు. ఒక బాలింతస్త్రీని ఆమెకనిన బిడ్డతోఁగూడ నాకు బలినీయ వలెను. ఇచ్చెదరా బురుజు నిలుచును. ఈయరా విహారీజన్మమున నిచ్చట కోట నిర్మింపఁ జాలరు."

కాటారెడ్డి యిదివినెను. దీర్ఘవిచారపరీతమైన ఆతనిమనము ఆలోచనాధీన మయ్యెను. కోట నిలబడుటకని ఏస్త్రీవచ్చి శిశుసహితముగ బలివోవును? ప్రాణములపై తీపిని చంపుకొనుటకు కొందఱు సాహసింప వచ్చును. కాని కడుపార గన్నబిడ్డను మృత్యుముఖ మున చేతులార నర్పించుటకు ఏతల్లిప్రాణ మంగీకరించును? ఇంత ప్రయత్నము చేసి దుర్గ నిర్మాణమును పూర్తి చేయక పోయి అతఁడే మొగముతోఁ దిరిగి తన ఏలికయగు ప్రౌఢదేవరాయలను దర్శింపఁగలఁడు? ఎన్నివిధముల చింతించినను అతనికి ఆలోచన తెగలేదు.

కోటలోనున్న మహాశక్తి శిశుసహితముగ నొక బాలింతరాలిని బలికోరుచున్న వార్త జలతైలబిందువై రాయచూరుగ్రామమున మూలమూలలందుఁ గూడ వ్యాపించెను. తుద కాసంగతి పురిటిమంచముపైనున్న తెలగవారిచిన్నది సంగమ్మ చెవికిఁ గూడఁ జేరెను. ఆమె అప్పటికి మూఁడుదినములకుఁబూర్వము ప్రసవించియున్నది. కోట కట్టుటకు కాటారెడ్డి చేయుచున్న సకలప్రయత్నములును బూడిదలోఁ బోసిన పన్నీ రగుచుండుట ఆమె గమనించెను. కోటతీరినచో నదిప్రజలకు మిక్కిలి ఉపకారిగా నుండ గలదని ఆమె నిజ మూరసెను.

"చావు ఎప్పటికైన తప్పనిదే. జరాభారమున క్రుంగి, రోగములచే క్రుంది జీవిత మును నిరర్థకముగా తుద ముట్టించుటకంటె ప్రజాభ్యుదయమునకై ఇప్పట్టున మరణ మును వరించుట ఉత్తమము; కీర్తిదాయకము" అని త్యాగబుద్ధిగల సంగమ్మకుఁ దోచెను. తనప్రక్కలోదూరి పరుండియుండి అప్పుడప్పుడే నేత్రములను విప్పి లోకమును గాంచుచున్న ఆనెత్తురుకందు నొకసారి యామె తిలకించెను. "ఈప్రజోపయోగ కార్య ములో నా చిట్టిబిడ్డకూడఁ బాల్గొనుగాక! పసుమొగ్గకు దేవతాపీఠమున స్థానము లభించుగాక!" అని ఆమె [illegible] చేసికొనెను.

పొత్తులలో పొదవుకొని ఆమెకోట చెంతకుఁ బోయెను. నిశ్చలబుద్ధితో నామె శిశుసహితముగ పునాదిగోతిలో దుమికెను. కూలివాండ్రు చురుకుగా పైన యిటుకలు పేర్చి గోడలు కట్టిరి. గోడలు లేచెను. బురుజు తీరి చెక్కుచెదరక నిలిచెను. క్రమముగా మిగిలిన బురుజుల నిర్మాణముకూడఁ బూర్తియయ్యెను; దుర్గము సర్వాంగశోభతో విలసిల్లెను.

సంగమ్మచేసిన అపూర్వత్యాగము దేనికి సూపసిద్ధికల్పించినదో ఆరాయచూరు దుర్గమునుండి ప్రభుత్వము సాగించి కాటారెడ్డి కాటభూనరేంద్రుడని ప్రసిద్ధిచెందెను. తన అభ్యుదయమునకు సంగమ్మ త్యాగము మూలదుంప యన్నసంగతి రెడ్డిప్రాణము లున్నంతవఱకు విస్మరింపలేదు.

మహాత్యాగిని సంగమ్మ శిశుసహితముగా బలిపోయి నిలిపిన బురుజు యిప్పటికిని ఆమెపేరిట 'బాలింత సంగమ్మ కోట' అనివ్యవహరింపఁ బడుచున్నది. త్యాగధనుల పవిత్ర నామములు అక్షరమను సూత్రము నీవిషయము ప్రతిపాదించుచున్నది.

సంగమ్మ త్యాగము అతిలోకమైనది. పరోపకారార్థము ప్రాణత్యాగ మొనర్చిన రమణీమణులు ఇతిహాసప్రపంచమున పలువురుగలరు. కాని శిశుసహితముగ బలి పోయినవారు మిక్కిలి తక్కువ. తల్లికి తన ప్రాణముమీఁద కంటె తన బిడ్డ ప్రాణము మీఁద మమకారము హెచ్చు. అట్లుండుట ప్రకృతి సిద్ధము. లోకసహజమైన అట్టి మమకారమును గూడ తెగగోసి లోకోపకారార్థము శిశుసహితముగ ప్రాణములను విడిచిన పడఁతి త్యాగబుద్ధిని కొలఁదులు పెట్టఁదరము కానిది. ఆమె సాహసము శతథా శ్లాఘింపవలసినది.

ఈ కథ శ్రీ మెకంజిదొరవారు సేకరించిన లోకలు రికార్డులలోని 'కైఫీయతు గ్రంథాలు' నుండి గ్రహింపఁ బడినది.

# సౌందర్య కళా రహస్యములు.

ప్రపంచ మెంతటి అనాగరికస్థితియందున్నను సౌందర్యకళ కెక్కువ ప్రాముఖ్యత యొసంగియున్నది. దిగంబరత్వమునకన్న నెక్కువ యెరుంగకయున్న సమయ మునకూడ స్త్రీపురుషులు సౌందర్యమును గమనించియుండిరి. అందువలననే ఆపురాతన కాలములయందు అడవులయందు నివసించుచుండిన స్త్రీపురుషులు ఆయాకాలములయం దలి పద్ధతుల ననుసరించి తమ దేహముల సింగారించుకొనుచుండెడివారు. పుష్పములు అందమగు ఆకులు మకుటములుగను కంకణములుగను అలంకరించుకొనుచుండెడివారు.

క్రమముగ నాగరకత యెక్కువయగుకొలదియు దిగంబరత్వము పోయి వస్త్ర ధారణము, కేశసంస్కారము మున్నగునవన్నియు బయలుదేరినవి.

సౌందర్యకళారహస్యములను ప్రతి స్త్రీయు ప్రతి పురుషుడును యెరుంగవలయును. సౌందర్యకళాపోషణమనగ పలువురు పలువితముల తలంపవచ్చును. కాని ఆరోగ్యము పరిశుభ్రత వీటి నాధారపడి మానవజీవితము సౌఖ్యదాయకముగ నొనరింపబడుటకే సౌందర్యకళారహస్యముల నెవ్వరుగాని యెరుంగవలయునని చెప్పబడియున్నది.

దేహమును పరిశుభ్రముగ నుంచుకొనుట సౌందర్యకళాపోషణమందు చేరి యున్నది. తెలుగుదేశమందలి చంటిబిడ్డలకు దినమువిడచి దినము గోరువెచ్చని నీళ్లు పోయుదురు. ఆలేగందులశరీరమున కంటియుండు మలినమును పోగొట్టుటకు సబ్బు మున్నగువాటి నుపయోగించుటంత యుత్తమకార్యము కాదని మన హిందువులు తలం తురు. అందువలననే లేగందులస్నానము చేయించు సమయములయందు పసుపుముద్దనే యెక్కువగ నుపయోగింతురు. శరీరమునకుండెడి యెట్టి వాసననుగాని పోగొట్టి చర్మము నకు మృదుత్వమొసంగుగుణము పసుపునందుగలదు. హిందూస్త్రీలు స్నానమొనరించు సమ యములయందు పసుపుముద్దను ముఖములకు రాసికొనియెదరు. అందువలన ముఖమున బయలుదేరు నూగువెంట్రుకలు నశించును. ప్రస్తుతకాలమున పసుపురాసికొనుపద్ధతి మాయమైనది. ఇందులకు బదులు స్త్రీలు సబ్బుతో మోముకడుగుకొని అనంతరము ఫేస్ పౌడరును అద్దుచున్నారు, కాని పసుపునందు గల ఉత్తమగుణ మీ పౌడరులందెంత

మాత్రమును కానుపించదు. కాని పౌడరులను మానవలయునన్న ప్రస్తుతము స్త్రీలు మానజాలరు. ఆ కారణమున వారమున కొకమ మొక్కమారేనియు స్త్రీలు పసుపు పూసికొను టుత్తమము.

## ముఖము మెరుగులు.

ప్రతీచీదేశముల నాగరికతానీలచేలమును ధరించియున్న దినములయందే ప్రాచ్యదేశములు సౌందర్యకళోపాసన మొనరించుచుండెడివి. అందులకు తార్కాణముగ బౌద్ధకథలయందీ మెరుగులు మున్నగువాటిని గురించిన కొలది వర్ణనలు నేడు కానరగుచున్నవి.

ఇటీవలనే తెరువబడుచున్న ఈజిప్టుదేశమందలి చక్రవర్తుల సమాధులయందు మోము మెరుగు సుగంధ వస్తువు లెన్నియో నేటికిని చెడకుండ నున్నవి. ఈపదార్థములు కొన్ని వేలవత్సరముల క్రితము భూగర్భమున నుంపబడినప్పటికిని చెడకుండ అట్టులే యుండుట రసాయనశాస్త్రజ్ఞుల కాశ్చర్యకారణమగుచున్నది. నిజముగ నిట్టి ప్రశస్తమైన వస్తుచయ మింతవరకును తయారు గావింపబడి యుండ లేదనియే చెప్పవచ్చును.

ప్రస్తుతము బజారులందు వందలకొలది ముఖము మెరుగులు విక్రయింపబడుచున్నవి. వీటిలో నూటికి తొంబది తొమ్మిది వంతున విదేశములనుండియే దిగుమతి గావింపబడుచున్నవి. ఈ కారణమున ప్రతిమాసమును లక్షలకొలదిగ భారతదేశ ద్రవ్యము విదేశములకు పోవుచున్నది. ఈ మెరుగులన్నియు యేదేశమున తయారగుచున్నవియో ఆదేశమందలి శీతోష్ణస్థితిగతులకు కొంత సంబంధము గలిగియుండిన నుండవచ్చును కాని భారతదేశమున కెంతమాత్రమును సరిపడవు. ఇపుడిప్పుడే బొంబాయి కలకత్తా, పూనా, మదరాసు మున్నగు నగరముల యందు కొందరీ మెరుగులను తయారు చేయుచున్నారు కాని యివి యన్నియు విదేశీ పద్ధతులనే తయారు చేయబడుచున్నవి. భారత దేశమందలి రసాయనశాస్త్రజ్ఞులు యీ సందర్భమున కొంత శ్రద్ధవహించి పరిశోధనలను సాగించి భారత దేశానుకూలమగు పదార్థచయములను తయారు జేయునెడ నెంతయు బాగుగ నుండును.

# జోల

శ్రీమతి లలిత కుమారిగారు.

పండుకో అమ్మాయి పండుకోవమ్మా
పండుకోఅమ్మాయి పండుకోవమ్మా

కోనేటి నీటిలో కొదమరాయంచవై
నీలాలమింటిపై నిండు జాబిల్లివై
పండుకో అమ్మాయి పండుకోవమ్మా

చివురాకుదోనెపై చిరునీటి చుక్కవై
తలిరాకు జొంపాల పలవించు నీడవై
పండుకో అమ్మాయి పండుకోవమ్మా

గాలిలో లీనమౌ గంటల మ్రోతవై
ఎడదలో పొడసూపు కడకంటి చూపువై
పండుకోఅమ్మాయి పండుకోవమ్మా

విరహగీతములలో విరియు రాగమ్మువై
మురిపెంపు ప్రేమలో ముద్దుల ముద్రవై
పండుకో అమ్మాయి పండుకోవమ్మా.

# అంతర్జాతీయ మహిళా మహాసభ.

స్త్రీలకుకూడ రాజకీయములయందు హక్కుండవలయును. స్త్రీలకు వోటు హక్కుయుండవలయుననియు ప్రజాసంస్థలకు పురుషులతో పాటు స్త్రీలుకూడ పోటీచేయు నధికార మొసంగవలెననియు ఆదియందు జర్మనీదేశమందలి స్త్రీలాందోళనను లేవనెత్తిరి. అనంతరము యిటీవలనే ఇంగ్లాండు మున్నగు దేశములీ యాందోళనను సాగించియున్నవి.

రానున్న జూన్ మాసములో బెర్లిన్ నగరమున అంతర్జాతీయ మహిళామహాసభ అతి వైభవముగ జరుగగలదని ప్రకటింపబడియున్నది.

ఇప్పటికే స్త్రీలు ప్రపంచమందలి అన్ని ప్రాంతములనుండియు ప్రతినిధులుగ బెర్లిన్ నగరమునకు వచ్చియున్నారు.

జర్మనీ దేశమందలి ప్రఖ్యాతి మహిళామణుల సహాయముతో పార్లమెంటు సభ్యురాలగు ఫ్రాష్యూరిబర్ గారు సభ్యురాండ్ర కాతిథ్య మొసంగుచున్నారు.

**1904**-వ సంవత్సములో యీయాందోళనల ప్రారంభింప బడిన కొలది దినములకు భవననిర్మాణమహోత్సవము జరుపబడి యున్నది. ఆ సమయమున ఆహ్వానములంది బెర్లిన్ నగరమునకు విచ్చేసియుండిన నారీమణు లందరును ప్రత్యేకముగ ఆహ్వానింపబడియున్నారు.

పార్లమెంటు సంభ్యురాండ్ర నివాసమగు 'రీచ్‌స్టాగ్' భవనమున కెదురుగనున్న 'క్రోల్ హాల్' నందీ మహాసభ జరుప నిర్ణయింపబడియున్నది.

స్త్రీలస్థానము నేడెట్టిదై యున్నదను విషయముగురించి చర్చించుటకు బ్రహ్మాండమగు నొక బహిరంగ సమావేశము గావింపబడును. ఈ సంఘమునకు యిరువది దీర్ఘవత్సరములకాలము అధ్యక్షురాలై యుండిన కారిఛాప్‌మన్ కాట్ సతీమణి యీ బహిరంగసభలో నుపన్యసించును. నానాజాతి సమితియొక్క ఆందోళనను ఉత్సవరూపముగ రూత్ మూర్గన్ కన్య, మెడమ్ శేకర్ మున్నగు మహిళామణులు సాగింతురు.

ఈ మహాసభలో స్త్రీ పురుషులకు సమానహక్కులుండవలయునను విషయము గురించి చర్చ గావింప బడునని ప్రకటింప బడియున్నది.

# మాచిపత్రి

మాచిపత్రి పవిత్రవంతమును, సుగంధయుతమును అయిన పత్రిములలో చేరినది. తులసి, బిల్వ, మరువము, దవనము మొదలగు సుగంధపత్రములవలెనే మాచిపత్రినికూడ మనవారు దైవారాధనకు వాడుచున్నారు. కాని దీని ఓషధీగుణమును తెలిసికొని, రోగనాశనశక్తినిగ్రహించి వాడుకొనువారు చాలతక్కువగనున్నారు. మాచిపత్రి ప్రతియింటితోటలలోను నాటి సులభముగ పెంచదగిన ఓషధీరత్నము. ఈమూలిక హిందూవైద్యశాస్త్రసమ్మతమైనదే. కాని ఆయుర్వేదవైద్యులు దీనిని విరివిగా విని యోగించుట లేదు.

ఆంగ్లవైద్యులు ఈమూలికయొక్క విలువను కనుగొని యిందుండి 'శాంటొనైన్' (Santonine) అనునొక ఔషధరాజమును తయారు చేయుచున్నారు; విరివిగ రోగులకు వాడుచున్నారు. కడుపులోని నులిపురుగులు, పాములు మొదలగు క్రిములను చంపి వేయుటకుగాను ఈ'శాంటొనైన్' అనుమందును ఆంగ్లవైద్యులు సర్వసాధారణముగ నుప యోగించుచున్నారు. ఈ 'శాంటొనైన్' ఔషధమును రోగులకు ముందురాత్రి యిప్పించి తెల్లవారిన పిమ్మట ఆముదమును త్రాగించెదరు. ఇందువలన కడుపులోని క్రిములుచచ్చి మలముతో కలిసి పడిపోవును.

ఈ యౌషధము చాల ఉష్ణవీర్యముకలది. కావున దీనిని సేవించిన కొందఱికి రెండుమూడురోజులవఱకు కండ్లు పచ్చబాఱుట మొదలగు బాధలు కలుగుచున్నవి. ఔషధము మోతాదు జాస్తియగుటవలనకూడ పైనివివరింపబడిన బాధలు కలుగుట కలదు. మూలికనుండి తీయబడినసారమగుటచే 'శాంటొనైన్' సేవించినవారికి ఇట్టి ఇబ్బంది కలుగుచున్నది. అసలు మూలికనే కషాయముగగాని, చూర్ణముచేసిగాని ఉప యోగించినచో నిట్టి కష్టములుండవు. మూలికయొక్క మోతాదు కొంచము యెక్కువ అయినను ఎట్టి హానియులేదు. మాచిపత్రియొక్కసారమగు 'శాంటొనైన్' వలన గలుగు దుర్గుణములేవియు అసలు మూలికను వాడుటవలన కలుగవు. మాచిపత్రిని అప్పు

డప్పుడు తులసిదళములవలెనుగ తినుచుండిన అన్నాశయమునందుపుట్టు పురుగులు నశించి మంచి ఆకలి కలుగును. మాచిపత్రితో రెండుమూడు మిరియములను కలిపినూరి సుమారు ఉస్తికాయంతవుండలనుచేసి బిడ్డలకు అప్పుడప్పుడు యిచ్చుచుండిన కడుపులోని పురుగులు చచ్చిపోవును. అందువలన వారికి ఈడ్పు, వాయువు, మొదలగు బాలరోగ ములు, సాధారణమైన ఇతర రుగ్మతలు రాకుండచేయును.

మాచిపత్రి పవిత్రమైన మూలిక. అమూల్యమగు ఔషధరాజము. ప్రతివారికి సుల భముగ లభించునది. నిరపాయకరమైనది. ఇట్టి మూలిక యొక్క విలువను మనవారు గ్రహించి వాడుకొని తగిన లాభమును, సదుపాయమును పొందవలెనని మా ఆశయము.

శాస్త్ర సంగ్రహము.

మాచిపత్రి ఆకులతోను, వెన్నులతోను తయారుచేయబడిన కషాయము వ్రణము లను, దద్దులను, కుష్ఠరోగమును మాన్పును. వాతమును, ఈడ్పురోగమును కుదుర్చును. క్రిములను హరించును. వరుసజ్వరమును, అజీర్తిని, మూర్ఛను, అపస్మారమును, మరిడి జాడ్యమును, ఋతుబద్ధమును మాన్పును.

ఈ యాకులను వెన్నులను వెచ్చచేసి తయారుచేసిన కషాయముతో వ్రణములను కడిగిన అవి త్వరగ నయమగును. కుళ్ళిన వ్రణములమీద యీ యాకులను వెచ్చచేసి కట్టుకట్టిన తొర్రవుండుపడి శీఘ్రముగ మానును. తలనొప్పికి, మూడపోటుకు, వాతనొప్పు లకు, యీ ఆకులను వాడ్చి కట్టు కట్టిన నెమ్మదించును. దీని ఆకులను వెన్నతో వెచ్చ చేసి కండ్లకుకట్టిన కండ్లయెరుపులు, పోటు, నొప్పి నిమ్మళించును.

మాచిపత్రికి సంస్కృత భాషయందు స్థాణీయక; బహిర్చూడ; సురపర్ణ; శుకపుచ్ఛ, శుకచ్ఛద; వికీర్ణ; శీర్ణరోమక; మయూరచూడ; కీరవర్ణక; మొదలగు నామములుగలవు. ఈ నామ శబ్దముల అర్థమునుబట్టి మనమామూలికను అత్యంత సులభముగ గుర్తింప వచ్చును.

మాచిపత్రి జిగటగను, మధురముగను, రుచికరముగను, మనఃప్రియముగను ఉండును. కుష్ఠు, రక్తవాతము, జ్వరము, భూతబాధ, పిశాచభయము, వీటిని ఇది నశింప జేయునని ధన్వంతరి నిఘంటువు చెప్పుచున్నది.

త్రిదోషమును, రక్తదోషమును, భూతావేశమును, క్రిములను, చర్మవ్యాధులను, పోగొట్టి బలమును, శుక్రవృద్ధిని, రుచిని, బుద్ధికుశలతను కలుగజేయునని దీనిని గూర్చి ఇతర వైద్యనిఘంటువులు వ్రాయుచున్నవి.

మాచిపత్రి తేలికకషాయముతో మలాశయమును కడిగిన క్రిములు నశించును. కడుపులోని పురుగులను చంపుటకు ఆకుస్వరసము మంచిది.

మాచిపత్రినుండి 'శాంటొనైన్' అనుమందును తయారు చేయుచున్నారని ఇది వఱకే చెప్పియున్నాము. అదిగాక దీనినుండి 'అబ్సింతాల్' (Absinthol) అను నీలవర్ణము గల నొకవిధమగు చమురును తయారుచేసి వాడుచున్నారు.

మాచిపత్రికి లాటిను భాషలో (Artmesia Absinthium) ఆర్టిమిజియా ఆబ్సింథియము అనియును, ఆంగ్లభాషలో (worm-wood) వరమ్ వుడ్డు అనియును పేర్లు.

# ఇటలీదేశపు స్త్రీలు

ఇటలీదేశము యూరపు ఖండముయొక్క మాధ్యమిక ద్వీప
సిసిలీ, సార్డీనియా, మరియు కొన్ని చిన్నదీవులును చేరియు
సంగ్రామానంతరము ఇదివరకు యీ దేశమునకు సంబంధించియుండని
ట్రెంటినో, ఆల్టో, ఆడిజీ మున్నగు దీవులు కూడ యీ యిటలీ సామ్రాజ్య
లైనవి. ఇటలీ దేశముయొక్క మొత్తపు విస్తీర్ణత 118130 చతురపు
40,070,000.



పూలనమ్మ యువతి అమ్మకమైన యనంత
రము మందహాసవదనముతో గృహమునకై పయన
మగుచుండుట వెనిస్ నగరమందు తరచు చూడ
వచ్చును. నిర్విచారవదనమండలము సంతృప్తిని

ఇటలీ సామ్రాజ్యమున
పతి. ఆతని కుటుంబమందలి
యనంతరము కొమరునివరు
నేలుచున్నారు. పరిపాలనావి
సలహా నొసంగుచుండుటకు
కలవు. కాని యీ పద్ధతి
పూర్తిగ మారిపోయియున్న
త్రుడై తన మాటయె అన
శాసనముగ తలంపబడు లాగున
రాజుయొక్క యధికారమంత
ముల జేయుటకు క్రిందవచ్చితేది.
మున బెనిటో ముస్సోలినీచే
స్థాపింపబడియుండిన ఫాసిస్ట్ ప్ర
దేశమును పాలించు చున్న
మంతయు డిక్టేటరగు ముసో

లనుగాని మరియే యితర రాజకీయాందోళనను గాని ఫాసిస్టు ప్రభుత్వము ఇటలీదేశ మందు తలయెత్తనీయదు. ఆదియందు ముస్సోలినీ సోషలిస్టు సిద్ధాంతములను గౌరవించి వాటికి తీవ్రమగు వ్యాప్తి నొసంగియున్నను డిక్టేటరు పద్ధతిపై తనకు మక్కువ జనించిన నాటినుండియును తన దేశమందలి రాజకీయ భేదాభిప్రాయములు గలవారందరిని కూడ దేశమునుండి తరిమివేయుటయో లేక బందీలుగ గైకొనుటయో గావించెను. ఇదివరలో మితముగనుండిన ఇటలీ సైన్యములు నేడు పెంచబడియున్నవి. ముస్సోలినీ యిందుల కెక్కువ శ్రద్ధవహించి పాటుపడుచున్నాడు.



వెనిస్ ప్రాంతములందలి కన్యలు అంగసౌష్టవము నకును వన్నెకును తను సౌందర్యమునకును పేరువడసి యున్నారు. వీరు శరీరమునకు వలయు వ్యాయామ మును గృహపరిశ్రమల నొనరించుట మూలమున నిచ్చు చుందురు.

ఈ దేశమున యెక్కువమంది చే రోమన్ కాథలిక్ మత మనుసరింపబడుచున్నది. దేశమందు ప్రభుత్వముచే 17 విశ్వవిద్యాల యములు స్థాపింపబడి సాగింపబడుచున్నవి. ఇందులో మూడు విశ్వ విద్యాలయములు ఉచితవిద్యల నొసంగుచున్నవి.

ఇటలీదేశమున నేపిల్సు, మిలాన్, రోమ్, యారిస్, పాలెర్మో, ఫ్లారెన్సు, కటేనియా, లొంబోగ్నా, వెనిస్, మెస్సినా, లెగ్‌హారన్, బారి, పడే, ఫెర్రారా ముఖ్య నగరములు. వీటియందే విపరీతముగా వాణిజ్య వ్యవహారములు సాగుచుండును.

మొత్తముభాగములో 71,652,692 యకరముల సాగుబడి గావింపబడుచున్నది. దేశమందలి గనులు తెరువబడుచున్నవి. ఈ దేశమునుండి యెక్కువబొగ్గు యితర దేశముల కంపబడుచున్నది.

ఆదియందు ఇటలీదేశము చిన్న చిన్న ఖండములుగ విడిపోయి యుండెను ఆచిన్ని ఖండములనన్నింటి నొకచో జేర్చిన యనంతరము మేధావంతులు ఇటలీజాతి నిర్మాణ మవసర

మని తలంచిరి. అంతకుముందు ఇటలీదేశీయులకు నియమములుగాని జీవితాదర్శములుగాని లేవని ఆంగ్లేయులు మున్నగు వారందరును హేళన పూర్వకముగ మాటలాడుచుండెడి వారు. అదియంతయు నేడంతర్ధానమైనదనవచ్చును. ఇందులకు ప్రబల ప్రయత్నములను గావించియుండినది శిల్పికొమరుడగు ముస్సోలినీయే. యుద్ధానంతరము బెనిటో ముస్సోలినీచే కనిపెట్టబడిన ఫాసిస్టు ఉద్యమమువలన ప్రజలయొక్క రాజకీయ స్వాతంత్ర్యత కొంత వరకు తగ్గినను మొత్తము దేశమునకు గౌరవ స్థానమలవడినది.

మొత్తముమీద ఇటలీదేశమంత సౌఖ్యజీవనమునకు నిలయమని చెప్పజాలము. ప్రకృతిశోభకుమాత్ర మీదేశము నిలయమగుటచే ప్రజలయందొక విధమగు ఆనందము సంతృప్తియు నుదయించియున్నది. దేశమందు దారిద్ర్యత యెక్కువగనున్నది. పొలముల యందు దినమంతయు పాటుపడు ఇటలీ కార్మికునకు వలయునంత కూలిదొరకుట దుర్లభము. అదియుగాక ఆకూలికొరకేనియు దూరప్రదేశములకేగ వలసియుండును. ఇట్టి యిక్కట్లను నిర్మూలన మొనరించుటకు నేడు ప్రయత్నములు జరుగుచుండుట ప్రజలకుత్సాహమును కలుగజేయుచున్నది. దేశమందన్ని ప్రాంతములలోనను వ్యవసాయదారుల సంఘములు నెలకొల్పబడుచున్నవి.

గ్రామములయందు సౌఖ్యజీవన విధానములు కానుపించుచున్నను నాగరిక పద్ధతులు లేనికతమున దృశ్యమించుక మొరటుగనుండును. గ్రామములందు విద్యాలయములను విరివిగ నెలకొల్పి నిర్బంధ విద్యా విధానము నాచరణలోనికి గొనిరావలయునని ప్రభుత్వము ప్రయత్నములను సాగించుచున్నది. నేటికిని గ్రామములయందేగాక నగరములయందును ఉత్తరములు మున్నగు వ్రాతపనులను చేయుటకుగాను కొందరు అంగళ్లనుతెరచుకొని యుందురు.

ఒకానొకకాలమున నాగరికత ఉన్నత స్థానమున కెగబ్రాకియున్న దేశమంతటి పాడుస్థితికివచ్చినదని మరిమరి జ్ఞప్తికిదెచ్చుటకోయన ఆదేశమందెచ్చో జూచినను బ్రహ్మాండ మగు పురాతన శిథిలమందిరములు కానవగుచుండును.

నేపిల్సు నగరము రామణీయకత కెంతయు ఖ్యాతినార్జించియున్నది. ఆనగర మందలి స్త్రీలు పురుషులుతోపాటు కర్మాగారముల యందుత్సాహముతో పనిచేయు చుందురు. మధ్యాహ్నభోజన సమయములయందు స్త్రీలందరొకచోగూడి హాయిగ కాలముగడపుచుండ గమనించుటకెంతయు ఆనందదాయకమై యొప్పుచుండును.

నేపిల్సు నగరమందలి వీధులలో చిన్నచిన్న హోటళ్లుందును. ప్రజలు హోటళ్ల కడ హాయిగ కాలము గడపుచుందురు.



లేసుల నుపయోగించుట తక్కువయైనను ఇటలీ దేశమందలి స్త్రీలు తమ కాలమును లేసు అల్లుట, తుంగతో లతలపట్టీలనల్లుటలోనను వినియోగింతురు. చిత్రమందలి స్త్రీ సన్ననితుంగతో కళాసంయుత మగు పట్టీని తయారు చేయుచున్నది.

దేవుని పూజించు విధములందు కొంత వరకా దేశమందలి స్త్రీలు హిందూ స్త్రీల పూజార్చనల ననుసరించెదరనవచ్చును. పురుషులయందునకన్న స్త్రీలయందే యెక్కువభక్తి జ్ఞానమున్నది. పడవబోవుటకు వలయునంత లోతుగల చెరువు మధ్య నిర్మింపబడియున్న కల్లు మంటపముమీద నుంచబడియున్న క్రైస్తవ మాత మేరీ ఆలయమునకు స్త్రీలు పుష్పములు ఫలములు గైకొని అర్పింతురు. నేపిల్సునగర మందు పుష్పములను ప్రేమించువారెక్కువ యనవచ్చును. ఆకారణముననే యెక్కడచూచి నను పుష్పముల నమ్ముచుండు స్త్రీలే ఆనగర మున కానుపించుచుందురు. గ్రామములయందలి స్త్రీలు వ్యవసాయమునకు సంబంధించిన పనులను జూచుటయేగాక లేసు అల్లిక, చాపఅల్లిక మున్నగు గృహపరిశ్రమలయందు తమకాలమును వినియోగపరచుచుందురు. నగరములయందు స్త్రీలు లేసులనల్లుచు అక్కడక్కడ సమావేశమై లోకాభిరామాయణమును సాగించుచుండుట మామూలై యున్నది.

ఇటలీదేశమందు సేవాసంఘము లాదిని బయలుదేరినవని చెప్పవచ్చును. ఈసేవా సంఘములు ఆదేశీయులకు చేయుచున్న సేవఅపారము. ప్రధాననగరము లన్నింటిలోనను సేవాసంఘములున్నవి. ఈ సంఘములకు కొంతమూలధనమును, కొందరు సభ్యులునుగలరు. జననమరణ సమయములయందీ సంఘములు చేయుచున్నసేవకు ప్రజలెంతయు సంతృప్తి జెందియున్నారు.

ఇటలీ దేశీయులకు పండుగలు ఉత్సములన నెక్కువ యిష్టము. పండుగ దినము లందు స్త్రీ పురుషులు చక్కనివస్త్రముల ధరించి వేలకొలదిగ ఉత్సవములకేగెదరు. మేరీ

కన్యయొక్క ఉత్సవ మన్నింటికన్న నెక్కుడు వైభవముగ గావింపబడుచుండును. ఆదినమున మేరీ యొక్క పవిత్ర విగ్రహమును నత్యంతరామణీయకముగా నలంకరించి బ్రహ్మాండమగు క్రొవ్వువత్తిదీపముల మధ్య నొక ఉన్నతాసనమున నునిచి యూరేగింతురు. వచ్చినవారందరును భక్తిగౌరవములతో ఆవిగ్రహము నారాధింతురు.

ఇటలీ దేశమందు జూదము విపరీతముగ బెరిగియున్నది. ఈజూదమూడు విధముల వలన ప్రజలకు జరుగుచున్న అపకారమును సాధ్యమగునంత వరకు తగ్గించు తలంపుతో ప్రభుత్వము కొన్ని నియమముల నేర్పరచినది. ఆ నియమముల ఫలితముగ నేడు జూదము కొంతవరకు తగ్గినది. ఆస్థానమున లాటరీలు యెక్కువమైనవి. లాటరీ టిక్కెట్లను కొను నలవాటులేని ఇటలీ దేశీయుడొకడేనియు ఆదేశమున కానరాడని చెప్పవచ్చును

ఇటలీదేశము ఫలపుష్పముల కెక్కువ ప్రసిద్ధిజెందియున్నది. ఈదేశమునుండి వేలకొలదిగ సీమవంకాయల పచ్చడిని (టొమేటాసాస్) యితర దేశములకు యెక్కువగా దిగుమతిగావింపబడుచున్నది. సీమవంకాయలను ప్రత్యేకముగా పండించుపొలములీ దేశమున చాలగలవు. అది యొక ప్రత్యేక పరిశ్రమక్రింద సాగింపబడుచున్నది. సిసిలీ దీవులయందలివారు బొమ్మజెముడుపండ్లను రొట్టెలతో తినెదరు.

మొత్తము ఇటలీ సామ్రాజ్య మంతటిని పరిశీలించునెడ వివిధ ప్రాంతములయందలి స్త్రీలు వివిధాకృతిగల దుస్తులను ధరించుచున్నట్లు తెలియగలదు. ఈదేశమందలి స్త్రీలు లేసుల నెక్కువగా నుపయోగింపరు.

# పోటీ పరీక్ష

చెన్నపురి కమ్మ విద్యార్థి సంఘము.

ఈసంఘము 30 రూపాయలను, కమ్మ విద్యార్థినులయందు వ్యాసరచనలో పోటీ ఏర్పాటుగావించి, కృతార్థులైన నల్గురకు బహుమతు లిచ్చుటకు నిశ్చయించి యున్నది. వ్యాసము స్త్రీ విద్యనుగూర్చి-వ్యాసములను గ్రాంధిక భాషయందు, సుమారు 30 అరఠావు పుటలకు మించక, కాగితమున నొక ప్రక్కనే వ్రాయవలెను. విద్వాన్ మొదలగు బిరుదాంకితు లీబహుమతుల కనర్హులు. మే నెల 15 వ తేది లోపల వ్యాసముల నీక్రింది అడ్రసుకు పంపవలెను.

కాకరాల సత్యనారాయణ చౌదరి,

కార్యదర్శి, చౌదరీలాడ్జి,

మాంబలం, సైదాపేట, మద్రాసు.

# ఏడ్పు మానుము పసికూన యింకనైన!

బాలకవి కోవూరి. వేంకట రాఘవసూరిగారు

మోసె నవమాసములు గర్భమున మహావ్య
థలకునోర్చి నీ నగుమోము కళల నీదు
చేతల సదాగనుచు సంతసించుచుండె
నట్టి నీతల్లి యింటి కార్యములసర్దు
కొను తలంపున నిన్వీడి జనుచునుండె
నది యెఱుంగక మఱినన్ను గదియదనెడి
తలపునన్ గెవ్వుమని యేడ్వదగునె నీకు
ఏడ్పుమానుము పసికూన యింకనైన॥

వదనగహ్వరమెండ "నావా" యటంచు
చిన్నికడుపున ప్రేవులు చేదుకొనుచు
వేడికన్నీటివపువెల్ల వాడిపోవ
అర్జున కృపీటజాతవదూర్జి తాచ్ఛ
నయనములు మృదుతమశయ ద్వయవిమర్ద
నమున నెఱడాలుగల్గి కెందమ్ములవలె
నుండ నిన్గాంచి నీతల్లి యుస్సురనదె
ఏడ్పుమానుము పసికూన యింకనైన॥

పండువెన్నెలగాయుచు నుండు వేళ
నిండుజాబిల్లిఁగాంచుచు పండుకొనిన
తల్లియొద్దనుపాలను త్రావునపుడు
నీదుచేతలకగు మనోహ్లాదగరిమ

చిత్రములగోరి గజిబిజిజేయునపుడు
పండ్లు కావలెనని పైకిఁబ్రాకునపుడు
నీవలనగల్గు మోదము నేటినిన్నుఁ
గనిన వెంటనె మాయును గానవేగ
నేడ్పుమానుము పసికూన యింకనైన॥

# స్త్రీలు-నాటకరంగ ప్రవేశము

శ్రీమతి పులవర్తి కమలావతిదేవిగారు

శ్రీమదఖండమహీమండలమునకు మండనాయమానంబై, సింగపు కొదమలతో జెలలాటలాడిన భరతునివంటి యఖండబలసంపన్నులచే బరిపాలితంబై, రత్నగర్భయని యితర దేశములచే సన్నుతినంది, ప్రాచ్యఖండములు నాగరికత యన నెట్టిదియో యెఱుఁగని శైశవావస్థయం దున్నతఱి కాళిదాసభవభూతులవంటి యుత్తమ నాటక గ్రంథకర్తలను గలిగియుండిన మన హిందూదేశము తొల్లిటినుండియు దృశ్య ప్రబంధముల బ్రదర్శించుట యందెంతకేనియు వన్నెకెక్కియున్నది.

కాని కొంతకాలమునుండి నాటకమునందు పాత్ర ధరించుటయన్న కడునీచ భూయిష్టముగ పరిగణింపబడుచు, ఉత్తములనుకొనువారు వారిని బహిష్కరించుట తటస్థించు చున్నది. పురుషులగతియే యిట్టులుండ నిక స్త్రీలను వారు విశాలభావముతో నటనా రంగముపైకి రానిత్తురా? అందులకనియే పాశ్చాత్యనాటకరంగము లత్యున్నత స్థితి యందుండ మన మింకను గుంటపూవులు బూయుచు యెదుగుబొదుగు లేక మేకతోకవలెనే యున్నవారము. ప్రాజ్ఞులిప్పుడిపుడీ సమస్యవిషయమై కృషిసల్పుచుండుట యెంతయు సంస్తవనీయము. స్త్రీలు నాటకరంగమున పాల్గొనుట మన యాంధ్రదేశమున నొక్క సురభికంపెనీయందే గాననగును. కాని యందు వారలే పురుష పాత్రల ధరియించుటచే మొగవార లాడువేసముల ధరియించి నటన నెంత గంగ పాలొనర్చుచున్నవారలో స్త్రీలు పురుషపాత్ర ధారిణులై నటననంతయే యధోగతి పాలొనర్చుచున్నవారలు.

---

* ప్రతివత్సరమును డాక్టర్ కె. యస్. కేసరిగారు నెల్లూరు ప్రొగ్రెసివ్ యూనియన్ తరఫున జరుపబడుచుండు ఆంధ్రవ్యాసరచన పోటీపరీక్షలకొక బంగరుపతక మొసంగుచుండుట వాడుక. ఈవత్సరము పతకము యీవ్యాసకర్త్రి కొసగబడినది.

స్త్రీలు నాటకరంగమున పాల్గొనవలసిన కాలమరుదెంచినది. ప్రపంచమంతయు మహా వేగముతో నాగరిక శిఖరము నధిరోహించుచుండ మనహిందూదేశ మొక్కటి వెనుకబడియుండుట భావ్యము గాదు. ఇందు విషయమై మిక్కిలి కృషి యొనర్చుచున్న వారు బళ్లారిలో పబ్లికుప్రాసిక్యూటరు పదవియందున్న తాడిపత్రి రాఘవాచార్యులుగారు. స్త్రీలు నాటకరంగ మలంకరింపవలయునను పట్టుదలతో నాతడు కొందఱు విద్యావతులగు స్త్రీలకడ నీ ప్రసంగము తేగా వారలితని హేళనమొనర్చి సాయపడరైరి. కాని యాధీరుడంతతో నూరకుండక తన భార్య కడకరిగి యామెనే నాటకరంగమున కరుదెంచి తనతో నభినయించి తోడి సోదరీమణుల కాదర్శప్రాయ గావలసినదని ప్రార్థించెను. ఆమె మిగుల విద్యావతిగాదు. ఉన్నతవంశ సంభూతురాలు. అయినను భర్తయందు గల భక్తిచేతను, తోడిసోదరీవతంసములకు మార్గదర్శిని కావలయునను కుతూహలము తోడను, భర్తకడనే పద్యనభ్యసించి తమ కనుకూలముగునట్లు భర్త రచియించిన నాటకముల వల్లెవేసి నాటకరంగమున కరిగి ప్రేక్షకుల తన్మయుల జేసినది.

ఆమె యద్భుతనటనాకౌశలము గాంచినవిమ్మట ఉస్మానియా విద్యాలయమున జదువు ప్రకాశరావను నొకసంఘసంస్కర్త తనభార్య సరోజినినిగూడ తాడిపత్రి రాఘవాచార్యులుగారి నాటకమున వేషముధరించుట కనుజ్ఞ నిచ్చిపంపెను. అది మొదలు కొందఱు విద్యావంతురాండ్రగు స్త్రీలా సంఘమునజేరి యత్యంత రామణీయకములగు నాటకముల ప్రదర్శించి పలువుర మన్ననలకు బాత్రులై నిలసిల్లుచున్నవారలు.

స్త్రీ పాత్రను స్త్రీయే ధరింపవలయును. స్త్రీకియున్న కోమలకంఠము, సహజ లావణ్యము, నునుసిగ్గు, పురుషనటకునకు వందసంవత్సరము లభినయశాస్త్రము నేర్చుకొన్నను రాజాలవు. గానము స్త్రీలసొత్తు. అట్టి కలకంఠులను బహిష్కరించిన నాటకరంగములు రక్తిగట్టునా?

మనయాంధ్రదేశమున నటకులకు జీతములు స్వల్పములు. అట్టియెడ విద్యావంతురాండ్రగు స్త్రీలెట్లు లభింతురని మీరునన్నడుగవచ్చును. అందులకెంతయు వీలగు నుపాయమును నేను సూచింపుచున్నదానను. మనము నేడు మనసంఘములోగల చెడుగుల నెల్ల పారద్రోల బద్ధకంకణులమై యున్నవారముగదా! నేడు మనసంఘము వేశ్యాసంఘమును సంస్కరింపవలయునని బహువిధముల ప్రయాసపడుచున్నది. ఇదివరకే వేశ్యావృత్తి యందుండ్డిన వారిని వివాహ మెంతసంస్కరించినను వ్యభిచారమును మానుదురేమోగాని

వారి నెవ్వరును వివాహమాడుటకు ముందునకు రారనుట సర్వజన విదితముగదా! అట్టిచో వారిని వృథాగా కూర్చుండబెట్టి పోషించుట సంఘమునకు లాభకారికాజాలదు. వారలా అభినయ శాస్త్రమున దిట్టలు. గానమువారిసొమ్ము. రూపమున వారికి పెట్టినదిపేరు. అట్టి బంగరుబొమ్మలను కొలది విద్యావిధానముతో మన నాటకరంగమున ప్రవేశపెట్టినయెడల నత్యద్భుతమగునట్లు నాటకకళ యభివృద్ధి నందగలదు. ఒకవంక వేశ్యాసంఘోద్ధరణము జరుగగలదు. రెండవవంక నాట్యకళాభివృద్ధిగాగలదు. వారలనుజూచి విద్యావంతులు గూడ నాటకరంగమున పాల్గొనుటకు వెనుదీయరు. ఒక విధవనుజూచి మరియొక విధవ, విధవా వివాహమున కుబలాటపడునట్లులే యొక స్త్రీనాటకరంగము నెప్పుడధిష్టించునో యప్పుడే మరికొందఱి కట్టిసంకల్పము జనించుట సహజము. స్త్రీలు నాటకరంగమున బాల్గొనుటతప్పా? యని మనరెండవ సందేహము. స్త్రీలు నాటకరంగమున బాల్గొనుట యిసుమంతయు తప్పుగాజాలదు. వృత్తికిని, వ్యభిచారమునకు నిసుమంతయు సంబంధము లేదు. నాటకమున బాల్గొను ప్రతి స్త్రీయు జారిణికావలయునని వనజగర్భు డెచటనైన వ్రాసి యున్నవాడా యేమి? జారవాంఛగల స్త్రీయింటనుండినను జారిణియగును. పతివ్రత రంగ మధ్యముననున్నను పతిపాదముల హృదయపీఠమున నధిష్టించి పూజింపుచునే యుండును. అందుచేత కుహనావాదములచే స్త్రీలను రంగస్థలములకు రాకుండ బహిష్కరింపకుడు.

స్త్రీని రంగస్థలము మీదికిరానిచ్చుట లాభకరమా? యని మనమూడవ ప్రశ్న. ఆర్థికముగ నింతలాభకరమైనది మరియొకటుండబోవదు స్వానుభవమువలన స్త్రీలు స్త్రీల పాత్రధరించుదురని ప్రకటన యొసర్చినప్పుడా నాటకమునకు రెండువేల రూపాయ లాదా యముపచ్చుట నేనెరుంగుదును. అట్టి కంపెనీయొకటి కొలది దినములక్రితము మాపుర మరుదెంచుటయు విశేషధనము గైకొని వెడలుటయు వాస్తవముగ జరిగిన విషయములు.

మర్త్యజీవితవికాసమునకై యేర్పడు విలాసములలో నాటకము లత్యుత్తమస్థానము నలంకరింపుచున్నయవి. సంఘ విద్రోహములగు దురాచారములను రూపుమాపుట యందేమి, మనుష్యునియొక్క నైతిక జీవితాభివృద్ధి గావించుటయందేమి నాటకము లెంతయో యుపకారులగుచున్నయవి.

సంఘవృక్షమునకు జీడపురుగులై చూపట్టు వివిధ సాంఘిక రాజకీయ ఆర్థిక సమ స్యలయందలి విషమ పరిస్థితులను ప్రత్యక్షముగ నేత్రములకు గన్పడునటుల జేసి చిత్త సంస్కారమునకు దోడ్పడునవే నాటకములు. కావుననే కాళిదాసాదికవులీ నాటకములు

రచియించి మృతులైనను వారియాశయమిప్పటికిని స్థిరస్థాయిగనున్నయది. లోకకల్యాణ మునకు దోడ్పడిన తొల్లింటి మహామహుల చరిత్రమును కనులారగాంచినపుడు మనమున నొకవిధమైన భావపరివర్తనము గలుగక మానదు. సారంగధరుని అకల్మష మాతృభక్తిని గాంచిన వాడెవడైన సవతిదల్లిని కన్నెత్తి చూడగలడా? జనకునియాజ్ఞపరిపాలించుటకై వనములకేగిన రఘురాముని పితృభక్తినిజూచినవాడు తండ్రిమాట జవదాటగలడా? సత్యవాక్య పరిపాలనార్థమై కన్నకొడుకును కానపాలుగావించి కాష్టభూమిని కాపుండిన హరిశ్చంద్రనరపాలుని జీవితమును రూపకమున జూచినవారికి యాతడాదర్శపాత్రుడు కాకపోడు. కావున యుత్తమ ప్రదర్శనములు సర్వవిధముల యశోదాయకములనక తప్పదు. వెలుతురునంటియుండు చీకటివలె, జ్ఞానచ్ఛాయల నాశ్రయించిన మాఢ్యము వలె, దీనికియున్న లోపమేమన స్త్రీలను రంగస్థలమునకు రానీయకుండ దరిమివైచుటయే. స్త్రీల బహిష్కారమే యీనాటక కళా వినాశమునకుమూలము. సంఘసంస్కార పరాయణుల దృష్టి విధవా వివాహములకన్న నీవైపునరల్చుట కడుంగడు శ్రేయోదాయకము.

నాటకప్రదర్శనము లెంతటి యుత్తమకళలయై విరాజిల్లినను లోకమున వానికపయశ మేరీతిని వాటిల్లినదో పరికించుట మనకు ప్రథమకర్తవ్యము. తరుణవిద్యార్థులు నాటక రంగమునకుదిగినయెడలను,యువకులు ప్రదర్శనోత్సాహమునజిక్కినను చెడిపోవుదురని మన వారి యభిప్రాయము. కడుపుకక్కుర్తికై మీసములదీయించి వేసమువైచి దేశముల పాలై స్వీయకుటుంబముల గ్రామదేవత పొట్టనుబెట్టి, పరదేశముల నుండుటచే వ్యభిచారమునకు దాసులగు కతమున నాటక కళకే యపవాదమును దెప్పించిన తుంటరి నటుల మూలము ననే యీ యపవాద తటస్థించినది. అంతియగాని జగదేక కవితల్లజుడగు రవీంద్రనాథుడు నాటకరంగమున పాత్రలధరించినవాడే. 'ఆంధ్రనాటకపితామహ'యని బిరుదునందిన కృష్ణమాచార్యులు పాత్రలధరించినవాడే. అట్టివారలవలన ఖ్యాతియేగాని యపకీర్తి రాబోదు. నాటకకళాభివృద్ధికై పాటుపడువారిలో స్వీయకుటుంబముతో స్త్రీలతో నాటకము లాడుచుండిన ఆదర్శప్రాయుడగు రాఘవాచార్యుడే యగ్రస్థానమునలంకరించుచున్నవాడు. ఆ మహామహుని పదజాడలగుండ నడచిన మనయితరనాటకసంఘము లత్యంత శీఘ్రకాలములో యభివృద్ధి నందగలవు. స్త్రీ రంగమున కధిష్ఠానదేవత. ఆమె లేకపోయిన పిమ్మట నది శ్మశానవాటికగాని రంగస్థలము కాజాలదు.



శ్రీమతి పులవర్తి కమలావతి దేవిగారు

స్త్రీలు నాటకమున పాత్రల ధరియించుటవలన లాభము లేమియున్నవో, ఎట్టి స్త్రీలను నాటకరంగస్థలమున మొదట ప్రవేశపెట్టవలయునో, అటుపిమ్మట స్త్రీలు తమంతదామే యెటులవత్తురో మొదలగు విషయములనెల్ల సమగ్రముగ నిదివరకే మనవి యొనర్చియున్నదానను. అందువలన వివేకరహితముగ స్త్రీలను రంగస్థలమున ప్రవేశ పెట్టుటయే జీవిత పరమావధిగ బెట్టుకొని యెటువంటి యాడుదియైన రంగస్థలమలంక రింతుననినయంతనే జేర్చుకొనుట నాటక కళాపోషణమునకుగాక వినాశనమునకు కారణ భూతమగును. ఇప్పుడు ప్రతి పట్టణమున నుప్పతిల్లిన రైసుమిల్లులవలె ఓ యనివ ఛం రాని పంతులమ్మల బడిప్రవేశమువలె కనబడిన యాడుదాని నెల్ల రంగస్థలమునకు దింపిన నిసుమంతయేని లాభముండదు. కావున నెట్టివారలు రంగస్థలమున కనుకూలురో యీయుపన్యాసమున దెల్పుట మిక్కిలి వాంఛనీయము. నాయికలు మూడు విధములు.

1. స్వీయ 2. పరకీయ 3. సామాన్య.

1. ఉచితలజ్జయు, ఆర్జవమును, శీలమును, సౌందర్యమును గల స్వభార్య స్వీయ యనంబడు.

2. పరుని భార్యయు, వివాహముగాని కన్యయు పరకీయ నాబడు.

3. వేశ్య సామన్య యనంబడు.

ఈ నాయికలు ముగ్ధ, మధ్య, ప్రౌఢ అని మూడు భేదములు గలిగియుందురు. ఎవ రెట్టివారో వివరముగా తెల్పుటకు నేను స్త్రీ నగుటచే పరీక్షకులు పురుషులై యుందు రేమోయని యెంచి లజ్జచే వ్రాయమానుచున్నదానను.

ధీర, అధీర, ధీరాధీర అనిమరల మధ్యయు ప్రౌఢయు ముప్విధంబులనుందురు.

1. సాపరాధుడైన భర్తను పరిహాసముగా నెత్తి పొడుచునది మధ్యధీర.

2. కన్నులనీరుపెట్టుకొని పరుషములాడునది మధ్యాధీర.

3. కన్నీటితో వక్రోక్తుల బల్కునది మధ్యధీరాధీర.

4. భర్త యపరాధియైనపు డాకారాదులచేత కోపము కనబడనీయక కామోత్కంఠత తన్ను జేరునపు డలయించునది ప్రౌఢధీర.

5. భర్తను రోషముచేత కొట్టునది ప్రౌఢాధీర (ఉదహరణము సత్యభామ)

6. కోపముతో కుటిలవాక్యము లాడునది ప్రౌఢధీరాధీర.

ఈ శృంగారనాయికలు 1. స్వాధీనభర్తృక, 2. వాసకసజ్జిక 3 విరహోత్కంఠిత 4. విప్రలబ్ధ 5. ఖండిత 6. కలహాంతరిత 7. ప్రోషిత భర్తృక 8. అభిసారిక అని యెనిమిది విధములనుందురు.

1. తనకు భర్త వశుడై యున్నయెడల నది స్వాధీన భర్తృక యనంబడు.

2. ప్రియునిరాకకు వేచి శృంగారముగ గృహము నలంకరించుకొని వేచియుండునది వాసకసజ్జిక.

3. పతి వచ్చువరకు తాళజాలక విరహవేదన బడుచుండెడిది విరహోత్కంఠిత యనంబడును.

4. సంకేతస్థలమునకు బోయి నాథునిగానక శోకించునది విప్రలబ్ధ నాబడును.

5. విభుడు పరాంగనాసక్తుడై వేకువజామున నింటికివచ్చినపుడు కోపపడునది ఖండిత యనంబడు.

6. భర్తను మొదట బాగుగా దూషించి పిమ్మట అయ్యో! ఆయనను దూషించితినే యని పశ్చాత్తాపబడునది కలహాంతరిత.

7. భర్త పరదేశముల కేగినప్పుడు వ్యధచెందునది ప్రోషిత భర్తృక.

8. కాంతు ననుసరించి పోగోరునది అభిసారిక యనంబడును.

ఇట్టి నాటక లక్షణములయందు ప్రత్యేక కృషి యొనర్చినవారలే రంగస్థలము నలంకరించిన నాటకకళకు వన్నెవచ్చును. అంతియగాక నాటకరంగ స్థలముల వేసములు వైచుపడంతికి తగిన యంగసౌష్టవము జబ్బసత్తువ యుండవలయును. నల్లగనున్నను లోటులేదు. పూతలలో నానల్లదనమడుగున బడిపోవును.

"ఎన్నియున్నను తగినపతిలేకయున్న నన్నియును సున్న" యన్న విధంబున నిన్ని గుణంబులు గలిగియున్నను గాత్రములేని యంగన జేరదీయరాదు. పల్కినా వీణా నినాద మట్లుండవలయును. కంఠమెత్తినా కిన్నెరలు మ్రోయవలయు. సభ్యులు ముగ్ధులు గావలయు.

అట్టి స్త్రీలను గలిగిన నాటకకంపెనీ సర్వసంపదలతో దులదూగగలదు. ఈశ్వరుడు మనకచిరకాలముననే నట్టి మంచి నాటకసంఘముల దయచేయుగాత యని పరమేశ్వరుని బ్రార్థింపుచు విరమించుచున్నదానను.

కేల వీణెను మీటెడు కీరవాణి
విద్యలకు మూలమెల్ల నాయాది దేవి
వీరసరస్వతి కెంతయు వరలుభక్తి
నర్పణము సేతుదీనిని నతులభక్తి

—సరస్వతి దాసి.

# శ బ రి

సాహిత్యసరస్వతి వావిలాల గోపాలకృష్ణయ్యగారు.

( క్రిందటిసంచిక తరువాయి )

రాముఁడు

సౌమిత్రీ! సీతను గాంచకుండిన నెక్కువ దివసములు జీవింపఁజాలనని తలంతు నోయీ!

సౌమిత్రి

(తనలో) ఆహా! దంపతులనిన నీ సీతారాములే దంపతులు. కాలకర్మవశమున భర్తనువీడియు భర్తృస్తుతికి బాత్రురాలైన యాసీత పాతివ్రత్యము వర్ణనాతీతము. పరాంగనా విముఖుఁడగు నీ శ్రీరాముఁడెంత ధన్యుఁడు ఈధన్యులసేవగావించుచు నేనెంత ధన్యుఁడనైతిని! (ప్రకాశముగా) తండ్రీ! అందులకే గదా మనమన్వేషించుచున్నయది! సీతాన్వేషణంబునకు ఎఱయు విషయములలో, గొన్నింటిఁ, విపులముగా దెలిసికొంటిమి. ఇంకను మనకుఁగావలసినది సుగ్రీవ సఖ్యముకదా!

రాముఁడు

అగు. లక్ష్మణా, నేడు సుగ్రీవుఁడుండు నగరమును జేరఁగలమా?

సౌమిత్రి

దేవా! ఎల్లి చేరఁగలమని నిన్న కబంధుడు జెప్పినదియు నీవిషయమేఁగదా!

రాముఁడు

సరియే! గాని, సౌమిత్రీ! నీవా కబంధు జూచినయంతనే యంత భీతినందితి వేమోయి. వాఁడే మనలను సంహారించునని తలంచితివి కాఁబోలు!

సౌమిత్రి

అన్నా! ఆయాకృతిని గాంచిన యంతనే నా గుండియ తల్లడిల్లెను. వాఁడు

మూర్ఖుడు—దుష్టుడు—నీచుడు—మాంసభక్షకుడు. అట్టివాడేమైన జేయునుగదా యని తలంచితిని. కాని, యా కబంధువు కారణజన్ముడని యిసుమంతయు దెలియ దాయెను.

రాముడు

సౌమిత్రీ! మఱచితిని. ఆకబంధువు మనకు 'శబరి'నామక శబరకులవనిత కానుపించు ననియు, నామె మనకాతిథ్యం బొసంగ నెన్నియో సంవత్సరములనుండి యెదురు జూచు చుండెననియు, ఆమె యొసంగు నాతిథ్యంబును మనము తప్పక స్వీకరించవలయుననియును దెలియజేసియుండెను కదా! ఆ వనిత నివసించు ఆశ్రమం బింకనెంత దవ్వుననున్నయదియో!

సౌమిత్రి

ఔనన్నా! ముందు నడచుటకు నీకు శక్తియున్నదా లేదా? లేకున్న నేదేని ఫలం బొండు భక్షింపనెంతువా?

రాముడు

సౌమిత్రీ! తొందరలేదు. మన మింకొక దశయోజనంబుల దూరమువఱకు నడచుటకు నాకు దార్ఢ్యము కలదని నా దేహము చెప్పుచున్నయది. కావున మనము నడువ గడంగుట మంచిపని యని తోచెడిని.

సౌమిత్రి

అన్నా! ఐనను నంత కష్టమేమి? ఈయరణ్యంబునగల కొన్ని ఫలంబులను దినియే కదలుదము. ఇంతలోనెంత వ్యవధి గడిచిపోవగలదు. (ఒకవంక జూచి) అవిగో! నచట కొలదిగ ఫలము లుండినటులున్నది. అది యుసరికవృక్షమని తోచెడిని. తా ముసరిక ఫలంబులను దీసికొని చాలకాలమైనది.

రాముడు

సౌమిత్రీ! అంతగ నిబ్బంది యేమియును లేదోయి! ఎచట గావలసిన నచటనే ఫలములు లభింపగలవు. మనము పోనున్నది పంపాతీరమునకు గదా? అచట ఫలముల కేమి కొఱత? ఈలోగా మనకంతయవశ్యములని తోచుటయు లేదు. కావున నాలసించనేల? కూర్చున్న వానికి నడచువానికి గూతవేటనినటుల నూరక నాలసించనేల. నడచెదమా?

సౌమిత్రి

మంచిది. అటులనే కానిండు.

(వడిగా నడచుడు).

## రంగము 3

శబరి వన్య ఫలంబుల నన్నింటిని సేకరించి తన యాశ్రమము (కుటీరము) న నిలువఁజేసియుంచెను. శ్రీరామ లక్ష్మణుల రాకకై యెక్కువ యాతురతతోఁడ వేచియుండెను. మట్ట మధ్యాహ్నము కాఁజొచ్చెను. మొయిలు విడివడియుండుటఁజేసి సూర్యతాప మించుక తీవ్రముగనుండెను. ఎండ యధిక మగుట ఫలము లకై వనమున నంతటను దిరిగి శ్రమించియుండుట వలనఁగొంత యలసటఁబొందినటుల శబరి ముఖముపై స్వేద బిందువులుఁగొన్ని జారుచుండెను. శబరిది పూర్వపు వేషమే! పూర్వముకన్న నిప్పుడు శబరికి శ్రీరామ దర్శ నాభిలాష యందాతురత యధికముగఁగన్పట్టుచుండెను. కుటీరప్రాంగణముననే కూర్చుండి యుండును.

శబరి

ధన్యలోకైకసాంద్రా! రామచంద్రా! రావేమి? ఇంకను రావేమి? నీకొఱకై నేనెంత కష్టించుచున్నానో యూహించుచుంటివా? రావేల? నాకష్టమును వృథా యొనర్తువా? అన్నా! సౌమిత్రీ! నీవైన సోదరుని ప్రోత్సహించి త్వరలోఁదోడ్కొని రారాదా? పాపము! నీ వెంతగ నలసియుంటివో గదా? ఆ, నీకుఁగాఁ బ్రత్యేకముగాఁగొన్ని ఫలంబులను బ్రీతితో సేకరించి యుంచితిని. నీ వనుదినమును సీతారాముల కొసంగెడు ఫలంబులె కడు రుచ్యమైనవో—నేను సేకరించి యుంచిన యీ ఫలంబులె కడురుచ్యమైనవో— యరయుటకైన నీవిటకురమ్ము. జగన్నాథా! శ్రీరామచంద్రా! ఇటురమ్ము! వేగిరము రమ్ము! నీ సోదరుఁడైన లక్ష్మణుఁడెక్కుడు రుచ్యమైన ఫలంబులను బ్రతిదినము తమ కొసంగుచుండెడివాఁడో లేక నేడు నే నొసంగ సేకరించియుంచిన ఫలంబు లెక్కుడు రుచ్యమైనవో నీ నదభిప్రాయమునిమ్ము. (ఆలోచించి) ఇంకను శ్రీరామచంద్రుడు రాక దడవొనర్చుటకుఁ గతంబేమియో? కబంధ సంహారము నిన్న జరుగ బడియుండునుగదా? (యోచించి)జరిగినదికదా! నేడు తప్పకరావలసిన దే. నేడు తప్పకరావలసిన దినమే! రామా! త్రిలోకపూతయగుసీతా వియోగంబునకు దుఃఖించుచు నెచటనైన గూర్చుంటివా? నీ దుఃఖమను పాలపొంగును పొంగనీయకుండునటుల నీ సోదరవర్యుఁడగు లక్ష్మణుఁడు సత్కథా కాలక్షేపంబను జలంబు నింతజల్లి పొంగున కుపశాంతిఁగలిగింపడా? శాంతి నొసంగడా! రామా! నడువలేకఁ గడుబడలి యెండైన విశ్రమించితివా? రామ లక్ష్మణులారా! నావద్దకు దయచేయుఁడు. వేగిరము రండు.

రామ! రావయ్య నీవైన నామమెంచి
నాదుజన్మంబు మొదలుగఁ బాడుకొనిన
భక్తియుక్తుల నిన్ను నేఁ బ్రస్తుతింతు
నీదుదర్శన లాలసనౌదుఁ గాదె?

నన్నుఁ గాంచగ మనసునఁ జిన్నవోకు
నీచకులముతోడుత నేమి నియతికలదు.
గుహునికుల మెద్ది? యోచించు—క్రూరుఁడౌ క
బంధుకులమెద్ది—యెఱుకులవారు కారె?

ఎఱుకపిల్లనౌ నను గాంచ నెబ్బరికము
యగుపటించుచు దలపక యరుగుఁ డెమ్మ;
శబరిఁదప్పక మనమున దయనుగలిగి
నీవుగా నేను బాటల న్వెదకుచుంటి.

నిగమగోచర రత్నమా నిన్ను నేను
యోగులటుల ధ్యానముఁ బాగుమీర,
జేయఁజాలను నీదగుచిత్స్వరూప
మరసి; నన్ను గావుమిక నైనఁ గరుణతోడ.

నిన్నుఁ గాంచంగ వలయునను మొదు కోర్కె—
తోడ—బాటల నేర్చితి—తోష మెసగ
నాదు బీదకుటీరము నీదుపాద
ధూళిచేఁ జేయుమోయయ్య దురితమివుగ.

దుష్టరాక్షస కోటులు కష్టమొసగి
నిన్నుమాన్యుఁడౌ లక్ష్మణున్ నిర్భరంపు
శ్రమలఁ బాల్పడఁ జేసియు సంతసించు
చున్నవారలు, చేరుమోయన్న యిటకు!

నాదు చిన్న కుటీరంబు—నాదు తేల?
ధన్యమౌ నీదు పాదముల్ దగిలినంత
దుష్టశాత్రవ భయదమౌ శిష్టరక్ష!
రాక్షసాధము పాలి హర్యక్షమగుచు.

వనమునంతటి వెదకి నేవలయురుచ్యా
ఫలములను సేకరించితిఁ బాపహరణ
నన్నుఁ జేరియు—వేగ నీచిన్నిపీట
పైని గూర్చుండి భక్షించు ఫలములన్ను

అడవులందును గంటకంబైన యిచట
నడచుటను నీదుపాదముల్ గుడిచెనొప్పి;
ఇందుఁగూర్చుండ నొత్తుచునుందు నీదు
పాదములను లక్ష్మణుని శ్రీపాదములను.

(పరికించి) ఆవైపున నేదో యాకులయందు సందడియైనట్లు వినవచ్చుచున్నయది. దానినిఁ బరికింతు. ఆశబ్దము శ్రీరామలక్ష్మణుల రాకయైయుండునా? నాకంత భాగ్యమా? అంతభాగ్యమేగలిగిన నింకనేమికొఱఁత? ఐననాబాటఁ బరికింతు. (తొంగిచూచి, ధ్వనినాలకించి) ఇందెవరును గానుపించుటలేదు. కాని యాధ్వని యంతకంతకు నన్నుఁ జాలసమీపించుచున్నది. ఒకవేళ శ్రీరామలక్ష్మణుల రాకయే యైయుండునేమో? వచ్చుచున్నారేమో! వారేతెంచిన దరువాతఁ బ్రయత్నింపనేల-నేనన్నింటిని సిద్ధపఱచితినా? (ఆలోచించి) అమ్మయ్యో—మఱచితిని. పాదప్రక్షాళనార్థము నీటిని సిద్ధపఱచినదాననుగాను సుమా! ఎంతపొరపాటెంత పొరపాటు! అన్నింటినిఁ బరికించి తక్కుంగలవాని సిద్ధపఱతును. ముందుగ నీటినిఁదెచ్చి సిద్ధముగనుంతును. (రెండు మృణ్మయపాత్రములఁ జేనిడుకొని) ఆజలాశయమునుండి నీరుఁదెత్తు.

(నిష్క్రమించును).

## రంగము ౪

[శ్రీరామలక్ష్మణులటు బయలుదేరి పంపాసరోముఖులై నడుమనడుమఁగల ప్రకృతిచిత్రముల గాంచుచు నపుడపుడుప్పొంగిన సీతావియోగతాపంబును నుపసంహరించుకొనుచు నిష్టాగోష్ఠిని మాటాడుకొనుచు శబరి కుటీరమున కొకింత దవ్వున నేతెంతురు. కుటీరము పూర్వపు మనశబరికుటీరమే. శ్రీరామలక్ష్మణుల వేషమిదివరలో నుదాహృతమైనదే. సమయము మట్టమధ్యాహ్నము. శ్రీరామలక్ష్మణులు దూరప్రయాణం బొనరించుటఁజేసి మొగములు వాడిపోయియుండెను.]

రాముఁడు

సౌమిత్రీ! మనకుఁ గబంధుఁడు చెప్పియుండిన శబరి యాశ్రమమిద్దియే నేమోనని యనుమానించెదను.

సౌమిత్రి

అన్నా, శ్రీరామచంద్రా! నాకును నటులనేఁ దోఁచెడిని. కబంధుఁడు చెప్పిన గుర్తులీ కుటీరంబునకుఁ గలవు.

రాముఁడు

నిజము!

సౌమిత్రి

అన్నా! సరియే. ఆసంగతియటుండనిమ్ము. శబరి కులమెద్ది?

రాముఁడు

శబరికులము శబరకులము.

సౌమిత్రి

అనఁగా ఎఱుకులకులమా?

రాముఁడు

అట్టులే! బోయకులమనియు ననవచ్చు.

సౌమిత్రి

ఎఱుకుల వారియింట క్షత్రియులు భుజింతురా? మనము క్షత్రియకులమున జనించిన వారముకదా!

రాముఁడు

(తనలో) ఏమీ సౌమిత్రి ఇంత పిచ్చినఁబడుచున్నవాఁడు? వీనికిఁ దెలియఁజేయవలసిన విషయముల నిట విపులీకరించి తెలియఁజేయక నిపుడేదో నచ్చఁజెప్పి తరువాత విషయమును బోధపఱతునుగాక! (ప్రకాశముగ) శబరులాటవికులను సంగతి నీకును నాకును నెల్లఱకును విదితమే గదా! మనము పదియుమూఁడు సంవత్సరములనుండియు నడవులయందుఁ గ్రుమ్మరుటఁజేసి మనమును నాటవికులమైతిమి. అందువలన వారును మనమును సమానులమే! సహపంక్తిభోజనార్హులమే! కంచమ్పుఁ బొత్తుఁగలవారమే! తెలిసినదా విషయము?

సౌమిత్రి

రామా! తెలిసినది. తెలిసినది. ఆరునెలల సహవాసమువలన వారు వీరగుదురను మాటకు దార్కాణ మియ్యదియేయని తలచెదను.

రాముఁడు

సౌమిత్రీ! మనమిటుల నాలసించిన నేమిప్రయోజనము? ఇప్పటికి ప్రొద్దును దిరిగిపోవుచున్నయది; నేనలసిపోయితిని. ఈ యాశ్రమం బెవ్వరిదైనఁగా నిమ్ము! ఇట విశ్రమించి తరువాత పంపాసరస్సుఁ జేరుదము. ఇదియే శబరి యాశ్రమం బైన నెంతయును మంచిదియే గదా! కానిమ్ము! ఏది యెటులైనను మన మీ యాశ్రమమున బ్రవేశించుటయే కర్తవ్యంబు.

సౌమిత్రి

అన్నా! మీరలసిన, నేదఁదీర్చుకొనఁ దలంపక నడువుఁడని బాధింప నామనసు బొడంబడఁజాలునా? తమరు విశ్రమించుటకు నిశ్చయించితిరి. కావున మన మిటనీ కుటీరంబునఁ బ్రవేశింతము. (కుటీరము వంకఁజూచి) అన్నా! ఈ కుటీరం బెంత యందముగ నున్నయది?

రాముఁడు

ఔను. అత్యంత సంతోషదాయకంబుగ నున్నయది. వనములందలి కుటీరములే నివాసయోగ్యములనఁ జెల్లుఁగాని రమ్యహర్మ్యములేనియు నామనంబున కిచ్చలేవు సుమా—

సౌమిత్రి

ఔను. దైవమును మనకనుకూలుఁడేగదా!

రాముఁడు

ఇటుఁగాంచుము!

ప్రక్కనుండిన మంచిపారిజాతపు పూలు
 వింతఁగొల్పెడు గాలి విడచుచుంట,
ముందున్న మంచిదౌ పందిరిపైనున్న
 మల్లె మొగ్గలు జారి మహినిఁబడుట,
లతకూన లోకటను జతఁగొనియుంటచే
 నందునకు గలిగెడు సందడియును,
అందందు వ్రేలాడు యందముఁ గూర్చిన
 గున్నమామిడిపండ్ల గుబురులవియు,

జెన్నుమీరుచు సౌందర్య శ్రీ లెసంగ
నహాహా! చూడఁజూడంగ నీయాశ్రమమ్ము
సంతసం బెంతో హెచ్చెను, సౌఖ్యమొసగె
నాకు-సుఖమెఱుఁగని యట్టి నాకు-నేడు!

సౌమిత్రి

అగు. నిజమన్నా నిజము. ఇంక నాలసించనేల? త్వరగ నీకుటీరంబునఁ బ్రవేశింతమా?

రాముఁడు

సౌమిత్రీ! ఈ యాశ్రమముఁగాంచినంతనే కష్టములన్నియు మఱపునకుఁబోయి యానందమును హెచ్చించినదోయీ! ఉత్సాహవంతునిఁ జేయుచున్నదోయి.

సౌమిత్రి

అన్నా! ఆనందముకాని యందముకాని నిజమాలోచింతుమేని యరణ్యములనఁ జాల-వనములందేఁగలదని నాభావనము. ఎంత చల్లగనున్నదో పరులకుఁ దెల్ప నేరితరము? అనుభవించినవారే యానందించఁగలరు.

రాముఁడు

లక్ష్మణా! అటు పరికించితివా? ఇచట నిదివఱకు మునులుండినటులఁ దోఁచెడిని.

సౌమిత్రి

అన్నా! ఔను. మఱచితిమి. మతంగమహామునులిదివఱకుండిన స్థలముననే శబరి కలదని మనము వింటిమికదా?

రాముఁడు

నిజము! ఇదియే శబరి కుటీరమైయుండును. సత్వరము ప్రవేశింతము. ఆమె మనకై యెదురుఁజూచుచునుండును.

(ముందునకు నడతురు).

[సశేషము]



## హిందూ స్త్రీ జనోద్ధరణము.—

ఈ సంవత్సరము సూరతునగరమున జరిగిన హిందూ మహాసభకు అధ్యక్షత వహించిన శ్రీరామానందచటర్జీగారు (మాడరను రెవ్యూ పత్రికాధిపతులు) తమ అధ్యక్షోపన్యాసమున 'హిందూస్త్రీజనోద్ధరణము'ను గూర్చి యిట్లు ముచ్చటించినారు.—

హిందూస్త్రీజనోద్ధరణము హిందూ మహాసభవారి ఆదర్శములలో నొకటి. హిందూమతము స్త్రీ కిచ్చిన ప్రధానస్థానము ప్రపంచమున మఱి యే మతమును ఇచ్చియుండలేదు కాని కొన్ని ఆచారములీ ప్రాధాన్యతకు భంగము కల్గించుచు లజ్జాకరములుగ నున్నవి. హిందూమతధర్మముప్రకారము స్త్రీలు యథాస్థానమును పొందవలయునన్నచో మన బాలికలకును, యువతులకును ఆయుధవిద్యతోబాటు వ్యాయామము, సర్వవిధములైన వైజ్ఞానికవిద్యలును గూడ నేర్పింపవలయును. బాలికల విద్యాభ్యాసమునకు వలయునంత వ్యవధి యుండుటకు బాల్యవివాహములను, తత్ఫలితమగు చిన్నతనమునందే పిల్లలుగనుటయు లేకుండ జేయవలయును. హిందూ మహాసభవారి సప్తమసమావేశమునందు పండితమదనమోహనమాలవ్యాగారి యాజమాన్యమున "హిందువులెల్లరును తమబాలికలకు పదునారు సంవత్సరములు వచ్చువరకును వివాహములు చేయకూడదు" అని తీర్మానించుట సంతోషకరము. వారి యిష్టమైనయెడల అటు పిమ్మటగూడ మఱికొన్ని సంవత్సరములు గూడ నవివాహితలుగా నుంచవచ్చునని యాతీర్మానమునందుగలదు. చిన్నటనాటనే పరిణయమగుట, ఈడు రాకమునుపే పిల్లలను గనుట యువతులకేగాక వారి సంతానమునకు కూడ హానికరమైనది. మఱియు నీ దురాచారము వలన తల్లుల బీజగ్రహణశక్తి నాశనమగును.

*    *    *

## కర్రి. అచ్చమ్మగారి నిర్యాణము.—

మార్చి మాసపు "రెడ్డిరాణి" పత్రికలో ఇట్లున్నది:—

మామిడాడ గ్రామవాసులు కీర్తిశేషులైన కర్రి. సూరయ్యగారి ధర్మపత్ని అచ్చమ్మగారు పిబ్రవరి 27వ తేదీని యేబదియేండ్ల వయసున కాకినాడలో తమ సోదరులగు కొవ్వూరి. సూర్యనారాయణ జమీందారుగారి భవనమున స్వర్గధామము నలంకరించిన వార్తను ప్రకటింపవలసి వచ్చినందుకు మేము చాల వగచుచున్నాము. ఈమె జగత్ప్రసిద్ధులగు కొవ్వూరి బసివిరెడ్డిగారి పెద్దకొమార్త. ఈమెకు పుత్రపుత్రికాసంతాన మధికముగగలదు.

అచ్చమ్మగారి పతిభక్తి స్త్రీలకు ఒరవడిగానుండెడిది. భర్త జీవించియున్నపుడు ఈమె ప్రతిదినము సూర్యోదయమునకు ముందే మేల్కాంచి కాలకృత్యములు నిర్వర్తించుకొని భర్తగారి పాదములకు మ్రొక్కనిదె మరియొకపని చేసియుండలేదు. ఈమె భర్తయే దేవుడనినమ్మి ఆయనకు సకలోపచారములు స్వయముగ చేసి సాటి స్త్రీలలో చాలగౌరవమును పొందినది. ఈమె మామిడాడ గ్రామమున బాటసారులకుపయోగించుట కొక సత్రమును నిర్మింపించినది. ఇంకను లెక్కలేనన్ని దానధర్మములు చేసి యీమె దీనబాంధవురాలు అని ప్రసిద్ధిపొందినది. అచ్చమ్మగారు మృతజీవులలో గణింపదగిన నారీమణి. ఆమె మహోన్నత పుణ్యలోకావాప్తిని గోరుచు ఈ దుఃఖసమయమున ఆమెసంతానమునకు బంధువులకు మాసానుభూతిని తెలుపుచున్నాము.

*   *   *   *

## బెజవాడ స్త్రీలసభ–గాంధీమహాత్ముని ఉపదేశము.—

ఏప్రియలు 10 న తేదీ సాయంకాలము 5-30 గంటలకు బెజవాడలో బ్రహ్మాండమగు **స్త్రీలసభ** జరిగెను. అందు మహాత్ములవారు ఇట్లు ఉపన్యసించిరి.

బెజవాడలో మిమ్ములనందఱిని దర్శించుట కిది తొలిసారికాదు. కొన్నిసంవత్సరముల క్రితము మిమ్ములనుచూచియున్నాను. మీమధ్యను ఆదినములలో నొకనారీరత్నముండియుండెను. ఆమె పవిత్రనామము అన్నపూర్ణాదేవి. ఆమె ఒక పెద్దసభలో నన్ను రక్షించెను. స్త్రీలను ఆభరణము లిమ్మని నేను కోరినపుడు ఆమె తననగల నన్నిటిని నాకిచ్చివేసినది. ఆరమణీమణి స్వరూపమును నేనెన్నడును విస్మరింపలేను. కనుకమీరు ఆమెను అనుకరింపవలెను. ఆమెవలె మీరుకూడ ఆభరణములను త్యాగముచేయుడు. భూషణములను సమర్పించుటయేగాక ఆమె ఖరీదుగల తన విదేశవస్త్రములన్నిటిని దహనముకొఱకు బొంబాయికిపంపెను. ఆమెపవిత్ర ప్రవర్తనమును దూరమున అమెరికాలోనున్న ఆమె భర్తనుకూడ నాకర్షించెను. ఆమెభర్త ఆమెను చూచి ఖద్దరు వస్త్రధారియయ్యెను; ఆడంబరజీవితమును వదలివేసెను. ఇంతటి మహత్తు మీయందఱియందు నుండవలెనని నాకోరిక. అన్నపూర్ణాదేవియందుండిన మహత్తు మీఅందఱిలోను ఉండినచో స్వరాజ్యసంపాదన మిక్కిలి సులకనయగును. చూచినారా! అన్నపూర్ణకు స్వర్ణవికారములైన ఆభరణములు శృంగారములుకాలేదు. త్యాగమే ఆమెకు భూషణమయ్యెను. మీలో చాలనగలను ధరించినవారున్నారు. పట్టుబట్టలనుకట్టినవారున్నారు. మీరు నాకు నగలనర్పింపుడు, అర్పింపకయుండుడు. నాకు వానితోనంతబనిలేదు. త్యాగము మాత్రముచూపుడు. నాకు కావలసినదిత్యాగము. మీరు చేయవలసిన విధియొకటున్నది. రాట్నములను పెట్టి వడికిన నూలుబట్టలను స్వీకరింపుడు. తెలుగునాటను మంచి పత్తియున్నది. దానిని మీరే బట్టలుగా మార్చుకొనవలెను. గాని మిల్లు బట్టలు కట్టుట అవమానకరము. అంటరానివారని ఎవరిని మనము అనకూడదు. అందఱిని సోదరభావముతో చూడవలెను.

అవిగాక మఱియొక దురభ్యాసము ఆంధ్రదేశమున గలదు. అది త్రాగుడు. మీరందఱును దీక్షవహించినచో ఆదురభ్యాసమును అరికట్టగలరు. మీరు మీపిల్లలకు తగినంత శిక్షను ఈయండి. పిల్లలకు విద్య భూషణము. బాల్యవివాహము కూడదు. ఆడపిల్లను 16 ఏండ్లవరకు కన్యగానుంచవలెను. పిల్లలకు నిరాడంబరజీవనము పవిత్రప్రవర్తనము నేర్పవలెను.”

సంస్కారప్రియులగు ఆంధ్రసోదరీమణులు లోకోత్తరపురుషుడగు గాంధిమహాత్ముని ఆదేశమును తులసీదళమువలె తలదాల్చి తదాచారణమునకు గడగెదరుగాక యని కోరుచున్నాము.

*　　　*　　　*　　　*

జర్మనీలో నొక ఆంధ్ర ప్రముఖుని మరణము.—

మార్చినెల 'తెనుగు సమాచారు' అను పత్రికలోనిట్లున్నది.

"శ్రీయుతపింగళి. జనార్దనరెడ్డిగారు అను నొక ఆంధ్రప్రముఖుడు జర్మనీలో కాలగతి నొందెనని తెలియజేయుటకు మిక్కిలి విచారించుచున్నాము. 1929-వ సంవత్సరము జనవరి నెల 30-వ తేదీని స్ట్రాయిను అను నొక జర్మను విద్యార్థితో రెడ్డిగారు మల్లయుద్ధమున తలపడిరనియు, ఆంధ్రప్రముఖులగు రెడ్డిగారికే తొలుతజయము కలిగెననియు, కానికడపట వారికిబలమైన గాయము తగిలెననియు తెలియుచున్నది. తుదకు వారా గాయము వలననే యసురులు బాసిరి. సెంట్రలు యూరపియను హైందవ సంఘమునకు వారు కార్యదర్శిగానుండిరి. జర్మనీ దేశపురాజధానియగు బెర్లినునగరమందలి ఇండియను అసోసియేషనునకు శ్రీరెడ్డిగారు నాయకులుగానుండిరి. జర్మనీదేశపు హోము మెంబరు అనుమతిపైని శ్రీరెడ్డిగారి దేహము హైందవపద్ధతిని దహనముచేయబడెను. దహనసంస్కారమునకు మూడువందల మందికి పైగావిచ్చేసిరి. ఈఆంధ్రప్రముఖుని అకాలమరణమునకు విషాదమును బొందని ఆంధ్రు డుండడు. శ్రీరెడ్డిగారి ఆత్మకు శాంతినిగోరుచు వారి కుటుంబమునకు మాసాను భూతిని తెలుపుచున్నాము."

*　　　*　　　*　　　*

బౌద్ధమతవిచ్ఛిత్తి.—

భారతదేశమం దేకాలమందుగాని యేసంస్థగాని పలువిధములగు మార్పులకులోను గాకుండయుండ లేదు. మార్పులేకుండనుండు కారణమున ఆసంస్థ మృతప్రాయమగుచున్నదని కొందరనుకొనుచున్నారు. అధోగతిపాలు సేయుమార్పునకన్నమార్పులేకుండనే యుండుటమేలు. అదియుగాక మతగురువులు, కలువుమున్నగు వారికి రాజపోషణ యున్న కారణమున పైన చేర్కొనబడియున్న వారిలో సోమరితన ముదయించుటయేగాక ఆయా సంస్థల కనర్థములు కూడవాటిల్లినవి. బౌద్ధమతము కడకెట్టులు విపరీతముగ పెంచివేయబడియున్నదో శ్రీడాక్టర్ యదునాథసర్కారుగారు హిందుస్థాన్ రెవ్యూలో నీక్రింది విధమున వ్రాసియున్నారు.

ధనసహాయ మెక్కువకాగనే (బౌద్ధ) మతసంస్థలకు సోమరితనము యెక్కువయైనది. ఇదివరలో జరుగుచుండిన గ్రామ ప్రచారములు ఆగిపోయినవి. భిక్షకై తిరుగవలసిన యగత్యము తప్పిపోయినది. బౌద్ధభిక్కులు సంఘారామములయందును విహారములయందును కడుపునిండకదలకుండ కూరుచుండి గ్రంథముల చదువుకొనుటతో కాలమును కొంతవరకు వెళ్లబుచ్చుచు విపరీతవర్తనల కలవాటు గావించుకొనిరి. బౌద్ధసిద్ధాంతములకై

ప్రక్కవిక్కిరములగా వించుచు పూజాపునస్కార శాఖ నెక్కువగ బెంచివైచిరి. ఆకారణమున బుద్ధభగవానుడు గావించియుండిన పవిత్ర నిర్మాణమంతయు ఒక్కమారుగ మారిపోయినది. బౌద్ధవేదాంతము నందింత వరకుండిన సుబోధక విషయములు మరుగువడి తర్కమున కెక్కువయెడ మొసంగు వేదాంత మపరిమితముగ పెరిగిపోయినది. 16, 17 శతాబ్దములలో వంగరాష్ట్రమందలి వైష్ణవ గోస్వాములకువలె బౌద్ధ భిక్కులును బహ్మాండమగు వేదాంతగ్రంధపరంపరను సృష్టిగావించిరి. ఆసమయములో యిరువురు వేదాంతులొక్క యంశమున కంగీకారము చూపజాలనివారైయుండిరి. దాన ఒకేమతమునకు జెందిన గురువులే విపరీత వ్యాఖ్యానములతో గ్రంధములను వ్రాసి తన్మూలమున బౌద్ధమతమందు శాఖలేర్పరచిరి. వారిలో లోననే యీభేదభావములు కొంతకాలమువరకు పెరుగుచువచ్చి కడకు విరోధము లుదయించి వివిధ శాఖానిర్మాణములకు కారణములైనవి. క్రీస్తుపుట్టిన ప్రథమ శతాబ్దమునకు బౌద్ధమతమందు పదునెనినుది శాఖలేర్పడినవి. 7 వ శతాబ్దమందు భారతదేశ బౌద్ధక్షేత్రముల సందర్శించియుండిన చీనా యాత్రీకుడు యూవణ్‌చ్యాంగ్ యీవిషయమై తనగ్రంథమందువ్రాసి చాలవిచారమును వెలిబుచ్చియున్నాడు. సింహళమున కంత ముందుగనే వ్యాప్తినంది విజయవంతముగ సాగు చుండిన బౌద్ధమతమందుకూడ చీలికలుదయించినవి. అందుదయించిన శాఖలలో ముఖ్యమైనవి మహావీర, అభయగిరిశాఖలు. ఆరెంటికిని యెక్కువపోరాటము జరిగియుండెను. ఆకారణమున క్రీ. వె. 300లలో మహాసేన రాజు మహావీర శాఖా బౌద్ధమతమును నిర్మూలన మొనరించెను.

పొరుగూరుల చదువుకొనువారు.—

విద్యలబడయు తలంపుతో యూరపుఖండమున కేగు భారతీయ విద్యార్థులు తమ విద్యాలయములకు చేరువనేయున్న పాశ్చాత్య గృహములయందు వసతుల నేర్పరచుకొని యుండుటపరామూలు, భరతదేశమునుండి ఇంగ్లాండున కేగువారిలో నూటికి యే పదిమందియో హాస్టలులయందు జేరుదురు. అటులే యీదేశమందునను ఒక గ్రామము నుండి యింకొక గ్రామమునకు విద్యబడయుటకై వెళ్లు విద్యార్థులు ఆయాగ్రామముల యందలి కుటుంబములలో నుండుట కేలయులవడరాదని అంతర్జాతీయసఖ్యతా సమావేశము యొక్క ఆహ్వాన సంఘాధ్యక్షులగు ఎస్. ఎ. బ్రెల్వీగారు తమయుపన్యాసమునందు తెలిపి యున్నారు.

విద్యార్థినులను విద్యార్థులను విద్యలబడయుటకని పట్టణములలోనికి వందలకొలదిగ వచ్చుచున్నారు. ఇంతమందివిద్యార్థులకు వసతి చాలకున్నకారణమున హాస్టలుల సంఖ్య యెక్కువయగుచున్నది. ప్రత్యేక సంఘములకని కొన్ని వసతి గృహములును, ప్రత్యేకనిబంధనలతో మరికొన్ని వసతి గృహములును నిర్మింపబడు చుండు టను మన మెరుంగుదుము. ఉన్నత విద్యలబడయుటకై పాశ్చాత్యదేశములకు భారత యువతీ యువకులేగు సమయమున వారాయానగరములందలి పాశ్చాత్య కుటుంబములయందు వసతుల నేర్పరచుకొనుచున్నారు. అట్టులే ఒకగ్రామమునుండి యింకొకగ్రామమునకా దేశమందు యువతీయువకులు విద్యలబడయుట కేగినప్పుడు ఏల కుటుంబములయందు వర్ణమును చాటింపకుండ వసతుల నేర్పరచుకొని ఒక సంఘము మింకొక సంఘ మునకు మధ్య సఖ్యతాసూత్రమును ముడివేయరాదు? విద్యాధికులగు కుటుంబ యజమానులు విద్యల బడయు యువతీయువకుల కిట్టి సౌకర్యముల గలిగించవలసిన సమయ మాసన్నమైయున్నది. ఈ పద్ధతి నాదియం దాచరణలోనుంచుటకు చాల యంతరాయములున్నమాట నిజము కాని ప్రయత్నించినచో అవి తొలగిపోవును. హిందూ మహమ్మదీయ సంఘములకు జెందిన వారొక్కటిగ జీవించుటయనునది కష్టమైన విషయమె. ఇందులకు నూతన సాంఘిక నియమములను నిర్మాణ మొనరించుకొనవలసియున్నది.

# వనితాలోకము

ఆనందమయి దేవి—

ఈమె వంగరమణి. వయస్సు ముప్పదిమూడు సంవత్సరములు. ఈమె గొప్ప తత్త్వవేత్రి. ఈమెకు నూతనముగ తత్త్వజ్యోతి కాననయ్యెనని శిష్యులనేకులు చెప్పుచున్నారు. ఆనందమయి దేవి వివాహిత. సంసారమును నిర్వహించుచున్నది. అయినను ఈమె తత్త్వజ్ఞానమును అనంతముగ నార్జించినది. ఈమె చదువుకొనలేదు. కాని తన తెలివితేటలచే నీమె విజ్ఞాననిధులనుగూడ వెలుపుగొల్పినది. సంస్కృత భాషా సంస్కారము రవ్వంతయైన లేక పోయినను ఈ నిమిషి ఆభాషలో శ్లోకములు రచియించినది. ఆశ్లోకములను తిలకించి పండిత ప్రకాండులు కూడ అబ్బురపడినారు. ఈమె పెక్కు రోగులకు బాధానివారణము చేసినది. చూచినంత మాత్రముననే అనేకుల విచారమును పోగొట్టి వారికి స్వాస్థ్యము కల్గించినది. పూర్వాచార పరాయణమైన బ్రాహ్మణకుటుంబమునకు



చెందినను ఈమె దర్శనము సకలవర్ణముల వారికిని సులభసాధ్యమే. జిజ్ఞాసలో వ్రతావలంబియై పెక్కుదినములుండి పరంజ్యోతిని కనుగొని ఆనందమయిదేవి హిందూసంఘమును బాగుచేయుటకొఱకు భారతదేశమున విశేషముగ సంచారము చేసినది. శాస్త్రవిషయికములైన విచిత్రములకు అమెరికాఖండ మెట్లు నిధానమో, యోగసంబంధములైన వింతలకు భారతఖండము గణనాతీతకాలమునుండియు పుట్టినిల్లై యున్నది. జన్మము, విద్య, పరిసరము—వీనినన్నిటిని అతిక్రమించి భగవదారాధనము చేసిన యోగులకు, యోగినులకు భారతవర్షము అంతులేని నిక్షేపము.

## జెన్నీలీకన్య.

ఈయువ యిరువదినాలుగువత్సరముల యువతి. ఇంగ్లాండు పార్లమెంటు సభ్యత్వమునకు ఉత్తరవేనార్కుడివిజనునకు సోషలిస్టుపక్షమున అభ్యర్థినిగా నిలిచి విజయము గాంచినది. పార్లమెంటునందుగల స్త్రీసభ్యులలో ఈమె మిక్కిలిచిన్నది. ఈమెయింతకు పూర్వము ఒకపాఠశాలలో ఉపాధ్యాయినిగా నుండెను. విజయవార్త తెలిసిన తోడనే యామె ప్రజాసమూహమును ఒత్తిగించుకొనివచ్చి ఫీఫ్షైర్ లో డన్ఫరమ్లైన్ నందున్న తన తాతగారికి తంతిగొట్టెను. అందుమీద ఆమె తాతగారు "నేను మిక్కిలి సంతోషించితిని. పార్లమెంటు సభికురాలు కావలెనని ఆమె చిన్నతనమునుండియు పలవరించుచున్నది. ఇప్పటికామె కోరికనెరవేరినది" అని యనిరి.

ఈమె తాతయు తల్లిదండ్రులును గనులయందు పనిచేయువారు. పాఠశాలలో యీామె మిక్కిలి తెలివైనదని పేరొందెను. విద్యార్థినీవేతమును బడసి యీామె ఎడింబరో విశ్వవిద్యాలయములో ఎం. ఏ. ఎల్. ఎల్. బి. పరీక్షనిచ్చెను.

*          *          *          *

## శ్రీమతి యలమంచిలి సత్యవతమ్మగారు.

ఈమె కమ్మకులస్థురాలు. శ్రీ గారపాటి సాంబయ్యగారి పుత్రిక. ఈమె భర్త యలమంచిలి వెంకటరామయ్యగారు చెన్నపురిలో గవర్నమెంటు ఆయుర్వేదపాఠశాలలో చదువుచు జ్వరమువలన నిరుడు చనిపోయెను. పశ్చిమ గోదావరిమండల సంచారములో మహాత్ముడు యీాయమ స్వగ్రామమగు నారాయుడుగూడెము వచ్చినపుడు 1400 రూపాయల విలువగల నగలొసంగి తనను సబర్మతి ఆశ్రమమునకు గొంపోవలెనని కోరెను. 21 సంవత్సరముల చిరుతవయస్సున దేశాభివృద్ధికై యింతటి త్యాగమునొనర్చి ఆశ్రమవాసము స్వీకరించిన యీాత్యాగినిజీవితము శ్లాఘనీయమైనది.

*          *          *          *

## శ్రీమతి ఆనందాబాయి కన్య.

ఈమె బి. ఏ. బి. యల్ ప్యాస్ చేసిన విదుషి. మదరాసు హైకోర్టునందు ప్రాక్టీసుచేయుటకు లాయరుపట్టాపుచ్చుకొన్న స్త్రీలలో యీామె ద్వితీయ.



## రష్యాలో స్త్రీల పలుకుబడి.

రష్యాలో స్త్రీల పలుకుబడి దిన దినమెట్లభివృద్ధి నొందుచున్నదో ఈ క్రింది లెక్కలు రుజువు చేయుచున్నవి. కడచిన మూడు సంవత్సరములలో రష్యాయందు స్థానిక సోవియటు సంఘములకు అధ్యక్షపీఠ మలంకరించుచున్న స్త్రీల సంఖ్య 174 నుండి 641 వరకు పెరిగెను. వ్యవసాయశాఖ మెండుకొని యుండు జిల్లాలయందు గడచిన ఆరుసంవత్సరములలో వెయ్యింటికి 46 నుండి 299 వరకు అభివృద్ధినొందెను. మరియు రష్యా దేశములో నేడు స్త్రీలు సైనికదళము, నావికాదళము, రక్షకభటశాఖ, ఉన్నతోద్యోగములు, సహకార ప్రతిష్ఠాపనలు, వర్తకసంఘములు మొదలగు వానియందు మిక్కిలిగా నున్నారు.

## హూడాల్టను సతి.

హూడాల్టను సతి పార్లమెంటులో సభ్యురాలుగా నెన్నుకొనబడినది. బిషప్ఆక్లాండు డివిజనుచే ఈమె ప్రాతినిధ్యము వహించుచున్నది. ఆమె కార్మికుల పార్టీకిఁజెందినది. ఇంతకు ముందు ఇప్పటి కామన్సు సభలో ఎనమండుగురు స్త్రీ లున్నారు. హూడాల్టను సతి తొమ్మిదవయామె. విశేషమేమన ఈమె భర్త కూడ కామన్సు సభలో సభికుఁడే. ఒక్కసారిగా పార్లమెంటు సభలో సభికులైన దంపతులలో డాల్టను సతీపతులు రెండవజంట.

## జుగోస్లావు దేశమున విడాకుల చట్టము.

పూర్వాచారపరాయణులగు జుగోస్లావు మతాధికారులు తమదేశమున క్రొత్తగా నొక విడాకుల చట్టమును నిర్మించినట్లు తెలియుచున్నది. ఈ నూతన చట్టముతో జుగోస్లావు స్త్రీల స్వాతంత్ర్యము మూలవిచ్ఛేదమగును. ఈచట్టమువలన నికముందు భర్తయగువాడు తనకు తెలియకుండగాని తన అనుమతి లేకుండగాని తనభార్య పొరుగింట నొక్కరాత్రి గడపినట్లు నిర్ధారణచేయగలిగినచో నాతఁడామెను విసర్జింప వచ్చును. తల్లిదండ్రులయింట భర్త యనుమతి లేనిదే ఒక్కరాత్రి మాత్రముండ వచ్చును. తన చెలికత్తెలయిండ్లకుఁబోయి ఆతిథ్యము స్వీకరించుటకు గూడ భార్య భర్తయనుమతిని బడయ వలయును. తన అనుజ్ఞలేనిదే నాట్యమందిరము; నాటకశాల మొదలగు స్థలములకు పోయిన భార్యను తలచినచో భర్త విడనాడవచ్చును.

భార్యకు విడాకు లిచ్చుటలో భర్త కెంత స్వేచ్ఛయున్నది భర్తను విడనాడుటలో భార్యకుగల వీల్లు మిక్కిలి తక్కువ.

స్త్రీ స్వాతంత్ర్యముతో చిరకాలమునుండి ముఖరితమగుచున్న ఐరోపాఖండములో జుగోస్లావు దేశమున నిట్టి సంకుచితాభిప్రాయమును వెల్లడించు చట్టము పుట్టుట విచిత్రముగా నున్నది.

## తల్లిదండ్రుల బాధ్యత.

పిల్లలను సన్మార్గగాములుగ చేయుటలో తల్లిదండ్రుల బాధ్యత అనంతమైయున్నది. భావికాలమున పిల్లలు మంచి వారగుటయు, చెడ్డవారగుటయు తల్లిదండ్రులపైననే నిలిచియున్నది. తమ బిడ్డలను సన్మార్గగాములుగ చేయకపోవుట తల్లిదండ్రుల తప్పిదమనియు నది శిక్షాస్మృతి క్రింద నేరముగా బరిగణింపబడుననియు గమనింపవలసిన విషయము. తల్లిదండ్రులు పిల్లలయెడ తగినంత బాధ్యత చూపకుండుట శిక్షార్హమను విషయము నిరూపించుటకు ఈమధ్య 'చికాగో' లోనొక సంగతి జరిగినది. జార్జిలూకస్సు అను పదునారువత్సరముల పిల్లవాడు తప్పత్రాగి, నృత్యమునల్పి పిమ్మట మోటారుమీద యింటికిపోవుచుండగా మరణించెను. దీనికి కారణము ఆబాలుని తల్లిదండ్రులు ఆతనిని తగిన అనుశాజ్ఞలలో నుంచకపోవుటయేయని తేలినది ఆనగరమునందలి తల్లిదండ్రులు తమపిల్లలను సరిగా జాగ్రత పెట్టి నీతిమార్గములను గఱపకుండుటచే వారుత్రాగుడు, నృత్యము మొదలగు దుర్వ్యసనములకులోనై అకాల మరణముల వాతబడుచున్నారని ఇప్పుడు సునిశ్చితమైనది. అగుటచే ఆనగరమున ఇద్దఱుతండ్రులకు ఖయిదును, ఇరువదిముగ్గురకు జరిమానాయును విధియింపబడెను.

## కలకత్తా శిశుసంరక్షక సంఘము.

కలకత్తానగరమున శిశుసంరక్షక సంఘము ప్రజాసేవ ప్రశంసనీయముగ చేయుచున్నది. ఈమధ్యను ఆనగరమున లక్ష్మమణిదాసి అనునామె 10 సంవత్సరముల వయస్సుగలతన బాలికకు నెలగుడ్డుఅనదగిన తనచిన్న కుమారునిచ్చి ఎస్ప్లనేడు జంక్షనులో జనులకుచూపి బిచ్చమెత్తుటకు బంపెను. అట్టి చిన్న బిడ్డను జనసమ్మర్దముగల చోట ఎండలో బెట్టుకొని యాచించుట ఆచిన్నబిడ్డ ఆరోగ్యమునకు మిక్కిలి అపాయకరమైనది. కావున అచ్చటి శిశుసంరక్షక సంఘమువారు దీనిని గమనించి లక్ష్మణమణిదాసిపై కలకత్తా రాజధాని మేజిస్ట్రేటువద్ద కేసు పెట్టిరి, ఆమెను బెంగాలు శిశుశాసనముక్రింద ఒకమాసము ఖైదు వేయబడెను. శిశువును, బాలికయు ప్రస్తుతము శిశుసంరక్షకసంఘమువారి పోషణమందు ఉన్నారు.




గా॥ శ్రీనివాసశాస్త్రిగారు—స్త్రీ విద్యావిధానము—

గతమాసము నాలవతేదీ సాయంకాలము ఎగ్మూరునందలి భారతమహిళా మహాసంఘ ప్రధానకార్యాలయమందొక మహోపన్యాసమును గావించుచు ప్రత్యేకముగ మహిళా విద్యాలయముల నెలకొల్పి సాగించు టవసరమాయను విషయమును గురించి తమ యభిప్రాయములను గా॥ శ్రీనివాసశాస్త్రిగారు వెలిబలికి యున్నారు. తమ యుపన్యాస సందర్భమున గా॥ శాస్త్రిగారు కార్వేగారు తమ జీవితాశయముగ నిడుకొని సాగించుచుండిన మహిళావిశ్వవిద్యాలయమును గురించి గావించియుండిన కొన్ని సలహాలు వీరి దీర్ఘాలోచనకు అడ్డగట్లుపడినవా యనిపించుచున్నవి. కార్వేగారి యుద్యమము భారత రమణీమణుల స్థానము సన్విధమునగాని అభివృద్ధిలోనికి గొనిరాజాలదనియు తామీ విషయమును కార్వేపండితునికే తెలియపరచి యుంటిమనియు బలికిరి. స్త్రీపురుషులు సమానులనియు అందువలన ఆభావములు విశేషముగ వ్యాప్తినందవలయునన్న స్త్రీలకు ప్రత్యేక విశ్వవిద్యాలయములుగాని ప్రత్యేక కళాశాలలుగాని నిర్మింపబడ రాదనియు, పురుషులతో బాటు స్త్రీలును ఒకే కళాశాలయందు విద్యల బడయుచు సమగౌరవముల బడయుచుండవలయుననియు శ్రీశాస్త్రిగారు తెలిపియున్నారు. మహిళామణుల యభివృద్ధికై దివారాత్రములు పాటుపడుచున్న సంస్కారమహానాయకులందరును కార్వేపండితుని యుద్యమము నెంతయు కొనియాడుచు తదుద్యమాభివృద్ధికి వలయు సహాయమును జేయ తలపడియున్న సమయమున శ్రీ శాస్త్రిగారు విపరీతాభిప్రాయములను వెల్లగక్కుటలో గల ముఖ్య కారణము మాకు బోధయగుటలేదు. పురుషునికెంత గౌరవముగలదో స్త్రీకికూడ అంత గౌరవమే యుండవలయుననుట నిశ్చయము.

అందులకని స్త్రీపురుషులోకే విద్యాలయమునందు విద్యలను బడయవలయునా? ప్రస్తుతమట్లు పురుషులతోబాటు పురుషుల విద్యాలయములయందే గాక పురుషుల విద్యాలయముల యందనుసరింపబడుచుండు కార్యక్రమమే అనుసరింపబడుచున్న మహిళా విద్యాలయముల యందలి స్త్రీలనేనియు పరికించునెడ శ్రీ శాస్త్రిగారియొక్క యభిప్రాయము లెంత వరకు సత్యగర్భితములో గ్రహింపవీలగును. ఇట్టి విద్యాలయములయందు విద్యల బడయుచుండిన స్త్రీలు కళాశాలలను వీడినవెనుక నేమిచేయుచున్నారు? కొందరుద్యోగములకు ప్రయత్నించుచున్నారు. మరికొందరు గృహమందుండి యింటికి పనికివచ్చు నెట్టి కార్యమునుగాని చేయజాలక యే గ్రంథపఠనముననో కాలము వెళ్లబుచ్చుచున్నారు.

విద్యలబడయు వారేగాక చుట్టునున్న వారుకూడ కొంతవరకు లాభము నందవలయును. వాంఛింపబడుచున్న గౌరవము సమానమైనదియైనను నిర్వర్తింపవలసిన విధులు, అనుసరింపవలసిన కార్యక్రమములు వేరువేరై యున్నవి. విద్యావతులగు స్త్రీలు జ్ఞానమార్జించి గృహములను తేజోవంతముగ నొనరింపవలయును. పురుషుడు కాయకష్టములకు లోనై ధనమార్జించుచుండ స్త్రీలు గృహములకడనుండి గార్హస్థ్య ధర్మములను చక్కగ నిర్వహించుచుండవలయును. ఇందులకు శ్రీ శాస్త్రిగారు చెప్పిన చొప్పున స్త్రీలు పురుషులతోబాటు సమానముగ తమ కేవిధమునగాని ఉపయోగపడని విద్యల నభ్యసించునెడ లాభముండదు. ఈ లోపమును లేకుండ చేయుటకే శ్రీ కార్వేగారు ప్రత్యేకముగ మహిళా విశ్వవిద్యాలయమును నెలకొల్పి దేశమందన్ని ప్రాంతముల యందును ఆ ప్రధానసంస్థ యొక్క శాఖలనే నెలకొల్ప దలపడి యున్నారు. ఇట్టి సదుద్యమమందు లోపములున్నవని చెప్పుటెంతమాత్రమును సమంజసముగ కానుపించుటలేదు.

త్యాగి ఖరగ్ బహదూర్ సింగ్—

త్యాగమనేక విధములై యున్నది. కొంతమంది తమకుగల యావదాస్తియు తమ ప్రేమంపు ప్రజోపయోగసంస్థకొసంగి కష్టముల లెక్కసేయకుండ కాలము గడపెదరు. కొందరు యిరుగుపొరుగు వారిని కాపాడుటకై కొలది కష్టములకు లోనయ్యెదరు. మరి కొంతమంది సోదరులయొక్కగాని సోదరీమణులయొక్కగాని గౌరవము, ప్రాణము వీటిని రక్షించుటకు తమ ప్రాణముల నర్పింతురు. ఇట్టివారిలో నేపాళయువకుడు ఖరగ్ బహదూర్ సింగు గణింపబడు టవసరము. ఒకయువతిని బలాత్కారముగ వివాహమాడ తల

పడియుండిన మూడుకాళ్ల ముదుసలిని హత్యగావించిన నేరముపైన యెనిమిదివత్సరముల కఠిన శిక్షకు పాత్రుడై కారాగారమునకేగి యిటీవలనే వైస్రాయిగారిచే విడుదలచేయ బడియుండిన ఖరగ్ బహదూర్ సింగును కలకత్తానగరము అత్యుత్తమమగు విధమున గౌరవించియుండుట మాకెంతయు ఆనందమును గలిగించుచున్నది. కలకత్తా నగరమున గత నెల 7 వ తేదీ సాయంకాలము టౌన్‌హాలునందు గావింపబడియుండిన మహా సభ యందు పురుషులకన్న స్త్రీలే యెక్కుడుత్సాహముతో పాల్గొని అభినందనపత్రమును సమర్పించి కలకత్తా మహిళామణులు తమకృతజ్ఞతను వెలిబుచ్చియుండిరి. ఈఅభినందన పత్రమునకు సమాధాన మొసంగుచు ప్రతిభారతీయునకుడును తనసోదరీమణులయొక్క గౌరవమర్యాదలను కాపాడుట కెల్లవేళలను సిద్ధముగనుండవలయునని సింగుగారు హెచ్చరించి యుండుట ఆంధ్రయువకులు ముఖ్యముగ గమనించవలసియున్నది.

53 ఏండ్లవృద్ధునకు వివాహము—

ఏబదిమూడేండ్లవృద్ధుడు పేదకుటుంబమునకు చెందినపదునైదు వత్సరముల ప్రాయంపు బాలికను వివాహమాడ నిశ్చయించుకొని యుండుట మాచదువరులకు కొంచెము నవ్వుబుట్టించునుకాని యిట్టిసాహసకార్యముల నొనరించుటకు వృద్ధులింకను పూనుకొను చుండుటను గాంచిన సంస్కారప్రియులు విషాదమునకు లోనుగాకయుండరు. ఖరగ్ బహదూర్‌సింగ్ చేయునది లేక యువతి జీవితమును రక్షించుటకు దౌర్జన్యమునకు పాల్పడి కడకు తన యాశయము నెట్లు నెరవేర్చెనో, అట్టులే యీ పదునైదువత్సరముల మార్వారు బాలిక జీవిత మంధకారబంధురము గాకుండ జేయుటకై బొంబాయి మార్వారీ యువజన సంఘము కొంత శ్రద్ధ వహించియుండు టెంతయు సంతసము. తానా లేగందును వివాహ మాడనని మాట యిచ్చియుండియు ఆవృద్ధుడు మరల కోర్టునకెక్కి చేయవలసిన ప్రయ త్నముల నన్నింటినిచేసెనుగాని యువకులుకూడ పట్టిన పట్టు విడువకుండయున్న కారణమున కడకా వృద్ధుని పట్టుదల నెగ్గదాయెను. బాలికయొక్క జీవితమును కాపాడిన న్యాయాధి కారి యెంతయు వందనీయుడు.

ఈసందర్భమున "గోలకొండ పత్రిక"కు వరంగల్ నుండి సంస్కరణాభిలాషి వ్రాసిన యుత్తరమందలి దారుణాంశములను కూడ యిటుపొందు పరుచుచున్నారము.

"లక్షల ద్రవ్యమార్జించి శ్రీమంతులని పేరుగాంచిన వరంగలు నివాసులు (వైశ్యులు) ఆకారపు చెన్నయ్య [75 ఏండ్ల వరుడు] గారికిన్ని తత్పరిసర గ్రామమగు మడికొండ నివాసులు పెద్ద బసవరాజంగారి కుమార్తె [10 ఏండ్ల వధువు] నాగమాంబకున్ను విభవనామ సంవత్సర పాల్గుణ బ॥ 10 లు, రోజున వృద్ధలోకైక వైవాహిక మహోత్సవము జరిగినది. ఈ 75 ఏండ్లవరుడగు చెన్నయ్యగారికి 40 ఏండ్ల యీడుపైబడిన యొక కుమారుడు (నరసింగం) గలడు.

మార్వాడీలలో సంస్కారోద్యమము—

మార్వాడీలలో యిదివరకు కొంత ప్రబోధము కలిగియుండినను యెవ్విధమగు చలనముగాని గలిగియుండలేదని ఆపరిసర ప్రాంతములయందు నివసించుచున్న యితర సంఘీయులు తెలిపియున్నారు. కాని యిటీవల బొంబాయి నగరమున శ్రీరాజా గోవిందలాల్ శివలాల్ గారి యధ్యక్షతక్రింద జరిగియుండిన పదియవ అఖిలభారత మార్వాడీ అగ్గర్వాల్ మహాసభయందు నిజముగ సంస్కారము నాసించియున్న కొందరు యింతవరకును తమ హృదయములయందే గుప్తపరచుకొనియుండిన సంస్కారాభిప్రాయములను వెలిబలికియున్నారు. 16 వత్సరములకు పూర్వము బాలికలకును 25 వత్సరములకు ముందు బాలురకును వివాహ మొనరింపరాదని అధ్యక్షులు తెలిపిరి. బాలవితంతువివాహము లాచరణీయములని చెప్పిన సమయమున సభ్యులలో కొంత యలజడి యుదయించినను సమర్థతతో అనుమానములకు సమాధానముల నొసంగి సభికులందరిచే నొకేయభిప్రాయము నంగీకరింపజేసియుండిన వీరెంతయు సంస్తవనీయులు.

స్త్రీవిద్య—హార్టాగ్ కమిటీ సూచనలు—

విద్యాభివృద్ధి కవసరమగు విషయములయందు తగు సలహో లొసంగుటకుగాను నియమింపబడియుండిన హార్టాగ్ కమిటీ స్త్రీవిద్యా వ్యాప్తిని గురించి గ్రంథస్థ మొనరించిన విషయము లెంతయు సత్యగర్భితములు. భారతదేశమందు విద్యలనందు బాలికల సంఖ్య వృద్ధియగుచుండినను ప్రభుత్వ విద్యాశాఖ వలయునంతశ్రద్ధ గైకొనుచుండుట

లేదని స్పష్టముగ కానుపించుచున్నదని కమిటీవారు వ్రాసియుండిరి. నేటి బాలికలే రేపటి దినము గృహములను పాలించు తల్లులయ్యెదరు. అట్టిసమయమున బాలికలకు వలయు విధమున విద్యల గరుపవలసియున్నది. ఈవిషయమై ప్రభుత్వమిక నేనియు శ్రద్ధవహించు టుత్తమము.

శ్రీరామనవమి–భోగము మేళములు—

"పరిణయోత్సవములందు, దేవపూజావసరములందు భోగము మేళముల నుపయోగించు నాచారము చిరకాలమునుండి తెలుగుదేశమున పాదుకొనియున్నది. ఆంధ్ర సంఘ సంస్కర్త శిఖామణులగు వీరేశలింగముపంతులుగారి నిరంతర ప్రయత్నముకూడ నీ యాచారమును శాశ్వతముగ నీ దేశమునుండి పారద్రోల లేక పోయినది. భోగ స్త్రీలకు దేవదాసీలు అను పవిత్రనామము నెలకొన్నది. వారిది ప్రత్యేక మొకవర్ణముగా నేర్పడినది. ప్రతి సంవత్సరమును శ్రీరామనవమి ఉత్సవములు రాజమహేంద్రవరమున నితాంత వైభవముతో జరుపబడును. ఆయుత్సవ సందర్భములందు భోగము మేళములను విరివిగా నుపయోగించు నాచారము అనుశ్రుతమై యున్నది. జనాకర్షణము కొఱకో, ఉత్సవమున కదియొక శోభయనియో ఉత్సవకారులు భోగము మేళముల నేర్పఱచుచున్నారు. ఇది మిక్కిలి అవినీతికరమైన సంగతి. దీనిని మాన్పించుటకీ సంవత్సరము రాజమహేంద్రవర యువజన సమితివారు ప్రయత్నించుచునట్లు వినుచున్నాము. వారి ప్రయత్నములు సఫలీకృతమగు గాక!"

అని మార్చిమాసపు "తెలుగు సమాచార" పత్రికలో నేతత్పత్రికా సంపాదకులు వ్రాయుచున్నారు. దేశాభ్యుదయ కార్యములను తెనుగుసీమకు హత్తించుటలో రాజమహేంద్రవరము ఎప్పుడును ముందడుగు వేయుచునే యున్నది. మఱియు నా పట్టణము సంఘోన్నతికి చీము నెత్తురులు వెచ్చించిన వీరేశలింగము పంతులుగారి జన్మస్థానము. కావున యువజనసమితివారి ప్రయత్నములు కార్యకారియైయుండుటలో విచిత్రమేమియు లేదు.

సరస్వతీదేవి–వీరాంగన—

పట్టపగలు నొక మహమ్మదీయ యువకునిచే చంపబడిన రాజపాలుగారి దహన క్రియలకు వేలకొలదిగా ప్రజలు శ్మశానభూమిలో మూగిరి. రాజపాలుగారి సతీమణి సరస్వతీదేవిగారు ఆజనసముద్రము నుద్దేశించి యిట్లుపలికెను.—

"నాభర్త మరణమువలన నాకు దుఃఖము కలుగుట సహజమే! ఐనను మీరందర యోదార్పువలన నాకు కొంతధైర్యము కలిగినది. నాభర్త ధర్మము కొఱకు తన ప్రాణము లర్పించెను. నా కోరిక యేమన నాభర్త యెట్లు ధర్మము కొఱకు తన ప్రాణము లర్పించెనో అట్లే నా కొమరుడుగూడ అవసరమగుచో ధర్మము కొఱకు తన ప్రాణముల బలినిచ్చుగాక!"

వీరపత్ని, వీరమాత అగు ఆమె ఉచ్చరించిన పలుకులు ఆలించి అచ్చట మూగిన అశేషజనములోని ప్రతివ్యక్తి హృదయమును తప్తమై హర్షాశ్రురూపమున బహిర్గత మయ్యెను. భారతవర్షమునందలి స్త్రీలలో నిక్షిప్తమైయున్న సాహసము, త్యాగము సరస్వతీదేవి వాక్యరూపమున లోకమునకు గానవగుచున్నవి. ధర్మము కొఱకు పతిని అర్పించి వలయుచో కొమారుని కూడ నర్పించుటకు సంసిద్ధమైయున్న స్త్రీరత్నములకు నిలయమై భారతదేశ మున్నంతకాలము అది యెంత దరిద్రములో మ్రగ్గుచుండినను రత్నగర్భ యే యనిపించుకొనును. సరస్వతీదేవి విశాలభావములు ప్రతిహైందవస్త్రీహృదయము నందును ధ్రువతారాతుల్యముగ మెఱయును గాక!

# గ్రంథములు, పత్రికలు.

**ఆత్మకథ.—**

లోకోత్తరపురుషుడగు గాంధీ మహాత్ముని ఆత్మకథకు ఆంధ్రానువాదమిది. అనువదించినది సుప్రసిద్ధాంధ్రపండితులు, శతావధానులు నగు శ్రీ వేలూరు శివరామశాస్త్రిగారు. ప్రచురణకర్తలు శ్రీ దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు. గ్రంథము క్రౌను సైజున 500 పుటలు. ఆకృతి అతిసుందరముగ నున్నది. అయినను మూల్యము రు 1-0-0 మాత్రమే. అనువాదమున శైలి సులభమయ్యుసుందరముగానున్నది. అలతియలతి వాక్యములతో ప్రజ్ఞాప్రయోగములకు గనియైయున్న ఇందలి భాషాశైలి ఆధునిక కవి కుమారులకు ఉపాస్యమైయున్నది. అక్షరాస్యుడైన ప్రతి ఆంధ్రుని హస్తమును అలంకరింపదగిన ఉత్తమగ్రంథము. ప్రస్తావిత విషయము మహాత్ముని సత్యచరిత్రముకావున ఇది భగవద్గీతవలె పారాయణము చేయదగిన గ్రంథరాజము. ఇది ఆంధ్రగ్రంథమాలలో పదియవ కుసుమము. వలయువారు ఆంధ్రగ్రంథమాలా వ్యవస్థాపకులు, నెం. 7, తంబుశెట్టివీధి, మద్రాసు—అని వ్రాయునది.

**కులలక్ష్మి:—**

శ్రీ వడ్లమూడి వేంకటరత్నముగారిచే రచియింపబడినది. వెల పన్నెండణాలు. పుస్తకములు తెనాలిలోని కృష్ణాఫ్యాన్సీ స్టోర్సులోగాని యం. యస్. శర్మ అండుకోలోగాని దొరుకును. వేంకటరత్నముగారీ గ్రంథమును వ్రాయుటలో స్త్రీలకు ఉత్తమశిక్షణము నలవఱచుటయను నంశమును ప్రధానము చేసికొనిరి. 'కులలక్ష్మి' రెండుభాగములుగ విభజింపబడియున్నది. ప్రథమభాగమున స్త్రీలు ఏయే గుణములవలన కులలక్ష్ములు కాఁగలరో తెలుపబడినది. రెండవభాగమున వారు యేయే దోషములవలన కులలక్ష్మి నామమునకు దూరమగుదురో వివరింపబడినది. శ్రీ వెంకటరత్నముగారు తమఉపదేశములను సోదాహరణపూర్వకముగ చెప్పిరి. పురాణములనుండియు, చరిత్రలనుండియు, సామాన్య సంసారవృత్తములనుండియు ఉదాహరణముల నిచ్చి గ్రంథకర్తగారు విషయబోధను ప్రశస్తముగా చేసినారు. శైలి తేలికగానుండి స్త్రీజనములకు సులభవేద్యమై యున్నది. స్త్రీలు తమసొంతగ్రంథసముచ్చయమున నీ కులలక్ష్మి ప్రతినొకదానిని తప్పక చేర్చుకొనవలయును. స్త్రీలకొఱకు ఉద్దిష్టమైన ఇట్టి ప్రత్యేక గ్రంథములు మనభాషలో మిక్కిలి తక్కువగానున్నవి. ఆలోపమును ఈగ్రంథము కొంతవఱకు తొలగించుచున్నది.

**శ్రీతులసీ రామాయణము.—**

ప్రపంచ వాఙ్మయములోని అత్యుత్తమగ్రంథములలో తులసీదాసు రామాయణ మొకటి. ఆ రామాయణమును శ్రీ భాగవతుల నృసింహశర్మగారు తెలుగున వెలయించుచున్నారు. ఇంతకుముందు బాలకాండము, అయోధ్యకాండము వెలువడినవి. ప్రస్తుతము పరామర్శింపబడుచున్న భాగము అరణ్యకాండము. ఇది నిర్వచనము. కవిత్వము ధారగలది. 'నక్కయెక్కడ దేవలోక మెక్కడ.' 'చావుదప్పి కన్నులొట్టపోయినదన్న కరణి' 'అభ్యాగత స్స్వయంవిష్ణుః' 'ఆత్మవత్సర్వ భూతాని' మొదలగు ఆర్యోక్తులు గ్రంథశైలికి మెఱుగుపెట్టినవి. పుట 26లోని 141-వ పద్యము పోతన్నగారి ప్రహ్లాద చరిత్రలోని పద్యగమనమునకు మిక్కిలి చేరికగానున్నది. మొత్తము మీద శర్మగారి కవిత్వమున పూర్వప్రబంధచ్ఛాయలు పెక్కులుగలవు. శృంగార రసపోషణములో వీరు ప్రబంధకవుల మార్గమునే అనుసరించిరిగాని దానికి నవ్యత సాపాదింప

లేదు. ముద్రణ దోషములు కూడ చాలగలవు. మూలగ్రంథ ప్రాశస్త్యము నుపలక్షించి ఆంధ్రు లెల్లరీ గ్రంథమును చదువుదురు గాక యని కోరుచు శర్మగారిని మిగిలిన కాండములను కూడ సాధ్యమైనంత త్వరలో ప్రచురింప వేడుచున్నాము:

గ్రంథములు వలయువారు గ్రంథకర్త పేర పొ ప్రయిటరు, వేగుజుక్కు గ్రంథమాల, పూడిపెద్దివారి వీధి, బరంపురము, (గంజాంజిల్లా) అని వ్రాయవలెను.

## శ్రీనరసింగరావుగారి గ్రంథములు.

శ్రీయుత ప్రొద్దుటూరు నరసింగరావుగారు రచియించినవియు ప్రచురించినవియునగు 1. బళ్లారిమండలము నందలి పాషణప్రదేశము. 2. శ్రీజయతీర్థగురుచరిత్ర, శ్రీటీకాచార్యులచరిత్ర. 3. సత్యబోధతీర్థులచరిత్ర 4. కనకదాసుల చరిత్ర. 5. జగన్నాథదాసుల చరిత్ర 6. పురందర దాసుల చరిత్ర 7. శ్రీమన్మహాభారత తాత్పర్య నిర్ణయభావసంగ్రహదీపిక 8. శ్రీరాఘవేంద్రతీర్థ గురుస్తుతికదంబము. 9. గీతాతాత్పర్యం. 10. శ్రీకృష్ణ చారిత్రమంజరి. 11. శ్రీరామచారిత్రమంజరి. 12. శ్రీమద్భాగవతసారము అను గ్రంథములను వందన పూర్వకముగ నందు కొంటిమి. తైర్థికులకును, భక్తులకును మిక్కిలి ఉపయోగకరముగా నుండగల గ్రంథములు. వలయువారు కృష్ణాజిల్లా డిస్ట్రిక్టు రిజిస్ట్రారుగారగు శ్రీప్రొద్దుటూరి నరసింగరావుగారి పేర బందరు వ్రాయునది.

## శ్రీపమిడిపాటి మహాలక్ష్మీశతకము—

గుంటూరుజిల్లా, ఒంగోలు తాలూకా, ఉప్పుగుండూరు స్టేషనునకు అరుమైళ్లదూరమున నున్న పమిడి పాడను గ్రామమున వెలసియున్న మహాలక్ష్మియను దేవతపై చెప్పబడిన 117 పద్యముల శతకము. రచయితలు రామకృష్ణశీతారామసోదరకవులు. వెల 0-2-0 అణాలు. వలయువారు గ్రంథకర్తలపేర అనంత వరాగ్రహారము. గజులకొండపోష్టు కర్నూలుజిల్లా అని వ్రాయునది. గ్రంథమున గ్రంథకర్తల చిత్రపటములు కూడగలవు.

## నెలవంక—

శ్రీఆవంత్స వేంకటరంగారావు (బి. ఏ) గారిచే వ్రాయబడి విజయనగరమునుండి ప్రచురింపబడిన నెలవంక యను పద్యకావ్యసంపుటము. చక్కగ డెమ్మి అష్టపోసైజున ముద్రింపబడినది. కవి అప్పుడప్పుడు ఆంధ్రపత్రికలయందు ప్రకటించియుండిన పద్యము లన్నింటికి నొక పుస్తకాకృతి యొసగెను. కవిత్వము లలితపద భూయిష్టమై మంచినడకను గలిగియున్నది. వెల అణాలు ఎనిమిది.

## ఆనంద భారతి.—

కథల మాసపత్రిక నూతనముగా వెలువడినది. సంపాదకుడు ఎస్. జి. ఆచార్యగారు. ప్రచురణకర్త యస్. వి. గోపాల్ మొదలియారు. మదరాసు.

శుక్ల సంవత్సరాదినాడు వెలువడిన ప్రథమ సంచిక మాకార్యస్థానము చేరినది. "కథలకై ప్రత్యే కింపబడియున్న పత్రిక యొక్కకొరత యీ" తెనుగున లేదు కావున "ఆకొఱతను దీర్చుటకే యీ పత్రికను ప్రచురించుటకు మేము పూనుకొనుటయైనది" అని ప్రకాశకులు 'స్వవిషయము' లో చెప్పుకొనియున్నారు. డెమ్మిసైజు. 40 పుటలు కలవు. గద్యపద్య వ్యాసములతో నొప్పుచున్నది. ఈ పత్రికాకిశోరము చిరకాలము వర్ధిల్లు గాక యని కోరుచున్నాము.




సచిత్ర మాసపత్రిక

సంపాదకుఁడు

డాక్టర్. కే. ఎన్. కేసరి

సంపుటము 2.] [సంఖ్య. 4

లోధ్ర ముద్రాలయము, మద్రాసు

1929

# Proceedings of the Various Taluk Boards and Municipalities.

(TRUE COPIES)

From M.R.Ry. A. Narayana Rao Garu, B.A., LL.B.,
President, Taluk Board, Penukonda.

To The Editor,
Grihalakshmi, Telugu Monthly Journal,
Post Box, 752, Egmore, Madras.

RLC No. 261/29 dated 8-4-29.

Sir,

The Board has in its resolution No. 586, dated 23-3-29 sanctioned to subscribe for the supply of 5 copies of the Journal "Griha Lakshmi." Please supply the journals to the Head Masters of the following schools and submit a bill for payment of the annual subscription due for the same.

1. Hindu Girls School, Penukonda 2. Hindu Girls School. Madakasira. 3. Hindu Girls School, Amarapuram. 4. Hindu Girls School, Hemavathy, 5. Hindu Girls School, Agali.

(Sd.) A. NARAYANA RAO.
*President.*

---

L. Dis. No. 2897 of 1928-29 dated 4th April 1929.

From
M.R.Ry. Rao Sahib V. Sree Ramulu Naidu Garu,
Chairman, Municipal Council, Ongole.

To The Editor,
Grihalakshmi, Post Box, 752, Egmore, Madras.

Sir,

The Council sanctioned the supply of one copy of monthly Journal "Grihalakshmi" to the Municipal Higher Grade Girls' School for one year with effect from 1-4-29. Please, therefore, supply the same every month to the Headmistress of the said school. A bill may be sent to me for payment.

(Sd.) CHAIRMAN.

---

Dis. No. 455/Rp. T. B. of 1929 dated 7th March, 1929.

From
M.R.Ry. B. Venkataratnam Choudari Garu, M.L.C.,
President, Taluk Board, Ramachandrapuram.

Sir,

I have the honour to request that you will be kind enough to supply the magazine to the Headmasters of the marginally noted girls schools for one year and send the bill to this office after the completion of the year.

1. Alamur 2. Artamuru, 3. Biccavole, 4. Chelluru, 5. Dangeru, 6. Draksharama, 7. Editha, 8. Kapileswarapuram. 9. Kotipalli, 10. Konkuduru, 11. Kulla, 12. Mondapet, 13. Pandalapaka. 14. Pasalapudy, 15. Ramachandrapuram, 16. Somaeswaram, 17. Tapaeswaram, 18. Vedurupaka, 19. Chodavaram, 20. Anaparty, 21. Machavaram, 22. Voolapalli.

I have the honour to be,
Sir,
Your most obedient servant,
(Sd.) PRESIDENT

Extract from the minutes of proceedings of the Vellore Taluk Board.

passed at its meeting held at Vellore on the 14th March, 1929.

Resolution No. 27.

The President moves the Board to purchase a copy of the Telugu Monthly Journal, Grihalakshmi on payment of annual subscription of Rs. 4/- for use of the Board Girls Schools at Odugathur and Agaram.

SANCTIONED.

D. Dis. No. 186 T. B. of 1929.

Copy communicated to the Editor, Grihalakshmi, Post Box No. 752, Egmore, Madras.

Vellore Taluk Board's Office,

Vellore, dated 19th March 1929. (Sd.) for President.

---

From The President, Taluk Board.
Gooty.

To
The Editor
Grihalakshmi, Post Box 752, Egmore, Madras.
Ref. Gl. No. 524/29 dated 1-4-29.

Sir,

Please supply me with one copy of the Journal "Grihalakshmi". The Taluk Board, Gooty, has sanctioned its supply for one year from 1-4-29.

(Sd.) President.

---

From M.R.Ry. Ch. Koteswara Row Pantulu Garu, B.A.,
President, Taluk Board, Narasarowpet.

To The Editor,
The Grihalakshmi, Egmore, Madras.
Resc. No. 714/GL of 29 dated 2—4—29.

Sir,

Please be good enough to supply your Telugu monthly journal, one copy to each of the Headmasters of Board Girls Schools, Vinukonda and Chilakaloorpet, for one year from April 1929 and the bill for their cost may be sent to this office in duplicate for payment.

(Sd.) President.

సం॥ చందా రు. 4. విడిసంచిక అ. 6.

# గృహలక్ష్మి

స్త్రీల ఆయురారోగ్య సౌభాగ్యములను పెంపొందించుట

కేర్పడిన సచిత్ర మాస పత్రిక.

సంపుటము 2. జూను నెల 1929. సంచిక 4.

## విషయసూచిక.

PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

## పార్వతీదేవి.

చిన్నారిజాబిల్లి సేసక్రొవ్వేదపువ్వు
మెట్టరాచబిడారు పుట్టినిల్లు
మగనిసామేను సేమపుటోలగపుమిద్ద
కలువలజవరాలు చెలిమిబోటి
తెలగంటికల్కిముద్దియ లూడిగపుచెలుల్
కడిఁదిబొబ్బమెకంబు కత్తలాని
యాముటేనుఁగుమోముసామి ముద్దుపట్టి
జక్కరవిరిఁబోడి సవతిమిన్న

గాఁగ జగములు గడితంపుఁగనికరంపుఁ
బెంపు రాణింప నెపుడు పాలింపుచుండు
సర్వమంగళ మాకు నఖర్వసర్వ
మంగళావాప్తి నొడఁగూర్చి మనచుఁగాత.

కూచిమంచి. తిమ్మకవి.

# గృహలక్ష్మి.

## వరునివచనము

ఓ కన్యా! శుచిమూర్తియగు అగ్నిదేవుడు మనయెదుట ప్రజ్వరిల్లుచున్నాడు. వాక్పరిశుద్ధిగల మునీశ్వరులు వివాహవేదిక చుట్టును ఉపవిష్టులై యున్నారు. వీరిసన్నిధానమున మనము వివాహకర్మమున బంధితుల మగుచున్నాము. మన యిరువురి హృదయములు ప్రవాహనీరములవలె నిర్మలములును గిరికందరములవలె శాంతిమంతములును అయి మేళవింపు నొందుగాక! ప్రాణమునకు వాయువునట్లు మనము ఇరువురమును పరస్పర సహాయ్యులమై యుందుముగాక! ప్రపంచమునకు దైవసహాయ్యమట్లు మనము ఉభయులమును ఒకరికొకరము సహాయ్యులము అగుదుముగాక! గురువు శిష్యులయట్లు మనము ఇద్దఱమును ఒకరికొకరము జ్ఞానోపదేశికులమై పరస్పరప్రేమానుబంధమున ఈలోకమున జీవయాత్ర సల్పుదముగాక!

ఓ సఖీ! పూజ్యమూర్తుల సన్నిహితమున నీపాణిని గ్రహించుచున్నాను. నీవు నావలన లోకమును వెలయింపగల సంతతిని పొంది ధనకనకవస్తువాహనపూర్వకమైన నాశ్రీలన్నిటికిని రాణివై మెలగెదవుగాక! వహ్నిసాక్షికముచేనైన మన ఈస్నేహము ఎప్పటికిని విచ్ఛిత్తి నొందకుండుగాక!

ఓ అర్ధాంగీ! కరుణాసింధువగు భగవానుడు నిన్ను నాకు ప్రసాదించినాడు. నీవు నాకు బలముగా, నాశరీరములో శరీరముగా నా కాధారభూతమై యుందువుగాక! 'నూటి

మీద నూరేండ్లు' పవిత్రప్రేమతో నీవు నన్ను అనునయింతువుగాక! ఎల్లవేళల నీవు నా పార్శ్వవర్తినివై మెలగెదవు గాక!

ఓ కులలక్ష్మీ! వంశాభివృద్ధినికోరి నేను సౌందర్యవంతురాలవయిన నిన్ను భార్యనుగా పరిగ్రహించుచున్నాను. నీవును అట్లే కులాభివృద్ధినికోరి నన్ను భర్తనుగా పరిగ్రహింపుము. లెస్సగా విచారణచేసి నిన్ను నేను స్వీకరించుచున్నవిధముననే నీవును నన్ను చక్కగా విచారణచేసి వరియింపుము. నేను నిన్ను నిశ్చలప్రేమతో తిలకించుచున్నవిధముననే నీవును నన్ను నిశ్చలప్రేమతో తిలకింపుము. నీవు ఋగ్వేదమువంటిదానవు. నేను సామవేదము వంటివాడను. నీవు భూమివంటిదానవు. నేను సూర్యునివంటివాడను. మనము పరస్పరము ప్రేమానుబంధముతో గూడి చక్కని సంతానమునుపడసి వంశాభివృద్ధి కొనలు సాగింతము.

ఓ గృహలక్ష్మీ! మనసంతానము తామరతంపరయై శాఖోపశాఖలై విస్తరించి మనము ముదిసి ముప్పునబడినప్పుడు మనలను సుఖపెట్టునుగాక! మనప్రేమానుబంధము శాశ్వతమును పరస్పరానుకూల్యముగలదియును నగుగాక! ఏకహృదయులమై మనము శతవర్షములు సౌఖ్యము నొందెదముగాక! పరస్పరము కామించుచు ఒకరినొకరము నిముషమేనియు నెడబాయక చూచుకొనుచుందుముగాక! ఒకరిమాట ఒకరము తులసీదళమువలె తలదాల్చుచుందుముగాక!

ఓ హృదయేశ్వరీ! సంపూర్ణమైన హృదయాంగీకారముతో నేను నిన్ను గ్రహించుచున్నాను. ఇప్పుడు ఉన్నట్లె నీవు ఎల్లప్పుడును నాతో నుండెదవుగాక! నాపలుకులను ఏకాగ్రచిత్తవై ఎల్లవేళల శ్రద్ధగా చెవినిబెట్టెదవుగాక! సర్వలోకాధినాథుడైన పరమేశ్వరుడు నిన్ను నాయందు అనురక్తనుగాచేయునుగాక! ఆకాశమున సూర్యుడు, బ్రహ్మాండమున భూమి, భూమిని గిరులు, ఎట్లు నియతమై యున్నవో అట్లే నీవు శాశ్వతవిశ్వాసముతో నాపూర్వీకులచే సంరక్షింపబడిన ఈకుటుంబమున ప్రవర్తిల్లుము. సృష్టికర్త నిన్ను నాకు ఒసగినాడు. స్థిరవిశ్వాసముతో జోడువాయక నాతో మెలగి నీవు ప్రజలను సృజియించి కులమునిలుపుము.

ఆహారమువలన ప్రాణికి జవము, జీవము, కలుగునట్లు ఆజన్మాంతమైన మనసఖ్యము వలన మనహృదయములు సత్యము, ఋజుత్వముల యందు స్థిరములై నెలకొనుగాక!

# పాడగలను నేను

పెమ్మరాజు రాజగోపాలముగారు (సారస్వత సమాజము)

పాడగలను నేను భావాల తేలి
ఆడగా నేర్తు నే నానందకలన—

౧

ఈ విశాలోర్విపై నుండి ఆ వినీల
విపులగగనాంతరాళము లిపుడు నిండ
దిశల ప్రతిరావములు మించ దివ్యఫణితి
మానవులలోని దేవతామహిమ గూర్చి
లోకమున నున్న యాస్వర్గలోకమహిత
సౌఖ్య సంధానమును గూర్చి సాహసముగ
కమ్రతరముగ సత్యేచ్ఛ కంఠమెత్తి
పాడగలను నేను భావాల తేలి
ఆడగా నేర్తు నే నానందకలన—

౨

దుఃఖ సంకులపంకిల దురితలోక
వృత్తులను దోలి మానవజీవితపు మ
ధురిమ గ్రోలి గ్రోలి సుఖసంభరితమైన
నతిమనోహరమైన ప్రేమార్ద్రమైన
విశ్వకల్యాణకమనీయ వివిధవిమల
గీతికామాలికాళి సంప్రీతి గూర్చి
పాడగలను నేను భావాల తేలి
ఆడగా నేర్తు నే నానందకలన—

౩

నవయుగాగమసూచికానందమధుర
మధురజాతీయ గీతాళి భావవిహాగ
మటుల సామాన్యజగతికి నందరాని
దైన యౌన్నత్యమున కేగి యద్భుతముగ
స్వేచ్ఛగా జీవయుతముగా చెలువుమీఱ
పాడగలను నేను భావాల దేలి
ఆడగా నేర్తు నే నానందకలన——

౪

హృదయకుహరాల మార్మూల నిదురవోవు
మృదుల భావాల రాగాల కదిపి లేపి
జాతి యలసత్వ బంధాలు సడలిపోవ
దివ్యతరమైన స్వేచ్ఛాప్రదీప్తి పైకి
కళల విరజిమ్మ దిక్కుల కలయఁబ్రాక
సర్వమానవభ్రాతృత్వ సరణి గూర్చి
పాడగలను నేను భావాల దేలి
అడగా నేర్తు నే నానందకలన——

# శారదలేఖలు

శ్రీమతి కనుపర్తి. వరలక్ష్మమ్మగారు.

సౌభాగ్యవతియగు కల్పలతకు:

నెచ్చెలీ!

కుర్తాళం వెళ్లుటకై మేము తెంకాశీలో దిగి పురముదెస చూడగనే ఆపుర మంతయు నొక్క తోటవలె గన్పట్టెను. అటనుండి బండి చేసుకొని అచ్చటికి మూడునాల్గు మైళ్లదూరములోనున్న కుర్తాళమునకు బయలుదేరితిమి. మార్గమధ్యమంతయు ఫలవృక్షములతోడను నీటికయ్యలతోడను నొప్పి తెంకాశీనుండి కుర్తాళం వఱకు నొక్కే యుద్యాన వనములో వెడలినట్లుండెను. అపుడు మిట్టమధ్యాహ్నమై సూర్యుడుతీక్ష్ణముగా నెండగాయు చున్నను మాబాటల కిరుప్రక్కలనున్న యెడతెగని వృక్షపంక్తులఛాయలచే మే మెండ కన్నెఱుగని శుద్ధాంతజనముల భాతినైతిమి. కుర్తాళమునందే ప్రసిద్ధిజెందిన మౌన స్వాములవారి మఠమున్నది. మఠము నిర్మించిన ప్రదేశము బహురమణీయమైనది. ఆమఠపుభవనమునంటి యొకచక్కని తియ్యనీటిజలధార అహర్నిశలు దోనదోనమని ప్రవహించుచుండెను. మఱియు చుట్టును పుష్పోద్యానములును జలప్రవాహములును, గోష్ఠశాలలును పరిజనగృహములును గలిగి స్వాములవారిమఠము మఠముగా నుండక శ్రీమంతులభవనమువలె నుండెను. ఆమఠముయొక్క సౌందర్యమును సౌకర్యములను గాంచినవారికా మఠము రాగవిరాగములసమ్మేళనముగా గన్పట్టును. పరివ్రాజక సామాన్యమగు సాత్వికతకంటె రాజసమే యచ్చట హెచ్చుగా గనుపించును. ఆమఠము లోని యొకానొక గృహమునందు మేము విడిసి వంటజేసికొని భుజించితిమి.

మఱునాడు ప్రాతఃకాలముననే లేచి హారిభియను జలధారయందు స్నానముసేయ నేగితిమి. ఈస్నానము నిమిత్తమే యాత్రికు లక్కడ కేతెంతురు. ఈజలపాతము మేము విడిసినమఠమునకు రెండుమూడు ఫర్లాంగుల కంటె నెక్కువదూరము లేదు. ఆగ్రామవాసు లెల్లరును దినదినమూ జలపాతము కడనె స్నానముచేయుదురు. హారిభయనెడు జల ధారయొక్కకొండపైనుండి యహర్నిశలు క్రిందపడుచుండును. అచ్చటినుండియే పడమటి కనుమ లారంభమైనవని చెప్పవచ్చును. ఆజలధార మేము చూచునప్పటికి ఒకటిరెండు

గజముల ప్రదేశమును మాత్రమే యాక్రమించి పడుచుండెను. కాని గ్రీష్మఋతువులో నాజలధార చాలవెడల్పు నాక్రమించి భయముగొలుపునట్లు భూమిపై పడుచుండునట. ఆజలధార పడునంతప్రదేశమును నునుపుగానుండెను గాని తక్కిన పర్వతభాగమంతయు పచ్చని లతాద్రుమాదులచేతను కుసుమకోరకములచేతను మనోజ్ఞమై యుండెను. అప్పుడే సూర్యుడుదయించుచుండెను. ఆయుదయభానుని లేతకిరణములు లతావిద్రుమాలంకృతమగు పర్వతపంక్తులమీద బర్వ నాప్రదేశ మెల్ల నపరంజికాంతు లీనుచుండెను. ఆకొండలపైనుండి దొరలిదొరలి దూకుచున్న జలధార యాలేయెండప్రసారముచే పసిమిజెంది బంగారునీరును గ్రుమ్మరించుచున్నట్లుండెను. అప్పటి యాప్రదేశపుసౌందర్యము వర్ణనాతీతము.

ఆజలధారయందు స్నానముచేయుటకు మొదట మాకుచాలభయముగొల్పెను. కాని స్నానార్థ మేగిన వారమెంత సేపా వేడుక నరయుచు నిలువబడుదుము? స్నానము చేయువారు జారిపడకుండ పట్టుకొనుటకై యక్కడ నినుపకడ్డీలు గూడ నున్నవి. ఆకడ్డీలను పట్టుకొనియు మేము ఆజలధారయొక్క చిందులకే జడిసితిమి కొంతసేపు. చిన్నధారల కడలితిమి కొంతసేపు. ఇటుల క్రమక్రమముగా సమీపించి ఆపెద్దధారపాటుకు వెఱచి మొదట నడుమిచ్చితిమి. తదుపరి తల యొగ్గితిమి. ఆనీటిమోదులకు మొదట నాగజాలక పోతిమి. తరువాత విడువజాలకపోతిమి. ఆరంభమున నచ్చట స్నానముచేయుటకెంత భయముగొల్పెనో అంత్యమున దానిని విడిచివచ్చుట కంత విచారముగొల్పెను. ఆజలధార యొక్కనీరే పెక్కు పాయలుగా చీలి యూరిసంతను చుట్టి పాఱుచున్నది. స్వాములవారి మఠము చుట్టును ప్రవహించుచున్నది గూడ నదియే. చల్లదనమునకు మాధుర్యమునకును నాజలము సాటిలేనిదని చెప్పనగును. ఆజలధారకు సమీపముననే కుర్తాళేశ్వరుని ఆలయమున్నది. ఆ ఆలయములోనికిపోయి స్వామిని సేవించి మాబసకు వచ్చి వెంటనే వంటజేసికొని భోజనాదులుగావించుకొని జనార్దనపును పుణ్యక్షేత్రమున కేగుటకై రైల్వే స్టేషనుకు వచ్చితిమి. సరిగా పదిరెండుగంటలకు మే మెక్కు రైలువచ్చెను. దానిపై నెక్కి పోవుచుండ మారైలుబాట కిరుప్రక్కలను కొబ్బరితోటలును పోకతోటలును అరటి తోటలును పనసతోటలును తమలపాకులతోటలును కనులపండువుగా గన్పట్టుచుండెను. పడమటికనుమలు మా కొకప్పుడు దవ్వుగను నొకప్పుడు దగ్గఱగను చూపట్టుచుండెను. ఒక్కొక్క స్టేషను గడచిన కొలది మాకు తమిళులదర్శన మరుదై మళయాళీలు తఱుచుగాగనుపింపజొచ్చిరి. విదునగరమను స్టేషనున కేగు నప్పటికి మాబండి పూర్తిగా

మళయాళీల మయమయ్యెను. విదునగర మొక జంక్షను. అచ్చటనే మాబండిలో దీపములు వెలిగించిరి. అప్పటి కింకను రెండుగంటలైన కాలేదు. ఎండ తీక్ష్ణముగానే యున్నది. పట్ట పగటివేళ దీపములు పెట్టుటచేత మార్గైలు పర్వతసొరంగములలో జొరబడబోవు చున్నదని గ్రహించితిమి. మేము తలచినట్లుగా వెంటనే మార్గైలొక పర్వత సొరంగ ములో జొచ్చెను. కొన్నినిముసములపాటు అంతయు నంధకారబంధురంబయ్యెను. ఊపిరి సలుపక నుక్కిరిబిక్కిరైతిమి. ఇంతలో వెలుగు కంటబడెను. సొరంగము దాటితిమి. బ్రతుకు జీవుడా యనుకొంటిమి. అదిమొదలు మా కిరుదెసల పర్వతపంక్తులును చఱియ లును లోయలును గుహలును నెత్తములును సెలయేటికయ్యలును భీకరారణ్యములును కనుపింపజొచ్చినవి.

సాధారణముగా మనప్రాంతములలో కొండలనిన ఒట్టిరాతిగుట్టలని యర్థము. వానిపై పచ్చని మొక్కలే యరుదు. కాని కల్పలతా! ఆపడమటికనుమల భాగ్యమే మని చెప్పుదును? సమస్తపాదపములు, నిఖిలలతావితానము, సర్వగుల్మములు, వాని సొత్తు. వికసించిన పుష్పగుచ్ఛములతో, విరియగ్రమ్మిన యాకుజొంపములతో, నాపర్వత ములపైనున్న లతాద్రుమావళు లెంత రమణీయముగ నున్నవనుకొంటివి? కుంకుమపు రాసులుపోసిన ట్లొకచోటను పసుపుకుప్పలుపోసి న ట్లొకచోటను నీలాంబరముగప్పిన ట్లొకచోటను వెల్లమునుంగు వేసికొనిన ట్లొకచోటను వివిధవర్ణచిత్రపుష్పవిరాజితంబై యాకనుమయందలి ప్రతివృక్షమును ప్రతివల్లరియు సొంపునింపుచుండెను. అచ్చట వీచెడు వాయువు గూడ మాలతీచంపకవకుళాదికుసుమసౌరభములనే గాక మన కపరిచితములగు పుష్పపరిమళముల నెన్నిటినో గొనివచ్చి ఘ్రాణేంద్రియ పరితృప్తి గలిగింపుచు హాయిహాయి యనిపించుచుండెను. కొండలపైనుండిపడెడి సెలయేళ్లు చఱియలలోఁబడి చిన్నచిన్న వాకలై దొనదొనమని ధ్వనిసేయుచు ప్రవహింపుచుండెను. ఆప్రవాహముల కొడ్డుననేయున్న వెదురుచెట్లు నీటిలోనికి వంగి ప్రవాహవేగమున కుయ్యాల లూగుచు బొయ్యిమనిబోలు ధ్వనిసేయుచుండెను. వివిధములగు జలపక్షు లానీటివాకలలో విహ రించుచు కలకలమని మంజులధ్వని జేయుచుండెను. రమ్యమైన ఆకనుమ మార్గమున మా పొగబండి పర్వతసొరంగములలోజొచ్చుచు నెత్తముల కెగబ్రాకుచు లోయలలోనికి దిగుచు సెలయేళ్ల దాటుచు బో అని బొబ్బలిడుచు పాముపాకినట్లు మెలికలు మెలికలు దిరుగుచు బోసాగెను. కల్పలతా! అంతవఱకు సుప్రసిద్ధమైన దక్షిణదేశమున పెక్కు దేవాలయములను దేవతలను దర్శించి హర్షించితిమి. కాని అవి అన్నియు మానవుని బుద్ధి

వైశద్యమునే విశదీకరించెను గాని భగవన్మహిమను తేటపఱుపవయ్యె. నిజమగు భగవన్మహిమను పడమటికనుమలయందే గంటిమి. ప్రకృతియందు పరమాత్మని గనెడు బ్రహ్మవేత్తల కీప్రకృతిదృశ్య మెంత యాత్మానందమును గూర్చునో గాని మూఢులకే జ్ఞానోదయమును గలిగించునట్లున్న దా కనుమలసొంపు. ఉన్నతములగు నాపర్వతశృంగములను గాంచినప్పుడు భగవంతుని యౌన్నత్యమును ఆకొండలపైనుండి భూమిపై కుఱికి జలజలబాఱు సెలయేళ్లను గని నప్పు డా పరమేశ్వరుని దయాపరత్వమును చిత్రవిచిత్రపత్ర పుష్పఫలభరితపాదపావళుల గాంచినప్పుడు జగదీశ్వరుని సృష్టికళానిపుణత్వమును కలకలమని మంజులధ్వని సేయు ఖగగణంబుల కూజితంబు లాలించినప్పుడు విశ్వకర్త యొక్క మృదు మధురమనోజ్ఞవాక్కును స్మరించి యొడలు పులకించుచుండెను. విశ్వగర్భుని స్వరూపసాక్షాత్కారము నిజముగా మాకక్కడనే గోచరమయ్యెనని చెప్పవచ్చును. భగవంతుని మహావిభూతి కా కనుమలు నిదర్శనములు. సర్వేశ్వరుని సర్వాంతర్యామిత్వమున కవితార్కాణలు. కల్పలతా! వేయిమాటలేల? అచ్చటి సృష్టిసౌందర్యము అనుభవైకవేద్యమే గాని వర్ణనాతీతము.

ఈవిధముగా ఆప్రకృతిసౌందర్యమును చూడంజూడ మనం బానందనిమగ్నమగుచుండ కొండనెత్తములపై నాకుటిండ్లు గట్టుకొని కాపురముసేయుచు కొండలోయలలో సేద్యము సేయుచు పంటబండించుకొనుచున్న నాటవికుల నచ్చటచ్చట గాంచి నక్కజపడుచుండ క్రమముగా పర్వతములు దూరమయ్యెను. ఆ పర్వతప్రాంతముల గాంచిన వృక్షజాతులు గాని లతానికుంజములు గాని ఇక గన్పింపవయ్యె. గ్రామపరిసరముల నుండెడి పోక టెంకాయ తోపులు కనుపింపజొచ్చెను. అంతటితో పర్వతములు దూరమైనవని నిశ్చయించుకొంటిమి. ఇట్లు మఱికొంచెము దూరము పోవ తెల్లనియిసుకతిప్పలును నాగజెముళ్లును జీడిమామిడిచెట్లును సరుగుతోటలును గాన్పించెను. ఇదియేమి? సాగరతీరమునకు వచ్చినట్లున్నామే! అని యాశ్చర్యముతో ననుకొనుచుండ నొక గొప్పస్టేషను వచ్చెను. అచ్చట నెందఱో దొరలు, దొరసానులు, తదితర ఉన్నతోద్యోగులు మూబండ్లలో నుండి దిగిరి; ఎక్కిరి. ఆ స్టేషను ఏదియో యని పరికింప ప్రసిద్ధసాగరతీరపట్టణమగు "క్విలన్" అని తెలిసెను. కేరళదేశ మంతయు నారికేళవృక్షమయముగదా! వారి యిండ్లును, వాకిండ్లును, తిండ్లును గృహోపకరణములును వ్యాపారములును వేయేల వారి జీవితమంతయు కొబ్బరిచెట్లతోనే యున్నది. కాన "క్విలను" దాటినది మొదలుకొని మాకు త్రోవపొడుగునను కొబ్బరిడిప్పలను నీటిలోనానవేయుచున్న వారును, నానిన

డిప్పలనుండి పీచును దీయుచున్నవారును, తీసిన పీచును త్రాళ్లుగా పేనుచున్నవారును, కొబ్బరి యాకుతో నిండ్లను దడులను గట్టికొనుచున్నవారును, చాపలను బుట్టలను నల్లుకొనుచున్నవారును, చిప్పలలోనుండి కొబ్బరి నెండలో నారవేయుచున్నవారును, నారవేసిన కొబ్బరిని బస్తాల కెత్తుచున్నవారును, బస్తాల కెత్తినదానిని కాటాలో వేసి తూయుచున్నవారును, కొబ్బరితీసిన ఒట్టి చిప్పలను గంపలలో బోసి వంటచెఱుకుగా నుపయోగించుకొనుటకై తీసికొనిపోవుచున్నవారును, కానవైరి. ఇంతలో వర్కలి యను స్టేషను వచ్చెను. జనార్దన మచ్చటికి మూడు మైళ్లున్నది. మే మచ్చట దిగగనే ఎదురు గానున్న కస్టమ్సుఆఫీసులో మాసామానులు పరీక్షించిరి. అచ్చటనే బ్రిటిషునాణెము లిచ్చి తిరువాన్కూరుప్రభుత్వమువారి నాణెములను గొంటిమి. అచ్చట వాడుకలో నెక్కువగాగల నాణెము చక్రము. చక్రము రమారమి మన గేదుపైసలకు సమానమగు నాణెము. అరచక్రము, కాలుచక్రము, కాష్ అను నవి గూడ గలవు. కాష్ అనగా చక్రములో పదునాఱవవంతుగల కడుచిన్ననాణెము. మన అర్థపావలా బేడలను బోలు వెండి నాణెములు గూడ కలవు. కాని చక్రప్రచారమే యెక్కువ. మేము జనార్దన మేగునప్పటికి దాదాపు ఏడుగంటలయ్యెను. అప్పు డొకసత్రములో దిగి వంటచేసి కొనుటకై యొకచక్ర మిచ్చి కొబ్బరిపెంకులను కొని తెచ్చుకొని వంటజేసికొని భుజించితిమి.

మఱునా డుదయమే లేచి ప్రాతఃకృత్యముల నిర్వర్తించుకొని సముద్రస్నానమునకై వెళ్లితిమి. సముద్ర మచ్చటకు సమీపముననే గలదు. పెక్కుచోట్ల సముద్రమును జూచితిమి. స్నానములు చేసితిమి. కాని జనార్దనములో సముద్రమునకుగల భయంకరతరంగము లెచ్చటను గనలేదు. ఆయలలను చూచుటకే భయముగొల్పుచుండ స్నాన మెట్లు చేయగలమని చాలభయము కలిగెను. కాని యెట్లెట్లో మూడు మునకలువైచి యీవలబడితిమి.

సాధారణముగా కొండ లున్నచోట సముద్ర ముండదు. సముద్ర మున్నచోట కొండ లుండవు. కాని జనార్దనములో సముద్రముపక్కనే కొండ యున్నది. కాన ఫేనయుతములైన యుత్తుంగతరంగము లతివేగమున వచ్చి యాకొండకు డీకొని పరాఙ్ముఖములై పోవుచుండెను. సముద్రపుటొడ్డునగల యాకొండనుండి యొకచిన్నజలధార స్రవింపుచుండెను. ఆజలధారకు బ్రహ్మతీర్థ మనిపేరు. సముద్రస్నానము చేసిన తరువాత

ఆజలధారవద్ద స్నానముచేసితిమి. ఆది బ్రహ్మ సత్రయాగము చేసిన ప్రదేశమట. మున్నొకప్పుడు బ్రహ్మ ముక్కోటి దేవతలకు నిరతాన్నదానము సేయుచు సత్రయాగము చేయుచు తన యన్నదానమునకు తానే సాటియనియు మఱియొక డిట్టి సత్రయాగము గావింపజాల రనియు గర్వముతో తలంచెనట. శ్రీమహావిష్ణు వా వృత్తాంత మెఱిగి బాల వటుడై చనుదెంచి యన్నపురాసు లెల్ల ఆహారించి బ్రహ్మచే యన్నము లేదనిపించి యాతనిని వీతగర్వునిగాఁ జేసెనట. ఆబాలవటుడే యచ్చటి జనార్దనస్వామి యని చెప్పుదురు.

జనార్దనస్వామివారి ఆలయ మొకచిన్నగుట్టపై నున్నది. జనార్దనుడు బాలుడు గనే యున్నాడు. ఆస్వామి కాపాదమస్తకము మంచిగంధము లేపనముచేయుదురు. కాన స్వామిదర్శనమున కేగిన వారికి మంచిగంధపుటుండ లిత్తురు. మఱియు నీరు మజ్జిగ తీర్థ మిత్తురు. మేము స్వామిదర్శనమున కేగు నప్పటికి సామిమేన చందన ముంచుచుండిరి. నల్లని స్వామివిగ్రహముపై పచ్చని శ్రీచందనలేపనముచేయుటచే చక్కని యాకృతిగల బాలునివలె స్వామియాకృతి యాకర్షణీయముగా నుండెను. తమిళదేశమున యనల్ప శిల్పకళావిరాజితములగు నున్నతోన్నతగోపురప్రాకారాలయములను గాంచి వచ్చిన మాకు జనార్దనస్వామివారిఆలయమును చూడగనే మహాశ్చర్యమయ్యెను. కేరళదేశపు దేవాలయముల కట్టుబడియే వేరు. జనార్దనాలయము గుండ్రముగ పొట్టిగ నున్నది. ద్రవిడదేశపు దేవాలయములలో నర్చకులైనవారు గర్భగుడి కేగుటే దుస్తరము. పట్ట పగలే కటికచీకటి. కన్నులుండియు నుపయోగపడవు. కునుకుచున్న దీపము లొకటియో రెండోయుండినను నవి యొసగెడు వెలుగువలని యుపయోగముకంటె నీడవలని అపాయ మెక్కువ. గడపలతోడను గట్లతోడను హెచ్చుతగ్గులుగానుండెడి ప్రదేశమును క్రొత్త వారు గుర్తింపలేకపడుచుందురు. కాని జనార్దనస్వామివారి ఆలయము చక్కని విశాల మైన బయలుకు నట్టనడుమనున్నది. స్వామిదర్శనమునకై చీకటిలో త్రొక్కుడులాడ నక్కఱలేదు. ఎంతదూరమునుండియైనను చక్కగా దర్శింపవచ్చును. దేవాలయ కుడ్యము లేమి ప్రాకారకుడ్యములేమి యెట్టిపనితనములేక నునుపుగా పలుకలుతీర్చి యున్నవి. ఆదేశపు దేవాలయములవలెనే యచ్చటి స్త్రీలుగూడ నిరస్తభూషలు. మళయాళస్త్రీలు సాధారణముగా నగలుధరింపరు. రంగు వస్త్రములనుకట్టరు. అయినను విలక్షణమైన ఆకృతియు దీర్ఘములైన శిరోజములును వారికి సహజముగనే లభించి వారిని రూపవతులనుగాజేసినవి. దానికితోడు శుభ్రమైనధవళవస్త్రధారణము వారి సౌందర్యము

నిను పుడింపజేసెనని చెప్పనగును. మళయాళస్త్రీల వస్త్రధారణముగూడ మన కక్క-
జముగనేయుండును. అచ్చటస్త్రీపురుషులొకే విధముగా వస్త్రములధరింతురు. తూర్పు
నకు (గంజాము విశాఖపట్టణ ప్రాంతములకు) పోయినకొలది స్త్రీల కట్టుబట్ట తొమ్మిది
మూరలే. అటునుండి క్రమముగా దక్షిణమునకు వచ్చినకొలది స్త్రీలచీర లొక్కొక్క-
మూరపెరిగి పెరిగి పూర్తిగా దక్షిణమునకు వచ్చునప్పటికి యిరువదిమూరలగును. కాని
కేరళస్త్రీల కట్టుబట్ట పురుషునికట్టుబట్టలవలె నాలుమూరలే. అధోవస్త్రమును వారునడిమికి
మడిచి దాక్షిణాత్యులవలె గూడకట్టుగా కట్టుకొని దానిపైనొక చిన్నతుండుగుడ్డను
వల్లెవాటుగా భుజముపై వేసికొని యొకకొంగును మొలలో దోపుకొందురు. రెవికకు
మాఱుగా నఱచేతులచొక్కా వేసికొందురు. ఈ పైతుండును వారు బయటికి వచ్చు
నప్పుడుమాత్రమే యుపయోగింతురని తోచెడిని. ఊర్ధ్వభాగమును కప్పుటకు వారంతగా
ప్రయత్నింపరు. పైట లేకపోవుట వారికొక యాక్షేపణీయవిషయముగాదు. మేము విడిసిన
సత్రమునకు ప్రక్కగానున్న కోనేరులో దేవకన్యలను బోలిన యువతులు కొందఱుచిన్న
తుండ్లను నడుములకుగట్టుకొని దీర్ఘములైన వినీలశిరోజములను విరియబోసికొని యథేచ్ఛ
ముగా స్నానము సేయుచుండిరి. పైటవేసికొననందులకు వారేమాత్రము బిడియపడుట లేదు.
కాన వారి కావిషయమైయంతగా పట్టుదలలేదని యనుకొంటిమి. తమిళకేరళరాష్ట్రములు
సన్నిహితములైనను తమిళస్త్రీలకును కేరళస్త్రీలకును బహువ్యత్యాసమున్నది. తమిళస్త్రీలు
తెల్లచీరలకట్టరు. మళయాళస్త్రీలు రంగువస్త్రములనుధరింపరు. తమిళస్త్రీలుసాధారణముగా
కొప్పుపెట్టుకొందురు. లేదా జడవేసికొనియెదరు. కేరళకాంతలు చక్కగా సారుముడి
వైచుకొందురు. తమిళస్త్రీల కర్ణాభరణములు బహుబాధాకరమైనవి. మఱియు
నందచందములేని మొఱటుదిమ్మెలు. ఆ దిమ్మెలను వారుగుత్తులుగా జేర్చి చెవులకువ్రేలాడ
వేసికొందురు. ఆనగల భారముచేత వారిచెవితమ్మెలు రబ్బరుత్రాడులవలె నాగిసాగి
భుజములనంటుచుండును. ముందెప్పుడో పసిడిసొమ్ములు పెట్టుకొనుటకై వారు తమ
కొమార్తెలకు పసితనముననే చెవులుకుట్టి కంచుమెట్టెలను సీసపుమెట్టెలను రెండుమూడు
గుదిగ్రుచ్చి చెవులకుతగిలింతురు. ఆ లోహభారముచేత బాలికల లేతతమ్మెలు నాగి
యూగులాడుచుండును. అనాగరకమును నత్యంతబాధాకరమును నైన నాయలంకారము
జూడంజూడ తమిళదేశమున బాలికయైపుట్టుట పాతకహేతువనిపించినది. మళయాళస్త్రీల
కట్టి కర్ణాభరణములులేవు. ఒకానొకరికున్నను సాధారణముగా చిన్నపాటి చెవికమ్మ
మాత్రమే. తమిళస్త్రీలు పొగాకును జేర్చి యధికముగా వక్కాకు నములుచుందురు. కాన

వారి పెదవులును దంతములును నెత్తుని గారగట్టి అసహ్యముగానుండును. మఱియు వారు కూర్చున్నచోటెల్ల నెత్తునియుమ్ములతో నశౌచపఱతురు. కేరళస్త్రీల కట్టి దుర భ్యాసమున్నట్లు కానము. కావున సహజమైన దంతధవళిమయు నధరరక్తిమయు వారి వదనారవిందములకు చెలువుగూర్చుచుండును. వేయేల, తమిళమళయాళస్త్రీల యాకార ములే భిన్నములు. తమిళస్త్రీలు అవయవములు పొందికలేక హెచ్చుతగ్గులుగానుండి అనా కారలుగా గాన్పింతురు. కేరళస్త్రీలు చక్కని యవయవపూర్తి గలిగి విశాలమును ప్రసన్నమును నైన ముఖారవిందములతో నొప్పి రూపవతులుగా గాన్పింతురు. దక్షిణ హిందూదేశమునగల ద్రవిడకర్ణాటాంధ్రకేరళాది దేశపుస్త్రీలలో కెల్ల కేరళస్త్రీలే చక్కనివారనిచెప్పుదురు. వారినిచూచుటతోడనే ఆమాటనిజమని ఋజువయ్యెను.

అన్యప్రసంగములకు బోయి ప్రస్తుతాంశమునకు దూరమైతిమి. సఖి! మేమట్లు జనార్దనస్వామిని సేవించి మాబసకేతెంచి భోజనాదులు గావించుకొని వెంటనే స్టేషనునకువచ్చి అనంతశయనమున కేగు రైలునెక్కితిమి. మనము అనంతశయనమను దానినే అచ్చటివారు తిరువనంతపురమనియు త్రివేంద్రమనియు అందురు. తిరువనంతపురము తిరువాన్కూరు రాజ్యమునకు ముఖ్యపట్టణము. అచ్చటనే సుప్రసిద్ధమైన అనంతపద్మ నాభస్వామివారి ఆలయముగలదు. మేమురైలుదిగి యూరులోనికి వెళ్లిసత్రములో మామూటముల్లెలు పెట్టుకొనివెంటనే స్వామిదర్శనమున కేగితిమి. ఆనాడు మకరసంక్రాంతి. దేవాలయములో గొప్పయుత్సవము. కాన యితరగ్రామములనుండి చాలమంది యాత్రి కులు వచ్చియుండిరి. కాన స్వామిదర్శనము కాదనియేయనుకొంటిని. కాని యచ్చట నొకమేలుగలదు. వచ్చినజనులందఱి నొక్కమాఱుగా నాలయములోనికి విడువరు. స్వామిదర్శనముచేయించుట కాయాలయములో నొకదుబాసియుండెను. ఆయన యేదేశమువారితో నాదేశపు భాషాడి స్వామిదర్శనముచేయించును. ఆదుబాసి సాయము తోనే మేముస్వామిదర్శనముచేసితిమి. అనంతపద్మనాభస్వామి కడుపెద్దసామి. శ్రీరంగ ములోని రంగనాయకులవలె అనంతపద్మనాభస్వామిగూడ శయనించియుండును. కాని రంగశాయికంటె అనంతుడు రెట్టింపుండును. గర్భాలయమునకు తలవద్దనొకటియు, నాభివద్దనొకటియు పాదములవద్దనొకటియు మూడుద్వారములుగలవు. ఈమూడు ద్వా రములలో దర్శించినగాని స్వామివారి సంపూర్ణాకృతి యగుపించదు. పద్మనాభాలయము చాలగొప్పది. కాని మెచ్చదగిన శిల్పకళలేదు. దేవాలయముచుట్టును దీపములుంచుటకు దగిన ప్రమిదలతో కొయ్యలమర్పబడియున్నవి. అవి లక్షదీపములట. ఆఱుమాసముల

కొకమాఱు లక్షదీపములు వెలిగింతురట. దానినే దీపోత్సవమందురు. మేము వెళ్లిననాడు (సంక్రాంతి) దీపోత్సవమే. దానిని చూచుటకే యాత్రికు లధికముగా వచ్చియుండిరి. ఆకాశ దీపమనెడి యెత్తైనదీపమును వెలిగించినవెనుక తక్కినదీపములన్నియు వెలిగింతురట. ఆ సమయమున దేవాలయావరణ మంతయు దేదీప్యమానములగు దీపమాలికలతోనొప్పి యపరనక్షత్రమండలమువలె విరాజిల్లునట. దురదృష్టవశమున నే నా నాడాదీపోత్సవమును చూచుట సంభవింపలేదు. కాని మావాళ్లందఱు చూచివచ్చిరి. ఆ దేవాలయము నందు మఱియొక యెంచదగిన విశేషమేమన ఆ ఆలయమందేగల స్వామివారి యన్నసత్ర ములో నిరతాన్నదానము జరుగుచుండును. ఎన్నిమాఱులు తినినను యెన్నిదినములున్నను నదియేమని యడుగువారు లేరు. కాన పెక్కుమంది బ్రాహ్మణబాలు రాయన్నసత్రములో భుజించిచదువుకొనుచుందురట. అచ్చటవండెడి అన్నమంతయు సామికి నివేదనచేసి ప్రజలకు పెట్టుచుందురు. అయితే ఆభోజనము మనముచేయలేము. చారునీళ్లు, జానుపప్పు, పెసర్తిని అన్నము, నేయి, పూజ్యమైన ఆభోజనమును దాక్షిణాత్యులేగాని మనతెలుగువారు తిన జాలరు. పచ్చడి నేయి లేని భోజన మాంధ్రులకు పస్తుతో తుల్యముగదా!

మఱియొక విశేషమేమన తిరువాన్కూరు రాజ్యమునకు పద్మనాభస్వామివారే ప్రభువు. కావుననే నాణెములపై స్వామిచిహ్నములగు శంఖచక్రములు ముద్రింపబడి యుండును. పద్మనాభస్వామి తిరువాన్కూరు సంస్థానమునకు ప్రభువైన కారణమేమన, ఒకమారు తిరువాన్కూరు రాజ్యము అప్పులపాలయ్యెనట. ఆఋణమునుండి విముక్తి గాంచుటకు ప్రభువువద్ద ధనములేకపోయెను. పద్మనాభస్వామికి చాలసొత్తుగలదు. ఆసొమ్మును వినియోగించుకొనిన సంస్థానము ఋణములనుండి విముక్తినందును. కాని దేవుని సొమ్మును స్వోపయోగమునకు వినియోగించుకొనుట దోషముగదా! కాన మహారాజు తన రాజ్యమును స్వామికి వ్రాసియిచ్చి స్వామిసొమ్ముతో ఋణవిమోచనము గావించుకొనెనట. నాటనుండి అనంతపద్మనాభస్వామి తిరువాన్కూరు రాజ్యప్రభువుగాను రాజాతని ప్రతి నిధిగానుండి పాలకకర్తగా వ్యవహరింపబడుచున్నారట.

మఱునా డాలయములో పూజార్చనాదులు గావించుకొని సాయింత్రము పురము లోని పణ్యస్థలములు వగైరా దర్శించితిమి. తిరువనంతపురము తిరువాన్కూరురాజ్య మునకు ముఖ్యపట్టణమేయైనను నీటికొళాయీలు విద్యుద్దీపములు మొదలైన నాగరికపు లక్షణము లేమియులేవు. గృహములు బారులుతీర్చి యింటిపక్కయిల్లుగానుండక

ఒక్కొక్కయిల్లు పెద్ద పెద్దపోక టెంకాయతోటలనడుమ మేలిముసుంగుచాటు మెలతవలె దృశ్యాదృశ్యముగా నుండును. కాన పట్టణమంత సొగసైనదిగా కనుపించదు. తిరువాన్కూరు రాజ్యములో స్త్రీవిద్య యధికముగా నున్నది. విద్యాంగమంత్రిగా నున్నది గూడ నొకస్త్రీయే యని వింటిమి. ఆడమళయాళమనిన అచ్చట పురుషు లుండరనియు స్త్రీలు పైటవేసికొనరనియు అక్కడ అంతయు స్త్రీయధికారమనియు మనవారు యేదేదో విపరీతముగా జెప్పుకొనెడివారు. అట్టి విపరీత మేదియులేదు. కాని అచ్చట స్త్రీ వారసత్వ మెక్కువ. రాజ్యాధికారములు గూడ కొమార్తెపుత్రునకు వచ్చునే కాని కొమారుని కొమారునకు రావు. వారును రైకలు పైటలు వేసికొనుచున్నారు. కాన విడ్డూరముగా చెప్పుకొనదగిన సంగతులులేవు. ఏవైన విపరీతాచారములు పూర్వమున్నను ఆధునికవిద్యానాగరికత లారాష్ట్రములో గూడ ప్రవేశించెను గాన వారిలో చాలమార్పు గలిగియుండవచ్చును.

మఱునా డుదయమే లేచి కన్యాకుమారికి మోటారుబస్సులో ప్రయాణమైతిమి. మేము కన్యాకుమారికి చేరు నప్పటికి దాదాపుగా ఒంటిగంటయయ్యెను. అచ్చటనున్న చక్కని గవర్నమెంటుసత్రములో దిగి వంటజేసి భోజనాదులు గావించుకొని విశ్రమించితిమి. మేము దిగిన సత్రము సముద్రమున కతిసమీపముగా నుండెను. మేము ప్రయత్నము చేయకనే గదిలో వాకిలిలో దొడ్డిలో వంటయింటిలో యెక్కడనిలిచిన నీలమేఘశ్యామలమై తనరారెడి యపారపారావారము నేత్రానందకరముగా కనుపింపుచుండెను. ఆసాయంత్ర మారుగంటలకు దేవాలయమున కేగితిమి. కన్యక గావున దేవి చిన్న యాకృతిలో చూడముచ్చటగానుండెను. మఱియు బాలికాసహజమైన పరికిణీ (పావడా) చొక్కా వేయబడి మేలైన యలంకారాదులను గలిగి దేవి ఆకర్షణీయగా నుండెను. దేవిని దర్శింప నేగిన వారికి దేవి మేనినుండి తీసిన పసుపును పువ్వులను యిత్తురు. పిల్లలకు మరమరాలు పెట్టుదురు. మఱునాడు ప్రాతఃకాలముననే లేచి సాగరాదితీర్థములలో స్నానము సేయ నేగితిమి. సాగరము దేవాలయము నానుకొనియే యున్నది. ఆలయపు వెనుకనుండి సముద్రములోనికి మెట్లున్నవి. అచ్చట స్నానముచేసితిమి. జనార్దనమునందు కొండ సముద్రపుటొడ్డుననుండ కన్యాకుమారియందు కొండ సముద్రము లోనికే యున్నట్లున్నది. ఆ పెద్దపెద్దకొండరాళ్లకు సాగరతరంగములు రివ్వురివ్వున వచ్చి డీకొని ఫేనయుతమైన నీటితో వానిని మాటిమాటికి మజ్జనముగావించుట కడుమనోహరముగా జూపట్టుచుండెను. ఎటుజూచిన పారములేని పారావారము నడుమ రాకపోకలకు బాట

వేసికొనినట్లు భూభాగపుచీలిక దానియగ్రమున కన్యాకుమారిఆలయము. హిందూదేశపు దక్షిణదిశ ఆఆలయముతో సరి. కన్యాకుమారిఆలయము కడుపురాతనమైనదిగాఁ దోచు చున్నది. బహిర్భాగమంతయు చాలవఱకు శిథిలమై యున్నది. ఆలయపుకట్టుబడి మళ యాళదేశపుసాంప్రదాయముగనే యున్నది. కన్యాకుమారి గ్రామము గూడ చాలచిన్నది. పటాటోపముతోఁ గూడిన నగరరాజములలో నివసించెడువారి కచ్చట నివసించుట నిసా తలమునకు విసరివేయబడినట్లు తలంతురు. సముద్రస్నానము వగైరా చేసినవెనుక దేవీ దర్శనము చేసి వెంటనే బస్సుపై బయలుదేరితిమి. మార్గమధ్యమున కన్యాకుమారికి నాల్గుమైళ్లదూరములో శుచీంద్ర మనెడి మఱియొక పుణ్యక్షేత్రము గలదు. ఆ పూటచ్చట దిగితిమి. శుచీంద్రాలయము బహుగొప్పది. దేవాలయపుకట్టుబడి మధుర రామేశ్వర మాది దేవాలయములవలె ద్రావిడసాంప్రదాయముగా నున్నది. ఉన్నతమైన ప్రాకార గోపురములు వానిపై శిల్పములు గలవు. దారులోహాదికములచే చేయబడిన రంగు రంగుల వాహనములు గూడ గలవు. రంగులతో వేయబడిన బొమ్మలు గోడలపై నేవంకజూచినను డాబుగా గన్పట్టినవి. తిరువాన్కూరురాజ్యములోని ప్రతిఆలయము ప్రత్యేకలక్షణములతో నొకేనిర్మాణపుఫక్కిలో నుండ ఆరాజ్యములోనిదేయగు నీయాల యము ద్రావిడాలయముల పగిది నుండుటేలనో తెలియదు. శుచీంద్రములో స్వామిని దర్శించిన వెనుకనే సత్రములోనికి వచ్చి వంటజేసికొని భుజించితిమి. వెంటనే బయలుదేరి నాగర్‌కోయిల మీదుగా తిరునల్వేలి వెళ్లవలె ననెడి యుద్దేశముతో బస్సుకొఱకు యెదురుజూచుచు సత్రపువాకిట గూర్చుంటిమి. ఇంతలో యెవరో కార్డులుచేత బట్టుకొని సత్రపుటరుగులపై వచ్చి కూర్చుండిరి. అవి అచ్చముగ మనకార్డులవలెనే యుండెను. కాని మనవి మాత్రముకావు. అవి తిరువాన్కూరురాజ్యపుకార్డులు. వానివెల కడు స్వల్పము. చక్రమునకు మూడుకార్డులు. అనగా ఒక్కొక్కదాని వెల యించుమించు రెండు దమ్మిడీలు. ఆకార్డు లారాజ్యమునందు మాత్రమే చలామణీయగును. బ్రిటిషుయిండియాకు వ్రాయవలెనన్నచో మనకార్డులనేయుపయోగించవలెను. స్వతంత్రరాజ్యములోని సౌకర్యము లట్టివి. చూడుము! ఎంతచౌకగా నమ్ముచున్నారో! ఐరోపాసంగ్రామసందర్భమున మన గవర్నమెంటువారికి ధనలోప మేర్పడి కానీకార్డును అర్ధణాచేసినారు. యుద్ధము ముగిసి ఎంత కాలమో అయినది. ప్రభుత్వము పూడుకొనినది. కాని కార్డుధర అట్లేయున్నది. ప్రజా సౌకర్యముకన్న ప్రభుత్వకోశమును నిండించుకొనుటయే యుత్కృష్టముగా దలంచెడి ప్రభుత్వములో ప్రజల కింతకంటె సౌకర్య మెట్లు గలుగును? ఇందువలన పేదజను

లనుభవించుచున్న కష్ట మనంతము. అయితే ప్రభుత్వమువా రది గుర్తించుటలేదు. ఈ సందర్భమున నొక చిన్న స్వానుభవము జ్ఞాపకమునకు వచ్చుచున్నది. పూర్వము మా యింట్లో ఒక పనిమనిషి యుండెడిది. ఆమనిషి నన్నొక ఉత్తరము వ్రాసిపెట్టుమని యొక తెల్లకాగితమును తెచ్చి నాకిచ్చెను. కవరేదీ అని నేనంటిని. "కవరక్కర్లేదు. కవరు మీద వ్రాస్తే మా ఉత్తరాలు చేరవు. బంట్రోతులు పారేస్తారు. నటుపేటుత్తరమైతే చేరుద్ది" అనినది. అణాకు రెండణాలు యిచ్చుకోవలసి వస్తుందిగా అన్నాను. "అవును ఆళ్లకు మేమేశినా మా కాళ్లేశినా మా ఉత్తరాలు యింతే. రెండణాలు ఇచ్చుకుండాదే. పూరబం మాపిల్లగాడు పుట్టకమునుపు అణాయిచ్చి ఉత్తరం తీసుకోనేవాళ్లం. ఇప్పుడు బేడ యిచ్చి తీసుకుంటున్నాము" అనినది. ఉత్తరము వ్రాసి యిచ్చితిని. రెండుమూడుదినములకు చిరునామాదారుడు ఊళ్లో లేడని ఆఉత్తరము తిరిగివచ్చెను. నటొపేటుత్తరమైనందులకు రెండణాలు అది మరల తిరిగివచ్చినందుల కొకఅణా మూడుఅణాలు వసూలు చేసినాడు పోస్టుజవాను. ఆడబ్బులు దగ్గరలేక చెంబు తాకట్టుపెట్టి మూడుఅణాలు యిచ్చినానని ఆదాసీది నాతో చెప్పి మొత్తుకొనెను. పోస్టలు రేట్లు పెరిగినందువలన పాపము పేదజను లెంత గోడుపడుచున్నారని నాకు మహావిచారము గలిగెను. శ్రీమంతులకు లక్ష్యములేకపోవచ్చును. కాని దినమునకు నాలుగణాలు కూలి తెచ్చుకొని జీవించెడు పేదసంసారములో రెండణాలు ఉత్తరమునకు చెల్లింపవలె నన్నచో నెంతకష్టమో చెప్పవలెనా? పోస్టలు రేట్లవలన వచ్చెడి అధికాదాయములో చాలభాగ మీకష్టజీవులకు చెందినదే. తక్కిన తపాలా రేట్లెట్లున్నను సర్వజనోపయోగకరమగు కార్డు కవరుల ధర లెప్పటిరేట్లకు మార్చుట ప్రజాహితము గోరెడి ప్రభుత్వమువారి కనీసధర్మము. కాని యీ వత్సరము గూడ ప్రభుత్వమువారు తపాలారేట్లను తగ్గించుటకు నిరాకరించిరిగదా. కల్పలతా! యాత్రావిషయములు దెల్పుటలో తపాలారేట్ల గొడవయేమిటని నవ్వుచుంటివా? ప్రస్తావనవశమున వచ్చెను గాని ప్రస్తుతాంశ మది గాదని యెఱుగకపోలేదు. మే మంకట మోటారుబండి నెక్కి నాగరుకోయిలకు వచ్చి అచ్చటినుండి వేఱొకబస్సుమీద తిరునల్వేలికి వెళ్లితిమి. అప్పటికి దాదాపు రాత్రి పదిన్నరగంట లయ్యెను. ఇన్నివందలమైళ్లు రైలుప్రయాణము గావించితిమి. కాని త్రివేంద్రమునుండి కన్యాకుమారికి అచటినుండి తిరునల్వేలివఱకు చేసిన కొద్దిపాటి మోటారుబస్సుప్రయాణములో మేముపడిన శ్రమలో వీసమైన రైలుప్రయాణమువలన పొందలేదని దృఢముగా జెప్పవచ్చును. ఆ మోటారుకారు డ్రైవరులయు కండక్టరులయు దురాశలును దుస్తంత్రములును దౌర్జన్యములును నగౌరవ

క్రియలును జన్మమున్నంతవఱకు మఱువరానివి. మొదటచెప్పెడులెక్క బల్లకు అయిదు గురు ఆఱుగురు అని. పురబాహ్యమునకు పోగనే ఆ అయిదుగురిలెక్క పదుగురుగా మాఱును. వీరు డబ్బిచ్చి శ్రమపడెడి దురదృష్టపు ప్రయాణికులు ఇఁక పోలీసువారున్నారు. వారు బస్సుఅధికారులకు గురుదేవులు. వారు ఎక్కడ ఏసమయములో ఎంతయిరుకులో ఎక్కెదమనినను చప్పున బస్సుఆపి యెక్కించుకొనవలసినదే. ఇక మోటరుబండ్లవారి కేమిభయము? పోలీసువారి కొక్కరికి విధేయతజూపి తమవారినిగా జేసికొనినచో ఇఁక నొకరియెడ అవిధేయతజూపినను భయములేదుగదా!

తిరునల్వేలి తామ్రపర్ణీతీరము. ఆనదీస్నానార్థమే మేమచ్చట కేగితిమి. అచ్చటి సత్రము అసహ్యముగానున్నది. ఎట్లెట్లో ముక్కుమూసికొని ఆరాత్రి అచ్చట నిలిచితిమి. తెల్లవారి తామ్రపర్ణిలో స్నానముచేసి వచ్చి భోజనాదులుగావించుకొంటిమి. అనంతర మొకజట్కాబండి కుదుర్చుకొని ఊరిలోని దేవాలయములను విపణివీధులను చూడనేగి తిమి. తిరునల్వేలిలోని శివాలయము చాలగొప్పదే. కాని అచ్చటి శిల్పములు మాత్రము చూడదగినవికావు. ఇన్ని ప్రసిద్ధదేవాలయములను గాంచితిమి కాని ఆతిరునల్వేలిపట్టణము లోని దేవాలయములోగల యవినీతికరమగు బొమ్మలు మాత్రము మఱెచ్చటను లేవు. ఆసాయంత్రమే బయలుదేరి మధురకు వెళ్లితిమి. అచట నొకదినముండి యటనుండి శ్రీరంగక్షేత్రమున కేగితిమి. తిరుచినాపల్లినుండియే మాకు వైష్ణవులు తరుచుగా గనుపింప జొచ్చిరి. ఇఁక శ్రీరంగమున కేగ నెచటజూచినవారే. రంగనిఆలయము సప్తప్రాకార విరాజితమే గాని యింపుసొంపులేదు. శిల్పము గూడ స్వల్పమే.

శ్రీరంగము సుప్రసిద్ధక్షేత్రమే గాని అచ్చట మేలైన సత్రమేలేదు. దాని కొక కారణము గూడ గలదు. ఆపురమునగల వైష్ణవతిరుమాళిగ (ఇండ్లు) లలో చాలవఱకు సత్రతుల్యములే. యాత్రికుల నీయేజంట్లు మద్రాసులోనే పట్టుకొందురు. మాబసలలోదిగిన సకల సౌకర్యములను గలిగింతుమని నమ్మబల్కి తీసికొనిపోవుదురు. కాని చాతుర్వర్ణ ములవారిని అసంఖ్యాకముగా తమగృహములలో నిలుపుకొనుటచేత నిజముగా యేజంట్ల యిండ్లలో సౌకర్యముగానుండుట గూడ కష్టమే. మఱియు నాయేజంట్లను తృప్తిపఱచుట గూడ సామాన్యవిషయముగాదు. మొదట యాత్రికులను పిలుచుకొనిపోవునప్పుడు తృణము మహామేరువుగా గ్రహింతుమని చెప్పుదురు. కాని వారిబసలో దిగినవెనుక మహా మేరువునొసంగినను తృణీకరించి ఇంకను గావలెనని పీడింతురు. యాత్రల కేగెడివారు

యిట్టియేజంట్ల చేతిలోబడుట నిజముగా నొకవిధమైన పారతంత్ర్య మేర్పఱచుకొనుటయని చెప్పనొప్పును. ధార్మికచింతచే గాక వారికి సొమ్మునుట్టునిమిత్తము దానధర్మాదులు యాత్రికులు చేయవలసియుండును. దానధర్మాదులు చేయుటకు యిష్టములేక పోయినను, శక్తిలేకపోయినను వారువిడువరు. మగవారికే యేజంట్లచే నీపాట్లు తప్పవు. ఇక ఒంటరిగా వచ్చిన స్త్రీల స్థితి యెట్లుండునో వేఱెచెప్పనేల? సఖీ! ఇదియొక శ్రీరంగపుసమాచారము గాదు. నేజూచిన యాత్రాస్థలము లందంతటను యేజంట్లవద్ద యిట్టి ప్రజాపీడయే గోచరించినది. శ్రీరంగములో బసచేయుటకు వసతియైన సత్రములేక మేము చాలశ్రమపడితిమి. ఇది యీక్షేత్రమునకు గొప్పకొఱతయనియు, స్వతంత్రముగా యాత్రజేసికొన తలంచెడువారికి గొప్పయిబ్బందియనియు చెప్పకతప్పదు. మేము శ్రీరంగములో మూడు పూటలు మాత్రమే యుంటిమి. రెండుమాఱులు శ్రీరంగశాయిని దర్శించితిమి. పూజార్చనాదులు గావించితిమి. తిరుమణి తిరుచూర్ణములు గొంటిమి. ఆదేవుని ఆలయమందే దేవునిప్రసాదము అరిసె జంతిక మున్నగుభక్ష్యములు పెరుగన్నము పులిహోర పొంగలి మున్నగుఅన్నపుముద్దలను వైష్ణవస్వాములు విక్రయింపుచుండిరి. అదియైన యేబుట్టలోనో తట్టలోనో బెట్టుకొనికాదు. నలుగురును నడిచెడి వట్టిరాతిబండలమీద వేసికొని యమ్ముచుండిరి. దైవసంబంధముగా నది యెంత పూజ్యతనమైనప్రసాదమైనను పారిశుద్ధ్య విషయముగా జూచితిమేని అదియెంతమాత్రము పరిగ్రహింపదగినదికాదు.

శ్రీరంగమునందు కావేరి రెండుపాయలుగా చీలి రంగనిఆలయమును చుట్టి పాఱుచున్నది. తల్లి బాహువులమధ్య నొదిగి నిలిచిన తనయునివలె ఆయుభయకావేరీమధ్య నున్నాడు రంగశాయి. అచ్చటికి సమీపముననే జంబుకేశ్వరమను పుణ్యక్షేత్రముగలదు. సాయంత్రపువేళ నచ్చటి కేగి స్వామినిదర్శించితిమి. ఆస్వామిపేరు కూడ జంబుకేశ్వరుడే. ఆయనదేవేరి అఖిలాండేశ్వరి జంబుకేశ్వరాలయము గూడ చాలగొప్పదే గాని బహిర్భాగమంతయు శిథిలమగుటచే మరలకట్టుచున్నారు.

శ్రీరంగమునుండి తిరుచునాపల్లి వెళ్లి యచ్చట కొండమీదగల మాతృభూతేశ్వరుని దర్శింపనెంచితిమి. కాని కారణాంతరములచే నచ్చటి కేగుట సంభవింపలేదు. కాన చెన్నపురి వచ్చితిమి. ఒకపెట్టె నెక్కించుటకైన సుకరముగాని యిరుకుదారులతో ప్రయాణికులకు మహాశ్రమయనిపించెడి దక్షిణయిండియారైలు కంపెనీవారి రైలుపెట్టెలబాధ తప్పెను. ఇంతటితో మాదక్షిణదేశపుయాత్ర ముగిసెనని చెప్పవచ్చును. కాని యీయాత్రా

చరిత్రమును ముగింపనున్న సమయమున చెన్నపురిలో మేము బసచేసిన గృహమును గూర్చి గూడ తెలుపకున్నచో సమగ్ర మనిపించుకొనజాలదు. మేము వెళ్లినప్పుడును వచ్చునప్పుడును గూడ మద్రాసులో గృహలక్ష్మీపత్రికాధిపతుల యింటనే బసచేసితిమి. విశేషపరిచయముగలవారము కాకపోయినను వారి గృహమున మాకు గల్గిన ఆదర సత్కారము లపూర్వములు. మేమేగాదు వారిపరిచయభాగ్యముగల వారెల్లరు వారిచే నిట్లె యాదరింపబడుదురని వింటిమి. కాన వారి గృహమున కితరములైన నాగరికపు నామధేయము లిచ్చుటకంటె ఉత్తమమైన "అతిథిమందిరము" అని చెప్పుట సమంజస ముగా నుండును. కల్పలతా! సెలవు.''

మిత్రురాలు.
శారద.

# జగదంబాస్తుతి.

బాలకవి. నేమాని వాసుదేవమూర్తిగారు.

సీ॥ శ్రీకిరచిద్రూప సింహాసనంబున
ముసిముసినగవుల మొల్కలొలుక,
వలకేలశ్రీరామ పట్టాభిషేకంబు
వక్షస్థలంబున వన్నెలీన,
యోగదీక్షారక్తి నోంకారపదశక్తిఁ
గనుశంకరునిజూపు గొనలవనుప,
త్రిపథస్థితులనాత్మ తెలగెలింగెడుతన్మ
యులహృదబ్జంబున నూగులాడ,
తే॥ గీ॥ నిండుఁగొలువుండి జగము లుద్దండలీల
మొలువఁజెలువొంద డిందఁగ మూలకంద
మైన జగదంబ, లలితవిద్యాకదంబ,
మన్మనోవీధి బాయక మనుచుఁగాత.

# తెల్లని ఉప్పు

డాక్టరు కే. యస్. కేసరిగారు

ఉప్పు మానవుని భోజనపదార్థములలో ముఖ్యమైనది. పదార్థములు రుచికరము లగుటకు జనులు ఉప్పును యథారీతిని వాడవలసియున్నది. కాని దానివిలువను మనవారు గ్రహించినట్లు కనుపించదు. ధరలు ఎంతహెచ్చినను మనవారు నెయ్యి మొదలగు భోజన పదార్థములను తప్పక వాడుదురు. కానిమిక్కిలి చౌకయైన ఉప్పుధరలో తలవెంట్రుక వాసియైన హెచ్చుదలయున్నచో మనవారు దానివాడుకను తగ్గించుటకు ప్రయత్నింతురు. ఇది మిక్కిలి గర్హ్యమైన పని.

ఉప్పు విషయములో మనవారు మఱియొకసంగతిని గమనింపవలయును. మన దేశమున సముద్రజలమును భూమిపైకి పాఱించి నిలువచేసెదరు. ఎండవేడిమికి ఆజలము క్రమముగా ఉప్పుగామారును. ఇట్లు తయారుకాబడిన ఉప్పులో మన్నుకలసియుండుటకు అవకాశమెక్కువ. కావుననే అంగళ్లయందు విక్రయింపబడు ఉప్పు మన్నుతోకలసి చాల నల్లగనుండును. ఇందుకుతోడు మనవర్తకులు దీనియందు ఉప్పురంగుగల చిన్నరాళ్లను కలిపి విక్రయించుచున్నారు. అంగడినుంచి తెచ్చినదానిని తెచ్చినట్లే మనస్త్రీలు పచనకార్యములందు వాడుచున్నారు. ఇందువలన మనఆరోగ్యము చెడుటకు మార్గమేర్పడు చున్నది. ఉప్పుతో కలసియున్నమట్టిని మనము భుజించుచుండుటచే మూత్రసంబంధమైన జబ్బులును, అజీర్ణసంబంధమైన రోగములును గలుగుచున్నవి. ఉప్పులో కలుపబడినరాళ్లు తినువారి దంతములక్రిందబడి ఆదంతములకు ప్రమాదములను కల్గించుచున్నవి.

ఈకష్టములు లేకుండ చేసికొనవలయునన్న మనము ఉప్పును జాగ్రత్తగ శుభ్రము చేయవలయును శుభ్రముచేసిన ఉప్పును 'టేబిలుసాల్టు' అని పట్టణములందు విక్రయించు చున్నారు. దాని ధరకొంచ మధికమగుటచే సామాన్యసంసారులు దానిని వాడకున్నారు. మఱియు నిదిమిక్కిలి తెల్లగానుండుకారణమున ఛాందసులగువారు కొందఱు దీనిని 'జాతి

వాడిఉప్పు' ముట్టరాదని పలుకుచున్నారు. పట్టణములందుండు గొప్పసంసారులు దీనిని ఉపయోగించుచున్నను పల్లెలయందుఉన్న వారికి ఈ టేబిలుసాల్టుదొరకుట ప్రయాసముకాలక మగుచున్నది. అగుటచే టేబిలుసాల్టు మంచిఆరోగ్యప్రదమును, పరిశుభ్రమును అయినదే యైనను మనలో విశేషవ్యాప్తి గాంచకున్నది. టేబిలుసాల్టునందుండు మంచిగుణములు కలిగి అంతకంటె తక్కువధరకు లభించుఉప్పు ప్రస్తుతపరిస్థితులలో అత్యంతావశ్యక మగు చున్నది. కావున బజారుఉప్పునందలి దుర్గుణములను పోగొట్టి దానిని తెల్లగా, శుచిగా చేయగల పద్ధతిని దిగువను తెల్పుచున్నాను. విశేషజ్ఞానము, ప్రయాస అక్కఱలేకయే మనస్త్రీలు చేయదగినప్రక్రియ కావున మనవారు దీనిని ఆచరణలోబెట్టి తగినలాభమును పొందుదురుగాక యనికోరుచున్నాను.

అంగడినుండి తెచ్చిన ఉప్పు ఒకభాగము పాత్రయందుంచి అందు నాలుగు భాగములు వేడినీటిని పోయవలయును. ఉప్పంతయు నీటిలోకరగిపోవువఱకు కొయ్యతో కలియబెట్టి పిమ్మట అందు ఒకచామగడ్డను నలియగొట్టి వేయవలయును. ఒక అరగంట కాలమునకుపిమ్మట చూచినచో ఆ ఉప్పునందలి రాళ్లు మన్ను నీటికంటె బరువైన పదార్థములు కావున పాత్రయొక్క అడుగుభాగమునకుపోవును. అప్పుడు ఆ ఉప్పునీటి తేటను మఱియొక పాత్రలోనికి గుడ్డతో వడియకట్టవలయును. అట్లు వడియకట్టిన ఉప్పునీటిని పొయిమీదబెట్టినీరుయిగురువఱకు మంటబెట్టినచో అడుగున తెల్లనిచక్కెరవలె స్వచ్ఛమైనఉప్పు పేరుకొనును. పాత్రలోనిఉప్పు గట్టిపడునప్పుడు ఒకకొయ్యతో ఉప్పును అటు నిటు కదుపుచుండవలెను. ఉప్పు పొడిపొడిగా నగువఱకు పాత్రను పొయిమీదనుంచవలయును. ఇట్లు తయారుకాబడిన ఉప్పు పరిశుద్ధమై యుండును. భోజనపదార్థములలో వాడుకొనుటకు ఈ పరిశుద్ధమైన ఉప్పు మేలితరమును, ఆరోగ్యవంతమును అయినది.

* పైనవివరింపబడిన రీతిని తెల్లనిఉప్పును తయారుచేసి నమూనాకు కొంచము మాకార్యస్థానమునకు బంపుచో వారియందు అతిస్వచ్ఛమైన ఉప్పుపంపిన వారిని తగినట్లుగౌరవింతుము.

# ప్రాచీనభారతస్త్రీ.

శ్రీమతి వెలువోలు వసంతాదేవిగారు.

గీ|| కత్తిచేఁబూని ఘోరసంగ్రామభూమి
శౌర్య మవతార మొందిన చందమునను
గర్వవైరులఁ జెండి స్వర్గమున కనిపి
విజయలక్ష్మిని వరియించి వెలసి తోకట.

గీ|| వెనుకముం దరయని యెదబిగువుతోడ
"భగ్గుభగ్గున" మండెడు పండుచితిని
దూకె నిర్భయదగ్ధవై ధూళియగుచు
నీదు సాహసముంజూపి నెగడి తోకట.

గీ|| ఉదయగిరి భానుఁ డుదయింపకుండఁ జేసి;
యమునికడనుండి భర్త్రప్రాణములు తెచ్చి;
ధరఁ ద్రిమూర్తుల శక్తి బాలురను జేసి;
విమలపతిభక్తి ప్రకటించి వెలిగి తోకట.

గీ|| చతురుదధిమధ్య సంస్థితసర్వవసుధ
ముదముతోడఁ దంత్రావాపముల్ వెలార్చి
లీలఁ బాలించి ప్రజల లాలించి మించి
నవ్యపరిపాలనపథాల నడచి తోకట.

గీ|| భవ్యబహుముఖమైన నీ ప్రథితదీప్తి
నుంత ప్రసరించి మము నుద్ధరింతు వనుచు
రక్తబాంధవ్యదివ్యకారణము కల్మి
ప్రియమువడుదుము సాక్షాత్కరింపు దేవి!

# ప్రసిద్ధస్త్రీత్రయము

నిడమర్తి సత్యనారాయణమూర్తిగారు, బి. ఏ. (సారస్వతసమాజము)

పురుషుడు స్త్రీని అబలయని వాడినాడు. అట్లు వాడినపుడు అతడు స్త్రీ పురుషునకు లోజ్జుగా భావించినాడు. దేహబలమున ఆమె అబల కావచ్చును. అది కూడ కాదనుటకు మహిషాసురమర్దని, రుద్రమదేవి, ఝాన్సీమహారాణి, జోన్ ఆఫ్ ఆర్కు (Joan of Arc,) తారాబాయి మొదలగు వీరవనిత లున్నారు. ఇట్టి వాదమని కొందరు వాదింతురేమో? వాదింపనిండు. ధీవిశేషమున మాత్రము స్త్రీ పురుషున కేవిధమునను తీసిపోదు. క్రొత్తవిషయములను కనుగొనుటలోను స్త్రీ పురుషునకు సమానమే. అంతియకాదు. పురుషుని హృదయకాఠిన్యము యుద్ధములకును నితాంతదుఃఖములకును కారణమగుచుండ స్త్రీయొక్క మాతృభావము దుఃఖనివారణమును శాంతిస్థాపనకరమును అగుచున్నది. ఇట్టి వీరవనితలలో మువ్వురి జీవితములనుగూర్చి యిట తెలుపదలంచితిని. వీ రెల్లరును పాశ్చాత్యవనితలు. మరొకసారి ఇట్టి భారతరమణీమణులనుగూర్చి వ్రాయగలను.

## హెర్తా అయర్టన్:

ఈమె ఇంగ్లాండులోని పోర్టుసీ అను స్థలమున జననమందెను. ఈమె తలిదండ్రులు యూధులు. పదునారువత్సరముల ప్రాయముననే ఈమె పితృవిహీనయై ఉదరపోషణార్థము ఉపాధ్యాయినీవృత్తి నవలంబించెను. కాని యామె నిరాశవహింపక పనిచేసి 'గర్టను' కళాశాలలో జేరి చదివి గణితమునందు మంచిపేరు సంపాదించెను. అక్కడ ఉన్నపుడే హృదయస్పందనమును గుర్తించు ఒక యంత్రము నిర్మించెను. అనంతరము ఋజురేఖను ఎన్నిభాగములుగా వలయునన్న అన్నిభాగములుగా జేయు ఒకవిభాగినిని కూడ ఆమె నిర్మించెను. దీనితో నామెకీర్తి విస్తరించెను. 1884 వ సంవత్సరమున ఆమె ఫిన్సుబరీలోని లండను టెక్నికలుకాలేజీలో జేరి పనిచేయదొడగెను. అక్కడ శాస్త్రాధ్యాపకుడుగానున్న ఎడ్వర్డుస్యూజెంటుఅయర్టనుతో నీమెకు పరిచయముకుదిరెను. తదనంతరము వారు వివాహమాడిరి. ఎడ్వర్డు విఖ్యాతుడగు శాస్త్రవేత్త. హెర్తా అతనికి శాస్త్రపరిశోధనమున

చేదోడు వాదోడుగా పనిచేసి తీగలేనితంతివార్త విషయములోను, 'సైకతతరంగముల' (Sand ripples) విషయములోను, ఎలక్ట్రిక్ ఆర్కు విషయములోను చాలసహాయము చేసెను. ఆమె క్రొత్తగాకనుగొనిన విషయములకును, నిర్మించిన సూత్రములకును రాయలుసొసైటీవారు చాలపొగడి బహూకరించియున్నారు. ఈమె నామము సెర్చిలైట్సు (Search Lights) నిర్మాణమున స్థిరస్థాయిగ నిలచిపోయినది.

## మేరీ క్యూరీ:

1867 నవంబరు 7 వ తేదీ యీామె జననదినము. వార్సా యీామె జన్మస్థాన మగుటచే నీమె పరాసువనిత. తండ్రిఅధ్యాపకుడు. చిన్నతనమునుండియు శ్రద్ధగలిగి చదివి ప్రశంసాపాత్రముగ జయమందుచువచ్చి 'సర్బోను' శాస్త్రాలయమున ఉపాధ్యాయినిగా 'పియరీక్యూరీ' యను శాస్త్రజ్ఞుని చేతిక్రింద పనిచేసెను. ఆసమయమున వారిరువురకును ప్రేమకుదురుటయు, వివాహమగుటయు తటస్థించెను.

వారు చాలనిరుపేదస్థితి యందుండిరి. రాబడి బహుస్వల్పము. అయినను పరిశోధనాకౌతూహలముతో వారికష్టములను స్మరింపక పనిచేసి 'రేడియము' అను వస్తువును కనుగొనిరి. ఇది చీకటిలో తళతళలాడును. మిక్కిలి శక్తిమంతము. సర్వరోగనివారిణి. ఇట్టి యద్భుతవస్తువు వారికి ఒక వడ్లగింజంతమాత్రము లభించెను. అది దురదృష్టవశమున క్రిందపడి చితికిపోయెను. అట్టియాపదకు ఆశోపహతులై యూరకుందురు. కాని మేరీ ధైర్యమువహించి గదియందలి మట్టినంతను ప్రోవుచేసి దానియందలి ప్రతిరేణువును పరీక్షించి తనరేడియమును తిరిగిసంపాదించెను. భర్త చనిపోయిన తరువాత కూడ నీమె యోపికతో పరిశోధనలనుచేసి పొలోనియమును రేడియమును విడదీసి చూపి లోకమునకు మహోపకారమును గావించెను.

## ఫ్లారెన్సు నైటింగేలు:

దయకు నిలయమగు నైటింగేలు 1820 మే 15-వ తేదీని జన్మించెను. చిన్నతనమున నుండియు నామె రోగుల కుపచారము చేయుటయందు ఆసక్తి గలది. ఆమె విద్య కూడ దాని కనుగుణముగ నుండెను. తెలివితేటలలో అద్వితీయురాలు. నర్సింగుపనిలో నీమె నిధి.

1854 వ సంవత్సరమున రష్యాతో ఇంగ్లాండునకు జరిగినయుద్ధమున క్షతశరీరులకు సాయముచేయుట కీమె యొప్పుకొని పనిచేసెను. ఈమె చేసిన యేర్పాటులవలన అంతకుపూర్వము నూటికినలుబదిమంది రోగులు చనిపోవుచుండ నీమె సంరక్షణలో ఇరువురుమాత్రము చనిపోయిరి. ఆసమయమున నీమె చూపిన ఓపిక, యోర్మి, దయ, బుద్ధికౌశలమును అద్వితీయములు. దినమునకు ఇరువదిగంటలకు మించి పనిచేసెను. ఆమె చేసినసేవకు అచటగలరోగులు ఆమె నీడను సైతము ముద్దిడుకొనజొచ్చిరి. ఆస్పత్రులలో ఆచారమందున్న నర్సింగుపద్ధతికి మూలము ఫ్లారెన్సునైటింగేలే. 1908లో లండనునగరపు స్వేచ్ఛయును (Freedom of the City of London) అంతకొకసంవత్సరముకుపూర్వమే (Order of Merit) అను అసామాన్యమైన బిరుదము నామె పొంది తొంబదితొమ్మిది యేండ్ల కాలమున మరణించెను.

ఇట్టి యుత్తమవనితల చరిత్రము లెన్నియేని గలవు. వారందరును స్త్రీలు అబలలు కాక సబలలే యని ఋజువుచేయుచున్నారు. ఈవిషయమును తెలుగుకాంతలు గ్రహించి విజ్ఞానోపార్జనమొనర్చి, పట్టుదలయును సద్వర్తనమును గలిగి పనిచేసి పడియున్న దేశ గౌరవమును పునరుద్ధరింపగోరెదను.

# సత్యము

చిత్తారు గంగాధరకవి.

సత్యసంధుఁడు హరిశ్చంద్రుండు తొల్లి
సత్యంబుఁ దప్పక సన్మునికొఱకు
నాలిబిడ్డల నమ్మి యంత్యజుఁ గొలిచి
మాలఁడై వెనువెంట మధుమాంసములను
కావళ్ల మోయంగఁ గరుణించి యంత
కావఁడా వారల గౌరీశ్వరుండు ?
నీమాట బొంకక నిర్వహించినను
సోమేశ్వరుఁడు దయఁ జూడంగఁ గలఁడు.

# స్త్రీలు—నాటకరంగ ప్రవేశము.

శ్రీమతి ధర్మవరము లక్ష్మీదేవిగారు

నాటక మననేమి, దానియందు స్త్రీపాత్రమును స్త్రీలు ధరింపవచ్చునా? లేక పురుషుడే స్త్రీపాత్రధరించినమేలా, లేక స్త్రీలే దీనికి అర్హులా, పురుషులు ఉండుటవలని లాభముహెచ్చా, స్త్రీలు లేనిచో నష్టమువిశేషమా, అనునది చర్చింపతగిన గొప్పసమస్య. ఇట్టి సమస్యను విడదీయుటకు చాలామంది విచారశీలురు ప్రయత్నము చేయుచున్నారు. ఇటువంటి విచారింపతగిన గొప్పసందేహమునకు నాదొక చిన్న అభిప్రాయమేమన :

ఇంపైనకావ్య మెట్లు జీవనమునకుసారమో అదేరీతిగా నాటకము మానవజీవితము యొక్క ప్రతిబింబము. అట్లయిన ప్రపంచమందు స్త్రీపురుషులు బాలబాలికలు ఈప్రతిబింబమందు చిత్రింపబడియే యుండవలెను. బింబ మెట్లున్న ప్రతిబింబ మట్లే యుండును. బింబ మందుగల లోపములను తెలియుటకు ప్రతిబింబ మవశ్యకము. మనము మంచిగాయెంచి చేసినచెడుగును, చెడుగుగా తెలియువలయునన్న దానినే పరులు చేసిన యెడల బహుశీఘ్రముగా తెలియగలము. కనుక ప్రతిబింబ మత్యవశ్యకము.

అదియుగాక మానవజీవితమం దంతటను, స్త్రీలు సుగంధమువ్యాపింపజేయు పుష్పమువలె నున్నారు. పుష్పములేని వృక్షరాజ మెట్లురాణింపదో, మానవుల జీవితము అంతే. నారీమణులులేని నాటకరంగము గృహిణులులేని గృహమువలె అరణ్యమై చూపట్టును.

---

ప్రతి వత్సరమును డాక్టరు. కే. యన్. కేసరిగారు నెల్లూరు ప్రొగ్రెసివు యూనియను తరపున జరుపబడుచుండు ఆంధ్రవ్యాసరచన పోటిపరీక్షలకొక బంగరు పతక మొసంగుచుండుట వాడుక. ఈ వత్సరము శ్రీమతి పులవర్తి. కమలావతిదేవిగారికిని, శ్రీమతి ధర్మవరము లక్ష్మీదేవిగారికిని చెరియొక పతకమును యిచ్చిరి. ఉభయుల వ్యాసములును బహుమానార్హములని పరీక్షాధికారులు నిర్ణయించిరి.



శ్రీమతి ధర్మవరము. లక్ష్మీదేవిగారు

వ్యాసకర్త్రి

నాటకమందు విశేషమైనఅభిరుచికలిగి గొప్పవిద్యావంతులని పిలువబడు ఆంగ్లే యులు కూడ మొదలుమొదలు రూపవంతులగు పురుషులచే స్త్రీపాత్రను ధరింపజేయు చుండిరి. ఇప్పుడు వారే స్త్రీపాత్రను పురుషులు ధరించుట చాలాహాస్యాస్పదముగా తలంతురు. ఏలయన, వారలు కాలము ననుసరించి ఇది తగునా తగదా యనువిచార మును పెంచిరి. సమస్తప్రపంచమందంతటను నాటకములు ప్రాకృతభాషయందున్న పూర్వకాలపునాటకములయందు, స్త్రీపాత్రము స్త్రీలే ధరించినట్లు యెన్నియో ఆధార ములుగలవు. ఆకాలమందు స్త్రీలు అంత నిర్భీతిగా రంగస్థలములం దాడుటకు కొంత కారణములుండవచ్చును.

(1) భరతశాస్త్రమందు ఉన్నతవిద్యనుబడసి సొగసైన దేహసౌందర్యము గల వారలై, మరియు ఇతర విద్యలయం దెన్నిటియందో పాండిత్యముకల్గి, ఇప్పటి అధోగతి పాలైన మనసమాజమునుండి "వేశ్యాస్త్రీలు" అనిపిలువబడు ఇప్పటి నాటకములలో ఆకాలపు అభినయకారిణులై యుందురు.

ఆకాలమందు అంతటి విద్యా, స్వాతంత్రజీవనము గలవారు, యిప్పుడు విద్యయను పేరుకూడ మరచి దాసులై వారాంగనలని పిలువబడుటకు కారణ మేమన, స్త్రీపురుషుల సమాన విద్యా స్వాతంత్ర్యమునకు సెలవొసంగి, కేవలము దేహవాసనలకు లోబడిన పురుషులయొక్క స్వార్థమే దీనికి మూలము. స్వార్థపరులు తలచినంతనే స్త్రీలు లోబడి ఆనందమయమైన ఉపదేశస్థానమగు రంగస్థలమునకు రాజీనామాయిచ్చిరి.

ఉదారహృదయులకు అల్పుల కోర్కెతీర్చుటయన సర్వసాధారణము. స్త్రీలు దయాస్థానమైన తమవిశాలమనస్సుచే వీరికిగాను లొంగినది యెట్లున్నదన భైరవుడు భస్మాసురునకు వరమిచ్చి నట్లున్నది. అదియుగాక, భగవద్గీతయందు పరమాత్ము డనిపిం చుకొనుటకు నోచుకొన్న కృష్ణుడే 'నన్నేవిధముగ పూజించిన యేవిధముగ తలంచిన ఆయారూపముగ వారల కోర్కెతీర్తు'నని నుడివి యుండ ఇక స్త్రీలెంత? ఇంతకు కారణము కళంకరహితమైన వీరి దయయే.

ఇటువంటి నారీమణులను వారివిద్యను విద్యయందుగల అభిమానమును, ధ్వంసము గావించి వారలను యంత్రములుగా మార్చినది అధోగతిపాలైన మనసమాజమే.

ఈస్వార్థపరులైన పురుషులవల్ల కీడుచెందిన సమాజమును ఉద్ధరించుటకు యెందరో మహనీయులు అవతరించి యెన్నియో శ్రమలకోర్చి ప్రయత్నించిరిగాని, యావత్తైలం-తావత్ వ్యాఖ్యానం- అను ఆర్యోక్తిననుసరించి వారి బోధను వారు ఇహలోకమును

వదలినతోడనే ఉదారహృదయులై వారుచెప్పినది మనకేల యని వారిది వారికే అర్పించి కట్టువిప్పిన కుక్కతోకవలె యున్నారు.

(2) లేక నాటకరంగము ఇప్పటివలె సమాజబాహ్యా మనుపించుకొనక గౌరవముచే నిండినటులును పైనవివరింపబడిన సతీమణులును జనులయొక్క ఆదరణకును మర్యాదకును అలంకారప్రాయులై యుండవచ్చును. అదియుగాక స్త్రీని నిరాకరించి స్త్రీపాత్రను పురుషుడు ధరించుటకు కారణము లివిమైయుండును. పైనవివరింపబడిన సతీమణులు ఇప్పుడు లభింపకయుండవచ్చును. లేక ఇప్పటి సమాజమునుంచి సరియైన శిక్షణలేక అకస్మాత్తుగా అందముగా అవతరించిన యువకులు ద్రవ్యాశకులోంగి నాటకరంగమందు దిగుచుండవలయును. లేక రంగమందు స్త్రీని స్పర్శించుటవలన ప్రేక్షకులమనస్సులు వికారము చెందునని వదలియుండవచ్చును.

అట్లయిన భావములేని నటన బాగుండదను విషయము యెల్లరకు విశదమేకదా! పురుషుడు స్త్రీపాత్ర ధరించిన సంపూర్ణభావ మెట్లుచూపగలడు? సహజమైన భావము ప్రకటించవలెనన్న సహజమైనస్వరూపము కూడ తోడ్పాటుగావలెను. సహజమాధుర్యమైన సతీమణుల భావమును నడవడికను ఊహచే నటించిన 'తా దాసరిగాకున్నపడేసి పంగనామాలుపెడితేఅవునా' అన్నట్లుండును. కొంతవరకు ఊహించిచెప్పిన చెప్పవచ్చును గాని చేయుటకష్టము. ఊహవేరు, సహజమువేరు.

రంగస్థలమందు స్త్రీపాత్రవహించిన నటునితో, వేరొక నటుడు సహ్యముకాని సల్లాపములు సలుపునపుడు నాటకనుందు తన్మయులై చూచుప్రేక్షకులు స్త్రీపాత్రవహించినది పురుషుడని తలంతురా! తలంపరు. నాటకము ముగింపబడిన తరువాత బుద్ధిచేవిచారించిన తెలియగలరే కాని భావమందు స్త్రీపాత్రను ధరించినవానిని స్త్రీ అనియే తలంతురు. స్వప్నమందు అనుభవించిన భీతినిగాని ఆనందముగాని జాగ్రతయందు బుద్ధిచే మిథ్యగా తలంతురే కాని, అనుభవమందు సత్యముగానే భావింతురు. స్వప్నమందు భావముపై చిత్రింపబడినదానిని నిజమనిభావించినట్లు నాటకము చూచువారలు స్వప్నమందున్నట్లే తన్మయులై భావోన్మత్తులై యుందురు. నాటకము ముగిసినతోడనే, స్వప్నమునుండి మేల్కొనినట్లగును. కనుక భావమే ప్రధానము. బుద్ధి తరువాత.

స్త్రీలే స్త్రీపాత్రను ధరించిన బహిరంగనాట్యరంగమందు ఇట్టి సహ్యముకాని సల్లాపములు జరుగుట అసంభవము. దీనివలన భావముచెడదు. బుద్ధి వికసించును.

అదియుగాక స్త్రీపాత్రను పురుషుడు ధరించుట వలనకలుగుచున్న అపాయములను కొంచెము యోచింపవలయును. మరియు స్త్రీపాత్రను స్త్రీలే ధరించునట్లుండిన ద్వంద్వార్థములగు సహ్యాముకాని పదములను వ్రాయుటకు గ్రంథకర్తకు సాధ్యమా? కాదు. కనుక స్త్రీలే రంగమందున్నయెడల యెన్నియో సత్స్వభావముల కాలవాలమై రంగస్థలము రాణించును.

అదియుగాక అన్నిటనువదలి రంగస్థలమందు మాత్రము స్త్రీనిషేధమెందుకు? ఒకే ప్రదేశమందెచ్చటను స్త్రీపురుషుల కలయిక లేదందమా, ఇరువురి కలయిక లేని కార్యమే లేదు. ఇచ్చట నిషేధము ఇచ్చటలేదు అనుటకు వీలు లేనేలేదు. తీర్థయాత్రలందు, తిరునాళ్లయందు, వీధులందు, దేవస్థానములందు, లెక్చర్లయందు, వివాహములందు, పాఠశాలలందు, కాలేజిలందు, రైలుప్రయాణములందు, కడకు గృహములందు కూడ వీరికలయిక లేనిది కార్యములేదు. రైలుప్రయాణములందు స్థలసంకోచమువల్ల అపరిచితులైన స్త్రీపురుషులు ఒకరికొకరు అంటుకొని గంటలకొలది కూర్చొని యుందురు. అన్నిస్థలములందు ఇట్టి సమయసందర్భము లెన్నియో కలుగును. ఇట్టి విచిత్రప్రమేయములచే ప్రపంచము నిండియుండ రంగస్థలమందు మాత్రము నాటీమణులనిరాకరణ మెందులకు? ఇరువురి యొక్క కలయిక ముఖ్యమా ఉద్దేశము ముఖ్యమా! ఎల్లరిసమ్మతివలన సన్మానము పొందునది ఉద్దేశమేగాని, కలయికకాదు.

పాఠశాలలందు కాలేజిలందు కలియుట విద్యయొక్క ఉద్దేశము. దేవస్థానములకు కలసివెళ్లుట దైవమందుగలడనియు, పాపములు పోవుననియు, దీని ఉద్దేశము. దేవుడు లేనిస్థలము జేనెడైనను లేదనుమాట నోట; గుడియందు తప్ప వేరొకచోట లేడను దృఢమైనభావన లోపల.

ఎన్నియో లెక్చర్లయందు కలయుచున్నారు. ఇదియొకగొప్పఉద్దేశమే. ఏమన ప్రపంచము దినదినము యెట్లుమారుట మనదేశము దినదినమెట్లు పరదేశము పాదముపట్టుట విచారశీలురై కాలానుసారముగా నడచుకొను మహనీయులగు గాంధి, దాసు, తిలక్, ఇటు వంటివారు ఈదాస్యమును విడుదలచేయుటకై పడినపాట్లు ఇంకను యెన్నియో గొప్పవిషయములను తెలియువలెననుఆశచే పోవుచున్నారు. వీటియందుగల ఘనమైనగమ్యామేమో బాగున్నది. ఉద్దేశమందు ఉర్రూతలూగుచున్నారేకాని, కార్యమందుమాత్రము కాళ్లు జారవిడుచుచున్నారు. స్త్రీలు నాట్యరంగమందు వచ్చుటకు, ఇట్టి ఘనమైన ఉద్దేశమునే యేలకలిగియుండరాదు? అన్నిఉద్దేశములందును ఈక్రొత్తఉద్దేశమును సరిపోల్చిచూచిన, అన్నిటివలె ఇదియు సహజముగా జనసమ్మతముగానే యున్నది.

రంగస్థలమునకు స్త్రీలు రావచ్చుననను నూతనాభిప్రాయమును కార్యరూపముగా ప్రారంభించునప్పుడు కొన్ని ఆటంకములు కలుగవచ్చును. కార్యమందుగల పట్టుదల ధృఢపడవలెనన్న ఆటంకములు కల్గిననేగాని లేకున్న విచారము హెచ్చదు. విచారము సన్నమైన వివేకము శూన్యమగును.

అడ్డులేక సరళముగా పారుచున్న ప్రవాహముయొక్క వేగమెంతగలదో తెలియుటకు అడ్డుగట్టిననే గాని తెలియదు. ఊరకవిడిచిన పోవుట గొప్పగాదు. తనకుకలిగిన ఆటంకమును లక్ష్యమందుంచకపోవుటయే శక్తిగలదానిలక్షణము. వ్యక్తియొక్క కార్యబలమును అంతే. అటంకమును నిర్లక్ష్యముగాచూచి తనకార్యము కొనసాగించుటయే ధైర్యము, సాహసమును.

విశ్వామిత్రుడు క్షత్రియుడైయుండియు బ్రహ్మర్షి యనిపించుకొనవలెనను ఉద్దేశముచే ఘోరమైన తపస్సు చేయునప్పు డెన్నియో అటంకములుకల్గెను. వాని వలన నిరుత్సాహపరుడై పట్టుదలవదలెనా? మరియు విశేషమైన పట్టుదలగలవాడై తన ఉద్దేశముయొక్క గమ్యమునుచేరెను. ఇట్టి పట్టుదల కలుగవలెననిన మనసునందు దృఢ సంకల్ప ముండవలెను. రంగస్థలములందు రమణీమణులు రావలయునన్న విశ్వామిత్రునకు గల పట్టుదల గావలయును. అదియుగాక అన్నిస్థలములందువలె నాటకమందుకూడ స్త్రీలు సమభాగినులై యుండియేతీరవలెను. అంతటనునిండియున్న నారీమణులను ఇందు మాత్రమేల నిరాకరించుట ? అన్నిటను అగ్రస్థానమొందినస్త్రీలు ఇందు మాత్రము అనర్హులగుటకు కారణమేమి? స్త్రీలు ఉచ్చస్థానమందుండుటకు తగరనిన జగత్తుకంతటికి పూజ్యులగు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులు, ఒకరు వాక్స్థానమందు, ఒకరు హృదయమందు, ఒకరు శిరస్సునందు, స్త్రీనిధరించు కొనియున్నారు. చతుర్వర్ణములకును స్త్రీప్రాధాన్యము, పూజ్యురాలు. బ్రాహ్మణులకు గాయత్రి, క్షత్రియులకు జయలక్ష్మి, వైశ్యులకు ధనలక్ష్మి, శూద్రులకు భూదేవి, శక్తియే జీవనాధారము. రంగస్థలము మాత్రము వీరులేనిదే యెట్లు రాణించును? ప్రతిమంత్రమునకు శక్తిలేని బీజాక్షరమే లేదు. శక్తిలేని మంత్రమందు మహాత్మ్యమే లేదు. స్త్రీలేని స్థానమందు స్ఫూర్తిలేదు. స్త్రీలేని గృహమందు శాంతిలేదు. తల్లిలేని పిల్లలకు తృప్తిలేదు. స్త్రీలేని నాటకరంగము ఉప్పువేయని పప్పువలె నుండును.

దేవస్థానములు పాఠశాలలు వీటియందుగల స్త్రీపురుషులకలయిక ఘనమైన ఉద్దేశముగల ఉపాయము. రంగస్థలములందు స్త్రీని నిరాకరించి పురుషుడు స్త్రీపాత్ర ధరించుట ఉద్దేశములేని అపాయము.

# జనాబాయి

శ్రీమతి బులుసు లక్ష్మీనరసమ్మ గారు

పాండురంగక్షేత్రమునకు సమీపమున ఒకగ్రామములో ఒక బ్రాహ్మణగృహస్థు గలడు. ఆతఁడు సంతానములేక పాండురంగనిగూర్చి అనేక వ్రతములు చేయగా నాపరాత్పరుని అనుగ్రహమున ఒక సుపుత్త్రికారత్నము జనించెను. ఆమెకు తలిదండ్రులు జనాబాయియను నామమునుంచిరి. ఆమె దినదినప్రవర్ధమానయై ఐదేండ్లప్రాయము నలంకరించెను. నాటగోలె విద్యాభ్యాసము నారంభించి యచిరకాలములో ననేకవిద్యా రహస్యములు సేకరించి విదుషీమణినా బఱగెను. ఆమెకు ప్రాయముతోఁబాటు దైవభక్తి నానాఁటికి యధికమగుచుండెను. ఐహికసుఖములయందు చిన్ననాటనుండియు నామె కసహ్యముగానుండెను. తనమనమును పాండురంగనియందు లగ్నముచేసి ప్రపంచమునే మరచియుండును. ఆటలు పాటలు మాటలు కథలు పురాణములు మొదలగు నెవ్వియ యినను భగవద్విషయకములనె గాని యితరములను కలలోనైన దలంపదు.

కార్తిక శు. ౧౧ నాడు పండరిపురమున పాండురంగని దేవాలయములో ప్రతివత్సర మందును గొప్పజాతరజరుగుచుండును. దానిని జూచుటకై కోట్లకొలది భక్తులుపోవు చుందురు. ఆయుత్సవము సమీపించుటచే జనాబాయి తలిదండ్రులు ఆయుత్సవము చూచుతలంపుతో పుత్త్రికను దోడ్కొని పాండురంగక్షేత్రము నచిరకాలములో సమీ పించిరి. ఆదివ్యక్షేత్రమున నెచ్చటజూచినను భక్తులే. ఏవైపు తిలకించినను భజనలే. ఏదిక్కు బరికించినను హరికథలే. ఇట్లు భక్తిరసాధిదేవత మూర్తీభవించి తాండవమాడు చున్నట్లుండెను.

ఆగ్రామమున నామదేవుడను పరమభాగవతోత్తము డొకడుండెడువాడు. అతడెప్పు డును శిష్యవర్గమును గూర్చుకొని పాండురంగని దేవాలయములో హరిభజనలుచేయుచు తనకాలమును వినియోగము జేయుచుండెడివాడు.

ఆనాడే యేకాదశి మహోత్సవమగుటచే జనాబాయి తలిదండ్రులతోకలిసి నుపవా సాదులను గావించి పాండురంగని దర్శించెను. నాడురాత్రివరకు నాదేవాలయముననే

యుండి కొంతసేపటికి నామదేవుని భజనను తిలకించెను. అంత భక్తాగ్రేసరురాలగునా జనాబాయి శరీరము పులకించి భక్తిపరవశయై నాభజనలో కలసిపోయెను. తలిదండ్రులను మరచెను. తలిదండ్రులామెను పిలిచిపిలిచి విఫలమనోరథులై యెట్టకేలకు నింటికి పోయిరి. జనాబాయి ఆభక్తులతో కలసి తెల్లవారువరకు భజనచేసెను. అంత నామదేవుడు నీమె భక్తి విశేషములకు మెచ్చుకొని యామెను తనగృహమునకు తీసికొనిపోయి యీమెవృత్తాంతము గుణాబాయియను తనభార్యతో చెప్పియామెకు నప్పగించెను. గుణాబాయి రెండవకలహాకంటియని చెప్పుటకు సందియములేదు. జనాబాయి నొక దాసిగా భావించి తగనిపనులు చేయించుచు ననేక యిక్కట్లు పెట్టుచుండెను. జనాబాయి కెట్టి పనిచెప్పినను విసుగులేదు. కొట్టుచుండినను లక్ష్యములేదు. ఆమెకుభక్తియే ప్రధానము. ఆమె నియమించిన పనిపాట్లను జక్కబెట్టుకొనుచు భగవంతుని నెప్పుడును స్తుతించుచుండును. గుణాబాయి యీమెకెప్పుడును నెంగిలికూడునే యాహారముగానిచ్చుచుండును. జనాబాయి ఆకూడునే భగవంతునికి నివేదనచేసి సగము ధర్మముచేయుచు మిగిలినది భుజించుచుండును.

ఒకనాడు గుణాబాయి నాలుగుకుంచములబియ్యమును పిండిచేసియిమ్మని జనాబాయికిచ్చెను. పాపమామె చేయగలదా? తవ్వెడుకావు. మానెడుకావు. నాలుగుకుంచములు. అయినను అంగీకరింపక తప్పినదికాదు. ఆరాత్రి బియ్యమును విసరుటకు నారంభించెను. కొంతసేపటికామెను నిద్రాదేవత యావేశించెను. బియ్యమట్లేయుండెను. అప్పుడుపాండురంగడు 'తెల్లవారులోపల పిండిచేయకున్న నాభక్తురాలికి నపాయమువాటిల్లనున్నది. ఆమెనన్ను ధ్యానించి నిద్రించినది' అని స్త్రీరూపముధరించి జనాబాయి గదిలో ప్రవేశించి యా నాలుగుకుంచముల బియ్యమును పిండిచేసి జనాబాయిని లేపెను. నిజరూపమునున్న పాండురంగని దరిశించి అనేక విధముల స్తోత్రములు చేసినది జనాబాయి. అంతలో భగవంతు డంతర్ధానమయ్యెను. ఆమె యాతని గుణములను గీర్తించుచు మరల నిద్రించెను. అంతలో ఎలుకలు దీపపు ప్రమిదెను త్రోసివేసెను. ఆదీపాగ్ని జనాబాయి చీరపైబడి జ్వాలలిల్లంతయు వ్యాపింపదొడంగెను. అప్పుడింటివారు గోలుమని వీధిలోనికి పరువసాగిరి. ఏమిచేయగలరు? అగ్నిహోత్రుని ప్రభావమును గనులార దిలకించుచుండిరి. మహాభక్తురాలగు జనాబాయి కెట్టియాపద రాకుండ భగవంతుడు కాపాడెను. భగవద్భక్తుల కాపదలు వాటిల్లునా? గృహమంతయు పరశురామ ప్రీతియయ్యెను. ఇందుకు జనాబాయియే కారణమని గుణాబాయి తలంచుచు ఆమెను శిక్షింప నూహించెను.

అప్పుడు భగవంతుడు 'నాభక్తురాలిపై నింద పడినది' అనిచింతించి తెల్లవారులోపున గృహమంతయు నెప్పటియట్లునిర్మించి శుభ్రపరచి యథాస్థానము నలంకరించెను. పురజనులందరు జనాబాయి భక్తివిశేషము వేనోళ్లపొగడిరి.

ఒకనాటిరేయి పాండురంగడు జనాబాయిని చూడవచ్చి ఆమెతోగలిసి యెంగిలికూడు నారగించి మణిహారము నచ్చటనె మరచిపోయెను. తెల్లవారుసరికి నర్చకులు మణిహారమును గానక ధర్మకర్తతో జెప్పిరి. వాడును బురమంతయు శోధించి జనాబాయి గదిలో మణిహారమును గాంచెను. జనాబాయిని చెరసాలలోనుంచి యాసంగతి రాజునకు విన్నవించిరి. దేవద్రవ్యము హరించిన దోషమునకు నామెకు రాజు శూలారోపణశిక్ష విధించెను. అప్పుడామెను వధ్యస్థానమునకు దీసికొనిపోయిరి. ఆమెకు భగవంతుని స్మరణ తప్పనేమియును తెలియదు. పాండురంగని అనేకవిధముల కీర్తించుచు శూలారోపణశిక్షకు సంసిద్ధయయ్యెను. అప్పుడు ఛండాలు డామెను శూలమున నుంచెను అంత భగవంతుడు శూలమున నావిర్భవించి నామెను శిరమున నిడికొని జనులందరును ఆశ్చర్యము నొందుచు జనాబాయిని శ్లాఘించుచుండగా తనలో లీనముచేసికొని యంతర్థానము నొందెను.

ఇట్టి పరమభాగవతోత్తమురాలి చరితము సమస్తజనులకు జిరస్మరణీయము గదా? పరమేశ్వరుడు భక్తులకు దాసానుదాసుడై యుండుననుటకీ యుత్తమురాలిచరితమే నిదర్శనము.

# పతిభక్తి

"శతావధానులు" రామకృష్ణ సీతారామ సోదరకవులు

(శంకరోపదేశము)

చ॥ పతిచరణాబ్జ భక్తిగలభామకుగొంగుపసిండి ముక్తి; యా
సతికి మనోరథంబు సురసాలము; సంపద కామధేను; వ
ప్రతిహతభోగ భాగ్యములుబాయనిచుట్టము; లిన్నియేల ? పా
ర్వతి ! జగమందునంబడయరానిది సాధ్వికి లేదుచూడఁగన్.

ఉ॥ పాటలగంధి ! బ్రాహ్మణసపర్యనొనర్చెడుకాంతగాని; తీ
ర్థాటనసేయఁగాఁజనెడుమంగనగాని; మురారిపూజ ము
మ్మాటును సల్పఁగా దొడఁగుమానినిగాని; సతీమతల్లి కా
ల్గోటికి సాటిగారు పదికోట్లులజన్మము లెత్తివచ్చినన్.

# జపాను స్త్రీలు

పాశ్చాత్య సాంప్రదాయము లలవఱచుకొని శీఘ్రగమనమున అభివృద్ధిలోనికి వచ్చిన ప్రాచ్యదేశములలో జపానుదేశము మొలుత పేర్కొనదగినది. జపానుదేశము ప్రకృతి చిత్రములకుగని. రాజ్య విస్తీర్ణము 260,738 చతురపుమైళ్లు. 1920-వ సంవత్సరమున గైకొనబడిన జనాభాలెక్కల ప్రకారము జపానుదేశపు జనసంఖ్య 55,961,140.

ఆదేశమున మైదానములు తక్కువ. కొండలు, లోయలు మెండుకొని యున్నవి. అవి దట్టమైన అడవులతో కూడియుండును. అగ్నిపర్వతములు జాస్తి. భూకంపములు తఱుచు కలుగుచుండును. వాగులు విస్తారము. అందు మిక్కిలి నిడివిగలైనది నాలుగువందల మైళ్లుపొడవు. చక్కని సరస్సులు చాలగలవు. సముద్రతీరభూమిచుట్టు కొలత సుమారు 18,000 మైళ్లు. విస్తారముగా జనులు బౌద్ధమతావలంబులు. ఆదేశమున ప్రాథమికవిద్య నిర్బంధము. పబ్లికు ఎలిమెంటరీ పాఠశాలలు 25,000 గలవు. అందుపనిచేయు ఉపాధ్యాయులు, ఉపాధ్యాయినులు కలసి 173,000 మంది ఉందురు.

రమణీయప్రకృతికి వేలముపట్టగు ప్రదేశములందు నివసించువారుగాన జపానీయులు సహజముగా కళారహస్యములను గ్రహింపగల శక్తిమంతులు.

అచ్చటి పంటలలో వరిపంట ముఖ్యమైనది. పరిశ్రామిక వృత్తులతో బాటు వ్యవసాయముగూడ నచ్చటి వారికి ముఖ్యవృత్తియైయున్నది. వ్యవసాయమునకు పిమ్మట ఎన్నదగిన వృత్తి చేపలవేట. ఇరువదిలక్షల జనము ఈ వృత్తిపై నాధారపడియున్నారు. జపాను ద్వీపము చుట్టును ప్రపంచమున మఱి యెచ్చటను లేని చేపలుగలవు. జపానుదేశమున సేద్యభూమిలో మూడింట రెండువంతులు వరిసాగుచేయబడుచున్నది. అచ్చట పండింపబడువరులలో 4000 రకములుగలవట. విశేషముగా వరిసాగుచేయు దేశములలో జపాను మూడవస్థాన మాక్రమించుచున్నది. కాని అందలి వరిరకములు నికార్సు అయినవై మొదటిరకమునకు జెందినవై యున్నవి. వరి తరువాత తేయాకుపంట ఎన్నదగినది. పసిఫికు సముద్రమట్టమునకు 12,400 అడుగుల ఎత్తునగల ఫ్యూజియామా పర్వతముపై మంచి

తేయాకు సాగుచేయబడుచున్నది. తేయాకు పంటతరువాత ఎన్నదగినది పట్టుపరిశ్రమ. మన దేశమునందువలెనే ఊడ్పులకు, కోతలకు స్త్రీ జనమే విస్తారము పనియగుదురు. జపాను స్త్రీలు పట్టుపురుగులను పెంచుటలో మంచి నైపుణ్యమును జాగ్రత్తను చూపుదురు. తేయాకు సంగ్రహించుటలోను డబ్బాలకెత్తుటలోను జపానుస్త్రీలు మిక్కిలి మెలకువతో శ్రమించి యజమానుల మెప్పులందుదురు.



జపాను స్త్రీల వనవిహారము.

రంగురంగుల బట్టల కట్టుకొని వివిధ వర్ణపుష్ప ములతో శోభించు పాదపముల ననుకరించుచు జపానుస్త్రీలు ఉత్సాహముతో వనవిహారము సల్పుదురు. రసార్ద్ర హృదయులగు కవులకు ఉత్తేజము పుట్టించు దృశ్యమది.

జపానుస్త్రీలు చక్కని ఆకృతిగలవారు. వారిముఖములు వికాసవంతములును, విలాస యుతములునునై యుండును. నేత్రములు పిప్పర మెంటుబిళ్లలవలె గుండ్రముగనుండును. దేహము పసపుచాయగా నుండును.

వారికి చేమంతి పూవులయందు ప్రేమ అధికము. చేమంతులలో 5000 వివిధజాతులను జపానీయులు సాకుచున్నారు. చెర్రీపూవులు గంపలు గంపలుగ వికసించియుండు ఏప్రియలు మాసమున జపానుస్త్రీలు వనవిహారము సల్పు టకు ప్రియముపడుదురు.

అతిథిపూజయనిన జపానుస్త్రీకి అధికమగు ప్రీతి. ఇప్పుడచ్చటి స్త్రీలు ఇంగ్లీషు స్త్రీలవలె దుస్తులను ధరించెదరు. కాని కొంచము వ్యత్యాసము మాత్ర మున్నది. అచ్చట ప్రారంభవిద్య నిర్బంధము గావున స్త్రీలందఱును చదువను వ్రాయను నేర్చియుందురు. అక్షరజ్ఞానములేని స్త్రీలు నూటికి అయిదుగురు ఉందురేమో? అంగవైకల్యము, మతి భ్రమణము, ముసలితనము అడ్డుతగిలిన స్త్రీలు మాత్రమే విద్యాహీనలై యుందురు. స్వభాషాజ్ఞానముతో సంతృప్తినొందక ఇప్పుడచ్చటి స్త్రీలు ఆంగ్లభాషాభ్యాసనమునకు దొర కొనుచున్నారు.

ఫ్రాంసుదేశమునుండి క్రిమినలు శిక్షాస్మృతిని; జర్మనీ దేశమునుండి పదాతిసైన్య నిర్మాణపద్ధతిని; ఆంగ్లావనినుండి నావికానైపుణ్యమును; అమెరికా సంయుక్తరాష్ట్రముల నుండి విద్యావిధానమును గ్రహించి దీక్షతో అనుసరించి జపానీయు లిప్పుడు ప్రపంచ మందలి వివిధదేశములలో సభ్యస్థానము నందియున్నారు. తమ దేశము నిట్టి యున్నత స్థానమునకు గొనిపోవుటలో పురుషులకు జపానుస్త్రీలు అనంతమగు సాహాయ్యముచేసి యున్నారు.

జపానుస్త్రీలు పరస్పర గౌరవమును చూపుకొనుచు పరులయెడ దయ, మర్యాద కలిగియుందురు. కాఫీ, టీ గృహములలో వారు అచ్చటికి వచ్చువారి యెడజూపు గౌరవము వర్ణనాతీతమై యుండును.

జపానీయులు చాలచురుకైనవారు. మిక్కిలి బలవంతులు. మనుజులు రిక్షాలను బండ్లను వారు జిన్‌రిక్షాలందురు. జిన్‌రిక్షాబండ్లు జపానుదేశమున అతివిస్తారము. ఆబండ్లను లాగు జపానీయుడు గంటకు 6,7 మైళ్లచొప్పున విశ్రాంతి కోరకనే 8 గంటల కాలము ఎడతెగక ఈడ్వగలడు. అది వారిబలమునకు మంచిగుర్తు. అట్టి బలసంపదగల జాతియందు పుట్టిన స్త్రీలుకూడ సహజముగ బలవంతులును చుఱుకుదనముగలవారును అయి ఉండుటలో నాశ్చర్యములేదు. వయసు మీరినను జపానుస్త్రీలు ఎల్లవేళల సంతోషమును, ఉత్సాహమును కనబఱతురు.

జపానుస్త్రీలు భారతపురుషులవలె దినమునకు రెండుమూడుసారులు స్నానము చేయుదురు. నగ్నులుగానుండి జలక్రీడ చేయుటవారి జాతీయాచారము. స్త్రీలును, పురుషులును, కలసియే భారతీయులకువలెనే నదులలోను, సరస్సులలోను స్నానము చేయుదురు. జపానుస్త్రీలు తఱచుతలంటుకొని ఒడలు పట్టించుకొందురు.

జపానువారి యిండ్లు అతి విచిత్రముగ నుండును. కొయ్య, కాగితము, అట్ట మొదలగు వస్తువులతో కట్టబడి అవి ఆదేశమున తఱచు సంభవించు భూకంపములను నెదుర్కొనగలిగియుండును. ఇల్లంతయు ఒక్క పెద్దహాలుగా నుండును. గదులుగావలసినచో అట్టలతో నిర్మింతురు. అవసరములేనిచో ఆ అట్టలను తీసివేయుదురు. ఇండ్లు బహిరంగముగా నుండును. చాటుమాటులేదు. వీధిలో బోవువానికి ఇంటియందు ఏమిజరుగుచున్నది సులభముగ తెలియును. ఘోషా ఏమాత్రమును జపానుదేశమున లేదు.

జపానుస్త్రీల శుచిత్వము కొనియాడతగినది. చెత్త చెదారములను ఇంటిలోనుంచుట యనిన వారికి తలనొప్పి. వారు తమయిండ్లను అద్దమువలె అతిశుచిగా నుంచుకొందురు. చెప్పులు బయటవదలి మఱి లోపల అడుగుపెట్టవలెను. జోడుతో లోపలికివచ్చుట అశుచిత్వమునకు మూలమగుటచే వారు తప్పుగాభావింతురు. జపానువారు మనకువలె అన్నమును చేతులతో కలుపుకొని భుజింపరు. చెమిచాల నుపయోగింతురు. నిద్రించుటకు వారికి పరుపులతో పట్టెమంచములతో పనిలేదు. చిన్నచాప తలగడ ఉండినచో సరిపోవును.



జపాను స్త్రీ బుద్ధుని కొల్చుట

తలవంచుకొని, చేతులు జోడించుకొని భక్తిభావముగల జపాను స్త్రీ అవతారమూర్తియగు బుద్ధుని మ్రోలనిలిచి అన్యచింతలు మాని అతనిని ధ్యానించుచున్నది. ఆమె హృదయమున ఇప్పుడు ప్రాపంచిక చింతలేమియు లేవు. ఈశ్వరసాయుజ్యముపై చిత్తము, భావము కేంద్రీకరించియున్నది.

ఆ దేశమున కాగితముయొక్క ఉపయోగము విస్తారము. స్త్రీలు కాగితముతో లాంతర్లు, గోడలు, పరదాలు, గొడుగులు మొదలగు వస్తువులను చిత్రవిచిత్రముగ, అతి సుందరముగ మంచి పనితనముతో చేయుదురు. ఉన్నత కుటుంబములలోని భారతస్త్రీలకు బద్ధకము బరువు. వంటపెట్టు అయినతరువాత వారు కూటికి గుడ్డకు పనికిరాని కబుర్లతో కాలక్షేపము చేయుదురు. జపానుస్త్రీలు అట్లుకాదు. వారు ఒక్కనిమిషమును వృథాగా పోనీయరు. ఎల్ల వేళల ఏదోయొక పనిచేయుచునే యుందురు. కృషీవలుల కుటుంబములలో స్త్రీలే యింటిపని, బజారుపని, ఆదాయవ్యయములను సరిజూచుట మొదలగు పనులన్నియు జేయుట ఆదేశమున దృఢముగ నెలకొన్న ఆచారము.

జపాను స్త్రీలలో "ఎయిను" జాతికిచెందినవారు మిక్కిలి మోటుగ అనాగరికులుగ అందవికారముగనుందురు. పేదతనము వారి అందవికారమునకు తోడై వారిని పీడించుచు వారిని సభ్యలోకమునకు దూరముచేయుచున్నది. ఎయినుస్త్రీలు దరిద్రులగుటచే జీవితము కొఱకు విశేషముగ కష్టపడవలసినవారగుచున్నారు. ఇనుముతో చేసినవంట

పాత్రలు, కొయ్యతో చేసిన మఱికొన్ని పాత్రలు, కొయ్యరోలు, రోకళ్లు యివివారి యింటియందుండు పరికరములు. వారివి పూరిండ్లు. బొరుగ్రాళ్లతో కట్టబడిన గడ్డి దుబ్బులు గోడలకు బదులుగా నిలువున దగ్గిఱదగ్గిఱగా పేర్చబడును. వీరి అభిప్రాయమున ఒక్కొక్కకొండనంటి ఒక్కొక్క దేవత ఆవేశించియుండును. కావున ఎయినుజాతి జపానీయులు కొండకొండకు దేవతినామము పేర్కొని పరమభక్తితో కొలుతురు. ఈ జాతిస్త్రీలు మగడు చనిపోయిన పిమ్మట జుట్టుతీసివేసికొందురు. విధవ యగుస్త్రీ దీర్ఘములగు శిరోజము లుంచుకొనరాదని వారి సాంప్రదాయము. పరపురుషునితో మాట్లాడునపుడు స్త్రీలు తమ వదనగహ్వరమునకు చేతినిఅడ్డముగా బెట్టుకొని మాట్లాడెదరు. శరీరమంతయు అందుముఖ్యముగా ముఖమునకు పచ్చబొట్టు పొడిపించుకొను ఆచారము వీరియందు ప్రబలముగానున్నది. ఈ దురాచారమిప్పుడిప్పుడు శాస్త్రముచే నిషిద్ధమైన దగుటచే క్రమముగా తగ్గిపోవుచున్నది.

జపానుస్త్రీలు తమశిరోజములను అతి శ్రద్ధగా బెంచుకొందురు. దిన దినము వానిని దువ్వి పాయలు పాయలుగా విడదీసి అవి దగ్గఱగా అంటుకొని రేగకుండుటకు గాను జిగురువంటి పదార్థమును బూసి విచిత్రమైన ముడులువేసి దానిపై అలంకారముగా విలువగల సూదులను గ్రుచ్చికొని విచిత్రాకారముగల దువ్వెనలను ధరింతురు.

జపాను స్త్రీలయందు కొన్ని దురాచారములు కూడ లేకపోలేదు. తేయాకు పానమున వారు మితినిపాటింపకున్నారు. తేయాకు పానీయము లభ్యముగానిచో వారు సేకు అనబడు నొకవిధమైన బియ్యమునుండి తయారుచేయబడు సారాయిని త్రాగెదరు. స్త్రీలు సయితము చుట్టలు కాల్చెదరు. కనుబొమలు గొరిగించుకొందురు. పండ్లకు కప్పువేయుదురు. ఇట్టి దురాచారములను వదలివేసి వారినుండి మనము గ్రహింపవలసిన విశేషములనే గైకొనుట మంచిది.

పాలు, వెన్న అనిన జపానుస్త్రీలకు అతిప్రీతి. పిల్లలను కనిపెంచుట యందును వారిని సుశిక్షతో సాకి దేశాభిమానులుగ జేయుటయందును జపాను స్త్రీలు అద్వితీయలుగా నున్నారు. వారు మన స్త్రీలవలె పిల్లలను చంకలో నిడుకొనక వీపుపై నెక్కించుకొని మూటవలె మోయుదురు.



జపానీయుల భోజనమందిరము.

భోజన పదార్థముల రుచివిశేషమునకు తోడు శుచిత్వము కూడ గలిగి కడుపునకును, కంటికిని యింపైయుండును. మెత్తని బొంతలపై కూర్చుండి వారు ఆత్మకింపైన భోజనము చేతురు.

అన్యోన్యము మర్యాద చేసికొనుటకు మనము చేతులు జోడింతుము. వారు నడుము వంచుదురు. వచ్చినవారియెడ గౌరవము చూపుటకు మనము నిలుచుందుము. వారు చతికిలపడుదురు. ఇది వారికిని మనకునుగల వ్యత్యాసము. జపాను స్త్రీలకు దైవభక్తి, పాపభీతి హెచ్చు.

హిందూ దేశమునందువలెనే అచ్చటి వారికి తమ ఏలికయగు మికాడో దైవాంశ సంభూతుడని గాఢనమ్మకము. జపానురాజ్యము తన స్వాతంత్ర్యమును 2500 సంవత్సరములనుండి విచ్ఛిత్తి నెఱుగక నిలుపుకొని వచ్చుచున్నది. ఇన్నాళ్లుగా ఒక్కసారియు పారతంత్ర్యమెఱుగని ఆ దేశ భాగ్యము అద్వితీయము గదా!

మార్చి 3 వ తేది సంవత్సరములోనెల్ల జపానుబాలికలకు మిక్కిలి వినోదకరమైన దినము. ఏమన అదిబొమ్మల పండుగదినము. ఉత్సవానుకూలమైన బట్టలు కట్టుకొని ఆనాడు జపాను బాలురు, బాలికలు గుమిగూడి నానావిధములైన భక్ష్యములను భుజింతురు. జపాను దేశపు రాజధాని నగరమగు టోకియోనగరమున ఆనాడు బాలికల కొఱకైన దుకాణములు పెక్కు ఏర్పాటు చేయబడియుండును.

# కన్యాశుల్కము

ఉభయభాషాప్రవీణ బులుసు నరసింహాశాస్త్రిగారు

చ॥ కటికివిధానఁ బండితులుఁ గన్నెల నమ్మి గుటుంబపోషణా
గటకట! సేయనూనుదురు కష్ట మటంచుఁ దలంపరాత్మ నా
కుటిలుల తప్పుకాదది యకుంఠితశక్తి దలిర్ప వారికిం
దిటముగఁ గన్యకాళి నిడు ధీరహితుండు విధాతనింద్యుఁడౌ.

# లోధ్రమహిమ

## స్త్రీరత్నముల అభిప్రాయములు.

### ఆంధ్ర యువతీమణులు

శ్రీమతి కవయిత్రి పులవర్తి కమలావతీదేవిగారు రాజమంద్రినుంచి యిట్లువ్రాయుచున్నారు.—

"నాసోదరి బహిష్టయందు కడుపునొప్పిచే చాల బాధపడుచుండెడిది. తమ "లోధ్రను" మూడు బుడ్లను తెప్పించి యామె కొసంగితిని. నాచెల్లెలు స్వస్థురాలగుటయేగాకుండ నిరువురు బిడ్డలనుకూడ కనినది. తమ లోధ్ర స్త్రీలపాలిటి వరప్రసాదిని యనుటకెట్టి సందియమును లేదు. మా స్త్రీల వ్యాధులకు తమలోధ్ర కల్పతరువువలె కన్పడుచున్నది."

శ్రీమతి ఎల్. కనకమ్మగారు, C/o నరసయ్యగారు, విలేజిమాజస్ట్రీటు, కదిరినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.—

"మీలోధ్ర 4 పెద్దబుడ్లను సేవించినాను. 4 నెలలనుండి కడుపునొప్పి బొత్తిగనిలచిపోయినది."

### కర్ణాటక స్త్రీలు.

శ్రీమతి బి. ఇందిరా కుమారిదేవిగారు మెట్టూరునుంచి ఇట్లువ్రాయుచున్నారు.-

"నేను మీకేసరికుటీరం "లోధ్రను"ను సేవించుచున్నాను. తత్పూర్వము నాకు బహిష్ఠకాలమందు మిక్కిలి బాధకలుగుచుండెను. ప్రతినెలయును క్రమముదప్పి బహిష్ఠి యిరువది దినములోపుననే యగుచుండెను. రెండు సంవత్సరములవరకు ఆసుపత్రిమందు పుచ్చుకొంటిని గాని గుణము కనుపించలేదు. పిమ్మట వారు ఆపరేషన్ చేసుకొమ్మని చెప్పిరి; నేనిష్టపడలేదు. తమ "లోధ్ర" ప్రభావమువిని రెండుబుడ్లు పుచ్చుకొన్న తర్వాత మామూలుప్రకారము క్రమముగ 28 రోజులకు బహిష్ఠయగుచున్నాను. బాధలన్నియు నివర్తిఅయినవి. మరి రెండుబుడ్లు తమ "లోధ్ర"ను నాకు పంపగోరుచున్నాను."

శ్రీమతి జయలక్ష్మమ్మగారు, కొల్లిగల్ బాలికాపాఠశాల ఉపాధ్యాయిని, ఇట్లు వ్రాయుచున్నారు.—

"గడచిన మూడు సంవత్సరములనుండి, నాకు సరిగా ఋతుస్రావము కాకుండెను. రెండుమూడు నెలల కొకసారి బహిష్టు కలుగుచుండెను. ఇందువలన నడుమునొప్పి, కీళ్లనొప్పులు, బలహీనము, దేహము బరువుగతోచుట, మొదలగు బాధల ననుభవించుచుంటిని. మీ "లోధ్ర" రెండు సీసాలు తెప్పించి వాడినందులో పైకనిన వ్యాధులన్నియు మాయమైనవి. ఇపుడు సకాలమునకు బహిష్టుఅగుచు సుఖముగనున్నాను. మరియు రెండుసీసాలమందును వాడదలచినాను. నావలెనే బాధపడుచున్న స్త్రీలకు లోధ్రను వాడితీరవలెనని ఖండితముగా తెలుపుచున్నాను."

### క్రైస్తవ నారీమణులు

శ్రీమతి అన్నాచాండిగారు ఎం. ఎ. ఆనర్స్ 'శ్రీమతి' సంపాదకురాలు, కొట్టయంనుంచి ఇట్లు వ్రాయుచున్నారు.—

# లోధ్ర మహిమ

"మీ 'లోధ్ర'ను వాడినాను. స్త్రీల ఋతుసంబంధమగు జాడ్యముల కుపయుక్తమగు అపూర్వమగు ఔషధరాజమని చెప్పగలను. తియ్యనిరుచిగల్గి, పథ్యపానాదుల పాలింపవలసిన అవసరము లేకుండుటచే, యీ మందును సంతోషముగ వాడవచ్చును."

శ్రీమతి డాక్టరు అన్నతామస్ అమ్మగారు బెంగుళూరు, ఆస్పత్రి సూపరింటెండెంటు, ఇట్లు వ్రాయుచున్నారు.

"ఇంగ్లీషు ఔషధములవల్ల గుణము లేనందున మీ "లోధ్ర"ను నాసోదరికి వాడితిని. ఆమెకు ఆశ్చర్యమైన గుణము నిచ్చినందుకు సంతోషించుచున్నాను. ఇకమీదట ఈ యౌషధమును నారోగులకు వాడెదను."

శ్రీమతి కె. ఇసయగారు, ఎ బి. మిషన్, సత్తెనపల్లి, గుంటూరుజిల్లా, ఇట్లు వ్రాయుచున్నారు.

"మీ 'లోధ్ర'వలన నాకుమిక్కిలి ఆరోగ్యముకల్గినది. నాకు వచ్చుచుండిన దగ్గునయమైనది."

శ్రీమతి మిసర్సు. ఏ. దేవదాసుఅమ్మగారు ఇ. డబ్ల్యు. ఎమ్. స్కూలు, సాల్ట్, మిర్జాపుజిల్లా, ఇట్లు వ్రాయుచున్నారు—

"మీవద్దకొన్న "లోధ్ర" నాలుగు బుడ్లను, ఋతుస్రావదోషములచే బాధనొందుచున్న స్త్రీల కిచ్చినాను. వాటిని వాడినందున వారి రోగములు కుదిరినవి."

## కేరళ వనితలు

శ్రీమతి ఎడపిల్లి పార్వతమ్మగారు తిరుచూరునుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"నేను 25 సంవత్సరములనుండి ఋతుసంబంధమగు జాడ్యములతో బాధపడుచుంటిని. ఎన్నియో మందులను వాడినను గుణముగుపడలేదు. తుదకు మీ 'లోధ్రను' కొద్దికాలము మాత్రము వాడగా అత్యద్భుతముగ రోగనివారణ గావించెను."

శ్రీమతి అమ్మకుట్టియమ్మగారు, సంగీత ఉపాధ్యాయిని, సర్కారుహైస్కూలు, తిరుచూరు, కొచ్చినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"చాలాకాలముగ అనేక విధములైన గర్భాశయ రోగములవల్ల బాధనొందుచుంటిని. అనేక విధములైన చికిత్సలను పొందితిని గాని నివారణము కాలేదు. కడపట మీ "లోధ్ర" సేవించిన వారము రోజులలోనే గారడివిద్య వలెగమనించు పనిచేసెను. దానిప్రభావమును వర్ణింపజాలను."

శ్రీమతి మిస్ గోపాలపణిక్కర్ గారు, శారదావిలాసము, చిత్తూరు, కొచ్చినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"మీవద్దనుండి తెప్పించిన 6 లోధ్రబుడ్లలో 3 నేనును తక్కిన 3 మా చెల్లెలును సేవించుటచే మాయొక్క ఋతుశూలలు మాయమాయెను."

శ్రీమతి మిసర్సు కర్తగారు, కోరోలి ఆమ్మనాత్ హౌవుస్, ఇరింజలకుడ, కొచ్చినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.—

"పది సంవత్సరములుగ ముట్టునొప్పివల్ల బాధపడుచుంటిని. దానిని మీ లోధ్ర అత్యద్భుతముగ నివారణచేసెను."

# ఆరోగ్యాశ్రమము.

చెన్న పట్టణమునకు సమీపమున ఆరోగ్యపద్ధతుల ననుసరించి
చికిత్స జేయుటకు చక్కని ఆశ్రమము.



నూరడుగుల యెత్తును, చక్కని నీడలును, పచ్చని బయళ్లును, నిర్మలమైననీరును, ఇసుక నేలయును గల్గి వనప్రదేశమైనను నివాసయోగ్యమై ఋష్యాశ్రమము బోలు నీప్రదేశము మిక్కిలి ఆరోగ్యవంతమై యున్నదని డాక్టరు ముత్తు మొదలగు ప్రకృతి శాస్త్ర వేత్తలు హెచ్చుగా కొనియాడి యున్నారు.

వివరములు కావలసినవారు

## డాక్టరు ఆ. లక్ష్మీపతి, బి. ఏ., ఎం. బి.సి.ఎం., భిషగ్రత్న

మేనేజింగు డైరెక్టరు గారు
43, హారిస్‌రోడ్డు, మౌంటురోడ్డు పోస్టు, మదరాసు,
అని వ్రాయవలెను.

---

# తులసి—బిల్వ

ఇవి తులసి బిల్వ అను జాతీయ మూలికలను గూర్చి శాస్త్ర విషయక పరిశ్రమచేసి వ్రాయబడిన ఉత్తమ గ్రంథరాజములు. ఈ మూలికల ఓషధీ గుణము, వైద్య ప్రయోగములు, శాస్త్రచర్చ, పురాణ వివరము సరళశైలిలో వివరింపబడినవి. వైద్యులకు, భక్తులకు మిక్కిలి ఉపయోగకరమైన గ్రంథములు. క్రౌను సైజున మంచి ఫెదరువైటు కాగితము మీద ముద్రింపబడి గృహలక్ష్మి గ్రంథమాలలో ప్రథమద్వితీయ కుసుమములుగా ప్రచురింపబడినవి.

గ్రంథముల కర్తలు. డాక్టర్ కే. యన్. కేసరి

ప్రతిఒక్కంటికి 0-8-0

గృహలక్ష్మి కార్యాలయము
పోస్టుబాక్సు నెం. 752
ఎగ్మూర్, మద్రాసు.

# మోహనాంగి

ఆండ్ర. శేషగిరిరావుగారు. బి. యె. (సారస్వతసమాజము.)

బళ్లారి మండలములోని ఆనెగొందికి సమీపమున నుండిన విజయనగరము రాజధానిగా కటకము దొట్టి కన్యాకుమారి వఱకునుగల దక్షిణభారతదేశమున కంతకును క్రీస్తుశకము ౧౫౦౯-వ సంవత్సరము మొదలు ౧౫౩౦-వ సంవత్సరముదనుక ఛత్రపతియై చెలువొందిన ఆంధ్రభోజుఁడు శ్రీకృష్ణదేవరాయలకు మోహనాంగియను కూఁతురుండెను. కృష్ణదేవరాయలు సంస్కృతాంధ్ర భాషలయందు సరసకవనము చెప్ప నేర్చి 'కవితాప్రావీణ్యఫణీశుఁ'డని బిరుదమందిన విద్యావంతుఁడు. మోహనాంగి రాజకవిశిఖామణియగు కృష్ణదేవరాయలకు సర్వవిధముల తగిన కూఁతురు. ఆమె ఎన్నికగన్న విద్వాంసురాలు; విశేషించి గొప్ప కవయిత్రి.

మోహనాంగి కవిత్వమందలి మంచిచెడ్డలను పరికించి పట్టగల ప్రాజ్ఞురాలు. రసవంతమైన కవిత్వమునందు వెలలేని అభిమానముగల ఉచితజ్ఞురాలు. ఈ సంగతులు సూచిపఱచుచు జనులొకకథ చెప్పెదరు. అందలి సత్యాసత్యము లెట్టివైనను ఆకథ వినసొంపుగా నుండును గావున నిచట వివరించుచున్నాను.

"ఆంధ్రకవితాపితామహుఁడగు అల్లసాని పెద్దనార్యుఁడు 'శిరీషకుసుమపేశల సుధామయోక్తుల'ను చరిత్రమును రచియించి కృష్ణదేవరాయలకు అంకితముచేసి ఆప్రభురత్నమువలన అపూర్వ సన్మాన గౌరవమునొందెను. ఆవృత్తాంతమునువిని సంకుసాల నరసింహాము అనుకవీశ్వరుఁడు తానుకూడ నొక ప్రౌఢప్రబంధమును రచియించి కృష్ణదేవరాయలకుఁ గృతినిచ్చి గౌరవమునందఁ గోరెను. అట్టికోరికతో నాతఁడు కష్టపడి 'కవికర్ణరసాయన' మను ప్రబంధమును వ్రాసెను. అతఁడాగ్రంథమును తీసికొని రాయలరాజధానీనగరమగు విజయనగరమునకుఁ బోయెను. పిమ్మట ఆతఁడచ్చటి ఆస్థాన కవిశ్రేష్ఠుఁడగు అల్లసాని పెద్దనార్యుని దర్శించెను; తన గ్రంథమును ఆమూలాగ్రముగ నాకవివర్యునకు వినిపించెను; తనకు రాజదర్శనము చేయింపుమని ఆతనిని పలువిధములఁ బ్రార్థించెను.

ఆంధ్రకవితాపితామహుఁ డాగ్రంథము నాలించి అందలి కవితాచమత్కారమునకు అబ్బురపడెను. ఆమనోహర కావ్యమును కృష్ణదేవరాయలకుఁ జూపినయెడల ఆతనికిఁ దన మనుచరిత్రమూఁది గౌరవము డింపు పాటొందునని పెద్దనార్యుఁడు కించపడెను. ఆతని హృదయము అసూయాగ్రస్తమయ్యెను. అట్లు అసూయా పిశాచగ్రస్తుఁడై ఆతఁడు నృశింహకవికి రాజదర్శనము కానియ్యక 'అదిగో, ఇదిగో' అని కాలయాపన చేయసాగెను. పాపము నృశింహకవి పెద్దన్నసాయమున తనకు తప్పక రాజదర్శనలాభము కలుగునని నమ్మి చిరకాల మల్లె విజయనగరమున సొంతసొమ్ము వెచ్చించుచునుండెను.

ఇంతలో నతనిచేతనున్న కాసువీసమంతయు సెలవైపోయెను; పెద్దన్న ఆతనికి రాజదర్శన లాభ మొనగూర్చునన్న ఆశ నక్కారయయ్యెను. ఆస్థితిలో నాతనికిఁ దనకావ్యములోని పద్యములు విక్రయించియైనగాని నిత్యభుక్తికి మార్గము కానరాకపోయెను. అట్లగుట నాతఁడు తనగ్రంథములోని కొన్ని రసవత్తర పద్యములనేర్చి తన పరిచారకునకిచ్చి వానిని పురమున అమ్ముకొని రమ్మనిపంపెను. సేవకుఁడును ఆపద్యరత్నములను తీసికొని పోయి పట్టణమంతయుఁ దిరుగుచుఁ బద్యమునకుఁ బదివరహాలు విలువయని కేక వేయుచు రాజనగరిలోనికి వచ్చెను. రాజకుమారికయగు మోహనాంగి హర్మ్యాగ్రమునుండి ఆకేక వినెను. కావ్యగీతి ప్రియురాలగు నామె వెంటనే ఆపద్యములను తెప్పించిచూచెను. రసగ్రహణమున అసమానురాలైన మోహనాంగి ఆపద్యముల నొక్కసారి చదువుట తోడనే అందలి పదశయ్యారసపాక చమత్కృతిని పూర్తిగఁ జూఱలాడ గలిగెను. అప్పుడు వాఁ డడిగిన మూల్యము నొసఁగి ఆవిద్వాంసురాలు ఆపద్యములను కొలిచెను; విమర్శక దృష్టితో దానిని పఠించి కంఠస్థమొనరించుకొనెను.

రాజాదరణ లభింపమిచేఁ గవికర్ణరసాయనప్రబంధనిర్మాత ఇక 'ప్రభుసురాత్ముల' ప్రస్తుతింపనని ఒట్టుపెట్టుకొనెను. తనగ్రంథమును రాజాంకితము చేయనని అభావవైరాగ్యమును తెచ్చుకొని ఆతఁడు పద్యముల నమ్మగా వచ్చినధనమును పుచ్చుకొని శ్రీరంగమునకుఁ బోయెను. అచ్చట ఆతఁడు ఆముష్మికార్థియై తనగ్రంథమును శ్రీరంగధామునకు అంకితముచేసి ధన్యజీవనుఁడయ్యెను.

అనంతరము కొంతకాలమునకు ఒకనాఁడు మోహనాంగి తనతండ్రియగు కృష్ణదేవరాయలతోఁ జతురంగ మాడుచుండెను. ఆసమయమున మోహనాంగి నడుపుచున్న

బలములోని ఒక బంటు కృష్ణదేవరాయలు నడుపుచుండిన బలములోని మంత్రి ఏనుఁగుల పగచేతఁ దొలగిపోవలసివచ్చెను. ఆసందర్భమునకుఁ జక్కఁగా హత్తునట్లు అప్పుడా కవయిత్రీమణి తానుకొనిన పద్యములందలి,

'ఉద్ధతులమధ్యఁ బేదలకుండఁ దరమె?'

అను అర్థాంతరన్యాసమును ఎత్తిపలుకుచు బంటును వేఱొక యింటికినేచ్చెను. అది వినిరాజు మెచ్చి ఆయర్థాంతరన్యాసముగల పద్యమునంతయుఁ జదువుమని తన తనయ నడిగెను. ఆమెఅప్పుడా పద్యమును చదవి తండ్రికి వినిపించెను. కృష్ణదేవరాయలా పద్యమునందలి చమత్కారమునకు సంతసించి 'ఇదియే గ్రంథములోనిది?' అని మోహనాంగిని ప్రశ్నించెను. దానికామె ఆపద్యము సంకుసాల నృశింహకవికృత కవి కర్ణరసాయనము లోనిదనియు, దానిని తాను విలిచితినని యు బదులుచెప్పెను. అందుమీఁద గలిగిన ప్రసంగవశమున కృష్ణరాయలు నృశింహకవికి పెద్దన్నచేసిన మోసమును తెలిసికొని మిగులవగచెను."

సరసకవిత్వమునందు మోహనాంగికిఁగల గాఢాభిమానమును వివరించుటకుఁగాను ఈకథ ఇటీవలివారిచేఁ గల్పింపఁబడియుండునని పలువురయభిప్రాయము.

మోహనాంగి 'మారిచీపరిణయము' అనుశృంగార ప్రబంధమును రచియించెను. కృష్ణదేవరాయ లొకనాఁడు అల్లసాని పెద్దన్న, ముక్కు తిమ్మన్న మొదలగు అష్టదిగ్గజములతో భువనవిజయాఖ్యసంసద్భవనమున నిండుకొలువై యుండగా మోహనాంగి తనప్రబంధమును అచ్చటచదివి వారికి వినిపించెను. అందలిమేలెంచి వారుదానిని మంచి కావ్యమని ప్రశంసించిరి. కాని ఆపుస్తకమిప్పుడు లోకమునకుఁ జేకూఱకున్నది. అకారణముగఁ గొందఱు మారిచీపరిణయ మను కావ్యము అసలు రచియింపఁ బడనేలేదని వాకొనుచున్నారు. కాని ఆగ్రంథము రచియింపఁ బడియుండెననుటకు ప్రమాణములు లేకపోలేదు. ఆశృంగార ప్రబంధము కాలగర్భమున జీర్ణించిపోయినదో లేక భావిపరిశోధనమున బయలుపడునో మాత్రము మనమిపుడు నిర్ణయింపఁ జాలము.

మోహనాంగి యౌవనదశయందే ప్రాణనాయకుని గోల్పోయెననియు, అపుడా పరమసాధ్వి సహగమనముచేసి పతితో నుత్తమలోకమునకుఁ బోయెననియుఁ జెప్పుదురు.

''ఆంధ్రవిదుషీమణుల''నుండి.

# శ్రీ యశోదాకుమార!

శ్రీమతి జూలూరి తులశమ్మ గారు.

చిరుగజ్జియలధ్వని చెవులపండువు సేయ నప్పప్ప యని జేరనరుగు నపుడు
అవ్యక్తమధురిమ నలరు వాక్తతిమీర నమ్మ! యేమైనఁ బెట్టనెడు నపుడు
పడుచు లేచుచు వచ్చి పైటనుదిగలాగి పాలంచు మారాముబట్టు నపుడు
మెడలోని హారముల్ దడవుచు పాల్ద్రావి హాయిగా కన్నులుమూయు నపుడు

ముద్దు లెన్నియొ గలవెన్న మురవిదార!
ప్రకటగుణగేయ! మునిజనభాగధేయ!
భక్తజనపాల! గోపికాప్రాణలోల!
తరుణమందార! శ్రీయశోదాకుమార!

పాలీయ కంటిలోఁ బనిసేర్పఁ జనఁ గిన్కఁ గుండ బోగొట్టు నీ కొంటెతనము
పట్ట ద్రిమ్మరగఁ గప్పడిన నిన్ బెదరింపఁ గనుల నుల్కుమంజూచు కలికితనము
వెదకి గాంచఁగ లేక వేసారు నందుని వెలదికి దొరకిన బేలతనము
భూరుహద్వయమును పురుషమూర్తులుగాగ పచరించు నీదు నేర్పరితనంబు

తండ్రి! నీమాయ లెన్న విధాత జాలఁ
డనఁగ మరి యెవ్వరికిఁ దగు? నమలచరిత!
భవ్యయోగీంద్ర సేవిత! భక్తవరద!
తరుణమందార! శ్రీయశోదాకుమార!

వెనుకపాటున వచ్చి కనుమూసి యెవ్వరో? చెప్పుకో మని తల్లిఁ జేరు నపుడు
జంగమలతలాగు సన్నిధి కరుదెంచి అమ్మ! సద్బట్టు మం చడుగు నపుడు
పాలారుచెక్కులపై దూగు ముంగురుల్ డాకేల మీవ్రిల్లి తడవు నపుడు
బర్హిపింఛము నాకుబాగు చేర్చుకొను అన్నయ్యకిదుమమ్మ! యనెడు నపుడు

మురిపమొసగెడు నీదగు ముద్దు లరసి
స్వాంతమునఁ బొంగు భాగ్య మెవ్వారి కబ్బు?
కరువుదీరంగ మీయమ్మ గాంచెఁ గాక
తరుణమందార! శ్రీయశోదాకుమార!

మూపునఁ బరశువు ముంగేలఁ జికుగోల పాలచెం బెడకేలఁ బరగు వేళ
సంగడీండ్రను గూడి సహజమై ఖరితోడ నాలతో బాల మేగునట్టి వేళ
సెలగోల నటనుంచి చలిదిబోనముఁ జేసి తోడిబాలుర కిడి యాడు వేళ
కాసంత యెండలో కాగి చెట్లకు ప్రాకి స్వాదుగా వేణువు నూదు వేళ

ముద్దులనుమూటగట్టు నీమూర్తి జూచి
ధన్యతములైరి నీదగు తల్లిదండ్రి
బాలగోపాలగోపికాపశుగణంబు
తరుణమందార! శ్రీయశోదాకుమార!

మునిమాపు పసులతో వెనుకొని వేవచ్చి యమ్మయొడిని బరుండునట్టి సొగసు
వులిగో రేదిర? యంచు పొలతి కన్నెఱసేయ వెఱచిన ట్టిటునటు బరచుతీరు
జలకంబుగావించి చలువగట్టఁగనిచ్చి బువ దిన రమ్మన్న బోవుసారు
తెలిసెజ్జపై నిద్రదీర రమ్మని పిల్వ తోడిబాలుర గూడి యాడు విధము

ముద్దు లొలికెడు నీచర్య ముదముదీర
గాంచ నోచెను గదర నిన్ గన్నతల్లి
రమ్యగుణసాంద్ర! త్రిభువనరాజచంద్ర!
తరుణమందార! శ్రీయశోదాకుమార!

# లక్ష్మీదేవి—బాలంభట్టు.

ఒంగోలు వేంకటరంగయ్యగారు, బియె. బియల్.

దేశస్త్రీలు వ్యవహార (law) పరీక్షలందు గెలిచి నియుక్త (advocate) పదవుల మెలగుటనిక మీద చూడగలము. ఇపుడిపుడే అచటనచట నొక రిద్దరు వెలసియున్నారు. రాజకీయ విషయములలో మహమ్మదీయులు తమ తెగలవారికి సంబంధించిన వ్యవస్థలు తమలోని వానికిని తమ మతస్థునికిని దెలసినటుల యితరులకు స్ఫురింపజాలవనియు, అదికారణముగ తమ జనమునకు ప్రత్యేక ప్రాతినిధ్యము (separate representation) ఉండవలయునని కోరుచుండుట జూచుచున్నారము. అబ్రాహ్మణులు బ్రాహ్మణదృష్టిలో తమ తమ సంపద్విపత్తులు చక్కగ వెలువరింప బడజాలవనియును తమ హానివృద్ధులు తమ జనమునకే గోచరింపగలవనియును ఉద్దేశములగొని అబ్రాహ్మణ సౌభ్రాతృత్వమును నెలకొల్పుకొనిరి.

అటులనే సాంసారిక విషయములందువలె వ్యావహారికములందును కొన్నియంశములు స్త్రీదృష్ట్యా ప్రపంచితములగు విధము వేరుగనుండవచ్చును. ఉదాహరణము గావలయునన నొక్కదాని జూపవచ్చును. పూర్వము మహారాష్ట్రదేశమున పాయగుండె వైద్యనాథభట్టు అనునొక బ్రాహ్మణుడుండెను. ఈతడు మహా పండితుడు. వ్యాకరణశాస్త్రమున మహావిద్వాంసుడు. నాగోజీభట్టు శిష్యుడు. "కలా" "చిదస్థిమాలా" లోనగు ననేక వ్యాకరణగ్రంథముల రచించిన ప్రసిద్ధపురుషుడు. ఈతనిభార్య లక్ష్మీదేవి. వీరికాలము క్రీ-శ. 17-వ శతాబ్దమని కొందరు 18-వ శతాబ్దమని కొందరు చెప్పెదరు. శతాబ్దమెద్దియైనను పౌరాణిక మూర్తులు కారు. ఆయమ లోకమున సంచారము జేసిన స్త్రీ. ఆమెను కిశాకృష్ణుడను నొకకొమరుడు గూడనుండెనట.

ఈలక్ష్మీదేవి శ్రీమహావిష్ణుపత్నివలె సమస్తసంపదలకాకరమై యుండెనదో లేదో తెలియదుగాని వేదములనభ్యసించిన మండనమిశ్రుని రాణివలె విద్యాసంపన్నురాలు. ధర్మశాస్త్రములందు ప్రవృత్తిగలిగి యాజ్ఞవల్క్యస్మృతికి ముఖ్యవ్యాఖ్యానమగు మితాక్షరకి సంస్కృతమున నొకవ్యాఖ్యానము వ్రాసినది. దీనికి లక్ష్మీవ్యాఖ్యానమని పేరు. ఈ పండితురాలు లేకారణముననో "బాలంభట్టు" యను పురుషనామమును గ్రహించినది. ఆ లక్ష్మీవ్యాఖ్యానము "హిందూలా" గ్రంథములలో బాలంభట్టీయము అని గానవచ్చుచున్నది. బాలంభట్టు ప్రశంస మెయిన్సు హిందూలా (Mayne's Hindu Law) లో దాయభాగమును గూర్చిన యధ్యాయమునగలదు. రాజకుమారసర్వాధికారియను బంగాళిపండితుడు రచించిన దాయమునుగూర్చిన (Inheritance) గ్రంథమునను విశేషముగు ప్రశంసగలదు.

ధర్మశాస్త్రపద్ధతులపై సంచరించునపుడీయమ చర్వితచర్వణము జేయక బుద్ధిదార్ఢ్యమును జూపక కొన్నిపట్ల స్వతంత్రముగ ప్రవర్తించినది. ముఖ్యముగ పురుషులతోపాటు స్త్రీలకును దాయభాగ నిర్ణయమును సిద్ధాంతము జేసినది. కుమారులవలె కుమార్తెలకును దాయభాగమును నిర్ణయించుచు "పుత్రాదిగ్రహణేన కన్యా నామపిగ్రహణం" అని నిర్వచించియున్నది. అనగ పుత్రశబ్దము "పుత్రికను" గూడ సూచించుచున్నదియని భావము. (ఇండియా శిక్షాస్మృతిలోని (Penal Code) పదభాషాపరిచ్ఛేదమున "వాడు" అను సర్వనామమును దాని రూపభేదములును స్త్రీపురుషుల కిద్దరకని అన్వయించునట్లు) "అంగాదంగాత్సంభవతి పుత్రవద్దుహితా న్యణాం" అనియే ప్రాతకాలమునను మనువను నీతిసారమున శాసించియున్నాడు.

మరియు మన లక్ష్మీదేవి, సపత్నీమాతను (సవతితల్లిని) గూడ దాయభాగస్థుల (వారసులు)లో జేర్చినది. ఎటులనగి :—

మాతాజననీ అభావే సాపత్నీ మాతాపి మాతృపదోక్తి— భార్యాపుత్రులు లేనివాని తల్లి సజీవురాలుగనుండిన వానికి నామె వారసు అని అందరు అంగీకరించియున్నారు. లక్ష్మీదేవి జేసిన విశేషమేమనగి కన్నతల్లియును లేక సవతితల్లి మాత్రమున్నయెడల ఆమెయు వారసు అగును. ఏలననగి ఆమెయందును మాతృపదమన్వయించుచుండుటచేత. సపత్నీమాతను వారసుగ యే హైకోర్టువారును యిప్పటివరకంగీకరింపలేదు. లక్ష్మీదేవి స్త్రీయగుటచే హిందూకుటుంబములలో సవతితల్లియొక్క దుస్స్థితి దెలసికొనినదై ఆమెకును దాయాప్తత కల్పించినది. హైకోర్టులును ఎప్పుడో యొక సన్నివేశమున సవతితల్లికిని వారసత్వగతి కల్పింపగలరు. ఏలనన తల్లితోబుట్టినవాడు మేనమామ వారసగుచుండుట ప్రసిద్ధమైయున్నది. మాతుస్సపత్నీ భ్రాత— తల్లికి సవతియన్న దమ్ముడు (Mother's step brother) వారసగునా కాదా యను వివాదమొకమారు మద్రాసు హైకోర్టులోనాసగి చంద్రాంశుధవళిత కీర్తిమూర్తియై మద్రాసు హైకోర్టునందు వెలుంగుచుండు శ్రీ శ్రీ శ్రీ

న్యాయమూర్తి ముత్తుస్వామి అయ్యరుగారు 16 మద్రాసు 23 (24) నందు ధర్మశాస్త్రములను, ప్రసక్తములగు వ్యాకరణాంశములను పూర్ణముగ పరిశీలించి తల్లి సవతి యన్న దమ్మునికిని మాతులత్వము సాధించియున్నారు. మాతృశబ్దమునకు "డులచ్" ప్రత్యయ సంయోగముగలిగి "మాతుల" శబ్దమేర్పడుచున్నదనియు వైయాకరణ సంవిధానమున మాతులశబ్దార్థము తల్లితోడబుట్టినవాడే మాతులుడగునని విధింపబడక యుండుటచేతను భిన్నోదరునికిని మాతులత్వ మాపాదింపగలదని నిర్ణయించియున్నారు. భిన్నోదరునికి యాధారమే ర్పడియుండ సాపత్నమాతృవిషయ మింకొక మెట్టులోనున్నది. లక్ష్మీదేవియాశయము నెరవేరదనజాలము.

ఇంకొకవిషయముననుమనలక్ష్మీదేవమ్మ వ్యవహార ధర్మస్వాతంత్ర్యమును జూపియున్నది. పెండ్లియైన కుమారుడు బిడ్డలు లేకనే తనతండ్రికంటె ముందు చనిపోయిన యెడల అట్టి వాని భార్యకు దాయపలకము నున్నత స్థానమీమె జూపియున్నది.

"పితామహో వితిభిన్నపదం. ఏతదగ్రేస్నుషాబోధ్యా" ఇత్యాది.

బంధువుల (Cognates) విషయమునను "అత్రాపి పుత్రాదిగ్రహణేన కన్యానాంగ్రహణం" అని స్త్రీలకును దాయార్హతను జెప్పియున్నది. ఆడుతోబుట్టువులు (Sisters) వివాహము వలన భిన్నగోత్రమువారగుచున్నారు. వీరికి దాయార్హత బొంబాయి రాజధానిలోనున్నటుల మద్రాసులో లేనందున ఈ లోపము నివారింపన్యాయమూర్తి శేషగిరిఅయ్యరుగారు పోరాడిరి. సఫలము కాలేదు. ఇత్యాది విషయమునఁనేకముల లక్ష్మీదేవిస్ఫుటముగ చర్చించియున్నది. ఒక్కొక్కప్పుడు ధర్మమీమాంసజేయు నవసరమున, నైయాయిక ప్రౌఢిమను ఈమెజూపుచున్నది. (Inheritance does not always follow sacra)పిండము బెట్టువానికే దాయముగలికముగ సంక్రమింపవలయునను నియతివిధింపబడియుండలేదను విషయమును పంపాదించుచు "పిండదత్వ ప్రయుక్తాంశ హరత్వస్యన శాస్త్రీయత్వమితి అనయోర్మిథోనవ్యాప్యవ్యాపక "భావ: నాపిసార్వత్రికం సమనైయతత్వం" ఇత్యాది తర్కసంప్రదాయముల గుప్పించినది. (Obligation to offer funeral oblation (pinda) and the right to inherit are not invariably coextensive అనితాత్పర్యము. అనగ కర్మచేసినంత మాత్రమునసె ఆస్తికిహక్కు కలుగనేరదు అని.)

లక్ష్మీవ్యాఖ్యానము పూర్తిగ అచ్చుపడినటులలేదు. దీనిలోదాయభాగమునకు సంబంధించిన ప్రకరణములు మాత్రము యెచటనో అచ్చుపడియున్నటుల డాక్టరుజూలియస్ జాలివిరచితమగు "హిందూ ధర్మశాస్త్రములు, ఆచారములు (Hindu Law and Custom) అనునొక్క గ్రంథముయొక్క ఆంగ్లపరివర్తనమున పుటక్రింది సూచికలలో (foot note) నున్నది. ఆగ్రంథము లభింపలేదు. ఈచిన్నవ్యాసమున నుదాహరింపబడిన వాక్యములు ప్రాయకముగ సర్వాధికారిహిందూ న్యాయధర్మము (Hindu Law of Inheritance Tagore Law Lectures) అను గ్రంథముననుండి గ్రహింపబడినవి.

ఈ ధర్మశాస్త్రజ్ఞురాలు "బాలంభట్టు" నామధేయమును స్వీకరించిన కారణమూహ్యముగనున్నది. స్త్రీయొకతె ధర్మ ప్రవచనముచేసినదన్న నాగ్రంథమునకు గౌరవము గలుగజాల దనుభీతియె కారణముగ నుండునా? ఆమెననేల. వ్యవహారములోనుండు ధర్మశాస్త్రములు పురాణములు అన్నియు ఆయా ఋషులు రచించినవి కాక పోవచ్చునను నూహయుకలదు కదా. శ్రీమద్భాగవతము బోపదేవకృతమా లేక వైయాసికమా యనువివాదము తీర్మానము నందలేదు. అటులనె యెవరోగొప్ప భట్టారకుడు రచించినటుల ప్రవర్తింప

జేయుటకు కారణమై బాలంభట్టు అను పేరు యేర్పడియుండును. దీనియందింక నింకను విమర్శింపవలసియున్నది. ఓరుగంటిసామ్రాజ్యమేలిన రుద్రమదేవికి "రుద్రమదేవ" యని గ్రాంథికప్రశస్తిగలదు. విమర్శకులు దీనికేమి కారణము జెప్పగలిగియున్నారు? ఛాందసపురుషుల నడుమనుండు ఘోషా గార్గి మైత్రేయీ లోనగు వారివలె గాక మనలక్ష్మీదేవిపేరు చరిత్రాంకితమైయున్నది. ఈమె వ్యాఖ్యాన ప్రచారము కాశీప్రాంతముల మెండుగనున్నటుల దోచుచున్నది.

వేదాంతపరిచయమున వాచస్పతి మిశ్రకృత శ్రీశాంకరభాష్య వ్యాఖ్యానమునకు "భామతి" యను పేరును భాస్కరాచార్య విరచితమగు గణితశాస్త్రమునకు 'లీలావతి' యను పేరును ఔపచారికములుగ సంకలితములయినటులుగాక లక్ష్మీదేవి ప్రత్యక్షముగ ధర్మశాస్త్ర వ్యాఖ్యానమునురచించి కీర్తివడసినది.

మన పాయగుండె లక్ష్మీదేవిబాయి గాక పదునాల్గవ శతాబ్దప్రాంతమున మిథిలాదేశము నేలినచంద్రసింహుడను గొప్పరాజుయొక్క భార్య లక్ష్మీదేవియను నామెయొకర్తు యుండినదియట. ఆమెయు గొప్ప విద్వాంసురాలయి తన భర్తగారియందలి భక్తిప్రేమల గనుపరచుచు వారిపేరు గొంతి గూర్చి "వివాదచంద్రము" అను ధర్మశాస్త్ర గ్రంథము నొకదాని వ్రాసినటులను సర్వాధికారాగారు పూర్వోక్తస్వకీయ గ్రంథమున జెప్పియున్నారు. ఈ గ్రంథప్రచారము విశేషముగ మిథిలారాజ్యమున గలదని తెలియుచున్నది. ఆమెయు తన గ్రంథమునకు తనపేరు పెట్టుకొనక తన మేనల్లుడగు మిశరుమిశ్రుని పేరు పెట్టినట్లు దెలియుచున్నది.

దేశస్త్రీలు వ్యవహారధర్మముల గూర్చి ప్రచారము జేయుట మనదేశమున ననాదిగనున్నది. ఆంగ్లేయులకును ఐరోపియులకునువలె ఇరువదియవశతాబ్దమున సృష్టిపడిన దివ్యావిర్భావము కాదు. ఎవరోయొకర్తు ఇంగ్లాండున బారిస్టరు అయినదనగనె వారు కబ్బురపాటునొలిగిరని. మనదేశ చరిత్రము మన మెరుగక యున్నారము. హిందూదేశ స్త్రీలును న్యాయవాదినులై స్త్రీజనముయొక్క అభివృద్ధికిని వ్యావహారికదాస్య విముక్తికిని నిరోధకములగు ప్రతిబంధములను తొలగించికొని అనావృతముగాని స్వేచ్ఛ ననుభవింపవలయును.

(ఈ వ్యాసము అచ్చునకు బంపిన వెనుక జయదేవకవి విరచిత "చంద్రాలోకము" అను నలంకార శాస్త్రమునకు ఈ లక్ష్మీదేవిభర్తయగు పాయగుండే వైద్యనాథ రచితరమాఖ్య వ్యాఖ్యయొకటి బొంబాయిలో గుజరాతి ప్రెస్సులో నచ్చుపడియుండినటుల దెలిసి దానిని దెప్పించి చూడగా ప్రకాశకుల పీఠిక యందిటులనున్నది:—"అనేన శబ్దేందుశేఖరేచిద." స్థిమాలా, పరిభాషేందు శేఖరేగదా, శబ్దరత్నే భావప్రకాశికా, మహాభాష్య ప్రదీపోద్యోతేఛాయా, వ్యాకరణ సిద్ధాన్తమంజూషాయాంకలా యాజ్ఞవల్క్య మితాక్షరాయాం లక్ష్మీనామ్నా, చంద్రాలోకేరమాభిధా చేతి వ్యాఖ్యా: ప్రణీతా: లోకేషు ప్రసిద్ధా అయం లోకేషు బాలంభట్ట ఇతినామ్నా ప్రథిత ఇతితాస్సర్వా అపి బాళంభట్టీ నామ్నా వ్యవహ్రియన్తే". దీనిని బట్టి చూడ వైద్యనాథునికె బాలంభట్టు అనిపేరు అయినట్లు కనుపడుచున్నది.

మరియు కాశీలోనుండు చౌఖంభముద్రాక్షరశాలవారు మితాక్షరికి వ్యాఖ్యానమగు "వ్యవహార బాలంభట్టి" యను గ్రంథమును ప్రకటించుచు అది పాయగుండే వైద్యనాథ విరచితమని తమ పుస్తకముల పట్టికలో ప్రకటించియున్నారు. గుజరాతి ప్రెస్సువారి యొక్కయు చౌఖంభవారియొక్కయు యూహాపోహాభాసములు మృగ్యములుగనున్నవి. బహుశ్రుతులును బహుగ్రంథశోధకులును నగు సర్వాధికారి జాలిగార్ల అభిప్రాయములే గ్రాహ్యములు. బాలంభట్టు లక్ష్మీదేవికి నామాంతరము.)

# శ బ రి

## సాహిత్యసరస్వతి వావిలాల గోపాలకృష్ణయ్యగారు

(వెనుకటి సంచిక తరువాయి)

### రంగము ౫

[అందరివి పూర్వపు వేషములే. సమయము మట్ట మధ్యాహ్నానంతరము రెండు ఘడియలు. శబరి తన యాశ్రమములోఁ గూర్చుండి ఫలములనన్నింటిని సరిచూచికొని సంతృప్తిఁగను ద్వారము నైపునకే సర్వదా చూచుచుండును. మొగమునుండి స్వేదబిందువులు ప్రవాహమైపాఱి క్రిందఁబడుచుండ ముందు శ్రీరాముఁడును నాతని వెనుక సౌమిత్రియు నాశ్రమమునఁ బ్రవేశించుచుందురు.]

రాముఁడు

(ముందుకుఁజూపి) సౌమిత్రీ! ఈ వృద్ధవనితయే శబరియని తోఁచెడిని.

సౌమిత్రి

అన్నా! కబంధుఁడు చెప్పిన జాడలఁ బరికించిచూడ నాకును నటులనే దోఁచుచున్నయది. ఆమె మనలఁ జూడలేదు మనము సమీపింతము. ముందునకు నడచిపోవుదము.

(ముందునకిరువురు నడతురు)

శ బ రి

(శ్రీరామలక్ష్మణులఁ జూచి, గుర్తించి, సంతసమున దన్మయురాలై)

సౌమిత్రీ! వందనము. రామా! నన్నుద్ధరింపఁజేయ నెంచి మీ రెంత దూరము నుండి నడచి వచ్చితిరి! ఎంతయలసితిరో? ఈచిన్నపీటపైఁ గూర్చుండుడు. నేను జలమునుదెచ్చి మీ పాదములపైఁగల ధూళిఁగడగుదును. ఒడలంతయు నెంతచెమ్మట పోసినది. జలములదెత్తు. సెలవా! మహాత్మా! నీరుఁదెమ్మనియెదరా?

రాముఁడు

(తనలో) ఆహా! ఈమెభక్తి. ఈమెది మూఢభక్తియనఁదగు. (ప్రకాశముగ) తల్లీ! అటులనే తమయిష్టానుసారము నిర్వర్తింపుము.

(శబరివెళ్లును)

శ బ రి

(ప్రవేశించి, రాముని కడకువచ్చి) రామచంద్రా! నీపాదముల నిటుచెమ్ము. చాల దూరమునుండి వచ్చుటచే నీరాతిగుట్టలలో సంచరించుటచే మీపాదములెంతగ నొప్పినిఁ గుడిచియున్నయవియో?

రాముఁడు

అమ్మా! నీవుమాకన్నను పెద్దదానవు. నీవునాపాదములంటుటనాకు శ్రేయస్కరమా? నాశ్రేయమును గోరుచు నన్నిటులఁ గోరనగునా? తల్లీ క్షమింపుము. ఆజలముల నిటుఁ దెమ్ము. నేనేపాదములఁగడిగికొనియెద. తమరీ విషయమునఁగూడ శ్రమించవలయునా? తల్లీ! నీరిమ్ము.

శబరి

తండ్రీ! తమరిట్లన నగునా? నేను ప్రాయమున కొకవేళ పెద్దనేనైనను నిజముగ నాలోచించిన దమరేయన్నిఁట బెద్దలు. సత్యమునుబరికించిన తమరు ప్రాయమునందైనఁ బెద్దలే. సృష్టికాదులనూతుఁలైరైనది తమరేగదా! మహాత్మా! తమరట్లన దగునా, దయఁజేసి మీపాదముల నిటనుంచుడు.

సౌమిత్రి

తల్లీ! అన్నగారన్ని విధములఁ జెప్పుచుండ వినరాదా!

శ బ రి

సౌమిత్రీ! నామీఁద నీకుఁగూడ దయలేదా? నీవు శ్రీరామచంద్రునకుఁ జెప్పివారి పాదములు నాచేత గడుగబడునటులొనరింపఁజేయుము. తండ్రీ!

సౌమిత్రి

(రామునితో) అన్నా! ఎంతజెప్పినను లాభములేదు. ఆమె కోర్కెఁదీర్పుము.

రాముఁడు

(సౌమిత్రితో) సరియే! అటులనేయొనరింపనిమ్ము!

శ బ రి

(శ్రీరాముని పాదములఁ గడిగి జలమును శిరముపై జల్లుకొని తన వస్త్రముతో శ్రీరాముని పాదములఁ దుడిచి, యావస్త్రమును తన నేత్రముల కద్దుకొనుచు సౌమిత్రితో) సౌమిత్రీ! నీపాదములనిటుఁ దెమ్ము!

సౌమిత్రి

తల్లీ! అది శ్రేయమా?

శబరి

నామాటవినకఁ దప్పదు. (సౌమిత్రి పాదములఁ గడగి కన్నుల కద్దుకొని) శ్రీరామచంద్రసౌమిత్రులారా! తాము తానంబాచరింతురా?

రాముఁడు

తల్లీ! అటులనే జేయుదుము. దూరవుఁ బ్రయాణమును జేయుటవలన నొడలంతయుఁ జెమ్మట పోసినది. నీరిచ్చిన స్నానంబాచరింతుము.

శబరి

తండ్రీ! నన్ను బ్రతివిషయము నడిగిన దానినెల్లగావించెద. నన్ను మీతల్లికి సమముగ నెంచుకొనుఁడు. తల్లిపుత్త్రులకు జలములఁబోయదా? నేనటులనేయనుకొనుఁడు.

రాముఁడు

(నవ్వి) సరియే తల్లీ! అటులనేఁగానిమ్ము. (శబరితో వెళ్లును.)

సౌమిత్రి

ఆహా! ఈ శబరిజన్మము ధన్యము. జన్మించినదాది యింతవఱకు నొక్క నిమిషం బేని శ్రీరామచంద్రమూర్తినెడబాయక వాని కష్టములే నాకష్టములుగ నెన్ను కొనుచుంటినే! ఒక్కనాఁడేనియు శ్రీరాముని పాదపద్మములఁగడిగి యాజలమ్మును జన్మపావనముగలోనికి స్వీకరించి యుంటినా! శబరిజన్మమే జన్మము!

(రామశబరులు ప్రవేశింతురు)

శబరి

రామా! నీవీ పీటపైని గూర్చుండుము. సౌమిత్రిని జలకమాడించి తీసికొని వచ్చెదను. అన్నా! లక్ష్మణా! నీవికలెమ్ము! వేగిరమెరమ్ము! (సౌమిత్రితో వెళ్లును.)

రాముఁడు

ఆహా! ఈ శబరి శ్రద్ధాభక్తులు శ్లాఘ్యపాత్రములు. ఈమె జన్మము ధన్యము. పరాత్పరుని మెప్పింపనలయుననిన మూఢభక్తియే వలయును. మూఢభక్తిలోనుండిన మూర్తిభవము మఱేవిధమగు భక్తియందును లేదు.

శబరి

(సౌమిత్రితోఁ బ్రవేశించి) తండ్రీ! సౌమిత్రీ! నీవీపీఠంబునఁ గూర్చుండుము. రామా! లక్ష్మణా! మీకాఁకలి వేయుచున్నదని తలంచెదను. మీరిచట కెంతదూరమునుండి వచ్చుచున్నవారలో తమ కెంత యాయాసము కలిగినదియో కదా! కావున మీకుఁ దప్పక నాకలివేయుచునే యుండును. నా నిమిత్తముననేఁ గదా తమకిట్టి కష్టము సంప్రాప్తమగుట! మీకీవడిగాడ్పుల కెంతగ డస్సితిరో! నేను కొన్ని ఫలంబులను సేకరించి యుంచితిని. ఇదిగో గంప! ఈగంపలోని పండ్లను వివరముగాఁ జూపించెదను. దయయుంచివానిలో మీకేఫలంబు లిష్టములో వానిని స్వీకరింపుడు. ఫలమునఁగొంత భాగమును గోసినటుల గుర్తుఁగాంచితిరా? ఆ ప్రక్కన నొక ముక్కనుగోసి రుచిజూచి నాకుసంతృప్తిని, సంతసమును గలిగించినది యగుటఁజేసి యిది శ్రీరామచంద్రమూర్తికి భోజ్యార్హమని తలంచి సేకరించియుంచితి. వెదకి తెచ్చినవి కదళీఫలంబులు. చూచితిరా? ఈ గెల యందొకఫలంబు తిక్కనిదైయున్నది. దానిని గెలగోయక పూర్వము నేను ముందుగఁగోసి రుచిఁజూచితిని. అంత ఫలంబులు రుచ్యంబులుగ నుండుటఁగాంచి గెలఁగోసి తెచ్చితిని. కాని ఫలంబులన్నియు రుచికరములుగ నుండుసను నమ్మకము లేక—చూడుడు! ప్రతిఫలమునందును గొంతకొంతఁదిని బాగుగనున్న వానిని మాత్రమే యుంచితిని. మహాత్మా! వీనిని దయతో స్వీకరించి నన్ను కృతార్థురాలిఁజేసి నాశ్రమను సఫలపఱచుడు.

రాముఁడు

అయ్యో! మామూలముననఁగదా నీకింతశ్రమకలిగినది. జననీ! క్షమింపుము!

శబరి

తండ్రీ! తమరిటులనఁజెల్లునా?

రాముఁడు

(కొలదిగ ఫలంబులను భుజించును. కొలదిగ మిగిలియుండును.)

శబరి

అన్నా! సౌమిత్రీ! నీ వీఫలంబులను స్వీకరింపుము. తండ్రీ! రామచంద్రా! నీ వింకను ఫలంబులను స్వీకరింపుము.

రాముఁడు

తల్లీ! నాకుఁజాలును. నేనింతకన్న నధికముగ స్వీకరింపఁజాలను. బలవంతపెట్టకుము. క్షమింపుము.

శబరి

సౌమిత్రీ! నీ వింకను భుజింపకుంటి వేమి!

రాముఁడు

అమ్మా! సౌమిత్రిని బలవంతపెట్టినను లాభములేదు. సౌమిత్రి యీ చతుర్దశ వర్షంబులును నిరశన వ్రతుఁడైయుండ నిశ్చయించుకొని యదినిర్విఘ్నముగఁ గొనసాగింపఁ బడుటకుఁ బ్రయత్నించుచున్నాఁడు. అతని జనని సుమిత్రయు నాతఁడు నిరశనుండై జీవించునటుల వరంబొసంగి నాతోడఁ బంపె. వాని నీ విషయమునందు క్షమింపకఁ దప్పదు. క్షమింపుము.

శబరి

తండ్రీ! రామచంద్రా! సౌమిత్రీ! గుణసాంద్రా! అదియును నాదురదృష్టమే. (తనలో) ఆహా! సౌమిత్రి అన్నకై సర్వస్వమును వదలుటయేగాక నాహారంబును నంతయేగాక ఫలభక్షణమును సైతము వర్జించినాఁడే!

రాముఁడు

తల్లీ! నీవిచటనెన్నియో దినంబులనుండి నివసించి స్థిరనివాసము నేర్పరచికొని యుంటివికదా! నీకీవనవాసము సౌఖ్యదాయకంబుగనున్న యదియా?

శబరి

సౌఖ్యముగనున్నదా యనియా నన్ను బ్రశ్నించుచుంటివి? ఆ—సౌఖ్యముగనున్నదా యని ప్రశ్నించితివా? తండ్రీ! ఎంతపిచ్చివాఁడవు. రామచంద్రా! నీయంత పిచ్చివాని నా కెందును గానుపించలేదు! సౌఖ్యమను మాటకర్థముఁ దెలియనెంచు ప్రతివారును నిందు నిలచిననే—నిచట నివాసమేర్పరచు కొనిననే—సౌఖ్యమను పదంబున కర్థమును గ్రహింపఁ గలుగుదురనిన నిందలి సౌఖ్యమును నీవు గ్రహింతువు గాక!

రాముఁడు

తల్లీ! ఈ తీర్థప్రభావంబు భాసిల్లెను. విని సంతసించెదను.

శబరి

తండ్రి! ఇది మతంగముని పుంగవుఁడుండి పోయిన యాశ్రమంబు. అదియే మతంగ పుంగవుండు స్నానంబాచరించిన సరోవరంబు! అవియే వారిచే బెంపఁబడిన సారంగ సంతతి. మహాత్మా! మతంగమహర్షి పుంగవుని మాహాత్మ్యంబులు వర్ణింప నాబోటి యల్పజ్ఞురాలికి సాధ్యమా? ఈ యాశ్రమంబు మీపాదధూళి సోకినంతనే పవిత్రతమము లాయెను. నేను మీ కాతిథ్యంబొసంగి ధన్యనైతిని.

సౌమిత్రి

తల్లీ! అటులనుట భావ్యంబా! శ్రీరామచంద్రమూర్తి మొదటనే మనవిఁజేసి యుండెను గదా మమ్ములను నీకన్నపామరుల భావింపఁదలంచుమని.

శబరి

అట్లనకుము తండ్రీ! సౌమిత్రీ! అటులెన్నటికిఁ దలంపఁజనదు! రాముఁడనినంత మాత్రముననే నీయన్నగ మాత్రము భావించితివా? జగమంతయు, సృష్టియంతయు నాతనినే రమించుటఁజేసియే యీరామునకు రాముఁడను నామమువచ్చినది.

రాముఁడు

(తనలో) ఈమెజన్మము ధన్యము ! నేనాదివిష్ణుఁడనని యీమె గ్రహింపఁజాలినది. కాని, యీ సౌమిత్రి యెవఁడని గ్రహించినదో! పాపము! ఆదిశేషుఁడే యీ సౌమిత్రి యని గ్రహించలేదు. కానిమ్ము! ఈమె మూఢభక్తియే విజయవంతంబగుఁగాక!

సౌమిత్రి

తల్లీ! ఈరాముఁడు సర్వజగన్నియామకుఁడని ధైర్యముగఁ బలుకుచున్నావు. సంతసము. నీవలన నేర్చికొనిన విషయము లత్యమూల్యములు. అనితరములు. అమ్మా! రాముఁ డీరాత్రికి ఋశ్యమూకంబును జేర నెంచియున్నాడు. కావున నేడీ రామచంద్రుని వీడ్కొలుపుము.

శబరి

రామచంద్రా! ననువీడి ఋశ్యమూకంబును నేటిరాత్రికిఁ జేరఁదలంచియుంటివా?

రాముఁడు

ఔనమ్మా! నేనచటికేగి సుగ్రీవాది వానర శ్రేష్ఠులతోఁ గలసి వారితోఁ బ్రసంగించవలసిన విషయము లనేకములుఁగలవు. మేమే విషయమును గుఱించి మాటాడఁ దలంచియున్నదియును దమకుఁ దెలిసియేయుండును గదా! అందులకై నేనేగవలయును.

శబరి

తండ్రీ! నాకిదివఱకే దెలిసినది. క్రూరదైత్యుని మర్దనము చేయ నెంచియేగదా! సరి-పెద్దదాననగు నేనాశీర్వదించెదను. రామచంద్రా! భవదీయ ప్రయత్నము ఫలించుఁగాక! రామచంద్రా! నేనీ యిహసుఖంబులఁగోరను. నేనింతవఱ కనుభవించిన ప్రాపంచిక సుఖంబులు చాలును. నాదగునంత్యకాలము సమీపించియున్న యదియని నేనెఱుఁగుదును. అందులకైయే నేను నీరాకకై యెదురుఁజూచుచు వేచియుంటి. నేటికా కోర్కెయు నీడేరె! నేను మతంగాది మహర్షి పుంగవుల పరిచారికనను సంగతి మీకింతకుమున్నె విశదీకరించు కొంటినిఁగదా! నేనింకవారి కడ కేగఁదలంచి యుంటిని. వారు నాకమున కేగిరి. వారు చనునప్పుడు రామదర్శనంబందినంతనే ముక్తిఁగలయఁగలవని యానతిచ్చియుండిరి. కావున దయఁజేసి యనుగ్రహించి యీయైహికంబులను వీడి నేను బరమార్థమును బొందననుజ్ఞ నొసంగుచు ననువొనరింపఁ బ్రార్థించుచున్నదానను. అనుగ్రహింపుము.

రాముఁడు

శబరీ! నీకోర్కె పావనము. నీయిచ్ఛమైఁ బ్రవర్తింపుము! మేమును బయలువెడలి రాత్రికి ఋశ్యమూకంబును జేరఁబ్రయత్నింతుము.

(అందరు నిష్క్రమింతురు)

# కనులపండువు

శ్రీమతి. జాగర్లమూడి. జానకమ్మగారు

శ్రీ చెన్నపురము భగవంతుని సృష్టినిపుణతను వెల్లడించు నగరంబులలో నొందనుటకు తార్కాణ మగుచున్నది. అందు వీధినిజూచినయెడ తీగవలయును. ఇరుమైళ్ళనిడివిగల మెరీనారోడ్డు తారుపూయబడి యుండు టచే నల్లనిగచ్చు చేయబడియున్నట్లు చూచుటకింపుగ నుండును. దీపములు వెలిగించినపిమ్మట మరింతసొంపు గులుకుచుండును. నక్షత్రమాలికలరీతి విద్యుద్దీపములు చూడ మనోహరములై ప్రకాశింపుచుండును. సుమారు నాలుగు గంటలు మొదలు యొక్కొక్క మోటారుగవచ్చి బారులుదీరి నిలచియుండుటజూడ ముచ్చటగ నుండును. వివిధజాతులకాంతలు తమ బంధుమిత్రులను గూడి నానావిధాలంకారములచే నుత్సవాదుల కేగువారివలె నుల్లాసంబున నేగుచుండుట జూడ నానందంబగుచుండును. బిడ్డలనెత్తికొనియు ఒండొరుల కరంబులబట్టుకొనియు వినోదంబున షికారునడచు యువతీయువకులను జూడ ముచ్చటగ దోచుచుండును. నిర్మలమైన పులినప్రదేశంబున అచ్చటచ్చట గుంపులై నెచ్చెలులగూడి సుఖాసీనులై కాంతలు నానావిధముగ సంభాషించుకొనుచు విచారంబుల మరచి నిశ్చింతలై యుందురు. ఇసుకలో నిండ్లను గోపురంబులను గట్టికొనియు రథికగంగంబులలో నాట్యంబుల సల్పియు ఇందునందు పరుగిడుచు వినోదించు బాలురను, సముద్రతరంగంబుల లెక్కబెట్టువారివలె నొకటివెంట నొకటిగ వచ్చు యలలజూచుచు రత్నాలయగంభీరతను భగవంతుని విచిత్ర మహిమంబును వెల్లడింప జేయుటకై వెలసిన సాగరమును జూచి అక్కజమంది కదలక మెదలక గూర్చుండి యుండు స్త్రీపురుషులును గగ్గి నేల యీనినట్లు నిసుక ప్రదేశంబంతయు నిండియుండుటజూడ నింపారుచుండును.

అట్టిసాగర తీరంబున చల్లనివాయుస్పర్శచే దేహంబులకు హాయిదోప నిర్మల వాయువు వీచుటచే మనస్సున కానందముదోప ఎంతసేపు గూర్చున్నను విసుగుదోపకుండుట కాశ్చర్యంబేమున్నది? చిన్నచిన్న గృహంబుల వసించుటచేతను పనిపాటలచే నలసియుండుటచేతను తాపముచే చిరాకు నొందినవారలకు సముద్రము జేరవచ్చినంతమాత్రమున సకలక్లేశంబులు పటాపంచలై పోవుట నిశ్చయంబగు. భగవంతుని మహామహిమంబుల వినుపించులాగునను ప్రపంచంబు మాయాసహితంబు సర్వలోకంబులు గడపటనాలోనే గలియును గాన దేహంబున్నంతలోనే సద్ధర్మంబు లాచరించి భగవంతుని యందుభక్తిభావంబుంచి పరమాత్మని గలియువిధంబు తెలియుడని నొక్కి జెప్పెడి మాడ్కి ఘోషించెడి యలలజప్పుడు విన్న నేరిమనంబు గరుగకుండును? ఎడతెగక నొకటివెంట నొకటిగ వచ్చుచు నురుగులుగట్టుచు పైకెగరుచు మహాఘోషంబునవచ్చెడు తరంగంబులు సంసారసాగరంబున నెడతెగకవచ్చెడు కష్టపరంపరల దోపజేసెడు. దీపంబులు వెలిగింపబడిన స్టీమరులగాంచిన భగవంతుని నమ్మి భజించిన సంసారసాగరంబునముంపక ఇటులనే జ్ఞానదీపం బొసంగి తీరంబుచేర్చునని జాటుచున్నట్లుండును. హార్బరునందున వరుసగ వెలిగెడి విద్యుద్దీపములును విశాలపులిన ప్రదేశంబును అందు వినోదంబున ప్రొద్దుబుచ్చు ప్రజలను వచ్చుచు బోవుచునుండెడి మోటారులు గుఱ్ఱపు బండ్లు ద్విచక్రశకటములును షికారునడచెడి జనులను గాంచిన కనులపండు వగుచుండును.



## పాడిపశువులు—పాలగుణములు.—

'రెడ్డిరాణి' పత్రికలో శ్రీయుత యేజెళ్ల. శ్రీరాములు చౌదరిగారు 'పాడిపశువులు—పాలగుణములు' అనువిషయమునుగూర్చి యిట్లు వ్రాయుచున్నారు.

"ఆరోగ్యవంతులును, అనారోగ్యవంతులును, పసిబిడ్డలును పాలనువినియోగించుచున్నారు. పాలు సామాన్యముగ బలము కలుగజేయు ననుసంగతి నెల్లరకు తెలిసినవిషయమే కదా! కావున పాలిచ్చు పశువులు కూడ బలముగలవిగ, ఆరోగ్యవంతములుగ నుండవలయును. లేనిచో రుగ్మతగల తల్లిపాల గ్రోలిన శిశువు లెంత అనారోగ్యకరముగ నుందురో అదేరీతిగ నారోగ్యములేక బక్క చిక్కినట్టి పాడి పశువుల క్షీరము గ్రోలినవారుకూడ నబలులగుటయే గాక రోగపీడితులగుటలో నాశ్చర్యమేమియు లేదు. కాబట్టి పాడిపశువు లారోగ్యముగ నుండవలెనననిన వానిని కట్టివేయు కోష్ఠములు సాధ్యమైనంత పరిశుభ్రముగ నుండవలయును. వాని యాహారవిషయములలో తగు జాగ్రత్తవహించి కాపాడవలయును. ప్రతిదిన మొకసారియైనను పశువు దేహము మురికిలేకుండ కడుగవలయును. పట్టణములలో గొల్లవాండ్ర నేకులు నిరు పేదలగుటచే యేగడ్డియో నొక తుక్కుగడ్డివేసి పశువుల రక్తమాంసముల సయితము పితికి తన్మూలమున జీవించుచున్నారు. వారి పశు నిలయముల కేగినచో దుర్భరంబగు దుర్గంధములచే నిముసమాత్రమైన నందు కాలు నిలుపుటకు వీలులేకుండును. అట్టిప్రదేశములయందు రాత్రింబవళ్లు పశువులను కట్టినచో అవి ఆరోగ్యముగా నెట్లుండగలవు? పాడిపశువుల పాలు పితుకువారు సయితము ఆరోగ్యవంతులుగ, పరిశుభ్రత గలవారుగ నుండవలయును. ముఖ్యముగ పాలను పితుకు వాని హస్తములు శుచిగా నుండవలెను. అనేకమంది వ్యాధిగ్రస్థులే మనకుపాలను పిండియిచ్చుచుండుట మనము కన్నులార గాంచుచున్నారము. కాని అందువలన గలుగుప్రమాదములు మన మేమాత్రము గ్రహించుట లేదు. ఇంతియేగాక పాలనమ్ము వారు పాలలో నీళ్లుపోయు పద్ధతి మహాఘోరముగా నున్నది. ఆపాలు త్రాగినచో ప్రయోజనము లేకపోవుటయేగాక పెక్కురోగములుకూడ తటస్థించుచున్నవి. నీరుకలిపిన పాలు నీలి రంగుగ నుండును. గ్లాసులో పోసి చూచినచో నీలవర్ణముగ కనుపడును. మామూలు పాలకంటె నీరుకలిపిన పాలు తేటగా నుండును. నోటిలోపోసికొని చూచినయెడల గప్పగను, అరుచిగను ఉండును. మంచిపాలు చిక్కగను, మధురముగను ఉండును. నీరుకలిపిన పాలు మామూలు పాలకంటె త్వరగా పులుపెక్కును. మామూలుపా లొకపాత్రలో బోసి కొంచెము సేపుంచినచో పైభాగమున అట్టమాదిరిగ మీగడవంటి పదా

ర్థము పేరుకొనును. నీరుకలిసిన పాలపైన ఆరీతిగ పేరుకొనదు. నీరుకలిపిన పాలలో వెన్నత్వరగారాదు. మంచిపాలలో వెన్న నిముషములో వచ్చును.

పశువుల జాతినిబట్టియు, వానికి పెట్టు ఆహారమును బట్టియు, అవి యీనిన ఋతువులను బట్టియు పాలగుణములు మారుచుండును. పసుపురంగుగల పాలలో వెన్నను కలుగజేయు క్రొవ్వుపదార్థ మెక్కువగా నుండును. జిగురుకలిగి చిక్కగనుండు పాలలో పెరుగును గలుగజేయు పదార్థ మెక్కువగానుండును. నీలి రంగుగలపాలు రుచికి తియ్యగనుండునుగాని అందులో మీగడ, వెన్న ఎక్కువగారాదు. చిక్కనిపాలకంటె పలుచనిపాలే శిశువులకు, రోగులకు ప్రశస్తము. శేర మంచిపాలలో నొక నవటాకు వెన్నయుండును. పశువు వయస్సుముదిరినకొలది పాలు చిక్కబడును. మాడి పశువుపాలు శిశువులకు మంచివికావు. ఇంకను పాలలో నుండు ద్రవ్యములలో గొన్ని యెక్కువగా నుండుటవలనను, తక్కువగానుండు పశువులయొక్క పాలొక్కొ క్కప్పుడు కొంచెము నీలివర్ణముగానుండి పలుచగనుండును. పాలొక్కొక్కపుడు తీసినవెంటనే కరుడు గట్టును. ఇందుకు కొన్ని సూక్ష్మజీవులే కారణము. ఒక్కొక్కప్పుడు పాలు తీసిన కొంతసేపటికి అవి చిక్కగ, జిగురుగ నగును. ఇందుకు నుఁ కొన్ని సూక్ష్మ జీవులు కారణము. ఒక్కొక్కప్పుడు పాలు కొంచె మెరుపురంగుకలిగి యుండును. ఈరంగు పొదుగులోనుండు పాలలో రక్తము కలియుటవలన గలుగును. ఈపాలు కదుపకుండ నుంచినచో రక్తసంబంధమగు పదార్థములు క్రిందికిదిగును. ఈరీతిగనే పాలు తీసిన కొంతసేపటికి నెఱ్ఱబడుటయు, మిగుల పల్చబడుటయు, చేదగుటయు, వివిధములగు సూక్ష్మజీవులచేత యని కొందరి శాస్త్రజ్ఞుల యభిప్రాయము. పొదుగు కొంతవఱకు మూత్రపిండములవలె శరీరమందుండు కొన్నివిధముల మాలిన్యములను దీసివేయుటకుగూడ నుపయోగపడును. మేతయందుండు కొన్నిద్రవ్యము లిట్లు తొలగింపబడును. కావున పాలస్వభావము మేత మార్చగలదు. కొన్ని ద్రవ్యములతో గూడి మేతమేసిన పాడిపశువుల పాలు మనుష్యులకు జబ్బుచేయును. పాలవలన క్షయ మొదలగు వ్యాధులు సంభవించును. కొన్ని పశువులొక్కొక్కప్పుడు ఈనుసమయము వచ్చినను పాలిచ్చుచుండును. ఇది నొకవ్యాధిగా పరిగణింప నవసరము లేకున్నను జంతువు యొక్క బల మిందువలన క్షీణించును. కావున యీనుటకు కొన్ని నెలలముందు పాలిచ్చుట మాన్పవలెను. ఇంకను పాలగ్రంథులకు విశ్రాంతి గలుగనియెడల యీనినవెనుక పాలు తగ్గవచ్చును.

10 వేల పాళ్ల ఆవుపాలలో 8717 పాళ్ల నీరు, 355 పాళ్ల మాంసకరపదార్థములు, 488 పాళ్ల ఉష్ణకరపదార్థములు, 71పాళ్ల ఉప్పు, 369 పాళ్ల నేయి కలిగియుండును. ఆవుపాలు మధురముగ నుండును. వీర్యపుష్టి, బలము కలుగును. రోగులకు శిశువులకు గోక్షీర మత్యావసరము. ఈ పాలలో పుష్టిని కలుగజేయు పదార్థము లెక్కువగా నుండును. నలుపురంగుగల కామధేనువుయొక్క క్షీరము వాతహరము, పైత్యమును పోగొట్టును. ఎఱుపురంగుగల గోవుపాలు వాతహరము, కఫమును పోగొట్టును. తెలుపురంగుగల ఆవుపాలు శ్లేష్మకారి. గురుత్వము చేయును. కపిలగోవుపాలు నేత్రములకు చలువ చేయును. నిడుపుకొమ్ములుగల ఆవుపాలు వృద్ధులకు, ధాతువు క్షీణించినవారికి అనుకూలముగ నుండును. బోడిఆవు పాలు పీనస గలిగించును. వాతపైత్యముల హరించును. తొలియీతావుపాలు శ్లేష్మవాతములను పోగొట్టును. రెండవఈతపాలు వాతము పోగొట్టును. మూడవఈతపాలు శ్లేష్మవాతములను పోగొట్టును. నాల్గవఈతపాలు త్రిదోషముల హరించును. అంతకంటె యెక్కువ యీతలీనిన పశువుపాలు త్రిదోషముల హరించును. లేగటిఆవుపాలు శీతలము, వాతముచేయును. తరిపిఆవుపాలు తాకజేసి వాతమును హరించును. తెలికపిండితినిన ఆవుపాలు గురుత్వము కఫము జేయును. ప్రత్తిగింజలు తినిన ఆవుపాలు వాతము జేయును. అపథ్యమైనవి. ఎండుగడ్డి

మేసిన ఆవుపాలు త్రిదోషరహితముగ నుండును. కుడితి త్రాగిన ఆవుపాలు పడిశము, అరుచి పుట్టించునని వస్తుగుణదీపిక తెలుపుచున్నది.

10 వేల పాళ్ల గేదెపాలలో 8141 పాళ్ల నీరు, 610 పాళ్ల మాంసకరపదార్థములు, 415 పాళ్ల ఉష్ణకరపదార్థములు, 81 పాళ్ల ఉప్పు, 747 పాళ్ల నేయి యుండును.

ఆవుపాలకంటె గేదెపాలు చౌక. గేదెపాలు చిక్కగానుండి చలువచేయును. గేదెవెన్న ఆవువెన్నంత రుచిగా నుండక మిక్కిలి తెల్లగా నుండును. ఆవువెన్న కొంచెము పసిమివర్ణముగ నుండును. గేదెపాలలో నున్నంత నెయ్యి తక్కినపాలలోలేదు. లవణపదార్థములు సహితము దీనియం దెక్కువగానున్నవి కాని ఈ పాలు త్వరగా జీర్ణము కావు. అందువలన రోగుల కివి యపథ్యములు. గేదెపాలు వీర్యవృద్ధి, దేహముపుష్టి కలిగించును"

## స్త్రీవిద్యావశ్యకత.—

ఈ విషయమునుగూర్చి బలభద్ర కోటయ్యగారు 'సత్యసాధని'లో నిట్లు వ్రాయుచున్నారు.

"విద్య పురుషులకంటె స్త్రీల కతిముఖ్యమనుట కనేక కారణములుగలవు. శిశుపోషణకు వలెనే బిడ్డలకు విద్యాబుద్ధులు గఱపుట యందును స్త్రీలధిక నేర్పుగలిగియుందురు. బిడ్డలు కలుగఁజేయు శ్రమలన్నిటిని వహించునంతటి సహనము స్త్రీల యం దధికముగ నుండును. గురువుల యందుండవలసిన సమస్త ధర్మములలో ముఖ్యమైనది దయ. దాక్షిణ్యమనునది స్త్రీల పైపుననే స్థాపింపబడినదన వచ్చును. విదేశముల యందు బాలికలకు మాత్రమే గాక బాలురకు సైతము ప్రారంభవిద్య గఱపుటకు స్త్రీల నుపాధ్యాయినులుగ నుంచెదరు. ఉపాధ్యాయినులుగా నుండుటకు బనికివత్తురు గావున స్త్రీలకు విద్యనేర్పుట ముఖ్యము. వశీకరణ విద్యయందు స్త్రీలధికులు. అది వారియందలి సహజగుణము. ఒకప్పుడు చల్లపల్లి బాలికాపాఠశాలలో బాలికలకు బహుమతులిచ్చు సందర్భమున నధ్యక్షత వహించిన కోపల్లె కృష్ణారావుపంతులుగారిట్లనిరి. 'కర్జను ప్రభువు హిందూదేశమునుండి యింగ్లండుకు బోయి వెలిబుచ్చుచున్న తన ప్రవాస చరిత్రమున, హిందూదేశమున స్త్రీలు చదువను వ్రాయను జాలరు సరిగదా గడపదాటి వెలికివచ్చి మాటాడనైన జాలరు. కాని అది యేమి ప్రజ్ఞయో తమ పురుషులను పట్టివంచినటుల వారిచేత దమకు గావలసిన వానిని చేయించుకొనగలరని తెలిపియున్నాడు. మనమెప్పుడైనను స్త్రీల వశమున నుండకతప్పదు. కావున వారికి మంచి మంచి మార్గములను చూపినచో మనచేత మంచి కార్యములనైన జేయింతురు.' కావున స్త్రీలకు విద్య నేర్పవలయును. పూర్వులిట్టి సందర్భముల నెన్నిటినో గమనించి స్త్రీని విద్యాధిదేవతగా నేర్పఱచియున్నారు. స్త్రీని విద్యాధిదేవతగాజేసి. విద్యాభివృద్ధికై స్త్రీని ప్రార్థించు దేశమున స్త్రీలకు విద్య తగదనుట వెఱ్ఱితనము.

## ఆనందమయమగుఅనుభవము.—

గాంధిమహాత్ములవారు ఆంధ్రదేశసంచారమును గూర్చి "యంగుఇండియా"లో వ్రాసిన ఈ వాక్యములను ఆంధ్రస్త్రీలు సంతోషముతో చదువగలరు.

ధనమును సమర్పింప గోరువారు యథాశక్తిగ నియ్యదలచిన తృణమోపణమో చాల ప్రీతితో నిచ్చుచున్నందున ఆశాసంతసములు పొడముచున్నవి. తునిలో స్త్రీలసభ జరిగినపిమ్మట నేనీ వాక్యములను వ్రాయు

చున్నాను. 75 ఏండ్ల వయసుగల పేదరాలగు నొక వృద్ధురాలు నేలమట్టమునకు వంగిన నడుముతో నాకడకు వచ్చి నేత్రములందును ముఖమునందును ఆనందవికాసము గోచరింప ఒక పావలాకాసు (నాలుగణాలు) సంతృప్తితో నాచేత బెట్టినది. వెంటనే మధ్యవయస్కురాలునగు మరియొక స్త్రీ ఖద్దరుచీర కట్టుకొనివచ్చి 5 రూపాయలను ఒక కానిని నాకొసగినది. "మీరిద్దరు నిచ్చిన మొత్తములలో నేది ఘనము?" అని నేను మధ్య వయసు స్త్రీ నడిగితిని. "రెండును సమమే" అని ధైర్యముగా తెలిపినది. ఆమె అటుల ననుటవలన నాకపరిమితమగు నానందము కలిగినది. ఏలననగా వృద్ధసోదరి యొసగిన నాలుగణాలును తానొసగిన అయిదురూపాయిలును సమానమే అని ఆమె అనునని నేననుకొనలేదు. "నేను పెక్కువత్సరములనుండి జాతీయోద్యమమునందాసక్తిని గలిగియున్నాను. నాకు ఖద్దరునందు నమ్మకము కలదు. నేనెల్లప్పుడును ఖద్దరునే కట్టెదను" అని ఆమె నుడివెను. ఆంధ్రదేశ సంచారమునందు సంతోషప్రదములగు నిట్టి అనుభవములు నాకు ప్రతిదినమును పెక్కుసారులు చేకూరుచునే యుండెను.

పాలిచ్చు గోవువధ.—

ఏప్రియలు మాసము 'యంగు ఇండియా' పత్రికలో ఇట్లున్నది.

"శ్రీ సెత్. గోవిందదాసుగారు ఈ ప్రశ్నను, లెజిస్లేటివ్ అసెంబ్లీలో చర్చకు తెచ్చిరి. ఈ దేశములో పిల్లల మరణముల సంఖ్య, భయంకరముగా గొప్పదిగా యుండుటకు కారణము పాలకొరతచేనని జ్ఞాపకముంచిన గోవధలగుటచే, యీ గోహత్యప్రాముఖ్య మెంతటిదో బయలుపడును. ఈ దేశములో సేనలలోనుండు హూణదేశభటుల తిండికొరకై మూడేండ్లకు పైగా తొమ్మిది లక్షలలోపు గానుండు గోజీవములే బలియివ్వబడుట, ఈ హత్యావ్యవసాయమునకు కొంత నిదర్శనము గదా! గోమాంసమే సైనికులకు అంతముఖ్యయాహారమని తలంచబడునెడల కొంతభరించి హాస్యాస్పదమైనను సరే. యితర దేశములనుండి అట్టిమాంసమును దిగుమతిచేయించుట మంచిది. శ్రీ సెత్ గోవిందదాసుగారు తెలిపినట్లు కోట్ల పిల్లలు నోట్లలోటుచే ఆపబడినను ఈ పశుహత్యవల్ల గలుగునష్టము మరచిపోదగినదని కాదు, గోవులకొరతచే పాలలేమి కలుగుటయే కాదు ఎడ్లకఱవుకూడగలుగుచున్నది.

నిమ్మపండురసము.—

ఈ విషయమును గూర్చి "ప్రకృతి" పత్రికలో వ్రాయబడిన వ్యాసమునుండి క్రింది భాగములు ఉద్ధృతములు:—

"ఆరోగ్యము కలిగియుండవలెనన్న రక్తము పరిశుభ్రముగను సమృద్ధిగను నుండవలెను. రక్తము పరిశుభ్రముగ నున్నచో సాధారణముగా నెట్టి వ్యాధియును కలుగదు. కావున రక్తమును మిక్కిలి పరిశుభ్రముగ నుంచుకొనుట కెల్లప్పుడును ప్రయత్నము చేయుచుండవలెను. నిమ్మపండ్లరసము రక్తమును శుద్ధి చేయుటలో మిక్కిలి శ్రేష్ఠమైనది. బాగుగా పండిన పండ్లరసమునే త్రాగవలెను. బాగుగా పండిన నిమ్మపండ్ల రసము రుచికి పుల్లగానుండును. నిమ్మపండ్ల రసమును త్రాగినచో రక్తము పలచబడుననియును, ఎండిపోవుననియును కొందరనుచుందురు. ఇది వివేకములేని మాటయని నమ్మవలెను. రక్తములో మలినములు విస్తారముగ చేరినచో నది చిక్కబడును. నిమ్మరసము ఆ మలినములను తొలగించును గాన రక్తమందువలన పరిశుద్ధమై యెప్పటివలె పలచగానుండును. కాని నిమ్మరసమువలన రక్తము పలచబడదు. కాలేయమును (లీవరు) శుద్ధి చేయుటలో నిమ్మరసమునకు సాటియైనది మరియొకటి లేదు. క్రిమిసంహారణశక్తి నిమ్మరసములో సహజ

ముగానే యున్నది. కురుపులు, నరుహులు, పుండ్లు మున్నగునవి కలిగినచో నిమ్మరసమును వానిపైన రాచిన రెండలనవి మానిపోవును. నిమ్మరసమును లోపలికి ద్రాగినచో విషజ్వరము (టైఫాయిడు), మాంససంతానిక (డిఫ్తీరియా) మున్నగు వ్యాధులను కలిగించు క్రిములను గూడనశింపజేయును. నిమ్మరసమును లోపలికి పుచ్చుకొనినచో మొటిమలు వ్రణములు మున్నగునవి గూడ శీఘ్రముగ నయమగును. ఎండలోపండిన నిమ్మపండు రసము మిక్కిలి శ్రేష్టము. రోజుకు కనీసము మూడు నిమ్మపండ్లరసమునైన త్రాగవలెను. ఉదయమున ఒక గ్లాసులో నీళ్లుపోసి ఒక నిమ్మపండు రసముదానిలో పిండి త్రాగుట చాలమంచిది. రాత్రిపరుండబోవునపుడు గూడనటులే చేయవలెను. మధ్యాహ్నము మరియొక పండురసమును త్రాగవలెను. వండిన పదార్థములను తినువారు అన్నములో కలుపుకొనుట మజ్జిగలో పిండుకొనుటమున్నగు వానివలన గూడగుణము కలుగును. కాని ఉదయమున ప్రత్యేకముగ పుచ్చుకొనుటవలన నధికమగు గుణము కలుగును. చక్కెర చేర్చగూడదు. నిమ్మనారింజిపండ్లు జలుబుచేయునని యొకప్పుడు భావించుచుండిన వైద్యులుకూడ వీని మాహాత్మ్యము నిపుడు తెలిసికొనుచున్నారు."

**మద్దిపట్ల. వేంకటరమణయ్యకవి యకాలమరణము.—**

1929–వ సంవత్సరము ఏప్రియలు నెల 27–వ తేదీ నాటి "ఆంధ్రపత్రిక"లో చాగంటి. విశ్వపతిశాస్త్రి (బి.యె) అనువారు ఇట్లు వ్రాయుచున్నారు.

"వేంకటరమణయ్యకవి నరసాపురము తాలూకాలోని మొగలితుఱ్ఱు గ్రామమున జనించెను. నరసాపురము హైస్కూలులో స్కూలుఫైనలు పరీక్షయందు కృతార్థుడై 1915 సంవత్సరములో రాజమహేంద్రవర కళాశాలయందు ఇంటర్మీడియేటు క్లాసులోజేరెను. అప్పటికే ఆతనికి తోడి వారికంటె స్వభాషాజ్ఞానము అత్యధికముగా నుండెను. ఆసంవత్సరమే బ్రహ్మశ్రీ పడ్డాది. సుబ్బరాయకవిగారు తత్కళాశాలయందు ఆంధ్రపండితులుగా నియమితులైరి. అప్పటినుండియు 1919 సంవత్సరములో వసురాయకవిగారు ఉపకారవేతనము గైకొనువరకు నాయనయొద్దనే భాషాసేవ చేయుచుండుటవలన బరిశుద్ధమైన భాషతో మృదుమధురమైన కవితారచనము చేయుట అతని కలవడినది. వేంకటరమణయ్యకవి గ్రంథాలయాభిమానము మెచ్చదగినది. రెండునెలల క్రిందట దనకు వ్యాధియంకురించువఱకు మహాభిమానముతో నతడు రాజమహేంద్రవరమునందలి గౌతమీగ్రంథాలయ కార్య నిర్వహణము గావించుచుండెను. అతనికి అంకురించిన వ్యాధి కాలక్రమమున పాండుక్షయగా మాఱి 21-4-29 ఆదివారమునాడు అపరాహ్ణము మూడుగంటలకు అతనిని మ్రింగివైచి గర్భవతిగానున్న యతని భార్యను నాలుగేండ్ల చిన్నికుమారుని దుఃఖ సముద్రమున పడద్రోసెను. మరణకాలమునాటికి అతనికి ముప్పదిసంవత్సరములు. ఈరమణయ్యకవి తన జీవితకాలమున ఆరాధనము, ప్రతిబింబము, సింహగడము, బాజీప్రభువు, శబ్దభేదనము, ఝురీతరణము మున్నగు పద్యవ్యాసములు విరచించి ప్రభవ, విభవ భారతి పత్రికలలో ప్రకటించుచు వచ్చెను. ఇతని అకాలమరణమువల్ల దేశమునకును భాషకును గలిగిన కొఱంత అనంతము. రమణయ్యకవి యాత్మకు పరమేశ్వరుడు శాంతిని ప్రసాదించును గాక!"

ఆధునికాంధ్రకవికుమారులలో ఎన్నికగన్న శ్రీయుత మద్దిపట్ల. వేంకటరమణయ్యగారి అకాలమరణము స్త్రీవిద్యాభిమానుల నెల్లరను అంతులేని విచారమున ముంచివేయగలదు. నేటి తెనుగుకైతగాండ్రు తమ గ్రంథపాఠకులలో విశేషవిద్యాగంధములేని

స్త్రీలును, బాలబాలికలును పలువురుగలరను సంగతి విస్మరించుచున్నారు. కావుననే వారి రచనములు ప్రౌఢాతిదీర్ఘసమాసములతో పిక్కటిల్లుచు విశ్వశ్రేయమునకు దూరమగుచున్నవి. సరసులగు ముగ్గురు నలుగురు కవికుమారులు మాత్రము సులభసుందరశైలిలో కావ్యపుష్పములను వెలయించి స్త్రీలకు, బాలబాలికలకు ప్రత్యేకము పద్యవాఙ్మయ సౌరభమును వెదజల్లుచున్నారు. అట్టివారిలో శ్రీయుత మద్దిపట్ల వేంకటరమణయ్యగారు స్థిర ప్రసిద్ధి గలవారు. 'భారతి' పత్రికాముఖమున లోకమునకు చేకూర్చిన వారి పద్యవ్యాసములను పఠించినవారికి పై విషయము అనుభవపూర్వకముగును. చదువనేర్చిన వారెల్లరు ఆకథలను సులభముగ నర్థముచేసికొనగలరు. ఇట్లనుటచే నవి పేలవముగ నున్నవని తలంపరాదు. ఉన్నతకవితాలక్షణములగు జిగి, బిగి, శుచి, రుచి మున్నగు వానికి వేంకటరమణయ్యగారి పద్యమాలికలయందు లోపములేదు. ఆంధ్రసారస్వతమునకు, గ్రంథాలయోద్యమమునకు వీరి మరణమువలన గలిగినలోటు తీరరానిది. తన చిత్రరచనా కౌశల్యముచే కళాప్రపంచమున అపూర్వప్రతిష్ఠగడించిన దామెర్ల రామారావు నిన్నగాక మొన్న ఇరువదియేడువత్సరముల ప్రాయముననే, చారిత్రకములగు పద్యకథలచే పాఠకలోకమును రసవాహినిలో తెప్పలు తేలించిన మద్దిపట్ల వేంకటరమణయ్య నేడు ముప్పదివత్సరముల ప్రాయమునను మరణించియుండుట మిక్కిలి సంతాపకరమగు విషయము. మఱియు ఈ యువకమణు లిరువురును రాజమహేంద్రవరపురవాసులైయుండుట గమనింపదగినది. రాజమహేంద్రవరమున మృత్యుంజయుడగు మార్కండేయ మునినాథుని ఇలవేల్పు అయి ఉండగా ఆంధ్రకీర్తిని వెలయింపగలనట్టి యువకమణులు ఆపట్టణమున అకాల మరణము నొందుటకు కారణము ఆంధ్రదేశజులు చేసికొన్న పాపఫలమైయుండును.

నవ్యభారతదేశము—స్త్రీలు.—

సోదరినివేదిత 'ప్రబుద్ధభారత' పత్రికలో 'నవ్యభారతదేశము—స్త్రీలు' అను విషయమును గూర్చి ఈవిధముగ లిఖించుచున్నది.—

"హిందూ సంఘమునకు పునర్జన్మ స్త్రీజనములవలననే కలుగునను వాక్యము తఱచువినుపించుచున్నది. ఆ వాక్యముయొక్క అసలు అర్థమును తెలిసికొనకయే పలువురు గద్దానిని పలుకుచున్నారు. నిజమేమనగా ప్రస్తుతము స్త్రీవిద్యయన స్త్రీలకు నాగరికత గఱపుట అని అర్థమగుచున్నది. మేము పలుసారులు నొక్కివక్కాణించినట్లు భారతీయుని ఆదర్శము కుటుంబసలయమునుండి మఱలించి సంఘము, దేశముపై ప్రసరింపచేయుటయే ప్రస్తుతసమస్య. ఈ సమస్యను స్త్రీల తోడ్పాటులేనిది పురుషుడు చేయజాలడు. నీతి విషయమునను, వ్యక్తి విషయమునను స్త్రీల పలుకుబడి హెచ్చు. స్త్రీల జాగ్రతలోనే జీవిత మాధుర్యము

ఇమిడియున్నది. జీవనార్థము బయటికిఁబోయి కాయకష్టముపడు పురుషునిశీలము స్త్రీజనపాలితమగు గృహమునందే నిర్మితమగుచున్నది. అగుటచే మానవుని జీవనపథమును స్త్రీలే నిర్మింపఁగలరనుట మాటికి ముమ్మాటికి సత్యము. పురుషుఁడు తెలివైనబిడ్డ మాత్రమే. స్త్రీలయొక్క పోషణము, రక్షణములయందే అతనిజీవితసుఖము ఆధారపడియున్నది. కృత్యవిభాగమున కొన్నివిషయములలో పురుషునిదే పైచేయిఅయియుండుట నిజమే. కాని జీవనపథము లన్నియు కొంచెమో గొప్పయో స్త్రీజనములకు పరిచితములై యుండవలయుననుట కూడ ముఖ్యము. సంసారసుఖమునకు భార్యాభర్తల మేలుకలయిక ఎట్లు మూలమగుచున్నదో సంఘాభ్యుదయమునకు పొరపొచ్చములేని స్త్రీపురుషుల ప్రయత్నము అట్లు అత్యవసరమగుచున్నది.

సంఘాభ్యుదయమునకు స్త్రీజనోద్ధరణము మిక్కిలి ముఖ్యమైనది. కావున మన స్త్రీల ప్రేమ కుటుంబ వ్యక్తులసేవనుండి దేశారాధనమునకై వినియోగపడవలయును. ఈసమస్యాపరిష్కారమే సభ్యనాగరికతా ప్రయత్నమునకు ప్రథమసోపానము. ఏమనఁగా? ప్రస్తుతము మన స్త్రీలదృష్టి కుటుంబవలయమునుండి దాటి పోవుటలేదు. ఆస్థితిని మనము ప్రయత్నపూర్వకముగ తొలఁగించితిమేని మన స్త్రీలయందు నూతన భావములు పెంపొంది నవ్యతేజము గలుగుటకు మార్గ మేర్పడును. అప్పుడు మన స్త్రీలకు విద్యయెడల ఆదరణ కలుగును. చదువను వ్రాయను నేర్చిన స్త్రీ జాతీయత అననేమో తెలిసికొనును. అయితే యిప్పుడొక నూతన సమస్య. బాలికలు, యువతులు చదువను, వ్రాయను నేర్చుకొనగలరు గాని పెద్దవారి మాటయేమి? ఇప్పుడు వారవి తెలిసికొననేరని కారణమున వారికి సంఘమున తగిన స్థానము లేకుండ వలసినదేనా? అవసరము లేదు. విద్య అనగా చదువను, వ్రాయను గలిగియుండుటయే కాదు. జీవితమును సన్మార్గమున నడిపించుటయే విద్యయొక్క ఫలము. రసార్ద్రహృదయము, జాతీయచరిత్ర జ్ఞానము గలిగి సుప్రసిద్ధతీర్థ యాత్రల సేవించి దేశవిషయమైన పరిజ్ఞానమును సేకరించిన స్త్రీ బహు విషయములను గూర్చి చదివిన స్త్రీకంటె వేయిమడుంగుల అధికురాలు.

ఒకప్పుడు సీత, సావిత్రి, గాంధారి, దమయంతి మొదలగు ఉత్తమనారీమణులగన్న ఈపవిత్రభూమి తిరిగి ప్రాక్తనవైభవమును పొందుటకు ముఖ్యసూత్రమగు హైందవ స్త్రీల అభివృద్ధిని గూర్చి పురుషులు నిరంతరము ప్రయత్నింతురుగాక!”

అలంకారములు.—

## 'అలంకారములు' అనుశీర్షికతో బయ్యావరపు. పళ్లంరాజుగారు 'తెలుగు' పత్రికలో వ్రాసిన ఈక్రింది వాక్యములు స్త్రీజనపఠనయోగ్యములై యున్నవి.—

“సామాన్యముగా సౌందర్యమనియు, గౌరవమనియు దలచు సువర్ణాలంకారములు అలంకారములు కావు. ఈఅలంకారములు కష్టనష్టముల పాల్జేసి, సుఖదూరులనుగా జేయునని నొక్కిచెప్పవచ్చును. తీర్థయాత్ర లప్పుడును, బంధువులిండ్లకు వెడలునప్పుడును ఇరుగుపొరుగువారివి కూడ ధరించుకొని బయలుదేరుదురు. మార్గమధ్యమున చోరులుకొట్టియు, తుదకు ప్రాణములుతీసియు తస్కరించుదురు. తల్లిదండ్రులు ముద్దుముచ్చట్లకని తమ బాలబాలికలకు వస్తువులు ధరింపజేయుదురు. ఈవస్తువుల మూలమున దుర్మార్గుల ధనాశాగ్నికి ఎంతమంది బాలబాలికల ప్రాణములు ఆహుతియై సంతోషమునకు మారుగా దుఃఖమే సంప్రాప్తమగుచుండ లేదు? శుభకార్యములప్పుడు స్త్రీలు తమకు ముక్కున నడ్డబాస లేకపోయి నప్పటికి కట్టడపు కాసులపేర్లు, నాగరపువంకీలు మొదలయినవి తెమ్మని నిర్బంధింతురు. భార్యలయొక్కయు, తోబుట్టువులయొక్కయు బాధ

పడలేక, పలుశ్రమలుపడి ఎక్కడనో ఒకచోట తెచ్చుటయు, అవి ఒకానొకసమయమున చోరగ్రస్తమై వందలు వేలు ఇచ్చుకోవలసి వచ్చుటయు తటస్థించుచున్నది. అప్పుడు శుభమున సంతోషమునకు మారుగా దుఃఖమే సంప్రాప్తమగును. ఇట్టిదుఃఖప్రదమైనట్టివియు కష్టనష్టముల పాల్జేయునట్టివియునైన వస్తువులను ధరించుట సౌందర్యమునకా, సంతోషమునకా? సౌందర్యము వస్తువులతోనే యున్నదికాని తనకేలవచ్చును? తమ్ము భాగ్యవంతు లనుకొనుటకు ఈసంగతి ఇరుగుపొరుగునను, బంధువులను తెలియజా? సంతోషమున్న పైయంశములవలన దుఃఖమే సంప్రాప్తమగుచున్నది. లాభమున్నదాయన్న అదియునున్నే. సావుకారులక్రిందను, వడ్డీల క్రిందను తనగులక్రిందను నష్టమేకలుగుచున్నది. ఇట్టి కష్టనష్టములకోర్చి చేయించుకొన్న వారలైనా ధరించుచుండిరా? అదియు కాన్పించుటలేదు. ఋణములపాలై చేయించిన నగలన్నియు ఇప్పుడు మారువాడీల యినుపబీరువాలు కెగుమతియై హెచ్చుసొమ్ము కుదువబెట్టి తక్కువసొమ్ము తెచ్చి తిరుగ వడ్డీ యివ్వవలసి వచ్చుచున్నది. ఇట్టిమితిమీరిన కష్టనష్టముల పాల్జేయు సువర్ణాలంకారములు ధరించుటయనెడు దురాచారమునకు లోబడక, గాంధిమహాత్ముడు మొదలగు మహనీయులు ఎట్టి సుగుణాలంకారములనుధరించి గౌరవనీయులై అధికత్వమునొందుచుండిరో అట్టి సుగుణాలంకారములను ధరింపజూచుదురు. ఈదురాచారము పురుషులయందు తగ్గుచున్నదిగాని స్త్రీలయందు మాత్రము పెంపొందుచున్నది. ఈదురాచారమును తగ్గించుటకై పురుషులను, ముఖ్యముగా స్త్రీజనలోకంబును ప్రార్థించుచున్నాను.”

ఆ డి బా ప లు—.

పి. సూర్యనారాయణశాస్త్రిగారు ‘గోల్కొండ పత్రిక’లో నిజామురాష్ట్రాంధ్రుల గృహజీవనమును కలుషితముచేయుచున్న నొకదురాచారమును గూర్చి యిట్లు వ్రాయుచున్నారు.

“వరంగల్, కరీంనగరం, మెదకు జిల్లాల సాంఘిక దురాచారములలో ప్రత్యేకత్వము దాల్చినది ప్రతి వసతిగలవారి యింటను పెంపబడు దాసీజన సముదాయము. మొదటి రెండుజిల్లాలలో దాసీలు బానిసలనబడువారగలే. మూడువదానిలో ‘ఆడబాపలు’ (ఆడుపాపలు) అని వ్యవహరింపబడుచున్నారు. ఈ బానిసల దుస్థితియు, వీరివలన సంఘమునకు వాటిల్లిన నైతికపతనము గాంచిన మిగుల లజ్జా విచారములు కలుగని వారుండరు.

ఈ బానిస వ్యాపారమవినీతితోడనే ప్రారంభమయి యవినీతి ప్రాధాన్యముగనే నడచుచుండును. తన శిశువునుదా బోషించుకొనజాలని యభాగ్యురాలైన పతితస్త్రీ యెవరికో దాని నొకరికి సరకువలె నమ్మికొని పోవును. చౌకగాగొనిన యాసరకును వారలు గాలికి పెంచను పెంచి తమయింట బనిచేయుటకు దగిన యీడు (౭, ౮ ఏండ్లు) వచ్చువఱకు దాని నరగింట గనిపెట్టి యుందురు. ఈ లోపలదన జీవితము బూర్తిగావించికొని పోయిన శిశు వదృష్టవంతురాలు. పాపెచిరాయు వనినటుల నాపెంపు నతిక్రమించి జీవించినది జీవచ్ఛవమే. కాని యీ బానిసత్వము జేయువారికి దమ పతితస్థితిగాని చేయించుకొనువారికి దానివలని నైచ్యముగాని తోచినటుల గాన్పింపదు.

ఈ పతిత స్త్రీజనము తఱచు దేశముఖులు, దేశపాండ్యాలు, జాగీరుదారులు, ధనికులయిన పట్వారీలు, సాహుకారుల యిండ్లలో గన్పింతురు. కరీంనగరము వరంగల్లు జిల్లాలలో దొరలని పిల్పించుకొనగోరు వారిండ్లలో నీజాతి జంతువులు కనీసము మూడునాలుగు గన్పించును. ఈ హేయజాత్యభివృద్ధిగావించుటలో నంతట నగ్రజాతీయులయిన బ్రాహ్మణులకే యగ్రత్వము నిలిచినది. వెలమదొరలు, రెడ్డిదొరలు పైపేర్కొనబడిన

పరిస్థితులందే నీ పనికి బూనుకొందురు కాని బ్రాహ్మణులు గ్రామపాచకత్వమున జీవించు వారికైనను సరియ యింటనొక 'బొంచె' [బానిస] తిరుగుచుండిన గాని నిద్దుర పట్టదు. ఇండ్లయూడ్పు, చల్లుడు, ఇల్లలుకుడు, విస్తరులు పెట్టుట, మంగలివాండ్రు దీపములు వెలిగించుటయు పళ్ళెములు వేయుటయు లేనిచోట నీ పనులును, జాకలివాండ్రట్లు తోముటయు మడిబట్ట లుదుకుటయు మామూలు లేనియిండ్లనవియు, గాళ్ళు వ్రేళ్ళు పిసుకుటయు సర్వసామాన్యమయిన పనులు. కొన్ని సందర్భములందు సౌకుమార్యము క్రుతిమించి రాగమున బడినపుడు బాహ్యమున కేగు యజమానుల వెంట 'పోరి' యొకతె 'ముంత' బట్టుకొని పోవుట చూడనిది కాదు.

ఇక నీ నీచపద్ధతివలనఁ బవిత్రముగా నెంచఁబడు నాగృహస్థుల యిండ్లెంత యవినీతి కాలవాలమయినవో విచారింతము. ఈ దాసీలకు పెండ్లి పేరంటములు చేయరు. కొందఱు దాసీదానికి యుక్తవయస్సు వచ్చిన మీద కత్తికిఁ పెండ్లి సేయుదురు. ఇట్లుచేయుట వ్యభిచారవృత్తి ముద్ర వేయుట యని యర్థము. ఆ నాటినుండి యది స్వేచ్ఛావృత్తి జరించుచుండును. కొన్ని సమయములందొక యజమానునొద్ద జీతగాండ్రఁడా యజమాను నింటి దాసీజనముతో నవినీతివర్తనమున సంచరించుచు యజమానునింటి నపవిత్రము జేయుదురు. ఈ పరిస్థితులు గృహస్త్రీల భావములు గలుషితములుగా చేయువానిలో కొన్ని సందర్భములందు యజమానుడు నీ వనితల నుపయోగించుకొనుట జరుగనిది గాదు. తలిదండ్రులయందుండు యువకులకు దుష్ప్రవర్తన మలవడుటకీ దాసీజనమే ముఖ్యకారణమగుచున్నది. ఈ విధముగ గార్హస్థ్యము నిందింపబడుచున్నది.''

నిజామురాష్ట్రమందలి ఆంధ్రప్రముఖు లీదురాచారమును త్వరలో నిర్మూలనము చేయ తపస్సుధారపోయుదురు గాకయని కోరుచున్నాము.

సూర్యనమస్కారములు—మహాత్మాజీ సలహాలు.—

నెల్లూరునందలి కస్తూరీదేవివిద్యాలయకార్యదర్శిని శ్రీమతి పొణకా కనకమ్మగారిట్లు వ్రాయుచున్నారు.—

13–5–29 తేది రాత్రి 8 గంటలకు శ్రీ మహాత్మాజీ మౌనవ్రతానంతరము వారిసన్నిధిని శ్రీ కస్తూరిదేవీ విద్యాలయబాలికలు, ''సూర్యనమస్కార విధానము'' నుచేసిజూపగా యీ క్రింది సలహాలను సంస్కరించుకొందురని తెలుపుచున్నానని శెలవిచ్చిరి. సలహాలు:—

1. ''రెండవస్థానములో నేలమీదకు వంగిన జడక్రింద పడిఅభ్యంతరముకాకుండునట్లు చుట్టుకొనవలెను. (2) 2, 3, 4, 5, 6, 7, 8, 9, వఱకు గలవిధానములలో భూషణములు మెడలోనున్నవో, నేలమీదపడుట, కొన్నిస్థానములలో గుండెకుగ్రుచ్చుకుని సరియగువిధానముననుండుట కభ్యంతరము కల్పించుట, కలుగును గాన వానిని తీసివేయవలెను. (3) పావడ, పైట మొదలగునవి బందాలుపడియుక్తముగా నమస్కారములు చేయ వీలుండదు. శరీరమునకు కావలసిన బహిరంగతయుండదు. గాన సాధ్యమయినంత వఱకు, చెడ్డీలు బిగువగు అర చొక్కాలు తొడిగించవలెను. ఇందుచే వారుసరిగా చేయునది లేనిది తెలుసుగొనగలము. (4) నమస్కార సమయములో నూపిరితీయుటకు స్వచ్ఛముగా మార్గముండ వలసినవిధిగాన, ముక్కుపుడకలు, బులాకులు ఎంత మాత్రముండ కూడదు. (5) సూర్యోదయ ప్రారంభమున సూర్యనమస్కారములు చేసినయెడల శరీరమునకు వెన్న లేనికొఱతను అయురుణకిరణములు తీర్చగలవు.''

# వనితాలోకము

శ్రీమతి సావిత్రీదేవి కన్య.—

ఈమె సింధు హైదరాబాదు పాఠశాలా సంఘమునకు అధ్యక్షురాలుగా ఎన్నుకొనబడినది. స్త్రీలలో ఇట్టి ఉద్యోగభారము వహించుటకును, అదియు ఎన్నికలో పొందుటకును సావిత్రీదేవి కన్యయే ప్రథమురాలు.

శ్రీమతి కె. మాలతి అమ్మ కన్య.—

ఈమె తిరుచూరునందలి కరింపాటనాయరు కుటుంబములలో నొక గౌరవవంశమునకు చెందినది. మొన్న జరిగిన హిందీరాష్ట్ర భాషా పరీక్షలలో ఈమె చెన్నరాష్ట్రమునకంతకును ప్రథమురాలుగా నెగ్గి బహుమానమును పడసినది.

శ్రీమతి ఫులావతి శుక్లాసతి.—

లక్నోనగరమందలి కన్యాకుబ్జ బ్రాహ్మణవంశమునకు జెందినది. ఆ బ్రాహ్మణ శాఖలో ఈమె ప్రథమ స్త్రీగ్రాడ్యుయేటు. లక్నో విశ్వవిద్యాలయము వారి యాజమాన్యమున జరుపబడు ఎం. ఏ. పరీక్షలో ఇంగ్లీషు అభిమాన శాస్త్రముగా గైకొని ఈమె జయము పొందినది.

శ్రీమతి ఆషాసేనుకన్య.—

ఈమె డిల్లీ విశ్వవిద్యాలయము రిజిస్ట్రారుగారైన యస్. కె. సేనుగారి పుత్రిక. ఈమె ఈసంవత్సరము డిల్లీ విశ్వవిద్యాలయమున బియ్యే పరీక్షలో నెగ్గి గౌరవములందెను. ఆ విశ్వవిద్యాలయమున బియ్యేపట్టా పొందెడు స్త్రీలకు ఈమె పురోగామిని.

శ్రీమతి పద్మావతి శ్రీరామ్‌గారు.—


శ్రీమతి పద్మావతి శ్రీరామ్‌గారు

ఈమె వెంకటగిరి రాజావారి పాలెస్సులో ట్యూటరుగానున్న యం. శ్రీరామ అయ్యంగారి (బి. యె. యల్. టి) సతీమణి. ఆధునికాంధ్రవిదుషీమణులలో పద్మావతి శ్రీరామ్‌గారొకరు. ఈమె రచించిన 'కెంపులడ్డిగ' యను చక్కని కథ ఏప్రియలుమాసము గృహలక్ష్మిలో ప్రచురితమై యున్నది. నరసాపురము తాలూకాభివృద్ధి సంఘమువారి యాజమాన్యమున జరుపబడు ఆంధ్రస్త్రీల బహుమతిపరీక్షలో ఈ సంవత్సర మీామె రెండవతరగతిలో ప్రథమురాలుగా జయము గాంచినది.

శ్రీమతి పి. పారిజాతంకన్య.—

ఈమె సుప్రసిద్ధులగు పి. పార్థసారథినాయడుగారి కొమార్తె. ఈ సంవత్సర మీాయువతీమణి మదరాసు విశ్వవిద్యాలయమునందు ఎం. ఏ. పరీక్షలో కృతార్థురాలైనది.

శ్రీమతి అచంట లక్ష్మీదేవిగారు. ఎం. బి. బి. ఎస్.—

ఆధునికాంధ్రమహాపురుషులలో నొక అమూల్యరత్నమును, ఆంగ్లాయుర్వేద వైద్యవిద్యలయందు అనంతకౌశలముగడించిన కోవిదశిఖామణియునగు డాక్టరు ఆచంట లక్ష్మీపతిగారికి ఈమె పుత్రిక. వైద్యవిద్యయం దారితేరి ఈమె భిషగ్రత్నమగు తండ్రికి తగిన కొమార్తెయను మాటవాసి నొందియున్నది. ఈమె ప్రస్తుతము శిశుసంరక్షణమును గూర్చి ప్రత్యేకశిక్షణమును పొందుటకు లండనునగరమునకు బోయియున్నది.

శ్రీమతి డాక్టరు సుబ్బరాయనుసతి.—

మదరాసు రాజధాని ప్రధానామాత్యులగు డాక్టరు సుబ్బరాయనుగారి సతీమణి బాగుగ చదువుకొన్నది. ఆమె కుమారమంగళము జమీాందారిణి. క్రిందటి ఎన్నికలలో సుబ్బరాయనుగారిని ఎన్నుకొన్న జమీాందారుల నియోజక వర్గమునకు ఈ మారు ఈమె ఎన్నికకు నిలుచును. సుబ్బరాయనుగారు కోయంబత్తూరో లేక సేలముజిల్లా మహమ్మదీయేతర నియోజకవర్గమునకు ఎన్నికకు నిలుతురు. మనరాజధానిలో స్త్రీలు ఎన్నికకు నిలుచుటకిదియే ప్రథమము. అగుటచే నీమె జయమును స్త్రీజనాభ్యుదయమును నాకాంక్షించు వారెల్లరు మనసార వాంఛించెదరనుట నిశ్చయము.

శ్రీమతులు మణి—లక్ష్మి.—

వీరు వైశ్యబాలికలు; అక్క చెల్లెండ్రు; బళ్లారివాస్తవ్యులు. బళ్లారియందుండు "మైత్రేయిలాడ్జి" యొక్క సాంగత్యమున వీరికి చిన్నతనముననే ఉన్నతభావములలవడెను.

బాల్యావస్థయందే వీరి తండ్రి మరణించెను. అప్పటినుండియు వీరితల్లి ఈ బాలికలను మిక్కిలి గారాబముతో పెంచుచుండెను. వీరు చిన్నతనముననే తత్త్వజ్ఞాన సమాజమునకు పోవుచు, అచ్చట దిన దినము నొసంగబడు శ్రీయుత చింతకుంట సుబ్బాశాస్త్రిలు గారి నీతిబోధకములైన ఉపన్యాసములను వినుచుండెడివారు. తారకసందేశసమావేశములకు అప్పుడప్పుడు మద్రాసునందలి అడయారునకుగూడ వచ్చుచుండువారు. ఇట్టి సజ్జనసాంగత్యమువలన వీరికి అతిబాల్యవివాహదురాచారమును తిరస్కరించు మనోధైర్యము, ఛాందసులగు బంధుజనుల ఒత్తిడిని లెక్కచేయని ధీరగుణము పట్టువడినవి. వీరిప్పుడు రాజమహేంద్రవరములోని వైశ్యసేవాసదనమునందు విద్యనభ్యసించుచున్నారు. నాలుగు సంవత్సరములైనది వారు సదనమున చేరి. ఇంగ్లీషు, తెనుగు భాషలయందును లలితకళల యందును మంచి జ్ఞానమును సంపాదించినారు.

శ్రీమతి జెయినాబ్ రహీముకన్య.—

ఈమె మంచి విదుషీ. మహమ్మదీయ మతస్థురాలు. వంగదేశమీమె జన్మభూమి. కలకత్తా నగరమునందలి డైయోసిజను కళాశాలలో విద్యబడసి ఈమె 1928—వ సంవత్సరమున బి. యె. పరీక్షయందు కృతార్థురాలైనది. ప్రస్తుతము జెయినాబ్ రహీముకన్య దినాజ్‌పురమున బాలికలకొరకు నొక ఉన్నతపాఠశాలను నిర్వహించుచున్నది. ఈ మధ్య డక్కా విశ్వవిద్యాలయము వారు ఈమెకు ఒకపోస్టు గ్రాడ్యుయేటు స్కాలరుషిప్పునొసగి యున్నారు. అగుటచే ఆమె కొలదిదినములలో డక్కానగరమునకు బోయి ఇంకను విద్యాసముపార్జనము చేయుచున్నది.

శ్రీమతి. బి. భాగీరథిఅమ్మ.—

ఈమె మళయాళపు స్త్రీరత్నము. 'మహిళ' అను స్త్రీవిషయిక మాసపత్రికకు సంపాదకురాలు. ఈ మధ్య తిరువాన్కూరునందు జరిగిన అరయారు (మళయాళదేశపు పల్లెవాండ్రు) జనుల మహాసభకు అధ్యక్షతవహించినది.



శ్రీమతి మణి.　　　శ్రీమతి లక్ష్మి.

శ్రీమతి వరలక్ష్మి —

ఈమె వైశ్యలోకమున సుప్రసిద్ధులగు శ్రీయుత గుంటూరు నరసింహారావుగారికి పినతల్లి కొమార్తె. శ్రీమతి వరలక్ష్మి గుంటూరు వాస్తవ్యురాలు. చిన్నతనముననే ఈమెకు వివాహము చేయబడెను. పరిణయమైన కొలదిదినములకే ఈమె భర్త ఇహలోకము విడెను. అప్పుడు శ్రీయుత గుంటూరు నరసింహారావుగారు ఉదారహృదయముతో సోదరి వరలక్ష్మిని చేరదీసి విద్యాసముపార్జనము నిమిత్తము రాజమహేంద్రవరమునందలి వైశ్యసేవాసదనమునకు పంపిరి. విద్యాభిలాషగల వినయవతిగావున ఆమె అచిరకాలముననే ఇంగ్లీషు, తెలుగు, సంగీతము, చిత్రలేఖనము, కుట్టుపనివగైరా నేర్చి తన ఉపాధ్యాయినుల మెప్పులందినది. తనకు విద్యాభిక్షనిడిన వైశ్యసేవాసదనమునకు ఆమె తన జీవితకాలమంతయు సేవచేయ స్థిరసంకల్పయైయున్నది.

శ్రీమతి సరస్వతి.—

శ్రీమతి సరస్వతి నైజామురాష్ట్రములో నైజాముబాదునగరవాస్తవ్యురాలైన వైశ్యబాలిక. ఒకప్పుడు ద్రవ్యవంతులైన ముత్యాలవారి వంశమునకు చెందినది. నైజాము రాజ్యమున ప్లేగువ్యాధి కల్గి అప్పుడప్పుడు కుటుంబములను నాశనముచేయును. అట్టి ప్లేగు వ్యాధి ఒకసారి పొడసూపి ఒకేరాత్రి శ్రీమతి సరస్వతియొక్క తండ్రిని, మఱదిని, భర్తను మఱి కొందఱిని మొత్తము ఏడుగురిని ఎత్తుకొనిపోయెను. ఒకేదినమున వితంతువులైనట్టి తల్లియు, తానును, చెల్లెలును నిర్ధనలై అసహాయలై మిగిలిరి. సరస్వతి పొరుగింటి మహారాష్ట్ర బ్రాహ్మణులు శ్రీనాగోజీరావుగారి భార్య శ్రీమతి భీమాబాయి, బాలికలపాఠశాలకు ముఖ్యోపాధ్యాయిని. ఈమెయందు కనికారమూని విద్యనేర్పి తన పాఠశాలలో ఉపాధ్యాయునీత్వ మిచ్చినది. కాని జీతము కుటుంబపోషణమునకు చాలకుండుటచేతను ఆమె విద్యాభిలాష మితిమీరుటచేతను సరస్వతి కొంతమంది ఉదారుల సాయమున రాజమహేంద్రవరమునందలి వైశ్యసేవాసదనమున ప్రవేశించి ఉన్నతవిద్యబడయుచున్నది.

శ్రీమతి జమున హిర్లేకారు ఎం. ఏ.—

బొంబాయి నగరమునందు సంఘసంస్కరణ విషయములలో విశేషముగ బాల్గొను యువతీరత్నము. బొంబాయి సెంటుజేవియరు కలాశాలలో నీమె ఉన్నతవిద్యబడసినది. గణితశాస్త్రము మీాకె అభిమాన విద్య. ఎం. ఏ. రెండవతరగతిలో నెగ్గి గౌరవమునందినది. ఇంటరుమీాడియాటు చదువుచుండగా 'గంగాబాయిభట్టు' విద్యార్థి వేతనమును; ఎం. ఏ.

చదువుచుండగా మానాన్కారు కన్యవిద్యాభి వేతనమును ఈమె పొందియున్నది. ఎం. ఏ. పరీక్షలో నెగ్గిన అనంతర మీయామె అలహాబాదునందలి క్రాస్తువెయిటు బాలికా పాఠశాలలో ఉపాధ్యాయినిగ చేరి మూడుసంవత్సరములు పనిచేసినది. అనంతరము ఈమె ఒక సంవత్సరము ఆఱుమాసములు ఇంగ్లండు జర్మనీ దేశములలో ప్రయాణముచేసి అచ్చటి విద్యాసాంఘిక సమస్యలను ఆమూలచూడముగ నెఱింగినది.

శ్రీమతి ఆనీ యస్. దేవదాశీకన్య.—

1929–వ సంవత్సరము మార్చిమాసమున జరిగిన మదరాసు విశ్వవిద్యాలయము వారి ఎం. ఏ. పరీక్షలో ఈమె విజయముగాంచి ప్రశస్తినందినది.

శ్రీమతి గౌరీశంకరనీ ఎం. ఏ. యల్. టి.—

విద్యాశాఖలో నూతనముగా నిర్మింపబడిన అయిదవ సర్కిలునకు (ఇందు దక్షిణ కనరా, మలబారు నీలగిరి జిల్లాలుగలవు) ఈమె బాలికాపాఠశాలల అధికారిణిగా నియమింపబడినది. ఇంతకుముందు ఈమె మద్రాసునందలి మేరీరాణి కళాశాలలో ఉపాధ్యాయినిగానుండెను. స్త్రీవ్యాయామవిద్యావిచారణసంఘమున ఈమె సభ్యురాలుగానున్నది. హార్టాగుకమిటీ ఎదుట విద్యాభివృద్ధి విషయమై సాక్ష్యమిచ్చుట కీమె ఆహ్వానింపబడియున్నది. బాలికాపాఠశాలల అధికారిణిగా (ఇన్స్పెక్ట్రెస్సు) నియమింపబడిన హిందూ కాంతలలో నీమె మొదటియామె.

శ్రీమతి కమలాదేవి ఛట్టోపాధ్యాయి.—

జినీవానగరమున జరుపబడు అంతర్జాతీయ స్త్రీజనమహాసభకు భారతస్త్రీలకు ప్రాతినిధ్యము వహింపపోయియున్న కమలాదేవి ఛట్టోపాధ్యాయి హిందూదేశమునకు తిరిగి వచ్చినపిమ్మట దక్షిణకనరా మలబారు జిల్లాల తరపున సామ్రాజ్యశాసననిర్మాణ సభలో ప్రాతినిధ్యము వహించుటకు ఎన్నికలకు నిలచును.

శ్రీమతి. సి. జి. భారతీ సతి.—

ఈమె మలబారు జిల్లాబోర్డునకును, విద్యాసంఘమునకును సభ్యురాలుగా నెన్నుకొనబడినది. ఈమె ఇంతకుముందు కొంతకాలము కాలికట్టుతాలూకా బోర్డులో సభికురాలుగానుండినది.



## పార్లమెంటు ఎన్నికలు—స్త్రీవోటర్లు.—

మే 10-వ తేదీని ఆంగ్లదేశమున పార్లమెంటు సమావేశము సమాప్తినొందినది. నిన్నటి దినమున (30 మే) క్రొత్తయెన్నికలు జరిగియుండును. మొత్తముమీద పార్లమెంటులో గల స్థానములు 615. వీనికి 1685 మంది అభ్యర్థులుగా నున్నారు. ఇందు కన్సర్వేటివు పక్షమునకు చెందినవారు 582. లిబరలు పక్షీయులు 493. లేబరుపార్టీవారు 559. కమ్యూనిస్టులు 24 గురు. ఇతర పార్టీలవారు 27 గురు. ఇంతకు పూర్వము జరిగిన పార్లమెంటు ఎన్నికలకు ఎప్పుడును ఇంతమంది అభ్యర్థులు నిలువలేదు. మఱియొక విశేషముకూడగలదు. ఈ 1685 మంది అభ్యర్థులలోను 80 మంది స్త్రీలున్నారు. ఈ స్త్రీలకు తప్పక జయముకలుగు సూచనలు గాన నయ్యెడిని. ఏమన నింగ్లాండుదేశము మొత్తము మీద స్త్రీవోటర్లే ఎక్కువగానున్నారు. వోటుగల పురుషులు 72 లక్షల 33 వేల 998 మంది మాత్రమే. స్త్రీవోటర్లన్ననో 81 లక్షల 85 వేల 710 మంది ఉన్నారు. తమ పక్షమునకు విజయము గోరువారు ఈ కారణమున స్త్రీవోటర్ల నాశ్రయింపవలసి యున్నారు. కన్సర్వేటివు లిబరలు, లేబరు పక్షీయులలో విశేషము లేబరుపక్షము వారు స్త్రీవోటర్ల నాశ్రయించియున్నారు. ఆహార పదార్థములధరలు తగ్గించుట, వితంతు స్త్రీలకు పెన్షను అభివృద్ధికరమైన విద్యాపద్ధతి, నర్సరీస్కూళ్లకు ప్రత్యేక సౌకర్యములు, బాలెంతలకు శిశువులకు సౌకర్యములు, గృహనిర్మాణము మొదలగు స్త్రీజనోపయోగ కార్యములను చేయుదునని లేబరు పక్షనాయకుడు మాక్డొనాల్డు వాగ్దానము చేసియున్నాడు. స్త్రీవోటర్లు విశేషము తమ తండ్రులు, పతులు చెప్పునట్లు చేయువారుగానుందరని ప్రవదంతి. కాని స్త్రీజనోద్యమనాయిక లీప్రవదంతి సత్యదూరమని చాటియున్నారు. కొలటదినములలో వెల్లడియగు ఎన్నికల ఫలితము లీ విషయమును రూఢిచేయగలవు.

## హింసాకరమైన వృక్షములు—

దక్షిణాఫ్రికాలో “గ్రాపిల్” అను నొక విధమయిన చెట్టుగలదు. దీని గింజలకుగల గేలంముళ్ళలో జంతువులు, సింహములు కూడ చిక్కుకొని పీల్చివేయబడినట్లయి చనిపోవును. వెస్టిండీసు దీవులలోగల ఒక మాదిరి మొక్కను ముట్టుకొనినంతనే కాల్చిన ఇనుపకడ్డితో పొడవపడినట్లుగా బాధకలుగును.

## 15 సంవత్సరముల కన్య--50 సంవత్సరముల పురుషుడు—

పురుషోత్తమదాసు అను 50 సంవత్సరముల వయస్సుగలవానికి రామాబాయి యను 15 సంవత్సరముల బాలిక నిచ్చి పెండ్లిజేయ నుద్దేశింపబడెననియు అహమదాబాదునందు జైనయువకులు పట్టుపట్టి ఆవివాహమును ఆపిరనువార్త కొన్నిదినములక్రింద ప్రకటింపబడెను. కన్య మైనరుగనుండుటచే తమ్మ గార్డియనులుగ నియమింపవలయునని ఇరువురు జైనయువకులు జిల్లా మేజస్ట్రీటుకు పెటిషను పెట్టుకొనిరి. తమ్మ గార్డియనులుగ నియమింపవలయునని పిల్ల తల్లిసోదరులు పెటిషను పెట్టుకొనిరి. జిల్లా మేజస్ట్రీటు ఈక్రిందివిధమున తీర్పుచెప్పెను:— "పిల్లతల్లిని సోదరులను గార్డియనులుగ నియమించుచున్నాను. పురుషోత్తమ దాసుగారు వివాహము చేసికొను అజ్ఞాతవిషయమై దురభిప్రాయ మేర్పడునట్లు నేమియు మాట్లాడగూడదని పురుషోత్తమ దాసుగారికి శ్లేడరు కోరియున్నారు. వివాహమాడుటకు పురుషోత్తమదాసుగారికి అజ్ఞతగలదా లేదా అనువిషయముతో నాకెట్టిసంబంధము లేదు. రామాబాయికి అతనికి వివాహము జరుగు విషయములో మాత్రము నాకు సంబంధమున్నది. ఇట్టివివాహ మాడుటకన్న రామాబాయి చచ్చిన మేలుగనుండును."

## అమెరికా దేశమున స్త్రీల పలుకుబడి.—

అమెరికా దేశమున పురుషులలో నలజడి పుట్టినది. ఏమన ఆదేశమునందలి ధనమంతయు స్త్రీలు తమకై వశమొనర్చుకొని చిక్కబట్టుచున్నారు. ఆదేశమునందలి సుప్రసిద్ధమైన బ్యాంకింగు సంఘము వారి మధ్యను కొన్నిలెక్కలను ప్రచురించినారు. ఆలెక్కలప్రకారము పండ్రెండు సంవత్సరములలోపల అమెరికా సంయుక్త రాష్ట్రమునందలి ధనలక్ష్మిలో విశేషభాగము స్త్రీల పరమగునని తెలియుచున్నది. వ్యక్తులకున్న ధనములో ఇప్పటికే నూటికి నలుబదియొక్క పాళ్లు స్త్రీలకై వశమైయున్నది. ఫినాన్షియలు మార్కెట్టుల లో స్త్రీల పలుకుబడి అతివిశేషముగానున్నది. అమెరికాయందలి పరిశ్రామిక సంఘములలో పెద్దవియగు ఐదింటియందు విశేషము స్త్రీలకే షేర్లు గలవు. అమెరికాసంయుక్త రాష్ట్రములందలి జీవితముల భీమా కంపెనీలలో స్త్రీలు నూటికి ఎనుబది పాళ్లు లాభమును పొందుచున్నారు. పురుషులలో కోటీశ్వరు లెంత మందియున్నారో కొంచమించుమించు స్త్రీలలోకూడ నంతమందియేయున్నారు. ఆదాయపుపన్ను పురుషుల కంటె స్త్రీలేయెక్కువ కట్టుచున్నారనిన అచ్చట స్త్రీల ధనసంపద గ్రహింపవచ్చును. ఇట్టిస్థితిలో అమెరికా దేశమున పురుషులలో అలజడి పుట్టుటలో ఆశ్చర్యమేమియు లేదు.

## కలకత్తా స్త్రీలు—వైమానిక శిక్ష.—

హిందూదేశమునందు పాశ్చాత్య నాగరికతకు దర్పణమనదగిన కలకత్తా నగరమందలి స్త్రీలు వైమానిక శిక్ష యెడల అత్యుత్సాహమును చూపుచున్నారు. ఆనగరమున నివసించు ఇరువురు ఐరోపియను కాంతలు విమానచోదనమును ప్రావీణ్యమును బడయుచున్నారు. ఈ ఇరువురిలో నొకయామె న్యాయమూర్తి పేజి గారి తనయ. ఆమెనామము జోనుకన్య. హిందూదేశమున వైమానిక శిక్షనందుచున్న కాంతలలో ఈమె మిక్కిలి చిన్నది. వీరు ఉభయులనుగాక ఇంకొక ఐరోపియను కాంతయు మరికొందఱు వంగరమణులును విమాన చోదకవృత్తి నేర్చుకొన స్థిరసంకల్పులైయున్నారు. ఈ సంవత్సరము ఫిబ్రవరి మొదటి తారీఖున జరిగిన బెంగాలు వైమానిక సంఘ ప్రారంభోత్సవ సమయమున కలకత్తా పోలీసు కమీషనరు అగుసర్ ఛార్లను టేగార్టు సతీమణియు, కూచిబీహారు మహారాణి పెద్దకుమార్తెయగు ఇళాదేవియు విమానమున ప్రయాణము చేసిరి.




బెసెంటమ్మ కార్యక్రమము:—

బెసెంటమ్మ పేరు హిందూదేశమున గృహనామమై యున్నది. ఆమె ఎల్లవేళల హిందూదేశాభివృద్ధి నాకాంక్షించు పుణ్యవతి. వయఃకాలము నంతయు మనదేశాభివృద్ధికి వెచ్చించిన జ్ఞానవతి. ఆమెయిప్పుడు ఇంగ్లాండు దేశమునకు పోయియున్నది. ఎందుకు? మంగలములోని వడ్లగింజలవలె మనుష్యులను మాడ్చివేయు హిందూదేశపు ఎండల తప్పించుకొనిపోయి చల్లని దేశమగు ఇంగ్లండు దేశమున చల్లగనుండుటకా? కాదు: 'కార్యము ముందు: సుఖము తరువాత' అని తలంచు ఆమె కార్యకాంక్ష శీతోష్ణ బాధలకు అతీతమైయున్నది. లండనునగరమున తత్త్వజ్ఞానమును గూర్చిన ఉపన్యాసపరంపరలైన తరువాత హిందూదేశమునకు అధినివేశస్వాతంత్ర్యము సంపాదించుటకై ఆమె కృషి చేయుచున్నది. లేబరుపార్టివారి ఎన్నికలఆశయపత్రములందు హిందూదేశమునకు స్వాతంత్ర్యమీయ బద్ధులమైయున్నామను వాగ్దానము చేయించుకొనుటకై ఆమె విశ్వప్రయత్నములు చేసినది. ఇంతతోనామె కార్యక్రమము ముగింపు నొందలేదు. ఇంగ్లండునుండి ఆమె అమెరికాకు పోనున్నది. ఆగష్టు మాసమున చికాగోనగరమున కూడనున్న తత్త్వజ్ఞాన విషయికమైన విశ్వసభలో నామె పాల్గొనును. పిమ్మట అక్టోబరు మాసమున తిరిగి భారతభూమికి వచ్చును. వచ్చి ప్రయాణపు బడలికయైన తీర్చుకొనక ఎన్నికల ప్రచారమున దుముకును. ఎనుబదిఏండ్లు నిండిన వృద్ధురాలు బెసెంటమ్మ ప్రయాసమూలకమగు నింతటి కార్యక్రమమును పూనినిర్వహించుట చూచితిమేని స్త్రీకి అబలయను పర్యాయపదము చెల్లదని మతిపోయినవారు కూడ ఒప్పుకొని తీరెదరు. విశ్రాంతియెఱుగని ఆమెకార్యదీక్షకుమెచ్చి భగవంతుడు హిందూదేశమునకు త్వరలో స్వాతంత్ర్యలక్ష్మిని ప్రసాదించునుగాక!

శ్రీమతి పెద్దాడ. కామేశ్వరమ్మగారి సంఘసేవ.—

చదువుకొనని స్త్రీలసంగతి సరే. చదువుకొనినవారు సహితము పరదాచాటు నొత్తిగించి బయటికివచ్చి సంఘాభివృద్ధికి శక్తికొలది పాటుపడు పరిస్థితు లింకను మనదేశమున ఏర్పడలేదను విషయము మిక్కిలి శోచనీయము. ఈ పరిస్థితులలో బహిరంగముగ సంఘజీవికకు యథాశక్తిని తోడ్పడు స్త్రీ రత్నములొకరిద్దఱు ఆంధ్రుల అదృష్టవశమున కార్యరంగమున ప్రవేశించియున్నారు. అట్టివారిలో శ్రీమతి పెద్దాడ. కామేశ్వరమ్మగారొకరు. ఆంధ్రదేశమున నూతనయుగప్రవర్తకులైన శ్రీ వీరేశలింగముపంతులుగారి జన్మస్థానమగు రాజమహేంద్రవర మామె నివాసభూమి. అగుటచే నామెకు సంఘ సంస్కారణాభిలాష సహజముగ నలవడ్డది. వీరేశలింగము పంతులుగారి కార్యశౌర్యమును ఒక్కింత ఆమెకు పట్టుపడినది. ఆమె ఆంధ్రమునందును ఆంగ్లమునందును చకచక ఉపన్యాసమీయగల చతరు. ఇప్పుడామెను ప్రత్యేకము ప్రశంసించుటకు కారణము రాజమహేంద్రవరమున శ్రీరామనవమి ఉత్సవముల సందర్భమున భోగముమేళముల బహిష్కారమునకై ఆమె సల్పినకృషియే. రాజమహేంద్రవరమున రామకళ్యాణోత్సవములనిన మేజువాణీయుత్సవములని పేరుమోసియున్నవి. కాని ఈ సంవత్సరము శ్రీమతి పెద్దాడ. కామేశ్వరమ్మగారి ఉపాధ్యక్షత క్రింద యువజనసమితివారు కష్టించి కృషిసల్పి తీవ్రప్రచారము నొనర్చి మొత్తముమీద ఆపట్టణమున వెలసిన 23 పందిళ్లలోను మూడునాలుగు తావుల తప్పమిగిలిన చోటులందు భోగముమేళములు లేకుండ జేయగలిరి. ఏతద్విషయమై ప్రజలలో ప్రచారప్రభోధములు కల్గించుటకు ఆమె తన కార్యశౌర్యమును వినియోగించి సభలను సమావేశముచేసినది; వక్తృత్వచాతుర్యమునుపయోగించి ఉపన్యాసము లిచ్చినది. పట్టిన పట్టు విడువకతుదకు కృతకృత్యురాలైనది. తన అసాధారణప్రజ్ఞ లేఖనీనైపుణ్యము వెచ్చించియు మూలముట్టముగ ఏదురాచారమును శ్రీ వీరేశలింగముపంతులుగారు నిర్మూలనము చేయలేక పోయిరో అట్టిదురాచారమును కొలదిప్రయత్నముచే చాలమట్టుకు అరికట్ట జాలిన శ్రీమతి పెద్దాడ. కామేశ్వరమ్మగారి ప్రజ్ఞ కడుంగడు ప్రశంసనీయము. ఈమె ఇట్లె చిరకాలము సంఘసేవయందు అప్రమత్తురాలై మెలగి దేశసౌభాగ్యమునకు యథాశక్తిని తోడ్పడుగాక యని వినీతభావముతో కోరుచున్నాము.

పడమటిగాలియా?—

మే నెల ౧౦-వ తేదీ నాటి 'ధర్మసాధని' పత్రికలో 'పడమటిగాలి' యను తలపేరిటి వ్యాసమున క్రిందటి మాసము 'గృహలక్ష్మి' పత్రికలో ప్రచురితమైన శ్రీమతి పులవర్తి.

కమలావతీ దేవిగారి 'స్త్రీలు-నాటకరంగ ప్రవేశము' అను వ్యాసము అర్థములేని తీవ్ర విమర్శనమునకు గురియైనది. దానికి ప్రతివిమర్శనము వ్రాయుట అనవసరమని తొలుత తలంచితిమి. కాని విషయము స్త్రీలకు ప్రత్యేకసంబంధము కలది కావునను అదియునొక విదుషీమణిచే వ్రాయబడినది యగుటను, విమర్శనము వ్రాసినది కూడ పేరుచెప్పకున్నను 'ఒక నారీమణి'యని ప్రచురితమగుటవలనను, పునరాలోచనమున ప్రతివిమర్శ వ్రాయుటకు సంకల్పించుకొంటిమి. 'ఒక నారీమణి' వ్యాసమును తుదముట్టచదివిన మీదట ఆమెకు పడమటిగాలి భారతీయుల పాలిటి పెనుధూళియను భావము గాఢముగ నెలకొన్నదని విస్పష్టమగును. పడమటిగాలి ప్రభావమున మన దేశమున కొనగూడిన లాభముల నామె ఒక్కటినైన పరిగణింపలేదు. అన్నియు చెలువులేనని ఆమె భావన. సదభిప్రాయమో దురభిప్రాయమో ఆమె కట్టి చింతనము కలిగినది. సరేదాని కేమి? గమనింపదగిన విషయ మేమన: స్త్రీల నాటకరంగప్రవేశములు భారతీయులకు పడమటిగాలి ప్రభావమున సంక్రమించినవనుట. ఇది భారతీయనాటక సాంప్రదాయముల నెఱుంగక వ్రాసిన వ్రాత. పడమటిగాలి ప్రభావమును నిరసించుటలో నొందిన ఆవేశముతో వ్రాసినవ్రాత. స్త్రీల నాటకరంగప్రవేశము భారతీయత్వమునకు విరుద్ధముకాదు. అది పడమటి గాలితో మన దేశమునకు కొట్టుకొని వచ్చినదియునుగాదు. గణనాతీతకాలమునుండియు మన దేశమున సుప్రతిష్ఠితమైయున్న ఆచారమే. నాట్యలోకబ్రహ్మయగు భరతమునిచే సృష్టింపబడిన ప్రయోగములు స్త్రీలవలననే రసపుష్టినొందునని కవికులసార్వభౌముడగు కాళిదాసు తన విక్రమోర్వశీయ నాటకమున ద్వితీయాంకములో

"మునినాభరతేనయః ప్రయోగో
భవతీష్వష్టరసాశ్రయోనిబద్ధః
లలితాభినయం తమద్యభర్తా
మరుతాంద్రష్టుమనాస్సలోకపాలః."

అని ఘోషించుచున్నాడు. కాళిదాసు కాలమునాటికి కూడ భారతదేశమున పడమటి గాలిప్రసరించినదని 'ఒకనారీ' మణి చెప్ప సాహసించునా?

శ్రీమతి పులవర్తి. కమలావతిదేవిగారు తమ వ్యాసమున నాట్యవిద్యాకుశలలగు వేశ్యలు నాటకరంగమున ప్రవేశించుచో నది శీఘ్రగమనమున అభివృద్ధిలోనికి రాగలదని సూచించిరి. ఇది అనుచితమైన సలహాయని 'ఒకనారీమణి' గారు చేయెత్తి చెప్పుచున్నారు. అనుచిత మెట్లు? అనుశ్రుతాచారముకాదనియా? కాదనుటకు వీలులేదు. చూడుడు, భవభూతి ఉత్తరరామచరిత్రలో నేమనుచున్నాడో—

రామః = వత్స! లక్ష్మణ !
భగవతా వాల్మీకినాస్వకృతిం
అప్సరోభిః ప్రయుజ్యమానాం
ద్రష్టుం ఉపనిమంత్రితాస్మః."

అంతర్నాటక మాడుదురని చెప్పబడిన ఈ అప్సరసలు దేవవేశ్యలే కదా? నాటక రంగమున ప్రవేశించిన పురుషులు ప్రాయికముగా చెడునడతకలవారుగా మారుచుండుటచే మనవారు ఆవృత్తియందలి గౌరవమును విస్మరించుచున్నారు. 'ఒకనారీమణి'గారు స్త్రీల నాటకరంగప్రవేశమును తెగడుటకు కారణ మిదియైయుండును. గుణశీలములు వ్యక్తిని బట్టి గల్గునుగాని వృత్తినిబట్టి గలుగవను సత్యమును 'ఒకనారీమణి' గ్రహించుగాక! "అచ్చటనున్న వెల్లనిచ్చట గూడ నుండవలెనని యొకేవెఱ్ఱి సిద్ధాంతముతో సంఘహాని కరములగు నుద్యమములు దేశములో స్థాపింపయత్నించుట ప్రమాదకరమ"ని 'ఒకనారీ మణి'యను చున్నది. ఆ వాక్యమునందలి సత్యమెట్టిదైనను స్త్రీలనాటకరంగ ప్రవేశము మనకు నూతనాచారము గాదనియు, దానిని అవలంబించుటలో కారణాంతరములచే విస్మ రింపబడిన నొక జాతీయాచారమును తిరిగి నెలకొల్పుచున్నామే కాని విదేశములనుండి వింతయాచారమును కొనితెచ్చుట లేదనియు 'ఒకనారీమణి'గారు గ్రహించుట సమంజస మును, సముచితమును నగును.

గాంధిమహాత్ముడు-ఆంధ్ర స్త్రీల వితరణ.—

"ఆరంభశూరులు, నాయకు నొల్లని అవినయనిధానులు." అని ఆంధ్రులను నిందిం చుచు మహాత్ముడు ఆంధ్రదేశసంచారమున కారంభించెను. మసకలు కట్టిన ఆంధ్రనేత్రము లకు అందులో ప్రభారాశిద్యోతక మయ్యెను. కరకుగట్టిన వారి హృదయములందు జాతీయో త్సాహము వెల్లివిరిసెను. ఆశాఘాతము తిన్న గుఱ్ఱములవలె ఆంధ్రులు పనిచేసి మహా త్మునకు సుస్వాగత మిచ్చిరి; కానుక లర్పించిరి. మహాత్మునకు సంతృప్తినిచ్చిరి. ఈ కార్య మున ఆంధ్రపురుషులకు ఆంధ్రస్త్రీలు చేసిన సాహాయ్యము అనంతమై మఱువరానిదై యున్నది. స్త్రీలు చేసిన త్యాగము పురుషుల త్యాగమునకు మేలుచేయిమైయుండవలసినది. వారు మనసుపడి చేయించుకొన్న మాణిక్యాంగుళీయకములు మహాత్ముని పాదపద్మముల చెంత రాసులు పోసిరి. మోజుపడి కొత్తఫాషనులో చేయించుకొన్న హస్తకంకణములను తీసి ఖద్దరునిధికి సమర్పించిరి. మఱి వారు కురిపించిన సువర్ణభూషణములకు చిత్రగుప్తుడే లెక్క తయారు చేయలేడు. ఇది యంతయు ఆంధ్రస్త్రీల అపూర్వత్యాగమును లోకమునకు

వెల్లడించుచు దేశహితైకకార్యములొనర్చుటలో వారు ఇతర భారతస్త్రీలకు తొదల భూషణములై యుందురను విషయమును రూఢిపఱచుచున్నది.

శ్రీమతి ఇందిరా దేవి త్యాగము.—

ఆంధ్రభూమి మొత్తముమీద స్త్రీలుచేసిన త్యాగమంతయు నొకయెత్తు. పశ్చిమ గోదావరిజిల్లా చాటపఱ్ఱు నివాసిని శ్రీమతి యర్నేని. ఇందిరాదేవిగారు చేసినత్యాగమొక యెత్తు. ఏప్రియలు 23. వ తేదిని మహాత్ముఁడు చాటపఱ్ఱువచ్చెను. ఆగ్రామములోని ప్రజలందఱును తాముచందాలు వేసికొని వసూలుచేసి సిద్ధపరచిన రు 920/-లను మహాత్మునకు సమర్పించిరి. మహాత్ముఁడవి స్వీకరింపలేదు. భక్తులొక్కరిచేతనే ప్రత్యక్షదైవముగా భావింప బడుచున్న తిరుపతి వేంకటరమణమూర్తికే తఱుఁగని ధనాశ ఆవేశించియుండ ముప్పదిమూడుకోట్ల భారతీయుల చేతను ప్రత్యక్షదైవముగా భావింపబడుచున్న ఈ మోహనదాసునకు తీరని ధనాశ ఆవేశించుటలో వింతయేమియును లేదు. అతనికి చాటపఱ్ఱుగ్రామస్థు లీయఁబోయిన రు 920/-లతో తృప్తిలేక పోయినది. వేయినూటపదార్లు కావలెనని స్వరాజ్యలక్ష్మికి వరుడుగాఁబోవుచున్న ఆతఁడు పట్టుపట్టెను. మహాత్ముని పట్టు అనగా ఏమిసామాన్యమా? భల్లూకపు పట్టు. సత్యాగ్రహయుధమును ప్రయోగించెనా లోకము తల్లడిల్లిపోవును. చాటపఱ్ఱుగ్రామస్థులు తిరిగి చందాలువేసికొన మొదలు పెట్టిరి. 80 రూపాయిలు మాత్రము వసూలయ్యెను. మహాత్ముని సంకల్పమునకు ఇంకను రు.116/-లు కొరవడియుండెను. పురుషులందరును ఆ మొత్తమును పూర్తిచేయుటకు విశ్వప్రయత్నములుచేసిరి. కాని కార్యకారికాలేదు. అప్పుడొక స్త్రీరత్నము-ఆగ్రామకాపురస్థులైన మాగంటి సుబ్రహ్మణ్యముగారి సుపుత్రిక-రూపొందిన త్యాగదేవత-కొదువ రు. 116/-లను మహాత్మునకు సమర్పించెను. సేతుశీతనగవ్యాప్తమైన ఈవిశాలభారతదేశమునకు వైస్రాయియైన రీడింగుప్రభువును గజిబిజ చేయునట్లు ఒకప్పుడు అల్టిమేటము వ్రాసియుండిన తన దక్షిణహస్తమును చాచి మహాత్ముఁడారూప్యములనందుకొని

"డెందమునకును వాక్కున కందరాని
అధికతరమైన యానంద మనుభవించె."

క్లిష్టపరిస్థితులలో త్యాగముచేసి దేశగౌరవము నిలిపిన శ్రీమతి ఇందిరాదేవి సాక్షాత్తు ఆంధ్రుల పాలిటి ఇందిరాదేవియే యనవచ్చును.

శ్రీమతి సత్యవతీదేవి నిశ్చయము.—

ఇప్పటికి సరిగా వందసంవత్సరములైనది కర్మక్షితియగు భారతదేశమున సహగమనము నిషిద్ధమై. పాతివ్రత్యధర్మాచరణమునకు శిఖరప్రతిష్ఠ—భారతస్త్రీల త్యాగము, సాహసము లోకమునకుఁజాటిన బూరగొమ్ము అయిన సహగమనాచారమును 1829-వ సంవత్సరమున విలియము బెంటింకు శాసనఖడ్గమున తుండించెను. ఆచారము నిలిచిపోయినది. కాని అప్పటి భారతస్త్రీలను తదాచరణమునకుఁ బురిగొల్పిన పతిభక్తి, పవిత్రభావము నేటికిఁగూడ మనస్త్రీలయందు నిలిచియే యున్నవి. నాఁటికిని నేఁటికిని భారతస్త్రీ పతితోడిదలోకమని మనసారనమ్మి ఆర్యజాతి కీర్తి గౌరవములు అనశ్వరములై వెలయఁ జేయుచున్నది. పునర్వివాహము మాటవినఁబడెనా సత్సాంప్రదాయముగల భారతస్త్రీ చెవులు మూసికొనును; వెగటునొందును. పతిదేవతయైన సరస్వతీదేవి యేమనుచున్నదో చూడుఁడు.

“మహాత్మాగాంధిగారి పెదపాడు ఉపన్యాసము 27-4-29 ఆంధ్రదినపత్రికయందు జూచితిని. స్త్రీపునర్వివాహమును ప్రోత్సహించుచు నన్నుకూడ సంబోధించి గాంధిగారు చెప్పినట్లు అందుకలదు. తిరిగి వివాహమాడ నిచ్ఛగల వితంతువుల కది అనుకూలముగా నుండవచ్చును. కాని శేషించిన జీవితమునంతను బ్రహ్మచారిణిగఁ గడప నిశ్చయించిన నాకు ఆ ఉపన్యాసము దుర్భరముగనున్నది. అందలి కొన్ని వాక్యములు నాధర్మమునకుఁ గూడ కళంకము నాపాదించుచున్నట్లున్న వేమోనని చింతిల్లుచున్నాను.

నావయస్సు 21 సంవత్సరములు. నాభర్త గతించినందువల్ల ఈ ప్రపంచములో నానందింపవలసినదేదియు లేదని నేనెఱిఁగియే నాయాభరణముల నన్నింటిని కాలానుగుణముగ యుక్తమగు ధర్మమని గ్రహించి గాంధిగారి ఖద్దరునిధికొసఁగితిని. స్వార్థత్యాగియు, దేశసేవకుఁడును, పరోపకారియు, ప్రేమించి పెండ్లియాడిన నాయనుంగు భర్తయనంతరము బ్రహ్మచారిణినై వారి ననుసరించుచు దైవభక్తిగలిగి దేశసేవజేయుటే నా ముఖ్యధర్మమని నేనెఱుఁగుదును. అట్లుచేయుటయే నాజీవితాశయము.

బ్రహ్మచారిణిగ నాధర్మముల నిర్వర్తించుటకు మహాత్మ గాంధిగారి యాశ్రమము సాధనాశ్రమముగ నుండునని యెంచి వారితోఁ గూడఁబోవుట కనుజ్ఞ గోరియుంటిని. వితంతువుల వివాహమాడ ప్రోత్సహించుటకన్న శేషించిన వారి జీవితకాలమంతయు బ్రహ్మచారిణులుగనేయుండి దేశమునకును, మతమునకును సేవజేయుట కనుకూలముగు

నట్లు ఈ ప్రాంతమున సాధనాశ్రమమును నెలకొల్పుటకు ప్రయత్నించువారికి నాశక్తి కొలఁది చేయగల సహాయమును జేతును.

మహాత్మాగాంధిజీవారు వారియాశ్రమమున నే నున్నంతకాలము నాయాదర్శముల కాదరణ జూపి వితంతూద్వాహాములకన్న బ్రహ్మచర్యము నందలి పవిత్రత లోకమునకు వెల్లడించుటకెక్కువ కృషిసల్పునుగాక!”

ఇట్లు సేవకురాలు, ఎలమంచిలి. సత్యవతి దేవి.

తల్లీ! సత్యవతీ దేవీ! ఆంధ్రస్త్రీల యశోగానము చేయుట కేర్పడిన ‘గృహలక్ష్మి’ పత్రిక పక్షమున నీకు మేము ధన్యవాదము లర్పించుచున్నాము. సర్వాభరణములును మహాత్మునకు నిలువుదోపు ఇచ్చిన నీవితరణశీలమునకు జయ వెట్టుచున్నాము. యావజ్జీవము బ్రహ్మచారిణిగ నుండ సంకల్పించిన నీ మనోధృఢిమకు అభివాదము లర్పించుచున్నాము. నీదగు ఆశ్రమవాసస్వీకార ప్రయత్నము ఫలోదయాంతమగు గాక యని హృదయపూర్వకముగఁ గోరుచున్నాము. నీత్యాగశీలము, పవిత్రభావము, పతిభక్తి స్త్రీ జనములకు తొడలభూషణమై వెలయుగాక యనిమనసార వాంఛించుచున్నాము. ఆధునిక కవి కుమారుడు నీయశోగాన మిట్లు చేయు చున్నాడు.

> “అమ్మ! సత్యరో! నీకు బాల్యంబుగాని
> నీగుణోన్నతి పెద్దయౌ నిర్ణయింప
> నమృతకర రేఖ కధిక బాల్యంబుగాని
> తద్విలాసంబునకుఁ బెద్దతనము గాదె?”

శ్రీ కస్తూరీ దేవీవిద్యాలయ శంకుస్థాపనము.—

మహాత్ములవారు నెల్లూరు పురమున కరుదెంచినపుడు శ్రీ కస్తూరీదేవి విద్యాలయమునకు శంకుస్థాపనము గావించిరి. పురమందిరమునకు సమీపమున ఆవిద్యాలయమునకు నూతనముగా కొంతస్థలము తీసికొనబడినది. శ్రీమతి పొణకా కనకమ్మగారి కార్యదీక్ష యెఱిగియున్న మాకు అచిరకాలములో నాస్థలమున బ్రహ్మాండభవనములుతీరి విద్యాలయమునకు చక్కని మందిరము యేర్పడునను విశ్వాసము దృఢమై నెలకొన్నది. శ్రీమతి కనకమ్మగారి కార్యదీక్షకు ఇప్పుడు వశ్యవాక్కులగు మహాత్ములవారి ఆశీర్వచనబలము తోడైనది. ఇక నీయుద్యమము ఫలోదయాంతమగుట సునిశ్చయము. శ్రమకోర్చి బందరు పురమునుండి ప్రత్యేకముగ నరుదెంచి కనకమ్మగారికి సర్వవిషయములందును చేదోడు వాదోడై ఈ మహోత్సవమునకు జవము జీవము ప్రసాదించిన శ్రీమతి ద్రోణంరాజు. లక్ష్మిబాయమ్మగారి సేవ మఱువరానిది. కే. శే. దిగుమర్తి. హనుమంతరాయసతి శ్రీకృష్ణాబాయిగారును, శ్రీమతి గుమ్మడిదల దుర్గాబాయమ్మగారును కూడ ఈ సందర్భమున అనంతమగుసేవచేసిరి. ఆత్మ జనోద్ధరణమునకై చీమునెత్తురులు వెచ్చించుచున్న ఈ రమణీమణులకు మాహృదయపూర్వక వందనము లర్పించుచున్నాము.

# గ్రంథములు—పత్రికలు

## ఆంధ్రపత్రిక—శుక్లసంవత్సరాది సంచిక.

వందనములతో నందుకొంటిమి. ముఖపత్రమున స్వరాజ్యమహాశయుడు 33 గుఱ్ఱముల బండిపై నూరేగుట అతిసుందరముగ ముద్రింపబడి మిగుల ఆకర్షణీయముగ నున్నది. ఆవెనుక త్రివర్ణచిత్రపటములను పరిగ్రహించితిమి. అవిమొత్తము ఆఱున్నవి. అందు ఆంధ్ర చిత్రకారులు సిద్ధహస్తములతో చిత్రించిన గోదావరి నీలాటిరేవు, చిత్రకారుడు, నాగరాజు అనునవి చూచి పొంగిపోయితిమి. పిమ్మట సాధారణచిత్రములను తిలకించితిమి. కలకత్తా జాతీయసభ కన్నులకు కట్టినట్లైనది; భారత ప్రముఖుల నెందఱతోడనో పరిచితులమైతిమి; ఆంధ్రనాయకుల నెందఱినో ఆరాధింపగల్గితిమి. అతిశయించిన ఆనందముతో అనంతరము తీరకమైన వ్యాసములను వరుసవెంబడి పఠించితిమి. ఆంధ్రదేశమున జరుగుచున్న సారస్వతజిజ్ఞాసకుచక్కని దర్పణమై సంచిక ప్రకాశించుచున్నది కదా యని సంతోషించితిమి. శ్రీయుత కాట్రావులపల్లి రామమూర్తిగారి జోలపాట చదువుచుండగా అశాఘాతము తగిలిన గుఱ్ఱమువలె చకితులమైతిమి. రసతరంగమున ఆరవల్లి నరసింహాచార్యులుగారు వేదకాలమునాటి ఇంద్రుని దగ్గరకు గొంపోవ బోయితిమి. ఒక దానిని మించి ఒకటి ఒప్పుచున్న ఇందలి వ్యాసముల మేలెంతని ప్రత్యేకించి ఎంచగలము? సాలగ్రామఖనిలో నొకప్పుడు జాత్యల్పపాషాణములుకూడ నుండును గాని ఈ సంచికయందలి వ్యాసములలో నొక్కటికూడ పొల్లువ్యాసము లేదనుట సాహసోక్తి కానేరదు. అందుసచిత్రముగ నున్న అమరావతిస్తూపవిషయకవ్యాసము వెలలేని వానిలో వెలలేనిది. మొత్తముమీద సంచికయంతయు ౩౩౯ పుటలుగలిగి, 70 పుటల చిత్రములుగలిగి వెనుకటి సంచికలకంటె నెల్లవిధముల నుత్కృష్టమై సర్వాంగసుందరమై క్రొత్తతీరున నొప్పుచున్నది. ఆంధ్రతాముద్రకు నిక్షేపభూమియగు ఈ సంచిక ప్రతిఆంధ్రగృహమునందును ఉండితీరవలెను. వెల చందాదారులకు ౧-౮-౦ ఇతరులకు ౨-౮-౦ మాత్రమే. వలయువారు—ఆంధ్రపత్రికా కార్యాలయము, 6, 7 తంబుశెట్టివీథి, మద్రాసు అని వ్రాయవలెను.

## ఆంధ్ర సాహిత్యపరిషత్తు—ప్రభవ సంవత్సర కార్యనివేదమున—

మా కార్యస్థాన మలంకరించిన ఆంధ్రసాహిత్య పరిషత్తువారి ప్రభవ సంవత్సర కార్యనివేదనము సావధానముగ తిలకించితిమి. మదరాసు వీడి తూర్పుగోదావరి మండలమున కాకినాడ చేరిననాటనుండియు సాహిత్యపరిషత్తు సత్వరాభివృద్ధిగాంచుచున్న విషయము నివేదిక వెల్లడించుచున్నది. ఇది సంతోషకరమగు విషయము.

## ప్రకృతి.—

ఆరోగ్య విషయికమైన ఆంధ్ర మాసపత్రిక. 10-వ సంపుటము పదియవ సంచిక వందనములతో నందుకొంటిమి. ప్రకృతి మార్గముల ననుసరించుటచే ఆరోగ్యము ఎట్లు బొందవచ్చునో వివరించు వ్యాసములతో నెల నెలకు వెలువడుచుండును. ఏడాది చందా రు. 3. వలయువారు—మేనేజరు, ప్రకృతి ఆఫీసు, బెజవాడ- అని వ్రాయునది.



# సచిత్ర మాసపత్రిక


సంపాదకుఁడు

డాక్టర్. కే. ఎన్. కేసరి



సంపుటము 2.] [సంఖ్య. 5

లోధ్ర ముద్రాలయము, మద్రాసు

1929

సం॥ చందా రు. 4. విడిసంచిక అ. 6

# గృహలక్ష్మి

స్త్రీల ఆయురారోగ్య సౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక.

సంపుటము 2. జూలై నెల 1929. సంచిక 5.

## విషయసూచిక.

PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# Proceedings of the Various Taluk Boards and Municipalities.

(TRUE COPIES)

From M.R.Ry. A. Narayana Rao Garu, B.A., LL.B.,
President, Taluk Board, Penukonda.

To The Editor,
Grihalakshmi, Telugu Monthly Journal,
Post Box, 752, Egmore, Madras.

RLC No. 261/29 dated 8-4-29.

Sir,

The Board has in its resolution No. 586, dated 23-3-29 sanctioned to subscribe for the supply of 5 copies of the Journal "Griha Lakshmi." Please supply the journals to the Head Masters of the following schools and submit a bill for payment of the annual subscription due for the same.

1. Hindu Girls School, Penukonda 2. Hindu Girls School. Madakasira. 3. Hindu Girls School, Amarapuram. 4. Hindu Girls School, Hemavathy, 5. Hindu Girls School, Agali.

(Sd.) A. NARAYANA RAO.
*President.*

---

L. Dis. No. 2897 of 1928-29 dated 4th April 1929.

From
M.R.Ry. Rao Sahib V. Sree Ramulu Naidu Garu,
Chairman, Municipal Council, Ongole.

To The Editor,
Grihalakshmi, Post Box, 752, Egmore, Madras.

Sir,

The Council sanctioned the supply of one copy of monthly Journal "Grihalakshmi" to the Municipal Higher Grade Girls' School for one year with effect from 1-4-29. Please, therefore, supply the same every month to the Headmistress of the said school. A bill may be sent to me for payment.

(Sd.) CHAIRMAN.

---

Dis. No. 455/Rp. T. B. of 1929 dated 7th March, 1929.

From
M.R.Ry. B. Venkataratnam Choudari Garu, M.L.C.,
President, Taluk Board, Ramachandrapuram.

Sir,

I have the honour to request that you will be kind enough to supply the magazine to the Headmasters of the marginally noted girls schools for one year and send the bill to this office after the completion of the year.

1. Alamur 2. Artamuru, 3. Biccavole, 4. Chelluru, 5. Dangeru, 6. Draksharama, 7. Editha, 8. Kapileswarapuram. 9. Kotipalli, 10. Konkuduru, 11. Kulla, 12. Mondapet, 13. Pandalapaka. 14. Pasalapudy, 15. Ramachandrapuram, 16. Somaeswaram, 17. Tapaeswaram, 18. Vedurupaka, 19. Chodavaram, 20. Anaparty, 21. Machavaram, 22. Voolapalli.

I have the honour to be,
Sir,
Your most obedient servant,
(Sd.) PRESIDENT

Extract from the minutes of proceedings of the
Vellore Taluk Board.

passed at its meeting held at Vellore on the
14th March, 1929.

Resolution No. 27.

The President moves the Board to purchase a copy of the Telugu Monthly Journal, Grihalakshmi on payment of annual subscription of Rs. 4/- for use of the Board Girls Schools at Odugathur and Agaram.

---

SANCTIONED.

---

D. Dis. No. 186 T. B. of 1929.

Copy communicated to the Editor, Grihalakshmi, Post Box No. 752, Egmore, Madras.

Vellore Taluk Board's Office,

Vellore, dated 19th March 1929. (Sd.) for President.

---

From The President, Taluk Board.
Gooty.

To

The Editor

Grihalakshmi, Post Box 752, Egmore, Madras.

Ref. Gl. No. 524/29 dated 1-4-29.

Sir,

Please supply me with one copy of the Journal "Grihalakshmi". The Taluk Board, Gooty, has sanctioned its supply for one year from 1-4-29.

(Sd.) President.

---

From M.R.Ry. Ch. Koteswara Row Pantulu Garu, B.A.,
President, Taluk Board, Narasarowpet.

To The Editor,

The Grihalakshmi, Egmore, Madras.

Resc. No. 714/GL of 29 dated 2—4—29.

Sir,

Please be good enough to supply your Telugu monthly journal, one copy to each of the Headmasters of Board Girls Schools, Vinukonda and Chilakaloorpet, for one year from April 1929 and the bill for their cost may be sent to this office in duplicate for payment.

(Sd.) President.

Extract from the Proceedings of the Municipal Council, Tadpatri, Passed at its meeting held on Friday the 31st May 1929.

Res. No. 27.

Read letter from the Editor of "Griha akshmi" a Telugu monthly Journal, requesting to introduce the journal in Girls' Schools.

Resolution:—Sanctioned.

(sd) M. Abdul Khadar Sahib,
Chairman.

R. C. No. 694/29.

True Extract is communicated to the Editor, "GrihaLakshmi" Post Box. No. 752, Egmore, Madras, for information. He is requested to send two copies of the journal every month for the use of Girls' Schools of this Municipality.

Tadpatri Municipal Office
Dated 2nd June 1929.

(sd) M. Abdul Khadar,
Chairman.

'By Orderj'

H. R/3-6.

Sd. Manager.

Extract from the proceedings of the Berhampore Taluk Board at its meeting held on 1-6-29 at Berhampore.

(220)

Sanction of the Taluk Board is required to supply Telugu Journal Grihalaksmi to the Telugu Girls' school at Berhampore, Sompet, Baruva at a cost of Rs. 4/-per copy per year.

*Resolution.* *Sanctioned.*

(Sd) P. V. Narayanarao,
President Taluk Board.

(True extract)

Copy communicated to the head masters of Girls schools Ichapore, (Telugu) Sompet and Baruva for information.

Copy communicated to the Editor Grihalakshmi Egmore Madras. He will send bill enclosing acknowledgements from the teachers.

Copy to the Inspector of L. F. Accounts, Ganjam, Chatrapore.

Copy to Bills clerk.
D. G/10-6-29.

(Sd) for President Taluk Board.

Taluk Board's Office.
Madanapalle.
Dated 10-6-1928.

R. O. C. No. 901 T. B. of 1929.
D. Dis

From

M. R. Ry. T. N. RAMAKRISHNA REDDI GARU, B.A., B.L.,
President, Taluk Board, Madanapalle.

To

The Editor, "Grihalakshmi"
Telugu Monthly Journal, No. 752, Egmore, Madras.

Sir,

Refce:—Your Ref. No. 215 dated 13-4-1929.

Please send one copy of the Journal "Grihalaksmi" to the address of Head Master, Board Elementary Hindu Girls' School, Voyalpad and send a bill to me for payment of the subscription for one year.

(Sd) for President.

A. K. S. 11-6.

Copy to the Head Master Board Ele. Hindu Girls' school, Voyalpad.

Proceedings of the Municipal Council, Cuddapah passed at its meeting held on Thursday the 30th May 1929.at 4-30 p. m.

Read:—No. 60. Letter dated 15-4-1929 from the Editor, Grihalakshmi, Madras, requesting to place this matter before the Council and pass a resolution recognising and introducing the journal Grihalakshmi in all the Girls' schools in the town,

Resolution :—Sanctioned.

(Sd) P. SESHIAH,
Chairman.

(True Copy)

Communicated to the Editor Grihalakshmi Madras for information.

S. L./ (Sd) Chairman.

Copy to the Accountant.

Extract from the minutes of proceedings of the Dhone Taluk Board at its meeting held at Pattikonda on Monday the 20th May 1929 at 9. A. M. Read.

బోర్డు హిందూగరల్సు స్కూళ్లకు గృహలక్ష్మి అను నెలసర జర్నలు శాంక్షను చేయవలెనని ప్రెసిడెంటుగారి ఆఫీసునోటు చదువడమైనది. సంవత్సరం చందా 4-0-0 రూపాయలుగా యుంటున్నది.

Resolution No. 30.

నాల్గు కాపీలు తెప్పించులాగు తీర్మానించడమైనది.

(Sd) D. SANJEEVA REDDI,
President.

(True Extract)

Copy to the editor for favour of supplying 4 Journals to the marginally noted school Head mistresses for one year.

Maddikera, Pattikonda, Peapully, Dhone.

యావన్మంది బోర్డుహిందూగరల్సు స్కూలు మాస్టర్లకు పంపడమయినది.

3-6-29. (Sd) for President.

Extract from the minutes of preceedings passed by the Koilkuntla Taluk Board at its meeting held at Allagadda on Monday the 27th of May 1929.

Read:—

తాలూకాబోర్డు ఆధీనములో అన్ని బాలికా పాఠశాలలకు గృహలక్ష్మి యను మాసపత్రిక సప్లై చేయుటకు ఏర్పాటు చేయవలసినదని వారిపత్రికాధిపతి వ్రాసుకొన్నది. 18-4-29 తేదీగల నెం 223 ల వుత్తరము చదువడమైనది.

Resolution No. 4.

శాంక్షను చేయడమైనది.

D. Dis. 486

L. F of 29. (Sd) for President.

(True extract)

Communicated to the Editor "Grihalakshmi" Egmore for information. A list of Girls schools is herein attached.

Dy. Inspector of L, F.

Sub Asst. Inspector of schools

Koilkuntla Girls Range.

Koilkuntla Taluk Board Office: (Sd) President

Dated 4-6-29.

## LIST OF GIRLS SCHOOLS.

*Koilkuntla Taluk*

1. Koilkuntla.
2. Vuyyalavada.
3. Nosam
4. R. Tambuladinne
5. Dornipad
6. W. Govindinne
7. Owk

*Allagadda Taluk*

1. Sirvel
2. Yallur
3. Allagadda
4. Chagalmurri
5. Rudravaram
6. Gospad
7. Yerraguntla
8. Sree Rangapuram
9. D. Chintakunta
10. Kotakandukur

# గృహలక్ష్మి

## ఏజెంట్లు.

తెనాలి: కొమ్మూరి కాశి విశ్వనాథంగారు,
జనరలు మర్చెంటు. తెనాలి.

బళ్లారి: వి. రాజాముదలియార్ & సన్సు
కమిషన్ ఏజంట్సు, కార్ట్రిస్టీటు,
బ్రూసుపేట, బళ్లారి.

రాజమండ్రి: దువ్వూరి బ్రదర్సు
3/188 దువ్వూరి వారిమేడ
రాజమండ్రి.

కాకినాడ: సి. హెచ్. బాపిరాజు.
కొమ్మిరెడ్డి వీధి, కాకినాడ.

ఆల్ యిండియా యునైటెడ్
న్యూస్ పేపరు ఏజెన్సీ, కాకినాడ.

ఏలూరు: పి. వి. శాస్త్రి
న్యూసు ఏజంటు, ఏలూరు.

నెల్లూరు: ఏ. సుబ్రహ్మణ్యం ఏజెంటు:
ఆంధ్ర యిన్స్యూరెన్సు కంపెని.
ట్రంకు రోడ్డు, నెల్లూరు.

బెజవాడ: నామల అంతోని
బెజవాడ

ఛత్రపురం: నేమాని వాసుదేవమూర్తి
సెక్రెటరి. పరమేశ్వరి విలాస్
ఛత్రపురం.

గుంటూరు: ఏ. ఎల్. నరసింహారావుగారు,
ఫోటోగ్రాఫరు, నేషనల్ స్టూడియో,
గుంటూరు.

మచిలీపట్టణము: కె. బాలకృష్ణ.
ఫోటో ఆర్టిస్టు,
మచిలీపట్టణము.

ఇతర చోట్లను ఏజంట్లు కావలెను.
వివరములకు ధరఖాస్తు పంపుకొనుడు.—

'గృహలక్ష్మి' తపాల పెట్టె. 752, ఎగ్మూరు, మద్రాసు.

---

గృహలక్ష్మి.

# పాటలవిలువ.

పాశ్చాత్యవిద్యావ్యామోహితులగు నవనాగరికులలోఁ బలువురు మన ప్రాచీన స్త్రీలకు విద్య, వికాసము లేకుండినవని చేయెత్తి చెప్పుటకు ఇంచుకంతయు జంక కున్నారు. వ్రాతమూలకమైన విద్య ప్రాచీన స్త్రీలకు లేనిమాట చాలవఱకు నిజమే. కాని అంతమాత్రమున వారికి విద్య, వికాసము లేవనుట నిజము పరికించి చెప్పినమాటకాదు.

ఏమన విద్యయనగా చదువుట, వ్రాయుట మాత్రమేకాదు. లేఖనమును, వాచకమును విద్యాసముపార్జనమునకు సాధనములు మాత్రమే. భావములకు ఔన్నత్యమును, హృదయమునకు వైశాల్యమును అలవఱచునదియే నిజమైన విద్య. జీవితపుష్పమునకు లౌకికజ్ఞానము, విశ్వభ్రాతృత్వము అను సుగంధముల హత్తించునదియే నిజమైన విద్య. అట్టి విద్యాగంధముగల వ్యక్తికి వికాసము కెలకులనున్న తంగేటిజున్ను. ప్రాచీనస్త్రీల కిట్టి విద్య, వికాసము ఉండినవి.

జాతీయతాముద్రాంకితులగు మన ప్రాచీనకవిపుంగవులు మన స్త్రీలకొఱకు అనంతమగు సారస్వతమును సృష్టించి యుండిరి. ఆర్యవిజ్ఞానమును, పురాణకథాసారమును క్రోడీకరించి వారు సులభసుందరశైలిలో పాటలు రచియించి స్త్రీజనముల కర్పించిరి. మన స్త్రీ లాపాటల నాప్యాయముతో కంఠస్థమొనర్చుకొని ఇతరులకుఁ జెప్పి ఆర్యవిజ్ఞానమును పారంపర్యముగ నిలుపుకొని వచ్చిరి. వారు పుస్తకమును చూచి రెండు అక్షరములైనను కూడబలుకలేనివారే. కాని వారికి ఆర్య విజ్ఞానమును, పురాణకథలును పాటల

మూలమున వారి చీమునెత్తురులయందు జీర్ణించిపోయినవి. మన స్త్రీలకిట్టి జాతీయ విజ్ఞానము ఒప్పియున్నది కావుననే హిందూదేశము పలుమారులు విజాతీయుల దండయాత్రలవలన సంక్షుభితమైనను మన జాతీయత అనశ్వరముగ వెలయుచున్నది.

'గంగా పరిణయము', 'లక్ష్మణ మూర్ఛ', 'ఊర్మిళాదేవి నిద్ర', 'సుభద్రసారె', 'లంకాయాగము', 'కుచ్ఛలకథ'—మున్నగు పాటలు మన ప్రాచీనస్త్రీలకు అనంతమగు వికాసము నిచ్చినవి. వారి భావములకు ఔన్నత్యము నాపాదించినవి. హృదయమును విశాలపఱచినవి. నీతులకు నిధానములు, గృహమర్యాదలకు పుట్టినిండ్లు, లోకజ్ఞానమునకు నిక్షేపములు అయిన ఆ పాటలు మన స్త్రీల మనోవికాసమునకు సంస్కారము కల్గించినవి. కావుననే వారు గంటము పుచ్చుకొని రెండు అక్షరములు వ్రాయలేని వారయ్యు క్లిష్ట పరిస్థితులలోగూడ సంసారచక్రమును ఆహాపుట్టునట్లు నిర్వహించినారు. పాటలయందు నిక్షిప్తమైయున్న విజ్ఞానమును ఆమూలాగ్రముగ గ్రోలి మన ప్రాచీనస్త్రీలు మగనికి 'మనసులో వర్తించు కులకాంతలై', చేరవచ్చిన వారికి చుట్టాలసురభులై, పుట్టింటికి పుణ్యశాలినులై, అత్తింటికి ఐశ్వర్యవంతురాండ్రై నిలసిల్లిరి.

అట్లు విలసిల్లిరి కావుననే పురోహితుని మంత్రవాక్యములకంటె పురంధ్రీమతల్లుల మంగళారాత్రికలు వివాహాది శుభకార్యములందు గౌరవనీయములై చెన్నారినవి. ముత్తైదువలు వచ్చి మంగళహారతి నిచ్చువఱకు వధూవరులు మంత్రబద్ధులైన వారివలె పెండ్లిపీటలపై కదలకుండ నుండవలసినదే. మన వారికి పాటల విలువ సమ్యగముగ తెలియును గావున వానికంత గౌరవము నిచ్చిరి.

అంత గౌరవము నిచ్చిరి. కాని నవ్యభారతదేశమున మన స్త్రీలకు జాతీయత వెల్లివిరియునట్టి పాటలపై ఆదరణము, అభిమానము సన్నగిల్లినవి. సన్నగిల్లుటేమి? పూర్తిగ పోయినవనియే చెప్పవచ్చును. కారణము వారు పాశ్చాత్యవిద్యావ్యామోహితులగుటయే. షేక్సుపియరు నాటకములు, షెల్లీపద్యమాలికలు మన వారికి తెలిసినట్లు త్యాగరాజుని కృతులుకాని అధ్యాత్మరామాయణ కీర్తనలు కాని పరిచితములు కావనుట మినహాయింపులేని సత్యము.

ప్రభుత్వోద్యోగియగు తండ్రి ప్రోద్బలముననేమి, హూణవిద్యాధికుడగు భర్త ప్రోత్సాహముననేమి మన స్త్రీలు—అందు ముఖ్యముగా పట్టణములందు నివసించెడు వారు—ఆంగ్ల విద్యాసంపర్కమును బొందుచున్నారు. దానివలన వారి దృష్టి ఎల్ల వేళల పశ్చిమాభిముఖమై యుండుచున్నది.

ఆంగ్లపాఠశాలయందు ప్రవేశించిన కన్యకు గృహకార్యనిర్వహణమున తల్లికి చేదోడు వాదోడు అగుటకే తీరిక లేకయుండ ఆమె తల్లి పాదములచెంత కూర్చుండి శాంతచిత్తముతో పూర్వకాలపు పాటల నేర్చుకొనుటకు మాత్రము సావకాశ మెక్కడ? ఇక పాఠశాలలో గఱపబడు విద్యయెట్టిదో గమనింపుడు. 'కాకి, నక్క' మొదలగు పాఠములతో నిండారు వాచకపుస్తకములు వారి హస్తముల నలంకరించుచున్నవి. జాతీయత పెంపొందించు వాఙ్మయముతో చిన్నపిల్లలకు పరిచయముచేయు ప్రయత్నము మన ప్రస్తుత స్త్రీవిద్యావిధానములో మృగ్యము. అగుటచే జాతీయత అననేమో సంపూర్ణముగ మఱచిపోయిన కన్యలు కాలక్రమమున గృహయజమానురాండ్రై హిందూగృహములను పాశ్చాత్యవాతావరణములో జెరలాడించుచున్నారు.

ఇది మిక్కిలి దుర్భరమగు స్థితి. ఇట్టి మార్గమున మఱియొక శతాబ్దము సాగిపోయితిమేని హైందవ కుటుంబములయందు ఆర్యతాముద్ర మందునకైన గానరాదనుట అతిశయోక్తిగాదు. ఇట్టి అరిష్టమును పాఱద్రోలుటకు మంచిమార్గము మన పడతులకు తిరిగి పాటలయందు రుచివిశేషమును పుట్టించుటయే అయి ఉన్నది. స్త్రీజనాభ్యుదయమును ఆకాంక్షించు విద్యాధికు లెల్లరును ఏతద్విషయమై వలసిన కృషిసల్పి దేశసౌభాగ్యమును పెంపొందింతురు గాక!

# పిచ్చుకా

శ్రీమతి పి. రుక్మిణీబాయిగారు

పిచ్చుకా యిటులెందు కోసమె
పిచ్చివై తిరిగేదు నాపై
పచ్చగా యున్నట్టి పైరుల
మెచ్చుచున్ వడిదిరుగ కా!

మెడను నిగిడించుచును యిటునటు
చిట్టికన్నుల వింతచూపుల
కిచకిచలతో పల్కుపలుకుచు
వెఱ్ఱిగా యిటులెందుకే—

ముక్కుతో యిటునటును పొడుచుచు
మిక్కుటముగా కలవరించుచు
నిక్కుచును నీల్గుచు నిఱేటికి
ఎక్కడికో వే పోగదే!

నీదు భావం బేమొ కానిక
నీదుచూపులు దెలుపుచున్నవి
నీదు స్వేచ్ఛను నిక్కముగ నే
వాడు లేదని యందునే!

నీదుమనమున నేమియున్నదో
దీనభావము గ్రక్కుచున్నవి
నీదుచూపులు నీదుపలుకులు
ఏది కష్టం బొచ్చెనే!

ఏదొ పైరున కూడుగుడుచుచు,
ఏదొ చెట్టున గూడుకట్టుక,
ఏదొ మూలను సంచరించెద,
నేదొ దైన్యం బేలనే!

# మధురవాణి.

అంద్ర శేషగిరిరావుగారు, బి. యె. (సారస్వత సమాజము.)

మధురవాణి వేశ్యాంగన. రఘునాథాభ్యుదయ కావ్యకర్త్రియగు రామభద్రాంబకు ఈమె సమకాలికురాలు. ఆమెవలె నీమెకూడ విద్యావినోదియగు తంజాపూరి రఘునాథరాయల సంసద్భవన మలంకరించిన విదుషీమణి.

సరసకృతులు రచియించుటయందును, ధీవిశేషమునందును మధురవాణి ఆ రాజాస్థానమందలి విదుషీరత్నముల యందఱికంటె అధికురాలై యుండెను. విద్యారసికుఁడగు రఘునాథనాయకుఁడు ఆమె వాఙ్మాధుర్యమునకు మెచ్చి ఆమెకు 'మధురవాణి'యని బిరుద మొసఁగెను. క్రింది శ్లోక మావిషయమును తెలుపుచున్నది.

> శ్లో॥ "చతురమధురవాణీం సమ్యగాకర్ణ్యయస్యా
> స్సదసిమధురవాణీ నామదత్తం త్వయైవ
> సరసకృతివిధాయాం సాధు మేధావిశేషా
> స్త్వధికపటుర శేషాస్వంబుజాక్షీ షు సైషా."

మధురవాణి సంస్కృతాంధ్ర భాషలయందు అంచితపాండిత్య మలవఱచుకొన్న విదుషి; ఆ భాషల రెండింటియందును సరసకవిత చెప్పనేర్చిన చతుర; సంగీతవిద్యయందు అనంతకౌశలము గడించిన కోవిదురాలు. "చతుర్విధ కవిత్వములందును చాతుర్యము కలది. వీణావాదమున ఆరితేరినది. పాణినీయవ్యాకరణమునందు మంచి ప్రజ్ఞ కలది. అనేకవిధములైన అవధానములను చేసి తన బుద్ధివైభవమును ప్రకటించినది" అని క్రింది శ్లోకము మధురవాణి వైదుష్యమును, చాతుర్యమును గీర్తించుచున్నది.

> శ్లో॥ "చాతుర్య మేతి కవితాసు చతుర్విధాసు
> వీణాకలాప్రకటనే భవతిప్రవీణా
> ప్రజ్ఞామియం నిపుణమంచతిపాణినీయే
> మేధాంవ్యనక్తి బహుధావవిధావధానే."

మధురవాణి పదియిరువది నిముసములలో నూఱు శ్లోకములను రచియింపఁ గలిగి యుండెను. ఆమెను పరీక్షించుటకై ఆస్థానకవీశ్వరులు ఆమె వీణాగానవినోదములందు

పర్యాప్తమై యుండినప్పుడు నూఁజేసి సమస్యలిచ్చుచుండెడివారు. అప్పుడామె ఇసుమంతయు గజిబిజినొందక సమయస్ఫూర్తికలిగి వాని సన్నింటిని పూరించుచుండెడిది. ఈ విషయము లామె అద్వితీయకవితాధారకును, అసదృశసమయస్ఫూర్తికిని చక్కని నిదర్శనములు.

మధురవాణి సంస్కృతమున రామాయణ కావ్యమును రచియించెను. ఏతత్కావ్యరచనాసందర్భమును గూర్చి జనులొక కథ చెప్పెదరు. ఆ కథ నిచ్చట నివేదించుచున్నాను.

"ఒకనాఁడు రఘునాథరాయలు కొలువుతీరి విద్యావినోదములఁ దేలుచుండెను. అప్పుడా సభయందలి విదుషీమణులలోఁ గొందఱు భక్తి కీర్తనములఁ బాడఁదొడఁగిరి; మఱికొందఱు రామచరిత్రము గానము చేయఁ జొచ్చిరి. రఘునాథరాయలు అఖండ రామభక్తాగ్రేసరుఁడు. మహారాజునకు శ్రీరామచంద్రునియందుండు గాఢభక్తిని వివరించి వర్ణించుచు తానురచియించిన కావ్యమును ఒక విదుషీరత్న మప్పుడు గానముచేయఁదొడఁగెను. ఆకావ్యమునందలి రామస్తోత్రము, శ్రీరామగుణవర్ణనము అత్యంత మనోహరముగ నుండెను. ఆఘట్టములను వినుచు సభికులును, రామభక్తుఁడగు మహారాజును ఆనంద తన్మయులైరి.

ఆకావ్యమును సమగ్రముగ నాలించి సంతసించి రఘునాథమహారాజు సభయందలి పండితబృందమును తిలకించి యిట్లు వచియించెను. "శ్రీరామచంద్రమూర్తి పవిత్ర చరిత్రమును అనేకులు అనేకపర్యాయములు అనేకరీతులగానము చేయగా వినియున్నాను. కాని వానియందన్నిటను ఇట్టి దట్టిదని చెప్పరాని దేదియో యొకలోపము చూపట్టుచున్నది. అట్టి లోపములేకుండ శ్రీరామచంద్రమూర్తి సుగుణపుంజములను గీర్తించుచు మీరెవ్వరైన రామాయణమును రచింపఁగలరా?"

రాజిట్లువైచిన ప్రశ్నమునకు అచ్చటి పండితులును, పండితురాండ్రును బదులాడరైరి. 'సరససాహిత్యకళాభోజుఁ'డగు రఘునాథ భూపాలుని మనసున కెక్కునట్లు రామాయణమును రచియింపఁగలమని చెప్పుటకు ఆ సభాస్థాన మందలి విద్వాంసులును, విద్వాంసురాండ్రును సాహసింప లేకపోయిరి. అగుటచే నారాజ చంద్రుఁడు విచారఖిన్నుఁడయ్యెను; వెంటనే సభచాలించి యంతిపురమునకుఁబోయెను.

ఆనాఁటి రాత్రి ఈ విషయమునుగూర్చి తీవ్రముగ నాలోచించుచు రఘునాథ రాయలు నిద్రించెను. అప్పుడాతనికి శ్రీరామచంద్రమూర్తి స్వప్నమునఁగానుపించి యిట్లు వచియించెను. "భక్తాగ్రణీ! విచారింపకుము. విద్యాపరదేవతయని చెప్పఁదగిన మధుర వాణి నీయాస్థానముననుండఁగా నీవీవిషయమై యేలచింతించెదవు? ఆకవయిత్రీమణి కవితా గానమునకు నేను మిక్కిలి ప్రియమందితిని. కావున రామాయణరచనాభారమును ఆ యపరసరస్వతి తలపై నిడుము. ఈ కార్యమును నిర్వహించి నీ మనోవైకల్యమును పాఱఁద్రోలుటకు ఆమెయె తగినది." ఇట్లు చెప్పి శ్రీరామచంద్రమూర్తి పొడగానరాక చనియెను.

మఱునాఁడు వేగుటతోడనే ఆ రాజచంద్రుఁడు కబురుచేసి మధురవాణిని తన వద్దకు రప్పించెను. రప్పించి గతరాత్రి తనకుఁగలిగిన స్వప్నవృత్తాంతము సమస్తము ఆ మహా రాజు ఆ విదుషీమణికి వివరించెను. అదివిని మధురవాణి యిట్లుపలికెను. "ప్రభువర్యా! శ్రీరామచంద్రమూర్తియాదేశమును, మీ ఆజ్ఞప్తిని మంత్రాక్షతలవలె శిరమునఁ దాల్చు చున్నాను. సర్వసమర్థుఁడగు శ్రీరామచంద్రమూర్తి ఆశీర్వాదబలమును, సాహిత్యసము ద్రులగు తమ సహాయసంపత్తియు నుండ నే నీకార్యమును నిర్వహించెదను."

పిమ్మట మధురవాణి రామాయణమును రచియించి తన యేలికయగు రఘునాథ రాయల మన్ననలఁబొందెను."

ఈ కథ కల్పితమగుటలో సందేహము లేదు. రఘునాథరాయలు తన యిష్టదైవత మగు శ్రీరామచంద్రమూర్తి దివ్యచారిత్రమును ఆంధ్రభాషయందు రచియించెను. ఆకావ్యము నాతఁడు తన ఆస్థానమందలి విద్వాంసురాండ్రలో వినుతికెక్కిన మధురవాణి చేత సంస్కృతభాషలోనికిఁ బరివర్తింపించెను. ఇట్లని గ్రంథదృష్టాంతముగలదు. అగుటచేఁబైని వివరింపఁబడిన కథ కల్పితమగుట నిశ్చయమగుచున్నది.

మధురవాణి రచియించిన రామాయణములోఁ గొంతభాగ మిప్పుడు మంగుళూరు మల్లేశ్వర వేదవేదాంత మందిరమందలి గ్రంథాలయమున భద్రము చేయఁబడియున్నది. ఉన్నంతవఱకు ఆపుస్తకమునందు పదునాలుగు సర్గలుగలవు. ఆ పదునాలుగు సర్గలయందును వివిధఛందములకుఁ జెందిన సహస్రశ్లోకములున్నవి.

తన యేలికయగు రఘునాథరాయల సభనుగూర్చి మధురవాణి రామాయణము నందలి ప్రథమసర్గలోఁగొంత ప్రస్తావించినది. విపంచి మీటుటలో నిపుణురాండ్రను,

శాస్త్రములను కూలంకషముగ నేర్చినవారును, సరసప్రబంధములు రచియింపసామర్థ్యము కలవారును—అయిన స్త్రీరత్నములు వచ్చి రఘునాథరాయుల సభలోఁ దమ తమ నైపుణ్యమును చూపుచుండెడివారనియును, రసవత్తరములైన కావ్యములను వ్రాయుటలో పండబారిన తమ కీర్తిని ప్రకాశింపఁ జేయుచు వేలకొలఁది విదుషీరత్నములు ఆ ప్రభువు కొలువుకూటమున నుండెడివారనియు మధురవాణి క్రిందిశ్లోకములలో వర్ణించినది.

శ్లో॥ "విపంచికాయాంచతురాఃప్రగల్భా
శ్శాస్త్రే తిదక్షాస్సరసప్రబంధే
సమీపమేతస్య సమేత్యకే పి
సుభ్రూజనాస్స్వ స్వకలావ్యనృణ్వాన్

సర్వోత్తరస్యాదిమ సంస్కృతాంధ్ర
ప్రబంధనిర్మాణపచేళిమాని
యశాంసి భూయాంస్యవతారయంత్య
స్సహస్రశస్సంతిసరోజనేత్రాః"

మధురవాణి ఈ రామాయణమునే కాక 'నైషధము, కుమారసంభవము' అను కావ్యములనుకూడ వ్రాసెనని చెప్పుదురు.

—"ఆంధ్రవిదుషీమణుల"నుండి.

# ప తి మా ట

చిత్తారు. గంగాధరకవి

పతిమాటఁ జేసిన బరమును గలదు
పతిమాటఁ జేసిన బరగు సత్కీర్తి
పతిమాటఁ జేసినఁ బావనం బొదవుఁ
బతిమాటఁ మీరినఁ బాపహేతువగు.

# మాధవస్తుతి.

శ్రీమతి వేమూరి. శారదాంబగారు

ఉ॥ శ్రీరమణీమనోహర ! సుశీల! నిజాశ్రిత కష్టభంజనా !
మారసమానదేహ ! యను మానము లేకముదంబుచే నినుం
గోరిభజించినందులకు గూరిమిబ్రోవగరాదె నన్నిలన్
సారసనేత్ర! నాదగు విచారములెల్లనుదీర్చి మాధవా!

ఉ॥ ద్రౌపదిగావలేదె భవతాపనివారక ! దైత్యసంహరా !
నాపయి జాలిలేదు కద నాతిగ జేయవె జాతి నోహరీ !
గోపవధూప్రియా ! దురితకుంజరసింహా ! ప్రపంచపోషకా !
నీపదయుగ్మ మున్గొలిచి నేనిక ధన్యతగందుమాధవా !

ఉ॥ నిన్నుమదిం దలంచి యిటు నిచ్చలు వేడు టదేలయన్న స
త్సన్నుత! స్త్రీలదుస్థితిని సత్వరితంబుగ బాపియిభ్భువిన్
బన్నుగ సద్బుధుల్ తగినపట్టున విద్యను ముద్దరాండ్రకున్
గ్రన్ననవేరిపించి మరి జ్ఞానముబుట్టగ జేయు మాధవా!

ఉ॥ మునుపటివారలెల్లతమ ముద్దియలం జదివించలేదొకో?
వినయపతివ్రతాత్వసువివేకములం జరియించినట్టి యా
జనకజ జూడరే? మఱియు జంద్రమతిం గనరే? యికెందఱో
యనుపమబుద్ధిగీర్తిలత లందిరి విద్యలవల్ల మాధవా!

చ॥ వినగ మహేశుడెప్పుడును వీడక గంగ శిరంబునందు నుం
చెనుగద బ్రహ్మతానుతన జిహ్వను బెట్టెనుగాసరస్వతిన్
అనవరతంబునీహృదయ మందున నిల్పితినీదుకోమలిన్
గనవదియేలొకో? జనులు కారలవైతురు స్త్రీలమాధవా!

ఉ॥ నీరజనేత్ర! నామనవి నెమ్మదితోడుతనాలకించి నా
కోరికయట్ల చేడియలకూరిమిగాచియు వారిదుస్థితిన్
సారెకుబాపుమా యిలను జక్కనిమార్గములంజరించునా
చారముగల్గునట్టులుగ సత్పురుషుల్ పనిపూనమాధవా!

# సహజ సౌందర్యము

ఎండ వేడిమి
బయినది.
ంచిన

పెమ్మరాజు రాజగోపాలముగారు (సారస్వతసమాజము)

సరస్వతికిప్పుడు పదమూడోయేడు. అమ్మాయికి సమర్త యీడు వచ్చుచున్న దేమిరా గతియని శరభరాజు నిరంతర మదేధ్యానముగా నాలోచించు చున్నాడు. రమణమ్మకు మనసు మనసుననే లేదు. పాప మాతల్లితండ్రులు పేదవారగుటచేగదా యిట్లాకులపడవలసివచ్చినది?

శరభరాజునకు తాత్కాలికముగా బీదతనము వచ్చినది కాని స్వతహా ఆయన చాలగొప్ప కుటుంబములోనివాడు. ఆతనికి పూర్వార్జిత మొకవందెకరముల భూమి యుండెడిది. దానకర్ణుడనియు నపరభాస్కరుడనియు, నాతని తండ్రికి భట్రాజులిచ్చిన బిరుదునామము లెన్నియోకలవు. అవసరము కలిగినపుడెల్ల భట్టుకవిపుంగవులట్టివియే మన శరభరాజు దగ్గరకూడ నుపయోగించుచుండెడివారు.

అట్టి స్తుతిపాఠములు తన్నుగూర్చినవి కాని, తనతండ్రి తాతలను గూర్చినవి కాని, వినినపుడెల్ల శరభరాజు నాగస్వరము విన్నపామువలె నాడిపోవుచుండెడివాడు. ఆలాటి వేళలయందాయన యీవి చూడవలసినదే కాని చెప్ప నలవికాదు. బ్రాహ్మణోత్తముల కాయనయిల్లు రహదారి. వారు రెండు శ్లోకములు తన పూర్వీకులమీద అువ్వి మూడు తనమీద విసరగనే ఆనియోగిప్రభువుదగ్గరనుండి ధనవర్షము కురియవలసినదే.

కాలమొక్కరీతిగా సాగునా? మనశరభరాజు గుణించుటే కాని గణించుటేది? హాయిగ వినుచువినుచు నుండగా నాగిపోయిన సంగీతమువలె నాయనధనమంతయు దానములు చేయుచుండగనే అంతరించినది. మీ యార్వేలవారికి లౌకికత్వమిచ్చుట లేదని చెప్పిన భట్టువాని వాక్యప్రభావముచే నాయనకున్న స్థిరచరరూపమైన ధనమంతయు జెల్లిపోయినది. మనకథాకాలము నాటికి శరభరాజు దరిద్రస్థితిచెప్ప నలవి కానంత దుర్భరముగా నున్నది. ఒక్కపూటకైన సరిగానున్నదో లేదో? పాపమైశ్వర్యమంతయు నూడినను అభిమానము మాత్రము విశ్వాసము జూపుచు నిల్చియున్నది. పట్టుబట్టలతో తులతూగుచుండెడి భార్యాదుహితలు బట్టపేలికలతో నల్లాడునపుడు శరభరాజు కన్నీరుమున్నీరుగా ప్రవహించుచుండును. మానవజీవితములో నధమవిధమగు

ణామమునకు లోనైనను, ఆయన సతీసుతల సహజసౌందర్యాభిజాత్యములు
౨. అవియే వాని దుర్దినములలో సంతసము గొల్పు మెఱుపుతళుకులు.

ఇప్పుడు పులిమీద పుట్రగా నాయజమానికి తనయావైవాహికాతురణ మొక్కటి పురమైనది. అల్లారుముద్దుగా పెఱిగి సహజసౌందర్యవిద్యాసంశోభితయైయున్న సరస్వతి నేమూర్ఖునకో కట్టిపెట్టుటకు నాతని కోమలహృదయము సమ్మతింపకున్నది. చింతలో జివికిన కొలదిని కన్నియకు వయసు ముదురుటయే ఫలితమగుచున్నది.

పోనిమ్మెప్పటికైనను శుభసందర్భము రాకుండునా? కాలనటకుడు గౌరవపరిధానధారియై యదృష్టవేష మభినయింపకుండునా? అని యతడు వేచి యుండదలచినను నిరంకుశమగు నాంధ్రదేశీయసంఘ మూరకొనునా? సానిని చేయుదురా అని ఒకరును, పెద్దపోకడ లేటికనికొందరును, అంతకు తగిన బొంత నే చూచుకొనవలెనని మఱియొకరును, సమర్తాడినదేమో యని యింకొకరు నిట్ల నేకవిధముల నమ్మలక్కలాడిపోయ జొచ్చిరి.

శాస్త్రములనైన సమర్థించుకొనవచ్చును, పరమేశ్వరానుగ్రహమైన బడయవచ్చును కాని, యోచనావిహీనమగు హైందవసంఘము సందుముఖ్యముగా నాంధ్రదేశీయఛాందసుల నొప్పించుట దుష్కరము. అందుచే శరభరాజున కెక్కడ వెలివేయుదురో అనుభయ మొకటి మిక్కుటముగా ప్రారంభమైనది.

ఆహేతువుచే మరింత వికలచిత్తుడై వరుల కొఱకు వెదుక నారంభించెను. దరిద్రునకు మోక్షమైనను కరతలామలక మగునుగాని తగిన అల్లుడు దొరుకుట కష్టము.

కావలసిన సంబంధములకు బోవ కటికి దరిద్రుడగుటచే నతనితో సరిగా ప్రసంగించుటయే లేదు. దరిద్రుడైనను సరియే విద్యారూపయుతుడగు కులీనున కీయనూహించెను. ఎంత గాలించినను ఆమూలము నొక్కచోట సందర్భపడలేదు. సందర్భపడినచో నేమిచ్చెద ననుప్రశ్నయే. భాగ్యవంతుల జేఱుటకే యాతని కలవికాదు. చేరెనా, భీకరవరకట్నసర్పవిషజ్వాలా ఫూత్కారములు ముందంజ వేయనీయవు. అవియటుండ శరభరాజున కింటనుంట మరింత వేదనా కారణముగానున్నది. దినదిన ప్రవర్ధమానయగు కుమారి సుకుమారసుందరవదనము వాని మృదులహృదయమునకు అంపపుకోత పెట్టుచున్నట్లుండెను. దానికి తోడిల్లాలి దైన్యభాషణము లిసుకరేణువులవలె మెదలప నారంభించెను. ఆకారణముచే మరల నెట్టులైన వరాన్వేషణమునకై శరభరాజిల్లు వెడలిపోయెను. అనువు తప్పినచో సంసారముకన్న బాధాకరమైనది లేదు.

౨

వసంతము ముదిరి క్రమక్రమముగా ప్రబలమగు వేసవియాయెను. ఎండవేడిమి దుస్సహముగానున్నది. అప్పటికిశరభరాజు వరాన్వేషణకుపోయి వారముపదిరోజులయినది.

రమణమ్మ సంసారము జాగ్రత్తగనే దిద్దుకొనుచున్నది. ఎంతజాగరూకత వహించిన నేమిచేయగలదు? ఇంటిలోని సంభారము లొక్కటొక్కటిగా నిండుకొనుచున్నవి.

రాత్రి పదిగంటలు గడచినవి. ఒకవంక వినీలగగనభాగముమీద సుధాకరుడు తారకాపరిష్కృతుడై, కుళాయిత్రిప్పినట్లు, చంద్రికాప్రవాహ మొలయించుచునేయుండెను. మఱొకవంకనుండి జీవసమితి శోషింపజేయగలిగిన వడగాడ్పు వీచుచునేయున్నది. జగ మంతయు నిశ్శబ్దమై వెచ్చనూర్పుచున్నది.

ఒక నులకమంచముపై సరస్వతియొడలు మఱచి నిద్రించుచున్నది. పసిడినిగ్గులు దేరుచున్న దామె శరీరచ్ఛాయ. ముకుళితములగు నాబాలిక సోగకన్నులందవ్యక్తమాధుర్య మొలుకుచుండెను. ఆమె మొగమునం దేమి శక్తియున్నదో కాని విలాసరసము విరియ జేయుచు నెంతజూచినను చూడవలెననియే యుండెను. ఇంకను బాలికయగుటచే జడ బందువైచికొన్నది. అది సౌందర్యదేవత శాసనదండమువలె క్రిందికి వ్రేలాడుచున్నది. అందమన నేమియో విప్పి చెప్పజాలను కాని, అది మాత్ర మామె సర్వాంగకములందు బూయబడి యుండవలెను.

పాపము సరస్వతికి పరికిణీలు రెండును జాకెట్లు రెండును మాత్రమేకలవు. అందొక జత యెప్పుడును పెట్టెలో దాచికొని, పేరంటములకు వెళ్లునప్పుడు కట్టుకొనును. రెండవది పగలు కట్టుకొనును. రాత్రులం దేపాతగుడ్డనైన ధరించి పండుకొనును. నాడు తన తండ్రి చినిగిపోయిన పంచెకట్టుకొని నిద్రించినది. సహజసౌందర్య మెట్లును ప్రకాశించును.

అంతలో సరస్వతితల్లి మంచినీరు త్రాగుటకు లేచి జలము గ్రోలిమరల శయనిం చుచు పిల్లవంకజూచెను. చూడగనే పొర్లి పొర్లి దుఃఖము వచ్చెను. ఆమె దగ్గఱకుపోయి ముద్దుపెట్టికొని కంటనీరిడసాగెను.

నిద్రాముద్రలోనున్న సరస్వతికి తన తల్లి గర్భగోళములో నగ్నిపర్వతము పగిలిన దనికాని, ఆమె హృదయకోశము ద్రవీభూతమై రుధిరబిందువుల చిందుచున్నదనికాని, ఆయమ నేత్రకోణములనుండి సంతతాశ్రువారి వఱదకట్టుచున్నదనికాని, ఆసతీమతల్లి యుదారముఖబింబముపై మలినవిషాదము స్థానమేర్పఱచు కొన్నదనికాని, యించు కయు దెలియదు. అదే నిద్ర. ఎప్పటివలె ముద్దునెమ్మొగముపై చిరునగవు లేతవెన్నెలలు, కుంచితసరోజనీపత్రప్రతిమాన నేత్రనిమీలనములు. ఆమెయొక చిన్నబాలిక.

అప్పటికి మూడురోజులనుండి సరిగా రమణమ్మ కాహారములేదు. తొలిరోజున తానొకపూటనే తిని రెండవపూట మానివైచెను. "అమ్మా! నీ కాకలి లేదటే? బియ్యము పొయ్యలేదటే? రేపు నాకు చద్దియన్నము వద్దులే. నువ్వుతిను." అని యమాయికయగు సరస్వతి బ్రతిమాలగా నాపుణ్యగేహిని గుట్టుచెప్పక "నాకాకలిలేదు. కడుపు నొప్పిగానుం"దని యెట్లో ఆమెను సమాధానపఱచెను. రెండవనాడు సరిగా తవ్వెడు బియ్యమున్నవి. తానుకూడ భుజించినచో సరస్వతి కొక్కపూట తిండియగును. అదిమండువేసవి. పిల్ల తూలిపోవును. అట్టి సమయములో నామె యేమిచేయగలదు? ఎక్కడనైన బదులు తెచ్చుట కావారము రోజులనుండి యూరివారి నందరి విసిగించియేయున్నది. పైగా నభిమానవతి. ఇట్టి దీన స్థితిలో నాయాగర్భశ్రీమంతురా లిదివఱకెప్పుడును పడియుండలేదు. ఆయిల్లాలింకొకరి కింత పెట్టినదికాని ఒకరిని దేహియని యడిగి యెఱుగదు. శరభరాజెంత త్వరలోవచ్చునని మాత్రమేమి నిర్ధారణము? అంతవఱకు మాడియుండవలసినదేనా? తల్లి తన బిడ్డకోసమెట్టి త్యాగమునైన చేయగలదు. అందుచే వ్రతమనిమిషపెట్టి, యామె నాడుకూడ నుపవాసముండెను.

ఇక తెల్లవారగనే మూడవరోజు. కొంచెము చలిదియన్నము మిగులగా సరస్వతికి పెట్టి రమణమ్మ తర్వాతగతి యేమని యోచించుచుండెను. తానెట్లైనను తాళగలదు. కాని పిల్ల మాటయెట్లు?

ముందునుగూర్చి యోచించిన కొలదిని, ఆమెకు నిరాశ మరింత బలముకాజొచ్చెను. కన్నులార జూచుచుండగనే తిండిలేక నాకలిచే తనముద్దు బిడ్డ చచ్చిపోవలసినదేనా? అయ్యో! యింక దిక్కులేదా? ఇట్లు తలపోయుచు నామె నూతిదగ్గర కూర్చుండి సరస్వతి చూడకుండ భోరున చంటిపిల్లవలె నేడ్చెను.

అంతలో నెవ్వరో పొరుగువారు వచ్చి తమ యింట జరుగబోవు విందునకు వారిని బిల్చిరి. రమణమ్మయు, సరస్వతియు కూడ వెళ్లి భుజించిరి. కాని రమణమ్మ కాతిండి తిన్నట్లేలేదు. తనయింట నేమియు లేకుండుటయు, పిల్చినది తడవుగా తాముబోయి పరుల యింట తినవలసి వచ్చిన నాటి యీ హైన్యత మిక్కిలి యామెను బాధించెను. ఇకనాటి రాత్రిగడపవలసియున్నది. సరస్వతి ఆకలిగాలేదని నిద్రపోయినది. తిందుమన్నను రమణమ్మ కన్నములేదు.

అట్టి దుర్భరావస్థలో నుండి యారాత్రి రమణమ్మ భర్తకొఱ కెదురుచూచుచున్నది. అంతలో శరభరాజు ప్రత్యక్షమయ్యెను. మార్గాయాసఖిన్నుడగు నాయనకామె కాళ్లుకడిగికొనుటకు నీళ్లిచ్చి దాహమొసగెను.

శరభరాజు దీనవదనయైయున్న భార్యవంకజూచి మాటలాడలేకపోయెను. కన్ను లలోనుండి చివ్వున నీరుగాఱినది. గంభీరహృదయుడగు నతడే యట్లయినపుడు రమణమ్మ సంగతి చెప్పవలెనా? అట్లు కొంతసేపటిదాక వారు మాట్లాడుకొనలేని స్థితిలో నడలజొచ్చిరి.

మరికొంతసేపటికి వారి దుఃఖోద్రేకము తగ్గినది. చివరకువారి వైఖరి యొక విధమగు బండతనము లోనికి దిగినది. అప్పుడు రమణమ్మ తనభర్త విఫలమనోరథుడై వచ్చుట గ్రహించి, అప్పటివఱకు తాననుభవించిన అవస్థనంతయు నెఱిగించి, ముందు గతియేమని యడిగెను. క్షణము శరభరాజు హృదయములో నుండి యొక్క దుఃఖ తరంగము దూసికొనిపోయి, శరీరమంతయు నూగించివైచినది. మరల నెట్లో స్థిమితుడై "నేను దేశమంతా గాలించి వెదికాను. మన దురదృష్టముచేత ఎక్కడా సంబంధం కుదరలేదు. నే నింత అన్నంతిని రెన్నాళ్లయింది. ఇట్టి సంకటావస్థలోపడి కుళ్లిపోవడం కంటె, ఒక్కమా రేవిషమో తిని కుటుంబమరణం పొందడంమేలని నిశ్చయించుకొని వచ్చా" నని చెప్పి వికృతముగా చూడసాగెను. రమణమ్మ దృక్కులు పిల్లవైపు మరలినవి. తోడనే అచేతనయయి పడిపోయినది. శరభరాజు ప్రతిమవలె యట్లేయున్నాడు. ఎట్టి భయంకరపరిణామము రానున్నదో కాని, యాచంద్రికామయవినిర్మలాకాశము కూడ భయానకహాసినియై పోయినది.

3

ఏదియెట్లున్నను కాలచక్రమూగదు. తెల్లగా తెల్లవారినది. సూర్యోదయము కూడనయినది. సరస్వతి యొకచిన్న బిందెబూని కొలని యొద్దనకు వచ్చినది.

ఆ కొలనియొద్దున నొకయువకుడు ఇటునటు పచారుచేయుచుండెను. అత డందమైనవాడు. సౌమ్యునిగా నాతని చూచినంతనే తెలిసికొనవచ్చును. కాని మనస్సులో నేదియో యోచించుకొనుచున్న ట్లగపడుచున్నాడు.

సరస్వతి కొలనులోదిగి పుక్కిలించుచు నిటునటు చూచుచుండెను. విచ్చిన తామరలతోను, నీళ్లపై మెఱయుచున్న సూర్యకిరణములతోను, ఆచెఱువు సొగసుగా నున్నది.

వాని కేమి బుద్ధిపుట్టెనో కాని, సరస్వతి సమీపముగా పోయి నిలువబడెను. ఆమె యాక్రొత్తవానివంక బెదురుచూపులు ప్రసరించెను. అప్పుడా యువకుడు "నువ్వెవరమ్మాయి" వని ప్రశ్నించెను.

సర—శరభరాజుగారి అమ్మాయిని.

యువ—నీపేరేమి ?

సర—(చిఱుసిగ్గుతో) సరస్వతి.

ఆయువకున కానామాక్షరము లమృతసేచన మొనరించినవి కాబోలు నానందపరవశుడైనట్లుండి మరల "నువ్వు చదువుకొన్నావా?" అనియడిగెను. దానికి సరస్వతి "మానాన్నగారికి ప్రతిరోజు భాగవతము చదివి వినిపించడము నేనే" అని బదులుచెప్పినది.

ముద్దులు మూటగట్టుచున్న ఆస్వర్ణాంగిని యతడు కౌతుకముతో చూచుచున్నాడు. అతడు తన్నంతగా చూచుచుంటచే కాబోలు మనసరస్వతి యించుక తెల్లబోవుచు నీళ్లుముంచుకొని వెళ్లిపోవుచున్నది. తేలిపోవుచున్న మధురస్వప్నమువలె, నలలు వేయుచు నేగుచున్న స్వర్గీయసౌందర్యస్రవంతివలె భుజముమీద బిందెనెత్తుకొని పోవుచున్న సరస్వతి నతడట్లే చూచుచున్నాడు. ఆమె యచ్చోటు వాసినది.

అయువకుడు కూడ నచ్చోటువదలి పోవుచు మధ్యమధ్య నస్పష్టముగా "మన యూహలు వేఱు దైవసంకల్పము వేఱు. సహజసౌందర్యములో నెట్టి ప్రభావమున్నది" అనుకొనుచు వెడలిపోయెను.

౪

మధ్యాహ్నమైనది. అప్పటికి శరభరాజెట్లో తేగలిగిన బియ్యముతో వంటచేసి రమణమ్మ తాము ముగ్గురొకేసారి తినవలయునని కాబోలు మూడు విస్తళ్లలోను వడ్డించినది.

ఆపుణ్యదంపతు లిరువురియందు నొకవిధమగు పైశాచికలక్షణ మావేశించినది. వైవర్ణ్యమునొందిన వారి మొగములును, వెఱ్ఱిచూపులును ఏదియో యుత్పాతమును సూచించుచున్నవి.

శరభరాజు పరిషించుటకు సిద్ధముగానున్నాడు. అంతలోనిరువురు క్రొత్తవారు తలవని తలంపుగా లోనికి వచ్చిరి. రమణమ్మయు, సరస్వతియు నావలకి వెళ్లిరి. శరభరాజు కొంచెము ఖంగారుపడి లేచి, "ఏమండోయి సోమసుందరంగారు, రండి దయచెయ్యండి. ఇదే నారావడ"మనెను.

ఆ వచ్చిన వారిలో రెండవవానిని మన మిందాక కొలనియొద్దను జూచియున్నాము.

అప్పుడు శరభరాజు సోమసుందరము వైపుతిరిగి "మీ అబ్బాయి కేశవరావుకూడా వచ్చాడు. వెంకటాచలంగారింటికా? కాబోవు వియ్యాలవారు." అని సంభాషణ మారంభించెను.

సోమ—అక్కడికి కాదు. ఇప్పుడే కానున్న వియ్యంకుడుగారగు శరభరాజు బావగారింటికి.

శర—(కష్టముగా) ఆ అదృష్టము నాకుంటే, నేను క్రిందటి మారు మీయింటికి వరాన్వేషణకై వచ్చినప్పుడే ఒప్పుకొనేవారు. మీరు వేలకివేలు గ్రుమ్మరించే వారితో సంబంధము చేస్తారు కాని, మాబోంట్లతో చేస్తారా?

సోమ—మీరల్లా భావించవద్దు, జరిగిన విషయము చెపుతాను. అసలు మీరన్నట్లు వెంకటాచలంగారి కుమార్తెను చూచుకోవడానికే వచ్చాము. ఉదయం చెరువుకి వచ్చిన మీఅమ్మాయిని సరస్వతిని మావాడు చూచేడు. వెంటనే అతని అభిప్రాయాలు మారిపోయినవి కాబోలు. నాదగ్గరకువచ్చి "నాకు వెంకటాచలంగారి పిల్లవద్దు. శరభరాజుగారి పుత్రికయయిన సరస్వతే కావా"లని నిష్కర్షగా చెప్పేడు.

శర—అల్లా అయితే మీబోటివారితో సంబంధం చేయుటకంటె కావలసినదేముంది. కాని ఒకటి మాత్రము పీడిస్తోంది. మీరు వెంకటాచలంగారి సంబంధం కోసము వచ్చేరు. ఆయన నామీద నిష్ఠురములు వేస్తాడేమో?

కే—అది నాయిష్టముమీదే వున్నదికాదా?

సోమ—శరభరాజుగారూ! మన మేమి చేయగలము. వాని యిష్టమెట్లో అట్లే కానిమ్మని చెప్పేను. తల్లిలేని పిల్లవాడు. వాడికి మనస్సు నేనెందుకు కష్టపెట్టాలి? అందుచేత అవశ్యము మన మిద్దరమూ వియ్యమందాలి.

కే—సహజసౌందర్యము, తగిన విద్యాకులశీలాదులు, అభిజాత్యముగల, బాలారత్నముకన్న పెన్నిధానము లేదు. అట్టివి కలలక్ష్మి కాబట్టియే నేను సరస్వతిని గృహలక్ష్మిగా వరించాను. ఈపాడుకట్నాలు రాగానే సత్కులప్రసూతలయిన యిట్టి కన్యారత్నములెందరు మాటుపడియున్నారో? కన్యాప్రదాతయిచ్చు కన్యనా కాక వానిధనమునా చూడవలసినది?" అని అతడావడ్డించినవిస్తళ్ళ వైపుజూచి, యీయన్నము వివర్ణముగానున్న దేమనెను. దానికి సత్యసంధుడగు శరభరాజు "ఇంకొకగడియుదాక మీసంబంధము రాకున్నచో కుటుంబమరణ మొందెడివార" మని బదులుచెప్పెను. "అది విషాన్నమేనా?" యని వారిరువురు చకితులైపోయిరి.

# "మాతృదేవోభవ"

శ్రీనాథమహాకవి

సీ॥ నవదరించుటయెట్లు జఠరగోళమునందు
నవమమాసావసానంబుదాక
వ్రేకనైన బ్రసూతివేళాసముద్భూత
సంకటం బోర్వంగ(జాలుటెట్లు
కుత్సింపకుండెట్టు లుత్సర్గవిణ్మూత్ర
లాలాద్రవశ్లేష్మజాలమునకు
పంచకరపాట్లు వడి తన్ను బెంచివిసికి
యాపదలబాచి రక్షించినట్టి తల్లి
దేవతాబుద్ధిభావించి తెలియవలయు
గొడుకువంశాబ్ధి సంవృద్ధిగోనలుసాగ.

క॥ రేపాడి గొడుకు జననీ
శ్రీపాదములకు నమస్కరింపగదగు ద
చ్ఛ్రీపాదక్షాళన పలి
లాపోశన మెపుడు సుతులకాయుష్యమగున్.

గీ॥ సర్వ తీర్థాంబువుల కంటె సమధికంబు
పావనంబైన జనయిత్రిపాదజలము
వరతనూజుల కఖిల దేవతలకంటె
జననిమెక్కుడు సన్నుతాచార నిరతి.

# అహింస

శ్రీమతి. డి. రాజరాజేశ్వరమ్మగారు (ఆంధ్రకవితామండలి)

'అహింసా పరమోధర్మః' అను నీతివాక్యపరిపాలన మనుజుని జీవనావ కవశ్యమగు నుపకరణము. తరించుమనుజున కహింసాపరత్వ మొక యూత. ప్రపంచమున నించుమించ న్నిమతములవారు నహింసాపరత్వముచే మోక్షపథమును బడయనగునని ప్రతిపాదించి చెప్పుచుండుట మనకందరకు విశదమే. రామాయణము, మహాభారతము మొదలగు హిందూపురాణములు కూడ నట్లే ఘోషించుచున్నవి. అహింసను సత్యముగాచును, మరియు, సత్యమును నహింసగాచును. అహింసను పరిపాలించువాడు సమస్తధర్మములను నెరవేర్చినవాడని హిందూమతసాంప్రదాయము. బౌద్ధులు, జైనులు, మొదలగు ప్రసిద్ధినొందిన మతములవారు కూడ 'అహింసా పరమోధర్మః' అను నీతిని పురస్కరించుకొని తమతమ మతములను నిష్ఠతో బరిపాలించుచున్నారు. జననీజనకారాధన, గురుభక్తి, శాంతము, ఇంద్రియనిగ్రహము, సత్యము, లోకమునకు సంబంధించిన మంచినడవడిక, నహింసాపరత్వమునకు ఎడతెగని సహకారులు. 'జంతుపదములెల్ల దంతి పదములో నడగు' విధమున, అన్ని ధర్మములు అహింసయం దడగి యుండుననియు, పురాణములందు తీర్మానింపబడియున్నది.

హింస జ్ఞానకృతహింసయనియు, యజ్ఞానకృత హింసయనియు రెండువిధములుగ ప్రతిపాదింపబడియున్నది. హింసల నిన్నివిధములని తీర్మానించుట మనకసాధ్యము. అహింసాపరత్వమున భూతదయ ప్రాథమికసోపానము. మన హిందూపౌరాణికపరతంత్రత అహింసాపరత్వ మందించుకంత వ్యతిరేకించుచున్నది. అజ్ఞానకృతహింసయు, సముచిత హింసయు, హింసలుగావని పౌరాణిక తీర్మానమును కొంతవరకు మన మంగీకరించవలసియున్నది. గాని సముచితహింస నంగీకరించుట సమంజసము. మాంసభక్షణము సముచితమా?

మాంసాహారమును నిషేధించిన మరిబ్రతుకజాలమా? పరమాత్ముడు సమస్తప్రాణికోటిని సమానదయాదృష్టిని జూచునుగదా? అతడు మనల నందరి నొక్కరీతిగనే గదా

యిలపై బుట్టించెను? అట్టిచో మత్స్యము, మేషము మొదలుగాగల సోదరజీవజంతువుల జంపి భుజించుటకు మనము రాక్షసులమా? ఆహా! మాంసాహారమం దిచ్ఛ గలిగి నిష్కళంకులగు దేవతలను నెపమిడియూ, వాయిలేని జంతుజాలములను జంపి పాపమున కొడిగట్టుట! ఉజ్వలపుణ్యలక్ష్మి యని పేరువడసిన భారతసామ్రాజ్యలక్ష్మికి బుట్టి రాక్షసులవలె మాంసాహార మందాసక్తిచే దయారహితులై సోదరజంతుజాలమును హింసజేసి కళంకమాపాదించుట భావ్యమా?......ప్రస్తుతపు దేశస్థితిని బట్టి జూడ, క్రమమున కొన్నాళ్లకు మనుష్యమాంసమును కూడ తినుటయందాసక్తిగల వారగుదురని యనుమానము కలుగుచున్నది.

క॥ సమదర్శియై యఖిలభూ
తములను దనయట్లగాఁగ దలచుచు నెవ్వం
డమలన్యాయపరుండగు
నమరు లతని వందనీయుడండ్రు నరేంద్రా!

—మహాభారతము

అనుటచే భూతదయ న్యాయమార్గదర్శకమైయ్యు, మోక్షమార్గదర్శియైయ్యు, మనుజుని కుపకారి యగుచున్నది. అహింసాపరిపాలనమునకు భూతదయయే మొదటి సోపానము. కావున—భారతదేశమందలి సోదరసోదరీమణు లించుకంతనా యీగమనికను గ్రహించి మాంసాహారము మొదలుగా గల జీవహింసకృత్యములను త్యజించి భూతదయాపరత్వము నూతగాగొని మోక్షమార్గమును గనుగొందురుగాక!

## ప్రౌఢవివాహము

ఉభయభాషాప్రవీణ. బులుసు. నరసింహశాస్త్రిగారు.

ఉ॥ చిన్నతనాన మంచి యిది చెడ్డది యంచు వచింపలేని యా
కన్నెను బెండ్లియాననెడి కౌతుకి మెంతయు సందడింప నా
చిన్నతనాలగున్నను నిసీ! తలిదండ్రులు భావిగాన కే
వన్నెయు వాసిలేని యొకవాజికిఁ గిట్టుదు రట్టులొప్పునే?

చ॥ వినుఁడొక చిన్నమాట పృథివీతలమాన్యచరిత్రులార! మీ
తనయలు ప్రౌఢలై తమయుదారప్రభావము పల్లవింపఁగా
ననుగుణులైన భర్తలఁదమంతటఁ దామ వరింపఁజేయఁ ద
న్మనములు సంతసిల్లు ననుమానము లేదిఁక వేద మొప్పెడిన్.

# వీరమాత రాణూబాయి

## శ్రీ శేషాద్రి రమణకవులు.

మహారాష్ట్రదేశమునందలి జాబు అను గ్రామమునందు సూర్యాజీపంతు అను నొక పరమభక్తుఁడు గలఁడు. ఆతని కనురూపపత్నియే మన కథానాయికయగు రాణూబాయి. ఈ పుణ్యదంపతులు బ్రాహ్మణులు. పవిత్రవర్తనులు. శాంతశమదమాదిగుణాలంకృతులు. పురోహితవృత్తివలన వచ్చునాదాయమె వీరికి జీవనాధారము. రాణుబాయి యెంద అతిథులే వేళ తనయింటి కరుదెంచినను లేదనక యిష్టమృష్టాన్నములు వండిపెట్టి యుపచరించుచుండును. ఈ పుణ్యదంపతు లాదిమదంపతులవలె నాకాలమున సమస్తజనమాననీయులై పేరొందిరి. రాణుబాయి గృహకృత్యములఁ దీర్చి భర్తృసన్నిధిలో వేదాంతగ్రంథపఠనము గావించుచు జీవితమంతయు నితరకార్యముల వంకకుఁబోనీయక యాధ్యాత్మిక చింతయందే గడుపుచుండెను.

ఆ కాలమున భగవదవతారముగ భావింపబడుచున్న యేకనాథస్వామి యన్న రాణుబాయి కెంతయో భక్తి. సంవత్సరమున కొక్కమారేని యాసాధుపురుషుని చెంతకు రాణుబాయి భర్తతోఁ బయనమై నమస్కరించివచ్చుట కలదు. నిస్పృహుఁడు త్యాగమూర్తియు నవతారపురుషుఁడునగు ఏకనాథస్వామి రాణుబాయి నాదరముగఁ జూచి ప్రసాదము నొసంగి యనుగ్రహించువాఁడు. రాను రానాసూర్యాజీపంతునకు ఏకనాథస్వామియెడభక్తిప్రసక్తులు మెండయ్యెను. బోధామృతము చవిజూడఁదలఁచినపుడు తప్పక తన గృహిణియగు రాణుబాయిని ఏకనాథస్వామి సన్నిధికిఁ గొంపోయి యుపచర్యజేయించుచుండును. పుత్రికావాత్సల్యముతో ఏకనాథస్వామి రాణుబాయి పరిచర్యలను బరిగ్రహించి యాశీర్వదించుచుండువాఁడు. అచిరకాలమున కాదంపతులకొక తనయుఁడుద్భవించెను. వానికి శ్రేష్ఠరాముఁడని నామకరణమొనరించి సంవత్సరాంతమునఁ దనయునితో నీపుణ్యదంపతులు సాధుపురుషుని సన్నిధికరిగిరి. ఏకనాథస్వామి రాణుబాయిని జూచిపరమానందభరితుఁడై "తల్లీ! నీ వదృష్టవంతురాలవు. వీరమాతవు కానున్నావు. భరతఖండమునుద్ధరింపఁగల యొక కర్మయోగి కొలఁదికాలములో నొక శుభముహూర్తమున జనింపఁగలఁడు. అబాలుని జూచుటయే తడవు నే నవతారముచాలించెదను. లోకోద్ధరణ కార్యమునఁ బాటుపడి నేనుముదుసలినైతిని. కార్యభారము నీతనయుండు నిర్వహింపగలఁడు. నీజ్యేష్ఠకుమారుఁడు కుటుంబధర్మములు నిర్వహించుచు మీ కుపకరింపఁగలఁడు. జనింపబోవు పుత్రుఁడు ప్రపంచోద్ధారకుఁడు. ఆతనికై మీరాశపడవలదు." అని పలికెను. స్త్రీజనముతోఁబలికి యెఱుంగని సాధుస్వామి యిట్లుభాషించుటవిని యచటమూగియున్న ప్రజలందఱు పరమాశ్చర్యభరితులై రాణుబాయిని నాదరించిరి. రాణుబాయి స్వామి చరణారవిందములకు సాగిలిమ్రొక్కి యనుగ్రహింపఁబడితినని పల్కి ప్రసాదమును స్వీకరించి తనభర్తతోఁ గలసి పరమానందభరితురాలై గృహముచేరెను. శా. శ. 1530 (క్రీ. శ 1608 ఏప్రియలు) కీలకనామసంవత్సర చైత్రశుద్ధనవమి పట్టపగలు పన్నెండు గంటలకు (సరిగ శ్రీరామజన్మసమయమున) రాణుబాయికిఁ బుత్రరత్నము జనించెను. సహజతేజోరాశియు

శుభముహూర్తసంభవుండు నగు నాతనయునిఁగాంచి రాణుబాయి యొందిన సంతోషమునకు మేరలేదు. సుపుత్రోత్పత్తికంటె మాతృదేవతకుఁ గావలసినదే మున్నది? సూర్యాజీపంతు కుమారునకు యథాశాస్త్రీయముగా జాతకర్మలొనరించి నారాయణుఁడని నామకరణముగావించెను. కొన్నిదినములు గడచినపిదప నీ పుణ్యదంపతు లిరువురు శిశువులతో ఏకనాథస్వామి సన్నిధికిఁబోయిరి. ఏకనాథస్వామి వారి పెద్దకుమారునిజూచి యీతఁడు భక్తుఁడు, జ్ఞానికాఁగలఁడని చెప్పి రెండవకుమారుఁడు నారాయణు నెత్తుకొని "కుమారా! నీ తల్లి కృతార్థురాలు. ఆయమను వీరమాతను గావింపవలసిన భారమేగాక భరతవర్షమునంతయు నుద్ధరింపవలసిన భారముగూడ నీపయినున్నది. ఇఁక నీవె కార్యభారవహుఁడవుకానుంటివిగావున నేను దేహయాత్రచాలింప నుంటి" నని పలికెను. కుమారుని యభ్యుదయము నాలించుటకతన ఆనందబాష్పములు స్వామి నిర్యాణవార్త వినుటవలన విచారబాష్పములు రాణుబాయి కనుగొనలనుండి రాలెను. కొన్నిదినములా యాశ్రమముననే యీదంపతులు గడిపిరి. ఒకానొక దినమున రాణుబాయి చూచుచుండఁగనే యొకదివ్యతేజము ఏకనాథస్వామి ముఖమునుండి బయలువెడలి బాలుఁడగు నారాయణునియందు లీనమయ్యెను. ఏకనాథునకు ఊర్ధ్వదేహ క్రియలాచరించి దంపతులు గృహముజేరిరి. అనంతరము కొలఁదికాలమునకె సూర్యాజీ పంతు పరలోకగతుఁడాయెను. రాణుబాయి సహగమనముగావింపఁబోవు తఱికిఁ గొందఱు సాధువులువచ్చి వారించి "తల్లీ! ఏకనాథస్వామియ నుజ్ఞనుల్లంఘింపకుము. కుమారుల సంరక్షణము నీ విధి"యని పలుతెఱంగుల బతిమాలిరి. లోకోత్తరుఁడగు తన ద్వితీయకుమారుని యభ్యున్నతిఁ జూడ నెంచియు విజ్ఞానమాతనికిఁ బ్రసాదింప నెంచియు సహగమనవ్రతము మానుకొనెను. పుత్రులిరువుర కామె చదువుసందెలు పురాణకథలు వీరలీలలు వినిపించుచుఁ గాలము గడుపుచుండెను.

శ్రేష్ఠరాముఁడు నారాయణునకంటె మూఁడు సంవత్సరములు మాత్రమె పెద్ద. రాణుబాయి పెద్దకుమారునకుఁ బెండ్లిపేరంటములు గడపెను. కొలఁదిదినములు గడిచినపిదప నారాయణునకుఁ బెండ్లిచేయదలంచెను. ఎన్నివిధములఁ జూచినను పెండ్లియనిన నేవగించుచు నారాయణుఁడు విరక్తివాక్యములు దెలుపుచుండెను. నారాయణుఁడు సహజజ్ఞాని. వినికిడివలననే సమస్తశాస్త్రముల సారము నెఱింగెను. లోకోద్ధారకులగు బ్రహ్మచారుల కథలన్నింటిని సాదృశ్యముగఁ దెల్పి తల్లిని తన వివాహము చేయుయత్నము మానుకొమ్మని చెప్పెను. శ్రీరామ సేవకంటె తనకితరము హితవుగాదనియు నన్ను శ్రీరాముని పరిచర్యకై విడిచిపెట్టుమనియుఁ దల్లిని బతిమాలెను. సంసారసుఖము చవిజూడమిచే నిట్లు పలుకుచుండెనని తల్లి నారాయణునకుఁ బెండ్లి జరుప నిశ్చయింప నారాయణుఁడెట్లో వివాహవేదిక యెక్కువఱకు ఓపికబట్టి వెంటనే మహారణ్యములకుఁ బారిపోయెను. లోకోద్ధారకుఁడగు కుమారుని కుటుంబజంబాలమునఁ ద్రోయనెంచిన మహాపాతకమునకు ఫలము పుత్రవియోగదుఃఖము ననుభవించుటయే యని రాణుబాయి విచారపడెను. నారాయణుఁడు వందలకొలఁది ఆమడలదూరము పోయి గోదావరీతీరమున ఆశ్రమము ఏర్పఱచికొని పండ్రెండు సంవత్సరములు ఘోరతపము గావించుచు భిక్షాహారముతో గాలముగడిపి సమర్థరామదాసస్వామి యను బిరుదనామమొంది పండ్రెండు సంవత్సరములు ఆర్యావర్తమంతయుఁ దిరిగి ముప్పదియాఱవయేట తన మాతృదేవియగు రాణుబాయి సన్నిధికిఁ జేరెను. రాణుబాయి తన కుమారుని గాఢముగాఁ గౌఁగిలించుకొని చిరకాలవియోగదుఃఖము దీఱునట్లు ఆనందబాష్పములతోఁ గుమారుని దేహము తడిపి "తండ్రీ! నాఁడు నీవు మమ్ము విడిచి యెందేగితివి? నీవు లోకోత్తరపురుషుఁడవు కాఁగలవని ఏకనాథస్వామి యాజ్ఞ యొసంగెను. లోకోద్ధరణమున కేమికార్యము లొనరించితివి? నాకు వీరమాతయను నామమే విధమునఁ బ్రసాదింప నెంచితివి?" వని ప్రశ్నించెను. రామదాస

స్వామి యిరువదినాలుగు సంవత్సరములలోఁ దానొనరించిన తపస్సు, చేసిన దేశపర్యటనము నివేదించి తాను సంకల్పించిన కార్యముల నీవిధముగా భ్రాతృసమక్షమున మాతృదేవితో నివేదించెను. "తల్లీ! ఆర్యావర్తము నంతయు యవను లాక్రమించియున్నారు. ఆర్యధర్మములు చాలవఱకు నశించుచున్నవి. సాధ్వీమతల్లులు మాన ప్రాణములఱచేతులలోఁ బెట్టుకొని దినమొకయుగముగా గడుపుచున్నారు. గోబ్రాహ్మణ ఘోషచూడఁ జాలకున్నాఁడను. తపస్వులగు బ్రాహ్మణులు మహమ్మదీయ వేషముతోఁ గర్మభ్రష్టులగుచున్నారు. ఆర్యావర్తమును కృతయుగముగఁజేయు శ్రీరామునివంటి యొకభారతీయచక్రవర్తికి అర్యావర్తమును బట్టాభిషేకము గావించి నేను దేహయాత్రచాలింప నిశ్చయించితిని. ఇదియే నాదృఢసంకల్పము. మాతృదేవి యాశీర్వాదము బడసినంతన యీ మహోద్యమమునకుఁ బూనుకొందును." కుమారుఁ డీవిధముగాఁ జెప్పినంతన రాణుబాయి దేహమున హర్ష పులకలు జనించెను. దేహ ముప్పొంగిపోయెను. "ఇప్పటికి నేను ధన్యురాలనైతిని. ఏకనాథ స్వామి యనుగ్రహమిట్లు ఫలించినది. అయ్యయ్యో! విరాగమూర్తియగు నాతనయుని గుటుంబమునఁ గూల ద్రోయనెంచి యెంతటి ద్రోహముగావించితిని" అని పరిపరివిధములఁ బలికి కుమారుని కౌఁగిలించికొని "తండ్రీ! నీవు సిద్ధసంకల్పుఁడవు. శ్రీరామభగవానుఁడు నిన్నే కార్యమున నియోగించెనో అందు నీజీవితము ధారపోయుము. నా జీవిక కీ శ్రేష్ఠరాముఁ డాధారము కాఁగలఁడు. కాని నా కోర్కె యొకటి. ఎక్కడనున్నను అంత్యకాలమున వచ్చి నన్ను గడ దేర్చుము." అని పల్కెను. రామదాసస్వామి యుప్పొంగి తల్లి చెంతఁగొన్నిదినములు వసించెను. రాత్రులెల్ల ఆన్నతో వేదాంత చర్చలొనరించుచుఁ బగలెల్ల దేశోద్ధరణధర్మములను మాతృ దేవి చెంతనభ్యసించుచుఁ గాలముగడిపెను. రాణుబాయి రామదాసస్వామికి అనేకవిధములుగ అర్యావర్తపరిస్థితులు యవనులవలన హిందువు లొందు బాధలు స్వతంత్రసామ్రాజ్యమువలని యావశ్యకము, స్వధర్మస్థాపన విధము కర్తవ్యము కుమారునకు బోధించెను. రామదాసస్వామి లోకోద్ధరణ ప్రణాళిక మాతృదేవి సన్నిధిలోఁ గల్పించుకొని కొన్నిదినము లింటనుండి కాషాయవస్త్రద్వితీయుఁడై లోకోద్ధరణమునకు బయలు వెడలెను. శ్రేష్ఠరాముఁడు తమ్ముని విడువలేక విడచెను. జ్ఞానవతియగు రాణుబాయి దుర్భరమగు పుత్రవియోగమున కోరువజాలక వావిడిచి యేడ్చెను. "తల్లీ! నీవు ఎరుంగనిధర్మములు లేవు. వినవిను" మని భాగవతములో దేవహూతికిఁగపిలుఁడు చెప్పిన ధర్మములు తెలిపి విరక్తిమార్గమునఁ దల్లిని ప్రవేశపెట్టి రామదాసస్వామి లోకోద్ధరణమునకై బయలువెడలెను.

రాణుబాయికిఁ గొంతకాలమున కవసానకాలము సమీపించెను. "నారామదాసస్వామి కనఁబడఁడుకాఁబోలు"నని ఆమె కన్నీరు విడచెను. కన్నీటితేమయారకమున్నె రామదాసస్వామివచ్చి తల్లి పాదములపై వ్రాలి "అమ్మా! శివాజీమహారాజు ధర్మసంస్థాపనమున కవతరించి హిందూసామ్రాజ్యమును స్థాపింపనున్నాఁడు. భవిష్యత్సామ్రాజ్యమున కాదర్శముగ నేను "దాసబోధ"యను గ్రంథమును రచించితి"నని రామదాసు పలికెను. రాణుబాయి దాసబోధనుగైకొని కనుల కద్దుకొని "కుమారా! యశస్వివికమ్ము" అని దేహయాత్ర చాలించెను. రాణుబాయి వీరమాతృరత్నముగదా! *

* (దాసబోధను తెలుగులో ననువదింపించి వరంగల్లులోని కాకతీయగ్రంథమాలవారు 800 పుటల గ్రంథముగఁ బ్రచురించిరి. ప్రకృతాంశము కొంత నందుండి గ్రహించితిమి.)

# ఋష్యాశ్రమము

శ్రీమతి టి. యస్. భ్రమరాంబగారు (యువతీకవితామండలి)

(సత్యవంతుడు సావిత్రితో)

సీ. కోదమసింగములతోఁ గదిసి మేలములాడుఁ గేరుచు నున్మత్తవారణములు,
వాడిమెకంబులఁ గూడి వేడుకతోడఁ గ్రీడించుఁ బ్రోడలై లేడిగములు,
ప్రేముడితో బావురుబిల్లులతో మెల్ల సయ్యాటలాడు మూషకచయంబు,
గారవం బలరారఁ గాఱెనుబోతులఁ జేరిలీలల నుండు వారువములు,

గీ. చిలువలును ముంగిసలు చాలఁ జెలిమి సేయఁ
దగరు లెప్పుడు తోఁడేళ్ళఁ దగిలియుండఁ
బగ లొకింతయు నెఱుఁగ కీయాశ్రమమునఁ
దుహినకరశేఖరుని మహామహిమఁ జేసి.

మ. కమనీయామలతోయసంయుతములౌ కాసారరాజంబు లం
దమువీఱ న్విలసిల్లుచుండె బాగడొందన్నాప్రదేశంబునం
గుముదేందీవరపద్మహల్లకలసత్కారండజగ్రాహన
క్రమహావ్యాళకుళీరహంసబకకోకస్తోమధామంబులై.

చ. ఘనమగు పోఁకమ్రాఁకులును గాంతినిఁ జెన్నగు పొన్నగున్నలుం
బనసలు నారికేళములు పాటలము ల్వకుళామ్రసాలచం
దనములు పారిజాతములు దాడిమముల్సురపొన్న లాదిగాఁ
దనరు ననేకభూజసముదాయము చూడు సమీపభూములన్.

చ. సలలితపత్రము ల్వికటజాలకచంచువుల న్వసింప నిం
చుక శుకనామ మబ్బుట నె సొంపునమూకు సమంబె? తాళకిం
శుకములటంచు నెంతయును జూడఁగ నోర్వక తమ్ముఁ బల్మరున్
శుకములు పల్కనిం దతులశోభలఁ గేరు పలాశజాలముల్.

చ. సకలసుమంబులం దుఱుము శంభున కర్పింపరించి వాని పూ
జకు వెలియైన గేదఁగిని సమ్మతినుండునటంచు ఫుల్లచం
పకములు పూనికన్ తోడ మధుపమ్ములఁబాఱఁగఁదోలుఁజేరనీ
యక, యటుగానిచో మధుకరావళి సేసినదేమి వానికిన్?

తే. గీ. మెండుకొని గండుతుమ్మెదపిండు నిండి
యుండఁ గన్నులపండువై బొండుమల్లె
పొద లలరునిందు హారిరత్నములు ఘటించి
నెఱినిడిన ముత్తియంపుఁ బందిరు లనంగ.

చ. సురుచిరపల్లవప్రకటచూతలతాస్థితకోకిలావళుల్
వరుసఁ జెలంగు మాధవుఁడు వావిరి నవ్వనలక్ష్మికెంతయున్
గుఱుతుగఁ బ్రేమతోడుతను గూర్చి యొసంగిన శోణనీరజ
స్ఫురదసితోత్పలౌఘములఁ బొల్పగు మాలికలో యనం గడున్.

సీ. గొనకొని 'సశివ ఏకోదేవ' యంచును సరవితోఁ బల్కెడు శారికలును,
దత్పరీతిని 'శివాత్పరతరంనాస్తి' యం చాడెడు మదమరాళావళియును,
'హరవామదేవ మహాదేవ' యనిభక్తిఁ గీర్తించు ఘనరాజకీరములును,
'భర్గ శంకర పరబ్రహ్మత్రినేత్ర' యం చారయఁగేరు మయూరతతులు.

తే. గీ. 'సభవ భూతేశ హరివిరించ్యర్చితాంఘ్రి
పంకరుహాయుగ్మ'యని కేరు పరభృతములు
గలిగి యభినవశృంగార గరిమఁదనరి
మహితగతినొప్పు యాశ్రమభూమి గంటె?

మ. అదె కన్గొంటివె? యస్మదాశ్రమము; నందానాడు వేర్నాటిన
ట్టిదె సుమహ్నా, వటభూజ మిప్డు పరిపాటిన్ దీర్ఘశాఖాభిసం
పద జెన్నొంది సమస్తజీవతతి మన్నం గల్పవృక్షంబునాఁ
బొదలున్ లోకహితార్థముల్ దరుగణమ్ముల్ పూర్ణబింబౌదనా!

# స్త్రీలు—తలకట్టు

ఆకుండి. వేంకటశాస్త్రిగారు.

స్త్రీలకు సహజ సౌందర్యమిచ్చు వస్తువులలో శిరోజములు ఎన్నదగినవి. వానిని దువ్వుకొనుటలో అవలంబింపదగిన కొన్ని సలహాలను వినీత భావముతో నాసోదరీమణులకు నివేదించుచున్నాను.

శిరోజముల చిక్కుదీర్చు దువ్వెనలు పదునైనమొనలుగలిగి యుండరాదు. తీగెల బ్రష్షులతో తల దువ్వుకొనుట తగదు. బిరుసువెండ్రుకలతో చేయబడిన బ్రష్షుల నుపయోగించుటకూడ తలకట్టునకు చెఱుపే. మాడపట్టున కెదురుగాదువ్వెనను నొక్కి దువ్వరాదు. సగము మృదువుగను సగము బిరుసుగను నుండెడు దువ్వెనలను వాడరాదు. లోహపుదువ్వెననుగాని బ్రష్షునుగాని వినియోగించుట తగదు. పండ్లవరుసలో ఎగుడు దిగుడుకల దువ్వెనను వాడుట ప్రమాదకరము.

కురులు దువ్వుకొను బ్రష్షును దువ్వెనను అమోనియా (Ammonia) కలిపిన గోరువెచ్చని నీటిలో తఱచు శుభ్రపఱచుట గమనింపదగిన విషయము. సూర్యరశ్మిలో తలకట్టు తఱచుగా ఆర్చుకొనుట మంచిది. సూర్యరశ్మి శిరోజములను దీర్ఘకాలము ఆరోగ్యస్థితిలో నుంచుటకు దివ్యమైన యౌషధరాజము. శిరోజముల నారబెట్టుటలో సూర్యాభిముఖముగా గూర్చుండరాదు. వీపు సూర్యుని వైపుంచి అప్పుడప్పుడు తలనిటు నటు త్రిప్పుచుండవలెను.

శిరోజములను ముందు దువ్వెనతో దువ్వి పిమ్మట బ్రష్షును ఉపయోగించుట నాగరికపు స్త్రీ లవలంబించు మంచిమార్గములలో నొకటి; అగుటచే నది స్త్రీజనముచే నవశ్యముగా నవలంబింపదగినది. శిరోజములకు గూడ విశ్రాంతి యుండవలయును గావున తరచుగా దువ్వుట—అనగా రోజునకు అయిదారుసారులు అనుట—ఆరోగ్యకరమగు పద్ధతికాదు. బ్రష్షు నుపయోగించుటవలని యుపయోగములలో నొకటి తలనుండి వచ్చు నొకవిధమగు నూనెను అన్ని వెంట్రుకలకు సమానముగ సర్దుబాటు చేయుటయే యనువిషయము తల దువ్వుకొనునపుడెల్ల స్త్రీలు జ్ఞప్తియందుంచుకొనవలయును.

# స్త్రీస్వాతంత్ర్యము.

శ్రీమతి పురిటి సూర్యనారాయణమ్మాళ్‌గారు.

భగవంతునిచే సృష్టింపబడిన స్త్రీయు, పురుషుడును జీవనావయొక్క నావికులు. వారిరువురును సంసారాంబుధి నుత్తరించి మోక్షమును బడయుదురు. సుఖాసక్తిని బుద్ధివైభవమునను కరచరణాదియవయవములందును, నించుమించుగ స్త్రీపురుషులిరువురును సమానులని చెప్పకతప్పదు. అనుకూలకులసతిగలవాడగు గృహస్థుడే క్రియావంతుడును, దాంతుడును పుత్రవంతుడును, నగునని పురాణములు ఘోషించుచున్నవి. మరియు, స్త్రీ ధర్మార్థకామసాధనముల కుపకరమగుటచే పురుషుడు భార్యసహాయములేక మోక్షమును బడయలేడని స్పష్టమగుచున్నది. కావుననే గాబోలు, పురుషుని చేతల కూతయగుస్త్రీ మనదేశమున కేవలము జ్ఞానశూన్యయైయజ్ఞానాంబుధిఁబడి కొట్టుకొనుచున్నది. దేశము బాగుపడవలయునన్న, నందున్న ప్రజలు కొంచముగనో గొప్పగనో జ్ఞానపరిచయము గలిగియుండవలయుననుట నిస్సందేహము. జ్ఞానపరిచయము, అనురాగము అనునీ రెండును, నైకమత్యమునకు ముఖ్యసూత్రములు. మనదేశమున పురుషులే పెక్కండ్రు జ్ఞానవిద్యాపరిచయులై యున్నారను సంగతి అందరికిని తెలిసిన విషయమే. పాశ్చాత్యులలో స్త్రీపురుషులిరువురును నించుమించుగ సమానవిద్యావంతులు. అందువలననే వారు సమత్వమందును తెలివితేటలందును నితరదేశములతో సరిపోల్చ నించుకైనను దీసిపోరు.

మన దేశమందన్ననో—స్త్రీ పురుషు లిరువుర కనురాగమే పొసగదు. ఇరువురలో సాధారణముగ స్త్రీ విద్యాపరిచయము లేమిచే జ్ఞానమున కపరిచితయనుట నిర్వివాదము. ఇరువురును జ్ఞానపరిచయము గలవారై యుండుట చాలయరుదు. త్రాసుయొక్క తక్కెడవలె నిరువురును సమానముగ నుండినయెడల జ్ఞానాభివృద్ధికి లోటేమి? పురుషుడు పండితుడై స్త్రీ జ్ఞానశూన్యయైనను, స్త్రీ సకలశాస్త్రవేత్త్రియై, పురుషుడు విద్య కపరిచితుడైనను, సరితూనికకు భంగముకలుగును. ప్రస్తుతము నారీలోకమంతయు నొక్కసారిగ

మ్రింగ దలచిన వరశుల్క-వ్యాఘ్రములను మాత్రము ముందు వేటాడి చంప ప్రయత్నింప వలెను. స్త్రీల పతితస్థితికి వరశుల్క మొక కారణమని చెప్పక తప్పదు. ఇన్ని యేల? స్త్రీల పతితస్థితికి వారి వారి తల్లిదండ్రులే కారకులు! స్త్రీ స్వాతంత్ర్యము అని శీర్షికను వ్రాయుటలో స్త్రీకి సర్వస్వాతంత్ర్య మొసగవలెనని కాదు నాయూహ. హైందవమహిళామండలి నించుకంత జ్ఞానప్రభచే యున్నతపదవిని బొందువరకు మాత్రమే మనము చేయూతనొసగి సహకారులుగ నుండుట సమంజసము. కావున జాతీయనాయకులు, సంఘసంస్కర్తలు, విద్యాధికులును, పూర్వాచార పరాయణుల ప్రతిబంధకములు ప్రబలముగ నున్నవనియు, మతాచారముల వ్యతిరేకించ రాదనియు, నూరకొనక, నజ్ఞానాంధకారముననున్న హైందవ నారీలోకమునకు విద్యావిద్యుచ్ఛక్తియొక్క కాంతిని నెలకొల్పి, ఇంచుక చేయూతనొసగిన, మిక్కిలి ప్రశంసనీయులని పొగడ్తనుగాంచుటకు సందేహమేమి?... పూర్వమునుండియు స్త్రీస్వాతంత్ర్యమన్న మన దేశమందలి నాయకులు విముఖతను, తిరస్కార భావమును జూపుచుండిరి. స్త్రీ బాల్యమున తల్లిదండ్రులచెంతను, యౌవనమున భర్తయాధీనముననను, వార్ధక్యమున పుత్రులవశముననను, నుండునని విధింపబడియున్నది. స్త్రీలు విద్యార్హులుకారనియు, బాల్యవివాహమసమంజసముకాదనియు, పూర్వాచార పరాయణులవాదన. కాలముమారుచుండ ప్రజలుకూడ మారుచుందురు. అందుచే కఠినమగు మతాచారములను, విధులను, నించుకంత దిద్దుబాటుచేయుట మిగుల శ్రేయస్కరము. మతాచారము లెన్నియడ్డువచ్చినను వాటి ననుసరించుట మిగుల కష్టమని దోచినయెడల మన పూర్వాచార పరాయణులు కఠినమగు కట్టుబాట్లకు కొంచ మంతరాయమును గల్పించి, వాటిని దిద్దుబాటుగావింపలేదా? ఎట్లైనను—మతాచారములుకూడ స్త్రీల పతితస్థితికి కారణమని చెప్పుటవసరము. స్త్రీలకు స్వాతంత్ర్యమొసగిన వ్యభిచారమందాసక్తులగుదురని కొందరి యభిప్రాయము. ఇట్లనుకొనుట కేవలము తెలివితక్కువయని భావింపనగును. జాతీయసమత్వమునకై పాటుపడుచున్న నాయకులు నారీలోక ప్రస్తుతపు పతితస్థితిని జూచి ఇంచుకైనను జాలినొందకుండుట మిగుల విచారకరము. సంపూర్ణ స్వతంత్రత నివ్వలేకపోయినను, సంఘాచారమున కొంచమంతరాయమును గల్పించి, సంఘసంస్కర్తలును, జాతీయనాయకులును, స్త్రీకి విద్యాభ్యాస లాభ మొనరింప పాటుపడుట మిగుల శ్లాఘనీయము.

# క్రొత్తకోడండ్లు—అత్తలమూఢత్వము.

శ్రీమతి రాళ్లభండి శీతాలక్ష్మమ్మగారు

పూర్వకాలపు స్త్రీలకు విద్యావసతులు లేకయుండెను. విద్యాభ్యాసముపై శ్రద్ధయు లేకుండెనను విషయము వింతగాదు. అయినను "చదివినవారికన్న చాకలిమేలు" అన్నట్లు విద్యగల్గిన ప్రకృతపు స్త్రీలకన్న విద్య లేని పురాతనస్త్రీలు యెంతయో మేలనిపించుచున్నారు. పూర్వపు స్త్రీలకు చదువను, వ్రాయను తెలియకున్నను, వారికిగృహము నలంకరించి శుభ్రముగానుంచుకొనుట, గృహవైద్యము, పాకశుద్ధి, దైవభక్తి, భూతదయ మొదలుగా గల గృహకృత్యములయందు పరిచయముగలిగి యుండెడిది. అప్పటిస్థితులు మారి స్త్రీవిద్య ప్రబలినందుకు సంతసింపదగినదేకాని పైజెప్పబడిన యంశములన్నియు గలిగినవారిప్పుడరుదు. ఇవి పెద్దవారలు తమకూతుండ్రకును, కోడండ్లకును తామాచరింపుచు నేర్పగల యంశములు. సాధారణముగా బాలికలు 6 సంవత్సరములువయస్సు వచ్చునప్పటికి పాఠశాలలకు పనుపబడుదురు. విశ్రాంతిసమయములలో ఫిడేలు హార్మోనియం మొదలగు సంగీతవాద్యముల తమకు వివాహమగునంతవరకు సాధనపరచుట యిప్పటియలవాటు. ఏదైనను సావకాశమున్నపట్ల, ఉలుపనులు, నూలుపనులు, తమకన్న చిన్నవారలగు బిడ్డలనాడించి తమ తల్లికి సహాయమొనర్చుట మొదలగు విషయములును ఆమోదింపదగినవే. అయితే వారు భవిష్యత్తున కనువగు వంట మొదలగు గృహకృత్యముల నేర్చుకొనుటకవకాశ మెక్కడ? తలిదండ్రులచే గారాబమున పైరీతిగా పెంచబడుటచే "ముందున్నది ముసళ్లపండుగ" యన్నట్లు...మూఢులగు అత్తలచే చాలకష్టములకు లోనగుటయు జూచుచున్నారము. తలిదండ్రులు తమయాడుబిడ్డల నెక్కుడు గారాబమున పెంచుట యంతసమంజసము కాదని యిప్పటిస్థితుల ననుసరించి తోచుచున్నది. పుట్టింట జూపబడు గారాబమత్తవారింట కష్టముల దెచ్చిపెట్టునని యెరుంగవలెను. తలిదండ్రులు తమ బాలికలకు గృహకృత్యములయందు తగినంత తరిబీదునొసంగుట యావసరము. పేదకుటుంబములలోని బాలికల కీవిషయమును గురించి యంతగా జెప్పవలసినది లేదు. ఏలయనగా వారి తలిదండ్రులార్జించు వేతనము తమపిల్లలకు సంగీతము మొదలగు విద్యలపై వ్యయపరచుటకు చాలియుండదు. కాన నట్టి బాలికలు జేయుటకు వేరుపనులు లేక గృహకృత్యములయందే పరిచయులగుదురు. ధనికులు తమ బిడ్డలచే ఇంటిపనుల జేయింప నిష్టపడకుండుట సహజమే. అట్టిపిల్లలు వేళకింత యన్నముదిని చదువులోను, కుట్టుమొదలగు పనులలోను కాలము గడుపుదురు. 12 సంవత్సరములలోపుననే వివాహము జరుగును. పిదప కడుశీఘ్రములోనే యత్తవారింటికేగవలసి యుండును. అచట పోగానే గృహకృత్యముల యందు చురుకుతనముగల్గి వర్తించుటెట్లు? తలిదండ్రులు తమ బాలికల గారాబమున బెంచక విద్య సంగీతము నొసంగకుండుటయా? లేక అత్తలు తమయింటికి క్రొత్తగా వచ్చిన కోడండ్లకు మంచితనముతో గృహకృత్యములను నేర్పి తరిబీదు నొసంగవలెనా? యనున దొకసమస్య. మూఢులగు అత్తలపంచ పుట్టింటమురిపెమున బెరిగిన బాలికలు గృహకృత్యముల నతిసులభముగా నేర్చుకొన జాలక పలుకష్టములకు లోనగుచున్నారు. అత్తింటియందును వారి యిరుగుపొరుగు స్త్రీలయొక్కయు దెప్పులకు పాత్రలగుచున్నారు. క్రొత్తకోడలు వివాహసమయమందో లేక యేపండుగలప్పుడో తప్ప తన భర్తనుగాని మిగత బంధుగులనుగాని జూచియుండదు. మొదటిసారి కాపురమునకు పోగానే యచటి వారందరు క్రొత్త. ఎవరెవరి మనసు యెట్లుండునో తెలియజాలక కొంతకష్టపడును. కొందర త్తలు తమ కోడండ్లముఖము జూడగనే సోమరులగుదురు. కోడండ్లు

తమ భర్తయింట సుఖపడుటకు వచ్చిరను యభిప్రాయమే వారికి లేదు. తమకు దాసీలనియే వారిభావము. కోడలి ముఖముచూచి తామేమిపనులు చేయకున్నను, పనిపాటలనేర్పి వారివద్ద చేయించుకొను ఓర్పువారికి కానరాదు. "అత్తమంచి—అల్లిపచ్చిలే" దనులోకోక్తి స్థిరపరచెదరు. క్రొత్తకోడలు పుట్టినింటనేర్చుకొన్న విద్యతో అత్తవారింట భారతభాగవతాదిసద్గ్రంథముల జదువ వసతిలేదు. పుట్టింట ధనము వ్యయముజేసి నేర్చుకొన్న సంగీతము అత్తింట యరణ్యరోదనమే! క్రొత్తకోడలుచేయు చేతకానివంట ఉప్పచప్పనిదిగనే యుండునుగదా? అత్తగారునేర్పి చేయించని దోసమటుండనిచ్చి కోడలిని చీవాట్లు పెట్టుట—కోడలితల్లిని దూరుట—కొడుకుతో లేనిపోని తంటాలుచెప్పుట—ఇట్టి తరుణములో ఆడుబిడ్డవచ్చి "అమ్మా—నిన్న నేను జేసిన వంటలో ఉప్పుతక్కువయని మాయన్న యాక్షేపణజేసెగదా. ఈ రోజు, వదినెచేసిన వంట వల్లకాదుగానున్నను పలుకక కుక్కవలె తిన్నాడు" అని ఎక్కబోడుచుట—క్రొత్తకోడండ్లు యిట్టిదూషణలకు దుఃఖములకు లోనగుచున్నారు.

ఈ సందర్భమున నొక చిన్నకథ జ్ఞాపకమునకు వచ్చుచున్నది. ఒకానొక యూర భార్యాభర్త లిద్దరు సుఖముగా గాపురముజేయుచుండిరి. వారి కొక్కతెయే కుమార్తె. బిడ్డకు ౭వ సంవత్సరముననే తల్లి గతించెను. తల్లి లేని బిడ్డయను ప్రేమచే తండ్రి యాబిడ్డను గారాబముతో పెంచి శక్త్యానుసారము అదేయూర నొక చిన్నవాని కిచ్చి వివాహముజేసెను. యుక్తవయస్సు రాగానే ఆ చిన్నది కాపురమునకేగి సాధ్యమగు వరకు పనిపాటలు జేయుచుండెను. కాని పాపము! ఆమెకు వేకువ నిద్రలేచి తలవాకిట కసవుజిమ్మి పేడనీళ్లు చల్లుట యలవాటు లేదు. ఈ పనిని కోడలిచేతనే జేయించవలెనని అత్త కోడలిని జూచి "ఏమే, వాకిట పేడ నీళ్లు యెవరు చల్లెదరు? నేనే చల్లవలెనా ? నీవు చల్లగూడదా ? నీవు చల్లకుంటే నీ యబ్బ చల్లుతాడా" ? యనెను. ఎట్టులో యీవార్త ఆ ఊరియందే యుండు ఆబిడ్డ తండ్రి చెవులలో బడినది. యోచించి నాడాయన. ఆహా! తల్లి లేని బిడ్డ యీ స్వల్పపుపనికెన్ని పాడుపుమాటల బడుచున్నది యని చింతించి, ఆ మరునాడు మొదలు తూర్పు తెల్లవారక మునుపే యితరుల కంటబడక తన కొమార్తె వాకిటతానే స్వయముగా కసవు చిమ్మి కళ్లాపునీళ్లను జల్లి పోవుచుండెను. అత్తచూచినది ప్రతిరోజీమాదిరి జరుగుట. ఈ పని యెవరు జేసి యుందురు? కోడలినడిగినది. ఆమెకును తెలియదు. ఆశ్చర్యపడినది. ఈ చిత్రమును కనిపెట్టవలెనని ఒకనాడు వాకిట నొకమూల దాగియుండినది. మామూలుప్రకార మాతడు పేడనీళ్లుజల్లుచుండెను. చూచినది ముఖమును! ఆశ్చర్యము, కంపముగలిగెను. అప్పుడాయన—"నా కుమార్తె గారాబమున బెరిగెను. ఈ పని యామెచేత గాలేదు. నీవు చల్లకపోతే నీ యబ్బ చల్లుతాడా యని యనబడిన నీ భావమును నెరవేర్చుచున్నా"ననెను. మూఢురాలగు ఆ అత్తకు బుద్ధివచ్చినది. ఆ రోజు మొదలాఅత్తకోడండ్లు యన్యోన్యమైత్రితో గృహకృత్యముల నెరవేర్చుకొనుచుండిరి.

అత్తల మూఢత్వముచేత క్రొత్తకోడండ్లనేకులు ప్రాణాపదలకు పాలగుచున్నారు. అలవాటు లేక క్రొత్తగా వంటచేయునపుడు వేడిగంజిని కాళ్లపైపోసికొనువారు—పొయ్యిమంటచేత పైటకొంగు, కుచ్చెళ్లు కాల్చుకొనువారు తద్వారా ప్రాణాపాయమునకు లోనగువారి నెందరనో జూచుచున్నాము. కాన పుట్టినింటియందే తల్లిదండ్రులు తమ యాడుబిడ్డలకు విద్యతోపాటు గృహకృత్యములను నేర్పవలెను. అత్తలు తమ మూఢత్వమును వదలి తాముగన్నకూతుండ్లవలెనే తమ కోడండ్లను భావించి వారికి పనిపాటలు తమ యిష్టానుసారము మంచితనముతో గరపి తాము సుఖపడి తమ కోడండ్లను సుఖపెట్టుదురుగాక !

"అత్తయు నొక యింటి కోడలే" యనులోకోక్తి మరువదగదు.

# లలిత

## (బాలికల కొఱకు ఒక చిన్నకథ)

వాస్వంతినగరం రాజుకు ఒక్కడే కుమారుడు. అతను చాలా పట్టుదలమనిషి. అతను ఒకనాటిసాయంకాలం షికారుకు పోయేడు. అక్కడ ఒక నువ్వు చేనుకు కాపలా కాస్తూఉన్న బాలికను చూచి అతను "కాయఏర్పడిన తరవాత పువ్వు ఎక్కడ?" అని నవ్వుచు అడిగెను.

దానికి లలిత—అది ఆమెపేరు—జబాబుగా "మీతల్లి బాలికగా ఉన్నప్పుడు నీవెక్కడ?" అని ప్రశ్నించెను. ఇట్టి నిర్భయప్రతివచనానికి రాజకుమారుడు కావున అతను అలవాటుపడి ఉండలేదు. అందుచేత అతనికి లలితమీద నిండాకోపంవచ్చింది. "నీకు తగిన శాస్తిచేస్తాచూసుకో. నిన్ను నేను పెళ్లాడి నీకు పశ్చాత్తాపం కలిగేదాకా నిర్బంధంలోఉంచుతాను" అని రాజకుమారుడు అన్నాడు.

అందుమీద లలిత తిరిగి నిర్భయంగా ఇట్లా చెప్పింది. "అట్లా అయితే నీ కుమారునిచేత నిన్ను చెప్పుతో కొట్టిస్తాను." ఇంటికివెళ్లి రాజకుమారుడు తల్లితో తాను లలితను పెళ్లిచేసుకొన తలచినసంగతి చెప్పేడు. "ఏమిట్రా! నాయనా! తోటకారి కూతుర్ని పెళ్లిచేసుకోవడం రాజకుమారుడవైన నీకు తగునా? "అని తల్లిపలికింది. "మంచో, చెడ్డో లలితను నేను పెళ్లాడితీరతాను. నీకు కోరికవుంటే నాకు తగిన రాజ కుమారినితెచ్చి తరవాత మళ్లీ పెళ్లిచేద్దువుగాని లలితను మాత్రం నేను వివాహం చేసు కోక మానను." అని అతను చెప్పేడు.

కుమారుని మంకుపట్టుచూచి తల్లి లలితతండ్రియైన తోటకారి కొఱకు కబురు చేసింది. ఈసంగతి అంతా యింతకుముందే లలిత తండ్రికి చెప్పిఉంది. కావున అతను రాణీ గారి దగ్గరకు పోయినప్పుడు తనకు చాలాధనం ఇస్తేగాని లలితకు పెళ్లిచేయడానికి వీలు లేదని చెప్పేడు. రాణీగారు తలస్తే ధనానికి లోపం ఉంటుంది కనకనా? వాడు కోరిన

ధనం ఇచ్చి లలితను తనకొమారుడికి రాణి పెళ్లిచేసింది. పెళ్లిఅయిన మఱునాటినుంచే లలితను ఒకకోటలో నిర్బంధించారు. ఒక్క సేవకురాలుతప్ప మఱియెవ్వరూ ఆమెచెంతకు పోవడానికే వీలు లేదు.

చిన్నతనంనుంచి లలిత ఒక ముంగిసను పెంచుతూవుండేది. కోటలోకి పోయే సమయంలో ఆముంగిసను తనబట్టల చాటునదాచి ఆమె తీసికొనిపోయింది. అచ్చటముంగిస లలితకు చాలా సహకారి అయింది. ఆకోటలోనుంచి ఆమెతల్లితండ్రుల యింటిదాకా అది ఒక సొరంగం తవ్వింది. ఆసొరంగంగుండా లలిత సర్కసుఆటలు ఆడగల కన్యలను రప్పించింది. వారందఱకూ తానే నాయకత్వం వహించి పట్టణంలో సర్కసు ఆటలు మొదలుపెట్టింది. చూచి ప్రజలు చాలామెచ్చుకున్నారు. రాజకుమారుడు ప్రజలు మెచ్చేసర్కసు ఆట చూడడానికి కుతూహలపడి ప్రత్యేకంగా తనకొఱకు ఒక ప్రదర్శనం ఏర్పాటు చేయించేడు.

నాయకురాలుచేసే సర్కసు ఫీట్లకు రాజకుమారుడు పరవశుడై పోయేడు. ఆమె మీాద అతనికి మనస్సుపోయింది. సర్కసు మేనేజరుతో సంప్రతించి ఆటకత్తెతో మాట కలిపేడు. ఆమె అతని వేలిఉంగరము అడిగిపుచ్చుకుంది. ఇద్దరికీ అనుకూలం అయింది. ప్రేమాధిక్యతచేత నాయకురాలు లలితయే అని రాజకుమారుడు గ్రహించలేకపోయేడు. కొన్నివారాలు జరిగిన తరవాత ఆమెతిరిగి వస్తానని చెప్పి వెళ్లిపోయింది. వెళ్లిపోయి లలిత యథాప్రకారంగా కోటలో ప్రవేశించింది. అక్కడ ఆమెకు ఒక మగపిల్లవాడు కలిగి దినాల వరుసను పెరుగుచూ ఉండెను.

ఇల్లా కొన్నిసంవత్సరాలు గడిచిపోయినాయి. వెనక లలిత తనతో అన్నమాటలు ఒకమాటు అతనికి జ్ఞాపకంవచ్చాయి. అందుచేత అతడు లలితకు పశ్చాత్తాపం కలిగిందేమో చూద్దామని కోటలోకి పోయేడు.

తలుపు తెరచి లోపల కాలుపెట్టే అంతలో చటాలున ఒక అందమైన బాలుడు చెప్పుతో అతని చెంపమీాద కొట్టేడు. రాజకుమారుడు తేరిపారి చూసేడు. పిల్లవాడు, వేలిని తన ఉంగరం పెట్టుకునిఉన్న లలిత—అతనికి కనిపించేరు. దానితో అతనికి కథ అంతా తెలిసింది. బీదకుటుంబంలో పుట్టినప్పటికిన్నీ లలిత తనకు తగిన భార్య అని రాజకుమారుడు నిజం గ్రహించేడు.

# తల్లియనగా నేమి?

శ్రీమతి నాయిలికోలను. పద్మాసనమ్మగారు.

తల్లి దైవమునకు సమానము. నూతన జీవుల కుత్పత్తిస్థానము గనుక దేవుని వంటిది. ఈతత్వము, నిజస్థితి, ఎందరెఱుగుదురు? ఎందరు పురుషులు తమ స్త్రీలకీ తత్వ మెఱుకపరచియున్నారు? బహుస్వల్పము. ఎందరు శిశువులు అల్పవయస్సులోనే మరణించుచున్నారు. ఎందరు తల్లులు బాలింతలుగా చనిపోవుచున్నారు. కారణమేమి? అజ్ఞానము. తల్లికి అజ్ఞానము; తండ్రికి అజ్ఞానము; సంఘమునకే అజ్ఞానము. దీనికికారణము ప్రసవించిన వారము లోపుగనే ప్రతి ముగ్గురు శిశువులలో ఒక శిశువు చనిపోవుచున్నదని మీరెఱుగుదురా? తప్పి బ్రతికిన శిశువులలో అయిదుగురిలో ఒక శిశువు మొదటి సంవత్సరములోనే చనిపోవుచున్నదని గుర్తెరుగుదురా? మన దేశములో శిశువుల మరణము చాలా హెచ్చు. వెయ్యింటికి ఇన్నూర్గురు చనిపోవుచున్నారు. ఈ మదరాసు శోస్త్రాలో తక్కిన ఏనాగరికత దేశములోకన్నా రెట్టింపు మరణములు జరుగుచున్నవి: ఇది ఎందుకు? శిశువుల జీవితకాలము పుట్టినది మొదలు కాదనిన్ని గర్భారంభములోనే తల్లి యుదరములో పిండము పడినదాదిగ శిశువుకు జీవము ఆరంభమగుచున్నదనిన్ని తెలియకపోవడమే దీనికి కారణము. నూతనజీవుడు తల్లి కడుపులో నుద్భవిల్లి తల్లి ప్రాణముతోపాటు మఱియొక ప్రాణిగా వృద్ధియగుచుండును. గర్భ స్త్రీ యీరీతి రెండు ప్రాణములుగలదని యెవరు తెలిసి నడచుకొనెదరు? ఇట్లు రెండు ప్రాణముల కాపాడు బాధ్యత గర్భిణిస్త్రీకి కలదనియు అలాగు రెండు ప్రాణముల పోషించుశక్తి కలుగుటకు ఆ స్త్రీకి ప్రత్యేకపోషణ కావలయుననియు ఎవరైనను తెలిసి నడుచుకొనుచున్నారా? ఇంటిలోని యావు చూలైన యెడల ఎంతయో అక్కరతీసుకొనెదరు. ఏలననగా ఆవు వెలయిచ్చి కొనిన ధనము. దానిని కాపాడుట ఆవశ్యకమని తోచినట్లు చూలాలిని కాపాడవలయునని తోచుటలేదు. గర్భములోని పిండము దైవాధీనముగ పూర్ణకాలము వృద్ధియై భూపతనము కావలయునే గాని వేరే యేజాగ్రతయు తీసికొనరు. అందువలన చాలా మట్టుకు గర్భస్రావములు, చనిపోయినశిశుప్రసవములు కూడా జరుగుచున్నవి. ఇట్టి దుఃఖకరమైన స్థితికిపైన చెప్పినట్లు అజ్ఞానము కారణము. గర్భిణీస్త్రీల ఆరోగ్యవిషయమైన శాస్త్రము, మనుష్యదేహశాస్త్రము, వీనిజ్ఞానము ప్రతి యొకరు తెలుసుకొనవలెను. గనుక యాజ్ఞానము నందరికి బోధపరచి యీ అజ్ఞానము తొలగింపుడు.

మన సంఘాచారములు కూడా మాతృత్వము, అనగా తల్లియగుట, యెంత గొప్పవిషయమో యనుట మరపించుచున్నవి. పెద్దవాడుకాక పూర్వమే బాల్యదశలోనే మొగపిల్లవాడు తండ్రియగుచున్నాడు. జీవమిట్టిదని తెలియక మునుపే ఆడపిల్ల తల్లియై కష్టములకు పాలగుచున్నది. శాస్త్రము లిందుకు సమ్మతించు

చున్నవారి లేదు. ఏలననగా "ఊన షోడశ వర్షాయా మప్రాప్తః పంచవింశతిం, యద్యాధత్తే పుమాన్గర్భం, కుక్షిస్థస్స విపద్యతే। జాతో వా నచిరంజీవేత్ జీవేద్వా దుర్బలేంద్రియః। తస్మాదత్యంత బాలాయాం గర్భాధానం నకారయేత్". పదునారు సంవత్సరములకు లోబడిన స్త్రీయందు ఇరువదియైదు సంవత్సరములకు లోబడిన పురుషుడు గర్భమును కలుగజేసినయెడల అట్టి గర్భమునందలి శిశువు గర్భమునందే నశించును. ఒకవేళ కుక్షినుంచి జనించినను చిరకాలము జీవించుట కష్టము. ఒకవేళ జీవించినను బలహీనమై దుర్బలమైన యింద్రియములతో కూడి యుండును. కనుక మిక్కిలి చిన్నవయస్సునందు గర్భాధానము చేయరాదని సుశ్రుతాచార్యులు వ్రాసియున్నారు.

తల్లి దైవసమానమను సూక్తి జ్ఞాపకపర్చుకొనుడు. తల్లియగుట స్త్రీకి పూజ్యమైన విధిగా భగవంతుడు నియమించియున్నాడని జ్ఞాపకమునందుంచుకొనుడు. స్త్రీకి యేర్పడియుండు యీ పవిత్రమైన విధిని మలినపరచకుడు. స్త్రీ యెట్టిదైనను గర్భము ధరించ తగునని తలవకుడు. పురుషు డెట్టివాడైనను తండ్రి యగుటకు యోగ్యత కలవాడు కాడు. నూతన జీవుణ్ణి సృష్టించుటకు యోగ్యత కలిగియుండిన కాని తలిదండ్రులగుటకు యోగ్యత కలుగదు. శారీరకమైన వ్యాధులు గాని మానసికమైన వ్యాధులు గాని కలవారు తలిదండ్రులగుటకు యోగ్యులు కారు. ఆరోగ్యవంతులగు బిడ్డలనుకని వారి ముద్దుయాటలచే ఆనందమనుభవింప గోరువారు తమ జీవితము పవిత్రముగను పరిశుద్ధముగను మనోవాక్కాయ కర్మలనుండు నటుల నడచుకొనవలెను. అట్లన్న గాని వర్ణహీనము కాకుండదు. కాబట్టి ప్రతియొకడు వివాహమాడ యిష్టపడునెడల తానున్ను తాను వివాహమాడు స్త్రీయున్ను తమ కుటుంబమునకు చేరినవారును, వ్యాధిరహితముగను దుర్గుణరాహిత్యముగ నుండవలయును. అట్టి వ్యాధియు, దుర్గుణములును, సంతతిని బాధించును. మన హిందూదేశమునకు దేహబలమున్ను, మనోబలమున్ను కలసంతతి అత్యావశ్యకమయి యున్నది. అట్టి స్థితి లభించిన గాని మనదేశ మితరదేశములకు సమానముకాదు.

## కులసతీసుఖము.

లింగనమఖి కామేశ్వరకవి.

సీ. దాక్షిణ్యములగీము లక్షణంబులదీము వ్రతములయొరగల్లు రహికినిల్లు
నెఱతనమ్ములతావు నిక్కువమ్ములప్రోవు కలిమికిదావు భాగ్యములవైవు
వినుతికి విడిపట్టు వినయమ్ములకుగుట్టు కలఁకకుఁగెళవు కీర్తులకునెలవు।
పతిభక్తికి బిడారు సుతరత్నపుఁగొటారు ధర్మంబులకు మూట దయకుఁగోట

యనుచునందఱుఁగొనియాడనతిశయించు
కులసతినిఁజేరి యన్నిఁటఁగొంకు దీరి
యాత్మసుఖయించు నేధన్యుఁడట్టివాని
కడఁక చెలువొందు నెందు నీపుడమియందు.

# గుహుని ముచ్చటలు.

కీ. శే. బులుసు సీతారామ శాస్త్రిగారు.

(మనోహరమగుచిన్న గేయము, దండాలు దండాలు భారతమాత అనువరుస)

రామయ తండ్రీ! ఓరామయ తండ్రీ! నా
నోములెల్ల పండినాయి రామయ తండ్రీ!    అనుపల్లవి.

తల్లి సుమ్మ సీతమ్మ రామయ తండ్రీ! నీవు
మెల్లగాను తీసికెల్లు రామయ తండ్రీ!    రామ.

మునులబాబు లడవిగలరు రామయ తండ్రీ! నీవు
మొక్కిదీవెనలు గొనుము రామయ తండ్రీ!    రామ.

రాకాసి నాకొడుకులు రామయ తండ్రీ! నీకు
పీకాకు సేస్తారు రామయ తండ్రీ!    రామ.

వదలకుండ చెంతనుండి లచుమయ బాబూ! నీ
వదిననన్న గాయాల లచుమయ బాబూ!

మెల్ల మెల్ల గెల్లు మమ్మ! సీతమ తల్లీ! నీవు
ముల్లు ముట్టనూసుకుంటు సీతమ తల్లీ!    రామ.

ఎల్లినాడ వెలతావు రామయ తండ్రీ! బేగి
సల్లగిల్లు సేరాల రామయ తండ్రీ!    రామ.

# సంగీతము.

## తాళలక్షణము

### శర్మ సోదరులు

"తలప్రతిష్ఠాయామ్" తాళమ్ అని తాళశబ్దమేర్పడుచున్నది. ప్రత్యయమువలన గీతవాద్య నృత్యములు నెలకొల్పబడియున్నవి. శివపార్వతీ స్వరూప సమాగమమే తా, ల, అను అక్షరములయందు అర్థస్ఫురణమగుచున్నది. మరియు పాణిద్వయ సంయోగ వియోగ ములచే తాళమేర్పడుచున్నది.

శాస్త్రవేత్తలు ఈ తాళమునకు ప్రాణదశకము నిచ్చి పెంపు చేసినారు. అవియేవన, 1 కాలము, 2 మార్గము, 3 క్రియ, 4 అంగము, 5 గ్రహము, 6 జాతి, 7 కళ, 8 లయ, 9 యతి, 10 ప్రస్తారము.

(1) కాలప్రాణ లక్షణము:—నూఱు తామర రేకులను నొకటిమీద నొకటిగనుంచి వానిని సూదితో పొడుచునపుడు అందు ఒక తామర రేకు తెగునంత కాలము క్షణమన బడును.

| | | |
|---|---|---|
| అట్టి | 8 క్షణములు | లవమనబడును. |
| ,, | 8 లవములు | కాష్ఠయనబడును. |
| ,, | 8 కాష్ఠలు | నిమిషమగును (అనగా రెప్పపాటు). |
| ,, | 8 నిమిషములు | కళయనబడును. |
| ,, | 2 కళలు | చతుర్భాగము అనబడును. |
| ,, | 2 చతుర్భాగములు | అనుధృతమగును. |
| ,, | 2 అనుధృతములు | ధృతమగును. |
| ,, | 2 ధృతములు | చతురశ్రలఘువగును. |
| ,, | 2 లఘువులు | గురువు అగును. |
| ,, | 3 ,, | ప్లుతమనబడును. |
| ,, | 4 ,, | కాకపాదమనబడును. |

(2) మార్గప్రాణ లక్షణము:—పూర్వ గ్రంథకర్తలు మూడు మార్గములను చెప్పి యున్నారు. అవి దక్షిణము, వార్తికము, చిత్రము, అనునవి. ఇవియే ఇప్పుడు త్రికాలములని చెప్పబడుచున్నవి. పై జెప్పిన త్రిమార్గములలో ప్రతియొక్క మార్గమునకు 3 భేదములు గలవు. వెరశి 9 భేదములయినవి. అవియేవన 1 ధృతేధృతః (ధృతమార్గమునందు ధృతకాల

మును) 2 ధృతేమధ్యమః (ధృతమార్గమునందు మధ్యమకాలమును) 3 ధృతేవిలంబితః (ధృతమార్గమునందు విలంబకాలమును) 4 మధ్యే ధృతః (మధ్యమ మార్గమునందు ధృత కాలమును) 5 మధ్యే మధ్యః, 6 మధ్యేవిలంబితః, 7 విలంబితే ధృతః, 8 విలంబితే మధ్యమః, 9 విలంబితే విలంబితః. ఇట్లని నిశ్శంక బిరుదాంకితుడగు శార్ఙ్గదేవునిచే రచియింపబడ్డ సంగీతరత్నాకరమునకు వ్రాసిన తల్లినాథవ్యాఖ్యానమునందు చెప్పబడియున్నది.

మరి కొన్ని గ్రంథములయందు షడ్విధమార్గములు చెప్పబడియున్నవి. వాటినే షట్కాలములని వ్యవహరించుచున్నారు.

1. దక్షిణము :—ఉదా:—స... ... ... .... ... ... ... ...రి .... ... ... ... ... ... ... ... ...గ... ... ... ... ... ... ... ... etc.

2. వార్తికము:— స... ... ... .... రి... ... ... ... గ .. ... ... .... etc.

3. చిత్రము:— స ... .... రి ... .... గ ... .... మ ... .... మ ... .... ప ... .... ధ ... .... etc.

4. చిత్రతరము:—స ... రి ... గ ... మ ... ప ... ద ... ని ... స ... స ... ని ... etc.

5. అర్ధచిత్రము:—స, రి, గ, మ, ప, ద, ని, స, స, ని, ద, ప, మ, etc.

6. అతిచిత్రము:—స-రి-గ-మ-ప-ద-ని-స-స-ని-ద-ప-మ-గ-రి-స-etc.

మరియు జయమునిచే 12 విధములయిన మార్గము లేర్పడినవి.

| | | | |
|---|---|---|---|
| 1 | దక్షిణము:— | 8 | మాత్రల ప్రమాణము. |
| 2 | వార్తికము:... | 4 | ,, ,, |
| 3 | చిత్రము :— | 2 | ,, ,, |
| 4 | చిత్రతర:— | 1 | ,, ,, |
| 5 | చిత్రతమము:— | 1/2 | ,, ,, |
| 6 | అతి చిత్రతమము:— | 1/4 | ,, ,, |
| 7 | చతుర్భాగము:— | 1/8 | ,, ,, |
| 8 | తృటి:— | 1/16 | ,, ,, |
| 9 | అనుతృటి:— | 1/32 | ,, ,, |
| 10 | ఘర్షణి | 1/64 | ,, ,, |
| 11 | అనుఘర్షణి:— | 1/128 | ,, ,, |
| 12 | స్వరము:— | 1/256 | ,, ,, |

(3) క్రియా ప్రాణలక్షణము:—క్రియలు సశబ్దక్రియలనియు, నిశ్శబ్దక్రియలనియు రెండు విధములు. అనగా శబ్దముతోకూడు కొన్ని క్రియలు, శబ్దములేని క్రియలు. ఆవాపము, నిష్క్రామము, విక్షేపము, ప్రవేశము అను నాల్గువిధములగు నిశ్శబ్దక్రియలుగలవు. "ఆవాపమ"నగా ఊర్ధ్వముఖముగ నెత్తబడిన పతాకహస్తముయొక్క తర్జనీ మొదలుగ నాలుగు వ్రేళ్లను ముడుచుట. "నిష్క్రామము" అనగా అట్లుముడిచిన వ్రేళ్లను క్రమముగ విప్పుట. "విక్షేపమ"నగా ఆహస్తమును వెలుపలకు పార్శ్వమునకు విదలించుట. ప్రవేశకమ"నగా ఆహస్తము అప్రదక్షిణముగా క్రిందుగా ముందరికిరానిచ్చుట.

ధృవము, శమ్యము, తాళము, సన్నిపాతము అను నాల్గువిధములగు సశబ్దక్రియలు గలవు. "ధృవమ"నునది శబ్దపూర్వకమయిన చిటిక, "శమ్యము" అనగా కుడి హస్తము నందు యెడమచేతితో ఘాతవేయుట. "తాళము" అనగా ఎడమచేతియందు కుడిచేతితో ఘాతవేయుట. "సన్నిపాతము" అనగా అభిముఖముగా నిలుపబడిన రెండుహస్తములచే సమముగా ఘాతవేయుట.

మరియు ధృవక, సర్పిణి, కృష్ణ, పద్మిని, విసర్జిత, విక్షిప్త, పతాక, పతిత అనియెడు 8 విధములగు దేశ్యక్రియలు గలవు. "ధృవక":— సశబ్దముతో గూడిన కుడి హస్తము యొక్క ఘాత ధృవకమనబడును. "సర్పిణి":—కుడిచేతి పతాకహస్తమును ఎడమవంకకు చాచుట, "కృష్ణ".—అట్లు చాచిన హస్తమును కుడిప్రక్కకు తెచ్చుట. "పద్మిని":—అరచేయి క్రిందుగజేసి అధోముఖముగ చేయిచాచుట. "విసర్జిత".—పైనిజెప్పిన అధోముఖహస్తమును వెలుపల విసరుట. "విక్షిప్త":—హస్తము యొక్క వ్రేళ్లనుముడుచుట. "పతాక":—పతాక హస్తముగ బట్టినచేతిని మీదికి ఎత్తుట. "పతిత":—ఆమీదికి యెత్తిన హస్తమును దిగువకుదించుట. ఈ యెనిమిది దేశ్యక్రియలలోను ధృవకయనునది మాత్రము సశబ్దక్రియ, మిగిలినయేడును నిశ్శబ్దక్రియలు.

(4) అంగప్రాణలక్షణము:—తాళసంఖ్యను తెలియుటకు సాధనంబగు సంజ్ఞావిశేషము అంగమనబడును. అది అనుధృతము, ధృతము, లఘువు, గురువు, ప్లుతము, కాకపాదము అని 6 విధములు.

| | | |
|---|---|---|
| అనుధృతము | గురుతు. | ◡ |
| ధృతము | ,, | ○ |
| లఘువు | ,, | । |
| గురువు | ,, | 8 |
| ప్లుతము | ,, | § |
| కాకపాదము | ,, | +‌ |

## షోడశాంగ వివరణము.

| అంగములపేర్లు | అంగసంజ్ఞలు. | అక్షరకాలము. |
|---|---|---|
| అనుధృతము | ◡ | 1 |
| ధృతము | ○ | 2 |
| ధృతవిరామము | ◡○ | 3 |
| లఘువు | \| | 4 |
| లఘువిరామము | ◠\| | 5 |
| లఘుధృతము | ○\| | 6 |
| లఘుధృతవిరామము | ◡○\| | 7 |
| గురువు | ऽ | 8 |
| గురువిరామము | ◡ऽ | 9 |
| గురుధృతము | ○ऽ | 10 |
| గురుధృతవిరామము | ◡○ऽ | 11 |
| ప్లుతము | § | 12 |
| ప్లుతవిరామము | ◡§ | 13 |
| ప్లుతధృతము | ○§ | 14 |
| ప్లుతధృతవిరామము | ◡○ | 15 |
| కాకపాదము | + | 16 |

### షడంగములను వాడుటకైన క్రియలు.

1 అనుధృతము:—ఇది ధ్రువక అను సశబ్దక్రియచే వాడదగినది.

2 ధృతము:—ధ్రువక అను సశబ్దక్రియచేతను, విసర్జిత అను నిశ్శబ్ద క్రియచేతను వాడదగినది.

3 లఘువు:—ఇది ధ్రువక, విక్షిప్తయను సశబ్ద, నిశబ్దక్రియలచే వాడదగినది. ఇందు విక్షిప్త అనుక్రియను ఉపయోగించునపుడు వ్రేళ్లను చతురశ్రాది జాత్యానుసారముగ ఘాతకువెనుక 2,3, 4, 6, 8, ఇట్లు వ్రేళ్లుముడుచవలయును.

4 గురువు:—ఇది ధ్రువక, విక్షిప్త, పతిత అనుక్రియలచే వాడదగినది.

5 ప్లుతము:—ఇది ధ్రువక, విక్షిప్త, సర్పిణి, కృష్ణ అను 4 క్రియలచే వాడదగినది.

6 కాకపాదము:—ఇది సర్పిణి, కృష్ణ, పతాక, పతిత అను 4 నిశ్శబ్ద క్రియలచే వాడదగినది.

# ప్రియంవద

శ్రీమతి బులుసు లక్ష్మీనరసమ్మగారు

సకలకలుషాప హారిణియగు గోదావరీ పుణ్యస్రవంతినీ తీరమున రాజమహేంద్ర వరమను నొక పురంబుకలదు కదా! అప్పురవరంబున పూర్వము మృత్యుంజయుఁడను నొక బ్రాహ్మణశ్రేష్ఠుఁడుండెడివాఁడు. ఆతఁడు సకలకళాకోవిదుఁడును, వేదాధ్యయన తత్పరుడును. ఆతని సత్ప్రవర్తనను బురజనులు వేనోళ్లఁ బొగడుచుండెడి వారు. దైవానుగ్రహమువలన నావిప్రుఁడు సిరిసంపదలకుఁ దానకంబై యిహలోక సుఖముల ననుభవించుటయే గాక పారమార్థిక చింతతోఁ గాలక్షేపము చేయుచుండెడివాఁడు. ఆతనికి ననుకూలవతియును బరమ పతివ్రతయునునగు కామాక్షియను ధర్మపత్ని తోడు నీడయైయుండెడిది.

ఇట్లుండ నా విప్రునికిఁ దీర్థయాత్రలు చేయుదమను దలంపుకలిగెను. అప్పుడు తన యిల్లాలిని ముగ్గురు పుత్రులను బిలిచి తన యావదాస్తియును నాలుగు భాగములు చేసి నలుగురికి పంచిపెట్టి తన మనోరథమును వారలతోఁ జెప్పెను. పూర్వము ధూమ శకటాది సౌకర్యములు లేకుండుటచే దూరదేశమయినను నడచిపోవుచుండుటయే గాక తిరిగివచ్చుటకు ధైర్యములేక తమ యాస్తుల నిట్లే తమ పుత్రాదులకు నిచ్చివేయుట యాచారమై యుండెడిది.

అప్పుడు కామాక్షి "నాథా! నీతోడిద నాసుఖము. నీతోలేనిసిరిసంపదలు నాకెంత మాత్రము ననుభవింపఁదగినవికావు. అర్ధాంగినగు నేను సుఖముగాని దుఃఖముగాని నీతో సమానముగా ననుభవించియే తీరవలయును. "పతిగలుగుకంటె సౌఖ్యము సతులకు నొండొండుకలదె చర్చింపంగాఁ పతిలేమి సర్వశూన్యము పతిగలిగిన సతికి నింద్రపదవి యాదేలా?" అని పెద్దలు చెప్పెదరుకదా? నీతో తీర్థయాత్ర లనుభవింపలేని యీతుచ్ఛ శరీరమును గోదావరి కర్పించెదను." అని చెప్పుధర్మపత్ని వాక్యములు విని యనిష్ట మయ్యును నాసన్నప్రసవవేదనయగు తన భార్యను దోడ్కొని కాశీక్షేత్రమునకు

బ్రయాణము సాగించెను. ఇట్లు సని చని కతిపయ ప్రయాణంబులకు నొక మహారణ్యమును జేరుకొనిరి. అచ్చట కామాక్షికిం బ్రసవవేదన కలిగి యొక సుపుత్రుఁడు రాజలక్షణములతోఁ బుట్టెను. అప్పుడు మృత్యుంజయుఁడు శాస్త్రదృష్టితో నా బాలకుని బరికించి భార్యతో నిట్లు వక్కాణించెను. "ప్రేయసీ! యీ బాలకుఁడు మన యొద్దనున్నచో ప్రమాదము వాటిల్లును. ఇచ్చటనేయుంచి పోయినచో గొప్పచక్రవర్తి కాఁగలఁడ"నిచెప్పి కామాక్షిని సమాధానపరచెను. "యోऽమే గర్భగతస్యాపివృత్తిం కల్పితవాన్ ప్రభుః।" అనునర్థ శ్లోక మొక తాటాకుపై వ్రాసి యాయర్భకుని కంఠమునఁగట్టి పల్లవశయనము కల్పించి యా బాలుని దానిపై బరుండఁబెట్టి యెట్టకేలకు నాదంపతులు పయనము సాగించి కాశిసిఁ జేరుకొనిరి. అట్లు కాశ్యాది దివ్యక్షేత్రములు తీర్థములు క్రమమున సేవించుచుండిరి.

౨

ఇచ్చట నాయర్భకుని నొక మహాసర్పము చుట్టుకొని తన ఫణములచే నా బాలకునకు నెట్టి బాధ కలుగకుండ కాపాడుచుండెను. ఆశిశువు వట వృక్షముక్రింద పరుండుటచే నాచెట్టుపైనున్న తేనెపట్టునుండి మధుబిందువు లాబాలకుని నోటపడుచుండెను. అట్లు మధుబిందువులు గ్రోలుచు ఫణీంద్ర వేష్టుఁడయి నిర్భయముగాను సుఖముగాను శుక్లపక్ష చంద్రునిరీతి నా బాలకుఁడు వృద్ధినొందుచుండెను. దిక్కులేని వానికి దేవుడేదిక్కుకదా? ఇట్లుకొంతకాలము చనిన పిదప నాప్రాంత దేశములను పాలించుచున్న ప్రభావసుఁడను నొక రాజన్యుడు మృగయార్థియై నాప్రాంతమునకువచ్చి ఫణీంద్ర వేష్టుఁడై ముద్దులుముంగారుచున్న నా బాలకునిచూచెను. అంతలో నాపాము నెందేని చనియెను. రాజు అప్పుడా బాలకుని శిరము మూర్కొని తన రథముపై నిడికొని నిజనివాసమునకు జనియెను. వానికంఠమున తాటాకుపైనున్న యర్థశ్లోకము పరికించి యర్థము గ్రహించెను. వెంటనే కొందఱు సేవకులను బిలిచి యామహారణ్యమున నొక సత్రము కట్టించుఁడని యాజ్ఞాపించెను. అట్లేవారుచేసిరి. అప్పుడు రాజాసత్రమున నాయర్థశ్లోకము నొకబల్లపై వ్రాయించి యా సత్రద్వారమున కట్టించెను. మఱియు నచ్చటనుండు సేవకులతో "నీఅర్థశ్లోకముపూర్తి చేయువానిని నాయొద్దకు దీసికొని రమ్మని యాజ్ఞాపించెను.

ఇట్లుండ నొకనాఁడు నామృత్యుంజయుఁడు తీర్థయాత్రను సేవించి యాయరణ్యమార్గమున భార్యతోవచ్చుచు సత్రమును దిలకించెను. క్రొత్తగాఁ గల్పించిన యాసత్రమునుగాంచి యాశ్చర్యము నొంది యా యర్థశ్లోకము పూర్తిచేయునంతలో నాబ్రాహ్మణుని

చారులు రాజునొద్దకుఁ గొంపోయిరి. వీరలు మహాభయముతో రాజునొద్దకు వెళ్లఁగా వారి వృత్తాంతమును నామూలాగ్రముగా దెలిసికొని రాజు వారిపుత్రుని వారలకు నర్పించి ధనధాన్యముల నొసఁగి పొమ్మనెను. అప్పుడా బ్రాహ్మణుఁడు రాజును జూచి "మహాత్మా! దైవానుగ్రహమువలన నాకన్నవస్త్రములకు లోటులేదు. మఱియు ముగ్గురుపుత్రులు కూడ నింటఁగలరు. అందుచే నీవు సంతాన హీనుడవు కనుక నీవీపుత్రుని పెంచుకొనుమని యిచ్చివేసెను. అప్పుడు రాజు మహాప్రసాదమని పరిగ్రహించి యా బ్రాహ్మణుని గౌరవించి పంపెను. అప్పుడు రాజు నాబాలునకు వరరుచియని పేరిడి గారాబముతో పెంచుచుండెను.

## 3

ఇట్లు కొంతకాలము చనఁగా వృద్ధుడగుప్రభావసుఁడు ప్రాప్తయౌవనుఁడగు వరరుచికి రాజ్యము నప్పగించి తపస్సుకై పోయెను. అప్పుడు వరరుచి జనానురంజకుఁడై రాజ్యము పాలింపుచుండెను. ఇట్లుండ నొకనాడు వరరుచికి వివాహమాడు తలంపుగలిగి "నీయభిమాన మెవ్వరిది నిక్కముగా లిఖియించుకోమలీ!" అని యొక్క పద్యపాదమును లేఖపై వ్రాసి కొందరు సేవకులనుబిలిచి "దీనిని సమస్తదేశములలోఁ గల రాజకన్యలకుఁ జూపుఁడు. ఆయారాజకన్యలు వ్రాయు జబాబులను నచిరకాలమున నాయొద్దకు తీసికొని రం"డనియా జ్ఞాపించెను. అట్లువారు పత్రికను నాయారాజకుమారికలకు జూపిరికాని తగిన సమాధాన మెవ్వ రివ్వజాలరైరి. కాని చోళదేశపు రాజపుత్రిక మాత్రము "నాయభిమానంబు నాదె నయగుణదీపా!" అని ప్రత్యుత్తరమిచ్చెను.

ఆప్రత్యుత్తరము తీసికొనివచ్చి రాజునకుఁజూపిరి. అప్పుడురాజుసంతసించి సపరివారముగామహావైభవముతో చోళదేశమునకుఁబోయెను. చోళరాజువానిని గౌరవించి వరరుచి మనోరథము తెలిసికొని సంతోషపూర్వకముగా చోళరాజు ప్రియంవదయను దన పుత్రికారత్నమును వరరుచికిచ్చి విధ్యుక్తముగా వివాహము చేయించెను. వరరుచి వివాహోవంతరము తనపరివారమును అనేకములగు ధనాలనొసంగి తనదేశము పంపించెను. తాను మాత్రము కొంతకాలమచ్చటనేయుండి యొకనాడు భార్యయగు ప్రియంవదతోఁ గలసి తనదేశమునకు పయనమయ్యెను. అప్పుడు త్రోవలో నొకనదిని దాటవలసివచ్చెను. అప్పుడా మహాస్రవంతిని ప్రవాహపరంపరలతో రెండుగట్టులను నొరసిపారుచుండెను. అట్టి నదిని దాటుటకై యొకనావలో నిరువురు కూర్చుని నదినిదాటుచుండ నంతలో దురదృష్టవశమున నా పడవ రెండు వ్రక్కలయ్యెను. అప్పుడు ప్రియంవదా వరరుచులు నాప్రవాహములో కొట్టుకొనిపోయిరి.

# లోధ్రమహిమ

## స్త్రీరత్నముల అభిప్రాయములు.

### ఆంధ్ర యువతీమణులు

శ్రీమతి కవయిత్రి పులవర్తి కమలావతీదేవిగారు రాజమహేంద్రినుంచి యిట్లువ్రాయుచున్నారు.—

"నాసోదరి బహిష్టయందు కడుపునొప్పిచే చాల బాధపడుచుండెడిది. తమ "లోధ్రను" మూడుబుడ్లను తెప్పించి యామెకొసంగితిని. నాచెల్లెలు స్వస్థురాలగుటయేగాకుండ నిరువురు బిడ్డలనుకూడ కనినది. తమ లోధ్ర స్త్రీలపాలిటి వరప్రసాదిని యనుటకెట్టి సందియమును లేదు. మా స్త్రీల వ్యాధులకు తమలోధ్ర కల్పతరువువలె కన్పడుచున్నది."

శ్రీమతి ఎన్. కనకమ్మగారు, C/o నరసయ్యగారు, విశేజిమాజస్ట్రేటు, కదిరినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.—

"మీలోధ్ర 4 పెద్దబుడ్లను సేవించినాను. 4 నెలలనుండి కడుపునొప్పి బొత్తిగనిలచిపోయినది."

### కర్ణాటక స్త్రీలు.

శ్రీమతి బి. ఇందిరా కుమారిదేవిగారు మెట్టూరునుంచి ఇట్లువ్రాయుచున్నారు.-

"నేను మీకేసరికుటీరం "లోధ్రను"ను సేవించుచున్నాను. తత్పూర్వము నాకు బహిష్ఠకాలమందు మిక్కిలి బాధకలుగుచుండెను. ప్రతినెలయును క్రమముదప్పి బహిష్ఠ యిరువది దినములోపుననే యగుచుండెను. రెండు సంవత్సరములవరకు ఆసుపత్రిమందు పుచ్చుకొంటిని గాని గుణము కనుపించలేదు. పిమ్మట వారు ఆపరేషన్ చేసుకొమ్మని చెప్పిరి; నేనిష్టపడలేదు. తమ "లోధ్ర" ప్రభావమువిని రెండుబుడ్లు పుచ్చుకొన్న తర్వాత మామూలుప్రకారము క్రమముగ 28 రోజులకు బహిష్ఠయగుచున్నాను. బాధలన్నియు నివర్తిఅయినవి. మరి రెండుబుడ్లు తమ "లోధ్ర"ను నాకు పంపగోరుచున్నాను."

శ్రీమతి జయలక్ష్మమ్మగారు, కొల్లిగల్ బాలికాపాఠశాల ఉపాధ్యాయిని, ఇట్లు వ్రాయుచున్నారు.—

"గడచిన మూడు సంవత్సరములనుండి, నాకు సరిగా ఋతుస్రావము కాకుండెను. రెండుమూడు నెలల కొకసారి బహిష్టు కలుగుచుండెను. ఇందువలన నడుమునొప్పి, కీళ్లనొప్పులు, బలహీనము, దేహము బరువుగతోచుట, మొదలగు బాధల ననుభవించుచుంటిని. మీ "లోధ్ర" రెండు సీసాలు తెప్పించి వాడినందులో పైకనిన వ్యాధులన్నియు మాయమైనవి. ఇపుడు సకాలమునకు బహిష్టుఅగుచు సుఖముగనున్నాను. మరియు రెండుసీసాలమందును వాడదలచినాను. నావలెనే బాధపడుచున్న స్త్రీలకు లోధ్రను వాడితీరవలెనని ఖండితముగా తెలుపుచున్నాను."

### క్రైస్తవ నారీమణులు

శ్రీమతి అన్నాచాండిగారు ఎం. ఎ. ఆనర్స్ 'శ్రీమతి' సంపాదకురాలు, కొట్టయంనుంచి ఇట్లు వ్రాయుచున్నారు.—

# లోధ్ర మహిమ

"మీ 'లోధ్ర'ను వాడినాను. స్త్రీల ఋతుసంబంధమగు జాడ్యముల కుదుర్చుటకు అపూర్వమగు ఔషధరాజమని చెప్పగలను. తియ్యనిరుచిగల్గి, పథ్యపానాదుల పాలింపవలసిన అవసరములేకుండుటచే, యీ మందును సంతోషముగ వాడవచ్చును."

శ్రీమతి డాక్టరు అన్నతామస్ అమ్మగారు బెంగుళూరు, ఆస్పత్రి సూపరిండెంటు, ఇట్లు వ్రాయుచున్నారు.

"ఇంగ్లీషు ఔషధములవల్ల గుణము లేనందున తమ "లోధ్ర"ను నాసోదరికి వాడితిని. ఆమెకు హాశ్చర్యమైన గుణము నిచ్చినందుకు సంతోషించుచున్నాను. ఇకమీదట ఈ యౌషధమును నారోగులకు వాడెదను."

శ్రీమతి కె. ఇసయగారు, ఎ.బి. మిషన్, సత్తెనపల్లి, గుంటూరుజిల్లా, ఇట్లు వ్రాయుచున్నారు.

"మీ 'లోధ్ర' వలన నాకుమిక్కిలి ఆరోగ్యముకల్గినది. నాకు వచ్చుచుండిన దగ్గునయమైనది."

శ్రీమతి మిసర్సు. ఏ. దేవదాసుఅమ్మగారు ఇ. డబ్ల్యు. ఎమ్. స్కూలు, సాల్కి, మిర్కబుజిల్లా, ఇట్లు వ్రాయుచున్నారు---

"మీవద్దకొన్న "లోధ్ర" నాలుగు బుడ్లను, ఋతుస్రావదోషములచే బాధనొందుచున్న స్త్రీల కిచ్చినాను. వాటిని వాడినందున వారి రోగములు కుదిరినవి."

## కేరళ వనితలు

శ్రీమతి ఎడపిల్లి పార్వతమ్మగారు తిరుచూరునుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"నేను 25 సంవత్సరములుగ ఋతుసంబంధమగు జాడ్యములతో బాధపడుచుంటిని. ఎన్నియో మందులను వాడినను గుణమగుపడలేదు. తుదకు మీ 'లోధ్రను' కొద్దికాలము మాత్రము వాడగా అత్యద్భుతముగ రోగనివారణ గావించెను."

శ్రీమతి అమ్ముకుట్టియమ్మగారు, సంగీత ఉపాధ్యాయిని, సర్కారుహైస్కూలు, తిరుచూరు, కొచ్చినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"చాలాకాలముగ అనేక విధములైన గర్భాశయ రోగములవల్ల బాధనొందుచుంటిని. అనేక విధములైన చికిత్సలను పొందితిని గాని నివారణము కాలేదు. కడపట తమ "లోధ్ర" సేవించిన వారము రోజులలోనే గారడివిద్య వలెగమందు పనిచేసెను. దాని ప్రభావమును వర్ణింపజాలను."

శ్రీమతి మిస్ గోపాలపణిక్కర్ గారు, శారదావిలాసము, చిత్తూరు, కొచ్చినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"మీవద్దనుండి తెప్పించిన 6 లోధ్రబుడ్లలో 3 నేనును తక్కిన 3 మా చెల్లెలును సేవించుటచే మాయొక్క ఋతుశూలలు మాయమాయెను."

శ్రీమతి మిసర్సుకర్తగారు, కోరోలి ఆమ్మనాత్ హౌవుస్, ఇరింజలకుడ, కొచ్చినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.---

"పది సంవత్సరములుగ ముట్టుకట్టువల్ల బాధపడుచుంటిని. దానిని మీ లోధ్ర అత్యద్భుతముగ నివారణచేసెను."

## ౪

కొంతసేపటికి వరరుచియొక తెప్ప చేరెను. అదియొక అరణ్యప్రాంతము. అచ్చట వరరుచి మూర్ఛితుడై నిద్రించియుండగా భగవంతుఁడు వీనిధైర్యము పరిశీలింపవలెనని జగన్మోహనాకారియగు నొక స్త్రీరూపము ధరించి వరరుచి సమీపమున కూర్చుండెను. కొంతసేపటికి వరరుచి సేదదేరి యెదుటను స్త్రీనిచూచి దప్పికొన్నవాఁడగుటచే జలమును జూపెను. అప్పుడాస్త్రీ తనయభిలాషమును దీర్చిన జలము దెచ్చెదనని చెప్పెను. అందుపై వరరుచి "తల్లీ! నేనేకపత్నీవ్రతుఁడ. నావృత్తాంతమిది" అని తన వృత్తాంతము నంతయును జెప్పెను. కాని యాస్త్రీ యనేకశ్రీరంగనీతులు చెప్పియు సమీహితము తీర్చుకొనలేక, వరరుచి ధైర్యమునకు వెఱగొంది నిజరూపముచూపెను. అప్పుడు వరరుచి భగవంతుఁడగు నాపరమేశ్వరుని ననేకవిధముల గీర్తించెను. అంత భగవంతుడు వరరుచియొక్క భావియభ్యుదయమును ప్రియంవదయొక్క క్షేమవార్తయును, అచిరకాలముననే వారిరువురియొక్క కూటమియును వక్కాణించి యదృశ్యుఁడయ్యెను.

అంత వరరుచి భార్యను నెమకుచు నెందేని జనియెను. ప్రియంవదకూడ క్షేమముతో నొకయొడ్డును చేరికొనెను. ఆమెకూడ మూర్ఛాక్రాంతయై కొంతసేపాయొడ్డుననుండి మూర్ఛదేరి తన దురదృష్టమును నిందించుకొనుచు భర్తను వెదకుచు నొక యరణ్యమార్గమున పోవుచుండెను.

అంత కుసుమధ్వజు డనునొకరాజు వేటకై యాయరణ్యమునకు వచ్చి యామెను దిలకించెను. చూచి యామె వృత్తాంతము గనుగొని యాతనితోఁదన గృహమునకు తీసికొనిపోయెను. అచ్చట నామె సౌందర్యాదులకు మోహితుఁడై యాతని మనోరథమును నామెతోఁ జెప్పెను. విదుషీమణియగుటచే ప్రియంవద యిట్లని చింతించెను. "నేనిప్పుడు వీని యభిలాష తీర్చనని చెప్పినచో బలాత్కారము చేయకమానడు. కనుక వీని నెట్లైనను వంచించి పోవలె"నని తలఁచి రాజును చూచి "మహాత్మా! తమరు నన్ను రక్షించితిరి. కనుక తమ మనోరథము తీర్చుట నాకువిధి. కాని నాకొక వ్రతము కలదు. ఆ వ్రతముచేసిన గాని పురుషుని చూడఁగూడదని చెప్పెను. రాజు "నీ యిష్టానుసారముగ వ్రతాదులు చేసికొనుము. ఆ వ్రతమెట్టిది? దాని కేమిసామగ్రియుండవలెను?" యనియడిగెను. అప్పుడు ప్రియంవద" ప్రభువర్యా! బంగారు చేటలు ఒకలక్ష, బంగారు గుమ్మడిపండ్లు ఒకలక్ష, పతివ్రతల కొకమాసము పంచిపెట్టవలెను. ఈనెలరోజులు బ్రాహ్మణులకును బీదజనులకును

షడ్రసోపేతముగా నన్నము పెట్టవలయును. పిమ్మట మీ యభీష్టము తీర్తును." మోహ పిశాచావిష్టుఁడగు రాజు వల్లెయని యా సామగ్రియంతయును సంస్థానము పై ఋణము తెచ్చి యాయతము చేసెను. ఆమె వ్రతము నారంభించెను. ఇట్లు పూర్వోక్త ప్రకారముగా వ్రతము సమాప్తమయ్యెను. ఆ నాటి రేయి రాజు ప్రియంవదను చూచి మనోరథము తీర్చుమనెను. "మహాత్మా! ఈరోజున నుపవాసముతో నున్నాను. ఎల్లితప్పక నీమనోరథము నెరవేర్తును" అని చెప్పెను. అప్పుడు రాజు తన గృహమునకు పోయెను.

అంత ప్రియంవద "భగవంతుఁడా! దిక్కఱి దీనాననై యిట్టి మహాపత్తున పడియున్న నన్నురక్షింపవా? ఇట్లు నావలెనే అవమానము భరింపనున్న ద్రౌపదిని కాపాడినావు కావా? నీ కింత పక్షపాతమా?" అని ప్రాణములు బలవంతముగా త్యజింప నుంకించు నాయనద వాక్కులు భగవంతు డాలకించెను. అప్పు డామేడగవాక్షముయొక్క ఇనుపకడ్డీ లప్రయత్నముగా విఱిగిపోయినవి. ఆకిటకిలనుండి భూమివఱకు నొక గొలుసు వ్రేలాడి యుండెను. ఆమె యీ గొలుసు పట్టుకొని క్రిందకు దిగి యథేచ్ఛం జనియెను.

ఆమె యట్లుపోయి యొకయరణ్యమార్గమున పోవుచుండగా కొందఱు దొంగలు ఆమె నెదుర్కొని నీచులగుటచే ఆమెను బలాత్కారముగాఁ జెరుప నుంకింప నామె యాచోరులఁగాంచి "మీ యిద్దరి అభిలాషయును దీర్చెద. నా కాకలిగానున్నది. కొంచెము అన్నమున్నచో నిండు." అనియడిగెను. అప్పుడు దొంగ లిద్దరును, అన్నము తెచ్చుటకై నీవు వెళ్లుము నీవువెళ్లు మని పోట్లాడుకొనుచుండఁగా ప్రియంవద "మీయిద్దరును పూర్ణముగా తెచ్చిన మన ముగ్గురము కడుపునిండఁ దినఁగలము" అని పలికెను. అప్పుడు మద్యపానవిమోహితులగు నాచోరులు అట్లచనిరి. అంత ప్రియంవద బ్రతుకు జీవుఁడా అని చనిచనియొక్క పట్టణప్రాంతమునకుఁ జేరెను. సర్వానర్థములకు కారణమగు నా స్త్రీరూపముతో నుండుట ప్రమాదమని పురుషవేషము ధరించి యొక పట్టణముచేరెను.

అట్లు చేరి యాపురమున రాజునొద్ద మంత్రియుద్యోగమును దనబుద్ధివిశేషముచే సంపాదించెను. కాని తన భర్తనుకూడ నచ్చటకు రప్పించవలయునని తలచి చిత్రకళా పరిచయముగల యామెయే తన స్త్రీచిత్రమును వ్రాసి దేవిడీయెదుట పెట్టించి, చాదులతో నిట్లుచెప్పెను. "ఆ చిత్రముచూచి యెవరుదూపింతురో, విచారింతురో, వారలను నా యొద్దకు రప్పించుడు." అని యాజ్ఞాపించెను.

అంత నొకనాడు దొంగలామెను వెదకికొనుచువచ్చి చిత్రపటము చూచి దూషింప నారంభించిరి. అప్పుడు వారిని మంత్రికిఁజూప ఖైదులోనుంచమని యాజ్ఞనిచ్చెను.

మఱియొకనాడు కుసుమధ్వజుడు ప్రియంవదనువలచి తన సర్వస్వము కోలుపోయి రాజ్యభ్రష్టుఁడయి యామెను వెదకుచునచ్చటకు వచ్చి యా చిత్రపటముజూచి విచారింప నారంభించెను. అప్పుడు చారులు మంత్రికిఁజూపిరి. అప్పుడు మంత్రియయియున్న ప్రియం వదవాని చరిత్రమువిని వానికనేక ధర్మోపదేశములుచేసి యిటుపయిని బుద్ధిగా నుండుమని చెప్పిపంపెను.

అంత వరరుచి ప్రియంవదను వెదకుచు నీయూరువచ్చి చిత్రపటమును చూచి విచారింప నాచారులు వానిని మంత్రియొద్దకు తీసికొనిపోయిరి. అప్పుడు ప్రియంవద భర్తను జూచి లోపలికి తీసికొనిపోయి స్త్రీరూపము ధరించియుండెను. అప్పుడు భార్యయగు ప్రియంవదను కౌఁగలించుకొని యామె వృత్తాంతము నడిగెను. ఆమె తన చరితము సవిస్తరముగాఁ జెప్పెను. అప్పుడు రాజు ఆమె బుద్ధికుశలతకును ధైర్యమునకు ఆశ్చర్యము నొందెను. అప్పుడిద్దరు తమ రాజ్యమునకుపోయి యథేచ్ఛగానుండిరి. తన మానమును తానె కాపాడుకొందుననని ప్రతిజ్ఞ చేసిప్రియంవద యట్లు నెరవేర్చుకొనెను. అందరు స్త్రీలు నట్లె యత్నించుట శ్రేయము.

## మహాత్మాగాంధి

శ్రీమతి నెలువోలు వసంతాదేవిగారు

సర్వసర్వంసహా జనశ్రవణసుఖము
మధురమధుర మ్మహింసాసుమాన్యగీత
మాలపించు వసంతపికాధిపతివి
గాంధి! మమ్ముఁబ్రోచు మీపాదకంజరజము.

ఖండఖండాంతర స్థితాఖండజనము
పూరుషశ్రేష్ఠుఁడని మిమ్ముఁబొగడుచుండ
నతపరాధీన దుఃఖాసనమ్మునందుఁ
దెల్ల స్మితరేఖ భరతభూదేవిదాల్చు.

ఈ దరిద్రనారాయణు లీవిధానఁ
గోట్లకొలఁదిగఁ గూడునుగుడ్డలేక
పొందువంతను నీవెంతొ కుందికుంది
రాట్నమొసఁగితి తన్ని వారణముగాఁగ.

తతసనాతనహిందూమతమ్ము పేర
స్త్రీలకును బంచములకును జెప్పరాని
స్పృగ్థవేదనలెన్నెన్నొ చెల్లుచుండ
మించుమిబోధ వాని వారించుచుండె.

మీస్వరాజ్యసంకల్ప మమేయసిద్ధి
నందుఁగావుతమని మాదుప్రార్థనంబు;
అలమహాత్ముల సంకల్పబలమువలన
నెట్టి కార్యము లేని గిట్టకున్నె?

# శారదలేఖలు

సౌభాగ్యవతియగు కల్పలతకు :—

నెచ్చెలీ!

నీవువ్రాసిన జాబుచేరినది. నేనుగూడ నీవలెనే స్త్రీ నాటకరంగప్రవేశమును గూర్చియే అహర్నిశలుయోచింపుచున్నాను. "అయినను ఈనాటకసమస్య మనకు గానిపని. ఆడువారమా, పాడువారమా, యంటివేల? స్త్రీయుద్యమమనిన తరువాత అది స్త్రీజాతి కంతయు సంబంధించినదే. ఏలయన నేడు యీయుద్యమము వలన కలుగబోయెడి లాభనష్టములు, మానావమానములు, కీర్త్యపకీర్తులు, స్త్రీజాతికంతయు జెందును. ఏనాడో కైకచేసిన యకార్యమును, చిత్రాంగిచేసిన దుష్కృత్యమును కారణముగా "అబ్బా! ఆడవాళ్లెంత గట్టివాళ్లు. ఎంతకైనా సాహసులే" అనువాదు స్త్రీజాతి కంతయు చుట్టుకొనినది!

> మ|| నరకద్వారము సాహసాకరము పుణ్యస్వర్గవిఘ్నంబు దు
> స్తరమాయాశతపేటి దంభనిధిదోషస్థాన మప్రత్యయో
> త్కరసుక్షేత్రము కాలకూట మమృతాకారంబు స్త్రీయంత్రముం
> ధరనెవ్వాఁడు సృజించె బూరుషగళోద్బంధక్రియాపాశముం.

అని భర్తృహరి స్త్రీని హృదయభేదకముగా దూషించినాఁడు. భక్తిజ్ఞాన వైరాగ్య విషయములలో కృషిచేయువారు స్త్రీని యెంతపేలవముగా నిరసింపవలెనో అంతనిరసింపుచుందురు. దేవవేశ్యలైననేమి; మర్త్యవేశ్యలైననేమి; వేశ్యజాతి మూలకముగా స్త్రీసంఘమునకు చెందిన యపఖ్యాతి అపారముకాని యీజాతిని సృష్టించినవారును పురుషులే, దూషింపుచున్నవారును పురుషులే. కాన వీని నన్నింటిని బాగుగా గుర్తించి నూతనోద్యమమునకు చేయూత నిచ్చుటో నిరసించుటో యనెడు బాధ్యత ప్రతిస్త్రీ పైనున్నది. ఇది మనదిగాదని యూరకొనుట మనజాతి సౌభాగ్యమును నష్టపఱచుకొనుట. మఱియు దీనివలన గలిగెడు మంచిచెడ్డలు స్త్రీలవేగాబట్టి పురుషులకంటె స్త్రీలే ఈ విషయమును పూర్ణముగా విచారించి కర్తవ్యమును నిర్ణయించుకొనవలసినవారై యున్నారు.

రసపోషణకే, భావపుష్టికే, కళాభివృద్ధికే, స్త్రీ నాటకరంగములో ప్రవేశించిన తరువాత మోటారుబస్సులయందును, రైలుబండ్లయందును, ఒదిగి కూర్చున్నట్లును, విధిలేక తలవంచుకొని ఆపత్కాలమందు డాక్టరుగారికి చేయిచూపించినట్లును, చిన్ననాడు తప్పని సరిగా బడిలో పంతులుగారివద్ద చదువుకొనినట్లును, సభామధ్యమున తనకిష్టమైన విషయమునుగూర్చి ఒడలు వణుకుచునో మాటలు తడబడుచునో నాల్గుముక్కలు చెప్పినట్లును, నాటకరంగములో చరించుటకు వీలులేదు. లజ్జావతియగు స్త్రీ నాటకరంగమధ్యమున పరపురుషుడని యాంగికాభినయమున నాతనితో సమముగ జరించుటకే కొంచెము వెనుదీసినను నాటకకళ అధ్వానమైపోవును. హంగుచెడిచినయెడల స్త్రీ రంగమున కెక్కి ప్రయోజనమేమి? నవరసముల పోషించి హావభావప్రకటనము నందు లోటు లేకుండ ప్రదర్శించి నాటకములలో స్త్రీప్రవేశింప కుంటువలన గలిగెడు గొప్పలోటును తొలగించి నాటకకళను మహోన్నతస్థితికి దెచ్చుటకేగదా, స్త్రీ నటకురాలు కావలసి వచ్చినది? కాన స్త్రీ రంగమున కెక్కిన తరువాత మడిలేని పిన్నపెద్దలు సంచరించెడిచోట మడిగట్టుకొనిన ముసలమ్మ యొదిగి యొదిగి నడచినట్లు యెడ యెడగా నుండుటకు వలను పడదు. కలిసి చరించుట స్త్రీల కర్హముగాదు. అయినను నాటకకళాభివృద్ధికొఱకు స్త్రీల నేల బలవంతముగా నాకర్షింపవలెనో నాకు తోచకున్నది. రాముడుగానితా నచ్చముగ రాముఁడుగను, సీతగాని తా నచ్చముగ సీతగను, నటించి వేషధారి ప్రేక్షకుల నానందింపజేయుటయే నాటకము. తాము సీతారాములముగామని నటకులకు దెలియును, ప్రేక్షకులకును దెలియును. అట్టిచో సీతవేషమును స్త్రీవేసినను నొకటే. పురుషుడు వేసినను నొకటే. పురుషుఁడు స్త్రీగా నటించిన నందు కొంత సామర్థ్యప్రకటన ముండునేమోగాని స్త్రీనటించినచో నందద్భుతమేముండును? స్త్రీయైన మాత్రమున పలుభావములు ప్రకటించుటలో కౌశలము వలదా? యనిన నదియు నిజమేకాని పురుషుఁడే యిన్నిభావములు ప్రదర్శించిన మఱియు నధికకుశలతయనిపించు కొనును గదా! శీలము మనుష్యునిబట్టి యుండునుగాని వృత్తినిబట్టియుండదని కొందఱనుచున్నారు. కాని సీతవంటి శీలవతి నాటకరంగములో సీతవేషమునుధరించు ననుకొనుము. ఆదర్శపాత్రమగు సీతశీలమును ప్రతిస్త్రీయును తనజీవితమునందనుష్ఠేయముగా నుంచుకొనదగినదికదా. హనుమంతుడు సీతను తన మూపున నిడుకొని శ్రీరామచంద్రుని కడకు గొంపోవుదునని సీతతోఁజెప్పినప్పుడు పరపురుషునంటనని సీతచెప్పినది. ఉత్తమమైన యాసతీధర్మము ననుష్ఠించెడు యాసీతవేషధారిణి నాటకరంగములో నెట్లు చరించును? నాకు దుర్జ్ఞేయముగానున్నది. అదిసరే. భాగవతములు నాటకములు

మున్నగు నీకాలక్షేపము లెందులకుఁబుట్టినవి? ఇంచుక యోచింతము. ప్రజలలో నీతిని పెంపొందించుటకును, దేశానురక్తిని గలిగించుటకును మతాసక్తిని బుట్టించుటకును దైవభక్తిని వ్యాపింపఁ జేయుటకును, జనులను కూటమిగాఁజేర్చి కాలక్షేపములు జరుపుట మన దేశములో ననాదిగా నడచుచున్న యాచారము. ఇవి సామాన్యముగా పామర జనుల ప్రబోధము కొఱకే యేర్పడినవి. వీనిలో మొదటి మెట్టు కథలు చెప్పుకొనుట. కథ నీతికరమైనదియు కథకులు వచోనైపుణిగలవారును నైనచో ఆటపాటలు, మద్దెల తాళములు, బహుపాత్రలు లేకపోయినను, వినువారి మనస్సు నట్టె యాకర్షించి చిత్ర ప్రతిమలుగాఁ జేయవచ్చును. వీనిలో శ్రోతలు కథలోని పాత్రలను మానసికముగా సృష్టించు కొందురు. వీనిలోనున్న యేకాగ్రత మేళతాళాడంబరములలో నుండెడి కాలక్షేపములలో నుండదు. తల్లివద్ద నేకాగ్రచిత్తముతో నిట్టి కథల నాలకించియే మహారాష్ట్రచక్రవర్తియైన శివాజీ యంతటి శూరుడైనాఁడు. వీనికి కొంచెము పైమెట్టు గొల్ల సుద్దులు, తందాన పదములు మున్నగునవి. వీనిని వినువారు ముఖ్యముగా జానపదులు. ఈ పదములు వట్టి పాడిమాటలు కాకపోయినను తత్తుల్యములగు కొంచెము రాగముతోఁగూడిన పదములు. వీనికి కొంచెమూత ఏకతంత్రీసాధనమగు తంబూరయు కొమ్ము, తిత్తి, మున్నగునవి. పూర్వము జనసామాన్యములో మతము, యుద్ధము, మున్నగు వానినిగూర్చి ప్రబోధము కలిగించ వలసినప్పుడు పరవశచిత్తులగు వారిచే నుద్రేకముగా చదువబడెడి యీ పదములు బహూపయోగకరముగ నుండెడివి. ఇప్పటికిని బొబ్బిలికథ, పల్నాటివీరచరిత్రము, మున్నగు వీరచరితములు పాడబడునపుడు జానపదులలో గల్గెడి యుత్సాహ మద్భుతము. వీనికి పైమెట్టు తోలుబొమ్మలాటలు. జనులలో నాగరికత యభివృద్ధియైన కొలది యీకాలక్షేపముల యభివృద్ధియు పలుతెఱగులుగా నుండజొచ్చినది. ఉపనిషత్కాలమున మానసికముగానున్న యేకేశ్వరోపాసన కాలక్రమమున ఆడంబరములతోఁగూడిన ప్రతిమార్చనగా మాఱి మనుజుని పతనమునకు కారణమైనట్లు ఈకాలక్షేపముల వృద్ధియు మన పతనమునకే దారిచూపినవి. కథలను గేయములను వినునప్పుడాయా కథలలోని యుత్తమపాత్రలకు మానసికముగా రూపకల్పన గావించుకొని వాని సత్వశీలసామర్థ్యములను గుర్తించి వానిని తమ జీవితములందనుష్ఠేయముగా నుంచుకొనుటకు శ్రోతలకవకాశముండెడిది. కాని తోలుబొమ్మలాటలలో ప్రసిద్ధ వ్యక్తులకు కృత్రిమరూపములు కల్పించుటచే చిత్తైకాగ్రత నశించినది. తోలుబొమ్మలాటలతోనే రంగస్థలమున తెఱయెత్తబడినది. వాయిద్యపరికరములుగూడ నధికమైనవి.

గాత్ర మాధుర్యమునకు ప్రాముఖ్యత ఈయ బడినది. కాన కథలకు కళాసాంకర్యము గల్గినది ఈతోలుబొమ్మలాటలయందేనని చెప్పవచ్చును. కాని మన భరతఖండమునందలి ప్రసిద్ధేతిహాసములగు రామాయణభారతాది యుద్ధగ్రంథములయందలి శూరభక్తానీకముల చరిత్రములను బొమ్మలద్వారాసుబోధముగావించి పామరజనులలో నీతి ప్రబోధము గావించుటయే యీతోలుబొమ్మలాటల లక్ష్యముగూడ నైయుండెను. కాని యచేతనములగు తోలుబొమ్మల నాడించి సచేతనపుతోలుబొమ్మలగు జనసామాన్యము నానందింప జేయుటయనునది కాలక్రమమున నాగరికులకు మోటుగా తోచినది. కాన తామే ఆయాపాత్రముల ధరించి నటించుట యుక్తముగా భావించినారు. అవియే భాగవతములు. తోలుబొమ్మలాట వఱకు మనుజుడు మొగమునకు రంగుపూసికొని రంగమున కెక్కలేదు. మఱియు తోలుబొమ్మలాటవఱకు నీకథల నడుపువారు సామాన్యముగా శూద్రులే యైయుండిరి. ప్రాయికముగా వీరి గురువులు బ్రాహ్మణులై యుండినను నలువురిలో నాడెడివారు మాత్రము బ్రాహ్మణేతరులే. బ్రాహ్మణేతరులలో నిట్టియాటపాటల కాలక్షేపములు జరుగుచుండ బ్రాహ్మణు లూరుకొనలేదు. పురాణపఠనము హరికథలు మున్నగునవి వారి కాలక్షేపములుగా నుండెడివి. అయితే వారి కాలక్షేపములకు వీరును వీరికాలక్షేపములకు వారును పోకుండిరని భావనకాదు. వాని ఆధిపత్యము లాయాజాతుల వారు మాత్రమే చేయుచుండిరని యర్థము. అయితే భాగవతములలో అన్ని జాతులవారును పాల్గొనిరి. బ్రాహ్మణభాగవతులు—వీరే కూచిపూడి భాగవతులు. గొల్లభాగవతులు, ఏనాదిభాగవతులు, మాలభాగవతులను పేరులతో—వేర్వేఱు కులములవారు భాగవతముల నాడుచుండుట యిప్పటికిని కందుము. నాట్యకళాబ్రహ్మయగు భరతాచార్యునకు పూజ్యత ఈ భాగవతములయందే కల్గినది. మఱియు హావభావముల కాధిక్యతయు, శృంగారమునకు ప్రాముఖ్యతయు, కృష్ణచారిత్రమునకు ప్రాధాన్యతయు, నీతికి న్యూనతయు నీభాగవతముల కాలముననే గల్గెను. కాని యొకమేలు వీధిభాగవతముల వఱకు వీనివ్యయము జనసామాన్యమునకు తగిలెడిదికాదు. గ్రామములో పెద్దలైనవారేనలుగురైదుగురో దాని వ్యయమును భరించి ప్రజాసామాన్యమున కాయాటను సందర్శించు భాగ్యమును ధారాగతము చేసెడివారు. వాని తరువాతనే నాటకములు. ఈనాటకములలో గూడ వీధినాటకములని యొక్కటే తెఱతో వీధులలో నాడునవి కలవుకాని ప్రచారము స్వల్పము. ఇప్పటి నాటకములనగా వానికొక ప్రత్యేక మందిరముండును. రంగానుకూలములైన పరికరము లధికము. వేషభూషాడంబర మెక్కువ, నృత్యగీతాభినయములకు ప్రాముఖ్యత

యధికము. మఱియు ప్రతిచూపరియు కొంతమూల్యమును తన స్థితినిబట్టి యిచ్చుకొనవలయుట వీనిలో ముఖ్యవిషయము. టిక్కెట్లపద్ధతితో గూడిన నాటకములు ధనికులను పేదలను విడదీసినవి. కాన భాగవతములు నాటకములు మున్నగు కాలక్షేపములు జరుపుట ప్రజాప్రబోధమునకనెడి యాదర్శమును నాటకములు చెఱచినవి. నాటకములు శ్రీమంతులగు నాగరికుల కానందమును గూర్పవచ్చును, కాని ప్రజాసామాన్యమునకు వీని ప్రయోజనములేదు. ఒకవేళ యే పాటకపు జనుఁడైనను పావలా, అర్ధా, చెల్లించి నాటకమునకు వెళ్లియుండినచో త్రాగుబోతైన వాడు యింటిలోని భార్య, బిడ్డలగోడు జూడక కల్లంగడికి వెళ్లినట్లే నాటకముల చూడవచ్చిన కూలివాడుకూడ యింటిలో మఱుపూట గంజి కాధారములేకుండ జేసి నాటకసందర్శనమనెడి దుర్వ్యసనపిపాస దీర్చుకొనుటకు వచ్చియుండెననుట స్పష్టము. కాన ధనికులగు విద్యాధికులకే నాటకములు. వీరి యానందమునకు పురుష వేషధారులు చాలలేదు. కాన స్త్రీలనుగూడ రమ్మనుచున్నారు.

ఇటీవల కొంతకాలమునుండియు నాటకకళ విషయమై మనయాంధ్రదేశమునందు ప్రచారము జరుగుచున్నది. సమర్థులైన నటకులు కొందఱు బయలుదేరి బహుమానములు, బిరుదులు, పొందుచున్నారు. ఈ కళాభివృద్ధికై గ్రంథములు కొన్ని ప్రకటింపఁబడినవి. పత్రికలుగూడ స్థాపింపఁబడినట్లు జ్ఞాపకము. కాని ఈ ప్రచారమంతయు పురుషులలోనే జరుగుచున్నది. స్త్రీలుగూడ నాటకరంగములో పాల్గొనకుండుట లోపమను సంగతిని కళావిదులు నిన్నమొన్నటివఱకు గుర్తింపలేదు. బహుశఃయిది ఈవత్సరమే దేశములో ప్రవేశించిన నవ్యమారుతము. ఇది పశ్చిమవాయువని కొందరన; కాదు, కాదిది ప్రాచ్యమారుతమే యని కొందఱనుచున్నారు. ఇది యేగాలియైననేమి మన హిందూస్త్రీ మనస్తత్వముల కిదిసరిపడునా? లేదా ? యనునదియే యోచింపవలసిన యంశము. వేశ్యజాతి స్వర్గలోకములోనున్నది. మర్త్యలోకములో నున్నది. పాతాళలోకములోనున్నది. చతుర్యుగములకు సంబంధించిన శ్రుతిస్మృతిపురాణేతిహాసములలో వీరి ప్రస్తావన గలదు. కాన యిది అతిపురాతనమైన తూర్పు వాయువు అని చెప్పుటకు సందేహములేదు. అయిననేమి? నీతిభ్రష్టమైన యీజాతి ధర్మమును కూకటివేళ్లతో గూడ పెల్లగించుటకు దేశహితైకాభిలాషులెల్లరు తీవ్రముగా యత్నింపుచున్నారుగదా. అట్లే ఈ నాటకరంగ ప్రవేశోద్యమముగూడ పాచ్యమైననేమి, ప్రతీచ్యమైననేమి, ప్రాక్తనమైననేమి; అధునాతనమైననేమి; సతీశ్రేయమునకు భంగకరమైనచో నది నిర్మూలింపఁజేయుట స్త్రీలకర్తవ్యము. మనయింటిదీపమని ముద్దుపెట్టుకొనవగునా?

కల్పలతా.

"లోకోభిన్నరుచి"యన్నట్లు జనులతలపులు బహువిధములు. నీతి లక్ష్యము కొందరికి, కళాప్రియత్వము కొందఱికి, కనులపండువు కొందఱికి, ఎవరి యుద్దేశము కాదనినను వారి కావేశమే యెత్తుకొనివచ్చును, కాని ఆలోచింపవలసిన విషయముల కావేశముచెందితే లాభములేదు. కాన ఒకప్పుడు శీలమునకై యాత్మార్పణము గావించి యశోవిశాలమైన భారతమహిళ నేడు నాటకకళకు బలియై తన పూర్వౌన్నత్యమును చెఱుచు కొనుట యుత్కృష్టమో, నాటకకళకులోపము కల్గిన గల్గుగాక తన శీలమునే ప్రాధాన్యముగా బెట్టు కొని నాటకరంగములకు వెలిగానుండుట యుత్కృష్టమో, స్త్రీలును స్త్రీసంఘాభ్యుదయ పరులగు పురుషవరేణ్యులును యోచింతురు గాక.

దూఱుదూఱుమను వారేగాని తోడు దూఱువారుండరు. స్త్రీలిందు పాల్గొనుట వలన దేశమభివృద్ధి జెందుననియు, నాట్యకళ పెంపొందుననియు, స్త్రీపురుషులు యోగ్యులై యున్నచో వారెంత కలిసి మెలసి యున్నను ప్రమాదములేదనియు, కళాభిమానులగు వారు తమ యుద్యమ విస్తారమునకై పలు తెఱగుల సమాధానములుచెప్పి స్త్రీలనాకర్షింప వచ్చును. కాని నాటకములాడు స్త్రీలనుగాంచి లఘుభావమున పలుగాకిమూకలాడు ప్రల్లదముల నాప వీరితరమా?

మహాత్మునివంటి యుత్తమోత్తమ పురుషవరేణ్యునిచే నడుపబడుచున్న సబర్మతీ సత్యాగ్రహాశ్రమమును బోలు నిష్ఠురనియమవిధానముగల సంస్థయందే స్త్రీపురుషులలో లోపములు గననయ్యెనని మహాత్ముడు వలవల విలపించినాడు. శీలభంగభయముచేతనే స్త్రీపురుషులుకలిసి పనిచేసెడు ఫ్యాక్టొరీవిధానమును మహాత్ముని వంటి ప్రాజ్ఞులు నిరసింపు చున్నారు. అట్టిచోనిక నాటకరంగములా స్త్రీలమర్యాదను చెక్కు చెదరకుండ రక్షింపునవి?

పూర్వము మనదేశమున స్త్రీలు నాటకములలో పాల్గొనినట్లు కానము. ఉండిరని చూపఁబడుచున్న వారు దేవవేశ్యలైన అప్సరసలేగాని సంసారిణులుగారు. మన శాస్త్ర మహోదధియందు బాల్యవివాహ వాదులకును ప్రౌఢవివాహవాదులకును నుదాహరణ ములుగా జూపదగిన శ్లోకరత్నములు లభించినట్లే ఒకవేళ వెదకినచో నీ విషయమునగూడ యుభయవాదులకును నుదాహరణ శ్లోకరత్నములు కొదువలేక దొరకవచ్చును. వేష ధారణము గృహస్థ నిషిద్ధకర్మమని శాస్త్రదృష్టాంతములు పెక్కులుగలవు. వాని నెల్ల

నిక్కడ వ్రాయనుట అనవసరము. ముంజేతి కంకణమునకద్దమెందులకు? స్త్రీనాటకరంగ ప్రవేశముయొక్క ఫలితములు సాధారణ విషయములను బట్టియే కరతలామలక మగు చుండ ప్రాచీనోదాహరణముల కొఱకు ప్రాకులాడుటేల? కల్పలతా! నాటకకళనుగూర్చి సందర్భమునుబట్టి యింతగా విమర్శించుటచే నాటకకళయనిన నాకు ద్వేషమని భావింపకుము. స్త్రీల ప్రవేశమునుగూర్చియే నాకభిప్రాయభేదముగాని కళాకోవిదులగు పురుష వరేణ్యులీనాట్యకళోద్ధరణకై విశేషము పాటుబడి మన యాంధ్రదేశమును నీ విషయమునగూడ తీసిపోని దానినిగాఁ జేసిరేని నాకు పరమసంతోషము. కాని యే స్త్రీజనాభ్యుదయచింత స్త్రీజనప్రయోజనకరములగు నుదారసంస్కరణములకు నన్ను సుముఖురాలనుగాఁ జేయుచున్నదో ఆమహనీయ చింతయే నన్నీయుద్యమమునకు వ్యతిరేకాభిప్రాయనుగా చేయుచున్నది. దీర్ఘముగా నాలోచించిన పిదపనే నే నీనిశ్చయమునకు వచ్చితిని. అది నాకళాయనభిజ్ఞతయు ఛాందసమునునని యేరైన నధిక్షేపించినను నదియు నాకొక యలంకారమే యనుకొందును.

శారద.

## చందమామ

శ్రీమతి లలితకుమారి

చందమామా రావె జాబిల్లి రావె
వెండిరథమ్ముపై వేవేగ రావె
చిగురాకు మోవిపై చిరునవ్వు సుధలు
తొలిచూపు తీవలో వలపుల పూలు

పాలబుగ్గల మీద మంచుచన్నీరు
పొలుపొంద ప్రకృతియే పులకించిపోవ
చందమామా రావె జాబిల్లి రావె
ప్రాచ్యసౌధద్వార బంధమ్ము చెంత

చెంగావిరంగుల చేలమ్ము దాల్చి
మందమారుత గీతమాధురుల్ చిలికి
యెవ్వరో హారతి నిచ్చుచున్నారు
భూమియే పాటగా పులకించిపోవ
చందమామా రావె జాబిల్లి రావె.

# కొరియా స్త్రీలు

కొరియా యొక ద్వీపకల్పము. ఆశీయాఖండమున ఈశాన్యమూలయందు జపానునకు సమీపమున కొరియా దేశముగలదు. ప్రపంచమందలి అతిప్రాచీన రాజ్యములలో కొరియాదేశ మొకటి. నాలుగువేల సంవత్సరముల పూర్వమువఱకు కొరియాజనులు తమ చరిత్రమును తీగెసాగించెదరు. కాని మూడువేల సంవత్సరముల నుండి మాత్రమే కొరియాదేశ చరిత్ర లోకమున ప్రతిష్ఠితమైయున్నది.



పుత్రవతియైన కొరియా స్త్రీ. సంతోష దేవతానిలయమైన ఆమె యిప్పటి వదనారవిందము ఆకర్షణీయమై యున్నది.

కొరియా దేశము చిన్నది. విస్తీర్ణము సుమారు 85,180 చతురపుమైళ్లు మాత్రమే. ఆద్వీపకల్పము యొక్క నిడివి 600 మైళ్లు; వెడల్పు 135 మైళ్లు. మంచూరియా దేశమును, తూర్పుసైబీరియా దేశమును ఈదేశమునకు ఉత్తరపు సరిహద్దులు; తూర్పున జపాను సముద్రము ఎల్ల; దక్షిణమున ఛోజనుఛానలు, పశ్చిమమున పసపుసముద్రమును గలవు. కొండలు లోయలు మెండుకొని యుండ కొరియాదేశము అతి విచిత్రముగ నుండును. ఆదేశమున నదులు త్రాచుపాము పిల్లలవలె పరుగెత్తు సెలయేళ్లు మాత్రమే. అదేశమునందు విశేషభూభాగము అడవులచే ఆక్రమింపబడియున్నది.

హిందూదేశమునందువలెనే కొరియాదేశమున కూడ వ్యవసాయమే జనులకు ముఖ్యవృత్తి. సుమారు 10,599,000 యకరములభూమి ఆదేశమున సేద్యము చేయబడుచున్నది. వరి, గోధుమలు, చిట్టిజొన్నలు, బార్లీ, చిక్కుడు, పత్తి, జనుము, పొగాకు ఇవి ఆదేశపుపంటలలో వరుసక్రమమున ముఖ్యముగా పేర్కొనదగినవి. పశువులలో మంచి జాతి పెంపబడును. చేపలనుపట్టు పరిశ్రమకూడ గలదు. జలచరములలో గొప్పది

నైన తిమింగలములను వేటాడుటలో కొరియావారు మిక్కిలి చురుకుతనము చూపు దురు. కాగితము తయారుచేయుట, చాపలల్లుట అచ్చటి పరిశ్రమలలో నెన్నదగినవి.

కొరియావారు మంగోలియా జాతికి చెందినవారు. వారి ప్రస్తుతపు జనాభా 180 లక్షలు. వారుపయోగించు భాష తురేనియాకుటుంబమునకు చెందినది. ఉత్తర ప్రత్యుత్తరములను మాత్రము చిత్రలిపిగల చీనాభాషాలోనే జరపుకొందురు.

కట్టువస్త్రముల నిర్మాణపద్ధతిలోను, వానిని శుచిగా నుంచుకొనుటలోను ప్రాచ్య దేశములందలి స్త్రీలలోకెల్ల కొరియాస్త్రీలే ఐరోపా దేశ స్త్రీలకు సరి తూగుదురు. కొరియా స్త్రీలు సాధారణముగా సిల్కు బట్టలనే కట్టెదరు. ధవళవస్త్రములందు వారికి ప్రీతి విశేషము. అంచులుగల చీరెలు, చిన్నజాకెట్లు ఇవి ఆజాతిస్త్రీల వస్త్రములు. స్త్రీలు, పురుషులుకూడ టోపీలను ధరింతురు. ఎత్తునందును, వెడల్పునందును మితముదప్పి అచ్చటి టోపీలు వివిధములై వికృతములైయుండును. పండుగ పబ్బములందు టోపీలను ధరించి ఒకచోగూడియుండు కొరియావారిని చూచుటకు విచిత్రముగానుండును.



విలక్షణమైన టోపి. ఇట్టిటోపీలను ధరించిన వారిని కొరియాదేశమున పెక్కురను కాంచనగును.

ఉన్నతకుటుంబములకు చెందిన అచ్చటి స్త్రీలు మనదేశమునందువలెనే సాధారణముగా బయటికి రారు. ఒకవేళ రాకతప్పనిచో మేలిముసుగువైచికొని మాత్రమేవత్తురు. బీద కుటుంబము లందలి స్త్రీలు యథేచ్ఛమున వీథులవెంట నడుతురు. వారి వస్త్రధారణము విలక్షణముగ నుండును. నడుమునకు లంగా, పైన జాకట్టు, ఇంతే. కాని పమిటలేదు. మనదేశమందలి మళయాళపుస్త్రీల వస్త్రధారణమును బోలియుండును.

కొరియాదేశపు స్త్రీలకు పిల్లలను కనుటయనినను, వారిని అతిజాగ్రతతో సాకుట యనినను అతిప్రీతి. ఆడపిల్లలకంటె మగపిల్లలయందు వారికి మమకారము హెచ్చు. ఆదేశపుస్త్రీలు శిశుపోషణమునందు అశిక్షితపాటవముగలిగి తమజాతి చిరంజీవముగ వెలయుటకు కారణభూతలగుచున్నారు.

కొరియారాజు అంతఃపురజీవితము స్తుతిపాత్రముగ నుండియుండలేదు. అతనికి బహుభార్యలుండిరి. కొజ్జాలు వారిని షష్ఠిఘడియలు కావలా కాయుచుండిరి. రాజు ఉంపుడుకత్తెలలో కొందఱు అప్పుడప్పుడు రాజ్యాంగమున వేలుపెట్టి ఒకప్పుడు ముప్పును ఒకప్పుడు లాభమును కల్గించిన నిదర్శనము లనేకములు గలవు.




వివిధవస్త్రాలంకృతయైన కొరియా స్త్రీ. రకరకముల సిల్కుబట్టలనే కాని వారు స్వర్ణరజిత భూషణములను మనవారికివలె ధరింపరు.

పెండ్లికూతురిని అలంకరించుట ఆదేశమున అతివిచిత్రముగా నుండును. తొలుత వధువు మొగమున మిక్కిలి తెల్లని విభూతి పూయుదురు. పిమ్మట నుదుటిమీద ఎఱ్ఱని చాదుబొట్టు పెట్టి బుగ్గలమీద చుబుకమునను ఎఱ్ఱనిచాదు కొంచములందుదురు. బంగారు సరిగె బుటేదారు పనిచేసిన వస్త్రమును ధరించి గగననీలమైన కోటుధరించి, కట్టిన మడి చేతులకు శాలువలుచుట్టి, అనేకమైన అలంకారములు చేయబడిన టోపీని ధరించి కొరియావధువు దర్శనీయమై యుండును.

ఈ విధముగ అలంకృతయైన కన్యను చెలికత్తెలు వివాహమగువఱకు వెన్నంటి యుందురు. మంత్రవేత్తలు మంత్రించి మాహాత్మ్య మాపాదించిన టోపీ ధరించుట అచ్చటి వివాహకర్మలలో ముఖ్యమైనది.

కొరియా దేశమునను, ఆ దేశపు రాజధానియగు కెయిజో నగరమునను నూతులు విస్తారము. నీళ్లు చాల పైన పడును. కొండ దేశము గావున నూతులు త్రవ్వుటయే కష్టము. కాని రాతితోను ఇటుకలతోను కట్టవలసిన



బాలిక నూతినుండి నీళ్లుతోడుట.

చేద విచిత్రముగ నుండును. ప్రక్క నది చూడగలరు.

హైందవరమణులవలెనే కొరియాజాతి స్త్రీలకు 'సోదె' 'మొఱుక' ఇత్యాదులయందు మంచినమ్మకము గలదు. సోదెచెప్పు స్త్రీలు కొరియా దేశమున విశేషముగ గలరు. ఎట్టి శుభ కార్యము చేయ తలపెట్టినను ముందు మొఱుక చెప్పించుకొననిది కొరియా స్త్రీ కార్యాచరణమునకు గడంగదు. కొరియావారికి దయ్యములందు భూతములందు గాఢమైన విశ్వాసము. పెద్దలను కొలుచుటయే వారిమతము. ఇతర మతములకా దేశమున స్థానము లేదు.

హిందూదేశమునందు వలెనే ఆదేశమున మశూచికము కనుపించినవారికి మందు వేయరు. ఏమన మనకువలె కొరియావారు కూడ మశూచికము అమ్మవారి ప్రభావమున వచ్చిన జాడ్యమని నమ్ముటచేత. ఒక వ్యక్తికి మశూచికము కనుపించినతోడనే వారు మందుమాకులకై ప్రయత్నింపక ముందు మంత్రగాని పిలుతురు. మంత్రగానితో గాయకులును నటకులును నగువాని శిష్యులు కొందఱు వత్తురు. వారు ఆడియు పాడియు మశూచికపు దేవతను ఇంటినుండి తరిమివేయుటకు ప్రయత్నింతురు. రోగికి మందు మాత్రము ఈయనీయరు. అట్లుచేయుట ఆదేవతను నిర్లక్ష్యముచేసినట్లు అగును కావున.

పండుగ దినములలో కొరియాస్త్రీలు అత్యుత్సాహముతో నుందురు. ఆదినమున వారు పాకశాస్త్రమందలి తమ నేర్పునంతయును వినియోగించి రకరకముల పిండివంటలను చేయుదురు. అనంతరము వానిని పళ్లెరములందు దొంతరలు దొంతరలుగా పేర్చి

నడుమ పూవులతో కలకలలాడు చెట్టుకొమ్మలను చిన్నవి నిలువుదురు. అట్లు అలంకృతములై కంటికింపు గూర్చు ఆపదార్థములను చుట్టపక్కములతో ఇష్టాగోష్ఠి సల్పుచు కడుపు కింపుగా భుజించి కొరియావారు పండుగ జరుపుదురు.

కొరియా దేశమునందలి శీతోష్ణస్థితి మెచ్చదగినది. ప్రపంచమునందలి ఆరోగ్యవంతములైన దేశములలో కొరియా యొకటియని భూగోళశాస్త్రపండితులు నొక్కి పలుకుచున్నారు. సంవత్సరము పొడుగునను శీతోష్ణములు ఇంచుమించు ఒక్కలాగునే యుండును. కావున అచ్చటి స్త్రీపురుషులు బాగుగా పాటుపడగలవారై ఆరోగ్యవద్దేహులై యుందురు.

అచ్చటి పురవీథులందు నడచువారిలో విశేషము పురుషులే అయియుందురు. కాని స్త్రీలు తఱచు గానరారు. ఒకరిద్దఱు గానవచ్చినను వారు సాధారణముగ దాసివాండ్రును, తక్కువకులమునకు చెందిన స్త్రీలును అయియుందురు. వారు వాగులందు వస్త్రము లుదుకుకొనుటకో లేక నూతులనుండి జలము చేదుకొనుటకో పోవుచుందురు. వ్రేలాడుబురఖా, టోపీలు పెట్టుకొని నడిచిపోవుచుండు పురుషులు వారిని గమనింపనే గమనింపరు.

కొరియా దేశమున వివాహకర్మములు పేర్కొనదగినవి. కన్యలను ఘోషాలోనుంచు ఆచారము ఆదేశమున బహుళము. వారివివాహములు ప్రాయికముగా తల్లిదండ్రులే మధ్యవర్తుల సాహాయ్యమున నిర్ణయింతురు. సాధారణముగ బాలికలకు ఆఱు ఏడు సంవత్సరములువచ్చినతోడనే ప్రధానము చేయుదురు. పదమూడు పదిహేను సంవత్సరములు వచ్చుటతోడనే వారికి వివాహముచేయుదురు. వివాహమునకుముందు ఎఱుకచెప్పు స్త్రీతో సంప్రదించి ముహూర్తనిశ్చయము కావింపబడును. గతించిన తనకొలముసాములను తలచుకొని అప్పుడు పెండ్లికుమారుడు తానుపరిణయ మాడబోవు విషయము వారికి నివేదించును. వధూవరుల ఉభయుల గృహములందును విందులు ఏర్పాటుచేయబడి బంధుజనులు రావింపబడుదురు. వివాహానంతరము వధువు తనభర్తయింటికి కొంపోవబడును.

పాశ్చాత్యనాగరకతాప్రచారము సోకినపిమ్మట కొరియాదేశమున అనేకమైన మార్పులు కలిగినవి; కలుగుచున్నవి; కలుగనున్నవి.

# బాలభాష

శ్రీయుత వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే

సంపాదితము

౧

ఉత్తముని పేరేమి? ఊరి పేరేమి?
సత్యపురుషులగన్న సాధ్వి పేరేమి?
ఉత్తముడు దశరథుడు ఊరు అయోధ్య
సత్యపురుషులగన్న సాధ్వి కౌసల్య.

* * *

శ్రీరామ! జయరామ! శృంగారరామ!
కారుణ్యగుణధామ! కళ్యాణనామ!
జగతిపై రామయ్య జన్మించినాడు
సత్యమ్ము లోకాన స్థాపించినాడు
తల్లిదండ్రులమాట చెల్లించినాడు
ఇల్లాలితోపాటు హింసపడ్డాడు
సీతామహాదేవి సృష్టిలోపలను
మాతల్లి వెలసింది మహనీయురాలు,

* * *

దండమ్ము దండమ్ము దశరథరామ!
దయతోడ మముగావు దాక్షిణ్యధామ!

౨

విఘ్నమ్ము లేకుండ విద్యనియవయ్య
విఘ్నేశ్వరుడ నీకు వేయిదండాలు.

---

సరసకవితాధురీణులును, సంస్కృతాంధ్ర సారస్వత నిష్ణాతులును, ఆంధ్రపరిశోధకశిఖామణులును నగు శ్రీయుత వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చిరప్రయత్నముచే ఏర్చికూర్చియున్న ఇట్టి మనోహరగేయములను గృహలక్ష్మి పత్రికాముఖమున లోకమునకు అందజేయ దయతో నంగీకరించియున్నారు. ఇకమీద ప్రతిమాసము ఆమధురరచనములను భాగములుభాగములుగా నిందు వెల్వరించుచుందుము.

౩

ఉంగరమ్ములు పెట్టి ముంగురులు దువ్వి
ఒద్దపెట్టుకు తల్లి ముద్దులాడింది
పలకబలపము లిచ్చి పద్యాలు పాడి
సరసపెట్టుకు తండ్రి చదువు నేర్పాడు.

౪

పిల్లలందరు రండి బళ్లోకి పోయి
చల్లన్ని గాలిలో చదువుకొందాము
విసరు విసరూ గాలి విసరవే గాలి
మల్లెపూవుల గాలి మామీద విసరు.

౫

చదువంటె అబ్బాయి చండికేశాడు
బద్దెపలుపా రావె బుద్ధి చెప్పాలి
చదువంటె అబ్బాయి సంతోషపడును
అగసాలి రావయ్య నగలు చెయ్యాలి.

౬

అరటిపండూ తీపి ఆవుపాల్ తీపి
మా చిన్ని అబ్బాయి మాటల్లు తీపి

౭

చదువుకో నాయన్న! చదువుకో తండ్రి!
చదువుకొంటే నీకు సౌఖ్యమబ్బేను!
ఆడుకో నాయన్న! ఆడుకో తండ్రి!
ఆడుకొంటే నీకు హాయికలిగేను!

* * *

పొరుగుపిల్లలతోను పోట్లాడబోక
ఇరుగుపిల్లలతోను యేట్లాడబోక
చక్కగా నీచదువు చదువుకో తండ్రి!
చదువుకొంటే నీకు సౌఖ్యమబ్బేను!



శ్రీశంకరాచార్యుల కాలములో స్త్రీవిద్యా ప్రాముఖ్యత.—

జానునెల పదియవ తేదినాటి 'త్రిలిఙ్గ' పత్రికలో ఆయుర్వేద మార్తాండ భిషగాచార్య పండిత హెచ్. సుబ్బరాయశాస్త్రి గారిట్లు వ్రాయుచున్నారు.—

"శ్రీశంకరుని కాలములో ఉత్తర హిందూస్థానమందు మండన మిశ్రులని కర్మమార్గములో ప్రామాణ్యము వహించిన పండితోత్తముడుండెను. ఇతడు సన్యాసుల ద్వేషించువాడు. శ్రీశంకరులవారు యితని శాస్త్రవాదమున నోడించవచ్చిరి. మండనమిశ్రులవారి ఇంటిలో మహాసరస్వతియే భారతియను పేర భార్యగా నుండెను. శ్రీశంకరులును మండనమిశ్రులవారును హోరాహోరిగ పోరి పోరి తుదకు వాగ్వివాదములోదిగి గెలిచినవారి ఆశ్రమము ఓడిపోయినవారు స్వీకరింప వలెనని పందెము వేసుకొనిరి. ఈవాదము పరిష్కరించు న్యాయాధిపతి యెవరు? భారతినే ఉండుమని యిరువురును కోరిరి. ఏ కాలములోనేని, ఏ చరిత్రలోనేని ఆడుదానిని అందులో ఒకపక్షపువారి భార్యను మధ్యవర్తినిగా నియమించిన చిత్రముకలదా? దీనిచే స్త్రీలకెంత గౌరవము, స్త్రీవిద్యకెంత ప్రాముఖ్యము శంకరుని కాలమున నుండెనో తెలియనగును."

పసిబిడ్డలను ముద్దుపెట్టుకొనుట:—

పై విషయమును గూర్చి ఒక సుప్రసిద్ధవైద్యుడు 'టైమ్సు ఆఫ్ ఇండియా' దినపత్రికలో నిట్లు వ్రాయుచున్నాడు.—

"పసిబిడ్డలను, పిల్లలను ముఖములమీద, పెదవులమీద ముద్దుపెట్టుకొను అలవాటు బహుళముగానున్నది. అది మిక్కిలి అనారోగ్యకరమైన అలవాటు. అపరిశుద్ధమైన ఉచ్ఛ్వాసవాయువును—అది బహుళః రోగకరములైన సూక్ష్మక్రిములతో నిండియుండును—పిల్లలనోళ్లలోనికి వదలుటయుగలదు. పెద్దవారు తమకు పిల్లలపైగల మమకారము కొలదియు నిట్లుచేయుచున్నారు; అంతియే కాని అది వారికి హానికరమైనదని తెలిసికొనిగాదు. అనారోగ్యకరమైన ఈలాలనవలన ఊపిరితిత్తులకు సంబంధించిన వ్యాధి పిల్లలకు గలిగిన సందర్భములు నే నెఱుగుదును. ముఖము, పెదవులు వీనిని ముద్దుకొనుట కంటె శిరము, భుజములు, రొమ్ము వీనిని ముద్దుగొనుట క్షేమకరమైనది.";

ఆంధ్రదేశమున స్త్రీవిద్యాలయములు.—

పంజాబు నందలి జలంధరునగరములోని కన్యామహావిద్యాలయమును గూర్చి ప్రస్తావించుచు జూనుమాసపు 'భారతి' పత్రికలో ఏతత్పత్రికాసంపాదకులు తెలుగు మాగాణిలో స్త్రీవిద్యాలయములను గూర్చి వ్రాసిన దిగువ వాక్యములు ఆదరణీయములును, అందుచే అవశ్యాచరణీయములును నై యున్నవి.—

"వ్రాతలలో మాటలలో స్త్రీల యభివృద్ధి యెడ సానుభూతి చూపుచున్న ఆంధ్రులందరును జాతి మత భేదములను దూరమునుంచి తెలుగుదేశము నందంతటను చాలినన్ని స్త్రీవిద్యాలయములను నెలకొలుపుటకై నిరంతరము కృషిచేయవలెను. వీరికృషికి జమీందారులు, ఇతర సంపన్నులు స్వార్థములు, తుచ్ఛములు నగు నైహికసుఖములను సమకూర్చుకొనుటకయి వినియోగించు తమ యమూల్యసంపదయందు కొంతయేని తోడుచేసి ఆవిద్యాలయములు స్థిరప్రతిష్ఠములగునట్లు చూడవలెను. ఇట్లు నెలకొన్న విద్యాలయములయందు స్త్రీజాతి సర్వతోముఖాభ్యుదయపరంపరకు వలసిన యెల్ల విద్యలను జాతీయ విధానముల ననుసరించి బాలికలకు నేర్పవలెను. ఇంతయు పొసగినచో మనసోదరీమణులకు మేలుకలుగ గలదు."

మానవజాతికి అత్యంత శత్రువగు ఇంటియీగ.

'లిబర్టి' అనుపత్రికలో నిట్లు వ్రాయబడియున్నది:—

మనుజునకున్న శత్రువులలోని కెల్ల ఇంటియీగయె అత్యంతశత్రువని చెప్పినచో చాలమంది కది యవిశ్వసనీయమైన యతిశయోక్తిగ నగపడును. అదిచూచుట కెంతో అపాయము లేనిదిగ కాన్పించును. అంటుగట్టునదియు, రక్తముపీల్చునట్టిదియు నగు యితరజాతి యీగలవలెనది యెన్నడును కుట్టుచున్నట్లగపడదు. ఈగ మనుష్యుని ఏలాగున గాయపరుపగలదు? కందిరీగవలె దానికి కొండిలేదు. పెద్దపులి, చిరుతపులి, తోడేళ్లవలె దానికి గోళ్లుండవు. దోమలవలెనది నెత్తురు పీల్చదు. అయినను అది మనుష్యునకు యన్నిటికంటె యెక్కువ అపకారమొనర్చునట్టి ప్రబలశత్రువని యెంచబడుచున్నది. కారణమేమన నది వ్యాధిని ఒకరినుండి మరి యొకరికి వ్యాపనముచేయునట్టి జంతువగుటచేత. సృష్టిలో నపరిమితముగనున్న యీజంతువు నాగరకజనుని ప్రపంచమందలి ప్రతిభాగములోనికిని యెట్లు వెంబడించి, ఇంటిలో యితర చీడ పురుగులకన్నను యెక్కువగా నెట్లు వ్యాధిని కొనిపోవుటలో పాలుపడుచున్నది సూక్ష్మదర్శినీయంత్రము మనకీవరకె తెల్పినది. జంతువిషయ శాస్త్రజ్ఞానము ఈ కాలములో మనకు బాగుగ నీవిషయమును భోదించుచున్నది.

ఈగలు గ్రుడ్లనుండివచ్చును. తల్లియీగ దాని గ్రుడ్లను దుర్గంధభూయిష్టమగు నొకచోటున పెట్టును. గుఱ్ఱపుశాలలు, ఆవులకొట్టములు, పందులు పడుకొనుతావులు, పాకీదొడ్లు మొదలగునవి అటువంటిచోట్లు. ఇట్టి చోట్లేతల్లియీగకు ప్రియమైనవి. చచ్చినజంతువు కుళ్లిపోయిన ఆకులలములును గూడ దానికిసరిపడును. గ్రుడ్లనుండి పురుగులువచ్చును. ఇవి గ్రుడ్లు పెట్టబడిన చోట్లనే అభివృద్ధినొందును. కొంతకాలములో నివి చిన్నపిల్లలై చివరకు పెద్దయీగలగును. ఇంటియీగ మధ్యమధ్యకొన్ని గుంపులుగ నాలుగైదుసారులు గ్రుడ్లుపెట్టుననియును, మొదటిసారి 150, తరువాత 100, అంతకంటె తక్కువగాను గ్రుడ్లుపెట్టునని శాస్త్రజ్ఞులు చెప్పెదరు. ఈగలకు అనుకూలమైన తావులలో ఆపెట్టినగుడ్లు పెట్టినకొన్నిగంటలలోనే పగు

లును. పుట్టిన తొమ్మిదిలేక పదిరోజులలోనే పెద్దదై అది గ్రుడ్లను పెట్టుటకు మొదలిడును. కనుక మిక్కిలి అనుకూలమైన గాలిగల ఒకనెలలో, ఒక్కయీగదంపతుల కుటుంబవృద్ధి 500 వరకున్ను రెండుమాసములలో నాసంఖ్య 250 సార్లు 500 లును మూడునెలలలో కొన్ని లక్షలున్నుకాగలవు,

ఈగల గుంపుకును, రోగవ్యాప్తికిని సంబంధము ఉన్నదని పూర్వకాలమునుండియును చాలమంది యభిప్రాయమైయున్నది. ఇంటిఈగ దుర్గంధపు తావులందు పెరుగుట అంత యెక్కువలోనిదికాదు. కాని, మనుష్యుని జీవితమునుబట్టి యాలోచించినచో దాని యనంతరజీవితము విడుపులేని యొక హీనజీవితమైయున్నది. ఈగలు వాని బంధుగులగు తేనెటీగల మాదిరి పూదేనెను మాత్రమే తమ యాహారమునకు సరిపెట్టుకొనవు. మానవజాతి యారోగ్యమున కపాయకరమైన పురుగులు మూగియున్న మలము, ఉమ్మి, కుళ్లిపోయిన పదార్థములున్ను వాని యాహారములో చేరును. తినునప్పుడు అది ఆహారముపైవాలును. అది తనకుతాను పలుమారు పరిశుభ్రము నొనరించుకొనుచున్నను, సెంద్రుకమయమైన దాని కాళ్లు పురుగులను వ్యాపింపజేయును. వాలిన చోటులలోనెల్ల అది యప్పుడప్పుడు మలమును నల్లని స్వల్పమరకలను వదలివెళ్లునట్టి పాడు అలవాటొకటి దానికి కలదు. ఇట్టి మరకలు గోడలమీదను, కిటికీలలోను, ఇండ్లకప్పులందును, ముఖ్యముగా మనుష్యులు విశ్రాంతి తీసికొనుట కుత్సాహపడెడి ఉయ్యేలలమీదను, కానవగును. అది అన్నముు తిను విధము అన్నము మీద దానియుమ్మిని అపరిమితముగా విడుచుచు తిరిగి పీల్చుకొనుచుండుటయే. అది అన్నముమీద విడిచిన రసములో తరచుగా సూక్ష్మజీవులు ఉండును. బజారులోను, అంగడిలోను, వంటయింటి యందును, ఇంటియీగలు తమకు అవకాశము దొరికినప్పుడెల్ల మన యాహారమును అపరిశుభ్ర మొనరించుచుండును. కనుక లక్షల కొలది జనులు ఈ యసహ్యజీవరాశియొక్క పీడకు గురియగుచున్నారు. పట్టణములలో ఈగలు ముసరకుండునట్లు తన యాహారమును కప్పియుంచడేని, అతడు తన భోజనముతో లోపలికిగొనని ముతికియేయుండదన్నమాట. హిందువులలో కొందఱు తక్కువకులమువారు ముట్టికొనిన యాహారమును యంటనేఅంటనివారున్నారు. అట్లే జనులు, ఇంటియీగలు వాలిన యాహారపక్షమున గూడ నవలంబించిన బాగుండును.

కలరా, జీర్ణజ్వరము, గ్రహణి, నీళ్ల విరేచనములు, మశూచికము, కుష్ఠు మొదలగు పెక్కుఅంటువ్యాధులకు మూలకారణమగు సూక్ష్మజీవులను ఒకచోటనుండి మరియొకచోటికి ఒక జంతువునుండి మరియొక జంతువునకును ఒకమనుష్యునినుండి మఱొక మనుష్యునకును తీసికొని పోవునవి ఈగలే. ఒకయీగ ఒకమనుష్యుని జబ్బుకంటి మీదనుండి మరొకని మంచి కంటిమీదికి యెగురవచ్చును. అదియొక బిచ్చగాని పుండుపైనుండి యొక చంటిబిడ్డ యవయవములపై వ్రాలవచ్చును. అది కలరా తగిలిన యొకని యుమ్మి లేక మూత్రము పైనవ్రాలి యక్కడనుండి నేరుగా పొరుగువానియింటికిపోయి తరచుగా మూసియుంచని యతని యన్నముపై వ్రాలుట తటస్థింపవచ్చును.

ప్రకృతియందు ఈగలయొక్క యుపయోగము కొంతయైన లేదా? అని ఒక ప్రశ్నతఱచు అడుగబడుచున్నది. ఇతరజాతి యీగల గుంపులతోబాటు అవికూడ పాకీవాండ్ల పనులకు తోడ్పడుచున్న మాట నిజమే. కాని జబ్బులువచ్చుటకు తోడ్పడునట్టి వాటికీడు అవిచేయులాభమును మించిపోవుచున్నది. ప్రపంచమునకు ఈగలయొక్క యుపయోగము అతి స్వల్పము. ఒకవేళనున్నచో అవి కొన్ని పక్షులకును పురుగులకును ఆహారమగుటయే. ఇంటి యీగ కాన్పించుటయే అక్కడ ఎదో కొంతమురికియున్నదని తెలియజేయును. ఈగల బాహుళ్యము మురికియొక్క హెచ్చునుగాని మురికి సమీపములో నున్నదని గాని తెలుపును.

కావున, హిందూదేశమందలియన్ని యరణ్యమృగములయు, పాములయొక్క మొత్తముకంటె ప్రబల విరోధులగు ఇట్టి శత్రువుల బారినుండి మనలను రక్షించుకొనుటకు మన మేమిచేయగలము? మతము నిషేధింపనిచోట, ఈగలను నాశనమొనర్చుటకు ఇంటిలో చేయదగిన సాధనముల నవలంబింతము. అట్టి సాధనములలో నొకటి మన యెంగిలియన్నము, కుళ్లిపోవునట్టి చెత్త మొదలగు వాటిని తొట్లలోనుంచి వాటి మీదికి తల్లియీగలను ముసరునట్లుచేయుట. వంటయింటి అన్నివిధములైన చెత్తచెదారము గోధుమవన్నె రంగుకాగితపు సంచులలో పడవేసి వాటిని కొన్ని రోజులపాటు ఇంటిచుట్టునున్న బయలున అక్కడక్కడ ఉంచి తల్లియీగలు వాటిమీద ముసరునట్టుచేయవలెను. అటువంటి చెత్తచెదారము పెట్టిన మూడవరోజే పాతివేయవలెను. ఈగబోనులు, విషము, ఈగలనాశనమునకు ఉపయోగింపవచ్చును. ఒక పళ్లెముమీద యీగ కాగితముఉంచి దానిమీద నీరుపోసినచో ఆనీరు విషపూరితమగును. ఈగలు దానిమీదవాలి దానిని రుచిచూడగనే చచ్చిపడును. 'ఫార్మల్ డిహైడ్' అనుమందును ఒకగిన్నెడు పాలలో వేసినచో ఆపాలును అదేపనిని (నాశనము) చేయగలవు. ఒకగిన్నెడు తేనీటిలో ఒకడ్రాము బైక్రొమేట్ అఫ్పొటాషు వేసినచో నదియును ఆగుణముకలదగును. గ్లాసుతో చేయబడిన యీగబోనులు చౌకగదొరకును. వాటి సహాయమున ప్రతిదినము నూర్ల కొలది యీగలను చంపవచ్చును. మరి యొకమార్గము అంటుకొనునట్టి కాగితమును గోడకు కొట్టియుంచుట. కొందతీకి, బడితెలు, బల్లెములు మొదలగు ఆయుధములతో పాములను చంపుట కంత యభ్యంతరముండదుగాని, ఈగలను చంపుటకు ఆహారములోను, పానీయములోను విషముకలపుట యన్నమాటయే యెంతో అయిష్టముగ నుండును. ఇంటియీగయే ఆహారమును విషమయముగ జేయునట్టిది. కనుక పాములు మొదలగు భయంకరమృగములకంటె నదియే యెక్కువ ఘాతుకమృగమైయున్నది.

కావున మనము అన్నిటికంటె యెక్కువగా యింటి యీగలకే భయపడుచు ఈ క్రింది నియమములను పాటింతము.—

1. ఆహారమును, వస్తువులను మూతలువేసి యుంచని యంగడులనుండి యెవ్వరును కొనరాదు.
2. ఈగల నాకర్షించెడి చెత్తచెదారమును సాధ్యమైనంతవరకు యింటికి కొంతదూరములో నుంచుచు యీగలను యింటిలోనికి జేరనీయరాదు.
3. ఇంటిలోనున్న యీగలను విషముతోగాని బోనుల సహాయమునగాని చంపివేయవలెను.
4. ఆహారపదార్థముల నన్నిటిని మూసియుంచి యీగలువానిపై వాలకుండునట్లు చేయవలెను.
5. నిద్రబోవు బిడ్డపైని సన్నని వలువను కప్పవలెను.
6. ఈగగ్రుడ్లునాశనమగు లాగున వీలైనన్నిసారులు ఇంటికి సున్నము కొట్టుచుండవలెను.
7. గుఱ్ఱపుశాలలను, ఆవులకొట్టములను, పాకీదొడ్లను యెల్లప్పుడును పరిశుభ్రముగానుంచవలెను.

**భారతరమణుల కొక బహిరంగలేఖ.—**

మేమాసపు "ప్రబుద్ధభారత" పత్రిక ఇట్లు ప్రచురించుచున్నది.—

రమణీమణులారా!

భారతదేశపు భవితవ్యము పురుషులపయికంటె వనితలపై హెచ్చుగా నాధారపడియున్నదను స్వర్గీయులగు వివేకానందుల వారి సునిశ్చితాభిప్రాయము. ప్రాణములను బాసినపతిని అనుగమింపగోరి సంతోష చిత్తముతో మండుచితిని దుమికిన సాహసికురాలు హైందవకాంత. హైందవస్త్రీల ఓరిమికి, అనసూయతకు పతిభక్తికి లోకమాతయగు సీత నిదర్శనము. సావిత్రి గూడ నట్టిద. ఈశ్వరారాధనకేళికౌతుకపరాయణయై మణిభూషణములు దిగద్రావి తపస్సమాధి నొందిన ఉమాకన్య భారతసతీత్వమునకు ప్రబలనిదర్శనము. మరియే దేశ పురాణములందుగాని ఇట్టి స్త్రీరత్నములకు సములగు వారుండిరా?

నాగరికత—పవిత్రత—యివి నిలుపవలసిన వారు ఏదేశమునగాని స్త్రీలే. ఒకరిద్దరు పురుషులు మతప్రవర్తకులు గావచ్చును. కాని ప్రాయికముగా వారిలో పెక్కురు పొట్టకోసము తడుముకొనుటలోనే మునిగి తేలుచుందురు. పురుషునకుజ్ఞానము తేజమునిచ్చునది గృహము. గృహముయొక్క గౌరవము స్త్రీలచేతులలో నున్నది. కర్మక్షితియందు బుట్టిన రమణీమణులగు మీకు రాముని, శ్రీకృష్ణుని, శంకరాచార్యుని ప్రతిభకు వారితల్లులు ఎంతవఱకు కారణభూతులో తెలియకపోదు. ఆడంబరరహితమైన జీవితము—శాంతియుతమైన చిత్తము—గలిగి తపస్వినులవలె గృహపరిపాలనము చేయుచు భారతస్త్రీ విలసిల్లినది. దేశము మతమువీనికొఱకు జరిగిన కత్తులయుద్ధములకంటె భారతస్త్రీల ఆత్మవిశ్వాసమే మనదేశమును మన మతమును కాపాడినది.

ఈనాడు భారతధర్మము అడుగంటు సూచనలు గాన్పించుచున్నవి. దానిని అడుగంటకుండచేయ వలసిన భారము స్త్రీలపై నిలచియున్నది. ఆభారమును వారెట్లు నిర్వహింపగలరు? తమ పుత్రులయందు తిరిగి బ్రహ్మచర్య వ్రతావలంబనమును పురిగొల్పుటవలన భారతయువకులు బ్రహ్మచర్యవ్రతావలంబులై కీర్తికెక్కుచో నేడు అధమ స్థితియందున్న భారతమాత కొలది దినములలో మహాభారతమాతయై సరివారిలో తలవంపులు లేకుండ తిరుగగలదు. ఆపుస్థితులు కల్గించు ప్రజ్ఞ భారతస్త్రీలయందే యున్నదని మనవిచేయుచున్నాను"— ఇట్లు, సోదరినివేదిత.

**స్త్రీవిద్య—గ్రంథాలయములు.—**

అను విషయమును గూర్చి అంగలూరునందలి శ్రీబాల సరస్వతీ పుస్తక భాండాగార ప్రారంభోత్సవమునకు అధ్యక్షత వహించిన శ్రీరాజాశివప్రసాద్ బహద్దరుగారు తమ ఉపన్యాసములో నిట్లు చెప్పియున్నారు.—

దేశౌన్నత్య మంతయు స్త్రీలమీదనే ఆధారపడియున్నది. వారు భావిసంతతి వారికి మాతలు గావున ప్రఖ్యాత చరిత్రుడగు నెపోలియను "శిశువు పుట్టుటకు పూర్వము యిరువది సంవత్సరములనాడే జ్ఞానోపార్జన చేసియుండవలెను. అనగా తల్లి సంపూర్ణవిద్యావతిగ నుండవలెను." అని చెప్పినాడు. హిందూ వనితలలో విద్యాగంధమే కలిగినవారు స్వల్పసంఖ్యాకులు. అయినను ఆంధ్రవనితలు విజ్ఞానార్జనమునందు ఇతరదేశ

స్త్రీలవలె ముందంజవేయు సూచనలు కనుపట్టుట ప్రశంసనీయము. గ్రంథాలయములు పురుషులకన్న స్త్రీలకే ఎక్కుడు లాభకారిగ నుండవలెను. గ్రంథాలయ కార్యనిర్వాహక సంఘము వారు స్త్రీ విద్యాభివృద్ధికి పాటు పడనిచో గ్రంథనిలయ స్థాపనోద్దేశ మెప్పటికిని చేకూరదని హెచ్చరించు చున్నారు."

వితంతూద్వాహములు.—

కదిరి తాలూకా కొండకొమర్ల గ్రామమున జరిగిన రెడ్డిమహాజనసభలో సభాధ్యక్షులగు శ్రీమాన్ చింతల రఘునాథరెడ్డివర్మగారు నుడివిన క్రిందివాక్యములు స్త్రీ జనోద్ధరణమునందు వారికిగల అభిరుచిని వెల్లడించుచున్నవి: —

"శతవర్షములు జీవితసుఖము ననుభవింపవలసిన స్త్రీలోకమున కొందరు యువతులు వితంతువులయినపుడు వారిని జన్మాంతరము వరకు నిర్బంధవైధవ్యమునకు గురిచేయుటయు నొకవిధమగుపాపమే. ఇందుచే వ్యభిచారదోషము హెచ్చును. భ్రూణహత్యలు పెరుగును. స్త్రీహింసలు సంఘటించును. కాన నిట్టి ఘోరకష్టలను తొలగించుటకై వితంతువులలో నిష్టమున్న వారికి బునర్వివాహము గావించుట యుచితము. ఈకారణములచే నేను రమారమి యేబదిమంది యనాథయువతులకు పెండ్లిండ్లు చేసినాడను. పురుషులకులేని యీ రెండవవివాహ సంబంధమగు నాటంకము స్త్రీలకేలదాపురించెనో తెలియరాదు. మహ్మదీయ క్రైస్తవ మతములలో నీ నిర్బంధము లేనేలేదుకదా?"

స్త్రీవిద్య—పల్లెటూరి పడుచులు.—

ఈశీర్షికక్రింద శ్రీమతి ఈడుపుగంటి వేంకటరత్నమాంబగారు జూను 7 వ తేది నాటి 'సత్యసాధని' లో వ్రాసిన దిగువ వాక్యములు ఎంతయు సత్యములై తనరుచున్నవి.

"పట్టణవాసులలో పురుషులలోవలె స్త్రీలలోగూడ కొంతవఱకు విద్యావ్యాప్తియున్నది. పల్లెలలో నున్న స్త్రీజనము విద్యలో బొత్తుగా వెనుకబడియున్నది. విద్యాధికుడైన పురుషుడు విద్యావిహీనురాలైన యొక పల్లెటూరి పడుచును తన సతిగా గ్రహించినప్పుడు, వారిరువురకు అనేక విషయములలో పొసగక, ఏటి కొక రీఢ్చిన కోటికొక రీడ్చుట అనేకులకు అనుభవనీయమే. కనుక భర్త విద్యావంతుడైనప్పుడు, భార్య కూడ తదనుగుణ్యముగా విద్యావతియైననే దప్ప, ఆదాంపత్యము సుఖదాయకముగా నుండదు. లేనియెడల ఒకరికి అమృతతుల్యమైన విషయము రెండవవారికి కాలకూటముగా దోపవచ్చును. సతీపతులిద్దరు డొక్కశుద్ధి లేనివారైనచో దాంపత్యము అనుకూలముగానే యుండవచ్చును. గాని విద్యావిహీనతవల్ల గలిగెడి పైన పేర్కొనబడియున్న చెడుగులును, దేశాదృష్టపు ఫలితములును బోవు టెట్లు? కనుక స్త్రీపురుషు లిరువురును సరిసమానముగా విద్య నేర్చుకొనుటయే యగత్యముగా సిద్ధాంతీకరింపబడుచున్నది. పట్టభద్రులగు వఱకు విద్య నభ్యసించినను, మనదేశపు యువకులు తాము పుస్తకములలో చదివినట్టియు, తమ యుపాధ్యాయుల వల్లబోధింపబడి తముచే నమ్మబడినట్టియు, సత్యములు, సూత్రములు ఏమాత్రమును కష్టసాధ్యములుగానప్పుడు కూడ వారు ఆచరణలో పెట్టుటకు వెనుకంజవేయుట సర్వసాధారణముగా మనమందరము చూచుచునే

యున్నాము. వీనికి కారణమేమిటి? కాటికి కాళ్లు చాచుకొని నవీనకాలపరిమాణమును గుర్తింపజాలని ఏమూలలోనున్న ముసలమ్మయో, లేక మేడిపండువలె పైకిమాత్రము మస్తాబైయుండి, నిరక్షరకుక్షియైయున్న తన ప్రియసతియో సదా తన కడ్డుదగులుచునే యుండును. వారిని ధిక్కరించి, లేక వారికి నచ్చజెప్పి, మంచివని తాను తెలిసికొని, నమ్మిన విషయములను ఆచరణలో బెట్టుట కాయువకునకు ధైర్యస్థైర్యములుగలవా? వారికి తానెన్నటికిని మంచిమాటలతో నచ్చజెప్పలేడు. తానుజెప్పెడి దర్థముచేసుకొనెడి మనశ్శిక్షణ వారికెక్కడిది? తాను వారిని ధిక్కరించి, బెదరించి యేకార్యమునైన జేయ సాహసించినచో, ఏనూతిలో, ఏగోతిలో వారు తమ త్రోవచూచుకొందురు. ఈ విషయములన్నియు సదా మనము పల్లెలలో చూచుచునేయున్నాము. తత్ఫలితముగ స్త్రీజనము మాట యటుంచగా ఈకాలపు యువకు లనేకులు తమ విద్యవలన పొందవలసిన లాభమేమియు తమకు వ్యక్తిపరముగా గాని, తమ దేశమునకు గాని గడించలేకుండా యున్నారు. విద్యాధికుడైన యువకుడు విద్యావిహీనురాలైన తన స్త్రీవల్లసదా క్రుంగుచున్నాడు. రాజకీయములలోగాని సాంఘిక మత సమస్యలలోగాని తాను భావోద్రేకముగలవాడై ఉన్నతాశయములలో నోలలాడ దలచుకొన్నప్పుడెల్లను, అక్షరజ్ఞానము లేని యవివేకియైన తన భార్య మాట మనసునకు గోచరించి నిలువున నీరైపోవును.”

## అల్యూమినము గిన్నెలు హానికరములు—

శ్రీయుత సి. టి. బీట్సుగారు ‘హెల్తు మెసంజరు’ అను పత్రికలో నిట్లు వ్రాయుచున్నారు:—

“ఒకరోజున నేను సోడానీళ్లను అల్యూమినము గిన్నెలో పోసితిని. అప్పుడవి బుస్సునపొంగినవి. వానినే మఱియొక గాజుగ్లాసులో పోయగా ఏమియు పొంగలేదు. అల్యూమినము పాత్రలలో పదార్థముల నుడికించినచో అల్యూమినము ఆ పదార్థములలో మిళితమగుననియు, నందువలన నారోగ్యము చెడిపోవుననియు అప్పుడు నాకు తోచినది. ఇంతకు కొంతకాలమునకు ముందు నాకుచేసిన జబ్బునకు కారణము మాయింట అల్యూమినము పాత్రలలో వంటచేయుటయే అయియుండునని నేను నిజమూరసితిని. ఈ విషయము సత్యమో కాదో సమాలోచించుటకు విశ్వప్రయత్నము చేసితిని. మామూలు నీటిని అరగంటసేపు అల్యూమినము గిన్నెలో పోసి మరగించి దానిని పిమ్మట నొక స్వచ్ఛమైన గాజుగ్లాసులో పోయగా నాసంశయము తొలగిపోయెను. అల్యూమినం ఆనీళ్లలోకలిసి అల్యూమినం హైడ్రాక్సైడు అను విషమును నీళ్లలో కలుగచేసినదని స్పష్టముగ తెలిసినది. ఇతర పదార్థములను అల్యూమినం గిన్నెలలో నుడికించినచో వానిలోగూడ నిటులే జరుగుననిగూడ తరువాత పరీక్షించి నేను కనుగొంటిని. అల్యూమినం కడుపులో వాయువును కలిగించునను విషయమును వైద్యులుకూడ పెక్కు రంగీకరించియున్నారు.”

తక్కువధరకుదొరకుచున్నవి కావున మనవారు అల్యూమినము పాత్రములను విశేషముగ వాడుచున్నారు. కాని అవి అనారోగ్యకరములను విషయము వెల్లడియైనది. అగుట నీ పాత్రల వాడుక త్వరలో తగ్గించి జాతీయారోగ్యమును పెంపొందించవలసిన భారము స్త్రీలపై [illegible]యున్నది.

# వనితాలోకము

శ్రీమతి భక్తి అధికారి:—

ఈమె బెనారసు హిందూ విశ్వవిద్యాలయమున వేదాంత శాస్త్రోపన్యాసకులగు ఫణిభూషణ అధికారిగారి కడగొట్టు తనయ. ఈ సంవత్సరము ఆవిశ్వవిద్యాలయము వారి పట్టపరీక్షలో ఈమె ప్రథమురాలుగా నెగ్గినది. ఫణిభూషణుగారి పుత్రికలు నలుగురును ఉన్నత విద్యాధురీణలే. అందు జ్యేష్ఠురాలు పాఠశాలలోను కళాశాలలోను ఉజ్జ్వల మెప్పునందుచు విద్యగఱచి ఎం. ఏ. పరీక్షప్యాసుచేసి ఉపాధ్యాయినీ[illegible]నవలంబించి యున్నది.

డాక్టరు మార్తాశేషమ్మగారు:—

డా. మార్తాశేషమ్మగారు రెడ్డిజన సంఘము వారి ఉపకారవేతనము బడసి మదరాసులోని వితంతుశరణాలయమునందుండి యల్. ఎం. పి. వైద్యపరీక్షయందుత్తీర్ణురాలై నెల్లూరు జిల్లాబోర్డు ఆసుపత్రిలో కొంతకాలము పనిచేసినది. ఇపుడు రాయపురం ప్రభుత్వ వైద్యశాలయంకు సబుఅసిస్టాంటు సర్జనుగ నియమింపబడెను. ఈమె బాలవితంతువు. నెల్లూరుజిల్లా వాస్తవ్యురాలు. రెడ్డికులమునకు జెందినది.

బాలసుబ్రహ్మణ్యచెట్టిగారి సతి.—

దేవాంగస్త్రీల మహాసభా ఆహ్వాన సంఘాధ్యక్షురాలు కోయంబత్తూరుజిల్లా విద్యాసంఘసభ్యురాలు, ఆనరరీ మేజస్ట్రీటు.

శ్రీమతి రాధాకృష్ణమ్మగారు.—

నెల్లూరుజిల్లాబోర్డు విద్యాసంఘసభ్యురాలుగా నియమింపబడెను.



శ్రీమతి రాధాకృష్ణమ్మగారు

ఇ. పెరైరాసతి, ఎం. ఏ.—

చిత్తూరుజిల్లా విద్యాసంఘ సభ్యురాలుగ నియమింపబడెను.

తంబుచెట్టిగారి కుమార్తె.—

ఫిడేలు వాద్యమునందు ఎక్కువ కృషి జేయుటకుపారిసు నగరమునకు బోయెను. లండనులోని గానకళ నేర్పు ట్రినిటీకాలేజియందు ఫెలోషిపుబడసెను. మైసూరుమహారాజాగారి హుజూరు కార్యదర్శి తంబుచెట్టిగారి కుమార్తె.

టి. వి. మాధవన్ సతిగారు:—

ట్రివేండ్రము అక్కౌంట్సు ఆఫీసులో ఉద్యోగము చేయుచున్నది. తిరువాన్కూరు ప్రభుత్వపు సెక్రటరీయెట్ కార్యాలయములో నియమింపబడిన ప్రథమ స్త్రీ.

అన్నా చాండీసతిగారు, ఎం. ఏ. బి.ఎల్.,


అన్నా చాండీసతిగారు, ఎం. ఏ. బి. ఎల్.,

ఈమె కేరళవనిత. ఈ సంవత్సరమున జరిగిన న్యాయశాస్త్రపరీక్షలో విజయమునొందినది. బి.యల్. పరీక్షనిచ్చిన కేరళకాంతలలో నీమె ప్రథమురాలు. యమ్.యల్. పరీక్షలో నీమె రెండవతరగతిలో అతిగౌరవముగ జయమునందినది. స్త్రీల సాంఘిక రాజకీయనైతిక పురోభివృద్ధి కాంక్షించి ఈ విద్యావతి తన మాతృభాష యగు కేరళమున 'శ్రీమతి' అను నొక వారపత్రికను ప్రశంసనీయముగ నిర్వహించుచున్నది. ప్రత్యేకము స్త్రీల కొఱకు స్త్రీచేత నడుపబడుచున్న హిందూదేశ దేశభాషలలోని వారపత్రికలలో 'శ్రీమతి' తొలుత పేర్కొన దగినది.

వి. కమలాదేవిగారు :—

తూర్పు గోదావరి మండల ముఖ్యస్థానమగు కాకినాడ ఈమె నివాసస్థానము. ఆంధ్ర కాంగ్రెసు సంఘమునకు ఉపాధ్యక్షురాలుగా నెన్నుకొనబడినది. కాకినాడయందు జరిగిన ముప్పది తొమ్మిదవ హైందవజాతీయమహాసభయొక్క స్వచ్ఛందసేవకురాండ్ర దళనాయకురాలుగా పనిచేసిన దేశహితైకతత్పరురాలు.

విద్యాగౌరి రామర్ భాయి నీలకంఠ:—

ఈమె గుజరాతు దేశములో నొక విఖ్యాతజాతీయనాయకుఁడు కీర్తిశేషుఁడును నైన సర్ రామర్ భాయి మహీపత్రం నీలకంఠగారి సతి. గుజరాతు దేశములో పట్టభద్రు లైన స్త్రీలలో ప్రథమురాలు. విద్య, సాంఘిక విషయములయందు ఈమెకు అభిరుచి మెండు. సాంఘికౌన్నత్యమును గురించి తన శక్తిని వినియోగించుచున్నది. తన దేశములోని విద్య, సాంఘిక సంస్థలలో దాదాపు ప్రతిసంస్థతోడను ఈమెకు సంబంధముకలదు. వానిలో నీక్రింద బేర్కొనబడినవి ముఖ్యములు. గుజరాతు యువతీమండలి సాహిత్య సభ (స్త్రీభాగము), శారదామందిరము (మాంటిసోరిపాఠశాల)—ఈ సంస్థలకు అధ్యక్షు రాలు. అహమదాబాదు ప్రార్థనసమాజము, గుజరాతు కాలేజీ, గాన నాటకసంఘము, వానికిఉపాధ్యక్షురాలు. దివాలిబాయి బాలికాపాఠశాల, బొంబాయి రాజధాని యువతీసభ (అహమ్మదాబాదుబ్రాంచి), గుజరాతు లేడీస్‌క్లబ్, నేషనల్ ఇండియన్ అసోసి యేషన్ (అహమ్మదాబాదుబ్రాంచి), విక్టోరియా జూబిలీ ఆస్పత్రి (స్త్రీలకు), గుజరాతు దేశభాషాసమితి, వీనికి కార్యదర్శిని. ఈమె పాల్గొనుచున్న ప్రతియుద్యమమునందును, తనకార్య శ్రద్ధ, సౌజన్యము, ఉదారభావములను నుపయోగించి కార్యఫలమునందుచున్నది. విద్యాసంపన్నురాలైన హిందూయువతి కుండవలసిన సుగుణములన్నియును నీమెయందు మూర్తీభవించియున్నవి.

శ్రీమతి నల్లముత్తు అమ్మాళ్లు కన్య.—

ఈమెగొప్పవిదుషి. ఎం. ఎ. (ఆనర్సు), ఎల్. టి., బి. ఎస్‌సి. (లండను), టి. డి. (లండను) అని ఈమెకుగల బిరుదము లీమె వైదుష్యమునకు తార్కాణములు. ఈమె రాజమహేంద్రవరములోని గవర్నమెంటు వారి స్త్రీల బోధనాభ్యసన పాఠశాలా ప్రధానో పాధ్యాయిని. ఈమె తన అక్కగారును, మదరాసు శాసనసభోపాధ్యక్షురాలునునగు శ్రీమతి డాక్టరు మత్తులక్ష్మిరెడ్డిగారివలెనే స్త్రీజనాభ్యుదయమునకును, సంఘ సంస్కరణ మునకును నిరంతరము ప్రబలప్రయాసకోర్చి పాటుపడుచుండును. ఈమె రాజమహేంద్ర వరమున కరుదెంచినది మొదలు ప్రతిసాంఘిక, సారస్వత, మహిళోద్యమ విషయము లందును పాల్గొనుచు ఆ నగరజీవనమున నూతనచైతన్యమును గల్గించినది. ఆ నగర మండలి యువజనసమితికి అధ్యక్షురాలుగా నీమె అచ్చటి సాంఘిక సేవావిధానమున కనేక విధముల వన్నెయు వాసియు గూర్చుచున్నది. ప్రభుత్వమువారు ఈమె నిప్పుడు రాజ మహేంద్రవరపురపాలకసంఘమున సభ్యురాలుగా నియమించియున్నారు. ఇట్టి విదుషీమణి కార్యచోదనమున నియమితమైయుండ రాజమహేంద్రవరపురపాలకసంఘము సత్వ రాభివృద్ధియు, నూతనోత్తేజమును పొందుననుటలో సందియము లేదు.



## ఒక స్త్రీ కడుపులో మూడువీశల ముత్యములు.—

కలంబూరుకు చేరువనున్న అయ్యంపేట గ్రామములో నొక స్త్రీ గర్భవతియయ్యెను. ఆమెను ప్రసవము నిమిత్తము వేలూరువైద్యశాలకు తీసుకొనివెళ్లిరి. అచట డాక్టరుపరీక్షించి శస్త్రచికిత్స అవసరమని నిర్ణయించి ఆమెకడుపు కోసిచూడగా కడుపులో బిడ్డకనబడలేదు గాని మూడువీశల (పదులు) ముత్యములు కనబడినవి. వానిని చూచి డాక్టరు చాల విస్మయమును జెంది పరీక్ష నిమిత్తము ఆ ముత్యములను అధికారులకు పంపించెను.

## తాటిచెట్టున అరటిపండ్లు.—

తూత్తుకుడి [illegible]సరములందలి కొట్టారం గ్రామమునకు దగ్గరగ కిజనాథం అనుకుగ్రామము గలదు. ఆ గ్రామము నంద[illegible] [illegible]వాలయము వెనుక తాటివనముకలదు. ఆ తాటితోపులో నొకదానిపయి అరటిపండ్ల గెలలు కొన్ని [illegible]లుగ కాచియున్నవట. ఎవరైన చెట్టెక్క ప్రయత్నించినచో సగమెక్కునప్పటికి యెక్కిన వానికి తలతిరిగి మైకము క్రమ్ముచున్నదట. ఎవరో "చెట్టెక్కవద్దు" అని చెప్పినట్టు వినబడునట. ఈవిచిత్రము చూచుటకై జనులు చుట్టుపల్లెలనుండి గుంపులు గుంపులుగ పోవుచున్నారు. వృక్షమునకు ధూపదీపనైవేద్యము లర్పించుచున్నారు.

## అగ్నిపర్వతములు.—

ఇటలీలోని వినువియసు అగ్నిపర్వతము కదలిక జూపుచున్నది. నిప్పుపొగ లెగసి గ్రామములను ధ్వంసము జేయుచున్నవి. గంధకపుకాలువలు పారుచు, పరిసరములను పొగచే నింపుచున్నవి. బ్రహ్మాండధ్వని బయలుదేరి భూమినంతను కదలించుచు, ఇండ్లను వాకిళ్లను కూల్చుచున్నది. గ్రామస్థులు దిక్కుగానక పారిపోవుచున్నారు. మూడుమైళ్లఎత్తున పొగలుగ్రమ్మి అగ్నిజ్వాలచే ప్రకాశించుచున్నది. పదునైదువేల అడుగులయెత్తున నిప్పు రవ్వలెగయుచున్నటుల వార్తలు దెలుపుచున్నవి. దక్షిణ అమెరికాలో గూడ నొక అగ్నిపర్వతము బ్రద్దలై భూకంపములకు కారణమై అనేకులమరణములకు హేతుభూత మగుచున్నదట. ఇంతటితో నీ పర్వతములు ఘాటి ఆగనిచో, జనక్షయమును గ్రామనాశమును ఎంతయధికముగ గల్గునో యూహింపవచ్చును.

ప్రసవించిన కుబ్జ.—

ప్రసవించిన ఒక పొట్టిస్త్రీయొక్క విచిత్రవృత్తాంతము మార్చి మాసపు "మెడికలుకాలేజి మేగజిను"లో తెలుపబడినది. ఆవృత్తాంతము నిచట వివరించుచున్నాము:—

"చిట్టుపిల్లే అనబడు నొక పొట్టి హిందూస్త్రీ సులభప్రసవము కొఱకు మధురలోని గవర్నమెంటు వారి హెడ్డు క్వార్టర్సు ఆసుపత్రికిగొని రాబడెను. ఆమె మిక్కిలి పొట్టిగానుండెను. మూడు అడుగుల నాలుగు అంగుళములకంటె ఎక్కువ పొడుగులేదు. తూకము ముప్పదిఆరుపౌనులు. చూచువారికి నాలుగు సంవత్సరముల బిడ్డకంటె పెద్దగా ఆమె కాన్పింపదు. కాని ఆమెకు ఇరువది యొక్కటవ సంవత్సరమట. ఆసుపత్రిలోని సేవకురాండ్రు ఆమెను పొత్తిళ్లలో పట్టుకొని ప్రసూతివేదికపై పండుకొనపెట్టుటకు ఏమాత్రమును భారము నొందలేదు. ఆకుబ్జ స్త్రీకి తలపై వెంట్రుకలు బొద్దుగానుండెను. జ్ఞానదంతము లింకను పొడసూపలేదు.

ఆమె తన తల్లిదండ్రులకు నాల్గవ బిడ్డ. పెద్దవారు ముగ్గురును మగవారు. వారికి వరుసగా 29,27,23 సంవత్సరముల వయస్సు. వారు ఒడ్డు, పొడుగు మొదలగు విషయములలో మామూలుగానే యుందురు. కాని ఆమెవలె పొట్టివారుకారు. ఈమెకు 18 సంవత్సరముల చెల్లెలుకలదు. ఆమెకూడ పొట్టిదిగాదు.



ప్రసవించిన కుబ్జ బిడ్డను యెత్తుకొని నిలచియున్నది. ప్రక్కను నిలచిన స్త్రీపటము సాధారణస్త్రీకిని ఈ కుబ్జకునుగల భేదము చూపుటకు ఉంచబడినది.

ఈకుబ్జ తన 15 వ యేట ప్రథమ రజస్వల యయ్యెను. అప్పటినుంచియు ఋతుక్రమము సరిగానే యుండెను. పది మాసములకు పూర్వము ఆమెగర్భమును తాల్చెను. నీళ్లాడ ప్రొద్దులు వచ్చెను. ప్రసూతివేదన దుర్భరమయ్యెను. పండ్రెండుగంటలకాలము నొప్పులుపడెను. అప్పుడు మధ్యాహ్నము రెండు గంటలవేళ మధురఆసుపత్రికి గొనివచ్చిరి. అచ్చటి డాక్టరు ఆమెకు ఆపరేషనుచేసెను. 18 అంగుళముల పొడవు, 47 పౌనుల బరువుగల ఆడపిల్లను బయటికి తీసెను. క్రమముగా మందిచ్చి డాక్టరు ఆపొట్టిస్త్రీకి పూర్తి ఆరోగ్యమును కలిగించెను. ఆసుపత్రినుంచి వెళ్లిపోవునప్పటికి ఆమె తన పిల్లకు సరిపోవునన్ని పాలీయ గలుగునంతటి ఆరోగ్యవతియైయుండెను. చంటిపిల్ల మరియొక అరపౌను బరువు పెంచెను.

**టైపుచేయుటలో అగ్రేసరురాలు.—**

ప్యారిసులో పీయాక్రిను అనునామె నిమిషమునకు 96 మాటలను టైపు చేయుచున్నదట. ఇంతకు మించినవేగముతో ఎవరును టైపుచేయలేదు.

**ఒకే కాన్పున ముగ్గురు బిడ్డలు.—**

బాగ్దాదు నగరమునందు ఫారిసీ యువతి కొకేమారు ముగ్గురు బిడ్డలు పుట్టిరి. అందు ఇరువురు తెల్లగాను మూడవశిశువు కారునలుపుగా నున్నదట.

**ఒకబాలిక కడుపులో 1813 రాళ్లు.—**

సింహళములోని మగలకండ గ్రామములో 12 ఏండ్లవయసుగల నొకబాలిక కొంకిపురుగు వ్యాధిచే బాధపడుచు నీరసస్థితి యందుండుటచే కలతురా వైద్యశాలకు గొనిరాబడెను. ఆవైద్యశాలలో శస్త్రచికిత్స చేయగా ఆబాలిక కడులో 1813 గులకరాళ్లు కనబడెను. ఆబాలిక ఆరాళ్లను అప్పుడప్పుడు మ్రింగియుండు నని అచటి వైద్యు లూహించుచున్నారు.

**క్షయరోగము.—**

హిందూదేశము మొత్తముమీద క్షయరోగముతో తీసికొనువారు 1,000,000 మందికలరు. ఒక్క వంగరాష్ట్రమునందే 1927- వ సంవత్సరమున 800,00 మంది క్షయరోగపీడితులు కలరు. ఆసంవత్సరము వంగదేశమున క్షయరోగముచే చనిపోయినవారి సంఖ్య 100,00 మంది జనులు.

**తిమింగలములను తినుఓడ.—**

పూర్వము మహాసముద్రములలో తిమింగిలములు ఓడలను మ్రింగుచుండెడివని చెప్పెడివారు. ఇపుడు తిమింగిలములను మ్రింగే ఓడలే బయలుదేరినవి. టైను నదీతీరమునగల నాల్సుఎండు పట్టణములో నట్టి తిమింగిలములను పట్టే ఓడయొకటి తయారుచేయబడినది. దీనికి వెనుకతట్టు అడుగుభాగమున 18 అడుగుల వెడల్పున తిమింగిలముల నందుకొని లోపలికి గైకొనే బొరియకలదు. అట్లు పైఅంతస్తునకు గైకొని పోబడిన తిమింగిలములట కోయబడును. ఈయోడయే యొకపెద్ద తిమింగలముయొక్క ఆకారమున నుండును.

**మణిఖచితమైన మూపుగల తాబేలు.—**

లండనులో ఇంపీరియల్ వాయువిమాన సర్వీసు అధికారులకు విదేశములనుండి యరుదెంచిన ఒక విమానమందే ప్రయాణీకుని వలననో విడిచిపెట్టబడిన యొకచిన్న పెట్టెదొరికినది. దానిని తెరచిచూడగా నందు పూలుతో చుట్టబడిన ప్రాణముగల తాబేలున్నదట. ఈతాబేలుయొక్క మూపువెంకంతయు వజ్ర వైఢూర్యములాదిగాగల ప్రశస్తమణులచే పొదగబడి యున్నదట.

**మూగవారి వివాహము.—**

పోర్టులాండులో నొకమూగ వివాహము జరిగినది. వధూవరు లిరువురుగూడ మూగవారే మొదట ఉత్తరములద్వారాను, తరువాత పెదవులుకదల్చు భాషతోను మాట్లాడుకొనుచు ప్రేమించుకొనిరి.




వీరాంగన:—

నైజాము రాజ్యమున కామారెడ్డి తాలూకాలో కూడలియను నొక గొప్ప క్షేత్రము కలదు. కొన్నిరోజుల క్రితము నవయౌవనుడగు నొక రైతును అతని భార్యయును స్వగృహము నుండి బయలుదేరి అత్తవారింటికి వెళ్లుచు నీకూడలికి వచ్చిరి. అప్పటికి కాలాతీతమయినందున అచట చలిది నారగించి వెళ్లుటకు వారు నిశ్చయించిరి. అచటి నది బాగుగా ప్రవహించుచుండెను. ఆయువతి గట్టున నొక చింతచెట్టు క్రింద కూర్చుండెను. ఆయువకుడు యేటిలోదిగి ముఖప్రక్షాళనము చేసికొనుచుండెను. అచట అపుడు నరసంచార మేమియు లేకుండెను. అంతలో అతిక్రూరుడగు నొక ముసల్మానుడు చుక్కతెగిపడ్డ వడువున నెక్కడినుండియోవచ్చి చేత ఖడ్గమునుధరించి రెప్పపాటులో ఆయువకుని శిరమును ఖండించి ఆస్త్రీని బలాత్కరింపసాగెను. ఆమె ధైర్యమును చిక్కబట్టి తాను వానికోరికను తీర్చెదననియు, మొదట నామృతకళేబరమును ఖననము చేసినగాని మనశ్శాంతి కలుగదనియు వానితో చెప్పెను. వాడామాటనమ్మి కత్తిని క్రిందపెట్టి యిసుకను త్రవ్వసాగెను. తానుగూడ కొంతసేపటులే నటించి సమయము కనిపెట్టి అపతివ్రత అచ్చటి కత్తిని తీసుకొని ఒక్కవ్రేటున భర్తృహంతకుని శిరమును ఖండించెను. ఈసంగతి తెలిసినవెంటనే ప్రభుత్వోద్యోగులువచ్చి ఆమె ధైర్యసాహసములను కొనియాడి పారితోషికమును స్వీకరించుట కామెను భాగ్యనగరము (హైదరాబాదు) నకు పంపిరి.

మగనిక్రౌర్యము మరణమునకు కారణము.—

షోలాపూరునందు జనాబాయి అను నొక యువతి క్రూరుడగు తనభర్తతో కాపురము చేయలేక పుట్టినింటికివచ్చెను. తనభర్తమరల తన్నుగొనిపోవుటకురాగా ఈయువతి యొక పెట్టెలోదాగి మూతవైచుకొనెను. జనాబాయి యింటలేదనుకొని ఆమెభర్త వెడలిపోయెను. కొంతసేపటికి మిత్రురాలాపెట్టెను తెరచి చూడగా జనాబాయి యూపిరాడక మృతినొంది యుండెను.

కన్యభార్యతో సంభోగము—

కొన్నిదినములక్రిందట నెల్లూరు డిస్ట్రిక్టుమ్యాజిస్ట్రేటువారు కొప్పోలు వెంకట్రావు అను నొక బ్రాహ్మణ యువకునికి ఒక సంవత్సరము కఠిన శిక్షను విధించిరి. ఆ యువకుని యత్తమామలు అతనిపై ఇండియన్ పీనల్ కోడ్ సె 375 క్రింద ఒక అభియోగమును తెచ్చిరి. శ్రీయుత చివుకుల కృష్ణస్వామి, బి, ఏ. బి. యల్. గారు ప్రాసిక్యూషన్ జరిపిరి. కేసుపూర్తిగా విచారణ జరుగగా పన్నెండు సంవత్సరముల వయస్సుకు లోనయి

అవయవవృద్ధిలేని బాలికయైన తనభార్యతో పైవెంకట్రావు బలాత్కారసంభోగము గావించినందున ఆబాలిక అంగములు క్షతములైపోయినవి. డాక్టర్లు సాక్ష్యము చెప్పిరి. అందువలన బాలిక ఆజన్మాంతము భర్తృసాంగత్యమున కనర్హ యయ్యెనని ఋజువు అగుటచే సదరు వెంకట్రావుగారు రేప్ అను నేరమును చేసెననియు దోషియనియును తలంచి జిల్లామేజస్ట్రేటు వారు ఒక సంవత్సరము కఠినశిక్షను వానికి విధించిరని తెలియుచున్నది.:—

**సాహసిక:—**

తెలిసియే నిర్ణయించెనో తెలియకయే నిర్ణయించెనో తండ్రి కుదుర్చుకొని వచ్చిన వరునకు కుష్ఠురోగము కలదు. తాళిగట్ట బోవుచున్న వరుని పరిశీలించిచూచి నిజము తెలిసికొని కన్య చటాలున **వివాహవేదిక** వదలి **పారిపోయెను.** వివాహము నిలిచిపోయినది తమగ్రామమున జరిగిన ఈ కన్యాసాహసమును కుంభకోణవాసులు తఱచు స్మరించుచున్నారు. ఈవధువుచేసిన **సాహసము** శ్లాఘనీయమైనది గదా!

**మానప్రియ.—**

గుంటూరు తాలూకాలో నొక ప్రదేశము. చక్కనిరోడ్డు గలదుగాని ఆప్రదేశమున జనుల బాహాటప్రచారము మాత్రములేదు. అక్కడ ఒకసత్రముకలదు. చెదరుగా మోటారులు ఆదారిని వచ్చుచు బోవుచుండును. కొన్ని దినములక్రిందట ఒకనాటిసందె చీకటివేళ ఒకస్త్రీ కొంచమను ఆభరణములుకలది, తన ఇద్దఱు బిడ్డలతోడను ఆమార్గమున బోవుచుండెను. పరుగులమీదవచ్చి పడుచున్న చీకటిని తలచి ఆరాత్రి కామె తన ఇద్దఱు బిడ్డలతోడను ఆసత్రమున విడియనెంచెను. ఆసత్రమున మఱియెవ్వరును లేరు. బాగుగా చీకటిపడెను. చీమరాళ్ల ధ్వనియే కాని మఱియెట్టి సవ్వడియును లేదు. భూలోకభూతమన దగిన ఒకపురుషవిగ్రహము పెద్దకత్తి పట్టుకొని ఆస్త్రీయున్నగదిలో ప్రవేశించెను. మగవారి కృత్యములు సందునుడిమాయలని కవి నిర్వచించి యున్నాడుగదా! కొంచముగు నామె యాభరణములు లాగికొన్నాడు. అతని దౌష్ట్యమంతతో తుదముట్టలేదు. అలనాటి కౌరవ సభలో దుశ్శాసనుడు ద్రౌపది వలువలు ఒలువ ప్రయత్నించినట్లు ఇప్పుడీ దుష్టుడు ఈ అసహాయ కట్టువస్త్రమును ఒలువ ప్రయత్నించినాడు. అది శ్రీకృష్ణమూర్తిగల ద్వాపరయుగము గావున దుశ్శాసనుడు తన ప్రయత్నమున కృతార్థుడు కాలేకపోయెను. ఇది కలికాలము. కృష్ణుడులేడు. అగుటచే ఈదుర్మార్గుని పాపచింతపండినది. నగ్నయై ఆస్త్రీ కూలబడినది. మానభంగముచేయ ఆరాక్షసుడు ప్రయత్నపడినాడు. అప్పటి ఆ అనాథ స్త్రీయాలాపములు అరణ్యరోదనములైనవి. తోడనే ఆమె మంచి మాటలతో వానిని పందిరివెట్టి అవశిష్టము తీర్చికొని వత్తునని గదినుండి బయటికివచ్చి చటాలున గదితలుపు ఇవతల గొళ్లెమిడెను. తనబిడ్డ లిద్దఱును, యమలాడునులోననుండిరి. కిటికీచెంత నిలచి ఆమె వానిని చూచెను. 'తలుపుతీయవేని నీబిడ్డలను తుండ తుండములు చేతు'నని వాడనెను. 'నామానముకంటె నాఅంశములగు నాబిడ్డలు నాకు ఎక్కువకాదు' అని ఆమె అనెను. ఆకటికిగుండెలకాముస్న అంతట అబిడ్డల నిద్దఱిని తన కత్తితో ముక్కలు ముక్కలుచేసెను. ఆమానప్రియ యది అంతయును చూచుచునే యుండెను. ప్రాణములో ప్రాణములు పిల్లలు తుండ తుండములైనను ఆమె విచారింపలేదు మానమునిల్పుకొన గల్గితినిగదా యను సంబరమున. ఇంతలో నచ్చటికి ఒక మోటారువచ్చెను. అందలి ప్రయాణికులు ఆమెకు కట్టువస్త్రములిచ్చి గదిలోనికంసుని తీసికొనిపోయి పోలీసు వారికి అప్పగించిరి. ఆకేసు ఇప్పుడు గుంటూరులో విచారణ జరుగుచున్నది. అదిఎట్లు పర్యవసితమగునో మనకక్కర లేదు. ఆస్త్రీ మానప్రియత్వము మాత్రమే మనకు గావలసినది. అతిలోకమైన ఆమె మానసంరక్షణాభిమానమును ఉన్నది ఉన్నట్లు చెప్పుటకైనను వాఙ్మయమునకుశక్తిలేదు.




కీ. శే. వేదము. వేంకటరాయ శాస్త్రులవారు:—

చ. "కలుషమునుబట్టియేము కలకాలము నిట్టుల దుఃఖవార్తలే
తెలుపుటలయ్యెనే హతవిధీ !"

ఆంధ్రకవికుమారుడు మద్దిపట్ల వేంకటరమణయ్యగారి మరణవార్తను విచారించుచున్న ఆంధ్రులకు పుంస్త్వము దాల్చిన శారదావతారము అవతారము చాలించిన విషాదవృత్తాంతము, జంగమమైన సారస్వత విజ్ఞానసర్వస్వము తన సంచారముడిపి కొన్న దుఃఖవార్త ఈ మాసమున నివేదింపవలసి వచ్చినందులకు మిక్కిలి విచారముగా నున్నది. జూను నెల 18-వ తేది ఉదయము 6 గంటలకు చెన్నపురి మల్లికేశ్వర దేవాలయ వీధి 4-వ నెంబరు స్వగృహమందు వేదము. వేంకటరాయ శాస్త్రులవారు తమ భౌతికశరీరమును వదలి దివంగతులైరి. ఈ బహుళాంధ్రోక్తిమయప్రపంచమునకు వీరి మరణము వలన గలిగిన లోటు నిజముగా తీరరానిది. ఈ అభినవమల్లినాధులవారు శృంగారనైషధము, ఆముక్తమాల్యదలకు వ్రాసిన వ్యాఖ్యానములు వీరి అసాధారణసార్వజ్ఞతకు మానదండములై యున్నవి. ఆంధ్రభూమియందు విశ్వవ్యాపనమందిన ప్రతాపరుద్రీయనాటకము ఈ కళాప్రపూర్ణునకు అజరామరమైన కీర్తినిగొనివచ్చినది. కుమారసంభవము, మేఘసందేశము మొదలగు సంస్కృతగ్రంథములకు శ్రీవారు వ్రాసిన టీకలు ఆంధ్రవిద్యార్థులకు పూజ్యలింగములై యున్నవి. ఈ వశ్యవాక్కుని వచనరచనాచాకచక్యమునకు 'కథా సరిత్సాగరము' నిక్షేపముద్రయైయున్నది. వైక్లబ్యముననున్న మేము వీరిపవిత్రాత్మకు పరమశాంతిని గోరుటతప్ప ఈ సాహిత్యసముద్రుని, ఈ వ్యాఖ్యాతృశిరోమణిని, ఈ విమర్శకశిఖామణిని, ఈ నాటక కళాప్రపూర్ణుని గూర్చి విశేషముగ వివరింపలేము. వివరించియు ప్రయోజనములేదు. ఏమందురా?

చ॥ "కవివచనంబు లీతని యగాధయశఃకలశాంబురాశిలో
లవములు వోలెడిందు"

పాటునొందును గావున.

శాన్నో దేవి శపథము:—

ఏదేశము ఒకస్త్రీవ్యక్తిని విద్యకు అధిష్ఠానదేవతగా నిల్పి సేవించుచు గణనాతీత కాలమునుండియు స్త్రీవిద్యకు అత్యంతప్రాధాన్యత నిచ్చెనో అట్టి భారతదేశమునగల స్త్రీవిద్యాప్రతిష్ఠాపనములలో పంజాబునందలి జలంధరుపట్టణములోని కన్యామహా విద్యాలయము నాయకరత్నము. శ్రీమతి శాన్నోదేవి యను విద్యాధికురాలు ఆసంస్థకు ప్రధానోపాధ్యాయిని. తనవిద్యాలయమునకు ఒకలక్షరూప్యములు వసూలుచేయ నామె సంకల్పించినది. ఇట్టి సంకల్పములు స్త్రీవిద్యాలయనిర్వాహకురాండ్రకు ఇతరులకు గూడ నుండుటలో విచిత్రమేమియునులేదు. అయితే శాన్నోదేవి సంకల్పములో నొక విశేషము. తాను సంకల్పించిన లక్షారము చేకూర్చుకొని గాని విద్యాలయము నొక్క గడప త్రొక్కి చూడనని ఆమె శపథము పూనినది. పంజాబునందు సంచారము చేయుచున్నది. తన వాంఛితార్థము పంజాబున లభింపనిచో ఆమె బర్మాదేశమున గూడ సంచారముచేయ తలపుగొనియున్నది. తన రాష్ట్రపు పొలిమేర దాటకుండగనే ఆమె సంకల్ప మీడేఱు సూచనలు చూపట్టుచున్నవి. స్వరాష్ట్రప్రతిభకు తార్కాణమై విల సిల్లుచున్న విద్యాసంస్థలలో కన్యామహావిద్యాలయ మొకటిగావున పరోపకారసంప్ర భవయశస్వులైన పంజాబీయులు విరివిగా అమెకు ధనమర్పించుచున్నారు. అప్పుడే దాదాపు ఏబదివేల రూప్యములు చేకూరినవి. మొదటినుండియు పరార్థప్రవణమైన శాన్నోదేవి బుద్ధి, అచిరకాలముననే పాలితప్రతిజ్ఞగాఁ గల ఆమె దీక్ష కొనియాడదగి యున్నవి. నిశ్చితార్థము విడువని శాన్నోదేవివంటి నిపుణమతులగాంచు భాగ్యము సుపు త్రోదయలీలాగణ్యయైన ఆంధ్రమాత కెన్నడుగల్గునో?

హూణవిద్య నేర్చిన భారతయువతి.—

మదరాసు వ్యభిచారనిషేధనచట్టమును గూర్చి విచారణ సల్పుచున్న ఉపసం ఘమువారి సమక్షమున సాక్ష్యమిచ్చుచు క్రైస్తవకళాశాలయందు విద్యార్థులకు ఆరోగ్య పరీక్షాధికారియగు రివరెండు వి.జె.ఆర్. అశీర్వాదముగా రిట్లు చెప్పియున్నారు. "నూతన విద్యావ్యాప్తిపద్ధతివలనను, నవీనాభిప్రాయముల ప్రచారము వలనను బాలికలలో స్వేచ్ఛా ప్రవర్తనాభిలాషయు చేసికొనిన భర్తయెడల నిరసనభావమును వ్యాపించుచున్నవి." ఈ వాక్యములు సత్యసమీపములని మానవ్మక ములు. ఏమందురా? ప్రస్తుతపరిస్థితులలో హూణవిద్య నేర్చిన భారతయువతికి ప్రేమించిన వానిని పెండ్లాడుటా? పెండ్లాడిన వానిని ప్రేమించుటా? అను సమస్య జీవితాంతమువఱకును తెంపునొందక తెవులులేని వేదనను

గలిగించుచున్నది. సనాతనసాంప్రదాయములలో పుట్టి పెరిగిన బాలిక పెండ్లాడిన వానిని ప్రేమించి చీకుచింతలేక సంసారము నిర్వహించుచున్నది. ఆమె దిద్దు గృహము నిజముగా శాంతిదేవతానిలయమై ఒప్పుచున్నది. స్వశరీరసుఖమును గూడ మఱచి భర్తకు సేవ చేయుటలో నామె రవ్వంతయైన పరాకుపడదు. జోరీగలవలె వేధించుకొని తినుచున్నను ఆమె తనబిడ్డలపై సాధారణముగా చిరాకుపడదు. చిన్నతనమునుండియు పనిపాటలలో నారితేరిన ఆమె నైపుణ్యము, ఆరోగ్యమును సూచించు ఆమె అవయవస్ఫూర్తి, అలసట యెఱుగని ఆమె కార్యకాంక్ష, సంసారమును స్వర్గతుల్యముగ చేయుచున్నవి. ఇక హూణ విద్యావతియగు యువతి దిద్దు కొన్నిసంసారములను చూచితిమేని మిక్కిలి విచారము గల్గకమానదు. రక్తమును పీల్చు హూణవిద్య ఆమెకు అవయవస్ఫూర్తి లేకుండ జేసినదే కాని గృహకృత్యములను సమర్థతతో నిర్వహింపగల పుష్టిని ప్రసాదింపలేదు. లౌకికజీవనమునకు ఏవిధముగను పనికిరాని నేటి పాఠశాలలోని విద్య ఆమెను సర్వదా ముక్కుఁద్దములతో పడకకుర్చీలో హస్తమలంకరించిన పుస్తకముతో నంటియుండుటకే ప్రోత్సాహించుచున్నది. కాని వలయుచో పట్టుమని పదిమందికి వండిపెట్టుశక్తిని అనుగ్రహించుటలేదు. ఉన్నదానితో అసంతృప్తి, లేనిదానికై దేవుళ్లాడుట-ఇది ఆంగ్లవిద్య నేర్చిన యువతి మానసిక ప్రవృత్తియై యుండుచున్నది. ఈ వాక్యములు నిజములగుటచే నిష్ఠురములుగా నుండకమానవు. ఇట్లనుటచే మేము స్త్రీవిద్యను తెగడుచున్నామని భావింపరాదు. స్త్రీలకు విద్యఅవసరమే. కాని అది ప్రస్తుతము పాఠశాలలలోను, కళాశాలలలోను బోధింపబడుపద్ధతి పూర్తిగ మార్పునొందవలయును. గృహపాలనము, శిశుపోషణము, పాకశాస్త్రము, ఆరోగ్యమార్గములు మొదలగు ఆవశ్యకగుణములను హత్తించనినేటి కల్లబొల్లి విద్యలతో నరిముల్లువాసియైన ప్రయోజనములేదుగదా, మీదు మిక్కిలి కొండంత చెఱుపుకూడ కల్గుచున్నదని మామనవి. దేశనాయకులీవిషయమై తగినశ్రద్ధ వహింతురు గాక యని కోరుచున్నాము.

"దేవతల బానిసలు."—

తిట్టి తిట్టించుకొనుట కొందఱికి పుట్టుతో బుట్టుగుణము. మేయోకన్య స్వభావ మట్టిది. 'మదరిండియా' అను గ్రంథమున ఆమె హిందువులను ఎట్లు నిరసించినదో లోకమునకు వెల్లడియైనది. అందుతో తృప్తినొందక ఇప్పుడామె తన దూషణవ్రతమునకు రెండవపరికరముగా 'దేవతల బానిసలు' అను గ్రంథమును ప్రచురించినది. ఇది కొన్ని

కథలసంపుటి. అసత్యవిషయములను గోరంతలు కొండంతలుచేసి సభ్యలోకమున భారత దేశమునకు తలవంపులు సంఘటించు తలంపు ఆ మెసీగ్రంథరచనమునకు పురిగొల్పియుండును.

"తప్పు తడవ తడవ తమకన్ను లేపోవు"

నని మేయోకన్య వ్రాతల యెడ భారతీయులు పెక్కులు ఉదాసీనతవహించిరి. కాని దేశాభిమానవ్యగ్రహృదయులగు లజపతిరాయి, నటరాజను మొదలగు వారు మేయోకన్య వ్రాతలు సత్యదూరములని పుస్తకదర్పణముల జూపిరి. శ్రీమతి సరోజనీదేవి, మిస్సుకజిన్సు, సి. ఎఫ్. ఆండ్రూసు మొదలగు వారు పశ్చిమదేశములందు ఉపన్యాస పరంపరలతో మేయోకన్య వాకట్టుచున్నారు. ఏయుద్దేశముతో వ్రాసిననేమి మేయో కన్య గ్రంథములు హైందవసంఘము విషయమై నింతటి జిజ్ఞాస గలిగించినవి గావున నదియు నొకమేలునకే.

లేబరు కాబినేటులో నొక స్త్రీ.—

లండను డవునింగువీధిలో మఱల లేబరుకాబినేటు సమావేశమైనది. అయిదు సంవత్సరములకు పూర్వ మొకసారి లేబరు మంత్రాంగ మేర్పడినది. కాని అది అప్పుడు నాలుగురోజుల నవ్వులాటయైనది; ఏమసారు లోడిపోయి లేబరు నాయకుడు రామ్సే మేక్డొనాల్డు మంత్రిపదవికి స్వస్తి చెప్పినాడు. మరల నేడు ఆతడు లేబరు మంత్రి వర్గమును నేర్పాటు చేయగల్గినాడు. 1924 వ సంవత్సరమునాటి మంత్రివర్గమువలె నేటి లేబరు మంత్రివర్గము పుబ్బలోపుట్టి హస్తలోమాడునట్లుగాక కొంచము స్థిరముగనుండు నట్లు దోచుచున్నది. ఇదియొక మోదావహమగు విషయము. ఇప్పటి లేబరు కాబినేటు విషయములో సంతోషపడవలసిన సంగతి మఱియొకటిగలదు. అది కాబినేటులో నొక మంత్రిణి నుండుటయే. బ్రిటీషు పార్లమెంటు చరిత్రలో నిదియొక నూతనాధ్యాయమంగళా చరణము. మొన్నజరిగిన పార్లమెంటరీ ఎన్నికల ఓటర్లలో అధికసంఖ్య స్త్రీలే. ఈ ఎన్ని కలందు స్త్రీలు చూపిన ఉత్సాహము వర్ణనాతీతము. ఓటర్లను ఓట్లువేయించుటకు గొని వచ్చు మోటార్లకు సారథ్యము వహించిన వారిలో అధికసంఖ్య గలవారు స్త్రీలే. అది యునుగాక ప్రపంచమందలి అన్నిదేశములందును స్త్రీ జనాభివృద్ధి హుటాహుటి నడలతో ముందునకు సాగుచున్నది. ఇది అంతయు గమనించియే లోకజ్ఞుడగు మాక్డొనాల్డు తన మంత్రివర్గమున విఖ్యాతరమణీమణియగు మిస్. మార్గరట్ బాండ్ ఫీల్డును నొక మంత్రిణిగా జేర్చికొన్నాడు. స్త్రీలు ప్రీవీకవున్సిలులో చేర్చుకొనబడుటకు కాబినేటులో మంత్రిణిగా ప్రవేశించుటకును ఈమెయే ప్రథమురాలు. రాజకార్యనిర్వహణమున తన

ప్రజ్ఞాపాండిత్యములను కూలంకషముగ చూపి ఈమె స్త్రీలోకమునకు వన్నెయు వాసియు గూర్చుగాక!

సమదర్శిని: శుక్ల సంవత్సరాది సంచిక:—

వందనములతో నందుకొంటిమి. ముఖపత్రమున చిత్రితమైన స్వర్గీయ పానుగల్లు ప్రభువు వారి దివ్యచిత్రము ముగ్ధమోహనమై ఆరాధనమును పురిగొల్పుచున్నది. త్రివర్ణ చిత్రపటములలో గౌరవస్థానము (Place of Honour) నలంకరించుచున్న 'నవోఢ' భావగభీరత లుట్టిపడుచు పాఠకుల మనములను అయస్కాంతము లోహమునట్లు ఆకర్షించుచున్నది. బుద్ధభగవానుని సంసారపరిత్యాగము; ప్రేమోన్మీలనము; సంధ్యారాగము; భావసుందరి; చంద్రికాసుధాకరము అను మిగిలిన త్రివర్ణచిత్రములు కూడ రమణీయ సుందరములై యొప్పుచు సంచిక విలువను రెట్టించుచున్నవి. మహానాయకుల ఛాయా చిత్రములును పెక్కులుగలవు. వ్యాసములలో శ్రీయుత మల్లంపల్లి సోమశేఖరశర్మగారి అనాదృతవాఙ్మయము అనునది అమూల్యమైయున్నది. పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రులవారి గౌరిగర్వభంగము అనుపాటను గూర్చిన విమర్శనము పఠనయోగ్యమై యున్నది; నిడమర్తి. సత్యనారాయణమూర్తిగారి తిక్కన: స్వతంత్రరచనములు అనునది తిక్కన కవితావిమర్శనములలో నొక నూతనఫక్కిని ద్రొక్కుచున్నది. శ్రీయుత వేమవరపు రామదాసుపంతులుగారు; బుఱ్ఱా శేషగిరిరావుగారు మొదలగు పెద్దల వ్యాసములను సేకరించి ప్రచురించిన పత్రికాధిపతి కార్యశ్రద్ధయు, సారస్వతాభిమానమును శ్లాఘనీయములై యున్నవి. లింగము వీరభద్రచౌదరిగారి పాశ్చాత్య స్త్రీలు అను వ్యాసములోని విషయములు అరోచకములుగా, సత్యదూరములుగా నున్నవి. గుడిపాటి వెంకటచలముగారి రెడ్డిరంగమ్మకథ సభ్యలోకమునకు ఏవబుట్టించునదిగానున్నది. మిగిలిన వ్యాసములు ఆవ్యాసకర్తల సారస్వతాభినివేశనమునకును, విషయపరిశీలనమునకును నిదర్శనములైయున్నవి. గ్రంథాకృతి ఆకర్షణీయముగను; ముద్రణము ముచ్చటగను నున్నవి. శిల్పరమణీయమున నొప్పుచున్న ఈ సంచికను గూర్చి ఎంత చెప్పినను తనివి నొందలేము గావున అక్షరాస్యుడైన ప్రతి ఆంధ్రుడు చదివితీరవలెనని హెచ్చరించుచు విరమించుచున్నాము. సంచిక వెల చందాదారులకు రు ౧-౦-౦ ఇతరులకు రు ౧-౮-౦. పోస్టేజి (౦-౬-౦ అణాలు) ఎవరికైనను ప్రత్యేకము. వలయువారు మదరాసు: మౌంటు రోడ్డు నెం. 14న నున్న సమదర్శినీకార్యాలయమునకు వ్రాయునది.

# గ్రంథవిమర్శనము

## శ్రీమతి బెంగుళూరి నాగరత్నముగారి గ్రంథములు.—

ఆంధ్రలోకమునకు చిరపరిచితురాలైన గానవిద్యాసుందరి శ్రీమతి బెంగళూరి నాగరత్నముగారు రచియించిన ౧. ఇదేమేపిల్లా! ఈలాగు మారిపోయినావు? ౨. అయ్యో! నీవూ నావుగడా? ౩. ఏమే ఒకరినుండి యొకరు ఇద్దఱము చెడిపోతిమి. ౪. మద్యపానము. ౫. శ్రీత్యాగరాజాష్టోత్తర శతనామావళి. అనుగ్రంథములను వందనములతో నందుకొంటిమి. బ్రహ్మశ్రీ పండిత, పురాణం. సూర్యనారాయణ తీర్థుల వారిచే సంస్కరింప బడియున్నవగుట నీగ్రంథములు నిర్దుష్టములై యున్నవి. ప్రశస్తినందిన ఆంధ్రవిదుషీమణి రచియించిన ఈగ్రంథములను తెనుగు వారెల్లరును చదివి ఆనందింప గోరెదము. వలయువారు గ్రంథకర్త్రి పేర 7, శ్రీనివాసయ్యరువీధి, మద్రాసు అనివ్రాయవలెను.

## ఏనుగు తమ్మిరాజుగారి గ్రంథములు.—

శ్రీరామశతకము, శ్రీకృష్ణశతకము, శ్రీమహాత్మాశతకము, శ్రీమిత్రశతకము, శ్రీబుచ్చిరాజీయము.— అను శ్రీ ఏనుగు, తమ్మిరాజుగారి గ్రంథములను కృతజ్ఞతతో స్వీకరించితిమి. కవిత్వము ప్రాథమికముగానున్నను పాంకముగానున్నది. విశేషవ్యాసంగము కావలయును. పుస్తకములు వలయువారు గ్రంథకర్త పేర తాపేశ్వరము (తూర్పుగోదావరి) జిల్లాకు వ్రాయవలెను. బుచ్చిరాజీయము వెల 0—2—0 మిగిలిన వాని వెల తెలుపబడలేదు.

## ఏ జెల్ల. శ్రీరాములు చౌదరిగారి గ్రంథములు.—

1. పశువైద్యచింతామణి :—అక్షరాస్యుడగు ప్రతి రైతుబిడ్డయు చదివి పశువ్యాధుల వివరమును; ఆవ్యాధులను నివారించు మార్గమును తెలిసికొనుటకు ఈగ్రంథము పరిమోపకారిగా నుండగలదు. క్రౌను సైజు 200 పుటలు. వెల ప్రతి ఒక్కంటికి రు. 1—4—0. 2. విషనివారిణి:—విషజంతువులవలన కలుగు ఉపద్రవములకు చికిత్సల నుపదేశించు గ్రంథము అనేకవైద్యగ్రంథములనుండి క్రోడీకరింపబడిన వైద్యప్రక్రియలుగలవు. ఫూల్‌స్కేపు సైజు 60 పుటలు. వెల. రు. 0—4—0. 3. గానవిద్యా కుమారి :— సప్తస్వరముల ప్రకృతి వికృతి తారతమ్యము హార్మోనియమునందు సంగీతము నభ్యసించు బాల బాలికలు

చక్కగా తెలిసికొనవీలగు మంచిగ్రంథము. క్రౌనుసైజు. పుటలు 60. వెల రు. 0—6—0. 4. బాలవినోద గీతావళి:—ప్రాథమిక పాఠశాలలందు ఉదయ సాయంకాలములందు ప్రార్థనలు, రాజభక్తికీర్తనలు మొదలగునవి పిల్లలచే పాడించు నాచారమును పోషించుటకనువైనగ్రంథము. క్రౌను సైజు. 40 పుటలు. వెల రు. 0—3—0. ఈ నాలుగు గ్రంథములును తత్కర్తలు శ్రీయుత యేజెళ్ల. శ్రీరాములు చౌదరిగారివద్ద (కృష్ణాజిల్లా అంగలూరు) లభించును.

## కుముద్వతి—

ఈ గ్రంథమును సుప్రసిద్ధకవయిత్రియగు శ్రీమతి పులవర్తి. కమలావతీదేవిగారు రచియించిరి, రాజమండ్రి సరస్వతీ గ్రంథమండలిలో ౧౭-వ కుసుమముగా ప్రకటింపబడినది. డెమ్మీ ఆక్టావో సైజు ౧౯౭ పుటలు. ౩౦ ప్రకరణములు. గ్రంథమున కవయిత్రిగారి ఛాయాపటముకూడగలదు. ఇదియొక చరిత్రాత్మకనవల. సముచితములగు కల్పనా విశేషములతో నలరారు చున్నది. కథలో వీరాద్భుతరసములు ప్రధానములయ్యును ప్రకరణానుగుణ్యముగా నచ్చటచ్చట శృంగారకరుణాదులును ప్రవేశములయి యున్నవి. కథయొక్క ముఖనిర్వహణములు అత్యద్భుతములు. కవయిత్రి గారిట్టి గ్రంథము లనేకములువ్రాసి యథాశక్తిని యాంధ్రభాషా యోషకు అలంకారములు సమకూర్తురుగావుతమని కోరెదము. గ్రంథము వెల రు. ౧-౦-౦. వలయువారు రాజమండ్రి యందలి సరస్వతీ గ్రంథమండలి వారికి వ్రాయునది. —బులుసు నరసింహశాస్త్రి.

## రాధికాచంద్రావళులు.—

ఇదియొక సాంఘిక నవల. రచయిత్రి పులవర్తి కమలావతిదేవి. డెమ్మీ అక్టావోసైజున 20 పుటలు వెల రు 0-4-0.

శైశవప్రమాదమున తలిదండ్రులను గోల్పోయి విడివడి కావటికుండలగు సుఖదుఃఖముల రెంటిని చవిచూచి అనంతరము పరిణతలై పరమకల్యాణమున జీవయాత్ర నడపిన రాధికాచంద్రావళులను ఇద్దఱు కవల పిల్లల చరిత్రమిందు హృద్యమగు శైలిని వివరింపబడియున్నది. గ్రంథములువలయువారు గ్రంథప్రకాశకులగు పులవర్తి. మాణిక్యారావు గారికి (రాజమండ్రి.) వ్రాయవలెను.

# పత్రికా పరిచయము.

## "శ్రీశారదా"—

ఇది భారతసనాతనధర్మమండల పక్షమున ప్రతిపక్ష చతుర్థియందును శృంగేరినుండి విద్వాన్ శ్రీ శేషశాస్త్రిగారి సంపాదకత్వమున ప్రచురింపఁబడు సంస్కృతపత్రిక. దీనికి చందా సంవత్సరమునకు పోస్టేజితో రు. 2-8-0 లు. ఇది గీర్వాణభాషయందలి సకల విషయములను అందు ముఖ్యముగ ఆయుర్వేద విషయములను గూర్చి కడుసమర్థతతో చర్చించు పత్రిక. ప్రస్తుతము మనదేశములో సంస్కృతభాషలో ప్రచురింపబడెడు పత్రిక ఇదియొకటియే. వలయువారు సంపాదకుని పేర శృంగేరి (మైసూరు రాజ్యము)కి వ్రాయునది.

## కాంగ్రెసు స్వాతంత్ర్య సంచిక.—

ఆంధ్రవార పత్రికలలో కృష్ణాపత్రిక తరువాత సీతానగరమునందలి గౌతమీసత్యాగ్రహాశ్రమమునుండి ప్రచురింపబడుచున్న కాంగ్రెసు పత్రికయే పరిగణనీయమైనది. ఏతత్పత్రికా సంపాదకులగు మద్దూరి. అన్నపూర్ణయ్యగారు దేశారాధకతత్పరులగు ఆంధ్రయువకులలో స్థిరప్రజ్ఞగలవారు. వారు మే ౧౦ వ తేదీని ప్రత్యేకముగ ప్రచురించిన స్వాతంత్ర్యసంచిక విమర్శనార్థము మా కార్యాలయమునకు నేడు పంపబడినది. చిత్రపటశోభితమై విషయగర్భితమైయున్న ఈ ప్రత్యేకసంచికయందలి వ్యాసములు సుబోధకములై యున్నవి. ఆంధ్రులందఱును పఠింపదగియున్నది. వెల 0-2-0 వలయువారు సంపాదకునిపేర సీతానగరము. కొవ్వూరు మార్గము, గోదావరీతీరము అను చిరునామాకు వ్రాయవలెను.

## రాష్ట్రేతరాంధ్రులు —

పరభూములందు వలస నెలకొన్న ఆంధ్రులలో ఆంధ్రాభిమానమును రేకెత్తించ పాటుపడుచున్న ఈమాసోదర మాసపత్రికకు ఒక సంవత్సరమునిండి జూలై మాసముతో రెండవసంవత్సరము ప్రారంభమగుచున్నది. మా పత్రికాపీఠము నలంకరించుచున్న సంపుటము ౧ సంచిక ౧౨ పత్రికఆదర్శములకు దర్పణమై యున్నది. పత్రిక చిరకాలము వర్ధిల్లి ఆంధ్రతాముద్ర వెలయించుటకు యథాశక్తిని తోడ్పడు గాక యని కోరెదము. సాలు చందా (రు ౧-౦-౦) స్వల్పము గావున తెనుగువారు పూని ఈ పత్రికను పోషింప వలసియున్నది. వలయు వారు ఖర్గపురమునకు సంపాదకునిపేర వ్రాయునది.

## కౌమోదకి.—

ఇది కడపజిల్లా, నంద్యాలనుండి గాడిచెర్ల. హరిసర్వోత్తమరావు యం. ఏ. యం. యల్. సి భిషగ్వరకైప. సుబ్రహ్మణ్యశర్మ ఏ.ఎం., ఎ.సి, గారల సంపాదకత్వమున, బ్రచురింపబడు పక్షపత్రిక. దీని సాలం చందా సామాన్యులుకూడ తెప్పించుకొనుటకు వీలగునటుల రు. 2-0-0 లు ఏర్పరుపబడినది. మాకు అందిన ఒకటవసంపుటము 3,4 సంచికలనుబట్టి వైద్య విషయములకు ఇందు ప్రధానస్థాన మొసగబడుచుండునని విశదమగుచున్నది. ఆవిషయములు అందఱికిని చక్కగ దెలియునట్లు సులభగ్రాంథిక శైలిని వ్రాయబడుచున్నవి. ఇది యెంతయు ఎన్నదగిన విషయము. ఈ పత్రికను వలయువారు, కౌమోదకి ఆఫీసు, నంద్యాల అని వ్రాసినచో పడయగలరు.




సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు

డాక్టర్. కే. ఎన్. కేసరి

సంపుటము 2.] [సంఖ్య. 6

లోధ్ర ముద్రాలయము, మద్రాసు

1929

సం॥ చందా రు. 4. విడిసంచిక అ. 6.

# గృహలక్ష్మి

స్త్రీల ఆయురారోగ్య సౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాసపత్రిక.

సంపుటము 2. ఆగస్టు నెల 1929. సంచిక 6.

## విషయసూచిక.

# గృహలక్ష్మి

ఏజెంట్లు.

తెనాలి కొమ్మూరి కాశీ విశ్వనాథంగారు,
జనరలు మర్చెంటు. తెనాలి.

బళ్లారి: వి. రాజుమొదలియార్ & సన్సు
కమిషన్ ఏజంట్సు, కారుస్ట్రీటు,
బ్రూసుపేట, బళ్లారి.

రాజమండ్రి: దువ్వూరి బ్రదర్సు
3/188 దువ్వూరి వారిమేడ, రాజమండ్రి.

కాకినాడ: సి. హెచ్. బాపిరాజు.
కొమ్మిరెడ్డి వీధి, కాకినాడ.

ఆల్ యిండియా యునైటెడ్
న్యూస్ పేపరు ఏజెన్సీ, కాకినాడ.

ఏలూరు: పి. వి. శాస్త్రి
న్యూసు ఏజంటు, ఏలూరు.

నెల్లూరు: ఏ. సుబ్రహ్మణ్యం, ఏజెంటు.
ఆంధ్ర యిన్స్యూరెన్సు కంపెని.
ట్రంకు రోడ్డు, నెల్లూరు.

బెజవాడ: నామల అంతోని బెజవాడ

ఛత్రపురం: నేమాని వాసుదేవమూర్తి
సెక్రెటరి. పరమేశ్వరి విలాస్, ఛత్రపురం.

గుంటూరు: ఏ. ఎల్. నరసింహారావుగారు,
ఫోటోగ్రాఫరు, నేషనల్ స్టూడియో,
గుంటూరు.

మచిలీపట్టణము: కె. బాలకృష్ణ.
ఫోటో ఆర్టిస్టు,
మచిలీపట్టణము.

భీమవరం వి. కుటుంబరావు

ఇతరత్ర చోట్లకు ఏజంట్లు కావలెను, వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.

'గృహలక్ష్మి' తపాల పెట్టె. 752, ఎగ్మూరు, మద్రాసు.

# గృహలక్ష్మి

## ఆంధ్రపురంధ్రి

ఆంధ్రరమణి ప్రాక్తనవైభవము కొలఁదియిడరానిది. ఆమె రాజ్యపాలనా కౌశల్యము నెఱుఁగఁ గోరెదవా? రుద్రమదేవిని గూర్చి విదేశయాత్రికుఁడు 'మార్కోపోలో' వ్రాసిన వ్రాతలను బఠింపుము. రణవిద్యయందలి ఆమెనేర్పు చూడఁ గోరెదవా? రుద్రమ్మకుఁ బాదాక్రాంతుఁడయిన దేవగిరిరాజు మహాదేవరాయల చరిత్రమును స్మరింపుము. ఆమె భాషాభిమానమును గుర్తింపఁగోరెదవా? తమిళదేశమున మంగమ్మ వెలయించినఁ దెలుఁగు శాసనములను తిరుగఁదోడుము. మంత్రాంగమందలి ఆమెప్రజ్ఞ తెలిసికొనఁగోరెదవా? పల్నాటి కృష్ణుఁడగు బ్రహ్మనాయఁడంతవానిని దేశముల వెంటఁదిప్పిన నాగమ్మ జీవచరిత్ర చదువుము. ఆమె కీర్తివాంఛ పరికింపఁ గోరెదవా? పదునాఱేండ్ల బాలప్రాయమున భావనాశలనన్నిఁటిని దిగఁద్రావి ప్రాణనాథునిఁ గదనరంగమునకుఁ బంపిన మాంచాల దివ్యచారిత్రము జ్ఞప్తికెలయించుకొనుము. ప్రమాదము నొందిన పతికి విధ్యుక్తధర్మము నుపదేశించు ఆమె ఉత్సాహము తిలకింపఁ గోరెదవా? వీరవిహారము విరమించి యింటికివచ్చిన భర్తను ఉద్బోధించి తిరిగి యుద్ధభూమికిఁబంపిన చానమ్మ చరిత్రము స్మరణకుఁ దెచ్చికొనుము. ఆమె మానసంరక్షణ ప్రియత్వమును దెలిసికొనఁ గోరెదవా? మానభంగభయమునఁ దమ ప్రాణములను తృణప్రాయముగఁ దుఃసముట్టించిన రాగమ్మ, మల్లమ్మ, రమణమ్మల చరిత్రములను అధ్యయనము చేయుము. ఆమె స్వార్థత్యాగము, ప్రభుభక్తి పరిశీలింపఁ గోరెదవా?

మహాకష్టములఁబడి పెద్దాపురసంస్థానమునకు ప్రభుబిక్ష పెట్టిన మహాలక్ష్మమ్మ మహనీయచరిత్రమును బునశ్చరణచేయుము. ఆమె వాక్పరిశుద్ధి నెఱుంగఁ గోరెదవా? సీతమ్మ జీవితమును బరికింపుము. ఆమె పితృభక్తి, పతిభక్తి తెలియఁగోరెదవా? గణపమ్మ జీవితమును బరామర్శింపుము. ఆమె సంఘదురాచారతిరస్కారప్రియత్వమును చూడఁగోరెదవా? పతిమరణానంతరము-సహగమనము చేయనొల్లని మంగమ్మచరిత్రమును, శిరోజములఁదీయింప నంగీకరింపని వెంకమ్మచరిత్రమును స్మరింపుము. ఆమె నర్తనవైదుష్యమును నెఱుంగఁగోరెదవా? మాచల్దేవి, లకుమాదేవి వీరలనుగూర్చి శాసనశంఖములు ఏమని శబ్దించుచున్నవో అవధరింపుము. ఆమె సంస్కృతభాషాపాండిత్యము పరికింపఁ గోరెదవా? మృతప్రాయమగు ఆభాషయందు కష్టించి కృషిసల్పి కవిత్వము చెప్పి మెప్పులందిన గంగాదేవి, మధురవాణి, రామభద్రాంబల చరిత్రములను అవలోకింపుము. ఆమె మాతృభాషావైదుష్యమును పరిశీలింపఁగోరెదవా? తెలుఁగునఁగావ్యపుష్పముల వెలయించిన మొల్ల, ముద్దుపళని, రంగాజమ్మ-వీరల కథ నవధరింపుము.

ప్రాక్తనకాలమున ఆంధ్రపురంధ్రి యిట్టి కీర్తనీయచరిత్రమున విలసిల్లినది. కాని మధ్యకాలమున నామె మసిపాతఁగట్టిన మాణిక్యమువలె వికాసవైభవమును గోల్పోయినది. అప్పుడైనను ఆమెకు దీక్షలేక పోలేదు, బుద్ధిలేక పోలేదు. కాని ఆదీక్షకు ఉచితోపయోగవృత్తి, ఆబుద్ధికి సంస్కారణమును గొఱవడియుండినవి. ప్రస్తుతము ప్రబోధసమయమగుటచే నా దుస్థితి తొలఁగిపోవుచున్నది. ఆశాకిరణములు ఎల్లయెడల ద్యోతకమగుచున్నవి.

ఇప్పుడు ఆంధ్రరమణులు ఆహాపుట్టుసల్లు గ్రంథములు రచియించుచున్నారు; పత్రికలు నడుపుచున్నారు; కష్టసాధ్యములగు పెద్ద పెద్దపరీక్షల నిచ్చుచున్నారు. శ్రీమతి ఆచంట రుక్మిణమ్మ మొన్న అంతర్జాతీయసమావేశమునకు ప్యారిసునగరమునకుఁ బోయి వచ్చినది. శ్రీమతి ఆదిపూడి వసుంధరాదేవి యం. ఏ. పరీక్షనిచ్చి లండనునగరమున రసాయనశాస్త్రము పారము గనుఁగొనుచున్నది. శ్రీమతి డాక్టరు లక్ష్మీదేవి యం. బి., బి. యస్. పరీక్షనిచ్చి వైద్యవిద్యయందాఱితేరి శ్రీయుత ఆచంట లక్ష్మీపతి భిషగ్రత్నమునకుఁ దగిన పుత్రిక యనిపించుకొనుచున్నది. శ్రీమతి రుక్మాబాయి అద్భుతకృత్యముల నొనర్చి తన శరీరబలమును ప్రకటించుచు ఆంధ్రస్త్రీలోకమునకు వన్నె దెచ్చుచున్నది. శ్రీమతులు దిగుమర్తి బుచ్చికృష్ణమ్మ, దామెర్ల సత్యవాణి మున్నగు వారు జీవకళ యుట్టి

పడునట్లు చిత్రముల వ్రాయుచు నాంధ్రపురంధ్రుల చిత్రకళానైపుణ్యమును లోకమునకుఁ జాటుచున్నారు. దేశమాతపాదముల సన్నిధిని తన చీమునెత్తురులు సమర్పించి శ్రీమతి మాగంటి అన్నపూర్ణాదేవి మన దురదృష్టవశమున దివంగతురాలైనది. శ్రీమతి కోకా కృష్ణవేణమ్మ తూర్పు గోదావరిమండలవిద్యాసంఘవ్యవహారములను దక్షతతో నిర్వహించుచున్నది. శ్రీమతులు పోణకా కనకమ్మ, ఉన్నవ లక్ష్మీబాయమ్మ స్త్రీవిద్యాసంస్థలను ప్రశంసనీయముగ నడుపుచున్నారు. శ్రీమతి పెద్దాడ కామేశ్వరమ్మ సంఘసేవయందు నిమగ్నయై రాజమహేంద్రవరము కీర్తిని నిలబెట్టుచున్నది. మఱికొందఱు రమణీమణులు మునిసిపాలిటీలు, జిల్లాబోర్డులు, తాలూకాబోర్డులు మున్నగు ప్రజాసంస్థలయందు సభికురాండ్రయి; గౌరవన్యాయాధికారిణులై తమ సంఘాభివృద్ధిని వెల్లడించుచున్నారు. ఇవి అన్నియు సంతోషకరములగు విషయములు.

సంతోషకరములగు విషయములు. అవును. అయినను మన మీసంతోషమునఁ బరవశులము కాఁగూడదు. పారవశ్యము నొందవలసినస్థితి ఇంకను రాలేదు. ఆంధ్ర స్త్రీసంఘమింకను ఎన్నోవిధముల నభివృద్ధిని గోరుచున్నది. ఆవిధముల నరసి ఏతత్ప్రయత్నము చేయుట ఆవశ్యకమగు మన భావికర్తవ్యము.

సౌందర్యోపాసకుఁడగు బాలచంద్రుఁడు ఆరాధనము పురికొల్పు నిజపత్ని మాంచాల ముఖమున అలనాఁడు తన కరవాలమునకు ఆశీర్వాదరక్షాక్షతల నందినట్లే సౌందర్యాధ్యేతయగు యువకుఁడు ప్రేమార్చనసల్పు ప్రణయిని చుఱుకుకన్నులలో నేఁడు దేశాభివృద్ధికి సందేశదీప్తి నందునట్లు ఆంధ్రస్త్రీల స్థితిని చక్కఁజేయ మనము ప్రయత్నింపవలసియున్నది. కావున మనము కార్యవ్యగ్రహృదయుల మగుదము. అనంతరము దైవము తోడ్పడవచ్చును.

## తొయ్యలిఁబాసి దేశసంచారము.

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

ఉ. దూరమునుండి యెండఁబడి దూపిలి యింటికినేఁగుదెంచు చో
ప్పారసి కూర్మిపేర్మి వినయంబు భయంబు దొలంకుచూడ్కి నిం
డారిన మోముతోడ నెదురయ్యెడు తొయ్యలిఁబాసి దేశసం
చారముచేతరోఁత, పరిచారకులా? ధనమా? వృథా! వృథా!!

# గర్భిణిస్త్రీ పోషణ.

వావిలికొలను పద్మాపసమ్మగారు బి. ఎ.

వివాహితయయిన స్త్రీగర్భవతియగుట సామాన్యమైన విషయము. అయినప్పటికి అదియొక విశేష మైన స్థితిగనె తలపవలయును. ఏలననగా ఇకను పుట్టబోవు శిశువును గర్భిణీస్త్రీమూలముగనే మనము తెలిసుకొనగల్గుదుము.

శిశువు—ముందు బాల్యదశను పెరిగి దేశసేవకుడుగ పరిణమించబోవు మనుజునిజీవితము—జననము నుండికాదు ఆరంభమగుట, పిండోత్పత్తి అనగా గర్భమైనది మొదలుగ ఆరంభించుచున్నది. ఆ జీవితము యొక్క మొదటిదశ తల్లి గర్భవాసము. కాబట్టి ఆరంభము నుండి ఆప్రాణమును జాగ్రతగా కాపాడి పెంచ వలెను. పునాది బలముగా వేయనిది శాశ్వతమైన కట్టడమును కట్టుటకు యేలాగు సాధ్యము గాదో అటులనే తల్లి గర్భమునందుండు పిండమును ఆరోగ్యవంతముగాను ధృఢమైనదిగాను పెంచినగాని ఆరోగ్యమైన దృఢమైన శిశువుపుట్టదు. అది ఆరోగ్యముతో కూడినట్టియు, దృఢశరీరియునగు జీవిగా పెరగదు. కావున శిశువును జాగ్రతగా కాపాడి పెంచుటకు గర్భము దాల్చిన స్త్రీని జాగ్రతతో కాపాడవలెను. గర్భిణీ స్త్రీకిని గర్భమందుండు పిండమునకు అభేదమైన సంబంధము కలదు. కనుక గర్భిణీస్త్రీకి కలిగెడు వ్యాధి, సంకటము, దుఃఖము ఇవన్నియు గర్భములోని పిండమునకు వ్యాపించును. కాబట్టి గర్భధారణకాలములో స్త్రీని అతిజాగ్రతగా సంరక్షించుట అత్యావశ్యకము.

శుభ్రమైనగాలి, నిర్మలమైననీరు, సారవంతమైన మంచి ఆహారము, యీమూడున్ను గర్భిణీస్త్రీకి ధారాళ ముగా కావలసియుండును. ఆమె ఉండుచోట చుట్టుప్రక్కల చెత్త, పెంట ఉండనీయరాదు. మనసుకు సంతోషము, నెమ్మది, ఆనందము కలుగచేయు పరికరములమన్య ఆమె యుండవలెను. అప్పుడు ఆమె మనసు సదా సంతోషము కలిగియుండును. ఇదిగాక స్వల్పముగా వ్యాయామమును, విశ్రాంతియు ఆమెకు అవసరములు. రేయింబగళ్లు యెల్లకాలము గర్భిణీస్త్రీ ఇంటిలోపలనే యుండకూడదు. మంచి గాలిగల్గి ఎండయుండు బయలున ప్రతిదినమును కొంతసేపు తిరుగులాడవలెను. కార్తిక సమారాధనలు, యితర వనభోజనములకు ఆమెను పోనీయరాదు. ప్రథమగర్భిణులకు సాధారణముగా కల్గు లజ్జ, భీతి పోవునట్లు సర్వవిధముల ప్రయత్నింపవలెను. ఆమె పరుండుగదిలో ధారాళముగా గాలివచ్చునట్లుంచ వలెను.

గర్భిణీ స్త్రీలకు సాధారణముగా తిండియాశ మెండు. ఏది యంటే అది తినువాడుక కలిగియుండును. ఇట్టియాశ దేహమునకు అవసరమైన భోజనేచ్ఛగాదు. శరీరమునకు చెడుగు కలుగచేయు పదార్థములపైన

కూడ యాశ జనియించును. కనుక యిట్టి యాశలను మట్టుపరచవలెను. గర్భము దాల్చిన స్త్రీకి జీర్ణశక్తి తగ్గియుండును గనుక మాచినది తినుటవల్ల అజీర్ణవ్యాధి కలిగి ఆమెను, ఆమె గర్భమందుండు శిశువునను ముప్పువాటిల్లును.

సాధారణముగా స్త్రీలు యిండ్లలో చేయుచుండు గృహకృత్యములను గర్భము దాల్చిన స్త్రీలు కూడ చేయుచునే యుండవలయును. అందువలన శరీరము తేలికగానుండి ప్రసవము సుఖముగా అగుటకు తోడ్పడును. పని పాటలు చేయక కూర్చుండి యుండడమువల్ల దేహము భారమై ప్రసవించుట కష్టమై ఒకవేళ డాక్టరు సహాయము కావలసిన స్థితి కలుగవచ్చును.

రాత్రిళ్లు బాగుగా నిద్రపోవలెను. పగటిపూట కూడ కొంచెము సేపు విశ్రాంతి తీసికొనుట మంచిది. అయితే పగలు భోజనము చేసినది మొదలు సాయంకాలము వరకు పడుకొనియుండకూడదు. మధ్యాహ్నము ఎండవేళ కొంచెము సేపు విశ్రమించవలెను.

గర్భిణిస్త్రీ యుండుచోట్లు ఆమె మనసుకు సంతోష మిచ్చునట్లుంచవలెనని పైన చెప్పబడినదిగదా! తండ్రి గుణములు కొడుకుకు పట్టుబడునని చెప్పుదురు కదా! తల్లి గుణములు కూడ పిల్లకు పట్టుబడును. తల్లి సంతోషమైన మనసు గలదిగా నుండినయెడల పుట్టెడు బిడ్డలును, ఆనందమయులును, సుగుణవంతులును అయి యుందురు. గర్భిణీకాలమునందు మనోవ్యథలు, దుఃఖము కష్టము వీటికి పాల్పడెడు దురదృష్టవంతురాలికి ఎప్పుడు ఏడ్చుచు చీటికి మాటికి పోరుపెట్టుచుండు బిడ్డలు కలిగి వారిని పీడించుచుండెడు దౌర్భాగ్యమును తటస్థించును.

గర్భిణీస్త్రీలు దేహారోగ్యమును మనస్సంతోషమును కలిగి గర్భిణీకాలమును గడపినయెడల దేశమునకు ఉపయోగకరమును సుగుణసంపన్నమును నగుసంతానమును కని దేశక్షేమమునకు తోడ్పడెదరు.

# సరస్వతి

కీ॥ శే॥ బులుసు సీతారామశాస్త్రిగారు

నలువ మేల్మోముదమ్ములయందు నేనాతి నటనవిద్యామహాత్మ్యతఁగాంచు
నడలకోడినయంచ నడుము నధిష్టించి యేచాన జగములఁదాఁజరించు
వేదవేదాంగసంవాదనోద్యత్స్వరముఁబట్టి యేనాతి ముఖునుఁగాంచుఁ
బ్రాఁబల్కు పొత్తంబుఁదాఁబట్టి నొకకేల నొకకేల వీణ నేయువిద పట్టు

అట్టివేల్పులదొరసాని యజునిరాణి
హాసితసైకతసుశ్రోణి యబ్జపాణి
అంబుదశ్రేణిసమవేణి యమృతవాణి
వాణి యిడుఁగాత మాకు వాగ్వైభవంబు.

# ఉప్పు

యస్. శేషగిరిరావు గారు యల్. ఐ. యమ్.

జూనుమాసపు గృహలక్ష్మి సంచికలో డాక్టరు. కే. యన్. కేసరిగారు అపరిశుద్ధమైనఉప్పు, దానిసేవనచే కలుగు జాడ్యములు, దానిశుద్ధిని గురించి వివరించి వ్రాసియున్నారు. ఆవ్యాసము చూచిన మీదట నాకు గృహలక్ష్మిపాఠకులకు ఉప్పుయొక్క గుణములను ఔషధోపయోగములను తెలుపవలయునను కుతూహలము జనించినది. ఆకుతూహలమును పురస్కరించుకొని నేనీవ్యాసము వ్రాయుచున్నాను.

ఉప్పే సర్వమనియు, ఆయుర్వృద్ధికరమనియు స్వామి లవణానందులవారు ఉపదేశించుచున్న విషయము సర్వజనవిదితము. లవణానందస్వాములవారి సదుపదేశమును కాదనుటకు కాబోలు ఈనడుమ తత్త్వజ్ఞాన సమాజప్రచురణాలయమువారు (Theosophical Publishing House) 'ఉప్పు—అపనమ్మిక' (Salt—a Superstition) అనునొకగ్రంథమును ప్రకటించియున్నారు. ఎవరి యభిప్రాయ మెటులున్నను ఉప్పు—ఉపయోగకరమైనదేయైనను—అమితముగను, అనవసరముగను వాడుట చెఱుపునకే.

## ఉప్పుయొక్కగుణములు

సాధారణమైన ఉప్పు కాక చేసి ఆర్చును. అన్నిపదార్థములకంటె ఎక్కువ బలము నిచ్చును. వీర్యపుష్టిచేయును. జఠరదీప్తి కలిగించును. జీర్ణముగావించును. రుచిపుట్టించును. విరేచనము చేయును. వాడు పరిమాణములు, అనుపానములు ననుసరించి వివిధ గుణములను కలుగ చేయును.

## ఔషధోపయోగములు

నేతిలో ఉప్పు వేసి కాచి పుచ్చుకొనిన శూలలు అణగిపోవును. ప్రథమకబళముతో కొద్దిగ ఉప్పుపుచ్చుకొని అనంతరము భోజనముచేసిన పరిణామశూలలు తగ్గును. రెండు లేక మూడు తులముల ఉప్పు చల్లనినీళ్లతో గలిపి పుచ్చుకొనిన రక్తవమనము కట్టును. వేడినీళ్లతో పుచ్చుకొనిన వమనముచేయును. ఉప్పునీరు నస్యము (లోనికిపీల్చుట) ఇన్ఫ్లుయంజాయను విషమజ్వరమును రాకుండజేయును. ఉప్పునీరు వస్తికర్మ తలనొప్పులను పోగొట్టును; కడుపుఉబ్బరము, శూల వీనిని నివారించును; పెద్దపేగులయందుండు క్రిములను బయటికి త్రోయును. జెణుకు నొప్పులు, కండరములందలి తీపులు, కీళ్లవాయు శూలలు, చర్మరోగములు—వీని నివారణము కొఱకు ఉప్పునీటిస్నానము సహకారియగును. జార్జి సార్వభౌముని దంతశస్త్రవైద్యులగు సర్ హారీబాల్డువినుగారు దంతముల నిత్యశుద్ధికి ఉప్పు నీరు అతిప్రశస్తమైనదని నొక్కి వక్కాణించుచున్నారు. కీళ్లనొప్పులకు గండమాల సంబంధమైన వాపులకు వెచ్చచేసిన ఉప్పుతో కాపడము పెట్టుట సర్వసాధారణముగ అవలంబింపబడు సూక్ష్మక్రియయే.

ఒకపౌను తూకముగల ఉప్పుచూర్ణమును పలుచని నారబట్టలో మూటగట్టి అగ్నిపై వెచ్చచేసి ఒక్కొక్కసారి ఇరువది లేక ముప్పది నిముసములవఱకు కాపడము పెట్టినచో అజీర్ణసంబంధమైన కడుపునొప్పికి అమోఘముగ పనిచేయును. మితమైన మోతాదులుగ నుపయోగించినచో ఉప్పునందు రసాయనికగుణము కలుగును.

కలరా, ప్లేగు, రక్తస్రావము మొదలగు ప్రబలరోగములలో ఆంగ్లవైద్యవేత్తలిచ్చు సెలైన్ ఇంజంక్షనులో విశేషభాగము పనియగునది ఉప్పే. ఆయుర్వేదవైద్య విధానమున ఉప్పు పెక్కుమందులలో—అందుముఖ్యముగ శూల, అజీర్ణము, గుల్మవ్యాధి మొదలగువానికొఱకు వాడు మందులలో—కలియుచున్నది. చక్రదత్తలో చెప్పబడిన నారికేళక్షారము, శార్ఙ్గధరసంహితలో వచింపబడిన భాస్కరలవణము మొదలగు ఔషధ యోగములను పరికించిన వారికి ఈవిషయము అనుభవవేద్యమే. ఉప్పువలన ఇంతటి మేళ్లు కలవుగదాయని దానిని పరిమాణమునకు మించి మితముదప్పించి పుచ్చుకొనినచో

ఎముకల బలమును తగ్గించును, వీర్యపుష్టికి చెఱుపుచేయును. నెయ్యి, చలవవస్తువులు, బియ్యము కడిగిననీళ్లు, నిమ్మపండు, మజ్జిగ — ఈవస్తువులు ఉప్పువలన కలుగు దోషమునకు విరుగుళ్లు.

ఆయుర్వేద వైద్యవిధానమున ఉప్పు నిషిద్ధమైన మందులుకూడ కొన్నియున్నవి. పాండు మొదలగు రోగములచే బాధపడువారికి ఆయుర్వేదవైద్యులు ఉప్పులేని పథ్యమును నియమింతురు.

# కవిత.

స్థానాపతి రుక్మిణమ్మగారు

౧

అమలభోగైక విశ్వంభరాధపతిక
కలితమాతంగ సైంధవోత్కరభటాది
వర్గసాహస్ర మెంతైన వరలనిమ్ము
కవిత లేకున్న గీర్తి నిక్కముగ గలదె ?

౨

అంధుడారయ కమలపత్రాక్షుడనియు
పరమకృపణుండు సంతానతరువటంచు
భీరువెంతయు శౌర్యగంభీరుడనుచు
ఖ్యాతిగాంచుట కవి కృపాకలనఁగాదె ?

౩

అన్యదేశాలసంచార మన్యదాస్య
మొకక్కభార్యకు సేవురునొప్పమీర
భర్తలైయశముగనుట పాండుసుతులు
వ్యాసకవిసార్వభౌము నిర్వ్యాజకరుణ.

౪

సూర్యచంద్రాది సుపలు విస్ఫూర్తిమెఱయ
నాదిమధ్యాంతరహితుఁడౌ ఆపరాత్ప
రుడును యెదిగాంచగా లేరొ కడగియొక
కవిమహాత్ముండు సద్దాని గాంచుజగతి.

౫

ద్వివిధ మాగోచరించెడి విశ్వమంత
నామరూపాత్మకంబని నవ్యఫణితి
నామప్రాపంచనిర్మాత యేమొకవియె
ధాతరూపాత్మజగతి నిర్మాతయయ్యె.

౬

మొల్ల తరిగొండ వెంకమ్మ ముద్దుపళని
అచ్చమాంబయునాదియౌ ఆంధ్రమహిళ
లమితవిఖ్యాతి గాంచుటీయవనిలోన
క్రమకవితామృతాస్వాదకలనఁగాదె?

# కృతజ్ఞతా చిహ్నము

పాలెపు వెంకటరత్నముగారు

## ౧

### అన్యోన్యము

జానకీ రామభద్రులు చతురంగ మాడుచుండిరి. వృద్ధనారి భాగీరథమ్మ గృహ కృత్యములు నిర్వర్తించుకొని.—

బంగారు మేడలో—బాగైన రత్నాలచవికెలోపల
శ్రీరామచంద్రులూ—సీతమ్మ చతురంగమాడు చుండిరా

అని పాటలు పాడుకొనుచు ప్రవేశించెను.

మాతృదేవతను చూడగనే రామభద్రు డాటముగించి వినయవినమితశిరస్కుడై నమస్కరించెను. తోడనే జానకియుఁ బ్రణమిల్లెను. ఆప్రేమమూర్తి వారిని లేవనెత్తి మనసార దీవించి

"రామభద్రా! నేడు గెలుపు నీదా మాకోడలిదా?" యని ప్రశ్నించెను.

"అమ్మా! యీరోజున నీకోడలిదే గెలుపు. నిన్నటి నా విజయమును జూచి పట్టుదలతో నేడు నన్ను గెలిచినది" అని రామభద్రుడు ప్రత్యుత్తర మిచ్చెను.

జానకి త్రపాభరంబున మోమువరవాంచెను. ఇంతలో "రామభద్రా" యని మిత్రులెవరో వీధిలోఁబిలచిరి.

ఆతడు మాతృదేవి యాజ్ఞగైకొని దుస్తులధరించి, తన ద్విచక్రికపై వారి ననుగమించెను.

జానకి బీరువనుండి "అభిజ్ఞానశాకుంతలము" దీసి చతుర్థాంకముఁ జదువుచు శయ్యపై బరుండెను.

భాగీరథమ్మ ప్రక్కగదిలో పాటలు పాడుకొనుచు వత్తులు చేసికొనుచుండెను.

## ౨

### అనుమానము

రామభద్రుని తండ్రి ఉన్నతోద్యోగముం జేసి అపారమగు ధనము గడించి స్వర్గస్థుడయ్యెను.

భాగీరథమ్మకు రామభద్రుడనిన మిక్కిలి ప్రేమ. జానకీ రామభద్రులు ప్రణయ జీవనమున జానకీరాములే! వాత్సల్యమున భాగీరథమ్మ కౌసల్యామాతయే! రామభద్రుడు మదరాసులో న్యాయకళాశాలయందు చదువుచున్నాడు.

జానకి సౌందర్యమున అసదృశ. విద్యలకునిధి. సౌజన్యమునకు పుట్టినిల్లు. మూర్తీభవించిన పతిభక్తి.

ఆమెతండ్రి రాజమౌనిగారొక గొప్పసంస్కర్త. స్త్రీవిద్యాభిమాని. ఆయన తన కుమార్తె కున్నతవిద్య చెప్పించెను. జానకి దివ్యజ్ఞానకళాశాలలో నైదవఫారమువరకుం జదివెను. గీర్వాణభాషలో చక్కని పాండిత్యము సంపాదించెను. ఆంధ్రమున నామె పఠింపనిగ్రంథమే లేదు. కొన్ని ప్రబంధములలోని రసవత్తరఘట్టము లామెకు కంఠస్థములు. హిందీభాషయందు చక్కని ప్రవేశముగలదు.

ఆమె చదువుకొనునప్పుడు 'తులసీదాసునిగేయములు' పాడుటయందును 'ద్విజేంద్రుని నాటకముల'లో కొన్నిపాత్ర లభినయించుట యందును ఆమెపొందిన బహుమతులసంఖ్యాకములు.

రాజమౌనిగారు దివ్యజ్ఞానసామాజికుడు. క్రైస్తవకళాశాలలో ప్రధానోపన్యాసకుడు. రామభద్రుడు క్రిస్టియన్ కాలేజీలో బి. ఏ. తరగతిలో చదువుచున్నపుడు అతనికి జానకినిచ్చి రాజమౌనిగారు వివాహమొనర్చిరి.

ఆయనకు రామభద్రుడనిన పుత్రవాత్సల్యము. నాడు సంధ్యాకాలమున రాజమౌనిగారు సముద్రతీరమునకు షైరుబోయి తిరిగివచ్చుచుండిరి.

రామభద్రుడు విక్టోరియా హాస్టలులో నొకవితంతువుతో సంభాషించుచుండెను.

రాజమౌనిగా రది తిలకించి యచ్చెరువందిరి. ఇదివరకు రామభద్రుడు పరస్త్రీలతో పలుకాడి యెరుగడు.

## 3
### స్వప్నము.

సంధ్యాసమయమున జానకీబాల విపంచితో తన మృదుమధురగాత్రమును మేళవించి గానము చేయుచుండెను. సంగీతమున జానకి సరస్వతి. సంధ్యారుణకాంతు లస్తమించెను. జానకి శ్రోత్రపేయముగా పాడుచుండెను. నాడు బహుళతదియ. ఆకసమున బాలచంద్రోదయమయ్యెను. జానకి పాటముగించెను.

ద్వారమున రామభద్రుడు ద్విచక్రి దిగెను. శ్వేతవెన్నెలవెలుగులో నాథుని జూచి జానకి జలమును దువ్వలువయు దెచ్చియందించెను. రామభద్రుడు దుస్తుల విసర్జించి పంచె ధరించి పాదప్రక్షాళనము చేసికొనుచు "జానకీ! అమ్మయేదీ?" అని ప్రశ్నించెను.

జానకి ప్రత్యుత్తరమిచ్చు లోపుననే భాగీరథమ్మగారచ్చటకువచ్చి "నాయినా! నేడింత యాలస్యమేల చేసితివి? పెందలకడనే యిల్లుజేరుకొనిన మంచిదికాదా?" యనెను.

"అమ్మా! నేడు కార్యాంతరములచే కొంచె మాలస్యమైనది. క్షమింపుము." అని యాతడు వినయముతోం బలికెను.

భాగీరథమ్మగారు జానకీరామభద్రులకు రెండు రజతపాత్రలలో భోజ్యములు వడ్డించెను. సల్లాపములతో వారు భోజనములు ముగించిరి.

వృద్ధురాలికి మితిలేనిసంతోషము. ఆమెకు యేకమాత్రపుత్రుడే స్వర్గము; స్నుషయే పెన్నిధానము. వారిసౌఖ్యమే అమెకు మోక్షము. గృహకృత్యములన్నియు నామె స్వయముగా నెరవేర్చుకొనును. జానకి నెంతమాత్రమును చేయిజేసికొననీయదు.

శయనాగారములో రామభద్రుడు గ్రామఫోను దెరచెను. ఆతనికి గానమన్న మిగులప్రీతి. ఉత్తర హిందూస్థానవారకాంతలగు మిస్‌గోహార్, మిస్‌దులారీ, జానకీబాయి, మాల్కాజాన్ మొదలగువారి పాటల నాతడెక్కుడుగా సేకరించెను.

ఆదంపతు లిరువురును చాలసేపు గానరసామృతమును గ్రోలిరి. తరువాత విషయము గ్రంథపర్యాలోచనము. భవభూతి విరచిత ఉత్తరరామచరిత్ర లోని జానకీరఘురాముల ప్రేమతత్వమును గూర్చి వారికి వాదప్రతివాదములు పెరిగిపోవుచుండెను. కొన్ని విషయములలో రామభద్రుడు సరియైన ప్రత్యుత్తర మొసగ జాలకుండెను. ఆతడేలనో పరధ్యానముగానుండెను.

భాగీరథమ్మ భగవద్ధ్యానము చేసికొనుచు నిదురించెను.

నాటిరేయెల్ల రామభద్రుడు స్వప్నప్రపంచములో దిరుగాడుచుండెను. తాను విక్టోరియాహాస్టలులో మేడపై నొక కుర్చీలో కూర్చున్నాడు. పార్శ్వమందు తన మిత్రుడు వసంతరావున్నాడు. కట్టెదుటికుర్చీలో సౌదామినీదేవి. వసంతరావు సౌదామినీ వృత్తాంతము తనకు నివేదించుచుండెను. ఉషఃకాలమున శకుంతముల గీతములచే నాతడు ప్రబోధితుం డయ్యెను.

## ४

## ప్రవర్తనము.

సౌదామిని సాధారణ సౌందర్యవతి. చామనచాయమేను. పాశ్చాత్య సాంప్రదాయానుసారముగా నామె దుస్తులుధరించును; శిరోజములు సవరించును. క్రైస్తవకళాశాలలో నామె బి. యే. సీనియరు తరగతిలో చదువుచుండెను. ఆమె యాంగ్లభాషాధోరణి నిరాఘాటము, నిర్దుష్టము. సహజమధురమగు కంఠస్వరముతో 'టెన్నిసను షెల్లీ' మొదలగు కవులపద్యముల నామె పఠించునప్పుడు యువకులు సమ్మోహితులై పోవుచుందురు. వసంతరావు రామభద్రున కామెతో పరిచయము కలిగించెను. సౌదామిని విద్యావతి యేకాని సుశీలకాదు. రామభద్రుడు సౌదామినీ చంచలవిలాసములకు సంపూర్ణముగా వశుడయ్యెను. అమాయికమగు జానకి హృదయము తల్లడిల్లిపోవుచుండెను. ఆమె పూర్వమువలె పతిప్రేమభాగ్యముం బడయుచుండుటలేదు. రామభద్రుడు భోజనసమయమందు తక్క మిగిలిన కాలమంతయు సౌదామినీ సాన్నిధ్యముననే.

క్రమముగ నీసంగతి జానకీ భాగీరథమ్మలకు తెలిసెను. భాగీరథమ్మ దుఃఖముచే కుమిలిపోవుచుండెను. జానకి శోకమును పారములేకుండెను.

ఆమె యొకనాడీవిషయ మాతనితో ప్రస్తావించెను. ఆతఁడు మౌనముద్రాంకితుం డయ్యెను.

*　　*　　*　　*　　*

వెల్లింగ్టన్ సినీమాలో 'ముగ్గురుయోధులు' ప్రదర్శనము ముగిసెను. సౌదామినీ రామభద్రులు మోటారుబండి నధిష్ఠించిరి. రాజమార్గా రదిచూచి లోగడవారికి గలిగిన యనుమానము నిర్వర్తించుకొనిరి. నిమ్నాభిముఖమైన నీరు నిలుపరాదని వారు ఉదాసీనత వహించిరి.

౫

## వలపుకమ్మ

జానకీ రామభద్రుల ప్రణయలత వాడిపోయినది. రామభద్రునిహృదయమను వెన్నెలపులుగు రాకాచంద్రికాసమమగు జానకిప్రేమనుండి మరలి అతిచంచలయగు సౌదామినింజేరెను.

భాగీరథమ్మ శయ్యాగతురాలై యుండెను. మ్లానమైయున్న స్నుషావదనముం దిలకించినపు డామె నేత్రములనుండి యుష్ణాశ్రువులు జలజలరాలుచుండెను. వాత్సల్యప్రపూర్ణమగు నామె హృదయము దారుణవ్యథ ననుభవించుచుండెను.

జానకి చిక్కి సగమాయెను. వేడినిట్టూర్పులచే నామె తనువల్లిక క్రాగి పోవుచుండెను. రాజమానిగారు ప్రతిదినము వారిగృహమునకేగి చూచి వచ్చుచుండిరి.

రామభద్రు డమితముగా ధనమును వ్యయించుచుండెను. ఆతడొక గృహము నద్దెకు దీసికొనెను. దానిలో సౌదామినితో నాతని ఉనికి. ఆతడుక్రొత్తగాకొన్న మోటారు కారుపై వారిరువురకు సాయంతనవిహారములు.

రామభద్రు డొకనాడు చిత్తుకాగితములు తిరుగవేయుచుండగా వానిలో నాతని కొక లేఖ కాన్పించెను. అది సుదర్శనరావను నొకయువకునకు సౌదామిని వ్రాసిన వలపుకమ్మ. సౌదామిని పొరబాటుచే నది చిత్తుకాగితములలో జేర్చినది. సుదర్శనరావు సౌదామినితరగతిలో చదువుచున్న యొకసుందరపురుషుడు. ఆమె యొకపాతలేఖను కవరులో నాతనికిం బంపించి తాను వ్రాసిన లేఖను పొరపాటున చిత్తుకాగితముల బుట్టలో పారవైచెను.

రామభద్రునకు సౌదామిని దుస్స్వభావము గ్రాహ్యమయ్యెను. తటాలున యాతని బుద్ధి జానకి వంకకు మరలెను. "ఆహా! యెంతతారతమ్యము, అదియొక స్వర్గము. ఇది యొక నరకము." అనియతడనుకొనెను.

కరుణాప్రపూర్ణహృదయ మాతృదేవత స్మృతిగోచరము కాగానే యాతని నయనములనుండి ముత్తెములంతేసి యశ్రువులు రాల జొచ్చెను.

కట్టెదుట సౌదామిని సాక్షాత్కరించెను. ఇదివర కాతని భావవీథినిం దోచిన యూహాలన్నియు మెఱపు తీగలవలె నదృశ్యములయ్యెను.

"సౌదా! నీహస్తమలంకరించిన దేమి గ్రంథము?" అని యతఁడు దరహాసితవదనుఁడై ప్రశ్నించెను.

"రామా! నీకు ముఖ్యముగా కావలసిన గ్రంథమిది" యని యామె రాధికా సాంత్వన మాతనిపై విసరెను.

వారు సరససల్లాపములలో నిమగ్నులై యుండిరి.

## ౬

## అపాయము

ఆనాటి సాయంకాలము సముద్రతీరమున రెండు మోటారుకార్లు ఢీకొనియెను. ఒకదానిలో జనము లేరు. రెండవదానిలోనున్న యువతీయువకులును చోదకుడును స్మృతితప్పి పడిపోయిరి. ఇంతలో వెనుకనుండి వచ్చుచున్న యొక పెద్దమనుష్యుని సాహాయ్యమున వారు జనరల్ హాస్పిటలునకు గొంపోబడిరి.

ఆయువతీయువకులు సౌదామినీ రామభద్రులే! ఆ పెద్ద మనుష్యుడు రాజవానిగారు.

హాస్పిటలులో సౌదామినీ రామభద్రులు స్మృతిగాంచిరి. రామభద్రుని హృదయము గాఢపశ్చాత్తాపాగ్నిచే తప్తమగుచుండెను.

నిరుపమాన సౌందర్యవతి, ప్రేమప్రపూరితహృదయ అమాయికస్వభావ యగు తనసతి జానకీ పరితాపాగ్నియే తన్నిట్లు దహించుచున్నదని యతడు తలపోయుచుండెను.

"నామాతృహృదయము కరుణారసార్ద్రమైనది. నాప్రవర్తన కామె యెంత పరితపించుచున్నదో? ఆమె హృదయమున కింతటిక్షోభ గలుగజేసిన ఈ కఠినాత్మునకిక నెన్నడేని మంచిగతి పట్టునా?" యని యతడు విలపించుచుండెను.

అతని ప్రక్కశయ్యపై సౌదామిని గాయములచే మూల్గుచుండెను. ఆమెను జూచి నపుడెల్ల రామభద్రు డేవగించుకొనుచుండెను. ఆలేఖావృత్తాంతము జ్ఞప్తికి వచ్చి ఆతనికి మరింత విరక్తిని గలుగజేసెను.

హాస్పిటలు దాదు లందరి కంటె నొకదాది సౌదామినీరామభద్రుల నెక్కుడుగా సేవించుచుండెను. ఆమె యెల్లపుడును వారిని విడువక వారి చెంతనేయుండి పరిచర్య గావించుచుండెను.

రామభద్రు డామెకు తన కృతజ్ఞతను తెలియజేసెను. ఆమెను గురుతించుటకుఁ బ్రయత్నించెను. కాని యామె యవకుంఠనవతి. ఆమె సాదరపరిచర్యవలన సౌదామినీ రామభద్రులు క్రమముగా స్వస్థతిగాంచిరి. రామభద్రు డామెకు కృతజ్ఞతాసూచకముగ నొక బంగారుగొలుసు నొసంగెను.

## ౭

## మాతృచ్యుతి.

రామభద్రుడు సౌదామినీ సాంగత్యమును సంపూర్ణముగా పరిత్యజించెను. కాని యింటికిఁబోవుటకు మొగముచెల్లినది కాదు. ఆతడు పట్టణమంతయుఁ బిచ్చివానివలెఁ దిరుగుచుండెను. కారు విక్రయించెను.

ఒకనా డతడు 'మూర్ మార్కెట్టు' వద్ద తిరుగుచుండగా రాజమానిగారు తొందరగా వచ్చి "రామభద్రా! నీవుత్వరగా నింటికి రావలయు"నని హెచ్చరించి యొక మోటారుపై నాతనితో రామభద్రుని గృహముఁజేరిరి.

భాగీరథమ్మ మరణశయ్యపై నుండెను. జానకి యొకప్రక్క, ఆమె తల్లి యొక ప్రక్క నామెకు పరిచర్య గావించుచుండిరి. డాక్టరు ఔషధ మొసంగుచుండెను. రామభద్రు డదిగాంచి బాలకునివలె విలపించుచు మాతృపాదములపై స్మృతి తప్పిపడిపోయెను. పశ్చాత్తాపాగ్నిచే పుటముపెట్టబడిన యాతని హృదయ మశ్రుజలప్లావితమై పరిశుద్ధ మయ్యెను.

"నాయనా! వచ్చితివా?" యని జనని హీనస్వరమునఁ బ్రశ్నించెను.

"అమ్మా! క్షమింపుము! ఈ కఠినకర్ముని క్షమింపుము." అని యాతడు వెక్కి వెక్కి యేడువఁదొడగెను.

"అమ్మా! జానకీ, యిటురా" యని భాగీరథమ్మ బిలచెను. జానకి రామభద్రుని ప్రక్కనిలువబడియెను.

ఆమె వారిరువురి కరములను కలిపి యిట్లు మెల్లగా చెప్పెను. "నాయనా! రామభద్రా! నేటికి నీకు మంచిబుద్ధి ప్రసాదించినందులకు భగవంతున కనేకకృతజ్ఞతా వందనములు. రామా! నీవును నీభార్యయు నన్యోన్యముగా మెలగుచుండుటయే నాకు స్వర్గము. నేటినుండి యట్లు ప్రవర్తింపుము. తండ్రీ!" యని యామె అతికష్టముపై ననెను.

రామభద్రుడు మాతృచరణ కమలసాన్నిధ్యమున మోకరిలి "అమ్మా! నేటినుండి నేను జానకిని హృదయపూర్వకముగా ప్రేమించెదను. విశుద్ధవర్తనుడనై మెలంగెదను. త్రికరణశుద్ధిగా చెప్పుచున్నాను. దానికి దైవమేసాక్షి."యని గద్గదస్వరముతో పలికెను.

మరల భాగీరథమ్మ "అన్నా! రాజమానా! నీవు నాతోబుట్టినవాని వంటివాడవు. నీకును నీభార్యకును ఈదంపతుల నొప్పగించుచున్నాను." అని యామె అతికష్టము మీద మాటముగించెను.

"అక్కా! నేటికి నీపుత్రుని హృదయము పరమపవిత్రమైనది. నేను వారిని కని పెట్టుచుండెదను. నీవు బెంగపెట్టుకొనవలదు." అని యాతడు బదులిడెను.

మరికొంతసేపటికి భాగీరథమ్మ జగద్రంగమునుండి నిష్క్రమించెను. ఆసమయ మున యచ్చటి వారిస్థితి వర్ణించుటకు కలమాడుటలేదు.

## ౮

### ఆనందము.

కాలక్రమమున జానకీ రామభద్రుల దుఃఖముపశమించెను. వారు మరల సుఖమయ ప్రణయమయ జీవనము గావించుచుండిరి. రామభద్రుడు న్యాయశాస్త్రపరీక్ష యందుత్తీర్ణు డయ్యెను. ఆత డిప్పు డొకప్లీడరు.

రామసదనమందు నేడుకర్ణానందముగా సన్నాయిపాట విననగుచుండెను. బ్రాహ్మ ణోత్తముల యాశీర్నినాదంబులు వినవచ్చుచుండెను. నేడు రామభద్రుని కుమార్తె బార సాల మహోత్సవము జరుపబడుచుండెను.

రామభద్రుడు తన తనయకు 'భాగీరథమ్మ' యని నామకరణము జేసెను. ఆ సమయము జానకి శిశువు మెడలో నొక బంగారు గొలుసువేసెను.

అదిచూచి రామభద్రు డాశ్చర్యచకితుడాయెను. జనరలు ఆసుపత్రిలోని దాదికి తానిచ్చిన గొలుసు జానకికి ఎట్లువచ్చినది? జానికియు ఆసుపత్రిదాదియు నొక్కరే యగుదురా? అనిరామభద్రుడు ప్రశ్నించుకొనెను. పాఠకమహాశయులను గూడ మే మాప్రశ్న వైచుచున్నాము. ప్రత్యుత్తర మీయలేరా?

# పాడు సంసారం

కూచిభొట్ల హనుమంతరావు గారు

గోపీనాథునికి పోలీసు సబుయినస్పెక్టరుపని అయింది. ఉద్యోగం పురుషలక్షణం అనినౌకరీ చేస్తూన్నాడన్న మాటే గాని అతనికి జీవనానికి యేంలోటులేదు. భూములమీద పదిపుట్లగింజలువస్తాయి. గ్రామానగరంలో పెద్దడాబాయిల్లుఉంది. తోటలు గొడ్లు ఉన్నాయి. చిన్నప్పుడే పినతండ్రిభార్య వెంకాయమ్మకు పెంపుడు పోవడంవల్ల అతనితో పంచుకునేవారు, ఎంచుకునేవారు ఎవరులేరు. ఎంతో హాయిగా ఉండవలసింది. కాని అదృష్టము ఉండవద్దూ? ఇంతేకాన్నా ఆతనిమనస్సుకు మాత్రం శాంతిలేదు. ఎప్పుడు కలవరంగానే యుండేది. ఏంచేద్దామన్నా అతనిమనస్సు ఒప్పడంలేదు. కష్టానికి సుఖానికి ఓర్చి చిన్నప్పటినుంచి పెంచి, ఆస్తిపాస్తి యిచ్చి విద్యాబుద్ధులు చెప్పించిన తల్లికా చెప్పలేదు. తనమాట ప్రకారమే నడుస్తూ, తననే దైవంగా జూచుకుంటూ, సర్వకాలసర్వావస్థలయందు తన సౌఖ్యానికే తంటాలుపడుతూ ఉన్నకాంతాన్ని యేమనలేదు. ఏంచేస్తాడు. మధ్య నలిగిపోతున్నాడు? అటుయిటు సర్దలేక మచ్చు మాసిపోతోంది. 'నూరుపిలకలు ఒకచోట యిముడుతయిగాని, రెండుకొప్పులు మాత్రము ఒకచోట యిమడ' వనే సామెత యితనికి బాగా అనుభవం అవుతోంది. పెద్దలు యెంతో అనుభవంమీద చెప్పిన వాక్యములు ఊరకనే యెగిరిపోతయ్యా. మరి పగలంతా పోలీసుస్టేషనులో గొడవ. ప్రొద్దు కూకగానే పొయ్యివద్ద గొడవ. సన్యాసంపుచ్చుకుని యెటయినా లేచిపోదామా యనిపిస్తుండేది. ఎంతో విరక్తి పుడితేనేగాని లేక పోతే సన్యాశం పుచ్చుకోవడం కష్టంకాదూ? అతడికి ఆరోజుకారోజు యీపాడుసంసారం మీద విసుగెత్తిపోతోంది.

కాంతం కాపరానికి వచ్చి యింకా యేడాదయినా కాలేదు. ఇంట్లో ఒకటేఆగం. ఒక్కటేగోల. అత్తకోడలకు పచ్చిగడ్డివేస్తే భగ్గుమనేది. ప్రొద్దునలేచింది మొదలు ఒకళ్ల తప్పులు ఒకళ్లు వెదుకుకొంటూ కూర్చోడమేపని. కుడిచికూర్చోలేక తెచ్చుకునే పోట్లాటలేగాని వారి పెద్దలను వీరు చంపేరా ? వీరి పెద్దలను వారు చంపేరా? ఏమీలేదు. చిన్నపిల్ల అవడంవల్ల యెప్పుడూ పోరుతూఉంటే యేందిగులు పడుతుందో యని జడుస్తూయుండే వాడు. కాని పైకి మాత్రం ప్రతివిషయంలో తల్లినే అనుకరిస్తూన్నట్టుగా అగుపడేవాడు.

క్రొత్తగా యేర్పడిన సంసారం అగుటచేత భార్యాభర్తల ఆలోచనలకు గుసగుసలకు అంతు అగుపడుట లేదు. రాత్రులయందు చాలాప్రొద్దు పోయ్యేవరకు, యేదోపుట్టమీదివి పురాణం మీదివి కబుర్లు చెప్పుకుంటూ, బహుసలాసాగా కాలం గడుపుతూయుండేవారు. ప్రేమసాగరమున దరితెన్నుగానక కొట్టుకుంటూయున్నారు. అనుభవించిన కొలది ప్రేమ పెరుగుచునే ఉండును గాని తగ్గదుగదా! ప్రకృతియే ప్రేమమయమగు నపుడు మానవుల సంగతి చెప్పవలసినదేమి!

పాపం వెంకాయమ్మ పెద్దది అగుటవల్ల రాత్రులయందు నిద్రపట్టేదికాదు. వాళ్లిద్దరు సిలాసాగా కబుర్లు చెప్పుకుంటూయున్నాగనిన్ని, తనతో మాట్లాడువారు ఎవ్వరు లేనినిన్ని, గొణుగుతూయుండేది. ప్రొద్దునలేచింది మొదలు కాంతంమీద యేదో ఒకనేరం మోపుతూయుండేది. తెల్లవారగట్లే లేవలేదనో— కనిబొమ్మల్లో పొట్టెట్టుకున్నదనో—నిలుచుని నీళ్లుత్రాగిందనో యేదోగాలి ప్రోగుచేసి, పెద్దనేరాలుగా గోపీనాథుడు యింటికి రాగానే జెప్పుతూయ్యేది. ఇలాగంటివన్నీ కూడా నేరాలే!

ఏమిచెప్పినా ఒకసారి రెండుసార్లు గోప్యం. అదేపని అయితే 'గోజుచచ్చేవాడికి యేడ్చేవాడెవడ'ని లక్ష్యభావం తప్పిపోతుంది. తడవతడవకు యిలాగే పితూరీలు చేస్తూయుంటే, యేదో పిచ్చిముండ, అలాగే చెప్పుతూ యుంటుందని వినిపించుకోకుండా వెళ్లిపొయ్యేవాడు. అలా నిర్లక్ష్యంగా ఉండడంవల్ల కోపం మరింత హెచ్చిపోతూ యుండేది వెంకాయమ్మకు. గోపీనాథునికి కాంతం మందు పెట్టిందని, అలామందే పెట్టకపోతే యిదివరకల్లా తనమీద యెంతో గురిగాయుండేవాడు, అలానిర్లక్ష్యముగా యుండుటకు కారణం యు దగనీ, ఊరంతా యాగీచేసివస్తూయుండేది. ఏంచేస్తాడు. ఆమె కోపం చల్లార్చడానికని గోజుగోజు అన్నీవిని సుఖపెట్టే కాంతాన్ని యెక్కడ దండిస్తూ కూర్చుంటాడు.

ఎవరితో చెప్పినాగాని 'వెంకాయమ్మా! నీకెందుకా గొడవఅంతా. పెద్దదానివయి పోయినావా! ఏదో రెండుమెతుకులుతిని కృష్ణారామాయని కూర్చోక—లేనిపోని దంతాతెచ్చి నెత్తిన పెట్టుకుంటావు' అనేవాళ్లే. పోనీకాస్తోకూస్తో తిప్పాతనివల్ల గూడా యున్నదనుకొన్న, పోలీసు యినస్పెక్టరు అగుటవల్ల యిది నీకు తగదని యెవరుపోయి కూకలేస్తారు? ఎవరికేంబట్టింది? కావలసినవాళ్లు పెద్దవాళ్లెవరయినా, యీమె కోపం చల్లార్చడానికి, ఆమె మొగంముందట గోపీనాథుణ్ని కోపపడినా, ఆమె మొగంచాటు కాగానే ఆలాగి అంటేనే గాని ఊరుకోడురా లేకపోతే మమ్మలనుగూడా సాధిస్తుంది. ఎమీ అనుకోకూ అనేవారు.

పిచ్చిది అలాగే వాగుతూయుంటుంది అని ఊరుకుంటే తొండ ముదిరి ఊసరవిల్లి అయింది. ఇదివరకు వాండ్లయింటికి వీండ్లయింటికి వెళ్ళి చెప్పుకుని యేడ్చి వస్తూయుండేదల్లా, యిప్పుడు ప్రతిదానికి వీధి యరుగు మీద కూర్చుని పోట్లాడడం మొదలెట్టింది. తనయింటిలో యేలాయున్నా పొరుగింటితగువువినుట మానవ జాతికి వేడుక. అగుటవల్ల దారినిబొయ్యేవారు, యిరుగు పొరుగువారు, అందరుజేరి తమాషాచూస్తూండేవారు. ప్రతిరోజూ యిదిఒక హంగామా. నలుగురిలో తిరుగనేర్చినవారు. ఒకళ్ళకు చెప్పేవారు. అటువంటివాడు ఒకళ్ళచేత చెప్పించుకోవడం అంటే తలకొట్టేసినట్లుగా ఉండేది. మర్యాదకోసము తంటాలుపడుతూ యుండే వాడు. పేరు ప్రతిష్టలకోసం ప్రాకులాడుతూయుండేవాడు. నయానాభయాన చెప్పవలెనని అనుకొన్నాడు. కాని 'ఆస్తి అప్పళించుకుంటూ తినవచ్చునుగాని మాటఅంటే పడలేరేం' అని లోకులుఅని పోతారేమోయని జడిసేవాడు. ప్రేమ అట్లాయుండనీ. ముందులోకంతో పడలేరుగదా. ప్రతీది లోకులుకేకావాలి. కాస్తయుంటే గంపంత చేస్తారు. అదుగోపులిఅంటే యిదుగోతోక అంటారు. ఏదోకోపంవచ్చినప్పుడుతప్ప సాధారణంగా నుడిచేసుకుని పోతూండేవాడు. ఆమె యేమన్నను బదులు చెప్పవద్దని కాంతానికికూడా గట్టిగా చెప్పేవాడు.

తానేమియుఅనక, కాంతాన్నీ అననీయక కట్టడిచేసేసరికి యిద్దరు తనతో మాట్లాడుటగూడ మానేశారనీ, యికఅటువంటియింట్లోఉన్నా ఒకటే లేకపోయినా ఒకటేఅనీ, అత్తకు కావలసినకోడలనా మొగునికి

కావలసిన భార్యనా అని విరుపుమాటలు సాగించింది. గోపీనాధునికి ఉంగిడి తిన్నట్టుగా ఉంది. ఆమెచారడు యాపనే వేరే కాచుకోవలసింది అని చెప్పవలెనని అనుకున్నాడు. కాని మనస్సు ఒప్పలే. ఎలాఒప్పుతుంది? చేసినమేలు మరచేవారి మచ్చులో వాడు కాడు. తల్లి అలాపిచ్చిదైపోయి సంసారం వీధిలోపెట్టుతూ యున్నందుకు చాలాపరితపిస్తూయున్నాడు కాని రోజులుమాత్రం గడిచిపోతున్నాయి. అలాయెన్నాళ్లు గడుస్తయి?

కాంతానికి నెలతప్పింది. దీనితోపాటు అన్నమందు రుచికూడా తప్పింది. ఒకపూట తినీ తినక ఒక పూట లేచీ లేవక యిలాగఉంది, ఆమెస్థితి. ఇంట్లోచాకిరి అంతా వెంకాయమ్మ నెత్తినేపడ్డది. పాపం పెద్దదయిపోయింది. అందులో తగువులమారి సంసారం. తెగవిసుక్కుంటూయున్నది. దాసీముండకంటెకూడా హీనమైపోయినానని యిరుగుపొరుగమ్మలతో చెప్పుకుని దుఃఖోపశమనము చేసుకుంటూయుండేది.

తల్లివండుతూ యున్నదన్నా, వడ్డిస్తోందన్నా గోపీనాధునికి చాలాభయమయి పోయింది, ఏమాట మీద ఏమిటివస్తుందో, యేమి ఆగం అవుతుందోయని. అందువల్ల భోజనమునకు వచ్చేటప్పుడు, కాంతం వడ్డించేటప్పుడు మాదిరి దర్జాగారాకుండా, కొంత భయపడుతూ యుండేవాడు. అన్నియేండ్లువచ్చి ప్రపంచంలో అంత అనుభవంసంపాదించిన ఆమె, యీమాత్రంకనిపెట్ట లేదూ! ఒకనాడు తొందరపనిమీద యెచ్చటికో వెళ్ల వలయునని భోజనంచేస్తూయుండగా, కనిపట్టలేక "భార్యతో అయితే ఇష్టాగోష్టి చెపుతూ నవ్వుతూ త్రేలుతూ ఉండగలవుగాని, నన్ను చూచేసరికి మొగం మటమట లాడించుకుంటావు. నాపాపమంటే గిట్ట కొచ్చిందినీకు. ఇంతకు నిన్ను అన్నలాభంయేముంది. నిన్నుబట్టిన ప్రతిబంధకం అలాచేస్తోంది. నోటిమాట లేకుండా చేసిందిగదా, యిక కంటిచూపులేకుండా చేయడమె తరువాయి" అని సాగించింది పురాణం. ఈ సూటీపోటీ మాటలు వినేసరికి ఆతనికిభలేకోపంవచ్చింది. ఒళ్లుమండిపోయింది. ఏంచెయ్యలేక, తినేవిస్తరి నేల కేసికొట్టి వంటంతా మైలపడేసి లేచిపోయినాడు పోలీసుస్టేషనుకు. ఇక ఆయింటిలో గణ్యత లేదనుకున్నది. గుడ్డాగుడుసులు చంకనబెట్టుకుని మనస్సు విరక్తిచేసుకుని 'దిక్కులేని వారలకు దేవుడేదిక్కు' అనుకుంటూ లేచి చక్కాపోయింది వెంకాయమ్మ.

కోపం చల్లారిన తర్వాత యింటికి వచ్చాడు గోపీనాధుడు. తల్లి యెక్కడకో వెళ్లిపోయిందని తెలిసింది, తాను ముందువెనుకలాలోచించక చేసినపనికి చాలాపశ్చాత్తాపపడ్డాడు, నొచ్చుకున్నాడు. మనస్సువిరిగి పోయినతరువాత ఏది ఎట్లాపోతేనేం పోలీసువాండ్రను వెంకాయమ్మను వెదకుటకు పట్టణం నాలుగుమూలలకు పంపాడు. మనిషిని చూడక పోయినప్పటికి, యితరులు చెప్పిన గుర్తులవల్ల మనుష్యులను గుర్తించ గలిగిన పోలీసువాండ్రు తెలిసియున్న వెంకాయమ్మను—రోజూ చూస్తూయున్న వెంకాయమ్మ జాడను కనిపెట్ట లేకపోయినారు. ఇక చేసిందేమయ్యా అంటే, వెంకాయమ్మ దేనిలోనోపడి చనిపోయిందని పుకారుపుట్టించారు, ఆమె యేనూతిలోను, గోతిలోనూ, ఆగుపడలేదుకాబట్టి సరిపోయిందిగాని, లేకపోతే గోపీనాధుని మర్యాదమట్టిలో కలిసిపొయ్యేదే. పాపం! యేంచేస్తాడు. వెతికించి వెతికించి విసుగెత్తి ఊరుకున్నాడు.

# పుష్పములనమ్ముకొను గ్రుడ్డిబాలిక

పా. శివరామకృష్ణయ్యగారు

“పూవులు గొనరయ్య పుణ్యమౌమీకు!
కన్నులుగలవారు కలవారు మీరు.
దిక్కుమాలినది నాదీనంపుబ్రతుకు;
పగలెరుంగనివి నాపాపంపుకళ్లు.
కొనరయ్య నాపూల గుణవంతులార!
ఎక్కడనుండియో యిటకు వచ్చితిని,
పూవులుగొనరయ్య పుణ్యమౌమీకు!
ఈలోకమెల్ల మీరేయెంచునట్లు
సుందరమేయైన శుభదమేయైన
నాకడనున్నయీ నవ్యపుష్పాలు
ఆతల్లిపిల్లలే యాదరుసుండి.
తల్లికితగినట్టి పిల్లలేవీరు.
అందచందాలలో నటుతీసిపోరు.
గడియసేపైన నిక్కముగగా లేదు
తల్లియొడిలోనుండి పెళ్లగించితిని
ఒడలెరుంగని నిద్రలోనున్న వేళ.
అనుమానమేల వాసన జూడరాదె
మార్దవమ్మె యతిమధురమైనట్టి,
తల్లి, పిల్లలపైన మెల్లగావిడచు
ప్రేమనిశ్వాసముల్ విడువనేలేదు.
కూర్మిబిడ్డలను యీకుసుమాలనింక
కొనరయ్యనాదు వాసనపూల మీరు
దిక్కుమాలిననాకు దిక్కుకాగలరు!
ప్రేమంపుబిడ్డల వీడగాలేక
ప్రకృతిమాత తపించి పాపలకిడిన
ప్రణయంపుముద్దు పోవగనైనలేదు,
కనలేదె, వీటిబుగ్గలపైననింక ?
తనయులప్రాప్తికై తపియించియామె
గార్చినకన్నీరు కాల్వలై పారి
మంచురూపాన నిర్మలమైనవీటి
మృదువైన తనువులవదలనే లేదు.
కనలేరె కన్నులుగలవారుమీరు ?
పూవులుగొనరయ్య పుణ్యమౌమీకు!
ఈప్రపంచమ్మె మీయల్లవారలకు
సుఖములపెన్నిధి, సొగసులరాణి,
కన్నులభాగ్యంబు గలవారలౌట.
ఆనోము నేనోచగాలేకపోతి!
అంధకారపుటింటినద్దెగానిచ్చి
‘యాకలీయకనేనె నీకొసంగితిని
బ్రతుకు’మటంచునన్ బడద్రోసెనిటకు
కరుణయేలేని యాపరమపూరుషుడు!
నాయింటిలోవారునరులుకారయ్య,
జీవమేలేని నిర్జీవనాదములు.
పూవులుగొనరయ్య పుణ్యమౌమీకు!
కన్నులుగలవారు కలవారు మీకు
వినలేరె యీచిన్నితనయుల వేడి
నిట్టూర్పులను ? కంటనిసురయేలేక
ఏమనుచున్నవో యిటువినరయ్య.
‘ఈగ్రుడ్డిబాలిక యెలుగునిక్కముగ
ఆవిరివలె మమ్మునణచివైచినది.
వదనంపుకాంతులు వాడిపోయినవి.
కాయంపుసొగసెల్ల కరగిపోయినది.
కాంతిలేకయె బ్రతుకంగలేమయ్య
మృదువుగా పెరిగిన ముద్దుబిడ్డలము.
ఏ వెలుంగెరుగని యీలేమనుండి
విలపించుమమ్మల విడువింపరయ్య.’
పూవులుగొనరయ్య పుణ్యమౌమీకు!
కలవారు కన్నులుగలవారుమీరు!

# స్త్రీసమస్య

గరికిపాటి రామమూర్తిగారు బి. ఏ.

హిందూమత సిద్ధాంతముల ననుసరించి సంఘములో స్త్రీలకు గౌరవస్థాన మొసంగవలసియున్నది. స్త్రీలును తత్ స్థానము నాక్రమించుట కర్హులుగ నుండవలయును. కాని, కాలక్రమమున—పురుషుల యవివేకమువలనగాదు—అశ్రద్ధవలననో మఱియేకారణము వలననో స్త్రీలకంతకు పూర్వమున్న గౌరవస్థానము పోయినది. ఇది స్త్రీజనస్వయంకృతాపరాధము చేతనా. పురుషులయసూయచేతనా యనునది యనవసర విచారణము—స్త్రీపురుషకలహ కారణము కూడ.

ఏమైననేమి? స్త్రీలలో విద్య సన్నగిల్లినది. విద్యతోబాటు వనితల గౌరవమును తగ్గినది. గౌరవము తగ్గినదని నాయభిప్రాయము స్త్రీజనోద్దేశములను పురుషులాదరించి సరకుగొనక పోవుటయేనని. దీనికి పురుషులుచేయు వాదమేమన "స్త్రీలకు విద్య లేశమును లేదు. మూఢులగుటచే వారివాక్యములు పాటించుట వలన నగుబాట్ల"ని. మఱి స్త్రీలు వాదించెదరు "పురుషులు మాకు విద్యాసౌకర్యములు గలిగింపక పోవుటయే కాక, వారి బానిసలుగ చూచుచున్నారు. ఇదిద్రోహము" అని. రెండు వాదములలోను కొంత యాథార్థ్యమున్నది. కాని గతించిన దానికి కలహమేల? ఇకముందు స్త్రీసంఘ మభివృద్ధిలోనికి వచ్చు మార్గ మరయవలెను.

ఏసంఘమైనను నభివృద్ధి యభిలషించినయెడల నాసంఘములో విద్యావ్యాప్తి కొఱకై పాటుబడవలెను. ఇచట మఱల నొకవాదము—విద్యయనిన ప్రస్తుతము పాఠశాలలలో బోధింపబడు నాంగ్లవిద్యయా, ఉపాధ్యాయులింటికివచ్చి గఱపు నాంధ్రసంస్కృతాది విద్యలా? దీనిని గుఱించి యనేకవాగ్వాదములు అనవసరముగ జరుగుచున్నవి. ఏలన విద్యయను పదమునకు జ్ఞానోద్బోధమని యర్థము తీసికొనవలెను. ఏస్త్రీకే యేవిద్యయందు ఆసక్తియో ఆవిద్యనే చెప్పింపవలయును. కాని యీసందర్భమున స్త్రీజన మొకసంగతి మాత్రము గమనింపదగియున్నది. స్త్రీపురుషులు కలిసి చదువుకొనెడి విధానము మాత్రము ప్రస్తుత పరిస్థితులలో పనికిరాదు. శ్రేయోదాయకమునుకాదు.

స్త్రీల కేవిద్యయైనను అనర్థదాయకమే అని కొందఱు మూఢులు వాదింపవచ్చును. అదిగాక భర్తలే భార్యల నట్లదలింపవచ్చును. ఇంతయేల? స్త్రీలలోనే కొంతమంది విద్యాభ్యాసము వనితలకు కూడదని వాదింపవచ్చును. దీనికై పురుషులలోనేమి, స్త్రీలలోనేమి ప్రచారము బహుళముగా నొనర్చి విద్యావతులగు స్త్రీలు పురుషులకు సర్వకాలములందును నండయై నిలుతురని బోధింపవలెను.

రెండవ విషయము వివాహములు. వివాహవిషయములలో ప్రస్తుతము బాలురకెంత స్వేచ్ఛయున్నదో బాలికలకు నంతియే యున్నది. (ఇరువురికిని లేదని నాయభిప్రాయము) సాధారణముగ తలిదండ్రులు పుత్త్రికలకుగాని పుత్త్రులకుగాని ఇష్టములేని వివాహము లొనరించి వారి నాజన్మాంతమును దుఃఖపెట్టెదరను వాదము బూటకము. అదియు గాక దంపతుల పురోభివృద్ధినిగూర్చి పితరులు సలుపు దూరాలోచన వధూవరులకు—వారు యుక్తవయస్కులేయగుదురుగాక—నుండుటరుదు. కారణము వారి కనుభవము తక్కువయగుటయే.

తలిదండ్రులలో కొలదిమంది ధనాశాపీడితులగుటవలన గదా ముక్కుమోగ మెఱుగని పసిబాలికలను ముదుసలులకిచ్చి వివాహముచేసి వారిజీవితము వ్యర్థమొనరించుచున్నారు? దీని నరికట్టు సాధనము నట్టి వివాహముచేసికొనినవారికి వెలివేయు ప్రచారము ప్రజలలో చేయుటయే. అది జయప్రదముగ కొనసాగనియెడల పురుషుడు ముప్పదియైదు నలుపది వత్సరములు దాటిన తరువాత వివాహముచేసి కొనరాదను శాసనము చేయవలెను. ఆశాసనము ధిక్కరించిన వారికి కఠినదండనమును నుండవలయును. ఈపరిమితి నేర్పఱచిన యెడల బాలవితంతువుల సంఖ్యక్షీణించును.

ఒకవిషయముమాత్రము మనము గమనింపవలెను. వివాహవిషయములలో బాలబాలికల కంతగా స్వాతంత్ర్యముకాని పారతంత్ర్యముకాని పనికిరాదు. పాశ్చాత్యాచారములు మనకు పూర్తిగా సరిపడవు. వీనికై ప్రచార మొనరించుట సాధారణమైన పనికాదు. (చెప్పుట సులభమే.) వీనికై చేయు యత్నములకు తోడుపడవలసిన బాధ్యత పురుషులపై లేక పోలేదు. స్త్రీపురుషుల పరస్పర సంభావనముపైననే భావిభారత భాగ్యోదయము నిలచియున్నది.

# తల్లి

శ్రీనాథ మహాకవి

చ॥ అరుణగభస్తిబింబ ముదయాద్రిపయి బొడతెంచునంతలోఁ
బెరుగును వంటకంబు వడపిందియలుంగొని తెచ్చియిచ్చుని
ర్భరకరుణాధురీణయగు ప్రాణము ప్రాణము తల్లియున్నదే ?
హరహర! యెవ్వరింక కడుపారసి పెట్టెద రీప్సితాన్నముల్.

# నలందా విశ్వ విద్యాలయము

పులపర్తి కమలావతిదేవిగారు

**పూ**ర్వము మహోన్నత దశయందుండి చీనా, టిబెటు మొదలగు దేశముల నుండి గూడ విద్యార్థుల నాకర్షించిన నలందా విశ్వవిద్యాలయముండి నచోట నేడొక చిన్నపల్లె కళావిహీనమై, అల్పజన సహితమై, అనాకర్షణీయమై రాజగృహమున కెనిమిది మైళ్ల దూరమున నున్నయది. విశ్వవిద్యాలయ మెట్టిదై యుండ వలయుననినచో కార్లయిలు నుడివినట్లు విశేషపుస్తక సముదాయ సమన్వితమై యుండ వలయును. న్యూమెను చెప్పినట్లుగా పలువిధములగు శాస్త్రములకు స్థానమై తార్కికులు, వైయ్యాకరుణులు, వేదాంతులు, రసాయనికశాస్త్రజ్ఞులు, జంతుశాస్త్రజ్ఞులు, వృక్షశాస్త్రజ్ఞులు, మతబోధకులు మొదలగు వారికెల్ల నాటపట్టై వెలయుచుండవలయును. ఇట్టియున్నతాదర్శములతో నలందా విశ్వ విద్యాలయము తొల్లి విరాజిల్లుచుండెడిది.

నలందా విశ్వ విద్యాలయము క్రీ. 450 సంవత్సరమున నుద్భవించినది. పండిత తారానాథు డయ్యది అశోకనిర్మితమని వచించుచున్నాడు. కాని ఫాహియాను దీనినిగురించి తన యాత్రలయందు బెర్కొని యుండలేదు.

హ్యూయనుత్స్యాంగు వ్రాతల ప్రకారము బుద్ధ నిర్వాణానంతరము శక్రాదిత్యుడను మహారాజు [illegible] నలందా విశ్వ విద్యాలయమునకు భూరివిరాళము క్రింద నొక సంఘారామము నిచ్చినట్లు తెలిసెడిని. శక్రాదిత్యుని కుమారుడు బుద్ధగుప్తరాజు తండ్రి చేసిన దానిని నిలువబెట్టుటయే గాక దానినింకను వృద్ధికిదెచ్చెను. అతని కొమారుడు తథాగతగుప్తరాజు తండ్రి తాతలపథమునే యనుసరించి యింకను దాని నభివృద్ధికై కొనివచ్చెను. అతని కొమారుడు బాలాదిత్యరాజాయును అతని కొడుకు వజ్రుడును గూడ ధార్మికబుద్ధితో దానినింకను యున్నత స్థితికిదెచ్చిరి. అటుపిమ్మట మధ్య హిందూ దేశపు రాజొకడు వీనిని పరిశీలించి ఆసంఘారామము చుట్టును యొక గొప్ప ఆవరణమును

కట్టించి ద్వారముకడ నొక ద్వారపండితుని నియమించెను. ఇట్టుల నలందా విశ్వ విద్యాలయము మహోన్నత స్థితికివచ్చెను. అయ్యది చూపఱుల కత్యంతానంద కరమగుటయే గాక దాని మూలవిధికి చాలమంది దాతలుసాయ మొసరించిరి. అయిత సింగు యిచ్చట పదిసంవత్సరములు విద్యాభ్యాస మొనరించెను. 750 సంవత్సరమున త్రివిష్టప (టిబెటు) రాజు నలందా ప్రధానాచార్యుడగు కమలశీలుని తన రాజ్యమున కరుగుదెంచి మూఢాచారముల తొలగించి బౌద్ధధర్మముల నెలకొల్పవలసినదిగా నాహ్వానించెను.

మహారాజవిశ్వవిద్యాలయమగు విక్రమశీలావిశ్వవిద్యాలయ ముత్పన్నమైన పిమ్మట నలందా విశ్వవిద్యాలయము క్షీణింప నారంభించెను. కొంతకాలమువరకు రెండు విశ్వవిద్యాలయములవారును అత్యంత మైత్రితోనుండిరి. నలందాయందు బౌద్ధమతము విరివిగ వ్యాపించియుండెను. బుద్ధుని కాలమునందు నలందా విశ్వ విద్యాలయ మున్నత స్థితియందే యుండెడిది.

బుద్ధుడు నలందాకు తన శిష్యగణపరివేష్టితుండై యరిగి పావారికా రసాల వనమున విడిసెను. అచ్చటనే శారిపుత్రుడు వారిని గౌరవించెను.

నలందా విశ్వ విద్యాలయమున పదివేలమంది విద్యార్థులు పఠించుచుండిరి. సుమారొక వేయిమంది ఆచార్యులందు నివసించుచుండిరి. వారెల్లరు జితేంద్రియులై అత్యద్భుత మేధాసంపన్నులైయుండిరి. వారి జీవనము నిష్కల్మషమై ఆదర్శప్రాయమై యుండెడిది. విద్యార్థులెల్లరు బ్రహ్మచర్యమును నిష్కర్షగ జరుపుచుండిరి. విశ్వవిద్యాలయ నిబంధనలు కఠినముగ నుండెడివి. ఎవ్వరును వానిని మీరకుండిరి. హిందూదేశము నందలి యన్ని గ్రామముల వారును నలందా పండితులను గౌరవించుచుండిరి. మొట్టమొదట ద్వార పండితుని యంగీకారమును బడసిననే గాని విశ్వవిద్యాలయావరణ యందు జరుగు సభల లోనికి పోవుట కెవ్వరికి నధికారములేదు. ద్వారపండితుని పరీక్షలో నూటికి ముప్పది మందికన్న నెక్కుడు కృతార్థులు కాజాలక పోయెడివారు. ద్వారపండితుని జయించిన యాకొలది వారైనను సభలయందు పాల్గొని యోడిపోయెడివారు. నలందా విశ్వ విద్యాలయమందలి విద్యయంతటియున్నత స్థితియందుండెడిది అప్పటి యుపాధ్యాయులలో వేరెన్నికగన్నవారు ధర్మపాలుడు, చంద్రపాలుడు, గుణమతి, స్థిరమతి, ప్రభామిత్ర, జినమిత్ర, శీలభద్రుడు, జ్ఞానచంద్రుడు నను వారలనామములు వినుపించుచున్నవి.

# లోధ్రమహిమ

## స్త్రీరత్నముల అభిప్రాయములు.

### ఆంధ్ర యువతీమణులు

శ్రీమతి కవయిత్రి పులవర్తి కమలావతీదేవిగారు రాజమండ్రినుంచి యిట్లువ్రాయుచున్నారు.—

"నాసోదరి బహిష్టయందు కడుపునొప్పిచే చాల బాధపడుచుండెడిది. తమ "లోధ్రను" మూడు బుడ్లను తెప్పించి యామె కొసంగితిని. నాచెల్లెలు స్వస్థురాలగుటయేగాకుండ నిరువురు బిడ్డలనుకూడ కనినది. తమ లోధ్ర స్త్రీలపాలిటి వరప్రసాదిని యనుటకెట్టి సందియమును లేదు. మా స్త్రీల వ్యాధులకు తమలోధ్ర కల్పతరువువలె కన్పడుచున్నది."

శ్రీమతి ఎన్. కనకమ్మగారు, C/o నరసయ్యగారు, విలేజిమాజస్ట్రీటు, కదిరినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.—

"మీలోధ్ర 4 పెద్దబుడ్లను సేవించినాను. 4 నెలలనుండి కడుపునొప్పి బొత్తిగనిలచిపోయినది."

### కర్ణాటక స్త్రీలు.

శ్రీమతి బి. ఇందిరా కుమారిదేవిగారు మెట్టూరునుంచి ఇట్లువ్రాయుచున్నారు.-

"నేను మీకేసరికుటీరం "లోధ్రను"ను సేవించుచున్నాను. తత్పూర్వము నాకు బహిష్ఠకాలమందు మిక్కిలి బాధకలుగుచుండెను. ప్రతినెలయును క్రమముదప్పి బహిష్ఠి యిరువది దినములోపుననే యగుచుండెను. రెండు సంవత్సరములవరకు ఆసుపత్రిమందు పుచ్చుకొంటిని గాని గుణము కనుపించలేదు. పిమ్మట వారు ఆపరేషన్ చేసుకొమ్మని చెప్పిరి; నేనిష్టపడలేదు. తమ "లోధ్ర" ప్రభావమువిని రెండుబుడ్లు పుచ్చుకొన్న తర్వాత మామూలుప్రకారము క్రమముగ 28 రోజులకు బహిష్ఠయగుచున్నాను. బాధలన్నియు నివర్తిఅయినవి. మరి రెండుబుడ్లు తమ "లోధ్ర"ను నాకు పంపగోరుచున్నాను."

శ్రీమతి జయలక్ష్మమ్మగారు, కొల్లిగల్ బాలికాపాఠశాల ఉపాధ్యాయిని, ఇట్లు వ్రాయుచున్నారు.—

"గడచిన మూడు సంవత్సరములనుండి, నాకు సరిగా ఋతుస్రావము కాకుండెను. రెండుమూడు నెలల కొకసారి బహిష్టు కలుగుచుండెను. ఇందువలన నడుమునొప్పి, కీళ్లనొప్పులు, బలహీనము, దేహము బరువుగతోచుట, మొదలగు బాధల ననుభవించుచుంటిని. మీ "లోధ్ర" రెండు సీసాలు తెప్పించి వాడినందులో పైకనిన వ్యాధులన్నియు మాయమైనవి. ఇపుడు సకాలమునకు బహిష్టుఅగుచు సుఖముగనున్నాను. మరియు రెండుసీసాలమందును వాడదలచినాను. నావలెనే బాధపడుచున్న స్త్రీలకు లోధ్రను వాడితీరవలెనని ఖండితముగా తెలుపుచున్నాను."

### క్రైస్తవ నారీమణులు

శ్రీమతి అన్నాచాండిగారు ఎం. ఎ. ఆనర్స్ 'శ్రీమతి' సంపాదకురాలు, కొట్టయంనుంచి ఇట్లు వ్రాయుచున్నారు.—

"మీ 'లోధ్ర'ను వాడినాను. స్త్రీల ఋతుసంబంధమగు జాడ్యముల కుదుర్చుటకు అపూర్వమగు ఔషధరాజమని చెప్పగలను. తియ్యనిరుచిగల్గి, పథ్యపానాదుల పాలింపవలసిన అవసరము లేకుండుటచే, యీ మందును సంతోషముగ వాడవచ్చును."

శ్రీమతి డాక్టరు అన్నాథామస్ అమ్మగారు, బెంగుళూరు, ఆస్పత్రి సూపరిండెంటు, ఇట్లు వ్రాయుచున్నారు.

"ఇంగ్లీషు అవుషధములవల్ల గుణము లేనందున తమ "లోధ్ర"ను నాసోదరికి వాడితిని. ఆమెకు పాశ్చర్యమైన గుణము నిచ్చినందుకు సంతోషించుచున్నాను. ఇకమీదట ఈ యవుషధమును నారోగులకు వాడెదను."

శ్రీమతి కె. ఇసయగారు, ఎ బి. మిషన్, సత్తెనపల్లి, గుంటూరుజిల్లా, ఇట్లు వ్రాయుచున్నారు.

"మీ 'లోధ్ర' వలన నాకుమిక్కిలి ఆరోగ్యముకల్గినది. నాకు వచ్చుచుండిన దగ్గునయమైనది."

శ్రీమతి మిసర్సు. ఏ. దేవదాసుఅమ్మగారు ఇ. డబ్ల్యు. ఎమ్. స్కూలు, సాలిన్, మిర్జాబుజిల్లా, ఇట్లు వ్రాయుచున్నారు—

"మీవద్దకొన్న "లోధ్ర" నాలుగు బుడ్లను, ఋతుస్రావదోషములచే బాధనొందుచున్న స్త్రీల కిచ్చినాను. వాటిని వాడినందున వారి రోగములు కుదిరినవి."

## కేరళవనితలు

శ్రీమతి ఎడపిల్లి పార్వతమ్మగారు తిరుచూరునుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"నేను 25 సంవత్సరములుగ ఋతుసంబంధమగు జాడ్యములతో బాధపడుచుంటిని. ఎన్నియో మందులను వాడినను గుణముగుపడలేదు. తుదకు మీ 'లోధ్రను' కొద్దికాలము మాత్రము వాడగా అత్యద్భుతముగ రోగనివారణ గావించెను."

శ్రీమతి అమ్మకుట్టియమ్మగారు, సంగీత ఉపాధ్యాయిని, సర్కారుహైస్కూలు, తిరుచూరు, కొచ్చినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"చాలాకాలముగ అనేక విధములైన గర్భాశయ రోగములవల్ల బాధనొందుచుంటిని. అనేక విధములైన చికిత్సలను పొందితిని గాని నివారణము కాలేదు. కడపట తమ "లోధ్ర" సేవించిన కారము రోజులలోనే గారడివిద్య వలెనగమందు పనిచేసెను. దాని ప్రభావమును వర్ణింపజాలను."

శ్రీమతి మిస్ గోపాలపణిక్కర్ గారు, శారదావిలాసము, చిత్తూరు, కొచ్చినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"మీవద్దనుండి తెప్పించిన 6 లోధ్రబుడ్లలో 3 నేనును తక్కిన 3 మాచెల్లెలును సేవించుటచే మాయొక్క ఋతుశూలలు మాయమాయెను."

శ్రీమతి మిసర్సుకర్తగారు, కోరోలి ఆమ్మనాత్ హౌస్, ఇరింజలకుడ, కొచ్చినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"పది సంవత్సరములుగ ముట్టుకట్టువల్ల బాధపడుచుంటిని. దానిని మీలోధ్ర అత్యద్భుతముగ నివారణచేసెను."

# ప్రసవకాలమును దెలుపు పట్టిక.

సాధారణముగ స్త్రీలు గర్భము ధరించిన 280 దినములకు ప్రసవించెదరు. కడపటి బహిష్ఠయైన మొదటిదినము మొదలు లెక్కపెట్టుకొనవలయును. క్రిందకనుబరచిన పట్టిక మొదటిపంక్తి జనవరి 1 వ తారీఖున గర్భముధరించిన యెడల రెండవపంక్తి అక్టోబరు 8 వ తారీఖున ప్రసవించెదరు.

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| జనవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జనవరి |
| అక్టోబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | నవంబరు |
| ఫిబ్రవరి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | | | | ఫిబ్రవరి |
| నవంబరు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | | | | డిసెంబరు |
| మార్చి | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మార్చి |
| డిసెంబరు | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | జనవరి |
| ఏప్రెల్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | ఏప్రెలు |
| జనవరి | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | | ఫిబ్రవరి |
| మే | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | మే |
| ఫిబ్రవరి | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మార్చి |
| జూన్ | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | జూన్ |
| మార్చి | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | ఏప్రెలు |
| జూలై | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | జూలై |
| ఏప్రెల్ | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | మే |
| ఆగస్టు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | ఆగస్టు |
| మే | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | జూన్ |
| సెప్టెంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | సెప్టెంబరు |
| జూన్ | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | | జూలై |
| అక్టోబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | అక్టోబరు |
| జూలై | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | ఆగస్టు |
| నవంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | | నవంబరు |
| ఆగస్టు | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | | సెప్టెంబరు |
| డిసెంబరు | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 31 | డిసెంబరు |
| సెప్టెంబరు | 7 | 8 | 9 | 10 | 11 | 12 | 13 | 14 | 15 | 16 | 17 | 18 | 19 | 20 | 21 | 22 | 23 | 24 | 25 | 26 | 27 | 28 | 29 | 30 | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | అక్టోబరు |

# వాసుదేవుఁడు

## విద్వాన్ సూరిగుచ్చి కృష్ణమూర్తిగారు

వాసుదేవున కిప్పుడిరువది రెండేండ్లు. పసిమిఁదనము కొంచెమున్నను నల్లనివాఁడు మాత్రముగాఁడు. పొడుగు పొట్టిగాని యాకారము, విశాలమైన నుదురు, తీర్చిన కనులు గలిగి ముఖమునందొక విధమైన యాకర్షణశక్తి గలిగి చూపఱుల కెంతయు నానందము గొల్పుచుండును. అతని మాటలలో నొకవిధమైన మార్దవమున్నది. అతఁడెంతయు దైవభక్తిగలవాఁడు. ఉచితమగు వినయము, సౌశీల్యమును గలవాఁడు. నిర్ధనమైన కుటుంబమున జన్మించినను దొరతనమువారి విరాళమువల్ల పట్టపరీక్షవఱకుఁ జదివి కృతార్థుఁడైనాఁడు. సంస్కృతమునందు చక్కని సాహిత్యము. మఱి రెండు మూఁడు భాషలలో నించుక పరిచయమును గలదు. అతని వేషమును బట్టి యాతని విద్యాదులఁ గుఱితింప నేమాత్రము నవకాశము లేదు. చూచువారల కాతఁడొక సామాన్యవిద్యార్థిగాఁ గానిపించును. వయస్సునకు మించిన లోకజ్ఞానము.

అప్పటి కాతని కిరువదివత్సరములు. బియేక్లాసు చదువుచున్నాఁడు. అవివాహితుఁడు నాఁటికి. అతని దృష్టులు వేఱు. ఆలోచనలు వేఱు. ఎప్పుడును ఆముష్మికచింత. బీదతనమువల్లనే యాతనికి దైవభక్తియు, తత్సంబంధమగు చింతలును గలిగినవి. ప్రపంచములో నిక నెన్నేండ్లు తాను జీవింపవలసియున్నది. ఎట్లు జీవింపవలయును? జీవనమున కాధారమైన ధనము లేనప్పుడు తానెట్లు బ్రతుకఁగలఁడు? బిచ్చమెత్తుకొను హేయమైన జీవనముల నాతఁడు భరింపలేఁడు. కేవల ముద్యోగముపైననే యాధారపడియున్న యాతఁడు పలుమార్లు రహస్యముగ నున్నపుడు భగవంతు నుద్దేశించి "ప్రభూ! నాకేల యీజన్మము నొసంగితివి? నను నీలో నైక్యము చేసికొనరాదా? నాకు త్వరలో మరణమొసంగవా?" అని యశ్రుపూరితనయనములతో బ్రార్థించును. మైత్రేయుఁడు "దారిద్ర్యాన్మరణాద్వాకతత్తేరోచతే" యని చారుదత్తు నడుగ "వయస్యా, మరణం మే రోచతే, నదారిద్ర్యం" అను సమాధాన మాతఁడెంతయో మెచ్చికొనును. దానినే మననమకృత్తుగఁ జేయుచుండును. మరణాపాదకములగు సాధనముల నాతఁడొకటి రెంటినొనర్చెను. కాని కృతకృత్యుఁడు గాలేదు. దైవానుకూల్యము లేనపుడు విషమును సమృతమగునుగదా!

వివాహవిషయము తలపెట్టినచో సాధ్యమైనంతవఱకుఁ దప్పించుకొనఁ జూచును. తప్పని సరియేయైనచో నాతఁడు దేవునుద్దేశించి "దేవా! నాకు గుణవతియైన భార్యనొసంగుమా" యని వేఁడును. వివాహము జీవితమునకుఁ గనరాని శృంఖల. వ్యక్తులుపరస్పరము తమయందు సుఖదుఃఖములఁ బంచుకొనుటయే దాంపత్యభావము. అట్టియెడఁదనకుఁగాఁబోవు సహధర్మచారిణి స్వానురూపమగునదియే కావలయునని యాతని యుద్దేశము. స్త్రీలుప్రపంచమున కలంకారభూతములనియు, దేశౌన్నత్యమునకు వారే హేతువులనియు వానియుద్దేశ్యము. కాని కేవలము ఐహికతుచ్ఛవిషయోపభోగ్యలు మాత్రము కారని యాతనిమతము. అట్టిస్త్రీలు నిరతమును విద్యావివేకాదులు గలిగి నీచమైన క్షణికమైన యాలోచనల దూరముగ త్యజించి యుండవలయునని వాసుదేవుని కోర్కె. ఆతఁడెల్లపుడును తన కేబాలిక పరిచయము గలిగియున్నను ఈతత్త్వమునే యుపదేశించి యారీతి

ప్రవర్తించు నట్లొనర్చును. కావునఁ దనకును గాఁబోవు భార్య యా రీతిగనే యుండవలయునని కోరుచుండును. ఇట్టి యాలోచనలలో నాతఁడు పరీక్షకుఁ జదువుచుండెను. అతఁడు తనకు పరుపున్నను నేలమీఁదనే శయనించువాఁడు. ఆతఁడు సుఖమునకనర్హుఁడనుగా ననుకొనును. కేవలము దుఃఖము ననుభవించుటకే యాతఁడు పుట్టెనని భావించుకొనును. ఆపూటకు గతిలేని నిరుపేదసైతమొకానొకప్పుడైనను మనసారి నానందము ననుభవించునుగాని వాసుదేవుఁడెన్నఁడును నట్టిది యనుభవించి యెఱుఁగడు. ఈజీవితసమస్య యాతనికిఁగుదురలేదు. ఈయాలోచనయే యాతనిని దుర్బలుని జేసినది.

పరీక్షలో నుత్తీర్ణుఁడైనాఁడు. ఈలోపుననే వివాహమైనది. జీవితాధారమగు నుద్యోగముపై ప్రయత్నించి విసిగినాఁడు. ఎంతోయో యత్నమొనర్చి తప్పక లభింపఁగలదను నాసతోనున్న యొక యవకాశము హఠాత్తుగ మఱియొకనికీయఁబడుటచే నాఁడు వాసుదేవుని హృదయముపడిన పరితాప మింతంతగాదు. బాలునివలె రుదించినాఁడు. ఆసమయములోఁ బ్రపంచమున బ్రతివ్యక్తియుఁ దనకంటె గొప్పవారే యని నిశ్చయపఱచుకొనినాఁడు. చివరకెట్లో యొక యస్థిరోద్యోగము లభించినది. భార్యాసహితముగ నాయూరు వెళ్ళి కాపురమున్నాఁడు. పైయధికారుల మెప్పునందునట్లు తనపని తాను జేసికొనుచున్నాఁడు.

భార్య పల్లెటూరియందు జన్మించినదగుట విద్యావతికాదు. సాంసారిక కార్యముల ప్రమత్తతోఁ జేయుచు నెంతయు నడకువగలిగి ప్రవర్తించుచున్నది. కాని వాసుదేవుఁడు సహధర్మచారిణితో ననుభవింపవలసినంత యానంద మనుభవింపలేకపోయెను. తన భార్యకుఁ బ్రాపంచికవిషయముల నెన్నియో కథలలోఁ జెప్పినాఁడు. సంయుక్త, గోషనార, మొదలగు వీరవనితల చరిత్రము, సావిత్రి, సీతామహాదేవి, మొదలగు పతివ్రతామతల్లుల చరిత్రములును నుపదేశించినాఁడు. ఆధునిక ప్రపంచ పరిస్థితులును, బ్రస్తుతకాలమున స్త్రీల నడవడికలు, స్త్రీ విద్య మొదలగు వానిని గూర్చి దినమును నొకగంట యామెకుఁ జెప్పును. కేవల గోసంగత్యార్థము కదనరంగమున కుఱికియుఁ గృతకృత్యుఁడు కాలేక వెనుదిరిగి యింటికివచ్చిన ఖడ్గతిక్కనకు తల్లియు, భార్యయుఁ గావించిన యుపచారములఁ దన సతికిఁ దెలియఁజెప్పి

పగఱకు వెన్నిచ్చినచో నగరే
మగుఱాడువారి మైతిమి

అనుపద్యమును గంఠస్థము చేయించినాఁడు. లోకమునఁ బ్రతివనితయు నీచమైన ఐహికతుచ్ఛవిషయములం దాసక్తిమాని యవి క్షణికములని విశ్వసించి దైవధ్యానపరాయణలై పతివ్రతామతల్లులై వీరవనితలుగను, విద్యావతులుగను నుండవలయునని బోధించును. పవిత్రమైన వాసుదేవుని బోధనలచే విశుద్ధాంతఃకరణము గలిగిన యాతని సతియొక్క హృదయము తొంటియజ్ఞానమును బాసి నూత్న తేజముతో వెలుగొందుచుండెను. ఈ మార్పు వాసుదేవున కెంతయు నానందమునిచ్చినది.

నాఁడు పూర్ణిమ. చుక్కలులేని నిర్మలాకాశమున సుధామయకిరణజాలముతో స్వచ్ఛముగ వెలుంగు చంద్రుఁడు లోకములో దరిద్రులుపడు కష్టములఁ జూచి హసించుచుండెనో యన్నట్లుండెను. ఆలోచనాసముద్రమునఁ గొట్టుకొనుచుండు వాసుదేవుని గన్నవారలేరు. నిన్నటివఱకును భార్యతో నానందించినదంతయు మాయమయ్యెను. ఆతని ముఖమున కాలమేఘాళి క్రమ్మినది. చంద్రునకు భయపడి గాఁబోలును చీఁకటి యంతయు దుఃఖరూపమున నాతనియందు లీనమైనది. బాహ్యదృష్టిలేదు. ఏమియో యాలోచించుచున్నాఁడు.

పనులుసవరించి కొని ప్రేమాస్పదుఁడైన భర్తవలని స్త్రీధర్మములు వినుటకుఁ గాఁబోలు నానందమున వచ్చిన భార్య పలుకరించినది భర్తను. అదరిపడినాఁడు. హృదయమునందలి యాలోచనలఁ దిగ మ్రింగినాఁడు.

పాపము గడుసుచుదినము లేదు. దూరాలోచనలు లేనిది. కావున నామె వాసుదేవుని హృదయము నెఱిఁగినది గాదు. ఆనందాతిశయముతోఁ బాహ్యమున నాసీనయైనది. అపుడు వాసుదేవుని కంఠమునుండి యప్రయత్నముగ

> వినిశ్చేతుంశక్యోన సుఖమితివా దుఃఖమితివా
> ప్రమోహోనిద్రావా కిము విషవిసర్పఃకిము మదః
> తవస్పర్శేస్పర్శేమ మహిపరిమూఢేంద్రియగణో
> వికారశ్చైతన్యం భ్రమయతిచ సమ్మీలయతిచ॥

అను శ్లోకము వెలువడినది. ఒకింతసేపు అన్యోన్యము హృదయముల మఱచినారు. భార్యతో "రేపటితో మనకీ యూరు సరి. వేసవి సెలవలుసుమీ, ఇంటికిపోవలెను." అని చెప్పినాఁడు. తల్లిదండ్రులను అత్తమామలను తదితరబంధువర్గమును జూడవచ్చును గదా యని యెంతయు సంతోషించినది గాని మఱల భర్తకెట సుద్యోగమో యేమియో గనుఁగొన లేకపోయినది. 'మృదూని కుసుమాదపి'యనుకవి వాక్యమెంతయు సత్యమైనది గదా!

వాసుదేవుఁడు సామానుతో భార్యాసహితముగ స్వగ్రామము మేఁగినాఁడు. ఆయూరి యుద్యోగి మస్థిరముగుటచే మఱల కళాశాలలు తెఱచు సమయములోనే పకాలముచుఁదగిన గొప్పవారల సిఫార్సులతో దరఖాస్తు లంపినాఁడు. పురుషప్రయత్నమునకు లోటులేకుండ ప్రయత్న మొనరించినాఁడు. 'యత్నేకృతే యదినసిధ్యతికోఽత్రదోషః' అనుదానికిఁదాను జన్మించుటయే యొకగొప్పదోషమని సమాధానము చెప్పుకొనినాఁడు.

కళాశాలలు తెఱచి వారము దినములైనది. తానింతవఱకును బ్రతిదినమును పోస్టాఫీసుకు వెళ్లినదంతయు వ్యర్థమైనది. ఎటనుండియు ప్రత్యుత్తరమురాలేదు.

చింతించి చింతించి కృశించినాఁడు. అయ్యో యనుకొనినాఁడు. నిశ్వాసము విడచి " ప్రభూ, జీవిత మిట్లు పాడైపోవలసినదేనా" యని నిమీలితనేత్రములతో నిమేషము ధ్యానించినాఁడు. నాఁటి వేకువ దుస్తు లేమియుఁ దీసికొనకయే ధనమునొక పైసయు లేకయే జననీజనకులను సహధర్మచారిణిని జూచిచూచి కన్నీరు కార్చి కార్చి హృదయపూర్వకనమస్సులొనర్చి యొనర్చి వెడలిపోయెను.

తెల్లవారినది. ఎంత ప్రతీక్షించినను వాసుదేవుఁడుగాలేదు. ఆతఁడసకృత్తుగఁబోవు నిండ్లలో విచారించి నారు గాని యటకునాఁడు రాలేదని తెలిసినది. భార్యయు నేమియుఁదోపమి గదిలోఁ బుస్తకములఁ దిరుగ వేయుచుండ నొకయుత్తరము గాన్పించినది.

"ప్రపంచము కేవలధనైకమూలమగుటచే, ధనాభావమువల్ల మానవుఁడు గారవము నంద లేఁడు గాననే నిట్లొనర్చితిని. చింతాపరంపరలచేఁ గలిగిన మనోదౌర్బల్యమే తెలుపుట క్షవకాశమిచ్చినదిగాదు. ఉచితమగు కార్యాచరణమ్ముచే లోకారాధ్యవుకమ్ము. ఇంతకన్న విశేషించివ్రాయఁజాలను. అవసరమును లేదు."

వాసుదేవరావు.

ఆమెయుఁ బతి యుపదేశములనే ప్రమాణముగఁ గైకొనినది. పతివ్రతలకు నుచితమగు కార్యమ్ము లొనర్చి చిరస్మరణీయయై కృతార్థతనందినది.

# గౌతమీ కూలమున

పెమ్మరాజు రాజగోపాలముగారు బి. యె.

సారస్వతసమాజము

పశ్చిమాంభోధిలోఁ గ్రాలె భానుఁ డంద సు
వర్ణ సంధ్యాప్రసూతసంపదలు వాసె
మించి విశ్వమంతయు నావరించుకొనెడి
కృష్ణపక్షము లల్లార్చు చిడె నిశావి
హంగ మొదిగి వ్రాలెడిని నీలాంబరమున.
స్థావరజగంబు సర్వము సహజకళ స
మర్పణము జేయుచు నిరుద్ధమహిమ్నమయి యు
మేయమగు మాయనడగి తామాటుమణఁగు
చున్నయటు దోచుచుండె నాకన్నుఁగవకు.
ఒక టసాధారణజగత్తు నుజ్జగించి
భావనాలోకపథముల పయనమగుచు
నేడకోపోవు నామన మెగసియెగసి॥

# స్త్రీ విద్యావిజయధ్వజము

ప్రోలంరాజు లక్ష్మీబాయమ్మగారు

దేశసేవకును, సంఘసేవకును, మఱెట్టిసదాచరణమునకును స్త్రీపురుషులు పరస్పర సహకార సానుభూతులుకలిగి యాచరించిననేఁగాని ఎట్టి మహామహులును తమ ధర్మమును ఉత్తమముగ నిర్వహింపఁ గలరనుట సత్యము. కావుననేఁ గాఁబోలు, "స్త్రీణాంచచిత్తమ్ పురుషస్యభాగ్యమ్" అనిపూర్వోక్తి. అనఁగా సర్వవిధముల ఉత్తమ చరిత్రఁగల సాధ్వివలననే పురుషుఁడు ఐశ్వర్యసంపన్నుఁడగుననుట. శృతి, స్మృతి, పురాణేతిహాసకాలములయం దెవ్వఁడుగాని, ఏమహామహుఁడుగాని జగన్నుతచరిత్రుఁడై ధవళకీర్తుల ప్రకాశించుచున్నాఁడనిన యాచరిత్రలో స్త్రీ ప్రధానసూత్రధారిణియై యుండుట సుప్రసిద్ధము. సీతామహామాతయు, ద్రౌపదీదేవియు లేకున్న రామాయణ భారతములే లేవు. చారిత్రకకాలమందలి త్యాగ, సహనశీలలగు వీరపతివ్రతా సాధ్వీమతల్లులు హిందూదేశమును ప్రపంచశిరోమణిగ నలంకరించియున్నారు. ఏనాఁడా యున్నతస్థానము స్త్రీలకు వంచితమైనదో ఆనాఁడే దేశపతనమునకుఁ బ్రారంభమైనది. స్త్రీలు సర్వహక్కులుగల సమభాగినులను భావము నశించి విషయోపకరణములగు జంత్రపుబొమ్మలువలె పరిణమించిరి. కారణమేదిగానిండు ఎవరిలోపముగానిండు మాతలు, పత్నులు, పుత్రికలుగా నత్యంతపూజ్యస్థానమున సంస్తుతింపఁబడఁదగిన స్త్రీలు అత్యంతమైన ఉదాసీనస్థితికి పాల్పడిరి. "షట్కర్మయుక్త" యగు "కులధర్మపత్ని"ని "కార్యేషుదాసీ, కరణేషుమంత్రీ" అన్నారు. ఎంతచక్కని అలంకారము!! ఎంతవినమ్రత! ఎంతవిధేయత! ఎంతసమర్థత! ఎంతఅధికారము! మనపూర్వులు మనస్త్రీలకు అత్యుచ్ఛస్థానముల నొసంగి లోకోన్నతకీర్తిచే ధ్రువతారలుగఁ బ్రకాశింపఁజేసిరి. కాని కుపస్థకార్యములఁ జేయలేదు. పత్రికాముఖములయం దున్నతవిద్యాధికలు గన్పట్టుచున్నను, ముప్పది మూఁడుకోట్ల భారతదేశమున వారేలక్షాంశమో? ఉన్నతవిద్యాధికులగు పురుషులే అత్యల్పముగ నున్నపుడు స్త్రీలమాట చెప్పనేల? ఉన్నకొందఱైనను స్త్రీలుగాని పురుషులుగాని విదేశీయవిద్యావ్యామోహమువలన అవసరమును ప్రధానమును నగు కర్తవ్యపాలనము నాచరింపఁ నేరకున్నారు. పాశ్చాత్త్యుల సహవాసముచే వారివలన నేర్చుకొనఁదగిన సుగుణము లెన్నియో యున్నను, కేవలము వేష, భాష, భేషజములే నేర్చుకొని అజ్ఞానముచే

ధర్మదూరులగుచున్న వారనేకులు. పాశ్చాత్యుల సద్గుణములలో మహనీయమైనదగు "దేశభక్తి" మనలో నెందరికున్నది?

విద్యాధికుఁడగు పురుషుఁడును తన సతియందు తనయాధిక్యతకుఁ జాలాసంగుటకు ప్రయత్నింపకుండుట చాల విచారకరము. స్త్రీలు తమ దుస్థితిని గుర్తింపనేరకున్నారు. పురుషులును కర్తవ్యము నెరుంగకున్నారు. ఇదిచాల అన్యాయము. సంపన్నములును విద్యావంతములును (ప్రగూషులలో) నగు కుటుంబము లనేకములు ఘోషాలో మగ్గుచున్నవి. పాఠశాలలకు బాలికలనంపిన శీలమునకు భంగమై పరువుచెడునను దురభిప్రాయము గాఢముగ నాటుకొన్నది. యాథార్థముగ విమర్శించినచో చింతాకరములగు లోపములు విశేషముగ గన్పట్టును. సమగ్రమును, నిర్మలమును కాని విద్యాశిక్షయే ఇందులకు కారణ మనవచ్చును. ఏ ఉత్కృష్ట విషయము నేఁడు సంకుచితముగఁజూడఁ బడుచున్నదో ఆ స్త్రీల యౌన్నత్యమువలన చిరంతనమగు మేలుపొందున దెవరు? దాయవిభాగమువలె స్త్రీపురుషనిర్ణయము స్పర్ధతోకూడినదికాదు. స్త్రీలయున్నతి భూతభవిష్యద్వర్తమాన దేశారాధకుల యున్నతి. స్త్రీల శ్రేయము దేశశ్రేయము. జరగిపోయిన కాలము నందలి బాలికలు జరుగుచున్న కాలమున సతులు. జరుగఁబోవు కాలమున మాతలు కావున "బాలికలే భావిభారతభాగ్యనిర్మాతలు." అట్టిబాలికలపురోన్నతి మనమెంతయో విశాలదృష్టితో గమనింపవలసి యున్నది. సత్యముగ దేశము పూర్వపు టౌన్నత్యస్థితికి రావలయుననిన స్త్రీలు ఉత్తమవిద్యావతులై ఉన్నతస్థితికి రాకతప్పదు. అట్టి శుభస్థితికి ఇప్పటి విదేశవిద్యాశిక్షణము ప్రధానసాధము కాదు.

ఉత్తమమగు జాతీయవిద్య విజాతీయవిద్యాలయముల వలన నెన్నంటికిని లభింపదు. అందుకు బాలురకువలె బాలికలకును పూర్వ గురుకులవిధానముతో కూడిన ఉత్తమవిద్యాశిక్షణముల నొసంగు విద్యాలయము లుండవలయును. అందుముఖ్యముగ కొన్ని సంవత్సరములు విధిగ చదివితీరవలెనను దీక్షయు నుండవలయును. అందువలన గురువులు నేర్పఁగలిగినంత ఉత్తమ విద్యబోధింపఁ గలుగుటచే గురుకులవాసము చేసిన బాలికలు తప్పక శ్రేష్ఠమగు విద్యాజ్ఞానములుగల యువతులుగ తయారయ్యెదరు. ఏ విద్యార్థుల జీవితములు విద్యాపూర్తియగుపర్యంతము; విద్య, గురువు, దేవుడు, దేశము సేవ, సర్వసౌభ్రాతృత్వము ఇత్యాది పవిత్రభావవినిర్మితమగు విశాలవాతావరణమున, ఆనందనిలయములై యుండునో ఆవిద్యార్థుల జీవితసుమసౌరభము విశ్వవ్యాప్తమై లోకకల్యాణము చేకూర్పఁగలదు.

# శారద

ఆచంట మంగళాంబ.గారు

## ౧

ఆ నాఁడు పౌర్ణమి. పిండియారఁబోసినట్లు వెన్నెలకాయుచుండెను. సముద్రము పెద్ద పెద్దతరంగములతో మహాసంతసమున ఉప్పొంగిపోవుచుండెను. అట్టి సముద్రపు టొడ్డున యెంతవిసుగుదల మనసుతో నున్నవారికైనను మనసు నిర్మలమగునట్లుండెను. ఆసముద్రపు టొడ్డున యిద్దఱు యువకులు ఆంతరంగికముగ నేదియో ప్రసంగించుకొనుచుండిరి. రాత్రి 12 గంటలయ్యెను విశాఖపట్టణమంతయు మాటుమణఁగినది. వారి క్రిందివిధముగ సంభాషణజరిగెను.

**మొదటివాఁడు.**—ఏమోయ్! వసంతరావూ! నీవేదియో గూఢమగు సంగతిని గురించి ఆలోచించుచున్నటు లున్నది.

వసం.—ఏమియునులేదు. నీకు తెలియని సంగతి నామనస్సునందొకటియు నుండదు. నామనస్సులోనున్న దంతయు యెప్పటికప్పుడు నీకు చెప్పుచునే యుందును. కృష్ణా! అదేమియో గాని నామనసు మిక్కిలి భారముగానున్నది.

కృష్ణ.—నీవు నాకు యేమియుచెప్పుట లేదని నేను యెప్పుడును నీమీఁద అనుమానపడియుండలేదు. ఇకముందును అట్టి అంతరాయము లెవ్వియురాకుండ మన ఆబాల్యప్రేమను వృద్ధిచేయుటకై భగవంతుని కనేకవందనము లర్పించుచున్నాను. మన మెప్పుడు ఇట్లు కలిసిమెలిసియున్న మన జీవితములో యింక కావలసినదేదియు లేదని నేను గట్టిగా చెప్పగలను. నేను...

వసం.—అబ్బా కృష్ణా! నీవేదియో మన స్నేహమునుగూర్చి పెద్ద పెద్ద ఉపన్యాసము లిచ్చుచున్నావు, కాని నాకుమాత్ర మవన్నియు తలకెక్కుటలేదు. మనసులో చాల ఆందోళనగానున్నది. అదినీతో చెప్పినగానితీరదు. సావధానుడవై వినుము. ఇవ్వాళ

మానాన్నగారు, నేను భోజనముచేయుచుండగా మా అమ్మ నన్నొక క్రొత్తప్రశ్న వేశింది. అదిగాక ...

కృష్ణు.—నేను నీమనసులో యిటువంటిదే యేదోయున్నదని అప్పుడే అనుకున్నాను. అదేమిటో నాకు తెలుసునులే. నామనసంతయు నీమనసులో ఐక్యమయినదనుకో. అదేమిటో నేను చెప్పనా? వద్దులే, నీకు కోపమువచ్చును. ఆ చెప్పుమరి.

వసం.—యేమి కృష్ణా! నన్ను విసిగించెదవు. నామాటకడ్డురాకు. నేను చెప్పునది విను. మా అమ్మ పెళ్లి చేసుకుంటావా? అని నన్నడిగింది. నేను కొంచెము సిగ్గుతో బి.యల్. ప్యాసైంతరువాత చేసుకుంటానులే. తొందరేమన్నాను. ఆమె కొంచెము విసుగుతో అదికాదురా నాయనా! ఇప్పుడు బి. యే. ప్యాసయినావా మరి వివాహము చేసుకుంటే నీవు ప్లీడరీప్యాసయే టప్పటికి పిల్లయింటికి వస్తుంది. మీ కాపురముచూడ నాకు ముచ్చటగ నుండును. ఇవ్వాళ బెజవాడనుంచి 4 వేలు కట్నమిచ్చి ఆడబిడ్డకు 5 వందలు, వియ్యపురాలికి 5 వందలు కట్నమిచ్చి పిల్లనిచ్చెదమని సంబంధమువచ్చినది. ఆమె యింక యేదియో చెప్పబోవునట్లుండెను. కాని నాకు విన నిచ్ఛజనించలేదు. అప్పటికి నాభోజన మగుటవల్ల నేను చెయ్యికడిగికొని వెఱ్ఱివానివలె మీయింటికివచ్చి నిన్ను తీసుకొని ఇక్కడ హాయిగనుండునని ఈ సముద్రము దగ్గిరకు వచ్చితిని. మా అమ్మ మాట్లాడుచున్నంత సేపు కూడా మానాన్నగారొక్కమాటయినను మాట్లాడలేదు. ఆయన పూర్వాచారపరాయణుడు. సదాచారసంపన్నుడు. వివేకశాలి నామనసు కనిపెట్టోయేమిటోగాని ఆయన పోనీ చేసుకోరా నాయనా అనిమాటమాత్రమైనను అనలేదు. మా అమ్మ ఆమాటలు చెప్పుచున్నప్పుడంతయు నా మనసులో యేదియో కలవరముగనే యున్నది. ఘోరపాపమున కొడిగట్టబోవుచున్నట్లు తోచినది. అదివరకే నామనసెవరికో దత్తమైనట్లు నా అంతరాత్మ బోధించుచున్నది. నేను మనసులో వరించిన కన్యను తప్ప అన్యబాలికను చేపట్టతలచునాస లేదు.

ఇంతలో ఒంటిగంటవినబడెను. అబ్బా చాల పొద్దుపోయినదని ఇరువురును సమీపమునన్నున్న తమ చదువులగదిలోనికి పోయిరి.

౨

విశాలాక్షమ్మగారొక పెద్దపట్టుదలమనిషి. ఆమెకు అన్నియుకావలెను. ఒకటియు పూర్తిగ తెలియదు, తెలిసినమనిషికాదు, తెలియనిమనిషికాదు. ఆమెమాట నెరవే

రుటయే ఆమెకు ప్రధానము. తెలిసినవారికైనను చెప్పవచ్చును. తెలియని వారికైనను చెప్పవచ్చును. తెలిసియు వినని వారికి చెప్పుట బ్రహ్మకైనను వశముగాదు. పాపము ఈమెతో సదాచారసంపన్నుడైన శ్యామలరావుగారు గుట్టుగా కాపురముచేయుచున్నారు. ఈమె పుత్రుడగు వసంతరావు వివాహవిషయములో కట్నము తీసికొని గొప్పయింటి పిల్లను చేయవలెనని మహాపట్టుపట్టినది. రంగమ్మ కూతురు శారదను చేసికొనుటకు ఆమె ఇంటిలోనున్న ఆడబిడ్డ కిష్టములేదు ఆమెకు డబ్బే ప్రధానము. అందుచేత ఆమెకు అచ్చటలు ముచ్చటలు జరుపలేని రంగమ్మగారితో వియ్యమందుటకు మనస్సు అంగీకరింపలేదు. ఆమె కుమార్తె వరలక్ష్మమ్మ యీమెయంతకాకున్నను యించుమించు యీమెరకమే. తల్లి గుణములు కూతురికిని తండ్రిగుణములు మగపిల్లలకును వచ్చునని లోకోక్తి. అదెంత నిజమోగాని యీవరలక్ష్మి దగ్గిర ఆలోకోక్తి కొంతసార్థకమైనది. తల్లీకూతురు యెప్పుడు చేరినను వసంతరావుపెళ్లి ముచ్చటలే.

వర—అమ్మా! అన్నయ్య పెళ్లియెప్పుడమ్మా యింకాను ?

విశా—ఏమో తల్లీ! ఇంటిలో మన మాటలేగాని మీనాన్నగారేమియు పట్టించుకొనరు. అన్నయ్యతో యెత్తితే అసలే పెంకె.

వర—అదికాదమ్మా. అన్నయ్యకు శెలవలుకూడ అయిపోవుచున్నవి. వేసంకాలంలో అయితే మనకెక్కువ అనుకూలముగ నుండును. మీ అల్లుడుగారికి కోర్టుకు శెలవలుకూడాను.

విశా—అవునమ్మా ! నాకును అదియేకోరిక. నాకైనా నీవొక్కతెవే కదా ఆడపిల్లవు. కూతురు, అల్లుడువచ్చి యింటిలో పెళ్లిపెత్తనము చేయవలెనని చాల మనసుగా నున్నది. దైవఘటన యెటులున్నదో తెలియదు. మన ప్రయత్నమేమియును లేదు.

వర—నిజమేనమ్మా! నీవు చెప్పినటుల మన ప్రయత్నమేమియునులేదు. అంతయును అన్నయ్య చేతిలోనున్నది. నీవనినటుల అన్నయ్య మొదటినించీ పెంకెవాడు. పెళ్లిసంగతి యెత్తిన యేమిటో వేదాంతపు ఉపన్యాసము లిచ్చును. అసలది పుట్టుకతోవచ్చినబుద్ధి. అదిప్పుడు నీవు నేను చెప్పిన పోవునదికాదు.

విశా—యెట్లైనను ఈ జ్యేష్ఠమాసములో ముడిపెట్టవలెనని వున్నది. తరువాతైతే వర్షాకాలము.

ఎప్పుడును వారికీవిధముగ సంభాషణ జరుగుచుండును. ఆడబిడ్డ కూతురిని చేసికొనుట ఈమెకిష్టములేదని ఇదివరకే అందరికి తెలిసినవిషయమేగదా? పిల్ల చాలా బుద్ధిమంతురాలు. కాని మంచివారి మంచి మంచివారికే తెలియునుగాని ఇతరులకేమి తెలియును? ఈవిధముగ సర్వదా కొడుకు పెళ్లినిగురించి భావసౌధములు నిర్మించుచుండును. కూతురు అత్తవారింటినించి వచ్చినప్పుడు యిద్దరును కలిసి యింటిలో వసంతరావుతోను, శ్యామలరావుగారితోను కొంత చర్చ జరుపుచుండురు. పాపము యిదంతయు ఒక్కొక్కప్పుడు చిన్న కలహరూపముగకూడ పరిణమించి విరమింప బడుచుండెడిది. ఈవిధముగ కొన్ని రోజులు గడచెను. పిల్లవానికి యింకా నెలరోజులు మాత్రమే శెలవలుండెను. ఈమెకు పెళ్లినిగురించి ఆదుర్దా యెక్కువగుచుండెను. తొందరలో గొప్పసంబంధము చూసి స్థిరపరచవలెనని. లేనియెడల తండ్రికి కొడుకునకుకూడ ఆడబిడ్డ కూతురగు శారదను చేసికొనవలెనని యిష్టమున్నట్లు కనపడుచున్నది. ఒకవేళ ఆబీదపిల్లను చేసికొనవలసి వచ్చునేమో అన్న ఆలోచన ఈమెను కలవరపరచ సాగెను. ఆడబిడ్డకూతురుని చేసుకొనుటలో యీమెకున్న అభ్యంతరములు మూడు (1) తనకూతురికి లాంఛనములు సరిగ జరగవని (2) గొప్పవారితో వియ్యము పొందితిమన్న గొప్ప తనకు దక్కదని (3) ఆడబిడ్డ మాత్సర్యము. ఈమూడు కారణములవల్ల ఆమెకు ఆపిల్లన్న యిష్టము లేక యితరసంబంధములను గురించి ఆలోచన లెక్కువగుచుండెను. తనకొడుకు చేసికొన్నను యింకేదైన సంబంధము చూచిచేసినను మొత్తముమీద శారద వివాహబాధ్యత శ్యామలరావుగారిమీదనే వున్నది. అందుకని ఆయన తన కొడుకుకు చేసికున్న ఉభయఖర్చులు కలిసి వచ్చుననియు, పైగాపిల్లబుద్ధిమంతురాలు, పిల్లవానికి పిల్లకు యిష్టమున్నట్లు కనపడుచున్నది, కనక ఆపిల్లను తనకొడుకుకు చేసుకొనవలెనని సంపూర్ణాభిప్రాయముతో నున్నాడు. కాని యింటిలోని వారికి ఆసంబంధమన్న యిష్టములేదని తెలిసి యెవ్వరితోడను తన అభిప్రాయము వెలిబుచ్చలేదు. ఆయనకేపైన అయిష్టమగు సంగతిని గురించి ప్రసంగించుట అంతగా ఇష్టములేదు.

## 3

వరలక్ష్మి అప్పుడప్పుడు తన అన్న దగ్గిరకువెళ్లి "అన్నయ్యా! ఒక్క చెల్లెలినయిన నాకోరిక తీర్చవా? తొందరలో పెళ్లి చేసికొనరాదా? ఆడబిడ్డ లాంఛనములను పొందవలెనని నాకెంతయో మనసుగనున్నది. మంచి మంచి సంబంధములు కూడ వచ్చు

చున్నవి. ఆలసింపవలదు." అని తరిచితరిచి తొందరపెట్ట మొదలు పెట్టెను. వసంతరావును యిదియే మంచితరుణమనుకొని ఒకరోజున తన చెల్లెలి మూలమున తన తల్లికి తన యభిప్రాయమును తెలియపరచ తలచుకొని "అమ్మాయీ! మాటిమాటికి నన్నిట్లు తరిచితరిచి ప్రశ్నించెదవేలా? మన అత్తకూతురును; నాకు వయసులోను వరసలోను కూడ సరిపోయినదియు నగు మరియును ముఖ్యముగ సుశీలవతియునగు మన శారద ఉండగ యితర సంబంధములను గురించి అనవసరముగ చర్చించెదవేల? మీ అభిప్రాయమేమిటోనాకు బోధపడకున్నది." అని యీవిధముగ కొంచెము గట్టిగ చెప్పగనే శ్రుతిమించి రాగమున పడునేమోఅని సందేహించి వరలక్ష్మి తల్లిదగ్గరకు వెళ్లిపోయెను. ఈ సంభాషణ పక్కగదిలోనున్న రంగమ్మగారి చెవినిబడెను. ఆమె యెప్పుడు యేదో భగవధ్యానము చేసికుంటూ తనకు నియమింపబడిన చిన్నగదిలో ఉండును. ఒకొక్కప్పుడు తన కూతురగు శారదచేత నేవియైనను సద్గ్రంథములు చదివించుకొని వినుచుండును. అన్నగారు భాగ్యవంతుడగుట వల్లను, ఇంటినిండ పనిపాటలవారు దండిగ నుండుటచేతను యీమెకు పని అవసరము అంతగా వుండెడిదికాదు. అయినను అవసరము వచ్చినప్పుడు చెయ్యని మనిషిమాత్రము కాదు. వసంతరావు దృఢమనస్సుతో పల్కిన మాటలను విని ఈమె పరమానందభరితురాలయింది. తన జీవితములో తనకు ముఖ్యమైన ఒకవిధి నెరవేరినదిగ భావించింది.

వసంతరావు తరుచు తన వివాహమును గురించి అంతరంగిక మిత్రుడగు కృష్ణునితో ప్రసంగించుచునే యుండెను. అతడుకూడ శారదను చేసికొనుటయే అనేకవిధముల శ్రేయస్కరమని చెప్పెను. తొందరలో పెళ్లిచేసికొనమని కూడ చెప్పెను. అదిగాక అతనికి కొద్దిరోజుల కిందటనే వివాహమాయెను. అన్నివిషయములలోను తన ముఖ్యమిత్రుడు తనతో సమానముగనుండవలెనని అతని నిండుకోరిక. స్నేహితునికి యిష్టమయినది తండ్రికిని ఇష్టమున్నట్లు వసంతరావు గ్రహించినాడు. అత్తగారి కీవివామును గురించి యిష్టముండునని వేరే చెప్పనక్కరలేదుగదా! పేదకు పెన్నిధి దొరికినచందమున అట్టి స్థితిలోనున్న ఆమెకు యీసంబంధమును గురించి యెంతకుతూహలముగ నుండునో వేరే చెప్పనక్కరలేదు. ఈసంగతి వసంతరావునకును తెలియును. ఎంతయిష్టమున్నను, కుతూహలమున్నను ఆశయున్నను పాపము రంగమ్మగారు మాత్రము ఒక్కసారైనను నోరుతెరచి అన్నగారిని ఆయన పిల్లవానికి తన పిల్లను చేసికొనమని అడగలేదు. అది ధర్మము కాదని ఆమె

యుద్దేశ్యము. వదినగారికి యిష్టములేదని తెలిసియు అన్నగారిని నిర్బంధించుట అన్యాయము కాదామరి. కించిత్ జ్ఞానమున్న వారికి ముందువారికి రాబోవుమాట ఆలోచించుకొని మాట్లాడవలెనని తోచును. అదిగాక కర్మము జాలక యీమెయెప్పుడైన యింకేదైన సంగతినిగురించి అన్నగారితో మాట్లాడుచున్నను శారదవివాహ విషయమే మోనని విశాలక్షమ్మగారి కొక పెద్ద అనుమానము. అందుకని అసలు ఆమె తనలో తాను కాలక్షేపణ చేసుకొనెడిదిగాని యెవ్వరితోడను అమితముగా సంభాషించెడిదికాదు.

## ౪

ఇంక వసంతరావునకు మిగిలినది శారద ప్రేమాన్వేషణ మొకటియే. ఈవిషయములో అనుదినమును మనసులో ఘోరతపస్సు చేయుచుండెను. అతనికి జ్ఞానమున్నంతవరకు అతని మనసుకు శారద తన్ను ప్రేమించుచున్నట్లే తోచెను. ఆమె చూపు తనయందు ప్రసన్నముగనే కనపడుచుండెను, అపిల్ల తనను చూసి ఒక విధమగు సిగ్గుతో వెడలిపోవుట, తానన్న ఒక మోస్తరు కుతూహలముకనపరుచుట, తనకు తెలియకుండ తన పనులను ఒక్కొక్కప్పుడు చేయుట, యివన్నియు సూక్ష్మగ్రాహి యగు వసంతరావు గ్రహించెను. ఇక నతనికి పరమానందం అంతకన్న కావలసిన దేమున్నది? తనకోరిన కన్యక తనను ప్రేమిస్తున్నట్లు తెలిసినప్పుడు ఆనందముగ నుండదా? కాని ప్రత్యక్షముగ అడిగి తెలిసికొనిన బాగుండునని తలచుచుండెను. అదెట్లు సాధ్యమగునో అతనికేమియు బోధపడకున్నది. వెళ్లి నన్ను పెళ్లి చేసికొనుట నీకిష్టమేనా అని అడుగుదమన్న అదికొంచెము మోటగ నుండును. అదిగాక సిగ్గు. ఆపైన ఆమె సరియైన జబాబిచ్చునో ఇయ్యదో అన్న సందేహము. ఇతనిస్థితి యిట్లున్నది. శారదయు బావను చేసికొనవలెనని సంపూర్ణాభిప్రాయముతోనున్నది. కాని ఆమె ఒంటరిగ యెప్పుడైన తన వివాహము సంగతి తలచుకున్నప్పుడు మాత్రము బావయిష్టము కనుగొనవలెనను తలంపు ఆమెకు కూడ కలదు.

ఒకరోజున శారద దొడ్డిలో దూరముగానున్న నారింజచెట్టు దగ్గిర కూర్చుని శకుంతల నాటకము చదువుకొనుచుండెను. వసంతరావును అప్పుడు అక్కడికి వచ్చుట తటస్థించెను. ఇది తనకు నొక మంచిఅవకాశమని వసంతరావు సిగ్గువిడిచి నెమ్మదిగా శారదదగ్గిరకు వెళ్లి నిల్చెను. తనను చూసినప్పుడు సిగ్గుతో పరుగిడు బావ తన యెదుట నిర్భయముగ నిలబడుట చూచి శారద కొంచెము చకితురాలయి తనుకూడా పుస్తకము చేతితో పట్టుకొని లేచినిల్చుంది. "ఏమిటి చదువుతున్నా" వన్నాడు వసంతుడు,

మృదుస్వరముతో నెమ్మదిగా "శకుంతల నాటక" మంది.

"యేభాగము చదువుచున్నావు?"

"దుష్యంతుడు కణ్వమహాముని ఆశ్రమమునకువచ్చి ఒంటరిగనున్న శకుంతలను తన్ను వివాహమాడమని కోరుఘట్టము."

"ఐతే నేనిప్పుడు దుష్యంతుడినయి పోయినానన్న మాట." దాని భావమును గ్రహించియు సిగ్గువల్ల జవాబియ్య లేక శారద నవ్వి ఊరకుకుంది. కాని అంతటితో వసంతుడు నిరాశ చెందలేదు.

"నీవు శకుంతల వవుతావా?" అన్నాడు.

"మహాప్రసాద మంది" చిరునవ్వుతో. భార్యాభర్తల ప్రేమ నిశ్చయముగ సంపూర్ణముగ స్థిరపడినది. దీనితో ఉప్పొంగిపోయినాడు వసంతుడు. శారద అంకెకన్న మిన్ను ముట్టెను. ఇక మిగిలినది వివాహమొక్కటే. అదియును మూడువంతులు స్థిరమే.

వధూవరులు, వధువుతల్లి, వరునితండ్రి అంగీకరించిన వివాహమునకు విశాలక్ష్మమ్మ, వరలక్ష్మమ్మ అడ్డుపెట్ట గలరా?

# పతివ్రతా ధర్మములు

అయ్యదేవర బాలాత్రిపురసుందరమ్మగారు

భర్తయం దెంత మక్కువ బరగియున్న
కాంతలకు గల్గు సంతతి గౌరవంబు,
ననెడు నార్యోక్తి సతతమ్ము మదినినిల్పి
ధరణిలోపల విఖ్యాతిదాల్పవమ్మ.

గృహమునందలి పనులను నింపుమీర
నాచరించుచునుండుము మీ యంబుజాక్షి!
పరమదాంపత్యసుఖముల బడయవమ్మ
ధరణిలోపల విఖ్యాతిదాల్పవమ్మ.

ఇతరగృహములకేగుట లెందుకమ్మ
చదువుకొనుట మనకు నీజన్మమందు
తెలియనేరని సంగతుల్ తెలుపునమ్మ
నీదుకాలంబు వృథయగానీయకమ్మ.

అన్నమోయంచు వచ్చెడి యతిథులందు
కినుకబూనక మిక్కిలి కనికరమున
కూరగాయలు పచ్చళ్లు కూడుబెట్టి
అతివ! చేయుచు నుండుమీయతిథి పూజ.



# లాలి పాట

లాలి రవికులతిలక లాలి రవితళుకా
లాలి ముద్దులచిలుక రాయంచతళుకా
అన్న ముద్దుపట్టి ఆమనుజకు బుట్టి
సన్నుతిం బొందితివి సకల జగజెట్టీ
పన్నుగా మాయట్టి పడతులు బట్టి
చెన్నుగా నూచెదరు చెలగు మీతొట్టి
పాలు త్రాగుమి నిండ బంగారుకొండ
పలుమారు ఏడ్వకుమి పసినిమ్మపండా
చాలగా మేమింత సంతసిలుచుండ
మాలిమిగ మాట్లాడు మా ముచ్చికొండా
అసమాన ధీర సూర్యాన్వయ ఘనుండ
రసికుడని కీర్తి రంజిల్లుచుండ
కుసుమాస్త్ర తేజ సద్గుణగణాఖండా
శశితోడ బుట్టిన సఖికళత్రుండ
ధరణివరనిగ మాద్రి దైవప్రసాదా
మరల నేడ్వకుమన్న మామీద వాదా
లాలి రవికులతిలక లాలి రవితళుకా
లాలి ముద్దులచిలుక రాయంచతళుకా॥

# శారదలేఖలు

సౌభాగ్యవతియగు కల్పలతకు—

నెచ్చెలీ!

చూచితిని, సమదర్శినీగర్భశుక్తిముక్తాఫలమగు యుగాదిసంచికను చూచితిని. చక్కని కాగితములతో స్వచ్ఛమైన అచ్చుతో రమ్యములైన చిత్తరువులతో మనోహరములైన భావగీతావళులతో దివ్యములైన వ్యాసములతో సంచిక రమణీయమై యొప్పారుచున్నది. ఆతెంగ్లు నిరాఘాటముగా చెన్నరాజధానీప్రజాయత్తశాఖల బాలించిన ప్రతిభాశాలియగు నాసచివశేఖరుని రాజలాంఛనాలంకృతంబగు త్రివర్ణముఖచిత్రము నిజముగా నాసంచిక కపూర్వశోభనే గూర్చుచున్నది. రాజకీయసాంఘికార్థికసారస్వతానేక విషయములనుగూర్చి వ్రాయబడిన ప్రసిద్ధవ్యాసములు పునః పునః పఠనీయములై తనరారుచున్నవి. అందందు తనరారుచున్న పద్యమాల లాసంచికాబాలకు మణిహారములే సందియములేదు. కాని యెట్టిచక్కదనాలచుక్కకైన యించుకంతలోపముండకపోదు. విధాతృసృష్టిలోనే యిట్టిలోటు సర్వసాధారణముగా కనుపించుచుండును. ఇంక మానవసృష్టిలోనుండుటలో వింతయేమున్నది? పాశ్చాత్య స్త్రీలనుగూర్చి వ్రాయఁబడిన వ్యాసమా సంచికలోఁ జేరుట నిజముగా నాసంచిక కొకకళంకమనియే చెప్పవచ్చును. అయినను నీ విషయమై యాసంచికా నిర్వాహకులనుగాని యావ్యాసకర్తనుగానియనవలసిన పనిలేదు. వారి పత్రికానామమే వారి మతమును నిరూపించుచున్నది. కాన సమదర్శన భావముతో నావ్యాసము నందుకొనిరి. ఇక వ్యాసకర్త విషయమా? ఆ సోదరునకు పాశ్చాత్యస్త్రీలనుగూర్చి తెలిసినంత మాతృదేశస్త్రీలనుగూర్చి తెలియదు. పాపము తెలిసియుండినచో అంత అసభ్యముగను నంతపేలవముగను వ్రాసియుండరు. దానికేమి? ప్రమాదోధీమతామపి. ధీమంతులకుగూడ నొక్కొక్కప్పుడు పొరబాటు కలుగుచుండును. కాని ఆకథలేమి? మాణిక్యము వంటి సంచికలో మసి చుక్కలుపెట్టినట్లున్నవే? కల్పలతా! ఆకథలను జదువగనే నాకు మితిలేని విచార మొదవినది. ఏమి ప్రయోజనము గోరి యాపట్టభద్రు లిట్టిచెట్ట కథలను వ్రాసిరో కానిప్పటికిని యూహింపలేకున్నాను.

మానవులు సహజముగా కథాప్రియులు. పాలుత్రాగు పసిబిడ్డగూడ చీమకథనో చేపకథనో చెప్పమొదలిడితి మేని యేడ్పుమాని ఊకొట్టును. ఈ పసితనమునాటి కథాప్రియత్వము మనుజులకు వార్ధక్యము వచ్చినను సడలదు. పత్రికాపాఠకులైన వారిలోగూడ సారస్వతవిషయములనిన విసుగుకొనెడి వారును, చారిత్రికవృత్తాంతమనిన తలకంటగించుకొనెడి వారును, ప్రపంచవార్తలనిన వలదనెడి వారును, మతవిషయములనిన మాకెందుకనెడువారును, భావగీతావళులనిన నేవపడెడు వారును, కలఁగాని కథలనిన చెవిగోసికొనని వారుండరు. ప్రతినెలయు మా యిరుగు పొరుగు అమ్మలక్కలు "ఏమండీ గృహలక్ష్మి వచ్చిందా? భారతి వచ్చిందా? ఏంకథలున్నాయి. ఒక మారుచూపరూ." అని కథలకొఱకే భారతీ గృహలక్ష్ముల క్షేమసమాచారము లడుగు చుందురు. ఆపత్రికలలోని యొకటి రెండు కథలు చదివినచో వారి చదువు పూర్తియైనట్లే, ఇఁక వానిలో వివిధ విషయములను గూర్చి కూర్చిన విజ్ఞానమంతయు వారి దృష్టిలో వట్టిచెత్త. చదువగనే యర్థమయ్యెడివిని చదివినంతనే యానందమును గూర్చెడివిని కథలు, కాన యన్నివిషయములకంటె కథలనిన ప్రజలకెక్కువ మక్కువ. ఈ విధముగా పండితపామరవివక్షతయు, బాలవృద్ధభేదమును లేక యెల్లరియామోదమును బడిసెడి కథలెంత ప్రశస్తములై యుండవలెను? అది యేమిపాపమోగాని ఆధునికకథా వాఙ్మయముపట్టి ప్రశస్తతను గోల్పోయి యుండుటకు కడుంగడు విచారము గొల్పుచున్నది. ఒక మారు మాఅన్నగారితో మాట్లాడుచుండగా మాటల సందర్భమున "కథలు యెట్లా ఉండాలె?" అని నేనుమా సోదరునడిగితిని. తన వాళ్లను నలుగురిని దగ్గరకూచో పెట్టుకొని చదివేటట్లుండాలె అని ఆయన అనెను. అంటే? అన్నాను నేను. మగవాడు తన తల్లికి, కొమార్తెకు, తోబుట్టువుకు, భార్యకును; ఆడుది, తన తండ్రికి, సోదరునకు, పెనిమిటికి, పుత్రునకును, చదివి వినిపించుటకు అర్హమైనదిగా ఉండాలె. కథలేగాదు చిత్తరువులుగూడ అట్లే ఉండాలె. అని ఆయన యనెను నాకు హితోపదేశము చేయుటకై మాసోదరుడావాక్యము లనకపోయినను, ఆమాటలు గురుమంత్రమువలె నా మనస్సున శాశ్వతముగా నాటిపోయినది. ఏదేని యొక కథవ్రాయ దొరకొనినచో భావగర్భితమైన యావాక్యము నాకు మాటిమాటికి స్ఫురణకు వచ్చుచు అంధకారపథమున దీపకళికవోలె తోఁచి నాకర్తవ్యతాపథమును నిరూపింపుచుండును. ఇతరకథలను చదివినప్పుడు గూడ ఆకథలు పైవాక్యమునకు సరిపడి యున్నవాయని యోచించుట నాకుపరిపాటి. సమదర్శినీ సంచికలోని కథలను జదివిగూడ నే నిట్లేయోచించితిని. రెడ్డిరంగమ్మ యొడ్డెతనపుగాథను జదివి అసభ్యము, అసాధారణము

అని మనస్సున చీకాకుపడి సావిత్రి, యనుచల్లని పేరుగాంచి యీకథయైన మనశ్శాంతి నీయకపోదని కుతూహలముతో జదివితిని. మొుదటికథకంటె యథార్థాన్నముగ నున్నదీ కథ. "మాప్రణయగాథ" సరేసరి. అన్నిటికంటె గొడవగానున్నది. అమ్మడు గొడవ. సమదర్శినీపత్రికాధిపతులు తమ సమదర్శకత్వమును తేటపఱచుటకై హితాహితములను గమనింపక యిట్టి కథలకు తావొసంగి రనుకొందము. కాని వ్రాసిన వారివి యెందులకు వ్రాసిరి? ఆ కథలు తల్లి బిడ్డకు చదివి వినిపింప దగినవికావు. బిడ్డ తండ్రికి చదివి వినిపింప దగినవి కావు. సోదరుఁడు తోబుట్టువునాకథలను చదువుమని చెప్ప సాహసింపచాలఁడు. స్నేహితుఁడు ఒకస్నేహితుని ముందరాకథలను సిగ్గువిడిచి చదువజాలఁడు. తుదకు అగ్నిసాక్షిగా పెండ్లాడిన ఆలుమగలు కాదుగదా కూరిమికిగూడిన స్త్రీ పురుషులైన ఆకథలను జదివి మోదింపజాలరు. సావిత్రివంటి, రెడ్డిరంగమ్మ వంటి, పనికిమాలిన స్త్రీ లెచ్చటైన నున్నచో వారిని గూర్చి బహిరంగముగా జెప్పుకొనుటకే యోగ్యులైన వారు పూర్వము జడియువారు. మనసున తలపరాని వాక్కున నుచ్చరింపరాని యట్టి వృత్తాంతములిప్పుడు విద్యాధికుల లేఖినీసన్మానమునందుచు రమణీయకథలై పత్రికలలో పాత్రములలో నెక్కుచున్నవి. ఆహా! కాలమహిమ!

కథ అచ్చుపడి దేశములో ప్రవేశించిన తరువాత అవివాహితయైన బాలిక చదువును. అన్నెపున్నెము లెఱుగని బాలవితంతువు చదువును. పత్యనురక్తయగు నిల్లాలు చదువును. వైరాగ్యోదయమైన వృద్ధురాలు చదువును. అట్లే పురుషులలో గూడ విద్యార్థులు మున్నగు పలురకముల వారు చదువుదురు. అందఱు చదువుట కర్హమైనదిగా నుండవలయుట కథారచయితల ముఖ్యధర్మమై యున్నది. కథకులే గాక కథకురాండ్రు గూడ యిట్టి కథలను వ్రాయ సాహసించుచున్నారు. దైవము వీరికి మంచి త్రోవను చూపుగాక.

కల్పలతా! యోచింప, యోచింప, భావకవులనబడెడివారేదియో యొక ఆడ పేరు బట్టుకొని 'ప్రేయసీ! ప్రేమసీ' యని యల్లాడుటయు, కథకులైన వారు 'ప్రేమ ప్రేమ' యనుచు స్త్రీలను గూర్చి యిట్టి విపరీతపు అసమంజసపు గాథలల్లుటయు, జూడ ఆంధ్రభాష దురదృష్టమో ఆంధ్రస్త్రీల దురదృష్టమో యోచింపలేకున్నాను.

శారద.

# శ్రీరామ గేయామృతము

బులుసు లక్ష్మీనరసమ్మ గారు

(నిగమాగోచర! శౌరి! రంగయ్యా! రంగా అనువరుస)

(పల్లవి)

తగునా? జాలమురారా! రామయ్యా! రామా! తగునా

జగతీభారముదీర్ప జనుదెంచితివి భువికి
జాగు సేయగనేలా? జగధీశ! నాతండ్రీ!—తగునా

అలనాడు శరణార్థి నాసుగ్రీవునిగావ, వానియ
న్నను వాలి వధియించితివి కావా?—తగునా

అన్నాచే నవమానమంది విభీషణుడు
హారామ! శరణన్నయతని గాచితివౌరా!—తగునా

భక్తిచే నెంగిలిపండ్ల నిచ్చిన శబరి
పాతకములంగోలి పాలించితివి కావా? తగునా

రాతినాతిగ జేసి రాజిల్లు నీపాద
రాజీవామలధూళి రానిమ్ము నాపైకి—తగునా

పూతభూజాతసమేతా యినకులజాతి
యేతీరుగా చెదవో? నీతిమమ్ములబ్రోవ—తగునా.




(బాలికా క్రీడా విశేష వివరణము.

చిల్లా సాంబమూర్తిశాస్త్రి గారు

[జాతీయములగు బాలికాక్రీడావిశేషములలో అచ్చనగాయలాట బహుళప్రచారముగలది. హస్తచాలనమున చురుకుతనము, లక్ష్యసాధనమున నిశితదృష్టి బాలికలకు చిన్నతనముననే నేర్పుటకు ఈఆట అత్యంతసహకారి.

"ముదురువెన్నెలగాయు ముత్యాల దిన్నెపైఁ
బైడియచ్చనగుండ్లు పాఱవైచి
కరకంకణ ధ్వనుల్ గలుగల్లుమని యింపు
గావింప నచ్చనగాయలాడు."

అని సారస్వతపట్టభద్రులు కవులు వర్ణించియున్నారు. ఆంధ్రదేశమందలి వివిధ స్థానికసంస్థలవారు తమ యాజమాన్యమున నిర్వహింపఁబడుచున్న బాలికాపాఠశాలలలో 'గృహలక్ష్మి'ని ప్రవేశపెట్టుచున్నారు. క్రీడాచలనమగు బాలికల మనస్సును ఆకర్షింపగల జాతీయములగు నిట్టి ఆటలనుగూర్చిన వ్యాసము లొక్కొక్కటిగా మాసక్రమమున నిందు వెల్వరింప సంకల్పించియున్నాము. అట్టియాటలయందు అభిమానముతోఁ గూడిన ప్రవేశపరిచయములు గలవారు వ్రాసి సమగ్రవివరణమును (అందుపాటలు ప్రసక్తములగుచో వానిని గూడ నుదాహరింపుచు) పంపుచో వందనపూర్వకముగా నిందు ప్రచురింపగలము. —సంపాదకుఁడు

అచ్చనగాయలాట ఆడపిల్లలు ఆడు ఆట. ఈయాటను బాలికలు మొదలు వృద్ధస్త్రీలవఱకు ఆడుచుందురు. అచ్చనగాయలాటయందు రెండు మూడు విధములున్నవి. తెలిసినంతవఱకు వానిని విపులముగ వివరింతును.

ఈయాట కొద్ది కొద్ది మార్పులతో మన దేశమునందు అన్ని తెగల వారిలోను వాడుకలోనున్నది. ఇది యాడుటకు గచ్చకాయలుగాని, చిన్న చిన్న గుండుగాళ్లుగాని, చింతగింజలుగాని, కుంకుడుగింజలుగాని కావలెను. ఇద్దఱు కాని అంతకు ఎక్కువమందిగాని ఈయాటనాడవచ్చును.

ఆటను ఉపక్రమించునపుడు అయిదు కాయలు ఎగురవేసి వానిని తిరుగవేసిన చేతిపై నిలుపవలెను. ఆ అయిదు కాయలలోను ఒక్కకాయక్రింద బడినను ఆటపోయినట్లు ఎంచబడును. అప్పుడు రెండవవారు ఆడుటకు మొదలు పెట్టుదురు. బోర్ల వేచిన చేతిమీది ఐదుకాయలును క్రిందవైచి అందొకకాయ నెగుర వేయుచు క్రిందనున్న నాల్గింటిని నొక్కొక్క కాయ చొప్పున గుప్పి ఎత్తుకొనవలయును. పైకి ఎగురువేసిన కాయను క్రిందనుంచి గుప్పినకాయను చేతితో పట్టుకొనవలయును. ఇట్లుచేయుటలో ఎగురుడు కాయ క్రింద పడినను గుప్పుడుకాయ కాక మిగిలిన కాయలు ఏకారణముచేతగాని కదిలినను ఆటపోయినట్లు భావింపబడును. ఇట్లే రెండవతూరి యొక కాయను ఎగురవేసి రెండేసికాయల చొప్పున కొట్టి తరువాత ఈవిధముగా ఒక కాయను ఎగురవేయుచు మూడేసి నాలుగేసి కాయల చొప్పున ఎత్తుదురు.

అటుతరువాత నేర్పుతో రెండు పాదముల మధ్యను కాయలను నిలిపి అప్పుడు పాదములను విడదీసి పూర్వమువలెనే ఒక్కకాయను ఎగురవేసి క్రిందనున్న నాలుగుకాయలను ఒకేసారి గుప్పుదురు.

పిమ్మట అయిదుకాయలు చేతబట్టుకొని అందు ఒకదానిని పైకి ఎగురవేసి నాల్గింటిని క్రిందవదలి పైనుండి వచ్చిన కాయను పట్టుకొని మఱిఒకసారి పైకి ఎగురవేసి ఆకాయక్రిందకు దిగివచ్చుసరికి క్రిందికాయలను మొదట ఒక్కొక్కటి చొప్పునను పిమ్మట క్రమమున రెండేసి, మూడేసి, నాల్గేసి చొప్పునను దూయుచు పైకి ఎగురవేసిన కాయనుపట్టుకొందురు. ఒకేసారి క్రింది నుంచి మూడేసి కాయలను తీసిన ఆటకు 'ముప్పీలు' అనిపేరు. నాల్గేసికాయలు తీసినఆటకు 'గుప్పీలు' అని అందురు. సాధారణముగ 16 గుప్పీలు 16 ముప్పీలు ఆడుదురు. ఈ ఆడు బాలికలలో కొందఱికి సంఖ్యాధికము తెలియకపోవుటచేత ఆసంకెలను తెలుపుటకై పాటలను గూర్చుదురు. 16 గుప్పీలు ఆడునపుడు 1, 2, 3, 4 —ఇత్యాదిగా లెక్కపెట్టుటకు బదులు—

ఒక్కా ఓ చెలియా  
రెండూ రేవిల్లూ  
మూడూ ముచ్చిలకా  
నాలుగూ నందన్నా  
ఐదుం చిట్టగొలుసూ  
ఆఱుం జవ్వాజీ  
ఎనమల మనమందా  
తొమ్మిద తోకుచుచ్చా

మొదలుగాగల పాట పాడుదురు.

తరువాత ఆట ముగించునప్పుడు ఒక్కొక్కకాయనె ఎగుర వేయుచు—

కొండమీది వెండిగిన్నె
కొక్కిరాజు కాలువిరిగె
విరిగి విరిగీ రెండాయె
వీథిల్లో మూఁ
దానికేం మందు
వేపాకు చేదు
వెల్లుల్లి గడ్డ
నూనాయి బొడ్డు
నూటొక్క ధారం.

అనిపాడుచు ఒక్కొక్క కాయను ఎదుటనున్న పిల్లవైపునకు వేయుదురు. ఇట్లు ఎగురవేయుట గెలిచి నందుకు సూచన.

ఈయాటలో క్రిందనున్న కాయలలో ఒకదానితో ఒకటి తగులకుండ కొట్టుటకు కొంత అనుభవమును అతిశయించిన హస్తకౌసల్యమును కావలసియుండును. చేతిల్రేళ్లు వెనుకకు బాగుగావంగి దొప్పవలెఏర్పడు నుండినగాని కాయలు తిరుగవైచిన చేతిమీద నిలచియుండవు. పైనివర్ణించిన ప్రకారం మొదటినుంచి చివర వరకు ఆడి యెవరుముందుగా కాయలను తీసికొనెదరో వారు గెలిచినట్లు భావించెదరు. తక్కినవారు ఓడి నట్లు అనుకొని తిరిగి ఆటప్రారంభించెదరు. ఆడునప్పుడు విసుగు లేకుండుటకై కొన్ని ఊతపదములు వాడుక లోనికి వచ్చినవి. 'కుప్పి', 'హరకుప్పి'; 'సుబ్బి', 'హరసుబ్బి' మున్నగునవి కొన్ని ఊతపదములు. లెక్క గొనుటకు పాడబడుపాటలలో మఱి ఒక దానిని చూడుడు:—

ఒకటీ ఒప్పుల కుప్పా
రెండూ రేగుల చుక్కా
మూడూ ముక్కాలి పీటా
నాల్గూ నల్లని మొగ్గా

ఇట్లు ఒకటీ, రెండు, మూడు, నాలుగు అని లెక్కపెట్టి కాయలన్ని కొట్టిన తరువాత చివర

ఐదుం జెల్లూ

అని అందురు. ఇట్టిపాటలింకను పెక్కుగలవు. అవిబాగుగ వచ్చినవారు వానిని వ్రాసి పంపి 'గృహ లక్ష్మి'లో ప్రచురింతురు గాకయని కోరుచున్నాను.

## బాలికలు

ఋగ్వేదపతి వేంకటాచలపతికవి

అలికము రావిరేక, మృదులాంఘ్రులగజ్జెలు, కంధరంబునం
దలి పులిగోరు, సందజిగితాయొదు వీనుచిన్నిమద్దికా
యలు, నిడువాలుఁ గన్గొనల నంజనరేఖలు ముప్పగుల్క నుం
గల జరుగుంచు బాలికలఁగన్గొను భాగ్యము భాగ్య మిమ్మహిన్.

# ఆంగ్ల స్త్రీలు—పార్లమెంటు

బులుసు లక్ష్మణమూర్తిగారు

ఇంగ్లాండు దేశమునందు క్రొత్తపార్లమెంటు యెన్నికలలో స్త్రీలు కడుశ్లాఘనీయముగ పనిచేసిరి. లక్షలకొలది స్త్రీలు ప్రప్రథమమున తమ వోట్లనిచ్చుటకై పాటుపడిరి. ఎన్నికలలో జయమును పొందినస్త్రీలు తగుమాత్రము అయినను ఎదుట కక్షివాండ్రయొక్క "స్త్రీలు, యెన్నికలయందు గెలుపొందజాలరు" అను అసత్యప్రకటలను భగ్నముగావించిరి.

ఎన్నికలయందు గెలుపొందిన స్త్రీలసంఖ్య 13 మాత్రమే. ఎదుటకక్షివారలకు వీరు సమబలులుకాక పోవుట మిక్కిలి శోచనీయము. సోషలిస్టు పార్టీకి నాలుగు క్రొత్తపార్టీలు చేర్చుకొనబడినవి. ఇందులో తొమ్మండుగురు స్త్రీలుపార్లమెంటు సభ్యురాండ్రు కలరు. కంసర్వేటివు పార్టీయందు నలుగురు స్త్రీలుయెన్నికలోనో మిసస్. హిల్టన్ ఫిలిఫ్సన్ యీసారి యెన్నికలయందు నిలువలేదు. తక్కిన ముగ్గురును యెన్నుకొనబడలేదు. లిబరల్ పార్టీవారు మిసస్ రుంసిమనును గోలుపోయి మిస్ మేగన్ లాయడ్ జార్జిని గెలుచుకొనిరి. లిబరల్ పక్షపు స్త్రీలలో మిక్కిలి ప్రఖ్యాతిగాంచిన మిసస్. వింట్రింగ్ హామును, మిసస్. సి. ఎఫ్. జి. మాస్టర్ మన్గారును, లూత్, పాలిస్ బరీలయొక్క పరాజయమును పొందిరి. సోషలిష్టు పక్షపు స్త్రీలనేతులు తగు మాత్రపు భేదమువలన గెలుపొందజాలక పోయిరి. కంసర్వేటివు కమ్యూనిస్టిలగు ముగ్గురు స్త్రీలు పరాజయమును పొందిరి.

కంసెర్వేటివ్ పార్టీవారు పదిమంది స్త్రీసభ్యులు కలిగియుండెను. ఇందున ముగ్గురుమాత్రము యెన్నుకొనబడిరి. లిబరల్సు 25 మందిని గలిగి యుండెను. ఇందున ఒకరుమాత్రమెన్నుకొనబడిరి. సోషలిస్టు పార్టీవారు 30 మంది స్త్రీ సభ్యురాండ్రను కలిగియుండెను. ఇందులో తొమ్మండుగురు ప్రస్తుతము పార్లమెంటు సభ్య

రాండ్రు ఈక్రిందను, క్రొత్తగా యెన్నుకొనబడిన స్త్రీపార్లమెంటు సభ్యురాండ్రయొక్కయు పాత సభ్యులయొక్కయు జీవితము తెలుపబడుచున్నది. లేడీ. ఆస్టర్ (సి. ప్లేమూత్) పార్లమెంటు సభయందు మొదటి స్త్రీసభ్యురాలు. లేడీ ఆస్టరుగారి వోట్లు యీసారి పడిపోయినవి. 1924 వ సం॥ 5,079 వోట్లును ప్రస్తుతము 211 అయినవి. ఆథాల్ ప్రభ్వి పార్లమెంటు విద్యాశాఖ బోర్డుకు కార్యదర్శి. కాన్సర్వేటీవు పార్టీయందు యీమె యొక్కతయే మంత్రిపదవిని స్వీకరించెను. ఈమె ప్రభుత్వపరిపాలనయందును రాజకీయ తంత్రములయందును అసమానురాలు. ఈమె 1923 సం॥రము నుంచి సభ్యురాలుగ నుండు చున్నది.

లేడీ అన్నా, లేడీ ఆస్టర్ వలెను ఆథల్ ప్రభ్వి యెన్నికలయందు జయముపొందెను. ప్రథమమున ఈమె 1927 సం॥ నవంబరు మాసములో యెన్నుకొనబడెను. ఈమె పార్లమెంటు స్త్రీసభ్యురాండ్రయందరిలోను మంచివాగ్మిని. మిస్ మార్గరెట్ బాండ్ ఫీల్డు, 1924 సం॥లో కార్మిక మంత్రివర్గమునకు కార్యదర్శిగాయుండెను.

1925 వ సం॥ రపు యెన్నికలలో నార్త్ హాంప్టనందు పరాజయమునుపొంది 1926 వ సం॥ యెన్నికలలో వాల్సందునందు జయమును పొందెను. ఈమె, నిరుద్యోగపు సమస్యయందును, బ్లెన్సుబర్గు రిపోర్టుయందలి సమస్యలయందు గౌరవము గోలుపోయినను, ఈమెకష్టపడి మిక్కిలి యోర్పుతో పై సమస్యలయందు పనిచేయుట వలన గోలుపోయిన గౌరవమును సంపాదించుకొనెను. మిస్. సుసానాలారెన్సు 1923 వ సం॥ డిశెంబరు మాసములో మొట్టమొదట సభ్యురాలుగవచ్చెను. ఈమెబుద్ధి కుశలతయందును వక్తృత్వమునందును పార్లమెంటు సభయందు మిక్కిలి వన్నెకెక్కుటచేత పార్లమెంటు సభయందు పురుషసభ్యులు సహితము ఈమెయం దసూయిత గల వారైయుండిరి.

ఈమె 1871 సం॥మున జన్మించెను. న్యూన్ హేమ్ కళాశాలయందు విద్య నభ్యసించెను. లండనునగరపు కౌంటీ కౌన్సిలునందు బి.ఏ. పరీక్ష ప్యాసయ్యెను. మిస్. ఎలెన్. విల్కిన్సన్, 1924 సం॥ నుంచి సభ్యురాలుగ వచ్చుచున్నది. ఈమె మొదట స్కూలు ఉపాధ్యాయురాలుగను, పిమ్మట వర్తక సంఘపు తరపున నిర్మాత్రిగను పిమ్మట మేన్చెష్టరు నగరపు కౌన్సిలునందు సభ్యురాలుగను యుండెను. మిస్. జెన్నీలీ: ఈమె పార్లమెంటు స్త్రీ సభ్యురాండ్ర యందరిలోను మిక్కిలి పిన్నవయస్కురాలు.

ఈమె 21 సం॥రములు ప్రాయముగలది. గనులయందు పనిచేయుచున్న నొక కార్మికుని కుమార్తె మిస్ ఇంపిక్ టన్‌ట్రూంబర్‌విల్ :—ఈమె, పాత (Conservative) సంఘములోని వనిత. ఈమె, నావికి కార్మికుల తరఫున, బెట్టియందు పనిచేయుటకు మొదలుపెట్టెను. ఈమె స్త్రీల కష్టసుఖములను గురించి మిక్కిలి శ్రద్ధతో పని చేసినవనితయని నన్నెకెక్కెను. ఈమె, హిందూదేశము మొదలయిన దేశములందు సంచార మొనర్చిన పిదప, స్వాతంత్రకార్మిక పక్షమున 1918-వ సంవత్సరములో చేరెను.

డాక్టరు ఎథెల్ జెంథామ్ శస్త్రవిద్యానైపుణ్యురాలని ఇంగ్లండునందు ప్రఖ్యాతి గాంచెను. ఈమె పరిపాలన సంఘమువారిచే, మెట్రపోలిటన్ అసైలము బోర్డు తరఫున యెన్నుకొనబడెను. డాక్టరు మారియన్ ఫిలిప్సు D. Sc. సోషలిస్టు పార్టీయొక్క ప్రధాన నాయకురాలు. 1908-వ సం॥రము నుంచి అహర్నిశాదులు కష్టపడి పనిచేయుచుండెడి యువతీలలామ. ఈమె అర్థశాస్త్రవిద్యయందు ఆరితేరిన ప్రజ్ఞావంతురాలు. ఈమెయొక్క స్త్రీనాయకత్వ పదవికి తగినట్లు ఎన్నికలలో స్త్రీసభ్యురాండ్రను అధికముగా చేర్చుటకు మిక్కిలి కష్టపడి పనిచేయుచున్నది.

వేడ క్లేథిస్టూ మాస్లీ ఇదివరలో హిందూదేశపు రాజప్రతినిధిగా యుండిన కర్జను ప్రభువుగారియొక్క ద్వితీయపుత్రిక. ఈమె 31 సం॥పు ప్రాయముగలది. ఈమె 1920 సం॥రమున సర్ ఆఫీవల్డు మూస్లీగారిని వివాహము చేసికొనెను. భార్యాభర్త లిరువురును, పార్లమెంటు సభ్యులుగా నున్నారు.

మిసస్ మేర హేమిల్‌టన్, మంచి విలేఖరి. ఈమె అనేకనవలలను, రామసేమెక్ డానల్డుగారియొక్క సతీమణి జీవిత చరిత్రమును వ్రాసియున్నది. ఈమె గ్లాస్గో విశ్వ విద్యాలపు తర్కాచార్యుని గారియొక్క కుమార్తె. ఈమె న్యూన్హాం కళాశాల యందు విద్యా ప్రవీణురాలయ్యెను. ఉపన్యాసములు యిచ్చుట యందు మిక్కిలి ప్రవీణురాలు.

మిస్. మెగన్‌లాయడ్ జార్జి, లిబరల్ పార్టీనాయకుని కుమార్తె. ఈమె 27 సం॥ ప్రాయము కలిగి వక్తృత్వమునందును, మేధాసంపత్తియందును, తన జనకునికి సరి సమానురాలు. ప్రపంచపు శాంతిని గురించి ప్యారిస్ నగరమందు జరిగిన సభయందు అఖండమేధాధురంధరులందరు, ఈమెను మిక్కిలి కొనియాడి, ప్యారిస్ నగరమందు

బ్రిటిష్ రాయబారులు నివసించిన మెజస్టిక్ హోటలు పేరునుమార్చి ఈమె పేరిట మాగ్నటిక్ హోటలు అని పేరిడిరి.

కర్నల్ సు లేడీ జూడ ఆగ్రెఅను సభ్యురాండ్రు శరీరమున వేరయినను మనస్సునందు మాత్రము యేకోదరులని డెయిలీయెక్స్ప్రెస్ వ్రాయుచున్నది. లండనునగరముకు ఎన్నికలలో 9 గురు స్త్రీలు నిలిచియుండిరి. ఇరువురుమాత్రము యెన్నుకొనబడిరి. దేశమున కంతటికిని మొత్తముమీద నిలువబడిన 69 మంది స్త్రీలలో 14 మంది మాత్రము ఎన్నుకొనబడిరి. ఇంతమంది స్త్రీలు ఓడిపోవుటకు కారణమేమైయుండుననగా తగిన తెలివితేటలు లేకపోవుట చేతనుగాని సహజసౌందర్యనిపుణత్వము లేకపోవుట చేతనుగాని అయియుండవచ్చును. గెలుపొందిన స్త్రీలకు పైగుణములన్నియు యొప్పియుండినవాఅనవచ్చు. ఇందులనుగుఱించి జాగ్రత్తగా ఎన్నికలు జరిగినపిదప పరిశోధించగా మిస్. సూసన్ లారెన్సు డాక్టర్ యెథల్ బెంథామ్ యిద్దరిలో నెవ్వరికినిగాని వశీకరణశక్తిచాలినంత లేదని తేలినది. అయితే యిద్దరును మంచి మేధావులు. డాక్టర్ బెంథము నారీమణి పసిపిల్లలయొక్క సౌకర్యము కొరకును వారలకు నివసించుటకు తగిన గృహములు మొదలయినవి యిప్పించుటకును పోరాడునది. ఈమె సోషలిస్టు పరిపాలనపక్షమున ఆరోగ్యశాఖకు మంత్రిపదవి స్వీకరించుటకు ఉద్దేశ్యము కలిగియున్నది. ఈమెగుణములలో మిక్కిలి యెన్నతగినది యేమనగా గర్వముచేత విఱ్ఱవీగక సామాన్యురాలుగా కనుబడుటయే. మిస్. సూసన్ లారెన్సు పొడవైనదియు యెన్నదగిన సౌందర్యవతియు మిక్కిలి నమ్రతకలదియునై ఒప్పుచున్నది. ఈమె సోషలిస్టుపార్టీయందు తనయధికారము చెలాయించుచున్నను వారి ఆత్మగౌరవమునకు భంగము కలుగనీయక వారలను నొప్పింపక తెలివితేటలుగలిగి పనిచేయుచున్నది. ఈమె పార్లమెంటుసభయందు ఒకప్పుడు మంచి యుపన్యాస మిచ్చియుండెను. అది సామాన్యుల కెవరికిని అర్థముకాకపోయెను. అప్పటినుంచియు నీమె మిక్కిలి ప్రఖ్యాతిపడసెను.

డాక్టరు మాలియన్ ఫిలిప్సుసండరులెండును జయించెను. ఈమె తన పార్టీకి ముఖ్యురాలు. మిస్. మెగన్ లాయిడ్ జార్జి తన తండ్రియొక్క త్రోవను తొక్కుచున్నది. ఈమె తనతండ్రిని జయించవలసిన కాలము సమీపించినది. మిస్. జెన్నీలీ సోషలిస్టు పార్టీలో చాలమందికిని, ఇతరులకును ప్రేమపాత్రురాలు. ఈమె బుద్ధికుశలతయందును, సౌందర్యమునందును, వశీకరణశక్తియందును మిక్కిలి పేరుగొన్నది.

లానార్కునుండి యీమె రెండు పర్యాయములు యెన్నుకోబడెను. ఈమె వచ్చినప్పటి నుంచియు పార్లమెంటు సభనంతటిని గందరగోళము చేయుచుండెను.

మిస్ "తెర్క" మిస్ ఎలన్ విల్కిన్సన్:—ఈమెఆకుపచ్చని దుస్తులను ధరించును. ఈమె కొన్నినవలను రచియించెను. ఎన్నుకోబడిన ఇతర స్త్రీలవివరమేనగా, లేడీ ఇవేగ్, లేడీ ఆస్టర్, మిస్‌మార్గరెట్ బాండ్‌ఫీల్డు, మిస్ ఎడిత్ పిక్‌టన్ టూబర్ విల్, ఆథాల్ ప్వభ్వి, లేడీకేయింథయామాస్లీ. ప్లైఫర్సు, అనబడు ఓటర్లు మిసస్, కార్‌బెట్ ఆష్‌బీనియెన్నుకొనుటకు యేకగ్రీవముగా ఒప్పుకొనలేదు. ఈమె అంతర్జాతీయ స్త్రీల ఓట్లసంఘమునకు అగ్రాసనాధిపత్యము వహించెను. ఈమె మిక్కిలి బుద్ధికుశలతకలిగి, భర్తకుతగిన భార్యగను పిల్లలకు తగిన తల్లిగను పేరుగొనెను.

డాక్టరు. స్టెల్లా ఛెర్చిల్ కురుచగా తలవెంట్రుకలు కత్తిరించుకొనును. ఆనందపూరిత మగు ముఖము కలిగియున్నది. ఈమె పార్లమెంటు సభ్యురాలుగ నెందుకు నిలిచెనో యెవ్వరికిని తెలియదు. ఈమె దేశమునకు అధికమైన సేవచేయుచున్నది.

మిస్ ఎలిజబెత్ ఎడ్వర్డు, బ్రాగ్‌హాము ప్రభువుగారి సంతతిలో చేరినది. వశీకరణ ప్రజ్ఞగల కొలదిమంది స్త్రీసభ్యురాండ్రలో నీమె యొకతె. డోరావెస్టు, నొకర్డీగారు తినుబడి సామగ్రికి నియంత్రిగా యున్నప్పుడు యీమె అతనికి కార్యదర్శిగా నుండెను. ఈమెపార్లమెంటు సభ్యురాలుగ వచ్చుటకు ప్రయత్నించెగాని యీమెప్రయత్నములు కొనసాగకపోయెను. పార్లమెంటు సభయందు వలయునంతమంది స్త్రీ సభ్యురాండ్రుగలరు. కొందరుబుద్ధి కుశలత గలవారు. కొందరు సౌందర్యవతులు. కొందరు వాగ్మినిలు. కొందరు వశీకరణశక్తిగలవారు. కొందరియందు పైగుణములన్నియు యొప్పి బ్రిటిష్ పార్లమెంటుసభ స్త్రీసభ్యురాండ్రతో నొప్పుచున్నది.

## కర్మము

ఉభయభాషాప్రవీణ బులుసు సరసింహాశాస్త్రిగారు

విషమది కంథమందు నతిభీకరమై యలరారుచుండినన్
విషధరముల్ మహోగ్నియును వెల్గ శరీరముఖంబులందు మా
నుషుఁడుకిరీటి శర్వునని నొవ్వగఁజేయడె యెన్ని చెప్పినన్
విషమశరారికైన నగునే నిజకర్మముతోసి పుచ్చగన్ ?

# లాట్వియా స్త్రీలు.

ఐరోపా ఘోరసంగ్రామానంతరము ఉత్పన్నములైన నూతనదేశములలో లాట్వియా యొకటి. ఇది ఐరోపాఖండమున రష్యా, జర్మనీ దేశములకు నడుమ బాల్టికుసముద్రమునంటి యున్న ఒక చిన్న ప్రజాసత్తాకరాజ్యము. లాట్వియా యొక్క సముద్రతీరభూమి యొక్క చుట్టుకొలత 340 మైళ్లు. ప్రజలకు ప్రయాణసౌకర్యమును గలిగించి వినియోగసుఖము నిచ్చు నదులు మంచివిగలవు. రైలుబాటలు గూడ విస్తరించియుండి అచ్చటి ప్రజా జీవితమును సుఖవంతము చేయుచున్నవి.



లాట్వియా యువతి.

జాతీయములైయుండు లాట్వియా యువతి దుస్తులు ఆడంబరరహితములై అతిశుచిగానుండి చూపఱుల నాకగొల్పును.

లాట్వియా దేశమున వ్యవసాయమే ముఖ్యవృత్తి. ఉన్న పరిశ్రమలు కొద్ది. అవియైనను కృషిసంబంధమైనవిగాని ప్రత్యేకమైనవికావు. ఈ దేశము గోగునార పరిశ్రమకు పేరెల్లినది. 275,000 యకరములు ప్రత్యేకము గోగునారసాగు క్రిందనే వినియోగమగుచున్నవి. ముక్కాలు మువ్వీసము అందలి భూమి అడవులచే ఆక్రమింపబడియున్నది. అగుటచే ఆ దేశమున కలప వ్యాపారము హెచ్చు. పశుసంపద వృద్ధి చేయుట యనినను, తేనెటీగలను పెంచుట యనినను, చేపలపట్టుట యనినను లాట్వియా దేశీయులు ఉత్సాహముతో పరిశ్రమింతురు. తేనెటీగలను బెంచి తేనె సంగ్రహించి దానిని బహుజాగ్రత్తగ భద్రముచేసి

ఇతరదేశములకు ఎగుమతిచేయుటలో లాట్వియా దేశీయులు ప్రజ్ఞావంతులు. అగుటనే లాట్వియా దేశమునకు తేనెభూమియను పర్యాయాభిధానము ఏర్పడి వ్యవహారము లోనికి వచ్చినది. ఉద్యానవనములను అతిసుందరముగ పెంచుటలో లాట్వియా దేశీయులకు మంచినేర్పుగలదు. వారి పట్టణములు బ్రహ్మాండమగు పార్కులతో, పెద్ద పెద్ద పూవు తోటలతో నిండాలియుండి పురజీవనమువలన కలుగు బడలికలు వాపగల్గియుండును. లాట్వియా స్త్రీపురుషులు అతిశాంతశీలురగుటచే విదేశీయులకు గూడ వారి మధ్యనుండుట సంతోష ప్రదమై సుఖదాయకమై యుండును.



లాట్వియా గృహిణి

గృహకార్యము లొనర్చునెడ ఆమెకు విశ్రాంతి అక్కఱలేదు. ఉడకబెట్టిన ఉర్లగడ్డల తొక్కలను ఆమె కంటిలోకన్నుపెట్టుకొని పరిశీలించుచున్నది. అద్దము రేయిగాక పొలమాగని శోషిల్లుచున్న అవయవములతో ఇంటికి వచ్చు తన పతికి ఆత్మ్రకింపైన భోజనమిడుటయే తన దినకార్యావధిగా తలంచు లాట్వియా గృహిణి పతిభక్తి పొగడదగినది.

లాట్వియా దేశీయుల దుస్తులలో విలక్షణమైనవి వారిటోపీలు. అవి సాధారణముగ బుతేదారి పనిచేయబడి రాజాధిరాజుల కిరీటములను గూడ క్రిందుపఱుపజాలియుండును. అపూర్వమైన అందముగలిగి భాస్వరమైన బుతేదారి పనితనముగలిగి ఆటోపీలు ధరించినవారి ముఖములకు ఒకవిధమైన అవర్ణ్యసౌందర్యమును గొనితెచ్చును.

లాట్వియా దేశపు స్త్రీపురుషులు మంచి పనివాండ్రు. సూర్యుని వేడిమి వారికి అలసట గొనిరాలేదు. పనిచేయ మొదలిడిరా అది పరిపూర్తియగువఱకు వారు విశ్రాంతినిగోరరు.

లాట్వియా దేశమున విద్యాపద్ధతిలో జాతీయత మఱుగుపడియుండినది. 1887 వ సంవత్సరమున లాట్వియా దేశమును రష్యావారు జయించి లోబఱచుకొని అచ్చటి పాఠశాలలో లాట్వియాభాషకు చోటులేకుండచేసి రష్యాభాషను వారి నెత్తిపైరుద్దిరి. లాట్వియా దేశపు స్త్రీపురుషులు ఈస్థితిని భరింపజాలకుండిరి. కాని వారు రష్యాపీడను



ప్రజ్ఞావతియగు లాట్వియా బాలిక

లాట్వియాదేశమున వ్యవసాయమే ముఖ్య వృత్తి. అయినను పరిశ్రమలు కూడ లేకపోలేదు. ఆత్మదేశమున పరిశ్రమలు నెలకొల్ప రాత్రింబవళ్లు పరిశ్రమించుచున్న ప్రజ్ఞానిధులలో ఉదయ్యా దొక్సన యగు నీమె పేర్కొనదగినది.

వదలించుకొనలేకపోయిరి. ఐరోపాసంగ్రామము యొక్క మంచి ఫలితములలో నొక్కటిగా లాట్వియాదేశముయొక్క స్వాతంత్ర్యము ఉదయము నొందినది. అప్పుడాదేశీయులు ప్రత్యేకము తమ కొక విశ్వవిద్యాలయమును ఏర్పఱచుకొని మాతృభాషాభివృద్ధికై నిరంతరసత్ప్రయత్నము లొనర్చుచున్నారు.

లాట్వియా స్త్రీలు కాయకష్టముపడు స్వభావము వారు. పొదుపరులు. శాంతచిత్తులు. అనవసరమైన ఆడంబరముల పైకి వారి మనస్సుపోదు. బద్ధకము వారి కేవిషయము సందునను ఉండదు. గృహకృత్యముల నిర్వహించుటలలో వారికిగల శ్రద్ధ అపూర్వమై ఆనందకరమై యుండును.

లాట్వియా దేశీయుల ఇండ్లు ఎక్కువ ఇటుకలతో కట్టబడియుండవు. కలపవారికి విరివిగా దొరకును గావున దానితోనే వారు గృహములనిర్మించుకొందురు. గృహోపకరణములు గూడ ముక్తసరిగనుండునే కాని ఆడంబరయుతములై అవసరమునకు మీరి యుండవు. విదేశపు వస్తువులను ఆదేశపు స్త్రీలు తమ యిండ్లయందుంచుకొనుటకు కంటగించుకొందురు.

అచ్చటి స్త్రీలు జాతీయములగు పాటలనిన చెవికోసికొందురు. లేఖ్యారూఢములు కాని పాటలు ఆదేశమున కొల్లలుగనున్నవి. అవి పాటలపార్వతు లనదగిన అచ్చటి స్త్రీల నోళ్లయందు మాత్రమే జీవములనిల్పుకొని పరంపరాగతములై వెలయుచున్నవి. అగుటనే

అచ్చటి స్త్రీలు వర్ణక్రమము నెఱుగకపోయినను విద్యావతులై, హార్మోనియము ముట్టకపోయినను గాయకురాండ్రై జాతీయతకు రక్షణదేవతలై వెలయుచున్నారు.

లాట్వియా దేశీయులు జరుపు పండగలలో సెంటు జాను స్మారకదినము తొలుత పేర్కొనదగినది. అది ప్రతిసంవత్సరము జూను 23-వ తారీఖున వచ్చును. శుభ్రవస్త్రాలంకృతలైన భార్య, భగిని, మాత మొదలగు వారిని వెంటగొని పత్రఫలపుష్పభరితమైన బండి పూన్చికొని ఉత్సవార్థము భోగిమంట వేయబడిన తావునకుపోయి లాట్వియా దేశీయుడు పావన రమణీయమగు స్థలమునుండి ప్రార్థన సల్పుచుండుట చూచితిమేని మూర్తీభవించిన భక్తిరసమువలె నుండకమానదు. తత్కాలోచితమైన రొట్టెలు బజారులలో కనిపించీకనుపించు నంతలో చెల్లిపోవును.



లాట్వియాగాయకురాలు

సమర్చనీయములును జాతీయములును నగు వస్త్రముల ధరియించి కటిబద్ధములైన హస్తములతో నిలచియుండి చీకటి విరియించు చూపులు ప్రసరించుచు మధుర మందహాసము చేయుచు తన కలపుంస్కోకిల కంఠధ్వనికి వినువారు మైమఱపునొందునట్లు పాటలు పాడు గాయకురాలు.

లాట్వియా స్త్రీలకు ఆత్మప్రాకృతాచారముల యందు ప్రీతి అసమానము. స్వేచ్ఛాప్రియత్వమున వారు పురుషుల కెంతమాత్రమును తీసిపోరు. ఆ దేశపు స్త్రీలు యొక్కవోని దేశహితైషులు. నూతనముగా స్వాతంత్ర్యలక్ష్మిని బడసినను వారు పరవశలుకాలేదు. విధ్యుక్తధర్మమును పాలుమాలుటయను దోషము వైపుముల్లు చూపుచున్న పురుషులబుద్ధిని వారు మరలించి దేశక్షేమమునకై పాటుబడుటయందు లగ్నముచేయుటకు స్త్రీలు విశ్వప్రయత్నములు చేయుచున్నారు. దేవీస్వరూపిణులగు స్త్రీలుపట్టుబట్టి పరిశ్రమించుచో ఏదేశమైనను ముందుకురాకమానదు. అగుటనే లాట్వియా దేశము స్వాతంత్ర్యమును బడసి కొలదికాలమే అయినను అచిరకాలముననే సర్వవిధముల అభివృద్ధినిగాంచి సభ్యలోకమున సముచితస్థానము నందునని ఆధునిక రాజ్యాంగతత్త్వవేత్తలందఱు ఘంటాపథముగ వాకొనుచున్నారు.

# రామభద్రమ్మ

ఆం|ప్ర శేషగిరిరావుగారు బి. యె (సారస్వతసమాజము)

ఆంధ్రభోజుఁడగు కృష్ణదేవరాయల అనంతరము తంజాపురమున ఆంధ్రనాయక రాజ్యము వెలసి విలసిల్లినది. తంజాపురి ఆంధ్రనాయకరాజులలో రఘునాథ భూపాలుఁడు సుప్రసిద్ధుఁడు; సుశ్లోకుఁడు; విశేషించి సంస్కృతాంధ్రములందు స్వయము కవనము చెప్పఁగల గొప్పపండితుఁడు. వీనుమిగిలిన విద్యావినోదియగు ఆతని ఆస్థానమున సంగీతసాహిత్యములందుఁ బేరుమోసిన పండితులనేకులు ఉండిరి. వారిలోఁగొందఱు స్త్రీలు. అట్టి విదుషీమణులలో రామభద్రమ్మ యొకతె.

రామభద్రమ్మ వారాంగన. చెంగల్వ కాళయ యను బ్రాహ్మణపండితుఁ డీమెవిద్యా గురువు.* తన యేలికయగు రఘునాథరాయల వీరవిక్రమములను, విద్యావినోదము లను కీర్తించుచు నీమె 'రఘునాథాభ్యుదయము' అని సంస్కృతమున నొక కావ్యము వ్రాసెను. అది ద్వాదశసర్గములుగల మహాకావ్యము.

ఏతత్కావ్యరచనమున రఘునాథరాయలు తనకుఁ దోడుపడినట్లు ఈ కవీశ్వరి ప్రథమసర్గమున నిట్లు చెప్పుకొనియున్నది. చూడుఁడు.—

"శబ్దార్థయోర్మసమప్రధానం
వశంవదం యస్య వదంతి సర్వే
కృతీసఏవాత్ర కృతౌసహాయో
నాథోమమ శ్రీరఘునాథనామా."

(సమతాగుణప్రధానములై శబ్దార్థములు ఎవనికి అధీనములైయున్నవని సర్వ జనులును చెప్పుచున్నారో అట్టి నానాథుఁడగు రఘునాథరాయలే ఈకృతికి భర్తయు, సహాయుఁడునై యున్నాఁడు.)

రఘునాథాభ్యుదయమున ద్వాదశసర్గమునందు రామభద్రాంబ తనయేలిక విద్యా వినోదముల నిట్లు వివరముగ వర్ణించియున్నది.—

---

* చూడు: తంజావూరి ఆంధ్రరాజుల చరిత్ర: బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పీఠిక.

తతస్స తాసాంధగణీ పురందరః
చతుర్విధోద్భావకవిత్వచాతురీం
అశేషభాషానుగుణప్రపంచిత
ప్రబంధసందర్భ విశేషపాటవం
సమప్రధానం శతలేఖినీసమం
ప్రక్లృప్తనానావిధపద్యపూరణం
సలీలజాగ్రద్ఘటికాశతోచిత
క్రమాష్టభాషాకవితావిజృంభణం
కవిప్రణీతాఖిలకావ్యనాటక
ప్రబంధతత్వప్రతిపాదనక్రమం
కర్ణాటదేశాదిమకల్పితశ్రుత
ప్రగల్భగూఢార్థవివాదపాటవం
సుధారసస్యందిసుగీతిచాతురీ
ప్రవీణవీణాప్రతిమానవాదనం
స్వరానుకూలా..............
అనేకధా రావణహస్తపూర్వక
ప్రసిద్ధయంత్రస్వరరక్తిపాటవం
యథాక్రమప్రాపంచితమధ్యరాగస
త్పదాద్యపద్య ద్విపదప్రపంచనం
పరీక్ష్యసమ్యక్ ప్రతిబోధ్యచాధికం
విశేషముర్వీవిభురత్యుదారధీః॥

"వీరవిక్రమములు నెఱపి దిగ్విజయముసల్పి రఘునాథభూపాలుఁడు రాజధానీనగరమగు తంజావూరు వచ్చెను. అనంతర మాతఁడు తన యాస్థానమునను న్న విదుషీమణుల ప్రజ్ఞాపాండిత్యములఁ బరిశీలించుటకు సభకూర్చెను. ఆవిదుషీమణులు వివిధభాషలనేర్చినవారు; చిత్ర, బంధ, గర్భ, ఆశు అనుచతుర్విధకవిత్వములను చెప్పగల చతురలు; శతలేఖినీ విద్యయందును, సమస్యాపూరణమునందును ప్రవీణలు; గంటకు నూఱుపద్యములను రచియింపఁగలప్రోడలు; సంస్కృతమునందును, తెలుఁగునందును, మిగిలిన ప్రాకృతభాషలాటింటియందును కవితల్లగల క్లాంతహృదయలు; సుప్రసిద్ధకవిపుంగవులు రచియించిన కావ్యనాటకములకు సునాయాసముగ నర్థమును విడఁదీయఁగల విద్వాంసురాండ్రు.

ఒక్క సాహిత్యజ్ఞానముననేకాక వారు సంగీతజ్ఞానమునంగూడఁ గనుదిట్టలు. దేశికర్ణాటరాగ రహస్యములు వారికి హృత్కవిల. వీణ, రావణహస్తము మొదలగు వాని సాయమున వారు మృదుమధురగాన మొనర్పఁగల నేర్పరులు. సంగీతసాహిత్యములందలి ఈ విదుషీ మణుల పాండిత్యమును పరీక్షించి రఘునాథరాయలు వీరికిఁ గనకాభిషేకము చేసెను."

రామభద్రాంబచేసిన ఈ వర్ణనమువలన రఘునాథరాయల ఆస్థానమున అపరసరస్వతు లనఁదగిన స్త్రీలెందఱోయుండి రాజుమన్ననలఁబడయుచుండిరని తెలియుచున్నది.

రఘునాథాభ్యుదయమునం దీ విద్వాంసురాలి గద్య యిట్లున్నది.—

"ఇతి శ్రీరామభద్రకరుణాకటాక్షలబ్ధ సారస్వత ప్రవర్ధమాన శతలేఖినీ సమయలేఖినీ ద్వ్యష్టభాషా కల్పిత చతుర్విధ కవితానుప్రాణిత సాహిత్యసామ్రాజ్య పదవీధారూఢ రామభద్రాంబా విరచితే రఘు నాథాభ్యుదయే మహాకావ్యేద్వాదస్సర్గస్సమాప్తః॥"

దీనిని బట్టి రామభద్రాంబను గూర్చి ఈ క్రిందివిషయములు తెలియుచున్నవి. "శ్రీరామచంద్రమూర్తి కరుణాకటాక్షమున రామభద్రమ్మ కవిత్వము చెప్ప నేర్చినది. ఆమె శతలేఖినీ విద్యయందును, సమయలేఖినీ విద్యయందును చదురాలు. సంస్కృతము, ఆంధ్రము, ఆఱుప్రాకృతములు—ఈ యెనిమిదిభాషలయందును చతుర్విధ (గర్భ, బంధ, చిత్ర, ఆశు) కవిత్వము చెప్పఁగల ప్రజ్ఞాధురీణ. అగుటచే ఆమె సాహిత్య సామ్రాజ్య పదవీధారూఢ."

ఈ ఆంధ్రవిదుషీమణి యిహలోకమును వీడి యిప్పటికి మూఁడువందల సంవత్సరములకుఁబైఁగా నైనది.

"ఆంధ్రవిదుషీమణుల"నుండి

# బాలికాక్రీడా విశేషములు

పింగళి సూరన

దినముల్ కొన్ని చనంగ నంతఁ గడునర్థిం బొమ్మపెండ్లిండ్లు గు
జ్జెనగూళ్లచ్చనగండ్లు పింపిళులు కుచ్చళ్ గీరనంగింజ లో
మనగుంటల్ కనుమూసిగంతనలు కంబాలాట లోనైన ఖే
లనముల్ మీఱఁగ బోట్లతో నలరె బాలారత్న మెల్లప్పుడున్.

8



తేనె—నిమ్మరసము.—

జూను నెల పదియవ తేదీనాటి 'దీనబంధు' పత్రిక యిట్లు ప్రచురించుచున్నది.—

"గాంధిమహాత్ముని ప్రస్తుతపు ఆహారవిధానము తేనె, నిమ్మపండ్ల రసముతోను కూడియున్నది. నిమ్మపండ్లు హిందూదేశమున ప్రతి యింట వాడబడుచున్నవి గాని యెంతవరకు అవసరమో గ్రహింపలేకున్నారు. చింతపండునకు బదులుగ నిమ్మరసమే యుపయోగింపవచ్చును. చింతపండునందు ఆహారసంపద బహుస్వల్పము. నిమ్మపండ్ల రసమును వెచ్చచేయక, తాజారసమును పుచ్చుకొనవలెను. తేనెగూడ ఆహారవస్తువులలో ప్రధానాంశమైయున్నది. ప్రతిదినము ఆహారముగ ప్రప్రథమమున ఒకగ్లాసు మంచినీటితో నిమ్మరసము, తేనె కలిపి త్రాగిన బలముగను, ఆరోగ్యముగను ఉండును. అయితే నిర్మలమైన తేనె వాడవలెను. కొంత శ్రమచేసిన మంచితేనె లభించగలదు. మద్రాసులో తేనె వీశె రెండురూపాయలకు దొరకగలదు. ధర యెక్కువ ప్రియముగాదు. పల్లెటిగ్రామములలో నింకను చౌకగ వీశె రూపాయికే లభింపగలదు. మలబద్ధకమున్నచో ఎండుద్రాక్షపండ్లను కొద్దిగా నిమ్మరసము తేనెతో కలిపి పుచ్చుకొన్న మేలుకల్గును. సాయంకాలముగాని రాత్రిగాని ఒక నిమ్మచెక్కరసమును ఒక పాత్రలోనికి పిండి అందు పదిద్రాక్ష పండ్లను నానవేయుము. మరునాడుదయమున రెండు, మూడు చెంచాల తేనెయు, కొంచెము నీరు అందుకలిపి కొంచెము కాలమైనపిమ్మట ముందు ద్రాక్షపండ్లను నమిలి, తరువాత ఆద్రవమును త్రాగుము. ఇందువలన మలకోశములు బాగుపడుటయేగాక, మంచి ఆహారద్రవము గూడ నగును."

గీటురాయి.—

జూలై మాసము ౧–వ తేదీనాటి 'పంచానన' పత్రికలో గీటురాయిని గురించి ప్రచురితములైన దిగువవిషయములు ఆభరణప్రియులగు ఆంధ్రస్త్రీలకు స్వర్ణవృత్తి యందలి శాస్త్రరహస్యముల నెఱుంగుటకుఁ గొంతవఱకుఁ దోడుపడక మానవు.—

"ఇది క్రీస్తుశకమునకు ముందునుండియు వాడుక జేయబడుచున్నది. గీటురాయి నల్లటి చంద్రకాంతపు రాయి గాని లేక నల్లటిబలపముగాని యైయుండును. అది కఠినముగాను మెరుగునకు వీలుగా నుండవలయును.

ఈరాయి మిక్కిలి నల్లగానుండవలెను. ఎంతనలుపుగానుండిన అంతసూక్ష్మముగా బంగారముయొక్క వన్నెను తెలుపగలదు. ఎందుకనగా వర్ణముపై వెలుతురు ప్రకాశించునప్పుడు రంగులో భేదముగలుగును. దానిచేత గీటురాయి యెంతనలుపుగానున్న అంతచిక్కగానున్నదని మనము గ్రహించవలెను. గీటురాయి ఒక అంగుళము దళముగాను రెండంగుళములు నిడుపుగాను నుండును. ఇంత పరిమాణములతో నుండినట్లయిన గీటు వగైరాలు పెట్టుటకును అటునిటుతిప్పి చూచుటకును బాగుగానుండును. ప్లాటినము బంగారమునకంటె విలువయైనది. సాధారణముగ ప్లాటినమును ప్లాటినముఅని పోల్చుకొనుట చాలకష్టము. మొట్టమొదట ఆస్ట్రేలియాలో నికలును బంగారమును మిశ్రనముజేసి ప్లాటినమువంటిలోహము తయారుచేయుచుండెడివారు. కాని అదిచాల కఠినమయినదిగను తెలివిగలపనివాడు కంటితో చూచినంతనే ప్లాటినమునకును దీనికిని గల భేదమును కనిపెట్ట గలిగినట్లుగనుండెను. అందుచేత అట్టికఠినలోహములను గీటుపెట్టి పరీక్షించవలయుననిన గీటురాయి చాలకఠినముగ నుండిననేగాని తగినంత మచ్చుగీటునివ్వదు. గీటురాళ్లు విడియానుండి ప్రశస్తమయినవి వచ్చును. విడియా ఆశియా మధ్యనున్నది. కాని దళమున బలపముతో గూడ గీటురాతిని చేయించుకొనవచ్చును. ఆబలపము [అనగా కుఱ్ఱవాండ్రు వ్రాయుపలక] యొక్కవగా రంధ్రములు గలదిగానుండరాదు. కలితీ లోహములను పరీక్షించి చెప్పవలయుననినచో గీటురాతిపైగాక యీవిధమగు ఆసిడ్డులతో పరీక్షించవచ్చును.

1

| | |
|---|---|
| నైట్రేటుఆఫ్ పొటాసియము | 2 డ్రాములు |
| హైడ్రోక్లోరికుఆసిడు | ½ ఔన్సు |
| నైట్రికుఆసిడు | 2 డ్రాములు |
| నీరు | 2 డ్రాములు |

2

| | |
|---|---|
| నైట్రికుఆసిడు | 6 డ్రాములు |
| నీరు | 2 డ్రాములు |
| టేబిలుసాల్టు | 2 డ్రాములు |

ఇవి ముందు చూర్ణముచేయవలెను. వేరువేరుగానుంచియే చూర్ణముచేయవలెను. అన్నియు వరుసవాయిని నీటిలో కలుపవలెను. అట్లుతయారైన ద్రావకము చిన్నబుడ్డలోనుంచవలెను. ఏలోహము పరీక్షించవలయునో ఆలోహముపై ఒక్కచుక్కద్రావకమునుమాత్రము వేయవలెను. అప్పటికిని యేవిధమగు మార్పు కనబడక యున్నచో లోహము మంచిదికాదనియు విలువలేనిదనియు చెప్పవచ్చును."

జలముయొక్క విలువ—

'గుడ్ హెల్తు' అను పత్రికలో పైవిషయమును గూర్చి యిట్లు వ్రాయబడియున్నది:—

“జలము కోపతాపముల నణచుటకు దివ్యమైనది. లేచీలేవడముతోడనే ఒకటిరెండు గ్లాసుల శుభ్ర జలమును పానము చేయుచో పేగులు క్షాళితములై కాలవిరోచనమగుటకు వీలుకలుగును. పడుకనుండి లేచినతోడను, భోజనకాలములకు మధ్యను, పరుండబోవునపుడును వినియమయుగా జలపానము చేయుటకు యుక్తసమయములు. చర్మముమీది మురికిని పాఱద్రోలుటకు నీటికంటె ఉత్తమమైన వస్తువు మఱియొకటి లేదు. కాలనియమము ననుసరించి చేయు శీతలజలస్నానము ఆరోగ్యకరమైనది. కాని బలహీనులకది కొంత చెఱుపుచేయును. కావున అట్టివారు గోరువెచ్చనినీటి నుపయోగించుట లెస్సయగు మతము. రోగమును పాఱద్రోలుటకును ఉన్న ఆరోగ్యమును నిలుపుకొనుటకును నీరు మానవునకు అత్యంతసహకారి.”

## ఉన్నిబట్టల మఱకలు పోగొట్టుట.—

జూనుమాసపు ‘ఇండస్ట్రీ’ పత్రికలో వివరింపబడిన దిగువవిషయము గృహశౌచవ్యగ్రహృదయులగు స్త్రీలకు లాభకారిగా నుండగలదు—

“ఉన్నిబట్టలమీద ఏర్పడు మఱకలు పోగొట్టు మార్గములను తెలిసికొనుటకు గాను మున్ముందు మఱకలు ఏకారణమున ఏర్పడినవో గుర్తెఱుంగవలయును. వెన్న, నూని మొదలగు వానివలన గలిగిన మఱకలను తొలగించుటకు మఱకలుగల ఉన్నిబట్టను బల్లమీద పఱచి సాంబ్రాణినీటిలో ముంచిన తెల్లగుడ్డతో పలుసారులు రుద్దవలయును. సారాయి, కాఫీ, తేనీరు వీనివలన గలుగు మఱకలు నీటితో తడిపి పిమ్మట మెథిలేటెడ్డుస్పిరిటు, సోపు వీనితో రుద్దిన మాసిపోవును.”

## వంగరాష్ట్రమున స్త్రీవిద్య.—

జూలైమాసపు ‘మోడరను రెవ్యూ’ పత్రిక ఇట్లు ప్రచురించుచున్నది.—

“వంగరాష్ట్రమున బాలికలకును స్త్రీలకును విద్యావసతులుచాలినన్ని లేవు. ధనసంపదయందును జనసమ్మర్దము నందును చాల వెనుకబడియున్న జిల్లాలయందు కూడ బాలురకై పెక్కు ఉన్నత పాఠశాలలు ఏర్పడియుండగా బాలికలకై ఒక్క ఉన్నతపాఠశాలకూడ లేని జిల్లాలు పెక్కులున్నవి. ప్రతి జిల్లాయందును కనీసము ఒక్క ఉన్నత పాఠశాల—సకల విద్యా సౌకర్యములు గలది—గవర్నమెంటువారిచే బాలికలకొఱకు నిర్వహింపబడవలసిన అవసరము అనంతముగా నున్నది.”

ఇట్టి అవసరము ఆంధ్రమండలములందు కూడనున్నది. దానిని దీర్చికొన మనవారు ప్రయత్నింపకుండుట శోచనీయము.

## హైందవ స్త్రీలు:—

పై విషయమును గూర్చి ప్రొఫెసరు కార్వేగారు లివర్పూలునందు ఇట్లుపన్యసించియున్నారు. —

"భారతదేశము మేల్కాంచెను. భావిదశ మిక్కిలి యభివృద్ధికరముగ నుండుననుటకు సందియము లేదు. రాబోవుసంతతి వారిలో నమితమగు అభివృద్ధి కానగును సాంఘిక, పారిశ్రామిక, రాజకీయ, విద్యావిషయములందు భారతదేశ మభివృద్ధి గాంచుచున్నది. నలువది ఏండ్లక్రితము వితంతువివాహమునకు హిందువులలో నగ్రవర్ణములవారు సమ్మతించియుండలేదు. 11 లేక 12 ఏండ్ల బాలిక విధవరాలైనచో తన జీవితము నంతయును వితంతువుగనే గడుపవలెనని చెప్పుట మిక్కిలి యన్యాయము. నేను 36 ఏండ్ల క్రిందట దృష్టాంతమును జూపుటకే యొక వితంతువును వివాహమాడితిని. నేను చాలమంది వితంతువులను ఉపాధ్యాయులుగను, దాదులుగను తరిబీతునొందు స్త్రీలకనినొక పాఠశాలను స్థాపించితిని. 1450 మంది బాలికలు స్త్రీసంఘము వారి యాదరణమున విద్య నభ్యసించుచున్నారు. స్త్రీలకు ఇంకను అనేకమైన హైస్కూళ్లు స్థాపింపబడవలెను. ప్రతిరాష్ట్రమునను స్త్రీలకొక విశ్వవిద్యాలయ మేర్పరుపబడవలెను.

స్వర్గీయ సరసీబాల.—

ఆషాఢ మాసపు "ప్రవాసి" (వంగమాస పత్రిక) ఇట్లు వ్రాయుచున్నది—

"ప్రవాసీపత్రికకు సుప్రసిద్ధమైన లేఖకురాలుగా నుండిన శ్రీమతి సరసీబాల ఇహలోకమును వీడిన విషాదవృత్తాంతము పాఠకవర్గమునకు తెలుపవలసి వచ్చినందులకు చింతిలుచున్నాము. సుమారు ఏడాదిగా ఆమె రోగపీడితురాలై యుండుచు తన 43-వ యేట పరమపదించినది. ఆమెయొక్క ఈ అకాలమరణము వంగ భాషలో బాలసాహిత్యసృష్టికి విశేషమైన లోటు కలిగించినదనుటలో సందేహము లేదు. మహిళా లేఖకురాండ్రలో ఈమె యొక్కతియే అగ్రస్థానము వహించినది. పిన్నవయస్సుననే ఆమె తన ప్రథమగ్రంథమైన 'పుష్పహారము'ను ప్రకటించినది. ఆమె బహుగ్రంథములను పరిశోధించినది; అనేక ఉపన్యాసము లిచ్చినది; కథాసాహిత్యమునకు ఒక విశిష్టస్థానమును గొనితెచ్చినది. 'ప్రబాల' అను శీర్షికగల ఆమెయొక్క ఉపన్యాసములు గతవత్సరపు ప్రవాసీపత్రికలో ప్రకటింపబడి యుండుట పాఠకులకు తెల్లమే. ఈమె యొక్కతియే వంగమహిళాలోకమున అత్యంత తేజస్వినియై యుండెడిది. స్త్రీలకు పురుషులతోటి సమానమైన అధికారగౌరవములు ఉండవలయునని ఆజన్మాంతము తీవ్రకృషిసల్పెడిది. ఆమెయొక్క స్వదేశ ప్రేమయు స్వజాతివాత్సల్యమును మన దేశములో ప్రతిస్త్రీయు అనుకరింపదగియున్నవి. వ్యక్తిగతజీవనములో ఆమె యొక్కతియే ఆదర్శసుగృహిణియై యుండినది. ఆమెయొక్క స్వర్గగతాత్మకు సద్గతిని కోరుచు ఆమె విషయమై శోకసంతప్తులై యున్న ఆమె స్వామికిని, సంతానమునకును మా ఆంతరంగిక సహానుభూతిని తెలుపుచున్నాము."

ఇల్లాలు-సంతానము—

పై విషయమును గూర్చి శ్రీయుత దంటు లక్ష్మీకాంతముగారు జ్యేష్ఠపూర్ణిమనాటి "ఆర్యపత్రిక"లో వ్రాసిన వ్యాసమునుండి క్రిందిభాగము ఉద్ధృతములు.—

"ఒకానొక గర్భిణీ స్త్రీ పొలమునందిరుగుచుండ నొకపామామె కుడికాలి పిక్కకు బెనవేసికొనెను. ఆమె భయభ్రాంతయై కేకలుపెట్టి మూర్ఛనందెను. సమీపవర్తులరికివచ్చి యాపామును వదలించి చంపి యామెకాపన్నివారణ మొనరించిరి. కాని యామె ప్రసవమైన వెనుక నామెశిశువు కుడి పిక్కపై బాముచుట్టవేసినట్లు మచ్చయేర్పడియుండెను.

అంతర్వత్నియొకరిత యొంటరిగ నింటనున్న తరి నొక యెలుక యామె కుడిభుజముపైబడెను. ఆమె కడుంగడు భీతిల్లి పిదప శాంతిగనెను. ఈయెలుక రూపమామెకు గలిగిన శిశువు కుడిభుజమున మచ్చగా నేర్పడియుండెను.

స్త్రీలదేహము లతికోమలములు. శరీరములతోపాటు వారిబుద్ధియు నున్నితము. వారెపుడును దేహకార్శ్యత కలిగించునంతటి కాయకష్ట మొనరించుచుండిన వారిశరీరములు మోటువారి మిగుల కోమలములు అతిసున్నితములు నగు శిశురంగకముల మెలకువతో నరసి మృదుతరములు కాని తమశరీరావయవములచే వారిని దగినటుల సంరక్షింప జాలకుందురు. యువతులదేహములు సళ్లుపారియుండినంగాని శిశువులకు వలసినన్ని పాలుండుట దుర్లభము. కాయకష్టముచే పాలూరుట తరుగుపడుచుండును. శరీరము మిక్కిలి బలసికొవ్వు పేరిన వారికిని సుఖాంగులకును గర్భోత్పత్తియగుట దుర్భరము. కావున నెలంతలు వ్యాయామాంతరములుడిగి యథోచితగృహకృత్యము లొనరించుకొనుచుండుట సమంజసము. స్త్రీలు కఠినకృత్యము లొనరింపరాదని చెప్పబడినందున వారు కేవలము తినికూర్చుండవలెనని యెన్నరాదు. అట్టులైన కఠినములగు పనులొనరించుట వలన కంటె నధికముగ జెరుపు కలుగును. కాన గర్భిణులెపుడు గృహకృత్యములొనరించుకొనుచుంట మానరాదు. పనిలేక తిని కూర్చుండవలసిన భాగ్యవంతులు సుఖప్రసూతిం గాంజాలరు. ఇంటిపనులొనరించుకొను సామాన్య కుటుంబినిలు సుఖప్రసవలగుట తరుచుగ సంభవించు చుండును."

కీ. శే. సువ్వా వరహాలమ్మగారు.—

జూలై మాసము ౧-వ తేదీనాటి "హిందూసంస్కారి" పత్రిక ఇట్లు లిఖించుచున్నది —

"ఆంధ్రదేశమున కళావంతులలో సిరిసంపత్తులందు పేరెన్నిక గన్నవారిలో నొకరగు శ్రీయుత దువ్వ రాజగోపాలముగారి ద్వితీయపుత్రిక. సిరికిందావలమైన కుటుంబమున జనించినను ఈమె నిరాడంబరజీవియై తన దాతృత్వముచే తన కుటుంబమునకు వెనలేని గౌరవమును సంపాదించినది. ఈమె తన సంఘీయులలోనే గాక తదితర సంఘీయులలోకూడ బీదవిద్యార్థులకు సహాయము జేయుటయేగాక బీదల కన్యకలకు వివాహకార్యములందు గూడ తగు సహాయ మొనరించి తనధర్మగుణసంపత్తిని వెల్లడించినది. ఈవిధముగ పెక్కండ్రు అనేకవిధముల ఈమెవలన సహాయమును పొందినవారు గలరు. ఈమెకు సంఘసంస్కరణమన్న గాఢాభిమానముగలదు. తాను స్వయముగచేయు గుప్తదానము లనేకములుండ తమతల్లిగారిపేర ఆంధ్రదేశకళావం

తుల మీద విద్యార్థుల సహాయార్థమై నెలకొల్పబడిన "కళావంతుల విద్యాసంఘము" నకు (గుంటూరు) రు 500 లశాశ్వతవిరాళము నొసంగియుండినదని తెలియుచున్నది. ఈమె హఠాత్తుగ ది 29-5-29 వ తేదీని యకాలమరణమునకు గురియై వృద్ధురాలగు తన తల్లిని, కుమార్తెలను, మనుమలు, మనుమరాండ్రతో గూడిన తన కుటుంబమునే గాక సంఘీయులలో గూడ కడువిచారమును కలిగించినది."

వదాన్యత ఎఱిఁగిన శ్రీమంతురాలు శ్రీ॥ శ్రీ॥ వరహాలమ్మగారి యాత్మకు పరమేశ్వరుఁడు శాంతినిచ్చుగాక!

శారదలేఖలోని అభిప్రాయము సరికాదు—

గతమాసము గృహలక్ష్మి లోని శారదలేఖ స్త్రీలనాటకరంగప్రవేశము పనికి రాదని అభిప్రాయము తెల్పినది. ఆయభిప్రాయము సరికాదని 'సాధన' పత్రికలో ఏత్పత్రికాసంపాదకులిట్లు వ్రాయుచున్నారు.

"స్త్రీలు ఆపత్కాలమందు డాక్టరుగారికి చేయిచూపించినట్లు నాటకసభామధ్యమున మెలగినచో నాటకకళ అధ్వాన్నమై పోవునని శారదఅభిప్రాయము. కాని నాటకములో స్త్రీపురుషులు అంతఃపురములోవలె వర్తింపవలెనా? సంస్కృతనాటకము లెన్నియోయున్నవి. కాని అందులో గనుపరుపబడిన ప్రేమప్రదర్శనమునకు నియమము నిర్బంధములు గలవు. సభలో గనుపరుపరాని భావము నాటకములోనే కనుపడదు. కాని ఇటీవల ఆంధ్రనాటకములలో నాయికానాయకులు సిగ్గుబిడియము లేక వర్తించునాచారమేర్పడినది. దమయంతివంటి పతివ్రత వీరసేనుని ఎదుటబడినప్పుడు వారిరువురు నాటకరంగమంతయు చిందులు త్రొక్కుట నాగరకుల మనసున కసహ్యము గల్గింపకపోదు. అయినను ఆరంగమున దుమ్మురేగువరకు వారెగురులాడిన గాని ప్రేక్షకులకు ఆనందములేదు. ఆకిరాతరాజు దమయంతితో తనమోహమును వెల్లబుచ్చు సందర్భమున నన్నయభట్టు భారతములో 'నిజహృదయం బెఱిగించె'నని మాత్రము వ్రాసిముగించెను. ప్రబంధకవులయినచో నాయమ అంగాంగములను ఆకిరాతునిచే వర్ణింపజేసియుందురు. జనుల అభిరుచి విద్యావంతులెట్లు త్రిప్పిన నట్టుపోవుచుండును. వారిలో మంచిరుచి నుదయింపజేయుట విద్యావంతుల ధర్మము. కావున స్త్రీనాటకరంగమును ప్రవేశించినప్పుడు పురుషుడు స్త్రీవేషమును వేసికొని ఎగురులాడినట్లు ఎగురుటకు వీలులేకపోవునని శారదమ్మగారు దుఃఖించుటలో నర్థములేదు. ఆంగికాభినయము కంటె మాటలచే ఎక్కువభావము వెలిబుచ్చుటలోనే ఎక్కువ నేర్పుగలదు. అది నాగరకపద్ధతికూడ.

మన మింటిలోనైన వ్యవహరించునప్పుడు పురుషులే అందరున్నప్పుడుకంటె స్త్రీలున్నప్పుడు నాగరకముగా భాషించెదము. పాశ్చాత్యసంఘములలో స్త్రీపురుషులు భేదములేక కలసివ్యవహరింతురు గనుకనే వారి సంభాషణలు మనభాషకంటె నాగరకముగానుండును. స్త్రీలున్నప్పుడు మనము భావములను విశ్వం

ఖిలముగా వెలువడనీయము. దానికొక నిర్బంధమేర్పడును. నాటకరంగములో కూడ పురుషులే నాయికానాయక పాత్రముల ధరించుటబట్టి వారి ప్రేమోదంతములు ఎంతగసాభాసముగనైన చెల్లిపోవుచున్నవి. నాటకకర్తలుగూడ అందుకు తగినట్లె సీనులను కల్పించుచున్నారు. విషాదసారంగధరలోని చిత్రాంగిపాత్రము పురుషవేషధారి కర్హమైన రీతిగనే చిత్రింపబడినట్లున్నది. స్త్రీయే చిత్రాంగివేషము వేయవలసియున్నట్లయిన నెడల నాటకకర్త ఆరీతిగా ఆరంగమును వ్రాసియుండును. కావున స్త్రీలు నాటకరంగము ప్రవేశించుటతో నాగరకనాటకము లుత్పత్తియై ఇప్పుడు ప్రేక్షకులకలవడిన చెడ్డరుచి అంతరించును. నాటకములోని రాముడు రాముడని కానీ సీత సీతయని కానీ వారనుకొనుటలేదు. ప్రేక్షకులును తలచుటలేదు. కావున స్త్రీవేషధారి పురుషుడైనమాత్రమున వచ్చిన చిక్కేమియని శారదగారి అభిప్రాయము. అయినప్పుడు పసిపిల్లలతోనైన నాటకమాడించ వచ్చునే. వయసువచ్చిన పురుషులేల వేషము వేయవలెను. పురుషులు పురుషవేషముతోడనే స్త్రీపాత్రవలె ప్రవర్తింపవచ్చునే. చీరయేల కట్టుకోవలెను? కురూపులయినను వేషధారులుగా నుండవచ్చునే. అందమైనవారేల? పురుషుడు వేషము వేసినను చీరరవిక కట్టుకొనుటలో నాటక ప్రయోజనము కలదేని, స్త్రీలే స్త్రీవేషము వేయుటలో ఎక్కువ ప్రయోజనమేల లేకపోవును?”

### హిందూదేశమున స్త్రీయుద్యమము.—

జూలై మాసపు 'భారతధర్మ' పత్రికలో శ్రీమతి రామారావు సతి లండను నగరమున ఇచ్చిన 'హిందూదేశమున స్త్రీయుద్యమము' అను విషయికమగు ఉపన్యాస సారసంగ్రహమిట్లు పొందుపఱుపబడియున్నది.—

హిందూదేశమున స్త్రీల యుద్యమము త్రివిధములుగానున్నది; రాజకీయము, సాంఘికము; విద్యావిషయికము. రాజకీయగా పరికించితిమేని హిందూదేశమున స్త్రీలయుద్యమము హుటాహుటి నడలతో పోవుచున్నదనవచ్చును. విశేష పరిశ్రమ మక్కఱలేకయే వారికి ఓటింగు అధికారము వచ్చినది. కాని అదిసద్వినియోగము చేయుటకు వారిలో విశేషప్రచారము కావలసియున్నది. సాంఘిక విషయములలోకూడ హిందూదేశమున స్త్రీయుద్యమము ప్రోత్సాహకరముగనే యున్నది. శారదాగారి బాల్యవివాహముల బిల్లు స్త్రీజనామోదమును బడసినది. విద్యావిషయములలో మొన్న పాట్నానగరమున కూడిన స్త్రీవిద్యా మహాసభ ప్రశంసనీయమగు పనిచేసియున్నది. మేము అట్లు సర్వప్రయత్నము లొనర్చి అభివృద్ధికి వచ్చుచుండగా కండ్లుండియు చూడనొల్లని విజాతీయులు కొందఱు మాదేశమునుగూర్చి అబద్ధపు వ్రాతలు వ్రాయుచు అర్థములేని విమర్శనములు గావించుచుండుట మాకు మిక్కిలి సంతాపకరముగానున్నది.”




### కొబ్బరి మొక్కలో యేనుగుతల పుట్టుట.—

పుదుచ్చేరిలో రూఢియానను వెంకటాచలపిళ్లె వీధిలోనున్న మశీదుకు వెనుకనున్న కొబ్బరితోటలో 4—5 అంగుళములు యెత్తుగల కొబ్బరి మొక్క ప్రమానులోనుండి ఒక ఏనుగుతల పుట్టినది. తల యును మొండెమును గోధుమరంగు (బ్రౌను), కళ్లు ఆకుపచ్చరంగును కలిగియున్నవి. దానికి రెండుదంత ములు గూడ నున్నవి. అవి నిజమైన యేనుగకుండు దంతములవలెను చాల గట్టిగానేయున్నవి. నిజమైన యేనుగు తలకును కొబ్బరిమొక్కలోనుండి పుట్టిన యీ యేనుగు తలకును యెట్టి భేదమును లేదు. దానికి ప్రాణముమాత్రము లేదు. చాలమంది వచ్చి చూచిపోవుచున్నారు.

### బాలికమేనిపై పులిచారలు.—

తిరువళ్లదగ్గర వుండే కనియూరునుండి ఒక చిత్రమైన గాథ వినవచ్చుచున్నది. 12 సంవత్సరములక్రిస్తు బాలిక ఒడలిపై పులిచారలున్ను, వంటినిండా బొచ్చును పెరిగియున్నది. ఈ బాలికయొక్క చేష్టలు కూడ వ్యాఘ్రమునకువలె పెంపొందినవి. చుట్టుప్రక్కలనుండి ఈ విచిత్రబాలికను చూచుటకై ప్రజ లరు దెంచుచున్నారు.

### మణికాంతిగల జలచరము.—

సింధుదేశమందలి హైదరాబాదు సమీపమున సింధునదిలో కొన్నిదినములనుండియు రాత్రివేళ లందు లైట్ హావుసులలోని సెర్చిలైటువంటి కాంతియొకటి ప్రజల కన్నులను మిరుమిట్లు గొలుపుచున్నది. ఇందులకు హేతువేమని జాగ్రత్తగా పరిశీలింపగా నీటిపైన ఒకవిధమైన జలచరము తేలి కనబడుచున్నది. అది చూచుటకు చేపవంటి ఆకృతిగలదిగానున్నది. దానితలపైనుండి ఈకాంతి బయలుదేరుచున్నది. కొన్ని చేపలయందు భాస్వర ముండుననియు అందువలన ప్రకాశించుచున్నదని కొందరును ఇది చేపవలె నున్నదేకాని చేపకాదనియు ఒక మహాసర్పమనియు సర్పముల తలలో నుండునవి ప్రసిద్ధిగల మణికాంతియని కొందఱును తలంచుచున్నారు. ఈజలచరము ప్రశాంతసమయములందే కనబడును. జనకోలాహల మధికమైనప్పుడు నీటి లోనికి పోవుచున్నది.

### ఫోన్ ఫోటోయంత్రము—

నేటి నవనాగరిక కాలమునందు అనేకములైన ఊహాతీతవిచిత్రములు మనుష్యసౌకర్యార్థము కల్పింపబడుచున్నవి. వానిలో ఈఫోన్ ఫోటోయంత్ర మొకటి. దీనికికూడ ఒకస్థలమునుండి వేరొకస్థలమునకు టెలిగ్రాంతీగెలవలెనే ఏర్పాటు గల్గియుండును. దూరదేశమందున్న బంధుమిత్రాదులతో వెంటనే మాట్లాడుచు వారిని కన్నులతో సదాచూచుటకొరకై ఈయంత్రము తయారైనది. ఒక విశాలమైన గదిలో గదిఅంతయు ఆక్రమించు పెద్దగొట్టముండును. మనము ఆగొట్టములో నిలువబడినతోడనే మన కన్నుల కొక గొట్టమును మూతికొక గొట్టమును తగిలింతురు. మనము చూడదలచిన స్థలమునందని మనుష్యులు కండ్లకు కాన్పింతురు. వారి మాటలు చెవులకు వినబడును. మనము తిరిగి ప్రత్యుత్తరము చెప్పవచ్చును ప్రస్తుత మిదియింకను నూతనముగా నున్నను క్రమముగా ప్రపంచమంతటను వ్యాపింపగలదు.

### నక్షత్రలోకము.—

కాలిఫోర్నియాలోని విల్ నక్షత్రదర్శనశాలలోని నక్షత్రశాస్త్రజ్ఞులు, కొన్ని నూతన యంత్రోపకరణముల సహాయమున నీ విశ్వములో నక్షత్రలోకము లాక్రమించుకొని యున్న భాగముయొక్క వైశాల్యము 1920000 కోట్ల మైళ్ళున్నదని లెక్కవేసిరి. ఈ నక్షత్రలోకము లన్నియు పలుచని జేబుగడియారమువలె నున్నవి. ఇప్పుడు [మిల్కీవే] ఆకాశగంగ యనునది ఈ గడియారపు రూపమునకు చుట్టును నున్నది. సూర్యుడు, భూమి మున్నగు గ్రహములు డయల్ యొక్క మధ్యభాగముననున్నవి. దీనియొక్క (డయామీటరు) వ్యాసము 10 కోట్ల కోట్లు మైళ్ళున్నదనియు నాపైన శూన్యమనియు వీరు లెక్కవేసి చెప్పుచున్నారు.

### జపానీయులు పాములను తినుట.—

జపానులో కప్పలు, పాములు, తాబేళ్ళు అహారపదార్థములుగా నుపయోగపడుచున్నవి. వీనికోసము టోకియో నగరములో ప్రత్యేకముగ రెస్టారెంటులున్నవి. పాములను తినినచో నరములకు మంచి పటుత్వము గలుగునట. ఈ రెస్టారెంటులలో గాజుకేసులందు బ్రతికియున్న రకరకముల పాములను ప్రదర్శనార్థమై యుంచెదరు. పాముతోలుతో పులుసు కాచెదరు. పాములు మంచి బలకరమయిన ఆరోగ్యకరమగున అహారమని వారితలంపు. ఆదేశములో వందలకొలది జనులు పాములు పట్టుకొనుటయే పనిగా జీవించుచుందురు. టోకియోలోని గింజా రెస్టారెంటులో పాముఫలహార మొక్కంటికి 45 ఎన్నునాణెముల ఖరీదు గూడ గలదట.

### నాగరిక దేశములందు కూడమంత్రకత్తెలు.—

ఇంగ్లాండులోను, ఫ్రాన్సులోను గూడ నిప్పటికిని మంత్రకత్తె (విచస్) లున్నారట. వారికొక విధమైన గ్రంథజాల ముండును. మోటారుకార్లు పల్లెటూళ్లు ప్రవేశించినను వాటి నేమాత్రమును క్రొత్త త్రోవలో పెట్టలేక పోయెను. ఇంగ్లాండు ఫ్రాన్సులలోని కొన్ని రాష్ట్రములందు మంత్రకత్తెలున్నారని లండనులోని యూనివర్సిటీ కాలేజిలో ప్రొఫెసరుగానున్న యొక స్త్రీ తెల్పెను.




శీ ల వ తి:—

రాజమహేంద్రవరములో నొక చౌదరి 750 రూపాయల నోట్లున్న తనమనీపర్సును పారవేసికొనెను. అది నిఱుపేదరాలగు నొక నిమ్నజాతి కాంతకు దొరకెను. 'అర్థంబుఁబొడగన్న బ్రహ్మకైన పుట్టు రిమ్మతెగులు' అనువచనము చిరకాలమునుండి లేఖ్యారూఢమైయున్నదే. కాని ఈమాదిగ స్త్రీ శీలవల్లలన యగుటచే నట్లుపలబ్ధమైన అర్థమునకై లోభమూనలేదు. మనీపర్సు వెదకుకొనుచున్న చౌదరి చెంతకు గొనిపోయి ఆమె దానిని వాని చేతులలో పెట్టెను. చౌదరి ఆమెన్యాయశీలమునకు అప్రతిభుడై ఆమెకు కృతజ్ఞతాపూర్వకముగా కొంత బహుమాన మీయబోయెను. ఐక్కాఁడినఁగాని డొక్కాఁడని నిఱుపేదరాలయ్యు నామె విశేషబహుమానమును స్వీకరింపనొల్లక రోజుకూలి క్రింద రెండు మూడు అణాలను మాత్రము పుచ్చుకొనెను. 'ఆశాపాశము దాగడున్నిదుపై' మనుజులను వేధించు ఈ మాయకలికాలమున నిట్టి నిర్మమమురాలుగల్గుట నిజముగా ఆశ్చర్యకరమైన విషయము.

## పతివ్రతా మహాత్మ్యము.

కలకత్తాకు 203 మైళ్ల దూరమున ఆద్రా, గోమో లయినుమీద బెంగాలు నాగపూరు రయిలువేలో "తలగరియా" (Talgaria) అను క్రొత్తరైయిలు స్టేషనును కట్టుచుండగా ఆప్లాటుఫారముపైని యెల్లప్పుడు వెలితిగానుండు ఒక గోయి దృశ్యమైయుండును. ఈగోయి ఒకానొక హిందూపతివ్రతా రత్నముయొక్క చిహ్నముగా నిర్ధారణ చేయబడినది. చాలాకాలము క్రితము ఆయమ తన భర్త మరణాంతరము పూర్వాచారముల ననుసరించి సహగమనము గావించినస్థలము. ఇటీవల తలగరియా రయిలు స్టేషనును కట్టుచుండగా సహగమనము గావించిన స్థలములో ఏర్పడిన గోయి కూలివాండ్లచే పూడ్పింపవలసి వచ్చినది. ఆమరుచటిదినముదయమున చూడగా పూర్తిగా మట్టితో నింపబడిన గోయి యథాప్రకారముగా నుండెను. గోయిని కూలివాండ్రచే పూడ్పించిన కంట్రాక్టరు జ్వరపీడితుడవుటయేగాక గోయి పూడ్చిన కూలి

వాడు అకస్మాత్తుగా మరణించెను. మరియుమువ్వురు కూలివాండ్లీవింత నెరిగియు తమతోటి పనివాండ్ర మాటలను సరకుచేయక ఆస్థలావరణలో వంటచేసి పిమ్మట స్టేషను బిల్డింగు గోడలనెక్కి పనిచేయుచుండగా గోడల పైనుంచి క్రిందపడి బలమైనగాయముల పాలబడిరి. పిదప ఈవిపరీతమంతయు, కండ్లారజూచి మరియొక కంట్రాక్టరు తమ అసిస్టెంటు యింజనీయరుగారి అనుమతిని కొందరు మహమ్మదీయకూలీలను ఆగోయిని మట్టితో పూడ్చ ప్రేరేపణచేయ యాకంట్రాక్టరుగారి కన్ను గ్రుడ్డి అగుటయేగాక ఇంజనీయరుగారు ఓవరు సీయరుగారును ప్రమాదకరమైన జబ్బుచే పీడింపబడుచున్నారు. పాపము మరియొక పెద్ద ఆఫీసరుగారు ఆప్రాంతములో నిర్లక్ష్యభావములో నిలుచుండి పిదప తన మోటారు ట్రాలీ నెక్కి పోవుచుండ మోటారు ట్రాలీ బోల్తాకొట్టినట్లు తెలియవచ్చినది. ఈవింత అంతయు ఆపతివ్రతామతల్లియొక్క మహాత్మ్యమని రుజువు చేయబడి పిమ్మట అసహాగమనావరణస్థలమంతయు పూజార్హనీయస్థలముగా నెంచి గోయిని పూడ్చ మరల ప్రయత్నించక ఆసమీప గ్రామవాసులచే నొక పుణ్యస్థలముగా నెంచబడి పూజలు గావింపబడుచున్నవి.

## పూర్వజన్మస్మృతి.—

ఫరుకాబాదు జిల్లాలోని షాదినగరమున గంగవిష్ణు అను బ్రాహ్మణపండితుడు జీవించుచున్నాడు. అతనికి ఏడుసంవత్సరముల వయస్సుగల కూతురు ఉన్నది. ఆమె పేరు రాంకాళి. ఆమెకు పూర్వజన్మస్మృతి అగ్గలముగా గలదు. మూడేండ్ల ప్రాయమునుండియు ఆమె తన తండ్రియగు గంగవిష్ణువుతో అప్పుడప్పుడు ఇట్లు చెప్పుచుండెడిది. "నేను క్రిందటిజన్మమున మార్గబాగులో నివసించు చుంటిని. నాకు ముగ్గురుకొడుకులు గలరు. అందు మొదటివానిపేరు షియారాము, రెండవవానిపేరు రామస్వరూపు, మూడవపుత్రుడు పుట్టిన కొద్దిదినములకే నేను మరణించితిని. ఇప్పుడొకసారిపోయి వారినిచూచిరావలయునని నాకు నిండుకోరికగా ఉన్నది." ఈమాటలు గంగవిష్ణువునకు ఆశ్చర్యమును పుట్టించెను. మార్గబాగునకు పోవ తన కూతురు రాంకాళిచేయు ప్రయత్నములను అరికట్టుటకు పండితుడు పడరానిపాట్లు పడెను. కాని అవి అన్నియు చెవిటికి సెంకూదినట్లయ్యెను. మార్గబాగునకు పోవక మానననని రాంకాళి రాకాసిపట్టుపట్టెను. చేయునది లేకతండ్రి అప్పుడామెను బండియెక్కించిమార్గబాగునకు కొంపోయెను. గ్రామమున ప్రవేశించిన పిమ్మట రాంకాళి రెండుఇండ్లను తండ్రికి జూపి అవి తన పూర్వజన్మనివాసగృహములని వచించెను. అందులో నొక గృహమున ప్రవేశించి ఇద్దరు మనుష్యులనుచూచి వారు తన కుమారులని గుర్తుపట్టెను. ఆవింతచూచి ఆఊరిజనులచ్చట మూగి ఆ చిన్నదానిని కొన్ని ప్రశ్నములువైచిరి. వాని కన్నిటికి ఆ చిన్నది తృప్తికరములగు సమాధానము లిచ్చినది. ఆమెకు గలిగియున్న పూర్వజన్మస్మృతికి వారందరును ఆశ్చర్యచకితులయిపోయిరి. గంగవిష్ణువు కొంతసేపైన తరువాత రాంకాళిని తన ఊరగు షాదినగరమునకు ప్రయాణముచేసెను. తన్ను తన బిడ్డలనుండి విడదీసికొని పోవుచున్నందులకు కంటికి మంటికి ఏకధారగ ఏడువదొడగెను. ఎట్లో బలవంతముగ స్నానమట్లు రాంకాళిని గంగవిష్ణువు తన ఇంటికి చేర్చెను. ఇది పుక్కిటిపురాణమువలె నున్నది. కాని సత్యచరిత్రమని టైమ్సు ఆఫ్ ఇండియా పత్రికలో నొక విలేఖరి స్వయముగాచూచివచ్చి వ్రాసియున్నాడు.

# వనితాలోకము

వినోదినీ రామనుబాయి నీలకంఠ, బి. ఏ.

ఈమె గుజరాతీవిదుషీమణియగు విద్యారామబాయి నీలకంఠగారి పుత్రిక. మాతృభాషాసారస్వతములందు పాండిత్యము వడసి వినోదిని తల్లికితగిన కుమార్తె యనిపించుకొనుచున్నది. చిన్నికథల సంపుటమగు 'రసద్వార్' అనుగుజరాతీగ్రంథమును ఈమె రచియించినది. అమెరికా సంయుక్తరాష్ట్రములలోని మిచిగాను విశ్వవిద్యాలయమువారు ఇటీవల ఈమెకు సంఘతత్త్వవిద్య, సాధారణవిద్య గఱచుటకు ఉపకారవేతన మొసగినారు.

మిస్ మందాకినీ పండిత :—

ఈమె గుజరాతు కాలేజీలో ఉపాధ్యాయిని. ఎం.ఏ. క్లాసులో కృతార్థతనొందినది. గుజరాతీకాలేజీ ప్రిన్సిపాలు షింప్లేషిరాసుగారి యొక్క అహంకారమువలన ఎసరేగిన విద్యార్థుల సమ్మెకట్టులో నీమె పాల్గొని విద్యార్థులకే విజయమును తెచ్చినది. ఇది ఈమె ఉచితజ్ఞతకు నిదర్శనము. తన ఉద్యోగమునకు ఉద్వాసన చెప్పబడునను భయముకూడ నీమెను ఆప్రయత్నమునుండి తొలగింప లేకపోయెను. ఇది ఈమె ధైర్యగరిమకు తార్కాణము.

మిస్ యమునా దేశాయి :—

ఈమె యొకవైద్యురాలు. మీరటుకుట్రకేసులో నొకముద్దాయియును, 'స్పార్కు' పత్రిక సంపాదకుడును అయిన యం. జి. దేశాయిగారి భార్య. ఈమె బొంబాయి విశ్వవిద్యాలయములో ఎం. బి. బి. యస్. డిగ్రీని పొంది ప్రసవచికిత్సలో ఉన్నతజ్ఞానమును బడయుటకు ఇంగ్లండునకు పోయి అచ్చట ఎడింబరో విశ్వవిద్యాలయమునందు చదివి యల్. ఆర్. సి. పి. పరీక్ష నిచ్చినది. బొంబాయిలోని స్త్రీవైద్యురాండ్రలో నీమె సుప్రసిద్ధురాలు. తన భర్త మీరటుకుట్రకేసులో పట్టుకొనబడిన పిదప ఆయన ప్రారంభించిన యుద్యమము యొక్క కార్యభారము నీమె వహించినది.

శ్రీమతి తుంపూడి ఇందిరాభగవతి :—

వైశ్యబాలిక. ఈసంవత్సరము జరిగిన స్కూలుఫైనలు పరీక్షయందు ఉత్తీర్ణురాలైనది. హైకోర్టు అడ్వకేటగు వి. చలమయ్య శ్రేష్ఠిగారు బి. యె., బి. యల్ ఈమెజనకులు. పెద్దాపురము డిప్యూటీ కలెక్టరుగానున్న శ్రీయుత తుంపూడి భగవంతంగుప్తగారి తృతీయపుత్రులగు రంగనాథభగవతుగారు ఈమెపతి.

శాంతానాసిఖారు, బి. యె.—

బొంబాయి విశ్వవిద్యాలయపు పట్టభద్రురాలు. కన్యావితంతువగు నీమె నిరుడు తిరిగి వివాహము చేసికొన్నది. ఈమె చక్కని కథారచయిత్రి. మహారాష్ట్రభాషలో గ్రంథములు వెలువరించు మహిళావిజయ గ్రంథమాలలో నీమె 'లగ్నాచాబజారు' అనునవల ప్రచురించియున్నది. వసంతమహారథి అనువారిచే సంపాదితమగు 'గృహలక్ష్మి'యను మహారాష్ట్రమహిళావిషయకమగు మాసపత్రికకు ఈమె తఱుచు వ్యాసములు వ్రాయుచుండును.



శ్రీమతి తుంపూడి ఇందిరాభగవతిగారు.

డాక్టరు ఇం.సుమతి సేనుజితు.—

ఈమె ఈ సంవత్సరము బొంబాయిలోని గ్రాంటు వైద్యకళాశాలలో ఎం. బి. బి. యస్. పరీక్షలో నెగ్గినది. లాహోరునగరమందలి సివిలు ఆసుపత్రిలో నీమె ప్రస్తుతము ఉద్యోగమున కుదిరినది.

శ్యామకుమారి నెహ్రూకన్య.—

సర్ తేజ్ బహద్దరు సప్రూవారివద్ద తరిబీతు పూర్తిచేసిన శ్యామకుమారి నెహ్రూకన్య అలహాబాదు హైకోర్టులో న్యాయవాదవృత్తి నవలంబించి, ప్రథమమున నొక హత్యానేరమునందు ముద్దాయిపక్షమువహించి హైకోర్టులో వాదించెను. ప్రధానన్యాయమూర్తి, న్యాయమూర్తి సేనుగార్లు శ్యామకుమారి నెహ్రూవాదనను ప్రశంసించి, ముద్దాయిని విడుదలజేసిరి.

శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు.—



శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు.

రాజమహేంద్రవర వైశ్యసేవాసదనమునకు నియంత్రి. తత్పురమున వెలసినగౌతమీ గ్రంథాలయ కార్య నిర్వాహక వర్గమున నొక సభ్యురాలు. ఈసంవత్సర మీమె ఆంధ్రవిశ్వవిద్యాలయము వారి యాజమాన్య మున నిర్వహింపబడుచున్న ఉభయభాషా ప్రవీణ పరీక్షలో విజయముగాంచినది.

పద్మాబాయి సంజీవరావు జెనిగాల్, బి. యె.—

మద్రాసు రాజధానిలోని మంగళూరు ఈ విద్యావతి జన్మస్థానము. ఈమె వారణాసి యందలి మహిళా కళాశాలలో ప్రధానాధ్యాపకురాలు. జార్జిసార్వభౌముని జన్మదినోత్సవబిరుదములలో ఈమెకు ఈ సంవత్సరము కెయిజరు-ఇ-హిందు బంగారు పతకము ఒసంగబడెను.

శకుంతల పరంజిపికన్య.—

ఈమె డాక్టరు ఆర్. పి. పరంజిపిగారి కుమార్తె. గణితశాస్త్రసంబంధమైన కేంబ్రిడ్జి మ్యాథమ్యాటికలు ట్రిపాసు అనెడుపట్టమును బడిసిన విదుషీరత్నము. తండ్రి కూడ నీపట్టమును బడసియుండెను. ఈమె తండ్రికి తగినబిడ్డగదా!

స్నేహలతాపాగరు.—

కొలంబియా విశ్వవిద్యాలయమున విద్యబడసినది. బరోడాయందలి స్త్రీబోధనాభ్యసన పాఠశాలకు అధికారిణి. బరోడాపురపాలక సంఘసభ్యురాలుగా నియమింపబడినది.

కె. డి. రుక్మిణమ్మ, బి. యె.—

మైసూరు మహారాజ్ఞీ కళాశాల అధికారిణి. ప్రస్తుతమీమె మైసూరు ప్రభుత్వము వారిచే హిందువుల వారసత్వమును గూర్చి విచారణ సల్పుచున్న సంఘములో సభ్యురాలుగ నియమింపబడినది.

సుషమాదేవి:---

కవిసార్వభౌముడగు రవీంద్రనాథటాగూరువారి మేనకోడలు. రవీంద్రనాథ టాగూరు గారితోబోయి ప్రపంచయాత్ర ముగించుకొని వచ్చినది. పోయిన తావులనెల్ల నీమె హిందూదేశ సమస్యలనుగూర్చి ఉపన్యాసము లిచ్చి యున్నది. 1927—వ సంవత్సర మున కెనడాలోని టోరెంటో నగరమున జరిగిన అంతర్జాతీయవిద్యాసంస్థల విశ్వ సభలో భారతదేశమునకు ప్రతినిధిరాలుగా పోయియున్నది.

పి. కె. మాధవి అమ్మ:---

కొట్టాయమునందు ఇంతకుమున్ను జరిగియున్న శ్రీసమాజతియ్యాస్త్రీల సభా ముఖమున నీమె తన అసమానగానవైదుష్యమునకు బంగారుపతకము నొందియున్నది.

మిస్. ఎడిత్ విన్‌ఫ్రెడ్ గ్రే:---

లండను నగరమునకు పోయియుండి నూతనముగ తిరిగివచ్చినది. విశాఖపట్టణము నందలి క్వీనుమేరీసెకెండరీ బాలికాబోధనాభ్యసన పాఠశాలకు ప్రధానోపాధ్యాయినిగా నియమింపబడినది.

జె. ఎ. మాన్యాలు కన్య---

మద్రాసు విశ్వవిద్యాలయమువారి ఈసంవత్సరపు బియ్యేపరీక్షలో మొదటి తరగతియందు పదిహేనవరాంకున గెలిచిన విద్యావతి.

యస్. ముగసేత్ కన్య.---

మంగళూరు నివాసిని. మద్రాసు విశ్వవిద్యాలయమువారి ఈసంవత్సరపు ఇంటరు పరీక్షలో పందొమ్మిదవ యామెగా జయముగొనిన బుద్ధిశాలిని.

శ్రీమతి అప్పయ్యసతి:---

పల్లతూరు నందలి మురుగప్పచెట్టియారు ఆసుపత్రిలో డాక్టరుగా పనిచేయుచున్న అప్పయ్యగారి భార్య. రాజధానీ గౌరవన్యాయాధికారిణిగా నియమింపబడినది.

డాక్టరు యన్. కె. నారాయణిఅమ్మ:---

రంగూను కార్పొరేషనువారు క్రొత్తగా ఏర్పఱచిన స్త్రీవైద్యోద్యోగినులలో నొకతె. తెల్లిచేరియందలి యొక ఉన్నతకుటుంబమునకు చెందిన నాటియాల రామనుగారి కుమార్తె.




వివాహము—విద్య.——

'వివాహో౽విద్యనాశాయ' అను ఆర్యోక్తి అడుగున పడిపోయినది. దాని నిప్పుడు గమనించు వారేలేరు. బ్రహ్మచర్యాశ్రమ మవలంబించి గురుకులమున విద్యాసము పార్జనము సమాప్తినొందించుకొని సమావర్తన మొనర్చుకొని అనంతరము వివాహము చేసికొను విద్యార్థులు ఇప్పుడు భారతదేశమున స్వప్నవీథియందైనను గానరాకున్నారు. ప్రస్తుతకాలమున ఎ. బి. సి. డీల ప్రారంభము శుల్కప్రధానమగు వివాహముకొఱకే అయి ఉన్నది. అప్పుడప్పుడు సంప్రాప్తమగు దండయాత్రల సరకుగొనక అబ్బాయి స్కూలు ఫైనలు క్లాసులోనికి వచ్చుసరికి పాతపలక, బలపములను పగులగొట్టుకొని క్రొత్తవాని కై త్రొండలు విడిపించు ఎడపిల్లవాడు, కరకరమను ఆకలికిఁదాళఁజాలక గ్లాక్సోడబ్బాలకై రోదనవ్రత మవలంబించు చిన్నపిల్లవాడు, చిన్నతనముననే కలిగిన కాన్పులకు జవసత్వము లుడివోవ మోయుచున్న మూడవగర్భభారమునకు క్రుంగిపోవుచు నిరుత్సాహనిస్పృహ ములగు నేత్రములతో తన్ను తిలకించు భార్య దాపురించియుండ ఆవిద్యార్థిస్కూలుఫైనలు పరీక్షలో జయముగాంచుట యెట్లు? ఆతని కోర్కెతీగెకు పువ్వు పుట్టుట యెప్పుడు? ఎట్లునులేదు, ఎప్పుడునులేదు. అంతతో ఆతని చదువుకు స్వస్తి. ఆతని కోర్కెతీగెకు వాడు పాటు. మునిసిపలు ఆఫీసులో బిల్లుకలెక్టరుగనో, కలక్టరుకచేరిలో బిళ్లబంట్రోతుగనో మఱునాడు అబ్బాయికి కుదురుపాటు. ఇదియెంత దుర్భరమగు స్థితి? దీనిని తొలగించుటకు మార్గమేమి? బాల్యవివాహనిషేధమే. ముమ్మాటికి బాల్యవివాహనిషేధమే. ఇది ఫలోదయాంతమగుటకు విద్యార్థులను లోగొను విశ్వవిద్యాలయములు పూనవలసియున్నది. మహనీయుడు మదనమోహనమాలవ్యాగారి యాజమాన్యమున పుణ్యభూమియగు కాశీపట్టణమునందు నిర్వహింపబడుచున్న హిందూ విశ్వవిద్యాలయమున వివాహితులగు

విద్యార్థులకు ప్రవేశమే లేదు. పదునెనిమిదివర్షములైనను నిండక ముందే పరిణయమాడు బాలురను పాఠశాలలయందు చేర్చుకొనకూడదనియు మెట్రిక్యులేషను పరీక్షకు హాజరు కానీయకూడదనియు పంజాబురాష్ట్రమున విద్యావంతులగు సంస్కారులు కొందఱు విపుల ప్రయత్నము లొనర్చుచున్నారు. ఈ ప్రయత్నమునకు పాఠశాలాధికారులును, కళాశాలాధిపతులును యుక్తమగు ఉదారబుద్ధితో చేదోడువాదోడగుచున్నారు. లాహోరునందలి ఫోర్మెను క్రైస్తవకళాశాలాధ్యక్షులు ఇంటరుమీడియేటు తరగతులలో వివాహితులను చేర్చుకొనకుండుటకై నిశ్చలారంభులై యున్నారు. పదునెనిమిది సంవత్సరములకు లోపున వివాహము చేసికొనువారు 1931-వ సంవత్సరమునుండియు స్కూలుఫైనలు, మెట్రిక్యులేషను పరీక్షలకు రాకూడదని పాంచాలవిశ్వవిద్యాలయ విచారణోపసంఘమువారు తీర్మానించి యున్నారు. ఇది మిక్కిలి ప్రశంసనీయమగు తీర్మానము. పంజాబువిశ్వవిద్యాలయము వారివలెనే భారతదేశమందలి ఇతర విశ్వవిద్యాలయములవారుకూడ నీసంస్కరణము నవలంబించి దేశపురోభివృద్ధికి ప్రాసాదులు వేయుదురుగాక !

**అన్నపూర్ణాదేవి జాతీయ బాలికా పాఠశాల.—**

ఆధునికాంధ్ర రమణీలోకమున అపూర్వప్రతిష్ఠ గడించి కీర్తిశేషురాలైన మాగంటి అన్నపూర్ణాదేవిగారి పేరను ఏలూరుపురమున స్థాపితమైన జాతీయబాలికా పాఠశాల రెండు సంవత్సరములు నిర్విఘ్నముగ కొనసాగి మూడవసంవత్సరమున ప్రవేశించినదని తెలుపుటకు ఎంతయు ఆనందించుచున్నాము. 25-6-29 తేదీని ఆపాఠశాలద్వితీయ వార్షికోత్సవము అంగలూరు నివాసిని విద్వాన్ శ్రీమతి అట్లూరి వేంకటసీతమ్మగారి అధ్యక్షతను జయప్రదముగ నిర్వర్తింపబడినది. పాఠశాల ప్రస్తుతము 10,15 వేల రూపాయిల చందాలును 10,15 వందల రూపాయిల వసూళ్లను గలిగి సుమారేబదిమంది బాలికలతో ఉచితవిధమున నభివృద్ధి నందుచున్నదనియు, తెలుగు హిందీ ఇంగ్లీషు మొదలగు భాషావిద్యలును; కుట్టుపని, ఊలుకుట్టు మొదలగు చేతిపనులును బోధింపబడుచున్నవనియు నివేదిక వివరించుచున్నది. స్వల్పకాలముననే పాఠశాలను శ్లాఘనీయమైన నింత అభివృద్ధికి తెచ్చిన సంస్థాపకులను, నిర్వాహకులను, గృహలక్ష్మి పత్రికామతల్లి పక్షమున కొనియాడుచు పాఠశాల చిరస్థాయిగా వెలయుగాకయని మనఃపూర్వకముగ వాంఛించుచున్నాము.

కస్తూరిదేవి బాలికాపాఠశాల:—

అసహాయోద్యమము దేశమునకు చేసిన చెఱుపులకు లెక్కలేదని కొందఱు చెవి నిల్లు గట్టుకొని పోరుచున్నను సీతానగరమందలి గౌతమీసత్యాగ్రహాశ్రమమును తిల



కస్తూరిదేవి బాలికాపాఠశాల భవననిర్మాణ శంఖుస్థాపనము.

కించియు విక్రమసింహాపురమునందలి కస్తూరిదేవి బాలికాపాఠశాలనుగూర్చి వినియు వారిమాటలు కేవలము కువాదములని నిర్ణయించకుండ నుండలేక పోవుచున్నాము. కస్తూరిదేవి విద్యాలయమునుగూర్చి విన్నవారెల్లరును ఏతద్విద్యాలయ నిర్వాహకురాలగు శ్రీమతి పొణకా కనకమ్మగారి కార్యశ్రద్ధకు, దీక్షాబుద్ధికి ఆహాపొంది తీరెదరు. జాతీయ పద్ధతులపై గఱుపబడు నచ్చటి విద్యావిధానము; కుట్టుపని, అల్లికపని, ఇత్యాది చేతిపనుల నేర్పించు నచ్చటి సాంకేతికవిద్యాపద్ధతి ఆ విద్యాలయమునకు ఆంధ్రదేశమున మంచి పలుకుబడి మహనీయమైన ప్రతిష్ఠ గొని తెచ్చినవి. ఏతద్విద్యాలయ సంబధకములగు నీ

చిత్రములు స్త్రీవిద్యాప్రియులగు ఆంధ్రులను అతిగా ఆకర్షింపగలవు. విద్యాలయము ఇంకను సమగ్రాభివృద్ధి నందుటకు జాతీయవిద్యాభిమానులగు ఆంధ్రమహాపురుషులు



కస్తూరిదేవి బాలికాపాఠశాలా విద్యార్థినులు సూర్యనమస్కారములు గావించుచుండుట.

కృషిసల్పుదురు గాక యని కోరెదము.

స్త్రీల విశ్వసభలో భారతజాతీయపతాకము.—

జర్మనీదేశపు నగరరాజమగు బెర్లినునందు ప్రపంచమహిళాసభ జయప్రదముగ జరిగినది. రామారావుసతి, జినరాజదాససతి, మత్తాయిసతి, ఛట్టోపాధ్యాయసతి, కృష్ణసతి అను భారతరమణీజనచూడామణులు ఆ అంతర్జాతీయస్త్రీ మహాసమ్మేళనమునకు ప్రతినిధులుగా పోయియున్నారు. అయితే వారు దేశమునకు చేసిన మేలేమి? ఏటేట గవర్నమెంటువారి ఖజానాలోనుంచి చేరలకొలది ధనమును తీసికొనుచు కేవిదలిర్ప జాతిసమితికి ప్రతినిధులుగా బోయి వచ్చుచున్న పురుషులవలె వీరుకూడ చూపులగుఱ్ఱములై తిరిగి వచ్చుచుండిరా? లేదు. దేవీస్వరూపిణులగు స్త్రీలు అట్లేల చేయుదురు? వాగ్మినులగు ఆభారతరమణులు ఉపన్యాసము లిచ్చిరి; ప్రజ్ఞావతులగు ఆ హైందవనారీమణులు తీర్మానములు ప్రతిపాదించిరి. ఈకార్యములన్నిటికి శిఖరప్రతిష్ఠయగునట్లు అచ్చటి వివిధ దేశీయపతాక ప్రదర్శనములో భారత దేశపతాకమునుగూడ ప్రదర్శించిరి. అంతర్జాతీయసమావేశములలో భారతజాతీయపతాకము ప్రదర్శితమైనది. ఏటేట అంతర్జాతీయసమావేశములు అనేకములు జరుగుచున్నవి. వానికి ప్రతినిధులుగా భారతీయులు అనేకులుపోవుచునున్నారు. ఇంతవఱకు ఆ అంతర్జాతీయసమావేశములలో ఒక్కదానియందైనను భారతజాతీయ పతాకము ఎగురలేదు. ఇంతవఱకు ప్రతినిధులుగా పోయిన భారతీయులలో నొక్కరికి గాని స్వజాతీయపతాకము ఎత్తు తలంపు పుట్టలేదు. స్త్రీలు ప్రతినిధులుగాపోయియున్న

ఈసమావేశమున ఈ శుభారంభము జరుగుట నిజముగా మెచ్చదగినది. దేశమునకు గౌరవప్రతిష్ఠలు సంపాదించు మహత్కార్యములు శక్తిస్వరూపిణులగు స్త్రీలే చేయవలెను గాని ధనము సంపాదించు యంత్రములు మాత్రమేయగు పురుషులు చేయగలరా?

మోక్షాదేవి నిర్యాణము:—

కలకత్తానగరమున బౌబజారునందలి శ్రీనాథదాసు వీధిలో నెం 2 వ గృహమున జూను 24 వ తేదీని సోమవారము అపరాహ్ణమున మోక్షాదేవి పరమపదించినది. అగుటకు ఆమె 81 సంవత్సరములు నిండినవృద్ధురాలే. కాని ఆమె మరణమునకు సారస్వత ప్రియులగు వంగదేశీయులు దరిలేని శోకసాగరమున మునిగినారు. మోక్షాదేవి మాతృభాషయందు అంచిత పాండిత్యముగల విదుషి. చనిపోవువఱకుగూడ ఆమె కవితా వ్యాసంగమును మానలేదు. ఆమె తాను రచించిన గీతమాలికల నన్నిటిని కూర్చి 'వన ప్రసూనములు' అను నామముతో గ్రంథరూపమున వెలయించినది. సుప్రసిద్ధ వంగ నవలాకారుడగు బంకించంద్రుడు 'వంగదర్శనము' అను తన గ్రంథములో దానిని గొప్పగా పొగడియున్నాడు. 'సఫలస్వప్నము' అని మోక్షాదేవి రెండవగ్రంథము. ఇదియొక చరిత్రాత్మకనవల. వంగదేశమున బహుళప్రచారముగల నవలలో నిదియొకటి యనుట నిస్సందేహము. 'కల్యాణప్రదీపము' ఆమె మూడవగ్రంథము. ఇది ఆమె తన 80—వ యేట రచియించినది. జరాభారము ఆమె బుద్ధిబలమును ఆవగింజంతైన తగ్గింపలేదు. అగుటనే ఆమె మరణమునకు వంగసారస్వతప్రియు లందఱు వాపోవుచున్నారనుట. మృత్యుదేవత ఆమె భౌతికశరీరమును మంటిపాలు గావించినను లేఖ్యరూఢమైన ఆమె కీర్తిమూర్తి వంగసారస్వతరంగమున అనశ్వరమై వెలయ గలదు.

సిడ్నీ వెబ్బుసతి నిర్లిప్తత:—

కీర్తివాంఛ లేకపోవచ్చును. ధనాశ ఎఱుగకపోవచ్చును. బిరుదుశోకలపై వ్యామోహముమాత్రము పోగొట్టుకొనుట నాగరికవాతావరణములో పెరుగుచున్న జీవికి దుర్ఘటమగుచున్నది. అట్టిస్థితిలో బిరుదులపైకి మనసుపోనీయకుండు మానిసులు గలిగి రేని వారు నిజముగా వందనీయులే. కార్మికనాయకులలో నొక్కడగు సిడ్నీవెబ్బు కారణాంతరములచే ప్రభుపుష్టమునొంది లేబరుమంత్రాంగమున చొచ్చినాడు. ప్రభువుగారి భార్య ప్రభ్వీ యనిపించుకొనవలయునుగదా! అయితే అందుకు సిడ్నీవెబ్బుసతి స్నిగ్ధహృదయము ఒప్పుకోలేదు లేదు. "ప్రజాహృదయమున మాప్రతిష్ఠ సిడ్నీవెబ్బు అను నామము

చేతనే ఆదూఢమై నెలకొన్నది. కావున కడకాలమువఱకు నేను ఆనామముచేతనే వ్యవహరింపబడుటకు ప్రియముపడుదును." అని ఆమె చెప్పిన వాక్యములు ఆమెనిర్లిప్తతకు ప్రబల నిదర్శనములై యున్నవి.

సరోజినీ దేవి అమెరికాసంచారము.----

భారతభూమిని నిరసించుటలో కంకణముకట్టియున్న మేయోకన్య పుట్టి పెరిగిన అమెరికాఖండమున సరోజినీదేవి సంచారముచేసి వచ్చినది. పెద్దపట్టణములన్నిటికి నామె పోయినది; పోయినచోట్లనెల్ల నామె ఉపన్యాసములిచ్చినది. ఈసంచారమున ఆమె మొత్తము 200 ఉపన్యాసము లిచ్చియున్నది. మేయోకన్యవ్రాతలవలన మాసిపోయిన భారతదేశీయయశోకాంతి పునఃప్రతిష్ఠితమగుటకు ఆమె ఉపన్యాసములు చింతామణులైనవి. ఆమె కలపుంస్కోకిలకంఠధ్వని, అపూర్వవిషయనివేదనము అమెరికాప్రజలను మోహితులను చేసినవి. ఆమె తన ఉపన్యాసములలో నొక్కసారియైన మేయోకన్య పేరెత్తలేదు. కాని ఆమె వ్రాసిన వ్రాతలన్నియు తునాతునుకలుగచేసి విమర్శించి అవి సత్యదూరములుకావని చాటిచెప్పినది. మనదేశముయొక్క తూర్పుపడమరలు పూర్తిగ నెఱుగని విజాతీయురాలగు నొకస్త్రీ వ్రాసిన గ్రంథముల మూలమున మనదేశమునకు ఒనగూడిన అపదూఱు అనుధూళి జాతీయతలో మునిగితేలుచున్న భారతరమణీమణి సరోజినీదేవి ఉపన్యాసములు అనుప్రభంజనముచేత నామరూపములు లేక తుడుచుకొని పోవుటలో నాశ్చర్యమేమియు లేదు. సరోజినీదేవి దేశమునకొనర్చిన ఈమేలు చిరస్మరణీయమైనది.

రుక్మిణీదేవి అధ్యక్షుకోపన్యాసము :—

అది పౌరజీవనమునందు ప్రవేశింపఁబోవు యువకులసభ. కూడినది సింహళద్వీపమునందలి కాండినగరమున. అధ్యక్షత వహించినది భారతప్రతినిధురాలుగా కొలదికాలము క్రితము ప్యారిసునగరమునకు పోయివచ్చిన ప్రజ్ఞావతి శ్రీమతి ఆచంట రుక్మిణీదేవి. ఇక నాసభ జయప్రదముగ సమాప్తి నొందుటలో సందేహ మావంతయైన నుండరాదు. రుక్మిణీదేవి ఇచ్చిన ఉపన్యాసము ఉదారభావసమన్వితమై ఉద్దీపనకారియై ఉచితరీతి నొప్పుచున్నది. భారతజాతీయసర్వతోముఖాభివృద్ధికి దోహదక్రియ లన దగిన సంస్కారముల నెన్నిటినో ఆమె తన అధ్యక్షుకోపన్యాసమున సూచించినది. అతిబాల్యవివాహముల వలన కలుగు చెడుగుల విశదీకరించినది; నిర్బంధవైధవ్యమువలన కలుగు కష్ట

ముల వెల్లడిపఱచినది; త్రాగుబోతుతనము మూలమున దాపురించు ఇక్కట్లు లెక్కించి చెప్పినది; అస్పృశ్యత వలన సంభవించు అరిష్టముల ఉగ్గడించినది; కులమతాది భేదముల వలన ఒనగూడు హానుల వివరించినది; ఈదోషముల అన్నిటి కూడికయు హిందూదేశమను వృక్షమునకు ఎట్లు వేరుపురుగై యున్నదో రుక్మిణీదేవి యువకుల మనములందు నూరిపోసినది. ఈ వేరుపురుగును మొదలంట నిర్మూలనము చేయుట యువకుల విధ్యుక్త ధర్మమై యున్నదని హెచ్చరించినది. ఆమె హెచ్చరిక నందుకొని యువకులు తమ జీవిత రథములను ఉత్తమపథములు పట్టించి దేశకల్యాణమునకు వలయు ఉత్సవము లొనరింతురుగాక! విద్యావతియగు రుక్మిణీదేవి ఉపదేశికురాలై విత్తిన జ్ఞానబీజములకు యువకుల హృదయములు 'కాశ్మీరఖండంపుఁగేదారములై' వెలసి మంచిఫలము నొసంగుగాక!

# పత్రికాపరిచయము.

## రైతుపత్రిక:—

రాజమహేంద్రవరమునుండి నూతనముగా వెలువడుచున్న రైతుపత్రిక 2, 3 సంచికలు సంతోష పూర్వకముగ నందుకొంటిమి. వ్యవసాయమే ముఖ్యపరిశ్రమగాఁగల ఆంధ్రదేశమున జనసామాన్యమునకు వ్యవసాయ, ఆర్థిక పరిస్థితులను ప్రత్యేకించి బోధించు నిట్టి పత్రికల అవసరమెంతేనిగలదు. ప్రస్తుతము మన కర్షకు లవలంబించు వ్యవసాయపద్ధతులపై ప్రాచీనముద్ర పడియున్నది. కాలముతోపాటు మన వ్యవసాయ పద్ధతులుకూడ నవీనమార్గములం ద్రొక్కవలసియున్నది. అట్టిమార్గములను జనులకు బోధించుటకై ఈరైతు పత్రిక వశ్యవాక్కులగు బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి ఆశీర్వచనములతో తలసూపినది. మా పత్రికాపీఠ మలంకరించు చున్న రైతుపత్రిక రెండవసంచికలో 'రైతుల ఆరోగ్యము' అను అమూల్యవ్యాసమున శ్రీయుత బొల్లాప్రగడ సుందరగోపాలము గారు రైతుపత్రికయొక్క యుద్దేశ్యములను బాగుగా నిరూపించినారు. శ్రీయుత దుప్పూరి బాలకృష్ణమూర్తిగారి 'భారతవ్యవసాయము' అను వ్యాసము చక్కగనున్నది. 'చెఱకుతోటలు, అమృతమహాలు పశువులు' అను రెండు వ్యాసములను వ్యవసాయదారులు తప్పక చదువదగి యున్నవి. 'రెండవపంట' అను వ్యాసమును, శ్రీయుత కిళా వెంకటరావుగారి 'దివాలాభాగతము' అను వ్యాసమును శ్రమచేసి వ్రాసినవియైయున్నవి. మూడవసంచికకూడ ఉచితరీతిని నొప్పుచున్నది. పదహారు అణాల రైతుబిడ్డ అనదగిన శ్రీయుత మార్ని నరసన్నగారి సంపాదకత్వముక్రింద నిర్వహింపబడు ఈపత్రిక వ్యవసాయ దారులకు మిక్కిలి ఉపయోగకారిగా నుండగలదు. ప్రతిరైతును ఈపత్రికను తెప్పించుకొని చదువుకొనియో చదివించుకొనియో తగినలాభమును పొందుదురు గాక యని కోరెదము. దీనికి సాలు చందా నాలుగు రూపాయిలు మాత్రమే. విడిపత్రిక 0–1–6. ప్రతిశుక్రవారము వెలువడును. వలయునారు రైతుపత్రికాకార్యాలయము, పైగాముదిరోడ్డు, రాజమహేంద్రవరము, అని వ్రాయునది.

ఆంధ్రమాత.—

ఇదియొక నూతనాంధ్రపత్రిక. సంపాదకుఁడు తంగిరాల రామనాథశర్మ. ప్రతిబుధవారమునాడును వెలువడును. మొదటిసంచిక 12-6-29 నాడు వెలువడినది. ప్రజోపయోగకరములగు పెక్కువిషయము లిందు ప్రచురింపబడుచున్నవి. ఆదరింపదగినది. సంవత్సరపు చందా 3 రూపాయిలు; మాసము చందా 0-4-0. వలయువారు మేనేజరు 'ఆంధ్రమాత, నెల్లూరు' అని వ్రాయవలెను.

కళింగ.—

ప్రతి ఆదివారము గంజాంజిల్లా బరంపురమునుండి మూడు సంవత్సరములుగా ప్రకటింపబడుచున్న స్వతంత్ర వార్తాపత్రిక. ఉచితరీతిని ఆంధ్రదేశ సేవచేయుచు 'కళింగ'ను వారపత్రికలలో గౌరవస్థానమునకు కొని వచ్చుచున్న న్యాపతి నారాయణమూర్తిగారు వందనీయులు. సంవత్సరపు చందా 4 రూపాయిలు. అర్థసంవత్సరపు చందా రు 2-4-0. వలయువారు మేనేజరు, 'కళింగ', బరంపురము, గంజాంజిల్లా, అను చిరునామాకు వ్రాసిన బడయగలరు.

# గ్రంథస్వీకారము.

1—విజయ భాస్కర విజయము (పులవర్తి. కమలావతీదేవి) 2—పువ్వులతోట (సన్నిధానము. సూర్యనారాయణశాస్త్రి) 3—చాకిరేవు (కొల్లూరు ధర్మరాయకవి. బి. ఏ) 4—శారద (సాహిత్యసరస్వతి సీరిపి. ఆంజనేయులు) 5—జన్మనిరోధము (జరుగుమిల్లి. సాంబశివరావు బి. యె.) 6—విద్యానగరచరిత్ర (సాహిత్యసరస్వతి సీరిపి. ఆంజనేయులు) 7—విషాద విజయసేన (వీరుభొట్ల సదాశివరావు) 8—మీరాన్ జుంలా (పులవర్తి. కమలావతీదేవి) అను గ్రంథములను వందనములతో నందుకొంటిమి. వానిని పైమాసమున విమర్శింపగలమని మనవి.

# చందాదారులకు మనవి

చందాదారులు మాకార్యాలయమునకు ఉత్తరములు వ్రాయునపుడు తమ చందా నెంబరు దెలుపగోరెదము. సంచికలు సకాలమునకు చేరనిచో తమ తమ యూరి పోస్టాఫీసులకు తెలియబఱుపవలెను.

సంపాదకుఁడు.

గృహలక్ష్మి కార్యాలయము.

తపాలపెట్టె. 752,

ఎగ్మూరు, మదరాసు.



# సచిత్ర మాసపత్రిక


సంపాదకుఁడు

డాక్టర్. కే. ఎన్. కేసరి



సంపుటము 2.] [సంఖ్య. 7

లోధ్ర ముద్రాలయము, మద్రాసు

1929

THE following Municipalities and Taluk Boards have sanctioned subscription for GRIHALAKSHMI and have introduced the Journal into the Girls' schools within their provinces. As the Journal is mainly intended for the uplift of women, and is instructive and useful for girls, we invite the other Taluq Board Presidents and Chairmen of Municipalities to extend their patronage by placing this matter before their Councils and introduce the Journal into their Girls' Schools :

## MUNICIPAL COUNCILS.

**1 Ongole** **2 Cuddapah.**
**3 Tadpatri.** **4 Guntnr.**
**5 Adoni.** **6 Hindupur.**
**6 Tirupati.** **7 Nellore.**

## TALUK BOARDS.

**1 Penukonda.** **2 Ramachandrapuram.**
**3 Vellore.** **4 Gooty.**
**5 Narasarowpet.** **6 Berhampore.**
**7 Madanapalle.** **8 Dhone.**
**9 Koilkuntla.** **10 Karvetinagar.**
**11 Chendragiri.** **12 Peddapur.**

*Editor,*

# GRIHALAKSHMI.

**Post Box. 752.**

EGMORE, MADRAS.

సం॥ చందా రు 4. విడిసంచిక అ. 6.

# గృహలక్ష్మి

"యత్రనార్యస్తు పూజ్యంతే నందంతే తత్రదేవతాః।
..యత్రైతాస్తు నపూజ్యంతే సర్వాస్తత్రాఫలాఃక్రియాః॥

సంపుటము 2. సెప్టెంబరునెల 1929. సంచిక 7.

## విషయసూచిక.

త్రివర్ణచిత్రము.—

సీత అగ్నిప్రవేశము.

ఛాయాచిత్రములు

1. "మరలగ బోదురిండ్లకును మాపవునంతకుచేలలోపలందిరిగి"
2. లిథూనియా కర్షకుని గృహాంతర్భాగము.
3. గణపతి ('భారతధర్మ'పత్రికాధిపతి అనుగ్రహమున)
4. శ్రీమతి సుశీలపరంజిపికన్య.
5. శ్రీమతి యస్. లక్ష్మమ్మగారు.
6. శ్రీమతి సింథియా స్లెడనుకన్య.

# గృహలక్ష్మి.

## సీత అగ్నిప్రవేశము

రావణసంహారము గావించి విజయోల్లాసియై శ్రీరామభూపాలుఁడు లంకాద్వీపమున రాజమందిరమునందు ముత్యాలగద్దెపై పెద్దకొలువుండెను. మారుతి చేరి పాదము లొత్తుచుండెను. సుగ్రీవుఁడు నమ్రుఁడై వింజామరలు వీచుచుండెను. సోదర భక్తుడు లక్ష్మణుఁడు మడిచేతులు కట్టుకొని రామాజ్ఞకై వేచియుండెను. నూత్నముగా లంకాద్వీపపదపీఠారూఢుఁడైన విభీషణుఁడు వినయవినమితగాత్రుఁడై ఒకప్రక్క నిలచియుండెను. కొలువుకూటమున నిశ్శబ్దము విరాజమాన మగుచుండెను.

ఉన్నట్లుండి శ్రీరామచంద్రుని విశాలవిలోచనములు విభీషణునిపై ప్రసరించెను. 'ఏలినవారి ఆజ్ఞ ఏమి?' అని రామునితో నాతఁడనెను. అందుమీఁద రాఘవుఁడు విభీషణునితో

> 'పంక్తి కంధరు నాజిఁబరిమార్చితిరటంచు
> వసుమతీ తనయకు వార్తసెప్పి
> నీదేవి మొదలగు నీరజాక్షుల చేత
> నతివకు శృంగార మమరఁజేసి
> కొంచురమ్మ'

అని ఆజ్ఞాపించెను.

విభీషణుఁడు తోడనే తరలిపోయి సరమాదిసతులకు ఆసంగతి వినిపించెను. అప్పుడా సతులు సీతను నిర్మలజలముల జలకమార్చిరి; ఆమెకు పట్టుపుట్టమును కట్టఁ

బెట్టిరి; ఒడలికి చందనచర్చ యొనర్చిరి. చికురబంధమున సురభి పుష్పములు ముడిచిరి: కంఠమున మేలి భూషణములు దొడిఁగిరి. ఆత్రైలోక్యమాత నిట్లు అపూర్వశృంగార మున శృంగారించి అందలమున నిడికొని రామునొద్దకుఁ గొనివచ్చిరి.

సీత వచ్చినది. తరుణప్రవాళసుందరకాంతిని దనరు తన కరపల్లవములు మొగిచి రామునకు చుట్టివచ్చినది. ప్రణమిల్లినది. ఆభార్యా భర్తలకది చిరవియోగానంతర సమాగమమే. అయినను రామునివలని సాదరదరహాసవిలోకనలాభము ఆమెకు ఒన గూడలేదు. వినయభక్తితాత్పర్యములు వెలయు నావనితారత్నము 'ఈదీనురాలి యెడ ప్రాణవల్లభుఁడు ప్రసన్నుఁడు కాడని కలలోనైన తలపుబొటియుండినచో సీమె విగత ప్రాణయై ఈనాటికి ఎన్నియో దినములై యుండును' అని విలపింపఁదొడఁగెను.

సీతామహాసాధ్వీ—అయోనిజ—

నిడుదపెన్నెఱివేణి జడలుగా నవరించి
మలిన జీర్ణాంబరంబొలియఁగట్టి
భూమిజగంబు విభూతిపూఁతగఁబూసి
తన దివ్యమూర్తిఁ జిత్తమున నిల్పి
నిరశనస్థితితోడ నిలిచి భూశయ్యను
బవళించి నిదుర యేర్పడఁగ విడిచి
తారకబ్రహ్మమంత్రంబుఁ బఠింపుచుఁ
గఠినరాక్షస దుర్మృగములలోన
నహితలంకామహోద్యాన గహనసీమఁ
దపము సేయుచు నుండెను తన్నుఁగూర్చి

అను సంగతి మహనీయుఁడగు రామునకుఁ దెలియదా? తెలియును. తెలిసి యుండియే ఆతఁడు సీతను పరిశోధింపఁ దలఁపుఁగొనెను.

ఇంతి! వినుము పురుషుఁడెట్టివాఁడయినను
బరుని యింటనున్న పడఁతి మగుడఁ
బ్రాకృతుండుఁబోలెఁ జేకొనవచ్చునే?
యింతకంటె నింద యెద్దిగలదు?
కులసతిఁ జెఱకొనిపోయిన
యలశాత్రవు గెలువనోపఁడను పలుకులకున్
గెలిచితిఁ బగ చంపితి నిఁక
నెలఁతా! యెందైనఁ జనుము నే నిన్నొల్లన్

అని రాముఁడనెను.

అప్పుడు సీత రాముని ప
దాంబుజముల్ హృదయాంబుజంబునం
దప్పక నిల్పి ధీరత సుద
స్మృతియై తలవాంచి ధాత్రిపై
నొప్పునిజావలోకనము
లుంచి కరాంబుజముల్ మొగిడ్చి తా
నెప్పటెలుఁగుతో సభిను
లెల్లను విస్మయమందఁ నిట్లనున్

‘శ్రీరామచంద్రా! ధర్మదారనగు నన్నిట్లు పరుషములాడుట నీకుఁదగునా? నా సద్వర్తనము నీకు తెలియదా? సారగరిష్ఠుఁడవగు నీవు వినకనరాని ఇట్టి నిష్ఠురవాక్యములనఁ జెల్లునా?

పురుషులు నమ్మరేలిఁదమహాల్తుల చేష్టితచిత్తవర్తనం
బరయుట తప్పుగాదు మనుజాధిప! యుక్తముకాని నీవాగిం
బరుసని పల్కుపల్కవినఁ బాలయితిన్ సభలోన నక్కటా!
శరములఁబోలు వాక్యములు సైపుదురే? సతులింతకోర్తురే?

మీరిఁతి నమ్మకున్నను
గారనమేపార నన్నుఁగరుణించి మహో
దారంబగు సొదఁబెట్టుడు
ధీరమతిం జొత్తునందుఁ దిరమగుకడఁకన్

అని ముద్దులమఱఁది లక్ష్మణమూర్తివంకఁదిరిగి ‘ అన్నా ! లక్ష్మణా! కరుణాసముద్రుఁడగు రాముని అభిమానమునకు దూరమైన ఈమందభాగ్యురాలి కిఁక బ్రతుకుపై నాశలేదు. నాకొక చితినిఁ బేర్పింపుము. యజ్ఞభుజున కాహుతిగామై ఇడుములు గుడువగఁబుట్టిన ఈ ఒడలిని భస్మముచేసికొందును.’ అని అతిదీనముగాఁ బలికెను.

చితిపేర్ప లక్ష్మణునకు చేతులురాలేదు. రాముఁడు వారింపఁడు. సీత త్వరపెట్టుచున్నది. నడుమ నాతఁడు వికలచిత్తుఁడై పోయినాఁడు. సీతచితిని ఎక్కఁబోవునప్పుడు రాముని మనము కరఁగితీరునని తుదినిశ్చయమునకువచ్చి లక్ష్మణుఁడు కాష్ఠములు తెప్పించి సొదపేర్పించెను. అప్పటికిని రాముని చిత్తమున చీమతలయంతయైన కరుణ పొడసూపలేదు.

సీత చితి ఎక్కెను. చితికి అగ్ని పెట్టిరి. ప్రజ్వరిల్లి అగ్ని కాష్ఠముల భక్షింపఁ దొడఁగెను. జ్వలనజ్వాలిక లాకాశమంట నారంభించెను. పాణిపల్లవములు మొగిచి అప్పుడు సీతా మహాసాధ్వి "అగ్నిభట్టారకా!

రామస్వామి పదాంబుజంబు లెద నారాధింతునేనిన్ సదా
రామాజ్ఞం జరియింతునేనిఁ దగుజాగ్రత్స్వప్న సుప్తాదులన్
రాముందప్పనిదాన నౌటయు యథార్థంబేని

నావిశుద్ధచరిత్రము ఈ కూడియున్న మహనీయుల కందఱకును ప్రకటమగునట్లు చేయుము" అని ప్రార్థనాపూర్వకముగఁ బలికెను. ఇట్లు పలికి సీత రాయంచ చెంగల్వ కొలను చొచ్చినట్లు మలసిమండెడు మంటలో దుమికెను.

కాని సర్వభక్షకుఁడగు అగ్నిహోత్రుఁడు ఆమెను అంటలేకపోయెను. కాలాగ్ని వంటి ఆకార్చిచ్చు ఆపతివ్రత అంగములనేనియుఁ దాకలేకపోయెను. ఆమె శృంగారము ఇసుమంతయైన సలుగలేదు. ఆమెకు ప్రస్వేదాంకుర శ్రేణియైనను కలుగలేదు. ఆమె అంగములు ఇంచుకయైన మెఱుగేదలేదు. సీమంతవీధి చెన్ను చెరగనేలేదు. అడుగులుకూడ కసుగందలేదు; శరీరముమీఁది కమ్మపసపు లేఁబూఁతయైన పసిమిదప్పలేదు. తుదకు కట్టువస్త్రమైన పొగచూఱలేదు కింశుకపుష్పములలోని రాచిలుక--సాంధ్యారాగ పటలము నందలి బాలచంద్రిక—పవడపురాశిలోని భర్మశలాక—పల్లవపంక్తిలోని చంపకదామము—ఇట్లు దహనస్థితయై తలపువ్వువాడక తరుణీలలామ వెలుగొందు చుండెను.

తరుణీలలామ వెలుగొందుచుండెను. వెలుగొందుట సహజగుణముగాఁగల అగ్ని హోత్రుఁడు మాత్రము చప్పగఁ జల్లారిపోయెను. ఆకాశమంటిన అగ్నిజ్వాలలు అడగాఱి పోయినవి. కుప్పలుకుప్పలై యుండిన నిప్పులు కుంకుమరాసులైనవి. దీపింపరాని ఆమె పాతివ్రత్యమహాత్మ్యమునకు దేవతలు వెఱఁగొంది విరులవాన కురియించిరి. సభలోని వారందఱును ఆనందతన్మయులైరి.

అప్పుడు అగ్నిభట్టారకుఁడు సీతను గొనివచ్చి రామునకిచ్చి

దైవము ప్రాణమిత్రుఁడును
　　దాత సఖుండును జీవితార్థముల్
నీవుగ వాఙ్మనఃకగణ
　　నిశ్చయబుద్ధి శరీరదృష్టి సం
భావితవృత్తి నేమఱక
　　పన్నుగ నిన్నె తలంచు నన్యదు
ర్భావము లేదు భూమిసుత
　　భవ్యచరిత్రపవిత్ర, భూవరా!

అనిపలికెను. శుచిమూర్తి, యాగభుక్కు అగు అగ్ని చెప్పిన వాక్యములతో సంశయనివారణము కాఁగా రాముఁడు సీతను కౌఁగలింతల గారవించెను.

అందుమీఁద సీత రాముని ప్రియావలోకనముల తిలకించి "ప్రాణప్రియా! నిజముగా మీరు నాశీలమును గూర్చి సంశయమనస్కులైతిరా?" అని అడిగెను. దానికి రాముఁడు "ప్రాణేశ్వరీ! నీ సౌశీల్యమును గూర్చి నేను రవ్వంతైన అనుమానపడలేదు. కాని సత్యాసత్యనిర్ణయజకులగు లోకము వారికి నీ సంగతి తేటపడుటకు మాత్రమే నిన్నిట్టి కఠిన పరీక్షకు లోనుజేసితిని." అనిబదులిడెను. అప్పుడు వికాసవిలసితమగు ముఖమునకు తేజస్ఫురితములగు నేత్రములు ద్విగుణీకృతదీప్తి కొనిరా సీత రాముని తిలకించెను.

అంతట అశరీరవాణి సీత నుద్దేశించి

నీవిపుల ప్రభావమును నీవినయాదిక సద్గుణంబులున్
దేవుఁడెఱింగియుండియును నిందలకుంబుయిలోడి

ఇట్లు చేసినాడు" అనిపలికెను. వశ్యవాక్కులగు కవిశ్రేష్ఠు లప్పుడు అయోనిజయగు ఆజగత్పావనిఁ గూర్చి

జననీ! నీవుమహాపతివ్రతవు నీసౌశీల్యమిల్లాంద్ర కె
ల్లను మేల్బంతి రఘూద్వహుఁడ్రియుగళీ లగ్నాత్మవై యుందు

వని ఎలుగెత్తి చాటి ఆమె అక్షరరమ్యకీర్తిని అక్షరరూపమునఁ గీర్తించిరి.

# అనసూయ

**శ్రీమతి రామేశ్వరి.**

ఆ. వె. అలరుగాదె ధాత్రి యందత్రిమునిజాయ
భవ్యనామధేయ పతివిధేయ
అతిథిభాగధేయ సుతగుణ సముదాయ
శ్రీయుతానసూయ శిష్టగేయ.

—అనసూయ నాటకము.

అత్రియని ఒక మునీశ్వరుడు. అతనికి అనసూయ అను నామె పత్ని. ఆమె త్రికరణశుద్ధిగా పతియేదైవమని తలంచుచు ఆతని పాదసేవ ఏమరక చేయుచు ఆశ్రమమునకు వచ్చిన అతిథులను భక్తితో పూజించుచుండెను. ఇట్లుండగా త్రిలోకసంచారియగు నారదమునీశ్వరుండు ఒకనాడు అత్రిముని ఆశ్రమమునకు విచ్చేసెను. అనసూయ అతనికి అర్ఘ్యపాద్యము లొసంగి నమస్కరించెను. అచ్చట కొన్ని దినంబులుండి అనసూయ పతిభక్తికి బ్రాహ్మణభక్తికి అచ్చెరువంది ఆమెవద్ద సెలవుగైకొని నారదమునీశ్వరుండు దేవలోకమున కరిగెను.

నారదుడు కొండెములమారి. అనసూయతో సమానమైన పతివ్రత ముల్లోకములలో లేదని చాటి ఉమా, రమలకు చెప్పివారి గర్వ మడంచెద గాక యనితలచి నారదుడు స్వర్గలోకమున కరిగి "అనసూయతో సమానమైన పతివ్రత ముల్లోకములలో లే"దని త్రిమూర్తుల సతులకుచెప్పెను. వారుముగ్గురును మనకు మించిన పతివ్రత భూలోకములోనున్నదా? యని గర్వముచే నారదునిచేతికి ఉక్కుశనగలిచ్చి, "మునీంద్రా! మీరు భూలోకమునకేగి అనసూయ కీ ఉక్కుశనగలిచ్చి, వీనిని సగముడుకునట్లు గుగ్గిళ్లుచేయించి తిరిగి వీనిని మావద్దకు తెచ్చియిం"డని చెప్పిరి.

నారదుడు వల్లె యని వానిని తీసికొని భూలోకమున కరగి ఉక్కుశనగలను అనసూయకిచ్చి "అమ్మా! ఈ ఉక్కుశనగలను దేవలోకమునుండి తెచ్చినాడను. నేను క్షుద్బాధ కోర్వలేకున్నాను కావున నాకీ శనగలను సగము ఉడుకునట్లు గుగ్గిళ్లుచేసి యిచ్చిన నాక్షుద్బాధతీర్చికొందు''నని చెప్పెను. "మునీంద్రా! మీకింత క్షుద్బాధగనున్నను దేవలోకమున నీశనగలను గుగ్గిళ్లుచేయువారు లేక పోయిరా? చిత్రము. ఇదిగో యిప్పుడే గుగ్గిళ్లనుచేసి తెచ్చి మీక్షుద్బాధ తీర్చెదను. అని లోని కరగి ఆశనగలను గుగ్గిళ్లుచేసి నారదునకిచ్చెను.

అతఁడు నాగుగ్గిళ్లందుకొని దేవలోకమున కరిగి త్రిమూర్తులపత్నులకు నాగుగ్గిళ్లను చూపెను. వారు అనసూయ పాతివ్రత్యమహిమ కచ్చెరువంది ఆమె గర్వ మణచవలెనని తలచిరి. త్రిమూర్తులు తమతమభక్తసంరక్షణార్థమై సంచారము వెడలియుండి తమ తమ నిలయములకు విచ్చేసిరి. త్రిమూర్తుల సతులు తమ పతులకు అనసూయ పాతివ్రత్యమహిమయు తాము ఆమె గర్వమడంచుటకు గాను నారదునిచే పంపిన ఉక్కుశనగలను ఆమె గుగ్గిళ్లుచేసి యిచ్చుటయు మొదలగు వృత్తాంతము లెఱింగించిరి. త్రిమూర్తులు తమపత్నులకిట్లు చెప్పిరి. ''అనసూయ మహాపతివ్రతాశిరోమణి. ఆమె గర్వమడంచ మన చేతగాదు.'' కాని వారు మువ్వురు నొకటే పట్టుదలకలవారు కావున, వారిమాట తప్పించుటకు త్రిమూర్తులకు సాధ్యము కానందులకు, వారితో, ''సతీమణులారా! మీరిచట నేయుండుడు. మేముపోయి అనసూయ పాతివ్రత్యమును చెరచివచ్చెదమని చెప్పి మువ్వురను వారికి సమాధానముచెప్పి, త్రిమూర్తులు భూలోకమున అత్రి ఆశ్రమమున కరిగిరి.

త్రిమూర్తులు అనసూయవద్దకు వచ్చినప్పుడు తమరూపములమార్చి ఋషివేషధారులై వచ్చిరి. అనసూయ వీరినిచూచి అతిభక్తితో అర్ఘ్యపాద్యములొసంగి మువ్వురికిని నమస్కరించెను. ఆమె వారినందరి అతిథులవలె నాదరించవలెనని తలచి అనసూయ, ''విప్రోత్తములారా! మీరు చాలబడలినట్లున్నవారు. స్నానాహ్నికములన్నిట నీర్చుకొనివచ్చి నా ఆతిథ్యమును స్వీకరించి నన్ను ధన్యురాలినిని చేయవలెనని కోరుచున్నా న''ని అనసూయచెప్పెను. త్రిమూర్తులయందు నారాయణు డనసూయతో నిట్లనెను.

''అమ్మా! మేముమువ్వుర మొక వ్రతము సల్పుచున్నవారము. అది అతి కష్టమైనది. అదికొనసాగు వరకును మాకు భోజనము లేదు.''

అన—మునీంద్రా! అదెట్టి వ్రతమో సెలవిండు.

నారా—తల్లీ! నీవతిథిపూజాసక్తవని మాకుతోచుచున్నది. నీవు మహాపతివ్రతవు. అది నీకెట్లు తెల్పుదును!

అన—ఋషివర్యా! మీరుత్రిమూర్తులవలె మాగృహమున కేతెంచి నాయింట భుజించక వెళ్లుట న్యాయమా? అట్లు మిమ్ము మరలపంపిన నాగృహిణీధర్మమేమున్నది? మీవ్రతమున కేమి కావలయునో దయచేసి సెలవిండు, నాప్రాణమైనను యిచ్చెదాను.

నారా—అమ్మా! ప్రాణమిచ్చుటకంటెను కఠినమైనదినుమా! నీమాటసత్యమేనా?

అన—స్వామీ! ముమ్మాటికి సత్యము.

నారా—అట్లయిన చెప్పెదను. కోపగించకుము. మేము శక్తినిపూజించువారము. ఆమె ఆజ్ఞవలననే ఈమావ్రతము సల్పువారము. లేనియడల శక్తికి మహాగ్రహమువచ్చును. ఏమనగా సువాసినియగు నొక స్త్రీ వస్త్రవిహీనయై యన్నముపెట్టగా మేము భుజింపవలెను. ఇందులకు నిన్ను వేడుచున్నాము.

హా ! హా ! యనితలవాల్చి అనసూయ మరల ధైర్యమవలంబించి వారినిచూచి, "విప్రులారా ! మీరు స్నానాహ్నికముల దీర్చుకొనిరండు." అనిచెప్పి వారుస్నానమున కరుగగా నామె తనపతికమండలువు హస్తమున చేసుకొని భగవంతునిట్లుప్రార్థించెను.

"మానసంరక్షకా! నీవలనానాడు దుర్యోధనుని సభయందు మానభంగమునకు దుఃఖించుచున్న పాంచాలిని గక్షించితివి. ఈ దినమున నీవు నాకు తోడ్పడుము. ఈవచ్చినవిప్రులు కపట వేషధారులై నయనల నేనువస్త్రరహితనై వారికి అన్నము పెట్టునప్పుడు వారుమువ్వురును శిశువులై పోదురుగాక."

త్రిమూర్తులు స్నానాది కృత్యముల దీర్చుకొనివచ్చి అనసూయ సిద్ధము చేసిన పీఠములపై కూర్చుండిరి. అనసూయ వారియాజ్ఞప్రకారము వస్త్రరహితయై వచ్చి తన పతిపాదములను ధ్యానించి పతికమండలువులోని నీరు ఆ బ్రాహ్మణులపై ప్రోక్షింపగా వారు తత్క్షణమే శిశువులైరి. అత్రిమునీశ్వరుండువచ్చి ఆ మువ్వురు శిశువులను జూచి ఆశ్చర్యపడి తన సతి చెప్పగా సమస్తవృత్తాంతమును కనుగొనెను. అనసూయచర్యలకు అత్రిమునికి కల్గిన ఆశ్చర్యము యిచ్చట వ్రాయుటకు శక్యముకాదు.

భారతి, భార్గవి, భవానులు మువ్వురును తమపతులు శిశువులైనదిచూచి అనసూయపాదములకు నమస్కరించి

"అనసూయాదేవీ! మాకుపతిభిక్ష పెట్టుము. మాకు పుట్టినయిల్లు అత్తవారిల్లయినది." అని అతి దీనముతో వేడుకొనిరి.

వారి దీనాలాపములనువిని ఆ మునిదంపతులెంతయు కరుణించి త్రిమూర్తులను వేడుకొనగా వారు తమనిజస్వరూపమును అచ్చట నున్నవారికిచూపి, అత్రిఅనసూయలిరువురిని ఆశీర్వదించి తమతమ సతులను గైకొనిరి.

త్రిమూర్తులప్పు డనసూయనుచూచి "సాధ్వీమణీ! నీశీలమును మెచ్చితిమి. నీకీర్తిలోకమంతయు విస్తరించుగాక. మేముమువ్వురమును నీపుత్రులై తిమిగనుక మా అంశమున నీ కీపుత్రునినిచ్చుచున్నా"మని, వారు దత్తాత్రేయుని అనసూయకిచ్చిరి. ఆమె, "మహాప్రసాదమని," దత్తాత్రేయుని స్వీకరించి తనపతితో అతి సుఖవతియైకాలముగడపుచుండెను. త్రిమూర్తులు వారివారి నివాసముల చేరిరి.

మహాపతివ్రతామతల్లియగు అనసూయ త్రిమూర్తుల సతులగర్వ మడంచి తనమానము కాపాడుకొనుట యేగాక, యొక పుత్రుని బడసెను. సతీమతల్లి యగు అనసూయపాదారవిందములకు నమస్కరించి యీ చరితమునింతతో ముగించుచున్నదానను.

# ప్రణయమాధురి

కామరాజు మైత్రేయిగారు

## ౧

విమల మంచివంశమున జన్మించినది. వారింట లక్ష్మి తాండవమాడుచుండెను, విమల తండ్రి నాగేంద్రశాయి. మంచిగుణరాశి. విమలకు విద్యచెప్పించి పెద్దదానిగచేసి ఆమె యిష్టమువచ్చినవానిని భర్తగా వరింపజేయవలెనని ఆయన అభిలాష. అతడు ఎంత తలచిన అంతపని జేయువాడు. మాటతప్పువాడుకాడు.

విమలయు మంచి సౌందర్యరాశి. తరగతులలో మంచి సూక్ష్మగ్రాహిణి అనిపేరు బడయుచుండెను. ఆమె తెలివితేటల కుపాధ్యాయులుకూడ అచ్చెరువందుచుండిరి. ఆమె తరగతులు వీడి యింటరుక్లాసు చదువుచుండెను. అచ్చట మొదటితరగతిలో యుత్తీర్ణురాలయ్యెను.

ఈ తరగతిలోనుండ ఆమెకు నవయౌవనమంకురించెను. ఈమెతరగతిలో జయరాముడు గోపసింహుడు అనునిరువురు పురుషులు చదువుచుండిరి. వీరిరువురు ఆమె స్నేహమునే అభిలషించుచుండిరి. వీరిరువురు ఆమెతోపాటు క్లాసులలో నుత్తీర్ణులగుచుండిరి. విమలయు వారిని ప్రోత్సహించుచుండెను. వీరి మువ్వురకు అన్యోన్యభావ ముదయించుచుండెను. ఇట్లు కొంతకాలము గడచెను. వారు బి. ఏ. కూడ ప్యాసు అయిరి.

జయరాము డొకనాడు 'ఈవినింగుసూటు' వేసుకుని, మంచి కాంబినేషన్ టై వేసి, బూట్సు బాగా అద్దములాగ పాలిష్ చేసి, విమలగృహముయొద్దకు బోయెను. తలుపులువేసి యుండెను. తలుపు తట్టెను. ఒకపనివాడు రాగా తన విజిటింగుకార్డు పంపెను. విమల సన్నని ఊదాసరిగెచీరె ధరించి H. G. Wells యొక్క నవలను చదువుచుండెను. ఆ విజిటింగుకార్డు చూడగానే విమల "సరే" అనికబురు పంపెను.

"గుడ్ ఈవినింగు. మిస్ విమల!" అని జయరాముడనెను. "హల్లో! గ్లాడ్ టు మీట్ యు" అని విమల అనెను.

జయరా:—విమలా! నీతో నాయొక్క జీవితవిషయములను గూర్చి మాట్లాడ వచ్చితిని. మనచిరకాలస్నేహము మరువక నీవు నాకు తగినసలహా యిచ్చి నన్ను సంతోషపరుపవలెను.

విమల:—ఏమిటది?

జయరా:—నేను ఆర్ట్సుకోర్సు చదువుచున్నను నాబుద్ధి దీనిమీాద లేదు. నా కొక గొప్పడిటెక్టివ్ కావలెనని యున్నది. నామనస్సంతయు దానిమీాద పోవుచున్నది. యిప్పటికి నేను క్రిమినాలజీ అంతా చదివినాను. పోలీసువారికి కూడా నాపేరు తెలిసినది. నాసలహాకు వారు అప్పుడప్పుడు వచ్చుచుందురు. నాకు సి. ఐ. డి. డిపార్టుమెంటులో ఉద్యోగము కాగలదు. నాకు జీవితమునుగురించి ఎక్కువ దిగులులేదు.

విమల:—నాకు ఈసంగతి ఇంతవఱకు తెలియదు. నాకు చాలాసంతోషముగా నున్నది.

పడకకుర్చీలో పడుకునియున్న విమలకూర్చొని, ఆతురతతో వినుచుండ జయరాము డిట్లు చెప్పెను. "కాని, విమలా! నాకు హృదయశాంతిలేదు. నా హృదయము ఒకరిమీాద లగ్నమైయున్నది. ఆమె విద్యాపరిపూర్ణురాలు. ఆమెను నాహృదయపీఠమున నధిష్ఠింపజేసి నా ప్రేమప్రసూనములతో పూజింపు చుందును. నేనిట్లు ప్రేమించుచుంటినని ఆమెకు తెలియునో? తెలియదో? ఈసంగతి ఆమెకు జెప్పవలెనని యున్నది. ఆమె ఏమనునో తెలియదు. చెప్పుమందువా? లేక వద్దనెదవా? నీసలహా తీసికొనిగాని నేను ఏపని చెయ్యను."

విమల:—నీ ప్రేమరహస్యాలు చెప్పటానికి వచ్చావా? నాచేత నయినంతవరకు సహాయము చేస్తాను. ఆయువతీరత్నము ఎవరు? ఎంతధన్యురాలు!

జయరా:—ఆమెపేరు నీకెందుకు? ఆమె నీకు బాగా తెలియును. నీస్నేహితురాలే.

విమల:—ఈసంగతి నీలో నీవు దాచిపెట్టుకొని నీసుకుమార దేహమును కష్టపెట్టుటకంటె నీహృదయరహస్యమును వెల్లడింపుము. ఆమెహృదయము కనిపెట్టి మాట్లాడుము. ఆమెహృదయము యితరులమీాద లగ్నమైనదేమో పరికింపుము. ఇష్టమైన ఎడల శీఘ్రమే వివాహమొనరించుకొనుము. కాని నాకు వివాహమనిన యిష్టములేదు. మానవులు యిరువురు జన్మాంతమువఱకు కలిసి ఒకరికష్టములు సుఖములు ఒకరివని ఎంచుకొనుచు నివసించునప్పుడు వారిని ప్రేమతప్ప మరియొకటి బంధింపనేరదు. సంఘము ఎంతకట్టుదిట్టము చేసినప్పటికి ప్రేమలేనియెడల వారు సౌఖ్యమును అనుభవింపజాలరు.

జయరా:—నీకు వివాహమనిన సరిపడదా?

విమల:—వివాహమనిన నాయుద్దేశములో అర్థములేనిమాట. బెట్రాము రసిల్ గారు చెప్పినటుల ఒకరు భర్తయనియు, ఒకరుభార్యయనియు నుండినయెడల దుఃఖము తప్ప వేరు లేదు. ఒకరి కొకరు సహాయము చేసికొనుచు స్నేహితులవలె నుండవలెను. ఇట్లుండుటకు ప్రేమయే మూలకారణము. పోని! మనము వివాహము అనుపదమునుతీసివేయు లేనియెడల భార్యకు కూడ భర్తవలెనే విడిగా నుండుటకు, వివాహమును డైవర్సు(విడాకు) చేయుటకు హక్కు ఉండవలెను. ఇట్లు హక్కులుండుటకు, వారు దానిని చలాయించు టకును బాల్యవివాహములు చేయకూడదు. వివాహమనిన అర్థముకానిముగ్ధలకు వివాహ ములుచేసినచో 'డైవర్సు' అనిన అసలే అర్థముకాదు. అందులకు ఒప్పుకొనియెదవా?

జయరా:—నీవు వివాహవిషయములనుగూర్చి స్పెషలైజుచేసినట్లున్నావు. ముందు బాల్యవివాహనిషేధనచట్టము వచ్చిన పిదప సంఘప్రోద్బలముచే 'డైవర్సు' రాగలదు. ఇది వచ్చుటకు ఆడువారు వారి జాతిని విద్యనభ్యసించుటకు ప్రోద్బలము చేయువలెను.

విమల:—సరే! నాజీవితమంతయు దేశసేవకై వినియోగించి ఏది ఏమయినను నాజీవిత మెంత నీచమయినను నాయిచ్ఛయే నెరవేర్చుకుని మాజాతికి ఆదర్శకురాల నయ్యెదను.

జయరా:—విమలా! నాసంగతి మరచితివి. నాహృదయపీఠ మలంకరించిన శృంగార వతివి నీవే! ఆ విద్యావంతురాలవు నీవే! ఆ పువ్వుల గుత్తివి నీవే! ఆ పుష్పలతవు నీవే! నిన్ను వివాహమాడవలెనని యున్నది. నాయావజ్జీవము నీయిష్టాభిలాషయందే వినియో గించి ఎల్లపుడు నీసేవకుడనుగా నుండెదను. విమలా! వివాహముల మీాద నీ అపోహలు మాని నన్ను చేకొమ్ము. నీమనసు నొచ్చకుండ నే ప్రవర్తించెదను.

విమల:—ఎంతచదువు చదివినను నీవు నీప్రాతయుద్దేశ్యముల మాన లేదు. నీవు ఏదో సంఘసంస్కారివనుకుంటిని. నీకంటె మనరూపసింహుడు మంచి సంఘసంస్కారి. అతని యుద్దేశ్యములు నాయుద్దేశ్యములు సరిపడినవి. మేమిరువురము స్నేహితులముగా నివశింప దలచితిమి. మాజీవితములు ఈవిషయచర్చ యందే ధారపోయ దలంచితిమి. మేము సంఘముపెట్టు కష్టములను ఓర్చదలచితిమి. సత్యవాక్యప్రియుడగు భగవానుడు మాకు తోడ్పడుగాక!

జయరా:—"అమ్మా! విమలా! నాయుద్దేశ్యములు అంతముందంజ వేయక పోయినను మిమ్ములను ఆశీర్వదించెదను. మీకష్టములలో పాల్గొనెదను. సదా నీసౌఖ్యము నేను కోరుచుందును. విమలా! యీజయరాముని మరువకుము. రూపసింహుడు నాప్రియ స్నేహితుడు. నానమస్కృతులు అతనికి అర్పింపుము." అని ఆతడు తనగృహమునకు పోయెను. విమలారూపసింహులు భార్యాభర్తలవలె నివశించుచుండిరి.

౨

అక్రూరుడు:—శారదా! మనకు క్రొత్తపని తగిలినది. విమలారూపసింహుల సంగతి పత్రికలలో చదివితివా? బాగానేయున్నది. నేను ప్రేమవివాహములను నమ్మను. విమల మంచిరూపవతి.

శారద:—మరల మొదలుపెట్టినారా! యీతడవ ఏమి ఎత్తు?

అక్రూరుడు:—రూపసింహుడు విమలకు మంచిరవ్వలహారము యిచ్చినాడట. అది మనము......సరే. భాగములకేమిలే. ఇదివరకు ఎన్నిమారు లివ్వలేదు. వారి దగ్గరకు స్నేహితులవలె చేరవలెను. సరే! నేను నీభర్తగా నటించెదను. ఇద్దరము వారింటి ప్రక్క యిల్లు అద్దెకు తీసికొందము. ప్రయత్నములకు లోపములేదు. కార్యము సాగ వలెను. దైవసహాయము ఉండవలెను. దొరకెనా!.........ఇరవయివేల రూప్యములు.

౩

విమలారూపసింహులు చాల అన్యోన్యముగ నివశించుచుండిరి. వారి జీవితములను చూచిన ఆశ్చర్యము కలుగుచుండెను. ఒకనాడు వారింటిలో విందుచేసిరి. జయరాముడు, శారద, అక్రూరుడు కూడ దయచేసిరి. శారద అక్రూరుని రూపసింహునకు పరి చయము చేసినది. రూపసింహుడు అక్రూరుని విమలకు తెలియపరచెను. అక్రూరుని కళ్లన్నియును ఆవిమల రవ్వలహారము మీదనేయుండెను.

అక్రూరుడు:—విమలా! నీహారము చాలా అందముగా నున్నది. నీసొగసైన మెడకు వింతఅందము తెచ్చుచున్నది. దానితో నీవు ఫొటోతీయించుకొనిన బాగుండును. నాకు ఫొటోతీయుటలో కొంచెము ప్రవేశమున్నది.

విమల:—రూపసింహునకు ఇటువంటివి నచ్చవు. కాని మీరు ఫొటోతీయ గలరా? నాకు తెలియదు.

అక్రూరుడు మెల్లగా ఎట్లనో శారదచేత చెప్పించి, విమలను ఫొటోకు తన గృహమునకు వచ్చునట్లు చేసెను. ఆదినమున రూపసింహుడు యూరలేడు. కాని (మంచి అపరాధపరిశోధకుడు) జయరాముడు కలడుగదా! అక్రూరుని చూచినప్పటి నుండియు జయరాముడు అతనిమీద అనుమానము వహించెను. అతని ఎత్తులన్నియు పరిశీలించుచుండెను. విమల అక్రూరుని ఇంటికిపోవుటకు ఒప్పుకొనినట్లుకూడ జయరాముడు విమలదాసివలన తెలిసికొనెను.

## ౪

విమల సాయంత్రము మూడుగంటలకు అక్రూరుని గృహమునకువచ్చెను. అక్రూరుడు ఆరవ్వలహారమునె చూచుచుండెను. ఎంతచెడినను యిరుగు పొరుగువారేకదా! అక్కడ ఫొటోకెమీరా యుండెను. దాని ఎదుట కుర్చీ వేయబడియుండెను. హాలుఅంతయు అందముగా నుండెను. అకుర్చీప్రక్కన క్రోటన్సు మొక్కలు చక్కగా అమర్చబడియుండెను. ఆహాలు మనస్సు రంజింపచేయుచుండెను. అక్రూరుడువచ్చి "విమలా! నేత్రానందకరముగా నుంటివి" అనెను.

విమల:—అవేటిమాటలు ?

అక్రూరుడు "సరియే! యిదిగో—ఈ ప్రక్కకు తిరిగి నీమొక్కముఖము యిటు తిప్పి తిప్పిన తల కొంచెము—పక్కవాటుగాపెట్టు"—అని తలను తిప్పి సరీగా కెమీరాకు ఎదుర్కొని ఆమె చుబుకము కొంచెము ప్రక్కకుతిప్పి లెన్సు అయిపోయినదని చెప్పెను. రవ్వలహారము తీసివైచి యింకొకటివేసెను. విమలకు ఇదంతయు ఆశ్చర్యకరముగా నుండెను. మరల తనదుస్తులను ధరించి "నాహారమేది? నాహారమునాకియ్యి" అని గద్దించి అడిగెను.

అక్రూరుడు "ఆ—హారమా?—సరేయిచ్చెదను. కాని ఫొటో యిప్పుడే డెవెలప్ చేసి యిచ్చెదను." అని దానిని విమలకు తీసుకునివచ్చి చూపెను. విమల ఆశ్చర్యనిమగ్నురాలయ్యెను. అందులో అక్రూరుని బాహువల్లికలతో విమల చెక్కిళ్లు వత్తుచున్నట్లు ఫొటోయుండెను. ఇది ఎట్లువచ్చెను ? అక్రూరుడు వికటహాసముచేయుచుండెను.

"ఛీ క్రూరాత్మా! నన్ను ఇట్లువంచించుటకా నీవు పిలిపించినది? నీపాడు మనస్సు కనిపెట్టలేకపోయితిని! మానవాధముడవు. పాపివి, క్రూరుడవు." అని ఆమె ఆ బొమ్మను చించి వేయబోయెను.

అక్రూరుడు నవ్వి "విమలా! నీవది చించినను నాదగ్గిర 'నెగిటివ్' యున్నది. దానితో లక్షలకొలది కాపీలు తీసెదను. నిన్ను సంఘములో పాడుచేసెదను. నీవు నాకు హారమును ఇచ్చిన ఎడల యీనెగిటివ్‌ను పగులగొట్టెదను—నేను ఫొటోతీసినది 'ఆటోమాటిక్ సెల్ఫుకెమెరు' తెలిసినదా? విమలా! నాచేత చిక్కితివి."

విమల ఏమియుమాటాడలేదు. కనులు భాష్పపూరితము లయ్యెను. వదన మెఱ్ఱబడెను. ఏమిచేయుటకుతోచలేదు. ఇంకదిక్కెవ్వరు? శారద కానరాలేదు. రూపసింహునకు యీఫొటో కనుపించెనా—తనజీవితమంతయుబూడిదలోపోసినపన్నీరగును. ఎవ్వరుదిక్కు? పోనీ హారమిచ్చుననుకొనుడు! వాడు ఆనెగిటివ్‌ను పగులగొట్టునా? యేమో! రూపసింహుడు హారమేదని అడిగిన ఆమె యేమిచెప్పను? పోయినదనిచెప్పిన నమ్మునా? ఏడ్చుచు విమల తనగృహమునకు పోయెను.

జయరామునకు ఇదంతయు తెలిసిపోయెను విమలదాసివలన. రూపసింహు డూరినుండి వచ్చెను. తాను వెళ్లిన వ్యవహారము కొనసాగినందుకు సంతోషించి ఆతడు స్నేహితులందరికి విందునీయదలచెను. ఆ రేయి విమలను ఆరవ్వలహారమును ధరింపమని ఆతడు చెప్పెను. విమలకు ఏమిచేయుటకు దోపకుండెను. దుఃఖసముద్రమున దరిగానక ఆమె కొట్టుకొనుచుండెను.

అచ్చట జయరాముడు తన ప్రయత్నము సాగించెను.

౫

"తలుపుతీయండి. త్వరగా. ఆలస్యము చేయకూడదు." అని అక్రూరుని గృహ ద్వారమును ఎవరో కొట్టుచుండిరి. "ఒక తపాలాబంట్రోతు ఏదో ఒకప్యాకెట్ తీసికొని వచ్చేడు" అని శారద అక్రూరునికి తెలియపరచెను. "నీవు తీసికొనిరా" అనెను అక్రూరుడు. ఆమాటమీద తపాలాబంట్రోతు "ఎవ్వరివిలాసము వ్రాయబడియున్నదో వారికే గాని యితరులకు ఇచ్చుటకు వీలులేదు" అనుచు చొఱవతో లోపలికివచ్చి అప్యాకెట్టు అక్రూరుని హస్తమునందుంచెను. అక్రూరుడు దానిని ఇటునటు తిప్పుచుండెను. ఇంతలో నాసేవకుడు 'దానికిమీరు 15 రూపాయిలు యివ్వవలెనండి. ఇప్పుడు యిచ్చెదరా? లేని

ఎడల రేపు వచ్చెదను." అని దానిని తీసికొని పరువెత్తెను. అది ఎవ్వరో చదువరు లూహింపగలరా? అది మనజయరాముడే!

ఆప్యాకెట్ మీద కెమికల్ కాగితమునువేసి పైవిలాసమును వ్రాసెను.

ఆప్యాకెట్టు అక్రూరుని హస్తములందు పెట్టినవెంటనే వాని చేతిముద్ర ఆకాగితము మీదపడెను. దానిని ఫొటోదీసి పెద్దదిగాచేసి పోలీసువారికి పంపి దాని చరిత్రను తెలుపు డని ఆతడు వారిని కోరెను. దానికి వారు యిట్లుజవాబిచ్చిరి. "ఈ హస్తముద్ర యిదివఱకు జైలులోనుండి తప్పించుకొనిపోయిన దుండగీనిది. ఇతడు యింతకు పూర్వము నాలుగుతడవలు శిక్షింపబడెను. ఇతని నివాసస్థలము తెలిసికొని యితనిని పట్టి ఇచ్చిన ఎడల వెయ్యి రూప్యములు బహుమతి యిచ్చెదము. కడు అసాధ్యుడు. జాగ్రత."

జయరాముడిది చూచి అక్రూరుని ఇంటికి వెళ్లెను. శారద మాత్రముండెను.

జయరాముడు:—అక్రూరుడేడి?

శారద:—బజారు వెళ్లినాడు.

జయరాముడు.—ఎప్పుడు వచ్చును?

శారద.—ఏమో తెలియదు.

జయరాముడు.—సరే! హారము మార్చుటకు వెళ్లినాడా?

శారద.—అదేమిటి!

జయరాముడు.—నీవు నిజము చెప్పకున్న నిన్నుకూడ శిక్షింతును. అక్రూరుని మ్రాయవేషము తెలిసెను. నేను పోలీసుపత్తేదారుని. నీకు తెలిసినది చెప్పుము. లేని ఎడల—ఆడుదానవు—చిక్కులబడుదువు. నీవు తప్పించుకొనిపోవుటకు వీలులేదు. చేత చూచితివా? పిస్తోల్. జాగ్రత్త! నిజముచెప్పి ప్రాణము కాపాడుకొనుము.

శారద:—(భయకంపితయై హీనస్వరముతో) నిజముచెప్పెదను. నన్నురక్షింపుడు. నేను అక్రూరుని అల్‌బాదునందు కలిసికొంటిని. నన్ను యీవిధముగానే మోసపుచ్చి తన భార్యగా చేసికొనినాడు. నాకు ఇందుభాగము యిచ్చెదనని చెప్పి వెళ్లినాడు. మరల వచ్చునని నాకు నమ్మకములేదు. నన్ను రక్షింపుడు. బహుశః అతడు స్వగృహమునకు పోయి ఉండును.

జయరాముడు.—నాయుద్దేశ్యమును ఆలాగునే యున్నది. సరే. నేవచ్చువఱకు ఇక్కడనే యుండుము. లేకున్న కష్టములు వాటిల్లును.

అంత జయరాముడు అక్రూరుని నివాసస్థానమునకు బోయెను. ఆ గృహము కనుగొనెను. పోయి ఆతని దొడ్డిలో నొకగడ్డివాములో దూరెను. అక్రూరుని భార్యగడ్డి దీసికొనుటకు వచ్చి జయరాముని కనుగొనెను. "నాభర్తను తీసికొనిపోవవచ్చితివా?" అని బడితతో నాతనిని బాదనారంభించెను. జయరాముడు బయటికివచ్చి "అతని దగ్గిర ఒక హారము ఒకఫొటో నేగిటివ్ ఉన్నవి. అవి యిచ్చిన నీ భర్తతో నాకు సంబంధములేదు. అవి తెచ్చి ఇమ్ము. లేకున్న పోలీసువారిని పిలిచెదను. వారు యిచ్చుటనే దాగుకొని యున్నారు. ఈలవేసినవచ్చెదరు." అని పలికెను. అందుమీద అక్రూరుని భార్య ఆరవ్వల హారమును ఆనెగిటివ్ను తెచ్చియిచ్చెను.

జయరాముడవి తీసికొని రూపసింహుని గృహమునకు వచ్చెను. అప్పుడే విందు ప్రారంభమయ్యెను. స్నేహితులందఱు వచ్చిరి. విమల ముఖమున తప్ప మిగిలినవారి ముఖములందు ఆనందము తాండవించుచుండెను.

జయరాముడువచ్చి "విమలా! ఏమిటి యింతటి అశ్రద్ధ. నీహారము ఆగదిలో నేలమీదపడియున్నది. ఇదిగో జాగ్రత్తగా చూచుకో. రూపసింహా! చూచితివా ? విమల అశ్రద్ధ." అనెను. విమలహృదయము అప్పుడు ఎట్లుండెనో? ఆలోచింపుడు. రెండు రోజుల తరువాత జయరామునకు ఒకజాబువచ్చెను. అది విమలవద్దనుంచి వచ్చినది.

"ప్రియమైన జయరామునకు.—

నీవునాకు చేసినమేలు మరచుటకు వీలులేకుండచేసితివి. నన్ను నీచపు బ్రతుకు నుండి తప్పించితివి. నీహృదయము దయార్ద్రమని యెంచనైతిని. నాజీవితము రూపసింహునితో హాయిగానున్నది. మాకు యేవిధమైన తగవులులేవు. మేము నిరంతరము ఒకరి నొకరు ప్రేమించుచుందుము. మేము బానిసత్వపు వివాహమును గావించుకొనలేదు. అతను నొచ్చుకొనునని నేను నేను కష్టపడుదునని రూపసింహుడును జాగరూకతతో ప్రవర్తించుచుంటిమి. ఇదియే మాఅన్యోన్యభావమునకు కారణము. మాజీవితములు దీనికర్పింతుము. మాయిరువురి సౌఖ్యము కాపాడినందులకు—దుష్టుడగు అక్రూరుని ఆటలు తారుమారు చేసినందుకు నీకు నాసహస్రవందనములు. నీకును నాబోటితరుణి ఒకతె లభించుగాక యని కోరుచున్నాను.

ఇట్లు, విమల."

# మీరాబాయి

సామవేదం జానకిరామశర్మ గారు

మీరా రాఠోరు సామంతుని పుత్రిక. ఈమె బాల్యమునుండియు అలౌకికమగు రూపసౌందర్యమును మధురమగు కంఠస్వరమును గలిగియుండెడిది. ఆకాలమున ఈమె గానమును వినుటకును, సౌందర్యమును తిలకించుటకును చాలమంది జనులు రాఠోరుసామంతునికడకు వచ్చుచుండెడివారు. మీరా తన రూపలావణ్యముచేతను, గానమాధుర్యముచేతను ప్రజలను ముగ్ధుల నొనర్చుచుండెడిది. ఒకపరి చిత్తూరు యువరాజీమె గానమును, సౌందర్యమును ప్రజలవలన విని యిచ్చటకువచ్చి మీరాగానమును వినుచు చాలదినములుండెనట. చాలదినములవరకు యువరాజు రాకుండుటచే చిత్తూరు ప్రభువు చారులకంపి కుమారు నతికష్టముపై రాజ్యమునకు రప్పించెను. మీరాను వదలి వెళ్లుట కిష్టము లేకున్నను తండ్రి యాజ్ఞను మీరలేక వెళ్లునపు డాతడు మీరా కొకయంగుళీయకము నుపహారముగ నిచ్చి తనకామెయందుగల ప్రేమను వెల్లడి చేసెను.

ఆవల యువరాజు చిత్తూరు ప్రవేశించిన కొలదిదినములకే అచటనుండి చారు డొకడు రాఠోరురాజ్యమునకు మీరా వివాహవార్తనుదెల్పు శుభపత్రిక నొకటి దెచ్చెను కులశీలముల తగువరుడు లభింపనున్నాడని రాజు చిత్తూరుయువరాజునకు మీరానిచ్చి వివాహము గావించెను. వివాహమైన కొన్నిదినములకే యువరాజు రాణాయయ్యెను. మీరా బాల్యమునుండియు దైవభక్తిగలది. ఆమెకు సాంసారికభోగములం దనిష్టత మెండు. బాల్యమున పితృగృహమునందువలె విశాలమగు మైదానమున జనులందఱితో ముక్తకంఠమున భగవద్ధ్యానముచేయు నవకాశ మామెకు భర్తృగృహమున లభింపకుండెను. అన్నపానాదులులేక జనులెట్లుండజాలరో భగవద్ధ్యానములేక మీరా యట్లుండలేక పోయెడిది. భగవద్భక్తిలేక కాలము గడుపజాలని మీరా లోలోన చింతింపుచు యుదాసీనతతో దినముల గడుపుచుండెను. ఆమె భక్తి స్రోతస్సు సంగీతమార్గమున వెలువడుట కవకాశములేక యుదాసీనపథమున బ్రవహింపజొచ్చెను.

మీరా చదువను వ్రాయను బాగుగ నేర్చిన యువతీమణి. ఆమె రాజమహలునందుండి కవితాభ్యాసమున కారంభించెను. "రణచోడ్" దేవునుద్దేశించి యామె తన కవితాప్రాగల్భ్యమును దేశమునకు వెల్లడిపఱచెను. ఆమె సాహిత్యజ్ఞానము పండితశ్రేష్ఠుల మెప్పువడసినది. మీరా తన యనర్గళమగు కవితాధారచే చిత్తూరు రాజ్యమంతయు స్నిగ్ధమొనర్చెను. రాజస్థానమందలి కవిగణము నీమె తన స్వాధీన మందుంచుకొనెను. చిత్తూరు తన రాజ్య గౌరవమును క్షాత్రమునగాక మీరాయొక్క కవితాశక్తివలననే వృద్ధిపొందించుకొనినదన్న ఈమె కవితాశక్తి పాఠకులే యూహించుకొందురుగాక! మీరా వ్రాసిన భక్తిపాటలను భగవద్భక్తులందరును మిక్కిలి యాదరముతో గానముచేయుచుండెడివారు. మీరా కవిత్వమంతయు భక్తిరస పూరితమైయుండెడిది. "రాగగోవిన్ద" మను భక్తి రసప్రధానమగు యుత్కృష్టగ్రంథ మీమె రచించినదే! జయదేవకృతమగు సంస్కృతగ్రంథమున కీమె టీక వ్రాసెను. పైనవ్రాసిన రెండు గ్రంథములును ప్రజల ప్రశంసనొందినవి. మీరాభర్తయగు కుంభరాణా ఈమెవలన కవితాశక్తిని సంపాదించెనని కూడ యొకానొక వాడుక గలదు. మీరా కవయిత్రియేగాక విశేషించి భక్తురాలనియు ధార్మికురాలనియు గూడ ప్రసిద్ధికెక్కెను. భర్తయనుకూలమున నీమె రాజమహలునందు "రణచోడ్" దేవునకొక మందిరము నిర్మింప

జేసెను. ఆమందిరమునకు భక్తులు వచ్చుట కెట్టియాటంక ముండునది గాదు. స్త్రీపురుషభేదములేక యెల్లరు నచటికి వచ్చుచుండెడివారు. వారందరితో గలసి మీరా "రణచోడ్ దేవు" నెదుట భగవత్కీర్తనము గానించుచుండెడిది. సాధారణజనులతో మీరా కలసిమెలసియుండుట గాంచినపుడెల్ల కుంభరాణాకు మిక్కిలి కష్టముగ నుండెడిది. ఇతర రాజులవలె రాణాయును భోగములందత్యాశ గలవాడు. ఐనను మీరా యతని కోర్కెల నెరవేర్ప జాలకుండెడిది. భోగలాలసుడగు రాణా ద్వితీయవివాహ మాడగోరి మీరాను పృచ్ఛసేయగా నామె యాతని యభిప్రాయమును సంతసముతో నంగీకరించెను. మీరా సమ్మతిపై నాతడు కన్యాన్వేషణమున కారంభించెను. ఝూలావార్ రాజకొమరిత సౌందర్యమును విని యామెను వివాహమాడ నిశ్చయించుకొనెను. గాని ఆమె నీవరకే మందార రాజునకీయ నిశ్చయింపబడెను. ఇట్టిస్థితి యందాతడు వెనుదీయక సుముహూర్తము నాటి రాత్రి కామె నపహరించి చిత్తూరు జేర్చెను. పాపమా రాజకొమరిత మందార రాజుపై నత్యంతప్రేమను గలిగియుండెను. రాణా రాజకొమరితనే హరింప గలిగెను గాని యామె మనస్సును మాత్రము హరింపలేకపోయెను. ఎట్టులనో రాణా యామెను వివాహము గావించుకొనెను. కాని దాంపత్య సుఖము నాతడామెవలన యిసుమంతయు నొందియుండలేదని చెప్పుదురు. రాజమహాలు నందలి "రణచోడ్ దేవ్" మందిరమున కేరికిని వచ్చుట కాటంకములేదని యిదివరకే చెప్పబడినది. ఒకానొక దినమున మందార రాజకుమారుడు వైష్ణవ వేషమూని రాజమహాలునకేతెంచి "రణచోడ్ దేవ్" మందిరమున భక్తులందరితో గలసి విష్ణుగాన మొనరించెను. ప్రతిదినమును భక్తులందరు భగవద్గాన మొనర్చినపిదప ప్రసాదమును స్వీకరించి యిండ్లకేగుట యాచారమైయుండెడిది. కాని అనాడు మందార రాజకుమారుడు ప్రసాదమును స్వీకరింపకపోగా జలపానమును సైతము విసర్జించెను. అతిథిసత్కారమందత్యంతాసక్తిగల మీరా మిగుల ఖిన్నురాలై ప్రసాదస్వీకరణమునకై యాతని పలుభంగుల వేడుకొనెను. తుదకాతడు తాను కోరిన కార్యమును సఫలమొనర్చినచో ప్రసాదమును గ్రహింతునని భీష్మించ మీరాయందుల కొడంబడ నాతడు ప్రసాదమును స్వీకరించెను. పిమ్మట మందార రాజకుమారుడు ఝూలావార్ రాజపుత్రి తనయందనురక్తయగుటయు ఆమెను కుంభరాణా యపహరించుటయు, మొదలుగాగల సంగతులను జెప్పి ఆమె నొకపరి తనకు చూపించ వలసినదిగ మీరాను కోరెను.

రాజాంతఃపురమున పరపురుషప్రవేశము మిగుల భయానకము. ఐనను రాజపుత్రుని దీనస్థితియు తానొసగిన మాటయు దలంచి మీరా దుస్సాహసమున కొడిగట్టెను. మనుజుల కగోచరముగు రాజమహాలు నందలి గుప్తద్వారమును తెరచి మీరా రాజపుత్రుని రాణా శయ్యామందిరమున కంపెను. కాని దౌర్భాగ్య వశమున రాణా యాసమయమున రాజపుత్రుని స్వాధీన మొనర్చుకొనుటకై శయ్యామందిరమున కొచ్చియుండెను. రాణా వైష్ణవవేషధారియగు రాజకుమరుని గుర్తించెను. రాజకుమారునకు రాణాను గాంచినంతనే మితిలేని భయము గలిగెను. మీరా సాయములేక ఆతడు అంతఃపుర ప్రవేశమొనర్పలేడని రాణా గ్రహించెను. మీరాను ద్వేషించుచున్న రాణాకీకార్యము మరింత క్రోధమును బురికొల్పెను. నిష్ఠురభాషణ ములనాతడు మీరా నిట్లాజ్ఞాపించెను. "అంతఃపుర గుప్తద్వారము నాయాజ్ఞలేక తెరచినందులకు యీరాజ్యము వీడి పోవలసినది." ఇట్టి కఠోరవాక్కు నాలించియు మీరా యధీరగాలేదు. ఆమెకు రాజప్రాసాద మును రాజమార్గమును సమానములే! భర్తయాజ్ఞానుసారమున మీరా ఆ యుత్తరక్షణముననే రాజమహాలు వీడెను. చిత్తూరు ప్రజలకు మీరాయెడల భక్తిశ్రద్ధలు మెండు. మీరా వియోగముచే చిత్తూరు ఆనందరహితమైయుండెను. చిత్తూరు ప్రజలెల్లరు రాణాయెడ విముఖులైరి. ప్రజల

రీతి నారసి రాణా మీరా నారసి తీసికొని రావలసినదిగ నలుదిక్కులకు చారులనంపెను. మీరా వారిని గాంచి యిట్లనెను. "రాజాజ్ఞచే యింతదూరము వచ్చితిని. తిరిగి వారి యాజ్ఞాప్రకారమే చిత్తూరునకు వచ్చుచున్నాను." చారులతో గలసి మీరా చిత్తూరు ప్రవేశించెను. దయాహీనుడై రాణా యామె నితర రాజ్యముల కంపినను పతిదేవతగాన ఆమె యిసుమంతయు కోపగింపక చిత్తూరునకు వచ్చెను. ఇంతకు పూర్వ మామెకు రాజసుహాలునందు రణఛోడ్ దేవు నెదుట మాత్రమే భగవన్నుతిసేయుట కవకాశము కలిగెను. ఇప్పుడిచ్చవచ్చిన ప్రదేశమున భక్తులతోనేకమై హరిభజనసేయుట కవకాశ మేర్పడెను. మీరా భక్తిస్రోతస్సు చిత్తూరు రాజ్యమంతయు ప్రవహింపజొచ్చెను. పట్టణమందలి బాలురు, యువకులు, వృద్ధులు మీరా చేయు ధర్మకార్యములందామెకు సాయపడ సాగిరి. చిత్తూరుపట్టణమం దెచ్చట గాంచినను మీరా ధర్మకార్యప్రసక్తియే గానవచ్చుచుండెను. చిత్తూరుప్రజలను మీరా ధర్మస్వరూపులుగ నొనర్చెను. చిత్తూరుప్రజలెల్ల రామెను ధర్మస్వరూపిణిగ నెన్నుచుండిరి. మీరా సాధారణమానవులతో గలసి యుండుట గాంచి కొందరు దుర్మార్గు లామెను నిందింపసాగిరి. మీరా మధురగానము నాలకించి తన్మయులై యామె కుపహారముగ నాభరణముల నిచ్చిన వాటినన్నిటి నామె తనయిష్టదైవమగు రణఛోడ్ దేవునకు అలంకరించెడిది. ఆభరణస్వీకరణ విషయమైగూడ యవినీతిపరులు కొందర రామెను సంశయింపసాగిరి. ఈవార్త రాణాకర్ణముల బడినంతనే క్రుద్ధుడై నదీజలమం దామె శరీరత్యాగ మొనర్చు కొనవలసినదిగా నాజ్ఞాపించెను. మృతి నొందుటకు పూర్వ మామె యొకపరి భర్తను జూడగోరెను. కాని నిర్దయుడగు రాణా యామెకు దర్శన మీయలేదు. భర్తయాజ్ఞానుసార మామె జలపూర్ణమగు నొకానొకనదియందు ధైర్యముతో నురికెను. ఆహా! ఎంత ఆశ్చర్యము! నదీతరంగబాహువు లామెను తమలో నిముడ్చు కొనుటకు మారామెను కనుగందనీక యొకానొకతీరమునకు జేర్చివైచినవి. ఈ విధముగ జ్ఞానాధిక్యతచే మీరా కాలినడకను బృందావనమునకు పయనమాయెను. రాజపత్నియగు మీరా కాలినడకను బృందావనమునకు పయనమగుట గాంచి జను లచ్చెరువొందిరి. నిరంతరమును హరినామస్మరణ యందామె మగ్నయగుటచే మార్గశ్రమగాని ఆకలిదప్పులుగాని ఆమెను బాధింపనేరవాయెను. ఆమె యాగమనవార్త విని జను లెదురేగి తోడితెచ్చి యామెదర్శనమున పవిత్రుల మైతిమని సంతసించెడువారు. ప్రతిగ్రామవాసులును వేరొకగ్రామ మామె చేరువరకును వెంటనుండువారు. కొంద రామెతో గూడ బృందావనమునకు పయనమైరి. మీరా బృందావనయాత్రయంతయు భక్తిస్రోతస్సచే నిండిపోయెను. ఈ విధముగ ననేకవేలమంది యాత్రికులతో మీరా బృందావనము జేరెను. బృందావనమున శ్రీకృష్ణుని ధ్యానించుచు మీరా కొంతకాలముండెను. బృందావనమున మీరా యున్నకాలమున ననేకమంది భక్తు లీమెకు శిష్యులైరి.

రాణా ఈమె మహిమను విని తాను జేసినకార్యమునకు పశ్చాత్తాపముచెంది మీరా సామాన్యస్త్రీ గాదని తెలిసికొని, బృందావనమునకు స్వయముగ నేగి యామెను చిత్తూరునకు రావలసినదిగ కోరెను. మీరా మొదటినుండియు పత్యాజ్ఞానువర్తిని యగుటచే చిత్తూరున కాతనితో వచ్చెను. చిత్తూరునందు మాత్ర మామె విశేషకాల ముండజాలక తిరిగి బృందావనము ప్రవేశించెను. రాణాకోరికపై మీరా తఱచు చిత్తూరునకు వచ్చి పోవుచుండెడిది. మీరా యంతిమకాలము తీర్థయాత్రయందు గడపెను. ఆమె భగవద్ధ్యానము సేయుచు భక్త్యావేశముచే తఱచుమూర్ఛితురాలగుచుండెడిది. చివరకొకానొక దినమున మీరా హరిభజన సేయుచు మూర్ఛనొంది భగవంతుని యందైక్యమయ్యెను. చిత్తూరునందు—నేటికిని రణఛోడ్ దేవునికి వలెనే మీరాకును ఉత్సవాదులు జరుగుచున్నవి.

(భారతవిదుషీమణులనుండి)

# శారదలేఖలు

సౌభాగ్యవతియగు కల్పలతకు—

నెచ్చెలీ!

నీవు వ్రాసిన జాబుచూచితిని. అందు నీవు "ఇటీవల జరుగుచున్న ప్రతిసభలోను పురుషులకు గౌరవబిరుదు లొసంగుచు స్త్రీల కొక్కరికైన నీయక ఆంధ్రమహాజనులు స్త్రీలను చిన్నచూపు చూచుచున్నారు. చూచితివా? బిరుదు లందుకొనదగిన విదుషీరత్నము లాంధ్రస్త్రీలలో లేకనా? లేక స్త్రీలయెడగల నిరసనభావమా? ఏదిదీనికి కారణము? ఇప్పటి పురుషులకు స్త్రీలయందు గౌరవభావ మేర్పడుచున్నదని నీవు వాదింతువుగాని నేను నమ్మను." అని నీవు వ్రాసినవాక్యములు నాకెన్నిమారులు తలంచిన అన్నిమారు లత్యధికముగా నవ్వువచ్చుచున్నది. నీకుగూడ బిరుదులపిచ్చి యున్నదా యేమి? నంద్యాలసభలకు పూర్వ మొకపత్రికలో చదివితిని లెమ్ము. ఇంతకు పూర్వమిచ్చిన బిరుదులన్నియు బ్రాహ్మణులకే చెందినవి. ఈమారు బ్రాహ్మణేతరులకు గూడ నొక బిరుదు నిచ్చుటయావసరమని అందువ్రాయబడినది. అదిచూచి అర్హతానర్హతలను పరికింపవలసిన వాటికి బ్రాహ్మణబ్రాహ్మణేతరభేదములు తీయబడుచున్న వేమని విచారించితిని. ఇప్పుడు నీవు స్త్రీపురుషభేదములను గొనివచ్చితివి. బిరుదులపై మోహముగలవారు స్త్రీలలో గూడ నున్నారని నీయుత్తరముచూచి ఆశ్చర్యముతో ననుకొంటిని. కాని విచారించి చూడ నాఆశ్చర్యము పొరంబోతే, ఏలనందువా? ఈబిరుదులు మనదేశమునకు క్రొత్తలుగావు. రాజులకు, రాణులకు, మంత్రులకు, సేనాపతులకు, కవులకు, గాయకులకు, పండితులకు, మల్లులకు, శిల్పులకు—వేయేల ప్రజ్ఞాచణులైన వారి కెల్లరకు కడుదీర్ఘములైన బిరుదావళులున్నట్లు ప్రాచీన శిలాశాసనములు, గ్రంథములును చాటుచున్నవి. ముఖ్యముగా సుప్రసిద్ధులగు మనప్రాచీనకవివరేణ్యులలో బిరుదుపదములు లేనివారే లేరు. ఆదికవియైన నన్నయభట్టు వాగనుశాసనుడను బిరుదుపొందెను. ఆరణ్యపర్వశేషపూరణముగావించిన యెఱ్ఱనార్యునకు ప్రబంధపరమేశ్వరుడను బిరుదుగలదు. తక్కంగల

భారతమును రచియించిన తిక్కయజ్వ కవిబ్రహ్మయని వినుతి బొందెను. మనుచరిత్ర కావ్యకర్తయైన అల్లసాని పెద్దన ఆంధ్రకవితాపితామహుండను బిరుదమునందెను. రమణీయ మంజులకవిత కధినాధుండైన శ్రీనాధుండు కవిసార్వభౌముండను బిరుదును బడసెను. ఇక కృష్ణదేవరాయాది రాజేంద్రులకును, తిమ్మరుసు మున్నగు మంత్రిసత్తములకును, తదితర రాజకీయోద్యోగులకును గల బిరుదావళులకు లెక్కయేలేదు. ఇప్పటికిని మన దేశము నందలి సంస్థానాధిపతుల పేరులు చూచిన మనపూర్వులకు బిరుదావళులపై మోహ మెంతగా నుండెడిదో విశదమగును.

అలనాటినుండియు మనవారికి ఉండినబిరుదులపై వాంఛ నేడును మనవారిని వీడదుగదా! ఈబిరుదులు పలువిధములు. పాండిత్యమునకు మెచ్చి ఈయబడెడివి కొన్ని. ప్రజ్ఞకు సంతసించి యిచ్చెడివికొన్ని. ప్రజాసేవకు హర్షించి యొసంగెడివి కొన్ని. ప్రభుత్వసేవకు మెచ్చి యిచ్చెడివికొన్ని. ఈ బిరుదములను కొన్నిటిని ప్రజలొసంగుదురు. కొన్నిటినియే వేని విద్యాపీఠములో జాతీయసంస్థలో పరిషత్తులో యొసంగును.

మనదేశమందసహాయోద్యమము బయలువెడలిన తరువాత దేశీయులు బహిష్కరింప వలసిన వాటిలో ప్రభుత్వపు బిరుదములుగూడ నొకటిగా జేర్పబడినవి. అప్పటినుండి ప్రభుత్వబిరుదముల పలుకుబడి చాలవఱకు సన్నగిల్లినది. మఱియు వానిపై నొక విధముగు నిరసనభావము గూడ నేర్పడినది. నిరాకరణోద్యమము విస్తరించియున్న యాదినములలో పలువురు పూర్వదత్తబిరుదములను విసర్జించి ప్రజల పొగడ్తల బడసిరి. "బిరుదుపదవులను బురదలో దిగబడి" దేశమును దాస్యములో ముంచకుడని జాతీయాత్మగల కవులు గానముచేసిరి. ఈవిధముగా దొరతనపు సన్నదులపై మోహము జనులకు తొలగింపబడినను బిరుదులపై మోహము మాత్రము జనులకు పూర్తిగా వదల లేదు. దొరతనము వారి రావుసాహెబు; రావు, రాయ, దివాన్‌బహద్దూర్; సర్ యిత్యాది బిరుదులపైపోటీకి వచ్చినవో యనినట్లు దేశభక్త, దేశబంధు, దేశోద్ధారక మున్నగు బిరుదులు దేశసేవాపరాయణుల పూజ్యనామములకు తగిలించి పిలుచుట అసహాయోద్యమ కాలమునుండి పరిపాటిగానున్నది. దేశపూజ్యులైన వారికి నిండు ప్రేమతో ప్రజలొసంగెడి దేశభక్తాది బిరుదములు మాన్యములే యైనను వీని ఆధిక్యత యేమో నాకు గోచరించుటలేదు. మహాకవియైన రవీంద్రనాథటాగోరుగారికి సర్ బిరుద మీయబడి నప్పుడామహాపురుషు డనెనట, ఏమని? "సర్ రవీంద్రనాథటాగోరు అనుట

కంటె నాదేశీయులు 'రవిబాబు' అనుటయే నాకెక్కువ ప్రీతికరము" అని. కాన మహనీయులగు వారికి వారి నామాక్షరములే వేయి బిరుదులపెట్టు. ఎంత గొప్ప బిరుదమైన వారి నామాక్షరములతో జేరినప్పుడే గదా రాణించును? అయినను స్త్రీలకుగాని పురుషులకుగాని యీబిరుదులవలన గలుగబోయెడి ప్రయోజనమేమి? మునుపే గౌరవనీయులగు వారి కీబిరుదములువలన గౌరవ మినుమడింపఁబోదు. గౌరవహీనులగు వారి కీబిరుదులవలన గౌరవము కలుగను కలుగదు. మన ఆంధ్రమహాసభవారు గౌరవనీయులగు వారి కీగౌరవబిరుదము లీయ నారంభించినది, శ్రీ॥ శే॥ దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారికి ఆంధ్రరత్న బిరుద మొసంగుటతోనని జ్ఞాపకము. నాటినుండి యేటేట నొకరికో యిద్దరికో యీ బిరుదములు చదివింపుచునే యున్నారు. అన్నిటి కేమిగాని శ్రీకాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారికి దేశోద్ధారక బిరుద మీయఁబడినదని పత్రికలలో చదివినప్పుడు నిజముగా నాకు నవ్వొవచ్చినది. పత్రికల మూలకముగా, ఉపన్యాసముల మూలకముగా, వితరణఁమూలకముగా శ్రీపంతులుగారు దేశమునకు చేయుచున్న సేవ అమూల్యము. వారి సేవానిరతి అసదృశము, వారి దేశభక్తి యనుపమానము, వారి దానశీలత యసామాన్యము, వారి సౌజన్యకారుణ్యాదు లనన్యములు. సర్వతోముఖముగా ఆంధ్రప్రపంచమునకు వారు చేయుచున్న యుపకృతి పారములేనిది. అట్టి వారిని బిరుదులు లేకనే ఆంధ్రప్రపంచము గుర్తింపుచున్నది. పూజింపుచున్నది. గౌరవింపుచున్నది. ఇట్లు మునుపే ప్రజల మన్ననల చూరగొన్న యీమహనీయునకు మహాసభ "దేశోద్ధారక" బిరుద మొసంగుట సూర్యునకు దివిటీదానము చేసినట్లున్నది. ఇందువలన పంతులుగారికి ఇనుమడించెడి గౌరవములేదు. చేకూరెడి లాభములేదు. కాని అసాధారణమగు వారి దాతృత్వమునకు మహాసభవా రొకకొలమాన మేర్పఱిచి నట్లైనది. సర్వతోముఖమగు వారి కృషి కొకముఖ మేర్పరచినట్లైనది. అపరిమితమగు వారి దేశసేవకు పరిమితి నేర్పఱిచినట్లైనది. అంతియ దానిలాభము.

ఈ యేడాంధ్రమహాసభవారు నల్వురకు బిరుదములొసంగిరి. వారు నల్వురును యుత్తమోత్తమములైన యీసామర్థ్యచిహ్నములు పడయదగిన మహాపురుషులే యనుటకు సందియములేదు. కాని ఆ బిరుదులందుట వలన నామహనీయులకు ప్రయోజనము లేకపోగా ఆంధ్రమహాసభ వారీబిరుదు లొసంగు పద్ధతిని గమనించి మనదేశము

నంచు కప్పలు తిప్పలుగా జరుగుచుండెడి కులసభలును తదితరక్షుద్రసభలును చెలరేగి సాధారణులకెల్ల తలదెయొక బిరుదును నొసంగి ఈమహనీయుల గొప్పతనమును క్రిందు పఱచు నేమోనని భయమగుచున్నది. ఇప్పటికే కవి గాయక, నటక లోకమునన్నిట్టి బిరుదావళు లసంఖ్యాకముగా నుండుట సాధారణముగా జూచుచున్నాము. వారి కాబిరుదము లేసన్మానసభలోనైన నీయబడినవో లేక తమకుఁదామై తెచ్చుకొనినవో దైవమున కెఱుక. అయితే అట్టి బిరుదములను తగిలించుకొనుటచే వారి కార్థికముగా కొంతలాభ ముండవచ్చును. కాని దేశభక్త దేశోద్ధారకాది దేశసేవాపరాయణులకీ బిరుదములతో నేమి ప్రయోజనము? వారిదేశసేవయే వారికెనలేని సామర్థ్యచిహ్నము. మఱియు వయోవృద్ధులగు వారికిట్టి సన్మానములు సల్పుట కొంతకు గొంతలగ్గు. కాని చిఱుతప్రాయము వారికి బిరుదులిచ్చుట యోచనలేనిచేత. బౌద్ధవాఙ్మయబ్రహ్మ పిన్నవయస్కులని వింటిమి. బుద్ధపురాణము వారి గ్రంథములలో మొట్టమొదటిది. వారింకను పెక్కుయుద్గ్రంథముల రచియింపవచ్చును. అలవాటుపడినచేయి యూరకుండునా? చిఱుత వయస్సుననే బౌద్ధమతమును మథించిన యావిన్నాణి ఱేపు వేఱొక మతమునుగూర్చి యాంధ్రలోకమునకు విశదీకరింపవచ్చును. ఆ నాడాంధ్రమహాసభవారు ఆయామతముల వాఙ్మయబ్రహ్మయని మరల వేఱొక బిరుదమిత్తురా ? అట్లె విజయనగరసంగీతసారస్వతాది సభలవారుగూడ మఱల మఱికొందఱికి బిరుదులిచ్చిరి కాబోలు. అవి స్త్రీలకు లేవని నీకేల వంపోత? దీనివలన నారీలోకమునకు కలిగెడు లాభమేమి? స్త్రీలు విద్యావతులును, సుగుణవతులును, సేవాపరాయణులును నైనచో బిరుదులు లేకనే ప్రపంచము వారిని సన్మానించును. ప్రతిఫలరహితమైన ఉపకృతి, ప్రతిఫలరహితమైన వదాన్యత, యుత్తమోత్తమములు. మనుజులు కీర్తికాములగుటగూడ యొకలోపమే. కోరకయే మేఘుడు వర్షించినట్లు వేడకయే పవనుడు వీచినట్లు, ప్రార్థింపకయే సూర్యుడు వేడి వెల్గుల ప్రసాదించినట్లు జనులు స్వధర్మనిరతులు కావలెను. కృషికి ప్రతిఫలము గోరుట యుత్తమ గుణముకాజాలదు. ప్రతిఫలాకాంక్షలేని సేవాపరాయణులను లోకమే గుర్తించి మన్నించును. బాలగంగాధరతిలకునకు లోకమాన్య బిరుదము నేసభవా రొసంగిరి? మోహనదాసుకరంచందుగాంధికి మహాత్మ బిరుదమేసన్మానసభ యొసంగెను? కాన మహనీయులకు అల్పసంఖ్యాకుల కూటములు మాత్రమేయగు సభలలో బిరుదులు సమర్పింపబడ నక్కఱలేదు. అవి తమకుఁదామై వారిని జెందును.

ఏయుద్దేశముచేతనో మన ఆంధ్రదేశమునందలి సమావేశములు కొన్నివత్సరముల నుండి దేశములో పెద్ద పెద్దలకు సన్మానములొసంగుట సాగించినవి. ప్రమాదమో బుద్ధిపూర్వకమో అందు స్త్రీలుమాత్ర మింతవఱకు చేర లేదు. అందులకు నాకు సంతోషమే యగుచున్నది.

ఈబిరుదులపై పిచ్చి మనకే గాదు. నాగరక రాజ్యములని పేరొందిన పశ్చిమ ఖండములో గూడ యీబిరుదులపై వ్యామోహ మధికముగానే యున్నది. ఈబిరుదుల బడయుటకై వారు పలుపాట్లు పడుదురట. ఈ సందర్భమున నేటి బ్రిటిషుకార్మిక రాజ్యాంగమున మంత్రియై ప్రభుపదమును బడసిన సిడ్నీవెబ్బు దొర గారి యిల్లాలైన సిడ్నీ వెబ్బుసతి నిరీహ సంస్తవనీయముగా నున్నది. పెనిమిటి ప్రభువైనప్పు డామె ప్రభ్వీ కావలెనుగదా? కాని ఆమె యాపదముపై నేమాత్రము మోహము జూపక యిట్లనెనట—"ప్రజాహృదయమున మా ప్రతిష్ఠ సిడ్నీవెబ్బు అను నామముచేతనే ఆరూఢమై నెలకొన్నది. కావున కడకాలమువఱకు నేను ఆనామముచేతనే వ్యవహరింపబడుటకు ప్రియము పడుదును." కల్పలతా! ఆగష్టుమాసపు 'గృహలక్ష్మి'లో నే నీ వృత్తాంతమును జూచినప్పుడు పరమానందము జెంది నీ వ్యామోహత్త బాపుట కిది మంచిమందు అనుకొంటిని. సిడ్నీ వెబ్బుసతి నిర్లిప్తత మన ఆంధ్రమహిళామణుల కాదర్శకమగు గాక!

ఇట్లు మిత్రురాలు, శారద.

## భార్య

భార్యయుండిన వనమైనఁ బట్టణంబు
పత్నిలేకున్న గృహమైన బహుళగహన
మగుచుఁ గాన్పించు నరులకు; సంతయేల?
నాలు లేకున్న విధినైన నధముఁ డండ్రు.

యాగముల నయోగ్యుండగు;
భోగములకు బాహ్యుఁడౌ; సుపుత్రోదయలీ
లాగణ్యమైన భార్యా
యోగము లేకుంట నరుల కుచితంబగునే?

—శుకసప్తతి. పు. 146.

ఎంతదుఃఖమైన నింటికి వచ్చి యి
ల్లాలిమొగముఁ జూచినపుడె తలఁగు
నిది యెఱిఁగికాదె ఋషులువసిష్ఠాదు
లునుస భార్యలగుచువినుతిఁగనిరి?

అఖిలదుఃఖరోగార్తున కౌషధంబు
సురుచిరంబుగ భార్యయ చూవెఱుంగు
నొనర భార్యాసమేతుఁడై యున్నవాని
కెంత లాపద లయ్యును నెఱుకపడవు.

—భారతము. అరణ్యపర్వము.

# చూలాలు నడచుకొనవలసిన విధులు

వావిలికొలను పద్మాసనమ్మ గారు, బి. యె.

ఉదయముననే నిద్రలేచి నోటిని శుభ్రముగా ప్రక్షాళించి కడుగుకొని పండ్లు పరిశుద్ధముగా నుండునట్లు తోముకొనవలెను. పండ్లకు నొప్పి మొదలగు వ్యాధులువచ్చుటకద్దు. పండ్లకు వ్యాధికల్గినయెడల తినిన వస్తువులను జీర్ణించుకొనుటకు లోపముకల్గి అనేక వ్యాధులు సంభవించుటకు కారణమగును. కావున వెంటనే నొప్పిగల పండ్లను దంతచికిత్సచేయు వైద్యులకు చూపి పండ్లనొప్పిని ఉపశమించుకొను ప్రయత్నము చేయవలెను. తేలికగాను త్వరలో జీర్ణమగునట్టివిగాను దేహమునకు బలమిచ్చునట్టివిగాను ఉండు పదార్థములను మితముగా భుజించవలెను. పాలు త్రాగవలెను. కాఫీ,టీ మొదలగు తీవ్రపదార్థములను పుచ్చుకొనకూడదు. పడకనుండి లేవగానే స్వల్పముగా అన్నము రొట్టివంటి గట్టిపదార్థమును పుచ్చుకొని కొంచెముసేపు విశ్రామము తీసికొనినయెడల గర్భిణీస్త్రీలకు ఉదయమున సాధారణముగా కలుగు వమనము, వాంతి, ఓకిరింతలు, బైకిలు కలుగవు. గర్భమైన మొదటి నెలలోను కడపటను మలబద్ధమగుట సాధారణము. ఇది కలుగకుండ చూడవలెను. ఉదయమున నిద్దురనుండి లేవగానే ఒకపర్యాయమును రాత్రి పరుండబోవు సమయమున ఒకపర్యాయమును మంచినీళ్లు ధారాళముగా త్రాగుటమువల్లను భోజనకాలమందును అటు పిమ్మటను మితముగ మంచినీళ్లు త్రాగుచుండిన యెడలను మలబద్ధకము కలుగదు.

ముఖ్యముగా కడుపుప్రదేశమునకు బలమిచ్చునట్లు పరిశ్రమ దినము చేయుచుండవలెను. దేహమునకు కొలది ఆయాసము కలుగు వరకు పరిశ్రమ చేయవలెను. బలహీనమగు నంతటిపరిశ్రమ మాత్రము కూడదు. పరిశ్రమవల్ల దేహములోని మాలిన్యము చెమటమూలముగా వెళ్లగొట్టబడి దేహమునకు ఆరోగ్యము కలుగును.

ప్రతిదినమున ఉదయముననే స్నానము చేయవలెను. మనదేశములో పెద్దలకాలమునుండి వచ్చుచుండు ఆచారమగు ఒడలికి నూనె రాచి పసుపు పూసి స్నానము చేయుటను పూర్వాచారమని త్రోసివేయుటకంటె మూఢత్వము మఱియొకటి ఉండబోదు. ఒడలికి నూనె, పసుపు పూసి స్నానముచేయుటవలన దేహము పైచర్మమునకు ఒక విధమైన మెత్తదనముకలిగి ఆరోగ్యముగా నుండును.

గర్భిణిస్త్రీలకు కడుపు మొదలగు స్థలములందు చర్మము పగులుట సాధారణము. నూనెరాచి స్నానము చేయుచుండిన ఎడల ఇది కొంతవఱకు నెమ్మదించును. చర్మములో పగుళ్లుకలిగినయెడల వానిమార్గముగా అనేక వ్యాధిపురుగులు దేహమునందు ప్రవేశించుటకు హేతువగును. పసుపు అట్టివ్యాధి పురుగులను చంపివేయుగుణము కలది. కనుకనే మన ఋషులు దానిని వివాహమాడిన స్త్రీలు, గర్భిణిస్త్రీలు ముఖ్యముగా వాడవలెనని విధించియుండిరి.

సులభముగా జీర్ణమగు బలమునిచ్చు పదార్థములను మితముగా భుజింపవలెనని చెప్పియుంటినిగదా! ఆవకాయవంటి ఉష్ణకరపదార్థములు ఊరగాయలు తినరాదు. కావలసినంత మాత్రము భోజనముచేయవల

యునే గాని ఎక్కువగా తినరాదు. ఒకసారి భోజనముచేసిన వెనుక మరి నాలుగు గంటలు కాలము విరామము లేకుండ భోజనము చేయకూడదు. మాగిచెడిపోవని పండ్లు మంచి కూరగాయలు ప్రశస్తమైన ఆకుకూరలు మాత్రమే ఉపయోగింపవలెను. ఏదోవిధముగా పాలుకూడ పుచ్చుకొనుచుండవలెను.

మధ్యాహ్నకాలమున స్వల్పకాలము విశ్రాంతి, నిద్ర ఆవశ్యకము. ఇంటిలో ఏదో ఒకమూలనో చీకటిగదిలోనో గాక శుభ్రమైన గాలివచ్చు వసారాలోగాని తోటలోని చెట్టునీడనుకాని పరుండవలెను. సాయంకాలము వేళ కావలసియుంటె కొంచెము పాలుపుచ్చుకొనియో లేక స్వల్పాహారము పుచ్చుకొనియో కొంచము సేపు బయటగాలిలో తిరుగవలెను. మామూలుప్రకారము గృహకృత్యముల చేసికొనుచు కొంచెము బయటగాలిలో కూడ తిరుగుచుండినయెడల మలబద్ధము కలుగదు.

రాత్రిభోజనమునకు పాలుఅన్నమునో లేక ఇతరమైన తేలిక ఆహారమునో పుచ్చుకొని కొంతసేపు గాలిలో తిరిగి ఆపైన పరుండినయెడల నిద్రబాగుగా పట్టును. రాత్రిళ్లు నిద్రకు భంగముకలుగకుండ ఏడు గంటలకు తక్కువ కాకుండ నిద్రించవలెను. పడకగదులకు గవాక్షములు తెరచిపెట్టి గాలి ధారాళముగా లోనికి రానివ్వవలెను. శుభ్రమైనగాలి శరీరమందలి రక్తమును శుద్ధిచేయును, వృద్ధిపఱచును. అందువల్ల శరీరమునకు బలముకలిగి ఆరోగ్యము కలుగును.

ఇంటిని పెరటిని పెంట, చెత్తకుప్పలచే నిండించక శుభ్రముగా నుంచవలెను. పెంట, చెత్త వ్యాధికి కారణములు. తన ఆరోగ్యమునే గాక గర్భములోనుండు శిశువుయొక్క ఆరోగ్యమును కూడ కాపాడవలసిన విధి గర్భిణీస్త్రీకి ఏర్పడి యుంటచేమువల్ల ఆమెకు వ్యాధికలుగుటకు అవకాశములు ఉండకుండ ఎల్ల విధముల ప్రయత్నింపవలెను.

# హీనమైయున్న బ్రతుకేల మానినులకు?

మదిన సుభద్రమ్మ

కొంతుండు లేకున్నఁ గడుపేదయైయున్నఁ బుత్రులు బాలత బొందియున్న
మిత్రులు శత్రులై మేలెఱుంగకయున్న తిరిపె మేయూరను దొరకకున్న
దీనపోషకుండైన దేవరక్షామణి కనికరం బెదఁబూని కావకున్న
తనసహోదరులకు ధనధాన్యసంపదల్ కరము ప్రభుత్వంబు కలిగియున్న

భాతృగృహవాస మింతికి భవ్యమగునె?
వారి కుటిలవచశ్శరవ్రజము నాటి
బాధపడుకంటె దేహంబుఁ బాయుటొప్పు
హీనమైయున్న బ్రదుకేల మానినులకు?

# శ్రావణలక్ష్మి

శతావధానులు రామకృష్ణ సీతారామ సోదరకవులు

సకలశుభవాసరములకు జననసీమ
బాలికారత్నములకుఁ జుట్టాలసురభి
కాలమబ్బులకెల్ల విహారవనము
మత్తబర్హిణులకు నాట్యమందిరంబు
నగుచు శ్రావణమాసంబు సొగసునింపె;
నిరుపమానందకరములౌ నిస్వనముల
భావగీతంబులను నదుల్ బాడఁ దొడఁగె;
నభినవతృణాంకురములశయ్యాతలమునఁ
బండి భూసతి నూతనప్రసవవేద
నల ననుభవింప; బుధులు సుస్నాతులై ప్ర
భాతవేళ నరుణమంత్రపఠన సేయ;
జిలుఁగుపావడఁ గట్టి మంజీరమంజు
లారవము ముగ్ధజనుల మోహమున ముంప
దోరపుం బ్రేమ నూత్నవధూటి యుత్త
వారియిలుఁ జేర మెలమెల్ల పైనమయ్యె;
"అత్తవారింటికోడలవమ్మ! నయము
భయము గలిగి నాథునితృప్తిపఱుపుమమ్మ!
తల్లి! నీ వ్రతదివసముల్ దాఁటువెనుక
నాన్న యరుదెంచు లెమ్ము నా చిన్నకూన!

కనులనీరు నింపఁగరాదు కదలి వేగ
పోయిరావమ్మ!" యనితనపుత్రి నపుడు
పంపఁగాలేక జననిదా నంపుచుండె;
ఆరితూరక యున్న నీలాలకముల
వాలుజడ సల్లి, జిలుఁగుదువ్వలువఁగట్టి,
కేలఁబాత్రను గైసేసి; పూలతోఁట
కరిగె నొకకన్నె దావ్రత మాచరింప;
కరమునను వెండికుంకుమభరణి మెరయ
తరుణి, వలపులభరిణి, మందమగుకరణి
వెంటఁజెలులేఁగుదేర "మాయింటఁ జేరఁ
టమ్మ" నుచుఁబొట్టుఁ బెట్టి మోదమ్ముతోడఁ
బిలువఁదొడఁగెను ముత్తైదువుల నయాన;
ఏమినోములో? దేవతలెవరో? ఫలము
దేమొ? చేయఁగఁదగు విధులేమొ? సలుపఁ
జాలుదురో? లేదొ? కానియేబాలికలను
గన్నముత్తైదువులఁ జీరఁగడఁగి రపుడు;
"భామవారవ్రతంబు తప్పకమఱెన్ని
పనులుగల్గిన మీరు రావలయు" ననుచు
మాటిమాటికిఁ దేనియలూటలూరఁ
బిలచి రతివలఁ దొలికాఱు చెలియలెల్ల;
అప్పుడేపరిణయమైన యట్టియబల,
నిన్నమొన్న నీడేరిన కన్నెమిన్న,
చీరసింగారమెఱుఁగని చిగురుఁబోఁడి,
పావడాలింక విప్పని బాల, సొగసు
మాటలాడెడు ప్రౌఢవధూటి, మెల్ల
మెల్లఁగా వచ్చు పసిపిల్లతల్లి, పలిత
శీర్ష యగు నవ్వ, యత్యంతహర్షమునను

తోడివారలతోఁ గూడి వాడవాడ
లరసి ప్రాయంపు చేఁడియ లధికభక్తి
పసపుకుంకుమ కాటుక ఫలయుతముగ
విడెము సెనగలు కరము నందిడుచు "దేవి!
ఇస్తివాయన మియ్యదే ఇస్తివాయ
నం" బనుచుఁ బల్కఁ గృప నాశిషంబు లొసఁగి;
కర్ణపేయంబుగా భావగర్భితముగ
నెందుచింతలు మోసల నెత్తునటుల
నొకరి నొకరు జయించెద నుత్సుకతను
కేలఁ దాళంబు తట్టుచు బాలచూత
పల్లవగ్రాసపరభృతవల్లకీని
నాదసమకంఠమధురిమ మోద మొసఁగఁ
బాటలను బాడి తమపాలి పంటయనఁగ
వరలు శ్రావణమంగళవాసరముల
సంజవేళలఁ బురరమాసతులనంగ
సంచరించె సువాసినీసంఘ మపుడు.

* * * * *

# వైష్ణవయువతి

తిన్నసి సన్నని తిరుచూర్ణరేఖ
  తీరుగా సౌరుగా దిద్దిన మోము
మిన్నగా నున్నగా మెరుగార దువ్వి
మేలుగా వీలుగా మెలచిన కొప్పు

చిన్నారి పొన్నారి చెమరెత్తుచున్న
సిరిగిల్కు నెరిదళ్కు చెక్కుటద్దములు
వన్నెతో చిన్నతో వరుని మెప్పించు
వాసిగా దాసిగా వైష్ణవయువతి.

# శాంతి

## కంచి మంగళమ్మగారు

ఈ ప్రపంచమునందు శాంతమైన స్థలమెచ్చటనైన నున్నదేమోనని విచారించి చూచిన నెచ్చటను కానరాదు. ప్రతికుటుంబమునందును ఏదైననొక్క విచారము యేదైన నొకచింత యుండియే తీరును. భగవంతుని కృపావిశేషమువల్ల నూటికి ఒకటి రెండు కుటుంబములు సంతోషముగనుండిన నుండవచ్చును. అందులకు కారణము ఆకుటుంబమునందలి స్త్రీలు విద్యావతులై యుండుటయని తప్పక చెప్పవచ్చును. దయామయుడగు పరమేశ్వరుడు మనకెన్నియో సదుపాయములను కల్పించియుండగా మనమేల సంతోషముగ నుండరాదు? భుజించుటకు ధాన్యాదులును రుచికరములగు శాకాదులును మనకు భూదేవి ప్రేమతో నొసగుచున్నది. మధురములగు ఫలముల నొసగి వృక్షరాజము లాదరించుచున్నవి. నిర్మలజలముల నొసంగి నదులును చెరువులును ఉపచరించుచున్నవి. భూమియందు మొలచిన పచ్చికను మేసి ధేనువులు రుచికరములును ఆరోగ్యకరములునగు క్షీరముల నొసంగుచున్నవి. ప్రతియొక్కటిని ప్రత్యుపకారము నపేక్షింపకయే మనకు మేలుచేయుచున్నవి. అట్టియెడ మన మాజగదీశ్వరున కనంతకోటివందనము లర్పించుటకు మారు బుద్ధిపూర్వకముగ కష్టములను మనమే కల్పించుకొని ఆతనిని నిందించుచున్నాము. ఇందులకు కారణమేమి?

గృహచ్ఛిద్రములవల్ల గృహయజమానునికి శాంతిలేక పోవుచున్నది. గృహస్థుడు సకలవిద్యాపరిపూర్ణుడై యుండి సకల శ్రమలకోర్చి కష్టపడి ద్రవ్యము నార్జించి యిల్లాలి కందించును. గృహిణి విద్యావిహీన. ఆధనము నామె యెట్లువ్యయము చేయవలయునో యెరుగదు. మితవ్యయము కలలో కూడ తలంచియుండదు. ప్రతిమాసమును నగలకొరకో చీరలకొరకో ఆమె కొంతసొమ్మును వ్యయముచేయును. వాగ్భూషణమే సుభూషణమని ఆమె యెఱుగజాలదుకదా! ధనార్జనయొక్క కష్టము నామె యెట్లెరుంగును? ఒక కుటుంబమున యజమానునకు యిద్దరాడుబిడ్డలును యిద్దరు మొగబిడ్డలును యుండిరనుకొందము. తల్లి తనబిడ్డల సమముగనే పెంచును. తండ్రి సమానముగ ఆదరించును. కాని విద్యావిషయమున మాత్రము ఈ ప్రేమను వేరువేరు విధముల చూపుచున్నారు. ఇందుల కొకనిదర్శనము.

ఒక కుటుంబమున నొకయజమానునకు నల్గురు మొగబిడ్డలును ఒక యాడుబిడ్డయు నుండిరి. ఆ గృహస్థుడు హిందూధర్మశాస్త్రానుసారము బాలికకు పదయవయేటనే వివాహమొనరించెను. విధివశమున నాబాలిక విగతభర్తృక యయ్యెను. ఆమె తన తండ్రియింటనే యుండవలసివచ్చెను. కొన్నిదినముల తరువాత నాబాలిక తల్లినికూడ కోల్పోయెను. ఇక నాకుటుంబమున కాధారమామెయే యగుటవల్ల తండ్రి తన బిడ్డకు విద్యచెప్పింప నిచ్ఛగింపడాయెను. పాపమా యనాథబాలిక తన తమ్ములకొరకును తండ్రికొరకును తన జీవితమును వ్యర్థపఱచుకొని కాలక్షేప మొనరించుచుండెను. కాలమొక్కరీతి గడచునా? సహోదరులందరును విద్యావంతులై స్వంతముగ ధనార్జనచేయుచుండ తోడినారీమణులు విద్యావిశారదలై తమ విద్యాగౌరవములకు తగినరీతి ధనమార్జిం

పుచు స్వతంత్రజీవనము జేయుచుండ తాను అట్టి స్వతంత్ర జీవనము జేయుటకు శక్తిగాని యితర సదుపాయములనుగాని గానక విచారింపుచు తన దుస్థితిని తలచి కన్నుల నీరుబెట్టుచుండుటను చూచి సహోదరులుగాని తదితరులుగాని విచారించుటకు మారు ఆబాలికనే దూషించి ఈ కన్నీరు మా సంసారమునకు చేటు కలిగించును. ఈ యింట శాంతిలేదు. అని ఆమెనే నిందింపుచు, 'నీ వొక్కతెవే యీకష్టము ననుభవించుచున్నావా నీవలె యెందరో వున్నారు' అని హృదయశల్యములగు మాటలాడి ఆమె నొప్పించుచున్న ఆమెయెట్లు భరింపగలదు? అట్టియెడ నామె యెట్టిపని చేయుటకైనను వెనుదీయదు. ఆత్మగౌరవముగల స్త్రీలు యిట్టిసంసార విచారములందు భరింపరాని కష్టములు ననుభవించి తుదకు నిరాశజెంది తమ జీవితముల బలవంతముగ గోల్పోవుచున్నారు. అట్టితరి నాగృహమునందు శాంతి యెట్లుకలుగును? బాలురతోపాటు బాలికకూడ విద్యావతియైనచో తన దురదృష్టమున కామె చింతింప నవసరముండదు. ఒకకంటియందు వెన్నయు మరియొక కంటియందు సున్నమును, ఒకచేత అమృతమును మరియొక హస్తమునందు హాలాహలమును నుంచుకొనుయజమానిచే పరిపాలితమగుగృహమున శాంతియెట్లు గలుగును? తనస్వార్థపరత్వమునకై నోరెరుగని తమముద్దుబిడ్డను ఆజన్మదాస్యము నొనరించునట్లు చేయుట ధర్మమా? అన్నదమ్ములకై ఆమె పడినపాట్లును వెనుక వారు తలంచుట కష్టము. ఒకవేళవారు గౌరవించి ఆదరించినను స్వతంత్ర జీవితాభిలాషిణియగు నామెను తమకులగౌరవములకు తగురీతి నేదైనవొక యాధారమును జూపుట మంచిది కదా! కొందరు మహాత్ములు యిట్టిఅనాథల నుద్ధరించుటకు తగుపనుల గల్పించి వారలకు స్వతంత్ర జీవనోపాయమును గల్పించినను సంకుచిత హృదయులగు సహోదరులును తండ్రియు నందులకు ఇచ్చగింపకుందురు. అమ్మ పెట్టదు అడుగుకొని తిననివ్వదు అన్నట్లున్నది. తమ బిడ్డలకేదైన వ్యాధిగలిగినచో గ్రామదేవతకు మేకపోతును బలియిచ్చు తల్లివలె కుటుంబ సంరక్షణార్థమై నోరెరుగని బాలికలకాజన్మదాస్యమును గలిగించుచున్నారు. వారిని బలవంతముగ బలితీసికొనుచున్నారు. దైవవశాత్తున గల్గిన దుఃఖకారణమును మానవ ప్రయత్నమువల్ల తొలగించుటయో తగ్గించుటయో చేయుటకు ఎన్ని ఉపాయములు లేవు? అనాథయువతులను తగురీతి ఆదరించి స్వతంత్రజీవనము జేయు నుపాయమొనర్చినగాని మనగృహములందు శాంతి నెలకొనదు. దేశమునకు మోక్షముకలుగదు. స్త్రీపురుషులు సమానవిద్యాస్వాతంత్రత గల వారైరేని వారిగృహము స్వర్గతుల్యమై సౌఖ్యప్రదమై విరాజిల్లును. అదియేశాంతి సదనము. అగ్గృహమునందు పరమేశ్వరుడు ఎల్లప్పుడును సుఖసంతోషముల నొసంగుచుండును. అనాథ స్త్రీజనాలాపములు విని వారిని సంరక్షించుటయన్న భగవంతునికి మిగుల సంతోషము. పక్షులు మృగములు మొదలైనవి తిను తమ ఆహారములను తాము సంపాదించుకొనుచున్నవి. అన్ని అవయవములు దృఢముగనుండి సూక్ష్మబుద్ధి చాతుర్యములను గల యువతీమణులు మాత్రము తమ ఆహారమును తామేల సంపాదించుకొననీయరాదు? వారల కట్టి స్వాతంత్రము సహోదరులేల యీయరాదు? ఇచ్చితీరుట మంచిది. సహోదరులారా! మీమీసోదరీమణులకు తగురీతి విద్యాస్వాతంత్ర్యముల నిచ్చి యాదరించినగాని మీగృహములకు శాంతి గలుగదు. స్త్రీపురుషులు సమముగ కష్టపడిన సంసార సుఖమునకు ఎంతయో దోహదమగునుగదా? ఎవరిజీవితము మనదేశమున నొకగొప్ప సమస్యగానున్నదో అట్టి అనాథలను వారికిగల చింతలమాన్పి వారిని తమ కార్యములందు నియుక్తలై యుండునట్లు చేయుచో గృహకలహములనునవి కుందేటికొమ్ములగును. గృహస్థులకు శాంతిగలుగును. అతనిగృహము శాంతిదేవతానికేతన మనబడును. అట్టి సుదినములు హిందూదేశమున కెన్నడు వచ్చునో?

మద్రాసు ప్రాంతములలో జరుగు శుభాశుభ ప్రయోజనములకు, దైవారాధనలందు యీ కస్తూరిపట్టెలను విరివిగ వాడెదరు. చుట్టుప్రక్కలనుండి యీ పూలు చాపచుట్టలలో జాగ్రత్తగ భద్రము చేయబడి మద్రాసు నగరమునకు రైళ్లలో విశేషముగ దిగుచుండును. స్త్రీలు యీ పువ్వులతో శిరోజములను అలంకరించుకొనెదరు.

పచ్చగన్నేరును దేశమంతటను కంచలలోను దొడ్లలోను విశేషముగ చూడవచ్చును. ఈచెట్టుకు కాయలుండుటచే ఆకాయలుపండి నేలరాలిన అవన్నియు మొక్కలు మొలచి చెట్లగును. ఈచెట్టుకాయలు ఆకుపచ్చగనుండి పండిన నలుపుగామారును. చెట్టు కస్తూరి పట్టెల చెట్టకంటె పెద్దదగును, ఆకుసన్నగ పొడవుగ యీనెలవతుగ నుండును. పూలు బంగారువర్ణము గలిగి బూరుగ ఆకారముతో నుండును. ఈ పుష్పములను స్త్రీలు ధరించుటలేదుగాని దైవారాధనకు ఉపయోగించెదరు. ఈపువ్వులను డబ్బిచ్చి యెవరు కొనరు.

పైన తెలుపబడిన గన్నేరు బేధములేకాక కృష్ణవర్ణముగల పుష్పములను ఫలించు గన్నేరు బేధమున్నదని శాస్త్రమునందు యీక్రింది శ్లోకమువలన తెలియుచున్నది.

"కృష్ణస్తు కృష్ణకుసుమశ్చతుర్విధోయంగుణైస్తుల్యః"

—రాజనిఘంటుః

కాని అట్టి రకము ఇప్పుడెచ్చటను కానరాకున్నది.

ఈపైబేధములన్నియు ఒకజాతికిచేరిన వగుటచే సమానగుణములను గలిగియున్నవి. గన్నేరునకు సంస్కృతమున కరవీర, హయమారక, చండాతక, అశ్వఘాతక అనియు; హిందీయందు కనెర్, కారబీర అనియు; అరవమునందు అలరి అనియు; కన్నడమునందు కనగిలు, ఘడ్డాల్ అనియు నామములు.

## వైద్యవిషయము.

సాధారణగుణములు:—గన్నేరు, ఎఱ్ఱగన్నేరు ఇవి నేత్రరోగము, వాపు, కుష్ఠువ్రణము వీటిని బోగొట్టును. కించిదుష్ణము జేయును. నులిపురుగులు దురద వీటిని హరింపజేయును. భక్షించిన విషతుల్యముగ నుండును.

—సర్వౌషధగుణ కల్పకము

వేరు:—దీనివేరు నేతిలోగాని నూనెలోగాని ఉడికించినది కాని వేరుగంధముగాని నూరినదిగాని పైనపూయుట వలన కఠినమగు కుష్ఠులు, దురదలు చర్మముపైన

పొలుసులువలె అవడము, దద్దుర్లు, పొక్కులు, జంతువిషము, కంటిమీద చీరపేలు, పురుగులు, బొట్టుపెట్టుకొనుచోట పుట్టెడు దురద, పుండు, గజ్జి, చిడుము మొదలగు చర్మరోగములు వీనిని బోగొట్టును.

వేరును నేతిలో వేయించి ఆనెయ్యి లింగమునకు బూసిన వీర్యస్తంభన, లింగమునకు బలముకల్గును.

వేరురసమును కండ్లలో వేసిన కండ్లవెంట నీరుకారు నేత్రరోగము మానును.

అర్శసు వల్మీకము వ్రణము కుష్ఠము వీటియందు కరవీరమూలమును నీటితో నూరి బహిర్లేపమును చేయుటుపయోగకరము.

ఆదివారమున గన్నేరు మూలమును గ్రహించి జ్వరముచే బాధపడు మనుజునికి చెవియందు కట్టిన జ్వరవిముక్తుడగును.

తేళ్లు పాములు వీటివిషమున ముఖ్యముగ 'స్పర్శ' అనుసర్పవిషమున దీని కల్కలేపము ముఖ్యము.

తలనొప్పియందు గన్నేరు మూలచూర్ణమును మాడున రుద్దిన నొప్పి నయమగును.

ఉపదంశమున సాధారణముగ కలుగు వేదనాయుక్తలింగోత్థానమునకు కరవీర పిష్టమును వాడనగును. గర్భస్రావమునకు దీని నుపయోగించునట్లు Criminal Records తెల్పుచున్నది.

పట్ట:— Cinchona అను ఓషధికి బదులు ఈపట్ట వాడతగియున్నను దీని ఉపయోగమువలన అపాయము కల్గవచ్చును. పరిమాణమునకు జాస్తి అయిన వాంతిని యింకను జాస్తి విషసేవనచే కల్గు గుణములను కల్గించును.

ఆకులు:—కషాయము వెచ్చనిది పైన పోయుటవలన వాపులు హరించును.

ఆకుస్వరసమును సర్పాదులచే దష్టుడైనవానికి స్వల్పముగ యివ్వబడుచున్నది. ఒకవేళ స్వరసము జాస్తి అయిన ఘృతము సేవింపజేయునది.

పుష్పములు:—తెల్లగన్నేరు పుష్పములను ఎండబెట్టి చూర్ణించి సమముగ పొగాకు చూర్ణము, స్వల్పముగ పలకుల చూర్ణము కలిపి పాముచేకరవబడిన వారిచే నస్యము చేయించిన విషము విరుగును.

ఈ పుష్ప ధారణమువలన తలదురద రక్తదోషమును హరించును. తలవెంట్రుకలకు బలమిచ్చును. పేనుకొరకడమును మొదలగు దోషములను బోనణచును.

పాలు:—గాఢ విరేచనములు చేయును. విషతుల్యము.

గింజలు లేక కాయలు :—పశువులను జంపుటకుగాను నుపయోగపఱుపబడు చున్నవి.

దీని వేరుచెక్క లేక ఆకు నూరికట్టిన గడ్డలు, కంతులు, తామర హరించును.

ఆకులను ఉపదంశమున వ్రణక్షాలమునం దుపయోగించనగునని సుశ్రుతుఁడు, వాత కఫములచే జనించిన అశ్మరియందు గన్నేరుక్షారముపయోగించనగునని డల్హణుఁడును (ఈ క్షారమును సేవించునప్పుడు మధురసవిశిష్టమగు, క్షీరఘృతయుక్తమగు ఆహారమును రోగిచే సేవింప చేయవలయును) నేత్ర రోగమున (నేత్ర కోపమున) కరవీర ముపయోగించ నగునని చక్రదత్తుడును, కుష్ఠపలితరోగములయందు గన్నేరు మూలమును వాడుటచే ఆరోగ్యము కల్గునని చరకుడును తమ తమ సంహితలయందు తెల్పియున్నారు.

వ్రణనివారణమునకు గన్నేరు చిత్రమూలములు, పాముకు గన్నేరు మూలముచే తయారుచేయబడిన తైలము ముఖ్యమైనదని శాస్త్రములయందు వ్రణశోధ కుష్ఠచికిత్సల యందు చెప్పబడియున్నది.

విషచిహ్నములు:—విరుగుడు—దీని విషచిహ్నములు నరముల బలహీనత నాడి కనుపడకుండుట కల్గును. దీనికి విరుగుడు నీళ్లతో నూరి తీసిన కరక్కాయలరసము లేక కషాయము.

## చందాదారులకు మనవి

'గృహలక్ష్మి'కి చందా పూర్తియగుట కొకనెలకుముందే, చందాధన మును పంపమనియు, పత్రిక అవసరములేనిచో తెలియబఱచియు మాకు సహా యము జేయకోరుచుందుము. కొందఱూఱకయుండి, వి. పి. పంపగనే త్రిప్పి వేయుటగాక అందువలన మాకు పోస్టేజి నష్టములను కల్గించుచున్నారు. పత్రిక అక్కర లేనివారు, మున్ముందుగ మాకు దెల్పుదురుగాక యనికోరెదను.

—సంపాదకుఁడు

# ఆస్ట్రిడ్ యువరాణి.

న్యాపతి కృష్ణారావు గారు. బి. యె. బి. యల్.

ఆస్ట్రిడ్ యువరాణి యుత్సాహమును పురికొల్పు సమకాలికురాలు. ఒక శతాబ్దమునుండియు యుద్ధమే యెరుగని దేశమున జనించియు నామె పాణిగ్రహణమువలన రణవిప్లవములనుండి సంస్కారము చెందుచున్న దేశమగు బెల్జియమునకు యువరాణి యయ్యెను. సుఖప్రదమగు స్వదేశజీవితమును వదలి కష్టమగు జీవితము ననుభవించుటకు నామె తన మనసును లోబరచుకొని సర్దుకొనుట కవసరముకలిగెను.

ఆమె శైశవమంతయు స్వీడనులోనె తనఅక్కయగు మార్థాతో గడపెను. వారిద్వరకును చిరత కొకటి నాటినుండియు మోహనంబైన స్వాతంత్ర్యగుణము కలదు. ఆస్ట్రిడ్ పసితనముననే తనదేశపు జనులతో గలసిమెలసి తిరుగు అభిలాష కనుపఱచెను. రేవుస్థానములకడకేగి ఓడలు సరకులను దిగుమతి సేయుటయు, మరల వర్తకమునకై సామగ్రి నెక్కించుకొనుటయు చూచి ఆమె మిగుల నానందించుచువచ్చెను.

చిన్ననాటనుండియు ఆమె మనసు వింతవింతరంగులదెస ఎక్కువగా నాకర్షింపబడుచుండెను. ఒక ప్రత్యూషమున రాచనగరములో నామె కనుపడలేదు. అట జూలై నెల అగుటచేసి ఆయూరు పుష్పశోభితమై కన్నులపండువుగానుండెను. నౌకరులందరు నామెను వెదుక నారంభించిరి. ఒకగంట ఆయిన తరువాత పూల బజారువద్ద దాది ఆమెను జూచి కోపగించెను. అంతనామె ఎఱ్ఱని పూలవైపు చూపించుచు "అవియెంతయో ముద్దులు గురిపించుచుండ నేనిచ్చటికి రాక యెట్లుండగలను?" అని జిలిబిలి పల్కుల చెప్పెను.

ఉపాధ్యాయిని ఒకనాడు ఆస్ట్రిడ్నుగూర్చి ఆమె తల్లితో నిట్లు చెప్పెను. "అమ్మా! మీబాలిక యీనడుమ సరిగ చదువుటలేదు. ఎల్లప్పుడు పాకగృహములోనికేగి అచటపాకశాస్త్రమభ్యసించుచున్నది. ఇట్టి బాలికకు చదువువచ్చునా?" ఆస్ట్రిడ్ జనని తెలివికలది. తన కొమార్తె వంటయింటిలోనికి బోవుట చూచి ఆస్ట్రిడ్నకు పాకశాస్త్రము నేర్చుకొనవలెనని యభిలాష కలదని యెఱింగి ఆస్ట్రిడ్నకు పాకశాస్త్ర మందలి పాఠములను చెప్ప నియమించెను. ఆస్ట్రిడ్ ఆనందమునకు మేరలేదు. వంటయింటిలో పనులను చేయుచు పచనపదార్థములకు తగినపాళ్లు న్యాయాధికారివలె పరీక్షించుటను చూచుట యెవ్వరికైనను ముచ్చట గొలుపకమానదు. ఈనాడామె పాకశాస్త్రమునందు ప్రవీణురాలై వెలయుచున్నది.

స్వీడను దేశమున విద్యకు ఎక్కువగ గౌరవముకలదు. ఆస్ట్రిడ్ నవీనపద్ధతులందు విద్యగ్రహించి స్వీడను బాలికలతో సరిసమానముగ నుండెను. పాఠములన్నియు అతిజాగరూకతతో భయభక్తులతో జదువుచు మెప్పునుబడసెను.

వారి నగరముచుట్టును మెండుగ నావరించిన మంచుగడ్డలపై ఆమెయు, ఆమెసోదరియు, ఉపాధ్యాయినియు స్కేటింగు అను క్రీడాకాలక్షేపము చేయుచుండిరి. చిన్నతనమునందే స్కేటింగునందు ఆస్ట్రిడ్ చాలకుశలత కనుపరచెనని వినదుము. క్రమముగ పెద్దయైన పిదప ఆమె ఈ అభ్యాసమును పెంపొందించి స్కేటు చేయునపుడు ఒక గంటకు నలుబది మైళ్ల వేగమున గూడ పోవుచుండెడిది.

వేసవికాలములో అక్కచెల్లెండ్రిద్దరును టెన్నిసు, గోల్ఫు ఆటలను ఆడుచుండిరి. ఆస్ట్రిడ్ ఈత యనిన చెవికోసికొనును. బలాఢ్యునివలె యీదుటయు, నీటమునిగి అపాయము లేకుండ యీదుటయు ఆమెకు పరిచితములు. సాధారణముగ జూలై నెలలో వారినగరము చుట్టునున్న ద్వీపములకడకు నీదుచు బోయి ఒకదినమంతయు సచిహ్యాంభ్యంతరాంబువుల కాలము పుచ్చుటకలదు.

జీవితార్థము సుఖానుభవమే యనెడు లోకోక్తి స్వీడను జనులపట్ల హెచ్చుగ గోచరమగును. ఆస్ట్రిడ్ యీలోకోక్తిని ఆమూలాగ్రముగ ఆచరణలోనికి తెచ్చుటలో పేరువడసెను. ఎల్లరును అచ్చెరువందునటుల నామెచిన్నతనమందె చాలజ్ఞానము సంపాదించుటచే జీవితార్థము సుఖానుభవమనెడి యుక్తి ఆమె అంతరింద్రియములచే గూడ ఆనందింపబడెను. జాతీయసంస్థలందు చాల ఉత్సాహముతో బనిచేయుచుండె నీమె. దేశీయ ప్రజలతో నెల్లపుడును కలసిమెలసి తిరుగుచు వారి యాత్రలందు తాను పాల్గొనుచు, పుణ్యక్షేత్రములకు బోయి ప్రజలకు దర్శనమిచ్చి వారితో సరసమానురాలుగ సంభాషించి వారి ప్రేమను పొందుచుండెను. స్వీడను గ్రామములందు ప్రతియింటి ద్వారబంధమును తెల్లని పూవులతో నలంకరించుట ఆచారమయ్యెను. ఒకప్పుడు ఆస్ట్రిడ్ ఎండకాలమున ఒక గ్రామమునకు వచ్చియుండెను. గ్రామపు వీధిని బోవుచు ఆమె ఒక గృహమునందు అలంకారములు లేమినిచూచెను. ఒక వృద్ధురాలు కంట తడిపెట్టుకొని ద్వారబంధము యొద్ద ఆస్ట్రిడ్ కంటబడెను. ''ఏమది'' యని ఆస్ట్రిడ్ మృదులముగబల్కెను. ''నే నీపుష్పముల నలంకరింప లేకుంటిని. ముసలిదానను'' అని ఉత్తరమువచ్చెను. ''నే శృంగారించెద''ననుచు పుష్పముల ద్వారమున కలంకరించెను.

రణోత్పాత భీతి తాకనట్టి దేశములలో స్వీడనొకటి. అందున అచటి జనులు వారి స్వాతంత్ర్య బుద్ధియు ఉన్నతాశయములును నిలుపుకొనిరి. అచట ఆస్థానమున కుటిల ప్రవర్తన లొక్కటేనియు కానము. తత్కారణమున ఆస్ట్రిడ్ స్వేచ్ఛమైనట్టి జీవితము కళంకములేకుండ తన వివాహపూర్వము అనుభవింపకలిగెను.

రాచకన్య లెవ్వరును ఆస్ట్రిడ్‌నకు స్వేచ్ఛవలన కలిగిన ఆనందము నెరుగరు—వనములందు ఉపాధ్యాయినితో గడపిన సంతోషమయమయిన జీవితము, సోదరీమణితో గడపిన స్కేటింగు వేళలు—ఇవన్నియు ఆమెకు స్వేచ్ఛ జీవానురాగము నొడగూర్చెను. ఆమె గడపిన జీవితము నిర్మలము, సుందరము, శాంతియుతము, ఆరోగ్యకరము. ఎల్లపుడు దేశీయ వస్త్రధారణము మాతృదేశమునకొక బహిఃప్రాణమని ఆమె తలంచెను.

ఆమె గృహజీవితముగూడ ఆదర్శకప్రాయమైనదియె. ఇంట ప్రజల గౌరవమును బడయు నొక వ్యవహారమలవడెను. భోజన సమయమున నీమె చిన్నతనమున తల్లియొద్దకుబోయి ''అమ్మా కడుపునిండ భోజనమిడితివి వందనముల''ని తల్లివలన అంగీకార పూర్వకముగ నొక చుంబనము గొనుచు వచ్చెను. ఇట్లనే జనకుని చెంగటను జరుగుచుండెను,

స్వీడను కన్యలు వివాహపూర్వము పాకశాస్త్రమును దాది కార్యములను బాగుగ నేర్చుకొనుటగలదు. ఆస్ట్రిడ్ కూడ అట్లనే కావించెను. శిశుసంరక్షణ మున్నగునవి ఆమె తేటతెల్లముగ నభ్యసించెను.

వైద్యశాలలో నొక చంటి బిడ్డను జూడ ఆమెకు ప్రీతికల్గెను. అది చంటిబిడ్డయైనను ఈమె చికిత్స చేయుటకు వచ్చినచో, ఆమెరాచకన్యయని తెలిసిన దానివలెనె ఆమెపై తేరిపారచూచుచుండెను. ఒక నాడు ఆచంటిబిడ్డ అన్నయైన ఒకబాలుడు బిడ్డతోనేతెంచెను. చంటి బిడ్డ సంరక్షింపబడుచుండగ వాడు ఆస్ట్రిడ్‌ను రెప్పవాల్పక చూచెను. ఆమెతో మాట్లాడుటకు సిగ్గుచెందెను. కాని అనాటినుండియు ఆ చంటి బిడ్డ ఆరోగ్యముబడయు, దనుక ప్రతిదినమును వాడొక పుష్పగుచ్ఛమును ఆమెకు లజ్జతో నందిచ్చెడివాడు. ఒకమాటయైన పల్కెడివాడు కాడు. ఆస్ట్రిడ్ సంతోషించినదై ఆచిన్నవానిని తలపునకు తెచ్చుకొనినపుడెల్ల మందహాసముతో చిందులుద్రొక్కుచుండెను.

వేరొకనాడు ఒకతె ఎంత ఊరడించినను ఏడ్పుమానని చంటిబిడ్డ నెత్తుకొని వైద్యశాల మధ్యకువచ్చెను. ఆతల్లి స్వీడను దేశపుటాచార కారణమున తన బిడ్డను ఒక శాలువలో చుట్టపెట్టి చేతులలో గట్టిగ పట్టి యుండెను.

"ఇట్టిట్టు నాట్యమాడించవలెను గాబోలు" లనుచు నాబిడ్డ నెత్తుకొని గదిచుట్టును ఆస్ట్రిడ్ తిరిగి ఆడించెను. చంటిబిడ్డ గిరగిరమని త్రిప్పుటచూచి కాళ్లుచేతులు పైకెత్తున్నచు నవ్వుచు స్వేచ్ఛను బొంది యూరడిల్లెను. "నేను చెప్పలేదా" అనుచు ఆమె తల్లిచేతికి బిడ్డను ఇచ్చెను.

నేత పరిశ్రమయనినగూడ ఆమెకు నుత్సాహము గొల్పును. వస్త్రములందు వర్ణద్వితీయమును చూచి యేనాటిలో అది తయారుకాబడినదో ఆమె గురుతుపట్టి తప్పక చెప్పగలదు. నూతన కర్మాగారపరిస్థితులకు నేత పరిశ్రమ యెటుల సరుకుబాటుకొనవలనో ఆమె యోచించుచువచ్చెను. అందమైన వస్తువు లెటులుప యోగింపవచ్చునని గూడ తలచి వస్తువునకు సౌందర్యము, ఉపయోగముకూడ కలసి వచ్చునట్టి సంస్థలకు నామె ప్రేరణయే కేలూతగి నుండెను.

ఆస్ట్రిడ్ నవయౌవనవంతురాలు. దుస్తులందు కలుగు మార్పులామెను ప్రతిదినము నాకర్షించుచున్నవి. నవీనమార్పులతో దుస్తులను ధరించి మోహనముగ నాట్యము సేయును. నవీనురాలుగ నుండుటకతన దేశ జనులు ఆమె నెక్కుడు ప్రేమతో జూతురు.

అట్టికన్య జనించుట స్వీడను భాగ్యకారణమే. ఎల్లవిషయములను పరిశీలించి చూచినచో హైందవ సాంప్రదాయములెన్నియొ స్వీడనున గలవని తెలియనగును. సీత, సావిత్రి, దమయంతి మున్నగు హైందవ సాధ్వీమణులెల్లరును ఆస్ట్రిడ్‌ను చూడగనె స్మృతి పథమునకు వత్తురు. ఆధునికురాలై, జాతీయ సంప్రదాయముల మనస్ఫూర్తిగ ననుసరించి, ప్రజలప్రేమకు పాత్రురాలై, జాతీయవిద్య, స్త్రీకి వలసిన విద్య గ్రహించి, దేశీయవస్త్రములనె మక్కువతో నభిమానముతో ధరించి మాతాపితల నానందపెట్టుచు తుదకు బెల్జియము రాజ్య గృహలక్ష్మియగుట బెల్జియమెన్నినోములు నోచిన ఫలమోగదా!

—ఎవిలిను గ్రాహము జూలై మాసపుపియర్సను మాగజినులో వ్రాసిన దాని కిది అనువాదము.

# గోమిని

విద్వాన్ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు

కంచియందు మిక్కిలి ధనసంపన్నుఁడగు నొక కోమటివాఁడుండెను. అతనిపేరు శక్తికుమారుఁడు. ఆసెట్టిపట్టి తనకుఁబదునెనిమిది సంవత్సరములు రాఁగా మనస్సు నందిట్లనుకొనెను. "భార్యలేని మగవానికి సుఖమనునదిసున్న. భార్యయుండిన నామె గుణహీనురాలై భర్తను లక్ష్యము సేయనిదియైయుండిన పక్షమున నంతకంటె వేఱు యమబాధయునుండఁబోదు. అందుచేత నే నీతరుణమునందు గుణవంతురాలైన భార్యను బెండ్లాడుటకై తగిన యుపాయ మాలోచింపవలసియున్నది. ఏయుపాయముచేత నాకు సమస్తవిధముల ననుకూలవతియగు ధర్మపత్ని లభింపఁగలదు?"

ఇట్లావణిక్పుత్రుండు చింతిల్లుచుండఁగాఁ గొన్నిదినములు గడచెను. అత్తఱి వాని బంధువులు గొందఱు తమబాలికలను వీనిసమక్షమునకుఁ గొనివచ్చి "అయ్యా! మా కన్యను నీకిచ్చి పరిణయము సేయవలయునని తలంచుకొనియున్నారము. కావున మా ప్రార్థనమును వృథాపుచ్చకు" మని వారెంత ప్రార్థించినను వాఁడాచుట్టముల కన్యకలను బాణిగ్రహణముచేసికొనుట కంగీకరింపఁడాయెను. దానంజేసి వాని బంధువులెల్లరు తమ కన్నియలను దమయిండ్లకుఁ గొంపోవుచుండెడివారు. అనంతర మావణిక్పుత్రుండు నక్షత్ర శాస్త్రజ్ఞుండనని పేరుపెట్టుకొని యొకకుంచెడు శాలిధాన్యము నొక వస్త్రమున మూట గట్టుకొని యామూటఁ జేతఁబట్టుకొని దేశాటనము సేయ బయలువెడలె.

అతఁడు దేశాటనము సేయుతఱిని మార్గమధ్యమునందు స్వజాతివారు గొందఱు తమ తమ కన్యకల నీతనివద్దకుఁ దీసికొనివచ్చి "అయ్యా! మీరు గణితశాస్త్రజ్ఞులరని జనులాడుకొను మాటల నాలకించియున్నారము. కావున మీరు మాయందనుగ్రహించి మా బాలికలయందుండు శుభలక్షణములను దెల్పుఁడు" అనగా వాఁడు వారిహస్తములను జాతకములనుగాంచి యాయాకన్యలయందుండు శుభాశుభలక్షణములను వారలకుఁ దెలియఁ జేయుచుండెడివాఁడు. ఆకన్యారత్నములలో స్వజాతియందుఁ బుట్టిన దెవ్వతెయేని మంచి లక్షణములతోఁ గూడియుండినచో నాకన్యకంగాంచి యాతఁడిట్లనుచుండెడివాఁడు.

"బాలికా! నేను నీకీసమయమునందుఁ గుంచెడు శాలిధాన్యము నొసంగెద. నీ వాకుంచెడు ధాన్యముఁదీసికొని నాకుఁదృప్తియగునట్లుగా నన్నము మొదలగు వానిని వండి పెట్టఁగలవా?" యని యడుగుచుండెడివాఁడట. ఆమాటల నాలకించి యాకన్యక పక పక నవ్వుచు 'నాశక్యముగా'దని బదులు సెప్పి వానికడనుండి వేఱొక చోటికిఁ బోవుచుండెడిదట. ఈరీతిగ నాతఁడు ప్రత్యహము నెందఱనో కన్యకల నడుగుచుండెడివాఁడు. కాని వానిమనోరథము సిద్ధింపదాయె.

ఇబ్బంగి వాఁడు నానాదేశములఁ దిరిగి తిరిగి కొన్నిదినములకు శిబిదేశములోఁ గావేరీనదీ ప్రాంతమందున్న యొక నగరముఁ జేరెను. ఆ పట్టణమునందుఁ దల్లిదండ్రులు లేమింజేసి మిగులదీనురాలగు నొక కన్యక యాతని కంటఁబడెను. ఆపెం జూచినతోడనే వాఁడిట్లనుకొనెను. "ఈబాలారత్నము తినుట కన్నమును గట్టవస్త్రమును లేమింజేసి దీను రాలైన పగిది గన్పట్టుచున్నది. కాని యీబాలామణి ముఖవైఖరి యవయవముల పొంకము నెంతయు శుభలక్షణసూచకములై యొప్పుచున్నవి. కావున నీమెను బరి ణయమాడుటకై యనురూపమగు ప్రయత్నము గావించెద. ఆపెయు నన్ను పాణిగ్రహ ణము చేసికొనుట కంగీకరించిన పక్షమున నెంతయు మేలగు" నని యాబాలికను సమీ పించి యాసెట్టిపట్టి యల్లన నిట్లనియె. "ఓకన్యకామణీ! నీశరీరసౌందర్యము, నీమంచి నడతయుఁ గాంచి నిన్నుఁ బెండ్లాడవలయునని తలంపుగొంటిని. కాని నేనీతరుణము నందొక మాటచెప్పెదను. అట్లు సేయుదువా?" యని ప్రశ్నించెను. ఆకన్యక నూతనపురుషుం డగు నాకోమటితో సంభాషించుటకు సిగ్గుపడగా అటనున్న దాని దాది "అయ్యా! మీ యాజ్ఞప్రకార మీకన్యక సేయఁగలదు. సందేహింపక సెలవిం" డని యాతనితోఁజెప్పె.

ఆముసలి పలుకుల నాలించి యాతఁడు నా కన్యాభిముఖుండై "ఓకన్యకామణీ! ఇపుడు నాదగ్గఱ కుంచెడు శాలిధాన్యమున్నది. దానిని నీకొసంగెద. నీ వద్దానిఁగైకొని నాకు శాకము, సూపము, మున్నగువానిని వండిపెట్టఁగలవా?" యనెను. అనినదియు "స్వామీ! అట్లే చేయఁగల"నని వానిదగ్గఱనున్న ధాన్యము గైకొనెను. దాని దాదియు నప్పు డావణిక్పుత్రుని వీక్షించి "అయ్యా! ఇదిగో పాదప్రక్షాళనార్థ ముదకము గొనివచ్చి తిని. పాదములఁ గడిగికొని యీయఱుగుపైఁ గూర్చుండు"డని నుడివె. వాఁడు నాదాది చెప్పిన ప్రకారము గావించె. అనంతరము వాఁడాదాదిం గాంచి యిట్లు ప్రశ్నించెను. "అమ్మా! ఈ కన్యక నామధేయంబేమి?". అనగా నాదాది "ఆర్యా! ఈ బాలిక పేరు

గోమిని" యని ప్రత్యుత్తరమిచ్చెను. ఇట్లుండఁగా నాకన్యాలలామ ధాన్యముదంపి బియ్యము గావించి దాదిం బిలిచెను. తోడనే యదియు నాబాలికవద్ద కరిగెను.

అపు డాబాలిక "అమ్మా! ధాన్యముదంచి బియ్యముగావించితి. అందుఁగొంత నూకగ నేర్పడినది. ఆనూకను నీ పెప్పుడంగడికిఁ గొంపోయి నూనె, నేయి, పెరుగు మున్నగు వానిని గొనితెమ్ము. మఱియు నీ యూకను జిట్టును గుమ్మరివాండ్ర కడకుఁ గొంపోయి రెండు ఘటములను దెమ్ము" అని సాదరముగ వచించె. ఆకన్యాలలామ పలుకుల నాలించి యాదాదియు వంటసేయుటకు వలయు సామగ్రులను గొనివచ్చి యక్కన్యక కొసంగె.

అనంతర మాగోమిని స్నానమాడి పరిశుద్ధమైన యొక వస్త్రమును ధరించి వంటకము సేయుటకుఁ గావలసిన సామగ్రుల నన్నిటిని దగ్గఱనిడికొని కొంతసేపటికి వంటచేసి వైశ్యతనయుని సమీపించి యిట్లనియె. "అయ్యా! వంటయైనది. తాము స్నానమాడి భోజనార్థము దయసేయుఁడు." అపు డావణిక్పుత్రుండు ప్రమోదమానచిత్తుండై నూతి యొద్దకుఁబోయి యుదకము చేదుకొని జలకమాఁడి గోమిని వద్ద కఱుదెంచెను. అత్తఱి నాపె యెండవైచిన యొకయంశుకమును ధరింపుఁడని వానికొసంగెను. వా డావస్త్రమును ధరించుకొనునంతలో నాపె యొకయరఁటియాకునందు భోజన పదార్థముల నన్నిటిని బెట్టెను. అనంతరము వాఁడామె పెట్టిన భోజనపదార్థములను గడుపార భుజించి తృప్తుఁడాయెను.

పిమ్మట గోమిని తుంగచాపను గొనివచ్చి యఱుగుమీఁదవైచి "ఆర్యా! తాము గొంతసేపు దీనిమీఁదఁబరుండి విశ్రమింపుఁ"డని వచించి గోమినియు నాపె దాదియు భోజనముచేసి యావణిక్పుత్రుండు నిద్రించుచున్న యఱుగువద్దకువచ్చి కూర్చుండిరి. వాఁడును వారువచ్చుట నెఱింగి లేచి కూర్చుండెను. అనంతరము వారు వానితోఁ గొంతతడవు సంభాషించిరి. ఆసమయమున వాఁ డాగోమిని దాదితో నిట్లనుడివె. "ఓసీ, వృద్ధురాలా? నీబిడ్డను బెండ్లాడవలయునని నాకుఁగోరిక గలదు" అనగా నాపెయు నందుకు సమ్మతించెను.

అనంతర మాకోమటి పరమానందభరితుఁడై యాగోమినిని దననగరమునకు దోడ్కొనిపోయి వివాహముచేసికొని యాపెంగూడి చిరకాలము సుఖముగా నుండెను.

—'కథాకుసుమముల'నుండి.

# భారతనారి

విద్వాన్ సూరిగుచ్చి కృష్ణమూర్తి గారు

స్త్రీజాతిని మనము నీచమనియు, అధమమనియు, అపవిత్రమనియు చెప్పినాము. దానికి ఫలముగ మనము పశువులము, దాసులము, బలహీనులము, దరిద్రులము అయినాము. స్త్రీలను మనము నిందించి యధోగతి పాలగుచున్నాము. ఏ దేశములో ఏజాతిలో స్త్రీగౌరవముండదో ఆ దేశము, ఆజాతియు ఎన్నటికిని ఉన్నతస్థానమును పొంద జాలదు. ఆజాతి కిట్టి అథఃపతనము గలుగుట కాజాతియే ముఖ్యకారణమై శక్తిమూర్తిని అవమానించుచున్నది.

"యత్రనార్యస్తు పూజ్యంతే నంగంతే తత్రదేవతాః।
యత్రైతా స్తు నపూజ్యంతే సర్వా స్తత్రాఫలాఃక్రియాః।"

"ఎచట స్త్రీలు పూజింపబడుదురో అట దేవతలును ప్రీతులగుదురు. ఎచట వీరు పూజింపబడరో అట సమస్తమైన కార్యములును విఫలములగును." అని మనువు తనధర్మ శాస్త్రమందు చెప్పియున్నాడు.

వైదిక యుగమునను ఉపనిషద్యుగమునను మైత్రేయి, గార్గి, మొదలైన ప్రాత స్మరణీయులైన స్త్రీరత్నములు బ్రహ్మవిచారవిషయమున ముఖ్యస్థానమును అలంకరించి యుండిరి. వేలకొలది పర్యాయములు గార్గి వేదజ్ఞులైన బ్రాహ్మణుల నిండుసభలో అతిశ యించి యాజ్ఞవల్క్య మహర్షిచే బ్రహ్మవిచారచర్చకై ఎంతో గౌరవముగ ఆహ్వా నింపబడినది. మన భారతదేశము అథఃపతనమగుటకు భట్‌చాయ్ బ్రాహ్మణులు (బంగాలీలో ఒక తెగ) బ్రాహ్మణేతరులు వేదపాఠమునకు అధికారములేనివారని వ్రాయుటయేగాక ఆసమయములో స్త్రీలకున్న యధికారములన్నియు తీసికొనియుండు టయే కారణము. స్మృతులను వ్రాసి స్త్రీలను నియమమైన నీతులచే నిబంధించి మన దేశమునందలి స్త్రీలు కేవలము సంతానమును బుట్టించు యంత్రములనే యభిప్రాయమును దేల్చిరి. బహుకాలమునుండియు స్త్రీలకు విద్యాశిక్షణ నొసగక వారిని సంపూర్ణమైన అసహాయులనుగచేసి యితరులమీద ఆధారపడుటయనే ఒకగతిని కల్పించిరి. కాని

పురుషులును, దరిద్రులై స్త్రీలతో సమానదుఃఖము నందినపుడు కేవలము మనము విలపించుట తప్ప చేయదగిన కార్యమేమియును లేదుగదా!

ఏజాతి సీతాచరిత్రమును వ్యాపింపజేసి అది కేవలము కల్పింపబడినది అనియే గ్రహించినచో ఆజాతికి స్త్రీలోకము మీద శ్రద్ధయు సమానభావము లేదని చెప్పవచ్చును. సీతాసావిత్రీదేవతలకు స్థానమైన పుణ్యక్షేత్రమైన భారతదేశములో ఎపుడు స్త్రీలయొక్క చరిత్రమును, సేవాభావమును, స్నేహమును, దయను, తుష్టిని, భక్తిని చూతుమో అపుడు మనదేశముయొక్క గొప్పతనమును తెలిసికొనగలము. ఒకమాఱు భారతవనితలయొక్క లజ్జ, వినయము, మొదలగునవి చూచినచో మన నేత్రములకు సరియైన సాఫల్యాతిశయము నందగలము.

స్త్రీల విషయమై మనము చేయు హస్తక్షేపము, అధికారము ఒనరించు వారికొకమాఱు విద్యాశిక్షణమిచ్చు పర్యంతమే యుండును. విద్యాశిక్షణ మొసంగిన పిదప స్త్రీజాతికిట్టి యోగ్యతయు, అర్జనమును ఉన్నదని గ్రహించి మనయొక్క నీచమైన అభిప్రాయమును మనమే తొలగించుకొందుము. భారతీయరమణీగణమంతయు ఆదర్శమూర్తియైన సీతాదేవివలె నుండవలెను. రమణీసమూహములో ఏవిధమైన యాదర్శముగాని గొప్పగాని యున్నచో అదియంతయు సీతాదేవి చరిత్రనే యాశ్రయించియున్నది. రమణీగణమంతయు ఉచ్చాకాంక్షగలదై పరమ విశుద్ధస్వభావముగలదై పతిపరాయణయై అన్నివిధముల సీతాదేవివలె నుండవలెను. మన ప్రాచీన ఆరణ్యకోపనిషత్తునందు బాలికాబాలకుల కేరూపమైన సమానాధికారములు చెప్పబడినవో మనమట్టివి వారియెడ చూపుచున్నామా?

"కాన్యాప్యేవం పాలనీయా, శిక్షణీయాతియత్నతః"

'కన్యయునిట్లే పాలింపబడుచు ప్రయత్నించి విద్యాశిక్షణము బాలునివలె పొందునట్లు చేయవలెను'

అని మనువు చెప్పియున్నాడు. ఎపుడావిధముగ స్త్రీలను మనము సుశిక్షితలనుగ చేయుదుమో అపుడు మన భారతదేశములో కల్యాణసాధన మందు సమర్థులైన నిర్భీకహృదయులైన గొప్ప రమణీగణము యొక్క అభ్యుదయము గల్గును. వారి సంఘమిత్రత్వము లీల, అహల్యాబాయి, మీరాబాయిల యొక్క పదానుసరణమందు

సమర్థములై యుండును. వారు పరమపవిత్రలై స్వార్థగంధశూన్యలై వీరరమణులై యుందురు. భగవంతుని పాదపద్మస్పర్శనమువల్ల ఎట్టి వీర్యలాభము గల్గునో అట్టి వీర్య శాలినులును వారగుదురు. వారపుడు వీరప్రసవినులగుట కవకాశముగల్గును. స్త్రీల నిమిత్తమై గ్రామగ్రామములందును పాఠశాలల నిర్మించి వారిని మానుషలనుగ చేయ వలెను. స్త్రీలు మానుషలైనపుడే వారి సంతాన సమూహముగూడ దేశముయొక్క ముఖము జ్వలమై; విద్య, జ్ఞానము, శక్తి, భక్తి మొదలగు వాని కవకాశము గల్గును.

శిక్షించునపుడుగాని, దీక్షగనుండునపుడుగాని వారిని జాగ్రతగ చూడవలెను. ధర్మమునకు ముఖ్యముగ ప్రాధాన్యమొసగి విద్య చెప్పుచుండవలెను. ధర్మమునకు భిన్న మైన వేఱొక అప్రాధాన్యమైన శిక్షణము నీయవలెను. ధర్మశిక్ష, చరిత్రశిక్ష, బ్రహ్మ చర్యశిక్షల నీయవలెను. మనభారత కుటుంబములకు బ్రహ్మచర్యము, పవిత్రత్వము సహ జములైయున్నవి. ఇది కేవలము జన్మగత సంస్కారము. ఇట్టి ధర్మశిక్షణమే యొసగినచో జీవనపర్యంతమును వారు పరమపవిత్రలైయుందురు. ఇంకను ధర్మశాస్త్ర, సాహిత్య, సంస్కృతవ్యాకరణసంబంధమైన శిక్షణము కొంచెముగను, దేశభాషల శిక్షణమెక్కువ గను ఇయ్యవలెను. గృహకర్మల యందెట్టి విధానమిచ్చుచున్నామో శిశుపాలనమందును అట్టి దీయవలెను జపము, ధ్యానము, పూజ, వీనియందు శిక్షణమీయవలెను. సీత, సావిత్రి, దమయంతి, లీలావతి, మీరా మొదలగువారివలె ఇప్పటి వనితలు నుండునట్లు ప్రవర్తించుకొనవలెను. మఱియు ఇట్టి చరిత్రల సంసర్గమువల్ల మనస్త్రీలును శౌర్యముగల వారై, వీర్యముగలవారై అధికారముగలవారు కాగలరు. చూడుడు జాన్సీరాణి యొక్క తేజము?

మనదేశమందు స్త్రీవిద్యాలయములలో పురుషసంసర్గము కొంచెమేని యుండ కుండుటమంచిది. బ్రహ్మచారిణులైన స్త్రీలమధ్యనే శిక్షనిచ్చుట యుక్తము. మఱియు స్త్రీల కొరక మఠముండవలెను. అందు వివాహముగాని కుమారికలు, బ్రహ్మచారిణులు, విధవలు నుండనగును. ఇంకను భక్తిమతులైన గృహిణులును అపుడపుడు రావచ్చును. ఈమఠమందు పురుషుల సంబంధ మేమియు నుండగూడదు. ఈస్త్రీ మఠమందు వారికొరక పాఠశాలయు నుండవలెను.

బాల్యవివాహములు స్త్రీల కకాలసంతానమునిచ్చుటయేగాక ఆసంతతియు చాల భాగము మృత్యుముఖమున బడుచుండుట చూచుచున్నాము. మఱియు బాల్యవివాహితల సంతానసంతతి క్షీణజీవముగలదై దేశమునందు బికారులసంఖ్య నభివృద్ధి చేయుచున్నది. దీనికి కారణము జననీజనకుల శరీరములు సంపూర్ణసంగమమును సబలమును గాకుండుటయే యని చెప్పవచ్చును. సబలమేమైనచో ఇట్టి నీరససంతానము గలుగుటకు కారణమేమి? ప్రతిగృహములోను ఇంత విధవాభావము గలుగుటకును కారణ మీ యతి బాల్యవివాహములే.

కావున భారతీయులు భారతీయధర్మమును, విశ్వాసమును, శ్రద్ధయు వహింపవలెను. దేశము తేజస్వంతమై "మేముభారతీయులము" అని చెప్పుకొనుటకు సిగ్గు లేకుండునట్లు ప్రవర్తించి మనగారవము మనము గాపాడుకొను అనుభవముచేసికోవలెను. మఱియు ఒక్కమాఱు తలచుకొన్నచో మన అపరాపరజాతి ప్రత్యక్షమందుండు నట్లుండవలెను. కాని విశేషించి ప్రపంచమందలి అన్నిజాతులయొక్క అపేక్ష మనము సహస్రగుణాధికముగ కోరుచుండవలెను.

(శ్రీ వివేకానందులవారి వంగభాషయందలి వ్యాసమున కనువాదము.)

# వినాయకచవితి

సిద్ధివిఘ్నేశ! ప్రసిద్ధిగాఁ బూజింతు నోనరంగ నిరువదియొక్కపత్రి
దానిమ్మ మరువమ్ము దర్భ విష్ణుకాంత యుమ్మెత్త దూర్వాయు నుత్తరేను
కలగరు మారేడు గన్నేరు జిల్లేడు దేవకాంచన రేఁగు దేవదారు
జాజి బలురక్కసి జమ్మియు దాసాని మాచిపత్తిరి యారె మంచిములక

భాద్రపదశుద్ధమునఁ జౌతిఁ బగటివేళఁ
బప్పుపాయసమును నానుఁ బ్రాలు తేనె
నేయియుంద్రాళ్లు కుడుములు పాయసముగఁ
గోరి యర్పింతు నీకు నేఁ గోర్కితీఱ.

చాటుపద్యమణిమంజరి. భా-౨.

# రూపతృష్ణ

పెమ్మరాజు రాజగోపాలముగారు బి. యె., సారస్వత సమాజము

## ౧

అది సంధ్యారుణ సాయంసమయం. మలయమారుతసంచారముచేత ధాత్రీదేవి పులకిత అవుతోంది.

అప్పటికప్పుడే రామారావు విలాససంభరితవేషం వేసుకొని డాక్టరు సుబ్బారావు ఇంటికి వెళ్లేడు. ఆయన యింటిముందు దొడ్డిలో క్రోటనుల మధ్యగానున్న ఒక పడకకుర్చీలో సుగుణ వార్తాపత్రిక తిలకిస్తూ కూర్చుంది.

ఆమెకు పదహారేళ్లు వుంటాయి. మంచి సుందరరూపం. విడివడి వెనుక జీరాడుచున్న కుంతలములకు చివర ఎఱ్ఱపూలు ముడివేసింది. ఊదాసిల్కుచీర పార్సీమాదిరిగా కట్టుకుంది. పవుడరు అద్దిన అందమైన మొగం, మెడలోని యారుపేటల క్రొత్తరకం బంగారపు గొలుసు, భుజమూలమున అమర్చిన గిల్టుబ్రూచి, కాళ్లకి తొడిగిన పట్టుమేజోడు ఆమె విలాస లాలసత్వం తెలియ జేస్తోన్నాయి.

రామారావు రాగానే సుగుణ లేచి షేకుహ్యాండు యిచ్చింది. ఎదురుగావున్న కుర్చీలో రామారావు కూర్చున్నాడు. అప్పుడు విస్తృతనయనాలతో సుగుణ రామారావు వైపుచూచి చిఱునవ్వునవ్వి "ఈవేళ ఇంత ఆలశ్యంగా వచ్చావేంచేత?" అన్నది. దానికి రామారావు "ఒక మిత్రుడిమూలంగా ఆలశ్యమైంది. అందుకనే యింతతొందరగా వచ్చేసాను. సుగుణా? నిన్నువదిలి యిక యీజీవితం గడపడం చాలాకష్టంగావుంది. నేను నిన్నెంతగా ప్రేమించానో నీకేమి తెలుసు. ఇంక ఆలశ్యం చెయ్యక నువ్వు నాదానవు కావాలి" అని అన్నాడు.

సు:—నువ్వంటేమాత్రం నాకు ప్రేమలేదా? కాని నీపొజిషను చాలా డెలికేటుగావుంది. నేను దానికేంచెయ్యను.

రా.—సుగుణా! నువ్వల్లా అనుకోవద్దు. నీకోసమంతా వదులుకుంటాను. నీరూపానికి సేవకుడనైపోతాను. నన్ను సంఘం ఏమన్నాసరే లక్ష్యంచెయ్యను. ఇంక నువ్వు నన్ను వివాహంచేసికోకపోతే యీప్రాణంకూడా వదిలివేస్తాను.

సు:—(నవ్వుచు) రామం! నిన్నిదివఱకే నేను ప్రేమించాను. వూరికే నీకున్న ప్రతిబంధాలు చెప్పాను కాని అంతకన్న ఏమీలేదు. ఒక్కవిషయం మాత్రము నువ్వాలోచించుకోవాలి.

రా:—ఏమిటి? సుగుణా చెప్పివెయ్యి. నీకోసం ఏంపనిఅయినా చేస్తాను. సంకోచింపక చెప్పేయి.

సు:—నా సౌందర్యానికి నువ్వెల్లా ముగ్ధుడవయ్యావో అలాగే నేనూ నిన్ను వరించాను. అందుచేత మనమిద్దరమూ వివాహం చేసికొందాము. నన్ను నువ్వు సామాన్యంగా చూస్తే నేను వప్పుకొనేదాన్నికాను. నాకు వుండేందుకు నువ్వో మేడ కొనాలి. నేను షికారు వెళ్లేటందుకు ఒకమంచి మోటారు కొనాలి. ఏరకందుస్తులు కావాలంటే నువ్వారకం దుస్తులు కొని యివ్వాలి. ఇంటినిండా నౌఖరులు వుండాలి. నేను వంటచెయ్యడం, ఇంటి పనులుచెయ్యడం వట్టిమాట. అందుకు కూడా నౌఖరులు కావాలి. నాస్వేచ్ఛకి అడ్డం రాకూడదు. వీటన్నిటికీ నీకు సమ్మత మయితే నేను నీదాన్ని అవుతాను.

రా:—సుగుణా! నువ్వెల్లా కోరితే ఆప్రకారంగానే చేస్తాను. నీరూపానికి నా సర్వస్వంకూడా నైవేద్యం పెడతాను.

సు:—సరే అల్లా అయితె. మళ్లీ వారం సరీగా యీరోజునే చెన్నపట్నం పోయి వివాహం చేసికొందాము. ఈవేళకి నువ్వింటికి వెళ్లు. మళ్లీ రేపు వద్దువుగాని.

రా:—సరే, అల్లా ఆయితే వెడతాను.

ఇట్లని సంతోషపూరితమైన హృదయంతోను వికసితమైన మొగంతోను గృహాభిముఖముగా వెళ్లాడు.

౨

రాత్రి పదిగంటలు కావచ్చింది. కామేశ్వరి తనగదిగుమ్మములో కొంగుపఱచుకొని పండుకొని తనమగని రాక కెదురుచూస్తోంది.

అంతలో రామారావు వచ్చాడు. అతనిని చూడగానే కామేశ్వరిలేచి నిలబడింది. ఆమె మనోహరశ్యామలాకార. పలుచని శరీరం, సౌమ్యమైన ముఖారవిందం, అతివిశా

లములైన రమణీయనేత్రాలు ఆమె రూపసంపద, సతీత్వమూ ప్రస్ఫుటం చేస్తూఉన్నవి. మొగముమీద తీర్చిన కుంకుమబొట్టు హైందవోచితమైన వస్త్రధారణం, పొట్టిచేతుల కంచుకమూ కేవలము హిందూసుందరిని చిత్రించుచున్నవి. అప్పుడామెనుచూచి

రా:—భోజనం చేశావా? లేదా?

కా:—మీరు రాందే నేనెల్లా చెయ్యను?

రా:—నాకోస మెవరు కూర్చోమన్నారు?

కా:—అల్లా కూర్చోడం హిందూసతి ధర్మం.

రా:—ఓహెూ ! ధర్మదేవతవు కాబోలు? బాగానే వున్నావు నల్లగా సిద్దిలాగు.

కా:—నిజమే! నేను నల్లనిదాన్నే. ఒక వేళ అందంలో మీకు సాటిరాలేక పోవచ్చు. అయినా దాంపత్యధర్మం నిర్వహించడానికి అందం ప్రధానంకాదు. ఎవరైనా హృదయమూ, గుణమూ ప్రేమించాలి. కాని రంగుచూచి మోసపోకూడదు.

రా:—అదెక్కడి మాట. ఎవరైనా కంటికింపైన దాన్ని కోర్తారు. లోపలగుణ మెవరు కోర్తారు?

కా:—అల్లా అయితే తప్పకుండా మోసపోతారు. దీపాన్ని చూచి పురుగులు పండని భ్రమసి మాడిపోతాయి.

రా:—నీ మిట్టపంచాంగం నాకక్కరలేదు. నువ్వు రేపొద్దున్నే పుట్టింటికిపోవాలి. నే నర్జంటుపనిమీద మెద్రాసు వెళ్లాలి.

కా:—మీరు చెప్పేది చాలా హాశ్చర్యంగావుంది. పిలవకుండా పుట్టింటికి పోవడ మెల్లా? మిమ్మల్నివిడచి నేను వెళ్లలేను. ఈమధ్య నామనస్సు ఏదో ఒక ఆపదను శంకిస్తోంది. నామీద దయ తప్పకండి. నేను ధర్మపత్నిని. మీకందం కావాలంటే నాహృదయంలో వుంది. వట్టి రూపతృష్ణకి మోసమే ఫలితం.

రా:—అదంతా నాకు తెలుసు. ముందు భోంచెయ్యాలి. రావెడదాము. రేపు ప్రయాణ మెల్లాగో తప్పదు.

## 3

అప్పు డిద్దరూ కలిసి లోపలకి వెళ్లేరు.

"తాయీ" అని పిలచింది సుగుణ. తక్షణము వచ్చి తాయి యెదురుగుండా నిలపడింది. తాయి నల్లని శరీరచ్ఛాయకలది. ఆమె కృష్ణశరీరమెంత వికృతమైనదో కన్ను

లంత పెద్దవీ, అందమైనవీ. కట్టుకొనుటకు సరియైనబట్టలు లేకపోయినా ఆమె సుదీర్ఘాసిత నీలాలకములు ఒక్కసారి ముడివిదిర్చి నట్లయితే వీపంతాకప్పి జగమంతా కృష్ణమయం చేస్తాయి.

"ఎందుకమ్మా! పిల్చారు?" అంది తాయి.

సు:—పంతులుగారింకా రాలేదుటే?

తా—లేదమ్మా!

సు:—ఒక్కసారి డాక్టరుగార్ని తీసుకొనిరావే!

తా:—మళ్లీజ్వరం తగిలిందేమిటమ్మా?

సు:—అబ్బా! కాదే, ఆయాసంగావుంది. నీకెందుకదంతా? వెళ్లిచప్పున డాక్టర్ని తీసుకురా, పో.

తా:—కోపపడకమ్మా! వెడతాను.

తాయి వెళ్లిపోయింది. రామారావు తనధర్మపత్నియైన కామేశ్వరిని సిద్ధయుక్తై పుట్టినింటికి పంపివేసిన తర్వాత సుగుణతో బసులుదేటివచ్చి చెన్నపురిలో నున్నాడు. అతని తల్లిదండ్రులు లదివఱకే గతించారు. అందుచే మరింత స్వతంత్రుడై తనకున్న స్థిరచరరూపమైన యావదాస్తి అమ్ముకొని చెన్నపురిలో సుగుణకోమేడ కొన్నాడు.

తర్వాత ఆమె కోరికప్రకారంగా ఒక మోటారుకారు గుఱ్ఱపుబండీ కూడా కొనవలసివచ్చింది, ఇంటినిండా నౌఖరులు. వంటచేయుటకు మనిషి. కేవలము జమీందారీగా జరిగిపోతోంది.

సుగుణచేయు ఖర్చుకి మితిలేదు. ప్రతిరోజూ మిత్రులకు విందులు. ఆమె పోని సినీమా నాటకప్రదర్శనాలు లేవు. సాయంతనమగుసరికి బీచికి పోవలసిందే. ఆలాటప్పుడెంతకాలం ఆగుతుంది రామారావుకున్నధనం?

అది అల్లా ఉండగా వాడింటి సమీపంలోనే రంగారావను డాక్టరున్నాడు. అతడు రామారావుకి పరిచితుడైనాడు. సుగుణకికాని రామారావుకికాని జబ్బుచేసినప్పుడతడేవచ్చి మందిస్తూవుంటాడు.

తాయి అను నామెను చెన్నపురి వచ్చిన తర్వాత వారు దాసీగావుంచుకొన్నారు. ఆమె సుగుణ కన్నివిధములా సపర్య చేస్తోంది.

ఆరీతిగా పంపబడి తాయివెళ్లి డాక్టరు రంగారావును తీసికొనివచ్చింది. డాక్టరు రాగానే సుగుణ నవ్వుచూ యెదురుగాపోయి స్వాగతమిచ్చింది. అప్పుడు

రం:—ఈవేళ యెల్లావుంది?

సు:—కొంచెము సుళువుగానేవుంది. కాని ఆయాస మెక్కువగావుంది.

రం:—అది నేనిచ్చిన టానిక్కు పుచ్చుకొంటే క్రమక్రమంగా తగ్గుతుంది. సాయంత్ర మప్పుడు బీచికి షికారువెళ్లి వాయుసేవనం చేస్తూవుండాలి.

సు:—(నవ్వుచు) అల్లా అయితే సరే మీరు చెప్పినట్లే చేస్తూవుంటాను.

రం:—ఇక నాకు శెలవు. పనివుంది.

అని డాక్టరు వెళ్లేడు. డాక్టరువెళ్లగానే తాయిని ఇంటిదగ్గర చూస్తూవుండమనిచెప్పి సుగుణ వాయుసేవనమునకని మోటారుమీద పోయింది.

## ౪

సుగుణ వెళ్లగానే రామారా వింటికి వచ్చేడు. అతడు రాగానే సుగుణకొఱకు వెదికితే కానరాలేదు. వెంటనే తాయిని పిలచి "అమ్మగారేరే?" అన్నాడు. "డాక్టరు గారు రాగానే మందు పుచ్చుకొని వాయుసేవనానికి వెళ్లా" రని అది బదులు చెప్పింది.

"సరేలే. నావంట్లోనూ స్థిమితంగాలేదు. ఎల్లాగోవుంది. డాక్టరు దగ్గిరమందు పుచ్చుకొని వస్తాను." అని ఆతడు రంగారావు గృహామునకు బయిలు దేరేడు.

అతడు రంగారావుగృహామము జేరుసరికి అతని ఆఫీసుతాళము వేయబడియున్నది. మెల్లగా మేడమెట్లెక్కి రామారావు రంగారావు ప్రైవేటుగదిలోనికి పోయాడు. అక్కడికి పోవుసరికి రామారావుకి ప్రళయప్రదర్శన మెదురైంది. రంగారావు భుజవల్లరితో సుగుణ.

రామారావు హృదయం గుభిల్లుమంది. ఉద్రేకంతో నాతని శరీరం కంపించి పోతోంది. రామారావుని జూచి వారిరువురూకూడా స్తంభితులైపోయారు. గదంతా భయానకమైన నిశ్శబ్దం ఆవరించుకొంది. మాట్లాడకుండా రామారావు గిఱ్ఱున మళ్లి పోయాడు.

౫

రామారావింటికి తిరిగివచ్చుసరికి ఆకాశము మేఘావృతమై పోయింది. హోరున ప్రకృతి వాపోవుచున్నట్టుగా పెద్దవాన కురుస్తోంది. తటతటలాడుచున్న గుండెలతో ఉన్మాదునిలావచ్చి పడక కుర్చీలో కూలబడి కళ్లు మూసేడు. చాలాసే పట్లేవున్నాడు రామారావు. అంతలో డాక్టరుగారి నౌఖరిచ్చాడని ఒక ఉత్తరం తెచ్చి తాయి రామారావు కిచ్చి ఆతని ముఖలక్షణాలు పరికిస్తూ నిలపడింది. ఉత్తరములోని విషయమిది.—

"రామారావుగారి సన్నిధికి. నేటితో నేను మీ అనుబంధం తెంపుకున్నాను. దానికి కారణం నన్నడిగితే మీరు మీ మొదటిభార్యను ఏకారణంచేత వర్జించారో అదే అని చెప్పవలసి వస్తుంది. ఇంతే.

ఇట్లు, సుగుణ."

ఆఉత్తరము చదువుకొనుసరికి రామారావు హృదయాంధకారములో పెద్దపిడుగు కూడా పడింది. వెంటనే లేచి

రా:—తాయీ! ఇదంతా నువ్వెఱుగుదువా? యీలా ఎన్నాళ్లనుంచి జరుగుతోంది?

తా:—ఎఱుగుదును. ఈమధ్యనుంచే జరుగుతోంది.

రా:—మరి నాతో ఏల చెప్పేవుకావు?

తా:—నే చెప్పితేమాత్రము మీరు నమ్ముతారా? పైగా ఆపాపం నాకెందుకూ? పాప మెల్లాగో బద్దలవుతుందని వూరుకొన్నాను.

తత్క్షణమేలేచి రామారావు గబగబ నడచి పోవుచున్నాడు. అతడులేచి వీధిలోకి పోవుసరికి "బాబుగారూ! ఆగండి, ఆగండి" అని తాయి వెన్నాడించి రామారావు ఆగకుండా అంధకారములో లీనమై పోయేడు.

౬

ప్రచండవాయువుతో వర్షము కురిసి చల్లారింది. సుధాకరుని గుడ్డివెన్నెలలో దుఃఖితుడగు రామారావు బీచి సమీపానికిపోయి నిలబడ్డాడు. ఆసముద్రపు తరంగాల్లో దూకి కృతఘ్నమగు మానవలోకానికి దూర మవుదామనుకుంటున్నాడు.

ఇంతలో వెనుకనుంచివచ్చి యెవ్వరో ఆతనిచెయ్యి పట్టుకొన్నారు. రామారావు త్రిరిగిచూచి 'తాయీ' అన్నాడు. 'తాయీనికాను. చూడండి." అనికామేశ్వరి సముద్రోదకముతో తనమొగముమీది కృష్ణవర్ణము క్రమక్రమముగా క్షాళితముచేసి వైచికొనుచున్నది.

ఆమెనుచూచి రామారావు నిర్విణ్ణుడై పోయాడు. అతని హృదయం లజ్జచే ప్రతప్తమై పోతోంది. పశ్చాత్తాప మాతనిని పునీతుని చేస్తోంది. అప్పుడు

కా:—జరిగిన దానికి చింతింపనక్కరలేదు. ఇదంతా మీకున్న రూపతృష్ణ వలన వచ్చింది.

రా:—కామేశ్వరీ! నీవేనా తాయి వేషముతోవచ్చి దుర్మార్గుణ్ణి అయిన నన్ను కాపాడింది? నీలాటి వాళ్లీభూలోకములో వుంటారనుకోను. నీవొక స్వర్గీయ సతీమణివి. ఆదర్శలోకాన్నుంచి దిగావు. రూపతృష్ణచే సర్వస్వము పోగొట్టుకొన్న మహాపాపిని నేను.

కా:—అల్లా విచారించకండి. ఇది ఈశ్వరు డిచ్చిన అనుభవపాఠము. నానగలన్ని అమ్మేసి బ్యాంకిలో 5000 రూపాయలు వేశాను. దానితో జీవించవచ్చు. ఇక్కడ మా అన్నయ్య సంసారముతోవుండి బి. యల్ చదువుతున్నాడు. రండి అక్కడికిపోయి ముందు మార్గం ఆలోచించు కొందాము.

రా:—నీపాదాలు తాకడానికైనా పనికిరాని నన్ను నువ్వు క్షమిస్తావా? కామేశ్వరీ!

ఇట్లని బొటబొట కన్నీరుకార్చుచు రామారావు ఆమె రెండుచేతులూ పట్టుకొన్నాడు.

అప్పుడే మబ్బులోనుండి విడివడి సుధాకరుడు సంపూర్ణప్రేమజ్యోత్స్నలో వారిని ముంచెత్తినాడు.

# మ హా వా క్య ము.

బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహము గారు

చదువ న్నేర్తురు పూరుషుల్ బలెనె శాస్త్రంబుల్ పఠింపించుచో
నదమన్నేర్తురు శత్రుసేనల ధనుర్వ్యాపారముల్ నేర్చుచో
నుదితోత్సాహము తోడనేలఁగల రీయుర్విన్ బ్రతిష్టించుచో
ముదితల్ నేరఁగరాని విద్యగలదే? ముద్దార నేర్పించినన్.

# లిథూనియా స్త్రీలు

ఐరోపాఖండమున బాల్టికు సముద్రము నంటియుండిన చిన్న దేశములలో లిథూనియా చిరకాలము పారతంత్ర్యాకరమై యుండినది. పదినంవత్సరములకు పూర్వము ముగింపునొందిన ఐరోపాఘోరసంగ్రామము లిథూనియాకు స్వాతంత్ర్యమిచ్చి ఆదేశమునకు రూపవలయమును ప్రసాదించినది.

లిథూనియనుల ముఖ్యవృత్తి వ్యవసాయము. పదింటతొమ్మండుగురకు జీవనాధారము కృషియే. ఆదేశమునందలి భూమి సారవంతమైనది. పశువులను బెంచుటయనిన ఆదేశజులకు మిక్కిలి ప్రీతి. పంటలవలని లాభముమీాద కంటె జంతు సంబంధములగు ఉన్ని, వెన్న, గుడ్లు మొదలగు పదార్థములవలని లాభముమీాద లిథూనియా స్త్రీలకు ప్రీతియెక్కువ. నేతపరిశ్రమ, పంచదార పరిశ్రమ, తోళ్లపరిశ్రమ, కాగితపుపరిశ్రమ ఐరోపాయుద్ధమునకు పూర్వము ఆదేశమున చక్కగా కొనసాగుచుండునవి. అనంతరము మాత్రము వాని క్రమాభివద్ధి కాన్పించుటలేదు.

లిథూనియా కర్షకులు భారతకర్షకులవలె గ్రామములయందు నివసింపరు. వారి వారి పొలములయందే వారివారి తాహతుకు సరిపోయిన ఇండ్లు కట్టుకొని కాపురము ఉందురు. పొలములయందు నిర్మింపబడిన వారియిండ్లు మనోహరములై, ఆరోగ్యప్రదములై, పుష్పితలతాతరులచే పరివేష్టితములై సముద్రప్రదేశమున నిలిచిన సుందరులవలె నుండును. పది హేను మొదలు ఇరువది ఎకరముల పరిమితిగల భూమిని సాగుచేసి కష్టజీవియగు లిథూనియా కర్షకుడు తనకుటుంబమును గౌరవము చెడకుండ పోషింపగలడు.

లిథూనియాకర్షకుని యింట ఆవు ఒకటి యుండుట సర్వసాధారణము. కొన్ని గొఱ్ఱెలు, పందులు కూడ ఉండుట తఱుచు. గుఱ్ఱ మొకటి వినియుముగా నుండును. కోళ్లు కూడ ఉండును. 'రై' అనుకాయధాన్యములు, బార్లీ, ఓట్సు, గోధుమలు ఇవి ఆదేశమునందలి ముఖ్యమైన పంటలు. లిథూనియా కర్షకుడు తమ స్త్రీలు స్వయ

ముగానేసి యిచ్చిన ఉన్నిబట్టలను కట్టుకొనుటకు ప్రియముపడును. వారి ఇండ్లు సాధారణముగ గదులుగా విభజింపబడక ఒకపెద్దహాలుగా మాత్రముండును. హాలుమధ్యను నిరంతరము వెలుగుచుండు "స్టవు"గాని ఎల్లవేళల రగులుచుండు కుంపటి గాని ఉండును. వారిది శీతలదేశము గావున వెచ్చపుట్టుటకు ఇట్టి ఏర్పాటు అత్యవసరము.



"మరలగఁ బోదురిండ్లకును మాపవునంతకుఁ జేలలోపలం దిరిగి"

వ్యవసాయపు బనులయందు తమ తమ మగవారికి సాయపడుటను లిథూనియాస్త్రీలెల్లవేళల ముందంజ వేయుదురు. ఎండకు లెక్కచేయరు; వానకు జంకరు; చలికి వెనుదీయరు—మగలతో సమముగ నడుముకట్టి పొలముపని చేయుటలో వారు పొందెడు ఉత్సాహము వర్ణనాతీతము. పగలెల్ల పొలములందు పనిసాగించి సూర్యాస్తమయము కాగా పనిచాలించి శ్రేణులుగట్టి లేతపడదేరెడు మొగములతో గృహాభిముఖులై వీనులకు విందొనర్చునట్లు ఏలపదములు పాడుకొనుచు నింటికివచ్చు లిథూనియాస్త్రీలను చూచుటకు మిక్కిలి ముచ్చటగానుండును.

లిథూనియాదేశమున అడవులు విస్తారము. జీవితపరికరములలో పెక్కింటిని వారు అడవులనుండియే గ్రహింతురు. వారి పాటలయందు పలుతావుల అరణ్యవృక్షములు మహాత్మ్యమహితములని వర్ణితమై యున్నవి.

లిథూనియా దేశమున తఱుచు వాడబడు పండ్లలో గుమ్మడికాయ యొకటి. దీనిని వారు మనకువలె కూరకు ఉపయోగించుటయేగాక పశువులకు ఆహారపదార్థముగ కూడ వినియోగింతురు. గుమ్మడికాయకూర వండుటలో మంచినేర్పు సంపాదించిన గృహిణులకు ఆ దేశమున అనంతగౌరవము గలదు.



లిథూనియాకర్షకుని గృహాంతర్భాగము.

కటికినేలమీద ముతకపరుపు; పెద్దదియగు 'స్టవు'; బంగాళాదుంపలతో నుండిన కుండ; పెండి కట్టునుండి వ్రేలాడు ఉయ్యాల; ఇవి లిథూనియా కర్షకుని ఇంటియందు సర్వసాధారణముగ గానవగు ముఖ్య వస్తువులు.

పేదతనమున క్రుంగుచుండుగాక నచ్చటి సంసారి అతిథిపూజ సేయుటయందు ఎట్టి చికాకును పొందడు. దేశమున విస్తారప్రదేశము అడవిచే కప్పబడి యుండిన కారణమున ఆ దేశజులకు స్ట్రాబెర్రీలు అను పండ్లు విశేషముగ లభ్యమానము లగుచుండును. అతిథి పూజ యొనర్చుతఱి స్ట్రాబెర్రీల నిచ్చుట ఆ దేశమున మంచి మర్యాద.

లిథూనియావారు ఉన్నతమైన దృఢకాయులు, ఒళ్లువంచి పనిచేయుదురు. భావి శుభోదయముపై వారికి నమ్మకము హెచ్చు. వారు పీనాసితనమెఱుగని పొదుపరులు. లిథూనియా దేశమున పరపతిసంఘముల ప్రచారము, వినియోగము మెండు.

లిథూనియా వారి సారస్వతము విరళముకాదు. కాని ఉన్నంతవఱకు సారయుత మైనది. లిథూనియాజాతివారు సంగీత ప్రియులు. వారి కంఠము సంగీతమునకు సహజముగా లొంగియుండును. చిరకాలము తమ భాషయెడ అభిమానములేని విజాతీయుల నిరంకుశ పరిపాలనము క్రిందగ్రుగ్గుచుండినను లిథూనియా స్త్రీలు జాతీయాభిమానప్రేరిత లగుటచే జాతీయములగు ఏలపదములను, కీర్తనలను మఱచిపోవక పారంపర్యముగ వెలయుటకు కారణభూతలై యున్నారు.

మనదేశమునందు వలెనే ఆదేశమున గూడ వివిధప్రాంతములయందు సంతలు జరుగుచుండును. దిద్దితీర్చిన రూపమునకు శుభ్రవస్త్రములు వన్నెగూర్ప తాము కాయ కష్టముపడి పండించిన పంటసరకులను అమ్మకమునకు బెట్టు లిథూనియా స్త్రీ పురుషులను చూడ చాల ముచ్చటగ నుండును. బహుదూరములనుండి వారాసరకులను తెచ్చి అవి అమ్ముడు పోవువఱకు ఆరుబయట ఉద్రిక్తమానసమున నిలిచియుందురు. ఇట్టి సంఘటనములు సంతవర్తకమును ఎఱిగియున్న మనకు పరిచితమే.

# గృహిణి

సారస్వత సమాజ సభ్యుడు

పతికిం దాననురూపయౌ తరుణి సర్వానందసంధాత్రి య
ప్రతిమానం బగు స్వర్గలోకసుధ కార్యాలోచనాధారమం
దతిసూక్ష్మం బగుశక్తి జీవనమహాయాన నిర్యాపణో
ద్ధతమందారమహీజ మానవుని యర్ధప్రాణ మింపొందగన్



## కుక్కతల మేకశరీరముగల జంతువు:—

బార్నెటునందు ఒక మేక కుక్కతల మేకశరీరముగల పిల్ల నొకదానిని ప్రసవించినది. మంద మేకలు ఎల్లప్పుడును కాపుకుక్కవలని భయము గలిగియుండుట సుప్రసిద్ధముగదా! ఇట్లు కలిగియుండు భయమువలననే నిట్టి విచిత్రజంతువు యొక్క పుట్టుకకు కారణమై యుండునని జంతుశాస్త్రజ్ఞులు వచించుచున్నారు.

## ఇంగ్లాండు వేల్సు దేశములు—శిశుజననములు:—

ఇంగ్లాండు వేల్సుదేశములలో 1928-వ సంవత్సరమున శిశుజననముల సంఖ్య 660267 అని తెలియుచున్నది. 1927-వ సంవత్సరములో శిశుజననముల సంఖ్య 654172 మాత్రమే అయి ఉండెను. కాబట్టి 1928-వ సంవత్సరమున జననముల సంఖ్య అధికమైన దనవచ్చును.

## తెల్లని కాకులు:—

ప్రపంచమున తెల్లని కాకులు ఉండవని ఇంతవఱకు మానవులు నమ్ముచున్నారు. కాని కృష్ణాజిల్లా దివి తాలూకా రేమాలవారిపాలెమను గ్రామమున ఈ మధ్య రెండు తెల్లని కాకిపిల్లలు కానవచ్చుచున్నవి. అవి రంగువిషయములో తప్ప మిగిలిన అన్ని విషయములందును మామూలుకాకులను బోలియున్నవి. ఒక నల్లని కాకి వానికి ఆహారమును పెట్టి పోషించుచున్నది. అవి చూపఱుల కెంతయు నయనానందకరములై యున్నవి. ఇందు అసత్యము పిసరంతైనను లేదని శ్రీ తుమ్మల వేంకటేశ్వరరావుగారు ఆగష్టు 23-వ తారీఖున 'సత్యసాధని'లో వ్రాసియున్నారు.

## విద్యుచ్ఛక్తి విచిత్రము:—

అమెరికాలోని న్యూయార్కు పట్టణమున దాదాపు 300,000 కుటుంబముల వారు నివసించుచున్నారు. వారు నివసించుచున్న గృహము లన్నింటికిని విద్యుచ్ఛక్తిని సరఫరాచేయుటకు బ్రహ్మాండమగు యంత్రములు

నిర్మింపబడినవి. ఇందలి విశేషమేమన ఆయంత్రములను నడుపుటకు మానవుని సహాయము ఏమాత్రమును అవసరములేదు. ఆయంత్రాగారమున ఒక్కమనిషికూడ పనిచేయనక్కఱలేదు.

## ఆఫ్రికాలో హిందువుల ప్రాచీన వలసరాజ్యము:—

ఆఫ్రికాఖండములో జింబావీ అను ప్రదేశమున సుమారు 7000 సంవత్సరముల క్రిందట హిందువులచే నెలకొలుపబడిన వలసరాజ్యము ఉండినట్లు వియోఫ్రోబీనెస్సు అను నొక సుప్రసిద్ధ జర్మను పరిశోధకునిచే కనుగొనబడెను. జింబావీ సంస్థానము ఉచ్ఛదశలో నుండినప్పుడు ఈజిప్టు, సుమేరియా, క్రీటుదేశములతో గొప్పవ్యాపారమును చేయుచుండినట్లు నిదర్శనములు లభ్యమానములైనవి.

## క్రొత్తమాదిరి రాయి:—

ఫ్లారిడాలో నొక క్రొత్తమాదిరి రాయి కనుగొనబడినది. ఈ క్రొత్తరాతితో గోడలను కప్పును తయారుచేసి గృహమును కట్టుకొనినచో ఆయింటియందెంత శబ్దముచేసినను ప్రతిధ్వని ఈయదు. శబ్ద తరంగములు వెలుపలికి పోయి నాశనము నొందుటకు వీలైన సూక్ష్మరంధ్రములు ఈ రాతికి యుండుటచే దీనికి ఇట్టిగుణము కలిగినట్లు పరిశోధనలవలన కనుగొనబడినది.

## భార్యాభర్తల ప్రేమకు ఇన్షూరెన్సు:—

భార్యాభర్తల ప్రేమను ఇన్షూరుచేయుటకు క్రొత్తగా నొక పద్ధతియను ఇన్షురెన్సుకంపెని వెలువడినది. ఈకంపెనియందు భార్యాభర్తలు ఇద్దఱును కలిసి జాయింటుపోలసీ తీసికొనవచ్చును. వీరిప్రేమ తెగిపోయి విడాకులను తీసికొనవలసి వచ్చిన సమయమున పోలసీ మొత్తము ఇచ్చివేయబడును. ఈ ఇన్షూరెన్సు పద్ధతి నవీననాగరికతకు ఎంతయు తగియున్నది కదా!

## గొప్ప జర్మను విమానము:—

గ్రాఫ్ జప్లెన్ అనుగొప్ప జర్మను విమానము అట్లాంటికు మహాసముద్రమును దాటి అమెరికా సురక్షితముగా చేరినది. ఎక్కడను ఆగక 94 గంటలలో ఈ ప్రయాణమును పూర్తిచేసినది.

## భీమబలుడగు బాలుడు:—

విక్రమపురమని నామాంతరముగల డక్కానగరమునందు నివసించుచుండిన పార్వతీచరణమల్లిక్ అను నొక కాయస్థబ్రాహ్మణుని నాలుగేండ్ల బాలుడు అద్భుతమైన భీమబలము కలిగి విక్రమజిత్తు అనుపేరు పొంది యున్నాడు. ఈ బాలుని తల్లి దండ్రులు విశేషబలవంతులుకారు. తానైనను విశేషమైన కండరపుష్టికల వాడుగా కాన్పించడు. కాని అతడు వెఱుపుగొల్పు బరువులను మోసి చూపఱుల సంతోష పెట్టుచున్నాడు. పండ్లతో పదిశేరుల బరువును ఎత్తగలడు. చేతులతో పదిశేరుల బరువును మోయగలడు. పాదములపై పది

హేను శేర్ల భారమును నిల్పగలడు. గుండెలపై మూడుమళ్ల బరువు నుంచుకొనగలడు. ఈ బాలుడింకను పసివాడుగానుండినపుడు బరువుగలపెద్ద పుస్తకములతో చుట్టబడియుండిన పరుపుచుట్టను గుండెలమీదికి దొర్లించుకొని నవ్వుతూ తుళ్లుతూయుండెనట. తల్లిదండ్రులును, సోదరులును ఇది చూచి ఆశ్చర్యపడిరట. తల్లిదండ్రులతో ఈ పిల్లవాడొకసారి స్నానమూడ నదికిబోయినప్పుడు స్నానఘట్టమున ఇద్దఱు ముగ్గురుపెద్దవారును సయితము కదల్పజాలని పెద్దగుండురాతిని నీటిలోనికి సునాయాసముగ దొర్లించివైచినాడట. ఒకసారి ఈబాలుని కుక్క యొకటి కఱువవచ్చెనట. అందు మీద నితడు దానిపై ఎదురుతిరిగి దానినడుమును పండ్లతో కఱచి పట్టిలేవనెత్తి వానాలప్పతిరుగగా ఆకుక్క వెఱపింపబోయి వెఱచినట్లై కూపెట్టసాగెనట. అంతట బాలుని తండ్రివచ్చి పట్టుబలవంతము మీద బిడ్డనోటినుండి కుక్కను విడిపించెనట. ఈ బాలునకిప్పుడు నాలుగవసంవత్సరము. ఇతఁడు ప్రస్తుతము కలకత్తానగరమున వనమాలి సర్కారు వీథియందు తల్లిదండ్రులతో నివసించుచు తన అద్భుతశరీరబలమును ప్రదర్శించుచు చేరలకొలది ధనమార్జించుచు ఇంతకు మున్ను దినవెచ్చములకై తిరియుచుండిన తనకుటుంబమును ధనసమృద్ధమొనర్చుచున్నాడని అమృతబజారుపత్రిక వ్రాయుచున్నది.

## ఒకేకాన్పున నలుగురు బిడ్డలు:—

నెల్లూరు సెంట్‌జోసఫ్ హాస్పిటలులో 28 యేండ్ల వయస్సుగల మహమ్మదీయ స్త్రీకి ఒకేకాన్పున నలుగురు బాలికలు జనించిరి. ముగ్గురుమాత్రము జనించిన రెండుగంటలవరకు బ్రతికియుండిరి. మరియొకతె గర్భములోనె చచ్చిపుట్టినది. జనించిన బాలికలలో ప్రథమబాలిక అయిదు పౌనులు. ద్వితీయబాలిక నాలుగు పౌనులు. తృతీయబాలిక మూడుపౌనులు. చతుర్థబాలిక రెండున్నరపౌనులు. ఈబాలికలను తల్లిని చూచుటకు అనేకమంది సెంట్‌జోసఫ్ హాస్పిటలునకు పోయియున్నారు. నలుగురు బాలికలును చనిపోయిరి. తల్లి ఆరోగ్యముగానున్నది.

## అడవియేనుగుల వింతచర్య:—

కళ్లికోటకు 28 మైళ్లదూరముననున్న నీరాళియను కుగ్రామమున ఖానుసాహేబు కోయపత్తోడి మామెడుకుట్టి సాహేబుగారు కఱపను మోసికొనిపోవుటకై ఒక ఏనుగ నుపయోగించుచుండిరి. ఒకనాడు రాత్రి మామూలు విధముగ మావిటి ఏనుగను గొలుసులతో కట్టివైచెను. ఉదయమగుసరికి ఆచోటున ఏనుగ లేకపోయెను. గొలుసులన్నియు తెగియుండెను. అడివియేనుగులువచ్చి గొలుసులు తెంపి ఆ ఏనుగను అడివికి తీసికొనిపోయినట్లు జాడలవల్ల తెలిసెను. ఒకవారము దినములు ఎంతోమంది జాడలను కనిపెట్టి ఏనుగను పట్ట యత్నించిరిగాని లాభము లేకపోయెను. వారము ముగియుగనే ఒకనాడు ఆఏనుగ యథాప్రకారము తన స్థానమునకువచ్చి పనిచేయ ప్రారంభించెను. ఒడలియందు కొన్ని గాయములు మాత్రము ఉండెను. అడవి ఏనుగలవద్దనుండి తప్పించుకొని వచ్చునపుడు ఈ గాయములు తగిలియుండవచ్చునని యూహింపబడినది.

# గృహలక్ష్మి

## ప్రియాగమనము

సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రిగారు

కడపియును బెద్దతడవు నాకలికిమిన్న
యేఁగుదెంచంగఁ దనపుట్టినింటి నుండి
దారుణంబైన మూర్ఛను దేరినట్లు
లడవిలోనుండి యీవలఁ బడిన భాతిఁ
జెనఁటి గ్రుడ్డితనంబు నశించినక్రియ
భయదమగు రాత్రి చని పవల్ వచ్చినగతి
శాపమోక్షంబుఁ బొందినసజన్మమువలె
దుర్దినంబుల పదఁపడి దోయజప్తు
నుదయమైనట్లు నాకు నాయునికి దోఁచె
ముడుచుకొన్న నాహృదయంబు పొడవు సాగ
వేయిచంద్రులు నాయింట వెలిఁగినట్లు
కుసుమవర్షంబు నాపైని గురిసి నట్లు;
ఇదివఱకు లేని యుల్లాస మెగిరి వచ్చె
వచ్చునపు డామె తనతోడఁ దెచ్చినట్లు
కడిపియును బెద్దతడవు నాకలికిమిన్న
యేఁగుదెంచంగఁ దనబుట్టినింటనుండి.

# గణేశచతుర్థి

అరుదుగ వామభాగలలనాకలనాచలనాత్ముఁడైన యా
హరిగురుఁగాంచి తానును దదాకృతియాగతి నేకదంతుఁడై
కరికరిణీగుణంబులు మొగంబునఁ దాల్చి జగంబు లేలు నాం
తరకరుణాసనాథు గణనాథు మరుద్గణనాథు గొల్చెదన్.

—భట్టుమూర్తి

సేతుశీతనగవ్యాప్తమగు నీభారతవర్షమున సెప్టెంబరు 7-వ తేదీని వినాయక చవితి పండుగ సర్వవర్ణముల వారిచేతను జరుపబడును. త్వరఫలమునందవలయునన్నచో కలియుగమున గణేశుని, చండిని కొలువవలయునని కోవిదులు వక్కాణింతురు. గణేశుడు ఈశ్వరుని పుత్రుడు; కార్తికేయుని సోదరుడు. మానవులను ప్రవృత్తిమార్గమునందు నడుపుటకు కార్తికేయుని; నివృత్తిమార్గమునందు చరింపజేయుటకు గణేశుని ఈశ్వరుడు లోకమునకు ప్రసాదించినాడు. ప్రవృత్తి మార్గగాములగు మానవులు కల్పాంతమున మోక్షము సాధింతురు. ఇందుకు కుమార కార్తికేయుడు మానవులకు తోడుపడును. గణేశుడు జనులను నివృత్తిమార్గమున గొనిపోయి సత్వరమున మోక్షపదవి నందించును. భగవద్గీతల యందు నిర్వచింపబడిన బుద్ధియోగపథమున గొనిపోయి గణేశుడు మానవులకు కైవల్యప్రాప్తినొడగూర్చును.

కార్తికేయుడు దేవతలకు సేనాపతి. త్రిలోకములందును అతనికిఁ బనిగలదు. శివుని పరిచారకగణమునకు వినాయకుడు నాయకుడు. కొలిచి ఆతని సాహాయ్యము గోరుచో ఆతడు బుద్ధిమార్గమున గోచరమగు అడ్డంకులనన్నిటిని తొలగింపగలడు. మహర్లోకమునకు పైనగల మూడులోకములయందును నాతడు కార్యకర్తయై యుండును.



గణపతి

శివునకు ఇద్దఱుభార్యలు—పార్వతి, గంగ; ఇద్దఱు కొడుకులు—గణపతి, కార్తికేయుడు. పార్వతియు గణపతియు మాతాసుతలగుట చేతులు కలిపి జీవాత్మలను నివృత్తి పథమునకు బ్రహ్మవిద్య, బుద్ధిమార్గముల నడిపింతురు. గంగయు నామెతనయుడగు కార్తికేయుడును జ్ఞానమార్గమున జీవాత్మకు ప్రవృత్తిపదవి గలిగింతురు. జ్ఞానము ఆఱువిధములని వేదములు చెప్పుచున్నవి. అగుటనే కార్తికేయునకు షడాననములు గలిగినవి బుద్ధికి ఏకత్వమే గతి కావున గణేశుడు ఏకాననుడైనాడు. కార్తికేయుని వాహనము నెమలి. వివిధత్వగుణముగల ఈ ప్రపంచమునకు వివిధవర్ణములుగల ఆ నెమలి గుఱుతు. గణేశునకు ధవళమూషికము వాహనము. వివిధవర్ణములు ఎందు ఏకీభావమొందునో అట్టి ధవళవర్ణముగల మూషికము అతనికి వాహనమగుటయే గాక అతడును కోటిసూర్య సమప్రభుడు. ఆతడిట్లు వర్ణితమైనాడు :—

వక్రతుండ మహాకాయ కోటిసూర్య సమప్రభ,
ఆవిర్భాతంచ సృష్ట్యాదౌ ప్రకృతేః పురుషాత్పరమ్
అజంనిర్వికల్పం నిరాకారమేకం
నిరానందమద్వైత మానందపూర్ణమ్
పరంనిర్గుణం నిర్విశేషం నిరీహం
పరబ్రహ్మరూపం గణేశం నమామః
నమస్తస్మై గణేశాయ బ్రహ్మవిద్యా ప్రదాయనే
యస్యాగస్త్యాయతే నామవిఘ్న సాగరశోషణే
ఓంకారరూపీ భగవాన్ ఉక్తస్తేగణనాయకః

భక్తులచే వినాయకు డిట్లుప్రార్థింపబడుచున్నాడు.—

వాగీశాద్యాః సుమనసః సర్వార్థానామ్ ఉపక్రమే
యనత్వాకృత కృత్యాః స్యుః తంనమామి గజాననమ్.

బ్రహ్మ మొదలగు దేవతలందఱు తమపనులు ప్రారంభించునపుడు ఎవరినినమస్కరించి కృతకృత్యులగుదురో ఆ విఘ్నేశ్వరులకు నమస్కారము.

# వనితాలోకము

శ్రీమతి కళావతీదేవి :—

ఈమె దక్షిణాఫ్రికా నివాసిని. క్రైస్తవమతమునకు చెందినది. ఈమె ఇప్పుడు క్రైస్తవమతమును విసర్జించి హిందూమతమును స్వీకరించినది. పూర్వపు నామమగు ఫ్రాన్సిసు బూయిసర్ కన్య అనునది విడనాడి హైందవమతోచితమగు కళావతీదేవియను నామమును గైకొన్నది. జోహన్నుబర్గు నివాసియు, హైందవుడునగు బి. కే. పటేలుగారిని వివాహమాడినది.



శ్రీమతి సుశీలపరంజిపి కన్య

శ్రీమతి సుశీల పరంజిపికన్య:—

ఇందూరు మహారాజా వారికి కొంతకాలము దేశికుడుగానుండిన యర్. జి. పరంజిపిగారి కొమార్తె. ఈమె ఇప్పుడు గణితశాస్త్రాభ్యాసమునకు లండను నగరమునకు పోయియున్నది. మదరాసునందలి మేరీరాణి కళాశాలలో చదివి ఇంటరుమీడియటు తరగతిప్యాసు చేసినది.

శ్రీమతి లీలాచంద్రవిన్లోకన్య :—

చెంగల్పట్టు జిల్లాయందు సెంబియంలో ఆనరరీ మేజస్ట్రీటుగ నియమింపబడెను.

శ్రీమతి అన్నాటి సూమ్మక్:—

మద్రాసు వైద్యకళాశాలనుండి ఈ సంవత్సరము యం. బి. పరీక్షనిచ్చి గంగాధరము లక్ష్మీ నారాయణమ్మ బహుమానమును బడసినది.

శ్రీమతి యస్. లక్ష్మమ్మగారు:—

కర్నూలుమండల విద్యాసంఘసభ్యురాలుగా నియమింపబడినది.

శ్రీమతి యమ్.డీ. మేడకుగారు:—

బెలగాము నగరమున నూతనముగా ఏర్పడిన స్త్రీసంఘమునకు అధ్యక్షురాలుగా నెన్నుకొనబడినది. కర్ణాటక దేశమున నెలకొన్న స్త్రీసంఘములకు శ్రీమతి యమ్. డి. మేడకుగారి అధ్యక్షత క్రింద నిర్వహింపబడునదియే తొలుతటిది.



శ్రీమతి యస్. లక్ష్మమ్మగారు

శ్రీమతి యల్. సుబ్బలక్ష్మి అమ్మాళ్ గారు:—

సైదాపేట పురపారిశుద్ధ్యసంఘమున నొక సభికురాలుగా నియమింపబడినది.

శ్రీమతి మేరీజాన్ కన్య బి.యె.—

తిరువేంద్రములోని మహారాజావారి స్త్రీలకళాశాలలో శాస్త్రోపాధ్యాయిని, లండనునగరమున ఉన్నతవిద్య నొందుటకు మద్రాసు విశ్వవిద్యాలయము వారి విద్యార్థినీ వేతమును బడసినది. కొలది కాలములో ఇంగ్లండునకు పోనున్నది. మద్రాసు విశ్వవిద్యాలయమున పదార్థవిజ్ఞానశాస్త్రము ప్రధానముగా బియ్యే పరీక్షలో ఫస్టుక్లాసులో నెగ్గియున్న మతిమంతురాలు.

జయకళాదేవి కన్య:—

ఎం. ఏ. పరీక్ష నిచ్చిన విదుషి. పాశ్చాత్య విద్యాపద్ధతు, నేర్చుటకు విదేశములకు బోవ సంయుక్తపరగణాల ప్రభుత్వము వారిచే సాలుకు 240 పౌనుల విద్యార్థినీ వేతనమును గొన్నది.

ఉషావిశ్వాసు కన్య:—

ఎం. ఏ., బి. టి. పరీక్షలో నెగ్గినది. పాట్నాయందును, మిడ్నపూరునందును కొంత కాలము అసిస్టాంటు ఇనస్పెక్టరుగానుండినది. ఇప్పుడు కలకత్తాలో బాలికల ఉన్నత విద్యాలయమునకు నియంత్రిగా నియమింపబడినది.

శ్రీమతి రాయిసున్నీ గావీగముకన్య:—

దక్కను హైదరాబాదునందు సుప్రసిద్ధవైద్యోద్యోగియగు అఫ్సాఫుల్ హేగుగారి కుమార్తె. వయస్సు 15 వత్సరములు. లండను విశ్వవిద్యాలయమున ఎం. బి. డిగ్రీ పరీక్షకు చదువుటకు ఇంగ్లండునకు బోయియున్నది.


శ్రీమతి సింథియా సెల్డను కన్య

శ్రీమతి సింథియా సెల్డను కన్య:—

బొంబాయి నివాసిని. 13 సంవత్సరముల బాలిక. గానకళాకోవిదురాలు. లండను నగరమందలి ట్రినిటీ గానకళాశాలవారు గానవిద్యకైన ప్రథమ విద్యార్థినీ వేతనమును ఈమెకు ఇచ్చియున్నారు.

శ్రీమతి యమ్. శివభాగ్యవతి కన్య:—

వి. యం. ముత్తు కుమారర్‌గారి కొమార్తె. సింహళద్వీపనివాసిని. మద్రాసు మేరీ రాణి కళాశాలయందు చదివి బియ్యేపట్టా నొందిన సింహళద్వీపనివాసినులగు యువతీమణులలో నీమె మొదటిది.

శ్రీమతి ఫెలిసియా దేవసాహాయ్యముకన్య:—

మద్రాసు రాజధానీ కళాశాలయందు ఉన్నత విద్యబడసి బి. యె. ఆనర్సు పరీక్షలో నెగ్గి డాక్టరు టి. యం. నాయరుగారిపేర నెలకొల్పబడిన బంగారు పతకమును నొందినది.

శ్రీమతి సుభద్రాదేవిగారు:—

ఈమె జర్మను దేశస్తురాలు. డాక్టరు మిస్. చార్లటి క్రాసీ అని ఈమె పూర్వనామము. పి. హెచ్. డి. బిరుదాంకితురాలు. ఈమె ఇప్పుడు క్రైస్తవమతమును వీడి జయినమతము స్వీకరించి అందుకు తగియుండునట్లు సుభద్రాదేవియను నామమును చేకొన్నది. ఈమె ఈ మాసమున మదరాసు వచ్చియుండెను.

అవంతికభాయి గోఖేలు:—

బొంబాయి నగరమున సంఘ సంస్కరణమునకై పనిచేయు రమణీమణులలో నొకతె. బొంబాయి కార్పొరేషను సభ్యురాలు.




### వయస్సుముదిరినకొలది వివాహములును హెచ్చినవి:—

ఝాభారాజా ఉదయసింగు ఇప్పుడు తొమ్మిదవ వివాహము చేసికొన జూచుచున్నారు. వారిదివరకు ఎనిమిది వివాహములు చేసికొని యున్నారు. తిరిగి ఇప్పుడు 18 ఏండ్ల రాజపుత్రకన్యకను పెండ్లియాడుటకు ప్రయత్నించుచున్నారు. పెండ్లికుమారుడగు రాజావారి ఇప్పటి వయస్సు ఏబదినాలుగు సంవత్సరములు మాత్రమే. వారి రాజ్యాధికారము 1927లో తీసివేసిరి. అప్పటినుండియు వారు ఇందూరులో నివసించుచున్నారు. వారి భార్యలలో నిదివఱకు అయిదుగురు చనిపోయిరి. ముగ్గురు జీవించియున్నారు. 18 ఏండ్ల కన్యనొక దానిని ఎనిమిదవ వివాహముచేసికొని ఇంకను ఆఱుమాసములైనను కాలేదు. ఝాభాప్రజలకును రాజాగారి పరిచరులకును ఇప్పుడీ వివాహము ఇష్టములేదు. అంతమాత్రమున రాజావారికి వివాహము మానుటకును ఇష్టములేదు. గోలపుట్టకుండ పెళ్లికూతుగిని మఱియొక పట్టణమునకు తీసికొని పోయి అక్కడ వివాహము జరిపించుకొనుటకు వారు కృతనిశ్చయులై యున్నారు. ఝాబా ఖజానానుండి వీరికి 5 వేలవంతున ఇచ్చెదరు. ప్రతివివాహమునకును కొంత కట్నమువచ్చుచుండును. ఆ కట్నపు సొమ్మును వారు తమ స్వంతఖర్చులక్రింద వినియోగించుచుందురు. ఇటీవల వారు కొంతకాలమునుండి మందు పుచ్చుకొనుచు చికిత్సలోనుండి పథ్యపానములతో కాలము గడుపుచున్నారు. ఏబదినాలుగేండ్లు నిండినను నిత్యయౌవ్వనునివలె చరించుచున్న ఈ రాజువారు ఇంకను ఎంతమంది కన్యకలకు వారి కంఠములకు ఉరిత్రాడనదగిన పుస్తెబొందును కట్టెదరో సర్వమంగదలంజేయు కాలమూర్తికి మాత్రమే తెలిసిన విషయము.

### విచిత్రవివాహము:—

నిజాముఇలాకా కరీంనగరము జిల్లా కిష్టంపేట తాలూకాలోని పెద్దపల్లి గ్రామమునందొక విచిత్ర వివాహము జరిగినది. ఆగ్రామపుపటేలుగారి ౧౨ వత్సరముల ప్రాయముగల కుమారునికి వేమునూరుగ్రామ నివాసియగు వేంకటభీమారావుగారి కుమార్తె లలితాంబను యిచ్చి వివాహముచేసిరి. ఈమె వయస్సు ప్రస్తుతము ౧౬ వత్సరములు. ఈ వివాహము కేవలము పిల్లవాని తలిదండ్రుల మనోభీష్టార్థము జరుపబడినది. పాపము పిల్లవానికింకను సరిగా మాటలాడు శక్తిలేదు. దిసమొలతోడనే బజారులలో తిరుగుచున్నాడు. హిందూదేశమునందిట్టి వరహీనమైన వివాహమున కిదియే ప్రథమము కావచ్చును. వీరి సంసారమెటుల పరిణమించునో దైవమునకే యెరుక, (గోలకొండ).



ఉబ్బసరోగము—పాలపథ్యము:—

'అమెరికన్ మెడిసిన్' అను పత్రికలో డాక్టరు ఎఫ్. హారింగ్టన్ గారిట్లు వ్రాయుచున్నారు.—

"పాలను అమితముగ సేవించునట్టి రోగికి ఉబ్బసము కుదురుట చాల కష్టము. శ్వాసకాస సంబంధమగు ఈడ్పువలన బాధపడు రోగి పాలు పూర్తిగ వర్జించుటవలన రోగవిమోచనము నొందినటుల మఱిదేనివలనను గాదని నాయనుభవము. రొంప, జలుబు మున్నగునవి ప్రారంభమగుచున్న పిల్లలకిది ముఖ్యముగ వర్తించును"

స్త్రీలు—రంగస్థలము:—

ప్రస్తుతము ఆంధ్రదేశమును కలగుండువెట్టుచున్న 'స్త్రీలు—నాటకరంగప్రవేశము' అను విషయమును గూర్చి దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారిట్లు ఉపదేశించుచున్నారు.—

"వర్తమానకాలమున నాటకప్రపంచమున కొంత యలజడి జనించినది. అది స్త్రీలు రంగస్థలిని గూర్చిన విషయము. ఈ విషయమున ధైర్యముతో శ్రీయుత బళ్ళారి రాఘవాచార్యులుగారు ముందంజ వేసిరి. ఇది ధర్మమా, అధర్మమా యని మనవారు తర్జనభర్జన జేయుచున్నారు. స్త్రీలు స్త్రీవేషధారణ జేయవలెనని భరతాచార్యులే జెప్పియున్నారు. శృతిస్మృతులకు ఎవరిష్టముచొప్పున-వారు అర్థముల జెప్పుచున్నారు. నాటకరచన అభినయము తెలిసిన వెనుకగదా, అవి ఎవరభినయింప వలయునది తేలవలసినది. చిత్రకారు డత్యుత్తమమైన చిత్రమును వ్రాయును. శాస్త్రజ్ఞాన మతనికుండనిది ఆచిత్ర

రువు శోభాయమానముగా నుండదు. కళలోని కళాభినివేశము దేశమునందు వ్యాపింప వలెను. కళాభివృద్ధి గానిది దేశ మభివృద్ధిగాంచదు. మనుష్యుడతీతుడు కావలెననిన సుందరకళల నభ్యసించవలెను ఏదయిన పనిగావలెనంటే సుశిక్ష పొందవలెను. దానికి తగిన సామర్థ్య మతనియొద్ద నుండవలెను. లేకపోయిన అతెను ఆధునిక విద్యాభ్యాసమువలె చెడును. వర్తమానకాలమున మనము చేయవలసిన దేమన ఆంధ్రుల కన్నిటియందును అభినివేశముండవలెను. మనకు తగినటుల యీకళ అభివృద్ధికాలేదు. నాటకకళకు పూర్వము గౌరవ ముండెడిదికాదు. ఇప్పుడిప్పుడె కొంచెము గౌరవవంతమగుచున్నది. నాచిన్నతన మున నాటకము జూడబోయినను మాతండ్రిగారు నన్నుదండించెడివారు. మనము మన సాంప్రదాయాచారమున కతీతముగా నడచుచున్నారము. రాజమహేంద్రవరములోని చిత్రకళవారు నూతన ఫక్కి త్రొక్కుచున్నారు. మనము పురాణ నాటకముల నాడు చున్నాము. కొన్నిసమయములందు మనము మన ఆదర్శముల భగ్నము జేయుచున్నాము. మన ఆంధ్రత్వము కావలెనంటే సక్రమమైన నాటకరచనగావలె. మన మభివృద్ధి గావలె నంటే నవీనసృష్టికి మనము యిష్టపడవలెను. నవీన భావములను సృష్టించవలసిన యవ సరముగలదు. భావవికాసము లేనిది నిత్యజీవనము సుఖప్రదముగ నుండదు. ఆతీరున నాటకరంగములు, కళాభివృద్ధియుగావలెను. స్త్రీలు ఏతీరున పాల్గొనవలెనో పురుషు లేతీరున మెలంగవలెనో మనము దెలిసికొనవలెను. మనమన్ని విషయములలోను పరాధీను లముగానే యున్నాము. ఈ విషయమునగూడ మనము పూర్వాచారపరాయణులమై యుండుట సమంజసముగాదు. స్త్రీలయాందోళన పూర్తిగా సాగుచున్నది. ఇరువదిసంవ త్సరములనుండి స్త్రీలు సఫ్రజిష్టు ఆందోళనజేసి విజయులైరి. అట్టి యాందోళన లేకయే మన దేశములో స్త్రీలకు రాజకీయముగా లాభించినది. స్త్రీలోక మీతీరున యభివృద్ధి నొందుచున్నది. ఒకచోట స్త్రీలుజేసిన యాందోళన యితరచోటులందున్న స్త్రీలకు సహా యభూత మయ్యెను. వారి సహాయము కళాభ్యుదయమున కెటుల సహాయమయ్యెనో గమ నింపవలసియున్నది. నాటకవేషము అస్వాభావికము జేయుట సమంజసముగాదు. స్వాభా వికముగా స్త్రీలయందు రాజసము, సాత్వికము గాన్పించును. పురుషులందుస్వాభావికముగా వేరు గుణములుండును. అవయావాభి వృద్ధిలో తప్ప స్త్రీలు పురుషుని కేగుణమునందును

తీసిపోరు. ఈ కళయందు తారీమిన్‌సారి ప్రతిభగాంచిరి. వారికి ఎంతో గౌరవముగలదు, వారి గౌరవము మన ప్రవర్తనలో నున్నది. పూర్వమునుండి సంగీతాభినయనములకు ఒక సంఘముండెను. ఇప్పుడది విడిచిపెట్టబడి క్రమక్రమముగా వేశ్యలు దేవదాసీలు వారి వృత్తుల విసర్జించుచున్నారు. రసోదయముజేయు కళను వృద్ధిజేయవలెను. భావాభివృద్ధి కావలెనంటే మన యుపయోగమునకైకళ ఎవరెవరి కేకళయందభినివేశముగలదో వారిని ప్రవేశబెట్టవలెను. సులోచన మున్నగు విఖ్యాతనటులు నృత్యమునందవయవ విస్ఫురణ గలదనిచెప్పిరి. సంగీత సాహిత్యములు దేవత్వమొసగును. స్త్రీలు నాటకరంగముపై కిప్పుడిప్పుడే వచ్చుచున్నారు. వారిని మనము నిరుత్సాహులచేయుట మంచిది గాదు.”

నిద్రయొక్క విలువ :—

‘నిద్రయొక్క విలువ’ను గూర్చి ఆగష్టు నెల 5-వ తేదీ నాటి ‘కౌమోదకి’ పత్రిక ఇట్లు ప్రచురించుచున్నది.—

“యంత్రములకు విశ్రాంతి అవశ్యమందురు. అప్పుడప్పుడు పనిలేక నిలువబెట్టిననే గాని ఏయంత్రమును చాలకాలము పనిచేయదు. అట్లనే శరీరమునందును విశ్రాంతి అత్యావశ్యకము. ఈ విశ్రాంతి మనకు స్వాభావికకార్యములలో ఒకటిగా ఏర్పడి యున్నది. మనదేశములలో పిల్లలు పెరగవలెనంటే నిద్రవుచ్చవలెనని తల్లు లనుకొనుచుందురు. మన వైద్యశాస్త్రమునను, పడమటి దేశపువాళ్ల వైద్యశాస్త్రమును పిల్లలు పెరగవలయునంటె సరియైన నిద్ర ఉండవలయునని అంగీకరించును. కాబట్టి శరీరముయొక్క పోషణకు ముసలివారికైనను నిద్రయావశ్యకమనియు ఒప్పుకొనక తప్పదు. ఐన చాలమందికి నిద్రయొక్క స్వభావము ఇట్టిది అనునది తెలియదు. పరుపుమీద పండుకొనుట, కండ్లుమూసికొనుట నిద్రగా భావించువారు నూటికి తొంబదితొమ్మండుగురు, నిజమైన విశ్రాంతి ఇట్టి నిద్రవలన గలుగదు. గాఢమగు నిద్రకొంచమైనను ఎక్కువ యుపయోగకారి. అట్టి గాఢమగు నిద్ర అనుభవించవలెనన్న యెడల తక్కిన ఆరోగ్యవిధులను అనుసరించడమేకాకుండ సకాలమున నిద్రించి సకాలమున మేల్కొను అలవాటు చేయవలెను. పసిపిల్లలకు 9–10 ఘంటల కాలము నిద్దుర కావలెను. పెద్దవారలకు 6–7 ఘంటలకంటె ఎక్కువ నిద్రపనిలేదు.

ఎక్కువ నిద్రించెదమను కొనువారు నిజముగా నిద్రించుట లేదు. సోమరిపోతుతనమును పెంచు కొనుచున్నారు. రోగములకు తావిచ్చుచున్నారు. మన దేశమునందు రాత్రి 9-10 ఘంటల లోపు కాలము నిద్రించుటకు సకాలము. ప్రొద్దున $4\frac{1}{2}$-$5\frac{1}{2}$ ఘంటల కాలమున నిద్ర లేచుటకు సకాలము. దీనికే బ్రాహ్మ్య ముహూర్తమని పేరు. మనిషితత్త్వమును ఆయాఋతువును బట్టి కొద్దిభేదము పాటింపవచ్చును. నిద్ర పూర్తియైనదా లేదా అనునిర్ణయము ఎవరికి వారు చేసికొనుటకు అభ్యాసము చేయుట అవశ్యకము. ముక్కుచు మూల్గుచు లేచువాడు సుఖనిద్ర చేసినవాడుకాడు. లేచిన వెంటనే కన్నులు చిఱుమంటలు లేక సమస్థితిలోనుండిన యెడల సామాన్యముగా నిద్ర పూర్తియైనదని చెప్పవచ్చును. మెదడు చురుకుదనముగా నుండి తల చులకనగనుండిననే పూర్ణముగ నిద్రయైన దనుకొనవచ్చును. తలబరువు, ఆవులింతలు, మైవిరపులు ఉన్న పక్షమున మితిమీరిన నిద్రయై యుండవలయును. ఈ స్థితి కడుపుబరువు కండ్లుచిరుమంటలతో చేరినయెడల నిద్రతక్కువయని యూహించవచ్చును. నిద్ర యెక్కువచేత మాంద్యము కలిగినప్పుడు దేహపరిశ్రమ చేయడమువలన అది తొలగిపోవును. ఈ దేహపరిశ్రమకు చాల చిక్కులుపడ నక్కర లేదు. అర్ధమైలు చక్కనిగాలిలో బాగుగ నడచుటయు 10 మొదలు 20 దండెములవరకు తీయుటయు, 25 బస్కీలు కూర్చొనుటయు చేసిన చాలును. నిద్ర తక్కువైనయెడల అవయవముల నన్నిటిని సడలించి మనమును పారాడనీక నిలిపి 1 ఘంట పండుకొన్నయెడల స్వస్థితికి రావలయును. శరీరమును సడలించుకొనుట కూడ ఇందుకు సహకారియని కొందఱిమతము. అట్లయ్యు అనేకులు పగలునిద్ర కూడదందురు. సామాన్యముగా ఇది సరియైన సిద్ధాంతమె. కాని దీనికి సర్వత్రవ్యాప్తి కలుగచేయగూడదు. దేహము బడలినవారు, రోగమునుండి బయటబడిన వారు అనివార్యస్థితియందు రాత్రినిద్రచెడిన వారు పగలు నిద్రించుటయందు దోషము లేదు. భోజనమునకు పూర్వము నిద్రించుట ఆయుర్వేదాచార్యుల మతము. నిద్దురకొక్కటే నియమము. అతికూడదు. దానివలన స్వభావసిద్ధముగ అవశ్యముకలిగినపుడు నిరోధించరాదు. మన ఆయుర్వేదవేత్తలు అందుచేతనే నిద్రను వేగములలో నొక్కటిగా వర్ణించినారు. నిద్రను నిరోధించిన పక్షమున తలబరువు, భ్రాంతి, నేత్రశూల, అవలింతలు, సోమరితనము కలుగుటయేగాక అజీర్ణము జాడ్యము వాతరోగములు సంభవించును. నిద్ర తక్కువైనపుడు చేయవలసిన విధులు చేయుటయే దీనికి ప్రతీకారము.

# గ్రంథవిమర్శనము.

శారద :—

ఒకనవల. గ్రంథకర్త సాహిత్యసరస్వతి సీరిపి ఆంజనేయులు. క్రౌను సైజున 244 పుటలు. 32 ప్రకరణములు. వెల రు 1-8-0. వలయువారు విజ్ఞానవల్లికా గ్రంథమాల, అనంతపురము అని వ్రాయునది. నవలయందలి శైలి సరళముగాక ప్రయత్నముచే నేర్చికూర్చిన కఠినపదములతో నిండియున్నది. రసపోషణము, పాత్రౌచిత్యము ప్రశస్తముగా లేవు. కథానాయికయగు శారద ప్రప్రథమమున ప్రౌఢవలెఁ గాన్పించును. పోనుపోను ముగ్ధగా మాఱుచున్నది. కారణమేమో? సాహిత్యసరస్వతిగారు పీఠికములోఁ జెప్పియుండిరి 'ధ' 'థ'లును; 'ఱ', 'ర'; అర్ధబిందువు; వీనిని జాగ్రత్తగ పాటించియుండలేదని. ముద్రాజనితదోషము లసంఖ్యములు. మఱియు నప్రయుక్తము, వ్యాకరణవిరుద్ధము, అనుచితోపమలు—మొదలగు దోషములు గ్రంథకర్త బిరుదమునకుఁ గళంక మాపాదించుచున్నవని చెప్పుటకుఁ జింతిల్లుచున్నారము. అర్జునుడు పాశుపతాస్త్రమునకై ఇంద్రకీల పర్వతమునొద్ద తపస్సుచేసెనని భారతము, కిరాతార్జునీయములందు స్పష్టముగఁ జెప్పఁబడియుండ హిమాలయ పర్వతమునొద్ద తపస్సుచేసెననుటకు సాహిత్యసరస్వతుల కాధారమెక్కడిదో? 'చరమాంగము' (పుట ౨) 'వెన్ను' అనునర్థమున వాడఁబడినది. సరియగునా? 'యాత్రికసేనాపరంపరలు... చెలువారుచుండెను.' (పుట ౫)యాత్రికులకు సేనాత్వ మారోపించుట యీశ్వరునిపైకి భక్తులను కయ్యమునకుఁ బంపుటకాదా? 'వలలులు' (పుట ౯) అను దానికి ఒప్పులపట్టికలో 'వంటరులు' అని వ్రాసిరి. అందలి అర్థసారస్య మెట్టిదో? 'సర్వులు' (పుట ౯) అను ప్రయోగము సాధువగునా? 'మనోంబుజముల నానందసాగరమునఁదేల్చెను.' (పుట ౩) ఇది కవిసమయవిరుద్ధము కాదా? 'ఆమెయు సద్గుణాలంకారము.' (పుట ౯)అనుట పొందికలేని వాక్యనిర్మాణమేయగును కాదా? 'క్రీభాగము' (పుట ౧౪) క్రీఁదొడ, క్రీఁగడపు మొదలగు వానివలె నీ ప్రయోగముకూడ సాధువని సాహిత్యసరస్వతులు తలంచిరా? గ్రంథవిస్తరభీతిచే నింకఁజూపనొల్లెద. భాషాభిమానులగు ఆంజనేయులుగారు తమ భావిగ్రంథరచనమున నెక్కువశ్రద్ధ వహింతురుగాక!

—ఉభయభాషాప్రవీణ బులుసు నరసింహశాస్త్రి.

మీర్ జుంలా:—

ఇదియొక అపరాధపరిశోధకనవల. రచయిత్రి గృహలక్ష్మి పత్రికా పాఠకులకు చిరపరిచితురాలగు శ్రీమతి పులవర్తి కమలావతీదేవిగారు. ఈ నవల నేడు పుంఖానుపుంఖములుగ బయలుదేరుచున్న ఇతరమైన

తెలుగు నవలలవలె భాషాంతరీకరణము కాదు; కథావస్తువు కల్పితమేగాని ఎఱువుగైకొనినదియుఁగాదు. మీర్‌జుంలా భయానక కృత్యములు, తానీషాధర్మపరిపాలనము, రామదాసుని కష్టమయజీవనము ప్రజ్ఞతో వివరింపబడినవి. ఆటలవేడుకలు వర్ణించు ఘట్టమును నరమాంసభక్షకుల పైశాచికాచారములను వివరించు ఘట్టమును ప్రత్యేకముగ చదువదగియున్నవి. 'ఈ నవలనవరసకాస్పదమై నవ్యభావవిలసితమై మృదులమగు శైలితో మనోజ్ఞమగు నీతులతో నలరారుచుండు దనుక జదువకుండ లేచుటకైన బుద్ధిపోడమకుండ జేయుకథాచమత్కృతితో నత్యంత రామణీయకముగా రచియింపఁబడినది.' అని గ్రంథకర్త్రి ఆత్మవిశ్వాసముతో అవతారికలో వ్రాసియున్నది. ఇవి గమనింపదగిన సత్యవాక్యములు. గ్రంథమున ముద్రణదోషములుమాత్రము పెక్కులున్నవి. రెండవకూర్పున వానిని సవరింపనగును. వెల పండ్రెండు అణాలు. క్రౌనుసైజున 116 పుటలు. వలయువారు గ్రంథప్రకాశకులగు కాయల కన్నయ్యనాయుడు అండుసన్సు, శ్రీరామ కృష్ణాబుక్కుడిపో, యేలూరుకు వ్రాసిన బడయఁగలరు.

—ఆలూరు రామచంద్రయ్య బి. యె.

## విషాదవిజయసేన:—

విషాదాంతమగు అయిదంకముల నాటకము, నాటక కవిసార్వభౌముఁడగు షేక్స్పియరు మహాకవి 'ఒథెల్లో' నాటకమున కిది ఆంధ్రానువాదము. బ్రహ్మశ్రీ వీరుభట్ల సదాశివరావుగారిచే రచియింపబడినది. సదాశివరావుగారు 'నాట్యకౌశలార్జనకై బాల్యమునుండి శ్రమబడి రంగస్థల పరిచయముగూడఁ గలిగి యుండినవారని నాందీప్రస్తావనములవలన తెలియుచున్నది. మూలనాటకమునగల పేర్లుమార్చి హైందవ నామము లుటంకించుట, మూలకథయందుగల పాశ్చాత్యనాగరికతాచాగములను ఇచ్చవచ్చినరీతిని విడిచిపెట్టుట ఇత్యాదిదోషము లీగ్రంథమునకు తగిలి దాని ప్రాశస్త్యమును డిందుపాటునొందించినవి. మఱియు నాటకరచనమున వాడబడిన గద్యపద్యములు హృద్యములై రాణించుటలేదు. ఒక్క గద్యమునే ఆశ్రయించి యుండినచో ఇంతకంటె బాగుండియుండు నేమో! నాటకము భాషాంతరీకరణమున రక్తికట్టలేదని నిజమరసి వ్రాయవలసి వచ్చినందులకు విచారించుచున్నాము. గ్రంథము డెమ్మీసైజున 124 పుటలు. వెల ప్రతి ఒక్కంటికి రు 1. మాత్రమే. పోస్టు ఖర్చులు ప్రత్యేకము. వలయువారు గొల్లకోట సూర్యనారాయణ, ప్రకటనకర్త, కాకినాడ, అని వ్రాయునది.

—ఆలమూరి రాజగోపాలరావు బి. యె.

విజయభాస్కరవిజయము; పుష్పలతోట; చాకిరేవు; జన్మనిరోధము; విద్యానగరచరిత్ర—ఈ గ్రంథములపై విమర్శనము పై మాసమున ప్రచురింతుము.

సంపాదకుడు.

# గ్రంథస్వీకారము

ఇప్పుడు——భమిడిపాటి కామేశ్వరరావు; 2. అడ్డాడ హరిహరస్తుతి——గొట్టుముక్కల కృష్ణమాచార్యులు; 3. భాగతీయ ప్రబోధము——సాయం వరదదాసు; 4. మాయోపాయమారణము——బ్రహ్మానంద నాగభూషణము; 5. మోహిని——కాకులపాటి గురుమూర్తి; 6. అడ్డాడపుర శ్రీవేణుగోపాల కళామాలికా——గొట్టుముక్కల కృష్ణమాచార్యులు; 7. పశుపరీక్ష——జగన్నాథశర్మ; 8. నందకుమారవధ; చైతుసింగు——మొసలికంటి సంజీవరావు; 9. బాష్పబిందువు——వేంకట కాళిదాసకవులు. అను గ్రంథములను వందనములతో నందుకొంటిమి. వానిని కాలక్రమమున విమర్శింపగలమని మనవి.

# పత్రికా పరిచయము

## అహింస:—

కృష్ణాజిల్లా గుడివాడలోని శ్రీ అహింసా సాంప్రదాయ సేవాశ్రమము పక్షమున ప్రచురింపబడు పక్షపత్రిక. "అహింసాపరమోధర్మః" అనుగొప్పనీతిని ఉపదేశించుటయే ఈపత్రిక యొక్కముఖ్యాశయము. మాపత్రికాపీఠమలంకరించుచున్న ౧—వ సంపుటము ౩—వ సంచికలో నిమ్నజాత్యభ్యుదయము; అహింసయననేమి; త్యాగుడు; అహింసాధర్మము; జీవకారుణ్యము మున్నగు మంచి వ్యాసములుగలవు. సాలు చందా రు 2. ఈ పత్రికాకిశోరము ఆంధ్రమహాజనుల అభిమానాదరణములకు పాత్రమగుగాకయని కోరెదము.

## ప్రారంభవిద్య:—

ఏలూరునందలి వేంకటరామ్ అండుకో వారు విద్యాప్రపన్నులగు కొప్పర్తి నారాయణమూర్తిగారి (బి.ఏ., ఎల్.టి) సంపాదకత్వముక్రింద ప్రచురింపబడుచున్న విద్యావిషయిక మాసపత్రిక. ద్వితీయ సంపుటము 7, 8 సంచికలు వందనములతో నందుకొన్నారము. పత్రిక పుస్తకాకృతిని నొప్పుచున్నది. పాఠశాలలలో నుపయోగించుట కుద్దేశింపబడినది. సాలు చందా రు 1-8-0 ఇంతట్టి స్వల్ప చందాతో పత్రిక నిర్వహించుచున్న వెంకటరామ్ అండుకో ప్రొప్రయిటరుగారు ఎంతయు స్తుత్యులు.




గృహలక్ష్మీ దసరాసంచిక :—

రాబోవు గృహలక్ష్మిసంచిక దసరాసంచికగ వెలువడును. పుటలయందును, పటములయందును అది మామూలు సంచికలకంటె విశేషమై నెలయును. అందు విదుషీమణుల వ్యాసములకు ఎప్పటితీరున ప్రాధాన్యమీయ నిశ్చయించినారము. కావున ఆంధ్రవిదుషీమణులు అమూల్యములగు తమ వ్యాసభూషలచే దసరాసంచికను గైసేయ ప్రత్యేకముగ ప్రార్థించెదము. వ్యాసములతో బాటు వ్యాసకర్త్రినుల ఛాయాచిత్రములను కూడ ప్రచురించి రుచివిస్తారమును పుట్టింప పుట్టెడు కుతూహలముతోనున్నాము. కావున వ్యాసకర్త్రినులు మాకుతూహలముసంపలి మేలెంచి దయతో తమ ఛాయాచిత్రములను వెంటనే మాకార్యాలయమునకు పంపగోరెదము. గృహలక్ష్మి దసరాసంచికయందు ఆంధ్రదేశస్త్రీ విద్యాలయములను గూర్చి విషయ వివరణము సచిత్రముగ ప్రచురింప సంకల్పించినాము. ఆయావిద్యాలయ పాలకురాండ్ర జీవితసంగ్రహములను వారి ఛాయాచిత్రములను ప్రకటించుటకు ప్రయత్నించుచున్నాము. స్త్రీవిద్యాలయములను నిర్వహించుచున్న ఆంధ్రరమణీజన చూడామణులు ఉత్సాహమిళితములగు ఉదారబుద్ధితో ఈ విషయమున మాకు తోడ్పడి తమ ఛాయాచిత్రములను, తమ పాఠశాలలకు సంబంధించిన చిత్తరువులును విషయసంగ్రహముతో త్వరలో మాకు పంప ప్రార్థించెదము. స్త్రీజనోద్యమమునకు సంబంధించిన ఇతర చిత్రములకు గూడ దసరాసంచికయందు తావుండును. సెప్టెంబరు 10_వ తేదీ దాటిన తరువాత మాకు చేరు వ్యాసములనుకాని చిత్రములను కాని దసరాసంచికయందు ప్రచురింపజాలము. కావున మహాశయులందరును పూనుకొని వెంటనే చిత్తరువులు, వ్యాసములు పంపి మాయుద్యమమునకు జవము ప్రసాదింప వినీత భావముతో వేడుకొనుచున్నాము.

రాజమహేంద్రవర హితకారిణీ సమాజము :—

ఆంధ్రదేశమున సంఘ సంస్కరణోద్యమమునకు పితామహులగు శ్రీకందుకూరి వీరేశలింగము పంతులుగారిచే వారి కార్యశౌర్యమునకు విలాసమందిరమగు రాజమహేంద్రవరమున నెలకొలుపబడిన హితకారిణీ సమాజమువారి ౧౯౨౮-౨౯ సంవత్సరపు కార్య నివేదిక మాకు చేరినది. ఈ సమాజమునకు ఋషిసత్తములగు దివాన్ బహద్దరు సర్ డాక్టరు రఘుపతి వేంకటరత్నము నాయుడుగారు అధ్యక్షులు; కవిసత్తములగు బ్రహ్మశ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు ఉపాధ్యక్షులు; కార్యశూరులగు శ్రీకామరాజు హనుమంతరావుగారు కార్యదర్శి. ఉపదేశగర్భితమగు అధ్యక్షుని ఆశీర్వాదము, నిరుత్సాహభంజకమగు ఉపాధ్యక్షుని ఉద్దీపిత భావము, ఫలోదయాంతమగు కార్యదర్శి కార్యశౌర్యము, ఏకీభావమొంద హితకారిణీ సమాజము నివేదనసంవత్సరమున యథాశక్తిని సంఘసేవయొనర్చినది. హితకారిణీ సమాజము పక్షమున నిర్వహింపబడుచున్న సంస్థలలో విక్టోరియా హిందూవితంతు శరణాలయమునకు నియంతలగు శ్రీకామరాజు హనుమంతరావుగారు తత్కార్యములను శ్రద్ధాబాహుళ్యముతో నిర్వహించుచున్నారు; వీరేశలింగ ఆస్తికోన్నత పాఠశాలకు ప్రధానాచార్యులగు శ్రీజయంతి గంగన్నగారు ప్రజ్ఞాధురీణతతో దానిని నడుపుచున్నారు. వీరేశలింగ ఆస్తిక పుస్తకభాండారమునకు ప్రవర్తకులగు శ్రీఅడివి శంకరరావుగారు దానికి పునర్జీవనము పోయుచున్నారు. కాని శ్రీవీరేశలింగము పంతులుగారి ఈ సంస్థల జయనిర్వహణమునకు చాలినంతధనము లేకున్నది. ఉదారస్వభావులని పేరుగొనిన ఆంధ్రులకిది మిక్కిలి అవమానకరమైన విషయము. కొంతకాలమునకుమున్ను శ్రీవీరేశలింగముగారి పేరిట స్మారకనిధి యొకటి నెలకొలుపబడినది. నెలకొల్పబడుటయే కాని కొంచమేని నిర్వహింపబడలేదు. ఇప్పుడాస్మారకనిధిసంఘము వారితో చేతులు గలిపి పంతులుగారి శిలాప్రతిమను ప్రతిష్ఠించుటకును, వారి సంస్థలను పోషించుటకును, వారి గ్రంథములను ప్రచురించుటకును ఒక లక్షరూపాయిలనిధిని సంపాదింప హితకారిణీ సమాజము వారు నిశ్చలారంభులై యున్నారు. ఆంధ్రులీయుద్యమమునకు చేయూతనీయ వలసి యున్నది. ప్రజాహిత జీవన బీజమును ఆంధ్రదేశ కేదారమున మొలకెత్తించిన కర్షక మహాశయుడగు శ్రీవీరేశలింగము పంతులుగారి స్మారకనిధికి నేడు పాడిపంటల మహా

లక్ష్మియై వెలయుచున్న ఆంధ్రదేశమున అల్పాదల్పమగు ఒకలకారము చేకూరనిచో నంతకంటె తలవంపు మఱియొకటియుండబోదు. చేతికి ఎముకలేని వదాన్యులు ఆంధ్ర భూమియందు పెంపొందగలరు. పూజ్యలింగములగు వీరేశలింగముగారి నామము వారియెడ వశ్యాంజనమువలె పనిచేయగలదు. అగుట హితకారిణీ సమాజము వారికిప్పుడు అభ్యర్థనాభంగభయము కలుగవలసిన అవసరములేదు. స్మారకనిధి పూర్తియైన సంతోషవార్త విను భాగ్యము ఆంధ్రలోకమునకు త్వరలో కలుగగలదని నమ్ముచున్నాము.

అంగీకార వయోనిర్ణయసంఘము సూచనలు:—

1928–వ సంవత్సరము జూన్ 25–వ తేదీని అంగీకారవయోనిర్ణయ విచారణ సంఘము నియమింపబడినది. నిండు ఒకసంవత్సరము విచారణసల్పి కడచిన జూనుమాసము మూడవవారమున వారు తమనివేదికను ప్రభుత్వము వారికి సమర్పించిరి. అందు వారు చేసిన సూచనలలో ముఖ్యమైనవి :—

1. సకలజాతులవారి వివాహములును ఇక సర్కారులో రిజిస్టరు చేయింపవలయును.
2. బాలికకు పదునాలుగు సంవత్సరములలోపున ఏజాతివారును వివాహము చేయగూడదు.
3. పదిహేను ఏండ్లకులోపున గర్భాధానము చేయరాదు.
4. పై నియమముల నుల్లంఘించినవారు కఠినముగ శిక్షింపబడవలయును.

సూచనలు చేయబడినవి; అందు కష్టమేమున్నది? కాని అవి ఆచరణలో బెట్టుసరికి దేశమున అంతులేని సంక్షోభముపుట్టగలదు. కారణమేమందురా? పాశ్చాత్యదేశములందువలె మన దేశమున వివాహము కంట్రాక్టుపద్ధతికాదు; దురతిక్రమణీయమగు మతవిధి. ప్రభుత్వమునకందు జోక్యము కల్గించుట మంచిపనిగాదు. మన దేశమున నెన్నో ప్రభుత్వములు తమ పరిపాలనమును సాగించినవి; అవియేమియు ఎప్పుడును మన వివాహవిషయములలో నెట్టిసంబంధమును పెట్టుకొని యుండలేదని చరిత్ర విదులకు అనుభవ పునరుక్తము. జనసామాన్యములో ప్రబోధముపుట్టింపవలయునే గాని వ్యగ్రోత్సాహముగల సంస్కర్తల ఓట్లతో నీబిల్లుశాసనము చేయుచో దేశమున శాంతికి భంగముకల్గుననుట నిజము. ప్రభుత్వము వారి ఏజెంట్లగు పోలీసువారికి పవిత్రతమముగ నెంచు వివాహముల విషయమై

అనవసరమైన అధికారమిచ్చుటకు ఎవరు ఒప్పుకొందురు ? ఒప్పుకొనమని బెల్లముకొట్టిన రాళ్లవలె కూర్చుండినగాదు. గాఢమగు తమ అసమ్మతిని ప్రభుత్వము వారికిప్పుడే తెల్పి బిల్లుశాసనముగాకుండ చూడవలయును. ఇట్లనుటచే మేము అతిబాల్య వివాహములను ప్రోత్సహించుచున్నామని తలుపరాదు. అవి అవశ్యము తుండింపవలసినవే. తుండించుట ప్రజలలో ప్రబోధము పుట్టించుటచేత చేయవలయునే గాని ప్రభుత్వము వారి శాసనఖడ్గమున మాత్రము కూడదు. కూడునని ఈ వివాహవయోనిర్ణయపు బిల్లుతొందరపడి శాసనము చేయుచోనది అశాంతికి, ఆందోళనమునకు తప్పక మూలదుంపకాగలదు.

హ త్య కా దు:—

హేమసింగునకు ధనము హెచ్చినది; అందుతో మదమును హెచ్చినది. ఫలితముగా దుర్గుణమును హెచ్చినది. చేయునది వడ్డీ వ్యాపారము. ఇక నాతని హృదయమున దయ నీతి అను వానికి స్థానము ఉండదు కదా! కావుననే అతనిపేరు అలిఘరు జిల్లాలో 'రాక్షసుడు' అను దానికి పర్యాయపదముగా పరిణమించినది. ధనమూలమగు ఈ జగమున ధనవంతులు—అందును వడ్డివ్యాపారము చేయువారు—పెక్కుఱుగలరు. అయితే వారిలో తమవద్ద వడ్డికి గొనువారి భార్యలను, సోదరీమణులను, కోడండ్రను తమ కామతృష్ణకు బలిచేసికొను రాక్షసులు మాత్రము మిక్కిలి తక్కువగా నుందురు. ఆతక్కువ వారిలో హేమసింగు ఒకడు. అధమర్ణులకు ఈ అధముని వలన వచ్చెడి కడగండ్లు దుర్భరములుకాజొచ్చెను. అతనిని తుదముట్టించుటకు వారు నిశ్చయించిరి. ఒక అప్పులకాఁపు భార్య హేమసింగును తనయింటికి రప్పించినది. అచ్చట నాతనికి యమలోకమునకు చీటివచ్చినది. మామూలు కార్యకలాపముజరిగి అంతట కేసు అయినది. అలిఘరు జిల్లాజడ్జి హేమసింగును జంపిన అప్పులకాఁపును, వాని భార్యను ద్వీపాంతరవాసశిక్షకు గుఱిచేసినాడు. అలహాబాదు హైకోర్టువారు జిల్లాజడ్జి తీర్పును ఖాయము చేసిరి. చేయకెట్లుందురు? శిక్షాస్మృతులను నిరంతరము చూచుటలో వారికి సూక్ష్మదృష్టి మందగించినది. గోడమీద ఉపవిష్టురాలై వచ్చుచు పోవుచునుండు వారికి ఒక్కొక్కపోటు వడ్డించెడి గొలుసుల బొమ్మను చంపుటయు వీరి స్థూలదృష్టిలో హత్యయే అగును కాబోలు? ఒకయువతిని బలాత్కారముగ వివాహమాడ తలచిన మూడుకాళ్ల

ముసలివానిని చంపివేసిన ఖరగబహదూరుసింగు అను నేపాళియువకుడు న్యాయమూర్తుల స్థూలదృష్టిలో ఎనిమిది వత్సరముల కఠినశిక్షకు పాత్రుడయ్యు వైస్రాయిగారిచే విడుదల గాంచినాడు. ఖరగబహదూరు కేసుకును ఈ కేసుకును అన్నివిధముల సారూప్యము జతపడుచున్నది. అచ్చట ఒక స్త్రీ జీవితము అంధకారమున బడిపోవనున్నది. ఇచ్చట ఒక స్త్రీ మానము బూదికలయుచున్నది. అచ్చటను ఇచ్చటను కూడ పురుషులు చంపబడిరి. అయితే ఆచంపుట హత్యమాత్రము కాదు. అది దుష్టసంహారము మాత్రమే అగును. దానివలన పాపములేదు. గరళోల్బణమై కఱువవచ్చు పామును చంపు జీవివలెనే తన మానప్రాణములకు హానికల్గించు వారిని చంపియు స్త్రీ కిల్బిషము పొందదు. తన్ను చెఱుప వచ్చిన పురుషుని చంపిన స్త్రీకి మన న్యాయస్థానములందు శిక్షలు పడుచో అవి న్యాయమునకు స్థానము లెట్లగును? ఇక స్త్రీ తన మానమును క్లిష్ట పరిస్థితుల నెట్లు కాపాడకొనగలదు? పెద్దలు కొంచము తీవ్రముగ నాలోచింతురు గాక! న్యాయస్థానములను నామము నేతిబీరకాయయతుగాక నిజమైన న్యాయస్థానములుగ నగుటకు ప్రయత్నములు సాగుగాక!

విక్టరు బ్రూసుసతి ప్రజ్ఞ:—

రెండుమూడు గంటల కాలము విడువక మోటారు ప్రయాణము సల్పుచో సాధారణముగ తలనొప్పివచ్చును. అట్టిచో సుకుమార శరీరయగు స్త్రీ ఇరువదినాలుగు గంటలకాలము విశ్రాంతి యెఱుగక ఇదివఱకు ఎవ్వరును నడుపజాలని మహావేగముతో మోటారు నడిపినదన్నచో మిక్కిలి ఆశ్చర్యముగా తోపక మానదు. మానదు కాదు. తోచితీరును. కాని నిజమునకు అట్టి అద్భుతకృత్య మొకటి జరిగినది. గౌరవనీయుడగు విక్టరు బ్రూసుగారిసతి అరనిముసమేని విశ్రాంతి తీసికొనక ఇరువదినాలుగు గంటల కాలము తోడులేక ఏకటాకీని 2,200 మైళ్లదూరము ప్రయాణము చేసినది. గంటకు తొంబదిమైళ్లవంతున ప్రయాణము సల్పినదన్నమాట. లోకములో నందఱికంటె అతి వేగముగ మోటారు నడుపగలనని డంబములు కొట్టుచున్న ఎల్ డ్రిడ్జిగారు ఇంతవఱకు గంటకు డెబ్బదిమూడు మైళ్లుమాత్రమే నడపగలిగినారు. విక్టరు బ్రూసుసతి అబలయయ్యు పురుషులకన్న మిన్నగా మోటారుశకటమును నడిపి స్త్రీల ప్రజ్ఞను లోకమునకు చాటినది.

# గృహలక్ష్మి

## ఏజెంట్లు.

తెనాలి: కొమ్మూరి కాశీ విశ్వనాథంగారు, జనరలు మర్చెంటు.

బళ్లారి: వి. రాజు మొదలియార్ & సన్సు,

కారుస్ట్రీటు, బ్రూసుపేట.

రాజమండ్రి: దుప్పూరి బ్రదర్సు, 3/188 దుప్పూరి వారిమేడ.

కాకినాడ: కే. సర్వేశ్వరరావుగారు, జగన్నాయకపూరు.

ఏలూరు: పి. వి. శాస్త్రి, న్యూసు ఏజంటు.

నెల్లూరు: ఏ. సుబ్రహ్మణ్యం, ఏజెంటు, ట్రంకు రోడ్డు.

బెజవాడ: నామల అంతోని.

ఛత్రపురం: నేమాని వాసుదేవమూర్తి, సెక్రెటరి. పరమేశ్వరి విలాస్.

గుంటూరు: ఏ. ఎల్. నరసింహారావుగారు,

ఫోటోగ్రాపరు, నేషనల్ స్టూడియో.

మచిలీపట్టణము: కె. బాలకృష్ణ, ఫోటో ఆర్టిస్టు, కోజ్జిలిపేట.

తిరుపతి: వై.వి. సుబ్బయ్య & కంపెని. వెంకటేశనివాస్.

పిఠాపురం: ఏ. వి. శాస్త్రి, కవితావిలాస్.

హైదరాబాదు: ఎస్. గారీ శంకరవర్మగారు 544-566. రెసిడెన్సీ బజారు.
(దక్కను:)

(మనప్రాంత్యపు 1రూ ఉస్మానియా
రూ 1-3-0 అగును)

ఇతర చోట్లకు ఏజంట్లు కావలెను. వివరములకు ధరఖాస్తు పంపుకొనుడు.

"గృహలక్ష్మి" తపాల పెట్టె. 752, ఎగ్మూరు, మద్రాసు.

# లోధ్రమహిమ

## స్త్రీరత్నముల అభిప్రాయములు.

### ఆంధ్ర యువతీమణులు

శ్రీమతి కవయిత్రి పులవర్తి కమలావతీదేవిగారు రాజమండ్రినుంచి యిట్లువ్రాయుచున్నారు.—

"నాసోదరి బహిష్టయందు కడుపునొప్పిచే చాల బాధపడుచుండెడిది. తమ "లోధ్రను" మూడు బుడ్లను తెప్పించి యామెకొసంగితిని. నాచెల్లెలు స్వస్థురాలగుటయేగాకుండ నిపుడు బిడ్డలనుకూడ కనినది. తమ లోధ్ర స్త్రీలపాలిటి వరప్రసాదిని యనుటకెట్టి సంశయమునులేదు. మా స్త్రీల వ్యాధులకు తమలోధ్ర కల్పతరువువలె కన్పడుచున్నది."

శ్రీమతి ఎన్. కనకమ్మగారు, C/o నరసయ్యగారు, విలేజిమాజస్ట్రేటు, కదిరినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.—

"మీలోధ్ర 4 పెద్దబుడ్లను సేవించినాను. 4 నెలలనుండి కడుపునొప్పి బొత్తిగ నిలచిపోయినది."

### కర్ణాటక స్త్రీలు.

శ్రీమతి బి. ఇందిరా కుమారిదేవిగారు మెట్టూరునుంచి ఇట్లువ్రాయుచున్నారు.-

"నేను మీకేసరికుటీరం "లోధ్రను"ను సేవించుచున్నాను. తత్పూర్వము నాకు బహిష్ఠకాలమందు మిక్కిలి బాధకలుగుచుండెను. ప్రతినెలయును క్రమముదప్పి బహిష్ఠి యిరువది దినములోపుగనే యగుచుండెను. రెండు సంవత్సరములవరకు ఆసుపత్రియందు పుచ్చుకొంటిని గాని గుణము కనుపించలేదు. పిమ్మట వారు ఆపరేషన్ చేసుకొమ్మని చెప్పిరి; నేనిష్టపడలేదు. తమ "లోధ్ర" ప్రభావమువిని రెండుబుడ్లు పుచ్చుకొన్న తర్వాత మామూలుప్రకారము క్రమముగ 28 రోజులకు బహిష్ఠయగుచున్నాను. బాధలన్నియు నివర్తిఅయినవి. మరి రెండుబుడ్లు తమ "లోధ్ర"ను నాకు పంపగోరుచున్నాను."

శ్రీమతి జయలక్ష్మమ్మగారు, కొల్లిగల్ బాలికాపాఠశాల ఉపాధ్యాయిని, ఇట్లు వ్రాయుచున్నారు.—

"గడచిన మూడు సంవత్సరములనుండి, నాకు సరిగా ఋతుస్రావము కాకుండెను. రెండుమూడు నెలల కొకసారి బహిష్టు కలుగుచుండెను. ఇందువలన నడుమునొప్పి, కీళ్లనొప్పులు, బలహీనము, దేహము బరువుగతోచుట, మొదలగు బాధల ననుభవించుచుంటిని. మీ "లోధ్ర" రెండు సీసాలు తెప్పించి వాడినందులో పైకనిన వ్యాధులన్నియు మాయమైనవి. ఇపుడు సకాలమునకు బహిష్టుఅగుచు సుఖముగనున్నాను. మరియు రెండుసీసాలమందును వాడదలచినాను. నావలెనే బాధపడుచున్న స్త్రీలకు లోధ్రను వాడితీరవలెనని ఖండితముగా తెలుపుచున్నాను."

### క్రైస్తవ నారీమణులు

శ్రీమతి అన్నాచాండిగారు ఎం. ఎ. ఆనర్సు 'శ్రీమతి' సంపాదకురాలు, కొట్టయంనుంచి ఇట్లు వ్రాయుచున్నారు.—

“మీ ‘లోధ్ర’ను వాడినాను. స్త్రీల ఋతుసంబంధమగు జాడ్యముల నివృత్తికి అపూర్వమగు ఔషధరాజమని చెప్పగలను. తియ్యనిరుచిగల్గి, పథ్యపానాదుల పాలింపవలసిన అవసరము లేకుండుటచే, యీ మందును సంతోషముగ వాడవచ్చును.”

శ్రీమతి డాక్టరు అన్నతామస్ అమ్మగారు, బెంగుళూరు, ఆస్పత్రి సూపరిండెంటు, ఇట్లు వ్రాయుచున్నారు.

“ఇంగ్లీషు అవుషధములవల్ల గుణము లేనందున తమ “లోధ్ర”ను నాసోదరికి వాడితిని. ఆమెకు వాశ్చర్యమైన గుణము నిచ్చినందుకు సంతోషించుచున్నాను. ఇకమీదట ఈ యవుషధమును నారోగులకు వాడెదను.”

శ్రీమతి కె. ఇసయగారు, ఎ.బి. మిషన్, సత్తెనపల్లి, గుంటూరుజిల్లా, ఇట్లు వ్రాయుచున్నారు.

“మీ ‘లోధ్ర’వలన నాకుమిక్కిలి ఆరోగ్యముకల్గినది. నాకు వచ్చుచుండిన దగ్గునయమైనది.”

శ్రీమతి మిసర్సు. ఏ. దేవదాసుఅమ్మగారు ఇ. డబ్ల్యు. ఎమ్. స్కూలు, సాలిన్, మిర్జబుజిల్లా, ఇట్లు వ్రాయుచున్నారు——

“మీవద్దకొన్న “లోధ్ర” నాలుగు బుడ్లను, ఋతుస్రావదోషములచే బాధనొందుచున్న స్త్రీల కిచ్చినాను. వాటిని వాడినందున వారి రోగములు కుదిరినవి.”

## కేరళ వనితలు

శ్రీమతి ఎడపిల్లి పార్వతమ్మగారు తిరుచూరునుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

“నేను 25 సంవత్సరములుగ ఋతుసంబంధమగు జాడ్యములతో బాధపడుచుంటిని. ఎన్నియో మందులను వాడినను గుణమగుపడలేదు. తుదకు మీ ‘లోధ్రను’ కొద్దికాలము మాత్రము వాడగా అత్యద్భుతముగ రోగనివారణ గావించెను.”

శ్రీమతి అమ్ముకుట్టియమ్మగారు, సంగీత ఉపాధ్యాయిని, సర్కారుహైస్కూలు, తిరుచూరు, కొచ్చినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

“చాలాకాలముగ అనేక విధములైన గర్భాశయ రోగములవల్ల బాధనొందుచుంటిని. అనేక విధములైన చికిత్సలను పొందితిని గాని నివారణము కాలేదు. కడపట తమ “లోధ్ర” సేవించిన వారము రోజులలోనే గారడివిద్య వతుగ మందు పనిచేసెను. దాని ప్రభావమును వర్ణింపజాలను.”

శ్రీమతి మిస్‌గోపాలపణిక్కర్ గారు, శారదావిలాసము, చిత్తూరు, కొచ్చినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

“మీవద్దనుండి తెప్పించిన 6 లోధ్రబుడ్లలో 3 నేనును తక్కిన 3 మాచెల్లెలును సేవించుటచే మాయొక్క ఋతుశూలలు మాయమాయెను.”

శ్రీమతి మిసర్సుకర్తగారు, కోరోలి అమ్మనాత్ హౌవుస్, ఇరింజలకుడ, కొచ్చినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

“పది సంవత్సరములుగ ముట్టుకుట్టువల్ల బాధపడుచుంటిని. దానిని మీలోధ్ర అత్యద్భుతముగ నివారణచేసెను.”

# క్షీరవర్ధని

**: డబ్బాపాలు :**

పట్టుటవలన బిడ్డకు తృప్తి లేదు. ఆరోగ్యము లేదు. బలము లేదు. తన బాధ తెలిసికొని చెప్పుటకు తగినజ్ఞానము లేదు, గనుక, బిక్కమొగముతో చూచుచు విధిలేక త్రాగుచున్నది.



**: తల్లిపాలు :**

ప్రభావము తెలిసికొని చెప్పుటకు తగిన జ్ఞానమే బిడ్డకున్నయెడల, "అమ్మా, నాకు డబ్బాపాలువద్దు, నీవు క్షీరవర్ధని సేవించి, నాకు తల్లి పాలుత్రాగు భాగ్యమునిమ్మ అని యడుగును.

## ఆయుర్వేద భూషణ నోరి రామశాస్త్రి,
## ఆయుర్వేద నిలయము, బెజవాడ.

---

సెట్టిబలిజ

**తూర్పు పడమర గోదావరి, కృష్ణా జిల్లాల**

సెట్టిబలిజ సంఘపక్షమున వెలువడు మాసపత్రిక.

సాంఘిక—సారస్వత-రాజకీయ వ్యాసములకు, చారిత్రక, సాంఘిక నాటకములకు, కథలకు నిలయము. ఇందలి ప్రకటనలు మిక్కిలి లాభప్రదములు.

సంవత్సరపు చందా 3 రూపాయలు

వలయువారు సంపాదకుడు

సెట్టిబలిజ, అమలాపురము.

---

# క్షీరసముద్రం

ఈ రసాయనమును పాలుచాలని తల్లులు సేవించిన పాలు సమృద్ధిగావుండును. చనుబాలు త్రావినందులకే మనుష్యజాతికి బుద్ధిబలము, మాతాశిశువులకు ఆయురారోగ్యము. చనుబాలవంటిదవని, మోహపరచు ఆహారముల నీయకూడదు. రెండు మోతాదులకే గుణము.

మీనాక్షి ట్రేడ్ మార్కు సీసా 1 కి రు 1-4-0

**క్షీరసముద్రం డిపో, గుమ్మలూరు.**

పాలకొల్లుపోష్టు, ప॥ గో॥ జిల్లా

# రజోదర్శిని

తిమ్మసముద్రము

ఆర్యా. 28-5-29

"..........మీరు పంపిన 'రజోదర్శిని' మాత్రలు అనుకొనినంత గొప్పపనిచేసినవని తెలుపుటకు సంతసించుచున్నాను. 5 సంవత్సరములుగా రజస్వలకానటు వంటి స్త్రీ అనేకౌషధములవల్ల నయములేక విసిగినాతో సంప్రతించగా మీ 'రజోదర్శిని' ఒక బుడ్డి తెప్పించి యిచ్చితిని. ఈ బుడ్డి మాత్రలు పూర్తిగా అయిపోకమునుపే నిన్నటిదినం బయటచేరినది. తిరిగి రెండుబుడ్లు పంపగోరుతాను.

చిత్తగించవలెను

ఎ. పి. శర్మ.

రజోదర్శిని స్త్రీలకు గలుగు రజస్సంబంధమైన సమస్తవ్యాధులను నివారించును. రజఃకాలమున గలుగు కడుపునొప్పి, రజోదర్శనము కాకుండుట, స్వల్పముగా వెడలుట, మలబద్ధము, కడుపులో పోట్లు మొదలగు బాధలను పోగొట్టి, గర్భాశయమునకు బలమును గూర్చును-స్త్రీలకు పెన్నిధి వంటిది.

వెల 50 మాత్రలు రు 2 —

ఆర్ష రసాయనశాల

(ముక్త్యాల కృష్ణా.)

# హార్లిక్స్ వలన లాభము పొందిన సమూహమును చేరుడు




వృద్ధులు, యౌవనులు, తల్లులు, బిడ్డలు—వీరందరు ఏకగ్రీవముగ భూమండలమునంతటను హార్లిక్స్ యొక్క ఆహార గుణములను చాటించుచున్నారు.

ఇది నానిన గోధుమలు, బార్లీ, మీగడ, పాలతో తయారు చేయబడినది.

మా హార్లిక్స్‌ను వేడి లేక చన్నీటియందు కలుపుడు. అది ఆకలిని రుచిని కల్గించు పానీయ మగును. దేహదార్ఢ్యము, నరముల శాంతి, సుఖనిద్ర కల్గును.

**HORLICK'S**
**THE ORIGINAL**
**MALTED MILK**




# సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు

డాక్టర్. కే. ఎన్. కేసరి

సంపుటము 2.] [సంఖ్య. 8

లోధ్ర ముద్రాలయము, మద్రాసు

1929

౦॥ చందా రు. 4.  విడిసంచిక అ. 6.

# గృహలక్ష్మి

"యత్రనార్యస్తు పూజ్యంతే నందంతే తత్ర దేవతాః।
యత్రైతాస్తు నపూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియా॥

సంపుటము 2.  అక్టోబరునెల 1929.  సంచిక 8.

## విషయసూచిక.

Printed and Published by Dr. K. N. Kesari at Lodhra Press, Egmore, Madras.



# పసుపుకుంకుమలు

సోదరీ! పాశ్చాత్యనాగరికతాప్రభావమున మసకలు క్రమ్మిన నీ నేత్రముల నొకపరి తుడిచికొని దేవీనవరాత్ర్యుత్సవసందర్భమున అలంకృతమైయున్న ఆ ఆర్య గృహము నొకసారి తిలకింపుము. నూతనముగా సున్నముగొట్టుటచే ఆయింటిగోడలు ధవళధవళములై తనరారుచున్నవి. అప్పుడే చెట్టునుండి విఱిచి తెచ్చిన వగుటచే ఆ యింటిద్వారమునకు కట్టబడిన మామిడితోరణములు మరకతశ్యామలములై ప్రకాశించుచున్నవి. ఆధావళ్యమునకు, ఈశ్యామలతకు వన్నె పెట్టుచు ద్వారబంధపుకమ్ముల మీది పదియార్వన్నె పసిండిపూతయో అనిపించుచున్న పసుపుపూత, పసుపుపూతపై రేఖలుతీరిన కుంకుమపట్టీలు క్రాలుచున్నవి. గమనింపుము. తెల్లందనము, పచ్చందనము, పసిమితనము, ఎఱ్ఱందనము కలిసి ఆతలవాకిలి ఉన్మీలితచిత్రమువలె అపూర్వశోభతో నొప్పుచున్నది. అతిచంచలచిత్తగా వర్ణింపబడిన లక్ష్మీదేవి సహితము ఆగృహద్వారమును ఒకపరి తిలకించెనేని చంచలబుద్ధిని మాని స్థిరచిత్తయై ఆయింటియందే కాణాచిగా నిలిచిపోవకమానదు. పసుపుకుంకుమలు అలంకారద్రవ్యములై ఆర్యగృహిణికి ఎట్టి విధియోగసుఖము నిచ్చుచున్నవో చూచితివా?

సోదరీ! లోనికి పొమ్ము. రతనాలవంటి కుంకుమచుక్కలతో ముత్యాలవంటి సుద్ద బొట్టులతో పసుపుపూతచే సువర్ణచ్ఛాయ నలవఱచుకొని అలరారుచున్న దారుమయ సింహాసనముమీద ఉపాసకచింతామణియగు దేవి హస్తములందు అంకుశము, జపమాల, పాశము, వీణ ధరించి దర్శనీయయై ఒప్పుచున్నది. చూడుము. పాశ్చాత్యవిద్యచే భక్తిభావ

మును పూర్తిగ గోల్పోయిన నీశూన్యహృదయముకూడ నిప్పుడు భక్తిచే ఉద్దీపితమగు చుండుట లేదా? లేకపోయినచో రవలుచెక్కిన చేతిగాజులు ఘలుఘల్లుమన కరములేల జోడింతువు? ఆవిషయ మటుండనిమ్ము. పూజాపీఠముచెంత చెటియొక పళ్లెరమున నుండి నిజకాంతులు వెలిగ్రక్కుచు ఆవిశాలరమ్యప్రదేశమునకు అనూనశోభ తెచ్చుచున్న పసుపుకుంకుమలను పరికింపుము. తఱుగని ఐదువతనమును గోరి ఆ ఆర్యకుటుంబిని ఆపసుపును దేవి ఒడలికి పూయును; ఆకుంకుమతో దేవిని అర్చించును. పసుపుకుంకుమలు పూజాద్రవ్యములై ఆర్యగృహిణికి ఎట్టి ఉపయోగానందము నిచ్చుచున్నవో చూచితివా?

సోదరీ! అదిగో ఆకుటుంబిని నీరాకను చూచినది. పరవుమర్యాదల పారముచూచిన ఆమె నిన్ను సత్కరించుటకు త్వరగమనమున వచ్చుచున్నది. స్నేహితురాండ్రు నీ యింటికి వత్తురేని నీవు వారికి కరస్పర్శమిచ్చి కాఫీ త్రాగుమందువు. ఆకుటుంబిని ఇట్టి విచిత్రమర్యాదల నెఱుంగదు. చాపవేసి నిన్ను కూర్చుండ వేడి, నిరంతరము తులసిపూజచే ప్రాశస్త్యము వహించిన తన దక్షిణహస్తముతో నీ పాదములకు పసుపు పూయుచున్నది. కట్టిన పార్శీపువ్వులచీరెయంచుకు మరకలు తాకునని నీవు పసుపు పూయించుకొనుటకు జంకుచున్నావు. నీజంకును ఆ సుమంగళి గ్రహింపనేలేదు. పసుపు పూసి పారాణిపెట్టినది. నీవు ఆమెకంటె వయసున చిన్నదానవే. అయినను సత్కారావసరమున ఆమె చిన్నపెద్దతనముల పరిగణింపదు. నీపాదములనంటి పసుపుపూసి పారాణిపెట్టిన ఆమె వినీతభావము నిప్పుడైన గ్రహించితివా? అదిగో ఆమె—ఆర్యగృహమును ఎప్పుడును పాయనివస్తువ—కుంకుమబరణి తెచ్చి నీకు బొట్టుపెట్టుచున్నది. ఇంటికివచ్చిన పుణ్యస్త్రీలకెల్ల సుమంగళీ చిహ్నమగు తిలకమును ప్రసాదింపక ఆమెగడపదాటనీయదు. ఆహా! ఆమె సౌజన్యము! పసుపుకుంకుమలు సత్కారద్రవ్యములై ఆర్యగృహిణికి ఎట్టి శుభామోదము నిచ్చుచున్నవో చూచితివా?

సోదరీ! ఆ ఆర్యగృహిణి పసుపుకుంకుమలను అలంకారద్రవ్యములుగా, అర్చనద్రవ్యములుగా, సత్కారద్రవ్యములుగా నుపయోగించునది ఒక్క దేవీనవరాత్ర్యుత్సవముల సందర్భముననేకాదు. సకలశుభములకు ఆమెకు ఆద్యవస్తువులు పసుపుకుంకుమలే. నూత్నగృహప్రవేశమునకు పోవుచో పచ్చగ పసుపుపూసికొని ఎఱ్ఱగ బొట్టుపెట్టుకొని పార్వతీదేవివలె నొప్పుచు ఆమె పసుపుపొట్లము, కుంకుమబరణి ముందుగా గొనిపోయి ఆయింట నుంచును. కూపారంభమునకు కొబ్బరికాయ కొట్టవలసినచో ముందు దానికి పసుపు కుంకుమలు పూసి తీరవలెను. ఇంతయేల? సాధారణదినములలోనైనను నూత్నవస్త్రము ధరింపవలసినచో నామె దానికి పసుపుబొట్టుపెట్టి కాని మడత విప్పదు; విప్పనీయదు. వీధిని ఊరేగుచుపోవు అమ్మవారికి ఆమె బియ్యము సమర్పించుచో ఆపళ్లెరమున పసుపుకుంకుమ

లుండి తీరవలయును. సకలశుభములకు ప్రాతిపదికములు పసుపుకుంకుమలే యనుచుండ ప్రత్యేకించి ఇట్లు పేర్కొనన నేల ? పసుపుకుంకుమలు మంగళద్రవ్యములై ఆర్యగృహిణికి ఎట్లు శుభోపయోగము నిచ్చుచున్నవో చూచితివా ?

సోదరీ ! పసుపు కుంకుమల ఉపయోగము ఇంతమాత్రముకాదు. మంగళద్రవ్యము లగుటకు తోడు అవి ఆరోగ్యద్రవ్యములు కూడనై సంతానవతియగు ఆర్యగృహిణికి వినియోగపడును. చంటిబిడ్డకు కొండనాలిక వాలనిమ్ము. ఆమె కుంకుమ అద్దును. మఱునాటికి కొండనాలిక యథారీతిని ఒప్పును. ఎడబిడ్డకు గోరుచుట్టు కానిమ్ము. ఆమె పసుపు సున్నము కలిపి దానికి ఆరారగఁబట్టించును. రెండుమూడురోజులలో నది నయమైతీరును. గృహశౌచమునకై నీళ్లలో నానుటచే పాదములకు కలిగిన శీతదోషమును ఆమె పారాణి వలన పోకార్చును. పసుపుకుంకుమల ఓషధీగుణములను బాగుగా గ్రహించి వైద్యుని సాహాయ్య మక్కఱలేకనే క్షుద్రరోగముల నెన్నిటినో కుదిర్చి ఆమె సంసారమును దిద్దుచున్నది. పసుపుకుంకుమలు ఆరోగ్యద్రవ్యములై ఆర్యగృహిణికి ఎట్లు ఆరోగ్య సంపాదనమున తత్పరిరక్షణమున తోడుపడుచున్నవో చూచితివా?

"చూచితిని. అలంకారద్రవ్యములుగా, ఆరాధనద్రవ్యములుగా, సత్కారద్రవ్యములుగా, మంగళద్రవ్యములుగా, ఆరోగ్యద్రవ్యములుగా గణనాతీతకాలము నుండి ఆర్యగృహములను వెలయించుచున్న పసుపుకుంకుమల ఉపయోగము తెలిసికొంటిని; వాని ప్రయోజనము గ్రహించితిని. అనర్ఘమగు ఆర్యజాతియందు జనియించినందులకు నేనుకూడ వానిని విరివిగ నుపయోగింతును." అని, సోదరీ ! ఆద్యకుటుంబిని యగు ఆదేవి పవిత్రపాదపంకేరుహములపై దృష్టి నిలిపి నీవు చేయెత్తిచెప్పుము. 'దీర్ఘసుమంగళీభవ' అని జగదీశ్వరి, జగద్ధాత్రి, భక్తాభీష్టప్రదాయిని అగు ఆదేవి నిన్ను దీవించును.

## సుమంగళీచిహ్నములు

### శ్రీనాథమహాకవి

పసపుం గుంకుమ కజ్జలంబు నునుగూర్పాసంబు తాంబూలమున్
గుసుమంబుల్ కబరీభరంబు చెవియాకుల్ మంగళాలంకృతుల్
విసు వొక్కింతయు లేక తాల్పవలయున్ వీనిన్ సదాకాలము
న్నసిఁ జక్కంగఁ బ్రియుండు వర్ధిలుటకై నాళీకపత్రాక్షికిన్.

# గుడిపూడి ఇందుమతీదేవి

డాక్టరు కే. యస్. కేసరిగారు

స్త్రీవిద్య బొత్తిగా తక్కువగానున్న ఈదినములలో కష్టసాధ్యమగు కవిత్వరచనము నందారితేరి పురుషులకుకూడ పరమాశ్చర్యము పొడమునట్లు గ్రంథములు రచియించు కాంతామణులు గలిగిరేని అది దేశమాత యదృష్ట మనవలయును. దేశమాత అదృష్టమునకు తార్కాణమై ఆధునికాంధ్రకవితాప్రపంచమున వెలుగొందుచున్న విదుషీమణులలో శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవిగారి నామము చిరప్రతిష్ఠితమైనది. ఆమెరచించి ప్రచురించిన 1 సోదరి; 2 తరుణీశతకము; 3 గాంధిపాటలు; 4 రాజరాజేశ్వరీశతకము; 5 నరసింహాశతకము అను గ్రంథములను స్థాలీపులాకన్యాయమున ఒక్కింత పరామర్శించితిమేని ఆమె ప్రజ్ఞాపాండిత్యములు వెల్లడికాగలవు.

'సోదరి' అనుగ్రంథము హిందూకుటుంబములయందు సాధారణముగ సంఘటిల్లు నొకపరిస్థితినిగూర్చి వ్రాసిన పద్యకావ్యము. ఈ కావ్యపుష్పము చక్కగవికసించి మంచి తావిని వెదజల్లుచున్నది. 'రాజేశ్వరమ్మసోదరుడు సోదరిపై వాత్సల్యము కలవాడే గాని గయ్యాళియగు భార్యకుజంకి చిరకాలము సోదరిని చూచుటయేమానినాడు. తుదకు రాజేశ్వరమ్మభర్తకు ఉద్యోగము ఆమె అన్నగారి యూరనే అగుట తటస్థించెను. ఊరిలోనికి వచ్చినప్పుడు కూడనన్నయుఁదాను విముఖులై యుండుట కోర్వలేక మేనకోడలిని తన కుమారునికి చేసికొనియైన పుట్టినింటికిరాకపోకలగలిగి సంతసింపవలెనని ఆమె కుమారుని నన్నకడకంపెను. వదినకు సుతరాము ఇష్టములేకున్నను రాజేశ్వరమ్మ సిద్ధసంకల్పయై మేనకోడలిని కోడలిగనొనర్చుకొనెను.' ఇది ఈ కావ్యమందలి ఇతివృత్తము. అతిమనోహరముగ నిర్వహింపబడినది. 'మంచికిఁబోవ చెడుగగునను మాటనిజము' 'గంతకునుఁదగుబొంత' 'నీళ్లకుండనెత్తినమండు' మొదలగు సామెతలను వాడి ఈమె తన శైలికి అందమును చేకూర్చినది. అన్నకు చెల్లెలికి గలిగిన చిరవియోగానంతరసమాగమమును, సిద్ధసంకల్పులైన అన్నచెల్లెండ్రహర్షమును కవయిత్రి ఇట్లు లలితముగ వర్ణించినది.

అన్నయంట చెల్లెలను రాగవతియంట
మానసములు ప్రేమమయములంట
చాలరోజులకును సందర్శనంబంట
యెట్లులుండు వారికెంచిచూడ?

అన్న చెల్లెలి హర్ష మింతంతగాదు
చింతగింజను మొలవేసిపంత మొప్ప
పులకసుద్రాగితి మనుచు నుప్పొంగుచుండ్రి
మెలతలకు పుట్టినింటిపై మెండుప్రేమ !

ఈవాక్యములెంత సత్యసుందరములుగా నున్నవి? ఈ గ్రంథము సోదరీమణులకు లోకవర్తనవివేకమును కలిగించుచు సతులెట్లుమెలంగవలయునో యెరుకపరుచుచున్నది.

ఇక గాంధిపాటలనుగూర్చి. లోకోత్తరపురుషుడగు గాంధిమహాత్మునిచరిత్ర, ఆతడు దేశమున కొనర్చుచున్న సేవ పాటల మూలమున గానము చేయబడినది. హార్మోనియము మీద రాగవరుసతో ఈ పాటలు చదువబడునప్పుడు గాంధిమతమునకు వ్యతిరేకవాదులు కూడ ఉప్పొంగి పొంగిపోయెదరనుట సత్యదూరముకాదు.

తరుణీశతకము, రాజరాజేశ్వరీశతకము, నరసింహాశతకము—ఇందు తరుణీశతకమున స్త్రీలు నేర్చుకోదగిన పెక్కునీతులు, ధర్మములు జిగిగల కందపద్యములలో ప్రస్తావింప బడినవి. స్త్రీలెల్లరు చదువతగియున్నది. శైలికి రెండుపద్యములు చూపెదను.

కం. తొందర జెందకు కోపం బందకుమా పరులఁ దూలనాడకుమా కా
లెందైన జారగా తీయందగు నీకనోరు జార నగుసేతరుణీ !

కం. వరభూషణజాలంబులు ధరియింపఁగఁ జేయకమ్మ తగబిడ్డలకుఙ
తరిగని కైకొందురు తస్కరులటుపై బ్రాణహానికరమగుఁ దరుణీ !

రాజరాజేశ్వరీ శతకము బెజవాడ కడ గుంటూరుమండలముననున్న తాడేపల్లి గ్రామమున వెలసిన దేవతపై చెప్పబడినది. ఈశతకము భక్తిభావమునేగాక నీతినిగూడ బోధించుచున్నది.

మురిపెంపు పెండ్లికూతురవై శిరమువాంచి శర్వునిపైఁ దలఁబ్రాలుఁ జల్లునాడు
పాపపేరులగారచి భయపడ్డచందాన నొక్కచెంప కొదిగియుండునాడు
పల్లవమృదుపాణిపద్మంబులను బ్రీతి యొప్పార హరు నంఘ్రులొత్తునాడు
అర్ధశరీరంబు నాక్రమించియు నండ బాయక నెవ్వేళ బఱగునాడు
వీగరౌద్రాద్భుతావేశ మొప్పఁగ విజృంభించి రాక్షసుల మర్దించునాడు
ముగ్ధశృంగారవిస్మయ మూర్తివౌచు
రౌద్రమూర్తివినై నవరసము లొప్ప
నొనర నొక్కొక్కవేళ నొక్కొక్కరీతి
హర్ష మొదవించితివయారె హరునిమదికి
రాజరాజేశ్వరీ! భృంగరాజి చికుర!

నరసింహాశతకము మంగళాద్రియందు వెలసిన నరసింహమూర్తిపై చెప్పబడినది. ఈశతకమునందలి క్రిందిపద్యము ఈ విదుషీమణి ఎంతటి పతిభక్తిపరురాలో తేటతెల్లము చేయుచున్నది.

కం. నానాథుని సఫలీకృతమనోరథునిఁజేసి ప్రోవుమా దయతోడఙ
నీనామమె దలఁచెద నీ యానసుమీ మంగళాద్రియమలనృసింహా !

ఇట్టి మనోహరగ్రంథము లింకను పెక్కులు రచియించి ఈ విదుషీమణి రమణీ లోకమునకు ప్రతిష్ఠను సారస్వతలోకమునకు పుష్టిని గొనివచ్చు అవకాశమును గల్గింప జగన్నియంతను పవిత్రభావముతో ప్రార్థించుచున్నాను.




## శ్రీమతి యం. సి. సుబ్బమ్మ గారు



యం. సి. సుబ్బమ్మ గారు

ఇంగ్లాండు, అమెరికా మొదలగు నాగరిక దేశములందు స్త్రీలు తమ తమ విశ్రాంతి సమయములందు చేతిపనులలో నిమగ్నలై పలువిధములగు వస్తువులను తయారు చేసి బజారులలో వానిని విక్రయించుటకు తగువసతుల నేర్పాటు చేసికొని ధనమును సంపాదించి తమ తమ సంసారముల ఆర్థికసంపత్తికి చక్కగ తోడుపడుచున్నారు. మన ఆంధ్రదేశమున నానాట స్త్రీలు వంటకము చేయుటకుకూడ నశక్తలగుచున్నారు. విరామసమయములందు వారు అనవసరప్రసంగములతో కాలమును వ్యర్థపుచ్చుచున్నారు. ఇది ఎంతమాత్రము పొగడదగినదికాదు. తీరికసమయములందు కుట్టుపని, అల్లిక మొదలగు పరిశ్రమలు నేర్చుకొనుట మంచిది. అందుకని కొన్నిమోస్తరు అల్లికలను గూర్చి ఇందు సచిత్రముగ తెలుపుచున్నాను. వానిని చదివి అలవఱచుకొని నా సోదరీమణులు తగిన లాభమును బడయుదురుగాకయని కోరెదను.

## అల్లికలు

అల్లికలకు ముఖ్యముగా కావలసినవి నూలు, సూది. నూలు క్రోషాఅను సీమదారమునైనను లేక పదియవ నెంబరు సాదాదారమునైనను వాడవచ్చును. మొట్టమొదట కొంత శ్రద్ధవహించినచో చాల సులభముగా నేర్చుకొనవచ్చును. గొలుసుఅల్లిక, జారుడుఅల్లిక, జడఅల్లిక, రెండుజడలఅల్లిక, మూతఅల్లిక, గూడుఅల్లిక, మూతగూడుఅల్లిక అని అల్లికలు ఏడువిధములు.

## గొలుసు అల్లిక :—



౧-వచిత్రము



౨-వచిత్రము



3-వచిత్రము

సాధారణముగా అల్లికపనులకు పునాది వేయవలయునన్న మొట్టమొదట గొలుసు అల్లిక నేర్చుకొనవలయును. గొలుసుకుట్టు మొదలు పెట్టుటకుగాను, మొట్టమొదట దారముతోటి ౧-వచిత్రము విధముగా దారముతోటి వలయము నొకదానిని నేర్పరుపవలయును. అటుల వలయాకారముగా నేర్పరచినచో దారము నొకదానిపైన నొకటి చేరును.

ఆ గమ్యస్థానమును అనగా దారముయొక్క కిలియకను మనయొక్క యెడమచేతి బొటనవ్రేలితోడను చూపుడువ్రేలితోడను పట్టుకొనవలయును. తతిమ్మా దారమును (ఉండను) మనయొక్క నడిమివ్రేలు, ఉంగరపువ్రేలు లేక చిటికెనవ్రేలు వీని సందులోనుండి క్రిందికి జారవిడువవలయును.

కొక్కెముగల అల్లికసూదిని కుడిచేతితో పట్టుకొని వలయములో దోపి దారమును బయటికి లాగవలయును. (౨-వచిత్రము చూడుడు.) తదుపరి అల్లిక సూదియొక్క కొక్కెమును వదులుగా వలయములో దోనుపుతూ 3-వ చిత్రము విధముగా సూదిపైని దారమును త్రిప్పి లాగుచున్నయెడల జడయేర్పడును. తద్విధముగానే అల్లదలచుకొన్న వస్త్రమెంత పరిమితి యుండవలయునని తలచెదమో అంతపొడవు గొలుసును అల్లవలయును. సాధ్యమైనంతవరకు జడఅంతయు నొకేమందముగానుండులాగున చూడవలయును.

## జారుడు అల్లిక :—

తయారుకాబడినగొలుసు (జడ) యొక్క ఒకచివరనుండి మరియొకచివరకుపోవు సులభమగు కుట్టుకే జారుడుఅల్లిక అనబడును. దారముయొక్క వలయమును కొక్కెములోనుంచి, జడ యెడమవైపు కుట్టులో దొనిపి దారమును లాగుతూ జడయొక్క రెండవకుట్టులో దొనిపి లాగవలయును. ఇదే విధముగా కడవఱకు అల్లవలయును.

## జడ అల్లిక :—

మొదలుఅల్లిన గొలుసు (జడ)ను రెండింతలు వెడల్పుగానుండులాగునఅల్లుటకే జడఅల్లికయని పేరు. దీనిని జారుడుఅల్లికవిధముగానే దారముయొక్క వలయమును కొక్కెములో నుంచి జడయెడమవైపు కట్టులో దొనిపి ౫-వచిత్రము మోస్తరుగా సూదిపైన రెండు దారము పోగులురానిచ్చి లాగవలయును. అదే ప్రకారము అల్లినచో జడఅల్లిక తయారు అగును.



౪-వచిత్రము



౫-వచిత్రము

### మూడు జడ అల్లిక :—

రెండు జడలల్లికకును దీనికిని కొంచెము భేదము కలదు. రెండు జడలల్లికకు సూదిపైన రెండు దారము పోగులును లాగవలయును. దీనికి మూడుపోగులు వేసి యీడ్చవలయును. తక్కినవిధానమంతయు రెండుజడ లల్లికవలెనే జరుప వలయును.



౬-వచిత్రము

### మూత అల్లికలు :—

తయారుచేయదలచు వస్త్రము యెంత పొడవు కావలయునో అంత పొడవు జడఅల్లిక అల్లి తదుపరి సదరు జడయొక్క చివరనుండి మనకు మూత యెంత వెడల్పు వుండవలయునో అంత పొడవు పిల్లజడలు అల్లుతూ మొదలు అల్లిన జడతో కలుపుతూ రావలయును. అటులచేసినయెడల మూత అల్లిక యేర్పడును. ౭-వ చిత్రమును చూడుడు.



౭-వచిత్రము

### గూడు అల్లిక :—

ఎనిమిదవ చిత్రమే గూడు అల్లిక అనబడును. మూతఅల్లిక అల్లువిధముగానే జడయొక్క కొన నుండి పిల్లజడలు అల్లుతూ మనము యెంత పరిమాణముపెట్టి గూడువుండవలయునని తలతుమో అన్ని పక్కజడలు యెంచుకొని పిల్లజడను తల్లిజడతో అతికించవలయును.



౮-వచిత్రము

### మూత గూడు అల్లిక :—

ఏడు ఎనిమిది చిత్రముల విధముగా అల్లుటకు బాగుగా నేర్చుకున్నతరువాత మనకు యెక్కడెక్కడ గూడు కావలయునో అక్కడక్కడ గూడు వదలుతూ మూడు జడలల్లికవిధముగా యెంతవరకు మూయవలయునో అంతవరకు మూయ వచ్చును.



౯-వచిత్రము

పై తొమ్మిదివిధములగు అల్లికలు బాగుగా నేర్చుకున్న తదుపరి పువ్వులు, ఆకులు, జంతువులు పక్షులు మొదలుగాగల చిత్రములుకూడ వేయుట సులభము.

# స్త్రీ

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

చరాచరాత్మకంబైన యీవిశాల విశ్వమునందు సగభాగము స్త్రీ. స్థావరము లగు పర్వతవృక్షాదులలో స్త్రీ పురుష వివక్షతయున్నది. జంగమములగు జంతుజాలములో స్త్రీ పురుష భేదమున్నది. గగనచరములగు పక్షులు; జలచరములగు మత్స్యతిమింగిలాదులు; భూచరములగు పశుమృగములు, సరీసృపములు, క్రిమికీటకములు; వేయేల, అన్నిటను స్త్రీ పురుషతారతమ్యమున్నది. వివేకరహితములైన ప్రాణిచయము నందే స్త్రీపురుష విభేదముండ నిక మానవజాతిని గురించి చెప్పవలసినదేమి? అంతయెఱిగి నదే. కావుననే విశ్వరూపుడైన యీశ్వరు డర్ధనారీశ్వరుడు.

౨

జాత్యభివృద్ధి-స్త్రీపై విశేష మాధారపడియున్నది. ఇది మానవులలోనే కాదు. సకలజంతుజాలమునందును, కేవలము జాత్యభివృద్ధిమాత్రలాభమునకై మంద కొఱకుమగ జీవమునుంచి గొల్లబోయ గొఱ్ఱెల నిలుపుకొని పుట్టిన పొట్టేళ్లనెల్ల నమ్మివేయుచుండును. సూకరపాలకుడు ఆడుపందుల నిలుపుకొని మగపందుల నమ్మివేయును. గృహమేధి పెట్టల నుంచుకొని కోడెల విక్రయించును. ఎందువలన? ఆడువాని నుంచుకొనుటచే తమమంద తామరతంపరగా పెంపొందునని. కాన జంతుజాలమునందు మగవాటికంటె యాడుజంతువులకే ఘనత యెక్కువ.

3

మానవజాతియందు స్త్రీయొక్క పలుకుబడి తద్భిన్నము. మానవజగత్తున స్త్రీ జడము, పురుషుని కార్యసాధన కొఱకయుపకరణము, సంతానమును ప్రసాదించు జీవ యంత్రము. స్త్రీకి స్వకీయమైన దేహముగలదు, మనస్సుగలదు, బుద్ధిగలదు. కాని ఆదేహమనోబుద్ధులు స్వతంత్రములుగావు; పురుషచిత్తానుసారములు. పురుషుని చిత్త

వృత్తికి బద్ధమై స్త్రీ దైహికములైన తన సుఖముల విడనాడుకొనవలెను. మానసికములైన తన వాంఛలను జంపుకొనవలెను. బుద్ధిజన్యమైన తన పరిజ్ఞానమును నశింపజేసికొనవలెను. ఈ విధముగా స్త్రీ సమూలము పురుషుని యంతఃకరణమునకు లోబడియుండుట యావత్ప్రపంచమునను బహుకాలము చెల్లుబడియైన ప్రభుత.

౪

అయితే యావత్కాలమును తన యందర్ధభాగమైన స్త్రీని యచేతనోపకరణముగా నుంచుట పురుషునకును కష్టముగానే తోచినది. తుల్యమగు దేహమనోబుద్ధ్యాదులు గలిగియు జడముగా నుండుట స్త్రీకిని దుర్భరమే యనిపించినది. స్త్రీకి కొంత స్వాతంత్ర్య మీయవలయునను యూహ పురుషునకును, తాను కొంత స్వాతంత్ర్యమును బడయవలె ననెడి యూహ స్త్రీకిని క్రమక్రమముగా బలపడజొచ్చినది. ఈ యూహను తొలుదొల్త ఆచరణయందు బెట్టినవారు పాశ్చాత్యులు. పాశ్చాత్యదేశములందు స్త్రీలకు మొదట యొసంగబడిన స్వాతంత్ర్యము విద్యాప్రదానము. ఎప్పుడు విద్యయను తాళపుచెవిచే మూయబడియున్న స్త్రీ జ్ఞానకవాటము తెఱవబడెనో అప్పుడే అవకాశములేక నిద్రాణములైయున్న స్త్రీ శక్తిసామర్థ్యములు బయల్పడసాగినవి. విజ్ఞానమునందు పురుషుడెంత యుచ్చస్థితికి వెళ్లెనో స్త్రీ గూడ అంతయుచ్చస్థితికి వెళ్లినది. శాస్త్రములలో అసమాన పాండిత్యమును సంపాదించినది. కళలలో అనంతకౌశలమును గడించినది. కవితలో నిరుపమానశేముషిని జూపించినది. ఎందును స్త్రీ పురుషునకు తీసిపోలేదు. రత్నము ప్రకాశింపమికి కారణము జాతితక్కువచే గాదు, సానబెట్టమియేయని విద్యావతియగు స్త్రీ తన సర్వతోముఖమగు వైదుష్యసంపదచే నిరూపించినది. ధీవిశేషమున స్త్రీ పురుషునకు కొంచెమనుట కిక వీలులేదు.

౫

స్త్రీ విద్యావతియైనది. అయితే ఆమె వైదుష్యమును ప్రకటించుట కామె కన్నిటను ప్రవేశస్వాతంత్ర్యముండవలెను. స్త్రీకి స్వాతంత్ర్య మిచ్చుటయన పురుషుడు తన యాధిపత్యమును కుంచించుకొనుట. నిజముగా నదికష్టమే, కాని విద్యావతియైన పాశ్చాత్యస్త్రీ క్రమముగా ఉద్యోగస్వాతంత్ర్యమును బడసినది. వైవాహికస్వాతంత్ర్యమును బడసినది.

మతస్వాతంత్ర్యమును బడసినది. రాజకీయస్వాతంత్ర్యమును బడసినది. రవియస్త మింపని బ్రిటీషుసామ్రాజ్యపాలకసచివమండలియందు నేడు స్త్రీ గూడ నొకమంత్రిణి. వేయేల ఆంగ్లరాజ్యాంగములో నిరంకుశాధికార మతమునకు జెందినవారైన కన్సర్వేటివు పక్షమువారిని బోద్రోచి ఉదారమతమునకు జెందిన కార్మికపక్షమువారికి రాజ్యాధికార మొసఁగిన విశాలహృదయులు స్త్రీ ఓటర్లే.

౬

భరతదేశమున స్త్రీ యింకను జీవయంత్రమే. నాగరకరాజ్యములలో నగ్రగణ్యమైన బ్రిటిషుసామ్రాజ్యపరిపాలనకు లోబడియున్నను స్త్రీలకు విద్య కూడదను వారిప్పటికిని మనదేశమున లక్షలు, కోట్లు. అనగా నర్థమేమి? విద్యాప్రయోజనమును పురుషులే గుర్తింపలేదన్నమాట. హిందూస్త్రీ యెంత ముకుచుకొని మూలకొదిగిన యంత ఉత్తమురాలు. మాలోగూడ విద్యావతులున్నారని గర్వముతో జెప్పుకొనుటకై వేదయుగమువారి నొకరిద్దఱిని, పురాణయుగము వారి నొకరిద్దఱిని, ఇతిహాసయుగమువారి నొకరిద్దఱిని, మనము జేర్కొనుచుందుము. వారు భరతవర్షాకాశము నావరించిన నీలజీమూతమునందు అపుడపుడు పొడసూపిన జ్యోతిర్లతలు. కాగితముపై వ్రాయునప్పుడు వారి పేరులు దగ్గఱదగ్గఱగానున్నను వారిలో నొకరికొకరికి మధ్య సహస్రాబ్దముల అవధి యున్నది. వారి ప్రసక్తియిపుడేల? మన మిప్పుడు పర్యాలోచించునది అశేషస్త్రీజనమును గూర్చి. భారతదేశమున స్త్రీ చచ్చుపడిన అవయవమువలెనున్నది. చేతనప్రాయమైన విద్యాసంస్కార మామెకులేదు. జీవగఱ్ఱయైన విద్యకు దూరమగుటచే నామె తన పారతంత్ర్యమును తాను గుర్తెఱుగకున్నది. తనదాస్యజీవనమును తాను తెలియనేరకున్నది. తెలియజెప్పినను తెలిసికొనెడు వివేకము, ఇచ్చినను వినియోగించుకొనెడి నేర్పు, ఆమెకిప్పుడు లేదు. ఆమెశక్తిసామర్థ్యములు హృదయకుహరమనెడి చీఁకటికొట్టులో అవకాశము లేక బహుకాలమునుండి అడగియున్నవి. అవి యిటీవల బహుప్రయత్నముమీద నించించుక బయటబడుచున్నవి. కాని మతము, సంఘము, ఆచారములు, బంధువర్గము నాదిగాగల పాశములు పెక్కులు భారత స్త్రీని పెనచి పెనచి చుట్టుకొనియున్నవి. వీనిలో నేపాశబంధమును వదలించుకొనయత్నించినను స్త్రీ లోకగర్హ్యయగును. తోడి

స్త్రీలోకమే యామెను ఛీ,ఛీ యని దూఱును. పురుషప్రపంచ మామె నెకసక్కె మాడును. పూర్వాచారపరాయణులు రామబాణములవంటి తీర్మానములు చేసికొని వైస్రాయివద్దకు రాయబారములకు బయలుదేరుదురు. కావుననే మానుషమే ధనముగా నెంచు భారత స్త్రీ మూలకొదుగును గాని ముందుకురాదు.

అయితే యెంతకాల మీస్థితి? తమకు దోచకపోయినను నితరులను జూచియైనను నేర్చుకొనవలెను గదా! అపూర్వమైన ప్రాచీననాగరకతగల భారతదేశము నేడు పరాధీనమై నాగరక రాజ్యములలో కొట్టుకొనుచున్నది. దీని పునరుద్ధరణ మత్యవసరమని వివిధపరిస్థితులు విశదీకరింపుచున్నవి. భారతదేశపు ప్రజాసంఖ్యయందు సగమునకు మిగిలి యున్న స్త్రీభాగము జడమైయున్నది. పురుషుడేదైన ఘనకార్యము చేయబూనినచో నాతని వామభాగమైన స్త్రీ యాతనికి చేయూతనీయదు, సరిగదా యాతని యుత్సాహ శక్తినిగూడ దిగదీయును. అంతటితో కుడిభాగమునకుగూడ జడభావమబ్బినట్లే. ఈలోప మెవరిది? భారతదేశపు ధర్మగ్రంథములందు పురుషునకు స్త్రీ సహధర్మిణియని వ్యవహరింపబడును. ఇది బహు అర్థయుతమైన పదము. పురుషుడుచేయు సకలధర్మములకు తోడ్పాటు చేయుటచే యామె సహధర్మిణియనబడినది. అయితే ఇప్పుడు భారత స్త్రీ పురుషునకు సహధర్మిణిగా నుండుటలేదు. భారతదేశమునందు స్త్రీ పురుషుల పొత్తు—యజమాని, బానిసి—తుల్యముగానున్నది. పురుషుడు నిర్దాక్షిణ్యముతోగూడిన తననిరంకుశత్వమునువీడి ఆమెకు విద్యాబుద్ధులు గఱపి ఆమెను నిజమైన సహధర్మిణిగా జేసికొనవలెను. అప్పుడామె యాతని కార్యపరత నడ్డుపెట్టదు. మఱియు చేయూతనిచ్చును.

## ౨

స్త్రీ యొక్క తోడ్పాటులేక ఏ మతమును వ్యాపింపబడలేదు. ఏ సాంఘిక వ్యవస్థయు చక్కబడలేదు. ఏశిథిలరాజ్యమును పునరుద్ధరింపబడలేదు. ఏపరాధీన దేశమును స్వతంత్రతను బడయలేదు. నేడు భారతదేశము మతసాంఘిక రాజకీయార్థికానేకముఖముల శైథిల్యతనుజెంది పునర్నిర్మాణమును గోరుచున్నది. ఇదియొక పురుషునిచే నేమగును? స్త్రీ తోడ్పాటాతనికి గావలెను. కాని ఇంతకాలము నుండియు వంటయింట

మాటుమణగియున్న భారతమహిళ విద్యాసంస్కారమును జెంది మూఢతను బాపుకొని కార్యక్షేత్రమున ప్రవేశించి పురుషునకు చేయూతయై యాతనితోబాటు మతవ్యవహార ములను సంస్కరింపవలెను. సాంఘికవ్యవస్థలను చక్కజేయవలెను. దురాచారములను భంజింపవలెను. రాజకీయములను పరిష్కరింపవలెను. ఆర్థికలాభములను గమనింపవలెను. అంతియేగాదు: శిథిలభారతావని నుద్ధరింపగల కర్మవీరులైన తనయులను, సేవాపరాయణ లైన తనయలను ప్రసాదించు మహాభారముగూడ భారతస్త్రీపై నేయున్నది. విద్యావతి యైన తల్లికడ శిక్షణమువడసిన బాలబాలికలే నవ్యభారతనిర్మాతలు.

దేశముకొఱకు కాకపోయినను నేడు భారతమహిళ తనకొఱకైన తాను మేల్కొ నకతప్పదు. హిందూసంఘములోని అసమవివాహములు స్త్రీజీవితమును దుఃఖ భాజనముగా జేయుచున్నవి. వరశుల్క కన్యాశుల్కాదిదురాచారములు స్త్రీపురోభి వృద్ధిని భంగపఱచుచున్నవి. ఆర్థికములగు వారసత్వాధికారములు స్త్రీకి అన్నవస్త్ర ములకు కొఱతను కల్గించునవిగా నున్నవి. రాజకీయస్వాతంత్ర్యము లనెడిపేర స్థానిక సంఘములలో చట్టసభలలో స్త్రీలకీయబడుచున్న యొకటిరెండు ప్రభుత్వనియమితసభ్య త్వములు వట్టి మేడిపండులు. దీననేమగును? స్త్రీ నిజమైన అధికారమును బడసి తనజాతి సౌభాగ్యమును తాను పరిశీలించుకొనవలదా?

ర

ఉన్నతవిద్యావతులైన స్త్రీలను కొందఱి నిప్పుడందందు కనుచున్నాము. ఇది శుభావహమే. అయితే ఆ స్త్రీలు గమనింపవలసిన విషయములు కొన్నియున్నవి.

స్త్రీ విద్యావతికావలెనుగాని గర్వమునకు పట్టుబడరాదు. కళావతికావలెనుగాని నీతిచ్యుతికి బాల్పడరాదు. మతము నుద్ధరింపవలెనుగాని విడనాడరాదు. వైవాహికధర్మ ములను సంస్కరింపనగునుగాని విచ్ఛిత్తిజేయరాదు. ప్రణయమధువును గ్రోలనగునుగాని విశృంఖలత పనికిరాదు. అధికారపదవుల వహింపనగునుగాని ఆత్మగౌరవమును కోల్పోవ గూడదు. నాగరకరాష్ట్రములలోని విజ్ఞానము నెంతైన యుపార్జింపనగునుగాని నిజ జాతీయతను త్యజింపరాదు. ఇతరులకడగల పరిజ్ఞానబుద్ధి నలవర్చుకొనవలెను. కార్య దీక్షను నేర్చుకొనవలెను. నిర్వహణసామర్థ్యమును గ్రహింపవలెను. జాతీయాభిమాన

మును గుర్తింపవలెను. కాని తాను వారు కాగూడదు. తనవిశిష్టత్వమును చెఱచుకొన రాదు. తన జాతిని, తన దేశమును విస్మరింపగూడదు. ఏ అన్యనాగరకత పైని మోహము కూడదు. గుణగ్రహణమే కావలసినది.

ఇట్టి విచక్షణా జ్ఞానముగల స్త్రీయే దాస్యశృంఖలములను తెంపును. జాతీయతను కాపాడును. దేశపరాధీనతను బాపును. దేశకల్యాణమునకు దోడ్పడును. అట్టిది స్త్రీ.

౬

జాతీయపాఠశాలలు జాతీయదురభిమానమును గలుపుచున్నవి. ప్రభుత్వపు పాఠశాలలు విదేశీయనాగరికతా వ్యామోహమును పెంపొందింపుచున్నవి. ఈ రెండింటికిని పట్టువడక స్త్రీ విద్య నార్జింపవలెను. స్త్రీకి ధీబలమునకు తక్కువలేదు. సాహసమునకు కొఱతలేదు. కార్యకౌశలమునకు తరుగులేదు. మందీకృతమైయున్న యామె ప్రజ్ఞానలమును ప్రజ్వలింపజేసినచో ఆమె రాజ్యముల నిర్మించును. రాజ్యాంగముల నడుపును. యుద్ధముల జేయును. మతముల స్థాపించును. ఆమెకు చొప్పడని దేదియులేదు. భారతదేశమును దాస్య శృంఖలముల బంధించినది పరప్రభుత్వముగాదు. నిద్రాణమైయున్న స్త్రీజాతియే; ఎప్పుడు స్త్రీ మేల్కొని దాస్యవిముక్తయై కార్యక్షేత్రమున బ్రవేశించునో అప్పుడు భారతదేశము సర్వతోముఖాభివృద్ధిని జెంది జగన్మోహనముగ విరాజిల్లును. అట్టి కల్యాణదినములు భారతావని కనతికాలములో చేకూరునట్లు భగవాను డనుగ్రహించునుగాక!

# భార్య

శ్రీమతి మదిన సుభద్రమ్మగారు

ఘనపరిచర్యలందుఁ, దగుకార్యములందును, ధర్మసంగరం
బున, శయనించువేళలను, భోజనకాలమునందునన్, క్షమా
గుణమున—దాసి, మంత్రి, యనుకూలియు, రంభయుఁ, దల్లి, ధాత్రిలా
గున జరియించు భార్య కులగోత్రము లెంతయు నుద్ధరించెడిన్.

# దాది

### శ్రీమతి ఉధ్యసుబ్బలక్ష్మమ్మగారు

రోగార్తులకు మనోశాంతియు బాధానివృత్తియు కల్గించుటకు హృదయమే కారణము. దాదియగునట్టి వ్యక్తికి దయార్ద్రహృదయము, సాత్వికగుణము, కోమలస్పర్శయు నవసరములు. ఇట్టి గుణములు స్త్రీల యధీనమగుటచే, యుగాంతరములనుండి వారే రోగులకు శుశ్రూషనొనర్చుచున్నారు.

ఋగ్వేదకాలమున జాడ్యపీడితుడైన ఇంద్రునికి సోమపానము చేయించినది అపాలయను స్త్రీ; యజుర్వేదకాలమున ఒకానొకప్పుడు ఇంద్రుడు వ్యాధిపీడితుడై జవసత్వములుడిగియుండ అశ్వినీ దేవతలు సరస్వతిని వెంటనిడుకొని వెళ్లియుండిరి. ఆమె ఇంద్రునకేదో మహత్తరమగు నౌషధము నిచ్చి తేజోవంతు నొనర్చెను. బుద్ధునికాలమున చికిత్సాలయములును, అందు దాదులును ఉండిరని తెలియుచున్నది. అశోకుడు అనేకచికిత్సాలయముల నెలకొల్పినాడు. బుద్ధుడును రోగుల కెడతెగక సపర్యలొనర్చుచుండెడివాడు. ఆకాలమున వ్యాధిపీడితులకు పరిచర్యలనొనర్చుటయన నొక గొప్పకార్యముగ భావింపబడుచుండెను. సుమారు క్రీ. శ. 1185 సం॥న ఏడవ జయవర్మ యను నాతడు కంబోడియాయను దేశమును పాలించుచుండ 102 చికిత్సాలయము లుండెననియు, అందు వైద్యులును దాదులును నియమింపబడియుండిరనియు తెలియుచున్నది. అప్పటికాలమున ఆసుపత్రులకు ఆరోగ్యశాలలని పేరుండెడిది. కంబోడియనురాజుచే స్థాపింపబడిన ఆరోగ్యశాలలయందు చతుర్వర్ణములవారును 98 గురు నియమింపబడిరి. వారిలో కొందఱు వైద్యులు, కొందఱు వైద్యురాండ్రు, కొందఱు సామగ్రులు సమకూర్చువారు, కొందఱు వంటలవారు, కొందఱు ధాన్యములను విసరువారు, కొందఱు దాదులు. స్త్రీ పురుషు లిరువురును నియమింపబడి యుండిరి. దాదులకు ఆరోగ్యసంగ్రాక్షి (స్త్రీపురుషులు) సేవాశైరూష (పురుషదాదులు) సేవాశైరూషి (స్త్రీ దాదులు) అను నామాంతరములుగలవు. ఈ నవనాగరకకాలమున దాదు లెట్లు బిగువైన రవికెను వస్త్రమును ధరించి గాలికెగురకుండునట్లు వానిని మఱియొక చొక్కాతోకప్పి త్రాటితో నడుమువద్దను గొంతుయొద్దను ముడివేయుదురో అదేరీతిని బుద్ధునికాలమందును దాదులు వస్త్రధారణముగావించుచుండిరి.

బౌద్ధకాలమున దాదులలో ప్రసిద్ధికెక్కిన వనితారత్నము లిరువురు; బరుజాయు, జయావతియును. ఏప్రదేశమున తీవ్రరోగపీడితులుందురో అచ్చోట పరమశాంతమూర్తియగు జయావతి మందస్మితవదనారవిందయై వారికి ఉపచర్యలొనర్చుచు శాంతిని, సంతోషమునుకల్గించుచుండెను. పురుషపుంగవులలో పేర్కొనదగినవాడు నారాయణుడు. రణరంగమునందైనను, ఆసుపత్రులందైనను రోగులకు బంధువై తనప్రాణమునైనను సరకుగొనక వారికి సదా శుశ్రూషలజేయుచు వారి ప్రేమకు పాత్రుడాయెను. ఒకనాడు ఇతడు తన గుఱ్ఱము నుండి క్రిందపడనున్న యొకసైనికుని ప్రాణము కాపాడెను. ఇతని నామము చిరస్మరణీయము.

ఆయుర్వేదశాస్త్రము దాదికెక్కుడు ప్రాముఖ్యము నొసంగియున్నది. చరకసంహితయందు దాదులను గూర్చి యీరీతి వక్కాణింపబడియున్నది.—

## భిషక్ద్రవ్యాణ్యుపస్థాతా రోగీపాద చతుష్టయం.

అనగా ఉన్నతమగు చికిత్సకు కావలసిన ప్రకరణములు నాలుగు. అవి వైద్యుడు, ఔషధము, దాది, రోగి. ఎల్లప్పుడును రోగికడనుండి అతనికి పరిచర్యగునల్పుటచే దాదికి 'ఉపస్థాత' యను పేరుకల్గినది. ఆమెకు 'పరిచారక' యను పేరునుగలదు. పరిచారకుల కుండవలసిన గుణములివి—

ఉపచారజ్ఞతాదక్ష్యం అనురాగశ్చభర్తరి
శౌచంచేతి చతుష్కోయం గుణాఃపరిచారేజనే.

(1) రోగి పథ్యపానాదులను యిష్టానిష్టములను గమనించుట; రోగిని సరియగుస్థితియందుంచుట.

(2) సామర్థ్యము గల్గియుండుట.

(3) తమయజమానుల ప్రేమించుట.

(4) నిష్కళంకమగు గుణముకల్గియుండుట.

సుశిక్షితలగు దాదు లేకాలమునుండి క్షీణించిరో చెప్పుటకష్టము. కాని గృహిణులు చాలకాలమునుండి దాదులుగనుండిరని మాత్రము చెప్పవచ్చును.

ఐరోపాఖండమున. గ్రీకు రోమను స్త్రీలు పెక్కండ్రు, క్రీ. శ. 200 సం॥లకు పూర్వము, వైద్యచికిత్సయు పరిచారికావృత్తియు సల్పుచుండినట్లు లాటిను గ్రంథము లుద్ఘోషించుచున్నవి. దాదులు ప్రబలుటకు దేవాలయపు పరిస్థితులు రణరంగములు కారాగృహములు కారణములు. క్రీ. శ. 529 సం॥న మాంటికాసినో యందు సెంట్ బెనెడిక్టు ఆఫ్ నర్సియా యనుమతశాఖ యేర్పడెను. అప్పటినుండి ఇటలీయందును, పశ్చిమఐరోపాఖండమునందుగలమతశాఖీయులు రోగులకు చికిత్సలొసగుచు బాధానివృత్తిగావించుచుండిరి. మానవసేవాపరాయణులగు అనేకులు దాదులైరి. ఆరుశతాబ్దములకు పిమ్మట వారి యుత్సాహము చల్లబడినది. త్యాగిను లందరు భోగలాలసులైరి. ప్రజాసేవ యిష్టానిష్టములపై నాధారపడినది. 13-వ శతాబ్దమున ఫ్రేన్సిస్ బార్నార్డోఆఫ్ అస్సిసియను మతగురువు తన పరివారముతో స్వయముగ రోగులకు పరిచర్య లొనర్పగడంగెను. కుష్ఠురోగులు సైతము వీరి శుశ్రూషలకు పాత్రులైరి. కాని వీరి మతము వృద్ధికి రానురాను అందలి సభ్యులకు మదము హెచ్చినది; ఉత్సాహము సన్నగిలినది; దాదులు నీచముగ చూడబడిరి. దాదులును, భృత్యులును, జారిణులు నొకటిగ నెంచబడిరి. ప్రజాసేవయను ఉన్నతాదర్శ మెపుడు మూలపడెనో, ఉన్నత వంశజులీ వృత్తిని వదలిరి. హీనజాతులకు చెంది విద్యాగంధ మెరుంగని జీతగాండ్రగు స్త్రీలు దాదులైరి.

ఫుసెల్ డార్ఫ్ యందు కేసర్ వర్త్ డ్యాకనెసస్ ఇన్ స్టిట్యూషను ఆసుపత్రియు, 1840 సం॥న లండనున మిసెస్ ఎలిజబెత్ ఫ్రైగారి చికిత్సాలయమును, 1847-వ సం॥న సెంట్. జాన్స్ హవుస్. అను సంఘమును స్థాపింపబడినవి. అప్పటినుండి ప్రస్తుతపు దాదుల పుట్టుకయని చెప్పవచ్చును. దాదులకు గౌరవము కల్గుటకు మరి 7-సంవత్సరములుపట్టెను. దాదియన నేమియు నెఱుగని ఏకాకియు మలినశరీరయునగు ముదుసలి యనియు, హీనయనియు నెంచబడుచుండిన ఆ కాలమున, దాదులకు గౌరవమును సంపాదించి ప్రసిద్ధి కెక్కినది ఫ్లారెన్సు నైటింగేలుకన్య.

బెజవాడ: భారత మహిళా సంఘము.



తత్సంఘాధ్యక్షురాలు జానకిచంద్రనుసతి (పుష్పమాలాలంకృతయై నడుమనున్న యామె) గారికి మహిళాసంఘము వీడ్కోలిచ్చుట.

మదరాసు విశ్వవిద్యాలయము



పట్టభద్రలు, 1929

ఫ్లారెన్సు నైటింగేలు డెర్బీషైరు వంశజురాలు; సర్వసంపదల ననుభవింపగల్గిన సుకుమారి. అయినప్పటికి 'ఆల్మా' రణభూమియందు బాధ చేయూల్గుచున్న యోధులజూచి మనసు పరితాపముచే కరగిపోవ ప్రజాసేవచేయ నిశ్చయించి దాదులతో చేరెను. తన్నుకోరిన వరుని వివాహమాడి సుఖింపగలిగియు ఆమె తల్లివద్ద సెలవుగైకొని తన 33-వ యేట, కేసర్స్‌వెర్త్ దాదులసంఘమున చేరెను. హార్లీ స్ట్రీటు ధర్మశాలకు అధికారిణిగ నీమె నియమింపబడెను. 1854-వ సంవత్సరమున స్కుటారీమిలిటెరిహాస్పిటలు పరిస్థితుల గమనించి చక్కబెట్టుటకై యీమె నియోగింపబడెను. జనులు తన్ను ప్రోత్సహింప 38 దాదులతోడ నింగ్లండును వదలి కాన్స్టాంటినోపిలునకు సమీపముననున్న స్కుటారి బొలక్లావాయుద్ధానంతరము చేరెను. స్కుటారి యందామె గాంచిన దృశ్యమే వనుకల్గించెను. నాల్గుమైళ్ల పొడవున రోగుల పడక లమర్చబడియుండెను. వాటిక్రిందుగ మురికికాలువ దుర్వాసనను బుట్టించుచుండెను; పడకలపై యుపయోగింపబడిన గుడ్డలు ముకుకయై పనికిరానివిగ నుండెను. వాడుటకు తువ్వాళ్లులేవు, ఊడ్చుటకు చీపురుకట్టలులేవు, గుడ్డపేలికలులేవు, పాత్రలులేవు, కత్తులు లేవు, పత్తిగాని గాయములకు కట్టు నారగుడ్డలు గాని లేవు. ఇట్టి పరిస్థితుల జూచి నైటింగేలు అధైర్యము నొందలేదు. లండనుమిలిటెరీసైద్యసంఘ మెంతవలదన్నను వినక తానువచ్చు మార్గమున కావలసిన వస్తువుల సేకరించుకొని, 7000 సామానులతో నామె వచ్చెను.

అంతట పరిస్థితులన్నియు మారినవి. కత్తులు, సబ్బులు, తువ్వాళ్లు వాడబడెను. భోజనవసతులు చక్కబడెను. రాత్రింబవళ్లనక మహాత్యాగినియగు నైటింగేలు తన సౌఖ్యముల నెల్ల వదలి దీపముచేత బూని స్కుటారి చికిత్సాలయమున గల రోగుల కుపచారముల సల్పుచుండెను. వారిమేలునకై తానెట్టి కష్టములకైనను లోనగుచుండెను. ఆమెవలననే అచ్చట రోగులకు శాంతి కల్గుట. ఆమె కోరికపై ఒకప్పుడు ఫ్లారెన్సు గవర్నమెంటువారు 27000 షర్టులపంపిరి. రోగులు చలిబాధకు గజగజవడకి పోవుచుండిరి. కాని ఆమె యెంతవేడినను అధికారుల సంఘము సమావేశము అయిన కాని వాటినీయరాదని చేటుపడనెనట. మరి మూడు వారములకుగాని ఆషర్టు లివ్వబడలేదు. రోగులయెడ ఆమె నడచుకొను వైఖరివేరు. అధికారులయెడ వేరు. రోగులకు తల్లివలె ప్రేమతో ఓర్పుతో సహాయము చేయును. మిలిటెరిసర్జనులయెడను, అధికారులయెడను ఆమె అతికఠినముగ వర్తించును. అందుచే రోగులగదులు శుభ్రముగనుండెను. సామగ్రులు పుష్కలముగ వచ్చుచుండెను. మరణసంఖ్య నూటికి 42 నుండి వెయ్యికి 22 కు తగ్గెను. మిక్కిలి బలహీనయయ్యు స్వగృహమునకు బోనొల్లక క్రిమియాయందలి ఆసుపత్రుల పరీక్షించుటకుగాను గుఱ్ఱపుస్వారిచేయుచు సెడశోగక శ్రమ జెందిన సీసాధ్వి.

1856-వ సంవత్సరమున సంధిసమకూరెను. నైటింగేలు స్కుటారిని వదలి యింగ్లాండుకు మరలెను. మహారాణి ఆమెకు స్వాగత మొసగెను. ఇంగ్లాండు సైనికుల ఆరోగ్యపరిస్థితుల పరికించుటకును, మహారాజ్ఞియనుమతిపై విచారణసంఘ మొకటి నియమింపబడెను. సైనికుల ఆసుపత్రులందు మార్పులు గావింపబడినవి. భారతదేశమందును యిట్టి సంఘ మొకటి నియమింపబడినది. నైటింగేలు 90 సంవత్సరములు జీవించినది. 1860-వ సంవత్సరమున దాదులకు శిక్షనొసంగుటకు నైటింగేలుఫస్టుట్రెయినింగుస్కూలు స్థాపింపబడెను. 1880-వ సంవత్సరము లోపల అనేక ఆసుపత్రులందు దాదులకు శిక్షయొసంగుటకు పాఠశాలలు ఏర్పడెను. 1919-వ సంవత్సరము నర్సస్ రెజిస్ట్రేషన్ చట్టమేర్పడెను. అందువలన దాదులకు శిక్ష యొసంగి పరీక్షల నేర్పాటు చేయుట కొక సంఘ మేర్పడెను.

హిందూదేశమందలి స్త్రీలు అందువిధముగ నేర్పులేకయే మూఢభావమున చికిత్సల నొనర్చుచుండిరి. 1871-వ సంవత్సరమున డా. ఎడ్మండు చార్లెసుగారు మంత్రసానుల పాఠశాల యొకటి యిట్టి స్త్రీల సౌకర్యార్థము ఏర్పఱచెను. మొట్టమొదట తక్కువకులము వారును ఆంగ్లో యిండియను క్రైస్తవ స్త్రీలును మాత్రమే యిందుచేరిరి. కాని కాలముగడచిన కొలది ఉత్తమకుల స్త్రీలుకూడ మంత్రసాని పరీక్షకు చదువుచుండిరి.

1859-వ సంవత్సరమునకు పూర్వము ఆయాలనువారును, వార్డ్ బాయ్సు అనువారును దాదిపనులను చేయుచుండిరి. లేడీకానింగు సలహాపై ఆసుపత్రుల దాదులసంఘ మొకటి ఏర్పడెను. మ్యూటినీ అనంతరము గవర్నమెంటు ఖర్చులతో స్త్రీదాదులు అలహాబాదు సైనిక ఆసుపత్రియందు నియమింపబడిరి. వీరిపని చాలతృప్తికరముగను జయప్రదముగను పరిణమించెను. పిమ్మట ప్రతి రోగుల శాఖకొక దాది నియమింపబడెను. ప్రెసిడెన్సీ జనరలుహాస్పిటలునకు పంపుటకుగాను దాదులసంఖ్య 1860-వ సంవత్సరమున హెచ్చింపబడెను. 1861-వ సంవత్సరమున యిండ్లకు దాదులపంపుటకు సైతము వీలుపడెను.

1877-వ సంవత్సరమున ట్రస్టీస్ ఆఫ్ ది కాన్వెంట్ హౌస్ను, కమిటీ ఆఫ్ హాస్పిటలు నర్సస్ యిన్స్టిట్యూషనును ఒకటిగ చేర్పబడినవి. 1881-వ సంవత్సరమున స్త్రీసూపరింటెంటుకుబదులు యింగ్లండునుండి కల్లవర్ సోదరులు ముగ్గురు నియోగింపబడిరి. 1927-వ సంవత్సరములో సుమారు 224 దాదులు జనరలు మెడికలు ఆసుపత్రులకు పంపబడిరి.

1923-వ సంవత్సరమున దాదులకు, మంత్రసానులకు పరీక్షలు ప్రవేశపెట్టబడినవి. 1925-వ సంవత్సరములో డాక్టరు సుందరిమోహనదాసుగారి ప్రోద్బలమున పురపాలకసంఘమువారు కలకత్తాలో హిందూదాదుల శిక్షకొఱకై కొంత ద్రవ్యమునిచ్చిరి. బుర్ద్వాలోదాస్ ప్రసవవైద్యశాలయందు దాదులకును మంత్రసానులకును పాఠశాలల నేర్పరచిరి. కార్మికేలు మెడికలు కాలేజియుచిత్తరంజనఆసుపత్రులును మంత్రసానిదాదుల విద్యల గఱపుచున్నారు.

ఇపుడిపుడు అనేకహిందూవితంతువులు ద్రవ్యార్జనకైయో మరేకారణముననో యీవిద్య నభ్యసించుచున్నారు. వసతులేర్పడుచుండ దాదులకు గౌరవము హెచ్చగుచుండిన అనేకులీవృత్తిలో ప్రవేశింతురు. శీఘ్రముగ మరియొక జయూవతిగాని ఫ్లారెన్సునైటింగేలుగాని యవతరింపగలదు.

ప్రతివత్సరమును 3 లక్షల శిశుమరణములును 30 వేల ప్రసవమరణములును గల దేశమున రాజకీయవైద్యసంఘమువారు ప్రసవచికిత్సావిధానము నెరుంగని 64 హిందూదాదుల మాత్రము తరిబీదుచేసిరనుట విచారకరము. మరణసంఖ్యయో వెయ్యికి 30 వంతున. దీనిని గమనించి వైద్యులు దాదులను సురక్షితురాండ్రజేయుటమంచిది. సద్వంశజాలగు స్త్రీలకు శిక్షయొసంగుట కట్టి ప్రయత్నమునైనచేయ బెంగాలు గవర్నమెంటు తీర్మానించియున్నది. కాన చక్కగ పరిశీలించి యొక నివేదికను జిల్లాలోకలుబోర్డు సభ్యుల ముందరబెట్టి వారియనుమతిపై పేదస్త్రీలను దాదులుగ జేయుటకు ప్రయత్నింపవలెను.

# భూమాత సందేశము

ముద్దా విశ్వనాథము గారు

ఒకప్పు డొకప్రదేశమున ఘోరమైన కాటకము పట్టెను. దానిని భరింప జాలక యక్కడి ప్రాణికోటి భూమాతవద్దకు బోయి శోకప్రలాపములతో మొఱపెట్టుకొనెను.

తొలుత మనుష్యుడు వెళ్లి "ఓతల్లీ! నీ సంతతివారలమగు మాకు చెప్పరాని యిక్కటులు సంభవింప నీమన సెటుల కరుగకున్నది? ఈశ్వరునకు కరుణదప్పి మహామారి మొదలగు తెవుళ్లు మాపైగురియించుచున్నాడు. వఱదలువచ్చి యెంతో శ్రమపడికట్టుకొనిన యిండ్లను నేలమట్టము చేయుచున్నవి. పంచమహాభూతములును మమ్ము నాశము గావించుటకు ప్రేరేపింపబడినవేమోయని తోచెడిని. ఈ యేదుపులిటుండ మిగిలినవారైన తిన్నగనుండక జగడములు కల్పించుకొని మడియుచున్నారు. కొంతతడ వాలోచించిన మానవజాతి యంతయు నంతరింపనున్నదేమోయని కంపము పుట్టుచున్నది. అమ్మా! కటాక్షించి మాకష్టములు గట్టెక్కు సాధనము తెలుపుము." అని మ్రొక్కెను.

అంతట చతుష్పాదజంతువుల ప్రతినిధులగు యెద్దు, గుఱ్ఱము, గొఱ్ఱె వగైరాలు పోయి యిటుల విన్నవించుకొనెను.

"జననీ! నీ ప్రసాదము తిని జీవించు బిడ్డలమగు మమ్ము కరుణింపుము. క్షామముచే దహించుకొని పోవుచున్నాము. ఎండ వేడిమికి తాళలేక కమలుచుంటిమి. తుపానుల బారిచే తెరువులేక ఘోషిల్లుచున్నాము. వృక్షజాతములు యిసుమంతయేని కనికరము లేక మేతనిచ్చుట కనంగీకారము దెల్పుచున్నవి. రోగములచే క్షీణదశ నందుచున్నాము. నరులు మాపట్లనెంతయు క్రౌర్యముగ సంచరింతురు. తక్షణము మాకేదైన దారి చూపనిచో యేము మరుసటివత్సరమును జూతుమను నాశలేదు."

తరువాత—భూదేవి కంబళి ధరించి యున్నదా యని భ్రమింపచేయు పచ్చనిపసిరి కయు, కన్నుల పండువుసేయు సస్యాదులును, ఎన్నియో జీవరాసులకు నెలవొసంగి రక్షించు వివిధములగు వృక్షజాతులును తల్లి సందర్శనప్రాప్తిగాంచి ప్రార్థింపగడంగెను.

“దేవీ! మా యవస్థగని జాలినొందవా? నీ ఱొమ్మునంటి పట్టుకొని నీఫలసాయ మారగించు నీ జాతిని నీవుగాక మఱెవరు గారవింతురు? ప్రచండవాయువులు తుడుచు కొనిపోవ కృశించి వ్రేలబడి యెటులున్నార మో చూడుము. రాత్రియందు రాలెడు మంచు బిందువులకొఱకు దప్పికచే యెంత తహతహ నందుచుందుము! దుష్టమగు చీడపురుగుల దండులు దయ లేశమైన లేక మమ్మెటుల కొఱికి తినివేయుచుండును! పస్తుపడియున్న చతు ష్పాదములు యిట్టెవచ్చి వేరులతోసహ పెల్లగించి మమ్ముల ధ్వంసము చేయునుగద! ద్వేషబుద్ధిగల మానవుడు లేతవయసులోనే మము నిర్మూలము చేయగడంగునే! ఇప్పటికే మాలో చాలజాతులు పేరులేకుండ పోయినవి. వెంటనే నీవు దయబూని మమ్ముద్ధరిం పనిచో ఒక్క వర్షమునకు వృక్షజాతియంతయు పూర్తిగ సమసిపోవకతప్పదు.”

అప్పుడు భూమాత యెల్లరకు నిటుల సమాధానము చెప్పి పనిచెను.

“నాముద్దుబిడ్డలారా! నే నుదయించి యీసరికి కొన్ని వేలవత్సరములైనది. ప్రతియేడును లోకమున నేదోయొకమూలనుండి యిట్టి మొఱలు వినుచునేయున్నాను. అందుచే నీ జగన్నాటకచక్ర మెప్పుడు నొకేవిధముగ తిరుగుచున్నదని నానిశ్చయము. ఆలోచించిన కాలది ‘లయ’మనునదే యీ లోకమున గన్పట్టుచున్నది.

ఏలనన—ఈ సంవత్సరము దేశములో క్షామము విడియించినచో మరుసటివత్స రము ‘భాగ్యదేవత’ ఆ లోపమును పూరించుచున్నది. కొన్ని వృక్షములు నాశమైనచో అంతకు మిక్కుటముగ ఫలించుటకు సరిపడు విత్తనములు తయారుగనున్నవి. ఆహారము లేకుండుటచేతను రోగపీడవల్లను కొంత జంతుజాలము నశించినను తిరిగి యభివృద్ధి యగుటకు చాలిన మృగములు మిగిలియున్నవి.

మానవుడో నైసర్గికముగను దైవికముగను గలుగుబాధలేకాక స్వయంకృతముగ పాపకర్మఫలముచే కొంత దుర్దశ కలిగించుకొనుచున్నాడు. మనుష్యుని జీవితములో

దుఃఖము చేకూర్చు యంశములే యాతనిలో అంతర్యాగములైన శక్తులను ప్రేరేచి మంచిచెడ్డ లారయుజ్ఞానమును వికసింపజేసి మానవజాతి తరింప సాయపడును. ఇక్కటులు సంభవించినపుడే మనుజుడు దుర్వృత్తులనుండి మరలుటకు మంచియవకాశము కల్గును. అతని యనుభవమే యెల్లపుడును సత్ప్రవర్తనకు దారి జూపుచుండును. దారి తప్పి చరించునెడల కష్టములపాలగుట సహజమె కదా!

కనుక నాపిల్లలారా! తాత్కాలికములగు బాధలకు తొట్రుపాటుపడక శాంతింపుడు. కష్టసుఖములు రెంటిని సమదృష్టితో నాదరించి యనుభవింపకతప్పదు. ఐశ్వర్యము కావలెననుటయు దారిద్ర్యము వద్దనుటయు మన యిష్టానిష్టములలోని విషయముగాదు. అదిదైవేచ్ఛ. తనచిత్రసృష్టిలో నెంత సూక్ష్మజీవినైనను నెటుల నడిపింపవలెనో దయామయుడగు పరమేశ్వరుడు సదా కనిపెట్టుచునే యుండును. ఏప్రాణి కేసమయమున నెట్టి సహాయము వలయునో తప్పక చేకూర్పగల జగన్నిర్మాణకర్త యున్నాడని నమ్మి యుండుట శ్రేయము.”

—(అనువాదము.)

# ఝాన్సీ లక్ష్మీబాయి

## శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు

సకలావనీచక్రసంస్తూయమానమై యలరు కాశీపురి నవతరించి
అతిబాల్యమందె నశ్వారోహణాదుల పేరుకెక్కిన యట్లు నారితేరి
జయజయధ్వనులతో ఝాన్సీమహావిభు ప్రేమమీరంగను పెండ్లియాడి
ఖడ్గప్రహారవిఖ్యాతపాండిత్యంబు భువి వైరివరులకు జవులుజూపి
వీరలోకంబు జొచ్చిన వీరబాల
లక్ష్మిబాయిని సతమీ యిలాతలాన
భరతవనితల హృద్వీధి ప్రబలుచుండ
ముదముతోడుత జేమోడ్చి మ్రొక్కుదాన.

# దేవీనవరాత్రులు

కాంచనపల్లి వేంకటరంగారావుగారు

దేవియొక్క తొమ్మిది అవతారములను ఆశ్వయుజ శుద్ధ విదియ మొదలు దశమి వరకు గల నవరాత్రులయందు కొలువబడుచుండుటచే వీనికి దేవీనవరాత్రులని పేరు వచ్చినది. ఈ తొమ్మిదిరాత్రులును దేవి అవతరించిన దినములగుట పర్వదినములైనట్లు దేవీమాహాత్మ్యమువల్లను, మార్కండేయాది పురాణములవల్లను తెలియుచున్నది. మాతామహుల శ్రాద్ధకర్మ మనుమలచే నవరాత్రి ఉత్సవారంభదినాదియందు గావింపబడును. ఈ సందర్భములో మేధముని చెప్పిన గాథ యొకటి పురాణములనుండి ఇచ్చట వ్రాయుచున్నాను.

సురాధ యను నొక పృథ్వీపతి తన శత్రురాజులచేత నోడింపబడి, అపజయమొంది, రాజ్యమంతయు గోలుపోయి, తన రాజధాని విడచి విపినముల సంచరించుచుండెను. మధ్యేమార్గమున మేధముని అనువాని యొక్క కుటీరము గాన్పింప అందు ప్రవేశించి ముని ప్రశ్నించిన పైని తన యావద్వృత్తాంతమును విశదీకరించెను. రాజపదభ్రష్టుడైన సురాధుని దీనోదంతము లాలకించి మనంబున జాలిగొని రాజునకు సకలోపచారములు చేసి తనవద్ద నుండమని ముని కోరెను. కాని చలచిత్తుడైన సురాధుడు ఆమాటలు పాటించక తిరిగి యథోచితకార్యగామి యయ్యెను. ఇట్లు ద్రిమ్మరుచుండ దారి కడ్డముగా సర్వసంగపరిత్యాగియైన సమేధియను వైశ్యసన్యాసిని గాంచి గృహస్థాశ్రమము వీడి సన్యాసాశ్రమమేల స్వీకరించితివని ప్రశ్నించెను. అందుకు సమేధి మొదట తానొక ధనవంతుడనియు, కొన్ని అనివార్యములైన అవాంతరములచే భార్యాపుత్రులచేత స్వగృహమునుండి తరిమివేయబడి యిట్లొంటరిజీవనము చేయవలసి వచ్చినదనియు చెప్పెను. భార్యాపుత్రులు వైశ్యునియెడ గనుబరచిన కృతఘ్నతకు స్వాంతమున విచారాశ్చర్యమునొంది గతంబేమై యుండునో గనుగొందము రమ్మని యిరువురును మేధముని పర్ణశాలకేగిరి. ముని వారువచ్చిన కారణము తెలిసికొని ఇది అంతయు విష్ణుశరీరోద్భవమైన మహామాయ యొక్క విపరీతవర్తనాపరివర్తనములు తప్ప అన్యముకాదని అసంఖ్యాకమైన మహామాయ అవతారములలో కొన్నిటిని మట్టుకు విశదముగా సందర్భానుసారము యొక్కొక్కటే ఇట్లు వర్ణించెను.

ఒకానొక సమయమున జగదాధారభూతుడైన విష్ణుమూర్తి శ్రవణద్వయమునుండి మధు, కైటభులను యిరువు రసురాగ్రేసరు లుద్భవించిరి. వారు విష్ణుమూర్తి నిద్రించుసమయము గనిపెట్టి సృష్టికర్తయైన బ్రహ్మను అనేకవిధముల బాధింప జొచ్చిరి. అంత బ్రహ్మకేమియు ఆలోచన తట్టక హృషీకేశుని నిద్రనుండి లేప మహామాయను నియమించెను. మహామాయచేత నిద్రనుండి లేపబడినవాడై విష్ణుమూర్తి బ్రహ్మవల్ల నిజోచితకార్యము గుర్తెరింగి మధుకైటభాసురులతో యుద్ధమునకు గడంగెను. కాని పంచసహస్రాబ్దంబులు ఘోరయుద్ధము జరిపినను గెలుపనుమాట వినలేకపోయెను. పాపము జగద్రక్షకుఁడంతటివాడు జయమందలేకపోయినను ధైర్యము విడనాడక సాహసించి తమతో అయిదువేల సంవత్సరము లఖండముగా సమరము

ఫలిపినందులకు అయిరువురు రాక్షసాగ్రేసరులును డెందమునసమిత్రానందము నొంది మహామాయాశక్తిచేసమ్మోహనులై యేదైనను వరము కోరుకొనవలసినదని దామోదరు నడిగిరి. ఇదే మంచిసమయమని యెంచి మాయామోహనమూర్తియైన విష్ణుమూర్తి వారల మృత్యువు తనకు కావలయునని కోరెను. రాక్షసులైనను వారు పెద్ద మనుష్యులు గనుక విష్ణుమూర్తి కోరిన కోరికకు మనస్సులో క్రోధమున్నప్పటికి నోరుదాటిన దానికి చేయునది లేక అంగీకార భావము సూచించక తప్పదయ్యెను. అదే సమయమున భూమియంతయు జలమయమై యుండెను. ఏదో విధముగా తప్పించుకొనుటే ముఖ్యోద్దేశముగాగల యాయసురద్వయము యీయవకాశము వృథా పోనీయ నిశ్చయింపమి జలశూన్యప్రదేశమున తమ్ము వధించునట్లు యుక్తిపన్ని కోరిరి. కాని సమయస్ఫూర్తి గల యుక్తిమంతుడు గావున విష్ణుమూర్తి వారికుయుక్తికి వల్లెయని తన నడుముపైగా జలరహితప్రదేశము వరకు ఎత్తియచ్చట వారిద్దరిని హతమొనరించెను. ఈ విధముగా విష్ణుమూర్తికి విజయముకల్గ వీలగునట్లు పన్నాగము పన్నిన మహామాయ దశశిరస్సులును, దశపాదములును గలిగి కాలరూపమైన ఆకారముతో అతిభయంకరముగా నొప్పెను. అందుచేతనే మాయాదేవికి మహాకాళియను నామాంతరము గలిగెను. ఇదే మాయాదేవి ప్రథమావతారము.

ద్వితీయావతారమున అర్ధభాగ మనురుడు అర్ధభాగము మహిషము మోస్తరు ఆకృతితో మహిషాసురుడను నామాంతరమున మరొక డుద్భవించెను. మహిషాసురుడు దేవతల నందరిని వధించి, వారి యధిపతియైన ఇంద్రుని సహితము సంహరింప పనుకట్టి దేవలోకమునుండి పారిపోవునట్లు చేసెను మహిషాసురుని క్రౌర్యమునకు పాకశాసనుడు వెరగంది తదితర దేవతలనందరిని వెంట నిడుకొని బ్రహ్మతో విన్నవించుకొనబోయెను. కాని అదివరకప్పుడే మధుకైటభులచే పూర్తిగా పరాభవింపబడి అపజయమొందిన అనుభవము గల పితామహుడు తన ఆధిక్యతను తనంత తానే బయలుపెట్టుకొన నిష్టములేనివాడై వారల నందరిని వెంట నిడుకొని శివవిష్ణువుల వద్దకు వెళ్లిరి. అచ్చట బ్రహ్మ యింద్రాదిదేవతలు తమకష్టములన్నియు వెళ్లబోసుకొని మహిషాసురు నెట్లైనను అంతమొందించిననేగాని తమ జీవనములు దక్కవని వేడుకొనిరి. ఇంద్రాదిదేవతల దుఃఖోదంతము విన్నంతనే శివవిష్ణువులు వీరియెడ దయాళువులై రాక్షసునిపై అమిత్రాగ్రహ మావహిల్ల దమగహ్వరములనుండి అగ్నిజ్వాలలు ప్రజ్వరిల్లచేసిరి. ఆ యగ్నిజ్వాలలనుండి సింహాధిష్టయై యున్నట్లుగా యొక స్త్రీరూప ముద్భవించి మహిషాసురుని మదమణచి రూపుమాపెను. ఈమెనే మాయాదేవి ద్వితీయావతారమైన మహాలక్ష్మీ అవతారముగా చెప్పుదురు.

తృతీయావతారమే మహామాయ తృతీయలీలాస్వరూపమైన మహాసరస్వతి. శుంభ, నిశుంభులను యిరువురు రాక్షసులు దేవతలందరి నోడించి హిమాద్రికరిగి దేవీప్రార్థన గావించుచుండిరి. అదే సమయమున పరమేశ్వరుని పత్నియైన పార్వతి గంగానదికి స్నానార్థమై చనుచుండెను. ఆమె శరీరమునుండి యొక నవయౌవనసుందరాంగి యుద్భవించెను. ఆ కోమల మోహనాంగినిచూచి మోహించి శుంభుడనువాడు ఆమె తన నెట్లైనను వివాహమాడునట్లు పురికొలుపవలెనని సుగ్రీవుని ఆజ్ఞాపించెను. సుగ్రీవు డెంతయో కాలము అనేక విధముల ప్రయత్నముచేసెనుగాని ఫలముమట్టుకు సున్నయయ్యెను. విఫలుడైన సుగ్రీవునిచూచి ఆజవ్వనిపై ఆశుంభుండత్యుగ్రుడై ధూమ్రలోచను డనువాని యాధిపత్యమున కొంతసైన్యమిచ్చి ఆవనితామణిమీదకు యుద్ధమునకై పంపెను. మాయాజనితయైన యాజవ్వని రిపువర్గమున కిసుమంతయు భీతిల్లక వారందరిని భూమట్టమొనర్చెను. పొరపాటున యెవ్వరేని సరస్వతికి తెలియకుండ తప్పించుకొనినేని సరస్వతీవాహనమైన

సింహము వారిని వధించుచుండెను. ఈ విధముగా హతమొందుచున్న అసురులవార్త కర్ణపుటంబులబడినంత శుంభుడు కోపావేశపూరితుడై వెనుకటికన్న ద్విగుణీకృతసైన్యముతో చండ, ముండ యను ఇరువురు రాక్షసుల యాజమాన్యమున యథాప్రకారము సరస్వతిపై కంపెను. ఆమె సింహారోహిణియై, అత్యుగ్ర కోపావేశముతో కన్నువిచ్చిన ఎదుటనున్న యేవస్తువైనను మలమల మాడిపోవునాయేమి యన్నంత అగ్ని జ్వాలలతో సరివచ్చు తీవ్రదృక్కులతో నలుగెడల పరికించుచుండెను. ఆగ్రహావేశ పూరితురాలైన ఆమె సుందరవదనారవిందము కోపాగ్నిచే కమిలినట్లు కాళస్వరూపముదాల్చి యుండెను. ఆ కాలవదనోపరి భాగమునుండి కాళియనుశక్తి యొకటి యుద్భవించెను. మెకముతోలే అంబరముగాధరించి, ఖండింపబడుటచే రక్తముకారుచున్నపుర్రెలే మాలగా మెడనలంకరించుకొని సగము క్రిందకుజారిన రక్తపూరితమైన జేగురు జిహ్వా భీకరాకారముజూపపైకుబికిన పాటలచక్షుర్ద్వయముగలిగిన ఆభయంకరాకారియగు కాళీస్వరూపము యెవరిని భీతచిత్తునిగాజేయదు? అట్టి మహాకాళి అరివర్గమంతటిని అశ్వగజాదులతో సహా మ్రింగివేయుచుండెను. ఈవిరుద్ధభయంకరకాళీకృతపరిణామముచూచి చండయనువాడు కాళ్లకు బుద్ధిచెప్పదలంచెను. కాని వాని యుద్దేశ్యము తెలిసికొని కాళి చండ, ముండ యను యిరువురు రాక్షసుల శిరస్సుల దును మాడి అవి తీసికొని పార్వతిచెంతకేగెను. చండముండల నిరువురుని హతమొనరించిన సాహసమునకు గిరిసుత మెచ్చుకొని చాముండయను నూతన నామధేయమొసర్చి యిటుపైని చాముండయను పేరుననే తన్నుకొలువవలయునని యాజ్ఞాపించెను. చండ, ముండ యను రాక్షసు లిరువురును ససైన్యముతో వధింపబడుటచూచి శుంభ, నిశుంభులు యిరువురు రాక్షసులును వెనుకటికన్న మూడింత లధికమైన సైన్యముతో కాళికాదేవి మీదకు సమరమొనర్ప సంసిద్ధులైరి. దేవి, దేవివాహనమైన సింహము, కాళి, చండిక వీరందరును వారి వారి దేవతలందరితోను శుంభనిశుంభులపై తయారైరి. బ్రహ్మయొక్క శక్తిద్వయము హంసవిమానారోహిణి యయ్యెను; కాలకంఠునిశక్తి వృషభవాహన మధిష్ఠించెను; కుమారస్వామిశక్తి నెమలివిమాన మెక్కెను; విష్ణుమూర్తి శక్తి గరుడవాహనారోహణము గావించెను. తదనంతరము దేవిశరీరమునుండి చండికయను శక్తియొకటి యుద్భవించెను. ఆమె చూపరుల కపరిమితభయముగలిగించు భీకరాకారముతో యుండెను. చండిక మర్యాదగా శుంభనిశుంభలను ససైన్యములతో మగలునట్లు పార్వతీనాథుని ద్వారా ఆజ్ఞాపించెను. కాని వారు త్రినేత్రునిమాటలు సరకుచేయక దేవతలందరితోను అతిఘోరసమరము గావించి మరణించినవారుపోగా మిగిలిన కొందరు బ్రతుకు జీవుడాయని కాళ్లకు బుద్ధిచెప్పి ప్రాణములు దక్కించుకొని గృహోన్ముఖులైరి. రాక్షసులందరిలోను రక్తబీజుడు అనునొక అతిభయంకరమగు పిడుగువంటి రాక్షసుడు గలడు. వానిశరీరమునుండి భూపతనమైన ప్రతిరుధిరబిందువునుండి యొక్కొక్క రాక్షసి జనించుచుండెను. వాని నొక్కనిచంపుటకై యత్నించిన దేవతలు పైకారణమున వానిని వధించుటకు బదులు సహస్రానేక రాక్షసుల సృష్టించిన వారగుచుండిరి. ఇదిచూచి దేవతలకు గుండెలు బ్రద్దలగుచుండెను. దీనిని కనిపెట్టి దేవి రక్తబీజునిశరీరమునుండి రక్తబిందువు భూపతనమగుటకుముందే ఆరక్తము పీల్చివేయ కాళికి యాజ్ఞయిచ్చెను. ఇట్లు కొంతసేపగునప్పటికి క్రొత్తగా రాక్షసిపుట్టుటలేదు సరిగదా క్రమక్రమముగా వెనుక నుదయించిన వారందరు నాశనమైరి. చివరకు శుంభనిశుంభులు సహితము కాళిదేవి కాహుతులైరి. ఇదేమూడవ అవతారము.

నాల్గవ అవతారమున నందునియందు కుమార్తెగా జనించి, కంసుడు మామూలుప్రకారము తననుసహితము వధించుటకై పైకివిసరి కత్తి చాచిపట్టుకొని అంతరిక్షమున చూచుచుండ తిరిగి క్రిందపడుటకు బదులు మాయాజనితరూపిణియైన ఆ నందశిశువు తనను (కంసుని) హతమొనరించుటకు కృష్ణుడనువాడు నందునిగృహమందు సురక్షితముగా పెరుగుచుండెనని చెప్పి మాయమయ్యెను.

ఐదవ అవతారమున దేవి యొకఘోరరాక్షసుని తనదంతములతో చంపి "రక్తదంతి" యను పేరునబరగెను.

ఆరవ అవతారమున శతాబ్దములపాటు సంతతమొందని యొక గొప్ప క్షామమునుండి ప్రజలనందరిని రక్షించిదేవి "క్షామాంబ" అని పిలుపబడెను.

ఏడవ అవతారమున దుర్గమ్ అనుభయంకరాసురుని హతమొనరించి "దుర్గ" యను పేరున యొప్పెను.

ఎనిమిదవదానియందు "మాతంగి" యను పేరునను, తొమ్మిదవదానియందు దేవతల భార్యలనందరిని చెరబట్టి దుఃఖపెట్టుచుండిన అరుణుడను రాక్షసుని చంపి "భ్రమారి" అను నామమునను బరగెను.

మునివలన ఈవృత్తాంతము విని సమేధ సురథులు సంతుష్టులై గెుందేని జనిరి.

ఈ నవరాత్రిసందర్భమగు గాథ మరొకచోట ఈ విధముగా చెప్పబడినది. దశకంఠుని శ్రీరాముడు ఎన్నిమారులు శిరఃఖండనము గావించినను అవి తిరిగి యథాస్థానమున అతుకుకొనుచుండినట్లును, అది చూచి దేవతలందరును వెఱగందిరాఘవసుప్తిం జెందిన దేవిని ప్రార్థించినట్లును, దేవతల దీనాలాపము లాలకించి దేవి శ్రీరామునకు యిటుపైని దశాననుని సులభముగా సంహరించగలవని అభయమిచ్చినట్లును, ఆ క్షణమునుండి రావణాసురుని సీతావల్లభుడు వధించువరకు అతిభక్తితో దేవతలందరు దేవీవ్రత మాచరించి, చివరకు యెనిమిదవదినమున సీతాధవునిచే రావణు డంతమొందింపబడిన సువార్త వీనులవిందుగా వినినట్లును, తొమ్మిదవ దినమున అగ్నిసంస్కారాది, ప్రేతకర్మకాండయంతయు జరిపి, రావణాసురుని జంపి జయమొందిన విజయవార్తతో దశమినాడు శ్రీరాముడు నిజనగరోన్ముఖుడైనందున "విజయదశమి" అను నామాంతరము సహితము గలిగినట్లును తెలియుచున్నది.

# నారాయణస్తుతి

### బమ్మెర పోతరాజు

ధరసింహాసనమై నభంబుగొడుగై తద్దేవతల్ భృత్యులై
పరమామ్నాయములెల్ల వందిగణమై బ్రహ్మాండమాగారమై
సిరిభార్యామణియై విరించికొడుకై శ్రీగంగసత్పుత్రియై
వరుసన్నీఘనరాజసంబు నిజమై వర్థిల్లు నారాయణా!

# బీదకుటుంబము

కీ. శే. భండారు అచ్చమాంబగారు

ఈ క్రింద నుదాహరింపఁబోవు వృత్తాంతము నిజముగా జరిగినది. ఒకానొక ప్రసంగవశమున నాస్నేహితురాలగు శ్యామలాంబ నాకీసాధ్వీవృత్తాంతము నిట్లు చెప్పెను:—

"కొన్ని సంవత్సరముల క్రింద మాపొరుగునఁగల యొకచిన్న కుటీరములో నొక వితంతుకాంత తన గూఱుగురు పిల్లలతోడఁ గాపుర ముండుటకై వచ్చెను. ఆమె స్థితి యప్పు డధికశోచనీయముగా నుం డెను. ఆమె పేరు వెంకమ్మ. వెంకమ్మ భర్తకుఁ బదిరూపాయల వేతనముగల యుద్యోగముండెను ఆ పదిరూపాయలు చాలక వెంకమ్మ తానును గష్టపడి విసరి, దంచి కొంచెము ధనముసంపాదించి సంసారము గుట్టుగాఁ గడుపుచుండెను. కాని కఠినురాలగు మృత్యుదేవత ఆకాంతభర్తను తనకడుపున కాహారముగాఁ గొనిపోయెను. ఇందువలన నామెకుఁగలిగిన దుఃఖ మిట్టిదని చెప్ప నెవ్వరికిశక్యము?



కీ. శే. భండారు అచ్చమాంబగారు

---

'అబలా సచ్చరిత్రరత్నమాల' అను ఉత్కృష్టగ్రంథరచనముచే ఆంధ్రసారస్వతప్రపంచమున చిరంజీవత్వము సంపాదించిన సుప్రసిద్ధాంధ్ర విదుషీమణియగు కీ. శే. భండారు అచ్చమాంబగారి వ్రాతకాగితములు,

ధనవంతులకుఁ బదిరూపాయలనిన నొక గొప్పగా గానుపింపకుండినను బీదవారి కవి పది
వేలవలెనుండును. ప్రియభర్తృ వియోగమును దరిద్రదేవతాగమనమును జూచి యత్యంత
యుద్వేగము కలిగినను వివేకముకలది కాన నీ వెంకమ్మ ధైర్యమవలంబించి భర్తదిన
వారాదికర్మములు తీరినవెంటనే రూపాయి యద్దెగల మునుపటి గృహమును విడిచి పావలా
బాడిగగల మాయింటి పొరుగు కుటీరమునకుఁ బిల్లలతోవచ్చి ప్రవేశించెను. పాపమా
వెంకమ్మకుఁ గొంచెమైనను సహాయము చేయుట కత్తింటఁగాని పుట్టినింటఁగాని బంధువు
లెవ్వరును లేరు.

మాపొరుగున నుండవచ్చిన నాఁటినుండి మేమామెవర్తనమును జక్కఁగాఁ జూచు
చుంటిమి. ఆమె యహోరాత్రములు కష్టపడి యితరులగోధుమలు మొదలగునవి విస
రియు, బియ్యము మొదలగునవి పోటువేసియు నందునకు వారిచ్చు కూలితోఁ దనబిడ్డలను
సంరక్షించుచుండెను. మే మేరాత్రివేళ మేలుకొనినను వెంకమ్మ యింట *విసర్రాతి
చప్పుడు వినవచ్చుచుండెడిది. ఆమె నిద్ర యెప్పుడు పోవునో మాకుఁ దెలిసెడిదికాదు.
మాయింటి పిండియు నామెయే విసరుచుండెను. కాన పిండి యిచ్చుటకును గోధుమలు కొని
పోవుటకును ఆమె మాయింటికి వచ్చుచుండెను. అప్పుడామె మాయింట వ్యర్థప్రసంగము
లాడక తన పని నతిత్వరితముగా నెరవేర్చుకొని పోయెడిది. కారము, పసుపు, అటుకులు
మొదలయినవి దంచుటకు నేను బిలిచినచో నామెవచ్చి సంతోషముగా నాపనిచేసి
యందుకై నే నిచ్చిన కూలిని దీసికొని వెంటనే యింటికిఁబోవును. కాని పనిలేనిది యొక
గడియయైనను మాయింట నిలిచెడిదికాదు. ఇంతియకాక పనిలేని సమయమునందు
నేనొకసారి యామెను బిలువనంపఁగా "పనిగల సమయమునందు వత్తునుగాని పనిలేనప్పుడు
రాఁజాలన"ని యామె నాకు మొగమోటములేక బదులు చెప్పిపంపెను !

---

ఉత్తరములు వారి బంధుగులును, బెజవాడనివాసులునగు ఉభయభాషాప్రవీణ శ్రీకానూరి వీరభద్రేశ్వర
రావు (బి. ఏ, ఎల్. టి) గారి యొద్దనున్నవి. ఆకాగితములందు చక్కని కథలును, మనోహరవర్ణనలతో
నిండిన యాత్రాసమాచారములును పెక్కులున్నవి. 'బీదకుటుంబము' అనుశీర్షికతో నొప్పు ఈవ్యాసము
ఆకాగితములలోనిది. ఇది 1898-వ సంవత్సరప్రాంతమున రచియింపబడియుండునని శ్రీవీరభద్రేశ్వరరావు
గారు వ్రాయుచున్నారు. ఆకాగితములలో గల ఇతరవ్యాసములనుకూడ క్రమక్రమముగా 'గృహలక్ష్మి'
ముఖమున వెల్వరించి ఆంధ్రలోకమునకు అర్పింప శ్రీరావుగారు వాగ్దాన మొనర్చియున్నారు.

* మహారాష్ట్రదేశమున గోధుమ, జొన్న, సజ్జమొదలగునవి విసరి రొట్టెలుచేయుదురు. కానచటనవి
విసరి యాకూలితోఁ జీవించువారనేకులు కలరు. ఒకరింట పనికత్తెలుగానుండని బీదవారీపనినే చేయుచుందురు.

అదివిని వెంకమ్మ మిగులగర్వితయని నేనెంచి యామెపైఁ గోపించితిని. అంతతో నిలువక నేను నాభర్త సాయంత్రమింటికి వచ్చినవెనుక వెంకమ్మ గర్వితయని చెప్పి యందున కుదాహరణముగా నాపిలుపున కామెరాకుండుటఁ జెప్పితిని. అదివిని నాభర్త కొంచెము యోచించి నన్నుఁజూచి "నీవు వివేకహీనవు. నీవలెనే బీదవెంకమ్మకుఁ గూడ వ్యర్థముగా కాలము గడుపుటకుఁ దీరునని తలఁచెదవు. నీకు నీభోజనము నిమిత్తమయినను శ్రమచేయనక్కరలేదు. వెంకమ్మ యన్ననో తన పొట్టతోఁగూడ నింక నాలుగురు పిల్లలను సంరక్షింప వలసియున్నది. ఇట్లుండగా నామె నీవలె కాలము వ్యర్థపుచ్చినచో నెట్లు వారినందఱినిఁ గాపాడును ? ఈ ప్రకారమామె నడచుటవలన నామె తన కర్తవ్యమును జక్కఁగా నెఱుఁగునని తెలియుచున్నది. ఆమె గర్వితమతియని తలఁచి నీవామెను ద్వేషించుట మిగుల యవివేకము." అనెను. అప్పుడు నాభర్త చెప్పినమాటలవలన వెంకమ్మ యందు నాకుఁగల వైరభావముపోయి యామె యందెంతయుదయ కలిగెను. అయినను నేనది వెలిపుచ్చక యెంతపనియున్నను నొకగడియయైనను దీరదాయని నాలో నేను సణుగుకొని యూరకుంటిని.

ఆ మఱునాఁటినుండియు నేను వెంకమ్మకుఁ జేతనగు సహాయము చేయుచుంటిని. తదనంతర మెన్నడును నేనామెను పనిలేనిది పిలచియెఱుఁగను. వెంకమ్మ యెన్నఁడును పని చేయనిది నావలన నిసుమంతయు సహాయము పొందినదికాదు. తనకుఁ పరమేశ్వరుఁ డిచ్చిన య[illegible]యవములు బాగుండగా నితరులవల్ల నిష్కారణము సహాయము పొందుట మిగుల దోషమని యామె చెప్పుచుండెను. ఆసాధ్వి తన లేమి నెప్పుడుగాని యితరులకుఁ దెలుపలేదు. వెంకమ్మ పుత్రులలో నొకడు పదునొకండు సంవత్సరముల వాఁడు. వేఱొకఁడు తొమ్మిది సంవత్సరముల వాఁడు. మఱియొకడు నాలుగున్నర సంవత్సరముల వాఁడు. ముగ్గురు కొడుకులు. ముగ్గురుకూతుండ్రు. అందొకతె ఏడుసంవత్సరములదియు మఱియొకతె నైదేండ్లనర్థముదియు వేఱొకతె రెండేండ్లదియు. ఈపిల్ల లెప్పుడును నితరుల నొక వస్తువు నడిగి యెఱుఁగరు. దీని నిదర్శము నే ననేకపర్యాయములు చూచితిని. వెంకమ్మ పిల్లలు నాపిల్లలతో నాడుకొనుటకుఁ జదువుకొనుటకు వచ్చెడివారు. వారి యాటలును మిగుల సౌమ్యములయినవి గానేయుండుచుండెను. మాపిల్లలు పగలు మూఁడుగంటలకుఁ గొంచెము ఫలహారములుచేసి బడికిఁబోవుచుండిరి. మాపిల్లల ఫలహార సమయమయిన వెంటనే వారితోఁడ నాడుచున్న వెంకమ్మ పిల్లలందఱు తమ యింటికిఁ

బోవుచుండిరి. వారెన్నఁడును మాపిల్లల భోజనసమయమున మాయింటనుండుటగాని యితరు లిచ్చిన పదార్థమును దీసికొనుటగాని యెఱుఁగరు.

ఒక ఆదివారము నాభర్తయింటనుండఁగా వెంకమ్మబిడ్డలిద్దఱును మానాలుగు సంవత్సరముల కొమారుఁడును పిల్లలతో నాడుకొనుచుండిరి. అప్పుడు మూఁడు జాములైనందువలన నేను నాభర్త కొఱకై యఱిసెలు ద్రాక్షపండ్లు తీసికొనిపోయి యాయన ముందఱనుంచితిని. అదిచూచిన వెంటనే మాపిల్లలాట విడచి తండ్రిసమీపమునకు వచ్చిరి. కాని వెంకమ్మ పిల్లలు దూరముననేయుండిరి. దానింగని నాభర్తగారు మిగుల వింతపడి యొక యఱిసెయుఁ గొన్ని ద్రాక్షపండ్లను జేతఁబట్టుకొని వారిలోఁజిన్నవాఁడగు బాలకునింబిలిచిచూచిరి. ఆబాలుఁడు రానందున నవి నేను దీసికొని వానికీయ బోయితిని. వాఁడును మిగుల నాసక్తితోఁ జెయ్యిచాచెను. నేనాపదార్థములు వానిచేతిలో వేయనుంకించఁగా నాబాలుఁడు తేలుకుట్టిన వానివలె తటుక్కున చెయ్యివెనుకకుఁ దీసికొని నాకది యక్కఱలేదని చెప్పెను. అదిచూచి నాకు వారితల్లియొక్క శిక్షణమున కధికవిస్మయము కలిగెను. అప్పుడాపిల్లవాని చర్యచూచి నే నఱిసె తీసికొనుమని వానిని బలవంతముచేసి యింతకును వాఁడు తీసికొనకపోగా వానిఁబట్టుకొని నోటిలోఁ బెట్ట నుంకించితిని. కాని వాఁడదిచూచి యొకవ్రేటున నాపట్టును వదలించుకొని తనయింటికిఁ బోవుటకుఁ బయలుదేరెను. అందుపై నేను వాని యక్కను బిలిచి నీవైనను దీసికొనుమంటిని. అందుకాపిల్ల "అది నాకక్కఱలేదు. పరుల యింట నెప్పుడు తినగూడదని మా యమ్మ నాకుఁజెప్పినది" యని తానును బోవనుంకించెను. అప్పుడు నే నాపిల్లను గట్టిగాఁ బట్టుకొని "నీవిది తీసికొనుము. మీ యమ్మ నిన్నేమయిన ననకుండ నే నామెతోఁ జెప్పెద" నంటిని. అందుకాచిన్నది "నేనిది తీసికొనుట మా యమ్మకుఁ దెలిసెనా యామె నాతోటి మాటలాడదు" అని ప్రత్యుత్తరమిచ్చెను. అందుపై నేనాపిల్ల మనసుకనుఁగొనవలెనని 'మీయమ్మకీసంగతి నెవరు చెప్పెదరు?' అని యడుగగా నది "ఇతరులేల చెప్పవలెను? నేనే చెప్పెదను" అని బదులు చెప్పెను. ఆపిల్ల మాటలు విని దానింబోవిడచితిని. దానితమ్ముఁడు దాని యక్కయు నంతకుఁ బూర్వమే గృహమున కేగిరి. నేను విడచిన

వెంటనే యాకుఱ్ఱది వలలోనుండి విడువఁబడిన లేడివలె నొక్కపరుగున నింటికిఁబోయెను. ఆఱుసంవత్సరములు నిండని చిన్నదాని ఈ గుణముంజూచినాకుఁ గలిగిన సంతోషమింతింతని చెప్ప నలవికాదు. ఈసంగతి మఱియొకరు నాకుఁ జెప్పినచో నది యసత్యమని నాకుఁ దోఁచును. కాని నేను ప్రత్యక్షముగాఁ జూచిన యీవార్తను నేనెంత వివరించినను నాకుఁ దనివి తీరదు.

ఆ పిల్లలు కట్టుకొను బట్టలు ప్రాతవియు ముతకవియునైనను వారిబట్టలు మురికిగా నెన్నండును నుండగా మేముచూడలేదు. పైనుదాహరించిన సంగతి జరిగిననాఁటినుండియు నేనును నాభర్తయు నాకుటుంబీకులపై విశేషదృష్టియుంచి వారి ప్రవర్తనలఁ జూచుచుంటిమి. ఒక దిన మందఱికంటెఁ బెద్దదియగు పిల్లను నావద్దికిఁబిలచి ప్రసంగవశమున వారింటి సంగతినంతను దెలిసికొంటిని. అదియెట్లనిన పిల్లలబట్టలన్నియు నాపిల్లయే నిత్యము చక్కగా నుతికి యారవేయుచుండెను. అదిగాక యా కుఱ్ఱది నాలుగురోజుల కొకసారి యింటిగుడ్డలన్నియుఁ జవిటిమట్టితో నుతుకుటలోఁ దల్లికి సహాయపడుచుండెను. వారెన్నడును దమబట్టలుతుకుటకుఁగాని కుట్టుటకుఁగాని ద్రవ్యము వ్యయపఱచినవారుకారు. వారి కత్యావశ్యకములైన పిల్లల యంగీలు మొదలైనవి వెంకమ్మయే కుట్టుచుండెను. ఆమె పిల్లల యంగీలబొందులూడినటుల మేమెన్నడును జూడలేదు. పిల్లలవలన నొకానొక యపరాధమైనచో వారికిఁ గొప్పశిక్ష విధించుట దల్లి వారితో మాటలాడక యొకగడియ యుండుటయే. ఈశాసన మాపిల్లలకు మిగుల నసహ్యముగ నుండెను. ఆచిన్నదానిమాటల వలన వారితల్లి యనిన నొక దేవతయనియే నాకుఁదోఁచెను. ఆమె దేవత కాకుండిన నిట్టి స్థితిలోఁ దనసంతానము నిట్లు పెంచి వారి కిట్టిమర్యాద, నీతి, జ్ఞానములను నేర్పుట యెట్లు తటస్థించునని నాకుఁదోఁచెను. ఆమెనుజూచి నా పెనిమిటి నాతో నీవామెవలె నీకర్తవ్యము నెఱిఁగి ప్రవర్తింపుమని చెప్పుచుండెను. నేనును నాభర్త చెప్పినది నిజమని తెలిసికొని యట్లు నడువఁ బ్రయత్నింపుచుంటిని. వెంకమ్మయందు మా కధికాదరణ కలిగెను.

ఒకనాఁటిరాత్రి నా కాకస్మికముగా కడుపులోనొప్పి ప్రారంభించెను. నేనపుడు గర్భవతినై నెలలునిండకుండినందున జడిసితిని. రాత్రి సమయమయినందువలన పిల్లలందఱు

నిద్రపోయిరి. నావద్ద నెవరైనఁ దోడులేనిది నాభర్త మంత్రసానిని బిలుచుటకుఁ బోవ వలనుపడక నావద్దనుండుటకై వెంకమ్మను బిలువఁబోయిరి. అంతకు మునుపెన్నడును నాభర్త వెంకమ్మ గృహమున కేగలేదు. నాఁటి రాత్రి తొందరగా వెంకమ్మ యింటికిఁ బోయి తలుపుమూసియుండనందున నిరాతంకముగా గృహములోని కరిగిరి. అప్పుడు చిన్న పిల్లలందఱు నిద్రపోవుచుండిరి. పెద్దపిల్లలు ముగ్గురును దీపముచుట్టును గూర్చుండి తమ తమ పాఠములను జదువుచుండిరి. వెంకమ్మయు నొకగ్రంథమును జదువుచు వారు చదువుదానిని వినుచుండెను. నాభర్త వచ్చుటగాంచి వెంకమ్మ చదువు పుస్తకమునుమూసి కారణమడిగి తెలిసికొని వెంటనే మాయింటికి వచ్చెను. ఆమె వచ్చువఱకే నానొప్పి కొంత తగ్గెను. వెంకమ్మ వచ్చి చికిత్సచేయగా నాకడుపుకట్టు వదలెను. వెంకమ్మను బిలువఁబోయినప్పుడు నాభర్త కామె యింటిస్థితి చూచి యాశ్చర్యము కలుగకున్నను ఇంటికివచ్చి నాశరీరము నిమ్మళమయిన పిదప ఆయన యింతకుమునుపు తాను చూచిన సంగతిని గుఱించి విచారించి యాశ్చర్యపడసాగిరి. నాఁటివఱకు వెంకమ్మకుఁ జదువు వచ్చునను సంగతియే మాకెవ్వరికినిఁ దెలియదు. ఆమె తన పిల్లలు చదువు సమయమున వారి చదువువినుచుఁ గూర్చుండుటఁజూచి నప్పటినుండియు నంతకుఁ బూర్వమెన్నడు లేకుండినను నాభర్త పిల్లల చదువు కనుగొనుచు వారు చదువునపుడొక గడియయయిన నచటఁగూర్చుండి చదువు చెప్ప నారంభించిరి.

సాధ్వీమతల్లి యగు వెంకమ్మనుగూర్చిన సంగతులెన్నియో కలవు. కాని అవి యన్నియుఁ జెప్పఁదొడగినచో నీముచ్చట యింతలో తెగదు. నాకును నది చెప్పుట కవకాశములేదు. ఇచట ముఖ్యముగాఁ జెప్పవలసినదేది యన నట్లు పెరిగిన నాయమ పుత్రులు గొప్పవారలై తల్లి ఋణముదీర్చిరి. వారిలోఁ బెద్దవాఁడు ప్రవేశ పరీక్షయందు కృతార్థుఁడై యొక యుద్యోగములోఁ బ్రవేశించెను. వెంకమ్మ కూఁతురు వివాహ యోగ్యయయ్యెను. ధనహీనయైనందున నామె తన బిడ్డ వివాహమెట్లగునాయని విచార పడుచుండెను. కాని వెంకమ్మ విచారము చాలదినము లుండినదికాదు. అపిల్లదాని రూప గుణ సంపదఁజూచి మేమే మాపిల్లవానికిఁ జేసికొంటిమి. మొదట బీదపిల్లయని నేనెంత

యసమాధానపడినను నాభర్త యూరకుండక నాకనేకసమాధానములను జెప్పి యీ పిల్లను నాకుఁ గోడలినిఁజేసెను. నాకోడ లిపుడు తన సద్గుణములవలన మాయింట నంద ఱకును నధికప్రియయైన దయ్యెను. అది నాకోడలైనందున నేనుదానిఁ బొగడిన నీమా కంతగా నామాటలందు నమ్మకముండదు. మన వారిని లోకము నుతియింపఁగా విననల యునేగాని మనమునుతియింపరాదు.

వెంకమ్మ జ్యేష్ఠపుత్రుఁన కాతని తెలివి తేటలవలన నారంభముననే ముప్పది రూపాయిల వేతనముగల యుద్యోగము దొరికెను. క్రమక్రమముగా నభివృద్ధి పొంది యతఁడిపుడు నూట యిఱువది రూపాయిల జీతము పుచ్చుకొనుచున్నాఁడు. తన కొడుకు గొప్ప పదవిలో నుండెనని వెంకమ్మ యిసుమంతైన గర్వపడుటలేదు. పూర్వమెంత వినయవతియో, ఇప్పుడునంతియు. ఇరుగు పొరుగు వారికెట్టి యిక్కట్టు సంభవించినను ఇప్పటికి నామె ముందంజవేసి తోడుపడుచుండును. ఆమె వినయసౌశీల్యాదిసద్గుణగణ ములుచూచి ఒకధనవంతుఁడామె రెండవకూఁతును తన కుమారునికిఁ జేసికొనెను.

ఇట్లు నిరుపేదయగు వెంకమ్మ ఐశ్వర్యవంతులతో వియ్యమందియు పుత్రుని యుద్యోగలాభమున నైశ్వర్యముకలదియయ్యు ధనవంతులకు సహజలక్షణమగు గర్వోన్నతి జెందలేదు. తనకోడండ్రను కూఁతులతోబాటు దిద్దుకొనుచు కోడంట్రికము పెట్టక సంసారము సానుకూలముగ సర్దుకొని పోవుచున్నది. ఆమెనుండి నే ననేకగుణ పాఠములను నేర్చుకొనుచు నామిత్రుల కందఱకు నామె నుత్తమాదర్శప్రాయురాలిగ గన్పఱచుచుందును."

## కులసతీనిరాదరణ

వడ్డాది సుబ్బారాయడుగారు

తల్లిని దండ్రి నన్నలను దమ్ములఁ నప్పలఁ జెల్లియండ్రఁ బు
ట్టిల్లు సమస్తమున్ విడిచి యెల్లను దానని నమ్మి భక్తిమై
నుల్లము పల్లవింప నెపు డూడిగము సేయు సతిం గుబుద్ధియై
యొల్లనిఘాతి కేసరక మున్నదొ పాపఫలానుభూతికిన్?



శ్రీమతి పులవర్తి కమలావతీదేవిగారు

రాజమంద్రి: బ్రహ్మసందభక్తసమాజనిర్మాతలు.



శ్రీ కాకి అచ్చిరాజుగారు; వారిసతి పుష్పావతమ్మగారు.

# శ్రీమతి కాకి పుష్పావతీదేవి

## శ్రీమతి పులవర్తి కమలావతీదేవిగారు

ఉండు నేవీట మార్కండేయమునినాథ సజ్జలింగ మనంగ శాసనుండు
ప్రవహించు నేవీటి పశ్చిమప్రాకార మొరసి గంగమ్మ సాగరము కొమ్మ
యావిర్భవించినా నేవీటికోటలో బలభేది మదనగోపాలమూర్తి
పాలించు నేవీటి ప్రాగదక్షిణంబు నుమబోటి శ్రీముల్లగూరిశక్తి

అని కవిసార్వభౌమునిచే వర్ణింపబడిన సాంద్రవిభవమగు రాజమహేంద్రవరమునందు సుప్రసిద్ధములగు వైశ్యకుటుంబములలో కాకి వారి వంగడ మొకటి. ఆవంశమునకు ఆధునికకాలమున అనంతగౌరవము, అసదృశకీర్తి గొనితెచ్చుచున్న శ్రీ అచ్చిరాజుగారియు, వారిసతీమణి పుష్పావతీదేవిగారియు చరిత్ర భక్తిభావముగల ఆంధ్రరమణీమణులు అవశ్యము తెలిసికొన దగినది.

రాజమహేంద్రవాస్తవ్యులలో కాకి పుష్పావతీదేవి నెఱుంగనివారుగాని, యామె మృదుమధురభాషణము లాలకింపనివారుగాని యెవ్వరునుండరు. పుష్పావతీదేవిగారు సుప్రసిద్ధ విదుషీమణి. మహాత్యాగిని. దైవభక్తిపరురాలు. రాజకీయరంగమున బాల్గొననందున యామెపేరు పైకిరాలేదు. కాని యామె యొనరించుచున్న నిరాడంబరమైన సంఘసేవ నిరుపమానము.

సుమారు ముప్పదివేల రూపాయలు వ్యయపరచి యామె బ్రహ్మానందభక్తసమాజ భవనమను నొక దివ్యభవనమును పావనగౌతమీతీరమున నిర్మించినది. వేఱొకచో ముద్రితమైన ఆభవనముయొక్క ముఖదృశ్యము చూడుడు. ఇప్పుడు మరల నెంతయో ద్రవ్యమును వెచ్చించి అనాధస్త్రీలు నివసించి దేవుని బూజించుట కనువగునట్లు భవనమునకు సామీప్యముననే కొట్లను నిర్మించుచున్నది. ఈశ్వరునివలె ఆమె అష్టైశ్వర్య సమన్విత. బుద్ధభగవానునివలె సమస్తభోగసమన్విత. అయ్యును ప్రజల యభివృద్ధికొఱకు ఆమె నిరాడంబరజీవితమును గడుపుచున్నయది.

హిందీయందు దీమెకు గల పాండిత్య మపారము. భక్తిరసగ్రంథములకు పేరుమోసిన హిందీసారస్వతమందలి రత్నముల నీమె మూలమున నీపురజనులు విని తరించుచుందురు. అంతతో నూరుకొనక తన శిష్యురాండ్రందఱిని హిందీయందు విద్యావతులుగా నొనరించి మనోహరమైన హిందీపాటలను వారికి నేర్పినది. ఈసుదతీలలామకటాక్షమువలన హిందీయలవడుటయు దైవభక్తిని ఉద్దీపించు పాటలనేర్చుకొనుటయు నీపురవైశ్యస్త్రీలకు లభించినది. గాఢమగు ఈమె రామభక్తికి మెచ్చుకొని పురజనులు సభజరిపి ఈమెకు రామభక్తయను బిరుదము నొసంగి సత్కరించియున్నారు.

కాశీమొదలుకొని కన్యాకుమారియగ్రమువఱకు యాత్రలనొనరించు తైర్థికులు గోదావరీనదియందు స్నానమొనరించుట ముఖ్యనిధియై యున్నది. అట్లు దిగు యాత్రికులు భవనముయొక్క సుందరతరనిర్మాణమున కచ్చెరువంది యందలి కాశీవిశ్వనాథలింగమునకు నతులొనర్చకుండ నేగరు. ఈభవనము గోదావరినదీతీరమున మార్కండేయాలయమున కానుకొని నిర్మింపబడినది.

ఈ భవనమునందలి విశేషమేమన చాతుర్వర్ణ్యములవారును లింగమును తమ చేతులతో పూజింపవచ్చును. ఇట్టి ఘనతమమైన పద్ధతి కాశీయందు తప్ప వేరెచ్చటను గానరాదు. ఈ భవనముఖమంటపముపై యీశ్వరుడు విఘ్నేశ్వరపార్వతీసహితుడై ముంగట నందీశ్వరుడు కూర్చునియుండినట్లు రవివర్మ చిత్రించిన విగ్రహమువలె జీవకళలుట్టిపడునట్లు నిర్మింపబడినది.

ప్రతిదినము పురాణకాలక్షేపమును, రెండుపూటల సహస్రనామములతో మంత్రపుష్పాదులతో యథావిధిగా నీశ్వరపూజయు జరుపబడుచుండును. భవనమునందు చల్లనిగాలి వచ్చుట కనువుగనుండుటచేత పండితపామరులెల్లరు తప్పక దయచేయుచుందురు. రాత్రి పదిగంటలవరకు రెండు గ్యాసులైట్లు వెలుగుచుండును.

ఇయ్యది ప్రత్యేకము స్త్రీలు తరించుటకొఱకే గాక పురుషులుకూడ తరించుట కనువుగ నేర్పరుపబడినది. సభలు జరుగునపుడు సగముభాగము పురుషులకు సగము స్త్రీలకును ప్రత్యేకింపబడును. సంవత్సరమునకు సగటున నూరు హరికథలనైన చెప్పించు

రాజమంద్రి: బ్రహ్మానందభక్తసమాజము.



ఈశ్వరార్చన.

రాజమండ్రి: బ్రహ్మోసందభక్తసమాజభవనము.



ముఖదృశ్యము.

చుందురు. అంతియుగాక యనేకమంది యతీంద్రులు సచ్చిదానందస్వామివంటివారరు దెంచి ముక్తిమార్గమునుగుఱించి బోధించుచుందురు.

ప్రతి శుక్రవారము పురమునందలి స్త్రీలు విస్తారముగవచ్చి పూజచేసికొనెదరు. ఇందు లక్ష్మీనారాయణుల ప్రతిమలుగూడ గలవు. శివకేశవులకంను భేదములేదు. ప్రతి యేకాదశియందును కాకి పుష్పావతీదేవి తన శిష్యగణములతోఁగలసి కాషాయవస్త్రధారణముచేసి గోదావరీతీరపు టొడ్డుపై మనోహరముగ హరికీర్తనల కిన్నెరస్వరమున బాడుచు చిడతలువాయించుచు గంగపూజ కరిగి యా గోదావరినదీమతల్లి నర్చించు దృశ్యము చూడదగినది. ఈ భవనమున శ్రీరామనవమి యాదర్శప్రాయముగ జరుప బడును. ఈ భవనము పండితులకు కల్పద్రుమము. పామరులకు కామధేనువు. బీదలకు పాడియావు. సాధువుల కాశ్రయము.

మఱియొక విశేషమేమన తీర్థయాత్ర కరుదెంచిన వారికడ నొక్క పైసయైన గైకొనకుండ పసుపు కుంకుమ ఫలములు తాంబూలము నీరాంజనము మొదలగున వన్నియునిచ్చి యుచితముగ పూజలను సమంత్రముగ జేయించి పంపించెదరు. ఎవ్వరైన తమకు తోచినదియిచ్చి యందు వేయవచ్చును. నిర్బంధము లేదు. ఇట్టి దేవాలయము యిట్టి భక్తివైరాగ్యములు యిదివరకు మనము చూడలేదు. ఇక ముందుతరమువారు చూడబోవరనుట అతిశయోక్తి యనిపించుకొనదు.

విశేష ధనవ్యయముచేసి బ్రహ్మాండమగు భవనము నిర్మించి తనకు నెలవైయున్న పట్టణరాజమునకు నిరంతరభగవన్నామసంకీర్తనారావముచే దక్షిణకాశియను ప్రసిద్ధి ఎన్నటికి విచ్ఛిత్తి కలుగకుండునట్లొనర్చి దైవభక్తి, వైదుష్యము ఏకీభావమొందిన స్వరూపమునకు తార్కాణమై వెలుగొందుచున్న శ్రీమతి కాకి పుష్పావతీదేవి జీవితము పొగడ దగియున్నది. ఆమె తలపెట్టు సమస్తసత్కార్యములకు జవము, జీవము ప్రసాదించుటయే వ్రతాచరణముగ నడుపుచున్న శ్రీ అచ్చిరాజుగారి ఉచితజ్ఞత, ఉదారత స్తుత్యాతీతములు. ఈ పూజ్యదంపతుల భవిష్యజ్జీవనము నింకను ప్రకాశమానముగ నొనర్చి విశ్వేశ్వరస్వామి తన భక్తవత్సలత లోకమునకు చాటుగాక !

# శరద్రాత్రి

నిడమర్తి సత్యనారాయణమూర్తిగారు బి. ఏ. (సారస్వత సమాజము)

మందమారుతమున సందడి చేసెడు సరుగులు చేయవు సద్దాకింత,
అతులితమాధుర్యముల మురిసి పాడు కేదారములు నేఁడు కిక్కురనవు,
గంభీరనినదాన గదసి కేకలువేయు పవను సద్దేయెడ చెవుల సోఁకదు,
ఫుల్లకుసుమతతి పున్నాగముల్ రాల్చు జలజలనినదము జాడరాదు,

తిమిరసంయుతయామిని తెరువుఁజూపి
మెరయు ఖద్యోతమాలికల్ మిన్కురనవు,
లలితశారదజ్యోత్స్నఁ బులకితమగుట
నన్నియును దన్మయత్వమునందియుండె.

వేకువజామునందుఁ జలివెంటనె స్నానము లాచరించి శ్ర
ద్ధాకుల భక్తులుప్పతిలఁ దన్నులు వీడిన దీపసంఘముల్
ఈకొలనందు మిన్కుమని యొన్, నిజకాంతులు చంద్రికాద్యుతి
స్నేకత నొప్పనొల్లమిని యిట్టులెకా ఘనుముందు నల్పులుగన్.

పొలముల గోపకుండు గడువుల్ దరిమేయఁగ మంటఁ గాగుచున్
జలినడగించు నిర్మలతుషారకణంబుల ప్రజ్వరిల్లు శా
ద్వలమును మేసెడింబసులు, దాసుల మాధవసంస్తుతిధ్వనుల్
చెలగెడి మాధురీరసవిశేషము వీనుల విందుచేయఁగన్.

అమలకౌముదీసంపద నరసి చూచి
జలజమిత్రుని రాకను జాటవచ్చు

వెల్లకాంతు లటంచును వెఱ్ఱివడియు
ఖగము లక్కడక్కడ కలకలముచేసె.

శారదరాత్రు లుజ్జ్వలసుచంద్రికలం గనువిందుసేయుచున్
నేరని శాంతిసంపదను నిర్మలమైన మరీచిప్రౌఢిమన్
గారణకారణుండయిన కారుణికోత్తము శాంతి కీర్తి శృం
గారము నేర్పడంగడలగానగ జాలెను వేవిధంబులన్.

జననీశయ్యఁ బరుండి కప్పిడిన వస్త్రంబున్ రహస్యంబుగాఁ
దనుఁ దప్పించి మురారిచేష్ట లతిమోదం బీయ గోపాలబా
లను మోసంబునముంచి, వెన్నగొని, సల్లాపించి యీచంద్రశో
భనరాత్రిన్ విహరించుటన్ గలిగె బాస్వత్కౌముదీకాంతియున్.

ఘనసంసారదురంతదుఃఖమును నాకాంక్షింపమంచున్ వ్రజాం
గన లెల్లం దన మోహనాకృతికి మ్రొక్కన్ సంతసం బుప్పతి
ల్లిన సంసారమ సౌఖ్యమూలము సఖుల్ లేదింక వేరొండు మీ
కని యీశారదచంద్రచంద్రికలలో నాపంపెనా కృష్ణుఁడున్?

వీనుల విందుగాగ నటవీసమభూములయందు గోపబా
లానికరంబుఁ జెంతఁ గొలువారగఁ గృష్ణుడు వేణువూదినన్
మానులు మేలుకాంచి యమునాజలసంఘములందు వేకువన్
స్నానము లాడనేగు దివసంబు లికెప్పుడు ముందురావుగా?

ధరణీభారము మాన్పి సద్విజులకున్ ధర్మంబుస్థాపింప వే
స్థిరబద్ధుండయి హరి గోపకులతోఁ జెల్మిన్ విజృంభించి ప
ల్మరు గోసంఘము మేపుకొంచు నల ప్రేమప్రోక్తవేణూనినా
దరతిన్ శారదరాత్రులంగడప తత్సౌరభ్య మెంతో నాకో?

తత్త్వ శాస్త్రపరిశోధనమున నేదియుఁ దేలక యెన్నాళ్లు తిరిగినావొ?
ప్రాణసఖుండగు పార్థుకు నాధ్యాత్మికజ్ఞాన మెన్నాళ్లు గరపినావొ?
ధర్మము ధారుణి దాటుకొల్పువిధంబు చర్చింప నెన్నాళ్లు సలిపినావొ?
ప్రకృతి కృత్రిమ మార్గపరిశోధనమునకై బడలుచు నెన్నాళ్లు పరగినావొ?

యీ మనోమోహనకరంబయి తనరించు
విమలచంద్రికాకాంతుల వెల్లువలను
బుష్కలమగు సస్యసమృద్ధి పొలములందు
నందవంశాబ్ధిచంద్ర! యానందసాంద్ర!

రాజనీతిధురంధరత్వమున వెలుంగు దేశ మిప్డుముగంటె దీనయగుచు,
అధ్యాత్మికజ్ఞానమందున మిన్నయా ప్రజ జ్ఞానమందు విరళముఁ జెందె,
అఖిలకళల ధామమైయున్న వసుమతి కళలన్న రుచిలేక మెలగుచుండె,
బాహుబలాన్విత ప్రబలదేశ మిపుడు శస్త్రమే యెఱుఁగక సంచరించు,

వేయి చెప్పగనేల నోవృష్టితిలక!
నీవయుదయించి నప్పుడు తావకధర
యున్న యజ్ఞానమందున నున్నవారు,
వీరిసరి జేయ జనియింతు రేరు చెప్పుమ?




డాక్టరు యస్. శేషగిరిరావుగారు యల్. ఐ. యమ్.

ముదురు అరటికాయ పచ్చిగా ఉండగనే యెండించి కొట్టి పిండిచేసి దానిని బిళ్ల బిళ్లలుగాచేసి యెండబెట్టి ఉప్పుతో కలిపి తినిన అజీర్ణమును, పులి తేనుపులు గల అగ్నిమాంద్యమును కుదురును.

ఆవిసెఆకు రసమును దట్టముగ పట్టించి అందుపైన దూది అంటించిన గవద బిళ్ళలు హరించును. గాయములపైన వేసిన నవిమానును.

ఎఱ్ఱగుమ్మడికాయను చక్రములుగ కోసి అరికాళ్ళకు అరిచేతులకు కట్టిన జ్వరములో కాళ్ళచేతుల తీటలు నిమ్మళించును. దీని గుంజు పిసికిగాని దంచిగాని కట్టిన గెడ్డలు, రాచపుండ్లు పక్వమై పగిలిమానును.

కరివేపఆకులయొక్క తేలిక కషాయము మరిడిజాడ్యమున కల్గువాంతులను తదితరమైన వాంతులను కట్టును. ఆకులు పచ్చివిగాని నేతిలో వేయించినవిగాని తినిన రక్తగ్రహాణి కట్టును.

కుప్పింటాకు నూరి దానిలో సున్నముగాని ఉప్పుగాని కలిపి నూరి పూసిన గజ్జి, చిడుముమానును. ఆకునూరి పట్టించిన జెఱ్ఱి, పురికోస, తేలు, కందిరీగ, తేనెటీగ మొదలగు విషపుపురుగులు కుట్టినందువలన గలిగెడుబాధ నివృత్తియగును.

కొత్తిమిరి రసము చనుబాలలో గలిపి కండ్లలలో వేసినను లేదా దీనిఆకు వెచ్చజేసి కండ్లకు వేసికట్టినను అనేక నేత్రరోగములు మానును.

గుంటకలగర అనుదినము ఉదయపు పూటలను 3 చిగుళ్లు (దళములు) 3 మిరియపుగింజలు చొప్పున 15 లేక 20 దినములు తినిన మేహజ్వరము అస్థిగత పురాణఅహికజ్వరములు పాండు మొదలగు రోగములు నివర్తించును.

గుమ్మడుచెట్టు వేరు చూర్ణము, యష్టిమధుకి చూర్ణము కలిపి తేనె పంచదారతో నిచ్చిన స్త్రీలకు పాలు వృద్ధిజేయును.

పుదీనా పచ్చియాకు సువాసన జూచుటవలన తలలోనుండు జబ్బును, ముఖము తిరగడము (fainting) ను పోగొట్టును. నల్లమిరియములతో బుచ్చుకొనిన అజీర్ణము పోగొట్టును.

చుక్కకూరయొక్క ఆకు నమిలి యుమ్మివేసిన పంట్లనొప్పులు మానును పండ్లు గట్టిపడును. ఆకు నూరికట్టిన గడ్డలు త్వరగా పక్వమై పగిలిమానును. పైన పూసిన గజ్జిమానును.

మండూకబ్రహ్మి నీళ్లలోవేసి కాచి స్నానముచేసిన చర్మరోగములు మానును. దీని ఆకును వెచ్చజేసి మెంతులువేసి చేసిన తేలిక కషాయము బిడ్డల విరేచనములను జ్వరమును కట్టును.

ముళ్ళతోటకూరయాకును పప్పువేసి వండి స్త్రీలకుపెట్టిన పాలుపడును.

# రుద్రమదేవి

### శేషాద్రిరమణకవులు

జనకపాల్యంబైన సామ్రాజ్యమంతయుఁ దాల్మిమై హస్తగతంబొనర్చి
అన్యదాస్యంబున కాంధ్రసామ్రాజ్యలక్ష్మిఁ బోవనీక పాలనమొనర్చి
తననుబంధింపవచ్చిన హరిహరదేవు ప్రధనరంగమునకు బలియొసంగి
మూఁడులక్షలబలంబులతోడవచ్చిన మహదేవరాయల మట్టుపెట్టి

దేవగిరి యోరుగల్లు సంధిస్థలమున
వితతవిజయధ్వజంబుస్థాపించి మించి
యాంధ్రులచరిత్రమున కెల్ల ననుపమాన
దీప్తిఁగూర్చెను రుద్రమదేవిరాజ్ఞి.

# ప్రేమ చిత్రము

పెమ్మరాజు రాజగోపాలముగారు బి.ఏ., సారస్వత సమాజము

౧

నాకు చిన్నతనమునుండీ చిత్రలేఖనమందే సరదా. ఒక గొప్ప చిత్రకారుడిని కావాలనీ విఖ్యాతిచెందాలనీ కాదుగాని, కాలవాహినీప్రవాహములో పడి కొట్టుకొనిపోకుండా శాశ్వతముగా నిలచి జీవకళ ఉట్టిపడేలాగు చిత్రరచన చేయాలని అభిలాష. చిన్నతనమునందే యేవో కొన్ని కొన్ని బొమ్మలు వేసేవాడననీ, అప్పుడప్పుడు మంచి మంచి బొమ్మలుకూడా గీసేవాడననీ మావాళ్లుకూడా చెప్పుతూ వుండేవారు.

కొంచెము పెద్దవాణ్ని అయినతరువాత స్కూలులో ప్రవేశించ పెట్టారు. అందరికంటె డ్రాయింగు క్లాసులో నేనే బొమ్మలు బాగా వేసేవాణ్ని. ఓమాటు చెట్టుమీదవున్న కోతిపిల్ల బొమ్మ బాగా వేసానని మా మేస్టరు నన్నెంతో మెచ్చుకొని మంచి చిత్రకారుణ్ణి అవుతానని చెప్పేడు. అది నా కింకా జ్ఞాపకము.

విద్యా సంపాదనపూర్తి అయినతర్వాతకూడా నాకు ఉద్యోగముమీద మనసు పోనలేదు. చిత్రరచనాభ్యాసముచేస్తూ కళోపాసకుడనై వుందామనుకొని అదే నిశ్చయం చేసుకొన్నాను.

అప్పుడు నాకు యిరవై సంవత్సరములకంటే యెక్కువ వయస్సుండదు. తండ్రి గతించినాడు. అయిననూ మాకన్నవస్త్రాలకి లోపము లేదు. గౌరవమైన స్వతంత్రజీవనము చేయడానికి తగిన ఉపపత్తి లేకపోలేదు.

కాని యౌవనోదయముతోపాటు నామనస్సులో విచిత్రభావోదయంకూడా అయింది. అప్పటి కప్పుడే—భారతిలో పడకపోయినా—ఆంధ్రదేశములో నా చిత్రములందేదో కొంచెముఅభిమానము ఆదరణా ప్రారంభమైనవి.

ఆకారణముచేత నాయౌవనాశాహృదయం మరింత వుష్పింపగ నారంభించింది. నిరంతరము నూతనదేశాటనం చేయాలనే కోరిక మెండయినది. వివిధ దేశాలకి పోవడము, అక్కడవుండే ప్రకృతిసౌందర్యము చూచి ఆనందాతిశయం పొందడము, అనేక రీతులుగావుండే మానవస్వభావసౌందర్యాలు పరిశీలించడము నాకు మామూలై పోయింది. ఆదర్శప్రాయమై, సౌందర్యతత్వము ప్రకటించే కళయేదో అదే ప్రకటించాలని నామతమైపోయింది. ఏది సంపూర్ణముగా సుందరమై వుంటుందో అదే సత్యమైనదని నావూహ. శివము, సుందరమూ, సత్యమూ అయినదానిలో మాలిన్యము వుండదని నా నిశ్చితాభిప్రాయము.

అందుచేత ఏతావు సౌందర్యానికి ఆటపట్టో అక్కడికల్లా నే పోయేవాణ్ణి.

ఈలాగువుండగా దక్షిణదేశయాత్ర చేయాలనిబుద్ధి పుట్టింది. అక్కడ శిల్పకళాభిలాష మెండని వాడుక. అందుచేత బయలుదేరి ముందుగా చెన్నపట్నము వెళ్లేను.

౨

నేను చెన్నపట్నముచేరి సుమారు ఆరుమాసము లైంది. ఆ మహాపట్నములో చాలా ఆనందముగావుండేది. రోజూ బీచికి పోయేవాడిని.

ఒకనాడు. సాయంత్రసమయము అయింది. ప్రశాంతసౌమ్యసౌవర్ణసంధ్యారాగము పడమటివైపున ప్రకాశించుతోంది. ట్రిప్లికేను బీచికిపోయి సముద్రానికి బాగా సమీపానవున్న యిసుక తిన్నెమీద కూర్చున్నాను.

సముద్రతరంగాలు ఒకదానికంటె మరొకటి సముత్తుంగమై వచ్చి పడుచున్నవి. చిన్న చిన్న బాలికాబాలకులు ఆకెరటాలతో ఆటలాడుకొనుచున్నారు. తమిళ సాంప్రదాయానుసారముగా అక్కడ కనేకమంది స్త్రీ పురుషులువచ్చి కూర్చున్నారు. మనోహరమైన ఆదృశ్యము తిలకిస్తూ నామనస్సు అనిర్వాచ్యమైన ఆనందము అనుభవిస్తోంది.

ఇంచుక సేపు నిమీలితనేత్రుడనై మళ్లీ కళ్లు విప్పి చూచేసరికి నావైపున కెవ్వరో ముగ్గురు మనుష్యులు వస్తూవున్నారు. అందులో ఇరువురు స్త్రీలు, ఒక పురుషుడూ వున్నారు. ఆ పురుషునిదంతా పాశ్చాత్య వేషం. ఆంధ్రుడో, అరవవాడో నిర్ణయింప వీలులేకున్నది.

ఆ స్త్రీలలో నొకతెకు ముప్పదివత్సరాలు పైబడినట్లుంది. చాలా సుందరి. రెండవ యువతికి పదునెన్మిది వసంతాలు గడచివుండాలి అనుకొన్నాను. ఆలాటి జగదేక సౌందర్యము నేనెక్కడా చూడలేదనే చెప్పాలి.

ఆయువతి వచ్చుచున్నంతవఱకూ చంచలముకాని విద్యుల్లతాసముదాయము తీగకట్టినట్టుగావుంది. ఆమెనుండి ఒకవిధమగు దివ్య తేజముబయలు దేఱినన్ను కూడా ముంచెత్తుచున్నట్లుగా తోచింది. వారువచ్చి నాకించుక సమీపాన కూర్చున్నారు. నే నాయువతి వైపట్టే ముగ్ధుడనై చూస్తూ వుండిపోయాను.

ఆమె వాలుజుడ దట్టమై, దీర్ఘమై, నీలమై వెనుక వ్రేలాడుతోంది. వేణి అగ్రమున మల్లెపూలబంతి పెట్టుకొంది. జడచివర కట్టిన వూదారంగు రిబ్బను చాలా సొగసుగావుంది. గుబురులు గుబురులుగావున్న ముంగురులను రెండువైపులా రవ్వలుదాపిన హెయిరుపిన్నులు గ్రుచ్చుకొంది. వికసితసరోరుహసదృశసుందరవదనమండలము శోభాప్రపూర్ణముగావుంది. అతివిశాలరమణీయసువర్ణశతపత్రాలు రెండు తీసికొనివచ్చి ఆయువతి మాధురీమయనేత్రాలుగా అతికి, సువర్ణోదకములో ముంచి మెరుపు చాయలు సంతరించిన తిలపుష్ప మొకటి ఆమె నాసికగాతీర్చి, పైన నీలాలపట్టుకుచ్చులు కన్నుబొమ్మలుగా కట్టి, తన అపూర్వసౌందర్యనిర్మాణసామర్థ్యము సృష్టికాంత ప్రకటించి వుండాలి. ఆయువతి ఆయతనేత్రాలువిప్పి నీలాలచాయలు తోరణాలు కట్టేలాగు ఏవైపుచూస్తే ఆవైపల్లా ప్రపూతమై పోతోంది.

సుందరసమున్నతపీనవక్షమూ, అతి మృదులములై యించుక మాంసలములై లావుతేఱిన బాహుయుగళమూ, బహు ఆకర్షణీయముగావున్న సుందరజఘనమండలమూ, ఉత్తరదక్షిణఅమెరికాలమధ్య కనపడీ కనపడకుండా వుండే భూసంధిలాంటి సూక్ష్మమధ్యమూ కనువిందుచేయుచున్నవి.

మెడలోని సువర్ణహారాలూ, వంకులుతీర్చిన వడ్డాణము, భుజమూలమున బ్రూచి తప్ప ఆమెకు యితరాభరణములు లేవు. వారేమియో ప్రసంగించుకొనుచూ మధుర సల్లాపమున మునిగియుండిరి. ఆమె నావైపు చూచినదో లేదో నేను చెప్పలేను. కాని అప్పుడప్పుడు చూస్తోందనే నాఊహ. వారి వేషములనుపట్టి వారాంధ్రులే అయివుంటారనుకొన్నాను. ఆ ముగ్వురికెట్టి సంబంధము వుందో నాకు తెలిసికొనేటందుకు వీలులేకుండా వుంది. ఆ పురుషుని కామె కూతురో మరదలో అయివుంటుందనుకొన్నాను. వారి చనువునుపట్టి పుత్రికయే అయివుండాలనుకొన్నాను.

అవి శుక్లపక్షశర్వరులు. చంద్రదర్శనము కాగానే సాగరము కల్లోలిత్వోల్లోలములతో పొంగిపోతోంది. ఆకదలుతూవున్న తరంగాలమీది చంద్రికాసముదాయము మిలమిలా మెఱసిపోతోంది. తరంగానికి తరంగానికీ మధ్య రజితసారమో పాదరసమో పాకిపోతోంది.

వారలానే కూర్చున్నారు. ఆమె సౌందర్యానికి అర్చనచేస్తూ నేనూ అక్కడే వున్నాను. అదివొక స్వర్గీయరంగము. ఎదురుగుండా సౌందర్యదేవీమూర్తి సాక్షాత్కారము. నేను ధ్యానయోగములో మైమఱచి వున్నాను.

నేనుమరల ధ్యానముద్ర సడలించుకొని చూచేసరికి వారు ముగ్గురు వెళ్లిపోవుచున్నారు. వారెక్కడకు పోతారో చూడాలని నాకు బుద్ధిపుట్టింది. అందుచేత వారి వెనువెంటనే నేను బయలుదేరాను.

వాళ్లు బీచిమీదనుండి రోడ్డుదగ్గరకురాగానే వారికొఱకు మోటారుకారు సిద్ధముగావుంది. నేనూ వారిని సమీపించుసరికి వారు కూర్చున్న మోటారుకారు శరవేగమున పోవనారంభించెను.

నేను చేయునదిలేక ఆదేవీమూర్తిని ధ్యానించుకొనుచూ అక్కడనే నిలవడ్డాను. రోడ్డు చాలా సమ్మర్దముగావుంది. చివ్వునవచ్చి పోవుచున్న మోటారుకార్లకు, గుఱ్ఱపుబండ్లకు విధి విరామములేదు.

వెలిగింపబడిన విద్యుద్దీపికాసహస్రములచే పురమంతయు కాంత్యుజ్జ్వలమైవుంది. ఆకారు వెంటనంటి పోవాలనుకొని ఒకటాక్సీకారులోయెక్కి చాలాదూరము పోయాను. కాని మరల ఆకారును ఆనవాలు పట్టలేకపోయేను.

అట్లు కొంతదూరముపోయి చేయునదిలేక మరల టాక్సీదిగి వెఱ్ఱివానివలె తిరువళిక్కేణీ వీధులలో తిరుగ నారంభించినాను.

## 3

ఆకారు ట్రిప్లికేను వీధులలోనే మాయమైంది. కనుక వారి నివాసమూసమీపాననే వుండాలనుకొన్నాను. నామనస్సులో హత్తిపోయిన ఆయపూర్వసౌందర్యదేవతనే స్మరించుకొనుచూ ఈశ్వరదాసు సందులోవున్న నాబసకి చేరుకొన్నాను.

భోజనమైన తర్వాత భావభరమైన హృదయముతో కూర్చొని ఆమె దివ్యసౌందర్యము హృదయరక్తముతోనైన చిత్రించి సౌజన్య సార్థకము చేసికోవాలను

కార్యదర్శిని : కాళాంత్రపు శేషమ్మగారు



మహిళాజాతీయ విద్యాలయము : కాకినాడ.

కొన్నాను. తక్షణమే ఆమెను ధ్యానించుకొని మనోవీథిని ఆ మధురాకృతి నిల్పుకొని చిత్రింప నారంభించేను. అట్లే రాత్రి చాలాసేపు గడిపినాను. అంతలో నిద్రవచ్చింది. ఆకలతనిద్రలో ఆమె విషయమగు ననేకస్వప్నములు కాంచినాను. ఆమరునాడు తెల్ల వారగనే లేచాను. ప్రభాతసువర్ణారుణకాంతులతో ట్రిప్లికేను వీథులు ప్రకాశించు చున్నవి. నేను కాఫీతీసికొని మరల పిచ్చివానివలె ట్రిప్లికేను వీథులన్నియు తిరుగ నారంభించాను.

ఎంతగాలించినా ఆరూపవతి యుంకువ మాత్రము చిక్కలేదు. నాడంతయూ ఆమెను గూర్చియే చింతించుచుంటిని. నాకు ప్రపంచమంతా ఆమెమయముగానేవుంది. మరల సాయంకాలము కాగానే ట్రిప్లికేను బీచికిపోయాను. ఎప్పటిచోటే కూర్చొని వారి రాకకెదురు చూస్తూవున్నాను. కొంతసేపటికి మరల వారు ముగ్గురూకూడావచ్చి అక్కడే కూర్చున్నారు. అప్పటి మాఅవస్థ 'కాసెట్టి మెరియన్సు'లవలె వుండనుకొన్నాను. అతిదీర్ఘమైన ఆవేణీభరమూ దానిమీద మల్లికాగుచ్ఛమూ, అతి రమణీయ మైన ఆనెమ్మొగమూ, గులాబీ పెదవులలోని చిరునవ్వూ నన్ను మల్లీ స్వర్గభువనవాసిని చేశేయి.

కాని నేను మాత్రము పరధ్యానములోలేను. ఆవేళ తప్పకుండా వాళ్ల వెన్నంటి పోయి వారి నివాసస్థలము కనుక్కోవాలని పట్టుదలగా వున్నాను.

ఏకారణముచేతో వారు ముగ్గురూకూడా లేచి పెందలకడ పోవుచున్నారు. వాళ్ల కంటెముందుగానే లేచి వెళ్లి ఒక టాక్సీకారులో ఎక్కి సిద్ధముగావున్నాను. ముందు వాళ్లకారు, తర్వాత నాటాక్సీ. వారి కారు పోయిపోయి మైలాపూరులో శారదావిలాసు ముందాగింది. ఆమేడముందు ఆవరణయున్నది. దానిగోడమీద గోవిందరావు అడ్వకేటు అనివున్నది. ఆమేడ చుట్టూ చిన్నతోటకూడావుంది.

ఆకారులోనుంచి ఆముగ్గురూదిగి లోనికి పోయేరు. అప్పుడాయన యెవ్వరని ఆకారుడ్రైవరుని అడిగాను. ఆయనే గోవిందరావు గారని చెప్పాడు. స్త్రీలనుగూర్చి అడుగుట భావ్యముకాదని వూరుకొన్నాను.

కొంతసేపచ్చటనే తారాడి మరల వారెవ్వరూ కనపడని కారణముచేత యింటికి రావలసి వచ్చింది.

నాబసలోనికి రాగానే భోజనముచేసి మరల నామె చిత్రపటము లిఖించుట మొదలు పెట్టాను. కాని ఆమె సౌందర్యము సంపూర్ణముగా చిత్రించాలంటే రోజూ ఒక అరగంటసేపైనా ఆమె సమీపాని కూర్చొని రచనచేయాలనుకొన్నాను.

అది యెల్లా సాధ్యమవుతుంది. బాగా ఆలోచించాను. ఆమరునాడేపోయి మైలాపూరులో వారింటి సమీపానే ఒకగది అద్దెకు తీసికొని, అక్కడేవుండి చిత్రరచన మొదలు పెట్టాను.

౪

మైలాపూరులో ప్రవేశించినది మొదలు రోజూ రెండు మూడు సార్లైనా తప్పకుండా నాకామె సందర్శన మవుతూవుండేది. రోజూ సాయంకాలమవు సరికి బీచికి పోతూవుండేవాణ్ని. అక్కడికామెకూడా తండ్రితోనూ తల్లితోనూ కలిసి వస్తూండేది. ఆమెపేరు కమలావతి అని ఆమెభర్త పేరు శ్యామలరావని అతను సీమలో బారెట్టు లా పరీక్ష చదువుతూవున్నాడనీ వారి నౌకరులవల్ల తెలిసికొన్నాను.

ప్రతిరోజూ ఆమెను తిలకిస్తూవుండడమువల్ల నాసౌందర్యపిపాసమరింత హెచ్చి పోయింది. ఆమె సౌందర్యకిరణాలు గవాక్షముద్వారా యెప్పుడు ప్రవహిస్తాయా, ఆమె సుధావిలోకనము లెప్పుడు ప్రసరిస్తాయా అనే సదా వేచియుండేవాడిని.

నాకు సర్వకాలసర్వావస్థలలోనూ కమలావతి ధ్యానమూ, ఆమె చిత్రపటలేఖనమూ తప్ప మరేమీలేదు.

ఈమాదిరిగా చాలాకాలము గడిచిపోయింది. నాచిత్రపటములు క్రమక్రమముగా సుప్రసిద్ధములు కాజొచ్చినవి. గోవిందరావుకూడా నాపేరు విన్నాడు. ఒకనాడాయన నన్ను రమ్మని కబురంపినాడు.

ఆకబురు రాగానే అపరాధివలె కలత పడిపోయాను. నాచర్యఅంతా కనిపెట్టి కమలావతి ఆయనతోచెప్పివైచిందాఅనుకొన్నాను. ఏమయిన పెద్దమనిషి రమ్మని కబురుచేసినప్పుడు పోకుండా యెల్లాగు ఏమయినాసరే అని వెళ్లేను.

పాపము ఆయన వెళ్లగానే నన్ను చాలా గౌరవించాడు. నాచిత్రలేఖనా సామర్థ్యము కొనియాడి తనదీ తన భార్యదీ నిలువుచిత్రాలు వెయ్యాలని మంచిపారితోషి కమిస్తాననీ చెప్పాడు. సుప్రసిద్ధులైన చిత్రకారులు సుందరరావుగారు వీరేఅని భార్యతోను కమలావతితోనూ చెప్పి పరిచయము కల్పించాడు. ఇంక నేమికావలెను? దేనికొఱకు పరి

తపించుచున్నానో అట్టివారందరి పరిచయము ప్రాప్తించినది. ఇదంతా నామేలు కొఱకే అని తలపోశేను.

అదిమొదలు నాకు వారి పరిచయము హెచ్చిపోయినది. వారింట జరుగు ప్రతి విందునకు నాకాహ్వానము వచ్చుచుండెడిది. గోవిందరావుగారు ఆయనభార్య కూడా నన్ను పుత్రప్రేమతో చూడసాగిరి. కమలావతికూడా నాతో చాలాచనువుగా మాట్లాడుతోంది. నేను వేసిన తన తల్లిదండ్రుల బొమ్మలకు ఆమె చాలా సంతోషించినది.

నారోజులు బహుఆనందంగా గడిచిపోతున్నాయి. ప్రతిరోజూ కమలావతి స్వర్గీయ సౌందర్యము సందర్శించడము, ఆ అనితరలభ్యసౌందర్యము పూజ్యభావములతో అర్చించడమే నాకు ప్రధానకర్తవ్యములై పోయినవి. మధురస్వప్నములవలె దినములు గడిచిపోవుచున్నవి. జగదేకసుందరముగా నే నామె చిత్రము రచించుచున్నాను. అది నాప్రేమచిత్రమగుటచే నిరుపమానముగా తయారవుతోంది.

%

వసంతవాసరములు హృదయానందకరములై పొడసూపసాగినవి. శారదావిలాసోద్యానమంతా నవకిసలయకుసుమపరిశోభితమైవుంది. కోకిలాకూజితములతో పుష్పవనమెల్ల మారుమ్రోగుచున్నది.

గోవిందరావు హైకోర్టుకి పోయాడు. ఆయనభార్య తనగదిలో నిద్రపోతోంది. ఉద్యానవనసమీపమునవున్న ఒకగదిలోని సోఫామీద కమలావతి విలాసముగా కూర్చొని ఒక నవల చదువుచున్నది. అప్పుడు నేనామె సమీపానికిపోయి నిలిచాను.

నాటి యామె మనోహరాకృతి చూచి తీరాలి. చక్కని నీలిచీర ధరించింది. క్రిందపెడ పొట్టిచేతుల పట్టుకంచుకము తొడిగియున్నది. ఆమె ముంజులసుదీర్ఘవినీలకుంతలములు పరిసరమెల్ల నైగనిగ్యములు వెదజల్లుచూ సోఫాపైనుండి క్రిందికి వ్రేలాడుచున్నవి. సుస్నిగ్ధసుందరలలాటముమీద భావనాతరంగములు పోటు పాటు సూపుచున్నవి.

నన్నుచూడగానే ఆమె లేచి కూర్చొని “రండి దయచెయ్యండి” అని ఒకకుర్చీ చూపినది. నేను ఆమె చూపిన కుర్చీమీద కూర్చున్నాను. అప్పుడు మాకీప్రసంగము జరిగింది.

కమ:—మీారేమైనా క్రొత్త చిత్రాలు వ్రాసారామల్లీ?

నేను:—ఈ మధ్య అంతగా వ్రాయుటలేదు. ఒక్క అపూర్వచిత్రము వ్రాయుటలో మునిగి వున్నాను..

కమ:—(మృదుహాసముతో) అది ఎవరిదండీ ?

నేను:—(సాభిప్రాయముగా) ముందు మీరే చూడగలరు.

కమ:—ఎల్లాగయినా కవులూ, చిత్రకారులూ అదృష్టవంతులండీ. వారి కీర్తి శాశ్వతమై నిలచివుంటుంది. వారు మృతజీవులు.

నేను:—ఉత్కృష్టమైన సంపూర్ణత కల దేదైయైనా నిలచి వుంటుంది లోకములో. పూజ్యతరమైన సౌందర్యము మాత్రము శాశ్వతముగా వుండదా?

ఆమాట వినుసరికి కమలావతి కపోలములమీది గోరింటకుసుమకాంతు లినుమడించినవి. రమణీయనేత్రాలు బాగావిప్పి నా కేసిచూచి "ఒట్టిమాట. సౌందర్యము వేడి వంటిది. అగ్నితోపాటు వేడి చల్లారినట్లుగానే ప్రాయముతోపాటు సౌందర్యమూ పోతుంది. అమాటలువిని నేను—

అది నిజమే. కాని కవులూ చిత్రకారులూ శిల్పులూ సౌందర్యమును కూడా శాశ్వతముగా వుండునట్లు చేయకలరు.

అందు మీద కమలావతి నిజమేనా? అన్నది. నాచిత్రపటాగారమునకు రండు మీకు తార్కాణము చూపిస్తాను అన్నాను నేను.

అంతలో కమలావతితల్లి తొందరగా ప్రవేశించి "శ్యామలరావు వచ్చేడే" అన్నది. కమలావతి మొగము వికసితమైనది.

తత్క్షణమే శ్యామలరావాగదిలో ప్రవేశించాడు. రాగానే నన్నుచూచి వీరెవరన్నాడు. "ఈయన చాలాగొప్ప చిత్రకారులు. నీమామగారికి అభిమానపుత్రుడులా వున్నారు." అని ప్రేమ పురస్కృతముగా అంది. "అలాగా" అని అతడు నావైపు తీక్షణముగా, సాలోచనముగా చూచాడు. నేనుకూడా ప్రసంగము కల్పించుకొని "సీమనుంచి యిదేనా రావడ"మన్నాను. "ఔను" అని ఆతడన్నాడు. ముందు భోజనముచేయుదువుగా నిరా అని కమలావతితల్లి అన్నది. వారిదగ్గిర శెలవు పుచ్చుకొని నా గదిలోనికి వచ్చేసాను.

౬

శ్యామలరావువచ్చి వారమురోజులు కావస్తోంది. నేను వారింటికి పోవుచునే ఉన్నాను. కాని కమలావతితో అంతగా ప్రసంగించుట లేదు.

ఒకనాడు. సాయంసమయము. ఆకాశము రక్తకాంతులతో నిండివున్నది. సముద్ర తరంగములపైనుండి మందపవనము వీతెంచుచున్నది. గోవిందరావూ శ్యామలరావూ కలిసి యెక్కడకో వెళ్లేరు.

అప్పుడామె కేమిబుద్ధి పుట్టినదో కాని కమలావతి తిన్నగా నాగదిలోనికివచ్చి "మీరు చూపెదనన్న తార్కాణము చూపెదరా?" అని అడిగింది.

నాటి యుదయముననే ఆమెరూపము సంపూర్ణముగా చిత్రించియున్నాను. అందుచే నేను చిరునవ్వుతో ఆమె చిత్రపటముమీదనున్న ఆచ్ఛాదనము తొలగించినాను.

ఆ చిత్రపటమును తిలకింపగానే కమలావతి ఆశ్చర్యలజ్జాన్వితయై పోయినది. నేను మందహాసముచేయుచూ ఆమె ముఖవికాసము కనుగొనుచున్నాను. ఇంతలో దడాలున శ్యామలరావు నాగదిలోనికి వచ్చాడు.

మందహాసము చేయుచున్ననన్నూ ఆశ్చర్యముద్రలోనున్న కమలావతిని కుసుమ మాలాభ్యర్చితమైయున్న కమలావతీచిత్రపటమునూ క్షణక్షణమూ మారిపోవుచున్న ముఖలక్షణములతో చూచుచున్నాడు.

అప్పుడు నేను నిర్భయముతో "శ్యామలరావుగారూ! ఈ చిత్రపటమును నేను లోకములో సౌందర్యమునుకూడా శాశ్వతముచేయుటకు రచించాను. మీరేమి బహుమాన మిస్తారోకాని" అన్నాను. దానికి శ్యామలరావు "నేనూ కమలావతీ యీరాత్రి ఆలోచించి రేపు చెపుతాము" అని ఆవలకు వెళ్లాడు. కమలావతికూడా నావైపు కృతజ్ఞతాపూర్వకముగా చూచి వెళ్లిపోయినది. కాని ఆ యపూర్వసన్నివేశమున కేటికో నామనస్సు శంకింపనారంభించినది.

౭

తెల్లవారుసరికి గోవిందరావుగారి భవనమంతా రోదనముతో ప్రతిధ్వనించిపోతోంది. నేను ఖంగారుపడి వారింటికి పరుగెత్తేను. పోయి చూచుసరికి భయానకదృశ్యము నా కంటపడినది. కమలావతీశ్యామలరావు లిరువురూ ఏకశయ్యపై మరణించియున్నారు. కారణ మెవ్వరికీ తెలియదు. శ్యామలరావు జేబులోమాత్ర మొక ఉత్తరము దొరికింది. అందులో ఈవిధముగావుంది.

"మామగారికి—అపూర్వసౌందర్యఖనియైన మీకుమార్తెను నాకు వివాహము కావించి వున్నందుకు మీకు వేయి జన్మాలకీ కృతజ్ఞుడను. ఒకనికి పరిణయముచేసిన

తర్వాత భారతీయసాంప్రదాయానుసారముగా కన్య వరుని యిష్టానుసారము పోవలెనని మీా కెఱుగనిదికాదు. కొన్ని కారణాలచేత నాకూ కమలావతికి యిక యీాతనువులతో యీా జన్మకి సుఖములేదు. అందుచేతనే యీా జన్మకి యీా తనువులు వర్జించి ముందు జన్మలకేనా సుఖింపతలచి యిహలోకమును వీడిపోవుచున్నాము. దీని కితరు లెంత మాత్రమునూ బాధ్యులుకారు.

ఇట్లు
శ్యామలరావు."—

అంతా నాకర్థమైపోయినది. అతని కొందరకు విచారమును, ఔదార్యమునకు అపరిమితదుఃఖమును కలిగినవి. నా ప్రేమచిత్రము కమలావతీశ్యామలరావుల కకాల మరణ మిచ్చింది. అక్కడ నిలువలేక పోయాను. తత్క్షణము నాగదిలోనికిపోయి నా ప్రేమచిత్రము ముందు కూలబడిపోయాను.

కొంతసేపటికి లేచి కమలావతీచిత్రమునకు నమస్కరించి కన్నుల కద్దుకొని పెట్టెలో పదిలపఱచుకొన్నాను. "నా హృదయములో మాలిన్యములేదు. కమలావతి త్రికరణశుద్ధిగా నిర్దోష. శ్యామలరావులో మాత్రము తప్పేమి?" అని ఒకవిధమగు పిచ్చిలోపడ్డాను. ఎవరి తప్పేమిటి దైవసంకల్ప మిట్లాగున్నది. ఇది చిత్రకారుడనగు నావిషాద కథ.

## మహిషాసురమర్దని

మల్లంపల్లి బుచ్చయ్యశాస్త్రిగారు

ఏకార్ణవంబైనయెడ మధుకైటభద్వయముచే బ్రహ్మ యెంతయును నొచ్చి
నిద్రాస్వరూపవౌ నిన్ను బ్రార్థించిన తద్దైత్యులను దైత్యదమనుచేత
శిక్షింపగాజేసి సృష్టిక్రియాహేతు మేదినిగా వాండ్ర మేదముచేట
వైచి విధాతకు వరము లొసగు నిన్ను వర్ణింప నెవ్వారి వశము? దేవి!

యంబ! గీర్వాణ సంసేవితాంఘ్రిపద్మ!
దుర్గ! హేలాపురాంతరస్థుత్యసద్మ!
వరజల్లూపహారీశ్వర వశ్యదారి!
మహిషదానవ దుర్వారమదవిదార!

నెల్లూరు : కస్తూరి దేవివిద్యాలయము.



తృతీయ వార్షికోత్సవము

అధ్యక్షులు : దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులుగారు.

గానవిద్యాసుందరి.



బెంగుళూరి నాగరత్నము.

# బెంగుళూరి నాగరత్నము

## శ్రీ రామస్వామి భాగవతులు

గానవిదుషియగు బెంగుళూరి నాగరత్నముగారి నామము దక్షిణభారతదేశమున గృహనామమై యున్నది. గాయకవంశజుడగు హెగ్గడదేవన కోట సుబ్బన్న ఈమె మాతామహుడు. ఆతనివంశము చిరకాలముగా మైసూరురాష్ట్రమున నెలకొనియుండినది. సుబ్బన్నకు ఇద్దఱు భార్యలు; ఇద్దఱు కుమార్తెలు. రెండవభార్యయొక్క కుమార్తెపేరు పుట్టలక్ష్మిఅమ్మ. సుప్రసిద్ధ న్యాయవాదిగానుండిన సుబ్బారావుకు పుట్టలక్ష్మి అభిమానస్త్రీ. వీరిపుత్రిక నాగరత్నము.

నాగరత్నము ఏణ్ణర్థము బిడ్డ అయిఉండగా ఆమె తల్లిదండ్రులకు పొచ్చెము పుట్టెను. అగుట సుబ్బారావు అభిమానస్త్రీ పుట్టలక్ష్మిని ఏకైకపుత్రిని విడిచిపెట్టెను. అనంతరము నాలుగుసంవత్సరములు మాత్రము జీవించి ఆతడు కాలగతి చెందెను.

పుట్టలక్ష్మి పుట్టెడు దుఃఖములో నున్నను అధైర్యము చెందక మైసూరుసంస్థానమునకు చెందిన కవీశ్వర తమ్మయ్యశాస్త్రిగారి సాహాయ్యమును సమకూర్చుకొనెను. తమ్మయ్యశాస్త్రి పండితుడు; గాయకుడు. ఉదారహృదయుడగు నాతడు పుట్టలక్ష్మి స్థితికి చింతించి ఆమె జీవనమునకు కొంత ధనమిచ్చుచువచ్చుటయే గాక నాగరత్నమునకు సంగీతమునందును సంస్కృతసాహిత్యమునందును ప్రవేశము కుదిర్చెను.

బాల్యమున అలనాడు కవీశ్వరునియొద్ద ఆమె నేర్చిన సంగీతసాహిత్యములే ఆమె భావికాలగాన పాండిత్యమునకును, విద్వద్వైదుష్యమునకును మూలదుంపలై వెలయుచున్నవి. తొమ్మిది వత్సరముల ప్రాయము వచ్చువఱకును నాగరత్నము ఆతనియొద్ద విద్యగఱచెను. పుట్టలక్ష్మియు నామె కూతురు నాగరత్నమును ఇట్లు కవీశ్వరుని ఆదరపోషణమున సుఖజీవనము చేయుట వారి జ్ఞాతులు ఓర్చలేక పోయిరి. అగుట వారు కొండెములుచెప్పి కవీశ్వరుని మనమును వీరినుండి మరలించిరి. తిరిగి పుట్టలక్ష్మి చెట్టులేని పక్షియయ్యెను. దీనికితోడు జ్ఞాతుల ఓర్వలేనితనమును, ఒత్తిడియు అధికమయ్యెను. అందుచేత ఆగ్రామమున ఆమెకు శాంతి జీవనము దుర్భరమయ్యెను. ఇక మైసూరు విడనాడుట తప్ప గత్యంతరము లేకపోయెను. విడనాడిపోవుచు ఆమె తనకుమార్తెను విద్యాసంగీతములయందు పండితురాలిని చేసిగాని తిరిగి మైసూరు తొక్కిచూడరాదని శపథము చేసికొనెను. కంజీవరమునకుపోయి అచ్చట సంగీతవిద్యలో ప్రసిద్ధిజెందిన విదుషియగు ధనకోటియొద్ద తన కుమార్తెకు గానము నేర్పింప ఆమె ప్రియముపడెను. కాని అచ్చట గానవిద్య గఱచుట సుగమమై యుండలేదు. ఉదారుడగు నొకక్షత్రియుడు పుట్టలక్ష్మికి అక్కడ అనంతముగు సాయముచేసెను. దేశికాచారియను నామముగల నొక మహనీయుని సాయమున పుట్టలక్ష్మి తన పుత్రికకు గానవిద్య నేర్పుటకు అనువైన మునిసామియప్ప అను వానిని బెంగుళూరిలో చేరగ్గెను. మునిసామియప్ప

గొప్పగాయకుడు; శ్రీ త్యాగరాజయ్యగారి శిష్యులగు వాలాజాపేట పట్టునూలు కృష్ణస్వామి భాగవతుల వారి అంతరంగిక శిష్యుడు. ఆకాలమున ప్రసిద్ధి జెందిన గాయకులలో పిడేలువాయిద్యమున ప్రసిద్ధి జెందినవాడు. గాత్రం సంగీతం చెప్పుటలో చాలా ప్రజ్ఞ కలవాడు. ఏడుమాసములు వేచియున్నమీదట నాతడు పుట్టలక్ష్మి కోరిక మన్నించి నాగరత్నమునకు గానవిద్య నేర్పుటకు అంగీకరించెను. అప్పుడును పుట్టలక్ష్మి విశేషధనవంతురాలు కాదు గావున తనతనయగురువునకు నెలకు పదిరూపాయలు మాత్రము ఈయగల్గెడిది. మైసూరునందు నాగరత్నమునకు గురువుగానుండిన గిరిభట్టు (?) తమ్మయ్య శాస్త్రిగారియొద్దనే సుప్రసిద్ధుడగు బిడారము కృష్ణప్పగూడ గానవిద్య నేర్చెను. అగుట చేతనామె కృష్ణప్పయొద్దకూడ సంగీత మభ్యసించు భాగ్యము నాగరత్నమునకు గలిగెను. అభినయమును తిరువేంకటాచారియొద్దను నాట్యమును బెంగుళూరినివాసియగు కిట్టన్నయొద్దను ఆమె నేర్చెను. బెంగుళూరున నాగరత్నమునకు బోధకుడుగానుండిన మునిసామియప్ప మహనీయుడగు త్యాగబ్రహ్మముగారి పాదాంకముల చెంతగూరుచుండి గానవిద్య నేర్చిన పట్టునూలు కృష్ణస్వామి భాగవతారు వారికి స్వయము శిష్యుడు.

నాగరత్నము చిరకాలము ఈ అదృష్టమునకుగూడ నోచియుండలేదు. ఆమెకు ఇప్పటికి పదమూడేండ్లు నిండెను. తల్లికి క్షయరోగము కానుపించెను. పదునాలుగు సంవత్సరముల బాలికయగు నాగరత్నమును మునిసామియప్ప సంరక్షణక్రింద వదలి మఱియొక సంవత్సరమునకు పుట్టలక్ష్మి ఇహలోకమును వీడెను. ఆమె చనిపోవునరికి వారికెట్టి ఆస్తియు లేదు. చనిపోవుచు నామె కుమార్తెను చేరజీరి "బిడ్డా! దొంగలు అపహరింపరాని విద్యాధనమును నీకు ఒసగూర్చి నేను పోవుచున్నాను." అని చెప్పెను. తల్లిలేని ఆబిడ్డను ప్రత్యేకశ్రద్ధతో నరసిరక్షించి మునిసామియప్ప విద్యలు నేర్పి గురుపూజ మొదలైనవి గావించి దేశమున గానవిద్యాప్రదర్శనములు గావించుటకు చాలా పాటుపడెను. ఏనాడామె గతించిన తల్లి ఆశీర్వాదము వలనను ఆట్టిమహనీయుని అనుగ్రహము వలనను గానప్రదర్శనమునకు గడంగెనో ఆనాటినుండి ఆమెకీర్తి దశదిశలకు ప్రవహింప నారంభించెను. గానసభలకు ఆమెరాక తప్పనిసరియయ్యెను. సి. యస్. రాజరత్న మొదలియారు గారి ఆహ్వానము స్వీకరించి ఆమె మద్రాసునకువచ్చి కొన్ని ప్రదర్శనముల గావించెను. ఇరువదియైదుసంవత్సరములవఱకునామె బెంగుళూరున నివసించుచు అవసరము వచ్చినప్పుడెల్ల మద్రాసునకు వచ్చుచు బోవుచుండెడిది. అనంతరము ఆమె మద్రాసునగరమునందే నిలిచి పోయెను.

అసదృశగానవిద్యాప్రదర్శనముల గావించి ఆమె సూర్యనారాయణశాస్త్రులవలన విద్యాసుందరియను బిరుదము నొందెను. ఆమె తనగానమాధుర్యముచే సుమారు రెండులక్షలు ఆర్జించెను. కలపుంస్కోకిలకంఠధ్వనిని క్రిందుపఱచు నామె మధురస్వరము సభికులను మోహావిభ్రాంతిలో ముంపజాలియుండును. గ్రామఫోనున ఆమె కంఠధ్వని రెండుసార్లు గైకొనబడెను. తల్లికి ఆమె ఒక్కతియే తనయ. తనకు సంతానములేదు. దాయాదులవలననైన విరోధకష్టము లామెకు ఇహలోకబాంధవ్యము నెడ వైముఖ్యము కల్గించెను.

నాగరత్నము దానశీల. పండగ పబ్బములందు ఆమె వందలకొలది బ్రాహ్మణులకు, సాధువులకు, తదితరులకు మృష్టాన్నభోజన మిడును. తనమాతృదేవిపేరిట ఆమె బెంగుళూరున నొక బ్రహ్మరథోత్సవము నెల

కొల్పినది. మైసూరునందలి తిరునారాయణపురం యుత్సవమునకు ఆమె ఒక మంటపమును కట్టించెను. చెఱువు త్రవ్వించెను. తిరువత్తియూరునందలి నందికేశ్వర దేవాలయమునకు మద్రాసు గోవిందప్పనాయక వీధియందలి దేవాలయమునకు ఆమె యథాశక్తిని ధనము ఇచ్చినది. ఒకసారి గోఖలేభవనమున గానసభచేసి అందువలన వచ్చిన ఎనిమిదివందలరూపాయిలును జలియనువాలాబాగు నిధికి సమర్పించినది. ఈదానధర్మముల నన్నిటిని మించినది తిరువాడియందు ఆమె నిర్మించిన శ్రీత్యాగబ్రహ్మముగారి దేవాలయము. నిర్మించుటయేగాక ఆమె దానిని నిర్వహించుచున్నది. ఆమె ఇందుకు విశేషధనము వ్యయపెట్టినది, పెట్టుచున్నది. ప్రతివత్సరము అచ్చట ఉత్సవము పండితబృందముతో నడుపుచున్నది. బీద విద్యార్థులకు ఆమె తగు సాహాయ్యము యిప్పటికిని చేయుచున్నది.

సంస్కృతమునందును ఇతరభాషలయందును ఆమె చిన్నతనమున ఆర్జించిన పాండిత్యము ఇప్పుడు ఆమెకు అక్కఱకు వచ్చుచున్నది. సాంఘికదురాచారములను ఖండించు పెక్కుగ్రంథముల నామె రచియించినది. ఆమె ధారాళముగ మాట్లాడి వినువారిని వశ్యము గావించుకొనగల విదుషి. పద్యముల నల్లుటలో కూడ నామె ప్రవీణ.

దేవునియెడ భయము, భక్తిగలిగిన ఈమె గృహము నిజముగా నొక దేవాలయమువలె నుండును. దానముచేయుటకొఱకే ఆమె ధనమార్జించినది. పట్టుదల, దీక్షకలిగిన పుట్టలక్ష్మికి తగిన పుత్రికయై బాల్యమున పొడసూపిన కడగండ్ల నన్నిటి నతిధైర్యముతో నరికట్టి చేరలకొలది తనగానవైదుష్యముచే ధనమార్జించి త్యాగజీవనమునకు మార్గము ఏర్పఱచుకొన్న ఈ ప్రజ్ఞావతి జీవచరిత్రము స్తుతింపదగియున్నది.

# సరస్వతి

## కవిసార్వభౌముడు

రాజీవభవుని గారాపుఁబట్టపుదేవి యంచబాబా నెక్కు నలరుఁబోణి
పసిఁడికిన్నెరవీణెఁ బలికించు నెలనాగ పదునాల్గువిద్యల పట్టుఁగొమ్మ
ఈరేడుభువనంబు లేలుసంపదచేడె మొలకచందురుఁదాల్చు ముద్దరాలు
వెలిచాయ కొదమరాచిలుక నెచ్చెలికత్తె ప్రణవపీఠికనుండు పద్మగంధి

మందరాచలకందరమథ్యమాన
దుగ్ధపాథోధి లహరికాధూర్తయైన
లలితసాహిత్యసాహిత్యలక్ష్మి నొసఁగు
వరదయై మాకు వినతగీర్వాణి వాణి.

# చెల్లెలా!

పరుచూరు సుందరవరదులుగారు

### ౧

సిరులుపొంగిన జీవకడ్డయి
విరులు వెలసిన భాగ్యసీమయి
వీరపత్నుల కునికిపట్టయి
వరలినది యీ యాంధ్రదేశము

భక్తిఁ బాడవె చెల్లెలా!
పాడినీదగు మాతృదేశము
రక్తిఁ గొల్వవె చెల్లెలా!

### ౨

రామచంద్రుని రాగభూమిగ
వాయుపుత్రుని వసతిసీమగ
పక్షివల్లభు భక్తితల్లిగ
వెలసినది యీ యాంధ్రదేశము

భక్తిఁ బాడవె చెల్లెలా!
పాడి నీదగు మాతృభూమిని
శ్రద్ధగొల్వవె చెల్లెలా!

### ౩

తుంగభద్రాభంగములతో
గౌతమీనది పూత తుంపర(?)
కలసి వేడ్కలో గృష్ణకాల్వను
పాడుచున్నది యాంధ్రగీతము

ఆలకింపవె చెల్లెలా!
ఆలకించి ఆంధ్రమాతను
భక్తిఁగొల్వవె చెల్లెలా!

### ౪

ఒరలు తీసిన పదునుకత్తుల
చేతఁదాలిచి చెమటవారఁగ
వైరివీరుల నురిమి వెలసిన
వీరవనితల విస్తృతస్తుతి

పదముఁ బాడవె చెల్లెలా!
పాడినీదగు మాతృభూమిని
భక్తిగొల్వవె చెల్లెలా!

### ౫

యవన వీరుల నుక్కడంచియు
లోకమంతకు చీకుఁదెచ్చిన
కాకతీయుల కమ్మవీర్యము
మరువదగని మాన్యచరితల

భక్తి పాడవె చెల్లెలా!
పాడి నీదగు మాతృభూమిని
శ్రద్ధఁగొల్వవె చెల్లెలా!

౬

యవనవ్యూహము నడ్డుకొని తా
హిందూరాజ్యము నాదరించియు
శౌర్యదీప్తుల దిసలఁజిఱుపుచు
తెనుగుజెండా నెగురవేసిన

కృష్ణరాయనిఁ బాడవే
పాడి నీదగు మాతృభూమిని
భక్తిమెయి మదిగొల్వవే.

౭

పెద్దనార్యుని పెంపుకవితలు
తిక్కనార్యుని దిట్టపాటలు
వేమనార్యుని విమలతత్త్వము
అన్నిటను మన యాంధ్రతేజము

చొక్కిచూడవె చెల్లెలా!
చూచినదగు జన్మభూమిని
భక్తిగొల్వవె చెల్లెలా!

౮

కమ్మవీరుల కదన శౌర్యము
రెడ్డిరాజుల రూఢితేజము
వెలమవీరుల వీర్యసంపద
ఏలినది గదా యాంధ్రతేజము

భక్తిఁబాడవె చెల్లెలా!
పాడి నీదగు మాతృభూమిని
శ్రద్ధగొల్వవె చెల్లెలా!

౯

త్యాగరాయని తరుణగీతము
తెనుగు కవితల తీరుతీయము
ఆంధ్రవీరుల స్వారిగమనము
అన్నిటిని యేకంబుచేయుచు

పాటపాడవె చెల్లెలా!
పాడినీదగు జన్మభూమిని
భక్తిగొల్వవె చెల్లెలా!

# స్త్రీ స్వాతంత్ర్యము

శ్రీమతి వి. సరస్వతి గారు

మన దేశము నందిప్పు డెల్లయెడల స్వాతంత్ర్యసంపాదనమునకై ప్రయత్నములు పరుగులు వాఱుచున్నవి. కాని యవి ఫలసాయుజ్యము నొందుటలేదు. కారణమేమి? భారతజాతిలో సగభాగము ఆక్రమించుచున్న స్త్రీ పురుషునికి బానిసయై యుండియున్నది. బానిసయైయున్న స్త్రీతో కలసి మెలసియుండు భారతీయునకు బానిసత్వముతొలగి స్వాతంత్ర్యము గలుగ నేరదు కదా!



వి. సరస్వతి గారు

స్త్రీ స్వాతంత్ర్యవిషయమై చర్చవచ్చినపుడెల్ల శాస్త్రవిదులు హిందూధర్మశాస్త్రమునం దెన్నో హక్కులు స్త్రీల కీయబడియున్నవని పెద్దపెట్టున పేర్కొందురు. కాని పరికించి చూచితిమేని భారతస్త్రీ కిట్టిదాస్యజీవనము తెచ్చిపెట్టినవి మనధర్మశాస్త్రములేనని నా అభిప్రాయము. మనుధర్మశాస్త్ర ప్రకారము స్త్రీకి ఆజన్మాంతము తన దేహముపైననే తనకు స్వాతంత్ర్యములేదు. చిన్నతనమున తండ్రి, నడిమికాలమున భర్త, చివరకాలమున పుత్రుడు—ఆమెకు రక్షకులు. స్త్రీపురుషు లిరువురును మానవవర్గములో చేరిన వారేకదా! అందు ఒకరికి వారిదేహముపైననే స్వాతంత్ర్యములేదు. ఇక రెండవవారికి దేశముపై స్వాతంత్ర్యము కావలెనట! ఎంతపొందికలేనిమాట!

భారతపురుషుడు మిక్కిలి స్వార్థపరుడు. స్త్రీతనయెడ ఎట్లు ప్రవర్తింపవలయునో ఆతడు ఉద్గ్రంథములయందు లేఖ్యారూఢముచేసి యున్నాడు. చూడుడు:—

ఘని యధనుడు రూపసి యై
ప్పనివాఁ డవివేకి మూఢభావుఁ డగుగుం
డనుగితరోగుఁ డనక యం
గన పతి భావింపవలయు గామధ్వంసీ!

—భారతము.

పతి ఎంతపనికిమాలినవాడైనను స్త్రీ వానిని పరమేశ్వరునివలె భావించి పాద దాసియైయుండవలెను. ఇక స్త్రీ యెడ పురుషుడు నడువవలసిన క్రమ మెట్లున్నదో చూడుడు:—

వివాదశీలాం స్వయమర్థచోరిణీం
పరానుకూలాం పరిహాసభాషిణీం
అగ్రాసినీ మన్యగృహప్రవేశినీం
త్యజంతి భార్యాం దశపుత్రమాతరమ్.

—నీతిశాస్త్రము.

పదిమంది పిల్లలతల్లియైన భార్యనైనను కొంచము దుర్గుణము ఉన్నచో పురుషుడు ఆమెను వదలివేయవచ్చునట. పనికిరాని పాడెకట్ట అయినను మగడను వానిని స్త్రీ త్యజింపనే రాదట. అతడే గతియని నమ్మియుండవలెనట. ఇదెట్టి న్యాయము? పతియేదైవమనియు, అతడెంత దుర్మార్గుడైనను సతి కొలువవలెననియు, అట్లొనర్చినచో ఆమెకు స్వర్గము కరతలామలక మనియు, అట్లుచేయనిచో ఆమెకు విడుమరలేని నరకప్రాప్తి గలుగుననియు వ్రాయబడియున్న పురుషసృష్టములగు గ్రంథములతో భారతదేశవాఙ్మయము దుష్టమైయున్నది. పురాణకాలక్షేపములనుపేరిట పురుషుడగు పౌరాణికుడు ఆ గ్రంథములను అమాయికలగు భారతస్త్రీలకు ప్రతిదినము వినిపించినాడు. స్వర్గమను లంచముతో తబ్బిబ్బునొంది నీటిలోని మాటనమ్మిన మూర్ఖునివలె స్త్రీ ఎల్లవెంటలచెడి తనతోబాటు పురుషునికూడ క్రుంగదీసినది. క్రుంగిపోవుచున్నట్లు తెలియకనే పురుషుడు క్రుంగిపోయినాడు. పూర్వపుఔన్నత్యమునొంది పురుషుడు స్వాతంత్ర్యము బడయగోరెనేని ముందు స్త్రీకి స్వాతంత్ర్య మీయవలెను. ఇచ్చునా భగవాను డాతనికి స్వాతంత్ర్య మిచ్చును. ఈయడా భగవాను డాతనికి స్వాతంత్ర్యమీయడు. ఇది నిశ్చయము.




శ్రీమతి అంద్రె చింతామణిగారు

ఆగష్టుమాసపు గృహలక్ష్మిలో శ్రీయుత చిల్లా సాంబమూర్తిశాస్త్రిగారు అచ్చనగాయలాటను గూర్చి ఒక చక్కని వ్యాసము వ్రాసియున్నారు. అందు ఒకటిరెండు తప్పులు మాత్రము కనుపించుచున్నవి. 'ఒకేసారి క్రిందినుంచి మూడేసికాయలను తీసిన ఆటకు ముప్పీలు అనిపేరు.' అని శాస్త్రిగారు వ్రాసినారు. కాని ఆ ఆటకు 'పుప్పీలు' అని మాత్రమే పేరు. 'సాధారణముగా 16 గుప్పీలు 16 ముప్పీలు ఆడుదురు.' అని వారు వ్రాసియున్నారు. అట్లుగాక సాధారణముగా 10 గుప్పీలు 10 పుప్పీలు మాత్రమే ఆడుటవాడుక. ఇరువదికూడ ఆడుటకలదు. కాని పదహారు ఆడుట మాత్రము సర్వసాధారణముకాదు. ఆడుబాలికలకు సంఖ్యాధికము తెలియుటకై పుట్టబడిన పాటలు పదింటిని ఇరువదింటిని లెక్కించుచున్నవేకాని పదహారింటిని మాత్రము లెక్కించుట లేదు.

శాస్త్రిగారు కొన్నిపాటలను అందు ఉదాహరించిరి. ఆపాటలయందుకూడ ఒకటి రెండు తప్పులు పడినవి. పదిసంఖ్యలు తెలుపుపాటను వ్రాయుచు వారు ఏడును లెక్కించుపాదమును, పదిని లెక్కించుపాదమును వదిలిపెట్టిరి. కావున పూర్తిపాట ఇచ్చట వ్రాయుచున్నాను

ఒక్కా ఓ చెలియా
రెండూ రోకళ్లూ
మూడూ ముచ్చిలక
నాలుగు నందన్నా
ఐదుం చిట్టిగోలుసు
ఆఋం దారాలు
ఏడుం బేడీలూ
ఏనమా మనమందా
తొంబా తోకుచ్చు
పదికీ పట్టెళ్ళాం.

పదిగుప్పీలు పదిపుప్పీలు ఆడేటప్పుడు ఈపాట పాడుదురు. శాస్త్రిగారు ఎత్తివ్రాసిన పాటలో ఇందు

రెండూ రోకళ్లూ

అనుచోట

రెండూ రేవిళ్లూ

అనియు;

ఆఊం దారాలు

అనుచోట

ఆఊం జవ్వాజీ

అనియు కలదు. కొన్నికొన్ని ప్రాంతములలో ఈపాట ఆమాగిరిగా పాడబడుట కలదు. ఇరువది గుప్పీలు ఇరువదిపుప్పీలు ఆడునప్పుడుకూడ పాడుటకు నొకపాట ఉన్నది.

పదికీపట్టెళ్లాం

అయిన తరువాత యిరువదివరకు సంఖ్యలను తెలుపుటకుగాను ఈక్రిందిపాట పాడబడును.

పడమట గుడిశెలక
కన్నా రెండాయి
కాక్కి కొరకంచు
పిచిక్కి బీరంచు
అమ్మకు బొమ్మంచు
అయ్యకు జామారు
నాకు పట్టంచు
చెల్లెలు చేమంతి
తమ్ముడు తలపాక
మరదలకు ఆభరణం.

'ఒక్కా ఓచెలియా'తో మొదలుపెట్టి 'పదికిపట్టెళ్లాం'తో ముగిసిపోయే పదిగుప్పీలు పదిపుప్పీలు అడునప్పుడు పాడబడు పాటకు బదులుగా ఈక్రిందిపాట అప్పుడప్పుడు పాడుచుందురు.

ఒక్కా నంద
చిక్కా టీలు
ముక్కా మల్లె
నంగనాచి

ఐ దు ం రె ళ్లు
అ త్త వా రు
కొ త్త పు స్తె
కొ డు కు పే రు
మ ల్లె మొ గ్గ
మా మి డి పం డు.

'ఒక్క,ఐదు' అనునవి తప్ప మిగిలిన సంఖ్యలు మొదటిపాట యందువలె ఇందుచెప్పబడి యుండలేదు. పరిపాటినిబట్టి ఈపాటయందు సంఖ్యలను గ్రహింపవలెను. సంఖ్యాధికము తెలుపునట్టి పాటలు కేవలము ఆడుపిల్లల ఆటలయందేగాక మొగపిల్లలాడు గోళికాయల ఆటయందుకూడ కలవు. ఇచ్చట అట్టిపాట నొకదానిని ఉదాహరించుచున్నాను.

ఒ క్కా యి ఒ క్క
రె క్కా యి రె ట్టె
ము క్కా యి ము వ్వ
న క్కా యి నం ది
ఐ దుం బొ డ్డు
ఆ రిం క తా ళ
ఏ డి శా బొ ద్దు
ఏ న మా క న్ను
తొం బా ప ర క
తొ ట్టి కి ల గ్గి.

ఈ పాటలకు అర్థము ఉండనేరదు. అయితే వీటి ఉపయోగమేమిటందురా? ఉపాధ్యాయుని కన్నెఱ్ఱ, చింతబరికె ఉపయోగము అక్కరలేకనే బాలబాలికలు ఆటల సందడిలోనే అంకెలయొక్క క్రమము నేర్చికొందురు. ఆడుతూ పాడుతూ నేర్చుకొను యిట్టి విద్య వారిమనస్సులకు బాగుగాపట్టును.

అచ్చనగాయలాట ముగించునప్పుడు గెలిచినవారు ఒక్కొక్కకాయనే ఎగురవేయుచు ఈ క్రిందిపాట పాడుదురు. అపాటవాడుకలో రెండువిధములుగా నున్నది. ఆరెండువిధముల పాటలను వ్రాయుచు ఈవ్యాసమును ఇంతటితో ముగించుచున్నాను.

ఒక విధము

కొండమీద వెండిగిన్నె
కొక్కిరాజు కాలు విరిగి
విరిగి విరిగి రెండాయె
విధుల్లో మూడాయె
పడమట చుక్కలు పండేయి
భళ్లున తెల్లారె.

మఱియొక విధము

కొండమీద గుండుజారె
కొక్కిరాజు కాలు విరిగె
దానికేం మందు
వేపాకు చేదు
నెల్లుల్లి గెడ్డ
నూనె మ్మ బొడ్డు
నూటొక్క ధార.

## అర్ధాంగి

నన్నయ్య మహాకవి

ధర్మార్థకామసాధన కుపకరణంబు గృహనీతి విద్యకు గృహము విమల
చారిత్రశిక్ష కాచార్యకం బన్వయస్థితికి మూలంబు సద్గతికినూత
గౌరవంబున కేకకారణం బున్నతస్థిరగుణమణుల కాకరము హృదయ
సంతోషమునకు సంజనకంబు భార్యయచూవె భర్తకు నొండ్లుగావు బ్రియము

లెట్టికష్టములను నెట్టియాపదలను
నెట్టితీరములను ముట్టబడిన
వంతలెల్లబాయు నింతుల బ్రజలను
నొనరజూడగనిన జనులకెందు.

# మన యిరుగుపొరుగులు

## శ్రీమతి కామరాజు మైత్రేయిగారు

ఒక దేశనాగరికత అనాగరికత వీనిని చర్చించుటకు పరిశుభ్రతయే ప్రథమచిహ్నము. మన హిందూదేశమును గురించి యితరదేశస్థులకు చెడ్డయభిప్రాయము కలుగుటకు మనదేశమునందు పరిశుభ్రతను గురించి శ్రద్ధతీసికొనక పోవుటయే. విదేశీయులు, మనదేశమునకు వచ్చి మన పట్టణములలోనియు, గ్రామములలోనియు అశుభ్రతను చూచి దిగ్భ్రమను చెందుచున్నారు.

కాథరీను మేయో వ్రాసిన 'మదర్ యిండియా' యను పుస్తకమునందు హిందూదేశము నానావిధములైన అంటువ్యాధులకు ఆటపట్టనియు, హిందువులు మనుష్యజాతికి వేరుపురుగులనియు, లోకమునకు వెల్లడి చేసియున్నది. మన హిందూదేశమునకు వచ్చు పాశ్చాత్యుల ప్రథమాభిప్రాయము యీ విధముగానే యుండుట నిజము.



కామరాజు మైత్రేయిగారు

ఏ దేశములలో జనులు- వారి రాజవీధులందు, మలమూత్రముల విసర్జించుచు, స్థలవిమర్శనము లేక యుమియుచు, వీధిగుమ్మములయొద్ద పెంటదిబ్బల ప్రోవుచేయుచు యశుభ్రముగా నుండు దుస్తులను ధరించి యీగలు దోమలు ముసిరిన తినుబండములను తినుచు, పుణ్యమని తలచి దట్టముగా పాచిపట్టి పచ్చనై చూచుటకు రోతగానుండు దేవాలయముల పరిసరమునందుండు కోనేళ్లయందు స్నానము చేయుచు, పరిశుభ్రతయను పేర వారి యాడువారిని నెలకు మూడురోజులు ప్రత్యేకపఱచి, కుక్కల కంటెను నీచముగా చూతురో వారుయితర దేశస్థులచే నాగరికులని యెంచబడరు.

ప్రతి దేశస్థులును, ప్రస్తుతపు నవనాగరికులని పేర్వడసిన పాశ్చాత్యులును, యొకానొకప్పుడు యీ లోటు పాటును యనుభవించినవారే! యూరపుదేశముకూడ 16 లేక 17-వ శతాబ్దములలో, యిప్పుడు మన హిందూదేశము యెంత అపరిశుభ్రముగా నున్నదో, యంత అపరిశుభ్రముగానే యుండెడిది. వారును అశుభ్రమైన పనులెన్నో చేయుచుండిరి. వారిలో నిప్పుడిప్పుడు మనలో వలె, యంటువ్యాధులు ప్రబలముగానుండెను. ఒక పాశ్చాత్యయువతీమణి, హిందూదేశపు స్థితులను పరికించి నిష్పక్షపాత

బుద్ధితో 16 లేక 17-వ శతాబ్దపు యూరపును మాడ నభిలాషగలవారు 20-వ శతాబ్దపు హిందూ దేశమును పరికించిన విశదమగునని వ్రాసి యున్నది.

17-వ శతాబ్దాంతమువఱకు యూరపునకును హిందూదేశమునకును పరిశుభ్రతలో నంత తారతమ్యము యుండెడిదికాదు. 18-వ శతాబ్దములో యూరపు దేశమున పెక్కు మార్పులు కలిగెను. యంత్రనిర్మాణము, భౌతిక రసాయన శాస్త్రవిద్య అందు పాశ్చాత్త్యులు ముందంజవేసి, యీ యవమానకరమగు యశుభ్రత నుండి తొలగిపోయిరి. మన హిందూదేశమో యట్లేనిలచిపోయెను. ఈశాస్త్రసంబంధమైన విద్యవలనను, జనసామాన్యమునకు విద్య గఱపుటవలనను, పరిశుభ్రతయొక్క ముఖ్యత వారికి విశదమయ్యెను. అంటు వ్యాధులడుగంటుటకుగాను, యవిప్రబలకుండుటకుగాను, చట్టములేర్పఱచిరి. పట్టణములు, గ్రామములు, శుభ్రముగా నుండుటకొఱకు మురుగుకాల్వల కట్టించుట, తినుబండముల, కూరగాయల యంగళ్లు మొద లయినవి వైద్యశాఖవారి యాధిపత్యము క్రిందనుంచుట, నవీనపద్ధతులమీద పాకీ దొడ్లను కట్టించుట, పరిశుభ్రమైన నీటిని త్రాగుటకు తగువసతులు కల్పించుట, మునిసిపల్ సంఘమువారి ముఖ్యమైన పనులై యుండెను. పరిశుభ్రత యనునది వారి సాంఘికమర్యాదలలో నైక్యమైపోయినది. ఎట్లన ఎవరైన యశుభ్రముగాకాని, యసహ్యముగాకాని కనుబడుచో వారిని సంఘము బహిష్కరించును. కావునవారందరు శుభ్రముగా నుండవలసి వచ్చెను. పాశ్చాత్త్యులు యీ మార్పులవలన పెక్కులాభములను పొందిరి. వారిలో యంటు వ్యాధు లడుగంటుటవలన మరణసంఖ్య తగ్గిపోయెను. వారు నిరంతరానందజీవితములను గడపుచున్నారు.

మనము యీయానందకరమైన పాశ్చాత్త్యుల జీవితమును చూచి, మన హిందూదేశపరిస్థితిని తిలకించిన చాలజాలి గొలుపుచున్నది. మనజనుల యాచారములు నడవడికలు, పురాతనమైనవిగా కాన్పించుచున్నవి. మనయాడువారు తెల్లవారగనే తమ పిల్లలను గృహద్వారముల యొద్దకు తీసికొనివచ్చి వారిచే కాలకృత్యముల తీర్పింతురు. ఇట్లు తల్లులు మూఢత్వమువలన చేయుచున్నందువలన, పిల్లలకు మొదటినుండియు, అట్లు చేయుటవలన దాని యశుభ్రతగాని, యసహ్యతగాని వారికి బోధపడదు. మనలో చదువుకొన్న వారమని పేరుగలవారుకూడ బయలులందును, రాజవీధులందును మలమూత్రముల విసర్జించుచున్నారు. సాధారణముగా మనము రైలు ప్రయాణము చేయునపుడు తెల్లవారగనే, రైలుకురెండువైపుల గ్రామముల యొద్దకాని కాలువలయొద్దనకాని జనులు కాలకృత్యముల తీర్చికొనుట చూచుచున్నారము. ఆంధ్ర దేశ సంచారమునందు గాంధీమహాత్ముడు యీమనవాడుకలను చూచి చాల నొచ్చికొనిరి. వారు యీసంచారమునందు కృష్ణా గోదావరి మొదలగు పుణ్యనదులయొద్దనకూడ జనులు కాలకృత్యములను, స్నాన సంధ్యాదికములను ప్రక్కన ప్రక్కనచేయుటను చూచిరి. ప్రశ్నించిన పారుచున్నజలమునకు దోషములేదని చెప్పిరట.

మన వీధులయందు యక్కడక్కడ మనుష్యులు వీధులను కలుషితము చేసిన శిక్షింపబడుదురని ప్రకటనలను వ్రాసి యున్నను, జనులాప్రకటనలను నుల్లంఘించుచుందురు. అట్లుచేసినను వారిని యెవరు యాటంకపరుపరు. మన మునిసిపల్ సంఘమువారు దీనిని గుఱించి తగు చర్యతీసికొనక పోవుట వలననే, జనులా ప్రకటనలను లెక్కింపక యుల్లంఘించుచున్నారు. జనులు సాధారణముగా వ్యాధులు వచ్చినను పైకివెల్లడిచేయరు. చేసిన చికిత్సాలయమునకు పంపుదురని భయముచే వారు మరణించుటకైనను ఒప్పుకొందురుకాని చికిత్సాలయమునకు వెళ్లభయపడుదురు. ఇటువంటివారు తమ మూఢత్వమువలన యితరులకు వ్యాధిని వ్యాపింపచేయుచున్నారు.

మదరాసులో బిచ్చగాండ్రను అనేకులను చూచుచున్నాము. వీరు పేదవారు అగుటవలన యశుభ్రముగా నుండు పదార్థములను, యశుభ్రమైన నీటిని త్రాగి రోగము తెచ్చుకొందురు. రోగము వచ్చిన పిమ్మట గాని శ్రద్ధపుచ్చుకొనక, యట్లే వీధులయందు తిరుగుచుందురు. దీనివలన రోగము బాగుగ వ్యాపించి, జన నష్టము కలుగచేయుచున్నది. బీదసాదలకు యన్నప్రదానము జేసిన పుణ్యమని యెంచి గౌరవనీయులు కొందరు చిన్న చిన్న సంఘములుగా చేరి అన్నప్రదానసమాజములను కొన్ని యక్కడక్కడ పట్టణములమధ్య స్థాపించియున్నారు. వీనిలో మెంబర్లు కొందరు మన మునిసిపల్ సంఘములోని వారే. ఇట్లు అన్నప్రదానము జేయుటవలన సోమరి బిచ్చగాండ్రు యంటురోగాలతోకూడి యీ వ్యాధిని తెచ్చుకొనుచున్నారు. ఈ సమాజములలో యన్నప్రదానములు చేయుదినములందు లెక్కకు మిక్కుటముగా నానా విధములైన యంటురోగులును కూడుదురు. ఈ రోగులలో పెక్కుమంది కుష్టువ్యాధివలన బాధపడుచుందురు. వారు చెట్లనీడను కూర్చొని వారి రణములను గీరుకొనుచు యాప్రదేశమునంతయు పాడుచేయుదురు. కుష్టురోగ మంటువ్యాధియని కాని, యసహ్యమని కాని వారికి తెలియదు. మధ్యతరగతి వారైనను యీరోగమువచ్చిన దానిని గుర్తించి శ్రద్ధతీసికొనరు. ఇంత పెద్దపట్టణమని పేరు గాంచిన యీ మదరాసునందు కుష్టురోగచికిత్సాలయము ఒకటి సరియైనది లేదనుట చాలా దుఃఖకరముగా నున్నది. పాశ్చాత్యదేశములలో బీదవారికిని, దిక్కులేని వారికిని శరణాలయముల కట్టించి వారిచేత, పనిచేయించి యన్నవస్త్రములనిచ్చెదరు. బీదవారు వీధులవెంట బిచ్చమెత్తిన శిక్షింపబడుదురు. మనదేశములో బీదవారికి నివసించుటకు తగు వసతులు లేనందువలనను, బిచ్చమెత్తిన శిక్షింప బడకుండుటవలనను, సోమరి బిచ్చగాండ్రు యొడలువంచి కృషిచేయక యదే వృత్తిగా బిచ్చమెత్తి జీవించుచున్నారు, రోగములచే పీడింపబడు బీదలు వీధులయందు కూర్చుని రోగవ్యాప్తి చేయుచున్నారు.

మనదేశము బీద స్థితియందు ఉండుటవలనను, మనకి స్వతంత్ర రాజ్యము కానందువలనను, యిన్ని కష్టములు కలుగుచున్నవి. మన హిందువులకు యారోగ్యపద్ధతులగు గురించి తెలియనందువలనను యీ దేశ మశుభ్రముగానున్నది. మనవారు యున్నతస్థితిచెంది తక్కిన నవనాగరిక దేశములతో బాటు సాటిరా తలంపక పూర్వపు హిందూదేశ యౌన్నత్యమును పొగడికొనుచు తృప్తిమాత్రము చెందుచున్నారు. దీని వలన మనదేశ మభివృద్ధినొందక యెన్నడో పాశ్చాత్యులు సవరించుకొనిన లోటుపాటులింకను మనకడనిలచి యున్నవి. వీనిని ఎంత త్వరలో నిర్మూలించిన యంతమంచిది.

# బాలికాక్రీడలు

## పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు

బోటులతోడఁ దోయములు బొమ్మలపెండ్లియుఁ బుట్టచెండ్లుఁగో
లాటముచెమ్మ చెక్కలరుగాటలు గుజ్జనగూండ్లు దాటిచె
ట్లాటలు నిద్దఱాండ్లమగనాటలు వెన్నెలగుప్ప డాఁగిమూ
తాటలు నాదిగాఁగలుగు నాటల నాడుచునుండె వేడుకన్.

# సిరియాళ దేవి

## శ్రీమతి మరువూరు వేంకటసుబ్బమ్మగారు

పెన్నానది ఒడ్డుననే ఉన్నది జొన్నవాడ. ఆయూరిలో ఒక బ్రాహ్మణుడు కలడు. ఆయన బాగా చదువుకున్నవాడు. బీదవాడు. అట్టే ధనధాన్యములు చేతినిండ అనుభవించుటకు నోయలేదు. అయినను తనకున్న దానిలోనే లేదనకుండ దానముచేయుచుండును. నిత్యసత్యవ్రతుడు. సదా మంచికార్యములే చేయుచు ఆయూరివారి కందరకు తలలో నాలుకవలె మెలగుచుండెను. అందుచేవారు ఆయనన్న చాలా అభిమానముతో వుంటూరు. ఆయనపేరు రామారావు. ఆయనకు ఒక్క కుమార్తెకలదు. ఆమె చాలా అందమైనది. లేక లేక కలిగినందున ఆబిడ్డపై ఆవృద్ధదంపతుల కత్యంతప్రేమ. పార్వతీదేవియో సరస్వతీదేవియో వచ్చి వారి యింట పుట్టినదని ఆబాలికను చూచినవారందరు సంతోషించుచుండిరి. ఆమె పుట్టుకతోనే దరిద్రనారాయణుడు వారికి యెడమైపోయెను. ఆమెపేరు సిరియాళదేవి.



మరువూరు వేంకటసుబ్బమ్మగారు

వారామెనెంతో ముద్దుముచ్చటలతో పెంచుచుండిరి. ఆమెయు వెన్నెలదినాల నెలబాలునివలె పెరుగుచుండెను. ఆమెను చిన్నవయసుననే విద్యగరచుటకు నెల్లూరుకు అంపిరి. ఆమెయు తండ్రి చెప్పించినవిద్యలన్నియు వ్యర్థపుచ్చక అన్నిటిలోను నమ్రత సంపాదించుకొనెను. ఆమెకు యుక్తవయసు వచ్చులోపలనే మంచి చెడుగులను గురుతించెను. స్త్రీల యొక్క ధర్మములను తెలిసికొనెను. ఆమెకు ఉగ్గుపాలతోటే మంచిగుణములన్నియు లభ్యపడెను. ఆమెకు అందమును ఆనందమును తెచ్చునవి మంచి గుణములే. ఆమెను ఎప్పుడు తలిదండ్రులు ఒంటరిగా విడచి చిరకాలము వుండినదిలేదు. అందుకొరకై ఆవూరి ప్రక్కవూరిలోనే ఒక యువకున కిచ్చి వివాహముచేసిరి. ఆవూరిలో వున్న వారలందరికి ఆమెనుగూర్చిన మంచిమాటలతోటే ప్రొద్దుపోవుచుండెను. సిరియాళదేవి అన్న చుట్టుపట్ల గ్రామములలో మంచి గౌరవము. వారలందరుకూడ ఆమెను చూచినప్పుడు ఏలక్ష్మీదేవియోవచ్చి వారి ఎదుటవున్నదని ఆనందించుచుండిరి.

ఆమె భర్త మోహనరావుకు పెదతల్లికుమారుడగు కృష్ణారావు నెల్లూరిలో వుండెను. ఆయన తరుచు వదినగారిదగ్గరనే వుంటుండెను. మోహనరావు ఎంత మంచివాడో కృష్ణారావు అంత దుర్మార్గుడు. ఆయనకు మంచితన మనునది పొట్టవిచ్చి చూచినను లేదు. ఆయన జీవితములో ఎప్పుడూ పొరపాటుచేనైన నిజముచెప్పడు. వార్తాపత్రికల మూలముగా తెలిసికొనగలుగుచున్న లోకవిషయములు కృష్ణారావువలననే తెలిసికొనవచ్చును. ఇరుగు పొరుగు వారందరు ఆయన వచ్చుచున్నాడని విన్న ఎట్టి విపరీతములు తెచ్చునో అని భయపడుచుందురు.

నెల్లూరు జిల్లాలో ఆ త్రిలోకసంచారిని యెరుగనివారు లేరు. ఆయనకు "నా" అన్నవారు ఎవరు లేరు. కాబట్టి పినతల్లికుమారుడైన మోహనరావువద్దనే కాలముగు వెళ్లబుచ్చుచుండెను. ఈ దంపతులనుకూడ ఆయన ముప్పతిప్పలు పెట్టుచుండెను. వీరిని ఎన్ని కష్టముల పాలుచేసినను ఆ దంపతులు ఆయనను ఎక్కువగా చూచుచుండిరి. ఎప్పుడన్నా మోహనరావుకైనా కృష్ణారావు మీద కోపమువచ్చును కాని సిరియాళదేవికి ఆయననుచూచిన ఎక్కువ జాలివేయుచుండెను! ఆయనకు ఎన్నినీతులు బోధించినను అవిఅన్నియు వ్యర్థమగుచుండెను.

ఒకరోజు మోహనరావు కార్యాంతరముచే మదరాసు వెళ్లెను. వెళ్లునప్పుడు కృష్ణారావుని యింటికడ వుంచి వెళ్లెను. పాపము! సిరియాళదేవికి పూర్వము కృష్ణారావుపైవున్న ప్రీతివాత్సల్యము లన్నియు పోయినవి. కొద్దిరోజులనుంచి ఆయనని ఒకమాదిరి భయము కలుగుచుండెను. ఇంతకుముందు చనువుతోటి వదినగారివద్ద వున్నటువంటి ఆయనకూడా ఆమెతో పలుకుట మానివేసెను. ఒకరోజు భోజనానంతరము ఆమె పడకగదిలో టేబిల్‌వద్ద కుర్చీలో కూర్చుండి మనుచరిత్ర చదువుకొనుచుండెను. కొన్ని పుటలు తిరుగవేసినతర్వాత దానిలోనుంచి ఒకచిన్నకాగితము క్రిందపడెను. ఆమె దానిని తీసి చూచుకొని త్రుళ్లిపడి:

" ఏమి? నేను కలగనుచున్నానా? లేక నాకు మతిభ్రమకలిగినదా? నా భ్రమకాక ఆయన ఇట్టి సాహసమునకు ఒడబడునా? రామరామ! కాలమెంత విపరీతమైనది. ఇటువంటి ఆలోచన లున్నవారు మనుష్యులుకారు. మనుష్యులవలెనున్న నీచమృగములు" అని అనుకొని సిరియాళదేవి కొంతసేపు కృష్ణారావును నిందించి అప్పటికే జపమునకు వేళమించినదని తలచి జపమునకు వెళ్లెను. జపము పూర్తి అయినతర్వాత భగవంతుని ఇట్లు ప్రార్థించుకొనెను. "ఓ దీనబంధూ? నేను నీ భక్తురాలను. భక్తులను కాపాడువాడవు నీవు. నీ స్వాధీనమున నుండగనే భక్తురాలికి ఇట్టి ఆపద సంభవించునా! నీవే రక్షింపకపోయిన ఇక నాబోటి దీనులను రక్షించువారు ఎవరు? ఓ కరుణానిధీ! శరణు. అభయ మిమ్ము."

భగవంతుని ప్రార్థించుకొనుచుండగనే కృష్ణారావువచ్చి " సిరియాళగా! ఆవుత్తరము చూచితివా?" అని అడిగెను. ఈ ఒక్కమాటతోనే ఆమె మండిపడి చివాలున లేచిపోవుటకు గవాక్షముకడకు వెళ్లెను. అప్పుడు కృష్ణారావు గవాక్షమునకు చేతులు చాచి " దేవీ! నే నడిగినదానికి జబాబుచెప్పకయే ఇచ్చటనుంచి

పోవుటకూడ కలదా ?" అని ఇంకా యేమేమో నోటికివచ్చినట్లు ప్రేలసాగెను. ఆదుర్మార్గుని మాటలు వినిన కొలది సిరియాళదేవికి ఒళ్లంలయు మంటలు పుట్టసాగెను. "భర్తనే దైవముగా-ఇక భర్తకన్న వేరు దైవము లేదని-భావించివుండు భారతదేశస్త్రీలలో నొకతెనగునాపైనా ఇట్టి నీ యాశలు ఓయి క్రూరుడా! నీకు ఆడ తోడబుట్టువులు లేరా? ఇప్పుడే నీచత్వమును లోకమునకు వెల్లడించెదను. పాపముతో నిండిన నిన్ను భూదేవియు మోయజాలదు. నిన్ను నేను ఇన్నిరోజులనుంచి సోదరభావముతో చూచుకొనుచున్నదానికి ఇదియేనా నీవుచేయు ప్రతిఫలము? ఓయి కృతఘ్నుడా! నీవు మానుషరూపమునవున్న ఘాతుకమృగమవు." అని క్రోధమూర్తియై సిరియాళదేవి భీకరాకారముతో అచ్చటనుంచి వెడలిపోయెను. అట్టి సమయమున సిరియాళదేవిని చూచినవారు నిజముగా ఏఝాన్సీరాణి అనియో రుద్రమదేవి అనియో లేక యేశక్తిఅనియో తలచకమానరు.

మోహనరావు జొన్నవాడ వచ్చునప్పటికి చాలారాత్రి అయినది. వీధులలో మనుష్యుల అలుకుడే లేదు. ఆవూరిలోని వారందరు శాంతస్వరూపిణియగు నిద్రాదేవి కౌగిటిలో వొదిగివుండిరి. మోహనరావు అతికష్టముతో యింట్లో అడుగుపెట్టెను. ఏలకోకాని ఆయన మదరాసునుంచి బయలుదేరినది మొదలు ఆయనకేమియు తోచక మనస్సు కలతపడుచుండెను. ఆయన చింతకు సరిగానే ఆయన యింట్లో అడుగుపెట్టి చూచునప్పటికి ఆచ్చట ఎవ్వరు కనుపించలేదు. ఆ కారణముచే హృదయము కంపింపజొచ్చినది. ఆయన విసిగి వేసారి తుదకు ఒక చిన్నగదిలో చిన్నదీపపుకాంతిని తిలకించి అప్పుడు అచ్చటికిపోయి చూచుసరికి మోహనరావు గుండెగుభిల్లు మన్నది. అచ్చటనే కూలబడిపోయి రోదనము చేయసాగెను. ఏమి ? ఏమియులేదు. పతివ్రతాశిరోమణి అయిన సిరియాళదేవి కష్ణారావుచేసిన దుష్కార్యమును సహింపజాలక, వృద్ధులగు తలిదండ్రులను ప్రేమమయుడగు భర్తను వీడి ఆరాత్రి గంగాదేవిని శరణుజొచ్చెను.

పతివ్రత అయిన సిరియాళదేవి తనవద్ద కొచ్చినదని గంగాదేవి సంతోషించెను. మూడవరోజు ప్రాతఃకాలము పతిప్రాణయగు సిరియాళదేవి శవము పావనపినాకినీజలమధ్యమున తేలియాడుచు మాయాప్రపంచమునకు కంటబడెను.

# మొల్ల

రావూరి చిట్టివేంకట సుబ్రహ్మణ్యముగారు బి. ఏ. సారస్వత సమాజము

స్త్రీయని తేనెమాటల నతిప్రమదంబు జనించునట్లు రా
మాయణముఁ రచించి తన మర్త్యశరీరమువీడియు న్యశః
కాయముతోడ నెల్లకవికాండము సన్నుతులీయ నాంధ్రలో
కాయతనంబున న్వెలయునట్టి పవిత్రను మొల్లనెంచెదఁ.

# రామమోహనరాయల నారీ హితైషణ

విద్వాన్ సూరిగుచ్చి కృష్ణమూర్తిగారు

నేఁడు భారతవర్షమునందు బ్రహ్మసమాజస్థులమని చెప్పుకొను వారలందఱి లోను రాజర్షి రామమోహనరాయలే ప్రప్రథములని చెప్పుట కెవరి మన మంగీకరింపరు? ధర్మము, సమాజము, శిక్షాదీక్ష యివి మొదలగు సమస్తమును ఎప్పుడు ప్రాణహీనమై ఆచారానుష్ఠానమందు స్థవిరములుగ నుండెనో అపుడు రామమోహన రాయలు ధన్వంతరివలె వాని భారమోచన మొనర్చి దేశమందును, సమాజ మందును, ధర్మమునందును అనేకరీతుల సచల మొనర్చెను. ద్రోణుఁడు శిష్యులయందు వాత్సల్యముగలవాఁడై వారికి శిక్షణ మిచ్చుటయందు దీక్షగలవాఁడైయెనను మానుష యుద్ధమందు విరుద్ధమైన యంత్రచాలనము శత్రువు లొనర్చినపుడు విభిన్నముగఁ బ్రవ ర్తింపలేదు. అయినను అట్టి దయనీయమైన చరిత్రగల వానినిగాక అన్నివిధములలోను అంతకంటె ఉత్తమమైన కథగలవానిని మనము నేఁడు స్మరించుచున్నాము.

రామమోహనరాయలు సమగ్రదేశమునకు బంధువే యైనను భారతదేశమం దాయన కేవలము నారీహితమునకై జన్మమెత్తిరనుటలో అత్యుక్తి లేదు. ఈకాలమున మను ష్యులు, స్త్రీలయధికారము, స్త్రీశిక్ష, స్త్రీస్వాధీనత, స్త్రీపురుషసామ్యము, మొదలగు విషయములను గుఱించి చెప్పుచు సామ్యప్రతిష్ఠావిషయములో పని చేయుచున్నారు. యూరపుదేశములోనున్న యీ స్త్రీపురుషసమానభావము మన దేశమును దాల్చినది. కాని యూరపుకు పూర్వమే అవిచారమైన అంధకారమునందు కప్పఁబడియున్న మనభారత దేశమునందు శ్రీరామమోహనఋషియే సామ్యవర్తికను హస్తమున ధరించెను. రవీం ద్రుఁడుకూడ "యూరపులో స్త్రీల కధికారము గావలయునను ఉద్యమము లేచుటకు పూర్వమే యీ మహాపురుషుఁడు రామమోహనఋషి స్త్రీస్వాతంత్ర్యమను విషయమై సంగ్రామ మొనర్చె"నని చెప్పిరి. స్త్రీలయొక్క పూర్ణమనుష్యత్వమునందు ఈయన కెంత విశ్వాసమున్నదో అది నేఁడు మన కనేక విధముల తెలియుచున్నది. సతీదాహ

ప్రథను నివారించుటకు అక్లాంతమైన పరిశ్రమము ఈయనచేసెను. ఈఘోరదుర్దినము లలో కుసంస్కారమను నిబిడారణ్యమును ఛేదించుటయను మార్గమున నొక మహాపురుషుడు శక్తిమంతుడు నడువ వలయును.

సతీవిషయకమైన నృశంసమైన నిందను నివారించుటకై రామమోహనుడు కృతసంకల్పుడాయెను. ఇట్టి యీతనియందు విశ్వాసముంచుట మానవసహజము. ఈతడు స్త్రీలయొక్క పూర్ణమనుష్యత్వమందు విశ్వాసముంచి పురుషుల మననశక్తి, ప్రతిభ సహానుభూతి మున్నగునవి స్త్రీలకును గలవని చెప్పశక్తుడాయెను. ఇట్టి యీతని శక్తికెవరు విశ్వాసముంచరు? స్త్రీలు పురుషాపేక్షాహీనులని యెవరికి తెలియదు? ఇట్లీతడు శిక్షయందును, ధర్మమందును, సమాజమందును, వివాహమందును, వైధవ్యమందును, ప్రతివిషయమందును బురుషులతోటి సమానాధికారములు స్త్రీలకుగలవని పోరాడెను. స్త్రీలయొక్క బోధనాశక్తికేమియు ప్రమాణమీయ నవసరములేదు. వారిబుద్ధి యెల్లపుడును పురుషాపేక్షాహీనమైనది. స్త్రీలోకమునకు సంకల్పము, నిష్ఠ లేవని విన్నపుడు వీరాశ్చర్యమునంది "యేదేశములో పురుషులు మృత్యునామము విని భయపడుదురో అట స్త్రీలు పురుషులకు దమప్రాణముల నొసగుచుండ సంకల్పములేదని చెప్పుట పొరపాటు" అని నుడివిరి.

మనదేశమందు హిందూసమాజములో స్త్రీల కెచటను ఉత్తరాధికారములేదు. పిత, భ్రాత, స్వామి మొదలగువారి యనంతరము స్త్రీ లుత్తరాధికారిణులుగారు. కాని పూర్వకాలమున స్త్రీలకును హక్కుగలదు. "నేడిట్టి యసంగతభావమున స్త్రీలు వంచింపబడుటలేదా? నేడును అట్టియాచారముండుట యుచితముగాదా?" అని రామమోహనరాయలు పుస్తకరచనముద్వారా ఉపన్యాసములద్వారా నూరువత్సరములకు బూర్వమే యీవిషయమును దెలిపియుండెను. కాని నూరువత్సరములకు దర్వాత నేడేస్త్రీయు నట్టియధికారము పొందకుండుటగాని, మఱియెవరును ఆ విషయమును గుఱించి జోక్యము కలుగజేసి కొనకుండుట గాని యాశ్చర్యకరముగలేదా?

స్త్రీల ప్రగతి విషయమై రామమోహనరాయలు కొన్ని మంత్రములను బీజరూపమున సర్వక్షేత్రములందును జల్లెను. కాని వానినే నూతనమొనర్చుటలో ప్రయోజన

మేమియు లేదు. స్త్రీలను పూర్ణ మనుష్యులనుగ స్వీకరించి వారిగుణములందు విశ్వాసముంచి శ్రద్ధాబీజములను చల్లి బ్రహ్మసమాజమున దినదినమును నానారూపమైన పత్రమందు, పుష్పమందు, ఫలమందు, వికాసముగలుగునట్లు చేయవలెను. ఆశ్రద్ధయే బ్రహ్మసమాజమునందుండి క్రమముగ అన్యోన్యసంప్రదాయముగ శిక్షితమగుచు సమాజము నందంతటను సంక్రమించి నారీరాష్ట్రమందును, సమాజమునందును, ధర్మమునందును శిక్షయందును, దీక్షయందును, కర్మక్షేత్రమునందును, శిల్పాది సృష్టికార్యములందును బురుషులతో తుల్యాధికారమునందుటకుఁ దగియుండును. సకలాధికారములలోను వంచింపఁబడిన స్త్రీల విషయమై యిట్టిపనిచేయుట స్వాభావికము. చిరపరాధీనులైన పురుషులు స్వాతంత్ర్యవిషయమై యెట్టిభయము నందుచున్నారో అంతఃపురములలో బంధింపఁబడిన స్త్రీలును అట్టిభయమువిషయమయ్యే యలవాటు పడెదరు. కావున ఈభయమును బోఁగొట్టుటయు, ప్రేమ, ధర్మాదులయందు ధైర్యము గలిగించుటయును చూచువారి యొక్కయు, యోద్ధుల యొక్కయు విధియైయున్నది. యోద్ధులహృదయములోపలనే సృష్టియొక్క సమస్తరూపమైన కల్పనము సృష్టిచెందియున్నది.

("వంగలక్ష్మి" అను వంగమాసపత్రికలోని శ్రీమతి శాంతాదేవి, బి. ఏ. గారి వ్యాసమున కనువాదము.)

# సముద్రఘోష

శ్రీమతి ఆదిపూడి వసుంధరాదేవిగారు

త్రనుదర్శింపఁగవచ్చినట్టి జనులన్ ధన్యాత్ములన్ జేయునూ
హానుగాఁబోలును వారిరాశిసతతం బాత్మస్వరూపా! నిరం
జన! సృష్టిస్థితినాశకారణ! సినున్ సర్వజ్ఞు ఘోషంబునన్
వినుతుల్ సేయుచునుండు వేవిధములన్ విశ్వేశ! విశ్వాత్మకా!

# లక్షణ

## శ్రీమతి బులుసు లక్ష్మీనరసమ్మగారు

మద్రపురమున కధిపతి బృహత్సేనుఁడు. ధర్మశీలుఁడును, ప్రజానురంజకుడును, న్యాయపాలనా తత్పరుఁడునయి రాజ్యము పాలించుచుండెను; కాని యాతనిని సంతానములేని చింత వేధించుచుండెను. సంతానార్థియై ఆరాజు భార్యతోఁగలసి సకలలోకకారణుఁడగు నారాయణుని నిరంతరము సేవించుచుండెను.



బులుసు లక్ష్మీనరసమ్మగారు.

ఇట్లు నాపరమేశ్వరుని సేవింప నాతని యనుగ్రహముచే నా మహారాజ్ఞి గర్భముఁదాల్చి యొకనాటి శుభలగ్నమున సర్వలక్షణవిరాజమాన యగు నొక పుత్రికారత్నమును గనెను. లేక లేక కలిగిన యామెకు "లక్షణ" అను ననురూపాభిధాన మొసర్చి యతిగారాబముతో పెంచుచుండెడివారు. చిన్ని నెన్నుదిటిపై చిందులుద్రొక్కు యామె వినీలాలకముల సొగసును, అలిమిత్రహసితమోహనచంద్రచంద్రికల వెదఁజల్లు యాపసికూన నెమ్మొద్దు మోము గోమును, అక్షరోచ్చారణంబు అవ్యక్తమైయుండ పులకండ మొలికెడు నాముద్దుబాలికయొక్క తీయని పలుకుల కులుకులును, శ్రీకృష్ణనామోచ్చారణ మాత్రమున శరీరము పులకించుకొని కిలకిల నవ్వు నాపుత్రిక యాకార సౌష్టవమును దిలకించి తలిదండ్రులేకాదు బంధుగులును, పురజనులును గూడ మోహితులగుచుండిరి.

లక్షణకు ఆటలు కృష్ణవిషయకములే. పాటలును కృష్ణసంబంధములే. మాటలలోను కృష్ణుఁడే. అంతఁ జదువనారంభించి సకలశాస్త్రపురాణాదులసారమును గ్రహించి తోడిబాలికలలో మిన్నయనిపించుకొనెను. కొంతకాలమునకు ఆమె యౌవనము నలంకరించెను. కృష్ణుడే భర్త కావలయునని యామెసంకల్పము.

ఒకనాఁడు నారదుఁడు రాజుదగ్గరకు వచ్చెను. రాజు ఆతనిని ఉచితరీతిని గారవించెను. నారదుఁడు రాజుయొక్క యోగక్షేమముల నారసి "నీ పుత్రికకు యుక్తవయస్సు అంకురించినది. వివాహప్రయత్నము చేయవేలా?" అని ప్రశ్నించెను. "అనురూపుడగు భర్తను గాననైతి. మీరెఱిఁగిన శలవిండు" అనగా నారదుఁడు "రాజా! ద్వారకకు రాజు శ్రీకృష్ణుఁడు కలఁడుకదా? వాఁడు సర్వోత్తముఁడు. నల్లనివాడు; పద్మనయనంబులవాఁడు; కృపారసంబుపైఁ జల్లెడివాఁడు, భక్తవత్సలుఁడు. వానికి నీకూఁతు నిచ్చి తరింపు" మని ఎందేనిపోయెను.

నారదుని పలుకులు రహస్యముగా విన్న లక్షణ కృష్ణునిపై మోహము పట్టలేకుండెను. చెలికత్తెలవలన లక్షణ వృత్తాంతమువినియు గొల్లఁడగు కృష్ణునకుఁ గన్యనిచ్చుటకు జంకి రాజు స్వయంవరము సాటించెను. లక్షణ

యీవార్తనువిని మఱింత చింతనొంది యెట్టకేలకు ధైర్యమునొంది తన కనకపంజరమునఁగల చిలుకను దిలకించి "యీ జాబును గొనిపోయి కృష్ణున కందిమ్మ"ని యొక లేఖనువ్రాసి చిలుక కంఠమునఁగట్టి పొమ్మనెను. ఆచిలుక వాయువేగమనోవేగముల ద్వారకకు జనెను. కృష్ణుని అంతఃపురమున చూచి అతని వ్రేలిపై వ్రాలెను. అతడు చిలుకను హస్తముతో నిమిరి లేఖను తీసి ఇట్లు చదువఁదొడఁగెను—

"మనోహరా! శ్రీకృష్ణా! చిన్ననాటనుండి నిన్నే మనోవాక్కాయకర్మములచేతను ప్రేమించినాను. అన్య మెరుగను. కనుక పూర్ణమగుప్రేమ ఈ సేవకురాలిపై నున్నచో నీ ఉత్తరము చూచిన తక్షణమే వచ్చి నన్ను మన్నింపుము. లేనిచో లక్షణ ఇక భూమిపైనుండదు.

చిత్తగింపవలెను.

ఇట్లు మీపాదసేవకురాలు,

లక్షణ."

అని యున్న కమ్మను జదివి చిలుకను జూచి "చిలుకా! త్వరగా లక్షణ దగ్గరకుఁబోయి — భయపడకుము. వెంటనే కృష్ణుడు వచ్చి నిన్ను వివాహమాడును. అని చెప్పుము." అని చిలుకను విడిచెను. చిలుక లక్షణను జేరి జరిగిన సంగతి చెప్పెను. లక్షణ సంతసించెను.

మద్రపురము స్వయంవరాగతరాజకుమారులతో కలకల యనుచుండెను. పురమంతయు నలంకరించిరి. మత్స్యయంత్రమును నొకదానిని కట్టిరి. రాజుల కుచితగౌరవాదులు చేసిరి. ఆనాఁడు స్వయంవరమగుటచే రాజు లలంకరించుకొని మత్స్యయంత్రసమీపమునకు జేరిరి. కృష్ణుఁడుకూడ వచ్చెను. బృహత్సేనుఁడు రాజకుమారుల తిలకించి "ఓ మహానుభావులారా! ఈ మత్స్యయంత్రమును తెగవేసిన వానికి నా కుమార్తె నిచ్చి వివాహము చేసెదను. మణిహారమును ధరించి వచ్చుచున్న ఆమె నాకుమార్తె లక్షణ." అని చెప్పి యూరకుండెను. అప్పుడు రాజకుమారులు యంత్రము గొట్ట ప్రయత్నించియు కొట్టనేరక తమ శక్యము కాదని తొలఁగిరి. కొందఱు బారెఁడు మూరెఁడు పోచ్చుతప్పఁగాఁ గొట్టిరి. కాని ఎవ్వరును మత్స్యయంత్రమును భేదింపరైరి. అప్పుడు,

బంగరుదుప్పటంబు వలెవాటుగ నొప్ప హాసన్ముఖాబ్జుఁడై
రింగున నారికోల నమరించి తటాలున ద్రుంచె నాథను
శ్చంగుఁడు గోపయోషావతభుజంగుఁడు మోచితసంగుఁడుక్ కృపా
పాంగుఁడు దృప్తదర్పబలభంజనయంత్రము మత్స్యయంత్రమున్.

అంత లక్షణ మణిహారమును శ్రీ కృష్ణకంఠమునఁ గీలించెను. అప్పుడు దేవదుందుభులు మ్రోసినవి. దేవతలు పుష్పవృష్టి కురియించిరి. అచ్చర లాడిరి. గంధర్వులు పాడిరి. ఖేచరులు జయశబ్దము లొనర్చిరి.

# హైందవ స్త్రీ సమస్య

శ్రీమతి పద్మావతీ శ్రీరామ్ గారు

మన దేశములో స్త్రీల కేలాటిహక్కులు లేవు. వారు కేవలము పురుషుని మృగత్వమునకు బానిసలుగా భావింపబడుచున్నారు. స్త్రీ సంఘమును బాల్యవివాహములు, కన్యాశుల్కములు, అస్వాతంత్ర్యము, పిశాచములై పట్టిపీడించి పీల్చిపిప్పిచేయుచున్నవి. ఈ పిశాచములం బారదోల సంఘసంస్కర్తలు దీక్షంబూని యున్నారు. వారి ప్రయత్నములు కొనసాగునట్లు చూడవలయును.



పద్మావతీ శ్రీరామ్‌గారు

స్త్రీలను హీనస్థితినుండి నివారించుటకు జేయగలవానిని కొన్నింటినిఁగూర్చి ఇచ్చటముచ్చటించెదను. కడచిన జనభా లెక్కల ప్రకారము 100-కి ఏడుగురు స్త్రీలుచదువను వ్రాయను నేర్చియున్నారని తెలిసినది. అందులోను వారికి గరపు విద్య పాశ్చాత్యవిధానమున నున్నది. మునుపు మన దేశములో స్త్రీలకు విద్యగరపిరనుటకు సందియములేదు. భాస్కరాచార్యుని కొమరిత లీలావతి, రామాయణమును వ్రాసిన మొల్ల, వెంకమాంబ, వీరికీర్తి దిగంతముల ప్రబలియున్నది. గార్గి, మైత్రేయి, రాణీసంయుక్త, అహల్యాబాయి మున్నగు మహిళామణుల చరిత్రములు పూర్వస్త్రీసంఘ మత్యున్నత దశయందుండెనని చాటించుచున్నవి. విద్యావ్యాప్తికై స్త్రీలు పాటుపడవలయును. పురుషుల కుపయోగించు విద్యావిధానములు మనకును యనుకూలించుననుకొనరాదు. మనకు వేరుపద్ధతు లుండవలయును. స్త్రీలకు లలితకళలందు రుచియుండుట సహజము. వారికి సంగీతము, చిత్రలేఖనము, అలవడజేయవలయును. శిశుపోషణ, ప్రసవవైద్యము, ప్రథమచికిత్స వారికి తప్పక నేర్పవలయును. వైద్యవృత్తియందు స్త్రీ వైద్యు లధికసంఖ్యాకులుగా ప్రవేశ

బెట్టవలయును. మన ఆయుర్వేదపద్ధతి ననుసరించు చిన్నచిన్న చికిత్సలు, చిట్కాలు మనస్త్రీల కందఱకు తెలిసియుండవలయును. కొంతమంది యిండ్లలో ప్రసవానంతరము బాలింతకు శరీరపుష్టినిచ్చి ఆరోగ్యము చేకూర్చునట్లు లేహ్యమొకదానిని బాలింత రాలి తల్లియో అవ్వయో చేసియిచ్చుట వాడుక. పది పదునైదు మందుదినుసుల చూర్ణమును నేతిలోను తేనెలోను పక్వముచేసి యుంచి దానిని నలుబది దినములు వాడుదురు. ప్రస్తుతము దాని మాటయే మఱచుచున్నారు. ప్రతిదానికిని పేటెంటు మందులు. విదేశపుమందులలో ముఖ్యముగా ద్రాక్షారసము కలుపుదురు. దానివలన మనకు ఆక్షణమునకు ఖులాసాకన్పట్టును. కనుక మన మనాదిగా వాడుచున్న మందులను విడువక ఉపయోగించనగును. మన స్త్రీలందరును వైద్యవిజ్ఞానము నార్జించి ఉపచారి ణులు (Nurses) గా పనిచేయుటకు సిద్ధపడవలయును. అదియుంగాక మన స్త్రీలే వైద్యు లుగానున్న పథ్యపానాదులయందు మేలగును. సాధారణముగా స్త్రీలకు సంభవించు వ్యాధులు ఋతుశూలలు గర్భసంరక్షణము గర్భిణీహితచర్య మున్నగు విషయములగూర్చి ప్రతివారికి తెలియునట్లు ఆయాభాషలలో కరపత్రములువ్రాసి ప్రకటించి స్త్రీలయందు వైద్యవిజ్ఞానము వ్యాపింపజేయవలయును.

దేశము నిర్వీర్యమై నిస్సారమై యున్నందులకు సంఘదురాచారములు ముఖ్య కారణములు. ఆదురాచారముల నణచుటకు విద్యావిహీనతను లేకుండజేసి సంఘ మభి వృద్ధి జేయుటకు మనమే పూనుకొనవలయును. విద్యావతులైన మనలో గొందఱు, త్యాగశీలలై గృహిణులను వివేకవతులఁ జేయుటకు ప్రచారమొనర్చవలయును. స్త్రీ సంఘముల నచ్చటచ్చట నెలకొల్పి అభివృద్ధిపఱచి, అచ్చట స్త్రీల కుచితవిద్య గరప వలయును. స్త్రీప్రచారకసమితియేర్పడి సాంఘిక రాజకీయ విషయములనుగూర్చి చర్చించి బోధించవలయును. శిశుపోషణ ప్రసూతికష్టనివారణ మున్నగు విషయములు, వివా హావయోనిర్ణయము, బాలవితంతువుల పునర్వివాహము, మున్నగు విషయములను గూర్చి గమనించవలయును.

పురుషులు స్త్రీల యభివృద్ధికి పాటుపడినకాని దేశమునకు విముక్తిచేకూరదు. మన మును మనచేతనయినది చేయవలయును. స్వయంసాహాయము సర్వోత్తమమైనదికదా! మనదేశపు ప్రాచీన ఔన్నత్యమును దలచుకొని విఱ్ఱవీగిన లాభములేదు. ఎల్లవేళల భావినిగూర్చి ఆలోచించు చుండవలెను.

# స్వప్న వేదన

ఆరవిల్లి నరసింహాచార్యులుగారు బి, యె, సారస్వతసమాజము

ప్పొంగిపొరలు తరంగమాలిక
నింగిముట్టఁగ భీకరంబయి
చెంగుచెంగున వచ్చు సంద్రము
నఁగనంగొని భీతినందవు
ఎంత వెఱ్ఱివి తమ్ముఁడా!

ఆడబోయెద నంచుఁ బలికెదు
నీడలంగని నిజమటందువు
నీటమున్గెగుఁ చుఁ దేలుచంద్రుని
ఆటలాడెడి బాలలందువు
ఎంత వెఱ్ఱివి తమ్ముఁడా!

మల్లిపూవుల కుప్పలవిగో
చెల్లెలికిఁ గొంపోదమందువు
తెల్లదనమునుఁ జూచి భ్రమసితి
మల్లిపూ లెసముద్ర ఫేనము
ఎంత వెఱ్ఱివి తమ్ముఁడా!

చెల్లెలదిగో కూయటంచును
జెట్లమాటున దాగి పిలిచెను
మనలరమ్మని యనెదు; కోకిల
మధురకంఠ స్వరము సుమ్మది
ఎంత వెఱ్ఱివి తమ్ముఁడా!

చూడు చెల్లెలి నెంత యెత్తున
కాడ బోయెను యంచుఁ బలికెదు
కాదు చెల్లెలి ముద్దుమొగమిఁక
రాదు కలలోనైన గాంచఁగ
ఎంత వెఱ్ఱివి తమ్ముఁడా!

చెల్లెలదిగో నవ్వుచున్నది
తెల్లబడెను ప్రపంచమందువు
నవ్వుఁబోలిన పండువెన్నెల
నవ్వటంచును మోసపోతివి
ఎంత వెఱ్ఱివి తమ్ముఁడా!

పూలనెట్టులఁ జిమ్మివేసెనో
నేలఁబడగా ననెదు; చెల్లెలు
పూలరథమునఁ బోయి యెంతో
కాలమైనది—చుక్కలయ్యెవి
ఎంత వెఱ్ఱివి తమ్ముఁడా!

చిన్నిచేతులఁ జాచి చెల్లెలు
చేరబిల్చెడు పోదమందువు
మావిగున్నల కావిచిగురుల
కీవిధంబున మోసపోతివి
ఎంత వెఱ్ఱివి తమ్ముఁడా!

దేహకాంతి యెపండువెన్నెల
తేటయందువు చిన్నిచేతులు
మావిరెమ్మలటందు తెల్లని
పూవులన్నియు నవ్వులందువు
ఎంత వెఱ్ఱివి తమ్ముఁడా!

ఎంత యేడ్చిన నెంత పిలిచిన
నెంతగా బ్రతిమాలుకొన్నను
సుంత యైన వినంగఁ జాలదు
చూడఁ జాలదు చెల్లెలిప్పుడు
వంత యేలను తమ్ముఁడా!

పాపపుణ్యము లెఱుఁగఁ జాలని
బాల్యమందే మేలిలోకము
చూడఁ బోయెను; మఱచె నచ్చటి
చోద్యములఁ గన్గొనుచు మనలఁ
చింత సేయకు తమ్ముఁడా!

ఎదుట నున్న మహాసముద్రం
బీది యావలి కరుగు వరకును
చేరఁ జాలము మేలిలోకము
చెల్లెలిం గనవచ్చు నప్పుడె
భీతి నందకు తమ్ముఁడా!

# స్త్రీలు—గృహపరిశ్రమలు

శ్రీమతి అయ్యదేవర బాలాత్రిపురసుందరమ్మగారు

పూర్వకాలమున భారతవర్షము భాగ్యవంతమై ప్రతియింటను సౌభాగ్యలక్ష్మి కళకళలాడుచుండెను. మహమ్మదీయ ప్రభువుల పరిపాలనయందలి భూషణాలంకారముల క్రింద వాడబడు వజ్ర, వైడూర్య గోమేధిక, పుష్యరాగముల విలువగట్టలేక ఆంగ్లేయ ప్రతినిధులు నిశ్చేష్టులైరి. కోహినూరు వజ్రకాంతి దేదీప్యమానముగా నేటికిని పాశ్చాత్యప్రాగ్దిశాంతర్భాగమున ప్రభావంతమై సూర్యునివలెది వెల్గుచునే యున్నది. హైందవ గృహపరిశ్రమలను నాశనము జేసి హిందూగృహలక్ష్మిని ఏకవస్త్రధారిణిగా జేసిన విదేశవర్తకులకు భారతదేశముపై గల వ్యామోహము నానాటికి వృద్ధియగుచుండెనని యిప్పటి పరిస్థితులంబట్టి చెప్పక తప్పదు.



అయ్యదేవర బాలాత్రిపురసుందరమ్మగారు

ఇప్పుడు మన భారతదేశము అన్నమో రామచంద్రా యని యల్లాడు పాటకపు జనులతో నిండి దరిద్రనారాయణుల కాలవాలమై యున్నది. కావున హైందవనారీమణులు ముఖ్యముగా గమనింపదగిన కాంశములలో ముఖ్యమైనది వారుచేయవలసిన గృహపరిశ్రమలు తద్వారా ధనార్జనము.

గాంధి మహాత్మునిచే ప్రబోధింపబడి దేశమంతయు నాందోళనముగానున్న విదేశ వస్త్రబహిష్కారము—స్వదేశ వస్త్రస్వీకారము ప్రతి సోదరీమణి ఎరింగిన విషయమే. స్వదేశ వస్త్రమును ధరించుటకు అందుకు తగిన నూలు మన దేశమందు తయారుగావలెను. పూర్వకాలమున ప్రతి యింటను రాట్నపు చక్రముల నాదము ప్రతిధ్వనించుచుండెడిది. రాటమునుండి నూలుతీయుటలో భారతనారీమణులు శ్రేష్టలు. ఇటీవల జరిగిన ఖద్దరు వస్త్ర ప్రదర్శనపోటీపరీక్షలలో గెల్పునొందిన వారలెక్కువమంది మనసోదరీమణులని చెప్పుటకు సంతోషమగుచున్నది. అట్టి సోదరీమణులు యీదేశమందు సోమరులై పనిపాటలు లేక యూరకకూర్చుండు కాలములందు రాటము వడుకుట, నూలు తీయుట మొదలగు పనులు ప్రారంభిం

చినచో తిరిగి దేశము సౌభాగ్యవంతమగుననుట నిశ్చయము. ధనార్జనమున స్త్రీలు పురుషునితో కొంత భాగస్వాములయ్యెదరు గాక!

రాటముతో నూలు తీయుటేగాక యింకను కళాపోషణ జేయవలసిన బాధ్యత సోదరీమణులయందు గలదు. చిత్తరువుల వ్రాసి చిత్తమును భ్రమింప జేసియు భావగాంభీర్యములనొక్కుమ్మడి స్ఫురించు రూపముల లేఖినిచే జిత్రించి సనాతన హైందవనాగరకతను, ఆర్యసాంప్రదాయముల, నిరూపించు పటముల జిత్రించవలయును. అందుల కళాసౌందర్యము, చిత్రలేఖనాకౌశల్యము, ప్రకృతియందుగల, ప్రత్యక్ష దృశ్య ప్రదర్శనమందుగల నయనోత్సవాభిలాషను సోదరీమణులు నెరవేర్ప చిత్రలేఖనము నేర్చి సనాతన హైందవనాగరికతను నేర్పి వాటి విక్రయముల ద్వారా సహితము ధనము సేకరింప నవకాశము గలదని నా ఆశయము.

పై విద్యతోపాటు అల్లిక పేముపని గృహపరిశ్రమలలో నొకటిగా భావింపవచ్చును. పేమును తెచ్చి వాటిని వివిధ తరగతులుగా పూలబుట్టలు తమలపాకుల పళ్లెములు విసనకర్రలు మొదలగునవి అల్లి మధ్య మధ్య రంగు రంగుల బొమ్మల చిత్రించి, అల్లినఅవి ప్రస్తుతము ఆధునికనాగరికతను వెల్లడిజేసి మహిళామణుల తెలివి తేటల పెంపొందింపజేయుటేగాక వస్తుప్రదర్శనశాలల నలంకరించి గృహోపయోగకరములై యెల్లెడల నిండియుండును. ఇది ఆర్థికముగా దేశమున కుపయోగము.

సామాన్యముగా గృహమునకు కావలసిన వస్త్రములు చొక్కాలు, కోట్లు, షరాయిలు, కుట్టుటకు కూలివానికిచ్చిన చాలాధనము వ్యయమగును. మనయిండ్లలో కుటుంబమునకు కావలసిన కుట్టుపనులన్నియు సోదరీమణులే నిర్వహింపవలయును. ఇక కుట్టుయంత్రమున్నచో చాకచక్యముగా, క్రొత్తపద్ధతులతో, స్త్రీలకు, పురుషులకు, పిల్లలకు కావలసిన దుస్తులన్నియు తయారుచేసి యిచ్చుటకు సిద్ధముగా నుండవలయును. ఈ పనులన్నియు స్త్రీలకు వెన్నతో పెట్టిన విద్యవలె నుండవలయును. సామాన్య వస్త్రములనేగాక యింకను ఊలుతోను, జరీతోను అనేకవిధములైన నగిషీపనులను చేయవచ్చును. ఊలుతో సంచులను, మేజోళ్లను, పిల్లలకుళ్లాయిలను, మేజాబల్లలపై వేయు రంగురంగుల రుమాళ్లను, పైకి వేసికొనుటకు వింత వింత రంగు రుమాళ్లను, యింకను అనేక రకములుగా అల్లుట నేర్చుకొనుట శ్రేయస్కరము. వీటివలనను గూడా కుటుంబములలో చాలవరకు వ్యయముతగ్గి ధనార్జనమునకు మార్గదర్శిగానుండును.

రాటముతో నూలువడుకుటయేగాక నూలుతీసి నేతనేయుటను కూడ నేర్చుకోవలసిన యావశ్యకత గలదు. అట్లుచేయుట ఎవరి వస్త్రములను వారే నిర్మాణము చేసికోవలసిన బాధ్యత గలిగిన వారయ్యెదరు. ఇయ్యది దేశమునకు శుభదాయకము. కుట్టుటకు మేజోళ్లు నేయుటకు సులభముగా కనిపెట్టబడిన యంత్రముల ద్వారా యీపనులు తేలికగా నెరవేరగలవు.

ఓ సోదరీమణులారా! తుది మనవి. వనవిహారములలోను సూర్యచంద్రులు చొరని మహాసౌధముల లోను నాటకరంగములలోను మీ జీవితమును వ్యర్థము చేయక గృహ పరిశ్రమలను అభివృద్ధిచేసి ఒక్క పూటయైన తిండిలేక మల మలమాడు దరిద్రనారాయణులయొక్కయు పరిశ్రమలను గోలుపోయి శుష్కించి యున్న భారతలక్ష్మియొక్కయు దుఃఖమును మాన్పుడు.

# విజయదశమి

శ్రీమతి నడింపల్లి వెంకటరత్నమ్మగారు

చెల్లెలా రావమ్మ ! సీతలానిలముతో
చెమ్మగిల్లేమనసు కమ్మతేనియపలుకు
చిన్నిజాబిల్లిలో చెరిగి పోవని తళుకు
రాలిరాలని మల్లెపూలగుత్తుల సొబగు
చేర్చికొని దీక్షతో కూర్చుకొని రావమ్మ!
చెల్లి! శమీపూజ చేయ రావమ్మ !
ఈభరత భూమిలో యేయుగయుగాలనో
వెలసె నీదినమునే విజయశంఖధ్వాన
మాంధ్రవనితల శౌర్య మవనినిండినకాల
మే తెరలచాటునో యిచటదాగెనో, నేడు
నీ లేతచూపుతుద నీ వేపు కొని వేగ
చెల్లి! శమీపూజ చేయు రావమ్మ !

# బాల్యవివాహ నిషేధము

శ్రీమతి అట్లూరి వేంకట సీతమ్మగారు

ఏదేశముగాని, యేసంఘముగాని, యేజాతిగాని యభివృద్ధికి రావలెనన్నచో, నా దేశమందు, సంఘమందు, జాతియందు, స్త్రీలు, శిశువులు, యువకులు, విద్యావంతులు, ఆరోగ్యవంతులు, బలవంతులు నయియుండవలె ననుట నిర్వివాదాంశము.



అట్లూరి వేంకట సీతమ్మగారు

స్త్రీలు విద్యావిహీనులు, నారోగ్యరహితులు, బలహీనులునగుచో నిక నా దేశ సంఘ జాతులెల్ల నథోగతినొందినవనియె చెప్పవచ్చును. అందుకు దార్ష్టాంతము మన మాతృదేశమె.

ఒకప్పుడు విశ్వమందెల్ల నత్యున్నతస్థానమై భూలోకస్వర్గమై యతులైశ్వర్యసమేతమై దేవతలకుగూడ వాంఛనీయమై దిగంతవిశ్రాంతకీర్తియుతమై తేజరిల్లిన భారతదేశము, భారతజాతి, భారతసంఘము నేడథోగతిపాలై ప్రపంచజనులకు హాస్యాస్పదమై, దరిద్రతాపేడకాకరమై నిర్వీర్యమై, హీనాతిహీనమైయుండుటకు నారీమణుల జ్ఞానశూన్యతయు, నారోగ్యవిహీనతయు, బలహీనతయు ప్రబల కారణములని పెద్దలూహించుచున్నారు. భరతఖండమున నెప్పుడు ప్రకృతి స్వరూపిణియగు నారీమణి సకలజనగౌరవకారిణియై, గృహరాజ్యమున రాణియై, సకల విద్యారహస్యవేదినియైయుండెనో యానాడు భరతపుత్రులెల్ల సుశిక్షితయగు మాతచే శిక్షింపబడుచు,

నారోగ్యవంతులై, బలపరాక్రమయుతులై, సత్యమార్గప్రదులై, భక్తిజ్ఞాననిరతులై, ధైర్యస్థైర్యసాహసౌదార్యయుక్తులై వెలసిరి. అట్టియుత్తమగౌరవమును దమ సుందరీమణులకేదినమున భారతీయులొసంగక నంగనామణులు బానిసలనియు, వంటయింటిదాసీలనియు, వారికి విద్యాజ్ఞానములవసరములేదనియు భావించిరో యానాడే తమజాతి, సంఘము, దేశము క్షీణదశనొంది క్రమక్రమముగా బరాధీనతనొంది వెతలపాలగుట తటస్థించినది. నాటనుండి దేశమజ్ఞానభూయిష్టమై, బాల్యవివాహములు ప్రబలినవి. భారతీయులదృష్టిలో స్త్రీలొక విలాసవస్తువులయిరి. పురుషులు దమభోగలాలసతను చాటించి మగువల కష్టసుఖము లాలోచించుట మానివేసిరి. దాంపత్య ధర్మోద్దేశములను నార్యపద్ధతులను విడనాడి జంత్రగానిచేతి జంత్రపు బొమ్మలకైవడి సుదతులను ద్రిప్పసాగిరి. తత్ఫలితముగ వీర్యవంతము, తేజస్సమేతము నగు భారతజాతియందు నిర్వీర్యులు నిస్తేజులు నగు సంతానములుదయింపనయ్యెను. భారతపుత్రులనారోగ్యులు బలహీనులు మూర్ఖులునయియుండుట సంభవించెను. స్త్రీలు నిరంతరరోగభూయిష్ఠులై యుండుటచేతను విద్యాశూన్యులగుటచేతను, నబలలగుటచేతను జాతియంతయు నశ్లేషరిణమించెను. ప్రజలయందాయుఃపరిమాణము క్షీణించెను. సంగోరున కెక్కువ జనులు బలహీనులై యెట్టికార్యముల నాచరింపజాలక రోగములతో బాధపడుచుండుట పరిపాటియయ్యెను. పుట్టినదిమొదలు శిశువనారోగ్యముచే బాధనొందుచు, జూచువారలకు జాలియు, సంతానమందేహ్యమును బుట్టించుచుండుటయ్యెను.

ఇట్టి దుస్థితికంతకును మూలము బాల్యవివాహములేయని దృఢముగా జెప్పవచ్చును. అవయవములైన పరిపూర్ణములుగానట్టివేళ, లోకజ్ఞాన మెఱుగనివేళ, పదిపండ్రెండుల వయస్సున నాటపాటలతో విద్యావ్యాసంగములతో వినోదింపవలసినవేళ, మనోవికాసమునకవకాశములేనివేళ, సంసారభారము నెత్తికంటగట్టి అత్తమామలవలన గల్గుబాధలకోర్చి భర్తృసేవాపరాయణత్వమునుజూపి, శరీరారోగ్యమును గాపాడుకొనుట కెట్లుసాధ్యమగును? ఇంతలో బండ్రెండు లేక పదుమూడు వత్సరములు వచ్చునప్పటికి సంతానవతియై మాతృస్థానమాక్రమించుటయా తనదేహమునే తానుగాపాడుకోలేని బాలిక పసిబిడ్డను సంరక్షించుటయా! ఎట్టివింత! ఇట్టి పసిపాపలకు బుట్టిన బిడ్డలెంత బల

వంతులు, ఎంతటియాజానుబాహులు, ఎంతటి యారోగ్యవంతులు! సాధారణముగా నిట్టి పిల్లలు పుట్టినదినమందో కాక మఱుదినముననో లేక పురిటిలోపలనో మరణించుట మన మనుదినమును గాంచుచున్నాము. మఱికొందఱు బాలికలు సుఖప్రసవమునొందక యెనిమిదవ మాసముననో, యేడవమాసముననో మృతశిశువులం గాంచుటయు నెల్లరెరింగిన విషయమే. ఇట్టి బాలింతలు సాధారణముగా నూటికి ఏబదివంతున ప్రసవ బాధను సహింపలేకయు, గర్భభారమును వహింపలేకయు, నసువుల గోల్పోవుట దేశీయులెఱుంగని విషయముగాదు ప్రసవమయినవారిలో నూటికి పదిమందిమైన నారోగ్య భాగ్యమునుగాంచిన వారగపడరు. ఇందుచే శిశువులు బలహీనులు, రోగగ్రస్థులునయి యెట్లో కొందఱు బ్రతుకుచున్నారు. వారితల్లులు విద్యాశూన్యలు, ననారోగ్యులు నగుట బిడ్డలకు మంచి శిక్ష నొసంగ వీలులేదు. ఇక బిడ్డలో శరీరదౌర్బల్యము వలన నుత్సాహశూన్యులయి తగిన విద్యనేర్వలేకను, దేహమనోధైర్యంబుల వహింపజాలక నున్నారు. అట్టి దుర్బలులగువారు యువకులయ్యును, యౌవనమందుండవలసిన ధైర్య స్థైర్యగాంభీర్యములను సహజోత్సాహమును బడయజాలక యెట్లో గృహకార్యములను మాత్రము చక్కబెట్టుకొనుచున్నారు. ఇట్టి యీయువకులు పదునాఱు పదియేడేండ్లకు మరల గృహస్థులై దుర్బలసంతానము లోకమునకొసంగుచున్నారు. కావుననే భారత యుద్ధకాలమున సుమారు రెండువందలవత్సరములవఱకు జీవించిన భారతీయులు, నాజానుబాహులై దీర్ఘకాయులై, బలపరాక్రమవంతులై యుండినవీరులు నేడు పొట్టి వారు, దుర్బలులు, నల్పాయుష్కులు, బలహీనులునై యుండుటకంటె దేశమునకు దౌర్భాగ్యమున్నదా?

దేశీయులారా!

దేశమిట్టి దుర్బలజాతికి కారణమై, పతితమైయున్న తరుణమున మూలకారణము నారసి దేశకల్యాణమును, సంఘాభివృద్ధిని, జాతీయాభివృద్ధిని పెంపొందింప బుద్ధిమంతులు, నీతి విశారదులు, దూరాలోచనపరులు నగు మహనీయుల నాదేశముల ననుసరించి బాల్యవివాహముల రద్దుపఱచి మీ మీ బిడ్డల, జాతిని, సంఘమును, దేశమును నుద్ధరింపుడు. పూర్వాచారమని పట్టుబట్టి బాల్యవివాహములనే గావింపకుడు. ఇప్పుడు దేశ

మందంతటను వ్యాపించిన శారదాగారి బిల్లు ననుసరించి మీ బాలికలకు బదునాల్గు వత్సరములు వచ్చువఱకు వివాహముల నొనర్పక మంచి విద్యాభ్యాసమును జేయింపుఁడు. బాలురను నిరువది వత్సరముల వఱకైన బ్రహ్మచర్య వ్రతమును బాలించి విద్యనేర్చు నట్లొనర్పుడు.

ఈబాల్యవివాహపిశాచము శూద్రులందుకంటె నగ్రజాతులందే విస్తారముగానున్నది. అందువలన నెందరో బాలవితంతువు లశ్రుధారల విడుచుచున్నారు. దుర్బలులగు శిశువులను విస్తారముకాని యాయగ్రజాతి సోదరులే తండ్రులే పూర్వాచారపరాయణత ముఖ్యముగా నెంచి శారదా బిల్లు నెదురించి పోట్లాడ సందందు సభలొనర్చి కొందఱి ప్రతినిధులను బ్రోగుసేసి రాజప్రతినిధియొద్దకు రాయబారులనుగా బంపుచున్నట్లు పత్రికల వలన తెలియుచున్నది. అట్లొనర్చుట భావ్యముగాదనియు, మీబిడ్డల సుఖసౌభాగ్యముల నీటగల్పుట నీతిగాదనియు, మన పురాతన గ్రంథములందు సర్వవర్ణముల వారికి ప్రౌఢ వివాహములు నియతములనుట గానబడుచున్నది. మధ్యకాల మందప్పటి దేశకాలపరిస్థితులనుబట్టి, క్వచిత్తుగానుంచిన బాల్యవివాహములు దేశీయులు విద్యాశూన్యులై యున్నప్పుడు తాత్కాలిక లాభములను జూచుకొని కులపురోహితాదులు గల్పించిన మంత్రములను గ్రమక్రమముగా శ్రుతిస్మృతులందు జేర్చి దేశీయులకా మంత్రములను బ్రమాణముగా బోధించినందున నిట్టియనర్థకమయ్యె.

నేఁడు చాలమంది విద్యావంతులయియుండి, యట్టివి ప్రక్షిప్తములని తలంచుచు గూడ మరల పూర్వాచారవ్యామోహమునబడి శారదా బిల్లును బ్రతిఘటింప యత్నించుట కంటెను విచారశూన్యత వేఱయున్నదా? ప్రతినిత్యము గృహమందు జరుగునట్టి పైవిషయములన్నియు గన్నారగాంచుచుండియు నీ ప్రతికూలత యేల? విద్వాంసులమని పేరొందిన మీరు ప్రతికూలపక్షనాయకులై ఢిల్లీకేగుట న్యాయమా? పరిహాసాస్పదము గాదా! కనుక మీరెల్ల విశాలదృష్టితో నాలోకించి వివాహవయోనిర్ణయచట్టమున కంగీకారమునుజూపి మీజాతిని, సంఘమును, దేశమును దొల్లింటి యౌన్నత్య దశకుఁ దేమిమ్ముల‌ఁ బ్రార్థించుచున్నాను.

# శ్రీకృష్ణదేవరాయలు

శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారు

ఒకనాఁ డాంధ్రమరాటకన్నడము లొక్కటై యంచుఁ గీర్తింపఁగన్
సకలోర్వీశ్వరమస్తకప్రకటరత్నవ్రాతముల్ కాలియం
దెసఁ గీలించి జగన్నుతప్రతిభ ధాత్రీమండలిం గొన్న తు
ళ్వకులాబ్ధీందు నృసింహకృష్ణనరపాలా ! ఆంధ్రభోజప్రభూ !
రాజాధిరాజ వీరప్రతాప శ్రీరాజపరమేశబిరుద విభ్రాజివగుచు
ఘనమూరురాయర గండపెండార బింబితవైరి వీరపృథ్వీపుఁడవగుచు
నిఖిలయాచకజన నికరమనోరథావాప్తి కల్పకపాదపంబ వగుచు

ప్రథితవై భువమున సురేశ్వరుఁ డవగుచు
భువనవిజయాఖ్య రత్నపీఠి వసియించి
రామరాజ్యంబుఁ దలపించి రాణమించి
ప్రజలనేలితి శ్రీకృష్ణరాయచంద్ర !

హరిహరరాయ రాజ్యస్థాపనప్రజ్ఞ బుక్కభూపతి మహాబుద్ధివిభవ
మాద్వితీయహరిహరాధిపు శాంతంబు దేవరాయప్రభు దివ్యకృషియు
సాళ్వనృసింహరాజశ్రేష్ఠు సామ్రాజ్యవిస్తారచాతురి వినుతతుళువ
నరసింహరాయు ననంతసామర్థ్యంబు వీరనృసింహుని విక్రమంబు

నేకమై కృష్ణదేవరాణ్ణృపకులావ
తంస ! నీయందునిలిచె నితాంతగరిమ
భవదసామాన్య ధీపరిపాలనంబు
గానమొనరించునేఁడు శుష్కస్థలములు.

ఒకట శ్రీవిఠలరాయుని మహామహిమప్రభావంబు దశదిశల బర్వుచుండ
నొకట నుగ్రనృసింహు ప్రకటప్రతాపముల్ యున్నట్టిగగురుపాటొదవఁజేయ
నొకట విరూపాక్షు నుత్కృష్టభక్తి సంరక్షణత్వంబు దిగ్భ్రమముఁ గొలుప
నొకట హజారరామకృపాతిరేకంబు తలఁచినంతన తన్మయులనొనర్ప

శంకరుని దివ్యలింగ మాశ్చర్యమొసఁగ
విఘ్నపతి విగ్రహాద్వయవిపులగరిమ
గని మహానందమున నమస్కారశత మొ
నర్చి వచ్చితి నీయనూనప్రతిభకు.

కలరు జగన్నుతప్రతిభఁ, గన్న యవక్రపరాక్రమక్రమో
జ్జ్వలపృథుశౌర్యధైర్యసముపార్జిత సేతుహిమన్నగావళీ
విలసిత ధారుణీశులు కవిత్వపటుత్వమహత్వసంపదన్
గలుగరుగా భవత్సములు క్ష్మాస్థలి సాళువకృష్ణరాణ్మణీ !

పరరాణ్మత్తగజేంద్రకుంభదళన వ్యాపారపారీణ భీ
కరకంఠీరవమూర్తివై యమరవిఖ్యాతిం బ్రజాపాలనన్
బరగన్ జేసెడి నామహార్ణవమి దిబ్బంగన్న కన్నీరురా
ల్గరుగన్ కాల్వలుగా స్రవించెనకటా? కర్ణాటకృష్ణాధిపా !

ఘనలోకోత్తర చిత్రశిల్పరచనాగంభీరప్రాచుర్యనూ
తనలావణ్య యశోవినిర్మితకళాధౌరేయతాచిహ్నమై
చను యుష్మద్విమలోరుకీర్తి దిశలన్ జాటించు "లోటస్ మహాల్"
గననానాటి యపూర్వవైభవము కండ్లంగట్టె నట్లయ్యెడిన్.

స, రి. గ, మ, వర్ణసప్తక ప్రశంస లయ, శ్రుతి, రాగ, తాళ, సు
స్వరమృదుమాధురీమహిమ, స్తంభములన్ గడునద్భుతంబుగా
నిరుపమ శిల్పకల్పనవినిర్మితమా నల "విఠలేశు" సుం
దరనిలయంబుఁగాంచి ప్రమదంబున మ్రొక్కితి కృష్ణభూవరా !

నాకపురీ నివాసుల వినాశయశుండగు కృష్ణరాయు న
స్తోకవిచిత్రశిల్పకళ "సూర్యశశాంకము ధాత్రిసల్పగన్
బ్రాకటలీల నిర్మితమొనర్చిన చిహ్నము నాఁదనర్చు న
"య్యేకశిలారథంబు"ఁ గని హెచ్చినభక్తి నమస్కరించితిన్.

నిక్కపు జీవపుంగళల నేర్పునముద్దలు గుల్కుబొమ్మలున్
జొక్కపుమంజులాకృతుల సోఁపెసలారు లతాద్రుమావళుల్
యక్కజమొందు తీరుల భయంకర విగ్రహముల్గలట్టి యా
"చెక్కడపుంబను" ల్గనినఁ జేష్ఠలు దక్కక పోవునేటికిన్.

పాడియుఁ బంటనెట్టివో? ధృవంబుగవాకొనలేరుగాసి యా
నాఁడు నృసింహకృష్ణనరనాథవరేణ్యుని ప్రాంగణంబునన్
వాడుకలోననున్నదగు పాలనుకాచెడు "రాతితొట్టి" ము
య్యేడుగజాల బారు గజమెత్తువెడల్పుల నబ్రమై.

వరనరసింహకృష్ణ విభవ ప్రభవాదుల కీర్తిచంద్రికల్
గరమునుద్దై గుహాముఖములన్ జొరమున్నట ప్రాణభీతిచే
వెరవనిడాగియున్న రిపువీరవధూత్కరచక్రవాకముల్
నరహరి! కృష్ణ! కృష్ణ! శరణమ్మని మ్రొక్కిరిగాదె? యొక్కటన్.

అసమానధీనిధియౌ తిమ్మరుసు మహామంత్రి, సర్వజ్ఞత్వ మహితమహిమ
అపరపరబ్రహ్మలౌ పెద్దనామాత్యు, ప్రభృతుల సుకవితా వైభవంబు
సాళ్వగోవిందరాట్సచివఁ గొండారెడ్డి, వీరుల దోర్బలవిక్రమంబు
అనువైనఁబ్రాణము లర్పింప వెరువని ప్రజలనిరుపమాన రాజభక్తి

> కలిసి సర్వాంగసౌందర్యకలితమగుచు
> ఆంధ్రసామ్రాజ్యలక్ష్మి ప్రేమానుభూతి
> తావకోన్నత బాహుబంధములఁ జేరె
> దివ్యగుణగేయ! శ్రీకృష్ణదేవరాయ!!

శరణాగతులను రక్షణసేయఁ దనువైన జెనకియిచ్చుటయందు శిబియనంగ
అరిశాడ్భయంకరుండై రణావని గసిమసియొనర్చుట నభిమన్యుఁడనఁగ

వినయకారుణ్యావివేకసౌశీల్యాదిలలితగుణముల బ్రహ్లాదుఁడనఁగ
నిరతసూనృతవచోనియతి వినుత యశస్సాంద్రుఁడౌ శ్రీహరిశ్చంద్రుఁడనఁగ

ప్రజలచేఁగాక నిఖిలభూపతులచేత
వేయినోళుల సంకీర్తనీయుఁడయిన
కృష్ణరాయలపాదపంకేరుహముల
తలనుఁదాల్చిన దీధరాతలమె? నాఁడు

అకట! నీగర్భమునందొక మగబిడ్డ కలుగని దురదృష్ట కారణంబొ?
అచ్యుతదేవరాయల సమర్థత్వంబు హీనమైపోయిన హేతువుననొ?
అప్రతిమప్రతాపాగ్రణిరామరాడ్భూవరు సత్యహంభావముననొ?
గాక హిందూదాస్యకఠినదేవత నెత్తిమొత్తుచునుండెడి మూలముననొ?

ప్రాజ్యకర్ణాట వైభవరాజ్యలక్ష్మి
పరులపంచలఁజేరఁగా వలసివచ్చె
గాకయుండిన నేఁడు మాకల ఋకెట్టి
పథముఁద్రొక్కెడినో స్వేచ్ఛఁబడసియుంట.

## శరణార్థి

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

పరమాణువునకు లోపలడాఁగుసూక్ష్మాత్మ ! దయసేయవే సూక్ష్మదర్శనంబు
బ్రహ్మాండమునకుఁ బైపడి వెల్గుపరమాత్మ ! దయసేయవే పరదర్శనంబు
అఖిలంబునందభివ్యాపించు విశ్వాత్మ ! దయసేయవే విశ్వదర్శనంబు
ఏకమయ్యుననేకమైకల్గునేకాత్మ ! దయసేయవే యైక్యదర్శనంబు

గ్రుడ్డిమొద్దు చేనఁబడ్డట్టు లిటునట్టు
కానలేక మెట్టొకడచు చుంటి
ఆదుకోవె ! సచ్చిదానందపదవీవె !
నాథ ! నన్ను నిన్నొనర్చుకోవె ! !

# స్త్రీలు—నాటకరంగప్రవేశము

శ్రీమతి జాగర్లమూడి జానకమ్మగారు

స్త్రీల గౌరవము పరిరక్షితమగుటకు ఆధారము వారలయందే ఇమిడియున్నదని శారద వ్రాసినమాట స్త్రీలకెల్లను వెలలేని మూటయని నొక్కి వక్కాణింప నగును. స్త్రీల గౌరవము కాపాడు భారము ప్రస్తుత పరిస్థితులలో ప్రాయికముగా పురుషులయందున్నను మొత్తముమీద నది స్త్రీలయందే ఉన్నదని గుణగ్రహణపారీణులు గ్రహింపకపోరు.



జాగర్లమూడి జానకమ్మగారు

నేను మనము అడువారము. నాటకరంగమునకు ఎక్కిన పాడువారమే యగుదుము. ఇంతవఱకు మనలను బయటకురానీయక బంధించియుంచిన పురుషుడే నేడు మనలను రంగమునకు రావలసినదియని హెచ్చరించుచున్నాడు. ఈకార్యమునకే రేపు ఆతడు మనలను తూలనాడవచ్చును. చూడుడు. తొలుత రూపముగ్ధుడై దశరథుడు కైకకు వరములిచ్చినాడు; పిదప ఎందుకిచ్చితినాయని పరిపరివిధముల పరితపించినాడు. తన పతితనకెంత వశ్యుడైనను న్యాయవిరుద్ధమైన కార్యాచరణమునకు గడంగకూడదనుట కైక చరిత్రవలన విస్పష్టమగుచున్నది. న్యాయవిరుద్ధమైన కార్యాచరణమునకు గడంగి విరోధమైన కోరిక కోరినది కావుననే అది శాశ్వతాపవాదముగ నిలచిపోయినది. మనకెట్టి యవకాశము పురుషు లొసంగినను గౌరవహానికరములగు కార్యములకు పూనుకొనుట అభిమానగుణ ధుర్యలగు స్త్రీలకు తగదు. మన అభిమాన గౌరవములు మనమే కాపాడుకొనవలయును.

వాద ప్రతివాదములతో పనియేమి? మనము రంగమెక్కియే తీరవలయునని నిర్బంధమేమి గలదు? కులస్త్రీకి రంగమున నభినయింప నవకాశమెందున్నది? ఊపిరిపీల్చుకొనుటకైన అవకాశ మీయని గృహకార్యములు మనపై పెద్దపర్వతములవలె నిలచి

యుండ—ఉపచారిణి, మాతృదేవి అయి వ్యక్తులను కొలిచి వారికి స్వాస్థ్యము కల్గింప వలసియుండ—కేవల వినోదకృత్యములగు నాటకరంగ ప్రవేశములనుగూర్చి చింతించుటకైన సావకాశమేది?

శుచిమూర్తియగు అగ్నిదేవుని యెదుట మనోవాక్కాయకర్మలచే నీకు వ్యతిరేకముగా చరింపనని భర్తకు ఘోరప్రమాణముచేసి నాటకరంగమునకెక్కి నాయికవేషము దాల్చి నాయకునివేషము ధరించిన పరపురుషుని వాక్కుచే 'ప్రాణప్రియా' మొదలగు సంబుద్ధులచే పేరెత్తి పిలచుట ఎట్టిధర్మము? ఆలోచించి పెద్దలు పరిష్కరింతురు గాక!

ఒకవేళ స్త్రీలనాటకరంగప్రవేశము చిరకాలముగా మనదేశమున ఉన్నదేయనుకొనుడు. అంతమాత్రమున నది అనుకరణీయమగునా? పాలును నీరును వేరుచేసి పాలను మాత్రమే గ్రహించు హంసలవలె మనమును ఇంతయో అంతయో విద్యనేర్చుచున్నాము గావున పూర్వాధునికాచారముల లోతును బాతును, మంచిని చెడ్డను పరామర్శించి చెడ్డను విడనాడి మంచిని గ్రహించి మహితర పుణ్యమున జీవించుట ఉత్తమ పద్ధతికాని గాలిపాటువంటి ఆవేశమునకు దోసిలియొగ్గి రామాస్వస్తి రావణాస్వస్తియని చరించుట ఉత్తమ పథముగాదు.

పురాతనయాచారమని ఇప్పటికి మనయందుకాని భావికాలమునకు యనేక చిక్కులలో ముంచివైచెడి రంగస్థల మభినయంబుల గోరుట యెందులకు? దానివలన మనమేమి జ్ఞానధర్మముల గ్రహింపబోవుచున్నాము? బ్రహ్మదేవుని సభయందు భరత మహాముని యప్సరసలచేతను గంధర్వులచేతను నటనమాడించినట్లును యందు మోహినీశంకరుల ప్రదర్శనంబున వారు విరుద్ధముగ ప్రవర్తిల్లినందున భరతమహాముని కోపించి శపించినట్లును కాళిదాసచరిత్రమందు వినబడుచున్నది గదా. ఇటులనే భాగవతంబున శ్రీనారదులు తాను పూర్వజన్మంబున గంధర్వుడైనట్లును, దేవతల యాగ కాలంబున యప్సరసలతోగలసి వినోదార్థము నాటకమాడునపుడు ప్రమాదవశంబున వ్యతిరేకంబున వర్తించినట్లును యందుచేత శాపంబొంది వసుధయందు శూద్రకాంతకు జనించినట్లును ధర్మరాజున కెరుకబరచియున్నారు. ఇట్టి యనర్థంబులు గలిగినందువలననే యార్యులాయాచారము విసర్జించియుందురు. భర్తను బిడ్డల బంధుమిత్రుల పోషించుటకును ఇల్లు వాకిలి సవరించుకొనుటకును ఇహపరలోకంబులకు సాధనదాయకంబగు విద్యనేర్చి ఇదివరకే స్త్రీలు స్త్రీలని దుర్భాషలాడువారల నోటబడక గౌరవంబున కాలముబుచ్చుట మనకు చాలును. పురుషులు నాటకరంగమునకెక్కుమనుటయు మనము సరియనుటయు రెండును వలదు. మనకుగాకపోయినను మనబిడ్డలనాటికైన యనర్థదాయకంబగునని యెంచి వారివారి యభిప్రాయములను పత్రికాముఖమున వెల్లడిబరచి ఈ సాంప్రదాయమును ఖడించవలయునని స్త్రీలకు మనవిచేయుచున్నాను.

# శారదకు ప్రత్యుత్తరము

## శ్రీమతి ధర్మవరము లక్ష్మీదేవిగారు

సహోదరీ—

నీయొక్క శారదలేఖను బాగుగా మనస్సునకు వచ్చునట్లు చదివితిని. కొన్ని విషయములను విమర్శింపవలెనని తోచెను. ఎందులకన 'వాదే వాదే జాయతే తత్వభోధః' యని పెద్దల వచనము. మథనము వలననే వెన్న. అయిననూ ఇందులో కొంచెము గమనించతగిన విషయము కలదు. ఉద్దేశములేని వాదనవలన తత్వభోధయగునని చెప్పుటకు వలనుపడదు. అథవా తనకు మంచిదని తోచినదానిని నుడువుటగాని, తనకు చెడ్డదని తోచినదానిని ఖండించుటగాని వాదముయొక్క ఉద్దేశమై యుండతగదు. ఎందుకనిన ఆరీతిగనూ తత్వబోధ కాజాలదు.

తత్వమననేమి అనుదానిని తెలిసికొన వలయుననునదే వాదముయొక్క ఉద్దేశమైనయెడల అందువలన తత్వము స్పష్టపడును. ఈ ఉద్దేశము సంకల్పమాత్రమువల్లనే సాధ్యము కాదు. దానికితగిన వివేకసాధనమూ అగత్యము. వివేకమునకు అలిప్తబుద్ధియే కారణము. సామాన్యబుద్ధికి అలిప్తత లేదు. దానికి అభిమానమే హెచ్చు. తాను చెప్పినది, తాను వినినది, తన పెద్దలుచెప్పినది, తన ధర్మగ్రంథములందు వ్రాసినది, మొదలగునవే న్యాయమని అభిమానులకు.

హిందువునకు వేదశాస్త్రపురాణములనిన విశేషము. అవే దేవునివాక్యమని. క్రైస్తవులకు బైబిలు దేవుని వాక్యమని వాడుక. అయిన ఒక దైవము చెప్పిన వాక్యములందే యెంతో పరస్పర విరుద్ధము. ఈ రీతిగా ఒకసారినుడివిన దానిని వేరొకసారి కాదను దైవమును, సర్వజ్ఞుడు, సర్వత్రాణియని ఒప్పుకొనుట కష్టము. అథవా ఆయనకు జ్ఞాపకశక్తియూ కొఱపడి యుండవచ్చును. లేనియెడల ఒక్కొక్క మతమునకు వేరువేరు గ్రంథములనువ్రాసిన దేవునినే వేరువేరు యనవలయునా?

పుట్టుక అకస్మాత్తు. హిందూమతావలంబనుల కడుపులో పుట్టినతోడనే, శృతిస్మృతులు ఒప్పు, కురాన్ బైబులు తప్పు అగుటయెట్లో? అదేరీతిగా తురకలకు వేదశాస్త్రములు కాఫర్ జనుల అసత్య గ్రంథములగుటయెట్లో! సామాన్య బుద్ధియొక్క నైజమేమన అకస్మాత్తుగా సంభవించినదానినే ధర్మముగా తలంచుట విచారవివేకములకు పనియేలేదు. కొందరు ఇట్లనవచ్చును. వారిది వారికి ఒప్పు. మాది మాకు ఒప్పు. అని. భేష్ ఇదియెట్లు? ఒప్పు తప్పగుట, తప్పు ఒప్పగుట, ఇది నపుంసకుల అనుకూల సిద్ధాంతము. మరియు దురభిమానము. ఇట్లుండ సంపూర్ణముగ యే ధర్మగ్రంథములునూ సర్వసమ్మత మనుటకు లేదు. వాటి ఆధారము వలన జీవనమును నడిపించుటకు సాధ్యముకాదు. నడిపించుటయును లేదు. వెనుకటి వ్యయనియమము లన్నియూ ఇపుడెచట నున్నవి? లార్డ్ విలియమ్ బెన్‌టిక్ అను నాతడు తన చెయ్యిచూపిన తరువాత అప్పటివఱకు ధర్మమైయున్న సహగమనము ఎచ్చటికేగెనో? 12 యేండ్లకు తక్కువ పెండ్లిచేయరాదను

చట్టము ఉన్నప్పుడు అంతవఱకు 'అష్టవర్షాద్భవేత్కన్యా' యను ధర్మము ఎచటికి కెగిరిపోయెనో? ఇపుడు దైవవశాత్ శారదాబిల్లు ఆక్టు అయినయెడల ఇప్పటివఱకు జరుగుచున్న పెండ్లియొక్క ధార్మికవయసు యేమగునో! వూరక నోటినుండి ధర్మము ధర్మమనిన మాత్రముననే ధర్మము నడచునా? ఇంతవఱకు మన దుర్గతికి కారణమేమన, మనయందుండునది ధర్మముయొక్క ప్రీతికాదు. సంఘముయొక్క చట్టముల భీతియే. ఈభీతివలన డంబాచారము, స్వపరవంచన, క్రౌర్యము, వైక్లబ్యము. వివేకమువలన యోగ్యమూ, సాధ్యమూ, అవశ్యకమూ, హితకరమూ, అయినటువంటి, నూతన రీతులనూ మనమే స్వతంత్రముగా, యేర్పరించవలెను. దీనికి కేవలము అభిమానము పనికిరాదు. సత్యాసత్య యుక్తాయుక్త వివేచనయే అవశ్యకము.

జీవితముయొక్క అంగాంగమందునూ ఈసూత్ర ముండిన బుద్ధియూ స్ఫుటమగును, అలిప్తమగును. అటువంటి బుద్ధివలన, నూతన మార్గమునే తెరువవలయును. పాత దానిని అనుసరించిన మాత్రమే చాలదు. 'నవాజ్ఞానేన సదృశంపవిత్ర మిహావిద్యతే.'

జ్ఞానము, జగన్మాన్యముగాయున్నది. దానిని నిష్కళంకముగా, పెంచవలయును. అదిలేనియెడల మూఢభక్తియేగతి, మరియు దీనివలన, బుద్ధికిముప్పు, సంఘమునకు హాని. అన్నిమతగ్రంధములందునూ, వ్యత్యాసముకలదని మొదలే చెప్పితిని. అయిననూ జ్ఞానమునకు లోపడినటువంటి, పరమతస్థులకూ—అదేల—సర్వమతస్థులకూ, సమ్మతింప తగిన అనేక విషయములు వాటియందుకలవు. వాటిని మాత్రము వెతకి తీసికొని, ఆచరించుటయందే నిజమైన ధర్మమున్నది, ఐక్యమున్నది. భూత భవిష్యత్తుల ఐక్యము, పూర్వపశ్చిమవాసుల ఐక్యము, మత మతాంతరముల ఐక్యము జ్ఞానము వలననే సాధ్యము కావలయును. సహిష్ణతయూ, సంకల్ప మాత్రము వల్లనే కలుగదు. అది జ్ఞానముయొక్క సహజ లక్షణము. జ్ఞానముయొక్క జ్యోతియే అది. దీపము లేని జ్యోతిని వెలిగింపవలెనను ప్రయత్నము వ్యర్థము.

అభిమాన రహితమైన నిష్కళంక జ్ఞానమునకు ఎల్లమతములూ ఒకటే. ఒకకాలపు జనుల బుద్ధిపరిస్థితి సంస్కృతులకు మంచివియని తోచిన విషయములే మతములనగా అయినను అప్పటివే అన్ని కాలములకునూ, అన్ని పరిస్థితులకునూ యోగ్యమని మాత్రము జ్ఞానము ఎన్నటికినీ ఒప్పదు. దృష్టాంతమునకుగాను నీవు మానావమానములను గురించి కొన్నిసూచనలు ఇచ్చితివి. రామాయణ భారతములను మాదిరి చూపించితివి. ఈ గ్రంథముల ఎల్లభాగములనూ నిజమే, యోగ్యమేయని సమ్మతించుటకు అంధశ్రద్ధకు సాధ్యమేకాని, జ్ఞానమునకు సాధ్యముకాదు.

శ్రీరాములు శూద్రకుని చంపినది, వాలి ఇంద్రజిత్తులను చంపినది, సీతాదేవిని, ఒకపరి పరీక్షించియూ, ఎవరో ఒకరి అపవాదమునకుగాను క్రూరహృదయుడై, అదియుగాక, గర్భిణిగా వున్నప్పుడు, అడవులకు పంపినది వీటిన్యాయమును విమర్శించిచూచిన, మోసము క్రౌర్యము కానబడునేకాని విశేషసద్గుణము కనుపించుటయే లేదు.

జనాపవాదమునకు బలియైన రాముని జీవనసూత్రము సామాన్య జనమతమేయని తోచునేగాని వివేకమనునది కాన్పింపదు. ఈకాలపు సీతకు తన అపరాధమును రుజువుపరుపనిదే బయట వేయుట సులభసాధ్యముకాదు. అట్లు చేసినయెడల, కూడుగుడ్డలకుగాను మైంటినెన్స్ సూట్, వ్యాజ్యము నడచునట్టి సంభవముకలదు. ఆకాలమువలె, వాదియే న్యాయాధీశుడగుటకు ఇప్పటి సీతయైన సమ్మతించదు.



గరల్ గైడ్

రాముడూ కొంచెము, ముందువెనుక లాలోచించును. దీనికి ఇప్పటి జనుల అధర్మమనవలయునా అథవా వారల న్యాయబుద్ధి ప్రబలమగుచున్నదియనవలయునా ?

మహాభారతమును చూతము. ఆగ్రంథమంతయూ, అనుకరణార్హమగుటకు భగవద్గీతయు దాని యందన్ని స్థలము లందును లేదుకదా ? అన్ని భాగములయందునూ గీతయే వున్నయెడల, నేనే, ఎందుకు హిందువులే ఏల, ఎల్ల ప్రపంచ జనులునూ దానిని మార్గదర్శకముగా, నియమింపుచుండిరి. భారతమందు చూచిన, ఆకాలమందునూ, నీవంటి, నావంటి స్త్రీలదుస్థితియూ, ఎట్లుండెననుట; అదియుగాక, ఆకాల మందు మానాపమానలాభనష్టములను యేదృష్టితో చూచుచుండిరో యనునది తెలుసుకొనగలము.

ద్రౌపదియంతటి ఒక జీవిని జూదమునకుగాను పందెముగా వొడ్డుట ఎల్లరకు తెలిసిన విషయమేగదా? అయిననూ పాండవులేమో పుణ్యాత్ములే కదా! భారతమునకు దానియొక్క ఇప్పటి సర్వాంగభక్తులకు ? జూదమే దుష్కర్మము. దానియందునూ ఒక ఉత్తమస్త్రీని నిర్జీవపదార్థమువలె పందెమిడి ఓడుట యెంతటి ఘోరపాపము ? ఇంతైననూ పాండవుల అపరాధమును జూపించువారు ఒకరైననూ లేరు. చతుర్థాశ్వాసమందు యుథత్యుని కథను చూతము. యుథత్యుతి భార్య మమత అనునామె గర్భవతియై యున్నపుడు దేవరన్యాయానుసారముగా—ఇచట న్యాయమను పదమును గమనించవలెను—బృహస్పతిచేరుటకు పోయెనట. గర్భమందు గలపిండము, ఇది తగని పని యని వారించెనట. దానికి బృహస్పతి క్రోధవశుడై సన్మార్గమును ఉపదేశించిన, ఆశిశువును, తమోయుతుడవుగమ్మని శపించెనట. అదేవిధముగా ఆపిండము దీర్ఘతమోయుతుడై జనించెనట. ముందు అపుట్టంధునకు ప్రద్వేషిణి అనునామెకును వివాహమాయెనట. ఆమెకు గౌతమాదులైన అనేక కుమారులు కల్గిరి. ఈపిల్లలను మోయుటకును కాపాడుటకును సహించు టకు శక్తిలేనిదై, ఆమె సహజముగా ఉపేక్షితురాలైన, మగనికి కోపమువచ్చి శపించెనట. ఆమెయొక్క అపరాధమేమి? ఆమెచెప్పినమాటలవలననే తెలియనీ.

భార్య ౧.

ఆదిపర్వము—చతుర్థాశ్వాసము

పతియు భరియించు గావున భర్తయయ్యె
భామ భరియింపబడుగాన భార్యయయ్యె
పరగ నవి మనయందు వీడ్వడియె నిన్ను
నేను యెల్లకాలము భరియింతుగాన.

దీనికి ఉత్తరము

భర్త ౨.

పతిహీనలయిన భామిను లతిధనవంతులయ్యు గులజాలయ్యును ననలం
కృతలయ్యెడు మాంగల్యరహిత లయ్యెడు గృపణవృత్తినిదియు మొదలుగాన్.

ఆమె చేసిన న్యాయమునకు ఆమెకుమాత్రమే కాక ఈ శాపము ఎల్ల స్త్రీలకూ శాపమట. క్రైస్తవుల బైబులునందు ఒక్క ఆదమ్ పాపమునకు కాను మానవవర్గమందరినీ దేవుడు శపించినట్లేయున్నది. ఇది యెటువంటి న్యాయము? ఋషియనవలయునుకదా ఇతనిని? గర్భస్థమైన పిండము ద్రోహము చేసినదన వలయునా బృహస్పతికి? బృహస్పతి మహానుభావుడేగదా? దీర్ఘతముని శాపమునకు గాను స్త్రీలు ఇప్పటికిని మొగుడు ఎంతటి పామరుడైననుసరే వానిని కట్టుకొనవలయునుకదా? లేనియెడల ఆమెకు మాంగల్యభూషణాధికారము లేదనుటలో? బృహస్పతియు, దీర్ఘతముడునూ భారతమునకునూ దానియొక్క భక్తులకును సన్మానార్హులే. ప్రద్వేషిణి అపరాధిని, ఒప్పుకొనవలసిన విషయమా?

చెల్లెలా! యెట్లున్నది భారతముయొక్క మానావమాన విమర్శనము? మఱియు స్త్రీలకు ఇచ్చిన పదవి; ఈగ్రంథములయందు విశేషముగా బలమునకు మానమునకు దయకుస్థలమేలేదు. అటువంటి పురాణేతిహాసములను విని శివాజి అంతటి వాడాయె నంటివి. దానికొకప్రశ్న. పురాణేతిహాసముల కాలక్షేపమును తెలియని ఊరుగాని వీధిగాని లేదు ఈ హిందూదేశమందు. ఆకాలక్షేపమాత్రమునకే అట్టి ప్రభావమున్న యెడల, 33 కోట్ల జనులలో ఎంతమంది శివాజులు పుట్టవలసియుండెను. శివాజి శివాజియే, కాలక్షేపము కాలక్షేపమే. శివాజియంతటివారిని, పుట్టించి పెరిగించుటకు క్రొత్తరీతులను, స్త్రీలగుమనము వెతకి తీయవలయును. కని పెట్టిన చాలదు, కనిపెట్టవలయును. జీవింపవలయుననిన నవజీవనమునకు నూతన రీతులు అత్యావశ్యకము. అయిన పురాణగ్రంథముల సహాయమును, జ్ఞానముచే తగినంతమాత్రము అవశ్యముగ తీసుకొనుటకు అభ్యంతరములేదు.

కళాప్రియులైన మాత్రమునసే, కళావంతులనియు, అభినయార్థముగా వేషభూషణములు ధరించిన మాత్రముననే వేశ్యలనియూ, ఆజన్మాంతము పిలువబడుటకు మనసమాజమందుకల జనుల కుభావములెంత పెరిగియుండవచ్చును. ఈకళలేని కలియుగమందుగల జనుల కుభావములను తీసివైచి, నాటకమందు సద్భావములను తీసివైచి, నాటకమందు సద్భావయుతమైన సన్మానమును కలుగ జేయుటకై, మొదలు శ్రీరవీంద్రనాథ్ టాగూర్ గారు తమ స్వకుటుంబమును రంగభూమికి తెచ్చిరి. రెండవతూరి హరీంద్రనాథ చటోపాధ్యాయగారు కులసతియగు కమలాదేవిచే నాటకమును ప్రదర్శించిరి. మూడవది యోగి తారానాథ్ జీ గారిచే స్థాపింపబడిన బెంగుళూరు ప్రేమసంఘమందు మొదలు మీరాబాయి అను నాటకమును ప్రదర్శించిరి. స్త్రీలు రంగస్థలమునకు రాకూడదను భావముగలవారు మాత్రము ఇట్టి నాటకములను, కుతూహలముచే చూడక వదలిరా? ఒక సంవత్సరము తరువాత, హిందీ దీనబంధు కబీర నాటకమును మహాత్మా గాంధీజీ యెదుట ప్రదర్శించిరి. ఆనాటకమందు సుశిక్షితులైన కులీన స్త్రీలు చాలామంది వచ్చియుండిరనుట యెల్లరకు విశదమే. నీవు వ్రాసినప్రకారము, సబర్మతీ ఆశ్రమవాసులందు సహితము స్త్రీపురుషసాన్నిధ్యమువలన, అనాహుతములు జరుగుచున్నవని విలపించు మహాత్ముడు, ఈ నాటకమునుచూచి లేశమైనను ఆక్షేపింపక సంతసించి సన్మానించెను.

అదియుగాక, ఆకస్మిక స్త్రీ పురుషుల కలయిక వల్లనే అనాహుతములు హెచ్చుచున్నవని చెప్ప వచ్చును. లండనునుండి తిరిగివచ్చిన తరువాతనే మాతండ్రిగారగు రాఘవాచార్యులవారు ఇట్టినాటక ముల విషయమై పట్టుదలకలవారైరి. అయిన ఇట్టివి ప్రారంభమై 10 సంవత్సరములకు హెచ్చాయెనని చెప్పవచ్చును.

అయితే నిన్నటివిషయమును నేటికే మఱచునట్టి మనజనులకు మాత్రము ఇది నవీనమారుతముగానే తోచవచ్చును.

నవీనమో ప్రాచీనమో భావప్రదర్శనముకదా ప్రధానము, దానికి స్త్రీలైననేమి, చీరలుకట్టుకొన్న పురుషులైననేమియంటివి. దానికి సాధనాపత్రికయూ ఉత్తరమిచ్చినది.

నాటకమందు పురుషుల స్పర్శ మొదలైనవాటిని గురించి ఆక్షేపణ చేసితివి. నాటకమనిన కేవలము శృంగార విలాస మనియే నీయొక్క భావనయని నాకు తోచుచున్నది. నాటక మనిన ఉద్యాన విలాసము కాదు. కాముణిపండుగ కాదు. సహజమైన కామ ఆటను జయించు రీతినీ దానిని పరిశీలించి వ్యవస్థించి వాటినీ రంగస్థలము ప్రదర్శించవలయును.

"పరపురుషులస్పర్శ"ను గురించి నీవువ్రాసినావు. మనయొక్క సకల ధర్మములయందున్నట్లు వివాహ ధర్మమందునూ మనస్సునకు ప్రాధాన్యమున్నదని నామతము. మనస్సు ఎవనియందు లీనమైయుం డునో వాడే నిజమైనభర్తయు తత్వతః మనస్సొకనియందుండి అన్నవస్త్రములకు గాని, సంఘాపవాద భీతికి గాని దేహమును మాత్రము వివాహోత్సవకారణ మాత్రమునకు పతియనిపించుకొనువానికి వశముచేయుట, పరపురుషసహవాసమే. ఈవిధమైన అనాహుతములు మనసమాజమందెంతకలదో యనునది మనమే దురభి మానమును విడచి, చూచిన తెలియును. మనస్సనునది కలదని సహితము తెలియని, చిన్న పిల్లలకు పెండ్లిచేసిన వాండ్లు మనస్సిచ్చుటయననేమి? అర్థములేనిమాట. దానికి తగిన విద్యయు అవశ్యకము. అన్నవస్త్రములు భయదాక్షిణ్యములు మొదలైన క్షుల్లకవస్తువులకు గాను జరుగుచున్న సకలస్త్రీపురుషుల సహవాసము తత్వతః అధర్మమే.

అయిన వీని కతీతమైన వివాహదాంపత్యములు ఎన్నికలవు. మనయందు కేవల వివాహ "శాస్త్రము" తోడనే ఆలుమగలు కారు. మగడు స్వపురుషుడుకాడు. విద్యా స్వాతంత్రములవల్ల అన్నవస్త్రములకు అధీనకాని స్త్రీ తానై మనస్సును అర్పించి యిచ్చిన మనుజుడే స్వపురుషుడు.

అదిలేనప్పుడు వివాహమూ దాంపత్యమూ, ఎంత అట్టహాసముచే నడచిననూ, న్యాయబుద్ధికి, దాని యందుతోచునది పరపురుషస్పర్శమాత్రమే. ఏనిని సమాజమందు మన వివాహరీతి నీతియందే మొదలు

సుధారించవలయును. అట్లుమనస్సును జ్ఞానస్వాతంత్రములచే ఒకనికి ఇచ్చిన స్త్రీకి ఇంకొకనియెడ మనస్సుపోదు. ఆమెకు ఇంకొక స్థలమందు, కొంచెమో గొప్పో సాన్నిధ్యమున్ననూ మనస్సు స్వపురుషుని వదలి ఇంకొకనిని ఇచ్ఛింపదు. అటువంటి విచారశీలముగల స్త్రీలే నాటకరంగమునకు కావలసినవారు. వారు నాటకరంగముఖాంతరముగ జనుల జీవితవికాసమునకు కావలసిన సకల యుక్తధర్మములను వ్యాపింప చేయవలయును.

నాటకరంగమునకు స్త్రీలే కావలెనని తోడనే, నాటకములునూ వారిగుణములునూ యెట్లే యుండనీ అను అర్థముకాదు. నాటకములు యోగ్యమైనవియైయుండవలెను. నటియు యోగ్యురాలై యుండవలయును. దురాచారములకు శిక్షణలేనిదే ప్రబలకారణము స్త్రీలు రంగస్థలమునకు వచ్చినయెడల దురాచారములు ప్రబలమగునని ఉద్గారము చేయువారకు ఇప్పుడు స్త్రీవేషధారులైన పురుషులున్న రంగస్థలమందు అనాహుతములు లేవని తలంచిన, ఆ స్త్రీ వేషధారులైన బాలురయందు వారి సాన్నిధ్యమందున్న వారియందునూ చెప్పరాని అనాహుతములుకలవు. అవి అనైసర్గికములు ప్రకృతివిరుద్ధము. స్త్రీలయొక్క పాత్రధారణవలన, అవిచ్ఛినితపరిణామములు కొన్నిజరుగుటలేదని యెవరూచెప్పుటకు సాధ్యముకాదు. అయిన అటువంటివి రంగస్థలబాహ్యమందునూ జరుగుచునేయున్నవి. దానికిగాను రంగస్థలము అంతవిశేష కారణమనుటకు సాధ్యముకాదు. ఆరీతిగా వర్తించువారి అశిక్షిత మనసే కారణము. బాహ్యమందుగల మనస్సే వర్తించును. అట్టి విషయములందు, అపకీర్తి మాత్రము రంగభూమి. అయినబాలికాబాలుర అనైసర్గిక పశువృత్తికంతటికినీ చాలామట్టుకు రంగభూమియే జన్మస్థానము, ప్రోత్సాహకరమైన వాతావరణము స్త్రీలు అచ్చటికి వచ్చుటవలన ఈఘోరపాపముమాత్రము లేకుండ పోవుననుటకు సందేహములేదు. స్త్రీల రాక వలన నాటకకర్తలుకూడ, కామోన్నత చిత్రాంగిని ఆమెను అవివేకధనపదవులబలత్కారముచే వరించిన రాజరాజనరేంద్రుని నీ రంగభూమికి తెచ్చుటకు సంకోచపడుదురు. నాటకకర్తల లేఖినికి లగాముపడును. నటుల అసహ్యమగు ఉద్యానవిలాసములకు, అడ్డమగును. నాటకముల రంగరూపములు బదలాయింపబడును. ఉద్దీపనమునకు సెలవుచిక్కును. ఉపదేశము ప్రబలమగును. వ్రాయువారలకూ, ఆడువారలకూ, చూచువారలకు, వాతముచేకూరును.

# చిట్టి

శ్రీమతి వి. సుబ్బమ్మగారు

## ౧

నాకు ముగ్గురుపిల్లలు. మొట్టమొదటి సంతానము ఆడపిల్ల. రెండవది కుమారుడు. మూడవది ఆడపిల్ల. ఆపిల్లయే ఆఖరుది. వీరు ముగ్గురుగాక యిద్దరు మగపిల్లలు చనిపోయిరి. పిల్లవానిని అందరు "బేబి" యని పిలచెడివారము. చిన్నఅమ్మాయిని "చిట్టి"యని పిల్చెడివారము. బేబియనిన మాకుప్రేమ. ముద్దుకూడాను. బేబిని యతిగారాబముగ పెంచుచుంటిమి. అతడేమో గొప్పవాడయి తీరనియశము నార్జించునని తలచుచుండుదానను. బేబి కిప్పుడు దాదాపు పండ్రెండువత్సరముల వయసు. బడికిపోయి చదువుకొనుచున్నాడు. బేబి కోరికలు ఎప్పటివప్పుడు తీర్చుచుండెడి దానను. నేనేకాదు. మావారు కూడ అంతే. బేబికి జరిగినంత అచ్చటలు ముచ్చటలు ఎవరికిని జరుగలేదు. బహుశా పెద్దఅమ్మాయికి కొద్దిగ జరిగియుండవచ్చును. మాపిల్లలందరు అందగాండ్రే. వారి యందమునకు నేను గర్వపడుచుండుదానను. రోజు దృష్టితీయుచుందును. దృష్టితీయుట ఎవరికి మరచినను బేబికి మరువను. నాకు, (ఎఱుక) సోదె, దృష్టి, జ్యోతిషము, బుడబుడక్కలవాని పలుకులు, కలలు, వీటియందు పిచ్చినమ్మకము. ఈకాలపువారివలె వీటి నన్నిటిని త్రోసిపుచ్చెడిదానను కాను.



వి. సుబ్బమ్మగారు

౨

ఒకరోజు మేమందరము నిద్రించుచుండ నే నొక కలగంటిని. బేబియు చిట్టియు జబ్బుతో పరుండియున్నట్లు యాకల కన్పట్టెను. నాటినుండియు నాకు ఒకవిధమయిన భయము పుట్టెను. అల్లారు ముద్దుగ పెంచుచున్న బేబి కేదియో ముప్పువాటిల్లునని దిగులు జెందితిని. కాని చిట్టివిషయమై నేను గమనించనేలేదు. కలగనిన పదిరోజులకు, ఒక ఎరుకత వీధి వెంటబోవుచుండెను. తెల్లగ నెరసిన తలమీద ఒక తాటాకు బుట్టపెట్టుకొని "అవ్వో, యవ్వ," యని యఱచుచు, తలవాకిటనుండు నావంకజూచి, నాకు సోదెయందు నమ్మక మున్నదని నాముఖమునుచూచి తెలుసుకొన్నది కాబోలు "సోదె వినవాతల్లి! సోదె చెప్పుదునా యమ్మా!"యని యడిగెను. నేను చెప్పుమని యడిగితిని. వెంటనే యది తన చింపిచాప నేలమీద బఱచి, ఏవియో కొన్ని ముగ్గులుగీచి, మూఁడుదోసిళ్ల బియ్యమి య్యమని యడిగి, నేనది ఇవ్వగనే యొక చేటలోపోసి, దానిపై నొక మట్టిప్రమిద దీపము వెలిగించి, ఒకకఱ్ఱ ఆదీపముచుట్టు ముమ్మారుత్రిప్పి, దానికొన నొకదానిని నన్నుపట్టు కొమ్మని, రెండవకొన యది పట్టుకొని, కొంతసేపు కన్నులుమూసి తెఱచి "ఉజ్జయినీ కాళి, కొల్లాపురమ్మ, కొమారసామి, కాటమరాయుడ, కదిరి నరసింహుడ, కనకదుర్గమ్మా వాకీయరే"యని దేవతాప్రార్థనచేసి, పిదప కొన్నిప్రశ్నలకు ఔను కాదని ప్రత్యుత్తరము లిచ్చి, ఆఖరున నేనడుగకనే, లేచివెళ్లబోవునపుడు, నాదగ్గిర రెండుడబ్బులు తీసుకొనుచు "నీకు త్వరలో కడుపుశోకము గలుగు"నని చెప్పిపోయినది. నేనును "అయ్యో! చేతులార తెచ్చుకొంటినే, బేబి చనిపోవునేమోకదా, ఈసోదె ఏలచెప్పించుకొంటిని; దానినేల పిలి చితిని, ఎరుకత తప్పేమి వున్నది. సోదె వినకున్నంతనే, జరుగునది జరుగకపోవునా"యని పలువిధముల చింతించితిని. దుఃఖించితిని. సోదెయందు నమ్మకము లేనివారు నన్నుజూచి నవ్వుదురు. కాని వీటియందు నాకు నమ్మకమని మునుపే చెప్పితినికదా! అప్పుడు నేను కలకును, సోదెకును, ఏదియో సంబంధముండునని ఎంచి దిగులుపడుచుంటిని. వెంటనే నానాథునితో ఈవిషయములుచెప్పి, లేకలేక కలిగినబేబికి ఏమి కీడుకలుగునోయని కన్నీరు బెట్టుకొంటిని. వారు నన్ను బుజ్జగించి కన్నీరుతుడచి "కలలు, సోదెలు, నిజము లా? భయపడకుము, మనబేబికి వచ్చిన భయమేమియులేద"ని వూరడించిరి. కాని నాకు మాత్రము, మనసులో ఆవేదన లేకపోలేదు.

## 3

నేనుభయము పడుచు, కాలము గడుపుచుంటిని. నాభయమునకు కారణము లేకపోలేదని తెల్పుటకో యన్నట్లు మాబేబికి జబ్బుచేసినది. బేబి టైఫాయిడ్ చే పక్కచేరినాడు. ఇరువదిరోజులు జ్వరము నూటమూడు డిగ్రీలమీదనేకాని క్రిందలేదు. మావారు, చిట్టి, నేను, ముగ్గురము బేబిమంచము దగ్గరే యుండువారము. మాకు నిద్రాహారములులేవు. నాకు స్వప్నము, గాఁడెయు మరతుమన్నను మరవురాలేదు. బేబి చనిపోవునని యే యనుకొంటిమి. బేబినిచూచిపోవ బందుగు లెందరోవచ్చిరి. వారికి బేబి ముచ్చట్లుచెప్పి, వాని చేతలు, ఉన్నవి, లేనివికూడ వర్ణించి పొగడి యట్టిపిల్లడు నాకు దక్కనాయని కన్నీరు విడచెడిదానను. వారు నన్ను ఓదార్చి బేబికి భయమేమిలేదని ధైర్యముచెప్పి వెళ్లెడివారు. మామాటలు వినినవారు, అమ్మాయిలు బేబియంత తెలివిగలవారు కారని యనుకొనెడివారు నిజానికి చిట్టియే బేబికన్న తెలివిగలది. ఆమె తెలివి మరుగుపడుటకు కారణము, ఆడుపుట్టుక పుట్టుటయే. చుట్టములందరునువచ్చి బేబిని చూచిపోయిరి. కాని మాపెద్దమ్మాయి యిబ్బందిచేత రాలేకపోయినది. చిట్టికి వయసు ఎనిమిదేయైనను చిట్టికి తెలియనివిషయము లేదు. చిట్టి ముద్దుమాటలచే మమ్ము తనిపింపవలెనని వచ్చినమావారు "చిట్టి, లోనికిపొమ్ము నాకు పనియున్నదని" నేను 'అబ్బా! వూపిరి త్రిప్పుకొనసీయవేమే, తలనొచ్చుచున్నది. పొరకొమ్మని" కసరెడివారము కానీ బేబికి యడ్డేలేదు. అతడుచేసిన తప్పులు పెద్దవయినను మన్నింపబడును. చిట్టివిచిన్నవైనను కొండంతచేసి బేబితో తగువులాడినందుకై తిట్టువారము. ఇవన్నియు, బేబి బాగున్నప్పటి విషయము. అపుడు మాచేతలు మాకు తప్పుగ దోచలేదు. ఇక బేబి జబ్బుగనున్నపుడు చెప్పవలెనా? బేబి జబ్బుగనున్నపుడు ఒకరోజు చిట్టి నాకడకువచ్చి "అమ్మా, జడవేయవా, మూడురోజులైనదే. బేబి జబ్బుగ నున్నాడని నేనే యడుగుటకూడ మానివేసితిని. ఈపూటయైన వేయవా? నాజతపిల్లలందరు నేను పిచ్చిదాననని ఎగతాళి చేయుచున్నారు."అని యడుగ నేను "నీ అందమున కెక్కడ కొరవపడినది? రేపువేసెదనులే, ఇచట కేకలువేయకుము. బేబి నిద్రపోవుచున్నాడు, వాకిటపోయి యాడుకొ"మ్మని కసిరితిని. చిట్టి మారు మాటాడక చిన్నపోయిన ముఖముతో గదివదలి బయటికి పోయినది.

మాపెద్దమ్మాయికూడ బేబినిచూడ రెండురోజులు వీలుచేసికొని వచ్చినది. మరల ఆమె భర్తకడకుపోవుటకు బయలుదేరగనే నేను "అమ్మాయీ, చిట్టిని వెంటగొనిపోమ

దవా ? ఇచట అల్లరిచేయుచున్నది. డాక్టరుగారు బేబిని నిశ్శబ్దముగ నుంచవలెననియు, ఎవరును దగ్గరకురాకూడదనియు చెప్పుచున్నారు. చిట్టి కెంతచెప్పినను తెలియదు. నీకిబ్బంది గనున్న వలదుసుమా!" యంటిని. మాఅమ్మాయి బేబికి ఇబ్బందియని విన్నతోడనే బదులుచెప్పక చిట్టిని వెంటకొనిపోవ, చిట్టి ఇష్టము లేకున్నను అక్కగారింటికి వెళ్లెను. బేబి దినదినమునకు శుక్లపక్షచంద్రునివలె ఆరోగ్యము పొందినాడు డాక్టరు బేబిని చల్లటి ప్రదేశమునకు విశ్రాంతికై కొంపొమ్మని సలహానిచ్చెను. వెంటనే మేమిరువురము బేబిని బెంగుళూరుకు కొంపోతిమి.

## ౪

రాజమహేంద్రవరమున చిట్టికి అక్కగారింట స్ఫోటకము తగిలెను. అమ్మ, అమ్మ యని కలువరించుచుండెను. మాపెద్దమ్మాయియు, మాకు ఉత్తరము వ్రాతునా వలదా యని, యోచించి, యోచించి, తుదకు బేబికి నెమ్మదిగవుండి, బేబిపొమ్మనినవచ్చి చిట్టిని చూచి పోవలసినదని యొక ఉత్తరమువ్రాసెను. అది చేరకముందే యొక తంతివార్త వచ్చెను. 'చిట్టి మిమ్ముచూడవలయునని కలువరించుచున్నది. వ్యాధి హెచ్చుగనున్నది. తక్షణము బయలుదేరుడ'ని మాయల్లుడు పంపెను. బేబిని కదిపిన ఆరోగ్య భంగమగు నని మావారిని బేబికడనుంచి నేను చిట్టిని చూడ ప్రయాణమైతిని. చిట్టికేమివ్యాధియో చిట్టిని చూచువరకు నాకు తెలియదు. చిట్టి నన్ను చూడగనే "అమ్మా!"యని పిలచి ఎత్తు కొమ్మని ఏడ్చెను. నేను చిట్టిని యొడిలోనుంచుకొనగనే, కొంతసేపు నన్నుపైచూచి "అమ్మా, బేబికిపుడు జ్వరములేదు కదా! డాక్టర్ నన్నురమ్మనెనా, నేను వచ్చెదను. నన్ను నీతో తీసికొనిపొమ్ము. నీవు బేబిని వదలిపెట్టి రావనుకొంటిని. నాకన్న బేబియే మీకందరికి ఎక్కువయనికూడా ఎరుగుదును. అమ్మా, నాన్న బేబిదగ్గరనున్నాడా? నాన్న, బేబి రాలేదా" యనుచు కనులుమూసికొనెను. మరల తెరువలేదు. చిట్టి తన్ను బేబిని ప్రేమించినట్లు ప్రేమింపలేదని కనుగొనెను. ఇపుడు చిట్టి పసిడి తూగుటూయ లలో వూగుచు, చుక్కవలె మెరయుచున్నది. నాటినుండియు నాదుఃఖమునకు మితి లేదు. నాపక్షపాతము ఇపుడు తెలిసినది. చిట్టిమాటలు ఇప్పటికిని నాహృదయ శల్య ములైవున్నవి. చిట్టిపలుకులు వాస్తవమే. మాయిరువురికిని యిపుడేదిశిక్ష?



జగన్నాథము
దేవాలయము: స్నానఘట్టము

# ఆంధ్రదేశ స్త్రీవిద్యాసంస్థలు

## శారదానికేతనము గుంటూరు:

౧

సక్రమపద్ధతులపై స్త్రీలకు ఉన్నతవిద్య గరపుటకు 'శ్రీశారదానికేతనము' అను పేరిట గురుకులవిద్యాలయము 1922-వ సంవత్సరమున గుంటూరునగరమున స్థాపింపబడి దినదినాభివృద్ధి గాంచుచున్నది. ఈవిద్యాలయమున నవలంబింపబడు విద్యావిధానము రెండు తరగతులుగ విభజింపబడియున్నది. ఇచ్చట నవలంబింపబడు విధానము సామాన్యముగ ఎనిమిది సంవత్సరములు పట్టును. మొదటి అయిదు సంవత్సరముల చదువు సాహితీప్రకరణమనియు, కడమ మూడుసంవత్సరముల చదువు విదుషీప్రకరణమనియు విభజింపబడి యున్నది. బాగుగ చదువను వ్రాయనునేర్చి ప్రైమరీ తరగతివఱకు చదివిన బాలికలు సాహితీ ప్రకరణములో చేర్చుకొనబడుదురు. మొదటి అయిదుసంవత్సరములు పూర్తియగు నప్పటికి బాలికలకు సంస్కృతాంధ్రములలో కొంతకావ్యజ్ఞాన మలవడి సంగీత చిత్రలేఖనములలో నొక దానిలో మంచి జ్ఞానము సంపాదించి చేతిపనులలో నొకటినేర్చి వైద్యము భూగోళము చరిత్రలలో మంచి పరిచయము గలిగి పరీక్షలలో నుత్తీర్ణులయినవారు సాహితీబిరుదమును బడయగలరు. తరువాత మూడు సంవత్సరములలో సంస్కృతాంధ్రభాషలలో నొకటియును, ఆంగ్లహిందీ భాషలలో నొకటియును అభిమానభాషలుగ పఠించి ఉత్తీర్ణలగు వారు విదుషీపట్టభద్రలగుదురు. ఇప్పటికి గురుకులము స్థాపింపబడి వర్షసప్తకము జరిగినది; ఇంతవఱకు రెండు జట్లుగ పండ్రెండుగురు బాలికలు సాహితీబిరుదముల నందిరి. అందు తొమ్మండ్రుగురు బాలికలు విదుషీతరగతులలో చేరి చదువుచున్నారు. విద్యాలయమున కిప్పటికి దినదిన గండములు గడిచినవని చెప్పవచ్చును. స్త్రీవిద్యాభిమానులగు వదాన్యమహాశయుల సహకారమున స్వాంతభవన

మును భూమి మొదలగు తదితర స్థిరాస్తిని సంపాదించుకొన గల్గినది. ఆంధ్రదేశమందలి మునిసిపలు సంఘములు, తాలూకాబోర్డులు, జిల్లాబోర్డులు ఉచితరీతిని ఈవిద్యాలయము యొక్క ఆర్థికసంపదకు తోడుపడుచున్నవి. శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మగారు శారదానికేతన నిర్మాత్రి; బి. వేంకటలక్ష్మమ్మగారు నియంత్రి. వీరిరువురి చిత్రములును, ఏతద్విద్యాలయ సంబంధములగు మఱిరెండు చిత్రములును, నికేతనమున చిత్రకళాభ్యాసన మొనర్చుచున్న ఇద్దఱు విద్యార్థినిలు వ్రాసిన త్రివర్ణచిత్రములనుండి తయారుచేసిన రెండు చిత్రపటములును మొత్తము ఆఱుపటములు వేఱొకచో ముద్రించియున్నాము.

## ౨

## కస్తూరిదేవివిద్యాలయము నెల్లూరు.

స్త్రీల కాంగ్రెసు సంఘముపక్షమున 1923—వ సంవత్సరమున స్థాపితమై నాటినుండియు క్రమాభివృద్ధి నందుచున్నది. ఏతద్విద్యాలయమునకు శ్రీమతి పొణకా కనకమ్మగారు నిర్మాత్రి. విద్యాలయము సక్రమమగు జాతీయ పద్ధతులతో ఉచితముగా విద్యను గరపుచున్నది. ఇందు సంస్కృతము, తెలుగు, హిందీ, ఇంగ్లీషు విద్యలును; రాట్నము: పేముపని మొదలగు పరిశ్రమలును; భక్తిజ్ఞానప్రదమగు భగవద్గీతా పఠనమును; శాస్త్రోక్త సంగీతమును, సూర్యనమస్కారములును, సమర్థులగు నుపాధ్యాయులచే బోధింపబడుచున్నవి. దైవభక్తి, దేశభక్తి, పురికొల్పుచు ఓర్పు, నేర్పు, నీతి, గృహనిర్వాహకత్వము అలవడులాగున మనపూర్వచారిత్రములను, పౌరాణిక, ఐతిహాసిక కథలును బాలికలకు యథాశక్తి బోధింపబడుచున్నవి. బాలికలవద్ద జీతములు తీసికొనుట లేదు. ఈ 5 సంవత్సరములనుండి షుమారు 3—4 వందల బాలికలు యీ విద్యాలయములో చదివి గృహిణులై కాపురములు చేయుచు చదివిన విధానమును చక్కగా నభివృద్ధిలోనికి దెచ్చుకొనుచున్నారు. ప్రస్తుతము విద్యాలయమున 100 మంది బాలికలున్నారు. జాతి మత వివక్షతలు లేవు. బీదలకెక్కువ సహాయము చేయుటే ముఖ్యాశయము. ఈ విద్యాలయమునకు భవననిర్మాణమునకు విశాలరమ్యప్రదేశము సంపాదితమైనది. భవనమునకు శంకుస్థాపనము మహాత్ములవారు గావించియున్నారు.

## ౩

## వైశ్య సేవా సదనము : రాజమండ్రి

ఉదారులును శ్రీమంతులును నగు శ్రీనాళము రామలింగయ్యగారు ఈ సదనమును వైశ్యస్త్రీల అభివృద్ధికొఱకు 1920—వ సంవత్సరము మే 22—వ తేదీని రాజమహేంద్ర వర



నియంత్రి
బి. వెంకటలక్ష్మమ్మగారు



నిర్మాత్రి
ఉన్నవలక్ష్మీబాయమ్మగారు

శారదానికేతనము: గుంటూరు



పోషింపబడుచున్న అనాథశిశువు

శారదానికేతనము: గుంటూరు



ఉపాధ్యాయినిలు: కార్యకర్త్రిలు

మున స్థాపించిరి. సంవత్సరమునకు రు 3,500 ఆదాయమువచ్చు రు 40,000 విలువగల భూములు దానమొసంగిరి. భవననిర్మాణమునకు 50,000 ఇచ్చిరి. వైశ్యయువతులు సదనమున నివశించి మత, వాఙ్మయ, వైద్య, లలితకళ, కార్మిక విద్యలు నేర్చుకొనుచు ఆత్మవిశ్వాసము, సౌభ్రాతృత్వము, సంఘసేవ మొదలగు మంచిగుణములను అలవరచుకొనుట ఈసదనముయొక్క ముఖ్యోద్దేశము. ప్రస్తుతము సదనము వారు బాలికా పాఠశాలనడపుటయేగాక పురస్త్రీలకు వివిధవిద్యలుకూడ నేర్పుచున్నారు. ఈసదనము రాజకీయ విషయములందును, మతసాంఘిక కక్షలలోను జోక్యము కలుగజేసికొనదు. శ్రీమతి బత్తుల కామాక్షమ్మగారు ఈసదనమునకు నియంత్రి.

## ౪

## మహిళా జాతీయ విద్యాలయము : కాకినాడ.

తూర్పుగోదావరీమండల తిలకనగరమగు కాకినాడయందు స్త్రీల పురోభివృద్ధికినై విద్యార్థినీసమాజము నెలకొల్పబడి చిరకాలముగా పనిచేయుచున్నది. సమాజమునకు ఒక ముద్రణాయంత్రముగలదు. దానియాజమాన్యమున నొక పత్రిక 'హిందూసుందరి' యను పేర స్త్రీల యభ్యుదయము కొఱకై నిర్వహింపబడుచున్నది. విద్యార్థిని సమాజమునకు సుప్రసిద్ధాంధ్రవిదుషి బాలాంత్రపు శేషమ్మగారు కార్యదర్శిని; ఆసమాజముయొక్క యాజమాన్యమున నిర్వహింపబడుచున్న పత్రికకు ఆమెయే సంపాదకురాలు. 1924-వ సంవత్సరమునుండియు విద్యార్థినీసమాజమువారు స్త్రీలకొఱకు 'మహిళా జాతీయ విద్యాలయము' అనుపేర నొక విద్యాలయమును స్థాపించి నిర్వహించుచున్నారు. ఆవిద్యాలయమున మొదట మూడుసంవత్సరములు సంస్కృతము, ప్రచారసంఘము వారి హిందీపరీక్షలకు తగినశిక్ష, కుట్టుపని, సంగీతము, ఊలుపని మొదలగునవి గఱుపబడెను. ఈవిద్యాలయమున హిందీభాషాభ్యసనమొనర్చి హిందీప్రచారక సంఘము వారు నిర్వహించు ప్రవేశ, ప్రాథమిక, రాష్ట్రభాషాపరీక్షలలో జయముగాంచిన స్త్రీలు ఇప్పటికే సుమారు ముప్పదినలువదిమందిగలరు. మూడుసంవత్సరములుగా ఈ విద్యాలయము ప్రభుత్వము వారిచే సంస్కృత ప్రాథమిక పాఠశాలగా అంగీకరింపబడినది. అప్పటినుండియు నిందు సంస్కృతపాఠములు ప్రభుత్వము వారి పాఠక్రమము ననుసరించి నేర్పబడుచున్నవి. విశ్వవిద్యాలయము వారు నిర్వహించు ఉభయభాషాప్రవీణపరీక్షలకుగూడ నిందుతరిబీయతు నీయబడుచున్నది. ఈవిద్యాలయమున సంస్కృత మభ్యసించి శ్రీమతి బాలాంత్రపు మహాలక్ష్మి సుందరమ్మయను విద్యార్థిని ఈసంవత్సరము విద్యాప్రవీణపరీక్షలో

ప్రవేశభాగమున జయముగాంచినది. మొదటినుంచియు ఈవిద్యాలయము మహనీయులొసంగు విరాళములపై నాధారపడియున్నది. సంవత్సరమునకు గవర్నమెంటువారు మూడువందలరూపాయిలగ్రాంటును దయచేయుచున్నారు. ఉదారులగు శ్రీయుత బాలాంత్రపు సుందరరామయ్యగారును తదితరులగు మహనీయులును ఇచ్చిన పండ్రెండువందల రూపాయిల మూలధనము ప్రస్తుత మీవిద్యాలయమునకు గలదు. ఇపు డీవిద్యాలయమునకు నెలకు నూరురూపాయిల చొప్పున ఖర్చులగుచున్నది. విద్యార్థినీసమాజము వారి సొంతభవనమునమునందే విద్యాలయము నెలకొనియున్నది. దీనికిచేర్చి ఒక పుస్తక భాండాగారమున్నది. దానికి రాజ్యలక్ష్మి భాండాగారమనిపేరు.

---

## వైశ్యయువతీ విద్యాలయము : గుంటూరు

ఈ విద్యాలయము 1927–వ సంవత్సరమున స్థాపింపబడినది. మిగుల ప్రఖ్యాతి గాంచిన స్వర్గీయ మాజేటి శ్రీరాములుగారి కుమారికారత్నమగు కాళంగి శేషమాంబగారు ప్రారంభమునుండియు నీ విద్యాలయమును మిక్కిలి పట్టుదలతో నిర్వహించుచున్నారు. విద్యాలయములో గుంటూరు వారిను ఇతర గ్రామములనుండి వచ్చినవారును ప్రస్తుతము నూటనలుబదిమంది బాలికలు శిక్ష నొందుచున్నారు. చేతిపనులు, కుట్టు అల్లికలు మొదలగునవి చిత్రలేఖనము, సంగీతము, యంత్రపుకుట్టు, నేత్రవైద్యము, రాట్నము, తెలుగు, ఇంగ్లీషు, హిందీ, దేశచరిత్ర గణితము, చమికిపని మొదలగునవి నేర్పబడుచున్నవి. ప్రస్తుతము నాలుగుతరగతు లేర్పరుపబడెను. విద్యాలయమున నిప్పుడు ముగ్గురు ఉపాధ్యాయులును, ముగ్గురు ఉపాధ్యాయినిలును ఉన్నారు. సర్వకాల సర్వావస్థలయందు విద్యాలయాభివృద్ధికై పాటుబడుచున్న శేషమాంబగారికి అక్కల పున్నమ్మ, మద్దుల కామేశ్వరమ్మ అను విద్యావతు లిద్దఱు సహాయపడుచున్నారు. ఈ విద్యాలయము ప్రత్యేకము వైశ్యయువతులకు ఉద్దిష్టమైనది కావున వారికి అందుబాటులో నుండునట్లు వైశ్యుల కూడలియనదగిన గుంటలమ్మచెట్టుయొద్ద భవనమునందుంచబడియున్నది. ఈ విద్యాలయము ప్రజాదరణాభిమానములందు దినదినాభివృద్ధిని గాంచుచున్నది. విద్య నుచితముగా గరపుటయే గాక ఈవిద్యానిలయమున బీదబాలికలకు ఉచితభోజనసౌకర్యము కూడగలదు. పెద్దవారగు గృహిణులు సహితము నిత్యము పురాణకాలక్షేపముకొఱకై ఇచ్చటకువచ్చి పోవుచుందురు.

ఏకలవ్యుడు



చిత్రకారిణి: శ్రీమతి పుష్కరాంబ
(శారదానికేతన విద్యార్థిని)

రాధాకృష్ణులు



చిత్రకారిణి: శ్రీమతి తుంగల లక్ష్మీదేవి
(శారదానికేతన విద్యార్థిని)

# సుందరి

శ్రీమతి పి. రుక్మిణీబాయిగారు

౧

విస్సన్నగారికి తొంభయ్యో పడి వచ్చింది. శివపూజార్చకుడుగా ఉండి, చిన్నప్పటినుండి కాయకష్టాలుపడి ఐదార్వేల రూపాయల నగదున్ను, సుమారు ఇరువది ఎకరాల భూమిన్ని సంపాదించి ఉన్న ఆస్తి యావత్తు తన కుమారుడు రామన్నకు ఒప్పగించి పరలోకగతుడయినాడు. సహజంగా వృద్ధురాలగుటచేత విస్సన్నగారి భార్య భర్తపోయిన ఏణ్ణర్థంలోపుగానే పరలోకగతురాలయింది.



పి. రుక్మిణీబాయిగారు

తండ్రిపోయినప్పటినుండి సంసారభారమంతా రామన్నమీదపడింది. ఈతనికి పదునెనిమిదవ ఏటనే భార్య కాపురానికొచ్చింది. మన రామన్న నవనాగరికుడగుటచేత తలిదండ్రులుపోగానే అర్చకత్వం మానేసి లౌకికంలోదిగినాడు. దేవునికి అర్చకత్వం చేయడానికి ఒక జీతగాడిని పెట్టాడు. తాను ఊళ్లో నోట్లు దస్తావేజులు మొదలైనవి వ్రాసి ఫీజు పుచ్చుకోడం ప్రారంభించాడు. ఊళ్లో ఎవరేవ్యవహారం చేసినా ఈయన సలహాలేకుండాచేసేవారు కారు. ఈవిధంగా గడించిన డబ్బుతో ఎప్పటి కప్పుడు కొండ్రకొనేసేవాడు.

"ఇదేమిపాపమండి! మీరు ఏవో నాల్గురాళ్లు సంపాదిస్తున్నారని సంతోషం లేకుండాను. చూశారా! సుబ్బమ్మకూడ నాతోటిదే కదా! దానికిద్దరు పిల్లలు. ఇది నాపూర్వకర్మసుకృతం నాపూజాఫలం. ఎప్పుడు తుమ్మపూవులతో పూజచేశానో

ఇష్టం డనుభవిస్తున్నాను. ఏదోతిండికి లోటులేదుగదా అని కాలక్షేపం చేద్దామంటే లేదు కదా? మనకిచ్చిన ఐశ్వర్యానికితోడు ఒకబిడ్డనుకూడా ఇవ్వరాదు, ఆదేముడు. ఏమండీ మీరు తిరుపతివెంకటేశ్వర్లువారికి మొక్కుకోండి మనకు బిడ్డపుట్టిన తర్వాత కొండెక్కుతామని. నేను అన్నవరంసత్యనారాయణకు నానాను మీదుకడతాను." అని రామన్న పంతులుతో ఇష్టాగోష్ఠిని మాట్లాడుకుంటూ చెప్పింది రాధమ్మ. ఔను ఔనని రామన్న పంతులు తిరుపతివెంకటేశ్వరుల వారికి మొక్కుకొన్నాడు.

ఇట్లు కొంతకాలం గడిచింది. రామన్న రాధల అదృష్టంవల్లనో, లేక దేవుని కరుణాకటాక్షమువల్లనోకాని, రాధ గర్భవతి అయింది. నవమాసములు నిండిన తర్వాత ఆమె ఒక ఆడశిశువును కన్నది. రామన్నపంతులు, పుట్టక పుట్టినపిల్ల గదా అని సంతోషంతో బంధువులందరికి ఈశుభవార్త తెలియజేస్తూ పదకొండవనాడు బారసాలకు రావలసినదని కూడ ఉత్తరాలువ్రాశాడు. బారసాల చేస్తాడని తెలిసి ఊళ్లో మన పంతులు మోమోటస్తులు ఎవరికితోచింది వారు కానుకలు తీసుకొచ్చారు. ఎక్కడెక్కడి బంధువులు వచ్చారు. రామన్నపంతులు గృహం కలకలలాడుతూఉంది. పదకొండవరోజున బారసాలచేసి పిల్లకు "వెంకటసత్యసుందరి" అని నామకరణం చేశాడు. బారసాలంటే సామాన్యంగా చేశాడా. మనపంతులు గొప్ప పెళ్లి చేసినట్లుగా బారసాలయిన ఐదు రోజులు ఊళ్లోఉన్న అష్టాది వర్ణాలవారిని ఆహ్వానించి మృష్టాన్నం పెట్టాడు. కొద్దిగా మోమోటస్తుడన్న వాడికల్లా వస్త్రములు బహుమతీ చేశాడు.

బ్రహ్మానందంగా బారసాలయింది. బంధువు లెవరింటికి వారేతెంచారు. సుందరి దినదిన ప్రవర్ధమానంగా ఎదుగుతోంది. సుందరినిచూచిన వారంతా పేరు సార్థకమయింది మాత్రమగునని సంతోషించేవారు. సుందరికి యుక్తవయస్సు వచ్చింది. పెళ్లిచేయాలి. ఆపుటకు వీలులేదని తొందరచేస్తోంది రాధమ్మ. పంతులు వరుని కొరకు తిరగడం ప్రారంభించాడు. తిరిగి తిరిగి వెయ్యిన్నూటపదహార్లుకట్నం ఇవ్వడానికి ఒప్పుకొని, తనదర్జాకు తగిన సంబంధమే స్థిరపర్చాడు. ముహూర్తంకూడా నిశ్చయించారు. పెళ్లికొడుకు కుర్రవాడు. బి. ఏ. చదువుచున్నాడు. ఏదో ఆస్తికూడ బాగానే ఉంది. మంచి సంబంధం కుదర్చాడని సంతోషించింది రాధమ్మ.

౨

సలక్షణంగా సుందరికి వివాహం అయింది. భర్త రాజమండ్రిలో చదువుచున్నాడు. అప్పుడప్పుడు నారాయణరావు మామగార్కి తాను క్షేమముగా ఉన్నట్లు ఉత్తరాలు

వ్రాసేవాడు. వివాహమయి ఇంకా ఆరుమాసాలు పూర్తిగా కాలేదు. ఒకనాడు "మీ అల్లుడు నారాయణరావు నాల్గుదినములనుంచి కనబడుటలేదు. గోదావరిలో స్నానము చేయుచు మునిగిపోయాడని వదంతి" అని నారాయణరావు సహాధ్యాయులు పంపిన టెలిగ్రాముచూచి రామన్న పంతులు విస్మృతిజెంది పడిపోయాడు. రాధమ్మకూడ ఈ సంగతి వినగానే నిర్ఘాంతపోయి కడుపు, నోరు కొట్టుకొంటూ కొంపపడిపోయిందిరా దేముడా! అని గోలెత్తింది. పాపము! రామన్న రాధలకు చాలరోజుల దాకా నిద్రాహారాలు లేవు. రామన్న పంతులుకిక అన్నిపనులందు విరక్తి కలిగింది. వీధిలోకి రావడం మానేశాడు.

ఈవిధంగా విచార సముద్రంలో మునిగిపోయి ఏపనిచేయడానికి తోచకుండా పిచ్చివానివలె తిరుగుతూఉన్నాడు రామన్నపంతులు. సుందరికి పదునాల్గవఏడు వచ్చింది. రజస్వల అయింది. రామన్న రాధల విచారం మరింత హెచ్చయింది. వారున్నది పల్లెటూరు గనుక, ఏబస్తీకో పోయిఉంటే ఈవిచారానికి మరుపు కలుగుతుందేమో అని అనుకొని దగ్గరగానున్న విజయనగరం చేరుకొన్నారు.

రామన్న రాధలకు కొంచెం పాతబడడంవల్ల అంత విచారంలేదు. సుందరిని చాలా గారాబంగా పెంచుతూ ఉన్నారు. సుందరి జ్ఞానంవచ్చిన పిల్ల అవడంచేత ఒకనాడురాత్రి తనలో తాను ఈవిధంగా ఆలోచించుకొని నిశ్చయించుకొంది. "అనాధనగు నాజన్మమునిరర్థకము, నిష్ప్రయోజనము. భూభారము తప్ప మరేమియులేదు. ప్రస్తుతము కలకత్తాలో ఉన్న అవతారపురుషుడైన గాంధిమహాత్ముని పాదసేవచేసిన నాజన్మతరించును. ఈ సంగతి నాతెలిదండ్రులకు తెలిపినచో వారు నన్ను విడుచుటకల్ల. అందుచే వారికి తెలియకుండ రాత్రిబండికి కలకత్తాపోవుదును." అని నిశ్చయించుకొని "నేను కలకత్తాపోవుచున్నాను" అని ఒక ఉత్తరమువ్రాసి తన పక్కపుమీదపెట్టి కలకత్తాకు పయనమయి వెళ్లింది. సుందరి ఇల్లువిడిచి వెళ్లిన కొంతసేపటికి, రామన్నకు మెళుకువవచ్చి సుందరి పడుకొనే పరుపువైపు చూచాడు. ఆమె ఉన్నట్లులేదు. దీపం వెలిగించి పరుపుదగ్గరకుపోయి చూచాడు. సుందరి కనబడలేదుగాని, "నేను కలకత్తాపోవుచున్నాను" అని వ్రాసిన కాగితంమాత్రంచూచాడు. తక్షణం రామన్న రైలుస్టేషనుకు పరుగెత్తి సుందరిని పట్టుకొని, "తల్లీ! నీవు దక్క మాకిక దిక్కెవ్వరున్నారు? మేముకూడ నీ యిష్టప్రకారము కలకత్తా వచ్చెదము. అక్కడేకాలక్షేపము చేయుదము" అని సుందరిని ఒప్పించి, ఇంటికి తీసుకొనివచ్చి, మరుచటిదినమున రామన్న రాధలు సుందరితో కలకత్తావెళ్లి అక్కడే కాలక్షేపంచేస్తూ ఉన్నారు.

## 3

ఆనందనగరాని కుత్తరంగా ఒక మహారణ్యం ఉంది. అక్కడనన మధ్యమున, ఒక మోటజాతిజనులున్నారు. వారు తమదేవుని ప్రీతికొరకు మనుజులను బలియిత్తురట. కొందరు మోసగాండ్రు ఆయడవిజాతిజనులవద్ద కొంతధనము తీసుకొని మోసగించి తెచ్చిన మనుష్యులను అమ్ముదురట. ఈ మోసగాండ్రు దేశదేశములు విలువగుదుస్తులను ధరించి తిరుగుచు ఏమాయకబుర్లో చెప్పిరో, తమతోకూడనుండు కాంతలవల్ల భ్రాంతి కల్గించిరో, మరి ఏవేవో భ్రాంతులు కలిగించి రంగూను తీసుకొనిపోయి ఆయడవిజనులకు విక్రయింతురట. చదువరులారా! నారాయణరావు గోదావరిలో మునిగిపోయెనని దురభిప్రాయపడి అతని స్నేహితు లంపిన టెలిగ్రామువల్ల తప్పు అభిప్రాయపడితిమికాని, నిజముగా అతడు గోదావరిలో మునిగిపోలేదు. ఇతడుకూడ ఆనందనగర మోసగాండ్ర వలలో చిక్కి ఆనందనగరం గొంపోవబడ్డాడు. ఆనందనగరంలోనున్న మన దేశీయులవల్ల ఆమోసగాండ్రచరిత్ర తెలిసికొని, వారివద్దనుంచి తప్పించుకొని ఆనందనగరంలో మన దేశపు ఒక ఉద్యోగస్తుని ఇంటకొంతకాలము ఆమోసగాండ్ర కండ్లబడకుండా దాగి ఉన్నాడు.

దేశాభిమానము, సంఘాభిమానము ఎవరికుండదు? కొంతకాలమయిన తర్వాత ఆ ఉద్యోగస్తుని ద్రవ్యసాహాయ్యం చేతనే మనదేశం రావాలని బయలుదేరి ఓడెక్కి ఆనందనగరంనుంచి కలకత్తాచేరుకొన్నాడు. అక్కడ షాంబజారు వీధిలో హఠాత్తుగా మామగారయిన రామన్నపంతులుని చూచాడు. పలకరించబోయాడు. కాని తన మామ అక్కడకు రావడం ఎట్లా తటస్థించునని సందేహంతో వెనక్కితగ్గేడు. రామన్నపంతులు కూడ ఇతనినిచూచి తన అల్లునిజ్ఞప్తికి తెచ్చుకొని కళ్లనీరెట్టుకొన్నాడు. వారిద్దరికికూడా ఒకరిమొఖం ఒకరుచూచేసరికి ఏదో అనుమానం పీకులాడుతోంది. కాని ఒకరినొకరు మాట్లాడించుకోడానికి ధైర్యం చిక్కిందికాదు. అట్లావెనక్కితిరిగి చూచి విచారిస్తూ రామన్నపంతులు తన బసకువెళ్లాడు. నారాయణరావుకు అనుమానంతీరక ఆయన వెంట వెళ్లి ఆయన బసలో తన అత్తగారిని భార్యనుకూడా చూచి కళ్లనీరెట్టుకొన్నాడు. ఇతనిని చూచి రాధ మహానందంతో నీవు చనిపోయావని మాకొచ్చిన టెలిగ్రామువల్ల సర్వం త్యజించి ఇక్కడికి వచ్చాము, నీవు ఎక్కడికి వెడితివో సవిస్తరంగా చెప్పమని ఆదుర్దాతో అడిగి తెలిసికొని వాళ్ల అదృష్టంవల్ల తిరిగి వచ్చాడని ఆమె పొందిన సంతోషానికి మేరేలేదు. నారాయణరావు తండ్రికి ఆరోజునే పంతులు ఈశుభవర్తమానం టెలిగ్రామువల్ల తెలియపర్చాడు. మరుచటిరోజున అందరు కలకత్తానుండి తమ స్వగ్రామం చేరుకొన్నారు. సుముహూర్తం నిశ్చయించి ఆయావనదంపతులకు పునస్సంధానం చేశారు. వారిపుడు హాయిగా కాలక్షేపం చేస్తూఉన్నారు.

# ప్రబోధము

## శ్రీమతి నాగలింగమ్ బసవపున్నమ్మ గారు

సోదరీ? దెసలుం బరికించుము. ఏమూలగాంచినను, ఏపత్రికా రాజములను వీక్షించినను, పాశ్చాత్యవనితామణులవ్యాసములేనే, వ్యాసంగములేనే, ఛాయాచిత్రములేనే!



నాగలింగమ్ బసవపున్నమ్మ గారు

నీపూర్వపు ఔన్నత్యమును, నీపూర్వజీవిత పథమును పరీక్షించిన నీకేనవగాహముకాగలదు. ఇకనైనను నీపెద్దల యువకతవక ప్రసంగములకును, సునిశిత వైద్యుష్య సంపాదనమునకును గడంగుము. విద్యావతులమని బేరెన్నికగనుదివసములలో మన మండలియందు బాలికల విద్యాభ్యాసము కషు సన్నగిల్లుట భావ్యభివృద్ధికి యశుభ సూచకమని దలంతును. మనపూర్వవనితా జనతాకళా నిర్మాణ చాతురీధురీణతకు నచ్చెరువంది నీయాధునిక జీవిత పథమును దిద్దికొనుము. నీయవకతవక ప్రసంగములం జాలించుము. "సొగసెచ్చిన మదమెచ్చు" ననెడి విధమునంగాక "చదువెచ్చిన సొగసెచ్చుననెడి" సూక్తినాలించి విద్యావతివి చదువులసరస్వతివికమ్ము.

సోదరీ? ఏభాష నన్నయకవితాస్రవంతులకును, తిక్కన తెలుంగు తేటలకును భావమాధుర్యములకు మూలకందమో, ఏభాష అగాధమాధురీ స్రవంతులగు త్యాగరాయలకుం బ్రాపమ్యెనో, అట్టి—తనగీతి యఅవజాతిని పాటకులనుగా దిద్ది వర్ధిల్లిన—నీ

యాంధ్రభాషా మాధుర్యములఁ జూరగొనుము. తదుపరి ఆయుర్వేదమున సులభజ్ఞానమును సంపాదించుకొనుము.

సోదరీ? సర్వపాండితీమండితవగునీవు, సర్వగుణ పరిశోభితవగునీవు, స్వేచ్ఛాధీనవై, సంసారమును సాగించుటకు నవయౌవనోద్భాసితుని, విద్యాపారంగతుఁడగు హృదయేశ్వరునిఁజేపట్టుము. నీపతిని శ్రియఃపతి గా నెన్నుకొనుము. అపుఁడే నీవు ధన్యవు. అపుఁడే నీకుతృప్తి. అపుఁడే ఆనందము. అపుఁడేభోగము. అంతదనుక తృప్తిలేదు. ఆనందములేదు. భోగములేదు. ధన్యవుకాలేవు. శూన్యహృదయవు, తోలుతిత్తివి, నరముల పేటికవు, జీవములేని బొమ్మవు.

సోదరీ? ఇంతయేల? నీవుమాయాశక్తివని నీకు తెలియదుకాబోలు. సీతాదేవి పాతివ్రత్య మాహాత్మ్యమును, సతీదేవి సతీత్వమును వినికని ధన్యురాలవుకమ్ము. పతివ్రతాధర్మ సూత్రములఁ గలనైన మఱువక మంత్రాక్షరములవలె జపించుచుండుము

నీజన్మభూమి భారతావని. ఈభారత మాతృఫలసాయముననుభవించుచున్నను నీకు కృతజ్ఞతలేదు. ఎప్పుడుమాతృ సరసీరుహముల నాశ్రయించితివో యపుఁడే యామె మాటల నాలించవలయును.

నీసోదరులు వికలాంగులగు జనసంతతిని కటాక్షమున నుండుము.

నవ్యనాగరికతా వ్యామోహ పాశములఁ జిక్కకుము.

నీవన్య గృహారామముల కేగి యన్యస్త్రీల భావనావైకల్యముచే నిస్వచ్ఛ చిత్తమును కలుషిత మొనరించుకొనకుము. పరపురుషుఁడు నా"కన్న" యనెడి భావమును మనసున గమనించుము సోదరీ? నీమత సాంప్రదాయ రీత్యా సూత్రముల స్వీకరించుము. ఇహపర సౌఖ్యమునకు మోక్షపదవీ సంచారమునకు భగవత్పాదారవిందమకరందాస్వాదనమునకై ప్రయత్నింపుము. ఎన్నివిద్యలు పఠించినను "కమలనాభుని దెల్పెడి విద్యవిద్య" యనెడి సూక్తిననుసరించి భగవద్భక్తిని పెంపొందించుకొనుము. నీజాతి గౌరవమును కనుము. నీవగ్రజవైనను ప్రాథమిక శిక్షాచార్యునియందు భక్తి శ్రద్ధలతో మెలంగుము.

అలతి యలతితునియవై తొక్కుపల్కులకు రచ్చయైన నీరసనయం దేసమయమునన్నైన కర్ణకఠోర వాక్యముల నుచ్చరింపకుము. నీజాతికి గౌరవ సంసూచకములైన

ఖద్దరు వస్త్రధారణమునే మనసార గౌరవించి మంజుల గాత్రమున శత్రుపరాజయమునకై నిష్ఠతిగ ధరించుము నీపాండిత్యముచే గృహమున లక్ష్మివై వెలయుము. నీబాల బాలికాది సంతతి నెల్లపుడు ప్రేమతరంగమాలికాడోలికల నూగింపుము. గృహలక్ష్మివలె గృహమున సర్వక్రియాకలాపముల నిర్వర్తించి యన్నపూర్ణా ప్రశోభితవగుము!

శ్లో॥ శుశ్రూషస్వ గురూన్ కురు ప్రియసఖీ వృత్తింసపత్నీజనే.
పత్యుర్విప్రకృతాపి రోషణతయా మాస్మప్రతీపం గమః
భూయిష్ఠంభవ దక్షిణా పరిజనే భాగ్యేష్వనుత్సేకినీ
యాన్త్యేవంగృహిణీ పదం యువతయోవామాః కులస్యాధయః ॥

అను సూక్తి ననుసరించి స్వధర్మమును నిర్వర్తించుకొనుము. ఇవియే నీజీవిత పథమునకు సరియైన మార్గములని వ్రాసితి. ఈసందేశమును నీమనసార గమనించి నీ యౌన్నత్య ప్రభలఁ దిలకించి నీజీవితపథమును సువర్ణాక్షరములతో దిద్దుకొనుము. కోపమా? నీవు సోదరివి, నేను చెలియలిని. నేనిట్లు లిఖించితినని కినియకుము. నీనిష్కల్మష నిష్కళంక జీవితపథమునకు ప్రయత్నించెదవనియే వ్రాసితి. తప్పులను విడనాడి ఒప్పులనుగ్రహించుము. అంతియకాని "చిన్నదాని మాటలకు చేటులేద"ను విధమున నావాక్యములను నీజీవితపథమునకు సరిగానైనవనితోచిన తోడబుట్టినదానవు గనుక ఆలింపుము. అనుసరింపుము.

## శమీ ప్రార్థనము

రామకృష్ణ సీతారామ సోదరకవులు

బహుజన్మపాప జంబాల సంక్షాళన వార్షుకధారా ప్రవాహమెద్ది ?
నానావిహంగ సంతాన పాంథానీక తాపహృచ్ఛాయా ప్రదాతయెద్ది ?
దశమి సాయాహ్న ప్రదర్శిత నిజ విశ్వరూప ప్రభాసు కలాపమెద్ది ?
గారుత్మతోపలకాంతి కలితాతి సూక్ష్మ పత్రామల శాఖికాధామమెద్ది ?

ధరణిజానాయక ప్రియతమము నెద్ది ?
వైరిజనకాననోగ్ర కుఠారమెద్ది ?
యాశమీవృక్ష రాజమహర్నిశంబు
మేలుచేకూర్చుగాత మామిత్రములకు.



### తోకగలబిడ్డ:—

ఈ మధ్య ఉదయగిరి గ్రామములో ఒక వర్తకునికి షుమారు మూడు నాలుగు అంగుళము తోకగల మొగశిశువు జన్మించెను. పదిగంటలకాలము జీవించి మరణించెను. తోకలో కొద్దిగా యెముక మాంసము యెక్కువగను ఉండెను.

### చావకుండుటకు మార్గములు:—

మనుష్యులు చావకుండుటకు తగువగు పద్ధతిని కనిపెట్టుటకు పాశ్చాత్యశాస్త్రజ్ఞులు చిరకాలమునుండి విశేషప్రయత్నములు సలుపుచున్నారు. ఇప్పటికి కొంత అనుకూలమగుటచే కొంతకాలమునకు ఫలించునని నమ్మకము కలుగుచున్నది. శరీరమునందలి స్థితినిబట్టి యెటుల మరణము గలుగునో తెలిసికొనుటకు ప్రపంచ మందంతయు గొప్ప ప్రయత్నములు చేయుచున్నారని, ఛేదితమగు శరీరభాగములను నెలలకొలది ద్రావకముల యందుంచి జీవ శరీరమునందుండునపుడు వుండువాటివలె యుండునట్లు చేయగలిగియున్నారు. ఎలుకలు మొదలగు జంతువులను జీవితకాలముకన్న యెక్కువకాలము జీవింపకలుగజేసినటుల తెలియుచున్నది,

### ఎఱ్ఱ ఇండియను స్త్రీల అధికారములు:—

ఆమెరికాలో రెడ్ ఇండియనులను పూర్వనివాసులలో స్త్రీలకు సర్వహక్కులును నున్నవట. ఇరక్వాయలు అను తెగవారిలో ధనకనకవస్తువాహనము లన్నియు స్త్రీలవే. వంశపరంపరను స్త్రీలను బట్టియే వారెన్నుచుందురు. తెగలకు నాయకులు మున్నగు వారిని స్త్రీలే యెన్నుకోవలెను. వారె యాతనిని బర్తరఫు గూడ చేయవచ్చును. పొలములు, ఇండ్లు, వాకిళ్ళు, తుదకు శ్మశానములతో గూడ నన్నియు స్త్రీలవే కాని పురుషులకు జెందవట. పరిపాలన మంతయు స్త్రీ యధికారమునకు లోబడి యుండును. పురుషుని జంపినదానికంటె స్త్రీని జంపినచో రెట్టింపు శిక్ష. ఇంత యధికారము గల్గియు వారు తమ గృహ నిత్యకృత్యములను చక్కగా నెఱవేర్చు కొందురట. ఈ జాతివారు మెక్సికో కుత్తర

భాగమునందున్నారు. స్త్రీల హక్కుల విషయములో యూరపియనులకు వీరే యాదర్శ జాతిగా నుండిరని ఎడిథావాట్సను కన్య వ్రాయుచున్నది.

### బర్మాలో మణులు దొరకుట:—

ఇటీవల రెండు మహామణులు ఒకానొక గనిలో ఒకటి 1000 కారెట్లు యింద్రనీలమణి, రెండవది 96 కారెట్ల మాణిక్యము దొరికెనని "టైమ్సు" తెలుపుచున్నవి. ఈమణుల ఖరీదింతవరకెవ్వరు నిర్ధారణ చేయలేదు. అమెరికా వర్తకులిరువురు ఇంద్రనీలమణిని సీలు చేసినారు. మాణిక్యము బర్మా దేశస్థుని స్వంతగనిలోదని తెలియుచున్నది. 1919-వ సంవత్సరములో 3 లక్షల రూపాయిల మాణిక్యమొకటి దొరకెను. అప్పటినుండి యింత పెద్దవి దొరకలేదట.

### ఇంగ్లీషు ఛానలు నీదిన స్త్రీ:—

డోవర్ వాసి జాన్ బ్రిక్టన్ అను 20 ఏండ్లకన్య ఇంగ్లీషు ఛానలును 22 మైళ్లు 6 గంటల 2 నిమిషములలో యీది వేగమున రికార్డును స్థాపించినది. ఇంతకుముందు పురుషులచే స్థాపింపబడిన రికార్డుకంటె ఇది 12 నిమిషములు తక్కువ.

### నగ్నాంగనల ఉత్సవము:—

కనడాయందు వస్త్రవిహీనులుగా నుండవలయునను సిద్ధాంతముతో "స్వాతంత్ర్యపుత్రులు" అను సంఘమును స్థాపించిరి. ప్రభుత్వము వస్త్రవిహీనులైన దానికిగా 31 మందిని శిక్షింప దానికి అసమ్మతిని తెలుపుటకు 250 మంది స్త్రీలు ఒక ఉత్సవముగను, 200 మంది మరియొక ఉత్సవముగను దిగంబరులుగా బయలుదేర పోలీసు వెనుకకు తరిమివేసిరి.

### నంబూద్రి స్త్రీల ధైర్యము:—

ఉత్తర తిరువాన్కూరు రాష్ట్రములో గొప్ప కుటుంబములకు జెందినట్టియు, ధనికులైనట్టి కొందరు నంబూద్రి స్త్రీలు బురఖాలను తీసివేసి స్వేచ్ఛగా సంచరించుట అచ్చటివారిలో సంచలనము గలుగజేసినది. ఈ స్త్రీలు నవీన వస్త్రధారణముచేసి అందరకు దర్శనీయములగుస్థలములను దర్శించి నాటకములకు గూడ బురఖాలు లేకపోయిరి. వీరు తిరువాన్కూరు జూనియర్ మహారాణిగారి దర్శనము గావించి సంఘ సంస్కరణమును గూర్చి చాలప్రొద్దు ముచ్చటించిరి. నంబూద్రి స్త్రీలను పాఠశాలలకు బంపి చదివించవలసినదనియు, ఘోషాపద్ధతి నంతము నొందింపవలెననియు జూనియర్ మహారాణిగారు హితబోధ చేసినట్లు తెలియుచున్నది. జనానాలలో నుండి ప్రపంచమేమో యెరుంగని నంబూద్రి స్త్రీలు బురఖాలను తీసివేసి ధైర్యముగా సంచరించుట కిది ప్రథమము.

### మద్రాసు విశ్వవిద్యాలయపు పట్టభద్రులు:—

గత నెల 16 తేదిన సెనేటు భవనములో మద్రాసు యూనివర్సిటీ కాన్వొకేషన్ జరిగెను. అన్ని శాఖలలో పట్టాలు పుచ్చుకొనిన స్నాతకుల సంఖ్య 1820. వీరిలో స్త్రీ గ్రాడ్యుయేట్ల సంఖ్య 130; యం. బీ. బి. ఎస్. తరగతిలో 6 గురు స్త్రీలు, ఎల్. యం. యస్ లో ఇద్దరు, ఎల్. టీలో 35 గురు యువతీమణులు డిగ్రీలు పుచ్చుకొనిరి.



కీ. శే. పాటిబండ సత్యవతీ దేవి:—

కథావశేషమైన సత్యవతీదేవినిగూర్చి సెప్టెంబరు 15-వ తేదీనాటి 'యుగంధర' పత్రిక యిట్లు స్మరించుచున్నది.

"ఈయమ్మ ముప్పదిరెండు సంవత్సరముల యువతి. వితంతువు. ఈనెల పదునొకండవ తేదీని విషజ్వరముచే కాకినాడ ఆసుపత్రిలో మృత్యువాతబడినది. ఈమె బందరు కాలేజీ ప్రొఫెసరు దుగ్గిరాల రామమూర్తిగారి పెద్దకొమార్తె. పాటిబండవారింటి కోడలు. పదునాలుసంవత్సరముల క్రితము ఈమెభర్త బి. ఏ. సీనియరు పరీక్షకుఁ జదువుచు విషజ్వరపీడచే చెన్నపట్టణమున జనరలు ఆసుపత్రిలో మరణించెను. అది మొదలీయమ తన పినతండ్రి కథావశేషుఁడగు దుగ్గిరాల శివరామమూర్తిగారి పోషణప్రోత్సాహములతో విద్యాభ్యాసంగముచేసి బి. ఏ. ఎల్. టి ప్యాసైనది. డిప్యూటీ ఇనస్పెక్ట్రసుగాఁ బనిచేయుచుండినది. శీలమును జాగ్రత్తగ గాపాడుకొనిన మానవతి. ఈయమ్మ పంచభూతములు ప్రకృతిలో లీనమగుగాక!"

కోహినూరు:—

శ్రీయుత ఆకుండి వేంకటశాస్త్రిగారు సుప్రసిద్ధమగు కోహినూరు వజ్రమునుగూర్చి ఇట్లు వ్రాయుచున్నారు.

"ఈవజ్రము నాలుగు శతాబ్దముల క్రితము గోల్కొండ గనులలో దొరకినదని ప్రతీతి. గోదావరి నదీగర్భమునుండి లభించిన పెద్దసైజు వజ్రమని కొందరు చెప్పుట వాడుక. ఈ వజ్రము మొట్టమొదట గోల్కొండనుండి మీర్ జుమ్లాయను యోధునివలనఁ గొనిపోబడి యౌరంగజేబునకు కానుకగా నొసంగబడెను. (ఇప్పుడీ వజ్రము పంచమజార్జిచక్రవర్తిగారి కిరీటము నలంకరించుచున్నది.) అటుపిమ్మట యది పండూరురాజు యధీన మయ్యెను. ఈరాజు కాశ్మీరము, కాబూలు, హిందూదేశములో కొంతభాగము నేలుచుండెను.

మైసూరు యారాజువలన దానిని సంగ్రహించెను. క్రమముగ నది మహమ్మదుషావద్దనుండి నాదరుషా గైకొనెను. నాదరుషా చంపబడిన యనంతర మది యాఫ్ఘనుస్థానము చేరెను. అదృష్టము పట్టుటకును, రక్షణము కలుగుటకును కారణమగు నీ వజ్రముతో, నాదరుషావారసుడగు షాషూజా యొకప్పుడు దేశమును వీడి పారి పోగా పంజాబుసింహమని పొగడ్తగనిన రంజిత్ సింగు షాషూజాను తలదాచుకొన గల్గెను. రంజిత్ సింగు షాషూజాను బాధించి యీకోహినూరును యతనివద్దనుండి సంగ్రహించెను. రంజిత్ సింగు వంశీయులలో నొక డును వారసులలో నొకడును నగు 'దులీప్ సింగు' వద్దనుండి యాంగ్లేయులు సంపాదించిరి. ఆనాటనుండి యది బ్రిటీషుకిరీటము నలంకరించుచున్నది. ఈ కోహినూరు విలువయెంత యుండును? దీని విలువ యింతయని నిర్ధరించుట యెవ్వరికిని సాధ్యముకాదు. ఒక శతాబ్దముక్రింద దాని విలువ 2,000,000 పౌనులుండునని కొందరు మదింపువేసిరి. ఈవిలువ కోహినూరు వజ్రమును తీర్చి కోయకపూర్వము. తేజోరాసియగు నీ వజ్రము మొదట చక్కని పలుకలుదేరి యుండలేదు. ఈదేశమున దానిని తీర్చికోసిరి. కాని యాకోత నేర్పరి యగువాని పనివానితనమును వెల్లడింపక కొంతమోటుగ నుండెను. అందువలన దానియందమునుగూర్చి విన్న వారు దానిని కన్నంతనే నిరుత్సాహులైరి. దానిని తీర్చి కోయుట 75 వత్సరముల క్రితము జరిగెను. ఈకోత యనేక మాసములు పట్టెను. అప్పటికి దానికి చక్కని ఆకారము, స్వచ్ఛతేజప్రకాశము, అందము యను నీ గుణములు కల్గెను. ఇప్పటి దాని విలువయెంతయని మదింపు వేయవచ్చునో యెవరికెఱుక?"

అమ్మవార్లు:—

"అహింసాపరమోధర్మః" అను శీర్షికక్రింద శ్రీయుత కేసరి సుందరరామ శర్మగారు సెప్టెంబరు 14–వ తేదీనాటి 'స్వతంత్ర' పత్రికలో నిట్లు వ్రాయుచున్నారు.

"సర్వలోకరక్షకుడైన పరమేశ్వరుని దివ్యమహిమను మరచి ఈశ్వరునికంటె వేరగు క్షుద్రశక్తులు కలవను నమ్మికకు లోనయి రానురాను దినమునకు ఇద్దరు, ముగ్గురు శక్తుల కల్పించుచున్నారు. వానిలో కొన్ని నామముల నిట నుదహరింపుచున్నాను. పోలేరమ్మ, అంకమ్మ, కాలెమ్మ, మహాలక్షుమ్మ, బుట్టమ్మ మున్నగు అమ్మవార్లును; కదంబరాయుడు, తూముమునీశ్వరుడు మున్నగు మునీశ్వరులయొక్కయు బొమ్మ లచ్చటచ్చట చెట్లక్రింద వేనవేలు కన్పించుచున్నవి. వాటి యుత్సవములయందు నెలకొక పర్యాయమయినను స్నానమాచరించని దురాచారులగు స్త్రీ పురుషులకు తప్ప ఇతరులకు దేవత లావేశమురారు. ఇటీవల కొందరు యుత్తములే ద్రవ్యార్జనాశక్తిచేనయినను, లోకుల భయభ్రాంతచిత్తులుగ జేయువలయునను దురుద్దేశ ముతోనయినను ఆవేశము వచ్చినట్లు నటించుచున్నారు. వారు అట్లు ఆవేశమువచ్చి నటించినపుడు 'నాకు మేకలు కావలె, దున్నలుకావలె'యని చెప్పగనే వారి మాటల ప్రకారము నోరులేనిజంతువుల జంపుచున్నారు. ఆహా! యెంతటి అజ్ఞానము! అమ్మవార్లను పూజించుటచే అంత హానిలేదుగాని జీవహింస మున్నగు దురాచారములు చాల హానికరములు. అమ్మవార్లు భక్తిచే పత్రపుష్పాదులచే పూజించి

ఫలములు నైవేద్యము పెట్టిన సంతసించరా? భక్తిలేక యెన్నిజంతువుల బలియిచ్చిన నేమి లాభము? 'పత్రంపుష్పం ఫలం తోయం' యని భగవంతుడు గీతయందు చెప్పియుండలేదా?"

## దోమలు — మలేరియా:—

అనువిషయమును గూర్చి సెప్టెంబరు 'కౌమోదకి' పత్రికలో నిట్లు ప్రచురితమైనది.

"మలేరియా జ్వరము దోమలవలన గలుగునని సాధారణముగా వాడుకలోనున్న విషయము. అయినను అన్నిదోమలు రోగకారులు కావట. దోమలలో అనాఫలిస్ అనియు స్టిజోమియా యనియు రెండువిధములుగలవనియు వానిలో అనాఫలీస్ దోమయే రోగకారియనియు బొంబాయి మునిసిపాలిటీ అసిస్టెంటు హెల్తు ఆఫీసరుగారు తమ అభిప్రాయమును వెలిబుచ్చియున్నారు. అనాఫలీసు దోమ మన శరీరముమీద వ్రాలునప్పుడు తనతలపైన నిల్చుకొని రక్తమును పీల్చునట్టిది. స్టిజోమియా దోమ ఆలాగుచేయదు. ఈ వ్యత్యాసమునుండి రెండువిధములగు దోమలను గుర్తింప వచ్చునట. ఇలస్ట్రేటెడ్ వీక్లి ఆఫ్ ఇండియా పత్రికా సంపాదకులు ఈవిషయమై వ్రాయుచు అనాఫలీసు దోమలుగాని స్టిజోయాగాని క్యూలెక్సు దోమలుగాని మరియేపేరు పెట్టబడిన దోమలుగాని దోమలన్నియును నమ్మరానివే యని తమ యభిప్రాయమును సూచించియున్నారు."

## ఉర్లగెడ్డలు:—

కాయకూరలలో ముఖ్యమైన ఉర్లగెడ్డలను గూర్చిన ఈక్రిందివిషయములు ఆగష్టుమాసపు 'ఆరోగ్యప్రకాశిక'నుండి ఎత్తివ్రాయబడినవి.

కాయగూరలలో ఉర్లగెడ్డలు ముఖ్యమైనవి. ఇవి మిక్కిలి సులభముగా యెల్లప్పుడును దొరకును. కొన్నిరోజులు నిలువయుండినను చెడిపోవు. సరిగా వీనిని తయారు చేసినచో కడు శీఘ్రముగానే జీర్ణమగును. వీనిలో కార్బో హైడ్రేటులు చాలహెచ్చుగా నున్నవి. కాన నివి అధికమగు పుష్టినిచ్చును. వీనిలో క్షారసత్వమును కలిగించెడు లవణములునుగూడ హెచ్చుగానున్నవి. వీనిలో ప్రోటీను తక్కువగా నున్నదని కొందరందురు గాని మిక్కిలి కష్టపడి పనిచేయువారికి గూడ పూర్తిగా చాలినంతటి ప్రోటీను వీనిలో లేకపోలేదని డెన్మార్కు దేశపు సుప్రసిద్ధపరిశోధకుడగు హిన్డెడిగారు ప్రకటించిరి. డెన్మార్కు ప్రభుత్వమువారి ఉత్తరువు ప్రకారము ఉర్లగెడ్డలను గూర్చి అతడు దీక్షగా పది ఏండ్లు పరిశోధనలను గావించెను. అపుడు చాల తెగలవారిచేత మిక్కిలి బలువుపనులను చేయించుచు పెక్కు నెలలపాటు వారికి ఉర్లగెడ్డలను కొవ్వుపదార్థములను మాత్రమే పెట్టుచుండెను. ఉర్లగెడ్డలు మనుష్యులకు ప్రధానాహార మగును, వీనికి తోడు పళ్లనైనను, కూరలనైనను, వెన్న,

మీగడ, పాలు, పెరుగు, మున్నగు కొవ్వు పదార్థములను, రొట్టెలను మాంసకృత్తులుగల గ్రుడ్లు పాలు ధాన్యములు అపరములు మున్నగువానిని గూడ తినుచున్నచో సమగ్రాహార మగును. యూరికుయాసిడు యేర్పడినపుడు ఉర్లగెడ్డలు మంచి గుణమిచ్చునని యిపుడు స్థిరపరుపబడెను. ఈ వ్యాధి కలవారికి ఉర్లగెడ్డలను కూరలను వెన్నపు మాత్రమే పెట్టెదరు. అట్టివారు ఉర్లగెడ్డలను విస్తారముగా తినుట అవసరము. ఈరీతిగా తినినచో యూరికుయాసిడు కరిగిపోయి మూత్రము గుండా వెడలిపోవును. వీనిని నూనెలోగాని నేతిలోకాని వేయించినచో అజీర్ణమును కలిగించును. వీనిని నీళ్లలో ఉడికించవలెను. లేదా బాళీలోవేసి ఉప్పునీళ్ళు చల్లి మూతపెట్టవలెను. మూత పెట్టుట వలన ఆవిరి పైకిపోదు. ఉడికించ దలచినచో మొదట నీళ్లుమరగనిచ్చి బాగుగా మరగగానే ముక్కల నానీళ్లలో వేయవలెను. అపుడు నీళ్లు మరుగుచున్న శబ్దము నిలిచిపోవును. ఆశబ్దము మరల బాగుగా వినబడువరకును మూత పెట్టి పొయిమీదనే యుంచి ఆశబ్దము వినబడగానే క్రిందకుదింపి మూత తీసి పొయిలోని మంటదగ్గిర 20–30 నిమిషము లుంచినచో బాగుగాఉడుకును. వానిలోని ప్రాణసత్తులు పోవు. నీళ్ళు తగు మాత్రముగా పోసి యిగురనియ్యవలెను. కాని వార్చగూడదు. సిబ్బినిగాని, మరియొక గిన్నెనుగాని, మూత పెట్టగూడదు. ఇటుల ఉడికించినచో మిక్కిలిగా మెత్తపడవు. గాన, పళ్లతో కొరికి నమిలి తినుటకు అనుకూలముగా నుండును. బాగుగా ఉడికిన పిమ్మటనైనను నీళ్లు యిగిరి పోవుటకు మూత వేయకుండుటయే మంచిది. లేదా పలచని గుడ్డను కప్పదగును."

ఈగలు:—

శ్రీయుత పాలెపు సుబ్బారాయుడువర్మగారు ఆగష్టుమాసపు 'అగ్నికులప్రభోధిని' పత్రికలో వ్రాసిన ఈగలను గూర్చిన ఈ క్రిందివిషయములు స్త్రీలు ప్రత్యేకముగ గమనింపదగినవి.

ఈగలు కలరారోగియొక్క వాంతిభేదులను తినినప్పుడు వానిలోనుండు కలరాపురుగులు వాటి కడుపులోచేరును. అవి అక్కడ చావవు. 10, 20 దినములవరకును బ్రతికియుండును. ఈగలుమలము విడిచినపుడును వాంతిచేసికొనునపుడును వానిగుండా బైటికివచ్చును. ఇట్లు బైటికివచ్చినతరువాతకూడ అవి కొన్నిదినములు బ్రతికియుండును. ఈగలు మన ఆహారపదార్థములపై వ్రాలి వాంతిభేది చేసుకొనునపుడు వాటికడుపులో నున్న కలరాపురుగులు బైటికివచ్చి మన ఆహారపదార్థములలో చేరును. అట్టి ఆహారము తిన్నవారికి కలరా వచ్చును. కనుకనే కలరా యూరిలోనుండునపుడు ఈగలవిషయము అతిజాగ్రత్తగ నుండవలెను. ఈగలు మూగినపదార్థము లేవియును తినరాదు. సామాన్యముగ జనులు ఈవిషయమును గమనింపక ఈగలమూగిన చద్దిఅన్నమును తినుచుందురు. ఇట్లుచేయుట గొప్పతప్పు. కలరాయుండుకాలమున ఈగలు మూగిన యన్నమును ఎన్నడును తినరాదు. ఈ విషయమును అందరును చక్కగ గమనించవలెను. ఇంతమాత్రమేకాదు.

ఊరిలో కలరా వుండునపుడు ఈగలుపడిన పాలు త్రాగకూడదు. పాలలో ఈగలు పడినపుడు కలరా పురుగులు దానిలోచేరును. అట్టిపాలు త్రాగినవారికి కలరావచ్చునుగాన, అట్టిపాలు ఉపయోగింపరాదు. కలరా ఉండుసమయమున మనము తినుపదార్థములను ఈగలు మూగకుండునట్లు చక్కగ మూసియుంచవలెను. పాలు, నెయ్యి, మజ్జిగ ఇట్టివానినికూడ ఈగలు పడకుండునట్లు చక్కగ మూసియుంచవలెను. ఈవిషయమును ఎప్పుడును మరవకూడదు. ఈగలు పెట్టురోగము కలరామాత్రమే కాదు. ఇవి సన్నిపాతజ్వరము కూడ తెచ్చును. ఈజ్వరముగలవారికి భేదులగును. ఈభేదులలో జ్వరముగ గలిగించు పురుగులుండును. ఇవియున్ను కలరాపురుగులవలెనే మిక్కిలి చిన్నవి. కంటికి కనపడనంత చిన్నవి. ఈగలు ఈరోగుల భేదులపై వ్రాలినపుడు యీరోగమునుగలిగించు పురుగులు వానికాళ్ళకు అంటుకొనును. అవి ఆహారపదార్థములపై వ్రాలినపుడు యీపురుగులు ఆహారపదార్థములలో చేరును. అట్టిపదార్థములు తిన్నవారికి ఈరోగము వచ్చును. ఈగలు క్షయరోగమునుకూడ తెచ్చిపెట్టును. క్షయరోగి యెప్పుడును దగ్గుచూ కఫము, యెంగిలి, ఉమ్మివేయుచుండుట అందరికిన్ని తెలిసియున్నవిషయమే. ఈ కఫములోను, ఎంగిలిలోను యీ క్షయరోగమునుగలిగించు పురుగులుండును. ఈ పురుగులుకూడ కంటికి కనబడనంత చిన్నవే. సామాన్యముగ ఇట్టిరోగములను కలిగించు పురుగులన్నియును మిక్కిలి చిన్నవిగ నుండును. ఈగల కాళ్లకు వేలకొలది అంటుకొనునంత చిన్నవిగ నుండును. ఆయాజాతి పురుగులు ఆయారోగములనే కలిగించును. కలరాపురుగులు కలరారోగములనే కలిగించును. క్షయరోగమును గలిగించుపురుగులు క్షయరోగమునే గలిగించును. ఈగలు అన్నిరోగములను తీసికొని రాగలవు. కావున వానిని మనయింట చేరనీయరాదు.”

# హెచ్చరిక

చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాదుగారు

భువరమందున నోడిభయమంది వచ్చిన విభుని ఛీయనె నొక్కవెలది మున్న,
ఖడ్గంబుచేబూని కనుల నిప్పులురాల రణరంగ మొనరించె రమణియొకతె,
తనభుజాబలమున తన విభు రక్షించి పగతుర బరిమార్చెపడతి యొకతె,
తనకుమారు నొసంగి తన ప్రభు రక్షించి అతని వంశము నిల్పెనతివ యొకతె.

అట్టి సత్కృత్యము లొనర్చి అధిక యశము
గాంచి చనినారు తొల్లిటి కాంతలెల్ల,
ఏలనో నేడు యీలీల బేలలగుచు
అణగి యున్నారలక్కటా అతివలిపుడు.

# వనితాలోకము

**శ్రీమతి లక్ష్మీబాయి కన్య:—**



లక్ష్మీబాయి కన్య.

బొంబాయి ప్రాంతమున వలస నెలకొన్న ఆంధ్రుల యింటి ఆడుపడుచు. బొంబాయియందు కంట్రాక్టరుగానున్న రాజన్నబలో బ్యాంకలు గారి కుమార్తె. ఈసంవత్సరము బొంబాయి విశ్వవిద్యాలయమువారి మెట్రిక్యులేషను పరీక్షలో జయము గాంచినది. ఈప్రాంతమున నున్న ఆంధ్రవనితలలో ఈపరీక్షలో జయము గాంచుటకు ఈమెయే పురోగామిని. పూనాలోని హిందూ బాలికల ఉన్నత పాఠశాలలో విద్య నభ్యసించినది. పరీక్షలో నీమెకు గలిగిన జయమునకు ముఖ్యకారణము ఈమె మేనమామగారగు నారాయణరాజన్నగారి నిరంతరకృషియే. ఈమె కళాశాల విద్యకూడ నేర్చుటకు కుతూహలపడు చున్నది.

శ్రీమతి బాలాంత్రపు మహాలక్ష్మీ సుందరమ్మ గారు:—



బాలాంత్రపు మహాలక్ష్మీ సుందరమ్మ.

ఈమె కాకినాడ నివాసిని. మహారాజశ్రీ బాలాంత్రపు సుందరరామయ్య పంతులుగారి పుత్రిక. ఈమె జననము 20—10—1914-వ సంవత్సరమున. అవివాహిత. ఆంధ్రవిశ్వవిద్యాలయమువారి యాజమాన్యమున నిర్వహింపబడు ప్రాచ్యభిరుద పరీక్షలలో 'విద్యాప్రవీణ' అను సంస్కృత సాహిత్యపరీక్ష, ఎన్ట్రెన్సున కృతార్థురాలైనది. సంస్కృతభాషయందు ఆంధ్రదేశమున ఈపరీక్షలో కృతార్థురాలై సర్టిఫికేటు పొందుటకు ఈమెయే ప్రథమురాలు. హిందీప్రచారక సంఘమువారి పరీక్షలో రాష్ట్రభాషాపరీక్షవఱకు జయముపొందినది. ఇంగ్లీషులో కాశీవిశ్వవిద్యాలయమువారి ఎంట్రెన్సు పరీక్షకు ప్రయివేటుగా చదువుచున్నది. తెనుగున మంచి ప్రవేశముగలదు. బహుభాషలునేర్చిన ఆధునికాంధ్ర స్త్రీరత్నములలో నీమెయొకతె.

శ్రీమతి రుక్మిణి:—



రుక్మిణి.

బళ్లారిపట్టణమున నొక పేదవైశ్యకుటుంబమున జన్మించినది. పిన్నతనముననే తలిదండ్రులను పోగొట్టుకొన్నది. ఆమె కొకయన్న మఱియొక సోదరియు గలరు. రుక్మిణిఆమువ్వురిలో చిన్నది. చేసికొన్న పెనిమిటి దేశాంతరగతు డయ్యెను. ఎంతకాలమునకు ఆతనిజాడలు తెలియవచ్చినవికావు. దీనావస్థయందున్న రుక్మిణిని చేరదీసి శ్రీయుత రావు సాహేబు పూరకర కృష్ణశెట్టిగారు (బి.ఏ, బి.యల్) ఆమెను మద్రాసు ట్రిప్లికేను బాలికాపాఠశాలయందు చేర్పించగా ఉన్నతవిద్యబడసినది.

శ్రీమతి జాస్తి సీతామహాలక్ష్మి దేవిగారు:—



జాస్తి సీతామహాలక్ష్మి దేవి.

ఈమె చెన్నపురిలో న్యాయవాదవృత్తి నవలంబించియున్న శ్రీయుత జాస్తి సాంబశివరావుగారి (బి. యే. బి. యల్) పత్ని. శ్రీయుత సూరపనేని వెంకయ్య చౌదరిగారి జ్యేష్ఠపుత్రిక. ఈమె చెన్నపురిలో మేరీరాణి కళాశాలలో ఇంటరుమీడియేటు తరగతిలో చదువుచున్నది. చెన్నపురి కమ్మవిద్యార్థి సంఘమునకుసంయుక్తకార్యదర్శినిగ ఇటీవల ఎన్నుకొనబడినది. కమ్మకులములో కళాశాలయందు విద్యనభ్యసించుచున్న వనితామణి ఈమె యొక్కతియే.

శ్రీమతి శిఖరము కమలాంబగారు:—



శిఖరము కమలాంబ.

వైశ్యయువతి. ఆంధ్రమున మంచిప్రవేశముగలదు. మంచివ్యాసకర్త్రి. ఈమె వ్యాసములు తఱుచు 'వాసవి' పత్రికారాజమున ప్రచురితము లగుచుండును. ఒకప్పుడు రాజమండ్రి వైశ్యసేవాసదనవార్షికోత్సవమునకు అధ్యక్షురాలిగానుండి "మాతృశక్తిచేతనే ప్రపంచము ఉన్నతినందవలసియున్నది. మాతృస్వరూపిణులగు స్త్రీలు విద్యాహీనలుగను, జ్ఞానహీనలుగను, బలహీనలుగను ఉన్నప్పుడు, దేశము క్షీణగతి నొందక ఉన్నతస్థితికి రాగలదా?" అని ఈమె పల్కిన వాక్యములు ఈమె వివేచనాశక్తికి నిదర్శనములైయున్నవి.

శ్రీమతి సుబ్బమ్మగారు :—



సుబ్బమ్మ.

ఈమె బళ్లారి పట్టణమందొక యుత్తమ వైశ్యకుటుంబమునందు 1911—వ సంవత్సరమున అక్టోబరు మాసము 26—వ తేదీని జనన మొందెను. చిన్ననాడె తండ్రి పరలోకగతుడయ్యెను. పతిని గోల్పోయి సుబ్బమ్మ తల్లి అధ్యాత్మిక చింతలో మునింగెను. శ్రీయుత దర్శి చెంచయ్యగారి సాయమున ఆమె మదరాసు దివ్యజ్ఞానపాఠశాలయందు విద్యనభ్యసించుచున్నది. విద్యబడసి కులమును వెలయించు ఇట్టి కాంతామణులు పరశ్శతములుగా బయలు వెడలినప్పుడే దేశమునకు కళ్యాణము కలుగును.

# గ్రంథవిమర్శనలు

**పువ్వులతోట :—**

ఆంధ్రకవితారామసీమల పొడసూపిన ఒక నవ్యకుసుమము. కర్త సన్నిధానము సూర్యనారాయణ శాస్త్రి. ఈతడు నూతనయుగప్రవర్తకులగు కవులలో నొకడుకాడు. కాని అట్టివారి శుభాగమనమును తెలుపు నొకానొక తొలిచుక్క. 'పువ్వులతోటల'లో నవత్వమును, మహత్వమును కల కవిత్వమున్నది. ప్రాతపుంతలుకూడ లేకపోలేదు. ఇందలి 'ఆశ్రమప్రాంతము' లట్టి పాతవడిన కవితావస్తువు. కవి దానిని వెనుకకు నెట్టి 'పెలయేఱు' ముందు వ్రాసియుండెనేని నేటి రసార్ద్రహృదయుల కానందముగ నుండెడిది.

"... ... నేను కవిని
ప్రకృతి సౌందర్య చిత్కారోపాసికుడను
సుకృతవశమున నిన్ను జూచుట లభించె."

అని సెలయేరులో నత దుర్దిక్షుఁడై మాట్లాడినాడు. అందు నిజమైన కవిత్వమున్నది. 'అభిలాష' యను గీతములో కవి తన కవిత్వ మతిమార్దవముగా వెలయించినాడు. ఇందలి 'కోకిలాగీతము' నిజముగా కోకిలా గీతమనియే చెప్పవలెను. ఇది కవిని ఉన్నతపథమునకు తీసికొనఁ బోవజాలి యున్నది. కవి ప్రకృతిప్రియుడని 'సినీమాప్రదర్శనము' అను గీతము చాటుచున్నది. అందొకవిధమగు నాటకీయరచన కాన్పించి త్వరగ త్వరగ మనస్సును లాగికొని పోవుచున్నది. మన మున్నది పారతంత్ర్యాంధకారబంధురమగు కాలమున. ఈలాటి సమయమున యువకవులు కంఠమెత్తి స్వతంత్రగానము చేయవలెను. సూర్యనారాయణశాస్త్రిలో నాంధ్రత్వమున్నది. 'ఆంధ్రిడా', 'జన్మభూమి' అనుగీతములట్టి భావోదయమునే కల్గించుచున్నవి. 'స్వప్నదృశ్యము', 'విలాసిని' మొదలగు కొన్ని కావ్యకుసుమములు కేవలము ప్రాతపుంతల తొక్కుచు రుచివిస్తారమును పుట్టింపకున్నవి. 'పువ్వులతోట'లో కెల్ల 'పుష్పాపచయము' తలమానికము. అందలి రసార్ద్రిలలితభావములు మనోహరములైనవి. 'తృణకణములు' అను గీతమాలిక యోచించి చదివినచో రసకణమనియే తేలును. ఇట్టి మనోహర కావ్యములను మఱికొన్ని వ్రాసి ఈకవి ధన్యతగాంచు గావుతమని కోరెదను.

—పెమ్మరాజు రాజగోపాలము బి. యె.

## విజయభాస్కరవిజయము:—

నిరూపకనవల. గ్రంథకర్త్రి శ్రీమతి పులవర్తి కమలావతీదేవిగారు. డెమ్మీ ఆక్టావో సైజున 82 పుటలు, 19 ప్రకరణములు. లలితపదభూయిష్టమై మనోహరమగు కల్పనాచమత్కృతులచే నలరారుచున్నది. పురాతనకవిప్రోక్తపద్యములు చదువరుల కానంద ముట్టిపడునట్లు మధురతరములగు వచనరూపములుగా నచ్చటచ్చటఁ బొందుపరుపబడినవి. కరుణారసము ప్రధానము. శృంగారాదులుకూడ ప్రకరణానుగుణ్యముగ నచ్చటచ్చటఁ బొందుపరుపఁబడినవి. "స్త్రీజను లబలలయ్యు సబలలగుచుఁ దమ మానమును దామే కాపాడుకొనవలయును. భర్త యెన్నియిక్కట్లు పెట్టినను స్త్రీజను లోర్చియుండిన దైవము వారికి తోడ్పడఁగలఁడు. భర్తచే విముక్తలయ్యు స్త్రీలు మానాభిమానములను వీడక కాలము పుచ్చవలయును. భర్తలు భార్యలను తూలనాడి విడనాడి అన్య స్త్రీలంపటులు కాఁగూడదు. దుర్మార్గులకు తుదకు అధోగతియే గతి." ఇత్యాది నీతుల నీగ్రంథ ముపదేశించుచున్నది. ప్రేమయొక్క యుత్పత్తిపరిణామములు చక్కగ వర్ణింపబడినవి. చదువదగిన గ్రంథము. వెల ఒక రూపాయి మాత్రము. వలయువారు కవికొండల వెంకటరత్నముగారు, మేనేజరు, సుదర్శనప్రెస్సు, ఉల్లితోటవీధి, రాజమండ్రి అని వ్రాయునది.

—ఉభయభాషాప్రవీణ బులుసు నరసింహశాస్త్రి.

## విద్యానగరచరిత్రము:—

1903-వ సంవత్సరమున 'జీర్ణకర్ణాటసామ్రాజ్యచరిత్ర' మను పేర విజయనగరసామ్రాజ్యచరిత్రమును అప్పటికి ఉపలబ్ధములైన చారిత్రకాంశముల నన్నిటిని క్రోడీకరించి ఆంధ్రచరిత్రచతురాననులగు శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారు వ్రాసి ప్రచురించియున్నారు. 1911—వ సంవత్సరమున శ్రీయుత కొమర్రాజు లక్ష్మణరావుపంతులుగారు ప్రచురించిన తమ మహమ్మదీయమహాయుగమున విజయనగరసామ్రాజ్యచరిత్ర

మును మఱికొన్ని నూతనాంశములతో ప్రకటించియున్నారు. దానిమీఁదను విజయనగర సామ్రాజ్య చరిత్రమును గూర్చి అనల్పపరిశోధనము జరిగినది. అనేక శాసనములు బయటికి వచ్చినవి. నూతనాంశము లెన్నో తెలియ వచ్చినవి. వానినెల్ల క్రోడీకరించి నూతనముగ విజయనగరసామ్రాజ్యచరిత్రము ఆంధ్రమున వెలయింపవలసిన అవసర మెంతేని గల్గినది. అట్టిపరి శ్రీయుత సీరిపి ఆంజనేయులుగారు 'విద్యానగరచరిత్ర'మును ప్రచురించిరని విని సంతోషించితిని. కాని గ్రంథము చదివిన మీఁదట నాసంతోషము పోయినది సరికదా ఆశాభంగముకూడ గల్గినది. గ్రంథమునంతను బహుశ్రద్ధతో చదివితిని. ఒక్కనూతనాంశముకూడ వారందు చేర్పలేదు. పైగా అతిప్రమాదము లెన్నో దొరలినవి. మచ్చునకు ఒకటి చూపెదను. రెండవదేవరాయలకు (పుట ౧౧౫) స్థానేశ్వరము (ఢిల్లీనగరమున కుత్తరమున యమునకును సట్లెజ్ నదికిని మధ్యభాగమునఁ బ్రసిద్ధినొందినది) మొదలగు రాష్ట్రపాలకులు అంకితులై యుండిరఁట. ఇది నమ్మదగినమాటయేనా? దగ్గఱనున్న ఢిల్లీసుల్తానుల కాదని, మధ్యనున్న బహమనీసుల్తానుల సరకుగొనక స్థానేశ్వరపాలకుఁడు దేవరాయలకు సామంతరాజై యుండె ననుట ఎంతపొసగుబాటు లేనిమాట! విస్తరభీతిని కొల్లలుగనున్న ఇట్టిప్రమాదముల నిక చూపనొల్లెద. చారిత్రకముగా ప్రమాణగ్రంథము కావలసిన ఇట్టివానియందు సారస్వతవిషయమునకూడ నంత ప్రముఖములుగాని వినోదకథలతో పుటలునిండించుట కొనియాడదగినదికాదు. చూడుఁడు పినవీరభద్రుఁడు మొదలగు వారి కథలు (పుట౧౩౯). బొడ్డుచెర్ల చినతిమ్మన వృత్తాంతము తొలుత లోకమునకు చేకూర్చినది చాటుపద్యమణిమంజరి మూలమున. ఆతని విషయమును ఆంజనేయులుగారందుండి గ్రహించియు మూలగ్రంథము ఊబుసైన నెత్తకుండిరి. ప్రామాణికచరిత్రకారు డిట్టిపద్ధతి నవలంబింపఁజనదుకదా! గ్రంథమునందలికొన్నికొన్ని వాక్యముల నిర్మాణము బొత్తిగా బాగుండలేదు. 'ముక్కుతిమ్మనపలుకు ముద్దుపల్కనియునువినికి.' (పుట ౨౬౧) అచ్చుతీరి లోకములోనివారి కనుకలికి చిరకాలముగా అందుబాటులోనున్న ముక్కు తిమ్మన కవిత్వము ముద్దుపల్కని వినికి అని వ్రాయుటలో సారస్యమేమి? ఇట్టిదే 'అల్లసానివానియల్లిక జిగిసొంపఁట' (పుట ౧౫౯) అనుటకూడ. ఇంకను తడవనేల? విద్యానగరచరిత్ర రెండవముద్రణమునకైనను కూలంకషముగ సవరింపబడుఁగాకయని కోరెదను. అచ్చు బైండు అతిసుందరముగనుండి ముద్రాపకుల పనితనమును ప్రత్యక్షీకరించుచున్నవి. గ్రంథము క్రౌను సైజున ౪౦౦ పుటలు. పెక్కుచిత్రపటములుగలవు. వెల రు. ౨-౦-౦. వలయువారు విజ్ఞానవల్లికా గ్రంథమాల, అనంతపురము అని వ్రాయునది.

—ఆంధ్ర శేషగిరిరావు బి. యె.

## వినాయకచరిత్రము:—

ఈగ్రంథమునకు మూలము మార్కండేయపురాణము. మనదేశమునం దాబాలవృద్ధమెల్లరకు నీ వినాయకచరిత్రము తెలిసియున్నదే. అయినను "తదేవకావ్యం నవ్యంభవతి గ్రథనకౌశలాత్" అను న్యాయము చొప్పున బ్రహ్మశ్రీ మారెళ్ల జగన్నాథరావుగారు లలితపదసంయుతమగు శైలితో నీగ్రంథమును రచించియున్నారు. గ్రంథము నందచ్చటచ్చట సరళాదేశము, గసడదవాదేశము మున్నగు వ్యాకరణకార్యములు సేయబడలేదు. కొన్నితావులందుమాత్రము అయ్యవి మన్నింపఁబడినవి. ఇట్టిభేదముంబట్టి గ్రంథకర్త గారిపై దోషారోపణము సేయుట యసమంజసమగును. శ్రీవారు పీఠికలో వ్రాసినట్లు ముద్రణాజనితదోషము

లిందుఁజెప్పఁబున్నవి. పునర్ముద్రణమునందు వానిని సవరింపనగును. గ్రంథము క్రౌను సైజు 27 పుటలు. వెల ప్రతి ఒక్కంటికి 3 అణాలు. వలయువారు గ్రంథకర్త పేర బరంపురము వ్రాయునది.

—విద్వాన్ వేటూరు ప్రభాకరశాస్త్రి.

## సంతాననిరోధము—గుణదోషవిచారణ:—

గ్రంథకర్త శ్రీయుత జరుగుమిల్లి సాంబశివరావుగారు బి.ఏ. నేడు ప్రపంచమునంతను కలగుండు వెట్టుచున్న సంతాననిరోధప్రచారము అందలి గుణదోషములు విరివిగ వర్ణించు గ్రంథము. పాశ్చాత్యపద్ధతుల వలని సంతాననిరోధముచే గర్భస్రావము, వంధ్యాదోషము కలుగుననియు; రబ్బరు గొట్టములను, స్పంజిని అమర్చుకొనుట ఏహ్యమనియు శ్రీవారు చక్కఁగ వివరించిరి. పాశ్చాత్యవిధ్యానమైన సంతాననిరోధము వీరు సుతరాము ఒప్పుకొనరు. వాత్స్యాయనుడు, మనువు మొదలగు హిందూశాస్త్ర వేత్తల పద్ధతులు నిరపాయకరములగుట వీరికి సమ్మతము. హిందువుల దాంపత్యధర్మావలంబనములోనే సంతాననిరోధమునకు నిరపాయకరములగు పద్ధతులు ఇమిడియున్నవని సాంబశివరావుగారు చెప్పుచున్నారు. ఇదినిజము. గ్రంథము మంచి జిజ్ఞాసను రేపుచున్నది. ఆంధ్రమహాజను లెల్లరు దీని నొకసారి పఠించి యథోచితమగు లాభమును పొందుదురు గాక! క్రౌను సైజున 52 పేజీలు. మీచు కాగితములు, రేపరుఅట్ట. ధరమాత్రము 0-8-0 అణాలు. గ్రంథము దొరకుచోటు జరుగుమిల్లి సాంబశివరావు బి.ఏ; 32 అక్బరుసాహేబు వీధి, ట్రిప్లికేను, మద్రాసు.

—ఆలమూరు రాజగోపాలరావు బి.యె.

## మ్యారేజి ప్రహసనము—

గ్రంథకర్త గుండు రాఘవదీక్షితులుగారు. తెనాలి రజతముద్రణాలయమున ముద్రితము. క్రౌను సైజు. రేపరు బైండు, 48 పుటలు. వెల 0-6-0 అణాలు. ఈ ప్రహసనమున కథ ఒక్కటిగాదు. వివిధపరిస్థితులను తెలుపు ఆఱు చిన్నరంగముల సంపుటి. గ్రంథము యొక్క ముఖ్యోద్దేశము ప్రస్తుతము మనదేశమందున్న వివాహపద్ధతులయందలి లోపములను దెలుపుటయే. గ్రంథమునందలి వివిధరంగములుర సవంతములుగనుండి నవ్వు పుట్టింపజేయుచున్నవి. గ్రంథకర్తకు సంభాషణములయందును, ఘటనలయందును ప్రకృతిని బింబించునట్లు చేయు చతురతకలదు. కాని వానిని నిర్వహింపగల మంచిశైలి పట్టుబడలేదు. గ్రంథము వాడుక శైలిలో వ్రాయబడినది. కాని అది నేటివాడుక శైలివలె పక్వస్థితి నందలేదు. పలుతావుల పెటుకగు గ్రాంథికముతో మిశ్రితమై సాఫుగాకయున్నది. కాని అచ్చటచ్చట వాడబడిన జాతీయములును, సామెతలును శైలికి ఒకవిధమైన అందమును గొనితెచ్చినవి. మితిలేని పెండ్లి ఖర్చులు, చదువుకొన్న మగనికి చదువురాని భార్యకు కలుగు వైమనస్యము, బాల్యవివాహములవలని చెడుగులు, కన్యావిక్రయాచారము మొదలగు దురాచారములిందు ప్రస్తావింపబడినవి. దురాచారములను తొలగించుటకు ప్రహసనములు పెట్టినదిపేరు. అగుట గ్రంథకర్త మఱికొన్ని యిట్టి ప్రహసనములరచించి సంఘసంస్కరణమునకు యథాశక్తిని తోడుపడుగాకయని కోరెదము.

—వేటూరు కామేశ్వరరావుగారు బి. యె.



ఆశ్వయుజమాసము :—

వసంతము ఋతురాజమని కవులందరు. భావోన్మాదులగువారి కది యట్టిద కావచ్చును. కాని నిదానించి చూచు తత్త్వవిమర్శకులు అత్యంతమధురపంచమస్వరపూర్ణతాభవ్యమగు వసంతముకంటె భావిఫలోదయధన్యమగు శరత్తునే ఎక్కువగా నెన్నుదురు. రెల్లుపూవువంటి తెల్లందనము, మలయచందనమువంటి చల్లందనము గలిగి శారదజ్యోత్స్న మనోహరమై వెలయును. అందును దానియందము శరదృతువున ప్రథమమాసమగు ఆశ్వయుజమునందే చూడవలయును. రాబోవు మహాగ్రీష్మతాపమును తెలుపు మధుర మధుమాసమునాటి కించిదుష్ణముగాని, జీవిని ముజ్జడుగ నొనర్చు ప్రావృట్కాలము నాటి కాళమేఘములుగాని ఆశ్వయుజమాసమున కానరావు. పైగా ఆమాసపు వెన్నెల నవత్వము నొంది, వికసన్నవకైరవగంధబంధురోదారసమీరసౌరభముదాల్చి అంబర పూరితమై జనుల నాకర్షించును. అయితే శరదృతువున ద్వితీయమాసమగు కార్తికమున మాత్రము చంద్రిక కిట్టిమనోహరత యుండదా? అని ప్రశ్నింపవచ్చును. ఉండును. కాని అప్పటికే శారదజ్యోత్స్నతో జనులకు సుపరిచయము కలుగును; ఆ చంద్రికయు ముదురు పాకమున బడును. ముదురుపాకముకంటె లేతపాకమును, మలిపండుకంటె తొలిపండును రుచిరములుకదా! అగుటనే కార్తికకౌముదికంటె ఆశ్వయుజమాసపు వెన్నెల అతి మనోహరమైన దనుట. మనోహరజ్యోత్స్నాపులకితమగు ఆశ్వయుజమాసము దేవీనవ రాత్ర్యుత్సవములతో ఆరంభమగు చున్నది. లోకకంటకములగు రాక్షసదుర్మృగములను సంహరించి జగదుపకృతి గావించి జగద్ధాత్రియైన—స్త్రీదేవత—దుర్గను పూజించుటతో ప్రారంభమగు ఈమాసము స్త్రీజనాభ్యుదయము నాకాంక్షించు మహనీయుల కెల్లరకు మానసానందకరమైనదికదా! విజయవతియగు స్త్రీదేవతపూజతో ప్రారంభమగు

నీమాసము రణరాగయగు నొక శ్రీవిజయస్మరణముతో ముగియుచున్నది. అద్దము పిడి ముట్టిన అలయు తనసుకుమారపాణితలమును, తంత్రీవినోదము తడవు సైపని నును మెత్తని తన వ్రేళ్లను వీరకృత్యములకు అనువు పఱచి వీరాలోకదుర్లోకయై నరకాసురుని గజిబిజినొందించిన సత్యభామ వీరత్వమును స్మరించు నరకచతుర్దశి, దీపావళ్యమావాస్య లతో ఆశ్వయుజము అంతమునొందుచున్నది. నిరంతరము నిసర్గరమ్యమనోహరజ్యోత్స్న, ఆద్యంతములందు శ్రీవిజయప్రశంస గల ఈమాసము నిత్యయౌవనులగు రసార్ద్రులకు, ఉచితజ్ఞులగు శ్రీయుద్యమాభిమానులకు "డెందమునకు వాక్కునకు అందరాని అధికతర మైన ఆనందము" సంపాదించునుగదా!

దుర్గపూజా తత్త్వము:—

'శ్రీ' అనుశబ్దము చెవిని బడుటతోడనే మాతృస్వరూపము మానసవీధిని పొడ కట్టును. అయితే శ్రీని మాతృస్వరూపమున పూజింపక రోషకఠినమగు హాసము, నిప్పులురులు కన్నులు, వికటకుటిలభ్రుకుటినటనగల ఫాలఫలకము, మారణసాధనములు ధరించిన హస్తములు గల శక్తిస్వరూపమున పూజించుటలో నర్థమేమి? శ్రీయొక్క మాతృస్వరూపము సర్వసాధారణమైనది. తత్కాలోచితములగు తీయనిపలుకులును సర్వసాధారణమైనవే. పుటపాకప్రతీకాశమగు ప్రేమస్వరూపము స్నేహముచేతనే పిచ్చల మగును. శ్రీయొక్క శక్తిస్వరూపము అసాధారణమైనది. తత్కాలోచితములగు తీండ్రగల వచనములును అసాధారణమైనవే. అప్పటి ఆమె ఔర్వశిఖికంటె దుర్నిరీక్ష మగు శక్తిస్వరూపము ఆరాధనము కోరును. అగుటనే ఆమె అరూపమున కొలువబడు చున్నది. ఆమె వేదకాలమున ఉషస్సు అని పిలువబడి యుండుగాక; పౌరాణికయుగ మున త్రికళ అని పేర్కొనబడియుండుగాక; ప్రస్తుతకాలమున దుర్గ అనునామముచే కొలువబడుచుండునుగాక! ఎప్పుడు ఏ పేరున పూజింపబడిన నేమి? అవి శ్రీయొక్క శక్తిస్వరూపమున కీయబడిన నామాంతరములే. ఆమె కాశీలో విశాలాక్షి కావచ్చును; నైమిశమున లింగధారిణి కావచ్చును; ప్రయాగమున లలిత కావచ్చును; గంధమాధనమున గంధేశ్వరి కావచ్చును; ద్వారకయందు రుక్మిణి కావచ్చును; బృందా వనమున రాధిక కావచ్చును; మధ్యదేశమున క్షేమంకరి కావచ్చును; కంచిని కామాక్షి కావచ్చును; మధురలో మీనాక్షి కావచ్చును. ఎక్కడ ఏమైననేమి? అవి శ్రీశక్తి స్వరూపమున కాపాదింపబడిన రూపాంతరములే. ఈయబడిన ఏనామాంతరముననేమి, ఆపాదింపబడిన ఏరూపాంతరముననేమి శ్రీయొక్క శక్తి స్వరూపము ఆరాధింపబడుట మాత్రము ప్రోత్సహింపదగినది. సర్వసాధారణమైన మాతృస్వరూపమేకాని అసాధారణ

మైన శక్తిస్వరూపము భారతస్త్రీలలో మృగ్యమైపోయినది. మృగ్యమైపోయిన శక్తి స్వరూపమును తిరిగి మొలకెత్తించుటకు ఈనవరాత్రులలో శక్తిస్వరూపమున పూజింపబడు దేవి—జగదీశ్వరి, జగన్నియంత్రి, సర్వాభీష్టఫలప్రదాయిని—అనుగ్రహించుగాక యని ముకుళితకరములతో, నిమీలితనేత్రములతో, నిశ్చలబుద్ధితో ప్రార్థించుచున్నాము.

పత్రికాసన్మానము :—

పుణ్యదినమగు ఋషిపంచమినాడు పావనకృష్ణవేణీతీరమున కనకదుర్గ కాణాచినెలవగు బెజవాడనగరమునందు జరిగిన కృష్ణాంధ్రపత్రికల సన్మానము ఆంధ్రహృదయమునందు రేకెత్తిన జాతీయాభిమానమునకు ప్రబలతార్కాణమైయున్నది. ఆంధ్రపత్రిక ఆంధ్రతాబీజములను మొలపించి నూతనయుగనిర్మాణమునకు అనంతదోహద మొనర్చినది. కృష్ణాపత్రిక వంగసాంప్రదాయములను ఆంధ్రులకు హత్తించ ప్రయత్నించినది. చిరప్రతిష్ఠములగు ఈపత్రికల సన్మానమునకై ప్రత్యేకము రంగమునుండి పనిగట్టుకొనివచ్చి నడుముకట్టి సన్మానమును నిర్విఘ్నసమాప్తికి దెచ్చిన శ్రీయుత అవటపల్లి నారాయణరావుగారి (ఎం. ఏ., ఎం. ఎల్. సి) వ్యవహారదక్షత కొండాడదగియున్నది. ఆహ్వానసంఘాధ్యక్షులగు నడింపల్లి వేంకటలక్ష్మీనరసింహారావు పంతులుగారును, సభాధ్యక్షులగు ఆనరబిలు చింతలపాటి వేంకటనరసింహరాజుగారును నాగరికదేశములందలి పత్రికల పలుకుబడియు, ఆంధ్రకృష్ణాపత్రికలు దేశమున కొనర్చిన అమూల్యసేవను చక్కగ వివరించిరి. సంఘమువా రిచ్చినసన్మానపత్రమునకు కృష్ణాంధ్రపత్రికల సంపాదకులగు ముట్నూరి కృష్ణారావుగారును కాశీనాథుని నాగేశ్వరరావుగారును ప్రత్యుత్తరము లిచ్చిరి. కృష్ణారావుగారి ప్రత్యుత్తరము నిరుత్సాహకరముగానుండి వారు ఈ సన్మానమునకు బలవంతమాఘస్నానమట్లు ఒప్పుకొనిరను నానుడిని పోషించుచున్నది. నాగేశ్వరరావుగారి ప్రత్యుత్తరము ఉత్సాహమును రేపుచు, ప్రబోధమును పుట్టించుచు మొక్కవోని వారి ఆంధ్రాభిమానమునకు వ్యాఖ్యానప్రాయముగా వెలయుచున్నది. బొంబాయియందు పత్రిక ప్రారంభించినపుడు తమతోనుండి ఇప్పుడుకూడ పత్రికాముద్రాపకులుగ నున్న వారి నామము లుచ్చరించుచు పంతులుగారు తెలిపినవాక్యములు పారమెఱుగని వారిసౌజన్యమును లోకమునకు వెల్లడిచేయుచున్నవి. రెండుకోట్ల మహాప్రజలకు ఏకైకదినపత్రికయగు ఆంధ్రపత్రికను సంపాదించుచు జ్ఞానజ్యోతి ప్రసారమొనర్చుచున్న నాగేశ్వరుని దేశహితైషణ కొలది ఇడరానిది. కృష్ణాంధ్రపత్రికలు కలకాలము వర్ధిల్లి తత్సంపాదకుల ఆశయములను సఫలమొనర్చుచు దేశకళ్యాణమునకు తోడ్పడుచుండుగాక యని ఆంధ్రస్త్రీజనముల పక్షమున మనఃపూర్వకముగ కోరుచున్నాము.

## వివాహవయోనిర్ణయ చట్టము :—

వివాహవయోనిర్ణయచట్టమునుగూర్చి విచారణ సల్పుటకు ఏర్పడిన ఉపసంఘము వారు చేసిన సూచనలను విమర్శించుచు సెప్టెంబరు మాసమున 'ఆలోచన' అను శీర్షిక క్రింద మేమిట్లు వ్రాసియున్నాము. "అతిబాల్యవివాహములు అవశ్యము తుండింప వలసినవే. తుండించుట ప్రజలలో ప్రబోధము పుట్టించుటచేత చేయవలయునేగాని ప్రభుత్వము వారి శాసనఖడ్గమున మాత్రము కూడదు." గతమాసము 23—వ తారీఖున భారత శాసనసభలో ఈబిల్లు అరువదిఏడ్గురు సభ్యుల ఆమోదముతో చట్టమైనది. వ్యతిరేకముగా పదునల్గురు మాత్రమే ఓట్లనిచ్చిరి. దీనివలన దేశము ఈవిషయమై ప్రబోధితమైయున్నదనియు, విశేషప్రజ దీనికి సుముఖులైయున్నారనియు తేటతెల్లమగుచున్నది. అగుట ప్రజలు సంపూర్ణముగ నంగీకరించిన విషయమునకే ప్రభుత్వమువారు చట్టరూపమిచ్చిరన్నమాట. ఇందు ఇక చిక్కేమున్నది? ప్రభుత్వసభ్యులు తోడుపడకున్నను ఈబిల్లు శాసన మయ్యెడిదే. విశేషప్రజ లంగీకరించిన ఈవిషయమును తాము పట్టిన కుందేటికి మూడేకాళ్లను ఛాందసులకు కూడ అనువర్తించుటకు అనుకూలత ఏర్పఱచి వివాహసంస్కరణ విషయమున దేశమును ఏకసూత్రము మీద నడుపుటకు కారణభూతులైన బ్రిటీషు గవర్నమెంటువారిని ఈపట్టున ఎంతేని అభినందింప వలసియున్నది. గృహలక్ష్మి పాఠకుల ఉపయోగార్థము చట్టములోని ముఖ్యనిబంధనముల నిచ్చట ప్రకటించుచున్నాము.

(1) ఈ బిల్లు బాల్యవివాహ నిషేధచట్టము అని పేర్కొనబడును. (2) ఈ బిల్లునందు బాలుడు అనుశబ్దమునకు 18 ఏండ్లలోపువాడనియు బాలికయన 14 ఏండ్ల లోపు వయసు గలదనియు అర్థము. బాల్యవివాహమనిన బాలబాలికలలో నెవరికైనను పైని పేర్కొనబడిన వయసునకు తక్కువవయస్సునందు జరుగు వివాహ మనియర్థము. (3.) 18 ఏండ్ల పైని 21 ఏండ్లలోపున వయసుగల పురుషుడు 14 ఏండ్లవయసురాని బాలికను వివాహమాడినచో అట్టి పురుషుడు వేయిరూపాయీలవరకును జరిమానా విధింపబడుటకు అర్హుడు అగును. (4) 21 ఏండ్లకు మించిన ఏపురుషుడుగాని బాల్యవివాహమును గావించుకొనినచో అట్టి వానికి ఒక నెలవరకు సాధారణమైన ఖైదుగాని వేయిరూపాయీల వరకు జరిమానాగాని యీరెండునుగాని విధించబడును. (5) బాల్యవివాహము కాదని రుజువు చేయుటకు తగిన ఆధారము లేనపుడు బాల్యవివాహము చేయించువారికి ఒక నెల సాధారణశిక్షగాని వేయిరూపాయీలవరకు జరిమానాగాని యీరెండును గాని విధించబడును. (6) మైనర్లగు బాలబాలికలు వివాహము గావించుకొనినపుడు అట్టి వివాహమును ఆటంకపరుపక ప్రోత్సహించి చేయించు తలిదండ్రులకుగాని గార్డియనునకుగాని ఒక నెల వరకు సాధారణమైన ఖైదును లేక వేయిరూపాయీలవరకు జరిమానాయును లేక యీ రెండును విధింపబడును.

# శారదాచట్టము

జోశ్యుల నారాయణమూర్తిగారు

అతిబాల్యవైవాహికాచారమును రూపు
మాపుచేయుటకు సన్మార్గమగుచు
హైందవస్త్రీలలో నజ్ఞానపటలంబు
పారద్రోలుట కొక్క దారియగుచు
బాలికల్ వైధవ్యభారంబు నొందక
రాజిల్లుటకు కల్పభూజమగుచు
నిండుజవ్వని గాకయుండునప్పుడే నాతి
జనని యౌటకు గర్భశత్రువగుచు
సంఘమందుగల దురాచారపటలి
సంహరింపంగ నొకమహాశక్తియగుచు
దనరు గావుత మాచంద్రతారకముగ
సంఘసంస్కారి శారదాచట్టమిలను.

# లోధ్రమహిమ

## స్త్రీరత్నముల అభిప్రాయములు.

### ఆంధ్ర యువతీమణులు

శ్రీమతి కవయిత్రి పులవర్తి కమలావతీదేవిగారు రాజమంద్రినుంచి యిట్లువ్రాయుచున్నారు.—

"నాసోదరి బహిష్ఠయందు కడుపునొప్పిచే చాల బాధపడుచుండెడిది. మీ "లోధ్రను" మూడు బుడ్లను తెప్పించి యామెకొసంగితిని. నాచెల్లెలు స్వస్థురాలగుటయేగాకుండ నిరువురు బిడ్డలనుకూడ కనినది. మీ లోధ్ర స్త్రీలపాలిటి వరప్రసాదిని యనుటకెట్టి సందియమును లేదు. మా స్త్రీల వ్యాధులకు మీ లోధ్ర కల్పతరువువలె కన్పడుచున్నది."

శ్రీమతి ఎన్. కనకమ్మగారు, C/o నరసయ్యగారు, విలేజిమాజస్ట్రేటు, కదిరినుగాంచి ఇట్లు వ్రాయుచున్నారు.—

"మీలోధ్ర 4 పెద్దబుడ్లను సేవించినాను. 4 నెలలనుండి కడుపునొప్పి బొత్తిగనిలచిపోయినది."

### కర్ణాటక స్త్రీలు.

శ్రీమతి బి. ఇందిరాకుమారిదేవిగారు మెట్టూరునుంచి ఇట్లువ్రాయుచున్నారు.-

"నేను మీ కేసరికుటీరం "లోధ్రను" సేవించుచున్నాను. తత్పూర్వము నాకు బహిష్ఠకాలమందు మిక్కిలి బాధకలుగుచుండెను. ప్రతినెలయును క్రమముదప్పి బహిష్ఠి యిరువది దినములోపుననే యగుచుండెను. రెండు సంవత్సరములవరకు ఆసుపత్రినుండు పుచ్చుకొంటిని గాని గుణము కనుపించలేదు. పిమ్మట వారు ఆపరేషన్ చేసుకొమ్మని చెప్పిరి: నేనిష్టపడలేదు. మీ "లోధ్ర" ప్రభావమునిని రెండుబుడ్లు పుచ్చుకొన్న తర్వాత మామూలుప్రకారము క్రమముగ 28 రోజులకు బహిష్ఠయగుచున్నాను. బాధలన్నియు నివర్తిఅయినవి. మరి రెండుబుడ్లు మీ "లోధ్ర"ను నాకు పంపగోరుచున్నాను."

శ్రీమతి జయలక్ష్మమ్మగారు, కొల్లిగల్ బాలికాపాఠశాల ఉపాధ్యాయిని, ఇట్లు వ్రాయుచున్నారు.—

"గడచిన మూడు సంవత్సరములనుండి, నాకు సరిగా ఋతుస్రావము కాకుండెను. రెండు మూడు నెలలకొకసారి బహిష్టు కలుగుచుండెను. ఇందువలన నడుమునొప్పి, కీళ్ల నొప్పులు, బలహీనము, దేహము బరువుగతోచుట, మొదలగు బాధల ననుభవించుచుంటిని. మీ "లోధ్ర" రెండు సీసాలు తెప్పించి వాడినందులో పైకనిన వ్యాధులన్నియు మాయమైనవి. ఇపుడు సకాలమునకు బహిష్టుఅగుచు సుఖముగనున్నాను. మరియు రెండు సీసాలమందును వాడదలచినాను. నావలెనే బాధపడుచున్న స్త్రీలకు లోధ్రను వాడితీరవలెనని ఖండితముగా తెలుపుచున్నాను."

### క్రైస్తవ నారీమణులు

శ్రీమతి అన్నాచాండిగారు, ఎం. ఏ. ఆనర్స్ 'శ్రీమతి' సంపాదకురాలు, కొట్టయంనుంచి ఇట్లు వ్రాయుచున్నారు.—

## లోధ్ర మహిమ

"మీ 'లోధ్ర'ను వాడినాను. స్త్రీల ఋతుసంబంధమగు జాడ్యముల కదుర్చుటకు అపూర్వమగు ఔషధరాజమని చెప్పగలను. తియ్యనిరుచిగల్గి, పథ్యపానాదుల పాలింపవలసిన అవసరము లేకుంటచే, యీ మందును సంతోషముగ వాడవచ్చును."

శ్రీమతి డాక్టరు అన్నతామస్ అమ్మగారు, బెంగుళూరు ఆస్పత్రి సూపరిండెంటు, ఇట్లు వ్రాయుచున్నారు.

"ఇంగ్లీషు అవుషధములవల్ల గుణములేనందున తను "లోధ్ర"ను నాసోదరికి వాడితిని. ఆమెకు హాశ్చర్యమైన గుణము యిచ్చినందున సంతోషించుచున్నాను. ఇకమీదట ఈ ఔషధమును నా రోగులకు వాడెదను."

శ్రీమతి కె. ఇసయగారు, ఎ.బి. మిషన్, సత్తెనపల్లి, గుంటూరుజిల్లా, ఇట్లు వ్రాయుచున్నారు.

"మీ 'లోధ్ర'వలన నాకు మిక్కిలి ఆరోగ్యముకల్గినది. నాకు వచ్చుచుండిన దగ్గు నయమైనది."

శ్రీమతి మిసస్సు. ఏ. దేవదాసు అమ్మగారు ఇ. డబ్ల్యు. ఎమ్. స్కూలు, సాలిన్, మిర్జ బుజిల్లా, ఇట్లు వ్రాయుచున్నారు—

"మీవద్దకొన్న 'లోధ్ర' నాలుగు బుడ్లను, ఋతుస్రావదోషములచే బాధనొందుచున్న స్త్రీల కిచ్చినాను. వాటిని వాడినందున వారి రోగములు కుదిరినవి."

## కేరళవనితలు

ఎడపిల్లి పార్వతమ్మగారు తిరుచూరునుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"నేను 25 సంవత్సరములు ఋతుసంబంధమగు జాడ్యములతో బాధపడుచుంటిని. ఎన్నియో మందులను వాడినను గుణమగుపడలేదు. తుదకు మీ 'లోధ్ర'ను కొద్దికాలము మాత్రము వాడగా అత్యద్భుతముగ రోగనివారణ గావించెను."

శ్రీమతి అమ్ముకుట్టియమ్మగారు, సంగీత ఉపాధ్యాయిని, సర్కారుహైస్కూలు, తిరుచూరు, కొచ్చినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"చాలాకాలముగ అనేక విధములైన గర్భాశయ రోగములవల్ల బాధనొందుచుంటిని. అనేక విధములైన చికిత్సలను పొందితిని గాని నివారణము కాలేదు. కడపట తమ "లోధ్ర" సేవించిన నారము రోజులలోనే గారడివిద్యవలెను మందు పనిచేసెను. దాని ప్రభావమును వర్ణింపజాలను."

శ్రీమతి మిస్ గోపాలపణిక్కర్ గారు, శారదావిలాసము, చిత్తూరు, కొచ్చినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"మీవద్దనుండి తెప్పించిన 6 లోధ్రబుడ్లలో 3 నేనును తక్కిన 3 మాచెల్లెలును సేవించుటచే మాయొక్క ఋతుశూలలు మాయమాగెను."

శ్రీమతి మిసస్సుకర్తగారు, కోరోలి ఆమ్మనాత్ హౌవుస్, ఇరింజలకుడ, కొచ్చినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"పది సంవత్సరములుగ ముట్టుకట్టువల్ల బాధపడుచుంటిని. దానిని మీలోధ్ర అత్యద్భుతముగ నివారణచేసెను."

రసాయనములకు రాణి.

# లోధ్ర




స్త్రీజనమిత్రము.

వనితల ఋతుదోషాది రోగములకు ప్రజాయుషము.




సచిత్ర మాసపత్రిక

సంపాదకుఁడు

డాక్టర్. కే. ఎన్. కేసరి

సంపుటము 2.] [సంఖ్య. 9

లోధ్ర ముద్రాలయము, మద్రాసు

1929

సం॥ చందా రు. ౩. విడిసంచిక అ. ౧.

# గృహలక్ష్మి

"యత్రనార్యస్తు పూజ్యంతే నందంతే తత్రదేవతాః।
యత్రైతాస్తు నపూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః॥

సంపుటము 2. నవంబరు నెల 1929. సంచిక 9.

## విషయసూచిక.

త్రివర్ణ చిత్రపటము



ఛాయాచిత్రములు



Printed and Published by Dr. K. N. Kesari at Lodhra Press, Egmore, Madras.

# గృహలక్ష్మి

## అన్నపూర్ణాదేవి

"పుణ్యాంబుమడిమోచు పొలఁతుల కెల్ల నీవుఁబోడి యాదలభూషణంబు
పతియాజ్ఞ దలనిడి బరయింతగడవని లలనల కీయింతి తిలకలక్ష్మి
తోడి పూసి కట్టి బంధువులకునిడియున్న పడఁతుల కీపుణ్యభామ యొజ్జ
దేశహితార్థంబు దేహంబు నర్పించు సుదతుల కీచాన మొదలిపేరు

తాల్మిగని యొప్పుకందుప తగవు నెలవు
ధర్మములయిక్క మొగమోటతానకంబు
సుగుణముల ఠావు వినయంబుచోటనంగ
నన్నపూర్ణమ్మ నెల్లరు నెన్నఁ దగ డె."

విద్యాప్రియత్వము, అపూర్వత్యాగము, అసదృశకార్యశౌర్యము జూపి కులము, దేశము మహత్తరముగ వెలయింపగలదను ఆశను రేపినది. కాని ఇంతలో ఆశావిఘాతము కల్గినది. అరవిచ్చిన విరికి వాడుదల సంభవించినది. వృంతచ్యుతమై ఆసుగంధకుసుమము పంచభూతములలో లీనమైనది. అది క్షణకాలమేయగుగాక—హృద్యముగ వీచి సమసిపోయిన ఆసౌరభమును జనులు విపులప్రయత్నమొనర్చియు విస్మరింపజాలరు.

అన్నపూర్ణాదేవి విద్యాప్రియ. ఆకలియు నీర్వట్టు గణింపక, అంగములు కనలిసను పాటింపక ఆసాయమును ఆసీనప్రచలాయితమనునదియే ఎఱుంగక ఏకతానమైన బుద్ధితో

ఏకాగ్రమైన చిత్తముతో కలకత్తాయందలి శ్రీ హేమచంద్రసర్కారువారి బ్రాహ్మబాలికా పాఠశాలలో అయిదవఫారమువఱకు నిర్విఘ్నముగ సాగిన ఆమె విద్యాభ్యాసము ఆంధ్రస్త్రీలెల్లరును ఒజ్జబంతిగ గ్రహింపదగినది.

అన్నపూర్ణాదేవి మహాత్యాగిని. అసహాయోద్యమము చెలరేగియున్న దినములలో 1921-వ సంవత్సరమునందు బెజవాడలో జరిగిన మహిళాసభలో సర్వాభరణములును ప్రధానాంగుళీయకము సహితము తీసి స్వరాజ్యనిధి కర్పించిన ఆమె త్యాగమునకు రూపొందిన త్యాగమూర్తియగు మహాత్ముడుకూడ నోరారా! మెచ్చుకొనినాడు. అన్నపూర్ణాదేవి తన పట్టుపుట్టములను, ముదముతో విప్పి తన విదేశపుట్టములను తన యెదుట పడవేయగా ఆనాడు అగ్నిహోత్రుడు మీఁదెత్తిన తన జ్వాలాంగారముల రెపరెపలతో ఆమె త్యాగమును ఆకాశవీథులయందు చాటినాడు.

అన్నపూర్ణాదేవి గొప్పకార్యకర్త్రి. సహాయనిరాకరణోద్యమము ప్రారంభమగు నరికి ఆమె ఎండకన్నెఱుగని ఎలనాగ; నిరంతరము పుస్తకపఠనములో కాలముపుచ్చుచున్న విద్యార్థిని. అట్టి ఆమె దేశమాత పిలుపువినినతోడనే కార్యరంగమునకు దిగి కాలి నడకను ఇంటింటికి, వీథివీథికి, ఊరూరికి తిరిగి ఉద్యమప్రచారము చేసినది; మూపులు కాయలుకాయగా, చరణసరోజములు చిగురుముక్కలట్లు కందగా ఖద్దరుమూటలను మోయుచు దాని వ్యాపక్రియమునకు తపస్సుధారపోసినది. కావుననే సత్యోక్తిశీలుడగు మహాత్ముడామెనుగూర్చి 'భారతపురంధ్రులలో నాకుఁగల పుత్రికారత్నములలో సత్యో త్తమురాలు' అని ముక్తకంఠముతో పల్కినాడు.

అన్నపూర్ణాదేవి గ్రంథకర్త్రి. ఆధునికాంధ్రరమణులలో వైదుష్యమున ఆమెకు మించినవారు అనేకులుండవచ్చును. కాని తాముసంపాదించిన వైదుష్యము లోకములోని వారికి పంచియిచ్చు పరార్థప్రవణమైన బుద్ధిగల విద్యావతులు మాత్రము మిక్కిలి స్వల్ప ముగానున్నారు. పరార్థప్రవణమైన బుద్ధిగల అట్టి వారిలో అన్నపూర్ణాదేవి ఎన్నతగినది. తనకు పదునేడేండ్లప్రాయమున ప్రవేశపరీక్ష ప్యాసుచేసిన క్రొత్తలో ఆమె 'సీతా రామము' అనుగ్రంథమును వ్రాసి లోకమునకు సమర్పించినది. ఆగ్రంథము మహనీయ

లగు స్వర్గీయ కొమఱ్ఱాజు లక్ష్మణరావుపంతులుగారి మన్ననలనందినది. పాఠశాలలలో ఉన్నతతరగతులకు పఠనీయముగ పెట్టబడినది

అన్నపూర్ణాదేవి జాతీయాభిమానపూరితహృదయ. దేవిభర్త భావినీడుగారు వ్యవసాయవిద్యాభ్యాసమునకు అమెరికాకు పోవ సమకట్టెను. విద్య నేర్చుకొనుటకు విదేశములకు పోయినను మన దేశీయత విడనాడరాదని ఆ ఉచితజ్ఞురాలు పిన్నతనముననే గ్రహించెను. అగుటనే ఆమె అమెరికాకు పోవుచున్న పతి పాదపద్మములకు నమస్కరించి "నన్ను మరచినను మాతృదేశమును మరువవద్దు" అని ఆదేశపూర్వకముగ వరము కోరెను. అది ఎంత పవిత్రభావముతో కోరబడెనో అంత పవిత్రభావముతో నొసంగబడెను; అంత పవిత్రభావముతో నిర్వహింపబడెను. అన్నపూర్ణాదేవివంటి స్త్రీలు భారతదేశమునందింకను అప్పుడప్పుడు పొడసూపుచున్నారు కావుననే మన జాతీయత ఇంతమాత్రమైనను నిలచియున్నది.

అన్నపూర్ణాదేవి ఇరువదినాలుగు సంవత్సరములు మాత్రమే జీవించినది. ఆ కొలది కాలమును ఆమె దేశముకొఱకే జీవించినది. యశోవాల్లభ్య మందినది.

> " పౌరుషజ్ఞానమూర్తుల పొగనేని
> నాసి జన్మ పదోకక్రపూవులైనజాలు."

# ప్రణయతపస్సు

పెమ్మరాజు రాజగోపాలముగారు బి. ఏ. (సారస్వత సమాజము)

౧

చాలువ గులాబికాంతులెగ ♦ జిమ్ము కపోలము కేలనూది; లో
పల నుదయించి పై కుబుకు ♦ భావమరీచి మొగాన దేల; సొం
పులు దులకించు సత్ప్రణయ ♦ ముద్రితముల్ భవదీయవీక్షణం
బులు నక్షత్రవాలగా మధుర ♦ ముగ్ధతసంభావరించుచుంటివే ?

౨

జేవురుమొద్దలై మనువు ♦ చేతులు, మూపులు గాయకాయ నీ
తీవకుమారికన్ జెలిమి ♦ తీపిని చల్లని నీరువోసి గ్రీ
ష్మావధి దాట జేసితివి ♦ చక్కగ దా జివురించి నేడు పు
ష్పావృతమయ్యె నీతలపు ♦ పండుట లెప్పటికో తపస్వినీ!

౩

చిత్తములోని ప్రేమరస ♦ శీకరముల్పయి జిల్కరించి, రే
కెత్తిన భావపుష్పముల ♦ నేర్చి, హృదీప్సిత మాలగూర్చి, ఆ
యుత్తమునైతి వీవు హృద ♦ యాధిపు కంఠ మలంకరింప, దా
నిత్తరికైన రాడు హృద ♦ యేశ్వరుఁడో ప్రణయైకజీవనీ!

౪

ప్రేమరసార్ద్రము లుక్కుసుమ ♦ పేశలము ల్ప్రణయప్రపూర్ణము
ల్కాముకకాముకీ హృదయ ♦ కాంక్షితముల్గన నైపజాలరో
భామిని! వారలీకరణి ♦ ప్రాప్తమునౌ వలవంత నుంత హిం
దూమహిళాసతీత్వమెద ♦ నూల్కొన నోర్వుము ప్రేమయోగినీ!

౫

చారువసంతవాసరని ♦ శారమణీయవిమోహచంద్రికా
పూరములోన నీదికొని ♦ పోయి మనోహరు పాదపద్మముల్
చేరుకొనంగ నోప్రణయ ♦ సేవకురాల! ప్రయత్నశీలవై
తీరని యీ వియోగనిశి ♦ తెప్పున దేలుచు మున్గదోయిటన్

౬

భారతసుందరీహృదయ ♦ భావమహోన్నతి క్రుంగకుండ, నీ
వారసి తొంటి సాధ్వుల మ ♦ హామహిమంబు, సతీత్వభావస
ద్గౌరవ ముల్లసిల్లపరి ♦ తాపనిరాస తపస్వినీ మహో
ధారచరిత్రవై వ్రతమ్ము ♦ దాల్చితి నాథుడు రాకపోవునే ?

# బాల్యవివాహములు

శ్రీమతి మద్దాలి సీతారామమ్మగారు

నేటికి వివాహవయోనిర్ణయపుబిల్లు శాసనమైనది. నాడు శ్రీరాజారామమోహనరాయలవారి కాలమున ప్రభుత్వశాసనముచే సహగమనములు రూపుమాసినట్లు నేడు ఈశాసనముచే బాల్యవివాహములు గూడ అంతరింపనున్నవి. పారంపర్యమగు నాచారము అక్రమముగాని సక్రమముగాని హిందూజాతికి త్యజింపరానిదిగానున్నది. అనర్థదాయకములగు నాచారములు బలవత్తరములై ప్రచారముననున్నచో నయ్యవి ప్రభుత్వశాసనములచేగాని నశింపవు. బాల్యవివాహమువంటి మూఢాచారము నణంచుటకు గూడ ప్రభుత్వశాసనమే శరణ్యమగుటజూడ నది జాతిదౌర్బల్యమని చెప్పక చెప్పుచున్నది. బాల్యవివాహములచే గలుగు వైధవ్యాదికష్టనిష్ఠురములు స్త్రీల పాలిటివైయున్నవి. అందుచే నట్టి విషయమున యుక్తాయుక్తనిర్ణయము విశేషముగ స్త్రీలపై నాధారపడియున్నది. బహుస్వల్పసంఖ్యాకులు మాత్రమే యిట్టి వివాహములను సమర్థించిరి. తక్కిన భారతవర్షమంతయును ముక్తకంఠముగ బాల్యవివాహముల నిషేధించెను. సంస్కారప్రియులకు దేశము, కాలము, పాత్రము, స్వబుద్ధి ఇవి ధర్మనిర్ణయమునకు ప్రమాణములు. ఆచారప్రియుల కట్లుగాదు. వారికిగల సన్నాహమంతయు నొక్కశాస్త్రమే. ఆ శాస్త్రమైనను వారిపక్షమున నిర్వికల్పముగ సాక్ష్యముచెప్పదు. ఒక్కొక్కప్పుడు వారి ప్రాణములపైకి దెచ్చుటయు దటస్థించును. ఇందుచే బూర్వాచారపరాయణులకు స్థిమితమగు మార్గము వేఱేమియులేదు. శాస్త్రముల గుట్టు బయటపడిన ఈకలికాల

మంచు వానిని విశ్వసించువారును లేరు. ఏవిధముగ జూచినను బాల్యవివాహములను రద్దు పఱచు ప్రభుత్వశాసనము పుట్టుట యవసరము.

నిజముగా వైవాహికధర్మమును గుర్తెఱుంగని బాలికలకు వివాహమొనర్చుటలో నర్థమేమున్నది? జీవితాంతమువఱకును పైబడు కష్టసుఖములకు బద్ధులను చేసి యవశ్యము వాని ననుభవింపజేయునదిగదా వివాహము. అట్టి దానివిషయమున వధూవరుల కించు కేనియు నధికారము లేకుండ జేసి సర్వస్వాతంత్ర్యము తామే యవలంబించి వివాహము లొనర్చుట తలిదండ్రులకు మాత్రము భావ్యమా? బిడ్డలకు తలిదండ్రులను మించిన శ్రేయోభిలాషులుండరనుటనిక్కమే. అయినను దమ బిడ్డలకు బాల్యముననే వివాహతంత్ర ములు జరిపి యొకవేళ ననర్థములు తటస్థించెనేని వానికన్నిటికి దామే బాధ్యులయి యుండుట యుక్తముగాదనియు వధూవరులకు గూడ కొంత స్వాతంత్ర్యము గలిగెడు యుక్త వయస్సు వచ్చువఱకు నిలుచుట సమంజసమనియు అట్లుగాక బిడ్డల జీవితసర్వస్వము తమ కృత్యములపై నాధారపడజేయుట సాహసమనియు నావిన్నపము. వివాహమొక ముచ్చట కొఱకును, వేడుకకును జరుపబడునట్టిదిగా నుండక యది యైహికాముష్మిక సుఖప్రద మనియు మానవులకు నాగరికతాపరిణామఫలమనియు సభ్యసంస్కారమనియు జరుప బడవలయును. ఇట్టియభిప్రాయములు బాల్యవివాహములొనర్చునట్టి వారుగాని యొన రింపబడునట్టి వారుగాని పాటి సేయరని యావివాహములే సాక్ష్యము నిచ్చుచున్నవి. ఇంత కును బాల్యవివాహములు విస్తారముగా భాగ్యవంతుల పాలబడుచున్నవి. వారు తమ కూతులకు దగినసంబంధములు రావనియు, ముద్దుముచ్చటలు చూచు నవకాశము తాము గోల్పోవుదు మేమోననియు భయపడి చిన్నతనమందే తమ పిల్లలకు బొమ్మలకువలె పెండ్లిండ్లుగావించి వధూవరుల ముచ్చటగాక తమ ముచ్చటనే తీర్చుకొనుచున్నారు. స్త్రీల బలాత్కారమునగూడ నీబాల్యవివాహములు జరుగుచున్నవని చెప్పవచ్చును. ఇప్పుడిపుడు విద్యావివేకములు స్త్రీలకు గొంతవఱకైన యలవడుచున్నవిగాని పూర్వమిది యును లేదు. అందుచే సంఘక్షేమాభివృద్ధికరములగు నభిలాషయును, ఆచరణదీక్షయు నేకొలదిమంది స్త్రీలకోదక్క తక్కినవారియందవి యించుకేనియు మొలకెత్తనేలేకున్నవి. దేశము, సంఘము, వీనిక్షేమమును గూర్చిన కర్తవ్యముతో దమకేమాత్రము జోక్య

ముండరాదని యిప్పటి విద్యావతులగు కొందఱు స్త్రీలు తలంచుచున్నారు. ఇదియుక్తము గాదు. స్త్రీల బలాత్కారమున బాల్యవివాహములు జరుగుచున్నవనెడి నింద యికముందు లేకుండుటకై స్త్రీలు జాగ్రత్తపడవలసియున్నది. వర్తమానకాలపరిస్థితులను మనసునం దుంచుకొని యొకకవి యిట్లు చెప్పెను.

పసిబాలికల కడుపులఁ జిచ్చుపెట్టఁ గమ్మసాగిన మూఢులౌ ఛాందసులకు
మాటలంగోటలు దాటించు సుఖలోలురగు పొట్టకూటి వేదాంతులకును
కడుపారఁ దొలిపెండ్లికొడుకులవలె తినమరిగి తిగ్గెడు కులగురువులకును
వేదకాలచరిత్రవిషయం బెఱుంగని వికటవాక్సాహితీవిదురులకును

సమ్మతము గాక యున్నపో నిమ్మ శేష,
ప్రజలు బాలపతింతువివాహములకు
సమ్మతించెడుమాట వాస్తవము తల్లి!
భవ్యగుణగణసంభూతి! భరతమాత !

కావున బాల్యవివాహనిషేధము సర్వత్ర ప్రతిధ్వనించుచున్నది. అట్టి ధ్వనియే సమస్తశాస్త్రములకంటె బరమప్రమాణము.

# గృహలక్ష్మి

టి. రంగమన్నారు గారు

మంచిచల్లనినీట మజ్జనంబొనరించి యంగరాగంబొప్పనలదియలది
కుంకుమనొసటిపై గొమరొప్ప నెలకొల్పి కనుదమ్ములకు గాటుకనుదగిల్చి
వెన్నునవ్రేలాడు వ్రేలుముడినిబూలుచుట్టి తెల్లనిపట్టుబట్టగట్టి
అధరంబుపై మందహాసంబునటియింప నాననంబునకాంతియగ్గలింప

నొక్కచేతపూవులసజ్జ యొక్కచేత
జలము వేగొని రాయంచచందమునను
మందగతి నిందిరాదేవిమందిరమున
కరుగుచున్నది గృహలక్ష్మి పరమభక్తి.

# జానకీసందేశము

సూరిగుచ్చి రామమూర్తిగారు

నిరతముతేనియాననెదనిల్పిదయావివశాత్ములీ నిశా
చరనికరంబుకష్టములుసల్పుచునుండనొకప్పుడైన న
న్నరయఁడె నాదుదైవమనియాత్మఁదలంచుచుధైర్యమూని దు
ర్భరమగుప్రాణముల్ నిలుప భద్రముపల్కితివీవుమారుతీ!

తలఁపనలంఘ్యమివ్వనధిదాటినిశాచరనాథుఁజంపినన్
గలయఁగుతూహలుండగునొ కాదొ రఘూద్వహుఁడంచునిచ్చలున్
దలఁచుచునాసబాసియిటుదైన్యమునన్మదిఁగుందిజీవముల్
నిలుపఁగలేనియిట్టియెడనిన్నుఁగనుంగొనసంతసంబగున్.

వినడిది క్రూరకార్యమిటువెంగిలివౌచుభవత్ విభూతిపో
వనెటులఁజూతువీవొకటిపల్కెద రావణ! రాముచెంతకున్
ననుఁగొనిపోయికావుమనిసన్నటనుంచినసంతసించి తా
గనికరమూనునీవయిని ఖ్యాతదయాత్ముఁడటంచుఁదెల్పినన్.

సతతముమిమ్ము సంస్మరణసల్పు భవత్సతి సీత లంకలో
నెతలమునుంగఁగాంచి తనువెండియు "నన్నుఁదలంపు"మంచు మ
త్పతి రఘురాముతోడనను, పాపిదశానను దున్మినన్ సమం
చితభవదీయరూపమును జేర్పుమటంచువచింపుమారుతీ!

అనవరతంబు భక్తిమునంటిచరించుచుభావమందునన్
దననిజమాతగా రఘునిఁదండ్రిఁగనెంచు మఱదితోడ మున్
వనివసియించునప్డు పలుభంగులనాడిననీచవాక్యముల్
మనముననుంపకుండుమనుమా తగుభక్తిఁబ్రభంజనాత్మజా!

# శారదలేఖలు

సౌభాగ్యవతియగు కల్పలతకు—

నెచ్చెలీ! నాజీవము ధర్మము. నామతము నీతి. నాలక్ష్యము సతీశ్రేయము. ఈ మూటిని సమర్థించుటకే నేను చేత కలముబూనితిని. ఎప్పు డీయాశయత్రయము ననుష్ఠించ జాలకపోదునో ఆనాడు నావ్రాఁతకోఁతలు కట్టిపెట్టుదును. న్యాయమునకు నేను కేలు మోడ్తును. నిష్పాక్షికతకు నేను శిరమువంచుదును. నా కొకరు హితులులేరు, ఒకరహితులులేరు. యుక్తాయుక్తవిచక్షణలేక మతమును నిరసించెడు దురాచారులు నా కెట్లహితులో మతముపేరిట ప్రజలను పీడించెడు దుండగీండ్రును నా కట్లే అహితులు. సాంఘికధర్మముల విచ్ఛిత్తిఁజేయ నెంచెడి దుష్ప్రారంభులు నా కెట్లమిత్రులో సాంఘికరక్షణావ్యాజమున జనులనలయించెడి వారుగూడ నా కట్లేఅమిత్రులు. నిష్కారణముగా భార్యను దుఃఖపెట్టెడి దుర్జనుఁడు నాకెట్లు కోపకారణుఁడో భర్త నల్లాడఁబెట్టెడి దుశ్చరితయు నాకట్లే శత్రురాలు. అభము శుభము నెఱుగని పసిబాలయగుకోడలిని కోడంట్రికము పెట్టెడి అత్త నాకెట్టి శత్రువో అత్తపొత్తుగిట్టని గయ్యాళియు నాకట్లే పగతురాలు. దేశములోని సదుద్యమముల నిర్మూలింప యత్నించెడి దుశ్శీలురు నాకెట్టి పగతురో దురుద్యమముల వ్యాపింపఁజేయువారును నాకట్లేపగతురు. దూషణభూషణతిరస్కారములు శరీరమునకు గాని యాత్మకు లేవను వేదాంతుల నానుడిని యొకవిధముగా విమర్శకులు గూడ నాదర్శముగా గొనవలసియుండును. పుర్రెకొకబుద్ధి జిహ్వకొకరుచి. ఒక అభిప్రాయము మనము సరికాదనినపుడు దానిని సరి యనువారును కుప్పలు తిప్పలుగ నుండనేయుందురు. అయితే ప్రకృతిభేదమునుబట్టి ఆ అవునుకాదనుటలో నొకరి పదప్రయోగము కటువుగను నొకరి పదప్రయోగము మృదులముగను నుండును. అంతమాత్రమునకే మనము కించ నొందవలసిన పనిలేదు. అహింసాసత్యములు మహాత్ముని ఆదర్శములు. ప్రాచ్యప్రతీచ్య సమ్మేళనము రవీంద్రుని లక్ష్యము. ఈ ఆదర్శముల నంగీకరించినవారు వారిని కొండంతగ

పొగడుచుండ అంగీకరింపనివారు తీవ్రముగ తెగడుచుందురు. అయితే ఆ మహాపురుషులకు నిందాస్తుతులయెడ నొక్కటే అద్వైతము. తమ కర్తవ్యములను సాధించుకొనుటే వారి ఆశయము. మహాత్ముడు ఒకప్పు డేమనెనో తెలియునా? లోకములో ఒకేమానవుడున్నంతవఱకు నాసత్యసిద్ధాంతమును బోధింపుచునే యుందును. నాఖద్దరు మంత్రము నుపదేశింపుచునే యుందును అనెను. ఖద్దరుద్యమము యెంతెంతటి మహాపురుషుల నిశితవిమర్శనమునకు గుఱియైనది! అందులకని మహాత్ముఁడెన్నడైనను నిరుత్సాహము జెందెనా? తన సంకల్పము విడనాడెనా? అట్లే స్త్రీలనాటకరంగప్రవేశమునుగూర్చి యొకమాఱు దీర్ఘముగా యోచించి అనుచితమైనదని మనస్ఫూర్తిగా నిశ్చయించిన వెనుక పెద్ద పెద్దలెల్లరు దీనికనుకూలముగా నున్నారనియు, ప్రసిద్ధపత్రికాధిపతులెల్లరు దీనికి చేయూతనిచ్చుచున్నారనియు నేనిప్పు డెట్లామోదింతును. అది నామనస్సాక్షికి వ్యతిరేకము గాదా? కావున మనసా వాచా నే నిప్పటికిని దానికి వ్యతిరేకనే.

'సాధన' పత్రికనుండి యుద్ధృతమైన నానాటకరంగవిమర్శనాలేఖపై విమర్శనముగల భాగమును నేను 'గృహలక్ష్మి'లో చూడక పోలేదు. చూచితిని. అది నాసరియైన అభిప్రాయమునకు విమర్శనమైనచో దానికి నాసమాధాన మనగత్యము. ఏలనందువా ఎందరో స్త్రీలు నాటకకళాప్రవేశమును సమర్థింపుచు వ్రాయుచున్నారు. వారిలో వీరొకరని యూరుకొనియుందును. కాని నాలేఖకు కొన్ని అపార్థములు తీయబడినవి. అవి నాకు కొంచెము మనస్తాపకారణములుగనే యున్నవి. ఆవ్యాసము చూచినది మొదలు స్త్రీల వ్యాసములను విమర్శించునప్పుడే తగుమర్యాద జూపగల సరళభాష నుపయోగింపజాలనివారు స్త్రీలు వేసిన వేషము నేమాత్రపు సరళభావముతోఁ జూడగలరని సందియమగుచున్నది. నాలేఖ నామూలాగ్రముగా జదివిన నక్షరాస్యులకెల్ల నేను స్త్రీలనాటకధారణావిషయమున ప్రతికూలనని స్పష్టముగా విశదమగుచున్నది. అట్టిచో స్త్రీవేషము వేసి రంగస్థలమున బాగుగా నెగురుటకు వీలులేదని నేను దుఃఖింపుచుంటిననియు, అట్టి నాదుఃఖము అర్థములేనిదనియు సాధనపత్రిక యెట్లూహించి వ్రాసెనో నాకు తోచకున్నది. ఒకచో శారదమ్మగారనియు, నొకచో శారదమ్మయనియు వ్రాసిన మాత్రమున మనకు లోపములేదు. కాని అది స్త్రీలయెడ వారికి గల యగౌరవభావమునకు నిదర్శ

నము కాగలదు. మఱియు అవిషేగాదు. విషయము చక్కగా గ్రహింపకయే చేసిన విమర్శన లందింకను పెక్కులున్నవి. లేఖావిస్తరభీతిచే వానినెల్ల యిందు వివరింపక విడిచితిని. ఏమైన సరియే అర్థముచేసికొన సామర్థ్యమున్నప్పుడే చదువవలెను. వివరింపగల సామర్థ్యమున్నప్పుడే వ్రాయవలెను. ఈరెండింటికిని చాలక వారూరక అపార్థములను దీసి రచయితల నగౌరవపఱచెడి కటువుపదములతో వ్రాయుటకంటె మిన్నకుండుట మేలు.

ఎవరెన్ని విధముల సమర్థించినను నాట్యకళయభివృద్ధి జెందునేమోకాని గౌరవ స్థానమునకు వచ్చుటమాత్ర మింతలోనయ్యేడిదికాదు. ఈకళకు గౌరవము ముందుకలిగి నదిలేదు. ఇకముందు కలుగబోయెడిది గూడ సందేహమే. శైలూషవృత్తిచే జీవించువారు పూర్వమన్ని కులముల వారిచేతను బహిష్కరింపఁబడియే యుండిరి. కులస్థులు వారితో సంబంధబాంధవ్యముల కొప్పకుండుటయేగాక వారితో పంక్తిభోజనముల కంగీకరింప కుండిరి. రాజదత్తాగ్రహారములు వారికి చెందకుండునట్లు రాజులు శాసనములు వ్రాసిరి. పగటివేషములు వేయునట్టియు భాగవతము లాడునట్టియు బ్రాహ్మణులకు మాయిండ్లలో విడిగా భోజనము పెట్టువారమని యిటీవల మాతల్లిగారు చెప్పినప్పుడు నాకెంతయో ఆశ్చర్యమయ్యెను. ఆధునిక నాగరికతామహిమచే సాంఘికవ్యవస్థలు శిథిలమైన యిక్కాలమున అట్టి బాధలు నటకులకు లేక పోవచ్చును. లేకుండుట గూడ సంతోష కరమే. అయినను నాటకకళ కింకను గణ్యత లేదని మాత్రము చెప్పక తప్పదు. పాత్ర ధారులైన పురుషుల విషయమే యిట్లుండ స్త్రీ పాత్రధారులు ప్రజల మన్ననలందుట కెంత కాలము పట్టునో అనూహ్యము. అయినను ఈ చర్చలన్నియు పనిలేసి పనులు. ఎవరి యిష్టము ప్రకారము వారుండుట కీదినములలో నొకరి నిరోధమేమియు లేదు. ఎవరి పెండ్లాము బిడ్డలు వారి స్వాధీనము. కనుక ఈనవీనోద్యమము నామోదించు వారు ఇతర స్త్రీల నీపని సేయ పురిగొల్పుటకంటె తమ కుటుంబము వారితోడనే యీ సంస్కరణము నారంభించిన నెంతయు సమంజసముగా నుండును. అట్టివారి నెవరును కాదనరు. ఒకవేళ నావంటి చాదస్తులెవరైన కాదనినను వారికి కలుగు కొదువ లేదు. ఏమైనను రంగములోనికి దిగిన గాని రంగుబయట పడదు. తడిసిగాని గుడిసెకట్టరు. త్రాగి గాని తూగరని సామెతగదా! కాన అనుభవముచేత గాని దీని మంచిచెడుగులు తెలియవు.

—శారద.

# పూర్ణమ్మ

కీ. శే. గురజాడ వేంకట అప్పారావు గారు

మేలిమి బంగరు మెలతల్లారా!
కలువల కన్నుల కన్నెల్లారా!
తల్లుల గన్నా పిల్లల్లారా!
విన్నారమ్మా యీ కథను.

ఆటల పాటల పేటికలారా!
కమ్మని మాటల కొమ్మల్లారా!
అమ్మల గన్నా అమ్మల్లారా!
వినరమ్మా మీరీ కథను.

కొండల నడుమను కోనొకటుంది;
కోనకి నడుమా కొలనొకటుంది;
కొలని గట్టునా కోవెల లోపల
వెలసెను బంగరు దుర్గమ్మ.

పూజారింటను పుట్టెను చిన్నది
పుత్తడి బొమ్మా పూర్ణమ్మ;
అన్నల తమ్ముల కనుగై దుర్గకు
పూజకు పువ్వులు కోసేది.

ఏయే వేళల పూసే పువ్వుల
ఆయా వేళల అందించి
బంగరు దుర్గను భక్తితొ కొలిచెను
పుత్తడి బొమ్మా పూర్ణమ్మ.

ఏయే ఋతువుల పండే పళ్లను
ఆయా ఋతువుల అందించి
బంగరు దుర్గను భక్తిని కొలిచెను
పుత్తడి బొమ్మా పూర్ణమ్మా.

పళ్లను మీరిన తీపుల నడలను
పువ్వులు మీరిన పోడుములున్
అంగములందున అమరెను పూర్ణకు
సౌరులు మించెను నానాటన్.

కాసుకు లోనై తల్లీ తండ్రీ
నెనరూ న్యాయం విడనాడి
పుత్తడి బొమ్మను పూర్ణమ్మను వొక
ముదుసలి మొగుడుకు ముడివేస్రీ.

ఆమని రాగా దుర్గకొలనులో
కలకల నవ్వెను తామరలు;
ఆమని రాగా దుర్గవనములో
కిలకిల పలికెను కీరములు.

ముద్దు నగవులూ మురిపెంబు మరి
పెనిమిటి గాంచిన నిమిషమున
బాసెను కన్నియ ముఖకమలమ్మును
కన్నుల గ్రమ్మెను కన్నీరు.

ఆటల పాటల తోటి కన్నియలు
మొగుడు తాతయని కేలించె,
ఆటల పాటల కలియక పూర్ణమ
దుర్గను చేరీ దుఃఖించె.

కొన్నాళ్లకు పతి గొనిపోవచ్చెను
పుత్తడిబొమ్మను పూర్ణమ్మను;
చీరెలు సొమ్ములు చాలగ దెచ్చెను
పుత్తడమ్మకు పూర్ణమకు.

పసుపు రాసిరి బంగరు మేనికి
జలకములాడెను పూర్ణమ్మ;
వదినెలు పూర్ణకు పరిపరి విధముల
నేర్పులు మెరసీ కైచేసి.

పెద్దలకప్పుడు మొక్కెను పూర్ణమ్మ
తల్లీ తండ్రీ దీవించ్రి;
దీవన వింటూ పక్కన నవ్వెను
పుత్తడిబొమ్మా పూర్ణమ్మా.

చిన్నలనందర కౌగిట చేర్చుకు
కంటను బెట్టెను కన్నీరూ;
అన్నలతమ్ముల నప్పుడు పలికెను
పుత్తడిబొమ్మా పూర్ణమ్మా.

అన్నల్లారా! తమ్ముల్లారా!
అమ్మను అయ్యను కానండీ!
బంగరుదుర్గను భక్తితొ కొలవం
డమ్మలకమ్మా దుర్గమ్మా.

ఆయా వేళల పూసే పువ్వుల
ఆయా ఋతువుల పళ్లన్నీ
భక్తిని గోసి శక్తికి యివ్వం
డమ్మలకమ్మా దుర్గమ్మా.

నలుగురు కూచుని నవ్వే వేళల
నా పేరొకతరి తలవండి;
మీ మీ కన్నబిడ్డల నొకతెకు
ప్రేమను నా పేరివ్వండి.

బలబలకన్నుల కన్నీరొలికెను
పుత్తడిబొమ్మకు పూర్ణమకు
కన్నులు తుడుచుకు కలకల నవ్వెను
పుత్తడిబొమ్మా పూర్ణమ్మా.

వగచిరి వదినెలు వగచిరి తమ్ములు
తల్లియు కంటను తడిబెట్టెన్
కాసుకులోనై అల్లుని తలచుకు
ఆనందించెను అయ్యొకడే.

మెప్పటియట్టుల సాయంత్రమ్మున
యేరిన పువ్వులు సరిగూర్చి
సంతోషమ్మున దుర్గను కొలవను
వొంటిగ బోయెను పూర్ణమ్మ.

ఆవులు పెయ్యలు మందల జేరెను
పిట్టలు చెట్టును గూ[illegible]గూ జేరెన్
మింటను చుక్కలు మెరయుచు పొడమెను
పూర్ణమ్మ యింటికి రాదాయె.

చీకటి నిండెను కొండలకోన
మేతకు మెకములు మసలజనెన్
దుర్గకు మెడలో హారములమరెను
పూర్ణమ్మ యింటికి రాదాయె.

కన్నుల కాంతులు కలువల చేరెను
మేలిమి జేరెను మేని పసల్
హంసల జేరెను నడకల బెడగులు
దుర్గను జేరెను పూర్ణమ్మ.

# జహనారా

నిడమర్తి సత్యనారాయణమూర్తి గారు (సారస్వత సమాజము)

సద్గుణసంపన్ను లుదయించుటకు జాతిమతములతోగాని కులగోత్రములతో గాని సంబంధము లేదు. అట్టి వారి సుగుణముల సువాసన చిరకాలము నిలచును. మొగలిపూరేకువలె వారి స్మృతి కాలగతమున వాడినను సుగంధయుతమై నిలచును.

జహనారా అట్టి మానినీతిలకము. ఢిల్లీపాదుషాయగు షాజహానునకు తనయ. 1614 ఆమె జననసంవత్సరము. పదునేడు సంవత్సరముల ప్రాయమున ఆమె తల్లి కాలముచేసెను. అప్పటినుండియు నామె తండ్రికి కుడిభుజమై నిలచెను. తీసిన తరుగని ధనము, చిదిపి దీపము పెట్టగలయట్టి సౌందర్యము, తలలుమార్చగలయట్టి బుద్ధికుశలత గలిగియుండియు నామె జీవితకాలమును దుర్వినియోగము చేయక భగవద్భక్తియందును, పరోపకారమునందును గడిపి ధన్యయయ్యెను.

ఆమె చాకచక్యమును జూచి తండ్రి అన్నిపనులందును ఆమె సలహాగైకొనుచుండెను. మొగలుసామ్రాజ్యమునగల సమస్తజనులును ఆమె సహాయము నపేక్షించుచుండిరి. ఆమెవలన ఎందరెందరో షాజహానుని యాగ్రహమునకు గురిగాక తప్పినారు. ఆమెవలన రాజాంతఃపురమున అంతఃకలహము లెన్నో యడగెను. పేదలెందరో ఉపకారమును పొందిరి. తండ్రి రాజ్యకాలమున నామె వహించిన యధికారగౌరవములు అనూనములు.

షాజహానుని అంత్యదినములు దుఃఖపూరితములు. అతని తనయు లొకరితోనొకరు పోరుటయు, అతని కభిమానకుమారుడగు దారాను మరియిద్దరను గూడ ఔరంగజేబు సంహరించుటయు చరిత్రప్రసిద్ధము. ఔరంగజేబు రాజ్యభారమును వహించి తండ్రిని చెరయందుంచెను. జహనారాను ఔరంగజేబు గౌరవించి పూర్వపుటధికారగౌరవముల [illegible] దలంచెను. కాని యామె మనసు వానివైపు తిరుగలేదు. మొగలుసామ్రాజ్య కత్యంతవైభవమును జేకూర్చి అమృతమగు టాజమహాలును నిర్మించిన ఇంద్రతుం తండ్రియగు షాజహాను బందీగానుండ నామె చూడలేకపోయినది. అతనితో గూడ

యును నిర్బంధమున నివసింపజొచ్చెను. అతనికి సమస్తదుఃఖములందును చేదోడు వాదోడుగానుండి యాతని జీవనభారమును తగ్గించుటకు శక్తివంచనములేక పనిచేసెను. వృద్ధ పాదుషా నిర్బంధమున ఏడువత్సరములకు పైబడి జీవించెను. అంతకాలమును జహనారా యతనికి తోడునీడయైయుండెను.

తండ్రి చనిపోయిన యనంతరము ఆమె పదునైదు వత్సరములు జీవించెను. అపుడామె కోరితెచ్చుకొనిన నిర్బంధమును వీడి నగరిలో నివసించుచు ఔరంగజేబునకు మంత్రిణియై కాలమును గడపెను. మొదటినుండియు ఆమె జీవితము నిరాడంబరముగను, భక్తిపరముగను, ఉపకారపూరితముగను ఉండి ప్రజలప్రేమగౌరవములను చూరగొనెను.

జీవితమునం దెంత నిరాడంబరమో జీవితాంతమునగూడ నామె యంత పటాటోపరహితముగ నుండెను. ఆమె సమాధి అచ్ఛాదనము లేక యున్నది. దానిపై:

"నా సమాధిని పచ్చికతో తప్ప మరి దేనితోను గప్పకుందురుగాక; వినమ్రుల కదిమాత్రమే తగిన పరిధానము."

అని వ్రాసికొనియున్నది.

జహనారా 1681లో చనిపోయినది. ఇప్పటికి దాదాపు 250 సంవత్సరములు కావచ్చినది. అత్యంతవైభవమును, నిరంకుశాధికారమును వహించిన మొగలు సామ్రాట్టులును, సామ్రాజ్యమునుగూడ కాలగర్భమున కరగి రూపరిపోయినవి. నారీశిరోభూషణమగు జహనారా భౌతికశరీరమును నశించినది. కాని యామె కీర్తికాయము శిలవలె నిలిచిపోయినది. ఆమె పితృభక్తి అమృతమగు రూపమును దాల్చి చిరస్మరణీయమై యున్నది. ఇట్టి పితృభక్తిపరాయణలగు సుతలనుగన్న భరతమాత ధన్యురాలు.

# చిట్టెమ్మ పట్టుదల

ఉరవిల్లి నరసింహాచార్యులు గారు బి. ఎ., (సారస్వత సమాజము)

## ౧

చిట్టెమ్మ పుట్టిల్లు కాకినాడ. అత్తవారియూరు రాజమండ్రికి చేరువనున్న కాతేరు.
చిట్టెమ్మ కాపురమునకు వచ్చుసరికి ఆమె భర్తయగు సోమయ్య 'ఇంటరు వీడి యటు' పరీక్షాఫలితముల కొఱకై యాంగ్లదినపత్రికలు వెదకుచుండెను. చిట్టెమ్మ తన యింటఁ గాలుపెట్టినవేళ మంచిదగుటచేతనే తన కుమారుఁడు ప్రథమతరగతిలోఁ గృతార్థుఁడయ్యెనని సరళస్వభావయగు రత్తమ్మగారు మఱి కొన్నాళ్లకాయూరి చెరువుగట్టున గంభీరోపన్యాసమొసఁగిరి. కుమారుని బి. యే. చదివించుటా లేక ఉద్యోగముసేయఁ బంపుటాయను సమస్య పరిష్కరింపకయే సుమారొకనెలకు రత్తమ్మగారు కలరావ్యాధిచే మరణించిరి. పదునెనిమిదేండ్లు నిండని సోమయ్య తలపై ఆతఁడు మోయఁజాలనంత బరువుపడినది.

తన యజ్ఞానదశయందు మరణించిన తన తండ్రి వెంకయ్యగారి నాతఁడెఱుఁగడు. ఎన్నడు స్మరింపలేదు. చిన్నతనమునుండి గారాబముగా పెంచి, విద్యాబుద్ధులుగరపిన మాతృదేవతకొఱకు సోమయ్య బాలునివలె నేడ్చెను. కాపురమునకువచ్చిన నెలదినములకే దన్నెడఁబాసిన రత్తమ్మగారి సుగుణగణములను దలంచుకొని చిట్టెమ్మచాలకాలము వరకుఁ గంటనీరు పెట్టెడిది.

పదునెనిమిదేండ్లు పైఁబడినను సోమయ్య సంసారకష్టసుఖానుభవములందు బాలుఁడే. తప్పని సరిగా నాతఁడాదాయవ్యయపట్టిక తయారుచేసెను. ఆదాయ మైదుపాళ్లు, అప్పులు పదునైదుపాళ్లు. ఇతికర్తవ్యతామూఢులై సాశ్రులోచనులై యానూత్న దంపతులు ఒకరిపైనొకరు దీనదృష్టులఁబరపిరి. నూత్నదంపతులయ్యుఁ దమకు సంభవించిన కష్టపరంపరలచేఁ జిరకాలము సంసారచక్రమునఁ గష్టసుఖముల భాగస్థులైన దంపతులవలెనే చరింపఁజొచ్చిరి. అందుచేఁ జిట్టెమ్మ సోమయ్యతో జంకులేకుండ

మాట్లాడుట కలవాటుపడెను. ఏమిచేయఁగలరు ? పేదసంసారులగు వారి కాయూర దిక్కెవ్వరు ?

ఉన్నట్టుండి చిట్టెమ్మ కొంకయూహ తోఁచెను. తలకొంచెను వాల్చినను, నిశ్చల దృష్టితో దృఢస్వరముతో చిట్టెమ్మ "మీరు బి. యే. తరగతి చదువవద్దు. ప్రస్తుతపరిస్థితులందు మన మొకమాసమైన జీవింప సాధారము లేదు. రెండుసంవత్సరములెట్లు గడచును? అప్పులు మనశక్తి కతీతములై యున్నవి. సర్వస్వమునర్పించి తక్షణమే ఋణబాధా విముక్తి నందవలెను. తరువాత మీ రేదో యొక యుద్యోగమునఁ జేరవచ్చును." అనెను. ఇంటరుమీడియెటుప్యాసయి బి. యే. చదువకుండుట యవివేకమని సోమయ్య చెప్పఁ బోయెను. చిట్టెమ్మ సహేతుకముగ నాతనివాదము బలహీనమని తెలియఁజెప్పెను.

భూములు చాలక యింటినికూడ విక్రయించిరి. అదియుఁ జాలక చిట్టెమ్మకంటియు నొడ్డాణమును విక్రయించిరి. ఋణబాధతీరెను. అమ్మగా మిగిలిన కొన్ని చిల్లరసామానులతోను ముప్పదిరూపాయిలతోను స్వగ్రామమున నిలువనీడలేనందున కాకినాడకు ప్రయాణమైరి. చిట్టెమ్మ సామానుసర్దుచుండ సోమయ్య దస్తాకాగితములపై దరఖాస్తులు వ్రాసి 'ఉదయాస్తాచలసేతుశీతనగమధ్యోర్వీప్రదేశంబున' నెక్కడైన నుద్యోగము దొరకదాయను ధైర్యముతో 'తపాలాపెట్టె'లో వైచెను.

౨

చిట్టెమ్మ పెద్దన్నగారు నారాయణమూర్తి. చిన్నన్నగారు రామమూర్తి. ఒరులకుఁ బెట్టఁ దగినంతగాకున్నను, దమకుమారులు సుఖముగాఁ దినుటకు సరిపడినంత గణించి శీతయ్యగారు గతించిరి. నారాయణమూర్తి ముక్కోపి, పాపములకు భైరవుఁడు. రామమూర్తి దురాలోచనలో దూరాలోచనగలవాఁడు. వారొకనాఁటి మధ్యాహ్నము తలవని తలంపుగాఁ జెల్లెలి సంసారస్థితినిగూర్చి ముచ్చటింపఁజొచ్చిరి. ఆసమయమున నన్నపూర్ణమ్మగారందుకొని కుమారులతో "నాయనా! బ్రతికి చెడ్డకుటుంబము. వెనుక దిక్కులేదు. సోమయ్య పదిరాళ్లు సంపాదించుకొనువరకు వాళ్లను కాపాడండి" అని గద్గదికతోననెను. "జరుగుపాటున్న మంచిదే. కాని పట్నవాసంకాపురంలో పైవాళ్లను ఎన్నాళ్లు పోషింపగలమమ్మా ? అంత్యనిష్ఠూరముకంటె ఆదినిష్ఠూరమే మెరుగ"ని రామమూర్తి పలికెను. "రాముఁడా! పట్టెడన్నమే కాదురా ? చిట్టెమ్మతల్లి కష్టపడుతోంటే చూడగలనురా ?" అని యావృద్ధురాలు వాపోయెను. ఇంతలో నొకయెద్దుబండి వాకిటనిలిచెను.

చిట్టెమ్మయు సోమయ్యయుఁ బ్రత్యక్షమైరి. అన్నపూర్ణమ్మగారు చిట్టెమ్మచేతిలోని వస్తువులనందికొని "రా తల్లీ! నీమాటే అనుకుంటున్నాము." అని బిక్కమొగముతో నున్న సోమయ్యవంక తిరిగి "నాయనా! మహాయిల్లాలు. భూదేవత. ఆవిడ కావిడేసాటి. అలాగంటి ఉత్తమురాలికి పూర్ణాయుస్సు పొయ్యడమ్మా దిక్కుమాలిన భగవంతుఁ"డని పరామర్శించెను. నారాయణమూర్తి యిదివరకే పరామర్శించియుండినందునఁ గొంతసాహిత్యజ్ఞానముగల యాతఁడు పునరుక్తిదోషమున కెడమీయఁడయ్యెను. రామమూర్తి మితభాషణములఁ గొంతవగచెను. బండివాఁడు రెండవసారి యడుగకుండగనే చిట్టెమ్మ తన చీరకొంగున నున్నడబ్బులను లెక్కపెట్టి వానికిచ్చివేసెను. "ఏమీ బండిలో మరచిపోలేదు గదా?" యని సోమయ్య బండి తనిఖీచేసెను.

## 3

రెండు మూడుదినములు గడచెను. సోమయ్య తన దరఖాస్తులకుఁ బ్రత్యుత్తరములాశించి పోస్టాఫీసు పరిసరములఁ దిరుగుటఁగనిన రామమూర్తి యెగతాళి ప్రారంభించెను. భోజనసమయమునకు సోమయ్య రానిచో నాతనికొఱకు నిరీక్షింపమానిరి. ఆతఁడు తాము గూర్చున్నచోటి కరిగినఁ గూర్చుండుమనుటమానిరి. ఈ నిరసనభావమును సోమయ్య గుర్తింపనేలేదు. చిట్టెమ్మ గుర్తింపకుండలేదు. నారాయణమూర్తిభార్య సావిత్రి పుల్లవిరుపుమాటలచే చిట్టెమ్మకు మనోవేదనఁ గూర్పఁజొచ్చెను. అన్నల ముఖచర్యల ననుసరించి యెంత మెలకువగఁ బ్రవర్తించినను వారామెను గసరుచుండిరి. ఒకనాఁడు చిట్టెమ్మ చేతినుండి చెంబు క్రిందపడెను. సావిత్రి యాశబ్దమువిని కారణమరసి "చెంబులు పగులఁగొట్టకమ్మా! నీకుఁ బుణ్యముండును. పాడుచేయుట సులువే. బాగుచేయుట కష్టము." అని కసరెను. చిట్టెమ్మ సిగ్గుపడెను. సమయమునకు నారాయణమూర్తివచ్చి రుసరుసలాడెను. చిట్టెమ్మ యేడ్చెను. తల్లి యోదార్చెను. ఒకనాఁడు చిట్టెమ్మ తనభర్త పట్టలను విస్త్రీచేసి తెమ్మని చాకలి కిచ్చెను. వాఁ డాసాయంకాలమున కాపట్టల నదికి తెచ్చెను. "ఏమిరా! యిట్లు తెచ్చితి?"వని చిట్టెమ్మ కసరెను. "సావిత్రమ్మగా రొద్దన్నారండి" అని వాఁడు జవాబుచెప్పెను. చిట్టెమ్మ తలవాల్చెను. ప్రతిదినమేదో కారణమునఁ జిట్టెమ్మను అన్న లీసడించుచుండిరి. పతిహితాభిలాషిణియగు నా బాలిక వానిని మిగుల శాంతముగ భరించుచు సోమయ్య చింతించు నేమోయని యాతని చెవి కెక్కనీయకుండెను.

దసరాపండుగ సమీపించెను. నారాయణమూర్తి తనకును తనభార్యకును రామమూర్తికిని ఆతనిభార్యకును నూత్నవస్త్రములఁగొని తెచ్చెను. సావిత్రమ్మ వానిని దన యింటికివచ్చిపోవువారికిఁ జూపి వారి సదభిప్రాయములఁ గైకొనుచుండెను. ఉబుసుపోవని కొందఱు 'ఆడుబిడ్డకును బావమఱదికిని దెచ్చినవేవమ్మా?' అనిరి. 'సంసారులము గదా! ఎన్నివిధములఁ బెట్టఁగలమమ్మా? వేళకుఁదిని గోళ్లుమీటుకొనుచుఁ గూర్చుందుర'ని [illegible]దె మొదలుపెట్టెను. చిట్టెమ్మ కామాటలు శూలములు గ్రుచ్చినట్లయ్యెను. ఇంతలో అన్నపూర్ణమ్మగారు వచ్చి 'సావిత్రీ! పచ్చనిముత్తైదువ యింటనుండఁగా దానికొక చీరతేవద్దా?' యనెను. ఎక్కడనుండెనో కాని నారాయణమూర్తి విసవిసవచ్చి 'చీరాసింగినాదమని చెప్పఁగానే సరా? డబ్బు పెట్టక చీరలు దొరకునా? అమ్మగారినీ అయ్యగారినీ నెత్తిమీద నెక్కించుకున్నాము. చాలదా? తినుటకన్నము లేనప్పుడు ముప్పొద్దుమేపుచుంటిని. ఇఁక నేమిచేయఁగలను.' అని తీవ్రముగాఁబలికెను.

పాలపొంగువలె నుబుకుచున్న దుఃఖమును దిగమ్రింగి 'అన్నయ్యా! కాలకర్మమున మీయింటఁ జేరితిమి. వారి చెవినిబడెనా చాలపరితపింతురు. ఉన్నన్నినాళ్లుండఁ బోము. పట్టెడన్నమునకే మేము కలకాలముఁ గృతజ్ఞులమై యుందుము. చీరలు నగలు నేనడిగితినేని నీచిత్తము వచ్చినట్లు తూలనాడుము. నాయందు దయయుంచి మఱి కొన్నాళ్లు మమ్ము గాపాడుము.' అనిదీనయై కన్నీరొలుకఁబలికెను. అచ్చటచేరిన వారిలోఁ గొందఱు 'తోఁబుట్టువు నేడ్పింపరాదు. తమ్ముఁడొకటియుఁ జెల్లెలొకటియునా?' యనిరి. సావిత్రమ్మ అందుకొని 'మేమేమి యేడ్పించితిమి? చీరెలు సారెలు కావలెనని తానే యేడ్చుచున్నదికాని. మమ్ము రట్టుచేయ దాపురించినదమ్మా! నలుగురి నోళ్లలోఁబడవైచుట'కనియేడ్వఁజొచ్చెను. నారాయణమూర్తి మండిపడుచు తన పాలిటి శనిగ్రహములనియు, బ్రహ్మరాక్షసులనియు సోమయ్యను జిట్టెమ్మను నోటికి వచ్చినట్లు దుర్భాషలాడెను. ఒడలెల్ల కంపింప చిట్టెమ్మ చేతులుమోడ్చి 'అన్నయ్యా! పండుగ వెళ్లిన మఱునాఁడు మఱొక్కచోటికిఁ బోదుము. ఈ రెండురోజులు మమ్ము తలదాచికొననిమ్మని' వేడుకొను కొలది నారాయణమూర్తి చెలరేగి 'అట్లుకాదు. నేఁడే పోవలెను. పోయి యిద్దరు చెరియొకవీధిని బిచ్చమెత్తుఁడు. పోరేని మెడమీద కత్తివైచి గెంటింతు'నని ప్రతిజ్ఞచేసి లోనికేగెను. వెక్కి వెక్కి యేడ్చు నాబాలికను జేరఁదీసికొని అన్నపూర్ణమ్మగారు 'చిట్టితల్లీ! ఏడువకు. నేను జీవించియున్నంతవరకు నీకులోటు రానీయను.' అని బుజ్జగించి లోనికి తీసికొని పోయెను. సభ చెదరిపోయెను.

౪

కాకినాడయందుఁ దనసహజసరళస్వభావమునఁ బెక్కురు మిత్రుల సంపాదించి వారితోఁ గాలక్షేపమొనర్చుచు గృహమునందలి కల్లోలముల నెఱుఁగని సోమయ్యకు నిన్న రాత్రినుండి చిట్టెమ్మ భుజింపలేదను సంగతి తెలియదు. దంతధావనమొనర్చి 'కాఫీదేవాలయము'న కరుగఁబోవుచు దక్షిణకుఁగాను భార్య నతివినయమున సమీపించెను. చిట్టెమ్మ కనులుబ్బి యెఱ్ఱబడినవి. 'ఏమిట్లుంటివి?'వని సోమయ్య కలవరపడి ప్రశ్నించెను. "ఏమియులేదు. పొరుగింట నెన్నినాళ్లుందుము? పోయినవి పోగా మిగిలిన యీ పుదుచ్చేరినానును తెగనమ్మి కొంతడబ్బుతెండు. ఉద్యోగము దొరకువరకును ఎట్లో కాలము గడపుదమని చిట్టెమ్మ పలికెను. సోమయ్య తొట్రుపాటుతో 'అయ్యో! ఉన్న దొక్కటే నగ. దాని నమ్మమందువు. ఏమిమునిగిపోయినది? డబ్బులేకున్న నేమిత్రుని యొద్దనైన పదిరూపాయలు బదులు తెత్తును. లేదా యీనగ తాకట్టుపెట్టి తెచ్చెదను' అనెను. చిట్టెమ్మ తన సహజగంభీరస్వరమున "అట్లుకాదు. బదులు కొఱకరిగినచో మీమిత్రులకు మీయందు గౌరవము తగ్గి యీసడింతురు. ఆ బదులు తీర్చుటకయిన నగలమ్మవద్దా? ఇఁక తాకట్టన్న సగముధర కమ్ముట. కాబట్టి నమ్మకముగల మిత్రునితోఁ బోయి దీని నమ్మివైచి మనకు సరిపడు నొక చిన్న యింటినద్దెకుఁ దీసికొనుఁడు." అని తన మెడనున్న యాభరణము సోమయ్యచేత నిడెను. సోమయ్య నగతీసికొని పురములోని కరిగెను.

౫

రివిన్యూశాఖయందలి యున్నతోద్యోగులలో మంచివారని ఖ్యాతినందువారరుదు. డిప్యూటీకలెక్టరుపదవియందున్న రాఘవరావుపంతులుగారు అట్లుగాక ఉదారహృదయులని దీనబాంధవులనియుఁ బేరుగాంచిరి. కుమారులతోను కూతుండ్రతోను వారి గృహమునేఁడు మిగుల సందడిగనున్నది. జాముప్రొద్దెక్కిన పిదప కంసాలి వీరయ్య సోమయ్యతో వారిదర్శనమునకువచ్చి యిద్దరును బంతులవారికి నమస్కారములొనర్చి వారి యాజ్ఞపైఁ గూర్చుండిరి. వీరయ్య సంభాషణమున కుపక్రమించి "తమ కొకపుదుచ్చేరి నాను కావలయునంటిరి. చిత్తగింపుఁ"డని సోమయ్య చేతిలోని యాభరణము నందికొని పంతులుగారి కిచ్చెను. వారు దాని పనితనమునకు మెచ్చి అదితమవారికి సరిపోవుటచే ధర నిర్ణయించి సోమయ్య వంకచూచి "నాజూకయిన వస్తువు. తగుకారణము లేకుండ

వ్రికయింప"రనిరి. సోమయ్య తన వృత్తాంతము నామూలాగ్రముగ వినిపించెను. పంతులు గారు మిగుల జాలిపడి 'ఏమిచేయుదును? వారము దినములక్రింద నాకచ్చేరిలోనే యొక యుద్యోగముండెడిది. మఱియొక్కరికిచ్చితిని. ఏదీ? మీదస్తూరీ చూడనిండు. బాగు న్నది. ఈసారి కాళీవచ్చినా తప్పక మీకు కబురంపుము'నని యాతనిపేరు వ్రాసికొనిరి. ఈసంభాషణమంతయుఁ బ్రక్కగదినుండి యాలకించుచున్న పంతులుగారి భార్య లక్ష్మ మ్మగారు కిటికీనుండి సోమయ్యవంకఁ జూచిరి. లేతవయసున నాతఁడుపడు కష్టముల కామె హృదయము కరిగిపోయెను. పంతులువారు లోనికి వచ్చుటయే తడవుగ వారితో 'మీరాతనికిఁ దప్పక యుద్యోగ మీయవలయును. ఆతని దీనచరిత్రమును వింటిని. మఱియొకసంగతి—తమరీయఁబోవు రెండువందల రూపాయల నాదీనదంపతులెట్లు దాచఁ గలరు? మనయొద్దనేయుంచి ప్రతినెలకుఁ గొంతయిచ్చిన వారిని దుర్వ్యయమునుండి కాపాడగలుగుదుము. ఈలోఁగా నాతనికిఁ బ్రతుకుఁదెరువుఁజూప దైవమువలె మీరే కలర'నియనెను. సోమయ్య యీ సంభాషణమాలకించి పంతులవారితో 'నాదీనదశ తమ దర్శనమునఁ దొలఁగిపోయినది. నాకు నెలకు పదునైదురూపాయల చొప్పున నిచ్చినఁ జాలును. పెద్దలకు శ్రమఁగూర్చుచుంటి' ననెను.

సోమయ్య పదునైదురూపాయలతోఁ జిట్టెమ్మయొద్దకువచ్చి జరిగిన సంగతి పూస గ్రుచ్చినట్లు తెలిపెను. అంతయు శాంతముగ నాలకించి నిట్టూర్పుతోఁ గష్టసముద్రమున మునిఁగి తేలు మనకాధారముగా భగవంతుఁ డొకతెప్పను జూపించినాడు. భీకర తరంగములకు జడియక కష్టములని వెనుదీయక మనమా తెప్పతోఁ గష్టసముద్రమును దరిం పవలెను. తుమ్మచెట్టు క్రిందఁ దలదాచికొని యవస్థపడుచున్న మనకుఁ గల్పవృక్షము నీడ లభించినది." అనెను.

వెంటనే యాదంపతులు విశాలమగు నాపురమున మూలమూలలు శోధించిరి. వాసార్హముగనున్న యొక పూరింటినద్దెకుఁ దీసికొని యానాడేయందుఁ బ్రవేశించిరి. చిట్టెమ్మ ఆ యింటిని శుభ్రపరచి సామానంతయు సర్ది భర్తరాక కెదురుచూచుచుండ సుమారు రెండుగంటలవేళ సోమయ్య బుజముపై మూటతోవచ్చెను. ఆనాఁడాదంప తులు గంజియన్నమైన మనస్సంతుష్టిగా భుజించిరి. తర్వాత సోమయ్య పంతులవారి యింటికరిగి వారింటలేకుండుటచే లక్ష్మమ్మగారికిఁ దాను కాపురమున్న చోటునెఱింగించెను. పదిదినములు ప్రశాంతముగఁగడచి పోయెను. 'ఘోరులేని గంజి బొక్కెడే చాలున'ను

సఖ్యభావము నెఱిఁగిన యాదంపతుల జీవనము ప్రశాంతముగఁ గడువదా? ఒకనాఁడు డవాలీబంట్రోతువచ్చి పంతులుగారు రమ్మనిరని సోమయ్యను గొంపోయెను. ఒక గంటలో సోమయ్య తిరిగివచ్చి 'కలెక్టరుగారి కచ్చేరీలోఁ బదునైదురూపాయలు జీతముగల గుమాస్తాపని పంతులుగారి దయవలన లభించె'నను శుభవర్తమానము చిట్టెమ్మకుఁ జెప్పెను. "అమ్మయ్య ! మనోవేదన తొలఁగెన"ని చిట్టెమ్మ పలికెను.

## ౬

తెలతెలవాఱుచుండ లేచి చిట్టెమ్మ గృహోపకరణములను శుభ్రపరచి నీళ్లుతోడి సిద్ధపరచి భర్తను లేపును. సోమయ్య లేచి, దంతధావన మొనర్చి స్నానమొనరించి చలిదియన్నము భుజించి సూర్యోదయమునకు బూర్వమే కచేరికిఁ బోవును. తన వినయ ప్రవర్తనమువలనను, గార్యదీక్షవలనను అచిరకాలముననే యాతఁడు కచ్చేరీలో నందఱి యభిమానము నందఁగలిగెను. బండపనులన్నియు సోమయ్యపాలు కష్టమనక నిష్ఠురమనక సుఖమనక సుకుమారమనక విసువనక విరామమనక యంత్రమువలె పాటుపడు సోమయ్య యోర్పును పంతులువారు పొగడఁ జొచ్చిరి. ఇంతటికష్టమును చిట్టెమ్మ మందహాసశోభితవదనారవిందమును, ఆపతిసేవాపరాయణ మృదుమధురోపచారవాక్యములును విస్మరింపఁజేయుచుండెను. సోమయ్య పంతులవారి యింటికి వెళ్లినపుడెల్ల లక్ష్మమ్మగారు వారిక్షేమసమాచారముల గనుగొనుచుండిరి.

ఒకనాటి సాయంకాలమున లక్ష్మమ్మగారును బిల్లలును 'క్రొత్త గుమాస్తా'గారి యింటికిఁబోయిరి. ఆడంబరరహితమగు శుచిర్దేవత కాలవాలమైన యాయింటిని చూడగనే యిల్లాలెట్లుండునో లక్ష్మమ్మగారూహించుకొనఁగలిగిరి. పసిమి, మిసిమిఁజిమ్ము శరీరశోభయే భూషణముగా, పరిశుభ్రమగు నేతచీరయే చీనిచీనాంబరముగా మూర్తీభవించిన యార్యనారీస్వరూపమో యనదగిన పదునైదేండ్ల బాలిక—చిట్టెమ్మ—వారి నాదరించి లోనికిఁ గొంపోయెను. పడకగదియు—వంటయిల్లును పరీక్షించి యానందించి పెరటిలోని కరిగిరి. పెరటిలో చాలుగా నాటఁబడి మిగుల జాగరూకతతోఁ బెంపఁబడుటచే నిలువెల్ల పుష్పించి చూపరులనాకర్షించు బంతి, చేమంతి మొదలగు పూలచెట్ల నడుమ నొక గుడ్డకుర్చీయుఁ బ్రక్కనే యొకచాపయునుండెను. పగలెల్ల శ్రమపడివచ్చిన సోమయ్య దానిపై గూర్చుండి ప్రకృతిసౌందర్యమును దర్శించుచుఁ దనపాదములయొద్ద చాపపై గూర్చుండి సతిజిలిబిలిపలుకుల నాలకించుచు నానందించుచుండునని లక్ష్మమ్మగారూహించిరి.

"అమ్మాయీ! ఇంత చిన్నవయసున గృహకృత్యములయందు భర్తృసేవయందు ఇంతశ్రద్ధచూపుచున్న నీవు నేఁటికాలపు స్త్రీలకాదర్శముగా నుండఁదగినదానవు. సోమయ్యగారి సత్ప్రవర్తనము మావారెన్నిసారులో మెచ్చుకొందురు. కష్టములు కాపురముండవు. వంటయైనదా? ఈ పూటకేమివండితివి" అనిప్రశ్నించెను.

చిట్టెమ్మ ప్రసంగము మార్పనెంచెను. లక్ష్మమ్మగారాసంగతి కనిపెట్టెను. విధిలేక ముత్తెములవంటి రెండు బాష్పబిందువులు ననుజెక్కిళ్లపైరాల 'రెండు ఏడియములు వారికొఱకుఁ గాల్చితిని' అనెను.

"తల్లీ నీ మాట?"

"నామాటకేమి? కష్టకాలముగడచినఁ గావలసినంత సౌఖ్యపడవచ్చును"—అని చిట్టెమ్మ ముగింపక పూర్వమే లక్ష్మమ్మగారు వీధిలోనికివచ్చిరి. వారిని వీడ్కొలుపఁ దొందరగావచ్చు చిట్టెమ్మకు "అమ్మా ఎందుకే యేడుత్తోంటే?" అను నైదేండ్లవయస్సుగల లక్ష్మమ్మగారి కుమారుని మాట చెవులఁబడెను.

మరునాటి సాయంకాలమున సోమయ్య ఇంటికివచ్చి "చిట్టీ! నన్ను ముప్పది రూపాయల గుమాస్తాగా వేసి"రని యానందముతోఁ బలికెను.

## 2

పదునైదు సంవత్సరములు గడచినవి రాఘవరావుపంతులుగారి దయవలన సోమయ్యపంతులుగా రిప్పుడు తహశ్శీల్దారు పదవియందున్నారు. షోడశకళాపూర్ణుఁడగు సోమునివలెనే తన్నామాంకితులగు వీరును తమశీతలకరుణాకటాక్షములఁ బ్రజలనలరించుచున్నారు. చిట్టెమ్మయందు వయసునందు తప్ప యితర మార్పులేమియులేవు. పదునైదేండ్ల క్రిందఁ బగలెల్లఁ బాటుపడి గృహాగతుఁడైన పతికెట్లుపచారమొనర్చెడిదో నేడును అట్లే సౌఖ్యముఁగూర్చుచున్నది. నాటిపూరింటివలెనే నేటి సౌధమును బరిశుభ్రతయందు సాటిలేకున్నది. పెరడులోని పూలచెట్లు—పూలచెట్లమధ్య భర్తయును దర్శకులును విశ్రమించుటకుఁ గుర్చీలువేయుట భర్తయారోగ్యమునకును, అభిరుచికిని సరిపడు ఆహారపదార్థములు చేయుట నేడును చిట్టెమ్మ విధాయకకృత్యములే.

ఒకనాఁటి సాయంకాలమున ఒక పెద్దమనుష్యుఁడు పూలచెట్లమధ్య పడకకుర్చీపై విశ్రమించు పంతులవారి యొద్దకు చేతి నొక దరఖాస్తుతో వచ్చెను. పంతులుగారు దరఖాస్తు చిత్తగించి 'ఏమండీ! కరిణీకముఁగోరి వచ్చితిరిగదా! పరీక్షలు ప్యాసయితిరా? అట్లు కానిచో సహాయము చేయఁజాల'ననెను.

ఆతఁడు చేతులు నలుపుకొనుచు "చిత్తము. కాలకర్మమున నుద్యోగము లేక జీవనము జరుగని స్థితిగలిగినది. బ్రతికి చెడినవాఁడను" అనెను.

"మీపేరు ?"

"పరిమి నారాయణమూర్తి."

"మీతండ్రిగారు శీతయ్యగారా ? మీతమ్ముఁడు రామమూర్తేనా ?"

"చిత్తము."

"బావా ! చాలకాలమునకుఁ గన్పించితివి. చిట్టీ ! మీయన్నయ్య వచ్చినా"డని భార్యను బిలిచెను.

చిట్టెమ్మ యొక్కసారి తొంగిచూచెను.

"చిట్టీ! నేను నారాయణమూర్తిని."

"కోపము విడువలేదా ? క్షమింపవా ?" అని నారాయణమూర్తి బ్రతిమాలెను.

చిట్టెమ్మ మాట్లాడలేదు.

"చిట్టీ ! చాలకాలమైనది. వెనుకటిసంగతి మరచిపొమ్మ"ని పంతులుగారు పలికిరి.

చిట్టెమ్మ మాట్లాడలేదు.

"బావా! లోపలికి రావోయి." అని పంతులుగారు నారాయణమూర్తిని లోనికిఁ గొంపోయిరి. ఐదేండ్లకుమారుఁడు రాఘవరావును మేనమామకుఁ బరిచయముఁ గలిగించెను. చిట్టెమ్మ యానాడు వడ్డింపనేలేదు. ప్రక్కయింటి ముసలమ్మగారు వడ్డించిరి. చిట్టెమ్మకుమారునకుఁ బాఠముఁ జెప్పుచుఁ గూర్చుండెను. మఱునాటి యుదయమున నారాయణమూర్తి పయనమై పంతులవారి యొద్దకేగి రెండుచేతులును బట్టుకొని "బావగారూ! అపరాధిని. ధనగర్వమున విఱ్ఱవీగిన ఆజన్మ యంతరించినది. దీనదేవత కాలవాల

మగు నీజన్మ మిగులభారముగా నీడ్చుచుంటిని''—అని విసవిస నడువఁజొచ్చెను. సోమయ్య పంతులుగారాతని వెనుకకుఁబిలిచి "బావా! మీ అమ్మగారినీ నీభార్యను బిడ్డలను బంపవోయి. చూచి చాలకాలమైనది'' అని జవానుచేతికిఁ గొంతపైకమిచ్చి కూడఁబంపిరి. మఱునాటి సాయంకాలమునకు నారాయణమూర్తి కుటుంబమంతయువచ్చి వ్రాలెను. పంతులవారు బండియొద్దకుఁబోయి వారి నాహ్వానించిరి. చిట్టెమ్మ తల్లికిఁ జేయూఁతనిచ్చి బండిదింపి కష్టసుఖము లడుగుచు గదిలోనికిఁ దీసికొనిపోఁబోయెను. పంతులవారామె దారికడ్డునిలిచి "ఎంతకాల మీపట్టుదల? నామాటవిని పట్టుదల విడువు''మనిరి. ఉద్వేగమునఁ బొడమినగద్గదికతో "పదునైదేండ్ల క్రిందట నావదినయు నన్నయు బలికిన పలుకులు నాచెవియందింకను ప్రతిధ్వనించుచున్నవి. నాఁడు నన్నమ్మనిచ్చినపుడు నీవిట్లుంటివేమని యడిగితిరి. అన్నయు వదినయుననరాని మాటలనుటచే నిద్రాహారములు మానివిలపించుటచేనని ఆనాఁడు చెప్పలేదు. బిచ్చమెత్తి జీవింపుమని నాయన్న సలహానిచ్చెను. దైవకృపవలన నోడలు బండ్లైనవి. బండ్లోడలైనవి''యని వెక్కివెక్కి యేడ్చెను. పంతులవారి బుజ్జగింపుమాటలో అన్నపూర్ణమ్మగారి యాత్మహత్యాప్రతిజ్ఞయో చిట్టెమ్మ పట్టుదల మాన్పించినవి.

## శ్రీ అన్నపూర్ణాదేవి

శ్రీమతి చట్టి రాధమ్మగారు

శ్రీ ఆంధ్రగర్భాన స్త్రీరత్నమైపుట్టి బెంగాలు యొడిలోన పెరగినావు
గాంధిబోధల యుద్ధరంగమున దిగుచు రాట్నమునుపూని ఖద్దరు కట్టినావు
'మమ్ము మరచిన దేశమ్ము మరవ' కనుచుభర్తతోపల్కి అమెరికా కంపినావు
అతడు వచ్చినతోడ నాతని కెదురుగఁబోయి పూజించి ఖద్దరు పుట్టమిచ్చి

కట్టియున్నవి వారాశి గలపినావు
భరతస్త్రీజాతియౌన్నత్య మరసినావు
మరల వెలయవె సోదరిమమ్ము బ్రోవ
ఆంధ్రనారీవతంస! శ్రీ అన్నపూర్ణ!

# స్త్రీలు–వారిస్థానము

విద్వాన్ సూరిగుచ్చి కృష్ణమూర్తిగారు

"ఎంతగ వాదమేల యవివేకుల పోలిక, స్త్రీలవిద్య సి
ద్ధాంతమె చేసినారు, మన తజ్ఞులు."

భగవంతునిచే మానవజాతియందు సృష్టింపఁబడిన స్త్రీ పురుషులనువ్యక్తులలో స్త్రీ జాతికి మాత్రము సామాన్యముగ మన మెఱింగినంతవఱకు ప్రాచీనార్వాచీన కాలములో స్వాతంత్ర్య మేవిషయముననుగాన రాదు. దీనికిఁగారణమేమి?. స్త్రీలకుఁ బ్రపంచమున నెట్టిస్థానముగలదు? అను విషయము మనము విచారింపవలసి యున్నది. స్త్రీల కిట్టియధఃపతనము గలుగుటకు ప్రథమకారణము పురుషులే. రెండవది వారి యజ్ఞానము. పురుషులకారణముగ స్త్రీజాతియొక్క సంపూర్ణమైన హక్కులను లాగికొని తమ యిష్టము వచ్చినట్లు స్మృతులు మొదలైన వానియందు స్త్రీలు స్వాతంత్ర్యాదుల కనర్హులని వ్రాసిరి.

వివేకము వ్యక్తుల మీద నాధారపడియున్నది గాని లింగముమీఁదఁగాదు. మగవాఁడును జెప్పినది గ్రహింపఁజాలని యవివేకకావచ్చును. స్త్రీయుఁజెప్పినది గ్రహింపఁజాలిన బుద్ధిమతి కావచ్చును. కాని మొదట స్త్రీజాతికి విద్యాదులం దధికార మీయక వారిని నిరుత్సాహులఁ గావించుటయే యీదరిద్రమునకు హేతువు. కొన్నికొన్ని ప్రమాణస్మృతులందు స్త్రీయైనను ధర్మాదుల నుపదేశింపనగునని వ్రాసియున్నది. భవభూతి యుత్తరరామచరిత్రములోని యాత్రేయి వాల్మీకియొద్ద నభ్యసించుచుఁ గారణాంతరములచేనట విద్య కధ్యయన ప్రత్యూహము సంభవించుటచేతనే గదా మఱియొకయెడ కరిగినది?. ఇట్లే గార్గి మొదలైన వనితామణులు విదుషీమణులని మనము వినుచున్నాము. "గుణాఃపూజాస్థానం గుణిషు నచలింగం నచవయః" యనిగదా మహాకవి చెప్పినది?

"స్త్రియస్తథా పాలనీయాః యథాతాః కార్యవస్తుని,
పుంవత్ప్రవృత్తి మాధాయ సాధయే యురనాకులాః"

కావున స్త్రీలు విద్యాభ్యాసమున కనర్హులను వారి వ్రాత యవివేకమూలమనుట నిర్వివాదము. ఇఁకను స్వాతంత్ర్యము విషయమై కూడ "యథైవాత్మా తథాపుత్రః పుత్రేణదుహితాసమా" యనిమనుస్మృతి.

"నపరదారాన్ గచ్ఛేత్" అను విషయము పురుషుల కెట్లవశ్యాచరణీయమో అట్లే యువతులకును పాతివ్రత్య మవశ్యాచరణీయము. తప్పిచరించిన వారు వారి వారి కర్మానుసారమైన పుణ్యపాపముల ననుభవింతురు.

మొదటినుండియు రాణివాసమునందే యుండియు భర్తగతించిన వెనుక మాసమున కైదువేలరూప్యము లిత్తుమని రాజ్యమును స్వాధీనము చేసికొనిన యాంగ్లేయులపై కత్తిదూసి పురుషవేషమునం బురుషులు తల వంచుకొనునట్లనితరధైర్యశౌర్యసాహసములం జూపి కదనరంగమున వీరస్వర్గమును బొందిన వీరవనితఝాన్సీ లక్ష్మీబాయి నింకను దేశము విస్మరింపలేదు. యుద్ధమునందు జయము లభింపదను సంశయముచే బారివచ్చిన ఖడ్గతిక్కనను, గన్నకడుపైనను దల్లియుం, బతియైనను భార్యయుం, బరిహాసమొనర్చి 'తిరిగి యుద్ధమునకుం బురికొల్పిరి. ఇంతింతయనరాని రాజభక్తిగలిగిన "పన్నా" యను వృద్ధదాసియే తన కుమారుని మృతికైన నంగీకరించి పసికూనయైన మేవాడరాజకుమారుండైన ఉదయసింహుని జంపనుంకించిన "బనబీరు"ని మాయో పాయములనుండి రక్షించినది.

"నీలోత్పలదళ శ్యామాం విజ్జికాంమహామ జానతా,
వృధైవదండినా ప్రోక్తంసర్వ శుక్లాసరస్వతీ"

అని చెప్పి స్వీయానితరసాహితీవిశేషమునం బ్రజలను మెప్పించి సంస్కృతభాషయందనేక గ్రంథముల రచించిన "విజ్జిక" యను విదుషీమణియే స్త్రీప్రతిభ కాదర్శభూత. కాని యీమె వ్రాసిన గ్రంథములు కాన రాకున్నను మొనమొన్ననే పరిశోధకులు శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు తంజావూరినుండి యెక్కుడు శ్రమతో "కాముదీమహోత్సవము" అను నొక సంస్కృత నాటకమును బ్రకటించి యది విజ్జిక రచించినదనియే నిశ్చయించిరి. కాలక్రమమున నిట్లేయన్ని గ్రంథములును వెలువడంగలవు.

"పార్థస్య మన సిస్థానంలే భేఖలు సుభద్రయా,
కవీనాంచవచోవృత్తిచాతుర్యేణ సుభద్రయా"

అని చెప్పుకొనిన సుభద్ర మొదలగు విదుషీరత్నములు పెక్కుమంది జనించిరి. మొన్నమొన్ననే గదా యెంతయో శ్రమపడి తనంతతానే యనేకభాషలలో సాహిత్యము సంపాదించి యమూల్యమైన యుప దేశములొనర్చిన భండారు అచ్చమాంబగారు గతించిరి. ఇట్లే లెక్కకుమీఱిన విదుషీమణులు అన్ని జాతుల యందును బుట్టినారు. నేడును చాలమంది ప్రతిభగలిగిన యువతులున్నారు.

కాన స్త్రీలకు విద్యాభ్యాసాదు లనవసరమను పనికిమాలిన వాదమును వీడి పురుషులతోం బాటు సమస్తవిషయములందును స్త్రీలకును స్వాతంత్ర్యమీయవలయును. అపుడే దేశాభ్యుదయము గలుగుట కవ కాశముండును. ప్రపంచమున పురుషులకెట్టి స్థానముగలదో స్త్రీలకు నట్టిస్థానముగలదు.

('వంగలక్ష్మి'యను బంగాలీమాసపత్రికలోని సంపాదకీయానుసరణము.)

# స్వర్ణగౌరి

శ్రీమతి కాంచనపల్లి చూడామణిగారు

సరస్వతీనదీతీరమున విమలయను నొక నగరరాజముగలదు. ఆనగరాధిపతి యగు చంద్రప్రభుడను వానికి మహాదేవి, విశాలాక్షి యను యిరువురు భార్యలుగలరు. ప్రథమభార్యయగు మహాదేవి యణకువగల ప్రేమాస్పదమైన సహచారిణియై పట్ట మహాదేవి యను నామమును సార్థకపరచుచుండెను.

ఇట్లుండ ఒకానొక దినసంబున విమలాధిపతి విహారార్థమురుగ మధ్యేమార్గమున దారి కడ్డముగ పక్షులచేతను, విహంగకన్యకలచేతను పరివేష్టింపబడిన పద్మపూరిత సరోవరంబొండు గాంచి, విహంగకన్యకలు ఆపద్మముల నారాధించుచున్నటుల తెలిసి కొనెను. అంత పృథ్వీపతి సంభ్రమాశ్చర్యానందపరవశుడై ఆకన్యకల "మీరేమిటా యారాధించుచున్నది?" యని ప్రశ్నింప అదియొక వ్రతమనియు, దానిపేరు "స్వర్ణగౌరీ" వ్రతమందురనియు, కైలాసనాథుని అర్ధాంగియగు గిరిసుతయొక్క అపరావతారమనియు, ఐశ్వర్యప్రసాదినియనియు నుడివిరి. అనంతర మాభూరమాపతి ఆవ్రతవివరముల నశేషరహితముగ వినిపింప ప్రార్థించెను. "శ్రావణశుద్ధతదియ మొదలుగ పదునారువత్సరములు యేకదీక్షగ యీవ్రత మెవ్వరు శ్రద్ధాభక్తులతో నాచరింతురో వారలకు తప్పక యైశ్వర్య మొనగూడు"నని వారలు చెప్ప అందులకు రాజువల్లెయని వారలచేత పదహారు దారములు కలిపి పేనబడిన యొక దారమును తన కుడిముంజేతి కంకణమునకు ముడి వేయించుకొనెను. ప్రతిశ్రావణ శుద్ధతదియ నాడును స్నానముచేసి, యీవ్రత మాచరించి ఆదినమంతయునుపవాస ముండవలయునని వారుపదేశించిరి. ఉపవాసానంతరము యొకసత్ శ్రోత్రియభూసురోత్తముని భార్యాసహితుడై సహపంక్తి భోజనమున కాహ్వానించవలయుననియు, వారల సమ్ముఖమున యీవ్రతమాచరించి ఆపదహారునూలుపోగులతో పేనబడిన దారమును తన వామహస్తమున కట్టుకొనవలయుననియు, తదనంతరము విప్రవరులకు భూములు, గోవులు, సువర్ణము, ధనము, వస్త్రములు, మొదలుగా యథాశక్త్యానుసారము దానమియ్యవలయుననియు, వివాహమయిన పదహారుగురు స్త్రీలను పిలచి

నూతనవస్త్రధారణ గావించి, పసుపురాసి, గంధముపూసి, బొట్టుపెట్టి, అక్షింతలు యిచ్చి యేమైనను సుగంధఫలపుష్పవాయనములతో వారల సత్కరించవలయు ననియు, యీవ్రతము పదహారు వత్సరములు భక్తిపూర్వకముగ యెవ్వరాచరింతురో వారలకు యిహమున నైశ్వర్యమును, పరమున ముక్తియును, యొనగూడునని బోధింప యమ్మహీపతియందుల కిష్టపడి యచ్చోటనే మొదటివత్సరవ్రత మాచరించి యేకహస్తబద్ధకంకణుడై యధాక్రీతిని విహారానంతరము తన మహలున కరుదెంచెను.

సువర్ణమయమైన యాతని మందిరమందు నూలుత్రాడు తన హస్తము నలంకరించి యుండుట తన ప్రథమప్రియభార్యయైన మహాదేవి విలోకించి, కుపితురాలై అత్యాగ్రహావేశపూరితమగు డెందంబున భర్తముంజేతి నూలుత్రాటిని తెంచి కిటికీనుండి క్రిందకు విసరివైచెను. రాజంతవానికి యీనూలుపోగు కర్మమేమిటని తెలియక తెంచి పారవైచెను గాని ఆమెకు దీనిమహిమ యిసుమంతయు తెలియదు. తెలిసియే యున్నచో యిట్లాచరించనే యాచరించదు గదా! గనుక యిందులకే యేకార్య మాచరించినను ఆలోచన అగత్యమని పెద్దలు చెప్పుదురు.

విసరివైచిన యీనూలుదారము యెన్నియో వత్సరములై యెండి, మోడై చచ్చిపడియున్న యొక వృక్షోపరిభాగమున పడెను. స్వర్ణగౌరీవ్రత చిహ్నమగు యీనూలుపోగు యెంతటి మహిమగలదో గాని దాని త్రాకినమాత్రమున పునః ప్రాణధారియై చిగిర్చి ఫలపుష్పచయములతో నెంతో కన్నులపండువుగ, శోభాయమానముగ పచ్చని నడిమివయస్సు వృక్షమై, వసంతఋతువు స్వర్ణగౌరీవ్రతసూచకమగు యీనూలుపోగు ప్రభావమునకు వెరగంది ఈ యొక్క వృక్షమునకు ప్రత్యేకించి తన నిజవ్యక్తిత్వమును ప్రత్యక్షముగ యాచరణరూపముదాల్చినదా యనునట్లు నయన పర్వముగ గాననయ్యెను. ఇదియంతయు మరుగున నుండి విలోకించుచున్న యాతని ద్వితీయభార్య విశాలాక్షి యెండి మోడై మరణించిన యావృక్షముయొక్క నవీన ప్రకృతి యలంకరణమునకు సంభ్రమాశ్చర్యానందపులకితురాలై వృక్షముమీద పడిన యద్దారమును చెలికత్తెల సహాయమున తీయించి తన వామహస్తము ముంజేతి కలంకరించు

కొనెను. అగ్ని తన తత్త్వమును తాను వీడునా? తెలిసిముట్టుకొనినను, తెలియక ముట్టుకొనినను కాలక విడుచునా! జ్ఞాని, అజ్ఞాని; చిన్న, పెద్ద; స్త్రీ, పురుష; యౌవన, వృద్ధ; యీ విచక్షణలు దాని కవసరము లేదు. దాని తత్త్వమునుండి యది మరలదు. అటులనే రాజు ద్వితీయభార్య యాపారవైచిన నూలుపోగు తిరిగి తెచ్చి బంధించుకొన్న మాత్రమున ఆరాజునకు మిక్కుటముగ ప్రేమాస్పదురాలై ప్రథమభార్యయందు యతని కసహ్యముగలిగించు నంత యౌవనసుందరి యాయెను. దినేదినే ద్వితీయభార్యయందు మోహప్రేమలధికమగుచుండ, ప్రథమభార్యను చూచిన భగ్గుమనునంత కోపఘూర్ణిత హృదయుడై కడకు యామెను తనమహలున సహితము యుంచక తరిమివైచెను.

పాపము భర్తవల్ల భవనమునుండి తరిమివేయ బడినదై మహాదేవి యడవుల సంచరించి సంచరించికడకు సేదదీర్చుకొనుటకై యొకమునిగృహము సమీపించి అందు ప్రవేశింపబోయెను గాని దుర్మార్గురాలైన యామె వదనము చూచి చూచి యామెకెవ్వరాతిథ్య మిత్తురు? ఆమునియు రాజురీతినే యొనరించెను. దారియు డొంకయు తెలియక విచారగ్రస్తమగు చిత్తమున విపినముల సంచరించుచు నావనమధ్యమున యెట్టకేలకు గణేశ్ అను వానిని కలసికొని యాతడు ప్రశ్నించిన పైని స్వర్ణగౌరీదేవి యెచ్చట యుండునో తెలిసికొన వెతుకుచు యీ యడవుల సంచరించుచుంటినని జవాబిచ్చెను. మారుజవాబు రానందున యథారీతిని యటులనే పోవంబోవ మొదట యొక మామిడితోపును, దానికి సమీపముననే యొక సరోవరమును అందున గల పద్మములచుట్టును ఆరాధించుచున్న విహంగకన్యకలను చూచి, ధన్యురాలనైతినని డెందమున యపరిమితానందము నొంది వారల సమీపించి తన నిజోదంతమునంతయు నెఱింగింప యత్నించెను. కాని పాపపూరితురాలైన యామె మనోభీష్టమునకు వల్లెయన నయిష్టులై సరోవరముచెంతకురానీక యాటంకపఱచిరి. తాను చేసిన పాపపు కార్యమునకు ఫలితమిదియంతయు గదా యని గుర్తించి పశ్చాత్తాపము నొంది యచ్చోటనే నిర్వ్యాపారపాటున నిశ్చేష్టురాలై నిలువబడి దుఃఖించుండెను. అంతట స్వర్ణగౌరి యామె పశ్చాత్తాపమునకు ముదమంది తనదర్శన మిచ్చెను. మహాదేవి యాదేవిని గాంచినంతనే

సాష్టాంగనమస్కార మాచరించి తన యజ్ఞానమువల్ల చేసిన పాపకార్యమును చెప్పుకొని క్షమించి రక్షించవలయునని ప్రార్థించెను. స్వర్ణగౌరి రాజుభార్య యజ్ఞానమునచేసిన యాయకార్య కారణమువలన గలిగిన పశ్చాత్తాపమునకు మెచ్చి క్షమించి, యాశీర్వదించి యంతర్ధాన మొందెను.

అనంతరము మహాదేవి మహలున ప్రవేశించి సక్రమముగ నీవ్రత మాచరించి వెనుకటివలె భర్త ప్రేమావశంవదురాలై సంచరించెను. చంద్రప్రభ సహితము సక్రమముగ పదునారు వత్సరములును యీవ్రతమాచరించి చక్రవర్తినై కడకు అవసానమున కైలాసమునకు బోయెను. ఈవ్రత మెవ్వరు భక్తిశ్రద్ధలతో పదునారువత్సరములును యేకదీక్షగ నాచరింతురో వారల కశేష్టైశ్వర్యము లొనగూడుటే గాక అరివర్గమును త్రుటిమాత్రమున జయింపగల శక్తిసంపన్నులై ముక్తినొందుదురనియుఁగూడ స్కాంధ పురాణమున చెప్పబడియున్నది.

# శారదాచట్టము

శ్రీమతి నడివింటి వెంకటరత్నమ్మగారు

ఎన్నోదినాలనుండి మనహిందువులన్ గ్రసియించుచున్న యీ
పిన్నతనంపుపెండిళుల పీచమడంచి జగద్ధితంబుగా
ఇన్నిదినాలకీవు ఘొనరించితి, శారద! శాసనంబు నిన్
సన్నుతిసేయగావలదె సంతతమున్ భరతాంగనామణుల్.

మాచిరకాలధర్మములు మంటను గల్పెదరే శృతిశ్మృతుల్
నీచపుకార్యమిద్ది తగునేయని పల్కెడునంచుబల్కునా
పాచికమాటకారుల విపక్షులనందరి గెల్చినాడవౌ
నీచరితంబు ధన్యమగు నిక్కముగా వినుమయ్యశారదా!



# సీతమ్మతల్లి

నేమాని వాసుదేవమూర్తిగారు

("చింతిలకమ్మా మన శ్రీరామునికొరకు సుదిని")వలె

వందనమమ్మా మాయమ్మ సీతమ్మతల్లి ॥వం॥

జనకరాజపుత్రికవయి । జానకియనుపేరుతోడ
శ్రీకరుడగు శ్రీరాముని । ధర్మపత్నివయిననీకు ॥వం॥

సుగుణసమన్వితుండైన । శ్రీరాముని భార్యవయి
ఇనవంశంబునకుకీర్తి । నీవె నిల్పితివిగదమ్మ ॥వం॥

నీదుసవతియత్త నీదు । భర్తనడవికేగుమనగ
భర్తనంటివెడలినఓ । పతితపావనీ ! నీకు ॥వం॥

కాయకసురులనుభుజించి । కటికనేలపవ్వళించి
భర్తకునర్ధాంగినివయి । పడినపాటులెన్నదరమె ॥వం॥

లంకరాజురావణుండు । లంకకుగొంపోయిమిగుల
అష్టకష్టములనుబెట్ట । నన్నియోర్చినట్టితల్లి ॥వం॥

భర్తసేవదక్కయొండు । భాగ్యముకాదనుచుదెల్ప
భరతదేశస్త్రీలకీ । వయితివిగద తార్కాణము ॥వం॥

నీమహాత్మ్యమెఱిగిస్త్రీలు । నిన్నుబోలి పతివ్రతలయి
యీపుడమిని కలకాలము । నింపుగవర్ధిల్లుదురు ॥వం॥

# గర్భిణీస్త్రీ చేయకూడని పనులు

శ్రీమతి వావిలికొలను పద్మావతమ్మగారు

గర్భిణీస్త్రీ శరీరమును ప్రయాస కలిగించెడి ఏలాటి పనులున్ను చేయకూడదు. ముఖ్యముగా గర్భము కాకుండినయెడల నెలబహిష్ఠ ఎపుడు అగునో అట్టి కాలము వచ్చినప్పుడు శరీరమునకు ఏలాటి ఆయాసమున్ను కలిగించకూడదు. గర్భస్రావము కలుగుటకు సాధారణముగా అట్టితరుణమునందే. మూడవనెల మొదటను, కడపటను, ఏడవనెలయందును ఎనిమిదవనెలయందును శరీరమునకు ఆయాసము కలిగించు పనులు అనగా బరువు వస్తువుల నెత్తుట, ఎగురుట, దుముకుట, నిద్రమేల్కొనియుండుట—ఈలాటి కార్యములు చేయరాదు. గర్భధారణ కాలములో ఈనెలలు బహుజాగ్రతతో సంరక్షింపవలసిన కాలము.

గృహకృత్యపు పనులు చేయకుండా సోమరితనముతో ఎల్లప్పుడు పండుకొని యుండరాదు. ప్రసవ కాలమందు గొప్పకష్టము పడవలసియుంటున్నది. కనుక అప్పటికి దేహము బలహీనము కాకుండా దినము దేహమునకు పరిశ్రమ యిచ్చుచు సోమరితనమును చోటివ్వకూడదు. అట్లు సోమరితనమునకు చోటిచ్చిన యెడల దేహము బలహీనమై ప్రసవసమయమున కష్టపడవలసి వచ్చును.

మలబద్ధము కలుగనివ్వకూడదు. కలిగినచో త్వరలో పోగొట్టుకొనవలెను. మలబద్ధము త్వరలో పోకుండి శరీరమునందు నిల్చిన కల్మషమువల్ల రక్తముచెడి వ్యాధులుకల్గును. కనుక వైద్యునితో చెప్పి మలబద్ధనిముక్తికి ఔషధము తీసికొనవలెను.

ఏదిపట్టిన నది తినవలెనను తిండియాశకు లోబడరాదు. ఆరోగ్యవంతమైన భోజనము క్రమముగా చేయుచుండిన యీయాశలకు చోటుండదు. కలిగినను తప్పించుకొనగలరు. కొందరికి మన్ను, బొగ్గు, విభూతి, మొదలగు పదార్థములను తినెడు దుర్వాడుకలు కలుగును. అట్టివి వెంటనే మాన్పింపవలెను.

పడకగది తలుపులు గవాక్షములు మూసిగాని మొగమునకు దుప్పటి కప్పుకొనిపడుకొనిగాని నిద్రించరాదు. ఇందువల్ల శుభ్రమైన గాలిని పీల్చుటకు వీలులేకపోవడమే గాక తాను ఊపిరి విడిచిన చెడ్డగాలినే తిరిగి పీల్చుట తటస్థించును.

కోపము, తాపము, ఈర్ష్య, అసూయ, యిట్టివానికి చోటివ్వరాదు. భయంకర ఆటలు అనగా డ్రామాలకు కూడా పోరాదు. ఏలననగా ఇందువలన మనసుకు కలవరము కలిగి నరములకు తొందరకలిగి ముంగోపము, అసహ్యత మొదలగు దుర్గుణములు అలవడును. ఇవి గర్భములోని శిశువుకు కూడాపట్టుబడును, గనుక వీనికి చోటివ్వకూడదు. భోజనపదార్థములలో ఆవాలు, మిరియాలు, యింకా యితర తీవ్రమైన మసాలాదినుసులను వర్జించవలెను. టీ, కాఫీ, సారాయము మొదలగు కైపు కలుగచేయు పానిని పుచ్చుకొనకూడదు.

బరువు వస్తువుల నెత్తడము, తటాలున వంగడము, వేగిరముగా నడవడము, పరుగెత్తడము, మిద్దెమెట్లపై నుండి దుమకడము, యిటువంటి శరీరమునకు విపరీతమైన శ్రమగలుగ చేయు కార్యములు చేయకూడదు. ఇటువంటి కార్యములు చేసినయెడల శరీరములోని అంగములకు ఇరుకు మొదలగు ఉపద్రవములు కలిగి కడుపులోని పిండమును బాధకలుగును.

# రురుఁడు

## విద్వాన్ శేకుమళ్ల పాపయ్యశాస్త్రిగారు

భృగువంశసంభూతుండగు ప్రమతియను వానికి ఘృతాచియను నొక కాంతారత్నమునందు గుణరత్నాకరుండగు రురుఁడను సూనుం డుదయించె.

అతఁడు విశ్వావసువను గంధర్వరాజునకు మేనకయందు జన్మించి స్థూలకేశుఁడను తాపసోత్తము నాశ్రమమునందుఁ బెఱిగిన ప్రమద్వరయనెడి కన్యకామణిం జేపట్టె. గుణముల ప్రోవును సౌందర్యఖనియునగు నాప్రమద్వర పరిణయమైన దాదిగ మగనినే దైవముగా భావించి సర్వకాలసర్వావస్థలయందు నాతనికి శుశ్రూషలు సేయుచు నాతని స్వాంతము నానందింపఁజేయుచుండెడిది. రురుఁడుగూడ నిజప్రేయసియందు గాఢానురాగముగలిగి మెలంగుచుండెడివాఁడు. ఇబ్బంగి నన్యోన్యానురాగపరిపూర్ణహృదయులగు నాదంపతు లొకరి నొకరెడఁబాసి యుండరు. ఇట్లుండఁగాఁ బ్రమద్వర యొకదినము చెలికత్తెలంగూడి యరణ్యమున కరిగి లతాంతములఁ గోయుతఱి నొక పామామెను గఱచెను. తోడుతనే యామె పుడమిపైఁబడి ప్రాణములఁ బరిత్యజించె. అత్తఱి నామె సఖురాండ్రు అతిత్వరితగతిం జని రురున కాసమాచారము నెఱిఁగించిరి. రురుఁడావృత్తాంతము నాకర్ణించి కడుశీఘ్రముగఁ బ్రమద్వరవద్దకుఁ బోయెను. అచ్చట నతఁడు సర్పదష్టయై పుడమింగూలియున్న నిజభార్యపైఁబడి యురము మోదుకొనుచు నేడ్వనారంభించె. ఈ సమాచారము నాలకించి యాపరిసరములనున్న ఋషులెల్లరట కరుగుదెంచిరి. వారును బ్రమద్వరకు సర్పవిషమును దొలగించుటకై యనేక మంత్రములను వేసియు, నౌషధరాజముల నొసంగియుఁ జూచిరి. కాని యవన్నియు నిష్ప్రయోజనములయ్యె. ప్రేయసీవియోగాసహమానుఁడై రురుఁడు శోకసాగరమున మునిఁగి వనమెల్లెడలఁ బ్రతిధ్వను లిచ్చునట్లు విలపింపఁ దొడంగె. మఱియు "ఓదేవతలారా! నేను నిజముగ నతిథ్యభ్యాగతుల సాదరభావమునఁ బూజింతునేని గురువుల యెడభక్తిగల్గి మెలంగువాఁడనేని మహామహిమాంచితులరగు మీ మహిమవలన నా ప్రాణప్రియురాలగు నీ ప్రమద్వర సప్రాణయగునుగాక! నా ప్రాణేశ్వరి నెవరు బ్రతికింతురో వారికి నా తపస్సంతయు ధారపోయుదును." అని పలికెను. అత్తఱి గగనమునుండి యొక దేవదూత రురునిగాంచి 'తాపసోత్తమా! దైవవశమున సంప్రాప్తమైన దానినెవరు మాన్పగలరు? అయిన నుపాయమొండుగలదు. దానినెఱింగించెద. సావధానుండవుకమ్ము. నీయాయుస్సులో సగము నీ భార్యకొసంగినచో నామె జీవింపఁగలదు' అనినుడివెను. రురుఁడును దేవదూత వచించిన వాక్కులకత్యంతమలరి 'యోమహాత్మా! అట్లే సేయుదు'నని ప్రత్యుత్తర మొసంగెను. అనంతరము ప్రమద్వర విషనిర్ముక్తయై ప్రాణములఁ బడసి లేచి కూర్చుండెను. రురుఁడామెం గాంచి సంతోషాక్రాంతస్వాంతుండయ్యె.

అటు పిమ్మట రురుఁడు తన ప్రియపత్నికిఁ బాము హానిగావించుటం జేసి పాములనన్నిటిని మడియింప దలంచి పుట్టలు పొదలు వెదకి కంటఁ బడిన సర్పముల నెల్ల దండముతోఁ గొట్టి చంపుచుండెడివాఁడు. ఇబ్భంగి నాతఁడొనర్చుచుండ నొక దినము "డుండుభము"ను సర్పమును గాంచి చంపనుంకింపఁ నయ్యది భీతిల్లి వానికిట్లనియె. "ఆర్యా! పాములమీఁద నీకెందులకింత కోపము గల్గెను? అగ్రజాతిసంభూతుండవును, యతీంద్రుండవునగు నీకియ్యది ధర్మువుగాదు కదా?" అని సంభాషించుచున్న యాపన్నగమును దండము నెత్తి రురుఁడు కొట్టం బోవ నయ్యది మునిరూపముం దాల్చి యాతని కట్టెదుట నిల్చెను. అపుడు రురుఁడు వెఱగంది "మహాత్మా! ఇంతదనుక నురగాకృతినున్న నీ వెట్లు మునివైతివి? ఇందులకెయ్యది కారణము?" అని ప్రశ్నించెను. అనిన నతఁడు రురునకుఁ దన వృత్తాంతము నిట్లు చెప్పఁదొడంగె. "అయ్యా! నేనొక మునీశ్వరుండ. నా పేరు సహస్రపాదుఁడండ్రు. నేనొకప్పుడు తృణనిర్మితమగు సర్పము నొకదాని నామిత్రుండును ఋషీశ్వరుండునునగు ఖగముఖునిమీఁదఁ బరిహాసమునకై పడవైచితి. అతఁడందులకుఁ గినిసి నీవును దీనివలెనే నిర్వీర్యమగు జన్మ బడయుదువుగాక యని శపించెను. నేను శాపాంత మొసంగి నన్నుద్ధరింపుమని వేడుకొనఁగా నతఁడు రురునిదర్శనమగు వఱకు నీడుండుభాకృతితో నుండి మఱల నిజరూపమును బొందెదవని చెప్పెను. కాన భవద్దర్శనమువలన నేఁడు నాశాపవిముక్తి యయ్యె'నని నుడివి మఱియు నాతని కిట్లనియె. 'అయ్యా! ద్విజన్ముఁడవగు నీకు భూతదయ యుండవలెను. ఇట్లు ప్రాణిహింస సేయుట యనుచితము. కనుక సర్పములఁ జంపుటనికనైనను బరిత్యజింపుము." ఆమాటలనాలించి రురుఁడు శాంతచిత్తుండయ్యె.

సర్పాపహృతప్రాణయైన నిజవల్లభను మఱల బ్రతికించుకొనుటకై తన యాయుస్సులో సగమామె కొఱ కొసంగిన రురుని ప్రేమాధిక్య మనిర్వర్ణనీయము గదా!

# చిత్ర ప్రశ్నలు

మల్లపురెడ్డి సత్యనారాయణగారు

౧

నేనొక గొప్ప స్త్రీని.

నాపేరు మూడుఅక్షరములది మాత్రమే.

నాపేరులోనినడిమిఅక్షరము పోయెనేని నేనొక చతుష్పాదజంతువునగుదును.

నా పేరేమి ?

ఇట్టి వానియందు రుచిగల గృహలక్ష్మి పాఠకులు ఈ ప్రశ్నకు జబాబు ఆలోచించి మాకు లేఖాముఖమున తెలుపుదురు గాక !

# పతివ్రత

శ్రీమతి కొంగర అన్నపూర్ణమ్మగారు

నిలయము వాటించి నిర్మలదేహియై శృంగార మేప్రొద్దు జేయవలయు
సత్యప్రియాలాపచతురయై ప్రాణేశు చిత్తంబు ప్రేమ రంజింపవలయు
దాక్షిణ్యసంతోషధర్మమేధాదుల దైవతమని ప్రియు దలపవలయు
నాథుడేపద్ధతి నడచు నాపద్ధతినడచి తద్బంధుల నడపవలయు

మార్దవమున బతికి మజ్జనభోజన
శయనపాన సుఖము జరుపవలయు
విభుడు పాపియైన వెలది బుణ్యునిజేయ
వలయు నిదియే ధర పతివ్రతలనీతి.

—భాగవతము.

కౌశికుండను నొక బ్రాహ్మణుఁడు వేదవేదాంగాదిసమస్తశాస్త్రము లభ్యసించి శిష్టుల కనువగు నొక గ్రామమున నివసించుచుండెను. ఒకనాటి యుదయమ్మున కాల కృత్యముల నిర్వర్తించి యూరిబయట నొకచెట్టు క్రింద గూర్చుండి వేదములను బఠించుచుండెను. ఆచెట్టు పైనుండెడి యొక కొక్కెర యాతనిపై రెట్టవైవ నతఁడు కోపారుణిత లోచనుండై యాబకమువంక చుఱచుఱజూడ వెంటనే యదివిగత ప్రాణమై క్రిందబడుట గాంచి యావిప్రుడు

క. కోపము నుబ్బును గర్వము
నాపోవనియునికియు దురభిమానము
నిర్వ్యాపారత్వము నను నివి
కాపురుషగుణంబు లండ్రుకౌరవనాథా.

—భారతము.

అయ్యో! కోపముచేత గదా, నేనీయకార్య మొనరించితి. నాజపతపస్స్వాధ్యాయములు కరుణలేమిచే రిత్తవోయె. ఈ పాపగతికి గాకుండుటెట్లు? ఇంక జేయునదేమి?

యని అనేకవిధముల జింతించి మధ్యాహ్నసమయమగుడు భిక్షాటనం బొనరించుచు నొక విప్రగృహంబున నిలిచి "భవతి భిక్షాం దేహి" యని యడిగెను. అంత నాగృహిణి వచ్చెద నుండుమనుచు భిక్షయిడుటకు పాత్ర శుభ్రపరుచుచుండు సమయమున తన భర్త అగ్నిహోత్రము వేల్చి మహాతప మొనరించి దేహముడస్సి మిక్కిలిదప్పిగొని ఆకటంబడుచు మందిరము సొచ్చుట నాగేహళిఁజూచి భిక్షుకుని మరచి భక్తితో భర్తకు నెదురేగి యాతని దోడి తెచ్చి యొక యుచితాసనంబున గూర్చుండ జేసి చెమ్మట లాఱ వీచి చన్నీట జలకమార్చి ప్రియోక్తులాడుచు భోజనమిడి వీడెమొసంగి శయనింప జేసి పాదము లొత్తుచుండు సమయమున భిక్షుకుడు తలంపునకు రాగ వేవేగ భిక్షగొని యాభిక్షువుకడ కరుగుదెంచెను. అంత కౌశికుఁడు కోపారుణితలోచనుండై "ఓయువిద! నేద్విజోత్తముడ. నన్నుగాంచి పోవకుండు భిక్షగొని వచ్చెదనంటివి. పొమ్మనిన బోవ కుందునా? ఈ యూరిలో నింట్లులేవా? భిక్ష మొసంగెడి వారులేరా? నన్నింతసేపు నిల్వబెట్టితివి. ఇదినీకు మరియాదా? ధర్మమా?" యనిన నవ్విప్రోత్తముని క్రోధసంతప్త చిత్తునిగా నెరింగి యామె యిట్లనియె.

"ద్విజోత్తమా! నాయందపరాధము కలదేని మన్నింపుము. కరుణతో సైరింపుము. నాపతి తపమొనరించి యిపుడే తెంచిరి. ఆతనికి భోజనమిడుచుంటి. అందుచే భిక్షయిడుట కాలస్య మొనరించితి." అందుమీద నాయగ్రజన్ముడాగ్రహాయత్తచిత్తుడై యిట్లనియె.

"మహీసురవర్యులమగు మేము తక్కువయు నీభర్త యెక్కువయునా? నీకు ధర్మ సూక్ష్మములు దెలియవు. ఇంద్రునంతటివాడు భూసురోత్తములకు మ్రొక్కుచుండ మనుష్యు లింత తడవుసేయుదురే?" దానికి నప్పతివ్రతాశిరోమణి యిట్లనియె.

"నీవు కోపము మానుము. క్రుద్ధుండవై నన్నేమి సేయుదువు? నీ కోపమునకు గురి యగుటకు నే కొక్కెరనుగాను. నాథునిగొల్చు నన్ను నీ విట్లనుటదగదు. విప్రులయొక్క మహాత్మ్యము దెలియనిదాన గాను. విప్రుడగు అగస్త్యుడు సముద్రోదకమును దోసిలి నింపి ద్రాగెను. వాతాపియను రాక్షసుని ఉదరము నందణిగిపోవునట్లుజేసె. గాన నేవిప్రుల దూలనాడను. నిగ్రహానుగ్రహసమర్థులగు నగ్రజన్ముల గ్రోధప్రసాదము లెరుంగ నెవరితరము. కాన వారి నెఱింగియే వేల్పుల భజించినట్లు సేవింతును. సతికి పతిం భజిం చుటయె శ్రేష్ఠమగు ధర్మము. కాన నేను నాపతిని దైవముగ భావించి అన్యకార్య

సంగతుల విడచి గొల్చుచుందును. తత్ఫలితముగ భువనత్రయార్థములు గల్గును. నీవు స్వాధ్యాయసంపన్నుడవైనను మహాక్రోధనుండవనియు నీ క్రోధంబున కొక కొక్కెర యెరయయ్యెననియు నేనెఱుంగుదు. బ్రాహ్మణోత్తమా! క్రోధంబు మనుష్యుని శరీరస్థమైన మహాశత్రువు. క్రోధమోహంబుల వీడి సత్యంబు దప్పక గురుభక్తిగల్గి సద్గుణఖనియై ధర్మపరుడై పరులు హింసించినను మరల హింసింపక జితేంద్రియుడై స్వాధ్యాయసంపన్నుడై భూతదయగల్గి షట్కర్మయుక్తుడై గర్వముడిగి భువన మాత్మసమంబుగా నెంచి పండితోత్తముడగు వాడె బ్రాహ్మణుండు. ధర్మమతి సూక్ష్మమైయుండు. దాని తత్త్వము నెవరెఱుంగుదురని నాకు తోచదు. ధర్మతత్త్వ మెఱుంగ గోరెదవేని ధర్మవ్యాధుడొకండు గలడు. వాని కడకు బొమ్ము. వాడు జితేంద్రియుడు. సత్యవాది. మాతాపితృశుశ్రూషను జేయుచు మిథిలానగరంబుననున్నవాడు. వానిపాలి కరిగితివేని సతతము ధర్మోపదేశంబు జేయును బొమ్ము. స్త్రీ స్వభావంబునంజేసిన నాయధికప్రసంగంబునకు అన్యథా భావింపక నన్ను మన్నింపుము."

అప్పుడు అప్పతివ్రతామతల్లికి కౌశికుండిట్లనియె. "జననీ! నీపల్కుల వలన నాకుండు క్రోధమను పెద్దరోగము నిశ్శేషమయ్యెను. మిక్కిలి ప్రియము బొందిన వాడనైతిని. పూతచరిత్రవగు నిను బోలుపుణ్యశీల లెందుగలరు? నీతో యేస్త్రీరత్నము బోల్పదగును? నీకు శుభమగు గాక! నే బోయివచ్చెద." ఇట్లుచెప్పి యా బ్రాహ్మణుడు ధర్మవ్యాధుని పాలికరిగెను.

విద్య నేర్చుటం జేసిగదా యీయమ పతివ్రతాశిరోమణియై ధర్మసూక్ష్మముల నెఱింగి కౌశికున కుపదేశమొనర్చెను. ఇంకను అసాధ్యమగు భూతభవిష్యద్వర్తమానములను తెలిసికొనెను. పతివ్రతల కసాధ్యమేది గలదు?

స్త్రీలు విద్య నేర్చిరేని చెడుదురను దురభిప్రాయమును ఖండించుట కీనారీరత్నము యొక్క చరిత్ర ఆదర్శముగ నుండగలదు.

స్త్రీలకు విద్యలేనిచో "షట్కర్మ యుక్తాఖలు ధర్మపత్నీ" యనెడు నార్యోక్తి ననుసరించి నడచుట కెట్లు సాధ్యమగును?

# ప్రణయరాధ

శ్రీమతి పాటిబండ వేంకట అలమేలుమంగతాయిగారు

అవె గోపాలకబాలకుల్ హరియు పశ్వానీకముఁ స్వాదుఘా
సవిలాసమ్ములఁదన్పినట్టి యలసుస్థానమ్ము; లాభీరికా
నివహమ్ముల్ హరిగూడి రాసరచనానిర్మగ్నలై నారలీ
భువి, నిచ్చోటనె వంశినూఁదె హరి గోవుల్ ప్రేపు లుప్పొంగగన్.

ఈనికుంజాంతరమ్మున నేకదా వి
భుండు నఱపల్కులం దేల్చుచుండువాఁడు ?
ఈచలువతిన్నెపై నెక్కియే కదా వి
భుండు లోకమోహనముగ మురళినూఁదె ?

శారదపూర్ణయామినుల శాద్వలభూముల గోపబాలక
స్ఫారవిశాలనేత్రముల బాష్పకణమ్ములు క్రమ్మ క్రమ్మఁవం
శీరవమాధురిం గురియజేసిన నీదగు ముగ్ధమోహనా
కారము నింక నొక్కపరి గాంచగనీగదవోయి మాధవా !

మురళీరవములకు ప్రోడులు చివురుపూతలనించుకొన్న వీస్థలములందు
వంశమనోహరధ్వని గుబాళించుకొన్న దీయమున యీతెన్నులందు
మురళీధ్వనులకు గోవులు శరీరమ్ములు పులకరించుకొనె నీభూములందు
వేణుగానమ్ములు విని ప్రేపు లశ్రువుల్ నించుకొన్నవట యీనెలవులందు

ఇట కళిందజ తనలోన కృష్ణమూర్తి
నైక్యమొనరించుకొనియె సంధ్యాఘటికల
ధన్యహో! కృష్ణపాదపద్మద్వయప్ర
పాదనపునీతబృందావనీధరిత్రి.

కృష్ణ! తవవంశికామృదుగీతికల ప్ర
తిధ్వనులు యమునాతరంగాధ్వములను
వినబడుచునున్నవోయి యీనాదినముగూడ
మాయలేదింక నీవంశిమధురగీతి.

ఈతమాలావనీజపునీతపత్ర
నైగనిగ్యమ్ములందు కృష్ణా! త్వదీయ
ముగ్ధరూపంపుప్రతిఫలమ్ములుకరంగి
చెఱగిపోవంగలేదింతవఱకుగూడ.

ఈతమాలమహీజ మేతపమ్మొనరించెనో నిన్నుప్రతిఫలించుకొనె కృష్ణ!
ఈయైందవోపల మేతపమ్మొనరించె నీభారముఁ వహించినది కృష్ణ!
ఈయమునానది యేతపమ్మొనరించె మురళీప్రతిధ్వనుల్ మొరసె కృష్ణ!
ఈకళిందాత్మజ యేతపమ్మొనరించె నినునైక్యమొనరించుకొనియె కృష్ణ!

ఈపశువులే విధానపూజించెనోయి
శీతలాశ్రుల నభిషిక్తుజేసి కృష్ణ!
యేమొనర్చిన నన్నింక నేలుకొందు
వోయి వచియింపుమట్లసేయుదును కృష్ణ!

పసురింఖాపుటధూళిధూసరితభాస్వత్కేశపాశంబుతో
శిశిరాయాతమరుత్ప్రకంపితలసచ్చేలంబుతో లీలమై
పశుసంఘంబు నవీనదేశముల మేపంబోవు నీకైన గో
పశిశూత్తంసము కృష్ణమూర్తి నెదసంభావింతు నశ్రాంతముఁ.

# బాల్యవివాహనిషేధకచట్టము

జోశ్యుల నారాయణమూర్తిగారు

ఇటీవల భారతజాతీయసాంఘిక జీవితమునందు మహాసంచలనమునకు కారణభూతమై, అనవసరమగు వివాదముల కాస్పదమై, ఒకవంక పూర్వాచారపరాయణుల మనములను, వేరొకవంక సంఘసంస్కరణాభిలాషుల మనములను విశేషముగ కలవరపెట్టిన శ్రీయుత హరబిలాసశారదాగారి వివాహవయోనిర్ణయపు బిల్లు 23-9-29 తేదీని భారతశాసనసభలో నత్యధికసంఖ్యాకులచే నామోదింపబడెను. ఈ బిల్లునుండి బ్రాహ్మణులను మినహాయించవలెనని శేషయ్యంగారును, మహమ్మదీయులను మినహాయించవలెనని మౌలానాషాఫీ దావూదుగారును భారతశాసనసభలో నుపపాదించిన సవరణలు సభవారిచే నిరాకరింపబడెను. బాలికల వివాహవయస్సు 12 సంవత్సరములకు నిర్ణయించవలెనని గంగానందసింహాగారును, 13 సంవత్సరములకు నిర్ణయించవలెనని బ్రెల్వీగారును, 16 సంవత్సరములకు నిర్ణయించవలెనని ముక్తేశ్వరసింగుగారును శారదాబిల్లునకు సవరణల నుపపాదించిరి. కాని యీ సవరణలు కూడ నోడిపోయెను. అధికసంఖ్యాకులు వాంఛించిన 14 సంవత్సరములప్రాయమే బాలికలకు వివాహార్హప్రాయముగ నిర్ణయింపబడెను. బాలురకు 18 ఏండ్లు వివాహప్రాయమని నిర్ణయింపబడెను. ఇందులకు భారతశాసనసభలో 67 గురు అనుకూలముగను 14 గురు ప్రతికూలముగను సమ్మతుల నొసగిరి. అనుకూలురసంఖ్యకును ప్రతికూలురసంఖ్యకును గల తారతమ్యమును గమనించినచో నేడు ఆసేతుహిమాచలపర్యంతమును గల భారతజాతి యెట్టి గాఢసంస్కరణాభిలాషను వ్యక్తపరచుచున్నదో యెంతటి మూఢమతులైనను గ్రహింపగలరు. శారదాగారి బిల్లును భారతశాసనసభవారామోదించిన కొలదిదినములలోనే స్టేటుకౌన్సిలువారు దాని నామోదించిరి. మరికొన్ని వారములకు రాజప్రతినిధిగారీ బిల్లునకు తమయంగీకార మొసగిరి. అందువలన నీ బిల్లు చట్టరూపమును దాల్చెను. ఈ చట్టము ననుసరించి వివాహకాలమునకు బాలురకు 18 ఏండ్లును బాలికలకు 14 ఏండ్లును వయస్సు ఉండకపోయినచో నట్టి వివాహములను గావించు తలిదండ్రులకును, సంరక్షకులకును, ప్రోత్సాహకులకును శిక్ష విధింపబడును. ఈ చట్టము 1930 సంవత్సరము ఏప్రిలు నెలనుండి అమలులోనికి వచ్చును. శారదాబాల్యవివాహనిషేధక చట్టము బ్రిటీషుఇండియా, బ్రిటీషుబెలుచిస్థానము, సంతాల్ పరగణాలకు మాత్రమే వర్తించును. బాల్యవివాహములనే గావించగోరు పూర్వాచారపరాయణులు పుదుచ్చేరిమున్నగు ఫ్రెంచిప్రభుత్వమువారి యాధీనమున నున్న ప్రదేశములకుగాని, బాల్యవివాహము లిదివరకు నిషేధింపబడని స్వదేశసంస్థానములకుగాని సులభముగానేగి ఆయా ప్రదేశములందు బాల్యవివాహములను జరుపుకొనవచ్చును. బ్రిటీషుఇండియాలో నిట్టి

శాసనముగావించబడినను దీనికి లోబడక బాల్యవివాహములను గావించుట యెంత సులభమో ఇందువలన స్పష్టమగుచున్నది. కావున సంఘసంస్కరణప్రియులు శారదాబిల్లు చట్టమైనదని యిటుపైని మిన్నకుండక యీచట్టనిబంధనలను బాల్యవివాహముల చెడుగులను ప్రజలలో ప్రబోధమొనరించుట అత్యంతావశ్యకమని గ్రహింపవలెను.

శారదాబిల్లును గురించి దేశీయులు తమ యభిప్రాయములను దెలుపుటకు పూర్తిగ నవకాశమొసగబడెను. ఈ బిల్లు భారతశాసనసభలో ప్రవేశపెట్టబడి మూడేండ్లకు పైగానుండిన పిమ్మటనే భారతశాసనసభవారు ఆమోదించిరి. పూర్వాచారపరాయణులును, సంఘసంస్కరణప్రియులును గూడ తమతమ యభిప్రాయములను సభలను గావించియు, పత్రికలలో వ్రాసియు ప్రజలకు వెల్లడించిరి. ఈ బిల్లు విషయమున మూడేండ్లకు పైగా తమ యభిప్రాయములను వెలిబుచ్చుటకు ప్రజలకు గడువు కలిగియుండెను. కావున భారతశాసనసభవారీబిల్లును తొందరపడి యామోదించిరని పూర్వాచారపరాయణులు గావించుచున్న నింద నిరాధారమును నిస్సారమును అగుచున్నది. బాల్య వివాహదురాచారమును తొలగించవలెననియే చాలకాలము నుండి దేశీయులలో నధికసంఖ్యాకులు వాంఛించుచున్నారు. ఈ దురాచారమునంతరింపచేసిన కీర్తిప్రతిష్ఠలు హరివిలాసశారదాగారికి చెందగలవు. ఈ విషయమున శారదాగారు సలిపిన కృషియు, వారు కనుపరచిన ధైర్యస్థైర్యములును మిక్కిలి ప్రశంసనీయము లనుటకు సందియములేదు. వీరినామము భారతదేశ చరిత్రమున చిరస్మరణీయమై వెలయగలదు.

శారదాబిల్లు చట్టమగుటకు కారణము లనేకములు గలవు. అందు మొట్టమొదటిది ప్రభుత్వమువారి సాహాయ్యమే అనినొక్కివక్కాణింపవచ్చును. ప్రభుత్వమువారిదివరకనేకసార్లు సాంఘికవిషయములందు జోక్యము కలుగజేసికొనక మిన్నకుండిరి. కాని యిపుడు ప్రభుత్వమువారు ప్రజల యభిప్రాయములను సంఘసంస్కరణ విషయమున పూర్తిగగ్రహించి శారదా బిల్లును బలపరుచుటకు పూనుకొనుటచేతనే యీబిల్లు శాసనమయ్యెను. ప్రభుత్వమువారు ఈ బిల్లు విషయమున వ్యతిరేకముగనున్నను తుదకు తటస్థులుగనున్నను, ఇది చట్టమైయుండుట సందేహాస్పదమగు విషయమేయని యొప్పుకొనక తప్పదు. దేశమంతయును రాజకీయ, సాంఘిక, ఆర్థిక, నైతికాభివృద్ధిని కోరుచున్నది. సాంఘికాభివృద్ధియు, రాజకీయాభివృద్ధియు నొకదానిపై నింకొకటి ఆధారపడియున్నవి. సంఘ మభివృద్ధి చెందినగాని రాజకీయాభివృద్ధి కలుగనేరదు. అటులనే రాజకీయాభివృద్ధి కలిగినగాని సాంఘికాభివృద్ధియు కలుగనేరదు. ఈ రెండు విషయములందును అభివృద్ధి యొకే కాలమున జరుగుచున్నగాని ప్రయోజనముండదు. అట్టి తఱిని సాంఘిక విషయములందు మేము జోక్యము కలుగజేసికొనజాలమని ప్రభుత్వమువారనుకొనుట భావ్యముగదోపదు. ఈ సంగతినిగూడ ప్రభుత్వమువారు గ్రహించియే శారదాబిల్లును బలపరచిరనుట నిస్సంశయము. ప్రభుత్వమువారీబిల్లును బలపరుచుటకు గలకారణము లెట్టివైనను వారీవిషయమున మిక్కిలి వివేకముతో మెలగిరనుట నిశ్చయము.

బాల్యవివాహములవలన గలుగుచున్న నష్టకష్టములను దేశీయులు బాగుగ గ్రహించిరి. పురుషుల విద్యాభివృద్ధికి కంటె స్త్రీల విద్యాభివృద్ధికి బాల్యవివాహములు అధికభంగకరములుగ పరిణమించెను. భారత

దేశము సర్వతోముఖాభివృద్ధిని గోరుచున్నది. అట్టి యెడ పురుషులెంత విజ్ఞానవంతులైనను స్త్రీలు అజ్ఞానాంధకారమున మునిగియుండుటవలన భారతదేశ మేవిషయముననైన నభివృద్ధిగాంచజాలదు. స్త్రీవిద్యకు ముఖ్యముగా బాల్యవివాహములే భంగముకలుగచేయుచున్నవనుట నిర్వివాదాంశము. అట్టి భంగమును శారదాచట్టము తొలగించుచున్నది. కావున భారతదేశమున నిటుపైని స్త్రీవిద్య అతిత్వరితగతిని అభివృద్ధి చెందగలదని విశ్వసింపవచ్చును.

బాల్యవివాహదురాచారమువలన సంఘమునందు బాలవితంతువులసంఖ్య ప్రబలజొచ్చెను. తల్లుల మరణములును, శిశువులమరణములును దినదినాభివృద్ధి గాంచుచుండెను. ఇటుపైని బాలికలకు 14 ఏండ్ల లోపున వివాహము లొనర్పరాదు. కావున బాలవితంతువుల సంఖ్య క్షీణించును. 12 లేక 13 సంవత్సరముల ప్రాయముననే బాలికలు గర్భముదాల్చి తన్మూలమున మరణదేవత నోటబడుట కూడ తొలగిపోవును.

బాల్యవివాహమువలని చెడుగులను బాగుగ గ్రహించినవారయ్యును కొందరు పూర్వాచారపరాయణులు మతముపేరుచెప్పి బాల్యవివాహములనే సమర్థించుట శోచనీయముగనున్నది. రజస్వలానంతర వివాహములు హిందూమతవిరుద్ధములని వీరివాదము. ఈ విషయమున పూర్వాచారపరాయణుల వాదములను, సంఘసంస్కరణప్రియుల వాదములను గాంచినచో రజస్వలాపూర్వవివాహములును, రజస్వలానంతరవివాహములును గూడ శాస్త్రసమ్మతములుగ దోచును. లేదా రెండును గూడ శాస్త్రనిషేధములనియే దోచును. రెండు విధములగు వివాహములును శాస్త్రసమ్మతములనియే నిర్ధారణచేయు నెడల సంఘమునందనేకమై చెడుగులకు కారణమైన బాల్యవివాహదురాచారము నేల అంతరింపచేయ గూడదు? సంఘమునకు హానికరములగు దురాచారములను అంతరింపచేయుట ప్రజలయొక్క ప్రధానకర్తవ్యము కాదా? దేశకాలపరిస్థితుల ననుసరించి ఆచారములను అవసరమగునప్పుడెల్ల మార్చుచుండినగాని ఏ సంఘమును అభివృద్ధి నొందజాలదు. వేదకాలమునందు మనదేశమున రజస్వలానంతరవివాహములే ఆచారముగ నుండెననుట కించుకయు సంశయములేదు. స్మృతులకాలము నాటికి యువతీవివాహముల ఆచారము కొన్ని సంఘములందు తొలగి బాల్యవివాహముల గావించు నాచారము ప్రారంభమయ్యెను. ఈ ఆచారము ప్రారంభమగుటకు అప్పటి దేశకాలపరిస్థితులే మూలకారణములు. అటులనే యీ ఆచారము నిపుడు తొలగించుటలో గూడ మనము దేశకాలపరిస్థితుల ననుసరించుటయే ముఖ్యము. ఇక రజస్వలాపూర్వవివాహములును, రజస్వలానంతరము వెంటనే గర్భాధానములను గావించు నాచారమును హిందూమతానుసారముగ నున్నవనుటకు పూర్వాచారపరాయణులు ఇపుడు జూపుచున్న ప్రమాణములు ఒక్కొక్క స్మృతిలో నొక్కొక్క విధముగానున్నవి. ఒక్క గ్రంథములోని యొక్క శ్లోకముననే పరిపరివిధముల నర్థము చెప్పుటగూడ సాధ్యమగుచున్నది. మలబారులో నంబూద్రి బ్రాహ్మణులు రజస్వలానంతరవివాహములనే గావించుచున్నారు. వీరు ఇందులకు శంకరస్మృతిని ప్రమాణముగ జూపుచున్నారు. వంగదేశమున కులీనబ్రాహ్మణులుకూడ రజస్వలానంతరవివాహములనే గావించు

చున్నారు. వీరుగాక ఉత్తరదేశమున కాశ్మీరబ్రాహ్మణులును, దేశమునందంతటను గల క్షత్రియులును నాల్గవ జాతివారును రజస్వలానంతరవివాహముల ఆచారమునే గలిగియున్నారు. హిందువులలో పూర్వాచారపరాయణులును సంఘసంస్కరణాభిలాషులును గావించుచున్న వాదములను గాంచినచో ఈ రెండువిధములగు వివాహములును శాస్త్రసమ్మతములుగ నున్నట్టు గ్రహింపవచ్చునని మీదచెప్పియుంటిని. అట్టియెడ నేవిధమగు వివాహములు సంఘాభివృద్ధికి అధికముగ తోడ్పడగలవో అట్టివివాహములను ఆచారముగ చేసికొనుట ప్రజలముఖ్య కర్తవ్యము.

హిందువులలోనే గాక మహమ్మదీయులందును పూర్వాచారపరాయణులుగలరు. వారుకూడ శారదా చట్టము నెదిరించుచున్నారు. వీరివాదము భారతశాసనసభలో సుప్రసిద్ధమహమ్మదీయనాయకుడగు జిన్నాగారు తుత్తునియలుగావించి రజస్వలానంతరవివాహములు ఇస్లాముమతమునకు విరుద్ధములు గావని స్పష్టీకరించిరి. ఈవిషయమున జిన్నాగారు గావించిన ఉపన్యాసమును మహమ్మదీయపూర్వాచారపరాయణులు గమనించుట ముఖ్యము. మహమ్మదీయదేశములగు టర్కీ, ఈజిప్టు దేశములందు వివాహవయస్సును, గర్భాధానవయస్సును ఆయాప్రభుత్వములచే నిర్ణయింపబడుచు శాసనములు గావింపబడెను. భారతదేశమునందును బరోడా, ఇండూరు, కపుర్థలా మున్నగు సంస్థానములందును ఇదివరకే యిట్టిచట్టములు గావింపబడెను. బాల్యవివాహదురాచారమును నిషేధించుచు శాసనమును గావించుటకు బ్రిటీషుఇండియాప్రభుత్వము మాత్రమే వెనుకపడియుండెను. ఇపుడిదియునుగూడ శారదాచట్టమునుగావించి తన కర్తవ్యమును నెరవేర్చినందులకు సంతసింపవలసినదే.

శారదాచట్టము భారతదేశీయుల సాంఘికజీవితమునందొక విఖ్యాతిమగు చరిత్రాత్మకవిషయముగ వెలయగలదు. ఈ చట్టమువలన సాంఘికవిషయములలో నవసరమని తలంపబడు విషయములను గురించి శాసనములను గావించు టెంతముఖ్యమో స్పష్టపడుచున్నది. బాల్యవివాహదురాచారమును తొలగించుటకు భారతదేశమున నింకను నూరేండ్లు ప్రచారప్రబోధములను గావించినను యీ దురాచారము శాసనములేక తొలగజాలదని యెల్లరును గ్రహింపగలరు. ఈ దురాచారము తొలంగకున్న స్త్రీసంఘమభివృద్ధి చెందనేరదు. స్త్రీసంఘ మభివృద్ధి చెందినగాని భారతజాతి యభివృద్ధి నొందజాలదని చెప్పనక్కరలేదు. జాతియంతయు సర్వతోముఖాభివృద్ధిని సత్వరముగ గాంచవలయుననినచో సాంఘికవిషయములందు ప్రతివిషయమును గూర్చియు గాకపోయినను ముఖ్యములగు అస్పృశ్యతానివారణము, దేవదాసీసంస్కరణము మున్నగు విషయములందైనను శాసనముల గావించుట అవసరమని దేశీయులు గ్రహించి ఆయాకార్యములను నెరవేర్చుటకు కాలహరణము గావింపక వెంటనే పూనుకొని భారతజాతిని, భారతదేశమును పునరుద్ధరింతురుగాక!

# శ్రీమతి వి. సరస్వతిగారికి

శ్రీమతి విద్యాసుందరి బెంగుళూరి నాగరత్నముగారు

అమ్మా!

తాము గృహలక్ష్మి దసరాసంచికలో 'స్త్రీ స్వాతంత్ర్యము' అను శీర్షికతో వ్రాసిన వ్యాసమును తిలకించితిని. ప్రస్తుతకాలమున మనస్త్రీలు అభివృద్ధి నందుచున్నారను నాయూహ మీవ్యాసమును గాంచినతోడనే యంతరించినది. ఇట్లు వ్రాయుచున్నందులకు కినియక ఇటు వినుడు.

'భారత పురుషుడు స్వార్థపరుడు' అని వ్రాసితిరి. భారతపురుషుడు తనకాంతను అర్థాంగిగా మన్నించినాడు; మన్నించుచున్నాడు: మన్నింపగలడు. వేనివాక్యములను తులసీదళములవలె నాతడు తలదాల్చునో అట్టి పురాణములు ఆతనికి ఇట్లే నడువవలయు నని శాసించుచున్నవి. కుటుంబపోషణమునకు ఆశ్రయింపరానివారి నాశ్రయించి; కొలువ రాని వారిని కొలిచి ధనమార్జించి యింటిని వస్తుసముదాయముతో పురుషుడు నిండించు చుండ స్త్రీ ఆయింట రాణివలె పరిపాలించుచున్నది కదా! ఇక భారతపురుషుడు స్త్రీకి చేసిన లోటేమి? ఏదియో యొక దుర్మార్గుని మనమునందిడుకొని భారతపురుషుల నంద ఱిని స్వార్థపరులుగా జమకట్టుట సాహసమేయగును. మగని ప్రయాసము నెఱుంగక నూతనవస్త్రాలంకరణముల కొఱకు కాంతనిని పీడించి అవి ఆతడు కొనిరానినాడు మొగము గంటు వెట్టుకొని పుట్టింటికిపోవు స్త్రీలు కొందఱున్నారు. అట్టివారిని ఉదాహరణముగ తీసి కొని భారతస్త్రీలెల్ల నిట్టివారేయనుట లెస్సకాదు. మంచివారు, చెడ్డవారు ఇరుజాతుల యందునుగలరు. అట్టిచో ఒక్కరినే దూషించి ఒక్కరినే పొగడుట ఉచితమైన పద్ధతి కాదు. ఆలోచింపకోరెదను. అన్యథా భావింపవలదు. జబాబు నపేక్షింతును.

# మాతృప్రేమ

కందుకూరి రామభద్రరావుగారు

పడతి! మృదులాంకసీమను బాపనుంచి
నీలములఁబోలు కనుపాపనిగ్గులందుఁ
జూడ్కులనునిల్పి యేమియోచూచుచుండి
తొగరుమోవిని లేనవ్వుదొడగినావు
మాతృప్రేమన్న నదియేమొ మాకుచెపుమ.

గ్రోల స్తన్యమునిడి కొనగోళ్లఁగురులు
చిక్కువిదలించి, తరుగనిముక్కువోలుక
మూర్ధమునుముద్దాడినురియువెంట
చెక్కిలినిగొట్ట చిరునవ్వుఁజిలికినావు
మాతృప్రేమన్న నదియేమొ మాకుచెపుమ.

జలకమాడించి ముఖమునఁదిలకముంచి
మేనసద్గంధమద్ది మేల్ పానుపునను
బవ్వళించిన పాపాయివదనమందు
భావపాఠముఁజదివి నీవునిలుతు
మాతృప్రేమన్న నదియేమొ మాకుచెపుమ.

# చాందుబీబి

అప్పుడు అక్బరుచక్రవర్తి మొగలుసామ్రాజ్యనియంత. లోకైకవీరుడగు నాతనికి పరరాజ్యజయకాంక్ష అగ్గలమయ్యెను. దక్షిణాపథమున ఆతనికి దోసిలియొగ్గని స్వతంత్రరాజ్యములు పెక్కులు గలవు. ఆపెక్కురాజ్యములలో అహమ్మదు నగరరాజ్య మొకటి. అక్బరు ఆజ్ఞప్తి నందికొని ఆతని తనయులలో నొకఁడు బహుళసేనాసమేతుఁడై



అశ్వారూఢయగు చాందుబీబి.

దక్షిణాభిముఖుఁడై వచ్చి అహమ్మదునగరమునకు ముత్తైగవేసెను. దుర్గము సులభముగ పట్టుపడునని ఆతని నమ్మకము. దుర్గరక్షకులైన ప్రభువు లొకరితో నొకరు కలహించుచుండిరని ఆతడెఱుగును. అంతఃకలహములచే కందళితమగుచున్న ఆదుర్గమును పాలించుచున్నది లోకజ్ఞానము చాలని బాలుడు. ఇట్లుండ ఆదుర్గము సులభముగ పట్టువడునని అక్బరుతనయుడు నమ్మకెట్లుండును? నమ్ముటయేగాదు అత డాసంగతి తనమంత్రి వర్గముతో గూడ చెప్పెను.

"తమ నమ్మకము అంత నిరాధారమైనది కాదనుమాట సత్యమే. దుర్గపాలకుడు సాముగరిడీలు ఎఱుంగని బాలుడగుటయు నిజమే. కాని దుర్గము బలపరాక్రమములు గల నొకమహావ్యక్తి సంరక్షణ క్రింద నున్నదని వినుడు" అని ఆతని మంత్రులలో నొకడనెను.

"అవును. అవును. నీవు ప్రస్తావించెడు మహావ్యక్తి చాందుబీబి యను నామముచే వ్యవహరింపబడు ఒకస్త్రీవ్యక్తి మాత్రమే అని నేను గ్రహింపకపోలేదు" అని ఆతడు నిర్లక్ష్యముగ బలికెను.

"తమరు అనుకొన్నది నిజమే. దుర్గపాలకుడగు బాలున కామె దగ్గఱిచుట్టము. ఒంకొరులతో కలహించు కొనుచున్న నచ్చటివారి నందఱికి సఖ్యముకుదిర్చి ఆమె తన ప్రజ్ఞాచమత్కారముచే రాజ్యమును రక్షింపుచున్నది. అహమ్మదునగరరాజ్య వినాశనమునకు విశ్వప్రయత్నము లొనర్చుచుండిన బీజపురసుల్తానును మంచిమాటలచే ననునయించి ఆతనిని తనకు మిత్రునిగా నొనర్చుకొన్నది" అని మంత్రి వచించెను.

"ఎన్ని పనులైన నొనర్చుగాక! ఆమె అబలయే కదా! అక్బరుసేనావాహిని ముందర ఆమె ఎంత? అక్బరుతనయుడవగు నాకు ఈ ఆడుదానిని ఓడించుట ఎంత?" అని ఆతడు సదర్పముగ వాకొనెను.

సదర్పముగ వాకొనెను. కాని జయముకొనుట చెప్పినంత సులభము కాలేదు. బహువారములు యుద్ధమునడచెను. అహమ్మదునగరసైనికులు లొంగుబాటునకు రాలేదు. కాని వారి సేనాసమూహము అంతకంతకు తగ్గనారంభించెను. తగ్గిన కొలదిని మొగలుసేనలు క్రొత్తవి వచ్చుచుండెను. పోరు మొదలిడినది మొదలు ఇంతవఱకు మడమతిప్పి ఎఱుగని అహమ్మదునగరసైనికులు వెనుకకు తగ్గ దొడంగిరి. ఆసైనికులలో పెక్కుఱు మరణించిరి. చచ్చిన వారిస్థాన మాక్రమించుటకు క్రొత్తవారు దొరకుట దుర్ఘటముగా నుండెను.

దుర్గమును ముట్టడించుచున్న సేనాసమూహమున కోలాహల ముదయించెను. అహమ్మదునగర సైనికుల గుండెలలో రాయిపడెను. కోటగోడలో నొకచోట క్రంత ఏర్పడెను. అది అపరిరక్షితముగా నుండెను. ఈవార్త జలతైలబిందువై రెప్పపాటులో నగరము నందంతటను వ్యాపించెను.

మఱునిముసమున మఱియొక వార్త వినవచ్చెను. "క్రంత అంత పెద్దదికాదు. అది అపరిరక్షితమును గాదు. ప్రదీప్తమగు నొక కవచమును ధరించిన యోధుడెవ్వరో మొగలుసేనాసముద్రమునకు చెలియలికట్టయై నిలచియున్నాడు." ఆవార్తవిని అక్కడకు పెక్కుమంది వచ్చిరి. ఇతడెవరో దివ్యపురుషుడు కావలయునని కొందఱనిరి. దుర్గరక్షణము కొఱకు కత్తిపట్టిన తపోధనుడు కావలయునని కొందఱనిరి. వీరాలోక దుర్లోకుడగు మన యిచ్చటి ప్రభువులలో నొకడు కావలయునని స్థలాభిమానులు కొంద అనిరి. "ఈతని సంగతి ఊహాతీతమైయున్నది. రజతకాంతులు గ్రక్కుచున్న ఆకవచమేమి? రెప్పపాటులో వేనకువేలుగా శత్రుశిరములను ఖండించియు మొద్దుపోవని ఆకత్తియేమి? వ్రేలుచున్న ఆచ్ఛాదనము మూలమున కాని కోపారుణితమై యుండు ఆతని ముఖమును చూచి మొగలాయి సైనికులు ఈపాటికే బేజారై పిక్కబలము చూపియుందురు" అని బుద్ధిమంతు డొకడనెను.

దినమంతయు తీవ్రయుద్ధము జరుగుచునే యుండెను. పడిన క్రంత మార్గమున దుర్గమునందు ప్రవేశింప మొగలుసైనికులు పెక్కుఱు ప్రయత్నించిరి. ప్రయత్నించిన వారెల్ల ఆనూతనయోధుని కరవాలమున కెరయగుచుండిరి. ఇందుతో అక్బరుసైనికులకు గుండెబెదురు పుట్టెను. తమ సైనికులలో నెందఱో ప్రాణములనో గైకొన్న ఆనూతన యోధుని కరవాలమును తలచికొని వారు గడగడలాడుచుండిరి. ఇంతలో సూర్యాస్తమయమయ్యెను. నాటికి యుద్ధము చాలించి మొగలుసైనికులు తమతమ శిబిరములకు చేరికొనిరి. రాత్రిపూట దొంగచాటుగా ఆక్రంతమార్గమున దుర్గములో ప్రవేశించుటకు గూడ వారు ప్రయత్నింపనేలేదు. ఆనూతనయోధుడు తలపుబొటినపుడెల్ల కలవరపాటునొందుచు కనుమూసిన వచ్చిపడుచున్న పలవరింతలతో మొగలుసైనికులు ఆరాత్రి నెట్లో వేగించుచుండిరి.

అచ్చట దుర్గమునందు సైనికులు నిద్రింపనే లేదు. కొందఱు ఇటుక, సున్నము తెచ్చిరి. కొందఱు వానిని పేర్చి కోటగోడ క్రంతను గప్పిరి. కోడికిని వారికిని ఒక్కసారియే తెల్లవారెను. తెల్లవారు సరికి కోటగోడ ఎప్పటి తీరుననుండెను. ఎప్పటి తీరున అచ్చట నూతనయోధుడు గూడ నుండెను. కరమున కత్తి, మొగమున ఆచ్ఛాదనము కలిగి ఆతడచ్చట ఒక స్తంభమువలె నిలచియుండెను. శత్రునిరాక నిరీక్షించుచుండెను.

నిరీక్షింపబడు చుండిన శత్రువు మఱిరాలేదు. శాంతి దూతవచ్చెను. అహమ్మదునగరమును అలవోకగా జయింతునని సదర్పముగ పలికిన అక్బరుతనయున కిప్పుడు జయాశ నశించి అపజయశంక పొడమెను. చేయునది లేక ఆతడు బీరమును పొత్తము కట్టి శాంతి కొఱకు రాయబారములు నడపెను.

అహమ్మదునగరపౌరులు దరిలేని ఆనందసాగరమున తేలుచుండిరి. కాని వారి నొక సంశయము పీడించుచుండెను. అపజయమను పిశాచము యొక్క బిట్టుకౌగిలినుండి తమ్ము తప్పించి అక్బరుకొడుకంత వానిచే తమ కడకు శాంతిరాయబారము రప్పించిన ఆనూతనయోధు డెవ్వరు? ఆతడెచ్చటినుండి వచ్చెను? ఎచ్చటికి పోయెను? ఈ సంశయమును బాపువారెవరు? "ఆనూతనయోధుడు రాజాంతఃపురమునుండి వచ్చెను. రాజాంతఃపురములోనికే తిరిగిపోయెను" అని కొందఱనిరి. నిజమగునా?

అహమ్మదునగరమున ఎచ్చోట చూచినను ఆ నూతనయోధుని గూర్చిన ముచ్చటలే. ఒకచోట పదిమందిగూడి ఈ విషయమునుగూర్చి ముచ్చటించుకొనుచుండగా నచ్చటికి ఏదియోపనిమీద పోవుచు నగరసేవలో వయస్సు ముదిరిన జమ్నాదాసు వచ్చెను. ఆతనినిచూచి వారు 'జమ్నాదాసూ! నీ కీవిషయమున నేమి తెలియునో మాచెవిని వేయుము' అని అడిగిరి.

జమ్నాదాసు మందహాసము చేసెను. సహజసరళవచనములతో నిట్లనియెను. "విషమపరిస్థితులలో మన దుర్గమును రక్షించిన ఆ వీరవ్యక్తి పురుషుడుకాడు. ఒకస్త్రీ."

"స్త్రీయా? నిజమే?"

"ఆమె తన్నెవరు చూడకుండుటకై తన వదనమును ఆచ్ఛాదిత మొనర్చుకొని యుండెను" అని జమ్నదాసు చల్లగ పలికెను.

"అవును. ఆసంగతిమాకును తెలియును. కాని ఆమె నిజముగా స్త్రీయేనా? ఏమి ఆధైర్యము? ఏమి ఆయుద్ధనైపుణ్యము? అట్టి దిదివఱకెన్నడును విన్నది కన్నది లేదే?" అని అచ్చటివారిలో నొకడనెను.

"మన సూల్తానా చాందుబీబి ఆ వీరాంగనకు వెలలేని యొకగొప్పబహుమాన మిచ్చి తీరును" అని మఱియొకడనెను.

"మన సూల్తానా చాందుబీబి ఆమె కెట్టి బహుమానమును చేయదు. ఆమె—" అని జమ్నాదాసు చెప్ప నారంభించెను.

"ఆమె ఏల బహూకరింపబడవలెనో సూల్తానా అరయలేకున్నది. ఏమందురా?—" అని జమ్నాదాసు తిరిగి చెప్పనారంభించెను.

"పౌరులమగు మేము మఱియొక విధమున తలంచుచుంటిమి. ఆమెను బహూకరింపకుండుట పాపమని మా తలంపు" అని ఒకడనెను.

దానికి జమ్నాదాసు ఇట్లుచెప్పెను. "నన్ను పూర్తిగ చెప్పనీయరు. మొగలుసేనాసముద్రమునకు చెలియలికట్టయై నిలిచి మన దుర్గనాశనమును పోకార్చిన ఆ గోషాధారి యోధుడు పురుషవేషము దాల్చిన మన సూల్తానా చాందుబీబీ మాత్రమే. ఆమె తనకు తానే ఎట్లు బహూకరించుకొనగలదు?"

ఆమాటలు విని వారందఱును అప్రతిభులై ఆశ్చర్యచకితులై కొంతసేపట్లే కొయ్యపెరుమాళ్లవలె నిలచియుండిరి.

కొంతకాలము గడచెను. అక్బరుసేనలు మఱియొకసారివచ్చి అహమ్మదునగరమునకు ముత్తెగవేసెను. ఈసారి ఆ దుర్గపరిరక్షణమునకు రజతకాంతుల వెల్లిగక్కు కవచమును ధరించిన ఆ యోధుడు లేకపోయెను. చేదోడు వాదోడు కావలసిన ఆతని యోధులే ఆతనికి ద్రోహ చింతనులై రాజభక్తిశూన్యులై ఆతనిని తుదముట్టించిరి. రక్షకుని తుదముట్టించి ఆర్జించిన పాపమునకు ఫలము వారు వెంటనే అనుభవించిరి. దుర్గము అక్బరుని కైవసమయ్యెను. తనకు శత్రురాలైనను ఆమె మంచిగుణముల మెలెంచగల యుదారుడు గావున అక్బరు చాందుబీబీ నింతచేసిన ద్రోహులను పట్టి తెప్పించి ముక్కముక్కలుచేసి కాకులకు గ్రద్దలకు వైచెను.

# లోభివాడు—హరికథ

శ్రీమతి బులుసు లక్ష్మీనరసమ్మగారు

(ఒక వినోదకథ)

అనగా అనగా వో వూళ్లో ఒక బ్రాహ్మడు వుండేవాడు. వానికి దిట్టంగా డబ్బుంది. కాని పరమలోభి. దమ్మిడీ మోహర్లాగు చూస్తూండేవాడు. పిత్రార్జితధనం కొంచెమెచ్చినను దాన్ని వొడ్డీవ్యాపారం చేత వొక లకారాని కిచేసేడు. వొక బోషాణంపెట్టె వాడింట్లో చిరకాలమునుండి వుండేది. తనసొత్తుయావత్తు ఆ బోషాణంలోపెట్టి బీగము వేసి దానిమీద వోకుచ్చెళ్లబొంతపరచి రాత్రిపగలు దాన్ని విడవకుండ పడుకునేవాడు. పాపం యింతడబ్బున్న మంచితిండెరుగడు. శుభ్రమైన బట్టఎరుగడు. అతనియిల్లాలు గుణవంతురాలు, పతివ్రత. ఆమెకు పతిసేవ, దైవభక్తి మెండు. అలాంటి భర్తదగ్గర ఆ యిల్లాలుకనక పురాణాది కాలక్షేపాలుచేస్తూ కాపరంచేస్తుండేది. వాడిదగ్గర మరో ఇలాంటాలాంటిది కాలక్షేపముచేయడం చాలా కష్టము.

ఇలాఉంటూండగా నవరాత్రులువచ్చేయి. ఆ వూళ్లోని ఆ నవరాత్రుళ్లు ప్రతిసంవత్సరం చందాలు వేసి చేస్తూండేవారు. అలాగు చేయడమే కాకుండా వొకహరికథా కాలక్షేపముకూడా మామ్మూలు. మామ్మూలుప్రకారం హరిదాసులువచ్చేరు. వూళ్లోచందాలుకు బయలుదేరి డబ్బు వసూలుచేసేరు. మన కథానాయకుడగు లోభాగ్రేసరుణ్ణి అడగడం మామ్మూలులేదు. వాడివ్వడం మామ్మూలులేదు. ఎవరుచందా లడిగినా మహాత్ముడు లాకేత్వంచెప్పటమే మామ్మూలు. ఎవ్వరికి ఎట్టనియోగా నేనాఇచ్చిన పాపాన్నిపోలేదు.

రాత్రి 9 గంటలవేళయినది. హరికథామందిరమంతా అలంకరించేరు, దాసుగారు గజ్జకట్టుకొని, తాళమేళాలికి శృతిచూసుకుంటూన్నారు. హరికథామందిరం ఇసక వేస్తే రాలనంతమందితో నిండిపోయింది. తాళమేళాలుచప్పుడువిని మనగృహస్తుని భార్యయగు మహాభక్తురాలిహృదయం భక్తిపరవశమై భర్తనుచూసి యిట్లు చెప్పడానికి ప్రారంభించినది. "ఏమండీ! రామా లేదు; కృష్ణా లేదు; హరికథ లేదు; గిరికథ లేదు; ఇంట్లోన్నమట్టుకు తింటూండడం; బోషాణమీద పడుకుంటూండడం; దీనివలన ఇహమా? పరమా? డబ్బుశాశ్వతమనుకొన్నారా? ఈతుచ్ఛశరీరము రేపోనేడో పోవలసినదే. అంచేత హరికథకువెళ్లి, రెండుముక్కలువిని నాకుచెప్పండి. దానివల్లఇహం, పరంవుంది. మీరుచెప్తే వినేసా సంతోషిస్తాను" ఈలాగ అనేకమార్లు చెప్పగా, చెప్పగావిధిలేక హరికథకివెళ్ల నిచ్చయించికొన్నాడు. కాని వెళ్లడానికిమాత్ర మిష్టంలేదు. ఇరుగుపొరుగులవాళ్లకి, ఊళ్లోవాళ్లకి వీడినిచూస్తే మహాకోపం. వీడెప్పుడిల్లుకదులుతాడు వీడిధనం ఎప్పుడు వుడాయించేద్దాం అని ఎదురుచూస్తుండే వారు. బాబుగారు హరికథకివెళుతూండగాచూసేరు. ఇంట్లోవున్నలొడ్డులొసుగు యావత్తు ఎగేసేద్దామని కాచికూర్చున్నారు.

హరికథలోకొచ్చేడు. వీడినిచూసి భాగ్యవంతుడని అంతా తోవ తొలిగేరు. మెల్లిగా దాసుగారి సమీపం లోకి వెళ్లినాడు. దాసుగారు వీడినిచూసి దొంగవేసి డబ్బులాగుదామని, ఆయనమీద కన్ను వేసినాడు. చూసి "అయ్యా! వచ్చేరా?" అని అన్నాడు. అప్పుడు బ్రాహ్మడికి వొంట్లోకుదుపుట్టి, అన్నా! నేరకొచ్చే నురా హరికథకిఅని అనుకోని కూర్చున్నాడు. హరిదాసుగారుచూసి "కూర్చున్నారా?" అనిఅడిగేడు. అంత బ్రాహ్మడుమనస్సులో "వీడిదుంపతెగ పిశాచంలాగుపట్టుకొన్నాడు. ఎలాగేనాబూటకాతీసి డబ్బులాగేదామని వాడిఉద్దేశము" అని అనుకొని గబగబ పుంజాలుతెంచుకొని యింటికిపరుగెత్తడం మొదలెట్టేడు. లోభికి దక్షిణ పావనం గదా? యింట్లోలోడ్డులోనుగు యావత్తు ఎవరేనా వుడాయించేస్తారని మనస్సులో భయంచేత అన్నారు. పరుగెత్తుతున్నాడు. అప్పుడుహరిదాసుగారు"ఏమండోయి! వెళ్లిపోతున్నారా?"అనిఅన్నాడు. వాడికి హరిదాసుగారిమాట లక్ష్యమా? మెల్లిగా యింటికిచేరి తలుపుబాదినాడు. అంత భార్య తలుపుతీసి అప్పుడే హరికథఅయిపోయినదండీ? అనిఅడిగింది. ఆ !!! అయింది. వాడిమొగంకథ, నీమొగంకథాను. హరిదాసు సంసారంగాదు. వొచ్చిందిమొదలు వొకటే పాట. ఎలాగేనాడబ్బు లాగేద్దామని ముఖస్తుతులు ప్రారంభించేడు. అప్పుడు భార్య భర్తనుచూచి ఏమిటి జరిగిందోచెప్పండురు సంతోషిస్తాను అని అడిగింది.

అంత బ్రాహ్మడు హరికథలో జరిగినభోగట్టా ఇట్లుచెప్పడానికి ఆరంభించేడు. నేను హరికథామందిరం లోకి వెళ్లేసరికి "వచ్చేరా?" అన్నాడు. హరిదాసు అన్న 'వచ్చేరా? శబ్దము ఇతడు గట్టిగా చేప్పేడు. అంతలో వీడికొంపంతా దోచేద్దామని పెరటిద్వారంతవ్వుతూన్న ఇరుగుపొరుగుదొంగలు, బ్రాహ్మడుచెప్పిన "వచ్చేరా?" అన్నశబ్దంవిన్నారు. విని "వీడి దుంపతెగా మనంరావడం ఎలాతెలుసుకున్నాడ్రా?" అని వాడి పెరట్లోవున్న నిమ్మచెట్టుక్రిందకు పారిపోయి కూర్చున్నారు. అప్పుడు బ్రాహ్మడుభార్య తరువాతేమిటిజరిగిందండీ? అన్నాది. మరేమి వాడిమొగం నేనుకూర్చుండడంచూచి "కూర్చున్నారా?" అని పారంభించేడు అని వొత్తిపలికేడు. పెరట్లోదొంగలు అదికూడావిని "వీడినెత్తికొట్టా కూర్చోడంకూడా చూచేడ్రా" అని సన్నసన్నగా కాళ్లకు బుద్ధిచెప్పే ప్రయత్నంలోకి దిగేరు. తరవాతేం జరిగిందని భార్యఅడగింది. మరేమి టంటా వేమిటె బ్రతకనిచ్చేడుకాడు. నేనుబయలుదేరడంచూచేడు. "వెళ్లిపోతున్నారా?" అనిప్రారంభించేడు అనిచెప్పుతూ హరిదాసు పలుకులు ఒత్తిపలికేడు. నాకసహ్యం వేసింది. పారిపోచ్చేను. అనిన్నీ చెప్పినాడు. అప్పుడుదొంగలు "పిశాచంముండాకొడుకు మనంపరిగెత్తిపోనడంకూడా చూచేడ్రా! ఇకమన ఆబోలుదక్కదు. వాడు పోలీసు కచేరీకిపోయి మనమీద నోటికొచ్చినట్లుకూస్తాడు, మనకొంపముంచేస్తాడు. కనుక మనదగ్గిర ప్రస్తుతంవున్న మూడువందలరూపాయలు వాడిమొగంమీదజల్లి బ్రతిమాలుకుందాంరార్రా?" అని ఇరుగు పొరుగుదొంగలు వాడికొంపమీదపడి వాణ్ణిపిలిచి ఆడబ్బుఇచ్చుకు కాళ్లమీదబడ్డారు. బ్రాహ్మడికి యీగోల తెలియదు. ఆ మూడువందలు అందుకొని తలుపులు బిడాయించేసేడు.

అప్పుడు భార్య, "చూచేరా? హరిదాసునోటంట వచ్చిన మూడుమాటలు వింటేనే మూడువందలు లాభంకలిగింది. అతడుచెప్పిన కథంతావింటే ఎంతలాభము వచ్చునోకదా?" అనిచెప్పెను. అదిమొదలు ఆ బ్రాహ్మడు తరుచూగా హరికథలకు వెళుతూ ఔదార్యముకలవాడై అంత్యమున విష్ణుసాయుజ్యము నొందేడు.

# గృహ కృత్యవిజ్ఞానము

శ్రీమతి కొండాలి సీతారామ దేవిగారు

కృత్యవిభాగమున చాలకాలమునుండి బయటకార్యములను చేసి వలయు వస్తు సామగ్రిని సమకూర్చవలసిన భారము పురుషులమీదను; ఇంటికివచ్చిన సామగ్రిని సర్వ భద్రముచేసి పచనకార్యము లొనర్పవలసినభారము స్త్రీలమీదను పడియున్నది. కావున స్త్రీ పురుషులకు వారివారికి ఏర్పడిన కార్యములను నిర్వహించుటకు వలయు జ్ఞానసముపార్జనము అత్యావసరమగు చున్నది. స్త్రీలు చేయవలసిన కృత్యములను అయిదు భాగములుగా విభజింప వచ్చును. 1 గృహనిర్వహణము 2 వంట చేయుట 3 కుటుంబసంబంధము 4 వస్తువులసంరక్షణ 5 దాసదాసీజన సంబంధము.



కొండాలి సీతారామ దేవిగారు

## గృహనిర్వహణము

రోగరహితముగను ఆరోగ్యముగను జీవించుటకు నివసించుచోటు శుభ్రముగ నుంచుటత్యవసరము. కనుక గృహమును శుభ్రపరచుటలో జాగ్రత్తగ నుండవలయును. ఏ యింటిలో తెలివితక్కువ స్త్రీలుందురో ఆ యింటిలో గదులు కిటికీలు నుండవు. ఇంటిలో సామానులను యిటునటు పారవైచుచుందురు. ఆ వస్తువులను శుభ్రపఱచరు. వస్తువులనిండ దుమ్ముకొట్టుకొనియుండును. ఇంటిలో దుర్వాసనవలన ననేకరోగములు వచ్చును. ఆ యింటిలో నున్నవారికి ఆరోగ్యము సరిగనుండదు. గృహము బాగుగ నుంచుటకు వెలుతురును, మంచిగాలియు కావలెను. అన్నిగదులయందును వెలుతురున్నదా మంచిగాలి వచ్చుచున్నదా లేదాయని స్త్రీలు చూచుచుండవలయును. గదులకు కిటికీలుండవలయును. ఇంటిలో మురికివస్తువుల నుంచకూడదు. ఇంటిలో కిరసనాయిలు దీపముల నుపయోగించువారు జాగ్రత్తగ నుండవలయును. ఏలనన వానినుండివచ్చు పొగ

గాలిని చెఱచగా, ఆ విషవాయువు లోపల ప్రవేశించి శ్వాసనాళములను చెడగొట్టును. దీపపు మసిదగ్గఱకు పురుగులు చేరుచుండును. అది యుండకుండ స్త్రీలు జాగ్రత తీసికొనుచుండవలయును. దానిలో చేరియుండు పురుగులు భోజనము చేయునపుడు వానిమనలో ప్రవేశించి అనేకరోగములను కలుగజేయును. ఇంటి నన్నివిధముల శుభ్రపఱచి అలంకరింపవలెను. అలంకారము చేయుటవలన నింటికి అందము మనస్సున కుల్లాసమును కలుగును.

## వంటచేయుట

వంటచేయుట స్త్రీలకు ముఖ్యమగుపని. శుభ్రముగను బలమిచ్చునట్టిదిగను ఆరోగ్యమును గలిగించునట్టిదిగను ఉండునట్టి పదార్థములు గుర్తెఱుంగవలయును. అన్ని ఋతువులలోను నొకే విధమగు పదార్థము పనికిరాదు. స్త్రీలు పాకశాస్త్రము తెలిసికొని యుండవలయును. ఋతువులయందు భోజనమును మార్చుటకూడ తెలిసికొని యుండవలయును. పరిశుభ్రమగు భోజనమునే తేలికగ భుజించుచుండిన ఆరోగ్యముగ నుండును. పక్వముగానట్టియు గట్టివస్తువులను యెక్కువగా తినుటవలన ఆరోగ్యము చెడిపోవును. వంటచేయుటకు ముందు స్త్రీలు వంటపాత్రలను యితరమగు సామగ్రిని శుభ్రపఱచవలయును. శుభ్రముగాని పాత్రల నుపయోగించుట హానికరము. ఏపాత్ర నుపయోగించుచుందురో ఆపాత్రను మట్టితో తోమి వేడినీళ్లతో కడిగి పొడివస్త్రముతో తుడువవలెను. వంటపాత్రల కెప్పుడును మూత యుంచవలయును. అట్లుచేయని యెడల యీగలు దోమలు పడి వానియందలి పదార్థములను అశుభ్రముగ నొనర్చును. వంటచేయువారు దేహమును వస్త్రమును శుభ్రముగ నుంచుకొనవలయును. వంటయింటికి ముఖ్యముగ వెలుతురుండవలయును. పొగపోవుటకు ధారాళమైన మార్గముండవలయును.

## కుటుంబసంబంధము

బయటిపనుల వలన పురుషులు అలసి యింటికి వచ్చునరికి గృహమున కలహములు నిండియుండెనేని విసుగుకొందురు. పురుషులకు సంతోషము సుఖము కలిగించుటకు స్త్రీలు తలంచుచుండవలెను. కుటుంబములో నొక్కరికికూడ నేవిధమగు కష్టమును కలిగించకూడదు. అట్లుకష్టములు కలిగించినయెడల క్రోధములు పెరుగును. కుటుంబమంతయు చెదరిపోవును. ఇంటిలో భార్యాభర్తలకు ప్రధానకర్తవ్యము యెల్లప్పుడును నేదియో యొకపని చేయుచుండుట. సోమరితనముగ కూర్చున్నయెడల జగడములు పెరు

గును. కుటుంబములో సంతోషముండుటకు యింటిలో అందఱును సత్యమును పలుకుచు నిశ్చలమైన మనస్సుతో నుండవలెను.

## శిశుసంరక్షణ

శిశుపోషణ స్త్రీలకు ముఖ్యమగుపని. బిడ్డలపోషణ సదా తల్లియే చేయుచుండవలయును. తల్లులు పిల్లలయొక్క ఆరోగ్యమును మనస్సును సరిగా నుంచుటకు ప్రయత్నించవలెను. గర్భములో నెప్పు డుత్పత్తియగునో అప్పటినుండి పిండముయొక్క ఆరోగ్యమును, మనస్సును తల్లిపై ఆధారపడియుండును. గర్భము నిలిచినప్పటినుండియు మిక్కిలి జాగ్రత్తగ నుండవలయును. తల్లులు మనస్సునకును శరీరమునకును యెక్కుడు కష్టమును గలిగించు పనులను చేయగూడదు. ఇట్లు చేసినయెడల బిడ్డల జీవిత మంతయు చెడిపోవును. ప్రసవించిన స్త్రీకి బాగుగ సేవ చేయుచుండవలయును. అట్టిస్త్రీవద్ద అశుభ్రమగు మంత్రసానిని ఉంచకూడదు. ఆమెకు సేవ సరిగ చేయనియెడల ప్రమాదము కలుగుచుండును. ఆమెను శుభ్రముగా నుంచుట శుభ్రమగు వస్త్రమును ధరింపచేయుట తేలికయగు భోజనమును పెట్టుట శుభ్రమగు గదియందుంచుట శుచిగల మంత్రసానిని యేర్పరచుట—వీనియందు జాగ్రత దీసికొనవలయును. పుట్టినప్పటినుండి శిశువును జాగ్రత్తగ పోషించుచుండవలయును. పుట్టినపుడు శిశువు బలహీనముగ నుండినప్పటికి బాగుగ పోషించినయెడల బలముకలుగును. తల్లి దండ్రులు పిల్లలయొక్క ఆరోగ్యమునందు మనస్సు నుంచవలెను. పిల్లలకు పుష్టినిచ్చు ఆహారపదార్థములను పెట్టుచుండవలయును. ఆరోగ్యము కొఱకు వ్యాయామ మవసరము. దానిని చిన్ననాటనుండియు తల్లిదండ్రులు నియమితకాలమునకు చేయించుచుండవలయును. కొందఱు బిడ్డలను పోషించుటకు నౌకరులను నియమింతురు. వారు సరిగా పెంచరు. పిల్లలను సంరక్షణ చేయుట తల్లిదండ్రుల మీాద ఆధారపడియున్నది. పరమేశ్వరుని నమ్మి ధర్మప్రకారము పోషించుకొనుచుండవలెను.

## వస్తుసంరక్షణ

చాలయిండ్లలో వస్తువులు యిటుఅటు పడవేసియుండును. వీనిని బాగుచేయుటకు వారికి మనస్సుండదు. అవి అట్లుండుట చూచి పురుషులు కోపపడుచుందురు. స్త్రీలకు సరియైన శిక్షలేక పోవుటచే తెలివి తక్కువచే వస్తువుల నందముగ నుంచరు.

బాల్యమున శిక్షలేక పోవుటచే నామె పత్నియైనప్పుడు ఆమె యింటి వస్తువులను సంరక్షణ చేయజాలదు. ఒకచోట పప్పు గుట్టుగా పోసియుండును. మఱియొక చోట బియ్యపు రాసి యుండును. ఇంకొకచోట అప్పడము లుండును. ఒకచోట కాకులు తిరుగుచుండును! పళ్లెములు గిన్నెలు చెంబులు నొకచోట పారవేయబడి యుండును. ఒకచోట రామాయణ గ్రంథము యొక్క పేజీలు ఎగిరి పోవుచుండును. గృహములోని విత్తనములను ఆహార వస్తువులను ఎలుకలు నష్టపఱచుచుండును. స్త్రీలకు గృహవిజ్ఞానమున్న యీ నష్టము లన్నియు తొలగును. ఏవస్తు వేస్థానము నందుంచవలయునో తెలిసికొని యుండ వలయును.

## దాసదాసీజనులు

బీదలు తప్ప భాగ్యవంతులు గృహకృత్యములను దాసీలచేతనే చేయించుకొనెదరు. ప్రస్తుతము భాగ్యవంతులు వంటచేయుట, శిశుపోషణమును కూడ నౌకరుల మీదనే వదలుచున్నారు. ఇందువలన భాగ్యవంతుల స్త్రీలకు పరిశ్రమ లేక ఆహారము జీర్ణము కాక రోగము లెక్కువగు చున్నవి. జ్ఞానముగల నౌకరులు దొరుకు టరుదు. అందువలన వంటచేయుట శిశుపోషణములను నౌకరుల మీద వదలకూడదు. ఈ రెండు విషయములయందు యజమానురా లజాగ్రత్తగ నుండకూడదు. దాసదాసీజనులకు కపటమును స్వలాభాపేక్షయును మెండు. మంచివారు దొరుకుట దుర్లభము. దాసీల చేతులలో బిడ్డల జీవితమును నష్టము చేసినట్లె యగును. నౌకరుల స్వభావమును రోగములును పిల్లలకు చేరును. కావున స్త్రీ లీవిషయములన్నియు శ్రద్ధతో గమనించి గృహకృత్యవిజ్ఞానమును పెంపొందించుకొందురు గాక యని కోరెదను.



## వింత శిశువుల జననము:—

నైజాము ఇలాకా విసునూరు గ్రామమునకు సమీపమునసుందు కొడకండ్లయను గ్రామమునందొక వడ్డె స్త్రీకి భాద్రపద శు ౧౦ రోజున గడ్డముతోడను, రెండు భాగముల శిరస్సుతోను ఒకమగశిశువు జన్మించి ఒకగంటకాలము జీవించి మరణించెను. తిరిగి ఆగ్రామమునందే భాద్రపద బ ౧౫ రోజున కోరదంతములు గలిగిన యొక మొగశిశువు యొకవడ్డెరస్త్రీకి జన్మించెను. సజీవుడైయున్నాడు. ప్రజలు ఆ వింతశిశువును తలచియు ఈ వింత శిశువునుచూచియు అచ్చెరువందుచున్నారు. (గోలకొండపత్రిక).

## అచ్ఛముగ బాలికయే:—

మైన్ హెడ్ పట్టణమున నున్న బాలికలలో మిగుల సౌందర్యముగల బాలికను రాణీగా చేసెదమని అచట కౌన్సిలువారు ప్రచురించిరి. వెంటనే పట్టణములోనున్న అందముగల బాలికలు రమ్యముగ అలంకరించుకొని పోటోలు తీయించుకొని కౌన్సిలువారికి పంపిరి. ఆపట్టణముననున్న ఒకబాలుడు బాలికవేషము ధరించి పోటోతీయించుకొని తన పోటోగూడ వారలకు అందజేసెను. కౌన్సిలు వారు తగుమధ్యవర్తుల నియమించి అందముగల బాలికలకు ఓట్లునొసగవలసినదని నను జ్ఞనిచ్చిరి. బాలుడు స్త్రీవేషముతో పంపిన పోటోకు అందరికన్న యెక్కువ ఓట్లు వచ్చెను. కనుక ఆపోటో బాలికలు పంపిన పోటోలుకన్న చాల అందముగ నున్నది. ఆ పోటోచూచిన యెడల అతనిని ఎవరు బాలుడని గుర్తించుటకు అలవికాకుండ నుండెను.

## ఒకగొప్ప ముత్యము:—

పర్షియను గల్ఫు ముత్యపు పేషరీలందు 50 ధాన్యపుగింజల భారముండు ఒక విలువగల ముత్యము దొరికెను. ఈముత్యము రంగునందును పరిమాణమునందును చాలాశ్రేష్టమైనది. 100 ఏండ్ల కాలమునుండి ఎప్పుడును ఈలాటి ముత్యము దొరకలేదు. ఈముత్యముయొక్క ధర 50,000 పౌనులని నిర్ణయింపబడుచున్నది.

### ఇంగ్లండులో వింతవివాహములు :—

1928 సంవత్సరములలో ఇంగ్లాండున చాల వింతవివాహములు జరిగినవి. 20 సంవత్సరములు ప్రాయముగల యువకులు తమకంటె రెట్టింపువయస్సుగల స్త్రీలను వివాహమాడినవారు పెక్కుమంది గలరు.

### టిన్ రేకుల విమానము:—

అమెరికా సంయుక్తరాష్ట్రములందు ఒకపెద్ద విమానము టిన్ రేకులతో తయారుచేసియున్నారు. ఇది చాల తేలికగాను బలముగాను ఉండును. ఇదిజపిలిన్ విమానముకన్న చాల గొప్పదట. 200,000 అడుగుల పరిమాణముగలది.

### ధనికురాలగుసినీమానటకురాలు:—

ప్రస్తుతమున్న సినీమానటకురాండ్రలో అమితధనమును సంపాదించినది మిస్ జి. లారెన్సు. ఈయమ వారము రోజులు సినీమాలో ఆక్టు చేసినయెడల 1000 పౌనులు పుచ్చుకొనును; ప్రస్తుతము ఆటపాటలతో మాట్లాడెడు ఫిలిములో ఆక్టుచేయుచున్నది. 5 నిమిషములు యెచటనైన ఆక్టుచేసినయెడల 500 పౌనులు పుచ్చుకొనును. ఈమె తనపాటను గ్రాంఫోను రికార్డులకుకూడ నిచ్చి చాల డబ్బును సంపాదించుచున్నదట.

### లంబికాయోగము:—

పూర్వము మనమహర్షులాచరించు యోగములలో లంబికాయోగ మొకటియై యున్నది. జిహ్వను కపాళరంధ్రమువరకు పోనిచ్చి యోగమునందు కూర్చుండుటచేత కపాళమునుండినాల్కపైకి బిందువులుగా స్రవించు అమృతమును త్రాగిమనుష్యుడు భూస్థాపనమయినను సరే పెక్కు వందలయేండ్లు బ్రతకగలడనియును, ఈ యోగమునకు గూర్చుండు నప్పు డాతడు యేస్థితిలో మనస్సునుంచిన ఆస్థితియందే యుండుననియును, మహర్షులు భగవంతునియందు మనస్సు లయింపజేసి లంబికాయోగసిద్ధిచే మోక్షమును గాంతురనియు ప్రసిద్ధియై యున్నది. నేపాళదేశములోని శిలానదితీరమున ఒక కంట్రాక్టరు నేలను త్రవించుచుండగా భూమిలో సజీవియైయున్న ఒకమనుష్యుని తలపైగునపపు దెబ్బతగులగా ఆభూమిలోని మనుష్యుడు స్పృహలేక పడిపోయెను. ఈవింతచూచి వానిని జాగ్రత్తగా త్రవ్వి శరీరమును బయటికి తీసిరి. వెంటనే కంట్రాక్టరు సమీపమందలి వైద్యమునేర్చిన ఫాదిరీదగ్గరకు వానిని తీసికొనిపోయి గాయమునకు చికిత్స చేయింపగా 3 దినములకు తెలివివచ్చెను. ఆమనుష్యుడు మనలో బాగాపొడగరికన్నను పొడవుగానున్నాడు. అతడు ఏదోభాష మాటలాడుచున్నాడు. కాని ఎవరికిని అర్థముకాలేదు. పదిదినములు రొట్టె పాలు పండ్లు దిని బ్రతికెను. పిదప అడవి జాతులలో ఒకతెగవారికి ఆభాష కొంత అర్థమయ్యెను. అది 'చినారీ' అను భాషయని గ్రహించిరి. అతడు చెప్పు మాటలవలన ఇప్పటికి 200 సంవత్సరములకు పూర్వము లంబికాయోగసిద్ధివలన భూమిలో స్థాపింపబడి సజీవియై యున్నట్లు తెలిసెను. అతడు తరువాత 2, 3 దినములు మాత్రమే బ్రతికెను. అస్థిపంజరము ఆగ్రావస్తు ప్రదర్శనశాలకు పంపబడెనని తెలియుచున్నది." (ఐరావతి)

# వనితాలోకము

మృణాళిని దాసుగుప్త కన్య :—

కీర్తిశేషులైన రాయికమలానాథ దాసుగుప్తగారి తనయ. డక్కా విశ్వవిద్యాలయమువారి యాజమాన్యమున నిర్వహింపబడు ఎం. ఏ పరీక్షలో ఈ సంవత్సరము ఫస్టుక్లాసున నెగ్గినవారిలో నీమె ప్రథమురాలు. వంగసంస్కృతము లీమె అభిమాన విద్యలు. ఈమెతండ్రి గొప్ప స్త్రీ విద్యాభిమాని. తదుద్ధారకుడు. ఈమె ఉన్నతవిద్యబడసి తండ్రి ఆశయములను నెఱవేర్చినది. తనకు విద్యాప్రదాయియగు డక్కా విశ్వవిద్యాలయముననే ఆమె భాషాపరిశోధనము చేయ సంకల్పించియున్నది.


జి. యన్. శారదాకన్య

జి. యన్. శారదా కన్య :—

చిత్తూరుజిల్లా విద్యా సంఘసభ్యురాలుగా ప్రభుత్వమువారిచే నియమింపబడినది.

శాంతా వాసుదేవ సూక్తంకరు కన్య :—

ఇందూరు సంస్థానమున విద్యాశాఖాధికారిగానున్న డాక్టరు వి. ఎ. సూక్తంకరు (ఎం. ఏ. పి. హెచ్. డి) గారి తనయ. ఇప్పటి ఈమెవయస్సు పందొమ్మిదిసంవత్సరములు మాత్రమే. ఈమె చిన్నతనమున ఇందూరునందలి చంద్రావతీమహిళా విద్యాలయమున చదివి తన పదునైదవయేట అలహాబాదు యూనివర్సిటి వారి మెట్రిక్యులేషను పరీక్షలో జయముగాంచెను.

సంస్కృతమున గొప్పమార్కులను సంపాదించెను. అనంతరము ఆమె లక్నోనగర మందలి ఇజబెల్లాథోబరన్ కళాశాలలో జేరి తన పదునేడవ సంవత్సరమున ఇంటరుమీడియటు పరీక్షలో శాస్త్రము అభిమానపాఠము గైకొని జయముగాంచెను. ఈ సంవత్సరము ఈమె ఆగ్రా విశ్వ విద్యాయలమువారి బి.యే పరీక్షలో అత్యుత్తమమైన తరగతిలో నెగ్గెను. బియ్యే పరీక్షయందు ఆంగ్లభాషలో గరిష్ఠసంఖ్యగల మార్కులు సంపాదించి ఈమె జోన్సు మునిసిపల్ మెడలుపొందినది.


బాలాంత్రపు శేషమ్మగారు

శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారు :—

సుప్రసిద్ధాంధ్ర విదుషి. కాకినాడ యందలి విద్యార్థినీ సమాజమునకు కార్యదర్శిని. మహిళా జాతీయ విద్యాలయ నిర్మాత్రి; హిందూసుందరి పత్రికాసంపాదకురాలు. ఈమె ప్రస్తుతము కాకినాడ మునిసిపలుసంఘసభ్యురాలుగా నియమింపబడినది.

రాజనాయకము సతి :—

యల్. యమ్. పి. పరీక్ష ప్యాసు చేసినది. ఈరోడునగరమున మొదటితరగతి బెంచి మేజిస్ట్రేటుగా నియమింపబడినది.

సునీతిదేవి మిత్రసతి :—

సంయుక్త పరగణాలయందు మునిసిపలు కమీషనరుగా నియమింపబడిన స్త్రీలలో ప్రథమురాలు. లక్నోనగరమందలి యువజనసమితికి ఉపాధ్యక్షురాలుగా ఎన్నుకొనబడినది.

డాక్టరు ఆచార్య ఓమెన్ కన్య :—

బరంపురమందలి బాప్టిస్టు మిషను హాస్పిటలులో డాక్టరుగా నున్నది. మద్రాసు ప్రభుత్వము వారీమెను బరంపురమున గౌరవన్యాయాధికారిణిగా నియమించిరి.

ఫెల్లిసు మేకే ఎమిలీ ఛాన్సు కన్య :—

మదరాసుపోర్టుట్రస్టుకు చెందిన జేమ్సు ఛాన్సుగారి కొమార్తె. లండను నగరము లోని సంగీతపరిషత్తున పట్టా పొందినది. బెడ్‌ఫోర్డుసందలి సంగీతవిద్యాశాలయందు కూడ గొప్ప యోగ్యతాపత్రములను బడసినది.



ధాయమనిమాన్యయలుసతి—

యల్. భవానిఅమ్మ కన్య :—

కేరళ వనితలలో మహోపాధ్యాయ పరీక్షయందు నెగ్గినవారిలో ప్రథమురాలు. తిరువాన్కూరు తియ్యా స్త్రీల బహిరంగసభలో బంగారుపతకము కొలదికాలము క్రితము బడసియున్నది ఈమెవయస్సు ఇప్పుడు పందొమ్మిది సంవత్సరములు మాత్రమే.

ధాయమని మాన్యాలు సతిగారు :—

టూటికారను మహిళా సంఘమునకు కార్యదర్శినిగా ఎన్నుకొనబడినది.

పద్మావతి కనకరత్నముఅమ్మాళ్ :—

బి. యె. యల్. టి పట్టము నొందినది. లండను విశ్వవిద్యాలయమువారి బి. యస్. సి పరీక్షలో జయము గాంచినది. ఈమె ప్రస్తుతము వారణాసియందలి స్త్రీ కళాశాలలో చారిత్రకార్థ శాస్త్రోపాధ్యాయినిగా నియమింపబడినది.

అలమేలుమం. తాయారమ్మాళ్ :—

మదరాసు మండల విద్యాసంఘసభ్యురాలుగా నియమింపబడినది.

లీనాఎడ్విన్ కన్య :—

తిన్నవెల్లిలో నూతనముగా స్థాపింపబడిన హైందవస్త్రీ ఉపాధ్యాయినుల బోధనాభ్యసన కళాశాల ప్రధానోపాధ్యాయినిగా నియమింపబడినది.

# మెడగాస్కారు స్త్రీలు

హిందూమహాసముద్రమున ఆఫ్రికాఖండము సమీపమునందున్న ద్వీపములలో మెడగాస్కారు ఎన్నదగినది. 1,000 మైళ్ల పొడవు; 300 మైళ్ల వెడల్పు గలిగి సుమారు 250,000 చదరపు మైళ్ల విస్తీర్ణమున నొప్పుచున్నది. ఇంగ్లాండు స్కాట్లాండు ఐర్లాండు దేశముల కంటె రెట్టింపు పెద్దది. 1895-వ సంవత్సరమున ఫ్రెంచివారిచే జయింపబడి నాటినుండియు వారి పాలనను క్రిందనున్నది.



కేశసంస్కారము

ఉంగరములుగ మెలిపెట్టుట; చిక్కుదీయుట, జడయల్లుట—ఇట్టి విధములగు కేశసంస్కారమున అచ్చటి స్త్రీలు దిట్టలు.

మెడగాస్కారు ద్వీపము పైరు పంటలతో నలరారుచున్నది. ఇందిప్పుడు చీనావారును, హిందువులును వర్తకము చేయుచున్నారు. ఈ ద్వీపవాసులు విగ్రహారాధకులు, మంత్రతంత్ర వాదులునై మూఢవిశ్వాసవంతులుగా హిందువుల యాచారములను కొంతవఱకు కనుష్ఠించువారుగా నున్నారు. ఇప్పుడిప్పుడు కొంతమంది క్రైస్తవ మత ప్రవిష్టులగుచున్నారు. మతము పుచ్చుకొన్న వారు శుభ్రవస్త్రములను క్రొత్త మాదిరి వస్త్రములను ధరింతురు. క్రైస్తవులు కాని వారు తెల్లటిలంగాలను పెద్ద చొక్కాలను ధరింతురు. ఈ ద్వీపవాసుల దుస్తులలో గమనింప వలసిన విషయమేమన స్త్రీ పురుషు లిరువురును ఒకే మోస్తరు దుస్తులను ధరించుట.

ఈ ద్వీప మందలి స్త్రీలు ఒడలు వంచి పనిచేయు మంచి గుణముకలవారు. వివేకము కలిగి దయాస్వభావులై మిక్కిలి మంచి హృదయము కలిగి యుందురు. ఇచ్చటి

స్త్రీలకు మన దేశమునందలి కొన్ని యున్నతకుటుంబములందువలె ఘోషా ఎంత మాత్రమును లేదు. వారు యథేచ్ఛావిహార మొనర్చుచు తమ పనులను చేసికొందురు.

ఆ ద్వీపము నందలి వాహనములలో విచిత్రమైనదియు ముఖ్యముగా పేర్కొనదగినదియు ఒక విధమైన పల్లకీ. ఆ దేశమునందలి స్త్రీలు ఒక చోటినుండి మఱియొక చోటికి పోవలసి వచ్చినచో తఱచు దానిమీదనే పోవుచుందురు. ఆ పల్లకీ స్త్రీలే మోయుదురు. దాని నిర్మాణము అతివిచిత్రముగా నుండును. అది అడ్డముగా పరవబడిన రెండు బొంగుల మధ్య మధ్య కఱ్ఱలచే బిగింపబడి నడిమి ప్రదేశము నందు క్రింది భాగమున కాళ్లు పెట్టుకొనుటకు వీలుగా కుర్చీవంటి యొక పీట అమర్చబడి యుండును. గొఱ్ఱెతోలు ముక్కలు అందు మెత్తతనమునకై బిగింపబడును. దీనిని నలుగురు మోయుదురు. దీనిని 'ఫిలంజనా' అందురు.



జలపాత్ర.

జలపూర్ణమగు కుంభమును శిరమున తాల్చి వైధవ్యచిహ్నముగ జుట్టు విరియబోసికొనియున్న మెడగాస్కరు పనికత్తె.

ఇచ్చటి స్త్రీలు నాగరికత గలవారే. శిశుపోషణమునందు వీరికి ఆదరణయు అధికారమును హెచ్చు. అచ్చట పాడిపంటలకు కొఱతలేదు. దేశమున నూతనముగా నేల బొగ్గు గనులు కనుగొనబడినవి. ఈ ద్వీపమున బంగారపు ఇసుక విశేషముగ లభ్యమగుచున్నది. ఆ ఇసుకనుండి జనులు బంగారమును తయారుచేయుదురు.

మెడగాస్కరునందు చెలామణీ యగునవి ఫ్రెంచినాణెములు. చిల్లర వలయుచో వారు మనకువలె చిన్ననాణెములుగా మార్చరు. అసలు నాణెమునే ముక్కలుముక్కలుగా చేసి వాడుదురు.

నిలువు పొడువున నెదుగు నచ్చటి కలువపూవులలో బుట్టు గింజలను అచ్చటి జనులు ఆహారపదార్థములుగా నుపయోగింతురు. మామిడి, జామి, అనాస, నారింజ, మిరియాలు, అల్లము, నీలిమందు, చెఱకు, వరి, మొక్కజొన్న, బంగాళాదుంపలు, ప్రత్తి, కాఫీ, కోకో, పొగాకు, గోగునార మున్నగునవి పైరగుచుండును. వ్యవసాయపు పనులందు పురుషులకు తోడుపడుటలో నిచ్చటి స్త్రీలు మంచి అభిరుచిని అభిలాషను గనబఱచుచు ఈ విషయమున ఇతర దేశ స్త్రీలకు మార్గదర్శినులుగా నున్నారు.



వస్త్రాలంకరణము.

విమర్శకదృష్టితో పరికించితిమేని ఈ మెడగాస్కరు స్త్రీ వస్త్రాలంకరణమునందు హైందవ ముద్ర ఒక్కింత పొడగాననగును.

ఇచ్చటి స్త్రీలు తేనెటీగలను బెంచి తేనె జేయుటయందును; పట్టుపురుగులను బెంచి పట్టు దీయుటయందును మిగుల నేర్పరులు. మెడగాస్కరుస్త్రీలు పిచ్చినమ్మకములు గలవారు. ఎట్టి శుభకార్యము చేయవలసి వచ్చినను వారు ముందు మంత్రవేత్తలతో సంప్రదింతురు.

ఆ ద్వీపమున నాగళ్లు మిక్కిలి చిత్రముగా నుండును. చివర పారలవలె రేకు తేలియుండి పొడుగుపాటి కాడతో కూడి యుండును. చేతి ఊతచేతనే అది నేలయందు గ్రుచ్చబడి మంటిని పెళ్లగించును. పొలమంతయు ఇట్లే దున్నబడును. పొలములు దున్నుట మన దేశమునందు వలెనే అచ్చట పురుషులే చేయుదురు. వరియాకును ఊడ్చుట ఇక్కడివలెనే అక్కడకూడ స్త్రీలే చేయుదురు. మెడగాస్కరుస్త్రీలు వడ్లను స్వయముగ దంచి బియ్యము చేయుదురు. అందుల కుపయోగించు పరికరములగు రోలు, రోకలి, చేట, జల్లెడ మొదలగువానిని తప్పక గలిగియుండుట వారు గొప్పగా భావింతురు.

మెడగాస్కరు స్త్రీలు నూతనాచారములను గ్రహించుటయందు ఉల్లాసమును, ఇతరులను ఆదరించుటయందు ఉత్సాహమును, కుటుంబమునందలి వ్యక్తులను ప్రేమించుట

యందు అత్యభిరుచిని కనుపఱచెదరు. వారి మాతృత్వము అనర్ఘప్రాయమైనది. శిశువులను పోషించుట కతిశ్రద్ధ చూపుదురు. బిడ్డలను మూపునగట్టి ఎట్టి భారమసియు నెంచక పనులొనర్చు మెడగాస్కరుస్త్రీని చూచితిమేని అబ్బురపడకమానము.

వివిధవిధముల కేశసంస్కార మొనర్చుకొనుటకు అ దేశపుస్త్రీలు ప్రియము పడుదురు. ఉంగరములు చుట్టునట్లుజుట్టును పెంచుకొనుట ఆదేశమున సౌందర్యమునకు ముఖ్యలక్షణము. మెడగాస్కరు స్త్రీలలో మగనిని గోల్పోయిన వారు తమ వైధవ్యమునకు చిహ్నముగా జుట్టు విరియబోసి కొందురు.



మెడగాస్కరు బాలికలు.

ఆనందహృదయలగు మెడగాస్కరు బాలికలు వికసితవదనములతో కరతాళధ్వనులతో ప్రకృతిసహచర్యమున ఆడియుపాడియు ప్రొద్దుపుచ్చుచుందురు.

చాపల పరిశ్రమ ఆ దేశమున విరివిగ సాగుచున్నది. అందు హెచ్చుగ పనియగువారు స్త్రీలే. రకరకముల బుట్ట లల్లుటలోను ; వివిధపరిమాణముగల చాప లల్లుటలోను అచ్చటి స్త్రీలు కనుపఱచు ఉత్సాహము కొలది యిడరానిది.

# ఆరోగ్యభోజనము

"కుమారబోధిని"

౧. భోజనము పరిశుభ్రవాయువుగల చోటఁ జేయవలయును.

౨. భోజనము మధ్య నీరు త్రాగ కూడదు, గంటముందుగాని పిమ్మటగాని త్రాగవలెను.

3. తినుఆహారము ఏదయినను, బాగుగా నమలి మ్రింగవలెను. ద్రవపదార్థమయినను కొంతసేపు నోటిలోనుంచి మ్రింగవలెను.

# మేరీరాణి వాచకపుస్తకములు

ఆంధ్ర శేషగిరిరావుగారు బి. యె (సారస్వత సమాజము)

ప్రస్తుతము ఆంధ్రదేశమున మునిసిపాల్టీలు, తాలూకాబోర్డులు మొదలగు సంస్థలవారు బాలికల కొఱకు ప్రత్యేకపాఠశాలలను స్థాపించుచున్నారు. బాల బాలికలకు ఒకే మోస్తరు విద్య కూడదు. బాలురను బాలికలును పెద్దలై నిర్వహింప వలసిన పనులు వేఱువేఱై యున్నవి. అగుట చిన్నతనము నుండియు వారివారి కృత్యములకు ఉచితమైన జ్ఞానము ప్రసాదించుట లెస్సయగు మతము. ఈ కారణమున బాలికలకు ప్రత్యేకించి వాఙ్మయముండుట ముఖ్యావసర మగుచున్నది.

అట్టి ముఖ్యావసరమును గమనించి ఆంధ్రమున బాలికల కొఱకు ప్రత్యేకముగ రచింపబడిన వాచకపుస్తకములలో నాయెఱిగినంతవఱకు మేరీరాణి వాచకములు తొలుతటివి. ఇవి ప్రాథమికవిద్యార్థినుల కొఱ కుద్దిష్టమైనవి కావున ౧, ౨, ౩, ౪ వాచకములే ప్రచురితములైనవి. పదిసంవత్సరములకు పూర్వమే ఇవి శ్రీయుతులు హరి సుబ్బారావుగారిచే రచియింపబడి మద్రాసునందలి సి. కుమారస్వామినాయుడు అండు సన్సు వారిచే ప్రచురితమైనవి. కాని ఆంధ్రదేశమందలి బాలికాపాఠశాలాధికారు లీవాచకములను వలయునంత ప్రచారములోనికి తెచ్చినట్లు కానరాదు. ఇదియెంతయు శోచనీయము.

ఈ వాచకములలో మొదటిది బాలశిక్ష. అది అక్షరములు, పదములు బోధించునది గావున దానికి ప్రత్యేకత అవసరములేదు. అగుట నది బాలురపుస్తకమువలెనే ఒప్పుచున్నది. ఇక రెండవ వాచకమును గూర్చి. ఇందు బాలికల కొఱకైన ప్రత్యేకపాఠములు ప్రారంభమైనవి. మంచిబాలిక; జపానుపడుచు; విక్టోరియా మహారాణి మొదలగు నిందలి పాఠములు బాలికలకు మంచిగుణములను నేర్పజాలినవియై యున్నవి. సూది, ధాన్యములు, ఆవుమొదలగు పాఠములు వారిగృహవిజ్ఞానమును—శుభ్రత, నీరు, ఈగ మున్నగు పాఠములువారి ఆరోగ్యజ్ఞానమును పెంపొందింప జాలినవియై యున్నవి. జోల, ద్రెళ్లపాట ఇత్యాదిపాటలు వారికి ప్రియమును గూర్ప జాలియున్నవి.

మూడవవాచకము ఇంతకంటె విశేషవిషయములతో నొప్పుచున్నది. వర్షించుట, సంభారవస్తువులు, బిడ్డను ఆడించుట, జంతువులను పెంచుట, జాబువ్రాయుట మొదలగు నిందలి పాఠములు బాలికల విజ్ఞానాభివృద్ధికి మిగుల తోడ్పడగలవు. బాలికలు ఆప్యాయముతో చదువు నీతిగర్భితములగు పౌరాణికకథలుకూడ కొన్ని గలవు.

నాలగవవాచకపుస్తకమున అద్దెకు ఇల్లుచూచుట, కుట్టుయంత్రము, భోజన పదార్థములు, బట్టలు, ఆయము మించినవ్యయము మొదలగు పాఠములు బాలికలకు మంచి జ్ఞానమును ప్రసాదింప జాలియున్నవి. దోమ, చలిజ్వరము, తాంబూలము, అంటురోగములు, నీటిని వడియగట్టుట, మున్నగు పాఠములు వారికి ఆరోగ్యకరమైన అలవాటుల నేర్ప జాలియున్నవి.

బాలికల చిత్తములను ఆకర్షింపగల పటములతో ఈ వాచకములు నిండారియున్నవి. పొడుపుకథల పద్యములు; కుమారీసుమతీ శతకములోని నీతిపద్యములు ఇందు చేర్చబడి వాచకముల విలువను రెట్టించుచున్నవి. బాలికా పాఠశాలాధికారులు వీనియందలి మేలెఱింగి తగుప్రచారములోనికి తేవలసియున్నది. బాలురకొఱకు వాచకములు అనేకములు వ్రాయబడినవి; వ్రాయబడుచున్నవి. కాని బాలికలకొఱకు ప్రత్యేకముగ వ్రాయబడిన ఆంధ్రవాచకములు మిక్కిలి తక్కువ. వానిలో ఈ మేరీరాణీ వాచకములు తొలుత పేర్కొనదగినవి. చిరకాలముగా దేశమునందు ప్రచారముననుండి వినువారి వీనులకు విందుగూర్చు ఈ క్రిందిపాటలు ఈ వాచకములలో ఉద్ధృతములగుట ముదావహముగనున్నది.

## చందమామ

చందమామరావె ! జాబిల్లిరావె !
బండెక్కిరావె ! బంతిపూలు తేవె !
కొండెక్కిరావె ! కోటివేలు తేవె !
పఱుగెత్తిరావె ! పంచదార తేవె !
పల్లకీలోరావె ! పనసపండు తేవె !
తేరుమీఁదరావె ! తేనెపట్టు తేవె !
అన్నిటిని తేవె ! అమ్మాయికీవె !

—2-వ వాచకమునుండి.

## జోలపాట

నిద్రించు శ్రీరామ ! నిద్రించురామ !
కమనీయగుణధామ ! కమలాక్షరామ !
విమలచారిత్ర ! శ్రీవిశ్వేశరామ !
మునులరక్షించిన ముద్దులరామ !
వనములకేఁగిన వనజాక్షరామ !
పూతచారిత్రయై పొలుపారునట్టి
సీతనుగైకొన్న శ్రీరామచంద్ర !

—4-వ వాచకమునుండి.



వంగదేశమున స్త్రీ విద్యాధికారిణి:—

పై విషయమునుగూర్చి అక్టోబరుమాసపు 'మోడరను రివ్ప్యూ' పత్రిక ఇట్లువ్రాయుచున్నది :—

"వంగదేశమున పెక్కు బాలికాపాఠశాలలలో విద్య మాతృభాషలోనే గఱపబడుచున్నది. ఆ కారణమున వంగభాష బాగుగ నెఱింగి పట్టపరీక్షనందిన దేశీయస్త్రీలే పాఠశాలలు తనిఖీ చేయుటలెస్స. ఇట్టి దేశీయస్త్రీలకు ఆంగ్లభాషాసుపరిచయముగలదు. అందు గొందఱు విదేశములకుగూడపోయి వచ్చియుండిరి; వారి వైదుష్యము అనేకవిషయములచే ప్రకటితమగుచున్నది. అట్టివారిలో నొకరిని స్త్రీ విద్యాధికారిణిగా నియమించుట పాడి. అయినను నొక ఆంగ్లస్త్రీని ఈ పదవికొరకు దిగుమతిచేయు ప్రయత్నములు సాగుచున్నవట. ఇదిఎంత అవమానకరమైనది! ఈ సందర్భమున మఱియొకవిషయము. ఒకేవిధమైనకష్టము, బాధ్యత గలపనికి స్త్రీకి తక్కువగాను పురుషునకు ఎక్కువగాను ఇచ్చుచున్నట్లు వినుచున్నాము. ఇది ఎంత అన్యాయమైన విషయము!"

అవమానకరమును, అన్యాయమునునగు నిట్టివిషయములు మన చెన్నపురిరాజధానియందును జరుగుచున్నవి. అయితే వీనిని తొలగించుటకు గాని నిర్మూలించుటకు గాని ఇక్కడ ఎట్టిప్రయత్నమును జరుగుటలేదు. వంగదేశీయులను చూచియైన మనవారు అట్టి ప్రయత్నముచేయ దొరకొనిన మేలగును.

ఇంకేం గర్తవ్యమేమి ?—

ఈ శీర్షికక్రింద శారదాచట్టమునుగూర్చి అక్టోబరు 6—వ తేదీనాటి 'యుగంధర' పత్రిక ఇట్లువ్రాయుచున్నది:—

"శారదాబిల్లు పరాస్తము కావలయునని సనాతనాచారపరాయణులు తీవ్రమగు నాందోళనమును సాగించిరి. వారి యాందోళనమునకై వారు పడనిపాట్లులేవు. ప్రయోగింపని యుక్తులేదు. కాని దేశమున గరిష్ఠసంఖ్య బిల్లున కనుకూలమగుటచే సనాతనుల బలము చాలినదికాదు. బిల్లు శాసనము కావలయునని పట్టు పట్టిన పక్షమునకంటె ప్రతికూలపక్షమునకే బలమునకు మించిన హాకము గనిపించినది. తీర్మానములు చేసిరి. ప్రచారములు సాగించిరి. మహాజరులు పంపిరి. అభిగమనములు నడపిరి. కాని వారి ప్రయత్నము లన్నియు భగ్నములైనవి. బిల్లునకనుకూలురగ నున్నవారును తమ ప్రచారమున ప్రసక్తులై యుండలేదు. వీరును భీరులని మేమనము. భీరుత్వము వీరినాశ్రయించుటచేతనే క్రియాపూర్వకముగ రజస్వలావివాహములను జరిపి సంఘమును వశపఱచుకొనుటకు బదులు ప్రభుత్వము నాశ్రయించి శాసనము చేయించుకొనుటకుఁ బాల్పడిరి. సంఘముల మీఁదఁ బ్రభుత్వము సాగించుట కుద్దిష్టములైన పీఠములు తమ ధర్మమును మఱచి దుర్బలపనములై నామమాత్రావశిష్టములైనవి. ఇఁక ప్రభుశాసనమే శరణ్యమయినదని అధునాతను లనిరి. సంఘ ప్రభుత్వము కొల్పడి పదభ్రష్టత కలిగినదని గ్రహించియు సంఘము ఈ వివాహశాసనమువలన చ్యుతమగునని సనాతనులనిరి, ఉభయులు భీరువులే. ఉభయవాదములును నిస్సారములే. ఈ వివాహసంస్కరణము మాత్రమావశ్యకమే యగును. కాని ప్రభుత్వశాసనము వాంఛనీయము కాదని నాటివలెనే నేఁడును మేమందుము. కాని ఈ శాసనమును గూర్చి మేము నిందింపము. అభినందింపము. కానిసనాతనుల చిత్తవృత్తులను నిశ్చలదీక్షను, నిర్వ్యాజసేవాపరాయణతను పరీక్షించుటకే శాసనము రూపుదాల్చినదని నమ్మి ఒక విధముగా అభినందనమే తెలుపవలసిన వారమైతిమి. ఇఁకఁ గర్తవ్యమేమి? అనునది మాత్రము మిగిలియున్నది. ఈ వివాహశాసనము సంఘవిప్లవమునకుఁ గారకమగునని నమ్మినవారు ఎందఱున్నారు? వారి విశ్వాసము స్వచ్ఛమైనదా? అని పరిశీలింపవలయును. శాసనమును మార్కొనవలయును. దండనలకు గుఱిగావలయును. ఫిరంగివాతికెదురుగా నిలువవలయును. ఇట్టి త్యాగము చూపఁగల ధీరులెందఱు సనాతనులమండి వెల్వడగలరు? ఈయుద్యమము నిజమైన దీక్షతో సాగించి శాసనమును రద్దుచేయఁగలిగిరా సనాతనార్యపరాక్రమము వీరిలో నింకను శేషించినదని దేశమేకాదు. ప్రభుత్వముగూడ శ్లాఘించును. లేనిచో వీరును పౌరుషహీనులని వట్టియాందోళకులని అప్రతిష్ఠాభాజనులు గాక తప్పదు. సనాతను లెంతవఱకు ఈ సన్నివేశమును మోహాటించి నిలువఁగలరో చూడఁదగును."

## కీ. శే. యఱ్ఱమిల్లి శకుంతలా దేవి:—

అక్టోబరు 7—వ తేదీనాటి 'సత్యాగ్రహి' పత్రికయిట్లు ప్రచురించుచున్నది :—

"ఈమె నర్సాపురములో సుప్రశిద్ధ న్యాయవాదులును, మహోదారగుణోపేతులునగు శ్రీయఱ్ఱమిల్లి నారాయణమూర్తిగారి భార్య. ఆంధ్రదేశమున సుప్రసిద్ధనియోగికుటుంబమగు దాసువారి యింటి యాడపడుచు, దాసు గోవిందరావు పంతులుగారి కుమార్తె. చనిపోవునప్పటి కీమెకు 30 సంవత్సరములు లోపు వయస్సు. ఈమె సుమా రొకసంవత్సరమునుంచి వ్యాధి పీడితురాలయి తుదకు హృద్రోగమువలన 20-9-29 తేదీని గం 3-30 నిమిషములకు భౌతికజీవితమును చాలించెను. శకుంతలాదేవి విద్యావతి, మహదైశ్వర్యవంతురాలు అయ్యు నిగర్వచూడామణి. సంఘసంస్కరణాభిలాషులగు దాసువారి యింటియాడపడుచైనను సనాతనధర్మా

భిలాషిణి. బీదసాదలను భేదములేకుండ పిలుచి ప్రతివారి యింటికి పెండ్లిపేరంటములకు వెడలి వారి మనస్సుల రంజింపజేయు స్వభావముగలది. తన నౌకరులకు తలలోని నాల్క. నౌకరులు ఆమె మరణమునకు యింటిలోనివారికంటె నెక్కుడుగ దుఃఖించిరి."

## పాముకాటుచే ఆరోగ్యము:—

ఈ విషయము 'గ్రామోద్ధరణ' పత్రికనుండి ఎత్తి వ్రాయబడినది :—

ప్రపంచమునందలి వస్తువులు రెండు విధములు. మంచివని చెడ్డవని.—అయితే ఉపయోగముకాని వేవిన్ని వుండవు. ఏ వస్తువు అయినను దాని వుపయోగము నరునికి తెలియకుండవచ్చు గాని, కొన్ని రోజులలో జ్ఞానాభివృద్ధిచే దాని సుగుణము తెలియుట నిశ్చయమని మా నమ్మిక.—పామువిషము చెడ్డది. దాని "నేల భగవంతుడు పుట్టించవలెను?" నని అనేకులు ప్రశ్నించి యున్నారు, ప్రశ్నించుచున్నారు. కొందరు ఆయుర్వేదశాస్త్రజ్ఞులు ఆ విషము మందులలో నుపయోగింప బడుచున్నదని చెప్పినా నాస్తికవాదము ననుసరించు వారికి నమ్మికపుట్టుట కష్టముగానుండెను. వారికి ఈ కాలపు పాశ్చాత్యులు పరికించు ప్రజ్ఞాపరీక్షలచే రూపింపబడుట అవశ్యము. పాముకాటుచే ఆరోగ్యము గలుగుచున్నదని పాశ్చాత్య వైద్య శిఖామణులు క్రొత్తగాకనిపెట్టినారని నొక్కి చెప్ప సంతసించుచున్నాము. కాకావళి, హిస్టీరియా (గాలి చేష్టలు) మున్నగు వ్యాధులకు తగినమందు పాముకాటని యేర్పడినది. ఈ కనుగొనుటను రూఢిపరచుటే గాక పైనచెప్పిన రోగములు తప్పక దానివల్ల నివారణయగును యని దక్షిణ ఆఫ్రికాపోర్టు యలిజబెత్, మూజియంహౌసు, డిపార్టుమెంటువారు గ్యారంటి (హామీ) నిచ్చుచున్నారు.

# తొట్లపాట

నిద్రించు శ్రీరామ ! నిద్రించురామ !
నిద్రించురఘురామ ! రాజపుత్రాను !
కమలాప్తకులచంద్ర ! కౌశల్యారామ !
మునివెంటనేగిన ముద్దులరామ !
తాటకాంతకరామ ! దశరథారామ !
ఘోరమారీచుని బోరిగొన్నరామ !
శివువిల్లువిఱిచిన శ్రీరామ ! రామ !
సీతాకళత్ర ! మోహశృంగారరామ !

చిట్టిచిట్టిచిట్టి చీమల్లమట్టి
మట్టిక్రిందవాడు తొట్టినాగన్న
తొట్టినాగన్నకు తోడెవరమ్మ ?
గొట్టెలగాచెడి గురవడేతోడు.
నిద్రపోఅబ్బాయి నీరేజనయన !
ముద్దుకృష్ణుడువచ్చి ముద్దిచ్చిపోవు
ఊరకోఅబ్బాయి ఊళ్లన్నిమనవి
ఊరకున్నను నిన్ను ఊచెదతండ్రి !

—3-వ మేరీరాణివాచకమునుండి.—

# గ్రంథవిమర్శనము

## అడ్డాడపుర శ్రీ వేణుగోపాల శ్లోకమాలిక:—

చిన్నిపొత్తము. అడ్డాడపురమున వెలసిన శ్రీవేణుగోపాలస్వామిపై వ్రాయబడిన పదునాఱు (సంస్కృత) వృత్తశ్లోకము లిందుగలవు. శ్లోకములు భక్తిపూరితములై మంచిశైలితో నొప్పుచున్నవి. భక్తులు ముఖ్యముగా చదువదగినది. గ్రంథము క్రౌను సైజున నాలుగుపుటలు. గ్రంథకర్త గొ. కృష్ణమాచార్యులు. ప్రకటనకర్తలు అడ్డాడపురవాస్తవ్యులగు బులుసు లక్ష్మణస్వామిగారు. బెజవాడ; వాణీముద్రాక్షరశాలయందు ముద్రితము. వెల తెలియదు.

—ఉభయభాషాప్రవీణ బులుసు నరసింహశాస్త్రి.

## మోహిని:—

ఐదంకములనాటకము. శ్రీసూర్యనారాయణ గ్రంథమాల ద్వితీయకుసుమము. డెమ్మీ సైజు 96 పుటలు. కాకులపాటి గురుమూర్తిగారు వ్రాసినది. ఇందలి కథావస్తువు పౌరాణికము. నాటకమున కల పాత్రలు మానవులు, మానవాతీతులు. కథామూలము పౌరాణికమౌట మరామరులు ధారాళముగ మాటాడుకొనుటకు అవకాశము కలిగినది. పద్యములు నవ్యత బొత్తుగా లేక ప్రాచీనవాసనాదూషితములై యున్నవి. ఉదాహరణము చిత్తగింపుడు.

తే. గీ. అతివ నినుగన్నదాదిగ నదయుడగుచు
మదనుఁడేయుచునుండె నా హృదయసీమ
తాళ తలిరాకు నెరిబాకు తాకులింక
రామ! వినవేమి? కనవేమి? రావదేమి?

నాటకమునందలి సంధ్యావళీ ధర్మాంగదుల ఘట్టముమాత్రము చదువరుల హృదయముల నించుక చూరగొనజాలియున్నది. సంధ్యావళీదేవి పాతివ్రత్యగుణపోషణము బాగుగనే యున్నదనవలయునుగాని మోహిని ప్రౌఢత్వముమాత్రము కొంచమేని పరిస్ఫుటము చేయబడలేదు. ఇదియొక గొప్పలోపము. నాటకమునందలి ముత్యాలహారగాథ యముని అశిధారావ్రతమును కొఱతపఱచుటయే కాక కథాభాగమును అనవసరముగా పెంచినది. అపేక్షితమైన భక్తిభావముకంటె శృంగారమే నాటకమునందు పైచేయిగానుండుట శ్లాఘనీయమైన విషయము కాదు. గ్రంథము వెల రు 1. దొరకుచోటు కాకులపాటి కృష్ణమూర్తిగారు, సెక్రటరీ శ్రీ బుద్ధిరాజు సుబ్బమాంబస్మారకనిధి; విజయనగరము సిటీ (విశాఖపట్టణముజిల్లా).

—ఆలమూరు రాజగోపాలరావు బి. యె.

## అచ్చతెలుంగు ఋతుసంహారము:—

ఈ గ్రంథము కాళిదాసకృత సంస్కృతఋతుసంహారకావ్యమునకు శుద్ధాంధ్రీకరణము. గ్రంథప్రణేత చింతలపల్లి రామకృష్ణమూర్తి శాస్త్రిగారు. డెమ్మీ అక్టోవో సైజున 25 పుటలు; 144 పద్యములు. గ్రంథాదిని గ్రంథకర్తలగు చింతలపల్లి రామకృష్ణమూర్తిశాస్త్రిగారియు గ్రంథము నుచితముగ నచ్చువేయించిన దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారియు చిత్రపటములు ముద్రింపబడియున్నవి. కాళిదాసకృత సంస్కృతఋతుసంహారకావ్యము సర్వజనసులభమగు శైలితోనున్నది. ఈ ఆంధ్రానువాదముమాత్రము కొన్నికొన్నిపట్టుల పండితప్రకాండులనుగూడఁ గోశాదిసాహాయ్యము నపేక్షింపఁజేయుచున్నది. నిరంకుశములగు క్రొత్తక్రొత్త తద్భవముల బ్రయోగించినట్లు మూర్తిశాస్త్రిగారే గ్రంథపీఠికలో వ్రాసికొనియున్నారు. కవిత్వము మంచిదనియే చెప్పవచ్చును. ధారయున్నది. మూలకావ్యములందలి భావములు బాగుగ ననువాదమునొందలేదనివ్రాయుటకు ఎడమంతగాలేదు. ఇట్టి గ్రంథములు సులలితములగు మిశ్రపదములతో నాంధ్రీకరించిననే రక్తికట్టునని చెప్పవచ్చును. భర్తృహరి నీతిశతకమును ఏనుగు లక్ష్మణకవి మొదలగువారు మిశ్రపదములతో నెంతోమనోహరముగ రచియించియున్నారుగదా! అచ్చతెనుగున రచియింపబడిన పొన్నగంటి తెలగనార్యుని యయాతిచరిత్ర మనోజ్ఞముగ లేదా యని యడుగవచ్చును. అది మనోజ్ఞముగనేయున్నది. కాని తరువాతి అచ్చతెనుగు కావ్యములట్టి మనోజ్ఞత సంపాదించలేదు. ప్రస్తుతము మన విమర్శనమునకుపాల్పడిన అచ్చతెలుంగు ఋతుసంహారము రెండవతరగతియందే చేర్పవలసినదిగా నున్నదని సత్యమునుపలక్షించివ్రాయవలసివచ్చినందులకు మిక్కిలి విచారమగుచున్నది. గ్రంథము వెల రు. 0–8–0 అణాలు. వలయువారు గ్రంథకర్తపేర ఈమనికి (గుంటూరు జల్లా) వ్రాసినఁబడయఁగలరు.

—ఉభయభాషాప్రవీణ బులుసు నరసింహశాస్త్రి.

## ఆంధ్రస్తోత్రమణిత్రయము:—

శ్రీ జగద్గురు శంకరాచార్యుల వారిచేతను, వారి శిష్యులచేతను రచియింపబడిన లక్ష్మీనృసింహస్తోత్రము. గోవిందద్వాదశమంజరికాస్తోత్రము–వీనికి ఆంధ్రానువాద మొనర్చి ఆంధ్రస్తోత్రమణిత్రయ మనుపేర శ్రీయుత చింతపల్లి రామకృష్ణమూర్తి శాస్త్రిగారు ప్రచురించియున్నారు. దేశభాషా ప్రాధాన్యమంగీకరింపబడుచున్న ఈ దినములలోకూడ ఇట్టిస్తోత్రముల భాషాంతరీకరణము ప్రోత్సహింపదగినది కాదని నానమ్మకము. ఏమందుగా? సంస్కృతమునందలి వానియందము తెనుగునకు గొనివచ్చుట దుస్తరమగుట. భజగోవిందశ్లోకములను శ్రీయుతవడ్డాది సుబ్బారాయుడుకవిగారు కూడ తెనిగించియున్నారు. వానికిగూడ మూలమునందలి రక్తికలుగలేదు. ఆంధ్రస్తోత్రమణిత్రయము విషయమునగూడ మేమంతకంటె ఎక్కువఉత్సాహకరముగ పలుకజాలకున్నాము. గ్రంథము క్రౌను సైజున ౧౭ పుటలు. వెల రూ. ౦-౨-౦. వలయువారు గ్రంథకర్తలగు చింతపల్లి రామకృష్ణమూర్తిశాస్త్రిగారిపేర గుంటూరుజిల్లా ఈమనికి వ్రాయునది.

—దివాకర్ల సోమసుందరరావు.

చాకిరేవు:—

పూజాపుష్పములు ౨. గ్రంథకర్త శ్రీయుత కొల్లూరు ధర్మరాయకవిగారు. (బి. ఏ) ఆంధ్రగీర్వాణ సాహిత్యసమ్మేళనము. ప్రకాశకులు: వేంకటకాళిదాసకవులు, విజయనగరము. ఇదియొక హేళనకావ్యము. శ్రీకవిగారు ఆధునిక భాషా ప్రపంచమునందలి మంచిచెడ్డలను కొంతవఱకు చక్కగా ముచ్చటించిరి. Romantic Poetry అనుపేరుతో 'ప్రణయం' తిలకముగా ధరించి పడికట్టురాళ్లవంటి పదిపదిహేను పదములను బుజానవైచుకొని నేడుదిగుచున్న ఒకవిధమైన భావగీతికల గతిని వీరుచక్కగా ప్రకటించిరి. మఱియు "గ్రామ్యం రాసినా అరసున్న లేకపోతే తెలుగుభాష లేదని" కవిగారు సహేతుకముగా వ్రాసినారు. ఉదాహరణము."ప్రదానవైఁన-ఆఁ-ఏవిఁటంటే" మొదలయినవి. (౨౮వ-పేజీయందలి చంద్రుఁడులో అరసున్న తప్పు) "హాస్య రసోద్దీపకంగాఉండే కావ్యాల్లో గ్రామ్యం రాయవలసిందంటే Serious Subjectsలోకూడ అదేఉపయోగిస్తూండటం" తప్పని వీరిసిద్ధాంతము. అయినను గ్రామ్యభూయిష్టమైన హాస్యరసోద్దీపక గ్రంథములలోకూడ "glamour" కొన్నాళ్లకు పోవునని వీరియూహ. తమ గ్రంథమున వాడుకభాష నుపయోగించుటేకాక దిట్టమగు ఆంగ్లపదముల దట్టించుట; బరన్సు, షేక్స్పియర్ మొదలగు గ్రామ్యవాదుల పేర్కొనుట చూడ తాము 'భాషాకాంగ్రెస్' నందు వ్రాసినటుల "కొంతకాలం ఆంధ్రలోకంలో మాత్రం గ్రామ్యశారదు"ండుననుహంశము వీరినిశ్చితాభిప్రాయముకాదని తోచుచున్నది. అటులవ్రాసినది బహుశః చదువరుల యభిప్రాయముల వీరుగ్రహించుటకు కాబోలు. అదియునుకాని యెడల, వారున్నయూరనే కొన్నివత్సరములకు పూర్వము జననమొంది, ఆంధ్రభూములదాటి పరభాషలవేషముదాల్చి శ్రీకవిగారికి కృతపరిచితయైన కన్యాశుల్కమేవారి యభిప్రాయయులను మార్పగలదని మాయభిలాష. హాస్యము వీరిగ్రంథమున పెక్కుపట్ల గాన్పించుచున్నను విషయబాహుళ్యములేమిని కొంత "glamour" తగ్గుచున్నది. వీరి చాకిరేవునందలి "గిరీశము" గుఱజాడ అప్పారావు గిరీశమునకును సారూప్యసామాన్యము లేశొంచమునుకాన్పింపవు. గ్రంథము వెల రూ.౧

—ఆల్లమూరు రాజగోపాలరావు బి. ఏ.

ఇప్పుడు; బాష్పబిందువు; నందకుమారవధ—చైతుసింగు; పశుపరీక్ష; మాయోపాయమారణము; భారతీయప్రబోధము; అడ్డాడ హరిహరస్తుతి—ఈ గ్రంథములపై విమర్శనము పైమాసమున ప్రచురింతుము.

సంపాదకుడు.

# పత్రికా పరిచయము

**ఆదిఆంధ్రపత్రిక:—**

ఆదిఆంధ్రజాత్యుద్ధరణకై రాజమహేంద్రవరమునుండి వెలువడు పక్షపత్రిక. సంపాదకుడు నిడ్డ పుల్లయ్య. ౧-౧౦-౨౯ తేదీని వెలువడిన మొదటి సంపుటము ఆఱవసంచిక మాకార్యస్థానము నలంకరించినది. ఈ సంచికయందు గీతాంజలికి అనువాదమగు 'నివేదనము' అనుపద్యవ్యాసము గలదు. మిగిలిన గద్యవ్యాసములు, యథోచితములై యున్నవి. పత్రిక సంవత్సర చందా రు 2. చందాదారులుగ చేరగోరువారు సంపాదకుడు, ఆదిఆంధ్రపత్రిక, లక్ష్మీవారపుపేట, రాజమండ్రి అను చిరునామాకు వ్రాయునది. మిక్కిలి వెనుకబడియున్న సంఘము నుద్ధరింప మేల్కొలుప బుట్టిన ఈ పత్రికాకిశోరము చిరకాలము వర్ధిల్లుగాకయని కోరెదము.

**కుమారబోధిని:—**

నాలుగవసంపుటము రెండవసంచిక వందనములతో నందుకొంటిమి. ఇది ప్రాథమికవిద్యార్థుల ఉపయోగార్థము సి. కుమారస్వామినాయుడు అండుసన్సువారిచే ప్రచురింపబడుచు శ్రీయుతులు హా. సుబ్బారావుగారిచే సంపాదింపబడుచున్నది. బాలబాలికలకు ఉపయోగించు పెక్కువ్యాసములతో నొప్పుచున్నది. కుమారనీతి, మోహావిభ్రమము, వర్షాగమము తెలిసికొను హైందవపద్ధతులు, పుత్రవతీహితోపదేశగీతములు, ఆరోగ్యసాధనములు, జీవముగలభారమితులు, అదృష్టము, ఒకయుక్తి, రైతు-పశువులకుసేవ, రాహుకాలము, స్త్రీల గృహకృత్యములు అను ఈ సంచికయందలివ్యాసములనొకపరి గమనించితిమేని బాలబాలికల విజ్ఞానాభివృద్ధికి పనికివచ్చు వివిధ విషయములనుకూర్చిన వ్యాసములుగలవను సంగతి విస్పష్టముగును. విద్యాభిమానులెల్ల ఆదరింపదగిన పత్రిక. సాలు చందా రు 2– మాత్రమే. వలయువారు సి. కుమారస్వామినాయుడు అండ్ సన్సు, 35, చిన్నతంబివీధి, జార్జిటవును, చెన్నపురి అను చిరునామాకు వ్రాసినబడయగలరు.

# గ్రంథస్వీకారము

1. దాసబోధ—కొణకంచి చక్రధరరావు ; 2. ఆత్మసంయమము—అమితవిషయాసక్తి—కూచి నరసింహము ; 3. కొండపల్లి ముట్టడి—శేషాద్రిరమణకవులు ; 4. చంపకమాలిని—శ్రీమతి అ. రాజమ్మ ; 5. ధన్యమణిహారము—తుళ్లా విశ్వనాథశాస్త్రి ; 6. లతాంతమంజరి (ప్రథమ భాగము)—కె. వి. రాధాకృష్ణశాస్త్రి ; 7 ఆంధ్ర బాలరామాయణము—చింతపల్లి రామకృష్ణమూర్తిశాస్త్రి ; 8. దేశిరాజు పెదబాపయ్యగారి జీవనస్మృతి—కామరాజు హనుమంతరావు ; 9. చంద్రమౌళీ—శ్రీమతి అ. రాజమ్మ 10. ఝాన్సీ లక్ష్మీబాయి—ముదిగంటి జగ్గన్నశాస్త్రి. 11. జీవధనరక్షణి—జి. రంగయ్యనాయుడు. అనుగ్రంథములను వందనములతో నందుకొంటిమి. వానిని కాలక్రమమున విమర్శింపగలమని మనవి.




శ్రీమతి డాక్టరు కొ. లక్ష్మమ్మగారి ప్రశస్తి:—

ఆంధ్రమండలము లన్నిటిలో విద్యావిషయమున మిక్కిలి వెనుకపడియున్న బళ్లారి మండలమున జన్మించిననేమి నిరుపమానమైన విద్యాప్రియత్వము గలిగి ఉన్నతవిద్య బడసినది. ఆమె విద్యాతృష్ణ అంతతో సంతృప్తినొందలేదు. సాంకేతికవిద్యాసముపార్జనము కొఱకు ఆమె జన్మమండలమును వదలి, తనరాజధానిని వదలి ఢిల్లీనగరమునకు పోయినది. లేడీహార్డింజి మెడికలుకాలేజీలో వైద్యవిద్య కొన్నాళ్లు అభ్యసించి తదనంతరము బొంబాయి నేషనలు మెడికలుకాలేజీలో వైద్యవిద్యాపరిపూర్తి గావించినది. గావించుటలో ప్రథమురాలుగా నుత్తీర్ణయై అనంతగౌరవమునందినది. అనంతర మామె బొంబాయిలో కామా అండ్ ఆల్బెస్ ఘోషాఆస్పత్రియందు ఉద్యోగినిగా కుదిరినది. వైద్యవిద్య నభ్యసించి ఉద్యోగినిలుగా పనిచేయుచున్న స్త్రీలసంఖ్య అంతబొత్తిగా తక్కువగా లేదే. అట్టిచో ఈమెను ప్రత్యేకముగ ప్రశంసింపవలసిన అవసరమేమి యని కొందఱడుగవచ్చును. ఆమె చేసినపని ఉద్యోగినిగా కుదురుటమాత్రమే యైయుండెనేని అది వ్యక్తిగతముగ కొంత వఱకు మహావిషయమే కావచ్చును. కాని దేశజులదృష్టిలో మాత్రమది యట్టిదికాదు. స్వార్థహితమునకు తోడు శ్రీమతి కె. లక్ష్మమ్మగారియొద్ద మొక్కవోని పరార్థహితచింతనముకూడనున్నది. ఆంధ్రవనితయగుట అసదృశమైన ఆంధ్రాభిమానమును; విద్యావతియగుట నిరుపమానమైన సంఘసేవాభిలాషయు గలిగి ఆయుమ ప్రజాహితజీవితమునందు పాల్గొనుచున్నది. బొంబాయిరాష్ట్రీయాంధ్రమహాసభకు ఆమె సంయుక్తకార్య

దర్శినిగా ఏకగ్రీవముగా నెన్నుకొనఁబడుటయే ఆమె ప్రజాహితబుద్ధిని బొంబాయిఆంధ్రులు గుర్తించిరన్నమాట. విద్యావతియు, జాతీయాభిమానపూరితయునగు నీయమకార్యదర్శిత్వమున బొంబాయిరాష్ట్రీయాంధ్రమహాసభ భవిష్యజ్జీవనము ప్రకాశమానముగ పెంపొందుగాకయని కోరెదము.

భారతదేశమున స్త్రీవిద్య :—

హార్టాగు కమిటీవారి రిపోర్టుచూచితిమి. పట్టరాని దుఃఖమువచ్చినది, స్త్రీ విద్య అనుచితముగా వెనుకబడియుండుటచేత. ఇరువది ఇరువదియైదు బాలికలలో నొక్క బాలికకూడ పాఠశాలముఖమైనను చూడకుండనుండు పరిస్థితులు అత్యుత్తమనాగరికులని పేరొక్కనబడుచున్న బ్రిటీషువారి పరిపాలనముననుండియు మనదేశమున నింకను పొడగాననగుట మిక్కిలి విచారింపవలసినవిషయము. విచారింపవలసిన విషయమే. కాని ప్రభుత్వమువారు మాత్రము తగువిచారమును చూపుటలేదు. 1917—22 వ సంవత్సరముల మధ్య బాలికాపాఠశాలలు మనదేశమున నూటికి ఇరువదిరెండువంతున అభివృద్ధి గాంచెను. కాని 1922—27 వ సంవత్సరముల మధ్య ఇంతకంటె హెచ్చు అభివృద్ధికలుగుటకు మాఱు నూటికి పదునేడువంతున మాత్రమే వృద్ధికలిగినది. 'స్త్రీ విద్య' 'స్త్రీ విద్య' అను మాట బహుపర్యాయములు ఆమ్రేడితమగుచున్న ఈ దినములలో నయితము పాఠశాలకు పోవు బాలురసంఖ్యతో బాలికలసంఖ్యపోల్చి చూచితిమేని 'స్త్రీవిద్య' ఇంకను నాదబ్రహ్మముగా మాత్రమే యున్నదను సంగతి తేటతెల్లముగాగలదు. ప్రాథమికపాఠశాలలలో విద్యగఱచు బాలికలు బాలురసంఖ్యలో నాలుగవవంతు మాత్రమే యున్నారు. లోవరు సెకండరీ పాఠశాలలలో బాలికలకంటె బాలురసంఖ్య పదునెనిమిది రెట్లును, సెకండరీ పాఠశాలలలో ముప్పదినాలుగు రెట్లును ; కళాశాలలలో ముప్పదిమూడు రెట్లును కలదు. దేశమున విద్యనేర్చుచున్న బాలురసంఖ్యయే తృప్తియిచ్చునదిగాలేదు. అసంతృప్తికరమగు బాలురసంఖ్యకుగూడ మిక్కిలి తీసికట్టుగానున్న బాలికలసంఖ్య స్త్రీవిద్యాభిమానియగు ఏభారతీయుని విచారపరీతమానసుని చేయదు? ఇంతకును తేలిన పర్యవసానమేమి? స్త్రీవిద్య అభివృద్ధి నందుటలేదని. అభివృద్ధినందుటకు మార్గములేమి? హార్టాగుకమిటీవారు

ఆమార్గములనరసినారు. బాలికలవిద్య సత్వరాభివృద్ధి గాంచవలయునన్నచో ప్రతిరాష్ట్రము నందును విద్యాశాఖాధికారికి స్త్రీ విద్యావిషయమున ఆలోచనపాలోచన చెప్పుటకు నొక విద్యాధికారిణి యుండవలయును. విద్యనువిర్వహించుచున్న స్థానికసంస్థలయందు స్త్రీలకు హెచ్చుప్రాతినిధ్య ముండునట్లు ప్రభుత్వమువారు ప్రయత్నించుట అత్యవసరమని హార్టాగు కమిటీవారుసూచించుచున్నారు. ఈసూచనలు రెండును మద్రాసు రాజధానియందు కార్య రూపమును దాల్చియేయున్నవి. విద్యాశాఖాధికారికి స్త్రీవిద్యావిషయమున ఆలోచనపాలో చన చెప్పుటకు విద్యాధికారిణి ఉన్నది. మునిసిపలు సంఘములు, తాలుకాబోర్డులు, జిల్లాబోర్డులు, మండలవిద్యాసంఘములు మొదలగు సంస్థలయందు స్త్రీ సభ్యురాండ్రు గలరు. అయినను మనరాజధానియందు స్త్రీవిద్య ఇతరరాజధానుల యందుకంటె విశేష ముగా నభివృద్ధినందియుండలేదు. అగుట హార్టాగుకమిటీవారి సూచనలు కీలెఱిగిచెప్పి నవి కావనుటకు ఇంచుకంతయు సందేహింపవలసిన పనిలేదు. కమిటీవారు మఱికొన్ని సూచనలుకూడ చేసిరి. వీలైనతావులనెల్ల స్త్రీవిద్య నిర్బంధమొనర్ప వలయుననియు; చిత్రలేఖనము, సంగీతము, సూదికుట్టు, గృహవిజ్ఞానము మొదలగు స్త్రీజనోచితములగు విషయములను పాఠములుగా నేర్పబడవలయుననియు, విద్యార్థినుల నైతికశారీరకాభి వృద్ధికి దోహదమొనర్చుటకు సర్వవిధములైన అవకాశము లీయబడవలయుననియు వారు సూచించిరి. ఈసూచనలు అవలంబించుట దేశక్షేమంకరమనుట అత్యుక్తికాదు. శ్రీమతి డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డి ఈసూచనలకు ఉపరి కొన్నింటిని గావించినది. మతమును గూర్చిన విజ్ఞానము స్త్రీలకు హెచ్చుగా నుండవలయుననియు, అదిలేనివిద్య విద్యయేకాదనియు, విద్యార్థిని ఆత్మప్రాక్కులాచారములను ఆమెకు విప్పిచెప్పనినాడు అది జ్ఞానబోధ యని పించుకొననేరదనియు ఆమెఎలుగెత్తి చాటుచున్నది. ఇదిమూటికి ముమ్మాటికి నిజము. పెద్ద లీవిషయమునుగూర్చి దీర్ఘముగ నాలోచించి యథోచితజ్ఞానమును దేశస్త్రీలకు ప్రసాదింప పాటుబడుదురు గాకయని వాంఛించెదము.

గృహలక్ష్మి

# అభినందనము

చల్లా సూర్యనారాయణ గారు

గృహలక్ష్మి ఆంధ్రుల గృహలక్ష్ములకు మంజు
సరసభాషణములు సలుపనేర్చు
గృహలక్ష్మి బోధించు సహధర్మిణీధర్మ
మర్మంబు తెలుగులమగువలకును
గృహలక్ష్మి చెలులకు గృహకృత్యనిర్వహ
ణంబును శిశుపోషణంబుఁ గఱపు
గృహలక్ష్మి దేశభక్తి రగిల్చి మనబాలి
కల వీరమాతలుగా నొనర్చు
దేశదేశ వృత్తాంతంబు తెలియఁజెప్పు;
తియ్యకథలను జిత్తంబు దేఱనుడువు.
అద్యతనవేళ గృహలక్ష్మి యరసిచూడ
స్త్రీలపాలింటి విబుధధాత్రీరుహంబు.




సచిత్ర మాసపత్రిక


సంపాదకుఁడు

డాక్టర్. కే. ఎన్. కేసరి



సంపుటము 2.] [సంఖ్య. 10

ఆంధ్ర ముద్రాలయము, మద్రాసు

1929

THE following Municipalities and Taluk Boards have sanctioned subscription for GRIHALAKSHMI and have introduced the Journal into the Girls' schools within their provinces. As the Journal is mainly intended for the uplift of women, and is instructive and useful for girls, we invite the other Taluq Board Presidents and Chairmen of Municipalities to extend their patronage by placing this matter before their Councils and introduce the Journal into their Girls' Schools :

## MUNICIPAL COUNCILS.

**1 Ongole**
**2 Cuddapah.**
**3 Tadpatri.**
**4 Guntur.**
**5 Adoni.**
**6 Hindupur.**
**7 Tirupati.**
**8 Nellore.**
**9 Bezwada.**

## TALUK BOARDS.

**1 Penukonda.**
**2 Ramachandrapuram.**
**3 Vellore.**
**4 Gooty.**
**5 Narasarowpet.**
**6 Berhampore.**
**7 Madanapalle.**
**8 Dhone.**
**9 Koilkuntla.**
**10 Karvetinagar.**
**11 Chendragiri.**
**12 Peddapur.**
**13. Tadapalligudem.**

*Editor,*

# GRIHALAKSHMI.

**Post Box. 752.**

**EGMORE, MADRAS.**

సం॥ చందా రు. 4. విడిసంచిక అ. 6.

# గృహలక్ష్మి

"యత్రనార్యస్తు పూజ్యంతే నందంతే తత్ర దేవతాః।
యత్రైతాస్తు నపూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియా॥

సంపుటము 2. డిసెంబరునెల 1929. సంచిక 10.

## విషయసూచిక.

త్రివర్ణ చిత్రము—

"సిగ్గుబిం దియతో నవ్వుమొగంబుతోడ నెదురై తృష్ణాత్రపార్ధస్ఫుర
న్నయనాబ్జంబుల జూచు జాయ శకునానందంబులం జేయుతన్."

ఛాయా చిత్రములు—

1. పార్వతిపాత్ర. 2. ప్రహ్లాదవేషము. 3. కనకసేనపాత్ర. 4. పెద్దాడకామేశ్వరమ్మగారు. 5. శ్రీమతి తుర్లపాటి రాజరాజేశ్వరమ్మగారు. 6. శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారు; ఆధునికాంధ్ర రమణీమణులు మఱికొందఱు. 7. సీతాజగుమాల్ సర్సియనుకన్య. 8. ఆర్. రుక్మిణి అమ్మాళ్. 9. మంచూరియాదేశపు విద్యార్థినులు. 10. తల్లి చేయి బట్టుకొని తక్కుచు తాఱుచు నడుచు చున్నాడు. 11. మంచూరియా స్త్రీ శిరోభూషణము. 12. నలినీతఖ్రాడు కన్య.

Printed and Published by Dr. K. N. Kesari, at Lodhra Press, Egmore, Madras.

# గృహలక్ష్మి.

## స్త్రీల స్థితి

ఇంతదనుక వివాహవాంఛను విడనాడ గల్గిన యొక స్నేహితురాలిట్లు వ్రాయు చున్నది:—

“నిన్నటిరోజున మలబారీహాలులో స్త్రీలసభ జరిగినది. అందు పలువురు గొప్ప యుపన్యాసముల నిచ్చిరి. పెక్కు తీర్మానములు ఆమోదింపబడినవి. శారదాబిల్లు సమస్యనుగూర్చి ఆసభవారు చర్చించిరి. బాలికలకు పదునెనిమిది సంవత్సరములలోపున వివాహము చేయరాదని తమరు చేయెత్తి చెప్పినందులకు మేమందఱమును అమందానందము నొందితిమి. స్త్రీలకుగూడ వారసత్వపుహక్కుండవలెనను తీర్మానమును ఆసభలో నామోదింపబడెను. స్త్రీల ఆస్తిహక్కునుగూర్చి మీరు ‘యంగుఇండియా’ ‘నవజీవను’ పత్రికలలో వ్యాసములను వ్రాసి ప్రకటించుచో చాలమేలు కలుగగలదు. స్త్రీలు తమ జన్మహక్కును తిరిగి బడయుటకు యాచింపనేల? సమరము సలుపనేల? తాను, స్త్రీ గర్భమునుండి జనించియు స్త్రీని ‘అబల’ యని పేర్కొని జాత్యహంకారమును సూచించుచు న్యాయముగా స్త్రీలకు చెందవలసిన హక్కులను వారికి ప్రసాదింతునని పురుషుడు ప్రగల్భము లాడుచుండుట విషాదాశ్చర్యములను గలుగజేయుచున్నది. పురుషు డిచ్చువాడును స్త్రీ పుచ్చుకొనునదియునా? ఇది అసందర్భప్రలాపము గాదా! పశుబలముచే

స్త్రీల హస్తములనుండి హరించి వారిహక్కులను మరల వారికి కలుగజేయుటలో పురుషుని ఉన్నతాశయము, గంభీరాదర్శము, శూరత్వము ఏమిగలదో తెలియరాదు. ఏ విషయమున పురుషులకంటె స్త్రీలకు ప్రాముఖ్యము తక్కువ? వారసత్వపు హక్కువలన పురుషులకు లభించెడు భాగముకంటె స్త్రీలకు లభించెడు భాగమేల తక్కువగా నుండవలెను? స్త్రీపురుషులకు సమానసత్త్వముండవలదా? ఈవిషయమునుగూర్చియే మేము రెండు రోజులక్రితము కొందరితో కడుతీవ్రముగా చర్చించు చుంటిమి. 'న్యాయచట్టమునందెట్టి మార్పు మాకవసరములేదు. మాకిపు డెట్టి అసంతృప్తియులేదు. కులదీపకుడగు పుత్రుడే పిత్రార్జితమైన ఆస్తిలో హెచ్చువాటాకు హక్కుదారుడై యుండుట న్యాయమే. కుటుంబముయొక్క పేరుప్రతిష్ఠలను నిల్పునది పుత్రుడే' అని ఒకయువతి నుడివెను. అందుకు యువతిమాటయేమి? అని మే మడిగితిమి. అచ్చటనున్న యువకు డొకడు వెంటనే ఇట్లు చెప్పెను. 'దానికి వ్రాసిపెట్టినవాడువచ్చి ఆబాలికయొక్క యోగక్షేమముల నారయును. వ్రాసిపెట్టిన వానిమాట యేల? దానికి వ్రాసిపెట్టిన వాడు దానికివచ్చునని యెప్పటి కప్పుడు దాటవేయనేల? తప్పక ఆపిల్లకగు వాడు దానికి ఉన్నాడని చెప్ప నెట్లు? ఇంకొకడు వచ్చువరకును ఎటులనో బాలికను గృహమున నుండనిచ్చి వాడు వచ్చినతోడనే తలబరువు తగ్గినదని ఆమెను వానికి వశపఱచుటయా? బాలికలు విక్రయింపబడదగిన ధాన్యపు మూటలని భావించి వీరుమిక్కిలి తేలికగా మాటలాడుచుందురు. మీరే యొకబాలికగా పుట్టియుండినచో నిట్టిమాటలను వినినపుడు మీకు ప్రబలమగు నాగ్రహము కలుగదా?"

పురుషులు స్త్రీలవిషయమున చేసెడు దారుణకృత్యములకు ఆగ్రహమును చెందుటకు నేను బాలికను గా నవసరములేదు. ఈ అక్రమములలో వారసత్వవిషయము మిక్కిలి తక్కువయనియే నేనుతలచెదను. వారసత్వపు చట్టమువలన స్త్రీలకు కలిగిన అక్రమముకంటె శారదాబిల్లువలన చక్కబరుపబడిన అక్రమమే ప్రబలమైనది. కాని స్త్రీల హక్కులనుగూర్చి అసమగ్రములగు సవరణలకు నేనెన్నటికిని సమ్మతింపను. న్యాయశాస్త్రప్రకారము పురుషులకుగల హక్కులన్నియును స్త్రీలకుగూడ పూర్తిగా నుండవలసినవనియే నాఅభిప్రాయము. పుత్రులను, పుత్రికలను సర్వవిషయములందును సమానముగానే చూడవలెను. స్త్రీలకు విద్య బాగుగా వ్యాపించినకొలదియు వారిబలమును వారు గ్రహింపగలుగుదురు. తమకు కలుగజేయబడుచున్న దారుణములగు నక్రమములను నారపు డెంతమాత్రమును సహింపరు.

న్యాయశాస్త్రసంబంధములగు నక్రమములను తొలగించినంతమాత్రమున పని పూర్తికాదు. ఈ అనర్థకము మిక్కిలి లోతుగానే వేరూనియున్నది. పురుషునకు కర్త్వాధికారములపట్ల గల తీవ్రకాంక్షయే దీనికి ముఖ్యకారణము. దీనికంటెను స్త్రీపురుషులకుగల సంభోగలాలసత్వమే ముఖ్యతమమగు కారణము. సొత్తుపైని యాజమాన్యము లభించుట వలననే అధికారము చేకూరును. అధికారముపై నాధారపడిన అక్రమయశమును గూడ పురుషు డపేక్షించును. తండ్రియొక్క కుటుంబసంబంధమగు సొత్తును అతనికి జనించినవారి కందఱికిని సమముగా విభజించినయెడల ఇది లభింపజాలదు. ఒక తండ్రికి పుట్టిన వారందరునుగూడ సమానహక్కుదారులని నిర్ణయింపబడినచో అతని ఆస్తిని వారందరికిని సమముగానే విభజింపబడవలసి వచ్చును. కావుననే కుటుంబఆస్తి సాధారణముగా జ్యేష్ఠపుత్రునకే చెందుచున్నది. స్త్రీలలో చాలమంది పెండ్లిచేసికొందురు. న్యాయశాస్త్రము స్త్రీకి విరుద్ధముగా నున్నను భర్తయొక్క ఆధికారస్వాతంత్ర్యములలో స్త్రీకి సమానహక్కుకలదు. తాను ధనికుల భార్యకావలెననియే ప్రతిస్త్రీయును కోరుచుండును. కావున స్త్రీలు సభలలో పాండిత్యప్రకర్షణాఅకు సంస్కరణమున కనుకూలముగా ఓట్లనిచ్చినను, ఆప్రకారము నడుచుకొనవలసి వచ్చినపుడు చాలమంది నిలువబడజాలరు. అటుల నిలువబడినచో వారికి గల సదుపాయములు తొలగిపోవును. వానిని వారు వదలజాలరు.

న్యాయశాస్త్రప్రకారము స్త్రీలకుగల అక్రమములన్నియును తొలగవలెననియే నే నెల్లపుడును వాంఛించుచుందును, వాదించుచుందును. కాని మనదేశమునందలి విజ్ఞానవతులగు స్త్రీ లేదేని ప్రధానకారణమునుగూర్చి పనిచేయవలెనని నేనుకోరెదను.

త్యాగమును కష్టానుభవమును స్త్రీలలో మూర్తీభవించినవి గాన వారు ప్రజాసేవకు గడంగినచో అది పునీతమగుటయేగాక పురుషుని నిరంకుశమగు దురాశకును, సొత్తునుకూడ బెట్టుటకును గూడ నిరోధ మేర్పడును. మనుష్యులలో కోట్లకొలదిమంది కేవలము నిర్ధనులుగానే యున్నారు. కాన వారు తమబిడ్డల కియ్యదగిన ఆస్తియేమియును వారికి లేదు. కావున అల్పసంఖ్యాకులగు ధనికులకు గూడ పిత్ర్యమగు ఆస్తి చెందకూడదు. తలిదండ్రులు తమ బిడ్డలకు సమముగా చెందచేయదగిన నిజమగు ఆస్తి తమ సద్వర్తనమును విద్యయును మాత్రమే యగును. తమ బిడ్డ లందరును ఆత్మవిశ్వాసమును కలిగి స్వతంత్రముగా కష్టపడి పనిచేసి జీవింపగలుగునట్లు చేయుటయే తలిదండ్రుల ముఖ్యధర్మము. కనిష్ఠులను పెంచవలసిన భారము జ్యేష్ఠులమీాదనే యుండును. తమబిడ్డలు స్వతంత్రముగా

జీవించుటకు తగిన విద్యను వారికి నేర్పింపవలెనను ప్రశంసనీయమగు సంకల్పము ధనికులకు కలిగినచో వారిబిడ్డలలో హెచ్చుమంది యిప్పటివలె మందమతులుగా నుండునట్టి దురవస్థ తొలగిపోవును. వారిని కుటుంబఆస్తికి బానిసలనుగా చేయవలెనను నింద్యమగు వాంఛ యిపుడు ధనికుల కుండుటచే వారిబిడ్డలు నిరుత్సాహులును విషయభోగపరాయణులును సోమరులును అగుచున్నారు. చిరకాలమునుండి వేరూనియున్న ఇట్టి అనర్థములను రూపుమాపుట విజ్ఞానవతులగు సతీమణుల ముఖ్యాశయముగా నుండవలెను.

స్త్రీలు తమ అర్హతలను గోలుపోవుటకు స్త్రీపురుషులకు గల పరస్పరసంభోగవాంఛగూడ చాల ముఖ్యమగు కారణమను విషయముగూడ సర్వజనవిదితమే. స్త్రీలు అప్రయత్నముగనే దుర్భావములేకుండనే చేయుచుండునట్టి పలువిధములగు సూక్ష్మకార్యములవలన వారు పురుషులను వంచితుల నొనరించుచున్నారు. ఇటుల స్త్రీలు తమ్ములను వశపరుచుకొనకుండ నిరోధించుటకు పురుషులుగూడ దుర్భావము లేకుండనే అప్రయత్నముగానే ప్రయత్నించి విఫలులైరి. దాని ఫలితము కార్యవైఫల్యమేగాన నిది చాల ముఖ్యతమమగు సమస్యయే యగును. భరతమాత పుత్రికలలో విజ్ఞానసంపన్నలగు వారీ సమస్యను పరిష్కరింపవలసియున్నది. ఇందులకు వీరు అన్నివిషయములలోను పాశ్చాత్యులనే అనుసరింపగూడదు. ఏలననగ వారి పద్ధతు లచటిపరిస్థితులకు మాత్రమే పనికివచ్చును. వీరు భారతదేశవిజ్ఞానమ్మునకును పరిస్థితులకును అనుకూలమగు విధానమునే అవలంబింపవలెను. పురుషులను నియమించుటలోను పునీతులను గావించుటలోను స్థిరచిత్తుల నొనరించుటలోను స్త్రీలు అధికమగు సామర్థ్యమును చూపవలెను. మన ప్రాచీన విజ్ఞానమున శ్రేష్ఠమైనదాని నంతను భద్రపరుపవలెను. నీచమైనదాని నంతను నిస్సంశయముగా తిరస్కరింపవలెను. సీతాదేవి, ద్రౌపదీదేవి, సావిత్రి, దమయంతి మున్నగు పతివ్రతాశిరోమణు లిట్టి ఘనకార్యమును చేయగలుగుదురుగాని గయ్యాళులును నంగనాచలును జేయజాలరు.

(మో. క. గాంధి)

# పతనము

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు.

౧

అపరదేశపు టగ్నిగాడ్పులు
విపులయార్యావర్త మంతట
రెపరెపమను వీచి సతులకు
రేపె నవభావముల్.

౨

వింతవింతల తలపుదొంతులు
విసరువిసరుగ ఎగిరివచ్చుచు
శాంతమతులౌ భరతమహిళల
స్వాంతముల కలచెన్.

3

ఊర్జితంబగు ధర్మమునకై
యుసురులే యొడకిచ్చిన పర
త్యాగశీలల గన్నభూమిని
సాగె నవభావముల్.

౪

పరిణయంబుల పట్టు సడలిచి
ప్రణయస్వేచ్ఛకు ప్రభుతనొసగి
పూతచరితలు ప్రోగుచేసిన
ఖ్యాతి దూల్చిరహా!

౫

సంతువలననే గతులు గలవని
చాటిచెప్పిన భరతదేశము
సంతులేకనె సౌఖ్యమందగ
సాధనంబులగాంచెన్.

౬

కళలకొరకై తరుణవతులౌ
నళిననేత్రలు నాట్యవేదిక
నటనచేయుట సతులయశమున
కంటె నీలిమల్.

౭

ఉజ్వలంబగు భర్తృభక్తిని
ప్రజ్వలంబగు నగ్నిరాశిలో
తనువుబాసిన తరుణిసీతలు
తారుమార మ్యెన్.

౮

చల్లబడియెను సాధ్వీధర్మము
నల్లబడియెను సతులకీర్తులు
చెల్లరే! యీయుపరగాడ్పుల
శౌర్య మేమంయెన్.

౯

అన్యపురుషుల కన్నుగవకు
మాన్యమగు తమగాత్రశోభను
చూపనోపక చిచ్చుజొచ్చిన
శీల మేమయ్యెనో?

౧౦

ప్రాణనాథుని ప్రాణములకై
ప్రౌఢవాక్కుల నాడిలాడియు
దండధరుని మెప్పించిన యా
దార్ఢ్య మేమయ్యెనో?

౧౧

సెగలుపొగలును నింగినంటగ
భగభగంచును మండునగ్నిలొ
చొచ్చి వెడలిన సీతశీలము
విచ్చె నేమొకో?

౧౨

నీతిబద్ధము జాతిబద్ధము
పూతచరితల పుణ్యజన్మలు
చెఱగిపోవును చిత్తసీమ
చెల్లరే! యికన్.

౧౩

భరతమహిళల మహితతేజం
బరరే! ఎంత దీప్తమంచును
నక్కజంబుగ నన్యదేశజు
లరయజాల రికన్.

# పూర్ణిమ కన్య

## కొత్తపల్లి లక్ష్మయ్యగారు

తండ్రి నాటకకళోద్ధారకుడగు శ్రీ వనారస. గోవిందరావుగారు; తోడబుట్టిన తోడు లైదుగురును నాటకరంగమున చోటబాటి ఒక్క స్త్రీవేషమునేగాక పురుషవేషములుకూడ పచరించు ప్రజ్ఞాశాలినులైనవారు. ఏగూటిచిలుక ఆగూటి పలుకే పలుకుననను సూత్రము ననుసరించి పూర్ణిమకన్య నాటకరంగములందు ప్రవేశించి అద్భుత కౌశలమును చూపుచున్నది.



పార్వతి పాత్ర

ఇంతకును ఆమె వయస్సెంత? పదిసంవత్సరములు. ముక్కుపచ్చలారని పదిసంవత్సరముల బాలిక—వ్యక్తిని మఱచి రాజుగనో, ప్రధానిగనో, రాణిగనో, చెలికత్తెగనో మఱియేపాత్రగనో అభినయించుట—ఆఅభినయించుటయు పరిమితజనముల యెదుటకాదు—అద్భుతావహములగు విషయములుగదా!

మొదటి అయిదుగురు పుత్రికలకు వలెనే తమ షష్ఠమపుత్రికయగు పూర్ణకుగూడ గోవిందరావు గారు చిన్నతనముననే విద్యాసముపార్జనమునకు చక్కని వీల్లుకల్గించిరి. తన పితృదేవుని స్వగ్రామమగు పోలసానపల్లి (ఏలూరు తాలూకా) లోని పాఠశాలయం దీబాలిక ప్రాథమికవిద్య బడసెను. ఆంధ్రమున చక్కని అర్థజ్ఞాన మలవడిన తోడనే ఈమె సంగీతము నేర్చుకొన ప్రారంభించెను. అచిరకాలముననే పూర్ణ ఆ విద్యయందు ప్రశంసనీయమగు ప్రవేశము సంపాదించెను. అనంతరము ఈమె తన తండ్రిగారిచే నిర్వహింపబడుచున్న సురభినాట్యమండలిలో ప్రవేశించి అందలి వారితోబాటు నటనయే వృత్తిగా నవలంబించినది.

పురుషుడు స్త్రీపాత్రల నభినయించుటలో చిరప్రయత్నన మొనర్చియు స్థిరప్రజ్ఞను కాజాలకపోయెనను కారణమున స్త్రీ పాత్రలు స్త్రీలే ధరింపవలయునను ప్రచారము ప్రబలి ఆచరణలోనికి వచ్చుచున్న ఇక్కాలమున కొందఱు స్త్రీలు స్త్రీపాత్రములనే గాక పురుషపాత్రములను గూడ ప్రశస్తతరముగా నభినయించుట గమనించినచో అమందానందము కల్గక మానదు. నాటకరంగమున ప్రవేశించి ప్రేక్షకమహాశయులకు తన పురుషపాత్రధారణముచే

అమందానందము కల్గించుచున్న ఆంధ్రస్త్రీలలో పూర్ణిమ మిక్కిలి చిన్నది. అయినను ఆమె అభినయము మాత్రము మురువు గార్చ జాలినదిగా నున్నది. నాట్యకళాప్రపూర్ణ బిరుదాంచితులగు శ్రీయుత తాడిపత్రి రాఘవాచార్యులవారియొద్ద పూర్ణ ప్రహ్లాదపాత్రధారణమున సుశిక్షనొందినది. ఆమె ధరించిన స్త్రీపాత్ర చిత్రమొకటియు పురుషపాత్ర చిత్రములు రెండును నిచ్చో బ్రచురితములైనవి. శ్రీకృష్ణుడు, కనకసేనుడు, ప్రహ్లాదుడుమున్నగు పురుషపాత్రల ప్రశస్తతరముగా పచరించి పూర్ణిమకన్య ఆయాప్రదేశములందు నాట్యకళాభిమానులచే బహుమానములను పతకములను బడసినది. ఈమె అభినయ కౌశలమును గాంచి యొక మహాశయుడిట్లు పల్కియున్నాడు.



ప్రహ్లాద వేషము

"కుమారుని పాత్రము నభినయించిన పదియేండ్ల బాలికయగు పూర్ణిమ ప్రేక్షకుల కంటికి నిజముగ పూర్ణిమయే. ముద్దులొలుకు పూపప్రాయము, కన్నుల పండువగు మధురరూపము, శ్రవణపర్వమగు తీయనివాణి, హృదయమున కెక్కు లలితాభినయనము గల్గి నిజముగ రంగకౌముదియై పొడకట్టినది. ఆమె కుమారవేషమున తారకునియెదుట నిలిచినప్పుడు 'నీవా? ఈ మహాపర్వతమును ఛేదింతు' వని నాలో నేను నవ్వుకొంటిని."



కనకసేనపాత్ర

పదియేండ్ల బాలప్రాయముననే నటీలోకమునందు గొప్పపేరు సంపాదించిన ఈ పూర్ణ భావికాలమున ఆంధ్రనటీజనచూడామణియై ప్రకాశించుననుట తథ్యము. ఈమెకు భగవంతుడు దీర్ఘాయువు, దివ్యారోగ్యము నిచ్చి రక్షించుగాక యని ప్రార్థించుచున్నాను.

# స్వయంకృషి — స్వతంత్రజీవనము

శ్రీమతి కొత్తపల్లి కౌసల్యాదేవిగారు

మానరక్షణమునకును ప్రాణరక్షణమునకును వలయు సామగ్రిని సేకరించుకొనుటకై మానవులకు తమ యవయవములే సాధనములుగాని యంత్రసాహాయ్యముతో నిమిత్తములేదని క్రిందియంశముల సారాంశము. సృష్టిలోని ప్రతిజంతువును స్వశక్తిచేతనే యాహారాదులను గడించుకొని బ్రతుకుచున్నట్లు స్పష్టము. తిండివెదకికొని తినుటకును, ఆపదలనుండి తప్పించుకొని డాగి ప్రాణరక్షణము చేసికొనుటకును వాని వాని కనుకూలములగు నవయవముల భగవంతుడు నిర్మించియున్నాడు. యంత్రనిర్మాతలగు మానవులుదక్క స్వీయావయవములను నిరర్థకము జేసికొను జంతువొక్కటియు గాన్పింపదు. ఎవరి స్వప్రయత్నమున వారు సుఖమొందుట భగవదుద్దేశమయినట్లు ఈజీవలోకమే సాక్షి. మానవులుదక్క యేయితరజంతువైనను పసితనమందుగాక అన్యసమయములందు పరాపేక్షలేక జీవించును. దానికి స్వశక్తియే యాధారము. తన జీవనమునకై పరులపై నాధారపడి యుండువారు జంతువులకంటె హీనులనుట యతిశయోక్తి గాదు. ఉన్నశక్తిని స్వప్రయోజనమునకైనను వినియోగించుకొనక చదికిలబడి కూర్చుండి నిరర్థకులైయుండుట జీవితమునకు వంచన. మానవుడు సంఘజీవియనుట కర్థము తినియూరక కూర్చుండుటగాదు. అనగా నొకనియొక్క జీవన ప్రయాసములోని హెచ్చుభాగమును సంఘము భరించును. అతనికి వచ్చు సుఖములోని హెచ్చుభాగమును సంఘమునుండియే కలుగును. అనగా మొత్తముమీద మనుష్యుడు సంఘమువలన సుఖజీవియనదగును గాని కేవలము దానివలననే జీవించుననుట పాడిగాదు. దీనినిబట్టి జీవనమునకు పనులు వినిమయము చేసికొనవలసినట్లు కనబడుచున్నదిగాని యూరకకూర్చుండరాదని స్పష్టమగుచున్నది. మఱియు బహోపకారము పుణ్యము పరహింస పాపము ననుధర్మమునుబట్టి తానితరులబీడించి బ్రతుకుటకంటె తానితరులకొఱకు స్వతంత్రజీవన మవలంబించుట యుక్తము. మహాత్ముని

యుద్యమరహస్యము మానవజీవితమును సార్థకపఱచుటయే. పనిలేక కూరుచుండు వారి పాప చింతనలను దొలగించుటకును ఆరోగ్యమును బుద్ధిని చెఱచు సోమరితనమనెడు వ్యాధిని నివారించుటకును ఆధివ్యాధులను హరించుటకును రాట్నమేగదా సిద్ధౌషధము? సర్వజనసులభమగు నిట్టిసాధనమును గనిపెట్టిన మహాత్ముని ప్రతిభావిశేషము అనిర్వాచ్యము.

నూలు వడికి ఖద్దరు ధరింపుడు! రయితుయొక్క పొలమునకు నాగలియెంత యావశ్యకమో గృహమునకు రాట్నమంతకంటె ఆవశ్యకము. అత్యధికఫలప్రదము. భగవంతుడు మనకొఱకు సాక్షాత్పరమేశ్వరాంశమున మహాత్ముని యవతరింపజేసినాడు. స్వాతంత్ర్యజీవనముకోరువారు తప్పక ఖద్దరుధరింపవలెను. మనము ప్రాణమానరక్షణములను కావలసిన యన్నవస్త్రములను స్వహస్తములతోడనే నిర్మించుకొని జీవితమును సార్థకపఱచు కొందముగాక! స్వప్రయత్నముగలవానికి దైవముతోడ్పడు ననుట యదార్థము. మనము త్రవ్వి నీళ్లుపోసి పెంచి కాయించిన కూరలు మొదలగునవి మనకెంతో రుచికరములై యుండును. బజారులోనివి మనకంటికి నదరుగానున్న నుండవచ్చును గాని యవియంతగా రుచింపవు. అవి స్వయముగా పండించుకొనుటచేతనే మన జిహ్వ కింపు బుట్టించు చున్నవి. కావున నదరుగల మిల్లుబట్టలకంటె స్వహస్తనిర్మితమగు ఖద్దరే మనకింపు. స్వయంకృషియే సౌఖ్యదాయకము. మనకు రాట్నము శ్రేయముగూర్చును. ఆత్మ శాంతిని గలుగజేయును. దేశమును వృద్ధికి దెచ్చును. స్వశక్తిచే జీవించుజంతువుల గనియు శ్రేయోదాయకమగు మహాత్ముని యుపదేశము వినియు స్వయంకృషి నొనర్పుడు. స్వతంత్ర జీవనమునకై స్వయంకృషి నవలంబింపుడు.

## స్త్రీ విద్య

కందుకూరి రామభద్రరావుగారు

కోమలివిద్య నేర్చునెడఁగూరిమి భర్తకుఁదోడు నీడయై
కామితసౌఖ్య సంపదలఁ గల్పకిఁతీజము భంగిఁగూర్చుఁ దే
బాములు కల్గకుండ తన ప్రాణము రక్షయొసంగి, గేహమే
భూమిని స్వర్గలోకముగఁ బ్రోది యొనర్పదె యెల్లవేళలన్

# గర్భవతి — వైద్యసాహాయ్యము

శ్రీమతి పాపిలికొలను పద్మాసనమ్మ గారు బి. ఏ.

గర్భిణీ స్త్రీకి దేహము రక్తహీనమై తెల్లబారి యుండిన యెడల వైద్యునికి చూపి తగు చికిత్స చేయించుకొనవలెను. విశేషముగా వాంతులు, నాలుగు నెలలు జరిగిన వెనుక కూడా ఓకిరింతలు, పైకలు నిలువకుండా వుండినను అన్నహితవు లేకుండినను శరీరము తూనికె తగ్గి బలహీనమయినప్పుడును వైద్యుని రప్పించి చూపవలెను. మొగమున్ను పాదములున్ను ఒకప్పుడు వాపుచూపును. సాధారణముగా దీనినంతగా గమనింపవలసిన కారణముండదు. అయితే ఒకప్పుడు కడుపులో మూత్రము చేరెడు ఉలవకాయ రూపముగల (Kidney) ఒక పిండము కలదు. అది చెడడమువల్ల వాపుకలిగి యుండినయెడల అపాయకరము. కనుక వెంటనే వైద్యునికి చూపి తగుచికిత్స చేయించుకొనవలెను.

మూత్రము కొంచెముగా గాని యెక్కువగా గాని అగుచుండినయెడల వైద్యునికి తెలియచేయవలెను. నెలకొకపర్యాయమైనను మూత్రమును వైద్యునికి పంపి పరీక్ష చేయించుచుండుట మంచిది. పిత్తవికారము, తలనొప్పి, లేక తల త్రిప్పుట, చూపు మందమగుట, లేక ఒక వస్తువు రెండుగా కనుపడుట ఇట్టియవస్థలు కలిగిన యెడల వైద్యునికి తెలియ చేయవలెను. మలబద్ధము అందువలన అసౌఖ్యము కలిగినప్పుడు మలముతోపాటు రక్తము పోవుచుండినప్పుడు వైద్యునికి తెలుపవలెను.

దంతములకు బాధకలిగి చిప్పి పట్టుచుండినయెడలనున్ను, తిన్న ఆహారము జీర్ణముకాకుండా పులితేపులు కలిగియున్నయెడలనున్ను, ఊపిరిపుచ్చుకోవడము ఆయాసముగా తోచినప్పుడున్ను, గర్భస్రావ మగునని సందేహము తోచినయెడలనున్ను, కాలమునకు పూర్వమే గర్భవేదన కలిగిన యెడలనున్ను, ఈ గుణములన్నియు గర్భస్త్రీలకు సాధారణముగా కలుగ కూడనివి గనుక — వైద్యునికి తెలియ పరచి తగుచికిత్స వెంటనే చేయించుకొనవలెను.

గర్భముధరించి యుండుకాలములో అప్పుడప్పుడు తెలివిగల నేర్పరియైన వైద్యునికి తనదేహతత్వమును తెలియపర్చుచుండడము ఆవశ్యకమనిన్ని అందువలన సాధారణముగా గర్భకాలమందుండవలసిన ఆరోగ్య గుణములకు విపరీతముగా ఏదైనా చిహ్నములు కనుపించినయెడల వానిని వెంటనె తగుచికిత్సచేయించుకొని తొలగించుకొనుటకు ప్రయత్నపడవలయునని ప్రతియొక గర్భిణిస్త్రీయు తెలిసికొని యుండవలెను. అట్లు చేయడమువల్ల వెనుక అపాయకరమైన కష్టములు కలుగకుండ తప్పించుకొనుటకు సాధ్యమగును. ప్రసవకాలమందు ఏమితెలియని మంత్రసానిని పిలుపించుకొని దానిచేత ప్రసవము చేయింపరాదు. తెలిసిన మంత్రసానిచే కాన్పు చేయించుకొనవలెను. ఇట్లుచేసినయెడల సుఖప్రసవమై పిమ్మట ఏమియు తొందర కలుగక సలక్షణముగా బాలింత దినములు జరుపుటకు వీలుకలుగును.

# ధర్మపత్నీసాహచర్యము

శ్రీమతి రాజేశ్వరిగారు

* అక్కల్లారా! చెల్లెల్లారా!
అద్భుతమగు నొక కథ విన్నారా?
కల్పితకథయని అనుకోకండీ,
నిజమగునట్టి చరిత్రే.

వీరబొబ్బిలికి దగ్గరనున్నది
భీమవరమనే ఒ గ్రామం — ఆ
రామద్రావిడులందుం డేవా
రఖిలశాస్త్రపారీణుల్.

ఇంటిపేరు వేములవారందురు,
రామశాస్త్రి గృహమేధి.
అతండు జ్యోతిశ్శాస్త్ర విషయమున
నాచార్యుడని ప్రతీతి.

ఉత్కళరాజుల సన్మానంబులు,
బొబ్బిలిప్రభువుల బహుమతులు,
విజయనగర రాజాహ్వానంబులు,
రామశాస్త్రి కనునిత్యంబున్.

---

* ఇది యొక స్థానికచరిత్రము. నా కీయితివృత్తముఁ దెల్పినవారికి కైదుపురుషాంతరముల వెనుకటి వారే యిందలి నాయికానాయకులు. ఆనాఁటికి సహగమననిషేధక శాసనములులో నున్నను, స్థానికరాజులు ప్రభుత్వము వారినుండి ప్రత్యేకానుజ్ఞ సంపాదించి, యైచ్ఛిక సహగమనమునకవకాశమిచ్చెడి వారట. చితిపై జానకమ్మ మానమును గాపాడిన యనగ్నిదగ్ధమగు పట్టుచీరపేలిక నానుపూర్విగఁ దద్వంశజులు దైవప్రసాదమట్లు దాఁచియున్నారని వాడుక. భారతమహిళాశీలముఁ జాటునట్టి యమృతకీర్తుల పవిత్రచరిత్రము లెన్ని కాలగర్భమున మాటువడియున్నవో యెవరికెఱుక? పాటతీరున వ్రాయు కుతూహలముచే నిందు గల్గిన వ్యాకరణాతిక్రమణములకు క్షంతవ్యను.

— వ్యాసకర్త్రి.

విద్యకుతోడగు నైశ్వర్యంబును
ధనసమృద్ధితో వినయసంపదయు
గలుగగ, ఫలభారంబున వంగిన
రసాలమట్ల తఁ డెసఁగన్.

ఆతని భార్యకు జానకమ్మయని
పేరుంచిన జననీ జనకుల్
భవిష్యదర్థం బెఱుగుదురని యే
జనులు నేటికిని దెల్పెదరు.

భర్తకు ముప్పది రెండవ యేటను
సదునాల్గేడుల పడతుక జానకి
శాపురంబునకు వచ్చెను భర్తృగృ
హప్రదీపకళతో.

తలలో వర్తిలు నాలుకవిధమున,
మనసున మసలెడు మాటయటుల్,
ఛాయపగిది, పతిఛాయ నెవర్తిలు
జానకి, జనులెల్లరు పొగడన్.

హరిద్రాంచిత ముఖమండలమున
కుంకుమబొట్టొక సొంపెసగన్,
సాయంవేళా రవిబింబాంకిత
చరమదిశా సతివలె వెలయున్.

ఆమె కనులలో ముగ్ధప్రేమకు
నాలంబనమన, నచిరమునన్,
సకలబంధుజనమోదావహముగ
గర్భోదయమామెకు గలిగెన్.

శ్రావణమాసపు జలధరమట్టులు
మందగించెగమనంబు,
సాగరస్థముక్తాపేటికవలె
నిమీలనము గనెకనుగల్వల్.

భవమోహావధి గడచినంతట సు
శుభలగ్నంబున శుభతారన్,
ప్రాకృతి గాంచిన రవితో బాటుగ
జానకి పుత్రుని గాంచెన్.

ప్రేమభాగ్యబంధమ్ము గాంచుటయె
దాంపత్యము సకుధన్యత యగా,
పుత్రుని బోలిన సువర్ణ శృంఖల
గల్గునె భార్యాభర్తలకు?

* * *

అక్కల్లారా! చెల్లెల్లారా!
ఆనందంబగు విషయంబైనది;
ఎండవెనుక నేవానజల్లువలె
నింక విషాదపు వృత్తంబే.

శిశువుదయించిన నాటినుండియును
రామశాస్త్రి ముఖమది యేమో
జలధర సంఛాదితమగు జాబిలి
కరణి నొకించుక కళ తరిగెన్.

ఒకనాడంతట జానకి శయ్యా
సీనుండగు పతి జేరి,
తనములాడుకొను తన లేఁబ్రాణము
నాతని తొడపై జేర్చి—

“బిడ్డా! అరుగో మీ బాబయగా”
“రెత్తుకొనండీ! ఒకమాటు”
అనుచును, మున్నా మేనక ఋషికడ
బలికినట్లు బలికె—

“దీర్ఘచింత మీ మదిలో నేదో
యేచుచున్న గతి దోచు,
అపకృతి యే దేనుండిన యెడ నీ
దయనుంగు దాసియె శిక్షార్హ”

అని, యింకేమో పలుక్కటకక్రుసులు
గొంతుక చెఱబట్టెన్,
మూఁగకనులపై రెప్పలు, వాయుచ
లన్నళినీదళముల వలె తొణుకన్

నిలిచిన జానకిఁ గాంచి భర్త యిటు
పలికెను, ఉరుమని పిడుగు బలెన్:—
"ఈశ్వరాజ్ఞ నాకైనది శ్రేష్ఠ
దివ్యపదంబును జేరన్!"

జగతీమృత్పిండము పులకింపగ
తిరుగబడిన వృక్షము వోలెన్,
ఎండతాకుచే వాడిన లతవలె,
జానకి వివశత వ్రాలెన్.

* * *

పతిసేవాపరతంత్రజీవయగు
జానకి, నామె నిసుంగున్,
సంసృతిపథమున పీడిత దాశా
జ్యోతి యంతరించెన్!

జంఝామారుత మొక్కసారి ని
శ్చలముగ నిలిచిన కరణిన్
జానకి కన్నుల తడి యారిచికొని
మరదిఁ బిలిచి యిటు బల్కెన్:—

"ఇదిగో, యీ నా ప్రాణనాయకవ
రప్రసాదమును చేకొనుడు;
కెలవైచిన దీకదళీభూజము,
జీవితాశ దీరెన్!

ఒంటిగ జనుమీ యన్నగారినిక
సగము దారినే కలియువలెన్,
ఖగోళమున తారలమై నిక
ణాశీస్సున సుతు ముద్దుగొనన్!"

త్రాడిమనుండి విడదీసిన మొగ్గవి
ధంబున పసికూనఁ గొని,
మారువలుకు లకు దోచక భోరున
నేడ్చి వైచె జానకి మరది.

* * *

పట్టుపుట్టమును హేమభూషలును
అక్షరమాంగళ్యము దెల్ప
సాప్తపదీనత నాటి కింకిణీ
రవమున జానకి చితి చుట్టు
ప్రదక్షిణంబుల నొనరించి హోమా
గ్నులలో నాజ్యము వోసెన్,
కరాంగుళుల వ్రేలాడెడు వత్తుల
వహ్నికీలలెగ బ్రాకన్!
అగ్నిపరీక్షావేళను జానకి
తల్లియొడిని జేరెను నాడు,
సాహచర్యమున నేడీ జానకి
భర్తృశయ్య జేరెన్!
కఠినదారువులె సుమతల్పంబై,
చిచ్చు నాలుకలె వీవనలై,
కీర్తిక్రాంతన భోంతరాళమే
వారలశోభన గృహమయ్యెన్!

# చివరికింతే

ఆలమూరు రాజగోపాలరావుగారు బి. ఏ.

(వినోదపాఠము)

నిన్న సాయంకాలం ఓ శెట్టాడుకొని బీచ్ నోపిల్లషికారుకొట్టి రూముకు చేరాను. ఇంతట్లోకే హాస్టలు బెల్ కొట్టారు. సాయంత్రం "నియోహోమల్లో" పూరాగా పిండించే ఉంచాను కనక ఉదరంలో ఆట్టే వేడి కలగలేదు. ఐనా యిచ్చేదబ్బేలాగా యిస్తున్నాం గదాని నలుగుంటితో టిబాటు నాలుగుమెతుకులు నోటికిముట్టించి చక్కావచ్చాను. ఇంకేముంది. సరే. రెండు గుప్పులు గుప్పి, సిగరెట్లు తన దగ్గరయిపోవటం చేత చల్లగా నాప్రక్కకిచేరిన మా వెంకన్న కిచ్చాను. 'వద్దోయి' అంటూనే రెండుపేళ్ళల్లో దానంతు కనుక్కున్నాడతను. ఇక్కడి కిదయింది. ఒక్కకిల్లీముక్క నోటి కందించి గడియారం తీసి చూచేటప్పటికి యెనిమిదింపావయింది. నాస్నేహను, యిదేం పనని శరీరాన్ని కాంపుకాట్టు మీదికి చేర్చాను. ఆపైన నాపక్కన్న పేపరొకటి విప్పి కళ్లకెదురుగుండా పడేశాను. కాస్సేపటి కెడంవైపున కిటికీ గబుక్కున చప్పుడయింది. ఉలిక్కిపడి గబుక్కున చూశాను. ఎవరూ లేదింతా చేస్తే. మా వెంకన్నే! హై మెంతన్నాడు. అయిం జెనిమిదిన్నరా అన్నాను. అబ్బా ఆలాగయితే అరగంటెక్కువ మేలుకున్నా నన్నమాట. ఇంకెందుకు నే పోయి పడకేస్తా నన్నాడు. నాదీ అదే ప్రయత్నం అన్నాను. ఓహో! అందు కా పుస్తకం విప్పావని యేదో రెండు కబుర్లు విప్పి ఆయనతన్న ఆయన జారాడు. ఆ పైన నా చేతులో పుస్తకం జారింది. ఇది పనికాదని యెడంకాలితో కిటికీతలుపు నో తాపుతన్ని కుడిచేత్తో సిపాన్నొక్కి నొక్కి చలివేయకపోయినా దుప్పటీ బిగతన్ని చప్పున్లేపండని మా రూమ్మేటుతో చెప్పి బ్రహ్మకైనా తెలియకుండా కళ్లుమూశాను. పక్కింటి బాతుల్లా కుర్రాళ్లు బాపురు బాపురుమంటూనే ఉన్నారు. అయితేయేం? రావిచ్చక్క క్రూసోకీ మళ్లే అల్లాగే నిద్దరట్టి పోయింది.

నేనూ మా వెంకన్నాట. ఇద్దరం వేడుతున్నావట. వెళ్లగా వెళ్లగా ఓ పెద్దసముద్రం. సముద్రంనిండా తెప్పలు కనబడతాయి. ఆ తెప్పల్లో యెక్కి ప్రయాణం సాగిస్తూన్నాం. వెళ్లగా వెళ్లగా ఏమిటో పెద్దపెద్ద కాలేజీలు, హైస్కూళ్లు, లెక్చరర్లు, హెడ్మాష్టర్లు కనబడతారు. ఏ వంయితే అయిందని యింకా కాస్త దూరం వెళ్లేటప్పటికి ఓ ఊరుదరికి చేరాం. పోనీ సాయంకాలవైంది వూళ్లోకెళ్లి టీ అన్నా పుచ్చుకుందాం అని బయల్దేరాం. ఆ వూరంతా మాకు తమాషాగా కనబడింది. అక్కడ యిళ్లన్నీ పొగాకుతో నేసివున్నారు. వాసాలన్నీ మంచి లంకాకు చుట్టలు. కిటికీ వూచలన్నీ మేలైన సిగరెట్లు, బీడీలు. వాళ్లకీ గుమ్మం ముందు ముగ్గెట్టుకోవడం అలవాటుందిగాని మన ముగ్గులా తెల్లగా లేదు. మా వెంకన్న యిదేమిట్రా కీళ్ల ముగ్గల్లా ఉందని వేల్తో తీసి కాస్తంత వాసన చూశాడు. అయ్యో! యింకేవంని చెప్పను నా దవస్త; ఒకటేతుమ్ములు

దాని సంగతి యిదివరకు కొంచం తెలిసిన వాణ్ణి కనక ఒక్క పట్టె డయితే ముక్కులో కెక్కించి, అప్పుడప్పుడు తెలుగుక్లాసులోకయినా పనికొస్తుందని కాస్తంత డబ్బీలోకి జాగ్రత్త పెట్టాను. ఇంకా రెండడుగులేశేటప్పటికి, జనులు దేశదేశాల వాళ్లూన్నూ. ఓహో! కోలాహలం యేమని చెప్పను! మిన్నుముట్టి పోతూంది. ఆ గుడారమంతా ఆ వూళ్లో యిళ్లలాగె కట్టబడుంది. పులింజూసి నక్క వాతెట్టుకుందని వీళ్లకి దేప్పట్లో అనుకుంటూ గేటుదగ్గర కెళ్లేటప్పటికి ఆర్చిమీద 'అఖిలదేశ ధూమపానీయ మహాజనసభాగతులకు స్వాగతము, అధ్యక్షులకు స్వాగతము' అని యీలా యేదో లిఖ్ఖున్నాయి. ఇదేదో చిత్రంగా ఉందని మేము లోపలికెళ్లాం. వెళ్లేటప్పటికి కా మహానుభావు డెవరో కాని కళ్లక్కట్టొ పడతాడు. ఆయన మాను వియ్యంకుళ్లాగ బహు మర్యాద చేసి షేక్‌హ్యాండిచ్చి సిగరెట్టుకూడా యిచ్చాడు. పుచ్చుగోకపోతే యేమన్నా అనుకుంటాడని కాదుగాని మా అవసరం కొద్దే ఓ చిరునవ్వు నవ్వి పుచ్చుగున్నాం. అప్పటికప్పుడే ఊపేస్తున్నాడు ఉపన్యాస మీ ప్రకారం ఎవరో.

“ఆధునిక భరతఖండంబు దరిద్రావస్థలం జిక్కింది. తురుష్కరాజ్య మానికంబునుం బోలిన హైదరాబాదు నగరవీధులం ప్లేగు పేల్చి వేస్తోంది. పూజ్యగౌతమీతీర రాజమహేంద్రవర ప్రాసాదమ్ముల మహామశూచిక పిశాచంబు తాండవించుతోంది. జనసముదాయంబులు సిగరెట్లరాజములం గాని పీకే శ్రేష్ఠంబులం గాని కొనచేతం లేదో గవ్వైనా. తత్కారణంబునను జనుల ప్రాపుంగోరిన ధీమంతులం బైన కారణంబునను, మా సుఖంబే వారల సుఖంబని యెంచిన త్యాగమూర్తులమైన హేతువులం బట్టీ, మేము ఒక కానీకి, అనగా అణాలో నాల్గవవంతునకు, జేడలో యెనిమిదవవంతునకు, మాకు నష్టము వాటిల్లినను వాటిల్లుగా కని యేడు బీడీల మాని యెనిమిదిబీడీల నిచ్చునట్లుగా హెచ్చించినాం. మే మొందు వెతలు పామరులకేటి యెఱుక, వినుడు! పాతికరూప్యంబుల సరకుంగొను వారలకొక స్వహస్తనపీనయంత్రంబును బహుమానంబుగా నీయదలచాం. సౌఖ్యంబునకా బీడియే, చల్లదనమునకా బీడియే. వేయేల? యెండవానల కాగునది వేఱొకటి కలదా.? లేదు లేదు. అధ్యక్షులం వారు కాలమయినదని అప్పుడే రెండుసార్లు శలవిచ్చారు. వక్కాణింపవలసిన హంశంబులు పెక్కులుం గలవు. అయినను మా వద్ద 'కరీము' తురుష్కమార్కు మొదలగు బీడీలు చవకధరలో సరసంబుగ నీయకలవారం.” అని ఆయన వెళ్లిపోయాడు. ఆయన్ని చూస్తే మాకోవిధంగా వెఱ్ఱినవ్వు ఆనందంకూడా కలిగింది. అతని నెత్తిమీద టోపీ తమాషాగా బీడీల్తో తయారు చేయబడుంది. ధరించిన టోపీనిండా “బీడీని త్రాగుడు! ధన్యులుకండు!” అని వ్రాయబడిఉంది. అన్నట్లు చెప్పటం మరచిపోయాను. వెళ్లేటప్పుడు మా అందరిమీద పుష్పవర్షంలాగ బీడీల వర్షం కురిపించి పోయాడు. ఆ పైన అధ్యక్షు డెవరిదో పేరు చదివాడుగాని సభికులంతా బీడీలేరుకోవటంలో మునిగిపోయిన కారణంచేత వినపడలేదు. ఇంతలో వారందరిని సముదాయించి కూర్చుండ పెట్టారు. తరువాత ఉపన్యాసకుడు విజృంభించాడీ ప్రకారంగా:—

“ధూమపానీయదురంధరులారా! మా అమ్మలక్కలారా! అభిమానులారా! నే చెప్పబోవు విషయంబు కడుం బెద్దదయినను అవకాశములేమి శీఘ్రముగ విరమింప వచ్చుచున్న యది. సిగరెట్టు శ్రేష్ఠమా అథవా బీడియా అను హంశము మనము యోజింపవలశినది కాదని నాకుందోచుచున్నయది. తద్విషయం బాభూతభవిష్యద్వర్తమానంబుల నెఱింగిన యా చిద్విలాసునకు, ఆ త్రిజగన్మోహనునకు ఆ శ్రీమన్నారాయణునకు ఎఱుకగాని మన యీ చర్మభస్త్రికెఱుకయే? కలిపురాణంబున ధూమప్రకరణంబున కొండొక

గాథకలదు. దాని సావధానచిత్తులరై వినుండు. తొల్లి నొకానొక సమయంబున దేవేంద్రుండు భూవలయంబునం గల మునిగజేంద్రంబులును సకలశాస్త్రంబుల నేర్చిన సరసులును వేయేల కవులు గాయకులు పాఠకులు అందరు పరివేష్టించియుండ నఖండవైభవంబున నిండుకొలువుండె. అట్టిసమయంబున నిష్ఠశిష్టాగరిష్ఠుండగు వశిష్ఠుండు లేచి, 'దేవేంద్రా! నీయభిప్రాయమేమి? సిగరెట్టు కేవలము బలవృద్ధియు, శరీరపుష్టియు కల్గించు కల్పవల్లి యనియే కద మొన్న జరిగిన యైరోపామహాసంగ్రామమునందు సైనికు లుపయోగించు నిమిత్తము ప్రత్యేకం పనికివచ్చునని కొన్నికోట్ల సిగరెట్లను తెప్పించి వారికి నొసంగిరి?' అనెను. అంత విశ్వామిత్రుండు కోపోద్దీపితుడై కన్గవిడ్డ గవ్వలవలె ముందుపరా నిట్లనిపల్కె. 'ఎంత జెప్పినను, వశిష్ఠా! నీవు నీ పట్టువిడువవుగా? నేను నీ చేతనే, యీ దేవేంద్రుని యెదుటనే మునిగణస్తోత్రా! విశ్వామిత్రా! నీవనునటుల బీడీయే శ్రేష్ఠమని యొప్పింపక పోతినేని, గెడ్డములబెంచి, బూడిదాధరించి యడవులంబట్టి తిరుగుదునని శపథము బట్టెను. అంత నారదుడు లేచి, 'మాచెరవేమి? వశిష్ఠా నీ కమండలమున వారి శిరోమండలము వ్రక్కలు చేయరాదే?' యని అపహసించెను. వశిష్ఠుండు కోపోద్దీపితుండై పాంకోడు పళుక్కున విరుగ భూమిపై నొక్క త్రొక్కుత్రొక్కి రోషావలంబున డీకొన నిట్లనిపల్కె. 'విశ్వామిత్రా! నేవంత ననదననుకొంటివో! యీ యెల్లరుజూడ నీ సభలో—ముందు జెప్పుట లెందులకు?—నీ చేత నా పాదముల బట్టించు కొనుటయే గాక, వసిష్ఠా! క్షమింపుము, క్షమింపు మపరాధ మొనర్చితినని అనిపించుటయేకాక అర్ధరూపాయి స్టాంపుపై వ్రాతమూలమున యీ నారదుని చేతనే సాక్షివ్రాలు చేయించి శ్రీసబుజిస్ట్రారు వారికైదువందలైనను లంచమిచ్చి పుచ్చుకొక పోతినేని, మెడల్ను వీడి, చచ్చిపోటుమాని యూరూరతిరిగి జీవింతు' నని తొడగొట్టెను. తదుపరి ఆ బ్రహ్మమానసపుత్రుండు లేచి, 'విశ్వామిత్ర వశిష్ఠులారా! ఏల మీకీ వృథా వాగ్వ్యయము. సర్వము నెఱింగిన ఈ దేవేంద్రుండు లేడే? మీరిద్దరును ఆతనికి బీడీనొకరును సిగరెట్టు నొకరును యిచ్చి యాతని యభిప్రాయానుసారము వర్తించుట కర్జంబు. మీ రుభయులు పాలు నీరువలె కలిసి మెలగుట మనకు పాడి కాదే'యని వాక్రుచ్చెను. వసిష్ఠుండు తక్షణము వల్లెయని తన కమండలమునుండి శిజారు పేకెట్టునూడబెఱికి ఒకసిగరెట్టులాగి దానిం బెట్రోలులైటున వెలిగించి రెండుగుప్పులుగుప్పి దేవేంద్రున కిచ్చెను. 'మేలు వశిష్ఠా! మే'లని యా దేవేంద్రుడు విశ్వామిత్రుని వైపు తిరిగెను. విశ్వామిత్రుండు తన శిఖయందున్న బీడీకట్టనుండి నొకబీడీ నూడబెఱికి, అంటించువైపు నోటనుంచి నొక్క నూదుయూది, తిప్పి యా సిగరెట్టుననే దానికగ్ని సంస్కారము చేసి దేవేంద్రునకిచ్చె. అది సిగరెట్టువలెనే యుండునని దేవేంద్రుండు రెండు గుప్పులుగుప్పె. పాపమాతనికి మొగమునిండ ముచ్చెమటలుపోసె. కాళ్లువణకసాగె. మూర్ఛవచ్చె. ప్రాణముల్ తావుల్ దప్పె. అప్పుడు వశిష్ఠుండు కోరచూపుల రెండింటిని విశ్వామిత్రునిపై విసరెను. విశ్వామిత్రునకు నోరాడలేదు, బట్ట తడిసెను చమటచేత. సభికులు పాదరక్షల చేతబూనిరి. ఆహా! భగవన్మాయ! తక్షణమా దయామయులగు హరిహరాదులు ప్రత్యక్షమైరి. శ్రీవల్లభుడు శంఖచక్రములు లేకయే వామహస్తంబున లైము జూస్ బాటిల్‌ను దక్షిణహస్తంబున ఓపెనరును గ్రహించి యొకాయెకీని కాలినడకను విచ్చేసెను. గౌరీనాథు డొకచేత నిమ్మపండ్లను వేఱొకహస్తంబున జిన్ తాజా పిల్సును ధరించి పులిచర్మ మూడిపోవుచున్నను లక్ష్యపెట్టక అటులనే యేతెంచెను. కంజాక్షుండు దేవేంద్రునినోట లైముజూసును గుమ్మరించెను. ముక్కంటి మూడు జిన్ తాజా పిల్సును, రెండు యాలకులను ఒక ఔన్సు నిమ్మరసమును యిచ్చెను. ఇట్లు దేవేంద్రునకు సకలవిధోపచారంబులను చేసి, వశిష్ఠున కనేకవరములిచ్చి నూరు యోజనంబుల వైశాల్యంబుగల పొగాకులంకను రెండు సిగరెట్ల యంత్రశాలలను యిచ్చి విశ్వామిత్రునకు నీతిగఱపి వశిష్ఠునివద్ద యేజంటుగ

నుండుము, నిపలగ్గగునని పలికి అదృశ్యమైరి. కనుక నో సోదరులారా! నా విన్నపమాలకించి నన్ను కృతార్థునిం జేసి నా సిగరెట్ల యేజంటు పదవి వలన వచ్చుచున్న నాలుగురాళ్లు నెలకి ముట్టునట్లుచేయ ప్రార్థితుడను. లేని యడల పనికిరాని గ్రామ్యయేట్టునై పోదును. బిడ్డలు గల వాడను.” అని చెప్పెను.

ఇహ అధ్యక్షుడు నెమ్మదిగా లేచి నోటిలోని కారా కిల్లీ ఆ పక్కనే ఉమ్మేసి, ఒక్క చిటికెడు నస్యం ఘ్రాణించి, సెకండుహ్యాండు స్పెన్సరు సిగర్ జేబులోంచి తీసి దానికి పునరగ్నిసంస్కారము గావించి, కళ్లజోడు పైనుంచోసారి చూసి, దాన్నితీసి, తుడిచి, తిరగి మళ్లీ తగిలించి, మళ్లా అల్లాగే చూస్తూ తానా పదవికి తగనన్నీ అయినా తన్ని యెన్నుకొన్న పెద్దలకి వందనాలని ఉపోద్ఘాతం మొదలెట్టి అసలిగ్రంథంలోకి దిగాడు. ఏవనంటే, బీడీ సిగరెట్టూకూడా మంచివే అనిన్నీ, సిగరెట్టు దొరికినప్పుడు సిగరెట్టు, బీడీ దొరికినప్పుడు బీడీన్నీ, కాతా కొత్తగా మొదలెట్టినప్పుడు సిగరెట్టూన్ను కాతా పెరిగి పోతూన్నప్పుడు బీడీన్నీ, మనవిచ్చేటప్పుడు బీడీన్నీ పుచ్చుకొనేటప్పుడు సిగరెట్టును, భోజనాత్పూర్వం సిగరెట్టు భోజనాత్పరం బీడీన్నీ ఏదో విధంబుగా మనవీల్నిబట్టి ఆచారాన్నిబట్టి ఉపయోగించొచ్చునని అభిప్రాయమిచ్చాడు. అసలే వళ్ళుగ్గయిపోతోంది ధోరణి చూసేటప్పటికి, ఇంకా యేంచేశాడను కొన్నారు. మనకి రాని భాషల్లోంచి ఓయాభై చదివి చివరికి స్త్రీలకి విద్య మన దేశంలో ముఖ్యముగా లేదని అందుకని స్త్రీలకు—ముఖ్యముగా తల్లులు కాగల బాలికలకు, కొంచం కారా మసాలా, సిగరెట్టునూ, బీడీన్నీ లేకపోతే లంకాకు చుట్టో అథవా కాస్తంత నస్యమో అలవాటు పరచే బాలికా పాఠశాలల నేర్పరచ వలసిందనీ ఇట్టివృద్ధికై అధమము దినవారపత్రిక లవసరమని కాబట్టి సభికుల్దగ్గరనించి చందాలు వసూలు చేయవలసిందని లేకపోతే ఓనాటకమన్నా వేసి డబ్బు సంపాదించవలశిందనీ మరీమరీ దీనవదనుడై చెప్పాడు. మా వెంకన్నతో అబ్బాయి, ఇహ వీళ్ళ సంగ తేకేస్తానన్నా. అబ్బే, అది మనం చెయ్యకూడదు యేబెంగాలీ బాబన్నా యేవో రెండు ముక్కలన్నాడంటే వాడి ఫోటో పేపర్లో వేస్తారు. దేశభక్తుల్లో ఒకడంటారు, అని వాడింకా యేదో చెప్ప బోతూంటే గణగణా అలారంగంట వాగింది. యెదిగే వేళరా, నాయనా అని మా ముసలమ్మ చెవుతూండేది. పోనీ కాస్తెదిగినా యెదగటమే అనుకుని మళ్లా పడుకున్నాను. గణ–గణ–ఘణా వాగింది కాఫీ గంట. ఇహ శలవు.

# మిథున ప్రశంస

చరుండి వెంకటశాస్త్రిగారు

జీవయాత్రను సుఖముగఁ జేయుకొనుటఁ  
దన్వి నొకదాని: ప్రీతిను ద్వాహమై; త్రి  
వర్గములఁ బొంది దివ్యమా స్వర్గలోక  
వాంఛ నొందును మనుజుఁ డీవసుధయందు.

కాన నన్యోన్య భావానురాగాహితమతి  
సకలక్రియలందు నిద్దఱు సంచరింప  
కలుగును సతిపతులకు సుఖంబుదాని  
కంటె వేఱొక సౌఖ్యంబు కలదె భువిని.

వింటిబద్ధ; నారి విధముగా నెప్పుడు  
సతివ ప్రాణనాథు నాశ్రయించి  
యోర్మి నతనివంచు నొనరఁగ నాతని  
వెంట నంటిపోవు వేడ్కమీఱ.

పురుషుఁడు నుందిగమునఁ బోవఁగానె  
బిడ్డలును సతియును వెంటఁ బ్రీతితోడ  
నవ్వుమోముల నెదుఁ రేఁగి నయముమీఱఁ  
బల్కరింప శ్రమంబెల్ల బాయునతఁడు.

# స్త్రీల హక్కులు—తత్సంస్కరణములు

శ్రీమతి ఆలపాటి సీతమ్మగారు

కాల చక్రము గిఱ్ఱున దిరుగుచున్నది. చక్రాంతర్భాగములు దృగ్గోచరములగుటలేదు. కాని సంపూర్ణస్వరూపము ఏకత్వమును బొందినదేమో అను వితర్క జిజ్ఞాసలు చూపఱుల ఆనందసాగరమున నోలలాడించుచున్నవి. పాఠకుల మనః ఫలకములయందు జిత్రింపఁబడనున్న విషయము ఏతత్కాలపరిణామావస్థయందలి యొకానొక యంశముమాత్రమె.

ఈ విశాలరమణీయపృథ్వియందు బ్రతిప్రాణియు స్వాతంత్ర్యాభిలాష గలిగి యుండుననువిషయము నిర్వివాదము. శుకశారికాదిపక్షిజాతులును సింహశార్దూలాద్యరణ్యమృగసంతానములును మానవులచే బంధింపఁబడుచున్నవి. వానిని మానవుఁడు స్వాధాయత్తచిత్తుఁడై మిగుల ప్రేమతో మచ్చికతో పెంచుచున్నాఁడు. అయిననేమాయె? వీలు చిక్కినతోడ్తో అవి విశృంఖలములై స్వాతంత్ర్యమును బొందఁ గోరుచుంటయుఁ బొందుచుంటయు మనకు నిత్యపరిచితవిషయములు.

విషయ మిట్లున్నది. ఇఁక యుక్తాయుక్త విచక్షణమునందేమి మేధాసంపత్తిప్రకటమునందేమి లోకోత్తరకార్యనిర్వహణచాతుర్యమునందేమి అవకాశము ఒదవినపుడెల్ల పురుషునితో దీటగు శక్తిని జూపిన స్త్రీ జాతి పురుషునివలె స్వాతంత్ర్యాభిలాషిణియై యుండుననుటకు వేఱుతార్కాణ వలయునా! మానవవాచ్యార్హయయ్యుఁ గేవలస్త్రీయై పుట్టిన హేతువుచేఁ బురుషుని కనుసన్నలమెలఁగి తన జన్మముయొక్క హక్కగు స్వాతంత్ర్యవాంఛాలతను మొదలంట త్రుంచి వేయవలయునా? అట్లెప్పటికిని గాదు. అందును సర్వవిషయములందును పురుషుని కన్నను స్త్రీకి ఎక్కువ గౌరవమును హక్కులను నిచ్చిన మహర్షినాగరకతాపరివ్యాప్తమగు మన భరతవర్షము నందట్లెప్పటికిని గాదు. చూడుఁడు:—లక్ష్మీదేవి విష్ణుమూర్తి వక్షస్థలము నధిరోహించినది. సరస్వతి బ్రహ్మవదనము నలంకరించినది. గంగాదేవి శివుని శుభ్రజటాజూటములయందు నొయ్యా

రముగా నుయ్యాల లూఁగినది. పార్వతీదేవి శివుని అర్ధశరీరమును ఆక్రమించినది. అహా! ఏమి నాగరకత. మహర్షుల ఆశీస్సులు స్త్రీల గౌరవమును ఎంతస్థిరముగ ఎంతటి ఉన్నత స్థానమును అధిష్ఠింపఁ జేసినవి. అట్టి మహత్తరనాగరకతాపరమావధికి నమస్కారములు. అది అట్లుండె.

మధ్యకాలమునందలి స్త్రీలు అట్టి యున్నతస్థానమునుండి క్రమశః భ్రష్టలుగాఁ జొచ్చిరి. స్త్రీల యజ్ఞానాదరణములు కొంతకు కొంత దానికి హేతువులు. మఱి పురుషుల నిరంకుశత్వమును దానికిఁ దోడ్పడినది. ఇంకఁ జెప్పవలసినది ఏమి? రాజకీయ వాతావరణమందలి హెచ్చు తగ్గులం జేసి కానిండు; విద్యావిహీనతం జేసి కానిండు స్త్రీల హక్కులన్నియు సంపూర్ణముగ రూపుమాసి పోయినవని చెప్పుట అతిశయోక్తి కానేరదు. అట్లయ్యును—ఆనఁగా—ప్రబల ప్రతిబంధక ప్రతికూల పరిస్థితులయందు నలిగిపోవుచున్నను—అచ్చటచ్చట అప్పుడప్పుడు—ఒకొక్క స్త్రీరత్నము తన స్వాతంత్ర్యాభిలాషను పురుషలోకము ఆశ్చర్యచకితమగునట్లుగా ప్రకటించుచునే యుండెను. శ్రీఛత్రపతి శివాజీమహారాజును అట్టి వీరునిగఁ అట్టి స్వదేశస్వమతాభిమానపూరితునిగఁ అట్టి స్వమతరక్షణ స్వప్రాణత్యాగ సంసిద్ధునిగఁ అట్టి సామ్రాట్టుగ దిద్దగలిగినది నారీలోకవతంస మగు శ్రీ జిజియాబాయి స్త్రీరత్నము యొక్క పవిత్రస్వాతంత్ర్యోద్బోధనలే గదా! వేయేల? మొన్న మొన్నటి శ్రీఝాన్సీలక్ష్మీబాయి చరిత్రను స్మృతిపథమున నిల్పుఁడు. ఆశ్చర్యసంతోషపారవశ్యమునం జేసి మన శరీరములు పులకితములగుట లేదా! అట్టి స్త్రీరత్నముల లోకమున కర్పింపఁ జాలిన స్త్రీ జాతికి వందనములు.

ఇదియంతయు యదార్థమే కాని సమిష్టిగా తీసికొనినచో మధ్యయుగము నుండి స్త్రీజాతి పతనోన్ముఖమైనదని చెప్పవచ్చును. అచ్చటచ్చట వ్యక్తిగతముగా ఒక దివ్య తేజము వెలిగిన నేమాయె! అయినను ఒక మహాశక్తిని ఎంత నిరంకుశహస్తమైనను సార్వకాలికముగా మూలమట్టముగా నణఁచివేయఁ జాలదుగదా? ప్రస్తుతము గతశతాబ్దము నుండి స్త్రీజాతి తన దీర్ఘనిద్రనుండి మేల్కాంచినది. తన దీనస్థితిని తిలకించినది. నిగూఢముగ అంతర్గర్భితమైయున్న తన శక్తిని స్మరించినది. ఇఁక తత్ఫలితముల నారయుఁడు. 19-వ శతాబ్దములో స్త్రీల హక్కులు పునర్వికసితములుగాఁ జొచ్చినవి. మహామహులగు శ్రీరామమోహన, ఈశ్వరచంద్రవిద్యాసాగర, కందుకూరి వీరేశలింగము పంతులు ఆదిగాఁగల సంస్కర్తలు బద్ధకంకణులై ఒక్కుమ్మడిగా దేశమంతయు ఎదుర్కొనినను న్యాయమాత్రసాహాయ్యులై స్త్రీల యెడ వరప్రసాదులైరి.

ప్రస్తుత శతాబ్దమున హరిశంకరగౌరు గారు హరవిలాసశారదాగారు ఎంతయు వంద్యులు. వారికాలమున స్త్రీలపాలిటి హరిహరులు. వారు తెచ్చిన వారసత్వపుబిల్లు వివాహవయోనిర్ణయచట్టము స్త్రీలోకమునకతిలోకముగ మహోపకారమొనర్చిన వనుటలో సందేహము లేదు. మఱియును హిందూ అవిభాజ్యకుటుంబములో భర్తమరణించిన భార్యకు భరణమిచ్చు ఆచారమును రూపుమాపి భర్తభాగమును భార్యయు తత్సంతానమును అనుభవించు నటుల చట్టమును ప్రవేశపెట్టనున్న శ్రీజయకరుగారెంతయు మాతృమల్లికాకష్టపరంపరానివారణచణులు. ఇటులనే ఇంకను మఱెన్నియో స్త్రీలకనుగుణ్యములగు చట్టములు కావలసియున్నవి. వానినన్నిటిని మనతండ్రులు-మన సోదరులు-మన తనయులు-సామ్రాజ్యశాసనసభ యందుంబెట్టి తీర్మానించి లోకమును ధన్యము చేయుదురు గావుతమని ప్రార్థన.

# వనితలు విద్యచేనమరకున్న

అతిరాత్రవాజిపేయాద్యధ్వర క్రియాకరణంబునకు ముఖ్యకారణంబు
నతిథిగురు బ్రాహ్మణార్చనావిధి మహాపుణ్య పణ్యాస్తిక గణ్యధనము
గార్హస్థ్యధర్మాదిలకరణ చిత్తోపశాంతికి విమలానషఁవికసనంబు
శృంగార చేష్టావిజృంభణాంచదనంగ జన్యజన్యాహ్లాదజననసీమ

యిష్టసౌఖ్యోప భోగసంతుష్టి హేతు
గృహిణియగు గాదెపరికింప గృహపతులకు
నట్టివనితలు విద్యచే నమరకున్న
గొట్టువడుగాదె నఖిలంబు కుతలమునను.

— బాలికావిజ్ఞానదీపికనుండి.

# మహారాణి ఫిలిప్పా

## కూచిమంచి సుబ్బారావుగారు

పరమేశ్వరుఁడు ప్రపంచసృష్టిలో సాధారణముగాఁ బురుషులకంటె స్త్రీలయందు నధికమార్దవము, సౌకుమార్యము, సౌందర్యము, సహనము, పరోపకారబుద్ధి, దయాదాక్షిణ్యములు, మొదలగు సుగుణములనేకము లిమిడ్చియున్నాఁడు. ఎక్కడో సక్రమముగానందుకు విరుద్ధముగా గొందరు దుష్టురాండ్రుండవచ్చును; కాని, సమూహముమీద గాంచుచో నాగరకజాతులందుగాని యనాగరికజాతులందుఁ గాని వారివారి స్వభావములఁబట్టి పురుషులకంటె స్త్రీలు ప్రతివిషయమునను నెక్కువ జాలిగుండె గలవారని యనేక దృష్టాంతములు గలవు. వానిలో నొకటి ఈ క్రింద జూపుచున్నాను.

ఇంగ్లాండుదేశమున రాజ్యమేలినవారిలో మూడవ యెడ్వర్డురాజుయొక్క యర్ధాంగి మహారాణీఫిలిప్పా. పూర్వమొకమారు యెడ్వర్డు ఫ్రాంసుదేశమున సముద్రతీరమున నున్న కలే (Calais) యనుకోట నొక సంవత్సరమువఱకు ముట్టడించెను. ఆ ముట్టడిలో ఫ్రెంచివారు తమకోట ఇంగ్లీషువారికి స్వాధీనము గాకుండ బహు చాకచక్యముగా బనిచేసిరి. కోటబయట మైదానమున నున్న యింగ్లీషుసేనలు విస్తారముగా నాశనమగుటయు, ద్రవ్యము గడతేరుటయు, సంభవించినందున యెడ్వర్డు విసికి క్రోధపూరితుడై నిప్పులు గ్రక్కుచుండెను. కాని, యేమైనను సరే తనపట్టుదలమాత్రము విడువలేదు. అయితే, తుదకు కలేకోటలోనివారికి దినుబండారములు నిలువై పోవుటఁబట్టి ఫ్రెంచివారు సంఘమరణమొందుటలో ప్రయోజనము లేదని గ్రహించి తాము లొంగిపోయి, కోటనప్పగించెదమని యెడ్వర్డుచెంతకు రాయబారమంపిరి. అదివిని రాజు "వారెల్లరుం దమప్రాణములు సంపత్తి తనపాదముల కర్పించి యేమిచేసినను సరే యని సమ్మతించిననే కాని వారికోరిక నామోదింప" నని తెల్పెను. అప్పుడు వారు "పురప్రజలకెల్లగను నాపత్తువచ్చునని యే లొంగిపోయెదమని వార్తనంపగా నందరును ప్రాణముల్పింప సిద్ధమై రావలయునని తెల్పుట యేటిన్యాయము; అట్లగుచో వారు కోటలోనే పడి పోరిపోరి ప్రాణములువదలుచో నాత్మగౌరవమైనం దక్కును. ఇట్లునిక్కమాలిన యవమానమరణమొంద నేల? వారెల్లరు తెగించిపోరి మరణించునంతకి దమకింకను ధనము ప్రాణము నష్టమై తీరనిచిక్కు రాగలదు. వారు మనఃపూర్వకముగ కోట సమర్పించి ప్రాణములుకూడ గోల్పోవుట యన్యాయము" అని యా రాయబారియు రాజమంత్రులుగూడ దెల్పినను సమ్మతింపక తుదకు వారిక్రింది నిబంధనల కంగీకరించుచో దయసూపెద నని వాగ్దానమొనర్చి ప్రమాణము చేసెను. అదేమనగా, ఆపురములోని గొప్పప్రతిష్ఠగల పురుషులార్గురు బోడితలలతో పట్టిశాల్లతో మొండిచొక్కాలతో మెడలో నినుపకడియములతో బానిసవేషధారులై తన సమూహమునకు రావలయును. కలే నగరముయొక్కయు కోటయొక్కయు తాళములు తెచ్చి యప్పించవలెను. ఆ యార్గురు రాజశాసనమునకు బద్ధులై యెట్టిఘోరదండనమైన ననుభవించుటకు సంసిద్ధులై యుండ

వలెను. అప్పుడు కడమవారెల్లరు రక్షింపఁబడెదరు. ఇదియే వారికి గనీసమగు సమపాయము.” అని తెల్పెను. వచ్చినమాత యీ నిబంధనలను కంటనీరు గార్చుచు దన పురముసకేగి నాయకులకుదెల్పగా వారు సమావేశము గావించి వానిని పౌరులెల్లరకుం జదివి వినిపించిరి. అదివినగానే కొందఱు సంతసించిరి; కాని యెవరికి వారే మొగములు తెలతెలబోవ నిదియెట్లుసాధ్యమగును? ఎల్లరు సమానముగా జీవితాశ కలవారే. ఇందులో నెవరీఘోరశిక్ష ననుభవించుటకు సిద్ధపడుదురు? కానిచో నిఁక నెవరికిని జీవితాశ యుండదు. సంఘమరణముతప్పదు అని కలవరపడి గోలున విలపింపఁ బూనిరి.

అపుడా సభామధ్యమునుండి యూస్టేసు డీ సెయింటుపెయిరీ అను మతాధిపతి లేచి “ఓ పౌరులారా! విలపింపకుడు. ఈ దీనుని దేహప్రాణములు పరమాత్మునకు ప్రియములై పౌరుల ప్రాణరక్షణమునకు సాధనభూతములగునేని ఇవినేను కలేపౌరుల విమోచనమునకై మొట్టమొదట కానుకగా నాశిర మింగ్లాండు రాజున కర్పించుచున్నాను.” అని యెలుగెత్తి యార్చెను. సభలో నాహాకారము చెలరేగెను. ఎల్లరు నాతని సాహసమున కాశ్చర్యపడి కృతజ్ఞతాసూచకములగు ప్రశంసాధ్వనులతో నశ్రుధారలు కార్చుచు, “భళీ” ఈ మహానుభావుని సాహసము మానవకోటిలో నసాధారణమైనది.” యని పల్కిరి.

ఆతని సాహసధైర్యములు చూచియు ప్రజలప్రశంసావాక్యములు వినియు నావేశపూరితులై యొకరిపిదప నింకొకరుగా గడమయైదుగురు యువకులు లేచి ప్రాణములర్పించుచున్నామని ప్రతిజ్ఞగావించిరి. దానితో సభాసదులెల్లరు చకితులై ఆబాలవృద్ధులతోఁ గూడిన సమస్తపౌరులయొక్కయు సర్వనాశనము వారించుటకై ప్రాణములు తృణప్రాయములుగా నెంచి మహోపకార మొనర్చిన యా వీరపురుషులకు బ్రణమిల్లిరి. పాపము! ఆ వీరులు తమదుస్తులు తీసివైచి ఎడ్వర్డు కోరినప్రకారము బానిసవేషములందాల్చి తమమోటుబట్టలు మహారాజులు మన్ననతో నొసగు గౌరవవస్త్రములకంటె ఘనమైనవిగా బావనములుగా దేశరక్షణచిహ్నములుగా భావించి సంశయింపక, తిన్నగా నెడ్వర్డు సమ్ముఖమునకేగి “ఇవిగో తాళములు. మమ్ము తమ యిచ్ఛానుసార మొనర్చి, మా పౌరులనెల్లర రక్షింపుడు” అని తెంపుతో బల్కిరి.

ఎడ్వర్డు వారిని బహుతిరస్కారదృష్టులతోఁ గాంచి, నాటిదనుక తనకు వారుగల్గించిన నష్టకష్టములకై దూషించి, దయాదాక్షిణ్యశూన్యుఁడై వెంటనే వారికి శిరచ్ఛేదము గావింప వలెనని యాజ్ఞాపించెను. ప్రేంచి వీరులార్గురును మంచినడివయస్సున నుండిరి. గోవగానెదిగి; మంచికండపుష్టిగల్గి యాజానుబాహులై స్ఫురద్రూపులై, నవనవలాడుదేహకాంతులతో నొప్పుచుండిరి. ఒకరికొకరు దీసుపోయక, యేకాకారమున గన్పడు యార్గురువీరులును రాజుచెంతకు రా వేగమే వారిఁగని నిర్విణ్ణులై యాశ్చర్యపడుచున్న సభికులు తమ ప్రభుని ఘోరమగు నాజ్ఞ వినుటతోడనే వికలస్వాంతులై పోయిరి. ఎవరేమి చేయగలరు? ఏమిచెప్పఁగలరు? అందరి హృదయములు నీరగుచుండెను; కాని, యా వీరులు తొణకలేదు. అపుడు మంత్రులలో సర్ వాల్టరు మాని మొదలగుకొందరు మనస్సునిలువక తెగించి కలుగఁజేసికొని, “దేవా! క్షమింపుడు. ఈ వీరులకిట్టి ఘోరశిక్షతగదు. మన్నించి చెఱలో బెట్టింపుడు. మన చేఁ బట్టుకొనంబడిన వారుకారు. దేశోపకారమునకై స్వయముగా తెగించివచ్చిన ధీరవీరులు. వీరిని రక్షింపుడు” అని వేడుకొనిరి. రాజు మండిపడి “మీకీవిషయమున నోరెత్తఁబోకుఁడు” అని కసరెను. పిదప యువరాజు యూరకుండఁజాలక తండ్రిదరికేగి “నాయనా! నామాట విని వారిని క్షమింపుము. పాపము! వారుమంచియువకులు, రూపవంతులు దేశరక్షణమునకై తెగించివచ్చిన వీరులు.

మనము వారి సాహసమునకు దేశాభిమానమునకు నిర్భీతికి సంతసింపవలెను. చంపవలదు. అంతమాత్రమున మన నష్టము కూడేరాదు?'' అని విన్నవించెను. ఆగ్రహపరవశుండైయున్న రాజు అతనిమాటయు వినలేదు. "నీకనుభవము చాలదు. వీరు మనకు గొప్ప ఘోరముచేసినారు. ఈ శిక్ష వీరలెల్లరకును గావలసినదే. దయదలంచియే కడమవారినెల్లను మన్నింప బ్రతినగావించినాడను. వీరికిశిక్షతప్పదు'' అని ఖచితముగా బల్కెను.

పాపము వీరలు పైకి ధైర్యమువీడక బింకముగానున్నను మరణమన్న మానవునికి మహాభయంకరమగుట వలన వివర్ణవదనులై, నిశ్చేష్టితులై, నిల్చియుండిరి. అప్పటికప్పుడే యమకింకరులవంటి రాతిగుండెగల తలారులు వారినిరమ్మని లాగుచుండిరి. ఎల్లరు వెలవెలపోవుచుండిరి. రాజును బ్రార్థించుటకు అప్పటి కింకొక వంతుమాత్రము మిగిలియుండెను. వారెవరు? మహారాణిఫిలిప్పా. అక్కడి వ్యవహారములు తననాథున కనుకూలముగా నున్నవని సంతసించి, ఆయనం గలిసి ముచ్చటింపదలంచి, ఆమె యానాడె సేనాశిబిరమునకు వచ్చియుండెను. ఆమె బహు సుగుణవతి, విద్యాఢ్య, సౌందర్యశాలిని, కనికరహృదయ. అవియటులుండ మహాభాగ్యశాలిని. ఆమె యింటకాలుపెట్టినదాదిగా రాజునకు జయపరంపరలు చేకూరుచుండెను. ఈమె యదృష్టముననే నీవెల్లక్రాసు అనుచోటు రాజునకు మహావిజయము గల్గెను. ఈమెభాగ్యముననే స్కాట్లాండు రాజగు రెండవడావీదు రాజుచేతులలో నిర్బంధితుడాయెను. ఇది యంతయు రాజెఱుంగును. ఇప్పుడామె నిండుచూలాలైయుండెను. కావున రాజున కీమెయందు ప్రేమాభిమానములు, గౌరవాదరములు హెచ్చి ఆమెయాజ్ఞ కడుగుదాటక వర్తింపఁజేయుచుండెను. కొంచెము లోనంగూర్చున్న యామె మంత్రుల ప్రార్థనలు కుమారుని విజ్ఞాపనము రాజునిరాకరణము గాంచి, యింక గార్యము లేదని తలంచి, యా వీరుల మొగములగని యూరకుండఁజాలక, చట్టునం దన యాసనమునుండి లేచివచ్చి, భర్తపాదములపై వ్రాలి, నశ్రుజలములచే నాతనిపాదములం దడుపుచు చేతులుజోడించి నమస్కరింపుచు, "ప్రాణేశ్వరా! తమ్మువిడనాడి యుండజాలక కష్టమైనను సరకుసేయక సముద్రముమీద పయనమొనర్చి, వచ్చి, మీయొద్దఁజేరిన ప్రేయసి, అర్థాంగి మీమ్రొక్కవరమడుగ నర్హురాలుకాదా? తెల్పుడు. తాము నాకింత చనవొసంగఁ దగదా? నాయందుఁ దమకు వాస్తవముగా హృదయపూర్వకమగు ప్రేమానురాగము లున్నయెడల నా ముద్దుదీర్చి, నా ప్రార్థన మన్నించి, సర్వభూతదయాపరుఁడగు నీశ్వరునిందలంచి, వారిమోముగాంచి, క్రోధముమానుడు. ఆ యార్వురు వీరులపై కనికరమువహింపుడు. క్షమించి విడువుడు. మనకందువలన శ్రేయమొనగూడగలదు." అని జాలి గొల్పునటుల వినయవిధేయతలతో, చాతుర్యము మెరయ బ్రతిమాలుకొనెను.

ఎడ్వర్డు యేమిచేయుటకుంగానక ఎదురాడఁజాలక, నిరాకరింపనేరక, యూరక కొంతసేపు మౌనము దాల్చి, క్రోధమెల్ల నడంచికొని, తుదకు సీత్కారముగావించి. "ప్రేయసీ! నీవు నేడిక్కడికేల వచ్చితివి? మంచిసమయమున కిక్కడ నుంటివే, యెంతపని వచ్చెను? ఏమనవలయును? నీవు కోరనేకోరవు. కోరినకోరిక ఒక్కటియు నెట్లు కాదందును? నిండుచూలాలవు. నీవిట్టి ఘోరప్రదర్శనములు గాంచరాదు. వినరాదు. ఇక నీడెందమందే బెంగయే నాటుకొనును. ఏమిచేతును? ఈ ద్రోహులను నీస్వాధీనముచేయుచున్నాను. యిష్టమువచ్చినట్లుచేయుము.'' అని విధిలేకపలికెను. సభవారెల్లరు నాశ్చర్యసంభ్రమములతో "భళీ! కీపీ!" యనిమెచ్చి యానందాశ్రులు రాల్చిరి.

దయాస్వరూపిణియగు ఫిలిప్పారాణి తనకు పెన్నిధి దొరికినటుల నుప్పొంగి, వారిం దన వైపునకుం దెప్పించి, "మీరు హంతకులా? దారిదోపుడుగాండ్రా? వారి దేశమును గాపాడుకొనుటకు నిల్చిపోరిన శూరులు; దేశరక్షణమునకై ప్రాణము లర్పింపవచ్చిన వీరులు; వీరికి గౌరవముజూపి, సన్మానించి పంపవలెను." అని అవమానసూచకముగా వికారముగా గప్పట్టు వారివేషములు తీసివేయించి క్రొత్తవస్త్రములు గానుకజేసి, బహుమానమొసంగి వారి దేశాభిమానమును సాహసధైర్యములను మిక్కిలికొనియాడి వారు చేయుపాయమును గాకుండ వారినగరమున దిగవిడిచి యిమ్మని యోధులసాయమిచ్చి, పంపివైచెను. ఆ వీరులు రాణి దయార్ద్రచిత్తమునకు సంతసించి, తమకు ప్రాణరక్షణ మొసర్చిన యమ్మహిళామణి పాదములకు నమస్కరించి వెడలిపోయిరి. స్వపుర రక్షణమునకై ప్రాణములర్పింపఁబూనిన ఆ త్యాగమూర్తులయొక్కయు, వారి శిరఃఖండనము దప్పించి ప్రాణ రక్షణ మొసర్చిన ఫిలిప్పారాణియొక్కయు సచ్చరిత్రము గ్రంథస్థమై, ఆయాదేశచరిత్రములందు వెలయుచున్నది.

అగుచు. సహధర్మచారిణియై మగని యదార్థప్రేమకు నాస్పదమైన లలనామణి హృదయపూర్వకముగా యత్నించి చాతుర్యముతో, జాలిగొల్పునటుల ప్రార్థించినచో సందర్భముగా సహజకోమలవాక్కులు పల్కుచో, రాజాధిరాజగుంగాక క్రూరాతిక్రూరుడగుంగాక ఆమె యనునయములకు లొంగనివాడు లోకమునందుండబోడు.

# సాధ్వి

మద్దూరి గణేశ్వర శాస్త్రిగారు

వేదములు నాల్గు నేర్చిన విప్రుడొకడు
తనదుసాధ్వినిగూడి సంతసముతోడ
స్నానసంధ్యాదినిష్ఠల జన్నములను
గౌరవంబుగఁ గాలంబు గడపుచుండె.
ఒక్కడగు ముద్దుబాలకు నొక్కరేయి
మార్గశిరమాస మగుటచే మంచుకురియ
చలికి నోర్వఁగలేడని సారసాక్షి
మంచముదిగువ కుంపటి నుంచి పిదప
అలసియున్నట్టి పతికి దా నాదరమున
బాదముల నొత్తుచుండగ బావకుండు
భర్తృసౌఖ్యము జూచి తా బట్టలేని
యీర్ష్యచేనన కాంతిని నినుమడించె.
ఆగ్రహము జెందియుండిన యగ్గివేల్పు
కన్నులోయన కుంపటి నున్ననిప్పు
లెట్టబారెను శయ్యయు నెట్టబారె.
జ్వాలలెగసెను బాలుండు వనటఁబొందె
అంకమున శీర్షముంచిన యాత్మనాథు
మేలునిద్ర నెఱిఁగి సాధ్వి మిన్నకుండె—
శాపభీతిని యాసాధ్వి శక్తినెరిగి
చందనము భంగి వహ్నియు చల్లబడియె

# సుశీల

ముద్దా విశ్వనాథము గారు

అనగ ననగ నొకదేశమున గొప్ప విద్వాంసుఁడగు రాజప్పుడే రాజ్యలక్ష్మిని చేకొనెను. కాలము గడచుచుండెను. కాని యాతఁడు వివాహ మాడడయ్యె. ఇతని తద నంతరము యువరాజవసరమగుటచే ప్రజలతని పరిణయమును గురించి యాతురత పడు చుండిరి. కడ కతనిని బలవంత పెట్టఁజొచ్చిరి. రాణిని యెన్నుకొను విషయమతని యిష్టము నకు వదలినచో 'నటులనే' యనెను. రాజు యభీష్టమునకు వల్లెయననిచో ఆ జన్మాంతము బ్రహ్మచారిగనే యుండునను భీతిచే ప్రజలు వెంటనే తమ సమ్మతిఁ దెల్పిరి. అంత తన పరిచారకులను, ఉద్యోగీయులను పిలువనంపి, అతివైభవముగ వివాహ మహోత్సవ సంరంభమునకు వలయు ఏర్పాట్లు చేయుమని రాజుత్తరువు చేసెను.

ఉచితరీతిని సన్నాహములు గావింపఁబడెను. నిర్ణయింపఁబడిన ముహూర్తదినమున పటాలములు తయారుగ నుండెను. ఎల్లరును మిక్కిలి యానందమగు దుస్తు లలంకరించు కొనిరి. భటులు సగముమంది ముందు, మిగతవారు వెనుక బారులుతీఱి నడచు చుండ, రాజు వారలనడుమ నత్యంతవైభవముగ నంబారిలో నూరేగుచుండెను. క్రమ ముగ దట్టమైన యగాధమగు నరణ్యముల నుత్సవము దాటుచుండె. సరియైన దారికాక, రాజాజ్ఞాపించినటులెల్ల ప్రజలు నడచుచుండిరి. రాజుచేష్టకు ప్రజ లమితముగ విస్మయ మంది, యిట్లనుకొనసాగిరి, "ఏమిది? రాజేమిచేయనున్నాడు? రాలురప్పలను వివాహ మాడునా? సరస్సులను పరిణయ మాడునా?" ఇట్లు వెళ్లి వెళ్లి తుదకొక కుటీరము దరికి చేరిరి. ఇచట నిర్మలమగు సరోవరమున్నది. గట్టున పెద్ద వృక్షములుగలవు. చెట్టు కొమ్మల నొక యూయెల యమర్పఁబడి, అందొక వృద్ధుఁడు విశ్రమించియుండె. అంత ప్రేక్షకులు "రాజీముసలివానిని పెండ్లిచేసికొనునా?" యని వితర్కింపఁజొచ్చిరి. ఉత్త రువు చొప్పున సేన యక్కడ విడిదిచేసెను. తక్షణమే యొక రూపలావణ్యవతి యగు నారీమణి తన తండ్రి (వృద్ధుఁడు) పండుకొనియున్న ఊయెల నూపుచుండుట ప్రజలుఁగనిరి.

రాజ్యభారము వహింపక పూర్వము మన రాజనేకపర్యాయము లీయడవికి వచ్చియుండెను. ఆ బాలిక సద్ధర్మానుచరణము పలుసారులు విలోకించెను. ఆమె తన తండ్రి కతిశ్రద్ధాభక్తులతో నుదకము తెచ్చి, స్నానముచేయించి, ఫలాహారము లొన గూర్చుచుండెను. అతనికి సమస్తోపచారములు చేయుచుండెను. తెలివిలేకుండ నింతపని చక్కబెట్టుచున్నను, విసుగన్నమాట యెఱుగక, సదా మిక్కిలి సంతోషదాయకముగను, కోకిలవలె నుత్సాహపూరితముగను ఉండును. ఆపెయొక్క యీ సుగుణపుంజమే రాజు మనము నాకర్షించినది. వివాహసమస్యయే ఆచరణకు వచ్చునెడ నీకన్నెను తప్ప మఱెవ్వరిని వరింపనని రాజు శపథము చేసికొనెను. తమ గుమ్మముప్రక్క నిదివరలో తఱుచు సంభారము గావించుచువచ్చిన యతఁడీరాజేయని గుర్తెఱుఁగక, ఆపెకీ యట్టహాసమంతయు వింతగఁదోప, "ఇదియంతయు నేమ"ని తండ్రి నడిగెను. "ఈతఁడు వివాహమాడుటకై దూరదేశము పోవుచున్న వరుఁడ"ని వృద్ధుఁ డుత్తరమిచ్చె.

అంత నా రాజు గజముపైనుండి డిగ్గి, వృద్ధునికి సాష్టాంగపడగ నతఁడు "ఏమి వలయును నీకు నాయనా?" యని ప్రశ్నించెను రాజు ముఖము వికాసము చెందెను. "నన్ను మీ యల్లునిగ చేసికొనఁ గోరెద"ననెను. ఈ మాట వినినంతనే వృద్ధుని సంతోషమునకు మేరలేదు. "నీవు పొరఁబడు చుంటివి, రాజా! మాబోటి బీదలతో నెట్లు వియ్యమందెదవు? మేము నిరుపేదలము." అని వాక్రుచ్చె. అంత రాజాతనికుమార్తెనే వరించి యుంటిననెను. "అటులైనచో నా పుత్రిక నీ సొమ్మే" యని వృద్ధుఁడు సమ్మతించె. ఈ వృద్ధుఁడు వేదాంతియగు సన్న్యాసి. కూతునకు చిన్నతనముననే చక్కఁగ జ్ఞానబోధఁ జేసియుండె. అల్లున కాశీర్వచనము తప్ప కట్నములేవియు నివ్వలేనని యతి వల్కెను. అపుడు రాజమూల్యములగు దుస్తులా కన్యక కివ్వగా నామె ధరించెను. కాని యాపె రాజువద్దకు రిక్తహస్తములతో వెళ్లలేదు. కట్నము తెచ్చెను. ఏమాకట్నము? తన నగలు దాచుకొనుటకై రాజిచ్చిన పెట్టెల నొకదానిలో తన పూర్వపు చింపిబట్టలు భద్రపఱిచెను. వృద్ధసన్న్యాసి సంరక్షణకొఱకై యొక పరిచారకుఁడు రాజానుమతిని నియమింపఁబడెను. అంత రాణితో బయలుదేఱి రాజాయరణ్యములు వీడి తన భవనము జేరెను.

మొదట కొంతకాలము వఱకు నీహీనజాతి కన్యను రాణిగా గైకొనుట, రాజాస్థానములోని యుద్యోగులెవ్వరికిని సమ్మతి లేకుండెను. వారలు తమతమ కూతుళ్లను, మేనకోడళ్లను రాజున కిచ్చి వివాహము చేతమను యూహతోనుండిరి. కావున రాణిపై

మిక్కిలి యసూయ వెళ్లగక్కుచుండిరి. గొప్పయుద్యోగస్థు లీపేదబాలిక నెట్లాహ్వానించుట? కాని, రాణి తన మృదుస్వభావముచేతను, మర్యాదపూర్వకమగు కృత్యములచేతను, సత్ప్రవర్తనచేతను యందఱు మెప్పుఁబడయుచుండెను. రానురాను యెల్లరు నామెను మిక్కిలి ప్రేమించుచువచ్చిరి. ఆమె యెల్లప్పుడు శాంతియుతమగు చల్లని మనస్సుతో నుండును. ఎవ్విషయమునను, ఎట్టి పరిస్థితియందును కోపము తెచ్చుకొని కొరకొరలాడి యెఱుఁగదు.

ఇటుల నొకసంవత్సరము కడచినతరి యామె కొకస్త్రీశిశువు కలిగెను. మిక్కిలి చక్కని బిడ్డ! ఆ సమయమున రాణి, రాజుల యుత్సాహము చెప్పుట కెవరికిసాధ్యము?

బిడ్డకు నాలుగైదు వత్సరములు గడచిన పిమ్మట ఒకనాడు రాణితో "మన రాజ్యమున ఒకవిప్లవము బయలుదేఱ నున్నద"ని భర్త చెప్పెను. "ఇట్టియవస్థ కలుగుటకు గతంబే?"మని రాణి పృచ్ఛించెను. అందుల కాతఁ డిట్లు ప్రత్యుత్తర మొసఁగె. "నిన్ను నేనుపరిణయమగుట నాయాస్థానోద్యోగీయుల కసూయకు కారణంబయ్యె. తల్లివైపు హీనజాతియగుటచే మనపుత్రి రాజ్యార్హురాలగుట వారల కేహ్యముగనున్నది. వారలలో నెవరి పిల్లనైన దత్తత చేసికొనవలెనని వారినిర్బంధము. ఈ విషయమై కుమార్తె పెరిగి పెద్దదైనపుడు చాలచిక్కులు వచ్చును. కాన తరిచితరిచి ఆలోచించిన కొలదిని పరిస్థితులఁబట్టి పిల్లను చంపించుట యుత్తమముగ కన్పట్టుచున్నది." అంత మన రాణి—సుశీల—తన భర్తపైనుండు నిశ్చితమగు ప్రేమయు, విధికర్తవ్యమును యుట్టిపడు నట్టి యీ క్రింది జవాబుచెప్పెను. "రాజా! నాకు మొదటినుండియు రాజ్యాభిలాషగాని, స్వలాభాపేక్షగాని యణుమాత్రమును లేదను యంశము నీకు విశదమే కదా? నా శరీరమును, మనస్సును నీ యాత్మలో నంతర్భూతమైనవి. నీ కెంతవఱకు నే నుపయోగకరముగ నుందునో యంతవఱకే నన్ను వినియోగింపుము. తమకెవ్విధమునను నే నడ్డురాను. కూతురను తొలఁగించుటే మీయభీష్టమగుచో నటులనే గానిండు. 'ఆమె నా కూతురని' నేనెప్పుడునుఁ దలఁచియుండలేదు." సరే! యర్ధరాత్రమున తలారులువచ్చి రాజుగారి పుత్రికను ఖండించుటకై తీసికొనిపోయిరి. ఈ వార్త రాజు భార్య కెఱిఁగించెను. రాణియు మిక్కిలి కుతూహలముతో, నిశ్చలమనముతో, నేమియు జరుగనట్లే యుండెను. ఇదియే వేదాంతము. ఎటువంటి ఐహికబాధలు వచ్చినను మనస్సు చలింపఁ గూడదు.

అంతరాజు "యికమీఁద నెల్లరును సంతోషించెద"ననెను. మఱొక వత్సరము కడచిన వెనుక రాణికి పుత్రజననమాయెను. బాలున కైదారు వత్సరముల ప్రాయము

రాగానే తిరిగి దేశములో సంక్షోభముకలిగెను. ఈ పరిస్థితులు రాణితో చెప్పి, యీ పిల్లవానినికూడ మారణము చేయింపవలసిన ఆవశ్యకత రాజు తెలియపఱచెను. సుశీల తన సహజమగు చిఱునవ్వుతో నిట్టులనియె, "నా యాత్మయే రాజ్యము. 'నాది' యను నదేదియు లేదు. భానుడెట్లు కిరణముల ప్రతిఫలాపేక్ష లేక వెదచల్లునో, యటులనే మనమొకరి కెల్లపుడిచ్చుచుండవలెను. అన్యులనుండి మన మెద్దియు కోర నుద్దేశము కూడదు. నా కేభోగములపైన నపేక్ష లేనపుడు సౌఖ్యమునకు కొఱతయేమి? సూర్యుఁ డెల్లప్పుడు వెలుతురు వెదచల్లు చున్నను, యతనికాంతి యణుమాత్రము తగ్గలేదు. అటులనే మన కుఱ్ఱవాఁడు కూడ భానుని కిరణమువలె వెళ్లిపోవుచున్నాఁడు."

ఇటులుండ మఱి కొంతకాలమునకు రాజుకు ద్వితీయపుత్త్రుఁడుకలిగెను. ఆ పిల్లవానికి నాలుగైదు వత్సరములు పచ్చినతోడనే పాపము, పూర్వమువలెనే అతఁడుకూడ ప్రజాభీష్టమున కాహుతియయ్యెను.

ఇట్టి దుర్భరకష్టముల మన సుశీల యెట్లు భరింపఁగల్గుచున్నది? కాపురమునకు వచ్చినదాదిగ, అనుదినము తన బొమ్మరింటికిపోయి, వలువలన్నియు తీసివైచి, యక్కడ దాచియుంచిన తన చింపిగుడ్డలు ధరించి, పూర్వపు స్థితి తలచి, యాత్మానుసంధానము కావించుచుండెను. దైవాంశము తన యంతరాత్మలోఁ గనుచుండును. ఆంగ్లమహాకవి యగు షేక్స్పియరు "కిరీటము ధరించిన తల మిక్కిలి బరువుగ నుండు"నని చెప్పినాఁడు. అనగా రాజునకు బహువిధ క్లేశములనిభావము. కాని, మన సుశీలయో, తాను కొలదికాలము క్రితము సరోవరము యొద్దున చింపిగుడ్డలువేసికొని, యాడుచు పాడుకొనుచుండిన సుశీలనే యనుసంగతి యెప్పుడను మఱచిపోదు. రాణి పదవియందుండియు, నైహిక విషయములలో నిమగ్న కాకపోవుటయే నామెనిరంతర సౌఖ్యానందములకు కారణము. ఆమె కేవిషయమునను ప్రత్యేకాభిమానము లేదు. ఈ పదవికిమించిన యాత్మానుసంధానమే యామె నిత్యతృప్తి. దీనివలననే సుశీల పరిశుద్ధ మనస్కురాలయ్యె. కోరిక యెప్పుఁడుండదో, జీవియప్పుడే సౌఖ్యమొందును. ఇవ్విధముననే రాణి యెల్లపుడును మనోనిశ్చలత్వము నిలపెట్టుకొనసాగెను.

అంత రాజొకరాత్రి యివ్విధమున భార్యతో ప్రసంగించెను. "ప్రేయసీ! ఇట్లు పిల్లలనందఱను చేతులార చంపించుట నాకు మనస్కరింపకున్నది. పసులపిల్లలను దత్తత చేసికొనుటెంతమాత్రము నిష్టములేదు. యోచింపగా, పునర్వివాహముచే దేశములో శాంతి ప్రబలునేమో యని తట్టుచున్న"దనెను. అందులకు సుశీల యణుమాత్రము జంకులేక,

"సరే" యని మనఃపూర్వకముగ సమ్మతించెను. ఆమెకు భర్త, తండ్రి, పిల్లలు—వీరుగాని మరితరులెవ్వరుగాని సౌఖ్యమొసఁగూర్చుటలేదు. తన యాత్మవలననే యామె యానందము నిత్యమును కనుచుండెను. నిష్కల్మషమగు సుశీల ప్రత్యుత్తరమునకు రాజపరిమితముగ సంతసించి, "నీవేమి చేయఁదలచితి"వని ప్రశ్నించెను. అందులకామె "మీ యిష్టమే నా యిష్ట"మనెను. "నీ విచ్చట నుండినయెడల దేశశాంతికి భంగము వాటిల్లును. కనుక ఇటనుండి వెళ్లిపోయిన బాగుండు"నని రాజభిప్రాయము తెల్పెను. తక్షణమే సుశీల యమూల్యాభరణదుకూలములన్నియు విడిచి, తన ప్రాత చింపులఁ గట్టుకొని, యత్యుత్సాహముతో రాజభవనమువీడి, యడవులలో సరస్సుయొద్దనున్న తనజనకుని యొద్దకుఁ బోయెను. వృద్ధుఁడగు తండ్రియు నెంతమాత్రము కినియక నిత్యసంతోషముతో నుండెను. ఇతని వద్ద నియమితుఁడైన రాజభటుఁడు సుశీల వచ్చినవెంటనే తిరిగి తన నౌఖరిలోనికి పోయెను.

ఇట్లుండ నొక దినమున సుశీల నోదార్చుటకుగాను రాజు సన్యాసికుటీరమునకు వెళ్లెను. ఆమె ముఖమున నిసుమంతయు విచార మగపడకపోవుటచే నట్టియవసరము లేకపోయె. "క్రొత్తరాణి నాహ్వానించుటకు వచ్చెదవా?" యని రాజడిగెను. అందులకు సుశీల "తప్పక వచ్చెద"నని చెప్పి యతనితో బయలుదేరి వెళ్లెను. వివాహమునకు వచ్చిన ప్రేక్షకులందరు గగుర్పడునట్టి యద్భుతమగు నేర్పాటులఁగావించెను. అతివైభవముగ వచ్చిన క్రొత్తరాణిని సుశీల అత్యంతప్రేమతో తల్లికంటె నక్కుడుగ కౌగలించుకుని, ముద్దిడి, సత్కరించెను. సభ్యులు క్రొత్తరాణీగారి సౌందర్యాతిశయములు కొనియాడుచుండిరి. అంతకంటె నెక్కువగ మన సుశీలయొక్క నీతిసౌలభ్యము వేనోళ్ల మెచ్చుకొనుచుండిరి.

క్రొత్తరాణి తనతో సిద్ధము సహోదరునిఁదీసికొని వచ్చెను. సుశీల పెత్తనముఁగావింప గొప్పవిందు లాసందర్భమున నేర్పాటుచేయబడియె. సుశీలయొక్క యద్భుతౌదార్యాది సుగుణములు కనుచున్న కొలదిని విందుకువచ్చిన సభ్యుల మనములు కఱఁగి బాష్పములు వ్రాలెను. ఈయుత్సవమంతయు నైనపిదప తిరిగి యామె తనతండ్రివద్దకు అడవులకు పోవలయుఁగదా! సరే, యీవిందుల సందడిని ప్రేక్షకులు తాత్కాలికముగ కలిగిన విచారము మరచి వారల భక్షణకార్యముచూచుకొనుచుండిరి. ఇదియంతయు ముగిసిన పిమ్మట సుశీల, "రాజా! సెలవుదీసికొనెదను. నీకెపుడు నా సేవ కావలసినను యెంతమాత్రము సంశయింపక కబురు పంపు"మని రాజనుజ్ఞ కోరెను. ఈసందర్భమున సభ్యులెల్లరుఁ దమదుష్టప్రవర్తన నెమరుకు తెచ్చుకొని పశ్చాత్తప్తులై హృదయములు

తరుగుకొనిపోవఁ గొల్లున ఏడువసాగిరి. "తల్లీ! నీవు వృద్ధసన్యాసి కుమార్తెవు కావు. దేవాంశసంభూతురాలవు." అని యేకగ్రీవముగ ప్రజలామె నభినందించిరి. అంతధనాంధతచే క్రొవ్వి మత్తెక్కియున్న రాజోద్యోగులు సుశీల తన పుత్రికాపుత్రుల చంపించుట కెటుల నిచ్చగించి దేశశాంతి నెలకొల్పినదియు మొదలగు అంశములు తలపోసిరి. ఈక్రూర వార్తలన్నియు విన్న క్రొత్తరాణి యేడువనారంభించెను. "నీకుమార్తెయు, కుమారులును వధింపఁబడిరా? ఇటువంటి రక్తపాతమగు క్రూరదేశమునకా నేను రాణిగానుండబోవుచున్నా?"నని యనేకవిధముల రాజునునిందించి "నేనిట్టి రాజ్యము నొల్ల"నని క్రొత్తరాణి తిరిగి పోఁబోవుచుండెను. అంతరాజు లేచి యిటులనుడివెను. "ఓరాజకీయోద్యోగప్రముఖులారా! నారీమణులారా! ఇచ్చట సుశీలతప్ప మీారందఱును బొబ్బలువెట్టి యేడ్చుచున్నారలు. నేనును సంతోషముతోను, కొంత విచారముతోను మిశ్రితములైన బాష్పధారలు విడుచుచున్నాను. మిమ్ములనే నిందించుటలేదు. మీారు నాపిల్లలవంటివారు. నానేత్రములు బాష్పధారలచే నిండియున్నవి. విచారముచేకాదు. అమితమగు నుత్సాహముచే గల్గిన బాష్పములు. మీారుకూడ నట్లె యానందబాష్పములు విడువుఁడు."

పిమ్మట రాజు సుశీలవైపు తిరిగి "నీవు యెప్పటివలెనే నిత్యసంతోషవై యుండుము. ఈరాజ్యమంతటిలో సుఖి యెవరన నిన్నుతప్ప పేర్కొనుట కితరులెవ్వరును లే"రనియెను.

మన క్రొత్తరాణి సాటిదేశపు రాజుగారి పెంపుడు కుమారితె. ఆమె సోదరు లిరువురనట్లే యారాజు పెంచెను. ఈదిక్కుమాలిన శిశువులు ముగ్గురి రూపురేఖలుచూచి, ఈ రాజు వారినిఁ బడుటచే వారిని తన స్వంత బిడ్డలవలెనే పెంచెను. చదువరులారా! వీరలు ముప్వురు నిశ్చయముగ నెవరో మీామానసముల గోచరమైనదా? క్రొత్తరాణి మన సుశీల కుమారితయే. రాజపుత్రు లిరువురు సుశీల ప్రియపుత్రులే. చిన్నిబిడ్డలను చంపుటకు చేతులాడక తలారు లీముగ్గురను జీవముతోనే యడవులలో వదలిపెట్టిరి. ఈ పరిస్థితులన్నియు ప్రజలకు బోధింపఁ బడెను. రాజు ప్రజాభీష్టము నెఱవేర్చుటకు తన కుమారితెనే తాఁబెండ్లియాడునా? కాన మన సుశీలయే తిరిగి రాణిగ నుండె. ఆమె పిల్లలే రాజ్యార్హులై పట్టముగట్టుకొనిరి. ఈవింతచూడ ప్రజ లానందనిమగ్నులైరి. చూచితిరా! భగవంతుఁడెంత కృతజ్ఞుఁడో! ఆయీశ్వరుఁడు తన యప్పులను వడ్డితోసహా తీర్చుకొనును.

5

స్త్రీరత్నములారా! మీ ప్రేమతత్త్వ మిట్టి నిజరూపము దాల్చుటకు యత్నింపుడు. పతివ్రతలన నిట్టివారే. ఇదేరీతిగ తన భార్యయందు దివ్యత్వము కనుఁగొనిన పురుషుఁడే పత్నీవ్రతుఁడనఁదగు. స్త్రీ తనభౌతికశరీరము, సూక్ష్మదేహమనఁబడు నాత్మయు భర్త కర్పింప కలిగినపుడే యామె నిజమైనభార్య. భార్యాభర్త లిరువురలోను స్వలాభాపేక్ష గర్హ్యముకాదు. అగ్నిహోత్రసాక్షిగ పరిణయ మాడుటలో ఒకరిహస్తము లొకరు పట్టుకొని యుభయులును తమలో నిమిడియున్న దివ్యత్వముఁ గనుఁగొనుటయే ముఖ్యాంశము. సుశీలయెట్లు ఐహికభోగములఁదగుల్కొనక తన కర్తవ్యము నిర్వహించుకొనెనో పాఠకులు గమనింపదగును.

భార్యాభర్త లిరువురు నొకరిలోని దివ్యత్వము నొకరు కనుగొనుటకు పూనిన యెడల సంసారము సుఖభాజనముగాక తప్పదు. ఇదియే నిజమగు ప్రేమతత్త్వము. సంసారజీవితమున సుఖమొనఁగూర్చున దిదియే. (శ్రీస్వామిరామతీర్థ)

# సౌందర్యప్రతిమ

పెమ్మరాజు రాజగోపాలము గారు బి. ఏ. సారస్వతసమాజము

మిలమిలకాంతులన్ జిలుకు మేని సువర్ణమరీచికావళీ
చలనము మార్గమందొలయ స్వర్ణమయూఖిని యీమె యెవ్వరో
సలలితగీతికాగమనసంపద వచ్చుచునున్న దీకెలం
కుల నిదె డాయ నాహ్లాదమకూలము దూయగ భావవాహినుల్.

శారదకౌముదీరజని చల్లగవచ్చి గ్రమించు స్వాప్నికా
కారమువోలె చిత్రముగ కన్నులపండువజేసి యింతలో
దారిని సాగినావె వనితా! మెలమెల్ల ప్రశాంతవాహినీ
నీరము బాఱుతీరుగను నీదు మనోహరరూపమేగెనన్.

స్వర్ణకాంతిని క్షణమాగు సంజరీతి
లలితగతి వీచి చను పరిమళమువోలె
ఒక్కసారిగ మనసును నోలలార్చి
సంతసంబున నేగె నీకాంత యెవరొ?

ఆమె వచ్చుట యేగుట లరయ నాకు
మధురమధురమా గతము నెమ్మదికిదట్టి
నటులదోచును; డెందాన నామె ఛాయ
అస్ఫుటంబుగ సంచార మాచరించు.

# వరశుల్కము

## శ్రీమతి కొంగర అన్నపూర్ణమ్మగారు

మిగుల క్రూరమైన సాంఘికదురాచారములలో వరశుల్కమును నదొకటి. ఇయ్యది కొలదివర్షముల క్రిందట యేకొలదిజాతులయందు మాత్రమే యుండుచు కాలక్రమాగతిని ప్రస్తుతము సర్వవర్ణములయందు పొడ సూపినది. అనేకకష్టములకోర్చియు తగిన ఫలసాయమును బొందలేక సగటున రాబడికన్న మించి ఋణముల పాలయిన ఆంధ్రదేశపు రైతుసోదరులలో ముఖ్యముగా కొన్నికులములను పిప్పిజేయుచున్న ఈ వరశుల్కమును గురించి విచారపడని వారుండరు.

పూర్వకాలమునం దీ వరశుల్కమనున దేలేదు. వరశుల్కమను పల్కునుగూడ నెవరును వినికని యుండరు. పురాణాదులయందుగాని చరిత్రలయందుగాని వరశుల్కమునిచ్చి వివాహము లొనరించినట్లు వ్రాయబడియుండలేదు. వివాహసమయమునందు తమ కన్యలకు బుద్ధిపూర్వకముగ కన్యాదానముతో సహా గోభూహిరణ్య దానముల నిచ్చుచుండిరేగాని కన్యాదానమున అల్లుని కొనుటయని యర్థముగానుండలేదు. ఆడబిడ్డలు గల్గిరని వినగానే ఇరువంశములు తరింపజేయ జన్మించినదని తలంచి తగిన విద్యాబుద్ధులుగఱపి

కం॥ శ్రీయును కులమును రూపును
ప్రాయము శుభలక్షణంబు బాంధవ విద్యా
శ్రేయబు గలవరుని క
న్యాయుతుగా జేయువలయు నధికప్రీతిన్

అను నార్యుల వచనము ననుసరించి దీర్ఘముగా నాలోచించి అట్టి తగిన వరునకిచ్చి యుద్వాహ మొనరించుచుండిరి. కన్యాన్వేషణవిషయములో గూడ పైసూక్తి ననుసరించుచుండిరి. ఇప్పుడన్ననో అట్టినియమము లేవియు అవసరములేదు. వివాహము ధర్మార్థకామమోక్షచతుర్విధఫలసిద్ధికని శృతిస్మృతులు బల్కుచుండ ప్రస్తుతవివాహము కేవలము ద్రవ్యప్రధానమై యున్నది.

మామగారు అల్లున కెంత కట్నమివ్వగలరు అనునదియే మొదటిప్రశ్న. పిల్లవాని విద్యాబుద్ధులతో పనిలేదు. తలిదండ్రులకు పిల్లవాడు స్కూలుఫైనల్ ప్యాసుచేసిన తోడనే కన్యాన్వేషణము చేయ మొదలిడుదురు. ఎవరెంత కట్నమివ్వగలరో యని విచారించుట జరుగుచున్నది. యఫ్. ఏ. కు 5000-0-0 లు; బి. ఏ. కు 10000-0-0 లు. సంతలో పశువుల బేరమాడునట్లు తాము గన్నకుమారులను కడునీచమైన కట్నమను నెపమున శుల్కమున కమ్ముచు నుద్వాహము గావించుచున్నారు. ఇందులో బేరములు. పైపాటలతో దలారులు వరాన్వేషణకై బయలుదేరుదురు.

కడుపేదలకు తనయగల్గిన కష్టము లేకనే వివాహము జరుగుచున్నది. ధనవంతునకు కుమార్తె గల్గిన వేనకు వేలు వరశుల్కమిచ్చి అల్లునిగొని వివాహము చేయుచున్నారు. సామాన్యగృహస్థున కొక కొమరిత యుదయించినదన్నతోడనే సంతసించుటకు మారుగ ప్రాణాపాయము సంభవించినట్లుగనో ఘాతుకమృగము చెంత నున్నట్లుగనో భావించి నిరంతరము శోకవహ్నిచే క్రాగుచుండుట వరశుల్కమూలముననే.

ప్రస్తుతము విద్య జ్ఞానము కొఱకుగాదు. వివాహముకొఱకు. కట్నములకొఱకు. కాన వివాహముకొఱకు తనయులకు చదువుచెప్పించుటలతోనే పిత్రార్జిత ధనమంతయు ఋణములపాలగుచున్నది. వరశుల్కమున కెచటనుండి ధనము లభించును? వరాన్వేషణకే కొంత ధనవ్యయ మగును. మీకన్యకు సంస్కృతాంధ్రాంగ్ల సంగీతములయందు చక్కని పాండిత్యముగలదా? యనివరుని ప్రశ్నలు. పుట్టినదాదియు తంటాలుపడియు వరశుల్కమునకే ధనము సేకరింపలేని తలిదండ్రులు విద్యగూడ జెప్పింతురా? స్త్రీ విద్య కిదియొక యాటంకము.

బిడ్డకు పెండ్లి వయసురాగనే తండ్రి చదువుకున్న వరుడెక్కడ దొరకును, శుల్కము నెట్లు సేకరింతును, యీ పిల్లకెప్పు డుద్వాహమొనరించి అత్తవారింటికి బంపుదు నను విచారార్ణవమున శల్యావశిష్టుడై బడికొట్టుకొనుచుండును. వరుని వెదకుటకొక మధ్యవర్తి నేర్పరచును. వరు నెట్లెట్లో వెదకి, కట్న మొప్పుకొని తిరిగి యింటికి వచ్చిన పిమ్మట వరశుల్కముకొరకు ధనము గూర్చు టెట్లని విచార మొందుచు, భార్యమెడలోని వస్తువుల నమ్మియో లేక ఋణములకుపోగా మిగిలినభూమిని తణఖా బెట్టియో ధనము సమకూర్చ వివాహము గాక ముందే అ మధ్యవర్తి తనడబ్బు తనకిచ్చినగాని పెండ్లికుమారుడు వివాహమునకు రాడని భయపెట్టి ధనము లాగుకొనును. ఇక మిగిలినడబ్బు శుల్కమునకు చాలదు. వరుడు వివాహవేదిక నెక్కి, శుల్కమంతయు సంపూర్తిగ నిచ్చినగాని భార్యమెడలో మంగళసూత్రమును ముడివైచనని కూర్చుండును. అప్పుడు వధువు తండ్రి పడునట్టి విచారము వర్ణనాతీతము. పెండ్లిపెద్దలు, మామగారు చెప్పు సానునయవాక్యములచే కొంతదెప్పరిల్లి వరుడు వధువుమెడలో పుస్తె ముడిపెట్టును. పెండ్లితంతు ముగియగానే కట్నమంతయు సంపూర్తిగ నిచ్చినగాని పిల్లను మాయింటికి పంపవద్దు శుల్కమివ్వలేనిచో మేము వేరొక పిల్లను వివాహముజేయ సమకట్టితిమని మాటలను శూలపుపోటులతో నొవ్వనాడుచు వారల వివాహము గావింతురు. సూత్రమును మాత్రము మెడయందు దాల్చిన యారమణి యావజ్జీవము కష్టపరంపరలకు గురియై తన నవశిరీషకుసుమగాత్రము వ్యగ్ని మొందించునది వరశుల్కము మూలముననే గదా?

విద్యాభూషితలగు యువతులు జనకుని కష్టములకాకరమైన దుర్భగజీవితమును చూచి భరింపజాలక తమకురానున్న కష్టములదలంచి నల్గురిలో నొకరము పోయినను జనకునికష్టము కొంత తగ్గునని, వివాహమునకు ముందుగనే మరణించుటయు గలదు. జీవించి సంసారవృక్షమును బెంపజాలిన యా కుసుమకోమలగాత్రలు ఆత్మహత్య మహాపాతకమని తెలిసియు బలవన్మరణమునకు గురియగుచున్నారు. ఇక నల్గురుకుమారితలు గలవారి కష్టములను వ్రాయుట కలవిగాదు.

వధువు తలిదండ్రులు విద్యాధికులకే శుల్కమొసంగుటయు వరుని తలిదండ్రులు తనయుడు విద్యాధికుండైనచో శుల్క మెక్కువ వచ్చునని విద్య చెప్పించుటయు ప్రస్తుతము జరుగుచున్న ముచ్చట. విద్యాధికులగు పురుషులుగూడ తాము కట్నము పుచ్చుకొనుటయు యిచ్చుటయుగూడ గౌరవముగ భావించుచున్నారు.

## "స్త్రీవిత్త మధమాధమమ్"

అనునీతి వాక్యము నేల విద్యార్థులు విశ్వసింపరు? వరునకు వధువుయొక్క పిత్రార్జితధనము చేకూరిన వానియంత అదృష్టవంతుడు లేడనియు తనకట్టి యదృష్టము పట్టునాయనియు లేదేని పెద్ద మొత్తమును కట్నము దెచ్చుభార్యనుగాని వివాహమాడననియు ఇత్యాదులగు చెడ్డతలంపులతో ఈ కాలమున విద్యార్థులగు వారేయున్నారు. విద్యార్థులగు భర్త లభించి తన కుమారి సౌఖ్యమందుననియు జామాత ఉద్యోగములో నున్న జూచి సంతస మొందవలెననియు కన్యయొక్క జననీజనకులు తలంచి వరాన్వేషణ మొనరించుటయు వరుని తలిదండ్రులును పిల్లనిచ్చెదమని సమాచారముల నంపిన కొలది కట్నములను పెంపజూచుటయు జరుగుచున్నవి.

నిరుద్యోగసమస్య తీవ్రముగ వ్యాపించియున్న హిందూదేశమందు ఇప్పుడు ఉద్యోగములు లభించుట దుర్లభముగానున్నది. పిత్రార్జిత ధనమంతయు ఐహికాముష్మికదూరమైన యీ ఆంగ్లవిద్యకే సమర్పితము. విద్యార్థులుండని యిచ్చిన (పుచ్చుకొనిన) ధనమంతయు హూణభాషాభ్యాసకులగు నవయువకులు డాంబికముగ కాలమును జరుపనెంచుటతో సరి. కొందఱు తలిదండ్రులు కుమారులు చదివి ఉద్యోగమును జేతురనుతలపుతో మడిమాన్యములనమ్మి విద్యచెప్పించి కడునిడుమలపాలై "భవతి భిక్షాందేహి" యనుటకు సిద్ధపడుచున్నారో? ఎందరుజనకులు తమకుమార్తెలను మితిమీరిన వరశుల్కమును ఈ నిరర్థకమైన హూణభాషకు ధారవోయుచున్నారో? ఊహింపరానున్నది. ఇక స్త్రీలన్నచో పురుషులకు చేదోడువాదోడు అగుటకుమారుగ అమ్మాయికి నగలు కావలెననియు, శుల్కమెక్కువయిచ్చి విద్యార్థులుండగు వరుని తేవలెననియు, నిరంతరము గొణుగుచు సణుగుచు పురుషులను మరింత చీకాకు నొందించుచుందురు. స్త్రీవిద్య లేమిచే గల్గు అనర్థంబులివియే.

బ్రాహ్మణులన్నచో తమకుమార్తెలను ముదుసలులకు విక్రయించుచున్నారు. నాల్గుసంవత్సరములున్న రూ. 400-0-0 కు అమ్మెదరు. అట్లు యెనిమిది సంవత్సరములలోపు యెన్ని సంవత్సరములున్న అన్నివందలు. కన్యాశుల్కమును దీసికొని బిడ్డలను విక్రయించి తమగర్భశుక్తిముక్తాఫలంబు లనదగు పుత్రికారత్నములను కడు నిడుమల పాలొనరించుచున్నారు. బాల్యవివాహనిషేధచట్టము మనములలోనికి రాగనే కన్యాశుల్క మడగునేమో కాని యీవరశుల్కము మాత్రము నిలిచియే యుండును. దీనిని నిర్మూలించుటకు మార్గము లన్వేషింప వలసియున్నది.

# తులసీదళము

### నరసింగోలు కృష్ణారావుగారు

మశకబాధ లడంప మంచి మందులసంచి శ్రీకరముగు తులసీదళంబు
శ్రీహరి నర్చింప చెడుగుల దొలగింప శ్రేష్ఠమైనది తులసీదళంబు
రోగము శమియింప రాగము లభియింప చేతికద్దము తులసీదళంబు
సకలనారీజనసామ్రాజ్య మకుటంబు చిత్తమోదము తులసీదళంబు

మున్ను వెన్నుని నారదమునికొసంగి
వెనుక చింతించు సత్యను కనికరించి
తులను నెలకొని రుక్మిణీ నెలతవలన
సేవకొనినది శ్రీ తులసీదళంబు.

— (స్వతంత్ర).

# ఇది యశాస్త్రీయమా?

శ్రీమతి పెద్దాడ కామేశ్వరమ్మగారు బి. యే.

౧

పేరు భానుమతి. కాని కళలుతప్పి మేఘముచే కప్పబడిన భానుని పగిది నున్నది. ఈమె కిప్పుడు పదునెనిమిది సంవత్సరములు. చిన్నతనముననే భానుమతికి వివాహము మాత్రముచేసి తల్లిదండ్రులు పరలోకమునకు తరలి పోయిరి. అక్కగారును, అన్నగారును ఆమె కిప్పుడు దిక్కు. అన్నగారు హిందూమతమును, హిందూదేశమును వీడి బౌద్ధమతమును స్వీకరించి సింహళద్వీపమున జీవించుచున్నాడు. ఆకారణమున భానుమతి తప్పనిసరిగా అక్కగారి అండకు చేరవలసి వచ్చినది. అక్కమొగుడు అంత ధనవంతుడు కాడు. పొయ్యిమీద కుండఎక్కడమే కష్టముగాఉన్నది. మంచివాడు కాబట్టి భానుమతిని కడుపులో పెట్టుకొన్నాడు. ఆమెకు విద్యాబుద్ధులు చెప్పించి గొప్పదానినిగా చేయవలెనని ఆతనికి సంకల్పమున్నను సమర్థతలేదు. కాబట్టి ఈమె వారింట పనిచేయుట వారీమెకు పట్టెడన్నము పెట్టుట. ఇట్లు దినములు గడచిపోవుచున్నవి. గడచిపోవుటలో సభ్యతకు కొంతభంగము కల్గుటమాత్రము లేకపోలేదు. కాకులవంటిలోకులు ఆమె భర్తనుగూర్చి ప్రశ్నింప నారంభించిరి. ఆమెకు భర్తఉండెనా? లేడా? అను మీమాంస చేయజొచ్చిరి.



పెద్దాడ కామేశ్వరమ్మగారు

౨

నిజమునకు భానుమతికి భర్తఉన్నాడు. జ్ఞానమువచ్చిన తరువాత ఆమె భర్త మొగముచూచి యుండలేదు. కట్టుకున్నభార్యకు దర్శనమిచ్చుటకు ఆమెభర్తకుకూడ తలంపులేక పోయినది కాబోలును. ఇంతకును ఆతనికి ఈమెమీద ఇష్టములేదా? ఇష్టము లేనట్లె కనిపించుచున్నది. భానుమతి బావగారికి అతడొకసారి హఠాత్తుగ కనిపించినాడు. ఈవిషయమై ప్రశ్నింపగా మొగము చిట్లించుకొన్నాడు. అనిష్టత సూచించు పలుకులెన్నో పలికినాడు. ఇక నామెకు గతియేమి అని భానుమతి బావగారు ఆమె భర్తను ప్రశ్నించినాడు. "ఆమె దిక్కున నామనము ప్రేమపరీతముకాలేదు. కాదుకూడ. వలయుచో ఆమె తిరిగి వివాహము చేసికొనవచ్చును. ఇదే నాఅనుజ్ఞాపత్రమిచ్చుచున్నాను." అని భాను

మతి భర్త బదులుపలికెను. హీనముఖమున ఈవార్త నాలించి ఆశాలేశము అడగారి పోవగా భానుమతి శూన్యహృదయముతో గోడకు జేరబడియెను.

3

భానుమతి అక్కగారికి ప్రబలరోగము ప్రాప్తించెను. అన్నగోపాలరావుని చూడ వలయునని చెప్పెను. టెలిగ్రాము ఇచ్చిరి. సింహళమునుండి ఆతడువచ్చెను. ఆతడు వచ్చిన తోడనే జెంగతీరిమో యేమో భానుమతి అక్కగారికి క్రమముగా ఆరోగ్యము కల్గెను. ఆరోగ్యమును కోల్కొని ఆమె భానుమతి భవితవ్యమును గూర్చి అన్నతో ఆలోచించెను. ఆతడామెను తనతో తీసికొని పోవుటకు ఉబలాటపడెను. ప్రయాణ సన్నాహములు తీరినవి. పోవుటకు ముందు గోపాలరావు భానుమతి భర్తదగ్గఱనుంచి ఆమె తిరిగి వివాహము చేసికొనుట ఆతనికి సమ్మతమని పత్రమువ్రాయించి పుచ్చుకొనెను. సోదరీద్వితీయుడై గోపాలరావు సింహళము చేరెను.

४

గోపాలరావు:—భానూ! నీవేమి చేసెదవమ్మా? స్కూలుకు పోలేనంటున్నావు. చదువు కొనుటకు వయస్సుమీఱడమేమి? ఇంతకును నీకేదో జీవనోపాధియుండ వలెను గదా? ఎల్లకాలము నేను మాత్రము శాశ్వతమా? నీవిట్లు సర్వదావిచార గ్రస్తవై యుండుటకన్న తిరిగి వివాహముచేసికొనుట మంచిదికాదా?

భానుమతి:—అన్నయ్యా! ఎంతమాటంటివి. హిందూస్త్రీనగు నేను పునర్వివాహ మెట్లొనర్చు కొనగలను. హిందూస్త్రీ పుట్టునదొకసారి. పెండ్లాడునదొక్కసారి. మరణించునదొక్కసారి. పాతివ్రత్యమునకు అతిలోకమైన మన్ననలగన్న హిందూ జాతియందు ఆవిర్భూతనైన నేను తిరిగి వివాహము ఆడుట ధర్మవిరుద్ధముకాదా?

గోపాలరావు:—చెల్లీ! నీవు చాల అజ్ఞానదశలో నున్నావు. మన స్త్రీలకుగాని పురుషులకు గాని తగినంత విద్యలేకపోవుటచే నూతనభావములు కలుగకున్నవి. శాస్త్ర ములకేమి? వానిని భగవంతుడు వ్రాయలేదుగదా! ఆయాకాలముల కను గుణ్యముగ మనుష్యులే వానిని వ్రాసిరి. అవి మనుష్యునకొఱకు వ్రాయబడి నవి గాని వానికొఱకు మనుష్యుడుగాడు. అయినను వానిని బాగుగ చదివి అందలి అంతరార్థమును గ్రహించిన మహాశయులెవ్వరు? నీవిట్టి దుర్గతికి పాలై యుండుట ఏశాస్త్రప్రకారము ధర్మమగును? 'నాకీభార్య అక్కరలేదు.' అని భర్తవిసర్జింపగా—అన్యాయముగ, అకారణముగ విసర్జింపగా—ఆస్త్రీ తిరిగి

వివాహమాడుట ఏశాస్త్రప్రకారము నిషిద్ధమగును? కాబట్టి ఇందు ధర్మాతి రేక మేమియు లేదు. నీవేమియు జంకవద్దు. భయపడవద్దు. నామిత్రులలో మంచి వాని నొకని వరించి సుఖియింపుము.

భానుమతి:—అన్నా! నాకు నోరుతాళము వేసికొని పోయినది. నీవుచెప్పినది వినజాలను. పునర్వివాహపు తలంపు మనమున నెల కొల్పుటయే పాపమని భావింతును. నాకెన్నడును తిరిగి వివాహమాడవలయునను తలంపు కలుగనే లేదు. అయినప్పటికి అక్కగారి యూరిలోని జనులు నన్నుగూర్చి పలువిధములగు దుర్భాషలాడుచుండెడివారు. అవి నాచెవులకు చేరినపుడు ఒళ్లు రణకంపర మెత్తెడిది. ఏడ్చెడి దానను. దానికేమిగాని అన్నా? తిరిగి వివాహముచేసికొనినచో నన్నందఱును ఆడిపోయరా?

గోపాలుడు.—అమ్మాయీ! ఈప్రపంచమున నందఱిని మెప్పించుటయు—తుదకు నొప్పింపకనైన నుండుటయు నెవరికిని తరముగాదు. ఈ ప్రపంచమున సుఖముగా జీవించుటకు నీకుహక్కుగలదు. పురుషు లెంతమట్టుకు వారి స్వలాభము చూచుకొనుటయేగాని స్త్రీలకష్టములను తొలగించుటకు ఎక్కువ ప్రయత్నము చేయరు. శాస్త్రములు వారికెక్కువ యనుకూలములుగానున్నవి. అందుచే వారికే బాధలు తెలియవు. నీవు పునర్వివాహమునకు అంగీకరించి ఆచరించినచో నీవలె బాధపడుచు కోటానకోట్లుగనున్న భారత స్త్రీలకందఱకు మార్గముచూపిన దానవగుదువు. కావున తప్పక నీవు తిరిగి వివాహమాడుము.

×

కొన్నిదినములకు భానుమతి పూర్ణభాను తేజముగలిగి యొకయువకునితో నొకనాటి సాయంకాలము సముద్రపు టొడ్డునకు షికారువచ్చినది. ఆమెనుచూచిన వారికందరకు నమితానందము కలిగి సర్వసుఖములతోగూడిన నిట్టి ప్రపంచము సృజించిన సృష్టికర్త యెంతయు సంస్తవనీయుడని తలప నారంభించిరి. భానుమతి వెనుకటి దుఃఖమును మఱచి మహానందమున నోలలాడుచున్నది. సంతోషజీవనము చేయుటకు ప్రతిమానవునకు హక్కుగలదు. అట్టిచో భానుమతి అనురూపవరలాభమును పొంది సుఖించుట అశాస్త్రీయమా?

# ఆంధ్రమహిళాసభ. బెజవాడ

## ౧

ఆహ్వానసంఘాధ్యక్షురాలగు శ్రీమతి తుర్లపాటి రాజరాజేశ్వరమ్మగారి ఉపన్యాసము నుండి క్రింది భాగములు ముద్రితములు:—

ఆహ్వానసంఘాధ్యక్షురాలు



తుర్లపాటి రాజరాజేశ్వరమ్మగారు

"దేశము స్వతంత్రమును పొందయత్నించుచున్న ఈ సమయములో స్త్రీలకు కొంత స్వేచ్ఛాస్వతంత్రమును కలుగచేసి స్త్రీలను శరీరబలహీనతనుండియు బాల్యవైధవ్యమునుండియు కాపాడగల శారదాబిల్లు మంజూరై చట్టమగుట మిగుల శుభావహము. బాల్యవివాహములవలన గలుగుచున్న అనర్థకములు అందరికి తెలిసినవే. ఈ శాసనము పూర్వాచార పరాయణులగు బ్రాహ్మణులకును, వైశ్యులకును మనస్సుకు కొంత కొంతకష్టము యిచ్చుచుండుట వాస్తవమేగాని కొలదికాలములో దేశము ఈ శాసనమున కలవడగలదు. బాల్యవివాహములుకూడ రూపుమాసి పోగలవని విశ్వసించుచున్నాను. శ్రీశారదాగారికి స్త్రీలోకము కృతజ్ఞత జూపుచున్నది.

మనదేశములో స్త్రీవిద్య మిగుల అధోగతియందున్నదని యీమధ్య సంచారముచేసి రిపోర్టువ్రాసిన హార్టాగ్ కమిటీవారును అంగీకరించి యున్నారు. స్త్రీలలోవిద్య యింకను పెక్కురెట్లు వృద్ధిచెందినగాని దేశమునకు మోక్షములేదు. ఆంధ్రదేశము స్త్రీవిద్యలో తోడిరాష్ట్రములగు మహారాష్ట్రము బంగాళముల కన్నను దక్షిణచెన్నరాష్ట్రముకన్నను చాల వెనుకబడియున్నది. మహారాష్ట్రదేశములో ప్రొఫెసరు కార్వేగారు ఇరువైఅయిదులక్షలు సంపాదించి (Indian Women's University) హైందవస్త్రీల విశ్వవిద్యాలయమును స్థాపించి యున్నారు. అనేకమైన ఉన్నతపాఠశాలలను కూడపెట్టించి యున్నారు. అవివాహితలగు యువతులు హైస్కూళ్లలో చదువుకొనుచుండుట మహారాష్ట్రదేశములో ఆచారమైపోయినది. మద్రాసులో (Queen Mary's College) క్వీను మేరీసు స్త్రీల కళాశాలను పెట్టియు, దానికి జతగా ఒక హాస్టలు పెట్టియు, విద్యార్థినులకు వసతిగృహమును పెట్టియు, మద్రాసు గవర్నమెంటువారు కొంత క్షేమ

చేసియున్నారు. కొద్ది కొద్దిగా అచ్చటచ్చట బాలికలకు ఉన్నతవిద్య నియ్యగల పాఠశాలలనుకూడ ప్రభుత్వము వారు పెట్టుచున్నారు. కాని యవి ఇంకను చాల తక్కువగా నున్నవి. మరియు వివాహితలగు స్త్రీలకును, ఇతరులకును గూడ విశ్రాంతిసమయములలో విద్య నొసంగగల విద్యాసంస్థలకొరకు మనము కృషిసలుప వలసియున్నది. కాని స్త్రీ విద్యావిధానమును గూర్చి ఇచ్చట ఒక్క మాట చెప్పవలసియున్నది. స్త్రీలకు ప్రభుత్వపుబడులలోను, హైస్కూళ్లలోను, కళాశాలలలోను గఱపు విద్య లాభకారిగా లేదు. పురుషులకు కావలసిన విద్యాపద్ధతు లన్నియు స్త్రీల కక్కరలేదు. పురుషులు విద్యను పొట్టకూటికిని, ఉద్యోగముల కొరకును నేర్చుకొనుచున్నారు. స్త్రీలు జ్ఞానార్జనముకొరకు మాత్రమే నేర్చుకొనెదరు. ఉద్యోగములు సాధారణముగా స్త్రీల కక్కరలేదు. నీతిని, దైవభక్తిని, దేశభక్తిని వృద్ధిచేసి మంచి తల్లులుగను, గృహిణులుగను, వీరమాతలుగను విలసిల్లుటకు కావలసిన విద్య ముఖ్యముగ స్త్రీలకు కావలసి యున్నది. దీనినిబట్టి పురుషులతోపాటు స్త్రీలకును శాస్త్రవిద్యలు మొదలగునవి అక్కరలేదని నా అభిప్రాయము గాదు.

స్త్రీలకు కావలసిన అవసరములలో వారియొక్క ఆర్థికస్థితి చక్కపరచుట చాల ముఖ్యము. ప్రస్తుతము హిందూ ధర్మశాస్త్రప్రకారము స్త్రీలస్థితి మిగుల హీనముగ నున్నది. జాయంటుకుటుంబములో భర్త చనిపోగానే ఆ ఆస్తియంతయు భర్తయొక్క అన్నదమ్ములకు చెంది వితంతువు భరణమునకు మాత్రమే అర్హురాలగుచున్నది. భరణము పొందుటలో స్త్రీలుపడు కష్టములు వర్ణనాతీతములు. భర్తయొక్క యావత్తు భాగమును జాయంటుకుటుంబములోకూడ భార్యకుచెందుట న్యాయము ధర్మము అయియున్నది. మరియు తండ్రియొక్క ఆస్తిలో కుమాళ్లతోపాటు కూతుళ్ళకుకూడ భాగములు పంచియిచ్చుట అవసరమైయున్నది. కుమాళ్లు మనుమలు ఉన్నప్పటికిని భార్యకుకూడ కొంతభాగము భర్త ఆస్తిలో ఇచ్చుటకూడ అవసరము. వివాహకాలమందు భర్తయొక్క ఆస్తిలో కొంతభాగము భార్యకు సంక్రమింపచేయుటయు అవసరము. ఇట్టి యేర్పాట్లు మహమ్మదీయులలో కలవని తెలియుచున్నది. స్త్రీలకు ఆర్థికసుస్థితిని యిచ్చు ఇట్టి హిందూ లా సవరణలు శాసనసభలలో తెచ్చుటకై మనము మిగుల కృషిసలుపవలసియున్నది.

మునిసిపాలిటీలు, లోకలుబోర్డుల చట్టములు మారబోవుచున్నవి. నామినేషనులు రద్దుచేయబోవుచున్నారు. మంచిదే! వాటిలో స్త్రీలకు కొన్నిస్థానములు యెన్నికలలో ప్రత్యేకించవలెనని మనము కోరవలసి యున్నది. అటులనే రాబోవు రాజకీయసంస్కరణములలో శాసనసభలలోకూడ ఎన్నికలలో స్త్రీలకు కొన్ని స్థానములు ప్రత్యేకించవలెనని మనము కోరవలసి యున్నది.

ఆచారమువలన పతితులుగా చేయబడిన దేవదాసీకులమును మరల పవిత్రపరిచి ఉద్ధరించుటకుగాను మనఅధ్యక్షురాలు చాల ప్రయత్నముచేయుచుండుట మీకు తెలిసినవిషయమే. దేవదాసీలచట్టమును మద్రాసు శాసనసభలోగావించి దేవాలయములనుంచి పతితులగు వ్యభిచారిణులు దూరముగనుండునట్లు వీరు చేసియున్నారు. దేవాలయములకు దేవదాసీనవుకరీ యీనాములు ఉండుటవలన ఆకులములోని బాలికలచేత నిర్బంధముగా భోగపుమేళపునౌకరీ చేయించవలసివచ్చుచున్నది. అందువలన ఆ బాలికలు నిర్బంధముగా వ్యభిచారిణులుగ చేయబడుచున్నారు. ఇప్పుడీచట్టమువలన ఈనాములకు క్వీటురెంటుకట్టి యివ్వబడినవి. నౌకరీచేయవలసిన అవసరములేదు. క్వీటురెంటు దేవాలయమునకు చెందును. ఇందువలన నిర్బంధముగ భోగముమేళపు నౌకరీ చేయవలసిన బాధ్యతపోయినది. ఆ కులస్థులుకూడా వ్యభిచారవృత్తివదలి చక్కగా వివాహములాడి ఆత్మగౌర

వముగల పౌరులయి యితరకులములతో పాటు అభివృద్ధి చెందెదరుగాక యని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాను. ఈ పతితోద్ధారణకొరకు శ్రీమతి యామినీపూర్ణతిలకమ్మగారు చేయుచున్న కృషి ప్రశంసాపాత్రముగా నున్నది.

పేదవారు దౌర్భాగ్యులునగు చిన్నబాలికలను పడుపు వృత్తిలో దింపుటకు కొన్ని సంఘములు, కొన్ని గృహములు యేర్పడి గొప్ప పట్టణములలో సంఘమర్యాదను తారుమారు చేయుచున్నవి. వాటిని నిర్మూలముగావించి చిన్న బాలికలను దుష్టమగు వ్యభిచారవృత్తినుండి సంరక్షించుటకు (Brothel's Bill) పడుపుగృహముల చట్టము మద్రాసుశాసనసభయెదుట నున్నది. దానికొరకు మన అధ్యక్షురాలు మిగులశ్రమపడుచున్నారు. ఆ చట్టమును వెంటనే మంజూరు చేయించుటలో మనము మన అధ్యక్షురాలికి తోడ్పడవలసి యున్నది. ఈ సమస్య రూపుమాపుటకు మనమును ప్రత్యేకసంఘములను నిర్మాణము చేయవలయును."

౨

సభాధ్యక్షురాలగు శ్రీమతి డాక్టరు ముత్తులక్ష్మీరెడ్డి, యం. బి. సి. యం. (మద్రాసు లెజిస్లేటివు కవున్సిల్ డిప్యూటీ ప్రెసిడెంటు) గారి ఉపన్యాసమునుండి క్రింది భాగములు ముద్రితములు :—

"ఇతర దేశములలోవలెగాక, మనదేశమందలి పురుషులు స్త్రీ స్వాతంత్ర్యముకొఱకు, అభివృద్ధికొఱకు ఎల్లప్పుడు సానుభూతి జూపుచున్నందులకు మన మదృష్టవంతులము. భారతదేశమునందలి స్త్రీలయభివృద్ధికిని, స్వాతంత్ర్యమునకును భారతమాతసంతానమునం దుత్తమోత్తములగు మహాపురుషులు నిరంతరము కృషిచేసిరి. చేయుచున్నారు. హిందూదేశమున పురుషులే స్త్రీల హక్కులకొరకై పోరాడి జయప్రదముగ విద్యావిషయమునను రాజకీయమగు హక్కుల సంపాదనమునను ముందంజవేయుటజూడ ఈ విషయమున హిందూదేశము యితరదేశములకు మార్గదర్శియై యున్నది.

ప్రప్రథమమున మనకత్యంత ప్రేమాస్పదుడగు రాజా రామమోహనరాయలు నిస్సహాయులైన సహగమన దురాచారమును రూపుమాపుటకు శాసనమును చేయించెను. తరువాత పండితవిద్యాసాగరపాండ్యాగారు బాలవితంతువుల కన్నీటిధారలచే నార్ద్రీకృతమనస్కుడయి వితంతూద్వాహచట్టమును చేయించెను. మరియు హిందూ దేవాలయములలో దేవదాసీలను కొందఱను పడుపువృత్తికై నియమించు దురాచారమును రద్దుచేయుటకై యాందోళనము 1869 సంవత్సరమునుండియు సాగుచున్నది. అనర్థదాయకము, క్రూరమునగు నీయాచారమును రూపుమాపుటకు మనము తగిన శాసనమును చేయించజాలకపోయితిమి. మన దురవస్థ యిట్లుండగా 1900 సంవత్సరముననే మైసూరు ప్రభుత్వమువారీక్రూరమైన యాచారమును రద్దుపరచి పురుషులలోగాని, స్త్రీలలోగాని అవినీతిని హిందూసంఘము ప్రోత్సాహపరచదని ప్రపంచమునకు చాటిసారు.

భారతనారీమణుల యభివృద్ధికై మనసోదరులు చేయుచున్న కృషి యత్యంతము శ్లాఘింపదగియున్నది. మనయుద్యమమునందు శ్రద్ధవహించి యింతమంది యుండుట మనభాగ్యమునియే చెప్పవలెను. కళావంతుల సంస్కరణకై సర్ వెంకటరత్నంనాయుడుగారు చాలకృషి గావించియున్నారు. లాలాగంగారామ్, వీరేశలింగము, స్వామిశ్రద్ధానంద మొదలగువారలు వితంతువులకై శ్లాఘనీయమగు కృషిని గావించినారు. కార్వే, దేవదారు

ప్రభృతులు దేశమునందనేకులు నెడలి స్త్రీల యుద్యమమున దత్యంతశ్రద్ధ వహించియున్నారు. లాలాలజపతిరాయలు మనకు నచ్చిన బాంధవుడు. సర్ హరిసింగు గౌరు, రాయబహద్దూర్ హరివిలాస్ శారదా మనకై శాసనములను చేయించి మనకృతజ్ఞతకు పాత్రులయినారు.

బాల్యవివాహనిషేధకశాసననిర్మాతయగు శ్రీయుత హరిబిలాస్ శారదాగారు తరతరములచేతను సంస్తుతింపబడుట నిక్కువము. ఏలననగా ఈ శాసనము బాలికలను సంరక్షించు చట్టము. మతము పేర బాలికలకు 8, 10, 12, 13, సంవత్సరముల వయస్సున వివాహము చేయుట అనర్థదాయకము. ఇతర నాగరకదేశములలో శిశువుల దేహారోగ్యమునకు భంగము కలుగజేయు తల్లిదండ్రులకు శిక్షలు విధింపబడును. కావున యితరదేశమునందలి విద్యాధికులు మాత్రమే గాక, ప్రపంచమంతయు, శారదా బాల్యవివాహ చట్టమును

సభాధ్యక్షురాలు



శ్రీమతి ముత్తులక్ష్మి రెడ్డిగారు
(నల్లవస్త్రము ధరించినవారు)

సమర్థించుచున్నదనియు, ఈ శాసనమునకు ప్రతికూలముగా నూటిలో నొక్క పూర్వాచారపరాయణుడు మాత్రమే యున్నాడనియు, అందులో చాలామంది చాల వెనుకబడియున్న దక్షిణదేశమునుండియై యున్నారనియు మనము ప్రభుత్వమువారికి దెల్పుదముగాక! హిందువులలోను, మహమ్మదీయులలోను విజ్ఞానవంతులగు స్త్రీలు మౌనముదాల్చియున్నను ఈశాసనము నామోదించుచునేయున్నారు. ఈ బాల్యవివాహదురాచారములను మార్చుటకు ప్రజలలో తగినంత ప్రచారము జరుగలేదని చదువుకొనినవారిలోగూడ కొందరు హ్రస్వదృష్టి కలవారు నుడువుచున్నారు. కాని యితరదేశములలో ప్రజాభిప్రాయము వ్యక్తము కాక ముందే నైతిక ఆరోగ్యవిషయిక సంస్కరణలు అమలు పరుపబడెనని వారు మరచుచున్నారు. ఆంగ్లదేశములో చేయబడిన శాసన

ముల పట్టికను గాంచినచో 19 వ శతాబ్దిలోనే బాలబాలికల యెడల క్రూరత్వమును మాన్పుటకు శాసనములు చేయబడెనని తెలియగలదు. మైనరు బాలికలను సంరక్షించుటకు శాసనము లేలయని మనము ప్రశ్నింపవచ్చును. పశువుల యెడల క్రూరత్వమును మాన్పుటకు మనదేశములలో నెన్నియేని సంఘములున్నవిగదా? కాని ఆంగ్లదేశమునందువలె, జర్మనీయందువలె, అమెరికాయందువలె బాలబాలికలను రక్షించుటకు చట్టములు లేకపోవుట శోచనీయము.

మైనరులను రక్షించుటకు సరియగు చట్టమును ప్రభుత్వము వారింతవరకును చేయలేదు. దేవదాసీలవిషయమై నేను ప్రవేశపెట్టిన చట్టముగూడ మైనరులనురక్షించుట కేర్పడియున్నది. మైనరు బాలికలు పడుపువృత్తి నవలంబింపకుండ చేయుటకది యుద్దేశింపబడినది. నాశాసన మామోదింపబడినందులకు శాసనసభవారిని, ప్రభుత్వము వారిని అభినందింపవలసియున్నది. కాని చట్టము అమలుపరుచుటలో ఆలస్యమగుటవలన స్వార్థపరాయణులగు దేవాలయాధికారులు నిరంకుశముగాను, పక్షపాతముగాను ప్రవర్తించుటకు వీలయినది. తక్షణమే యీ చట్టము నమలుపరచి, వేలకొలది బాలికలను పడుపువృత్తినవలంబించు హీనకార్యములనుండి రక్షింతురు గాక యని కోరుచున్నాను. ఈ దురాచారముల వలని మహోపద్రవములను గమనించిన విద్యాధికులును, విజ్ఞానవంతులును ఈ యాచారములకు వ్యతిరేకముగా ప్రచారము గావించుటయేగాక మన శారీరకమానసికదౌర్బల్యమునకు కారణభూతములగు నీ దురాచారములను మాన్పుటకు శాసనములు చేయవలెనని కోరవలెను. మనకు న్యాయము సమకూరువరకు తల్లులకు, బాలికలకు, నోరులేని మైనరుపిల్లలకు తగిన న్యాయము ప్రసాదింపబడువరకు మనము నిద్రపోరాదు. మన జాతి బలవీర్యసంపన్నమై యుండవలెనవిచో నిట్టిదురాచారము లన్నియు రూపుమాయుట యవసరము. ఇంతమంది తల్లులును పిల్లలును మరణించుచుండగా, రోగమువలన అనేకులు ఆజన్మాంతము కష్టపడుచుండగా, స్త్రీలలోను, పురుషులలోను లక్షోపలక్షలు అంటువ్యాధులవలన నశించుచుండగా, కుంటివాళ్లు, గ్రుడ్డివాళ్లు, వికలాంగులు లక్షలకొలది రక్షణకై పరితపించుచుండగా, సుందరములగు నగరములలో అనాథలగు వారు భిక్షమెత్తుచుండగా, పడుపుటిండ్లలో బాలికలు హీనమైనట్టియు, అవమానకరములైన జీవితములను నెరపుచుండగా మనమూరకొనుటకు వీలులేదు. నైతికప్రచారమును గావించుటకు మనదేశమున లక్షలకొలది స్త్రీ సేవకులు దీక్షతో పనిచేయువారు కావలెను. కాని యింతమంది విద్యాధికులును, యిన్ని స్త్రీ కళాశాలలును గలరాజధానిలో స్త్రీ సేవకులు అపురూపమగుట చాల దుఃఖకరము.

పూర్వపు హిందూధర్మశాస్త్రకర్తలు స్త్రీ పురుషులు సమానులని గ్రహించి స్వాతంత్ర్యవిషయమునను జ్ఞానసంపాదన విషయమునను ఆధ్యాత్మికవిషయమునను సమానహక్కులనిచ్చియున్నారు. కాబట్టి హిందూ స్త్రీలయొక్క హక్కు స్వత్వములు నష్టపరచి స్త్రీసంఘములకుతక్కువ స్థానమునిచ్చినది ఇటీవలి శాస్త్రకారులనియే చెప్పవలసియున్నది. హిందువులు సత్యమతధర్మములను హేతుజ్ఞానమును విడచి ఆచార్యములకు బానిసలయినందుకు విచారపడవలసి యున్నది.

ప్రస్తుతధర్మశాస్త్రమునుబట్టి హిందూవితంతువుల కెట్టి హక్కులును లేవు. ఈ రోజున భర్త జీవించి యుండగా గృహములో సర్వాధికారిణిగ నున్న స్త్రీ భర్తపోయిన నిముసమునుండియు కోడలియొక్కయో లేక జ్ఞాతులయొక్కయో నిగ్రహానుగ్రహములకు పాత్రురాలు కావలసిన దుస్థితిపట్టుచున్నది. తండ్రి చనిపోయిన తోడనే కుమార్తెలు సోదరులకును వారి భార్యలకును దాస్యము వహించవలసియున్నారు. మన వివాహధర్మముల పరికించినయెడల అవి స్త్రీ తన భర్త యెంతదుర్మార్గుడును పాపియు నయినను అతని చేతులలోని ఒక

నిర్జీవపదార్థముగను పశువులుగను చేసివేయుచున్నవి. ఆధునిక భావముల బట్టి ఈపరిస్థితులన్నియు మారవలసి యున్నవని అంగీకరించక తప్పదు. దత్తస్వీకారవిషయమునను మైనరుపిల్లల పాలనాధికారవిషయమునను భర్తతోపాటు భార్యకుకూడ సమానహక్కులున్నవని అంగీకరించవలసి యున్నది.

వోటింగు అధికారమును విస్తరింపజేయుట భారతనారీమణుల కిష్టమేనా? అవును. పురుషులవలెనే స్త్రీలును స్వపరిపాలమునందును, హెచ్చుగా పాల్గొన నిచ్ఛగించుచున్నారు. దేశభక్తులగు మహాపురుషులు రాజారామమోహనుని కాలమునుండి మహాత్ముని కాలమువరకు ధైర్యముతో స్త్రీలహక్కులను సమర్థించి, వారికొరకయి సర్వప్రయత్నములను చేయుచున్నారు. తమ స్త్రీజనముయొక్క స్థితులను బాగుపరచుటకు వారి హక్కులను రక్షించుటకు మాంటాగ్యూ ఛెలమ్సుఫర్డు ప్రణాళిక ననుసరించి యేర్పరుపబడిన శాసనసభలలో పురుషులు చాలప్రయత్నములను గావించినారు.

వివిధప్రభుత్వవిధానములకును సాంఘికపరిస్థితులకును పరస్పర సంబంధమున్నదనుట ప్రసిద్ధము. అనేక సంవత్సరములకు పూర్వమే మైసూరుసంస్థానము, బరోడాసంస్థానము సాంఘికశాసనముల నమలు పరచినవి. కాని యిట్టిమతాచారసంబంధమగు విషయములలో జోక్యము పుచ్చుకొనుట తగదని బ్రిటిషుప్రభుత్వమువారు తాటస్థ్యము వహించియున్నారు. సంస్కరణకు పూర్వము అమలులోనుండిన శాసనసభలకంటె సంస్కరణల తరువాత నేర్పడిన శాసనసభలు ఈ సమస్యలను గూర్చి హెచ్చుగా శ్రద్ధవహించినవి.

జపాను, టర్కీ మొదలగు స్వతంత్రదేశములు రాజకీయాభివృద్ధితోబాటు సాంఘికాభివృద్ధికిని తోడ్పడు శాసనములను జేయుచున్నవి. మన దేశములోనే మైసూరు, బరోడావంటి సంస్థానములుగూడ రాజకీయాభివృద్ధితోబాటు సంఘసంస్కరణమునకు బూనుకొనియున్నవి. ఈ దేశముల చరిత్ర నెరింగిన యెవ్వడు తమదేశమునకు బాధ్యతాయుతప్రభుత్వమును, రాజ్యాంగములో హెచ్చుపాలును కోరడు? వ్యక్తుల యొక్కయు, జాతులయొక్కయు సుగుణసంపత్తిని, తెలివితేటలను వృద్ధిచేయుటకు స్వాతంత్ర్యమును బాధ్యతయు ఆవశ్యకములయి యున్నవి.

మాంటేగ్యూ ఛెలమ్సుఫర్డు సంస్కరణలు ప్రవేశపెట్టబడినప్పటినుండియు, స్త్రీలకు మునిసిపాలిటీలో సభ్యులుగానుండుటకు అధికారము కలిగినప్పటినుండియు, భారతనారీమణులలో అపూర్వమయిన సంచలనము గలిగినది. ఈ మూలమున సాంఘిక, ఆర్థికరాజకీయ విషయములయందు వారు విస్తారముగా పాల్గొను చున్నారు.

స్త్రీలుమాత్రమేకాదు, ఈ సంస్కరణములవలన నిమ్నజాతులును, వెనుకబడిన జాతులును హెచ్చుగా లాభమునుపొందినారు. వారందరు తమతమ ధర్మములను, బాధ్యతలను గ్రహించి దేశాభివృద్ధికరమగు ఉద్యమము లన్నిటియందును శ్రద్ధగా పనిచేయుచున్నారు.

సంపూర్ణస్వాతంత్ర్యము లభించిననే ప్రతివ్యక్తియు, ప్రతిజాతియు అత్యంతము అభివృద్ధి నొందుట సాధ్యమగును. మనలో నిమిడియున్న శక్తులన్నియు సంపూర్ణముగా విజృంభించవలెనన్నచో స్వాతంత్ర్యసిద్ధి యత్యావసరము. సత్యమగు భారతీయాశయములు ఫలవంతమగుగాకయని మన మాశించుచున్నాము. జయము మనకు నిశ్చయమని మనవిజేయుచు మీకందరకును వందనసహస్రము లర్పించుచున్నాను.”

## 3

### ఈ క్రిందను తీర్మానములు ఆంధ్రమహిళామహాసభలో నంగీకరింపబడినవి:—

౧. భారతశాసనసభలో శారదాచట్టము నుపపాదించిన రాయిసాహెబు హరవిలాస శారదాగారికిని దాని నామోదించిన దొరతనమువారికిని శాసనసభ్యులకును ఈ సభవారు వందనము లర్పించుచున్నారు. (ఈ తీర్మానమును శ్రీమతి తల్లాప్రగడ విశ్వసుందరమ్మగా రుపపాదింపగా శ్రీమతులు మంచాల సావిత్రమ్మ, తుర్లపాటి రాజరాజేశ్వరమ్మగా ర్లనువదించిరి.)

౨. హిందువుల వివాహములు, దత్తత, బిడ్డల సంరక్షకత్వము మున్నగువానికి సంబంధించిన నిబంధనలలో గల లోపములనన్నిటిని తొలగింపవలెను. కుమార్తెలకు తండ్రిసొత్తులోను భార్యకు భర్తసొత్తులోను వాటా యుండుటకు వీలగునట్లు న్యాయశాసనములను సవరింపవలెను. (ఈ తీర్మానమును శ్రీమతి సత్తిరాజు శ్యామలాంబగారు ఉపపాదింపగా శ్రీమతులు యామినీపూర్ణతిలకమ్మ బత్తులకామాక్షమ్మగా ర్లనువదించిరి.)

౩. గర్భాదానవయోనిర్ణయసంఘమువారి సూచనలప్రకారము శ్రీయుత శారదగారు దీనినిగూర్చి చట్టమును సవరింపవలెనని ఈ సభవారు కోరుచున్నారు. (ఈ తీర్మానమును శ్రీమతి మంచాల సావిత్రమ్మగా రుపపాదింపగా శ్రీమతి సత్తిరాజు శ్యామలాంబగారనువదించిరి.)

౪. ప్రజలందరును ఖద్దరుపరిశ్రమకును ఇతర దేశీయపరిశ్రమలకును ప్రోత్సాహము నొసగవలెనని ఈసభవారు కోరుచున్నారు. (ఈ తీర్మానమును శ్రీమతి ఇలింద్రసరోజనీదేవిగా రుపపాదింపగా శ్రీమతి కాకరపర్తి జీవనప్రసన్నాంబగా రనువదించిరి.)

౫. దేవాలయములలో దేవదాసీలు సేవచేయుపద్ధతి నింకను కొనసాగించుట చాల అక్రమము. కావున డాక్టరు ముత్తులక్ష్మమ్మగారి చట్టమును వెంటనే అమలు జరుపవలెనని దొరతనమువారిని ధర్మాదాయబోర్డువారిని ఈ సభవారు కోరుచున్నారు. (ఈ తీర్మానమును శ్రీమతి పోణకా కనకమ్మగా రుపపాదింపగా శ్రీమతి దర్శి అన్నపూర్ణమ్మగా రనువదించిరి.)

౬. దేశమునందుగల అన్నిమతములవారును ముఖ్యముగా హిందువులును మహమ్మదీయులును ఏకీభవించి విరోధములను త్యజించి జాతియొక్క యేకీభావమును శాంతిని నెలకొల్పవలెనని ఈ సభవారు కోరుచున్నారు. (ఈ తీర్మానమును శ్రీమతి సత్తిరాజు శ్యామలాంబగా రుపపాదింపగా శ్రీమతి పోణకా కనకమ్మగా రనువదించిరి.)

౭. స్వపరిపాలనము లభించిననేగాని యేజాతియు స్వధర్మమును నెరవేర్పజాలదు గాన హిందూదేశమునకు తక్షణమే అధినివేశస్వాతంత్ర్యము నొసగవలెనని పార్లమెంటుసభవారిని ఈ సభవారు కోరుచున్నారు. (ఈ తీర్మానమును శ్రీమతి యామినీపూర్ణతిలకమ్మగా రుపపాదింపగా శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగా రనువదించిరి.)

౮. అస్పృశ్యతను వెంటనే నిర్మూలింపవలెను. పాఠశాలలు, దేవాలయములు మున్నగు బహిరంగ సంస్థలలోనికి అస్పృశ్యులనుగూడ యథేచ్ఛగా రానీయవలెనని ఈ సభవారు హిందూసంఘనాయకులనందరిని కోరుచున్నారు. (ఈ తీర్మానమును శ్రీమతి పోణకా కనకమ్మగా రుపపాదింపగా శ్రీమతి యామినీపూర్ణ తిలకమ్మగా రనువదించిరి.)

౯. కనీసము పదేండ్లలోనైన మద్యపానమును పూర్తిగా నడచివేయుటకు ప్రచారమొనరించుటతోపాటు చట్టమునుగూడ చేయవలెనని ఈ సభవారు దొరతనమువారిని కోరుచున్నారు. (ఈ తీర్మానము అధ్యక్షురాలిచే నుపపాదింపబడి యేకగ్రీవముగా నామోదింపబడెను.)

౧౦. శ్రీమతి మాగంటి అన్నపూర్ణాదేవిగారు దివంగతురాలైనందుకు ఈ సభవారు గాఢమగు సంతాపమును వెల్లడించుచున్నారు. ఆమె అకలంకమగు దేశభక్తితోను దీక్షతోను దేశసేవ నొనరించెను. స్త్రీలందరు నామె సాదర్శప్రాయురాలిగా గొనదగునని ఈ సభవారు ఆశించుచున్నారు. (ఈ తీర్మానమును శ్రీమతి అత్తూరు వెంకటశేషమ్మగారు ప్రతిపాదింపగా శ్రీమతి పొణకా కనకమ్మగారనువదించిరి. స్త్రీలందరును లేచి నిలువబడి దీని నామోదించిరి.)

౧౧. చెన్నపురిలో నేర్పరుపబడిన సేవాసదనము పద్ధతిని ఆంధ్రదేశమునందంతటను గ్రామములలోను పట్టణములలోను స్త్రీలసంఘముల నేర్పరుపవలెననియు ప్రస్తుతమున్న స్త్రీల సంఘములవారు ఆయాప్రదేశములలోని స్త్రీల మేలుకొరకు వారికి విద్యను పరిశ్రమలను నేర్పుటకు తరగతుల నేర్పరుపవలెననియు ఈ సభవారు కోరుచున్నారు. (ఈ తీర్మానమును శ్రీమతి ఎన్. సుభద్రమ్మగారు ప్రతిపాదింపగా శ్రీమతి జి. దుర్గాబాయమ్మగా రనువదించిరి.)

౧౨. బాలురకును బాలికలకును గూడ వెంటనే నిర్బంధప్రాథమిక విద్యనేర్పాటు చేయవలెను. ముఖ్యముగా స్త్రీలకును బాలికలకును పాఠశాలల నేర్పరుపవలెనని ప్రత్యేకముగా సూచించినందులకు హార్టాగు కమిటీవారికి ఈ సభవారు వందనములర్పించుచున్నారు. (ఈ తీర్మానము శ్రీమతి జి. దుర్గాబాయమ్మగారు ప్రతిపాదింపగా శ్రీమతి ఎన్. సుభద్రమ్మగా రనువదించిరి.)

## చిత్రప్రశ్న

౨

శ్రీమతి కె. గంగమ్మగారు

ఎనిమిదక్షరముల గననగు నొక నామ మాద్యంతములు శిలలగుచునుండు
మూడునాల్గైదును మోహంపు రాగంబు ఒకటియేడెనిమిది నొప్పురాజు
రెండు నాల్గెనిమిదియేని ప్రాసాదంబు ఆఱునొక్కటి బాలు జీరుటగును
ఆద్యక్షరద్వయంబమరు తారకమయి పుంలింగసంజ్ఞచేపొల్పుగాంచు

సర్వమును జేరి గొప్ప సంస్కారియైన
విబుధు నెఱింగించుచుండు నాపేరు భక్తి
నొక్కమారు వచించుడీ యక్కలార!
మనకృతజ్ఞతఁ దెలుపంగ మహినివలయు.

☞ ఇట్టివానియందు రుచిగల 'గృహలక్ష్మి' పాఠకులు ఈ ప్రశ్నకు జబాబు ఆలోచించి మాకు లేఖాముఖమున తెలుపుదురుగాక!

# శా ర ద లే ఖ లు

సౌ భా గ్య వ తి క ల్ప ల త కు :—

నెచ్చెలీ!

బహుకాలమునకు నీకు మన ఆంధ్రమహిళాసభను కన్నారజూచి తెలుపగలుగు భాగ్యమబ్బినందులకు సంతసమగుచున్నది.

నిజముగా ఈ నవంబరు నెల మొదటివారము మన ఆంధ్రులకు జాతీయపర్వవాసరములని చెప్పనొప్పును. అహో! ఎన్నిసభలు! ఎందఱుజనులు! ఏమికోలాహలము! ఎంతయుత్సాహము! వర్ణనాతీతముగదా! కల్పలతా! అమ్మహోత్సవము చూచిన తరువాత నిజముగా నక్కడి కేగుటయు, కనుటయు, వినుటయు మహాభాగ్యమే యను కొంటిని.

మేము బెజవాడలో ౨-౧౧-౨౯ తేదీని రైలుదిగునప్పటికి స్త్రీలిరువురు మాకెదురుపడి యొక కరపత్రమొసగి తామేర్పాటు చేసిన బసలకు రావలసినదని యాహ్వానించిరి. మా కీయూరబంధువులు గలరు. కాన వారియింటి కేగి సభకు హాజరుకాగలమని వాక్రుచ్చితిమి. వారు సరేయని విడిచిపుచ్చిరి. తరువాత వారొసంగిన కరపత్రమును చూచితిమి. మఱునాడు ప్రత్యూషముననే మహిళాసభ ప్రారంభమని అందుండెను. ఆహ్వానసంఘము వారు సభలవిషయమై స్థిరమగు తేదీని ప్రచురింపరైరి. ఎట్లు వెళ్లుదునని తహతహలాడి యెప్పుడు జరిగిన నప్పుడే చూడవచ్చునని తేదీ తెలియకనే నేను బెజవాడ వెళ్లితిని. మఱునాడే సభ. నే నేకొంచె మాలస్యము చేసినను మహిళాసభ గాంచెడి భాగ్యము గల్గెడిది కాదు. చాలామంది కట్టి యాశాభంగముకూడ గల్గెను.

ఆరేయి గడచెను. ఉదయమే లేచి ప్రాతఃకృత్యముల నిర్వర్తించుకొని దాదాపు యెనిమిదిన్నర గంటలవేళ మహిళాసభ జరిగెడి దుర్గావిలాసమున కేగితిమి. అక్కడ సభల సందడేమియు కాన్పింపలేదు. ఆ పెద్దహాలులో కొద్దిమంది స్త్రీలు ఒకమూల కుప్పగా కూర్చుండియుండిరి. తొమ్మిదిగంటలు కావచ్చినది. సభానిర్వాహకురాండ్రేరీ? ఆహ్వానసంఘాధ్యక్షురాలెక్కడ? అధ్యక్షురాలు వచ్చిరా? యని అక్కడివారి నడిగితిని. "అధ్యక్షురాలిని తోడ్కొనివచ్చుటకు స్టేషనుకు వెళ్లినారు. కూర్చోండి. వస్తారు" అని అక్కడ నున్నవారనిరి. సరేనని నేనును మాబంధుస్త్రీలును కూర్చుంటిమి. తొమ్మి

దయ్యెను. పదియయ్యెను. పదునొకండయ్యెను. జాడలేదు. సభలకై వచ్చి కృష్ణస్నానమున కేగినవారును, కనకదుర్గను కననేగినవారును, పురుషుల సభలో జరిగెడి పతాకోత్సవమును గననేగినవారును, యుస్సురస్సురనుచు రాసాగిరి. ఇంకను విషయనిర్ణయసభకొఱకు కూర్చుండుట అనవసరమే గాదు దుర్భరమే యనిపించెను. చల్లగా నింటికి వెళ్లిపోతిమి. దాదాపు పదిరెండు గంటలవేళ ముత్తులక్ష్మిరెడ్డిగారు దయచేసిరనియు విషయనిర్ణయము విషయమై సమాలోచన జరిగెననియు వింటిని.

మధ్యాహ్న కార్యక్రమము ఒంటిగంటకని ప్రకటనలో నుండుటచే నించుమించుగా మరల ఆవేళకు పుష్పవిలాసమున కరిగితిమి. కాని అప్పటికును సభలసందడి కాన్పింపలేదు. కొద్దిగా పురస్త్రీలు మాత్రము వచ్చుచుండిరి. ఈపూటగూడ సభ యెప్పుడు జరుగునో యనుకొంటిమి. దాదాపు రెండుగంటలవేళ సన్మానసంఘాధ్యక్షురాలును, సభాధ్యక్షురాలును సభకరుదెంచిరి. అంత స్త్రీల సభకై ప్రత్యేకముగా నిర్మింపబడిన విశాలమగు పందిరిలో చేరితిమి. ఇతర పురములనుండి యరుదెంచిన స్త్రీల సందడియేగాని పురస్త్రీలరాక కొలదిగానుండెను.

విజయవాడపురి నాకు చిరపరిచితమైన పురము. ఆ పురస్త్రీలు సిగనిండ పువ్వులు దుఱుముకొని యొడలినిండ నగలుపెట్టుకొని వన్నెవన్నెల విలువచీరలను ధరించి ప్రతి చిన్న హరికథకును, ప్రతి భజనసమాజమునకును తండోపతండములుగ వచ్చుట నేనెఱుంగుదును. ముఖ్యముగా నేదైన ప్రసిద్ధనాటకఖేలన మనినచో పురుషులుకూర్చుండు ప్రదేశముకంటె స్త్రీలుకూర్చుండెడితావు క్రిక్కిరిసిపోవుట బెజవాడ నెఱిగినవారికి క్రొత్తగాదు. కాని మహిళాసభపై వారేలనో శీతకన్ను వేసిరి. వివిధప్రదేశములనుండి పెక్కుమంది విదుషీమణు లరుదెంచి తమయూర గుమికూడి స్త్రీలకు సంబంధించిన పెక్కు విషయములను గూర్చి చర్చింపుచుండగా వానిని చూచుటకైనరాని పురస్త్రీల యుదాసీనత యనుచితమును, నక్కజమును అనిపించెను.

అధ్యక్షురాండ్రు సభ కరుదెంచిన తరువాత సభాప్రారంభమున కాలస్యము జరుగలేదు. శారదానికేతనపు బాలికల సుమధురమైన దైవప్రార్థనతోడను, భరతమాతృస్తవముతోడను, రాట్నగానముతోడను, సభ ప్రారంభమయ్యెను. తదుపరి అధ్యక్షురాలియెన్నికతంతునడపి శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారిని యగ్రాసన మెక్కించిరి. తరువాత యొక విదుషీమణి అచ్చొత్తిన స్వాగతపద్యములను మనోహరముగ జదివెను. అప్పుడే కళావంతులు శ్రీముత్తులక్ష్మమ్మగారు తమ సంఘమునకు గావించిన యమూల్యోపకారమునకు కృతజ్ఞతాసూచకముగా స్వాగతపత్రము సమర్పించిరి. అనంతరము ఆహ్వానసంఘాధ్యక్షురాలగు తుర్లపాటి రాజేశ్వరమ్మగారు విషయగర్భితమైన తమ మహోపన్యాసము

జదివిరి. తరువాత అధ్యక్షురాలగు డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారి యాంగ్లోపన్యాసమున కాంధ్రానువాదము వేఱొక నారీమణిచే చదువబడెను. మఱియు వారియుభయుల యుపన్యాసములును పుస్తకరూపమున ప్రచురితములై సభలో పంచిపెట్టబడెను. మొత్తముమీద రెండుపన్యాసములు స్త్రీలకు సంబంధించిన పక్కువిషయములతోఁగూడి భావగర్భితములుగా నుండెను.

తదుపరి తీర్మానము లారంభమయ్యెను. మొట్టమొదటిదే శారదాబిల్లు శాసనమైనందులకు మహిళాసభవారు తమ యామోదమును తెల్పెడి తీర్మానము. పూర్వాచారపరులకు హృదయశల్యమును; సంస్కర్తలకును, దేశహితైకాభిలాషులకును, స్త్రీజనాభ్యుదయచింతనాపరులకును నానందకరమునగు నా తీర్మానము నెగ్గినవెనుక ఖద్దరు, హిందీ, స్త్రీపునర్వివాహములు, స్త్రీ వారసత్వములు, గౌరుగారి వయోనిర్ణయశాసనము, సంపూర్ణ స్వాతంత్ర్యము, అస్పృశ్యత యనెడి పెక్కు విషయములనుగూర్చి తీర్మానములు చేయబడెను. అగ్రజాతులను కంపితగాత్రులను గావించెడి అస్పృశ్యతా విషయిక తీర్మానము సభలో చర్చకువచ్చునప్పటికి సాయంత్ర మాఱుగంటలు దాటెను. "మాలవాండ్ల నే విధముగా దరిజేర్చుకొందు మనువారి ఆలాపములును, ఇండ్లకు వెడలవలసినవారి సందడియు నేకమై సభలో కలకలము మెండయ్యెను. ఇదే సమయములో సభలో పాల్గొనుట కవకాశము చిక్కనివారి కసంతృప్తిమొందై యొకచోనలిగి కూర్చుండి విద్యాపురాలి సాధింపులు సాగించిరి. ఇట్టిస్థితిలో సభను సాంతముగా సాగించి ముగించుటకు సాధ్యముగాక మఱునాడు సభను మూడుగంటలకు వాయిదా వేసి ముగించిరి.

మఱునాడు కొంచెమాలస్యముగా నేను సభకేగియుండుటచే నేను వెళ్లునప్పటికే సభ ప్రారంభమైయుండెను. గతదినపు మహిళాసభ తరువాయియెట్లు సమాప్తము చేయబడెనో నాకు తెలియదు. నేడు తీర్మానములు లేక యెవరికి వారు తమ యభిమాన విషయములనుగూర్చి ప్రసంగింప నగునని వాక్రుచ్చిరి. స్త్రీవిద్య, కే. శే. మాగంటి అన్నపూర్ణాదేవి, ప్రస్తుత రాజకీయ పరిస్థితులు, స్త్రీల నాటకరంగప్రవేశ మాదిగాగల పలువిషయములనుగూర్చి పలువురు ప్రసంగించిరి. గతదినము అస్పృశ్యతా తీర్మానమువలె ఆనాడు స్త్రీల నాటకరంగప్రవేశము వివాదకారణమయ్యెను. స్త్రీలలో సమాన స్వాతంత్ర్యమునకు హక్కులకును పోరాడెడి నాగరికస్త్రీలుగూడ నాటకరంగప్రవేశమునకు ప్రతికూలత దెలిపిరి. ఒక్కగానొక్క విదుషీమణియే నాటకరంగప్రవేశము వాంఛనీయ మనెను. స్త్రీల కా వాక్యము వినుటకే దుస్సహ మనిపించెను. సభలో కలకల మారంభమయ్యెను. వారిని సమాధాన పెట్టుటకు కొంతసమయము కావలసివచ్చెను. తరువాత యొకరిద్ద రుపన్యసించిన వెనుక అగ్రాసనాధిపురాలు యంత్యోపన్యాసము నొసగి సభ ముగింపు చేసెను. సభజరిగిన రెండుదినములును అగ్రాసనాధిపురాలగు ముత్తు

లక్ష్మీనరెడ్డిగారి సౌమ్యప్రవర్తనము, సహనము ప్రశంసనీయమై యుండెను. ఆంధ్రస్త్రీల కామె క్రొత్తయైనను చిరపరిచితురాలగు మిత్రురాలివలె నందఱితో నుల్లాసముగా మాట్లాడుచు సహనముతో వినఁడని స్త్రీలను హెచ్చరించుచుండెను. వచ్చియు రాని తెలుగు మాటలతో స్త్రీలతో నామె గావించిన సంభాషణ హెచ్చరికలు తన దేశీయు లగు స్త్రీలయెడ ఆమెకుగల నత్యంతగౌరవమును తేటపఱచినవి. సభ ముగిసినవెనుక మేము ప్రదర్శనశాల కరిగితిమి. ప్రదర్శనము చాలచిన్నది. ఖద్ధరులో పలురకముల రంగువస్త్రములు, సన్ననూలు వస్త్రములు, జరీ, పట్టు, ఉన్నివస్త్రములు, వానితో తయారుచేయబడిన చేతిరుమాళ్లు, శాలువలు, బిడ్డలచొక్కాయలు, పెక్కులందుండెను. గాంధిగారు వడకిననూలు, తదితరులు వడకిన సన్ననూలు, వివిధరకముల రాట్నములు, ప్రదర్శింపబడి యుండెను. శారదానికేతనపు బాలికలయొక్కయు తదితరచిత్రకారుల యొక్కయు చిత్తరువులుగూడ నందు గలవు. ప్రదర్శనద్వారమున కెట్టయెదుట మహాత్మా గాంధిగారి సంపూర్ణతైలవర్ణచిత్రపటము ఆకర్షణీయముగ నుంచబడెను.

ఆప్రదర్శనశాలావరణములోనే ఖద్దరువస్త్రములు, పుస్తకములు, ఔషధములు, పేమువస్తువులు నాదిగాగలవి విక్రయించు నంగడులుంచబడి యుండెను. ఇంచు మించుగా వానినెల్ల తిలకించితిమి. ఖద్దరు వస్త్రములు బేరముచేసితిమి. వస్త్రములలో సీతా నగరము సత్యాగ్రహాశ్రమము వారియంగడియందును, సి. వెంకటరంగము శ్రేష్ఠివారి యంగడియందును వెలలు సరసముగా నున్నటుల దోచెను. తునివారి విక్రయశాల యన్ని విక్రయశాలలకంటె పెద్దదై పలురకముల వస్త్రములకు నిలయమై యాకర్షణీయ ముగా నుండెను. వారి విక్రయశాలలో లేనిగుడ్డలేదు. విదేశవస్త్రధారులను గూడ మోహింపజేసెడి గుడ్డలందుగలవు. భీమవరము వారిఅంగడి తుండుగుడ్డలకు ప్రశస్త మనిపించుకొనెను. మేమందందు రెవికల గుడ్డలు, తుండ్లు, శాలువలు గొంటిమి. ఒక మూల నొక స్త్రీ సన్నని నూలువడుకుట కనువైన యేకులను తయారుచేయుట గాంచి తిమి. మఱియొకచో పోరంకి శ్రీరామరాజుగారు నూతనముగా స్థాపించిన పేముపరిశ్రమా లయపు అంగడి పూలపుటికలు, తములపాకుల పళ్లెరములు, బిడ్డల ఉయ్యాలలు, పెట్టెలు మున్నగు వానితో నొప్పి స్త్రీల నధికముగా నాకర్షించుచుండెను. ఇన్నిటిమధ్య శారదా నికేతనము వారిచిన్నయంగడి పెద్దస్వాగతపటమును గట్టుకొని నికేతనపు బాలికల కోమలహస్తములచే తయారు చేయబడిన కుట్టుపనుల తోడను, చిత్తరువులతోడను, పేము వస్తువులతోడను, ముచ్చట గొల్పుచు నెల్లర నాకర్షించుచు నికేతనపు బాలికల రచనాకౌశలమునకును, ఉన్నవదంపతుల కార్యదీక్షకును నిదర్శనమై తనరారుచుండెను. వీని నన్నిటిని చూచునప్పటికే ప్రొద్దుక్రుంకెను. ఆసాయంత్రమే స్త్రీలకల్లబ్బులో శ్రీముతు

లక్ష్మమ్మాళ్ గారికి సన్మానపత్రము సమర్పింపబడుచుండెననియు చాలమంది స్త్రీలక్కడ కరిగిరనియు తెలిసెను. కాని వ్యవధి లేకుండుటచే మే మటకరుగలేదు.

మూడవనాడు అనగా 5-11-29 తేదీని రామమోహన గ్రంథాలయభవనములో స్త్రీల బహిరంగసభయని ప్రకటన పత్రికలు పంచిపెట్టబడెను. దాదాపు మూడుగంటల వేళ యామందిరమున కరిగితిమి. పురస్త్రీలు కొందరప్పటికే యట కరుదెంచి కూర్చుండి యుండిరి. కాని ఆసభకు నిర్వాహకురాండ్రెవరో యేర్పాటుచేసిన వారెవరో కనుపింప లేదు. గత రెండుదినముల సభలకు కర్తృత్వము వహించిన వారెవ రాసభకు హాజరు కాలేదు. ఇదియేమి ఆశ్చర్యమని యోచింపుచుండగా ఇదివారికి సంబంధించినది కాద నియు, పట్టణకాంగ్రెసు సంఘమువారి యేర్పాటనియు కొందఱు చెప్పిరి. ఓహో! అనుకొని . ఎవరైన నాయకురాండ్రరుదెంచెదరేమో మఱికొంచెము సేపు చూచి పోవు దముగాకయని మేముగూడ కూర్చుంటిమి. పిలుపు తలపులు లేనియాసభామందిరములో కాపరిలేని గొఱ్ఱెలవలె స్త్రీలు నలువైపుల తిరుగుచుండిరి. కొంతసేపటికి ఉన్నవ లక్ష్మీ బాయమ్మ గారరుదెంచిరి. తరువాత బత్తుల కామాక్షమ్మ, వేదాంతము కమలాదేవి, గుమ్మిడదల దుర్గాబాయమ్మ, యామినీపూర్ణతిలకమ్మ గార్లరుదెంచిరి. పేరంటమునకు బోయినచోట యింటి యజమానురాలు లేకపోయినచో తానే పసుపు కుంకుమ లుంచు కొని తాంబూలము తెచ్చుకొనిన చందమున లక్ష్మీబాయమ్మగారు పెద్దఱికము వహించి యెవరో ఒక బొమ్మను అగ్రాసనాధిపురాలుగా నెన్నుకొని సభను ప్రారంభించిరి. అధ్యక్షురాలు స్త్రీలు స్వదేశీవస్తువులు అను విషయమునుగూర్చి చెప్పెను. తరువాత లక్ష్మీబాయమ్మగారు ప్రస్తుత రాజకీయ పరిస్థితులనుగూర్చి మాట్లాడుచు శారదా చట్ట మునుగూర్చి యించుక కదలించి విడిచెను. తదుపరి రాష్ట్రభాషనుగూర్చి ప్రసంగించిన గుమ్మిడదల దుర్గాబాయమ్మగారును, కాంగ్రెసు విషయమై మాట్లాడిన కమలాదేవి గారును స్వాతంత్ర్యము విషయమై యుపన్యసించిన యామినీపూర్ణతిలకమ్మగారును మత విషయమై యుపన్యాస మొసంగిన బత్తులకామాక్షమ్మగారును శారదాచట్టమును విడు వక తమ యామోదమును వెల్లడించిరి. ఉపన్యాసకర్త్రు లొకరివెంట నొకరు శారదా చట్టమునుగూర్చి ప్రస్తావించుటచే ప్రబలమగు నీసంస్కరణమునకు మిన్ను విఱిగి మీాద బడ్డట్టులై మునుపే కలవరచిత్తులైయున్న పూర్వాచారపరాయణలగు వృద్ధస్త్రీలు సహ నము గోల్పోయిరి. సభలో గల గల మాటలాడ దొడంగిరి. అందఱొకమారుగ నేల మాట్లాడెదరు మీారుగూడ శారదాశాసనముపై మీాఅభిప్రాయము తెలుపుడనిన వినిపించుకొనరు. తాము అఱచుటమానరు. ఒకటేగోద. ఆనాడు మన స్త్రీల అశిక్షిత వ్యవహారము బాగుగా విశదమయ్యెను. వైద్యుని ఔషధమున కొప్పికొన్న తరువాత ఆరో

డొసగిన చేదుమందుగాని వెగటుమందుగాని ఘాటుమందుగాని విసుగుకొనక వర్జింపక యెట్లు పుచ్చుకొందుమో అటులనే సభలకేగెడు వారుగూడ హితాహితములగు విషయములను వినుటకు తగుసహనము ఓపికను కలిగియుండుటవిధి. పలు విషయములను చర్చించెడు సభలకేగి మా చెవికింపైన మాటలనే చెప్పుడు లేకున్న సల్లరిచేయుదుమనుట యసభ్యలక్షణము. కాని పురుషుల సభలలోనే యిట్టి సభానీతి భగ్నమగుచుండుట మనము నిత్యము వినుచున్నమాటయే. ఇంక ప్రపంచజ్ఞానములేని మనసంగతి చెప్పవలసినదేమి? శారదాచట్టమునుగూర్చి యూరక యుబుసుపోక వాదోపవాదములు చేసికొనుటయేగాని దాన ప్రయోజనమేమి? అది రాజశాసనము. అనుకూలురకును ప్రతికూలురకును తప్పదు. ఇది యుపన్యాసకురాండ్రు తెచ్చిపెట్టినదికాదు. వృద్ధాంగనలు దలుపుకొనినపోదు. కాని సభాప్రేక్షకురాండ్రావిషయమై యోచింపరైరి. అది ఆ యుపన్యాసకురాండ్రే తెచ్చినటుల భ్రమపడి కంగారుపడిరి. ఇచ్చవచ్చినటుల సభలో కేకలు పెట్టిరి. అంతతోఁ బోక వీధి పొడుగునను నోటికి తాళముతీసి బారలుసాచిరి.

సోదరీ! నా కీకల్లోలము చూచుటకు చాలకష్ట మనిపించెను. మన స్త్రీలలో విద్య యెప్పుడు పెంపొందును? ప్రపంచజ్ఞాన మెప్పు డలవడును? సహన మెప్పుడొదవును? తమ దేశసౌభాగ్యమునుగూర్చి జాతిసౌభాగ్యమునుగూర్చి యెప్పుడు తెలిసికొందురు? అను మహావిచారముతో మందిరమువీడి వెలుపలికి వచ్చుచుంటిని. ఇంతలో ద్వారముకడ నొక బాలుఁడు నిలువబడి మన 'గృహలక్ష్మి' పత్రికను చేతికందించెను. ఆపత్రికను చూచినతోడనే "నే నింటింట ప్రవేశించుట చేతనే మీ మౌఢ్యము తొలగగలదు" అని యా సంచిక మౌనముతో జవాబిచ్చుచున్నదాయనుకొంటిని.

ఇంతియేగాదు. కల్పలతా! వీధిలో నేగోడపై చూచినను గృహలక్ష్మి ప్రకటన పత్రములే. త్రోవలో నెవరెవరి చేతిలో చూచినను గృహలక్ష్మి కరపత్రములే. తెనాలిస్టేషను చేరినది మొదలు మనగృహలక్ష్మి పెక్కుమంది స్త్రీపురుషుల హస్తభూషణమై యలరారుటగన నాకెంతయో ముదంబు గొల్పెను. నిరంతర పత్రికాపఠనమే మనకు జ్ఞానప్రదాయిని కావలెను. మఱియు సభలు నిర్ణీత సమయముల వేళ తప్పక జరుపుకొనుటయు సహనము వీడక సభలోని యుపన్యాసముల నాలించుటయు మనస్త్రీలు నేర్చుకొనవలసిన ముఖ్యాంశములుగా నాకాసభలు గనుటవలన తోచెను.

మిత్రురాలు, శారద.

# నవ్వుతాలు

తాత కృష్ణమూర్తిగారు బి. ఏ; యల్. టి.

## ధర్మసందేహము

"అమ్మా! అమ్మా! నిన్నొకటి అడగాలనుకుంటున్నాను. కోప్పడవు కదా?"

"అయ్యో! వెర్రితండ్రీ! కోపగిస్తానా? అవశ్యం అడుగు;—ఏమిటి?"

"ఏమీ లేదు... నేను పుట్టకముందు, నన్నెప్పుడైనా చూశావా?"

చిరునవ్వుతో, తల్లి, "లేదు. ఏమి?"

"అయితే, మరి......పుట్టగానే, నేనే అని యెట్లా పోల్చుకున్నావు?"

## పెంకెపిల్ల

నా మనవరాలు రుక్మిణి, పెన్సిలొకటి చేతులో పట్టుకొని, పరిగెడుతూ నాదగ్గరకొచ్చి, "తాతా! తాతా! ఈ పెనసలు చూశావా? అన్ని రంగులూ రాస్తుంది. నీయిష్టం వొచ్చిన రంగు అడుగు." అన్నాది, నవ్వుతూ.

"ఏదీ ఆకుపచ్చరంగు రాసి, చూపించు." అన్నాను.

"ఇదిగో, చూడు." అంటూ, ఒక కాగితంముక్కమీద "ఆ...కు...ప...చ్చ." అని, వంకర టింకరగా అక్షరాలు రాసి చూపించింది.

## నోటిలెక్కలు

రాత్రిస్కూలు మాస్టరు—అసిరిగా! మీ అయ్య వందమామిడిపళ్లు ముగ్గవేశాడనుకో. అందులో ఇదో వొంతు పళ్లు కుళ్లిపోతాయనుకో. ఎన్ని పళ్లు నష్టం అన్నమాట?

అసిరయ్య—నష్టం ఉండదండి. కుళ్లు పళ్లన్నీయేరి, మా అమ్మ, బెల్లం పసుపు కలిపి, తాండ్రపోసి, అమ్మేస్తుంది.

## పుల్లయ్య

మూడోయేట ఆ అబ్బాయి యిరుగు పొరుగు పిల్లలతోకూడి యెప్పుడూ గొడ్డుబుగ్గి, బురద, మన్ను—వీటితోటే ఆట. పాపం, ఆ తల్లి తరుచుగా చాదడు నీళ్లు తెచ్చి, ఐదారుగురు పిల్లలున్నాయినా బలవంతంగా పట్టుకొని, వాళ్ల మొహాలు శుభ్రంగా కడిగి, మానుకుంటేనే కాని, వాళ్లలో తన కొడుకెవరో పోల్చుకోలేక పోయేదట.

## పదిపక్షులు

5 వ తరగతిలో ఉపాధ్యాయుఁడొకనాఁడు "పలకలు తీసుకొని, మీరు చూచినవి యేవైనా పది పక్షుల పేర్లను వ్రాయుడు.' అని చెప్పెను.

ఒక బాలు డిట్లువ్రాసి చూపించెను :—

" 5 కాకులు, 3 పిచికలు, 2 కోళ్లు — మొత్తం 10."

## సత్యకాలము.

ముసలమ్మ — (కోడలితో) అమ్మా! గౌరూ! పాపం. ఆముష్టివాడి నెప్పుడూ పొమ్మనకు. అలాటి వాడికి పిడికెడు బియ్యం వేస్తేనే పుణ్యం, చిన్నప్పటినుంచి, వాడికి మూగి, బ్రహ్మ చెముడు నట.

కోడలు — అత్తా! వాడికి మూగి, చెవుడు అన్న సంగతి మీకెట్లా తెలుసు?

ముసలమ్మ — వాడే చెప్పాడే. దీనంగా చేతులు జోడించి, నాతో, అమ్మా! మూగివాడికి బిచ్చం పెట్టండమ్మా! అన్నాడే. ఇంట్లో బియ్యం లేవని యెంత చెప్పినా వాడికి వినిపించదు కదా? చెవుడు కాక మరేమిటి?

## నూతనదాంపత్యము.

సరస్వతి కొత్తగా కాపురానికి వచ్చిన పిల్ల. అత్తగారికి సుస్తీగా ఉన్నందున, రాత్రి తానే వండవలసి వచ్చింది. భర్తకు వడ్డించుతూ, ఆ అమ్మాయి కళ్లుతుడుచుకొని, "అరటికాయలు కరకరలాడితే మీకు యిష్టం కదా అని, వేపుడు కూరచేసి, విస్తట్లో వేస్తే, అడకత్తెరయినా గుబ్బపాత్రం అయినా తెమ్మంటారు కదా, యేం న్యాయం చెప్పండి?" అని దీనంగా అడిగింది.

"అరటికాయ ముక్కలా యివి? అయితే, నాది పొరపాటే సుమా. జీడిపిక్కలు కాల్చి, వేసేవను కొని, వాటిని చితకగొట్టడానికి యేదైనా తెమ్మన్నాను. ఇవి కూరముక్కలే అని చెప్పినావు గనుక, అవశ్యం పిడచపెట్టుకొని ఆపాళంగా తినేస్తాను. పళ్లుకాని ఊడిపోయినట్టాయినా, మళ్లీ కట్టించుకో వచ్చును. కడుపు నొప్పి పుడితే, రేపు ప్రొద్దున్నే, సోలడు ఆవిఁదం తాగేస్తాను." అనిఅన్నాడు.

## డాబులు

"చిత్రలేఖనంలో అంతటి మహానుభావుడు మరి లేఁడండి. ఒకమాటాయన యేదో చెట్టు, పళ్లు నిరూపించే బొమ్మవ్రాసి, వ్రేలకడితే, యెక్కడలేని పక్షులూ వచ్చి, ఆపటం మీద వ్రాలేయట!"

"అంతేనా, అదేంగొప్ప? మొన్న మొన్న యెవడో బెంగాలీపెయింటరు ఒక—పెద్దపులిబొమ్మ వ్రాసేటప్పటికి, దానికి నిజంగా ప్రాణం వొచ్చి, అతన్ని అమాంతంగా మింగేసిందంట!"

## వైద్యులు

పెద్దమనిషి — డాక్టరుగారూ! తేలుకాటుకు సరియైన మందు యేదైనా ఉన్నదా, అండి?

డాక్టరు — లేదు.

పెద్దమనిషి — (డాక్టరుతో షేక్‌హ్యాండ్ చేస్తూ.) వైద్యుల్లో కల్లా, మీరొక్కరు నిజం చెప్పినారు.

## అంతేకాబోలు

మాస్టరు — విశ్వసించడమనగా, అర్థమేమి?

విద్యార్థి — ఒకరు చెప్పేది, అబద్ధమని తెలిసికూడా, నిజమని ఒప్పుకో దలచుట.

# శ్రీమతి విద్యాసుందరి బెంగుళూరు నాగరత్నము గారికి

శ్రీమతి వి. సరస్వతి గారు

అమ్మా!

"ప్రస్తుతకాలమున మనస్త్రీలు అభివృద్ధి నందుచున్నారను నాయూహ మీవ్యాసమును గాంచిన తోడనే యంతరించినది." అని వ్రాసితిరి. ప్రస్తుతము మనస్త్రీలు ఏఏవిషయమున ఎంతమాత్రము అభివృద్ధి చెందియున్నారను విషయము గమనింపవలసియున్నది. స్త్రీలనగా భారతదేశమునందుండు స్త్రీలనందరిని గూర్చి మనము చర్చింప వలసియున్నది. అచ్చటచ్చట విద్యావంతులగు స్త్రీలెందరో మనదేశమున నున్నారు. ఉన్నతోద్యోగములు సేయువారుకూడ నచ్చటచ్చట కనబడుచున్నారు. కాని విద్యావిహీనలైన స్త్రీలసంఖ్యతో బోల్చ వీరిసంఖ్య ఎంతమాత్రము! గృహలక్ష్మియందు వ్యాసములన్నియు స్త్రీలచే వ్రాయబడి యుండవచ్చును. మరియొకచోట ఉపన్యాసములన్నియు స్త్రీలచే నొసగబడి యుండవచ్చును. కాని వాటిని చదువను గ్రహించను శక్తిలేని వనిత లెందరున్నారు? ఇప్పటికిని స్త్రీలకు విద్య యనవసరమని వాదించు మూఢు లెందరు లేరు?

స్త్రీలు మునుపటికంటె ఇప్పుడు అభివృద్ధినొందుచున్న మాటనిజమే. కాని విదేశ సోదరీమణులను చూచిన ఎడల మన యభివృద్ధి చెప్పుకొనదగినంత విపులముగా లేదని తెలియగలదు. ఇప్పటికిని సంఘదుస్థితులకు లోనై వానికి బలియగుచున్న బాలవితంతువుల యొక్క కన్నీరు ఏరుగా మనదేశమున పారుచునే యున్నదిగదా! వితంతూద్వాహ చట్టమున్నదిగదా? ఏల ద్వితీయవివాహము సలుపరాదని మీరడుగవచ్చును. ఇట్లు చేయుటకు సంఘమును తిరస్కరించునంతటి ధైర్యము కావలెను. న్యాయకార్యమునందు లోకమునుగాని సంఘమునుగాని తిరస్కరించు నంతటి ధైర్యము (moral courage) కలుగుటకు బుద్ధి వికసింపవలెను. దీనికి విద్యయే కారణము. శారదాగారి కృప వలన మనకు "బాల్యవివాహ నిషేధచట్టము" లభించినను స్త్రీలయొక్క విద్యాభివృద్ధిలేనిదే

ఈచట్టము ఆచరణలోనికి వచ్చుటకష్టమని తలచెదను. మనస్త్రీలయొక్క దుస్థితిని మేయో కన్య వ్రాసిన "మదర్ ఇండియా" అను పుస్తకమును చదివిన యెడల చాలవరకు వెల్లడి యగును. ఈమె వ్రాసిన వన్నియు నబద్ధములనియు, అట్లామె వ్రాయగూడదనియు పెక్కు చర్చలు జరిగినవి. అట్లామె వ్రాయుట సరియని నేను చెప్పలేనుగాని అందు సత్యములగు విషయములు చాలయున్నవని మాత్రము చెప్పితీరెదను. మేయోకన్య వ్రాసిన కొన్నిసంగతులను అభిమానముకొలది ప్రయత్నించియు మనము మబద్ధమని రూపింపలేము.

"భారతపురుషుడు స్వార్థపరుడు" అనువిషయమై మీరు చర్చచేసితిరి. భారత పురుషుడేగాదు, ప్రపంచము నందంతటను పురుషుడు స్వార్థపరుడే. పురుషుడేగాదు. మానవజాతికే స్వార్థపరాయణత మెండు. అందు పురుషునికి స్వార్థపరాయణత జూపు నధి కారముండినది. కావున అతడు జూపగలిగెను. హిందూశాస్త్రప్రకారము పురుషు డెన్ని వివాహములైనను చేసికొనవచ్చును. ఎందరి వనితల పొత్తైనను పొందవచ్చును. అది శాస్త్రవిరుద్ధముగాదు. అత డెంత అనాదరణ చేసినను స్త్రీకి మాత్రము మగడేగతి! స్త్రీ కూడ బహువివాహములుచేసి కొనవలెననిగాదు నేను చెప్పుట. ఇట్లు ఒక్క పురుషుల పక్షమునే వహించు శాస్త్రము లెంతటి ధర్మశాస్త్రములని నేనాశ్చర్య పడుచున్నాను.

నిజమే! స్త్రీ పురుషునకు నర్థాంగియే. కాని అతడా అర్థాంగమునెంత చులకనగా మార్చుచున్నాడు. ఇట్లుసేయు వారెందరో యుండరని మీరనవచ్చును. ఎందరైననేమి? ఇది శాస్త్రీయమేగదా! శాస్త్రములు వ్రాసినది పురుషులేగదా! స్త్రీలే శాస్త్రకర్తలై యుండిన యెడల శాస్త్రములు తారుమారుగనుండుననియే నాయభిప్రాయము. "నస్త్రీ స్వాతంత్ర్య మర్హతి". నూరేండ్లయినను స్త్రీలు తమ్ముతా గాపాడు కొనలేరుగా! ఇక అర్థవిషయమున చూడ కుటుంబధనమును పొందుటకు గ్రుడ్డివాండ్రు రోగులు ఎట్లు అనర్హులో అట్లె స్త్రీలును అనర్హులు. ఇక నెక్కడి సమత్వము? పురుషులతోడి సమత్వము మనకు లేనేలేదు. పురుషుని గృహమునకు స్త్రీరాణియనియు, అతనిగృహమునకు ఆమె లక్ష్మియనియు రెండు కల్లబొల్లితీపుమాటలతో నవీననారీలోకము సమత్వము పొంది నట్లుగా తృప్తిపొందజాలదు. స్త్రీలై జన్మించిన మాత్రమున మనకు స్వాభిమానము లేక పోవునా? నిజమే. లేకపోయినది. మనస్త్రీలు పురుషులేమివ్రాసిన అవియన్నియు సరియైన వనియు, మానవనిర్మితమగు వేదశాస్త్రపురాణాదులు దైవనిర్మితములనియు, అవియే

కలకాలమును జనులకు మార్గదర్శకములుగా నుండవలెననియు తలచుచున్నారు. ఇది మిక్కిలి పొరబాటు. ఏమందురా? టెన్నిసను మహాకవి ఇట్లని చెప్పుచున్నాడు.—

"Old order changeth yielding place to new and God fulfils himself in many ways lest one good custom should corrupt the world."

(క్రొత్తవానికి చోటిచ్చుచు ప్రాతపద్ధతులు సమసిపోవును. మంచిదేయగుగాక ఒక్కటే పద్ధతిని లోకమును కాకుచేయకుండ ఈశ్వరశక్తి అనేకసన్నివేశముల దెచ్చిపెట్టును.)

వేదశాస్త్ర పురాణములందు వ్రాసియుండునవి ఆయా కాలములకు తగినవి. కాని మనకుగూడ నవియే మార్గదర్శకములనుట పొసగనేరదు. పురాణవాక్యములను తులసీ దళములవలె తలను దాల్చువారెందరున్నారు? వాటిని విశ్వసించు వారెందరున్నారు? కావున వేదశాస్త్ర పురాణములతో మనకు బనిలేదు. ప్రస్తుత స్థితిగతులతో మాత్రమే మనకు పనిగలదు. ప్రస్తుతస్త్రీల పరాధీనతకు పురుషులే కారణ మని నొక్కి వక్కాణింపగలను. బ్రాహ్మణేతరుల నెట్లు (పూర్వపు) బ్రాహ్మణు లణగ ద్రొక్కియుండిరో యట్లె స్త్రీలను పురుషు లణగద్రొక్కియుండిరి. పూర్వపుసన నేను పౌరాణిక కాలమునుగూర్చి నుడువుట లేదు. ఈమధ్యకాలమని చెప్పవలెను. వేదశాస్త్రపురాణముల నెట్లున్న నేమి? హిందూసంఘమున మాత్రము స్త్రీల కున్నతస్థానము లేదు. స్త్రీశిశువు పుట్టుటతోడనే "ఆడుబిడ్డనా" అనెదరు. ఆ "నా" దీర్ఘమునం బట్టే స్త్రీలదుస్థితి తెలియుచున్నది. పురుషుల ననిన లాభము లేదు. ఇకమీద మన స్వస్థానముల మనమెరింగి వాటిని మనము సంపాదింపవలెను. ఈ ప్రయత్నమునందు మనము పాశ్చాత్యసోదరీరత్నములను మార్గదర్శకులనుగా నుంచుకొనుట మంచిది.

# నాగరక విప్లవము

శ్రీ శేషాద్రి రమణకవులు

రాటంబుపైని నారజముగా దారంబు కనువిందుగాఁ దీయుకౌశలంబు
ముగ్గుతో శిల్ప లబ్బురపాటు గొనునట్లు వింతపొంకములఁ గల్పించునేర్పు
జోలపాటలఁ బాడి చొక్కించి శిశువులఁ బుజ్జగించుచు నిద్రబుచ్చుపేర్మి
పలుకు పల్కునఁ దేనెలొలుకఁ జక్కనికథల్ దెలిపి బాలకులను దిద్దు శక్తి

వింతవన్నియ నూలుతో వివిధగతుల
వలువపై నల్లికలఁగూర్చు పాటవంబు
నేటికాంతలయందుఁ గాన్పింపదయ్యె
నాధునికనాగరక మెంతకైనఁ దగదె?



## ఎట్టి విద్య స్త్రీలకు జెప్పవలయును?:—

అక్టోబరు మాసపు 'రెడ్డిరాణి' పత్రికలో యస్. అమ్మిరెడ్డిగారు 'స్త్రీవిద్య'యను శీర్షిక క్రింద పై విషయమునుగూర్చి ఇట్లు ప్రస్తావించుచున్నారు:—

"విద్యయనగా నొక్క చదువేకాదు. ప్రపంచమునందలి దేవుని సృష్టిని తెలియజేయు పెక్కుశాస్త్రముల గ్రహించుటయు, న్యాయశాస్త్రముల ప్రకారము మనస్సును త్రిప్పినడచుకొనుటయు. అయితే సకల శాస్త్రములను గ్రహించుటకు మానవజీవితము చాలదు. కాబట్టి యేయేశాస్త్రములను స్త్రీలు నేర్చుకొనిన వారి కుపయోగమో వానినే నేర్పవలయును. అవియేవనగ 1. సంగీతము. 2. భక్తిమార్గములు నెలకొల్పు గ్రంథములు. 3. పతివ్రతల చరిత్రలు. 4. ఆరోగ్యశాస్త్రములు. 5. అర్థశాస్త్రము. 6. కుట్టుపని మున్నగు చేతి పనులు. ఇట్టి విషయములను మనబాలికలకు పాఠశాలయందు బోధించినచో వారు పెద్దవారై మంచిగృహిణులు కాగలుగుదురు. సంగీతము బాలికలు నేర్చుకొనుట అత్యావశ్యకము. వారి కంఠములయందు సహజముగా మార్దవముండును. దానివలన వారు తమ భర్తలు ఒకప్పుడు విచారగ్రస్తులై యున్నప్పుడు యింపుగ పాడి వారి మనముల రంజింప జేయగలుగుదురు. ఆరోగ్యశాస్త్రము ముఖ్యముగ నేర్పబడవలయును. హిందూ స్త్రీల కారోగ్యశాస్త్రము తెలియని కతమున తమ పిల్లలను పెంచువిధి తల్లిదిగాని తండ్రిది ఎంతమాత్రమును కాజాలదు. పిల్లలకు శుభ్రమైన భోజనముపెట్టి దుస్తులు కట్టనిచ్చి విద్యాబుద్ధులు తల్లి చెప్పవలసి యున్నది. అట్టి పనులను చేయుటకు మాత విద్యావతియై యుండవలయును. ఆరోగ్యశాస్త్రమేగాక అర్థశాస్త్రముకూడ మాత నేర్చియుండవలయును. తనభర్త కాయక్లేశపడి ధనము నార్జించును. ఆధనము యుక్తముగా కుటుంబ ఖర్చు నామె చేయవలయును. అర్థశాస్త్రము తెలియని యిల్లాలు తన యిచ్చవచ్చినట్లు వ్యయముచేసి భర్త జీవనమును దుఃఖభాజనముచేయును. అంతియేగాక స్త్రీవిద్యావతియై యున్నచో తన భర్త సుఖదుఃఖముల యందు తోడు నీడయై మెలగి సంసారసుఖ మినుమడింపజేయును".

## ప్రాచ్య పాశ్చాత్య వాఙ్మయములు—స్త్రీలు:—

నెల్లూరునందలి వెంకటగిరిరాజావారి కాలేజీ మేగజినులోని అంగ్లవ్యాసమును అనువదించి శ్రీదుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు నవంబరు 4–వ తేదీనాటి 'దేశబంధు' పత్రికలో ప్రచురించిన 'ప్రాచ్యపాశ్చాత్యవాఙ్మయములు' అను వ్యాసమునుండి ఉద్ధృతములైన ఈ క్రింది వాక్యములు స్త్రీలకు ప్రత్యేకసంబంధము కలవి:—

"ప్రాచ్యస్త్రీలకు గ్రంథరచనమున కవకాశము లేని కారణమున మాతృప్రేమ, భర్తృపరత, గార్హస్థ్యము – ఇత్యాదులు పురుషులే వర్ణించి స్త్రీ హృదయమును మనకు మఱుఁగుపఱిచినారు. పాశ్చాత్యులలో నిట్లుగాక స్త్రీలే పెక్కండ్రు గ్రంథకర్త్రులైనందున గృహసాంఘికనైతికాదివిషయములకు స్త్రీదృష్టినిబట్టి కూడ వర్ణన లేర్పడినవి. వారు వ్రాసినగ్రంథములు ఉదారభావసమన్వితము లనేకములు కలవు. అట్టివి మనలో లేకపోవుటకుఁ బ్రజాజీవిత విధానమే కదా కారణము. మనలో స్త్రీస్వభావము దుష్టమని వర్ణించునది పురుషుఁడే; వారితో సమాగమము సర్వానర్థ మూలమని వర్ణించువాఁడు పురుషుఁడే; ఇంతయు గాక కథాక్రమమున నవసరమైనచోట స్త్రీచేఁ బురుషస్వభావమును నిందింపవలసిన ఘట్టముల వ్రాయువాఁడును పురుషుఁడే; ఈ ప్రకారము మన వాఙ్మయము ఒంటికంటి చూపుతో వెలసినది. స్త్రీ స్వాతంత్ర్యము దేశమునకు క్షేమంకరమా కాదా యను విమర్శ నాకుఁ బ్రకృతము కాదు. పాశ్చాత్యదేశములలో స్త్రీలును గ్రంథరచయిత్రులైనందున వారి వాఙ్మయము ఆ కారణమునను గొంత వర్ధిల్లి యున్నదని నిరూపించుటయే నా యాశయము."

## సమిష్టికుటుంబములు—బాల్యవివాహములు :—

శారదాచట్టమునుగూర్చి విమర్శించుచు పూర్వము హిందూసంఘమున బాల్యవివాహములుండుటకు కారణము సమిష్టికుటుంబములని 'ప్రబుద్ధభారత' పత్రికాసంపాదకులు నవంబరుమాసపు తమ పత్రికలో నిట్లు వ్రాయుచున్నారు:—

"సమిష్టికుటుంబముల పద్ధతి మనలో బాల్యవివాహములను పెంచి పోషించినది. సమిష్టికుటుంబమునకు ప్రత్యేకమైన ఆదర్శముగలదు; సంప్రదాయముగలదు. ఒకతరమునుండి మఱియొక తరమునకు దానిని పారంపర్యముగ వెలయింప వలసియున్నది. అట్టి కుటుంబమున సేవచేయుట, ఆజ్ఞాపించుట ఇట్టి ధర్మములను నిర్వహించువారు స్వార్థరహితమైన బుద్ధిగలిగి కుటుంబమునందలి వివిధవ్యక్తుల రుచులకు అనుగుణ్యముగా వర్తింపగలిగి యుండవలెను. ఆకుటుంబమునందలి స్త్రీలు తమ భర్తలను, బిడ్డలను మాత్రమేగాక కుటుంబమున కంతను సేవచేయవలసినవారుగా నున్నారు. సంసారమున శాంతి స్త్రీలమూలముననే చేకూఱునను విషయము సర్వవిదితము. తలచినచో వారు సంసారమును స్వర్గముగా చేయగలరు. లేదా నరకకూపముగా మార్పగలరు. కావున వారికి పిన్నటనాటనే మంచిబోధన ఉండవలయును. నూతనాంశములను గ్రహింపగల చిన్నతనముననే వారు సమిష్టికుటుంబముయొక్క ఆదర్శములతోడను అనుభవములతోడను సుపరిచయము నొందవలయును. మనఃపూర్వకమగు విశ్వాసముతో వారు కుటుంబమునందలి వివిధ వ్యక్తులను ప్రేమింపవలయును. అట్టిబోధను గ్రహించుటకును, ప్రేమను చూపుటకును పెద్దలై కొన్ని కొన్ని అభిప్రాయముల నిదివఱకే అలవఱచుకొనియున్న ప్రౌఢలు పనికిరారు. వారు నూతనాదర్శములను గ్రహింపజాలనివారుగా నవీనానుభవములకు ఓర్వలేనివారుగా నుందురు. ప్రౌఢలైనవారు బాలికలవలె తమ భర్తల గృహములందు అంతర్లీనము కాజాలరు. అగుట బాలికలుగా నుండినప్పుడే వారికి వివాహముజరిపి చిన్నతనమునుండి అత్తవారింటి మర్యాదలను గ్రహించుటకు అవకాశము కల్గించు పరిస్థితులు ఏర్పడినవి. సమిష్టికుటుంబముల పద్ధతి దేశమున నున్నంతకాలము బాల్యవివాహము అవశ్యాచరణీయములైనవి. కాని ఇప్పుడు హిందూదేశమున సమిష్టికుటుంబ

ముల పద్ధతి క్రమముగా సమసిపోవుచున్నది. బాల్యవివాహములను పెంచి ప్రోత్సహించిన సమిష్టికుటుంబముల పద్ధతి జారిపోవుచుండగా ఇకనట్టి వివాహములపై మోజు తగ్గిపోవుట సహజమే. అవి శాస్త్రనిషిద్ధము లగుటయు మంచిదే."

## గ్రామ పునర్నిర్మాణము — స్త్రీ విద్య :—

నవంబరు రెండవ తేదీనాటి 'స్వతంత్ర' పత్రికలో శ్రీయుత పొణకా పట్టాభిరామ రెడ్డిగారు 'గ్రామ పునర్నిర్మాణము' అను శీర్షిక క్రింద గ్రామ పునర్నిర్మాణమునకు ముఖ్య సాధనములలో నొకటియగు స్త్రీవిద్యను గూర్చి యిట్లు ముచ్చటించియున్నారు :—

"స్త్రీలు పురుషులకంటె మిక్కిలి అంధకారమున నున్నారు. లోకకంటకమగు ఘోషాపద్ధతి ఇంకను కొన్ని కుటుంబములను పీడించుచునే యున్నది. పురుషుడు స్త్రీకి ఏ విధమయిన స్వాతంత్రత ఇచ్చుటలేదు. స్త్రీ విద్యకు ఇట్టిస్థితిలో అవకాశ మెట్లుండును? వంటయింటికి దప్ప నా కెందుకు పనికిరాక యున్నారు. అదియు శుచిగా శుభ్రముగా నుండునా? పురుషులకు విద్యయెంతఅవసరమో అంతకం టెనుమిక్కిలి స్త్రీలకవసరము. బండిచక్రములలో ఒకటితిరిగి మరియొకటి తిరుగకున్న బండి కదులుటకు యెట్లు కష్టమో అట్లెసంసారమును నడుపుటకు స్త్రీ పురుషులు సమానబాధ్యత వహింప శక్తి లేకపోయిన అంతేకష్టము. దానిలో సౌఖ్యము, ఆనందము లేదు. విద్యావిధానములో స్త్రీలకు పురుషులకు బాహ్యవ్యవహారములు నిపుణతతో చక్కబెట్టు జ్ఞానమును, స్త్రీలకు గృహకృత్య నిర్వహణ సమర్థత, శిశువులను జాగ్రతగా పెంచి వారిని ఆరోగ్యవంతులుగను, నీతిపదగాములుగను చేయగల నేర్పరితనమును ఒసగునట్టివిద్య అవసరము. స్త్రీలకు స్వాతంత్ర్యము మాటటుండనిచ్చి విద్య చెప్పించుటగూడ తప్పుగా నెంచు మహానీయు లింకను మనదేశమున నున్నారనుట మిక్కిలి విషాదకరమయిన విషయము."

## తూర్పుగోదావరిజిల్లా జడ్జీగారి సాహసము :—

నవంబరు ౫-వ తేదీనాటి 'కాంగ్రెసు పత్రిక' యిట్లు వ్రాయుచున్నది :—

"శారదాచట్టమును తిరస్కరించుటకు పూర్వాచార పరాయణులు మార్గముల నన్వేషించుచున్నారు. వారికి మాజిల్లాజడ్జి శంకరయ్యగారు మార్గమును చూపుచున్నారు. రాజమహేంద్రవరములో వర్తకప్రముఖులగు కీ. శే. మట్టే నారాయణగారి 12 ఏండ్ల మైనరు కుమారునకు పెత్తండ్రి సుబ్బారావుగారు 10 ఏండ్ల పిల్లను వివాహము చేయుటకు సంకల్పించెను. వివాహము జరుగకూడదని పిల్లవాని మేనమామ అభ్యంతర పెట్టగా జిల్లాకోర్టులో శంకరయ్యగారివద్దకు విచారణకు వచ్చెను. శంకరయ్యగారు వివాహమున కనుజ్ఞనిచ్చుచు, శారదాగారి చట్టము త్వరలో అమలులోనికి వచ్చుచున్నది గావుననే తానిట్టి ఉత్తరవు నిచ్చుచున్నానని వ్రాసిరి. పాపము ఆయనకు బాల్యవివాహమందలి అభిమానము మితిమీరుటచే కాబోలు బాల్యవివాహమును ప్రశంసించుచు తీర్పును వ్రాసెను. బాల్యవివాహమువలన పిల్లలు చెడిపోరట. చెడుస్నేహము లబ్బవట. అందుచే త్వరలో చట్టము రానుండుటచే ఈ వివాహమున కనుమతించుచున్నానని జడ్జీగారు తీర్పునందు వ్రాసిరి. బాల్యవివాహములగూర్చి అభిప్రాయములను మేము విమర్శింపము. కాని కేసుయొక్క లోపాలోపముల నటుంచి శారదాచట్టము నాధారముగా జేసికొనిమాత్రము తీర్పును వ్రాయుట గర్హ్యానీయము.

ప్రభుత్వము ఆమోదించిన ఈ చట్టమును ప్రతిఘటించుటకు పూర్వాచార పరాయణులు అనేక ఉపాయముల నాలోచింపవచ్చును. కాని ప్రభుత్వసేవకుడైన శేషన్నజడ్జీగారు బెంచిమీదనుండి శారదాచట్టమును నిరసించి దానినుండి తప్పుకొనుటకు దారిచూపుట అక్రమము. దేశమందలి నాయకప్రముఖుల అంగీకారముతో చట్టమైన శారదాచట్టమును శంకరయ్యగారు బెంచిమీదనుండి నిరసించుట సాహసమే.

శారదాబిల్లు 1930 వ సం|| ఏప్రిల్ వరకు అమలులోనికి రాకుండుటయే చట్టములో లోపమని మా అభిప్రాయము. ఈలోగా ఛాందసులు తొందరగా కండ్లు తెరువని పసిపాపల కంఠములకు ముళ్లు పెట్టు ప్రయత్నములు చేయుట కవకాశము కలుగుచున్నది. అప్పుడే కోనసీమలో ప్రారంభమైనవి. ఈమధ్యనే కాకినాడలో ఒక విద్యావంతుడగు బ్రాహ్మణ ప్రముఖుని ఇంట 8 ఏండ్ల బాలికకు 12 ఏండ్ల బాలునికి సుమారు 20 వేల కట్నముతో వివాహమైనది, ఆషాఢమాసము, మూఢమువంటి అభ్యంతరములుకూడ తొలగిపోయి ఆపద్ధర్మముహూర్తములందు పెండ్లిండ్లగుచున్నవి. ఈ వివాహములకు ప్రతికూలప్రచారమును చేయు టెంతయు అవసరము. యువజనసమితులు ఈ విషయమై శ్రద్ధ వహింపవలెనని హెచ్చరించుచున్నాము."

## రైతు—భార్య సహకారము :—

బెజవాడబస్తీయందు నవంబరు ౬-వ తేదీనాడు కూడిన ఆంధ్రదేశ రైతు మహాజనసభకు అధ్యక్షత వహించిన ప్రొఫెసరు గోగినేని రంగనాయకులుగారు (బి. లిట్, ఆక్జన్) తమ ప్రారంభోపన్యాసమునందు 'రైతు—భార్యసహకారము' అను విషయమును గూర్చి యిట్లునుడివి యున్నారు:—

"ఇంటిలోని స్త్రీలు సహకారము చేయనిచో రైతు సంకల్పించు సర్వక్రియలు ఫలములేని వగుచున్నవి. సాంఘిక గౌరవమని భ్రమజెంది క్రొత్త నాగరికత యని ఉబ్బూట లూరి మన రైతులలో ననేకులు ప్రత్యేకముగా మాగాణి రైతులు, అందు ముఖ్యముగా కమ్మ, తెలగ, క్షత్రియులు తమ స్త్రీలను గోషా యని పేరుపెట్టి ఇండ్లయావరణములయందు మూసి మూతవేసి తమ సంసారజీవితమును నిస్సారముచేసికొనుటేగాక ఆర్థికజీవితముకూడ నిస్సత్తువైన దానిగా జేయుచున్నారు. పగలంత పొలములలో పనిజేసి వచ్చిన రయితులకు నీడను గోళ్లు గిల్లుకొనుచు ఓసిపో వేయన్న నోసిపో వేయంచు నీ వెంతయనిన నీ వెంతయనుచు గౌరవప్రతిపత్తుల దిగనాడి యిరుగు పొరుగు వారలతో పోట్లాడి నోరువాసన జేసికొనుచుండు భార్యలెట్టి సుఖమీయ గల్గుదురు? పనిచేయనివారు పనిచేయువారి కష్టముల నెఱుంగుదురా? పొలములో కష్టించని భార్య కృషీవలునియొక్క శ్రమను అర్థముచేసికొనగల్గునా? పొలమునకు అన్నము తేని భార్య—ఊచబియ్యము తెచ్చి వండని భార్య నిఱుపేదయగు హిందూదేశపు రైతునకు ఏమి సౌఖ్యము కల్గించగల్గును? పైగా సన్నసన్నని వస్త్రముల ధరించు భార్యను జేపట్టి అత్తరుల వాసనల నాఘ్రాణించి పరుపులపై బవ్వళించి సుఖడోలికలందుయ్యాలలాడ నేర్చిన రైతు తిరిగి కష్టజీవనమున కొప్పుకొనునా? కావున ఓ రైతుసోదరులారా! ఒక్కమాట జ్ఞప్తియందుంచుకొనుడు. కళ్లాములందు తిన్న తిండి యెంతరుచిగానుండునో అటులనే తన తోడుత కష్టించున భార్య రైతున కంతరమ్యముగా నుండును. కష్టపడుచున్న తనభార్య "చెక్కిళుల బట్టొడు ఘర్మము గాంచి యంతనాబడలిక చూడలే కిడుమపాట్లకు జొచ్చి నలంగితంచు నెక్కుడు తమకంబుతోడ దల గ్రుచ్చి కవుంగిట గూర్చు" రైతు యెంతసుఖుడో గమనింపుడు.

భార్య సహకారమున్న ఐదుయకరముల రైతునకు పాలేరు అవసరముండదు. భార్య పొలమునకు అన్నముదెచ్చుచో ఆమె మరొకచేలో పనిని పైజాగ్రత్తచేయుచో ఆమె యింటివద్ద పశువులమేపుకొరకు లోని యెద్దులమేత యెగజేసి ఆవు, గేదల పాలను పిండి నెయ్యి, పెరుగులనమ్మి రైతు ధాన్యరాసుల కాపలాగాసి జొన్నచేలోనుండి కాపల పారద్రోలి, మాగాణిగట్లనుండి గడ్డినికోసుకొనివచ్చి మినపకాయ పిల్లిపెసరల నేర్చుకొనివచ్చి పొలములోని దిబ్బలపై వామిప్రక్కన స్థలములో యింటివెనుక పెరటిలో కూరగాయల పండ్లకాయల పండించుచో రైతున కెన్నివిధముల లాభమో విచారింపరాదా ? భార్యయున్న ఇద్దరుపాలేరులున్నట్లే, భార్యయున్న తమ్ముడొక్కనికంటె హెచ్చు ప్రయోజనముకల్గును. భార్యసహాయ మున్న ఇంటి యిష్టదేవత రైతువ కుడిభుజముగా నిలబడినట్లే. ఇందులకు సందియ మేమాత్రము లేదు. ఆమె యిప్పుడు పనిజేయమిచే అజీర్తివగయిరా వ్యాధులాపెకు కల్గుట, వైద్యపుఖర్చులు హెచ్చుగుట కల్గుచున్నది. ఆమెచేయదగు కార్యములన్నిటికి ఇతరుల నేర్పరచుట, వారికి జీతమిచ్చుట ఆజీతమంతయు రైతునకు జేరకుం డుట, అంత రైతుభృతి జరుగుటే కష్టమగుట తటస్థించుచున్నది. పైగా రైతాంగమందుగల సగపుప్రజ, ఊరక తిని కూర్చొనుట, అందువలన, దేశమున ప్రతివత్సరము చేయబడు కృషితగ్గుట, చేయబడిన కృషినుండి పని జేయనివారు భాగమునొంది కృషిజేయు వారికివచ్చు భాగమును తగ్గించుట కల్గును. ఇందువలనే ప్రస్తుతపు రైతులుదుస్థితి మరింత దుర్భరమగుచున్నది.

ఇట్లన్న రైతాంగమునందు స్త్రీలందరు పనిజేయుట లేదనికాని, ఘోషా యందున్నారనికాని అనుట కాదు. నందిగామ, వంగోలు, పల్నాడు-వినుకొండ తాలూకాల కమ్మవారు బందరు, పెద్దాపురము, రాజమండ్రి. దివితాలూకా కాపులలో హెచ్చుమంది పొలములలోనికి వెళ్లి, పనిచేయుచు, తమ తమ భర్తలకు తగు సాహా య్యము చేయుచున్నారు. దత్త మండలముల రెడ్డి యువతులుకూడను పొలములందు పనిజేయుటకు సంశయిం చుటలేదు. కాని, స్త్రీలు పొలములందు పనిజేయుట తప్పను భావము, స్త్రీలకు సాంఘికస్వాతంత్ర్య మిచ్చుచో పాతివ్రత్యము పోవునను దుర్భ్రమ, స్త్రీలచే పని చేయించుకొనుట నాగరకతాలక్షణముకాదను భయము, మన క్రొత్తనాగరికుల, చదువుకున్న రైతుల హెచ్చుగా నావరించు చున్నవి.

కాని వారికి సుగాత్రివంటి సుందరీమణుల సొగసు, సౌందర్యము, పాతివ్రత్యమాహాత్మ్యము సరిగా తెలియుట లేదు. తోటలో "తగుచోట్ల తవ్వుగోల త్రవ్వి త్రవ్వి వడినిట్టు నట్టును నడచి నడచి, మళ్ళకు మడవలు మార్చిమార్చి నింపువదగు మోపులు మోసిమోసి, నేమిటికైన దామున్న యేగియేగి యెల్ల పనులు నొనర్చు" నారీమణుల సత్వము, తత్వము నెరింగిన రైతులకు, స్త్రీ స్వాతంత్ర్యమన్నను, స్త్రీలు పనిచేయు టన్నను గౌరవము, ముచ్చట యని తెలియనొప్పు.

ఇతరదేశములందైన, స్త్రీలు పనిచేయుటలేదా ? అమెరికా, ఇంగ్లండు దేశములం దింకను రైతు భార్యలు భూములందుగల పనులలో కొంతసహకారము జేయుచున్నారు. డెన్మార్కు, బెల్జియము, ఫ్రాన్సు, ఇటలీదేశములందు, రైతుభార్యలు హెచ్చుగా యన్ని పనులందును సహకారము జేయుచున్నారు. నాగరికత జెందిన, టెన్నిసు లాదిగాగల యాటలాడు సాంఘికమర్యాదలం దారితేరిన యీ యితరదేశపు యువతులిట్టు తమ భర్తలకు సాయము జేయుచుండ, బీదతనమందున్న, అప్పులందుజిక్కియున్న, నష్టకరమగు వ్యవసాయము ననుసరించు, మన ప్రజలకేల యీ పిచ్చితనపు నాగరికత."



## బట్టతల ఉండేడబ్బువస్తుంది:—

ఇంగ్లండులోని 'మాంచెస్టరు గార్డియను' పత్రికలో ఈ మధ్య క్రిందిప్రకటనము చేయబడెను. "బట్టతలలుగల పెద్దమనుష్యులు పండ్రెండుగురు కావలెను. వీరి తలలపై మావ్యాపారమునకు సంబంధించిన ప్రకటనలను చేయుదుము. తలలపై రంగు రంగులతో చేయబడు మా ప్రకటనలు ఆతలలుగలవారి ఆరోగ్యమునకు ఏ విధమైన హానియు చేయజాలవని చేయెత్తి చెప్పగలము. రంగు రంగులతో చిత్రింపబడు మా ప్రకటనములు గల తలలతో వారు బహుజనులు సమావేశమగు ప్రార్థనసమాజములు, నాటకశాలలు, పాటకచేరీలు మున్నగు ప్రదేశములకు పోయి అచ్చటి ప్రదర్శనము లగువఱకు ఆచోట నుండవలయును. అట్టి సమయమున వారు తలలపై ఏమియు కప్పుకొనరాదు. వీరిని ఇతరులు హేళన చేయకుండుటకును, ఇతరమగునెట్టి ఉపద్రవము చేయకుండుటకును వారివెంట నొక నౌఖరును పంపుదుము. ప్రవర్తనమునందెట్టి కళంకమును లేక గౌరవజీవనము చేయుచు బట్టతల గలిగియుండు పెద్దమనుష్యులు మాత్రమే ధరఖాస్తులు పంపవలెను." ఈ ప్రకటనమును బట్టి ఇక బట్టతల అందవికారముగనుండి మానవునికి చిత్తవైకల్యము గల్గించుటకు బదులు అర్థసంపాదనసాధనముగనుండి విశేషముగ కాంక్షింపబడును కాబోలును? ఆహా నాగరికమహిమ!

## గ్రుడ్డివారలకు పత్రిక:—

గ్రుడ్డివారులకు గూడ పత్రికలు వెలువడుట శుభచిహ్నము. ఇంగ్లండులో ప్రకటితమగు హాస్య భరితమగు "పంచి" పత్రిక నికమీద గ్రుడ్డివారల కుపయోగించెడి అక్షరములతో కూర్చి ప్రకటించెదరనియు, మామూలు పత్రికకన్న నిది చాల పెద్దదిగా నుండుననియు దెలియుచున్నది. ఇట్టి పత్రికలు వెలువడుచో అంధులకు పత్రికలు లేని కొరతగూడ దీరిపోగలదు.

## సంజీవనీమూలిక:—

మొక్కలయొక్కయు జంతువులయొక్కయు హృదయములమీద ఓషధులెట్లు పనిచేయునోయని సర్ జగదీశ చంద్రబోసుగారు తమ ప్రయోగశాలలో ప్రయోగించిరి. ఒక మూలికలోని ద్రవ్యముల గుణము సాధించిరి. అది హిమాలయపర్వతములందు లభ్యమానమగును. దాని గుణములను బట్టి అది సంజీవనీమూలిక

యని నిశ్చయించిరి. కీటకములు మొదలగువాని కుండినట్లే మొక్కలకును క్రమమగు హృదయస్పందన ప్రకృతి కలదు. మొక్కలకు గల హృదయస్పందన ప్రకృతి యందు రెండుకోశములుండును. వానియందు మొక్క యొక్క జీవరసము పైకిని క్రిందికిని ప్రసరించుచుండును. విషమూలికయొక్క రసమును ఒక మొక్కలోని కెక్కింప దానివలన దాని హృదయము ఆగిపోయినది. అప్పుడు ఈ సంజీవిమూలికారసమును ఎక్కించగా కొంచెముసేపటికి దాని హృదయస్పందనము ప్రారంభమైనది. ఈ సంజీవనీమూలికరసమును ప్రయోగింపగా హృదయనాళములందలి విషదోషములు పోయినవి; అసాధారణ శక్తి ఆపాదింపబడినది. విషప్రయోగమున చావ సిద్ధముగనున్న మొక్కలు పైమూలికయొక్క ప్రయోగమున అత్యద్భుతముగ ప్రాణవంతములైనవి. రెండునిముసములకు ముందు చావురూపుపడియున్న మొక్కలు సంజీవనీమూలికాప్రయోగము చేసినతోడనే తిరిగి శోభనొందినవి. ఓషధీప్రయోగమువలన జంతువులలోను మొక్కలలోను సమపరిణామము గలదను విషయమును బోసుగారిదివరకే కనుగొని యున్నారు. కాని ఇపుడొక కప్పమీదను ఈప్రయోగము చేసిరి. విషప్రయోగము చేయగా కప్పగుండె కొట్టుకొనుట నిలచిపోయెను. నూతనముగా కనుగొనబడిన మూలికయొక్క రసమును అప్పుడాకప్ప శరీరములోనికి ఎక్కించిరి. నిలచిపోయిన హృదయస్పందనము తిరిగి ప్రారంభమయ్యెను. అంతేకాదు. పూర్వముకన్న ఆ కప్ప ఉత్సాహముతో ఎగురదొడగెను. అలనాడు లక్ష్మణ మూర్ఛ దేర్ప హనుమంతుడు ద్రోణాద్రినుండి తెచ్చినట్లు రామాయణమునందు చెప్పబడియున్న సంజీవిమూలికకు ఈ నాడు బోసుగారు హిమాద్రినుండి తెచ్చిన ఈ మూలిక సజాతీయమైనదా? కాలపురుషుడు నిర్ణయము చేయగలడు.

## చెవిలో తేలు:—

నలుబది రెండేండ్లు వయస్సుగల అబ్దుల్ రహీం అను ఒక మహమ్మదీయుడు బెంగుళూరు విక్టోరియా హాస్పిటలునందు విచిత్రమును, అసాధారణమునునగు వ్యాధికి చికిత్సను పొందెను. ఒకనాడు తెల్లవారుఝామునుండియు అతనికి చెవిలో భరింపరాని పోటుగలిగెను. సామాన్యమైన చెపిపోటుగా దలచి తానే స్వయముగా చెవిలో నది, ఇది పోసి మాన్ప జూచెను. కాని బాధ మరింత దుర్భరముగా నుండుటచే తొమ్మిది గంటలకు హాస్పిటలుకు చికిత్సార్థమై వచ్చెను. చెవిని పరీక్షింపగా గులివి యుండుటచే పిచికారీ చేయుటకు కంపౌండరుకు ఆజ్ఞయొసంగిరి. పిచికారి చేయగా చెవినుండి ఒకటిన్నర అంగుళము పొడవు గల సజీవమైన తేలు బయల్పడెను. పదినిముసములలో రోగికి నొప్పిగాని పోటుగాని లేక చెవి మామూలు స్థితికి వచ్చెను. ఈ తేలు హాస్పిటలు మ్యూజియమునందు ప్రదర్శనార్థమై యుంచబడెను. ఈకేసు అసాధారణమైనదిగా భావించి మెడికల్ ఆఫీసరుగా నున్న డాక్టరు సుబ్బారావుగారు ఇండియన్ మెడికల్ గజెటునందు ప్రకటించిరి.

## లక్షసంవత్సరములనాటి నీటిగుఱ్ఱము:—

లక్షసంవత్సరములక్రింద యీ ప్రపంచమున నుండిన నీటిగుఱ్ఱములు ఏనుగులంతవి యుండెడివి. అందొకటి యొకగుంటలోబడి చనిపోయెను. ఈగుంట నేడొక కిరసనాయిలు నూయియై యున్నది. పోలండునందలి క్రాకోవిశ్వకళాపరిషత్తునపండితుండగు గోటిల్ దీనిని కనుగొనెను.

# వనితాలోకము

**యు. అభయాంబాళ్ :—**

మైసూరునందలి మహారాణి కళాశాలలో అర్థశాస్త్రోపాధ్యాయిని. అర్థశాస్త్రమున ఉన్నతవిద్య బడయుటకు ఇంగ్లండు పోయియున్నది.



సీతాజగుమాల్ నర్సియను కన్య

**మనోన్మోహిని జుట్షి కన్య :—**

లాహోరునగర మందలి ప్రభుత్వ కళాశాలకు చెందినది. ఈమధ్య లాహోరు నగరమున జరిగిన అఖిల పాంచాలీయ విద్యార్థి మహాసభకు ఆహ్వానసంఘాధ్యక్షురాలుగా నుండినది.

**త్యాంబిసతి :—**

గౌరవనీయులు, మధ్యపరగణాల ప్రభుత్వ సభ్యులును నగు త్యాంబిగారిసతి. నాగపురనివాసిని. కొలది దినముల క్రితము యోటమాలు నగరమున జరిగిన మధ్యపరగణాల మహిళాసభకు అధ్యక్షురాలుగా నుండినది.

**సీతాజగుమాల్ నర్సియను కన్య:—**

ఈమె కలకత్తా విశ్వవిద్యాలయమున బి. యె పట్టము నొందినది. అనంతరము విద్యాసముపార్జనమునకై విదేశములకు పోయినది. గ్లాస్గో విశ్వవిద్యాలయమున జి. టి. టి. సి పట్టము నొందినది. లండను విశ్వకళాపరిషత్తున యఫ్. ఆర్. జి. యస్ పట్టమును బడసినది. లండను రాయలు ఏషియాటికు

సొసైటియందు సభ్యురాలుగా నుండినది. హైదరాబాదు నందలి మునిసిపలు పాఠశాలలకు పరిపాలనాధికారిగా నియమింపబడినది.

సుభద్రా దేవి :—


ఆర్. రుక్మిణి అమ్మాళ్

ఈమె జర్మను జాతికి చెందినది. అసలు పేరు చార్లటి క్రౌసీకన్య. గొప్పవిదుషి. పి. హెచ్. డి పట్టము నొందినది. క్రైస్తవమతమును విసర్జించి జైన మతమును స్వీకరించి తదుచితమగు సుభద్రాదేవియను నామమును దాల్చినది.

ఇ. ఓల్సన్ కన్య :—

ఈమె ఎం. ఏ పరీక్ష నిచ్చిన గొప్ప విద్యావతి. తంజనగరము నందలి ప్రాచ్యపరిశోధన సంఘమునకు అధ్యక్షురాలుగా నెన్నుకొనబడినది.

శ్రీమతి ఆర్. రుక్మిణి అమ్మాళ్ గారు :—

లేడీవెల్లింగ్డను వైద్యపాఠశాలకు చెందినది. మద్రాసు నగరమునందు జరిగిన సంగీతపు పోటీపరీక్షలో ప్రథమబహుమానమును బడసిన యువతీరత్నము.

ఇ. యస్. బ్రిట్టో కన్య :—

బి. యె. యల్. టి పట్టము నొందినది. సబ్ అసిస్టెంటు ఇన్స్పెక్ట్రెసు ఆఫ్ స్కూల్సు అధికారమును నొందియున్నది. ఉత్తర ఆర్కాటు జిల్లా విద్యాసంఘమునకు సభ్యురాలుగా నియమింపబడినది.

సుబూరుఖము గసేతు కన్య :—

మంగళూరు నందలి సెంటు ఆగ్నీసు కాలేజీలో ఇంటరుమీడియేటు పరీక్షకు చదివి జయముగాంచి కృపాబాయి బంగారుపతకమును బడసినది. మద్రాసునందలి రాజధానీ కళాశాలలో ప్రస్తుత మీమె ఆనర్సుతరగతిలో చదువుచున్నది.

వాసంతిరాయి సతి :—

లెఫ్టినెంటు కల్నలు డి. జి. రాయి ఐ. యమ్. యస్. గారి సతి. ఈమధ్య మంగళూరు నగరమున జరిగిన మహిళాసభకు అధ్యక్షురాలుగా ఎన్నుకొనబడినది.




మగడు కాడు మారకుడు:—

బాబురావు నారాయణ మాళీయను నతడు బొంబాయి వి. యస్. మెడికలు కాలేజీలో విద్యార్థి. అహమ్మదునగరము జిల్లాబోర్డు యింజనీయరగు నానాసాహేబు మాళే ఈతని తండ్రి. నానా సాహేబు తమ్ముడు అప్పాసాహేబు. ఇతడు న్యాయవాది. అన్నదమ్ము లిరువురును అహమ్మదు నగరమున వారి వారి కుటుంబములతో కాపురముండిరి. బాబురావునకు 1927-వ సంవత్సరమున వివాహము జరిగినది. వధువు-ఆమె నామము ప్రయాగ-నైజాము ఇలాకా హింగోళి నివాసుడగు నొకా నొకా ధనికుని కుమార్తె. ఆమె వయస్సు పదునెనిమిది సంవత్సరములు. నిరుటి సంవత్సరము ఆగష్టుమాసమున బాబురావు తనభార్యను బొంబాయి నగరమునకు గొంపోయెను. ఆమెతోగూడ ఆమెచెల్లెలు-శాంతియనుపేరిది-పదిసంవత్సరముల బాలిక-బావయింటికివచ్చెను. బాబురావు తన భార్యపైగాని మరదలిపైగాని ఉచితమైన ప్రేమ చూపలేదు. తాను బయటికి పోవలసివచ్చినపుడు బాబురావు వారిరువురను యింటతాళముపెట్టి పోవుచుండెను. పొరుగింటివారు ప్రయాగతోగాని శాంతితోగాని మాట్లాడుటకైన వీలులేకుండెను. ఇంతమాత్రముకాదు. బాబురావు భార్యను కనికరములేక బాధించుచుండువాడు. ధనసాహాయ్యమునకై ఆతడు తన ఆలివంకవారికి అర్జెంటు టెలిగ్రాము లిచ్చుచుండువాడు. ఒకసారి అతని టెలిగ్రామునకు బదులుగా ధనమురాలేదు. అగుట నాతడు తనభార్య ప్రయాగ నొక్కతెను మఱునాటికి ధనము కొనిరా హింగోళికి పంపెను. మఱునాటికి ఆమె రాలేదు. అప్పుడు ఆతడు స్వయముగా అత్తింటికిపోయి తనభార్యను తనతో బంపుడని వారిని బలవంతము చేసెను. అందుమీద వారామెను ఆతనితో బంపిరి. టోంగాలోనెక్కి భార్యా భర్తలిద్దఱును స్టేషనునకు వచ్చిరి. వారిని దిగవిడుచుటకు వారివెంట ప్రయాగసోదరుడుకూడ వచ్చెను. స్టేషను చెంత బాబురావు తన భార్యమెడలో బంగారుగొలుసు ధరించియుండలేదని కనిపెట్టెను. కోపమువచ్చి ఆతడు ఆమెను ఆమె సోదరుని ఎదుట-బండివాని ఎదుట చెంపపెట్టు పెట్టెను. ఆమె సోదరు డిదిచూచి బంగారుగొలుసు పెట్టించి తీసికొని వత్తునని సోదరిని యింటికి గొనిపోయెను. ఇంటికి తీసికొని పోయినపిమ్మట ఆమె వంకవారు అప్పటికామెను బొంబాయి పంపకుండుటకు ఏవియో సాకులు చెప్పిరి. బాబురావు చేయునది లేక ఒంటరిగ బొంబాయికి తిరిగివచ్చెను. భార్యను తోడితెచ్చుటకు బాబురావు హింగోళికిపోవుచు తన మఱదలిని బొంబాయిలోని తనయింటబెట్టి తాళమువేసెను. ఆమెకు ఆహారము కిటికీగూండ నీయవలసివచ్చెను. ప్రయాగ పినతండ్రి బాపుసాహేబు శాంతియొక్క దుర్భరస్థితి తెలిసికొని వెంటనే బొంబాయికివచ్చి ఆబాలిక నెట్లో రక్షించెను. ఈసంగతి బాపుసాహేబు బాబురావు తండ్రికి తెలియజేయగా నాతడు ఆవిషయమై తగు విచారణ చేయుదునని మాత్రము చెప్పెను. బాబురావు తాను బొంబాయికి వచ్చిన రెండుగోజులకు

అత్తవారికి టెలిగ్రాము నిచ్చెను. అది ప్రయాగ పినతండ్రియగు బాపుసాహెబు యిచ్చినట్లుగా వ్రాయబడెను. అందిట్లుండెను. 'బాబురావు ఆకస్మికాపాయమునకు లోనైనాడు. అతనిస్థితి మిక్కిలి విషమముగానున్నది. వెంటనే ప్రయాగను బొంబాయికి పంపవలెను.' టెలిగ్రాములోని సంగతులు వినిన తరువాత ప్రయాగ ఒక్కనిముసము పుట్టినింట నుండలేదు. బయలుదేరి బొంబాయికివచ్చి వ్రాలెను. క్రిందటి సంవత్సరము నవంబరు పదియవతేదీని బాబురావు తండ్రి నానాసాహెబు బొంబాయికివచ్చి కొడుకుని కోడలిని అహమ్మదు నగరమునకు గొంపోయెను. మఱిమూడు దినములకు అనగా నవంబరు పదమూడవతేదీని బాబురావు పరీక్షలకు బొంబాయికి పోయెను. పోయిన కొద్దిరోజులకే తన శరీరారోగ్యము బాగుండలేదనియు తానింటికివచ్చి వేయుటకు అనుజ్ఞనిమ్మని అతడు తండ్రిపేర జాబువ్రాసెను. తండ్రి అనుజ్ఞనిచ్చెను. బాబురావు అహమ్మదునగరమునకు వచ్చెను. నవంబరు ముప్పదవతేది రాత్రి తొమ్మిదిన్నర పదిగంటల వేళ నానాసాహెబు కాపురమున్న రెండవ అంతస్తునుండి ఆడుదాని ఏడుపు కేకలు వినవచ్చెను. మఱికొంత సేపటికి ఒక పెద్దధ్వని విననయ్యెను. బాబురావు తనభార్యను ఆరెండవ అంతస్తునుండి క్రిందకుపడద్రోసెను. ఒక పీరుసమాధి చెంత వెనుక సందులో నామెపడెను. అట్లామె పడినతోడనే బాబురావు, అతని పిన తండ్రి, తండ్రి క్రిందికివచ్చి శవమును పైకి మోసికొనిపోయిరి. ఇట్లు మోసికొనిపోవుచుండగా బేడ్రెస్సుతో నున్న ఇరువురు పోలీసువారు చూచిరి. ఇదియేమని వారు ప్రశ్నించిరిగాని ముర్వురిలో నొక్కడుకూడ జబాబీయలేదు. అనంతరము పోలీసువారు బాబురావును హత్యానేరముక్రింద ఎరస్టుచేసిరి. ఇది ప్రాసిక్యూషను కథ. కేసు విచారణ యింకను ముగియలేదు.

## అన్నోదకములు అక్కఱలేని అంగన:—

శృంగవరపుకోట తాలూకా గంగుబూది అగ్రహారంలో ఒకసాలెమనిషి ఉన్నది. ఆమె రజస్వల అయిన కొన్నాళ్లకు పుట్టింటివద్దనుంచి గంగుబూదిలోని అత్తవారింటికి వచ్చుచుండగా మార్గమధ్యమున అకస్మాత్తుగా పడిపోయినది. ఆమెతోకూడ దిగబెట్టుటకు తండ్రి వచ్చుచుండెను. పడిపోయిన తరువాత ఎన్నిసార్లు పిలచినను ఆపిల్ల పలుకలేదు. దయ్యముపట్టినదేమో అని ఆమెను తిరిగి కన్నవారింటికి తీసికొనిపోయినాడు. అప్పటినుంచి ఎన్నిసాధనములు చేయించినా మాటలు రాలేదు. విశాఖపట్నము డాక్టరు ఆఫీసుకు తీసికొనివెళ్లి చికిత్స చేయించినాగాని మాటలురాలేదు. అన్నముతినుటలేదు. దాహము త్రాగుటలేదు. దేవుని మాహాత్మ్యమని, భీమునిపట్నములో నరసింహస్వామి దేవునిదగ్గరకు తీసికొనివెళ్లి కొండఎక్కి దేవునిదర్శించి కొండదిగుటకు రమ్మనమని తండ్రినిపిలచినది. అప్పటినుండి మాటలు వచ్చుచున్నవిగాని తిండితినుటయు, దాహముత్రాగుటయు లేదు. ఆమెను సుమారు ఒక ఏడాదివరకు మాటలురాలేదు. ఆమె ఎప్పుడైనను అర్ధరాత్రివేళ ఎవరికి తెలియకుండా ఏమైనా తినుచున్నదేమో అని పుట్టింటివద్దను అత్తవారింటివద్దను చాటుగా కాపలావుండి చూచిరిగాని ఆమె ఎప్పుడునూ ఏమియు తినుట కాన్పింపలేదు. నేటికి సుమారు ఏడేండ్లు కావచ్చినది. అన్నోదకములు అవసరములేదు. వృత్తిపనులన్నియు చేయును. భర్తతో కాపురముచేయుచున్నది. ఇపుడు నాలుగేండ్ల యీడుగల ఆడపిల్లయున్నది. ప్రస్తుతము గర్భము ధరించియున్నది. ప్రసవమైన తరువాత పిప్పలిగాని, కాయముగాని, యింగువగాని ఆమెకు అవసరములేదు. బ్రాందివగైరాలు అవసరములేదు. పిల్లలకు పాలు సమృద్ధిగాఉండును. ప్రతిదినము మలమూత్రవిసర్జనము ఉన్నది. దంతధావనముచేయును. వంటచేసి భర్త పిల్లలు వగైరాలకు అన్నము పెట్టును. తానుమాత్రము వేరేఒకచోట కూర్చుండును. పగలు 10 గంటలు వేళప్పుడు ఒకగంట పరుండ నిద్రపోవును. అప్పుడు ఆమెకు శరీరస్మృతివుండదు. ఆమెలేచిన తరువాత స్వప్నముగాని లేదా ఎవరైనా స్వప్నావస్థయందు కనిపించుతారా అని అడిగితే నాకు జ్ఞాపకము ఉండదు అనిచెప్పును. అర్ధరాత్రివేళ ఆమెవద్ద ఒకవిధమైన మాధుర్యమైన సువాసన వేయును. ఇప్పుడు ఆమె వయస్సు సుమారు 23 సంవత్సరము లుండును. ఆరోగ్యవంతురాలైయున్నది. (బొమ్మిరెడ్డిపల్లి అప్పల నరసింహముగారు; 'ఆంధ్రపత్రిక')

# మంచూరియా స్త్రీలు

మంచూరియా దేశము ఉత్తరమున సైబీరియా; పశ్చిమమున మంగోలియా, చైనా దేశములు; తూర్పున కొరియా దేశము జపానుసముద్రములచే పరివేష్టితమైయున్నది. ముక్డను రాజధానీనగరము. ఆనగరము చుట్టును ఒక పెద్ద కోటగోడ నేటికిని గలదు. దానిచుట్టు కొలత పదిమైళ్లు. ముక్డను బజారు వీథులలో తిరుగుటకు మిక్కిలి ముచ్చటగ నుండును. ముఖ్యముగ ఇత్తడిపాత్ర లమ్ము దుకాణములుగల వీథులలో తిరుగుచో కన్నుల వైకుంఠమువలె నుండును. రకరకముల పాత్రలు, పనిముట్లు బయట ప్రకటనపత్రములకు వ్రేలాడునట్లు కట్టబడి యుండును. కొంచము గాలి వేయుచో నవి నేత్రానందకరములై యుండుటకుతోడు శ్రవణపుటపేయమగు శబ్దమును కూడ కలుగజేయును.



మంచూరియా దేశపు విద్యార్థినులు

బాగుగ పరికింపుడు. బాలిక లందఱును పాశ్చాత్యసాంప్రదాయమున దుస్తులను ధరించియున్నారు. సరిగెపట్టు, జరీమొదలగు వానితో వస్త్రములపై పూవులుకుట్టు విద్యను ఈబాలికలు నేర్చుకొనుచున్నారు. వారి ఎదుట బ్లాకుబోర్డుమీద నొకా నొకా పుష్పాకారమును చిత్రించుటకు కొలత లీయబడియున్నవి. వాని ప్రకారమా బాలికలు కన్నులలో కన్ను పెట్టుకుని తమ తమ చెంతనున్న వస్త్రములపై ఆపుష్పమును చిత్రించుచు నవ్యనాగరికపు దేశపు స్త్రీలతో సరితూగ పునాదులు వైచుకొనుచున్నారు.

ఆ దేశమున ఎలుగుబంట్లు విస్తారము. మంచూరియా దేశమున పలువురు వానిని బట్టి మచ్చికచేసి తమాషా పనులు చేయించుచు జీవనము చేయుదురు. ఆదేశమున అడవులు మెండు. పెద్దపులులు, చిరుతపులులు, ఎలుగుబంట్లు మొదలగు ఘాతుకమృగములు ఆ అడవులయందు మెండుకొని యుండును. వానిని వేటాడుటయందు మంచూరియాప్రజలు అమితోత్సాహమును జూపుదురు.

మంచూరియా దేశస్థులు పొడుగుపాటి గౌనులు తొడుగుకొందురు. మంచూరియా దేశపు పురుషులను చీనాదేశపు పురుషులనుండి ఆనవాలు పట్టుటకష్టము. వారి వేషము, రూపము ఇంచుమించుగా నొక్క పోలికనుండును. కాని చీనాదేశపు స్త్రీలకును మంచూరియా స్త్రీలకును వేషమునందు కాని రూపమునందు కాని ఎట్టి సారూప్యమునులేదు. వారు వేర్వేరు జాతులకు చెందినవారని అతిసులభముగ పోల్చుకొనవచ్చును.



తల్లిచేయిబట్టుకొని తప్పటడుగులిడుచు నడుచుచున్నాడు. పసిరిక చేలనడుమ పాముమెలికలవలె తిరిగి యుండు దారులవెంట నడచిపోవుటకు ఆచిట్టి చిట్టి పాదములు ఎంతకష్టపడుచున్నవో!

అమెరికను మిషనరీలువచ్చి మంచూరియా దేశమున తమ సంస్థలు పెక్కు స్థాపించిరి. మంచూరియా దేశపు రాజధానీనగరమగు ముక్డెనునందు అమెరికను మిషనరీలు స్థాపించిన పాఠశాలలలో మంచూరియా దేశపు బాలికలు విద్యబడయుచున్నారు. విద్యబడయుట మాత్రమే కాదు. వారివేషమునుగూడ అలవఱచుకొనుచున్నారు. స్వజాతీయులగు ఉపాధ్యాయినిలు పరంపరాగతమగు దుస్తులను మాత్రమే ధరించియుండ ఆమెయొద్ద విద్యగఱచు బాలికలు ఆదుస్తులను విసర్జించి అమెరికనుపద్ధతి దుస్తులను వైచికొని యుండుటచూడ మిక్కిలి ముచ్చటగనుండును. మొక్కజొన్నలు చిక్కుడుగింజలు ఆదేశము వారి ముఖ్యమైన ఆహారవస్తువులు. చిక్కుడు గింజలనుండి ఆదేశపుస్త్రీలు ఒక విధమైన కృత్రిమక్షీరమును తయారుచేయుదురు చిక్కుడుగింజలనే అచ్చటిస్త్రీలు కాఫీ చేయుదురు. ఆదేశమున పొగాకుకూడ పండును. అచ్చటచ్చట సిగరెట్లుచేయు ఫ్యాక్టరీలు గలవు. మంచూరియాదేశపు ప్రజలు ఇప్పుడిప్పుడే సిగరెట్లు త్రాగుటకు అలవడుచున్నారు.

పెక్కు ఎకరముల పొలము ఒకేచోటనుండి మంచూరియా కర్షకునకు పనిపాటల యందు కాలము చక్కగ కూడివచ్చును. పెద్దకుంపటి వినియమముగా ప్రతి కర్షకుని ఇంటియందును ఉండితీరును. గాడిదలు, కంచరగాడిదలు, ఎద్దులు మొదలగు జంతువు

లాతనికి వ్యవసాయమునందు మిగుల తోడ్పడును. ఆదేశమున కొన్ని ప్రదేశములందు పట్టుపురుగులను సాకుటకూడ గలదు.

మంచూరియా దేశమునందలి జట్కా-బండ్లు అతివిచిత్రముగ నుండును. రోడ్లు కంకర లేక బహుళముగా బురదతో నిండియుండునవిగా నున్నవి. కావున ఆబండ్ల చక్రములు చిత్రముగనుండును. చక్రముచుట్టును నునుపుతేరక ములకలు గలిగి యుండును.



మంచూరియా స్త్రీ శిరోభూషణము

జీవనాధారములను వెదుకుకొనుటయందే జీవము చిట్లము కట్టించుకొన నక్కఱలేని మంచూరియా స్త్రీలు ఎల్లవేళల అలంకరించుకొని ఆనందముతో నుందురు. ముఖ్యముగా వారి శిరోభూషణములు పరికింపదగినవి. పుష్పములు కుట్టబడిన టోపీవంటి వారి శిరోభూషణమును పటమున చూడనగును. చీనా దేశపు స్త్రీల వలెనే ఈదేశపు స్త్రీలుకూడ పాదములు ఎంతచిన్నవిగానుండిన అంత అందముగానుండునను అభిప్రాయమును గలిగియున్నారు. వేళ్లను కుంచించుటకును పాదములను మిక్కిలి చిన్నవిగా చేయుటకును వారు బిగువైన జోళ్లను ధరియింతురు. పైపటమునందలి స్త్రీలు ధరించినజోళ్లను చూడుడు.

జట్కా-గుఱ్ఱమునకు ఎండతగులకుండుటకు భూతదయాపరుడగు మంచూరియా దేశీయుడు దానిపైన చక్కని పందిరివంటిది వేయును. మోటారు కారులింకను ఆదేశమున విశేషముగ చొఱబాఱలేదు.

మంచూరియా దేశమున లోహపు గనులు విస్తారముగనున్నవి. బంగారము, వెండి, రాగి, లోహములు అందు ముఖ్యములు. బాణము సూటిగా వేయుటయందు మంచూరియా దేశస్థుడు మంచి నేర్పుగలవాడు. నడుముకి కట్టుకొను బెల్టునే ఆతడు అమ్ములపొదిగా నుపయోగించును.

అచ్చటి స్త్రీలు గొప్పపనివారు. ఎంతపనిచేసినను శ్రమయని విసిగికొనరు. గృహకార్యనిర్వహణమున గొప్ప వ్యగ్యహృదయము కలవారు. శౌచము, గృహకార్యనిర్వహణము, శిశుపోషణము మొదలగు స్త్రీల ప్రత్యేక కార్యములను సరిగా చేయుటయందు వారు యితర దేశస్త్రీల కెంతమాత్రమును తీసిపోరు.




బెజవాడ: ఆంధ్రమహిళాసభ:—

తెలుగు స్త్రీలసభ. తెలుగుదేశమునకు నడిబొడ్డుగా చెప్పబడుచున్న బెజవాడ నగరమున సమావేశము. అధ్యక్షురాలు మాత్రము తమిళకాంత. వినుటకు క్రమవిపర్యము సంభవించినట్లుగానే కనిపించ వచ్చును. కాని తత్వపరిశీలనము చేయువారికి ఇందు వ్యతికర మేమియునుండదు. తమిళులు, ఆంధ్రులు, మహారాష్ట్రులు ఇట్టి ప్రత్యేకజాతీయత నాశనమునొంది సమగ్రభారతజాతీయత పెంపొందుచున్నది. సమగ్రత్వము ఇంకను సమకూఱలేదని చెప్పి ప్రత్యేకత కొఱకు ప్రాకులాడువారికికూడ శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారు ఆంధ్రమహిళాసభకు అధ్యక్షత వహించుటలో నెట్టి అక్రమము పొడగట్టరాదు. ఏమందురా? ఆమె పుట్టుకచే తమిళకాంతయే. కాని ఆమె మెట్టినది ఆంధ్రుల గడప. ఆమె ఆంధ్రప్రముఖుని చేయివట్టినది. ఆమె ఆంధ్రులయింటి కోడలు. ఆంధ్రులయింటి కోడలైన ఆమె ఆంధ్రమహిళాసభకు అధ్యక్షత వహించుటలో వ్యతిక్రమము ఏమున్నది? శ్రీమతి ముత్తులక్ష్మమ్మగారివలెనే ఇతరజాతియందు జననము నొందినను ఆంధ్ర మహాపురుషుని చేపట్టుటచే ఆంధ్రులయింటికోడలై ఆంధ్రనారీమణియైన శ్రీమతి సరోజినీదేవిగారిని ఆంధ్రమహిళాసభలతోటిపాటే ఆసమయమునందే ఆనగరమునందే సమావేశమైన ఆంధ్రరాష్ట్రీయసభకు అధ్యక్షత వహింప ఆంధ్రప్రముఖులు ఆహ్వానించి యుండిరిగదా! కారణాంతరములచే శ్రీమతి సరోజినీదేవి ఆసభకు అధ్యక్షత వహించనిమాట నిజమే. కాని ఇతర జాతులయందు జననము నొందినను ఆంధ్రులతో సంబంధబాంధవ్యము గలిగి ఆంధ్రతాముద్రనొందిన వారు మన మహాసభలకు అధ్యక్షత వహించుటలో నెట్టి వ్యతిక్రమమును లేదని మాచేయు మనవి. వ్యతిక్రమములేనేలేదు సరిగదా, శ్రీమతి ముత్తులక్ష్మమ్మ

గారి అధ్యక్షతక్రింద సభ నిర్విఘ్నసమాప్తి నొందినది. వేళాకచో ముద్రితములైన ఆమె ఉపన్యాసములోని భాగములును, ఆహ్వానసంఘాధ్యక్షురాలగు శ్రీమతి తుర్లపాటి రాజరాజేశ్వరమ్మగారి ఉపన్యాసములోని భాగములును, సభలో చేయబడిన తీర్మానములును గమనించువారికి స్త్రీజనాభివృద్ధి హుటాహుటి నడలతో ముందుకు సాగుచున్నదను సంగతి సువ్యక్తము కాగలదు.



నళినితర్ఖాడుకన్య :—

నళినితర్ఖాడుకన్య :—

ఈమె మహారాష్ట్రి జాతికి చెందినది. బొంబాయియందలి సుప్రసిద్ధ కుటుంబములలో నొకటియగు తర్ఖాడు వంశమున జనించినది. తండ్రి పేరు సురేంద్రనాథుడు. ఆతనికి ఈమె తప్ప ఇతరసంతానము లేదు. ఆత్మారాముపాండురంగడు—గొప్ప సంఘసంస్కారి—ఈమె పితామహుడు. ఈమెతల్లి పూనాయందలి సుప్రసిద్ధవంశములలో చిప్లంకరుల ఇంటి యాడుపడుచు. ఆమె 1911–వ సంవత్సరమున జననము నొందినది. అనగా ఆమెకిప్పటికి పదునెనిమిది సంవత్సరములన్నమాట. ఆమె మాతామహుని పాదాంకముల చెంత కూర్చుండి ప్రాథమికవిద్యబడసినది. ఆమెకు చిన్నతనమునుండియు గొప్పకోరికలు ఉద్భవిల్లు

చుండెను. 'నృత్యవిద్యయందు గొప్పపేరు సంపాదింపవలెను. చిత్రకళయందు అపారయశ మార్జింప వలయును. సంగీతమున అద్వితీయురాలిని కావలయును. పాత్రధారణమున ప్రగమనశీలనై ప్రఖ్యాతినందవలయును.' అని ఆమె అహోరాత్రములు తపస్సుచేయుచుండెను. కలిగినవన్నియు సత్సంకల్పములు. క్రమముగా సిద్ధినొందుటలో ఆశ్చర్యము, అనుమానము కల్గుటకు తావులేదు. ఆమె తొలుత ఫిలిముకంపెనీలో పాత్రధారణమునకు దొరకొన్నది. బెంగుళూరు భవానీకంపెనీలో సంస్కృత నాటకరాజమగు శూద్రకుని మృచ్ఛకటికము ఫిలిమున కెత్తు సందర్భమున ఈమె వసంతసేన చెలికత్తెయగు మదనిక వేషమునుధరించినది. ప్రథమ ప్రయత్నమైనను ప్రశంసనీయముగ నిర్వహించినది. ఆనిర్వహించుటలో ఆమె ధనమునకు ఆశపడలేదు. తనయందు నిక్షిప్తమైయున్న పాత్రధారణకౌశల్యమును ప్రచురపఱచుటకే ఆమె ఇందుల కీయకొన్నది. విస్ఫారియందు కనుదమ్మిదోయి, విలాసవికసితమగు వదనము కలిసి అవర్ణ్యసౌందర్యము నాపాదింపగా నవయౌవనోద్భాసితమగు నామె సినీమానటినీ లోకమున అచిరకాలముననే పేరు ప్రతిష్ఠలు గడించుననుట నిక్కువము. చిత్రకళ యందును ఆమె సిద్ధహస్తురాలైనది. స్వభాషయగు మహారాష్ట్రమున ఆమె చక్కని గీతములను రచియించినది. సంకల్పించిన సంగీతనృత్యవిద్యలయందు సమధికపాండిత్యము ఆదీక్షావతి త్వరలో బడయగలదు. ఇట్టి వనితామణిని గన్న మహారాష్ట్రజాతి యెంత మహత్తరమైనదో ఎన్నుట సులభము కాదుగదా?

బీహారు రాష్ట్రము: ఘోషాతిరస్కార సంఘము :—

ఉత్తరహిందూదేశమున ఘోషాదురాచారము ప్రబలము. అందు బీహారురాష్ట్రమున దాని పట్టుహెచ్చు. ఆరాష్ట్రమున ఆంగ్లవిద్యాపాశమున బద్ధులైన పెద్దలుకూడ స్త్రీస్వాతంత్ర్యమనిన కలవరింతురు. ఆరాష్ట్రపు మంత్రులలో నొకడు 'నస్త్రీస్వాతంత్ర మర్హతి' అనుదానిని పంచాక్షరీ మంత్రమువలె పారాయణముచేయు పూర్వాచారపరాయణుడు. అట్టి రాష్ట్రమున ఘోషాతిరస్కారసంఘమొకటి బయలుదేరి శ్లాఘనీయమైన పనిచేయుచున్నదన్నచో నిజముగా మెచ్చదగిన విషయమే. ఈమెచ్చుకోలు తన రాష్ట్రమునకు గొనివచ్చిన మహాపురుషులలో రాయబహాదూరు విజ్ఞానందసింగుగారు తొలుత పేర్కొనదగినవారు. విజ్ఞానందసింగుగారి వంటి వినిద్రవివేకశాలురు పెక్కులు బయలుదేరి స్త్రీజనాభివృద్ధికి చిరప్రయత్న మొనర్చినగాని పతనమునొందియున్న మన భారతనారీలోకము ఉజ్జృంభితము కానేరదు.

# గ్రంథవిమర్శనము

## ఆంధ్ర బాలరామాయణము:—

ఇయ్యాది మహాకవి వాల్మీకి విరచిత సంక్షిప్తరామాయణమునకు నాంధ్రీకరణము. గ్రంథకర్త చింతపల్లి రామకృష్ణశాస్త్రి. గ్రంథము క్రౌనుసైజున 23 పుటలు. దీనిలో 106 గీతపద్యములుగలవు. అరయనరయ మూలగ్రంథము సులలితములగు పదజాలములతో పండిత పామరహృదయంగమముగా నున్నదనుట సర్వజన విదితము. ఆంధ్రీకరణముకూడ మూలగ్రంథములోని రసభావాదులను సమగ్రముగా పోషించుచు వాల్మీకికవన ఛాయను బోవుచున్నది. గ్రంథము సర్వజనసుబోధకములును సరసములును నగు పదములతో నొప్పారు తెలుఁగుగీతములతో చదువరుల నాకర్షించుచున్నది. గ్రంథమూల్యము రు 0-4-0 మాత్రము. వలయువారు గ్రంథకర్త పేర ఈమని (గుంటూరు జిల్లాకు) వ్రాసిన బడయగలరు.

—ఉభయభాషాప్రవీణ బులుసు నరసింహశాస్త్రి.

## నందకుమారవధ: చైతుసింగు:—

ఇవి క్రిందటి సంవత్సరము భారతి పత్రికయందుఁ బ్రచురింపఁబడిన వ్యాసములు. ఇప్పుడివి విశాఖపట్టణమునందలి కవితాసమితి వారిచే క్రౌనుసైజున 48 పుటల చిన్న గ్రంథముగాఁ బ్రకటింపఁ బడినవి. రచయిత మొసలికంటి సంజీవరావుగారు. గ్రంథపీఠికయందు "చరిత్ర కేవలము విద్యార్థులకును కేవలము ఉపాధ్యాయులకును మాత్రమేగాక సర్వజనసమ్మతమై యుండవలయు"నను మహదాశయమును వెల్లడించినను వీరి వ్యాసములట్టి సర్వజనసమ్మతమైన ధోరణిని వ్రాయబడినట్లు గానరావు. ముఖ్యముగా నందకుమారవధ యను వ్యాసము కళాశాలయందుఁ జరిత్రమునఁగొంత ప్రవేశమున్నవారికే బోధపడునట్లున్నది కాని కళాశాలయందుఁ జరిత్రమభిమాన శాస్త్రముగాఁ బఠించియుండని విద్యార్థులకైన దురవగాహ మగునట్లున్నది. ప్లైవునకుఁ దరువాత మన దేశమున బ్రిటిష్ ప్రభుత్వ స్థాపనమునకు మూలకారణుఁడైన వారన్ హేస్టింగ్సు బుద్ధిపూర్వకముగాఁ జేసియుండిన కొన్ని క్రూరకార్యము లీ గ్రంథమున విమర్శింపఁ బడినవి. అప్పటి బ్రిటిష్ రాజనీతి యెంతటి ఘోరకార్యములకైన సంసిద్ధమగుచు కడకీవిశాలభారతవర్షమును కబళింపఁగల్గెనో ఒక్క వారన్ హేస్టింగ్సుయొక్క చరిత్రమే వేనోళ్లఁ జాటఁ జాలియున్నది. అతడు చేయఁ బాల్పడిన యకృత్యములలో వంగదేశమున బ్రాహ్మణమతమున కాచార్యుఁడై మహారాజ పదమునందున్న నందకుమారుని చంపించుటయు, కాశీరాజ్యాధీశ్వరుఁడైన చైతుసింగును రాజ్యభ్రష్టు నొనర్చుటయు బ్రథమగణ్యములు. సంజీవరావుగారీ విషయముల గూర్చి వ్రాయుచు వానినిగూర్చి తమకెంత తెలియునో పాఠకులకుఁ గూడ నంత తెలిసి యుండునన్న రీతిని ఆయా విషయముల విమర్శించుచు వ్రాసినట్లున్నది కాని అవి తెలసి యుండని సామాన్యపాఠకులకు సుబోధ్యమగునట్లు వ్రాసినవారు కారు. నవలాకారులని కొంత ప్రఖ్యాతి నొందియున్న సంజీవరావుగారు

జాతీయ ప్రబోధమునకుఁ జక్కఁగాఁ దోడ్పడు నిట్టి గ్రంథముల వ్రాయదొరకొనుట కభినందించుచు ముం దిట్టి విషయముల తాముచెప్పునపుడు కథలభంగినైన వ్రాయుదురుగాక యని కోరుచున్నాము. గ్రంథమువెల 0-12-0. వలయువారు విశాఖపట్టణములోని కవితాసమితి కార్యదర్శిగారికి వ్రాయవలయును.

—దివాకర్ల సోమసుందరరావు.

కథాకుసుమమంజరి:—

ఇదియొక చిన్న వచనకావ్యము. గ్రంథకర్తలు విద్వాన్. టేకుమళ్ల పాపయ్యశాస్త్రిగారు. గ్రంథము క్రౌనుసైజున 63 పుటలు. ఇందులో 8 కధలు మాత్రము కలవు. శైలిబాలురకుఁగూడ విస్పష్టముగాఁ దెలియునదిగా నున్నది. కధలు అపూర్వములు కావు. కాదంబరి, దశకుమారచరిత్రము, మహాభారతము నుండి తీయఁబడినవి చిన్నతరగతిబాలురు చదువుటకు నెంతయు సమంజసముగా నున్నది. ఇందలిగోమిని, ధూమిని కథలలో నించుకమార్పు చేయవలసి యున్నది. ప్రకటనకర్తలు ద్వితీయముద్రణమున నట్టిమార్పు చేయింతురు గాక. గ్రంథము వెల రు 0-6-0 మాత్రము. వలయువారు ప్రకటన కర్తలకు, కే. టి. దేవరాజులునాయుఁడు అండు, కో. కు వ్రాసినఁ బడయగలరు.

—ఉభయభాషాప్రవీణ బులుసు నరసింహశాస్త్రి.

ధన్యమణిహారము:—

ఇయ్యది తిరుపతి వాస్తవ్యులగు బ్రహ్మశ్రీ నాగపూడి కుప్పుస్వామయ్యగారిచే రచింపఁబడిన "స్తవరత్నావళి" అనుగ్రంథాంతర్గతమగు నొకభాగము. దీనియందుఁ బది శ్లోకములు మాత్రమే యున్నవి. దీనికి శ్రీ పచ్చయప్ప పాఠశాలాంధ్రపండితులగు, బ్రహ్మశ్రీ తూ॥శా. విశ్వనాథ శాస్త్రులవారు శాణోల్లేహన యను పేరిట నాంధ్రవ్యాఖ్యను వ్రాసిరి. శ్రీ వారు లిఖించిన వ్యాఖ్యాన సహాయమువలన గీర్వాణభాషయం దిసుమంతయుఁ బ్రవేశములేనివారు సయిత మిందలి శ్లోకాభిప్రాయములను బాగుగా గ్రహించి యానందింపఁ గలరని నా యభిప్రాయము. మరియు నిందలి శైలి గడుంగడు సులభపదసంయుతమై యలరారుచున్నది. కాన సంస్కృత భాషయందుఁ బరిచయ మించుక కల్గిన మోక్షకాములగు భక్తాగ్రణులకెల్ల స్వయముగా నత్యుత్సాహముతోఁ జదువ నీగ్రంధ మెంతయుఁ దగియున్నదని నిశ్శంకముగా నుడువవచ్చును. అందుచే సర్వజన వేద్యమనందగు సులభశైలిని గ్రంథరచన మొనర్చిన యేతద్గ్రంథప్రణేతలెంతయు శ్లాఘాపాత్రు లనిన నతిశయోక్తి కాఁజాలదు. ఇందు క్రౌనుసైజున పదునాలు పుటలుగలవు. వెలతెలియదు. వలయువారు. రేణిగుంట పాపనాయనిపేట. యస్. బి. కె. పబ్లికు లైబ్రరి కార్యదర్శిగారికి వ్రాసినఁ బడయగలరు.

—విద్వాన్ టేకుమళ్ల పాపయ్యశాస్త్రి.

చంద్రమౌళి:—

ఇదియొక సంస్కృత గద్యకావ్యము. గ్రంథకర్త్రి, అ. రాజాంబ. గ్రంథము క్రౌనుసైజున 252 పుటలు. ఇతివృత్తము కల్పితమువలె తోఁచుచున్నది. కవనము దివిజగంగాప్రవాహిని. అయ్యును, దీర్ఘసమాసములుగాని, కఠినపదములుగాని, పిచ్చిపిచ్చి వర్ణనలుగాని, మచ్చునకైనను గానరావు. శైలి సర్వజన హృద

యంగమము. గ్రంథములో "గృహకృత్యముల కుపయుక్తములగు సాధసామగ్రి పేరులు చాలమట్టుకు చూపఁబడినవి. విశేషించి పాకశాస్త్రమును గూర్చి చెప్పఁబడి యున్నది." అని పీఠికలో గ్రంథకర్త్రి చెప్పినది యెంతయు సత్యము. కవయిత్రి స్త్రీయయ్యును స్త్రీజనుల నైసర్గికదుర్గుణములు మున్ముందుఁ జూపి పిమ్మట వానిఁ దొలగించు నుపాయములుకూడఁ జూపెను. చతుర్వర్గసాధనహేతువు గార్హస్థ్యమేయనియును, గృహస్థాశ్రమముయొక్క విలువయును, తదితరాశ్రమములు గృహస్థాశ్రమముకంటె న్యూనములనియును సముచిత రీతినిఁ జెప్పెను. ప్రౌఢవివాహమే యత్యుత్తమమనియును, బాల్యవివాహ మెంతయును దుర్భరదుఃఖముల కాటపట్టనియును దెల్పెను. తన వివిధశాస్త్రపరిచయము నాయాతావుల తేటపఱచెను. ప్రకరణానుగుణ్యముగా బాణకవికృత పార్వతీపరిణయ నాటకము గ్రంథమున పొందుపఱచెను. ఇప్పుడు మృతప్రాయమగు గీర్వాణభాషను నిట్టి యుద్గ్రంథరచన నారంభించిన విదుషీమణులలో మన యాంధ్ర దేశమున నీమెయే ప్రథమురాలని చెప్పవచ్చును. రాజాంబగారు ఇట్టి గ్రంథము లనేకములు వ్రాసి స్త్రీ విద్యాభివృద్ధికిని మృతప్రాయమగు సంస్కృతమును జెంపొందించుటకు యత్నించుగాత అని కోరుచున్నాము. గ్రంథము వెల రు 1-8-0 వలయువారు. ఎ. ఎస్. శివఅండ్. కో, గిండీరోడ్డు, అడయారు. అని వ్రాయునది.

—ఉభయభాషాప్రవీణ బులుసు. నరసింహశాస్త్రి.

## ఇప్పుడు:—

గ్రంథకర్త భమిడిపాటి కామేశ్వరరావుగారు. క్రౌను సైజున 136 పేజీలు. ఫెదరువెయిటు కాగితములు. రేపరుబైండు. వెల రు 0-8-0 మాత్రము. ఈ గ్రంథము 'బాగు బాగు', 'ఎప్పుడూ ఇంతే', 'కచటతపలు' అను మూడు ప్రహసనములు గల సంపుటము. పుస్తకనామము కొంతవింతగానున్నను కొందఱు వివిధపరిశిష్టలనిచ్చి సమర్థించిరి. గ్రంథకర్త నేటికాలపు సంఘమును బహుసూక్ష్మముగా పరిశీలించి అందలి లోపాలోపముల నీప్రహసనములలో దెలియబఱచెను. ఇప్పటి సంఘస్థితిని ఒక్కమాటలో తేల్చివేయ సాధ్యముకాదు. ఏలనన పరస్పర విరుద్ధములగు అనేకవిషయములు ప్రస్తుతము సమన్వయ పరుపబడు చున్నవి. అనగా జాతీయత, అజ్ఞానయుతములగు పూర్వాచారముల నణచివేయుట, వాడుక హిందూమతములోని దురాచారములు నాశనము చేయుట, స్త్రీ స్వాతంత్ర్యము, ప్రకృతిశాస్త్రజ్ఞానము, విదేశపాలనలో దేశప్రేమ మాతృభాషాప్రేమ అలవరచుకొనుట యిత్యాదివిషయములు సామాన్యులను కలవరపరచి చంచలమతులుగ జేయు పెక్కు వ్యతిరేక విషయములు సమన్వయపరుపబడుచున్నవి. సంపూర్ణసమన్వయము కావలసినవి పూర్వస్థితి ప్రస్తుత సంఘస్థితి. ఈ స్థితినే గ్రంథకర్త తన ప్రహసనములందు చిత్రించి యున్నారు. జీవితగాంభీర్యమెరుగని యువ విద్యార్థులలోని యశోవాంఛ, అద్భుతఘనకార్య నిర్వహణాభిలాష, అసహనము, ఈర్ష్య, నిస్సంఘీభావము, శిక్షలేమి, ఒంటరితనము, బహునాయకత్వము మొదలగు దుర్గుణములిందు చిత్రింపబడినవి. ఈగ్రంథమునం దాంగ్లశబ్దము లధికముగావాడబడియుండుటచే అందరుజనులుగాక ఆంగ్లవిద్యార్థులు మాత్రమే యిందలి రసమాస్వాదించ గలుగుచున్నారు. ఆంగ్లము వాడుట తప్పని సరియైనది. ఆంగ్లభాషలో విద్య నేర్పబడుచుండుటచే విద్యార్థుల సంభాషణలలో రెండు భాషలును మిశ్రమగుట సహజము. గ్రామ్యముతో మిశ్రమైన వ్యావహారికమిందు వాడబడి యున్నది. శైలి జాతీయములతో పొంగి పొరలి కృత్రిమము కాక జీవకళతో నొప్పారుచున్నది. గ్రంథమందలి శబ్దస్వరూప శ్లేషశబ్దార్థ, హాస్యములును, వాక్యచమత్కృతియు ఆస్వాదకుల నానందపర

వశుల జేయుచున్నవి. పాత్రోచితమను మిషచే హాస్యమునందౌచిత్యపు లోటు గలుగలేదు. గ్రంథమందు చక్కని హాస్యము కొఱవడియున్నది. ఈ ప్రహసనముల కథాభాగములు స్వకపోల కల్పితములు. గ్రంథకర్తయొక్క అద్వితీయ మౌలికత్వమును జాటుచున్నవి. ప్రాపంచిక జ్ఞానరహితములును, ఇంద్రజాల మహేంద్రజాలా సమన్వితములును, నిర్మలతత్త్వజ్ఞాన శూన్యములును, అజ్ఞానబోధకములునగు పురాణనాటకములను జవివిజవివి మనస్సు కృశించి ప్రస్తుతమును మఱచి జడమైపోయినది. అట్టి మనస్సునకీ ప్రహసనములు అమృతప్రాయములై పునర్జీవ మిచ్చుచున్నవి. గ్రంథకర్త యిట్టిరూపకముల పెక్కింటి రచించి ఆంధ్రవాఙ్మయము నభివృద్ధి చేయునుగాక. వలయువారు భమిడిపాటి కామేశ్వరరావుగారు, రాజమండ్రి-అని వ్రాయవలెను.

—శేకుమళ్ల కామేశ్వరరావు బి. యె.

# గ్రంథస్వీకారము

ముత్యాలసరములు...చిన్నకథలు—గురుజాడ వేంకట అప్పారావుగారు; కంస విజయము—శ్రీపాటిబండ పురుషోత్తమ కవిగారు; విజయ—మహావాది వేంకటరత్నముగారు; హిమ్మత్ సింగు—వారణాసి లక్ష్మీనారాయణగారు; సనత్సు జాతీయము—ఆకుండివ్యాస మూర్తి శాస్త్రిలుగారు; ఆగ్నేయాశుగములు—కూచినరసింహముగారు; శివకేశవస్తోత్ర మాల—వీరపనేని బసవయ్య చౌదరిగారు; ఉపదేశసారము—బి. వి. నరసింహాయ్యరుగారు; అను గ్రంథములను వందనములతో నందుకొంటిమి. కాలక్రమమున విమర్శింపగలమని మనవి.

—సంపాదకుడు.

# నవంబరు చిత్రప్రశ్నకు సమాధానము

నవంబరుమాసపు గృహలక్ష్మియందు మల్లపురెడ్డి సత్యనారాయణగారు వైచిన చిత్రప్రశ్నకు సమాధానములు తెలిపిన వారిసంఖ్య నూటికి పైబడినది. అందు ముప్పది మందికిపైగా స్త్రీలుగలరు. సమాధానములు పంపినవారిలో ఇంచుమించుగా నందఱును 'మేనక' యని వ్రాసిరి. ప్రశ్నవైచినవారు మాకు తెలిపిన సమాధానముకూడ నదియే. ఒకరిద్దఱు 'కస్తూరి'(బాయి) అని వ్రాసిరిగాని అదిసరియైన సమాధానముకాదు. కే. యస్. కోదండరామయ్యగారు మాత్రము మేనకయని తెలుపుచు ఈప్రశ్నకు 'అగజ' యని కూడ సమాధానము కాగలదని తెలిపిరి. ఇదియును సరియైనదే. రెండు సదుత్తరము లిచ్చిరిగావున వారినామమిచ్చుట పేర్కొంటిమి.

—సంపాదకుడు.

# నెల్లూరు ప్రోగ్రెసివ్ యూనియన్.

ఆంధ్రవ్యాసరచన—పోటిపరీక్ష.

స్త్రీలకు మాత్రమే.

1. ఈ పరీక్షకుఁగాఁ బంపఁబడు వ్యాసములలో నుత్తమమగుదాని రచించిన వారికి "కేసరి స్వర్ణపతకము" అను పేరఁబరఁగు నొకబంగారుపతకము, ప్రోగ్రెసివ్ యూనియన్ వారిచేఁ దిక్కన జయంత్యుత్సవ సమయమున బహూకరణముగా నొసఁగఁబడును.

2. చదువుకొన్న, చదువుకొనుచున్న, స్త్రీలు ఎవ్వరేని వ్యాసము వ్రాసి పంపవచ్చును.

3. విషయము:—"స్త్రీ అబలకాదు' అనుదానిని గూర్చి.

4. వ్యాసము సలక్షణమైన భాషలోనుండవలయును. వ్రాతకాగితమున కొక్కప్రక్కనే యుండవలయును. వ్యాసము సాధారణపు వ్రాతలో ఫూల్‌స్కాపు (Foolscap) కొలతగల పుటలు పదునేనింటి కెక్కువ యుండరాదు. వ్యాసమున, గ్రంథములనుండి యనువాదములు మొదలగునవి యున్న. ఆ గ్రంథాదికము పేరు లాయాపుటల యడుగుననే వ్రాయవలయును. దీర్ఘములైన యనువాదములుండరాదు. భాషయందు రుచిభావముప స్వాతంత్ర్యము, కథనమునఁ గౌశలము నగపఱచువారు ఎక్కువగుణములు (marks) పడయఁ గలరు.

5. వ్యాసమునఁగాక వేఱొకపుటలో, నభ్యర్థిని తనపేరును, తనతండ్రి పేరును, తనచిరునామాయును విశదముగా వ్రాసి యందుఁగ్రింద, నేతద్వ్యాస రచనకుఁగాఁ దాను బేరొకన్న గ్రంథాదికము తక్కనితరము చూడలేదనియు, వ్యాసము సొంతముగా నితరసహాయములేకనే రచించితిననియు, నొకజ్ఞాపనము వ్రాసి చేవ్రాలు చేయవలయును.

6. అభ్యర్థినిపేరుగాని, చేవ్రాలుగాని, అభ్యర్థినిని గుఱుతింప సాధనములగు నితరచిహ్నములుగాని, వ్యాసమున నెచ్చటను నుండరాదు.

7. అభ్యర్థినులు, తమవ్యాసముల నెల్లూరు ప్రోగ్రెసివ్ యూనియన్ కార్యదర్శిపేర 1930 సం॥ జనవరినెల తే 31 ది నాఁటికిగాని, ముందేగాని చేరునట్లు రిజిష్టర్డుపోస్టులోఁ బంపుకొనవలయును.

నెల్లూరు
27–11–29.

కార్యదర్శులు.
యజ్ఞమూర్తి పాపయ్య, (బి. యే. బి. యల్.,)
గుఱ్ఱము వెంకట సుబ్బరామయ్య, (యం. యే.,)

K

# అమృతాంజనము

## కేవలము "గృహలక్ష్మి"




గొప్పగొప్పవారిచే వేలకువేలు యోగ్యతా పత్రములు పొందియున్నది. తలనొప్పుల మాన్పును, వాయు పోట్లబాపును, పార్శ్వపు నొప్పుల బారదోలును, పోట్ల బోగొట్టును. బెణుకుల భేదించును, వాపుల రూపుమాపును, దగ్గును తగ్గించును, దురదను తొలగించును. అన్ని నొప్పులకు మంచిమందు

ఈ మందును రుద్దగానే చెమట పట్టుటవలన శరీరమందలి దుష్టపదార్థములను తొలగించును. నొప్పులు తగ్గించును. విదేశములలో గూడ వాడుచున్నారు.

అమృతాంజనము అన్నివిధములగు నొప్పులకు సంజీవి వంటిది.

పంచభాష చీటీ చూచి కొనిన మోసము గలుగదు.

చక్కని డబ్బితో సహా సీసా 1-కి 0-10-0. డజను 1-కి రు 6-4-0 లు.

ప్రతియింట ముఖ్యముగా నుండదగినది.

6, 7, తంబు శెట్టివీధి, మద్రాసు | **అమృతాంజనం డిపో** | 249, ఫ్రేరరోడ్డు, ఫోర్టు బొంబాయి

---

## సెట్టిబలిజ

### తూర్పు పడమర గోదావరి, కృష్ణా జిల్లాల

సెట్టిబలిజ సంఘపక్షమున వెలువడు మాసపత్రిక.

సాంఘిక—సారస్వత-రాజకీయ వ్యాసములకు, చారిత్రక, సాంఘిక నాటకములకు, కథలకు నిలయము. ఇందలి ప్రకటనలు మిక్కిలి లాభప్రదములు.

సంవత్సరపు చందా 3 రూపాయలు.

సంపాదకుడు

సెట్టిబలిజ, అమలాపురము.

# గృహలక్ష్మి

## ఏజెంట్లు.

తెనాలి: కొమ్మూరి కాశీ విశ్వనాథంగారు, జనరలు మర్చెంటు.

బళ్లారి: వి. రాజుమొదలియార్ & సన్సు,
కారుస్ట్రీటు, బ్రూసుపేట.

రాజమండ్రి: ఆండ్ర రంగారావుగారు, ఉల్లితోట వీధి

కాకినాడ: కే. సర్వేశ్వరరావుగారు, జగన్నాయకపూరు.

నెల్లూరు: ఏ. సుబ్రహ్మణ్యం, ఏజెంటు, ట్రంకు రోడ్డు.

బెజవాడ: నాముల అంతోని.

ఛత్రపురం: నేమాని వాసుదేవమూర్తి, సెక్రెటరి. పరమేశ్వరి విలాస్.

గుంటూరు: ఏ. ఎల్. నరసింహారావుగారు,
ఫోటోగ్రాపరు, నేషనల్ స్టూడియో.

మచిలీపట్టణము: కె. బాలకృష్ణ, ఫోటో ఆర్టిస్టు, కొజ్జిలిపేట.

తిరుపతి; వై. వి. సుబ్బయ్య & కంపెని. వెంకటేశనివాస్

పిఠాపురం: ఏ. వి. శాస్త్రి, కవితావిలాస్.

హైదరాబాదు: ఎస్. గౌరీ శంకరవర్మగారు 544-566 రెసిడెన్సీ బజారు.
(దక్కను) (మన ప్రాంత్యపు 1 రూ ఉస్మానియా
రూ 1-3-0 అగును)

వాల్టేరు: పి. తారనయ్య, అల్లిపురం. వాల్టేరు.

ఇతర చోట్లకు ఏజంట్లు కావలెను. వివరములకు ధరఖాస్తు పంపుకొనుడు.

"గృహలక్ష్మి" తపాల పెట్టె. 752, ఎగ్మూరు, మదరాసు.

# లోధ్రమహిమ

## స్త్రీరత్నముల అభిప్రాయములు.

### ఆంధ్ర యువతీమణులు

శ్రీమతి కవయిత్రి పులవర్తి కమలావతీదేవిగారు రాజమండ్రినుంచి యిట్లువ్రాయుచున్నారు —

"నా సోదరి బహిష్ఠయందు కడుపునొప్పిచే చాల బాధపడుచుండెడిది. మీ "లోధ్రను" మూడు బుడ్లను తెప్పించి యామెకొసంగితిని. నా చెల్లెలు స్వస్థురాలగుటయేగాకుండ నిరువురు బిడ్డలనుకూడ కనినది. మీ లోధ్ర స్త్రీలపాలిటి వరప్రసాదిని యనుటకెట్టి సందియమును లేదు. మా స్త్రీల వ్యాధులకు మీ లోధ్ర కల్పతరువువలె కన్పడుచున్నది."

శ్రీమతి ఎన్. కనకమ్మగారు, C/o నరసయ్యగారు, విలేజిమాజస్ట్రీటు, కదిరినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.—

"మీ లోధ్ర 4 పెద్దబుడ్లను సేవించినాను. 4 నెలలనుండి కడుపునొప్పి బొత్తిగనిలచిపోయినది."

### కర్ణాటక స్త్రీలు

శ్రీమతి బి. ఇందిరాకుమారిదేవిగారు మెట్టూరునుంచి ఇట్లువ్రాయుచున్నారు.-

"నేను మీ సుప్రసిద్ధ "లోధ్రను" సేవించుచున్నాను. తత్పూర్వము నాకు బహిష్ఠకాలమందు మిక్కిలి బాధకలుగుచుండెను. ప్రతినెలయును క్రమముదప్పి బహిష్ఠ యిరువది దినములోపునే యగుచుండెను. రెండు సంవత్సరములవరకు ఆసుపత్రియందు పుచ్చుకొంటిని గాని గుణము కనుపించలేదు. పిమ్మట వారు ఆపరేషన్ చేసుకొమ్మని చెప్పిరి; నేనిష్టపడలేదు. మీ "లోధ్ర" ప్రభావమువిని రెండుబుడ్లు పుచ్చుకొన్న తర్వాత మామూలుప్రకారము క్రమముగ 28 రోజులకు బహిష్ఠయగుచున్నాను. బాధలన్నియు నివర్తిఆయినవి. మరి రెండుబుడ్లు మీ "లోధ్ర"ను నాకు పంపగోరుచున్నాను."

శ్రీమతి జయలక్ష్మమ్మగారు, కొల్లిగల్ బాలికాపాఠశాల ఉపాధ్యాయిని, ఇట్లు వ్రాయుచున్నారు.—

"గడచిన మూడు సంవత్సరములనుండి, నాకు సరిగా ఋతుస్రావము కాకుండెను. రెండుమూడు నెలలకొకసారి బహిష్టు కలుగుచుండెను. ఇందువలన నడుమునొప్పి, కీళ్లనొప్పులు, బలహీనము, దేహము బరువుగనుండుట, మొదలగు బాధల ననుభవించుచుంటిని. మీ "లోధ్ర" రెండు సీసాలు తెప్పించి వాడినందులో పైకనిన వ్యాధులన్నియు మాయమైనవి. ఇప్పుడు సకాలమునను బహిష్టుఅగుచు సుఖముగనున్నాను. మరియు రెండు సీసాలమందును వాడదలచినాను. నావలెనే బాధపడుచున్న స్త్రీలకు లోధ్రను వాడితీరవలెనని ఖండితముగా తెలుపుచున్నాను."

### క్రైస్తవ నారీమణులు

శ్రీమతి అన్నాచాండిగారు, ఎం. ఎ. ఆనర్సు 'శ్రీమతి' సంపాదకురాలు, కొట్టయంనుంచి ఇట్లు వ్రాయుచున్నారు.—

## లోధ్ర మహిమ

"మీ 'లోధ్ర'ను వాడినాను. స్త్రీల ఋతుసంబంధమగు జాడ్యముల కుదుర్చుటకు అపూర్వమగు ఔషధరాజమని చెప్పగలను. తియ్యనిరుచిగల్గి, పథ్యపానాదుల పాటింపవలసిన అవసరములేకుంటచే, [illegible] సంతోషముగ వాడవచ్చును."

శ్రీమతి డాక్టరు అన్నతామస్ అమ్మగారు, బెంగుళూరు ఆస్పత్రి సూపరిండెంటు, ఇట్లు వ్రాయుచున్నారు.

"ఇంగ్లీషు అవుషధములవల్ల గుణములేనందున తమ "లోధ్ర"ను నాసోదరికి వాడితిని. ఆమెకు హాశ్చర్యమైన గుణము యిచ్చినందున సంతోషించుచున్నాను. ఇకమీదట ఈ ఔషధమును నా రోగులకు వాడెదను."

శ్రీమతి కె. ఇసయగారు, ఎ.బి. మిషన్, సత్తెనపల్లి, గుంటూరుజిల్లా, ఇట్లు వ్రాయుచున్నారు.

"మీ 'లోధ్ర'వలన నాకు మిక్కిలి ఆరోగ్యముకల్గినది. నాకు వచ్చుచుండిన దగ్గు నయమైనది."

శ్రీమతి మిసర్సు. ఏ. దేవదాసు అమ్మగారు ఇ. డబ్ల్యు. ఎమ్. స్కూలు, సాలిన్, మిక్‌బుజిల్లా, ఇట్లు వ్రాయుచున్నారు---

"మీవద్దకొన్న 'లోధ్ర' నాలుగు బుడ్లను, ఋతుస్రావదోషములచే బాధనొందుచున్న స్త్రీల కిచ్చినాను. వాటిని వాడినందున వారి రోగములు కుదిరినవి."

## కేరళ వనితలు

ఎడపిల్లి పార్వతమ్మగారు తిరుచూరునుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"నేను 25 సంవత్సరములు ఋతుసంబంధమగు జాడ్యములతో బాధపడుచుంటిని. ఎన్నియో మందులను వాడినను గుణమగుపడలేదు. తుదకు మీ 'లోధ్ర'ను కొద్దికాలము మాత్రము వాడగా అత్యద్భుతముగ రోగనివారణ గావించెను."

శ్రీమతి అమ్ముకుట్టియమ్మగారు, సంగీత ఉపాధ్యాయిని, సర్కారుహైస్కూలు, తిరుచూరు, కొచ్చినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"చాలాకాలముగ అనేక విధములైన గర్భాశయ రోగములవల్ల బాధనొందుచుంటిని. అనేక విధములైన చికిత్సలను పొందితిని గాని నివారణము కాలేదు. కడపట తమ "లోధ్ర" సేవించిన నాలుగు రోజులలోనే గారడివిద్యవలెగ మందు పనిచేసెను. దాని ప్రభావమును వర్ణింపజాలను."

శ్రీమతి మిస్‌గోపాలపణిక్కర్ గారు, శారదావిలాసము, చిత్తూరు, కొచ్చినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"మీవద్దనుండి తెప్పించిన 6 లోధ్రబుడ్లలో 3 నేనును తక్కిన 3 మాచెల్లెలును సేవించుటచే మాయొక్క ఋతుశూలలు మాయమాయెను."

శ్రీమతి మిసర్సుకర్తగారు, కోరోలి అమ్మనాత్ హావుస్, ఇరింజలకుడ, కొచ్చినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"పది సంవత్సరములుగ ముట్టుకట్టువల్ల బాధపడుచుంటిని. దానిని మీలోధ్ర అత్యద్భుతముగ నివారణచేసెను."

# రజోదర్శని

తిమ్మసముద్రము

ఆర్యా, 28–5–29

"........మీరు పంపిన 'రజోదర్శిని' మాత్రలు అనుకొనినంత గొప్పపని చేసినవని తెలుపుటకు సంతోసించుచున్నాను. 5 సంవత్సరములుగా రజస్వలకానటువంటి స్త్రీ అనేకౌషధములవల్ల నయములేక విసిగి నాతో సంప్రతించగా మీ 'రజోదర్శిని' ఒక బుడ్డి తెప్పించి యిచ్చితిని. ఈ బుడ్డి మాత్రలు పూర్తిగా అయిపోకమునుపే నిన్నటిదినం బయటచేరినది. తిరిగి రెండుబుడ్లు పంపగోరుతాను.

చిత్తగించవలెను

ఎ. పి. శర్మ.

రజోదర్శిని స్త్రీలకు గలుగు రజసంబంధమైన సమస్తవ్యాధులను నివారించును. రజఃకాలమున గలుగు కడుపునొప్పి, రజోదర్శనము కాకుండుట, స్వల్పముగా వెటలుట, మలబద్ధము, కడుపులో పోట్లు మొదలగు బాధలను పోగొట్టి, గర్భాశయమునకు బలమును గూర్చును—స్త్రీలకు పెన్నిధి వంటిది.

వెల 50 మాత్రలు రు 2 —

ఆర్ష రసాయనశాల

(ముక్త్యాల కృష్ణా)

# మిక్కిలి తక్కువధరయైన మాయొక్క

## చేతిగడియారము కొనువారికి టేబిల్ టయింపీసు

## (బల్లపైనుంచు గడియారము) ఉచితము.



22 క్యారెటు రోలుగోల్డు "బంగారు" చేతిగడియారము కొనువారికి ఒక అందమైన టేబిల్ టైంపీస్ (బల్లపైనుంచుకొనతగినది) గడియారము ఉచితముగా పంపబడును. చేతిగడియారమునకును బల్లగడియారమునకును 5 సంవత్సరములు గ్యారంటి (పూచీ) యిచ్చెదము.

త్వరపడుడు! త్వరపడుడు!!

ధర 5-15-0 తపాలుకర్చులు ప్రత్యేకమగును.

జెనుయన్ వాచ్ కంపెని. మింటు బిల్డింగ్సు పోస్టు, మదరాసు.

---

## డిటెక్షను లేక రహస్యమును కనుగొను యంత్రము



దీని యుపయోగము:—ఉన్నచోట నుండియే నీయొక్క ప్రియురాలిని, ఆమెచేసెడి పనులను ఆమెకు తెలియకనే ఈ యంత్రమును గొని నీవు తెలిసికొనవచ్చును. నీవెనుకను ముందను, నీవు తెలియకనే జరిగెడి విషయములను ఏకకాలమునే దీనిమూలముగా దెలిసికొనవచ్చును. నీకు దెలియకుండ నిన్ను వెంబడించి వచ్చువారిని నీవు తిరిగ జూడకనే దీనిని గొని తెలిసికొనవచ్చును. దీనితో పలురకముల రంగులతో తయారుచేయబడిన పడకటింటి ఫోటోగ్రాపు పటములు చాల అందమైనవి నాలుగు పంపబడును. దీని ధర రు 2—0—0 పరదేశములకు వీ. పీ. మూలముగా పంపబడవు. గాన పైకము ముందుగానే పంపవలయును

పారిసు ఎంపోరియము, జి. టి. మదరాసు.

---

మాయొక్క నూతన గ్రంథము! అందమగు ననేక ఆఫ్టోను పటములుగలది!

# గృహస్థాశ్రమరహస్యములు

(రెండవ కూర్పు)




ముమ్మొదటగా నాంధ్రమున మాయొక్క గృహస్థాశ్రమ రహస్యములను గ్రంథమే వెలువడినది. పిదప దాని వలె నుండవలయునని తలంచి కొందరు అందలి విషయములను మార్చియు చేర్చుకొనియు, గృహస్థాశ్రమ అను పేరునకు మారుగా నేదోయొక పేరు పెట్టియు నిట్లు నానావిధములగు గ్రంథములను ప్రచారింప జేయుచున్నారు. కావున వాటిని జూచి మోసపోకుడు. వారెంత మార్చుకొన్నను మావ్యాపార చిహ్నమును మార్చలేరు. ఆ వ్యాపార చిహ్నము (Trade Mark) ఏరోప్లేను కలదియే మాయొక్క అచ్చుపుస్తకముగా నెరుంగుడు. అదియే వాసన్ పుస్తకశాలవారిచే ప్రచురింపబడినదియని తెలిసి దానిని తెప్పించుకొనుడు. ఏరోప్లేను గురుతు లేనిది మా పుస్తకముగాదు. ఇతర గ్రంథమును చూచి భ్రమించవలదు. యీ రెండవ కూర్పులో క్రొత్తగా కొన్ని ఆఫ్టోను పటములను చేర్చియున్నాము. ప్రతి 1-కి 1-8-0. రెండు ప్రతులు కొనువారికి తపాలు ఖర్చులేదు.

వాసన్ పుస్తకశాల,

244, టంకశాలవీధి, మదరాసు.

Lodhra Press, Madras.




సచిత్ర మాసపత్రిక

సంపాదకుఁడు

డాక్టర్. కే. ఎన్. కేసరి

సంపుటము 2.] [సంఖ్య. 11

లోధ్ర ముద్రాలయము, మద్రాసు

1930

THE following Municipalities and Taluk Boards have sanctioned subscription for GRIHALAKSHMI and have introduced the Journal into the Girls' schools within their provinces. As the Journal is mainly intended for the uplift of women, and is instructive and useful for girls, we invite the other Taluq Board Presidents and Chairmen of Municipalities to extend their patronage by placing this matter before their Councils and introduce the Journal into their Girls' Schools :

## MUNICIPAL COUNCILS.

**1 Ongole**
**2 Cuddapah.**
**3 Tadpatri.**
**4 Guntur.**
**5 Adoni.**
**6 Hindupur.**
**7 Tirupati.**
**8 Nellore.**
**9 Bezwada.**

## TALUK BOARDS.

**1 Penukonda.**
**2 Ramachandrapuram.**
**3 Vellore.**
**4 Gooty.**
**5 Narasarowpet.**
**6 Berhampore.**
**7 Madanapalle.**
**8 Dhone.**
**9 Koilkuntla.**
**10 Karvetinagar.**
**11 Chendragiri.**
**12 Peddapur.**
**13. Tadepalligudem.**

*Editor,*

# GRIHALAKSHMI.

**Post Box. 752.**

**EGMORE, MADRAS.**

సం॥ చందా రు. 4.                                    విడిసంచిక అ. 6

# గృహలక్ష్మి

"యత్రనార్యస్తు పూజ్యంతే నందంతే తత్ర దేవతాః।
యత్రైతాస్తు నపూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః॥

సంపుటము 2.          జనవరి నెల 1930.          సంచిక 11.

## విషయసూచిక.

PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

## ప్రకృతి పత్రిక

మందులు శస్త్రము ఇంజక్షనులు టీకాలు అవసరములేకనే సకల రోగములను సులభముగ చౌకగ నిరపాయకరముగ కుదర్చకలిగిన స్వాభావిక పద్ధతులను నిరూపించు ఆరోగ్యమాసపత్రిక. పత్రిక చందాదారులకు ప్రకృతి గ్రంథములు తక్కువధరలకీయబడును. సం॥ చందా రు 3-0-0

1. తొట్టివైద్యము కూనెగారి, 4 గ్రంథములసారము 400 పుటలు, 70 పటములు రు 3-0-0; సూర్యకిరణ చికిత్స 0-12-0, మలబద్ధము 0-12-0, ఉపవాస చికిత్స 1-0-0, నేపీయజలచికిత్స 0-12-0, జస్టుచికిత్స 0-10-0, క్షీరచికిత్స 0-4-0 శ్రీరామతీర్థవ్యాసములు 0-8-0, యుక్తిప్రకాశము 0-8-0, రక్తప్రక్షాళన చికిత్స 0-5-0, పచ్చితిండివలని ప్రయోజనము 0-12-0, తొట్టిస్నాన నియమములు 0-6-0, నిర్విచారభావిజీవనము 1-8-0, యోగచికిత్స 0-6-0, ప్రాకృత చికిత్సార్ణవము 1. భా. 1-8-0.

పుస్తకముల జాబితా ఉచితము——

——మేనేజరు, ప్రకృతి, బెజవాడ

---

## జామా తైలము

ఏజంట్లు కావలెను

శిరోభారము, చేతులు కాళ్లు పట్లు, ఇక్ఫ్లూయంజా వంటినొప్పులు కీళ్లనొప్పులు, మొదలగు వాతజాడ్యములకు "జామాతైలమునకు సమమగు మందు వేరేదియులేదు. యోగ్యతాపత్రము లనేకములు పొందియున్నది.

వెల:—బుడ్డి 1-కి అణాలు 6

## అమర్ చెందు శోభాచెందు,

ఇంగ్లీషుమందులు పలసరకులు సల్ఫ్యూరిక్, నైట్రిక్

మొరాటిక్ ఆసిడ్ల వ్యాపారస్థులు,

63 నెం. నైనప్పనాయునివీథి,

మద్రాసు.




ANANDHA VILAS
ROYAPETTA P.O MADRAS

అప్పటమైన

# ఆనందపన్నీరు

నవీన విద్యుశ్ఛక్తి యంత్రసహాయముచే విశేషానుభవముగలవారి వలన శాస్త్రోక్తముగ తయారుచేయబడినది. శుభకార్యములందుగాక, మిఠాయి మొదలగు వాటియందుకూడా చేర్చతగినది. ఇతర బూటకపు పన్నీరులను వర్జించి నమ్మకమైన మా ఆనంద పన్నీరునే యుపయోగింపుడు, మోసపోకుడు. అన్ని షాపులలో దొరుకును.

Rgd: Trade mark సెం॥ 240 సెం॥ 120 సెం॥ సెం॥ 60 సెం॥ 30

వ్యాపారస్తులకు మంచి కమీషన్ యివ్వబడును.

మావద్ద అన్నివిధములైన శరబత్తులు, ఆనంద జైన్ పండ్లపొడి, ఓమంవాటరు, ఆవిరినీళ్లు మొదలగునవి కూడా దొరకును.

## ఆనంద రోజువాటర్ డిపో,

రాయపేట మదరాసు.

---

దృష్టి కోసమున కెంత వ్యయపరచినను సార్థకమే. సార్థకమేవిధమున కలుగును? ముక్కద్దముల పరిశోధనయందు విశేషానుభవము కలిగిన



## విక్సన్ కంపెనీవారి నాణ్యము

లైన యద్దములపై పెట్టుబడి పెట్టుటచే సార్థకమగును. కాని వ్యర్థముకానేరదు. వీరి యద్దములా! దృఢము. తరగతులా ఆధునికము. నాణ్యమా! శాస్త్రీయము. ధరలా! సరసము. పనితనమా! మహా అందము. నేత్రపరీక్షయందా! విశేషానుభవము. అయినను యుచితము.

## విక్సన్ & కో

ముక్కద్ద వ్యాపారులు

165, బ్రాడ్వే, మదరాసు.

లోకప్రఖ్యాతి గాంచిన గ్యారంటి కలకత్తా హార్మోనియములు

# ఆర్. మోహన్ ఫ్లూటు

| | | | |
|---|---|---|---|
| సింగల్ రీడు జర్మన్ హార్మోనియం | 1-కి | రు | 20-0-0 |
| డబుల్ రీడుజర్మన్‌హార్మోనియం | 1-కి | రు | 30-0-0 |
| సింగల్ రీడు ప్యారిస్ హార్మోనియం | 1-కి | రు | 30-0-0 |
| డబుల్ రీడు ప్యారిస్ హార్మోనియం | 1-కి | రు | 50-0-0 |



## రాజో & కో

హార్మోనియం వ్యాపారులు

20 నుంకురామ శెట్టి వీధి, మదరాసు.

**Next to Y. M. C. A.**

**To Enjoy Real Music, buy "R. MOHIN FLUTE" and be satisfied.**

---

గ్రామాఫోన్ వ్యాపారమునందు విశేష అనుభవముగల

## గ్రామఫోన్ హౌసు

మదరాసు హైకోర్టుకు ఎదురు, మదరాసు.

"హిస్. మాస్టర్సు వాయిస్"

అను ఖ్యాతి జెందిన గ్రామాఫోనులున్ను. వాటి కనువయించిన రికార్డులున్ను, విక్రయించుట కనుమతి పొందినవారు.




బైటిఆర్డర్లుఅతిజాగ్రతగను, జాగరూకతతోను రవానా చేయబడును. గ్రామాఫోను రిపేరియందు పేరెక్కినవారు

క్రొత్తమోస్తరు "హిస్ మాస్టర్సు వాయిస్" గ్రామాఫోన్ మిషనులున్ను, వాటికి సంబంధించిన వివిధమైన రికార్డులు అన్ని భాషలలో సెల్లకాలమునందు అమ్మకమునకు సిద్ధముగ నుండును.

**THE GRAMAPHONE HOUSE**

K

**Opposite: High Court, Madras.**

# గృహలక్ష్మి

## సంక్రాంతి, స్త్రీ

ఓకన్యా! నీ విప్పుడు వరయోగ్యవైతివి. నీకు అనురూపవరలాభ మొనగూర్ప నీతల్లి తపస్సు చేయుచున్నది. నీతండ్రి

> "రూపగుణంబులందు ననురూపతగల్గు వరుండు దీనికిం
> జేపడు నొక్కొ పుత్రులఁ బ్రసిద్ధులఁ బల్వురఁగాంచు నొక్కొ ల
> క్ష్మీపరిణామహృద్యమగు జీవన మక్కట! గల్గునొక్కొ యి
> ప్పాప మదన్వయక్రమముఁ బాత్రముఁజేయునొకో పొగడ్తనుఁ."

అని అహోరాత్రములు అదియేపనిగా చింతించుచున్నాడు. నగిషీపనులులేని అద్దమువంటి నీఅమాయికహృదయముతో సర్వశుభవాసరములగు ఈ మకరసంక్రాంతి మాసమున భగవంతుని ప్రార్థించి నీపితృదేవుని సత్సంకల్పముల సర్వార్థసిద్ధికి తోడు పడుము.

> " దినముఁ బ్రాతస్స్నాన మొనరించు ద్విజులకు
> నగుకర్మలోపభయంబుకంటెఁ
> గర్షణంబొనరింప గడఁగు కాఁపుల కౌర
> యమిఁబైరుచెడునన్ భయంబుకంటె"

గడదిప్పైన శీతువు లోకమువారిని యుహుహూయని వడకించు చున్నది. నీవా చలిని పాటింపరాదు.

" మేలుకొనుమమ్మ నాతల్లి ! మేలుకొనుము
తల్లి వేసిన ముగ్గు చెదరకమున్నె
గొబ్బిళులు చెల్లితో బెట్టుకొందుగాని "

అని దేవాలయమునందలి మంగళతూర్యములు నిన్ను బిలుచుచున్నవి. నీ వీ ప్రాత ర్వేళ మంచుచినుకుగుమితో శ్వేతశ్రీదులకించు పచ్చికపఱపును త్రొక్కుకొనిపోయి బంతిపూవులు, చేమంతిపూవులు సంగ్రహించుకొనిరమ్మి. ముంగిట తీర్చిపెట్టిన ముగ్గు లపై గొబ్బిళులు నుంచుకొనుము; ముక్తాయతాస్ఫురణముగల పిండిబొట్లు, సువర్ణ వర్ణచారువులైన పసుపుబొట్లు, లాక్షాశోణితములైన కుంకుమబొట్లు పెట్టుము. తులసీ దళములతో, బంతిపూలతో, చేమంతివిరులతో పూజింపుము. పసుపు పాదముల చిట్టినడకల సౌందర్య ముట్టిపడుచుండ నీపరికిణీకొంగుపట్టుకొని చెల్లెలు నీతో ప్రదక్షిణము చేయుచున్నది. శిరీషపుష్పమృదులములగు చరణములు కందువఱకు ప్రదక్షిణింపుము. శ్రోత్రరసాయనముగ కిన్నరకంఠమెత్తి గొబ్బిపాటలు పాడుము. సంకల్పసోపానవితతి నతిక్రమింపజేసి విశాలరమణీయమగు జీవనసౌధమున నీకుహాయి ఒనగూర్పగల అనురూప వరలాభమునకై భగవంతుని ప్రార్థింపుము.

ఓబాలా! నీవు పాణిగృహీతవైతివి. శైశవమునకును యౌవనమునకును నడిమి వయస్సున నున్నావు. పెద్దవారిపైట, పిన్నవారి పరికిణీ రెండును నీకడ అర్ధభాగము నొందియున్నవి. ద్రాక్షారసపక్వములగు నక్షరవిక్షేపము లొలయ

" వచ్చిపోవమ్మ ! మాయింటి పజ్జకీవు
పరమకళ్యాణి ! మాతల్లి ! పౌష్యలక్ష్మి !"

అని పౌష్యలక్ష్మికి స్వాగతము చేయుచున్నావు. కోడితో లేచి ఇంటిముంగిలి అద్దమువలె తుడిచి చిక్కగ కలయంపిచల్లి అచ్చోట సాక్షాత్కరించిన లక్ష్మివలె నొప్పుచు కంకణముతో సూడిగములు రాయ ముగ్గులు పెట్టుము. సమానాంతరసరళ రేఖల తృణీకరించు ఆముగ్గుకాడలు, సిద్ధహస్తుడు పరిశ్రమించి తయారుచేసిన చిత్రములను సయితము క్రిందుపరుపజాలిన ఆముగ్గుబొమ్మలు చూచి నీహస్తకౌశల్యమునకు ప్రశస్తు లందించుట కదిగో నీప్రాణనాథుడు మామపిలుపు నందుకొని వచ్చుచున్నాడు. పౌష్యలక్ష్మికి స్వాగతముచేయు మర్యాద, ముగ్గులుపెట్టి గృహమలంకరించుకొను శ్రద్ధ అలవఱచుకొన్నది నీవాతని మెప్పులందుటకేగదా? నేసబ్రాలువోయుసందడిని, ముంచు కొనివచ్చు నునుసిగ్గుదొంతరల ఒత్తిడిని నీప్రాణనాథుని మనోహరాకారము కన్నుల కఱవు దీర చూచుటకు వివాహకాలమున వీలులేకపోయినది. ఈమకరసంక్రమణ పుణ్యకాలము నీకు తిరిగి అతని దర్శనభాగ్యము గల్గించుచున్నది. చంద్రికాశ్రీవిభవమును పలుచ చేయు ముఖప్రభ లుల్లసిల్ల సోరణగండ్లమార్గమున పావనదృగ్విలాసములు పచరించి

నీవాతనిని అర్ఘ్యరీతిని సత్కరింపుము. చాటుననుండి ఆతని వాక్యామృతము నాస్వాదించుచు పండుగ మూన్నాళ్లును నీవు మనోరథపరంపరానుధావనమున పరవశవు కమ్ము.

ఓయువతీ! గృహిణివై అత్తింటకాపురము దిద్దుచున్నావు. నీఅత్తమామలు నిన్ను ఓమనగాయగా నోముచున్నారు. రసజ్ఞుడు పతి నిన్ను రాణివలె చూచుకొనుచున్నాడు. పడుచుల నందఱిని పుట్టినింటికి చేర్చెడు కాంగ్రెసుమహాసభయగు సంక్రాంతిపండుగ సమీపించుచున్నది. నిన్ను, నీపతిని గొనిపోవ నీజనకుడు వచ్చియున్నాడు. కార్యాంతర మగ్నుడగుట పతికి నీతోవచ్చుటకు వీలుగాకున్నది. ఎట్లైన వీలుచేసికొని పండుగనాటికి తప్పక రావలసినదని ప్రార్థనామృదూక్తుల ప్రాణనాథుని ఒప్పించి పుట్టినింటికి పయనము కమ్ము. చిన్నతనమునుండియు ప్రాణముప్రాణముగా మెలగిన నీచెలికత్తెలు కొందఱు అత్తిండ్లనుండి అప్పుడేవచ్చి నీవెప్పుడు వత్తువోయని ఎదురుతెన్నులు చూచుచున్నారు. చెలిమితీపిని నీవు పెంచిన చేమంతి మొగ్గలుతాపిన పూలపళ్లెరముతో స్వాగతోపచారములు చేయుచున్నది. తమ్ముకుఱ్ఱడు నీరాకకై తబ్బిబ్బుపడుచున్నాడు. లాలన ఎఱిగిన నీచేతులతో నాతనికి భోగిపండ్లు పోయవలెనుగదా? నీవు పుట్టినింటికిపోయెడు పాలతివి. నీమన మెంతటి ఆనందముతో ఉద్వేలితమైయున్నదో ఎవ్వరి కెఱుక?

ఓపుత్రవతీ! బహుపుణ్యములుజేసిన ప్రోడవగుట నీకడుపు కందపెరడువలె ఫలించినది. నీప్రాయపుఁ బ్రొద్దు ఒకింత పడమరకు దిరిగినది. నీసుతులు ప్రబోధవిధేయమతులు. నీయింటి ఆడబిడ్డలు హంసలు. నీయింటి కోడండ్రు చిలుకలు. పిల్ల మేకతో దోసతోటవలెనున్న ఈ యింటికి నీవు యజమానురాలవు. సర్వజనాహ్లాదకరములగు ఈ సంక్రాంతిదినములలో విశ్రాంతి నెఱుగక గృహకార్యముల దిద్దుచున్నావు. కూతుళ్లతోడను, కోడళ్లతోడను కలసి నోచుకొనుటకై నీవు బొమ్మలనోము తొమ్మిదిసంవత్సరములలోను ఒక సంవత్సరము మిగుల్చుకొనియుంటివి. ఆది ఈయేడు సమాప్తిచేయ సంకల్పించుకొని కోడళ్లను పుట్టినింటికి బంపక ఆపియుంచితివి. దూర దూర గ్రామముల నుండి కూతుళ్లను తోడ్కొనివచ్చితివి. ఆహ్వాన మంగీకరించి అల్లుల్లుకూడ వచ్చియున్నారు. వారికి చిరపరిచితములగు నీసౌహార్దమార్దవమధురములగు మాటలతో స్వాగతము చేయుము. చుట్టంపుసందడితో నెట్టుకొనియున్న నీగృహమునుగూర్చి కవి యిట్లు గానముచేయును.

“ అరుగు అరుగల్లోకి ఏఅరుగుతీరు ?
అల్లుల్లు కూర్చున్న ఆ అరుగుతీరు—
కుదురు కుదురుల్లోకి ఏకుదురు తీరు?
కూతుళ్లు కూర్చున్న ఆకుదురు తీరు—”

# సంక్రాంతి దృశ్యములు

## ౧

### పింగళి లక్ష్మీకాంతము, కాటూరి వేంకటేశ్వరరావు గార్లు

#### పుష్యమాసము

దినకరుఁడు శాంతుఁడై తోఁచె దినము లింత
కుఱుచలయ్యెను జలిగాలి చుఱుకు హెచ్చెఁ
బొలములఁ రేల గ్రుడ్డివెన్నెలలలోనఁ
గుప్పలన్ నూర్చు కాపులు గొంతులెత్తి
పదములన్ బాడఁ దొడఁగిరి పచ్చపూల
జనుపచేలకు ముత్యాలసరులు గూర్చి
మిరపపండ్లకుఁ గుంకుమ మెరుపుఁదార్చి
బంతిపూవుల మొగములన్నింత విచ్చి
మన గృహమ్ముల ధాన్యసంపదల నిల్పి
సరసురాలైన పుష్యమాసమ్ము వచ్చె.

#### సాతాని జియ్యరు

కోడితో మేలుకొని తానమాడి నుదుటఁ
దిరుమణియుఁ దిరుచూర్ణముఁ దీర్చిదిద్ది
యొక్క కేలను దంబుఱ నొక్క కేలఁ
జిఱుతలంబూని నున్నని శిరముపైని
తొలఁగకుండ నక్షయపాత్ర నిలిపి మేలు
కొలుపులం బాడి వీధివీధులను దిరిగి
యనుపదమ్మును 'రంగారంగా' యటంచుఁ
గడపగడపకు నేగి భిక్షమ్ముఁ గొనుచుఁ
జేరవచ్చెను సాతానిజియ్యరడుగో.

#### గంగెద్దుదాసుడు

తమ్ముఁడా! రమ్ము గంగెద్దుదాసుఁ డడుగో;
వెండిబిళ్లల మొలత్రాడు దండకడెము
ముక్కునన్ బైఁడికాడయు మోముసందుఁ
బంగనామమ్ములును, వెంట గంగిరెద్దు,
చేత మునికోల తనపేరు చెప్పుచుండ
నూరి నడువీధి నాడుచునుండె రమ్ము
డోళ్ల చప్పుళ్లు, సన్నాయి మేళ్ల పాట
లదర శ్రీరామునకును సీతమ్మ నిచ్చి
పెండ్లిఁ గావింపుచుండె నా వేడ్కఁ జూచి,
కానుకల నిచ్చి వత్తము కదలిరమ్ము!
"బసవనా! ప్రొలుద్రావెదో? ప్రత్తివిత్తు
లే తినెదో?" యంచునడిగి గంగెద్దు చేతఁ
దలను ద్రిప్పించు వింతఁ జూతము రమ్ము.

#### క్రొత్త పెండ్లికొడుకు

అన్ని పండువులందు ముఖ్యమిది గాన
నత్తవారింటికేగుమో క్రొత్తపెండ్లి
కొమరుఁడా! యందు నీకు నెక్కుడుసుఖమ్ము
ముద్దుమరదలు నీతోడ ముచ్చటాడు
వదిననీతోడ మాటికి వరుసలాడు
గజ్జెపుఁ గఱ్ఱ నిన్నుఁ గాంచు గరువు లేక
తలుపుచాటున నిలిచి నీ తరుణి నిన్ను
నోరచూపులఁ జూచి, యువ్విళ్లూరుచుఁ
జిత్తమును; నిన్నుఁ జూచి యాచిగురుఁబోడి
పట్టజాలని సంతోషభరము చేత
నింటమాటికి నటునిటు నేగుచుండి
ముగ్ధమోహన కల్యాణమూర్తితోడ
సమయమగునెడ నీకు సాక్షాత్కరించు,

### పందెపుకోడి

కుక్కుటమ! నీవు సుకృతివి, కోరి యురిని
బెట్టుకొన్నను జావులభింప దుత్త
రాయణమ్మున, నీవు సంక్రాంతి వేళఁ
గత్తి దెబ్బకు శిరమొగ్గి, కదననిహతు
లైనవీరులకే భోగ్యమై తదన్య
దుర్లభంబగు దివి జేరుదువుగదన్న!
పొమ్ము నిలువకు బరిమీద బొమ్మవిఱచి
నిలిచికూయుము, నీమీదబలముఁజూప
పుంజొకటివచ్చుదానితోఁ బోరుచుండు
వేళ వెనుకంజవైచి నిస్బెంచినట్టి
వాని కపకీర్తిఁదెచ్చి, యవ్వానికేతఁ
దిట్టులందినిబ్రతుకకు తివిరిచంపు
కొండె చచ్చుటయొండె చేయుదువుగాక!

### విద్యార్థి

పట్నమున విద్యఁగఱచెడి బాలకుండ!
పొత్తమున, కయ్యవారికి, బెత్తమునకు
సలుపుదాస్యమ్మునుండి మోక్షమ్మునంది
చిన్నిచెల్లెలికిన్ వన్నెవన్నెగాజు
బొమ్మలన్ గొని మీగ్రామమునకుఁబొమ్ము,
చిన్నిచెల్లెలిముచ్చట చెయిదములును
నాటలాడంగ నినుబిల్చునట్టి తమ్ము
గుఱ్ఱవిసివింపులును, నూరిమఱ్ఱినీడ
జరుగు లోకవార్తాప్రశంసలును గ్రోలి
బాలుడా! చూచిరమ్ము మీపల్లెటూరు.

—'తొలకరి'నుండి

## ౨

## తుర్లపాటి గోవర్ధనరావుగారు

### అత్తవారింటిపడుచు

అత్తవారింటి పడుచ! మీయమ్మఁజూచి
చాలనాళ్లాయె, ప్రేమలేదేల చెప్పుమ?
తమ్ముకుఱ్ఱఁడు విసిగింపఁదల్లిదిట్టు
మార్గములకీవు ప్రతిచెప్పు మాయొకింత
కదలిరావమ్మ! పుట్టిల్లుగాంచుభాగ్య
మున్నగల్గునా వేయి జన్మలకయిన
వరుసదప్పిన యొకపాటి వనితవరుస;
తమ్ముడుంజెల్లి యొక్క కంచమ్మునందు
దినుచు తగవులాడుట గను తీరులెల్ల
తీర్పరావమ్మ! జనని యింతింతయంచు
చెప్పగారాని దుఃఖమ్ము నందెనమ్మ
కదలిరావమ్మ! పుట్టిల్లుగాంచు భాగ్య
మున్నగల్గునా వేయి జన్మలకయిన
వరుసదప్పిన యొకపాటి వనితవరుస.

### కన్యభార్య

పండుగేనాఁడవునో కన్యభార్య! చెప్పుమ?
మగనిఁదిలకింప నుద్వాహమయిన దాది
నేటిదాక రాడంచు చింతిలిదె? మోహ
నస్వరూపుఁడు నాథుఁ గాంచంగవచ్చు
నన్నహర్షాశ్రువులవియే? కన్నెదాన,
పొమ్ము తెమ్ము వాల్జాపు నుంకమ్మొసంగి
జీవితేశ్వరు పూజింప భావసీమ
బండుగేనాఁడవునో కన్యభార్య! చెప్పుమ?

—'రసవాహిని'నుండి

# ఉప్పు

డాక్టరు వి. వి. యస్. ఆరాధ్యగారు

ప్రతిమానవునికిని, పూటకూటికిలేని బీదవాడైనను, కోట్లకొలది ధనముగల లక్ష్మీపుత్రుడైనను ఉప్పులేనిది దినముగడచుట దుర్లభము. ఇట్లుండుటకు హేతువేమి? ఒక్క రుచియేగాదు. శరీరనిర్మాణపోషణలకు చాల ముఖ్యమని అందరుఒప్పుకొన్న విషయమే. కావుననే ఉప్పును ఉపయోగించని మానవుడుగాని, వైద్యముగాని లేదు.

ఇంతియగాక ఉప్పు ఆయుర్వృద్ధిని, అగ్నివృద్ధిని, వీర్యపుష్టిని, జీర్ణశక్తిని, రుచిని కలిగించును. మలబద్ధము నడచును. కావుననే మనము పవిత్రమగువంటఇంటిని, జిహ్వను దాని విలాసస్థానములుగా జేసినైచితిమి.

ఇట్టిదానిని వాడుటలో గృహిణులు నేర్పరులై పాకవిద్యయందారితేరినవారైనచో పరిమాణభేదముచేతను, వస్తుసంయోగముచేతను భోజ్యపదార్థములయందు మార్పుల గల్గించుచు తమవారిని రోగమునకు దాసులనుగాజేయక కాపాడెదరుగదా! కావుననే తరతరములనుండియు ఉప్పు గృహవైద్యమున ప్రధానస్థానము నాక్రమించినది. ఈపత్రికారాజమున యింతకు పూర్వమే శ్రీయుతులు డా. కేసరిగారును, డా. శేషగిరిరావుగారును ఉప్పునుగూర్చి పాఠకులకు బోధించినను, ఎంత తెలిసుకొన్నను తరగని విషయమగుటచేత నాకు తెలిసినంతవరకు పాఠకలోకమునకు విన్నవించుకొందును.

అన్నివైద్యములలోను ఉప్పు కలిసే యోగములు చాలయున్నవని అందరెరింగినవియే. ఇచ్చట అట్టివిగాక ఉప్పును ప్రత్యేకముగాను, గృహకృత్యములలో తేలికగా ఉపయోగించుటకు వీలగునట్లును వ్రాయబూనెదను.

ఉప్పు, మజ్జిగలో వేసుకు త్రాగితే అజీర్ణం, పులిత్రేపులు అగ్నిమాంద్యము, పోయి ఆకలిగల్గును.

ఉప్పు చిగుళ్లకు రుద్దితే దుర్వాసన, నీరు, తగ్గిపోవును. నొప్పులు హరించును.

ఉప్పు వేయించి కాపుకాచినచో నొప్పులు హరించును.

ఉప్పు వేడినీళ్లలో వేసుకొని త్రాగితే వమనము అగును.

ఉప్పు కొంచెము నీటితో ఉపయోగించిన విరేచనము బాగుగా నగును. ఆకలి గల్గును.

ఉప్పు, కరివేపాకు, మిరియాలు వేసినూరి ఉండజేసియిస్తే అజీర్ణవిరేచనములు కట్టును.

ఉప్పు పుచ్చుకుంటే (నీటిలోకల్పి) మజ్జిగ, నిమ్మపులుసు, మాధీఫలములు ఎక్కువగా వాడుటవలన గల్లుబాధల హరించును.

ఇందరిన్నివిధములుగా ఉపయోగించుచుండగా డా. సూష్లర్‌గారు తమ సిద్ధాంతము (Bio-Chemic System) నందలి ద్వాదశధాతులవణముల (Twelve Tissue Salts) లో ప్రధాన స్థానమిచ్చుటయేగాక ప్రతిమానవుని శరీరనిర్మాణమునందును కొంతభాగమై శరీరస్థితికి మూలమనియు దీనిహెచ్చు తగ్గులమీదనే అనేక రోగము లాధారపడి యున్నవనియు, దీనిసరిజేసినచో రోగములు శాంతించుననియు చాటిచెప్పిరి.

అనేకరోగములలో వాడుచున్నారు. అందును ఎండదెబ్బలోను, మలేరియా జ్వరమందును, మంచి ఫలితముల నిచ్చేనని తెలియుచున్నది. ఎండదెబ్బలో (3 లేక 6 x Natrum Mur) వాడినచో వెంటనే శాంతించును.

ఇక మలేరియాజ్వరమున సెట్టిఫలితముల బొందినదియు డా. బ్రూక్‌గారు అనుభవముల నిట్లు ప్రకటించియున్నారు. దాని ఆంధ్రానువాద మిట పొందుపరచెదను.

## మలేరియా—ఉప్పుచికిత్స

"నేను హంగేరీదేశములోని థైస్, మరోస్ దేశములలో (మలేరియా వ్యాపించిన దేశములు) ప్రయాణముచేయుచున్నప్పుడును దక్షిణఅమెరికాలో గారోసీయిండియనులతో కలసియున్నప్పుడును ఒకటి లేక రెండు మోతాదుల పుచ్చుకొనినంత మాత్రముననే 24 గంటలలో చలి జ్వరమును నిశ్శేషముగా తప్పక కుదుర్చునట్టి మిక్కిలి చౌకయగు ఔషధమును వాడితిని. ఒకచారెడు మంచి శుభ్రమైన ఉప్పును, ఒకక్రొత్త మూకుడులో గాని, లేక శుభ్రపరచిన దానిలోనైనను వైచి మందాగ్నిపై (కొంచెముగావేయించిన కాఫీవిత్తులవంటి గోధుమరంగువరకు) వేయించవలెను. దానినుండి సుమారు ఒక టేబిల్ స్పూన్ ఉప్పును ఒకగ్లాసెడు వేడినీటిలోకల్పి చలిజ్వరము తగలగనే ప్రొద్దున పరగడుపుననే యివ్వవలయును. నిత్యమువచ్చు జ్వరములలో చలి తగ్గిన కొలది గంటలలో ఇవ్వవలయును. ఇదివట్టి కడుపులోనే పనిచేయును గాన ఆహారపానీయముల నివ్వరాదు.

మిక్కిలి దప్పికగ్లినను నీటితో నాల్కతడుపుకొనవలయునేగాని త్రాగరాదు. సేవించిన 48 గంటల అనంతరము ఆకలిగల్గినచో చికిన్ బ్రాత్, లేక బీఫ్‌టీ యుపయోగించవచ్చును. జలుబు జేయకుండునట్లు ఆహారవిహారముల జాగ్రత్తగా చూడవలయును. నేను దీనిని గడచిన 18 ఏండ్ల నుంచియు వాడితినిగాని ఒక్కతూరి యయినను వ్యర్థముకాలేదు. దీనిచే హంగేరి ప్రాంతమున అనేకులు స్వస్థులగుటయేగాక, బ్యూనస్ఏరిస్‌నకు నాతోబాటు సముద్రయాత్ర జేయు ఐబిస్ అనుయాత్రికుని అనేక వత్సరములనుండియు బాధించుచుండిన చలిజ్వరము ఒక్కమోతాదుతో 24 గంటలలో నిశ్శేషముగా కుదర్చబడ్డది. అమెరికాయందలి ఉష్ణపుదేశములలో ప్రతి వలసపోయిన ఐరోపీయుడును దేశములోని కడుగిడగనే అశ్రద్ధచేసిన భయంకరముగా పరిణమించునట్టి చలిజ్వరముచే పీడింపబడును. క్వైనా బ్రాందీలనెంత యుపయోగించినను ఆగక నాలుగువందలమంది ఐరోపీయులు జ్వరముచే బాధపడుచుండగా ప్రక్కనే సమముగా బాధపడు హాక్వ పాంగీలయొక్క శాఖయందలి జర్మనీయుల కాలనీ వేచినఉప్పు సేవించుటచే ఒక మరణమైనను లేక సుఖముగానుండెను."

# మకరసంక్రాంతి

కే. నారాయణాచార్యులుగారు

విమలోదకక్షాళనముఁ జేసి కుడ్యభాగముల సుధాలేపనమునొనర్చి
ద్వారంబులకుఁ జిత్రవర్ణంబులనుగూర్చి పసపుఁగుంకుమలను బసగదిద్ది
నానావిధవిచిత్రమైనసొంపులుగుల్కు రంగవల్లికలను రమణదీర్చి
లలితరసాలసాలకిసాలయంబులఁ గొమరుమీఱఁగ దోరణములఁగట్టి

అమితకౌతూహలమ్మున నఖిలజనులు
పెద్దపండుగయంచును హద్దుమీఱు
క్రొత్తసొంపుల గృహరమకు నొనర్చి
సంతసింతురు మకరసంక్రాంతియందు.

# శారదలేఖలు

సౌభాగ్యవతియగు కల్పలతకు :—

నెచ్చెలీ!

ధర్మవరము లక్ష్మీదేవమ్మగారికి జబాబీయవైతి వేమని నీవు వ్రాసిన ఉత్తరమునుచూచితిని. నేనామెకీదినమే జాబు వ్రాసితిని. ఆజబాబిందుతో పంపుచున్నాను. కనుము.

సోదరీ! స్త్రీల నాటకరంగనిషేధమునుగూర్చి నేను వ్రాసిన లేఖకు నీవువ్రాసిన ప్రత్యుత్తరమును రెండు మూడు మారులు జాగ్రత్తగా జదివితిని. అందలి తత్వమును గ్రహించుటకు వివేకసాధనమూ, అలిప్తబుద్ధియు నవసరమని నీవు వ్రాసితివిగాని యీరెండిటికంటె ముఖ్యావసరముగాగన్పడినది విసుగెరుగని యోపిక. పైశీర్షికచూచి నాకేగదా యీప్రత్యుత్తరమని చదివితినిగాని దాదాపు నాల్గుపుటలు చదివినగాని నాటకరంగప్రస్తావన రాకపోవుటచే యిది నాకుగాదేమోనని పలుమారులు తలంచిన సమయములు గూడ కలవు. కాని కడవఱకు జదువ నాకేనని నిశ్చయమైనది. దయచేసి నీ వాశీర్షికయందు నాపేరు తగిలించక పోయినచో విషయముకంటె యుపోద్ఘాతమే పెద్దదిగానున్న యావ్యాసమును చదువకనే విడిచియుందును. చదివిన తరువాతగూడ జబాబీయదగిన విశేషాంశము లేమియు నందు గానరాక పోయినను, యావద్భారతీయుల చేతను నాదర్శనీయుడగు మానవోత్తముఁడుగను, పూజనీయుఁడగు ప్రభువుగను, సతతస్మరణీయుండగు దైవముగను సంభావింపబడుచున్న శ్రీరామచంద్రుని గుణశీలములు నిందింపబడుట చేతను, భారతగాథ దూష్యమనుటచేతను, మనదేశమునందిప్పుడమలు నందున్న వైవాహికపద్ధతిచే మన స్త్రీలందఱు పరపురుషసంపర్కము చేయుచున్నవారే అనుట చేతను, నేను నీకు జబాబిచ్చునవసరము గల్గినది. సోదరీ! నేను నీవంటి తత్వజ్ఞానము గలదానను గాకపోయినను నా సామాన్యబుద్ధికిఁదోచిన చందమున జబాబొసంగిన నా సాహసమునకు క్షమించిచదువ గోరెదను.

ప్రపంచమునందలి ప్రతి మనుజుఁడును నేదియోమతమునకు జెందియుండుటయు, నామతమును గూర్చి తనకు తెలిసినను తెలియకపోయినను దానియందభిమానగౌరవములు గలిగియుండుటయు లోకసాధారణము. అయితే మామతగ్రంథమైన భగవద్గీతయందు మాకధికగౌరవమనిన యన్యమతగ్రంథములైన కొరాను, బైబిలులను నిరసించుటగాదు. ప్రతిమతమును సత్యధర్మాశ్రయమైయే యున్నది. నిజమైన హిందువులకు పరమతసహనము యుత్తమలక్షణము. అట్టివారికి ప్రతిమతమును పూజనీయమేయగును. మతమననేమి? స్వేచ్ఛాసహజమైన మానవుల వర్తనమును ఒకనీతికి ఒకధర్మమునకు ఒకసత్యమునకు ఒకసాంప్రదాయమునకు బద్ధపఱచునదే మతము. విధినియమములు లేని మతమెందునులేదు. ఏమతము నవలంబించినను నామతనియమములు మానవుని స్వేచ్ఛనరికట్టక మానవు. ప్రతిమనుష్యుడును నేదేని మతమునకు జెందియుండుట విధినిషేధములులేని తన వృత్తిని యొక కట్టుబాటునకు బద్ధపఱచుకొనుటకే. "యోగ్యమూ, సాధ్యమూ, ఆవశ్యకమూ, హితకరమూ, అయినటువంటి నూతనరీతులనడచుట కేమతముగాని మార్గమునివ్వదు." తాత్కాలికానందమును గూర్చెడి ప్రతివిషయమును మనుష్యులకు హితకరముగనే యుండవచ్చును. కాని జీవితముయొక్క యంగాంగమందునూ హితకరమునకు ద్రోవయొసంగుట కేమతముగాని యంగీకరింపదు.

జ్ఞానము జగన్మాన్యమగుట వాస్తవమే. అయిననునదియు నీతిసత్యములకు నిబద్ధమైనప్పుడే జగన్మాన్యతబడయును. మనుజుని జీవితవికాసమునకుదోడ్పడి యుచ్చస్థితికి గొనిపోవునది మాత్రమే నిష్కళంకజ్ఞానము. కాని మనుష్యుని విపరీత స్వేచ్ఛ జ్ఞానముయొక్క నిదర్శనము కాజాలదు.

జ్ఞానులు తత్వజ్ఞులునైనవారు శ్రీరాముని జీవితమును దోషకలితమనుట కిదియే మొదలు. మన హైందవపురాణేతిహాసములలో నుత్తమము, నాదర్శనీయమునునగు నితిహాస మేదైనగలదనినచో నది శ్రీరాముని చరిత్రమే యని చెప్పకతప్పదు.

రాముఁడు దుష్టుడు. ఆయన జీవితములో మోసము, క్రౌర్యము కానబడునేకాని విశేషసద్గుణము కనుపించుటలేదని నీవు వ్రాసితివి. రాముడు ధర్మజీవి. సత్యము, ధర్మము, నీతి, త్యాగము యీనాల్గుసూత్రముల యొక్క సారమే రాముఁడు. రాముఁడు సీతను పరిత్యజించుట స్థూలదృష్టితో గనిన నింద్యముగనే గోచరించును. కాని రాముని జీవితవిశేషముల నామూలాగ్రముగా గమనించినవారి కందు క్రౌర్యమేమియులేదు.

ఆతఁడు తనజీవిత మంతటను నిట్టిత్యాగము లెన్నియో గావించెను. పటాభిషేకము వన వాసముగా మారినపుడును, భరతుఁడేవచ్చి పాదాక్రాంతుఁడై రాజ్యమును స్వీకరింపు మని కోరినప్పుడును, రాముడు చూపినత్యాగము నిరుపమానమైనది. తండ్రిని సత్య వాక్యనిరతునిగా జేయుటయు, తాను పితృవాక్యపరిపాలనా ధర్మము నకలంకముగా నెఱపుకొనుటయు ఆనాటి యాతని త్యాగమునకు కారణములు. రాముఁడే క్రౌర్య చిత్తుఁడు, మోసగాఁడునైనచో నట్టిత్యాగము గావించియుండునా ? అప్పటికి రాముని పలుకుడి యెట్లున్నది ? రాజు, ప్రజలు, మంత్రులు, బంధులు, మిత్రులు, అందఱు ఆయన పట్టు. రాముడే క్రూరుడైనచో యీనాడెట్టి బీభత్స జరిగియుండవలెను. ఔరంగజేబు వలెతండ్రిని చెఱలోనిడి తమ్ముల వధించి గద్దెయెక్కెడి వాఁడుకాఁడా? కాని సాధు లోకగణ్యుఁడగు శ్రీరామచంద్రు డెట్టి నిగ్రహము చూపెను! పరమాశ్చర్యముగదా! ఇఁక సీతాపరిత్యాగ విషయమున విచారింతము. రాముఁడు

స్త త్తదేవేతరోజనఃయద్యదాచరితిశ్రేష్ఠః
సయత్ప్రమాణంకురుతే లోక స్తదనువర్తతే.

అనగా శ్రేష్ఠుడు దేనినాచరించునో దానినే ప్రమాణముగా గొని లోకము వారి ననుకరించునని దాని తాత్పర్యము. కాన శ్రేష్ఠుఁడైనవాడు లోకమున కాదర్శపురుషుఁ డైనవాడు లోపరహితుఁడుగా నుండవలెను. కాన స్వార్థమును చంపుకొని లోకహితము గమనింపవలెనని రాముని ఆదర్శము. ప్రజల కోర్కెలదీర్చుట, ప్రజల యభిప్రాయప్రకా రము నడుచుకొనుట, ప్రజలను కన్నబిడ్డలవలె బ్రోచుట యివి తనపరిపాలనాధర్మములుగా బెట్టుకొనినాఁడు రాముఁడు. ఆ ధర్మమును నిలుపుకొనుటకే ప్రజల యిచ్ఛాను సారముగా సీతను పరిత్యజించె. ఈవిషయమున నాతడు పరతంత్రుఁడు, ప్రజాభీష్టానువర్తి. కాన యీసందర్భమున మనము గుర్తింపవలసినది సూక్ష్మతరమైన యాతని ధర్మలక్ష్యము గాని బాహ్యక్రియగాదు. అంతమాత్రముచే రాముఁడు క్రౌర్యవృత్తిగలవాడనుట పాడి గాదు. రామునకు సీతయందపారమైన ప్రేమగలదు. గౌరవముగలదు. విశ్వాసముగలదు. ఇందులకు నిదర్శన మాతఁ డేకపత్నీవ్రతుఁడై యుండి యశ్వమేధాదియాగసమయంబులో గూడ స్వర్ణసీతతో యజ్ఞతంతును నడుపుకొనుట వలననే తెల్లమగుచున్నది. రాముఁడు గావించిన యిట్టి కృత్యమునకు సీత కాతనిపై యభియోగము నడుపగల హక్కుగలదని యంటిరి. నిజమేకావచ్చును. ఇక్కాలపుసీత యనగా మీ నాటకపు సీతయైనచో నట్టి

పనిని తప్పక చేసెడిదే. కాని కృతయుగపు సీత యట్టిదికాదు. పెనిమిటి ధర్మతత్పరత యామెకును దెలియును. సత్యముకొఱకు, ధర్మముకొఱకు, ప్రజాహితముకొఱకు నాసర్వస్వము నర్పించెదనని యాతఁడెన్నిమారులో పలికియుండెను. కాన ఆతని ధర్మాచరణము నెఱిగియుండిన ధార్మికురాలగు సీత పెనిమిటిపై ఏమని వ్యాజ్యము నడపును? కావుననే యామె పెనిమిటిని పల్లెత్తి యొక్కమాటనలేదు. నిరపరాధయయ్యు, పామరజనుల సంతుష్టికొఱకును, పెనిమిటి ధర్మమును నిలుపుటకొఱకును దుర్భరమైన యాకష్టములను సహనముతో భరించెను.

రాముడు సీతనేగాదు ఆబాల్యమునుండియు దన్ననవరతము సేవించిన లక్ష్మణుని గూడ నట్టులే త్యజించెను. ఆ నాడుగాదు యీ నాడు మహాత్మాగాంధి తన జీవిత చరిత్రలో నేమివ్రాసెనో కనుము.

"ఈ శోధనమున నేను నా ప్రియతమవస్తువులగూడ విడనాడగలను. మఱియు నేనీ శోధనయజ్ఞమున నాశరీరమునుగూడ హోమముచేయ సంసిద్ధుఁడను."

సోదరీ! మహాత్ముల ధర్మలక్ష్యమట్టిది. అందుకు వారిని దుర్మార్గులని నిందించుట తగదు. ఇఁక మహాభారతమునుగూర్చి. ప్రద్వేషిణి పెనిమిటియగు దీర్ఘతముఁడు పుట్టంధుఁడు. వృద్ధు. అట్టివానిని నేను భరింపజాలననియు, నెక్కడకైన పొమ్మనియు ప్రద్వేషిణి చెప్పినది. ప్రద్వేషిణి చిన్నదిగాదు. గౌతమాదులైన పుత్రులను బడసిన యిల్లాలు. అట్టిది అంధత్వముచేతను, వార్ధక్యముచేతను నసమర్థుఁడైయున్న భర్తను లేచిపొమ్మనెను. నిస్సహాయుడగు నాచి కేమిచేయును? పాపము! కోపముపట్టలేక శపించెను. అందులకు కోపించి ప్రద్వేషిణి యాతనిని కట్టెలతో కట్టగట్టించి కొమారులచే గంగలో త్రోయించినది. ఇందధికాపరాధ మెవరిది? దీర్ఘతమునిదా? ప్రద్వేషిణిదా? సోదరీ! ఇట్టి నారీరత్నమును సమర్థింపబూనుట నీ వాదమునకు బలము కాజాలదు. మహాభారతములోని యీచిన్నయుపకథ భారతమంతయు దూష్యమని దూషించుటకు జాలినంత బలవత్ప్రమాణమునుకాదు.

ద్రౌపదిని పందెమిడుట యక్రమమే. కాని యందును ధర్మసూక్ష్మత లేకపోలేదు. అందు కొంతయొప్పిదమే లేకున్న భీమార్జునులప్పుడే తిరుగబడి యుందురు. ఇంతకును వారి యపూర్వత్యాగము, కష్టసహిష్ణుత, ధర్మబద్ధత, వినీతవర్తనమే లేకున్న వారు మనకు స్మరణీయులే కాక పోవుదురుగదా! అయినను గుణదోషవిచారణ లేక అందలి

కథయంతయు సత్యమనియు అనుకరణీయమనియు నేను చెప్పలేను. చెప్పను. ప్రస్తుత సాంఘికజీవనమున దూష్యములని నిందింపబడెడి యధర్మములెన్నియో అందు ధర్మములుగా నిరూపింపబడియున్నవి. అవియెల్ల మన మాచరింపదగునని వాదించెడి వెఱ్ఱి నాకులేదు. మహాభారతమున నుత్తమపాత్ర లెన్నియోగలవు. వారి చరిత్రములు మనము పఠించి మన నిత్యజీవితమునకు సాధనములుగా గొని ధర్మమును సత్యమును నీతిని వికాసపఱచుకొను టలో దోసమేమి? అభిమన్యునివంటి వీరకుమారుని చరిత, కర్ణునివంటి దానశూరుని గాథ, గాంధారివంటి మహాసాధ్వీచరిత్రము, భీష్మునివంటి సత్యవ్రతుని వృత్తాంతము, ద్రౌపది ధర్మపరిజ్ఞానము బుద్ధికౌశలము గృహనిర్వాహకత్వచాతుర్యము దెల్పెడి వృత్తములు మన కాదర్శపాత్రములు కాకేలపోవును? మఱియు మన కాదర్శపాత్రము లగు సావిత్రివంటి మహాసాధ్వీమణుల చరిత్రములెన్నియో యందుపకథలుగా చేరియున్నవి. సోదరీ! భారత భాగవత రామాయణాది పురాణేతిహాసములు నింద్యములని నిషేధించి నచో మీ నాటకకళాపోషణకైన కథలేవి? బహుశః సాంఘికములు, చారిత్రకములు నని మీ యుద్దేశమేమో! ఆ విధముగా చూచినను రామదాసు నాటకమాడినచో నాతని యుపాస్యదైవము రాముడు. మీరాబాయియాడినచో నామె దేవుడు కృష్ణుడు. మరల అక్కడగూడ పురాణపురుషులే ప్రత్యక్షము. ఎంత నింద్యములని దూషించినను ఆ పురాణేతిహాసములు విడనాడినచో మనకాడుటకు, పాడుటకు, చెప్పు కొనుటకు వేఱుతెన్నే లేదు. తొలుత యెంత తీవ్రముగ నిరసించినను పురాణ గ్రంథముల సహాయమును, జ్ఞానముచే తగినంతమాత్రము అవశ్యముగ తీసుకొనుటకు అభ్యంతరములేదని, నీవును ఒప్పుకొనక తప్పినదికాదు. ఇఁక నిదియే తగునని చెప్పిన నాపై నిశితవిమర్శ నెందుకు?

శివాజీవంటి మహాశూరుని తయారుజేయుటకు జిజీబాయి పురాణగ్రంథములనే ఆశ్రయించిన మాట వాస్తవము. ఆ మాట శివాజీ చరిత్రమునందే గలదు. కాని ఆధునిక శివాజీల యుత్పత్తికి నీవు చూపెడి నవరీతులేమో ఆధునిక స్త్రీలవలన నికమెఱుగవలసి యున్నది.

కళావంతులనియు, వేశ్యలనియు పిలునబడెడి యొక తెగవారాంధ్రదేశమున గలరు. నృత్యగీతాభినయాదులు వారికులవృత్తి. అవివాహితలగు నాస్త్రీలు పురుషుల సన్నిధిని నృత్యగీతాదుల ప్రవర్తింప జేయుటచేత వారిలో నీతిభంగదోష మేర్పడినది.

నీపోటీవ్యాసమునందిదియు నీవంగీకరించితివి. దీనికొసంఘీయు లిప్పుడు పొందుచున్న విచార మింతయంతగాదు. నృత్యగీతాదులు మానివైచి వివాహములు చేసికొని తొల్లిటి నైచ్యమును తొలగించుకొని సాటిస్త్రీలోకములో సమానత్వమును బడయుటకై వారి ప్పుడు మహాకృషి చేయుచున్నారు. తొల్లి నాట్యాభినయములలో పాల్గొనిన వారిస్థితి కన్నులారగాంచుచు మరల కులస్త్రీల నీయగాధకూపమున బడద్రోయ నెంచుటయు, దానికి నీవంటి విదుషీమణులు చేయూతనిచ్చుటయు శ్రేయస్కరముగాదు.

శ్రీరవీంద్రనాథటాగోరుగారును హరీంద్రనాథ చతోపాధ్యాయులును తమ స్త్రీలను రంగభూమికి తెచ్చిరని వ్రాసితివి. అందుల కాప్రాంతీయులెంతకుందుచున్నదియు, ఈ మధ్య చెన్నపురిలో జరిగిన సనాతనధర్మసభకేతెంచిన యొక బెంగాలీబాబు స్త్రీలను రంగభూమికి తెచ్చి పాడుచేయుచున్నారని చెప్పి విచారించెను. కంటివా? కాన యీాయు ద్యమమున శాస్త్రీయులైన యెక్కువ మోదము తెలుపుట లేదు. హింద్వూప్రేమ సంఘము వారాడిన నాటకమును చూచి మహాత్ముడు మోదించెనని వ్రాసితివి? సరియే. కాని ఇన్ని పాశ్చాత్యసాంప్రదాయములతో ఇన్ని అంగరంగవైభవముతో స్త్రీపురుషులు రంగభూమిని అభినయించుటను గూర్చి వారి ప్రత్యేకాభిప్రాయముసడిగి తెలిసికొంటిరా? గట్టిగా ఆయన అభిప్రాయము కోరినచో మహాత్ముడెప్పుడును అనుకూలాభిప్రాయమియ్య డనియే నాయభిప్రాయము. అయినను మహాత్ము డంగీకరించినను యెల్లరంగీకరింపవలెనని సిద్ధాంతమా!

నాటకమనిన కేవలము శృంగారమనియే నాభావన కాదు. అందు నవరసము లాలికింపబడునని నేనెఱుఁగుదును. ఏరసమైనను నేవిలాసమైనను నాటకమనిన కపట సంసారము వంటిదనియు, అందొకచో శయ్యాగృహము, ఒకచో కొలువుకూటము, ఒకచో ఉద్యానవనము, ఒకచో యుద్ధము, ఒకచో శ్మశానము రంగస్థలములుగా నుండు ననియు నాకు డెలియును. ఇట్టి భిన్నసమావేశముల కాస్పదమగు రంగస్థలమునందు స్త్రీ పురుషుల కలయిక కులాంగనలకు సమంజసమును గౌరవాస్పదమును గాదు. ఈ సంద ర్భమున సోదరీ! నీవు గావించిన హింద్వూనైవాహికప్రస్తావన మిక్కిలి యసమంజసముగా నున్నది. ఎప్పుడు బాలిక యొక పురుషునితో వివాహముచేయబడునో అతడే తనవాడ నియు తదన్యులు పరులనియు, విశేషించి సోదరతుల్యులనియు భావించి యాతని యందే లగ్నచిత్తలగుట మన హింద్వూకుటుంబములయందు సాంప్రదాయముగా నున్నది. పెసి

మిటి యెంత దుర్మార్గుడైనను నేనతని దాసినే యనుకొనునుగాని ఆతడయోగ్యుడని పర పురుషవాంఛ కలిగియుండు టనునది దుర్జాతిలక్షణము. ఉత్తమురాలగు నేహైందవ కుటుంబినియు నట్టి తలంపుకలిగియుండదు. మన హిందూకుటుంబములలో అందును మన బ్రాహ్మణకుటుంబములలో పతినివరించి పెండ్లాడెడి పద్ధతియింతవఱకు లేదుగదా తలిదండ్రులు పరిణయముచేసిన వరునియందే యనురక్తలగుట వధువుల ధర్మముగా నున్నది. శారదాచట్టమువలన మునుముందీ వైవాహికపద్ధతిమార్పునొందునేమోకాని యిప్పటి పద్ధతి స్వయంవరము కాదు. అట్టిచో అట్టి వివాహము లన్నియు నక్రమము లనియు నట్టివారు పరపురుష సంపర్కము చేసినవారనియు నిర్ధారించుట సాహసము. తలిదండ్రు లెవనికొసంగిన వానినే పరదైవముగా నెంచి ప్రేమించి గౌరవించెడి హిందూ స్త్రీలయెడ చిత్తమొకనికి శరీరమొకనికి యొసగుచున్నారని నీవు వ్రాసినవ్రాత మిక్కిలి యనుచితముగా నున్నది. ఇట్టి యూహ హైందవకుటుంబినులయెడ తలపరాని విషయము. అటుల భావించినచో మన బ్రాహ్మణ స్త్రీలలో వరించి వివాహమాడిన వారెవరు? అందఱము మన జననీజనకులచే నొకరికి కన్యాదానము చేయబడిన వారమే. కాన నీమతమే నిజమగుచో మనము, మన తల్లులు, సోదరీమణులు, పుత్రికలు, వేయేల మన భారతమహిళ లెల్లరు చెడ్డవారే యనవలసివచ్చును. సోదరీ! మన వివాహసంస్కారము నందు లోపములున్నచో సంస్కరింప నగునుగాని నీ నాటకరంగ ప్రవేశోద్యమసమర్థనముకొఱకు స్త్రీలనెల్లర కట్టగట్టి యిట్టి హేయమగు నిందకు గుఱిసేయుట కడుంగడు సాహసమే గాక యక్రమమనియు బల్కి సాహసించి నందుకు క్షమింపకొరెదను.

నాటకరంగమున స్త్రీలుచేరుటచే చెడిపోవుదురని నంములకు ఇప్పుడు బాగుగా నున్నవారెవ్వరు? వరించి పెండ్లాడని వానియందు ప్రేమ యెట్లుకుదురును? కాన యిప్పుడు మన స్త్రీలుచేయునది యంతయు పరపురుషసహవాసమేయని వాదింప దగునా? పతిచే పలుబాములు పడుచున్నను ఆతనినే దేవునిగా భావించి బూజించు చున్నవారును; పతి విగతజీవుడుగా సర్వము వర్జించి వీరవైరాగ్యము సలుపుచున్నవారును నైన మనభారత మహిళల హృదయమెఱుగక నీవు వ్రాసిన వాక్యములు వారి మానసము నెంత నొవ్వచేయునోగదా?

జ్ఞానముచే మనస్సును పరిపక్వము చేసికొనిన వారికి పరపురుష సాన్నిధ్యభీతి లేదని వ్రాసితివి. మంచిది. నీవు సుశిక్షితలనుగా జేసిన కులీనస్త్రీ లట్టివారే గావచ్చును. కాని వారితో నభినయింపవచ్చిన పురుషులుగూడ నట్టివారు కావలెనుగదా. సరి. యత్నముమీద వారినిగూడ మంచివారినే సంపాదించెద రనుకొందము. కాని చూడ వచ్చిన వారుగూడ బ్రహ్మజ్ఞానులు కావలెనుగదా. లేకున్న వారిచేనైన హేళనలు తప్పవుగదా. సోదరీ! ఏవేషభాషలు లేక బడికివెళ్లి చదువుకొనివచ్చు కన్యలకే యిక్కా

లమున మగవారిచే మాటలు తిప్పకున్నపుడు నాటకము లాడెడి కులీనస్త్రీ లెత్తైఱుగున మాటలు పడకుందురో నాకు దోఁచలేదు. హిందూప్రేమసంఘమువారాడిన నాటకములకు యిష్టములేనివారుగూడ వచ్చిరని సంతసముతో దెల్పితివి. అవును యిష్టములేనివారే యధికముగా వచ్చెదరు. కాని ఆవచ్చుట ఆక్షేపించుటకేగాని ఆమోదించుటకు గాదు సుమా! సోదరీ! మన దేశమున పురుషులింకను స్త్రీలవ్యక్తిత్వమును స్వాతంత్ర్యమును ఆమోదించుట కలవాటు పడలేదు. స్త్రీలయందుగల నిరసభావముతొలగలేదు. వారి యాటపాటలను గౌరవముతో సమానముతో చూచుట నేర్చుకొనలేదు. కానవారి చిత్తవృత్తులు మార్పు నొందనిది. స్త్రీలు రంగభూము లెక్కుట యుక్తముకాదు. కాననీవును కళాభివృద్ధి చింత నటుంచి మన స్త్రీల పురోభివృద్ధినే చిత్తమునందధికముగా నెంచి స్త్రీల యశోహానికరములగు నిట్టి యుద్యమములకు చేయూతనీయవలదని ప్రార్థన. ఇది నాయొక్కతె ప్రార్థనయేగాదు. మన స్త్రీలలో అధికసంఖ్యాకు లిటులనే కోరుచున్నారు. ఇటీవల బెజవాడకు వెళ్లినప్పుడు నేను చాలమంది విద్యావతులతో ఈ విషయమై మాట్లాడితిని. మహాసభలో ప్రస్తావించితిని. అత్యధికసంఖ్యాకు లీయుద్యమమున కెట్టులు ప్రతికూలముననుండిరో నీవుగూడ వచ్చినచో చక్కగా చూచియుందువు.

ఒక గొప్పస్త్రీవిద్యాసంస్థనడుపుచున్న యొక నారీమణి స్త్రీల నాటకరంగ ప్రవేశమునుగూర్చి ప్రసంగింపుచు యిట్టులనెను. "రామదాసు వేషమును రాఘవాచార్యులుగారు వేస్తే బాగుంటుంది. వారి వేషధారణమనిన జనులు అధికసంఖ్యాకులు వస్తురు. డబ్బుబాగావచ్చును. కానవారిని మావిద్యాసంస్థసహాయార్థ మొక్క ప్రదర్శనమును కోరితె బాగుండు ననుకొంటిని. కాని వారి యిప్పటి స్త్రీల నాటకరంగప్రవేశయత్నమును జూచి సాయము చేయమంటే ఏఆడదానైనా తోడాడడానికి పట్టుకరమ్మంటారేమో? అట్టాతీసుకరమ్మంటే ఎవతెను తీసుకవచ్చేది. ఏఅమ్మనైనా నీవు వస్తావా? అని అడిగితే నీవే ఆడరాదా? అంటుందేమోనని భయం. మఱిన్ని రాఘవాచార్యులుగారు రామదాసు పాత్రను ధరించినచో రామచంద్రారెడ్డిగారు కబీరు పాత్రమును ధరించినగాని బాగుండదు. స్త్రీలెక్కిన రంగభూమి నెక్కనని యీాయన వ్రతము. స్త్రీలు స్త్రీపాత్రము ధరించినగాని నాటకమాడనని ఆయనపట్టు. ఈ సంగతి సందర్భములు చూచి వారిసహాయమును కోరుట మానుకున్నాను."

సోదరీ! స్త్రీల భీతి యిట్టులున్నది. మఱియు నొకమనవి. నీ ప్రత్యుత్తరమం దెల్లెడలను నేను జ్ఞానిని, తత్వజ్ఞురాలను, నాబుద్ధి యసాధారణమైనది యను నాత్మస్తుతియు; మీారు వివేకరహితులు, అజ్ఞానులు, దురభిమానులు, అల్పబుద్ధు లనుపరనిందయు గోచరింపుచున్నది. జ్ఞానులును విశేషించి తత్వజ్ఞులునునైన వారిట్టివిముందుగా త్రుంచివేసికొనదగినడియని తెలిసికొన గోరెదను.

శారద.

# జూలియా వార్డు హావ్ సతి

వడ్లమూడి గోపాలకృష్ణమూర్తిగారు

"సహజమును, న్యాయమునునగు స్త్రీ సత్వముల నరికట్టు కొన్ని యక్రమపద్ధతుల రూపుమాపుటకై తన యావజ్జీవము పాటుపడి స్త్రీ జన శ్రేయమునకే తన సర్వ శక్తిని వినియోగించి అమెరికాలోని గణ్యలలో నగ్రగణ్యయని వన్నెకెక్కిన జూలియా వార్డు హావ్ సతి యొక్క జీవితము స్త్రీ స్వాతంత్ర్యనిర్ణయమున ననేక క్లిష్టసమస్యల నెదుర్కొనుచున్న భారతీయుల కవశ్యపఠనీయము, చిరస్మరణీయము."

—సండర్లాండు.

"ఒంటరిగను నిస్సహాయముగను ప్రపంచమునగల యసత్యముతో ధైర్యమున పోరాడు సాహసహృదయులకును, తామొనర్చిన కృషియొక్క ఫలితమును తమ జీవితమున గనలేక మరణముననె యశస్సును జూడగలిగి యట్టికీర్తినె వరించి గడించిన నాయకశిఖామణులకును, తాత్కాలికముగ నరణ్యరోదనమువలె పరిణమించినను సత్యమే జయమని యెలుగెత్తి చాటిన సత్యప్రియులకును, పాపదావానలజ్వాలలచే దమ శక్తిని దహింపబడనీక యధికతరోత్సాహమునె పొందిన పుణ్యజనులకును నేను కేలొగ్గెద్తును. వారి శ్రమ వృథాపోదనియే నాదృఢ విశ్వాసము. తీవ్రప్రతిఘటనలలోనై ప్రజాభిప్రాయమునకు భిన్నముగ వారు నాటిన సత్యబీజము లెప్పటికైన వృద్ధిజెంది వృక్షములై ప్రజావిశ్వాసము, సర్వజనశ్రేయము అనుఫలములను ఫలించకపోవు."

—జూలియావార్డు హావ్ సతి.

౧

ఈమె న్యూయార్కు పట్టణమున 1819–వ సంవత్సరములో జన్మించినది. శ్రీమంతుల యింటబుట్టి నప్పటికిని ధన మామె నాకర్షింపలేదు. ప్రజాక్షేమమె యామె పరమలక్ష్యము. అత్యంతరమణీయకరమగు దేహ సౌందర్యమును అసామాన్యమగు బుద్ధిబలమును, వేలకొలది ధనమును గలిగి··· ఇంతయేల, ఎంత మనోదార్ఢ్యము కలవారికైనను, కడు సులభముగ భోగలాలసుల నొనర్పగల వాతావరణమధ్యమున నుండియు చలింపక అట్టి యాడంబరగ జీవితపు బండారము గ్రహించి మేఘమధ్యమున ప్రకాశించు క్రొక్కారు

మెఱుగును బోలు నాసౌఖ్యముల యస్థిరత్వము నెరిగి అత్యున్నతాదర్శములతో మానవసేవయొనర్చి శాశ్వతానందము బొంద నాశించెడిది. ప్రపంచమున కెట్లుపయోగపడుదునాయనియె సదా యోజించుచుండెడిది.

బాల్యమునుండియు జూలియాకు పుస్తకములన్న నెక్కుడు ప్రేమ. గ్రంథపఠన మామెకు సంతోషదాయకము. చిన్నతనముననె గ్రీకుని, జర్మన్, లాటిన్ భాషలను నేర్చెను. స్వయంశిక్షణమువలననే ఇటాలియన్ భాషయందు మంచి పాండిత్యము బొందెను. కొలదివయసుననె గ్రంథరచనకు గడగి తన పద్యములను పత్రికలలో ప్రకటించెను. హాస్యసంభాషణమున నిపుణురాలగుటచే సాంఘికసమావేశములలో తన యుక్తివచనములచే నందఱి నలరింప జేసెడిది.

## ౨

1841 లో జూలియా బోస్టన్ నగరమున డాక్టరు సామ్యుల్ హావ్ అనునాయన పరిచయమును సంపాదించెను. ఈ డాక్టరు తనవైద్యశాస్త్రనిపుణతకును, దేశసేవానిరతికిని మిగుల ప్రసిద్ధికెక్కెను. సహజస్వాతంత్రాభిలాషియగు నీయన టర్కీ దేశపు నిరంకుశప్రభుత్వమును తొలగించి, స్వేచ్ఛనుబొంద యుద్ధము సాగించిన గ్రీకుదేశీయులకు సాయపడుటకై గ్రీసునకేగెను. అచ్చట నొక వత్సరము సైనికుడుగను వైద్యుడుగను తనప్రాణము తృణముగనెంచి, గ్రీకు స్వాతంత్ర్యమునకై పోరాడి అమెరికాకువచ్చి గ్రీకుసహాయనిధియని కొంతధనమునుగూర్చి, వస్త్రములను ఆహారపదార్థములను తీసికొనివెళ్ళి యుద్ధఫలితముగ దరిద్రులైన గ్రీకులకు తానేస్వయముగ పంచియిచ్చెను. ఇట్లే పోలండుదేశీయుల కొరకై పనిచేసి వారికృతజ్ఞతకు పాత్రుడాయెను. పారతంత్ర్యులగు నేదేశజులకైనను తనసంపూర్ణసానుభూతినిజూపి ఎట్టి సాహసకృత్యమైన నొనర్చి స్వేచ్ఛాస్థాపనాబద్ధకంకణుడైన డాక్టరు హావ్ యొక్క పేరు అమెరికా యూరోపుఖండములందంతట నాబాలగోపాలమునకు తెలిసెను. ఇట్టిత్యాగపురుషునకును మన జూలియాకును స్నేహమేర్పడుట నిజముగ దైవసంఘటనమే యనవచ్చును. మానవసేవయే జీవితపరమావధిగా నిడికొన్న జూలియా హృదయమును వశపరచుకొనుట కింతకంటె నర్హులెవరుండగలరు? ఇకవారిద్దరును పరిణయ మాడిరన్నచో నాశ్చర్యమేల? ఎంత యనుకూలదాంపత్యము! ఆహా! రెండు త్యాగపూరితహృదయము లొకటియైనవిగదా!

వివాహానంతర మాదంపతు లొక వత్సరము యూరపులోనె పర్యటనము సల్పుచు ఎమర్సన్, లాంగ్ ఫెలో, డికెన్సు మొదలగువారి మిత్రత్వమును సంపాదించి స్వదేశమునకేగిరి.

## 3

1. విద్యాసేవ 2. ప్రజాసేవ 3. గృహనిర్వహణము హావ్ సతి జీవితమునందలి ముఖ్యవిభాగములీమూడును.

ఈమె మంచి గ్రంథకర్త్రి. దాదాపు పండ్రెండు పుస్తకముల రచించినది. ఇవిగాక, తనవ్యాసరాజములను వార్తాపత్రికలు, మాసపత్రికల మూలమున పాఠక లోకమునకందజేసెడిది. పత్రికాసంపాదకులామె వ్యాసములకై యువ్విళ్ళూరుచుండిరి. పాఠకు లామె వ్రాతలను చదువ నుత్సాహపడుచుండిరి. ఈమె రచించిన గీతములెంతో కొనియాడబడి, ఈనాటికిని అమెరికాలో పాడబడుచున్నవి. అనేక భాషలలోనికి పరివర్తించబడినవి.

1860-వ సంవత్సరములో అమెరికాదేశమున వెలువడిన స్త్రీజనోద్యమమునకు హావ్‌సతి నాయకత్వము వహించెను. స్త్రీవిద్య పట్లచూపబడుచున్న సంకుచితదృష్టి తొలగవలెననియు వీరి విద్యకై యెక్కువ సౌకర్యముల నొసగవలెననియు తీవ్ర ప్రచారమొనర్చెను. ఇదివరకే బాలికలకు ప్రాథమికవిద్య యుచితముగ నేర్పబడుచుండెను. "ఉన్నతవిద్యకూడ వీరికేల నేర్పరాద"ని యాందోళనమొనర్చెను. ఈమె తీవ్ర ప్రయత్న ఫలితముగనె 1861 సంవత్సరములో అమెరికాలోనికెల్ల మొదటి స్త్రీకళాశాలయగు "వస్సార్ కళాశాల" స్థాపింపబడెను. క్రమముగ ననేకము లిట్టివి వెలువడినవి. వేనవేలుస్త్రీలు ఉపాధ్యాయినులుగను, పత్రికాసంపాదకురాండ్రుగను, వైద్యురాండ్రుగను, ఉపన్యాసకురాండ్రుగను శిక్షణమునొంది వారివారి స్వతంత్రవృత్తులందు బ్రవేశించుచుండిరి. కాలక్రమముగ ప్రథమమున నిందులకు విముఖముగ నున్న ప్రజాభిప్రాయముకూడ వీరి కనుకూలముగనె మారినది. ఎక్కువ విద్యావంతమగు దేశమని వన్నెకెక్కి స్త్రీపురుషులెట్టి భేదమును లేక సమానసత్వముల ననుభవించుచు, ఈనాటి నాగరికరాజ్యములలోనికెల్ల తలమానికమని వన్నెకెక్కిన అమెరికాలో స్త్రీలయున్నతవిద్య ప్రారంభింపబడి డెబ్బదివత్సరములేయైనది. అరరే! ఎంతలో నెంతమార్పు! భారత నారీమణు లెపుడిట్టియుచ్చస్థితి బొందగలరోకదా!

హావ్ దంపతులు "బానిసత్వనాశనోద్యమ"మున బ్రవేశించి తమ యావచ్ఛక్తిని వినియోగించి, యొనర్చిన శ్లాఘ్యనీయమగుకృషిని అమెరికాదేశీయు లెన్నటికిని మరువజాలరు. వీరిందులకై "బోస్టన్ కామన్ వెల్తు"ను పత్రికనుకూడ నడపిరి. ధనాఢ్యులును, పలుకుబడి గల యనేకులును బానిస యజమానులకే సహాయపడుచు వీరియుద్యమమును నిరుత్సాహపరచి నాశనమొనర్ప యత్నించినను సాహసమూర్తులగు నా సతీపతు లణుమాత్రమైనను జంకక బానిసల విముక్తికొరకై పాటుబడుచుండిరి. నీగ్రోలకు స్వేచ్ఛలభించిన యనంతరముకూడ, హావ్‌సతి, వారి సేమము నరయుచుండెను. వారికేవిషయమున నన్యాయము జరుగకుండు నట్లుగను, పాఠశాలల స్థాపించి విద్యగరపుటకును ఇంక నన్నివిధములగు సౌకర్యముల నొసగుటకును ప్రజలలో ప్రబోధము కలిగించుచుండెను. నీగ్రోలపట్ల తెల్లవారెంతో కృతజ్ఞులుగ నుండుటకు మారు వారిని కన వినరాని కష్టపరంపరలకు గురిచేయుట శ్వేతవర్ణుల మానవత్వమును సూచింపదని యామె నిర్భయముగ జాటెడెది. పాషాణతుల్యములగు కఠినహృదయములుకూడ కరగునట్లుపన్యసించెడిది. అంటరానివారు, ముట్టరానివారని భారతదేశమున నీసడింపబడుచు పశువులకంటె హీనముగ జూడ బడుచున్న పంచమసోదరుల యున్నతికై కృషిసల్పుటకును, వారిజన్మసత్వముల స్థాపించి, సంరక్షించుటకును, కొంగు బిగించి; కార్యరంగమున కురుకు నారీమణులెంత యవసరము? హావ్‌సతి జీవితపుటాదర్శమె హైందవస్త్రీలోకమున కాదర్శకమగుగాక !

౪

ఈమె మిక్కిలి శాంతిప్రియురాలు. పెక్కువత్సరము లమెరికాశాంతిసమితియందు సభ్యురాలుగ నుండెను. యుద్ధమువలన గలిగెడి ఘోరవిపత్తులను, ప్రజలకు సుబోధకమొనర్చి వారిని రణవిముఖులుగ నొనర్చుటకామె కడుశ్రమపడెను. 1870-వ వత్సరమున ఫ్రెంచిప్రష్యాయుద్ధసందర్భమున నీక్రింది సందేశమును దేశములందంతట ప్రకటించెను:— "ఓ, పిల్లలగన్న తల్లుల్లారా! మీకడుపులకు చిచ్చువెట్టు నీజననాశనకరమును, అమానుషమును, అసహ్యాకరమునగు నీయుద్ధముల నిట్టెసాగనిచ్చెదరా? దీనికష్టనష్టముల ననుభవించునది మీరేకదా! మీరేల, యీరక్తపాతము నాపరు?" ఈప్రార్థన ఫ్రెంచి, జర్మన్, స్పేనిష్, స్వీడిష్, ఇటాలియన్ భాషలలోని కనువదింపబడి, విశేషప్రచురణమొనర్పబడెను. అత్యంతమాననీయమును కడుబాధ్యతాయుతమునగు మాతృత్వంపుటాదర్శము శాంతిస్థాపనమేననియు, శాంతి చిహ్నములగు నారీమణులె ప్రపంచశాంతికి పునాది వేయగలరనియు నామె దృఢవిశ్వాసము. వివిధదేశముల

స్త్రీలలో ముఖ్యులతో నుత్తరప్రత్యుత్తరముల జంపి లండనునగరమున నీమె స్త్రీలకాంగ్రెసును స్థాపించెను. వీరందరు నైక్యకంఠముతో యుద్ధ మమానుషమని లోకమునకు చాటి, యుద్ధపు పద్ధతినే నిర్మూలించుటకై యత్నించిరి. అంతర్జాతీయ శాంతి స్థాపనకై స్త్రీలకర్తవ్యమునుగూర్చి హావ్ సతి పెక్కు ప్రసంగముల గావించెను. ఒకసారి ఆంగ్లేయశాంతి సంఘసమావేశమునకేగి, యచట నుపన్యసించుట కనుజ్ఞనీయుడని కోరగా స్త్రీల కట్టిహక్కున్నదును లేదని నిరాకరించిరి. అంత నామె వేరుగ నొక యుపన్యాసశాలనద్దెకు బుచ్చుకొని వేలకొలది జనులకు తన సహజవాగ్ధోరణితో గంభీరముగ నుపన్యసించెను. దేశమునందంతటను, జూన్ 2 వ తేది "తల్లులరోజును"నొక మహోత్సవమును జరిపి శాంతి ప్రాముఖ్యతను గూర్చియు, నందులకు స్త్రీల బాధ్యతనుగూర్చియు ఉపన్యాసముల జెప్పించి స్త్రీలోకమున కంతటికిని జ్ఞానబోధ జేయించెను. ఇట్టియుత్సవముల యుపయోగము ప్రజతెలంగ యేటేట నిట్లె జరుపుచుండిరి. ఈసందర్భమున నీమెయొనర్చిన కృషి వర్ణనాతీతము. తన జీవితమున తానొనర్చిన కార్యములన్నిటికంటె నిదియె ప్రాముఖ్యమైనదని యామె తలచుచుండెడిది.

౫

స్త్రీల వోటు హక్కుల కొరకును, తదితర రాచకీయ సత్వముల కొరకును హావ్ సతిచేసిన పనిని తెలిసికొనుటవసరము. నలువది వత్సరములీమె యోపికతో నిందులకై పాటుపడెను. స్త్రీవిద్యనుగూర్చియు, స్త్రీల యభివృద్ధికి సంబంధించిన తదితర విషయముల గురించియు ననేకసంఘములలో చర్చించి, వానిని స్త్రీలలో ప్రబోధ మొనర్చి స్త్రీలోకమున నొక నూతనతేజస్సును ప్రజ్వలింప జేసెను.

స్త్రీలశ్రేయమునకై విశేషప్రయత్నము సలిపియున్న భారత నారీమణులీమెనుండి కొంత నేర్వదగును. ఈమె యుద్యమప్రారంభమున పురుషులు హేళన జేయసాగిరి. పలుకుబడి గల నాయకులు వ్యతిరేకముగ పనిజేసిరి. స్త్రీలు భయపడిరి. పదిమంది స్త్రీ లొకచో జేరి తమయోగక్షేమముల నాలోచించుకొనుట శిక్షార్హమగు నేరమను నభిప్రాయము ప్రజలలో ప్రబలియుండెను. స్త్రీల సంఘముల శాంతిని, సాంఘిక విప్లవమును గలుగజేయునని స్త్రీయుద్యమవ్యతిరేకులు, ప్రచారము జేయమొదలిడిరి. కాని హావ్ సతి, ప్రజాభిప్రాయము వ్యతిరేకముగ నున్నను, కఠిన విమర్శనకు గురియయ్యు నిరుత్సాహము నొందలేదు. స్త్రీలువిద్యాహీనలుగ, పారతంత్ర్యులుగ నున్నంతకాలము దేశము సౌఖ్యవంతముగ నుండజాలదని యామె గట్టిగ నమ్మి ప్రజలకట్లు బోధించెను. స్త్రీలందరును సంఘీభావము గలిగి సక్రమమగు కృషినొనర్చినచో తమమేలు నకేగాక దేశకల్యాణమునకుగూడ దోడ్పడుదురని స్త్రీలకుపదేశించెను. ఔన్నత్యశిఖరము నధిష్ఠించిన అమెరికాయందలి మతవిజ్ఞానము విద్యాప్రచారము మద్యనిషేధము అసంఖ్యాకములగు ధర్మసంస్థానిర్వహణము సంఘసంస్కరణము ఆరోగ్యము శిశుసంరక్షణము మున్నగు విషయముల గాంచి నప్పుడీదేశమునగల నుంచి యనదగు ప్రతివిషయము నెదోయొక విధముగ స్త్రీజనోద్యమ ఫలితమేఅని చెప్పక తప్పదు.

౬

ప్రతిదినమును విశేషకాలము ప్రజాహిత కార్యములందే గడపినను హావ్ సతి గృహనిర్వహణమన్న నెక్కుడు శ్రద్ధవహించెడిది. స్థానికసంస్థలు, తదితర సంఘములలో పనిజేయుచు దేశసేవ యొనర్చుచున్నామని తలచి యింటికార్యముల పంకనైన జూడక అనంతర మనేకమగు యిడుముల గుడుచువారందరు నీమెనుండి యీ గుణపాఠమును నేర్చుకొనుట మంచిది. దేశసేవకును, సంసారవ్యవహారములకును సంబంధము లేదనియు, నందునను స్త్రీలిట్టి కార్యములందు పాల్గొన్నచో బిడ్డలను పెంచువారుండరనియు కుటుంబసంస్థయొక్క పునాదియే కూలిపోవుననియు భీతావహులగువారు నైతము ఈమెజీవితచారిత్రము జదివి ధైర్యము నొందవచ్చును. ఈమె యైదుగురు బిడ్డలతల్లి. ఉత్తమ విద్యాపారంగతయు, ఉన్నతాదర్శములు గలదియు నగు నీతల్లి శిక్షణమున బెరుగుటయే యీశిశువులకు నుత్తమోత్తమమగు విద్య.

ఈమె పరిచయ భాగ్యముగల వారందరును ఈమె శిశుపోషణాది సామర్థ్యమును మిక్కిలి పొగడి యుండిరి. హావ్ సతి సదా సంతోషస్వాంత. ఆమె యానందసూచకముఖబింబమును జూచినవెంటనె బిడ్డలందరు నొక నూతనోత్సాహము బొందెడివారు. ప్రతి యుదయమునను, ప్రతి బిడ్డవద్దకును వెళ్ళి వారిని సంతసపెట్టుట యామె కార్యక్రమములోని మొదటి విషయము. ఆమె యెదుటనెంతి కఠినహృదయుడైనను దయార్ద్రహృదయుడగును. నిరంతర దుఃఖపీడితుడైనను క్షణములో నానందసముద్రమున నోలలాడును. ఆమె యెచ్చటనున్న నచ్చటనే—నీలాకాశము—మలయమారుతము—కోకిలారవము-అంతయు నానందపూరిత వాతావరణమే ప్రత్యక్షమగును. ఈమె కుమార్తె రిఛార్డ్సు సతి యిట్లువ్రాసెను. "మాయమ్మ మా యుద్దేశ్యముల నెప్పుడును గమనించుచుండెడిది. శిశుహృదయమును కనుగొనుటలో నామె కడు సమర్థురాలు. ఆమెకు తెలియని రహస్యములెవ్వియు మాకుండెడివికావు. మాలోనొక్కొక్కరు చెప్పెడి మాటలను లేశమైన విసువులేక విని మావిచారముల బోద్రోలి కర్తవ్యమును సూచించెడిది. పాటలు, పద్యములు, కీర్తనలు బాడియు; కథలజెప్పియు, పిల్లల సదా సంతోష పెట్టెడిది. ఆమెకు రాని కీర్తనలు ప్రపంచమున గలవాయని మేము సందేహించెడివారము. ఇంటిలోనెవ్వరైన కొలదివ్యాధి గ్రస్తులైనచో వారికొరకై కొన్ని ప్రత్యేక గీతములను వీనుల విందగునట్లు పాడెడిది. వినియానందము బొందుటకై జబ్బువచ్చిననే బాగుండునా యని పించెడిది. పర్వతప్రాంతమునను, నదియొడ్డునను, సాయంసమయమున షికారు వెడలి ప్రకృతి సౌందర్యము గాంచునపుడు, మాతల్లి తన యమూల్యోపదేశములను బోధించుచుండెడిది. నాబిడ్డలకు, నివాసార్థము దేహసౌధమును, పరిపాలించుట కాత్మసామ్రాజ్యము నొసగితి నని యొకసారి చెప్పెను. ఇట్టి బోధనల నెన్నటికైన మరువగలమా ? పెద్దపెద్ద వేదాంతగ్రంథము లింతకంటె సద్బోధ నొసర్పగలవా?"

## ౭

హావ్ సతిని ప్రజలందరును మిక్కిలి గౌరవించెడవారు. ఆమె యేసభకేగినను సభలోని వారందరు లేచి నిలవబడి తమభక్తి జూపెడివారు. ఆమె సేవను ప్రశంసించుచు పెక్కు విశ్వవిద్యాలయములు గౌరవబిరుదముల నొసగిరి. అందున నొక స్త్రీవిశ్వవిద్యాలయ పాలకులు "డాక్టర్ ఆఫ్ హ్యుమానిటి" బిరుదునిచ్చుచు నిట్లు జెప్పిరి. "దేశాభిమానురాలు, కవయిత్రి, విదుషీమణి ఏబదివత్సరములు మానవస్వాతంత్ర్యసిద్ధికై సర్వశక్తి ధారవోసి, స్త్రీయౌన్నత్యమునకై యసమానసేవ నొనర్చి "ఈమెకీమెయే సాటి"యని వన్నెకెక్కిన నీకు పరిపక్వమైన అత్యంతిమాననీయమగు వయసునందొసగు మాకృతజ్ఞతాపూర్వక గౌరవచిహ్నమునందుకొనవేడెదము."

హావ్ సతి అన్నికులములు, జాతులు, బీదలు, భాగ్యవంతులు, స్త్రీలు, పురుషులు, అందరిచేతను ప్రేమింపబడెను. సర్వజనప్రియ యగు హావ్ సతి తొంబదిరెండవయేట, అనగా 1910—వ సంవత్సరమున నీలోకమును వీడి చనెను. సంతాపసూచకముగ బోస్టన్ నగరమునందలి పాఠశాలలన్నియు మూయబడి ఆమెయాత్మశాంతికై ప్రార్థనలు చేయబడెను. అమెరికా ప్రెసిడెంటు రూస్‌వెల్టనునాయన "నాకుహావ్ సతియందుగలభక్తి, ఏ స్త్రీ పురుషునందును లే"దని వ్రాసెను. బోస్టన్ నగరాధ్యక్షుడిట్లు పల్కెను. "కేవల భోగలాలసజీవితమునకును ప్రేమపూరితము, కార్యదీక్షాసమన్వితమగు నుత్కృష్టజీవితమునకును గల హస్తిమశకాంతర భేదమును లోకమునకు జాటుటయె హావ్ సతి జీవితపుటాదర్శము." మేరివూలియను నామె "మానవసత్వములందును, బాధ్యతలందును స్త్రీకికూడ సమానభాగమున్నదని లోకమునకు జాటిన హావ్ సతి సిద్ధాంతము ప్రపంచపటమున కొక నూతనఖండమును కలిపించినట్లుండె"ననెను.

ఇంక కొలది యేండ్లాపె జీవించియున్నచో భారత రత్నద్వయము రవీంద్ర, గాంధి మహాశయుల నెట్లు తన యమృతకవితాధారచే గీర్తించెడిదోగదా? బాల్యవివాహనిషేధమునకును, అస్పృశ్యతా నిర్మూలమునకును, స్త్రీవిద్యా సౌకర్యముల కొరకును, వితంతువుల క్షేమమునకును, ప్రజారోగ్యమునకును, మద్యనిషేధమునకును, కళాపోషణమునకును—ఇవియది యననేల—ప్రాపంచికవిజ్ఞానమున కనేకవిధముల సహాయపడగల భారతీయనాగరికతను పునరుద్ధరణ సల్పు అమూల్యకృషికి తన సంపూర్ణసానుభూతిని జూపి సాయపడెడిది కదా!

# తొలిసంజ

కందుకూరి రామభద్రరావుగారు

ఆంధ్రరమణీమణుల చెఱ యంతరించె,<br>
క్రొత్తతలఁపులు దిశలందుఁ గొనలుసాగె,<br>
భావిసౌభాగ్యదీధితి ప్రాచివెలిగె,<br>
భారతీపుత్రి స్వాతంత్ర్య భేరిమ్రోగె.

ప్రాచ్యపాశ్చాత్య భావసంభరితలైన<br>
తెనుఁగురమణులు భారతీదేవిచరణ<br>
వారిజములకు మంగళహారతులను<br>
బట్టుచున్నారు విజ్ఞానపాత్రమందు.

ప్రకృతిగ్రంథములోని భావములఁదీసి<br>
యాంధ్రజీవితసారమునందుఁగలిపి<br>
వ్రాయుచున్నారు చిత్రముల్ రామలిపుడు<br>
హేమకంకణకింకిణు లింపునుడువ.

ఆంధ్రచారిత్ర జీర్ణపత్రాంతరమున<br>
రంగుమాసిన జ్ఞానసూత్రములనెత్తి<br>
పాడుచున్నారు మంజులభాషణముల<br>
మరచిపోయిన యాంధ్రుల మహిమచాటి.

భారతీదేవికళ్యాణ తోరణతతి<br>
అంగనలుకట్టుచున్నార లాంధ్రభూమి<br>
భావిభారతసౌభాగ్య భాస్కరుండు<br>
పొడుచుచున్నాఁడు సత్కళాపూర్ణుఁడగుచు.

# అనాథ ఘోష

శ్రీమతి ద్రోణంరాజుల క్షేత్రబాయమ్మగారు

గరిమ మెయిన్ స్వయంవరునిఁ గైకొనుపట్ల సనాతనంపుటా
చరణలు గ్రాహ్యమన్నను విచారము లేదనవచ్చుగాని ఈ
సరణి నిసుంగులన్ దమయశాస్త్రపు జేతలపాలుఁ జేసి దు
ర్భరమగు కట్టుబాటులను పన్నిన నేమనవచ్చు నక్కటా !

పరిణయమైనరోజుననె భర్తగతించిన కంఠసీమ శ్రీ
కరమని శాస్త్రచోదితముగా నెలకొల్పిన సూత్రమంత దు
స్తరపరిణామ మొంద యురిత్రాటిగ మారుపుఁ జేతురౌర నో
రెఱుఁగని బాలికామణులకేనియు నెక్కడి శాస్త్రధర్మమో !

ఆమరణాంతముండెడి మహాదృఢబంధము అర్థహీనమై
నీమముఁదప్పిపోవనవినీతిగ "నాతిచరామి" యన్నయా
ప్రేమపుసూక్తి మిథ్యనొనరించి ప్రవర్తిలఁ దప్పుగాదు ఇ
స్సీ! మహి క్రూరచట్టములు స్త్రీలకెగా విధి నిర్ణయించెనో !

శ్రుతివిహితోక్తవాక్యములు శుద్ధమృషల్ యవిచెల్లరాదు సం
స్తుతమనుధర్మముల్ యవలఁ ద్రోయవలెన్ సమయానుగుణ్యప
ద్ధతులును నీతిబాహ్యము లితఃపరమేమిక? స్వోక్తభంగివే
గుతుకలఁ గోయుటొక్కటె యకుంఠితధర్మమొ? హిందుదేశమా !

ధనములేమి కొంత ధైర్య సాహసములు
లేమికొంత విద్య లేమి కొంత
కలుగ సంస్కరింపఁగా జంకుదురునరే !
అన్నియుండి యూరకున్ననేమి ?

అత్రిమూర్తులను బిడ్డలఁ జేసిన మహాపతివ్రత అనసూయదేవి జూచి
మాండవ్యముని శాప మహాత్తిని పతిభక్తినిల్పిన దేవి సునీతి నెన్ని
స్వామి శ్రేయమున కాజన్మాంతమును వనక్లేశ మొందిన జానకీసతిఁ గని
జాత్యంధుఁడౌ పతి సరణికన్నులను గంతలఁ డాల్చినట్టి గాంధారి నెఱిఁగి

ఆర్యభూమి మాహాత్మ్యంబు నరసిదేవ
తలును బొగడిరి నేటికంతయును పోయి
భర్తమృతి నొంద మంగళ వానిపొంత
సిగ్గువిడి కూరుచుండు దుస్థితిఘటిల్లె!

సారవిచారముల్ దొరఁగి చక్కని బిడ్డల జాలిమాలి క
న్నారఁగఁ జూచుచుండ నొక యంతనరూపఱఁ జేసినన్ యులం
కారము లెల్లడుల్చినను కల్గదు చింత రవంతగాని ఈ
క్రూరపుముండనంబుఁ గన గుండెలు వ్రీలవె యొక్కపెట్టునన్?

పంచవిధుల భర్తవినష్టపడిన నన్య
పతిపరిగ్రహణము విధిపరుప సతికి
దాని ద్రొక్కి నన కట! అధర్మసరణి
పసిపిల్లలముంగుల కేని ఏర్పరుపఁ దగదె?

పెండిలియన్న నేమొ? యొక వేడ్కమిఠాయిలుఁ బిండివంటలున్
మెండుగఁ బొట్టనిండఁ దిని మిత్రులతోడుత నాటలాడు పెన్
బంధువటంచు నెంచిన యభాగ్యవితంతువు లెందరుండిరో
పండితసంఘమా! ని యొకసారి పరీక్షగఁ జూడు సోదరా

సత్యము ధర్మమున్ పురుషచంద్రుల చెంగట నెట్లు ద్రిప్పినన్
నిత్యమునట్టులే జరుగు నేరము లేదు సరే కదా మహా
న్నత్యముఁ గాంచు ఎక్కడి సనాతనధర్మమొ సంస్కరించు సం
స్తుత్యులు లేరు మందునకుఁ జూచిన నొక్కరు భారతావనిన్.




శ్రీమతి జాగర్లమూడి జానకమ్మగారు

"కలయనూరార్చెందనతొక్కుపలుకులొప్ప"

—నన్నయభట్టు.

ఈ ప్రచురింపుచున్న పిల్లల సంభాషణ శ్రీమతి జాగర్లమూడి జానకమ్మగారు 'గృహలక్ష్మి' కొఱకు ప్రత్యేకము శ్రమచేసి సేకరించినది. సంభాషణ రూపముననుండు పిల్లల అవ్యక్తమధురభాషణములు ఇట్టివి దేశమున పరశ్శతములుగ నున్నవి. కాని వానిలో కొన్నిటికైనను ఇంకను అక్షరరూపము చేకూఱలేదు. ముద్రణసౌకర్యములు సమకూఱియున్న ఈదినములలో కూడ వానిని వ్రాఁగూపమునఁజేయుంచుట పాడిగాదు. కావున అట్టివానియందు రుచిగలవారు వానిని సేకరించి 'గృహలక్ష్మి'పత్రికాముఖమునలోకమునకు చేకూర్ప ప్రార్థించుచున్నాము.

—సంపాదకుడు.

కాలువకుపోదాం

వస్తావా ?

ఏ కాలువ ?

రాజు కాలువ—

ఏ రాజు ?

కొక్కురాజు—

ఏ కొక్కు ?

పందికొక్కు—

ఏ పంది ?

అడవిపంది—

ఏ అడవి ?

గున్నడవి—

ఏ గున్న ?

ఏనుగుగున్న—

ఏ ఏనుగు ?

మదపుటేనుగు—

ఏ మదం ?

ఆముదం—

ఏ ఆముదం ?

చిట్టాముదం—

ఏ చిట్ట ?

సరిచిట్ట—

ఏ సరి ?

దాసరి—

ఏ దాసు ?

కాళిదాసు—

ఏ కాళి ?

భద్రకాళి—

ఏ భద్ర ?

తుంగభద్ర—

ఏ తుంగ ?

నీళ్లతుంగ—

ఏ నీళ్లు ?

పుప్పానీళ్లు—

ఏ పుష్పం?
పెట్లుపువ్వు—
ఏ పెట్లు?
గుజ్జుంపెట్లు—
ఏ గుజ్జుం?
పఠానిగుజ్జుం—
ఏ పఠం?
గాలిపటం—
ఏ గాలి?

సుడిగాలి—
ఏ సుడి?
అరటిసుడి—
ఏ అరటి?
బొంతరటి—
ఏ బొంత?
కంబళిబొంత—
ఏ కంబళి?
రత్నకంబళి—

ఏ రత్నం?
నవరత్నం—
ఏ నవ?
గోరునవ—
ఏ గోరు?
పులిగోరు—
ఏ పులి?
బెబ్బులి—
ఏ బెబ్బులి?
వీరబొబ్బిలి—

# వీరపత్ని

శ్రీమతి పాటిబండ అలమేలుమంగతాయిగారు

౧

వైరివీరాస్వగాపగాభైరవారు
ణద్యుతులలోన నైక్యమైనాడు రంగ
రాయధాత్రీశ్వరుండు; తత్ప్రాణవాయు
వీచిక లనంతవాయుగర్భితములై ధ్వ
నించుకొన్నవి వీరపత్నీవచస్సు.

౨

ముగ్ధమయ్యును శౌర్యాగ్నిదగ్ధమైన
భవదుదారస్వరూపమ్ము పొడుకొనియె
నాంధ్రయోషావత హృదయరాజ్యాలయందు
మఱచిపోలేరు నీవీరమధురమూర్తి.

౩

యుద్ధరంగప్రయాణ సన్నద్ధుడైన
పతికినీవన్న శౌర్యవాక్ప్రబలగర్జ
లుప్తమైపోవలేదు మాక్రొమ్మితలివిగో
తొంగిచూడుము హృదయాల తోచగలవు.

౪

ఎన్నినాళ్లయ్యెనో విచ్చుకొన్నరక్త
నాళములచిందిపోతి వుష్ణతరరక్తమీ
భగతధాత్రిపై నా హరించుకొంటి
రాయస్పృక్తోష్ణతాభరమాంధ్రసతులు.

౫

నీయమృతవాక్ప్రతిధ్వనుల్ నిలిచిపోయె
నాంధ్రయోషావతకంఠ రవాధ్వములను
నీరజోమూర్తి ప్రతిఫలించెడి నిసాంధ్ర
రమణివ్యక్తిత్వమందు వీరవీరపత్ని.

౬

ముష్కరాంగ్లతురుష్కసమ్మోహనాస్త్ర
మార్ఖ్యశతాభ్రష్ణవిజయరామక్షితీంద్ర
క్రౌర్యకృత్యనివారణకారణాంచ
రితతవామానుషాభీలకృత్యమాంధ్ర
రమణికయ్యెడుగాత శ్రీరామరక్ష.

# స్త్రీలు—నాటకప్రదర్శనము

శ్రీమతి గుడిపూడి ఇందుమతీ దేవిగారు

చిరంజీవి సౌభాగ్యవతి శారదకు ఆశీర్వాదము:—

శారదా! కల్పలతకు నీవు వ్రాయులేఖలం జదివి సంతసించుచుంటిని. నీకుజాబు వ్రాయ కుతుకముతోనుంటిని. నేటికి వ్రాయుచుంటిని. అమ్మా రంగమున నాటకప్రదర్శన మొనర్చుటకు స్త్రీలు ప్రవేశించిననేగాని నాటకకళ వృద్ధిజెందనేరదని కొందఱు వ్రాయు వ్రాతలను జూచుచుంటిని. అందుచే నాకు విచారము గలుగుచున్నది. నాఉద్దేశముకూడా నీకు తెలుపుచు వ్రాయుచుంటిని. శారదా! హావభావచేష్టలను అభినయరూపమున బ్రకటించుచు లాస్యమొనరించుట చాలా కాలమునుండియు వెలయాండ్రకు వృత్తిగానేర్పడి మొన్నటివరకునట్లే జరుగుచుండెను. ఇటీవల మహాశయులు కొందఱు అట్టివృత్తివలదని వారలనే నాట్యవిద్యనుండితొలగించి వారికి వివాహములుచేయుట మేలనిబోధించిరి. చాలవరకు అట్టిమార్పుకలిగినందుకు సంతోషమునందుచుంటిని. కాని శారదా! యిప్పుడు సంసారిణులును నాటకకళలనభ్యసించి రంగమునంబ్రవేశించి నటింపందగునని పురుషులును, స్త్రీలును కొందఱు వ్రాయుచుండుటకు చింతించుచున్నదానను. ఒకవైపున వేశ్యలు నాట్యవిద్యకూడదనిమానుచుండ మఱియొకవైపునస్త్రీలకీ నాటకరంగప్రవేశప్రదర్శనము లేటికి? స్త్రీలు ప్రవేశముకలుగజేసికొనిననేగాని నాటకములకభివృద్ధికలుగదను టేటి మాట? నాటకములు వ్రాయువారును, ఆడువారును నానాటికి మిక్కిలివృద్ధియగుచునే యున్నారు. నాటకములు నాటకశాలలు నానాగ్రామములయందు వృద్ధియగుచునే యున్నవి. అట్టిచో నాడువారు నాటకమాడువారుగా నేర్పడిననేగాని వృద్ధికిరాదనుట సమంజసముగానున్నదా? చిన్నదాననైనను బుద్ధిశాలినివిగాన ఆర్షవాక్యములతో నాసందేహములుతీర్చెదవుగాన నిన్నడుగుచుంటిని. నాకంటెను పెద్దది నన్నడుగుటేమిటనియెన్నకుమా! వయసునకుగాదు పెద్దరికము బుద్ధికిగాని.

అయితే గజ్జెలుగట్టి ధైతక అనుచు యిదివరకాడెడు వేశ్యలఆటకును ఇప్పుడు స్త్రీలాడు నాటకమునకును భేదమేమి? అయితేవారియాట మోటుగానుండును. యిది మొదలు కదలకుండ నాజూకుగానుండును. సరిగాని పూర్వకాలపు వెట్టిదానసుమా నాఘాందసపుటూహలకు వ్రాతలకు విసువబోకుమా! అయితే కథానాయకురాలి పాత్రము నొక స్త్రీ ధరించును. నాయకుడిపాత్రము నామెభర్తయేగైకొనునా? అట్లయిన నూరు దుఃఖములలో లేశమాత్రము ముదము. అయినను భార్యయుభర్తయు కొఱలేకుండ సమముగా పాత్రపోషణమునొనర్ప సమర్థులు గాకపోవచ్చును. అన్నియు ననికొనినట్లు అనుకూలముగా లభించునా? అట్లుఅనుకూలముగా లేనిచో సమర్థులగువారలు యేయితర స్త్రీపురుషులో నాయకీ నాయకు లగుదురుగదా! అప్పుడు ఆ కథాభాగభావముల ననుసరించి వారు కరస్పర్శనాదులొనర్చవలసివచ్చును. అట్లొనర్చుట స్త్రీలపాతివ్రత్యమునకు భంగమని నాగట్టితలంపు. ఈ నాయూహ సరియైనదనియే నా నిశ్చయము. ఆర్యజను లిట్లే నిశ్చయింతురని నా నమ్మకము.

ఇక శారదా! గతిలేకయిప్పటి మోటారులయందును, రైళ్లయందును ప్రయాణమొనర్చునప్పుడు ప్రాణములుబిగబట్టికొని యెప్పుడుదిగిపోవుదుమా అని తహతహలాడుచూ నెట్లోకూర్చుని చెఱసాలనుండి విడుదలయగునట్లు బ్రతుకుజీవుడా అని బయట బడుచున్నాము. ఇట్టిబాధ మూడవతరగతిలో నెక్కువారికి మిక్కుటము. ధనవంతులు కొందఱు ఒకటిరెండవతరగతులలో నెక్కుదురు. వారి కీపీడలేదు. రెండువంతులమంది స్త్రీలము వీలగునంతవరకు ఆడువాండ్రకు ప్రత్యేకముగా నున్న పెట్టెయందె యెట్లో యిరికికూర్చుండుము. స్త్రీలకు ప్రత్యేకమునిర్ణయించినపెట్టెలు ఒకటిరెండుదక్క నెక్కువలేకపోవుటచేతను, మోటారునందుస్త్రీలకు ప్రత్యేకస్థలనిర్ణయమేలేకపోవుటచేతను ఇట్టి యిబ్బంది కలుగుచున్నది. ఈ రెండువిషయములు ముఖ్యముగా గమనించుచు స్త్రీలకు తగునేర్పాటుచేయుటమంచిది. ఇకనాటకమును చూడవచ్చుస్త్రీలు కొందఱుముందుసీట్లలో పురుషులతో గలసికూర్చుండుటలేదా? అనినచో అదియు మంచిదికాదనియే నాతలంపు. అయితే యిక నిర్భయముగా శృంగారించుకొని పరపురుషునిస్పర్శించుచు ప్రదర్శనమొనర్చునెడ వారి హృదయములు వజ్రకాఠిన్యమువహించునేని సంతోషమే. వారుపరమయోగులే. కాని అట్టి

మనోద్రఢిమగల మానినుల కీనాటకరంగప్రవేశము యింపుగానుండనేయుండదని నాపిచ్చి విశ్వాసము. అచ్చుగా స్త్రీలే స్త్రీపురుషపాత్రల ధరింతురనుకొనుము. పురుషులవలె స్త్రీలు వర్తింపవలెగదా! రంగముననిల్చి స్త్రీలు నటించుట యేపాటిమేలునుగాదు. మున్ను పురుష వేషము వేసి రాజస్త్రీలు యుద్ధమునపాల్గొనలేదా అనెదరేని మహోపద్రవప్రదమై సర్వనాశనమునగు సమయమున మానసంరక్షణార్థమై ప్రాణముల త్యజింపనెంచి రణరంగములకుఱికిరి గాని యిప్పుడు కుడిచికూర్చుండలేక నాటకరంగముల నెగురవలయునగత్యా మేమున్నది. పురుషులలో పెచ్చుపెఱుగుచున్న శైలూషవృత్తిచాలక స్త్రీలు బైలుదేరవలెనా? స్త్రీలకు శీలభంగకారియు నష్టదాయియునగు ఈనాటకరంగములు స్త్రీలవలననే కాని వన్నెకెక్కక నాటకకళవృద్ధిగాంచనిచో నవినశించి పోవుటయే మంచిదిగదా? నాటకములు జీవనోపాయములుగానేర్పడుచున్నవి. నాటకవృత్తిచే జీవించుట యెక్కువగణ్యతగా నాడును నేడును పరిగణింపబడుటలేదు. అయినను యేపాటుపడినను దారాపుత్రోదర పోషణనకు పురుషునకు చెల్లుబాటయినది. పైనబట్టలేకుండగనే బయటికిపోవుట మగవారికిచెల్లెను. సృష్టిలోను స్వభావములోను కొంతభేదమున్నదిగాన స్త్రీలెప్పుడు వినయవిధేయసౌశీల్యలజ్జాన్వితలై మానవతులై పరపురుషునకు దూరముగానుండుటయే దేశమునకు జాతిమతములకు శ్రేయస్కరమగును. శారదా! స్త్రీలు నాటకరంగములకు దుముకువిషయమును విమర్శించుచు నందుకువ్యతిరేకముగా నీవువ్రాసినదానికి అపార్థము నాపాదించి నీవునాటకరంగమున బ్రవేశించి బాగుగానెగురుటకు వీలులేనందుకు దుఃఖించుచుంటివని 'సాధన'లో వ్రాసినందుకు విస్మయమునొందుచు విచారించుచున్నాను. నీవు స్త్రీలు నాటకములయందు పాల్గొని ప్రదర్శించువిషయమున పూర్తి ప్రతికూలస్వభావముకలదానవనుట విదితమే. వారికి వేరుగాతోచుట విచిత్రము.

# నవ్వులాటలు

తాతకృష్ణమూర్తిగారు బి. యే; యల్. టి.

## హిస్టరీపాఠము

మాస్టరు—అంత్యదశలో పాపమావృద్ధ రాజు......యెట్టిస్థితిలో నుండెను?

విద్యార్థి—చచ్చిపడియుండెను!

## కవలలు

మనవరాలి పుట్టినదినంకదా అని, ముసలమ్మ పట్టుపరికిణి, చొక్కా, కుట్టించి, చిట్టికితొడిగించి, ముద్దులాడుతూ "చిట్టీ, నాపుట్టినదినంకూడా యీవాళేసుమీ!" అని చిరునవ్వుతో చెప్పింది.

మహా ఉత్సాహంతో, ఆబాలిక, "అయితే నాన్నమ్మా, మనం కవలబిడ్డలం, అన్నమాటకదూ?" అని చప్పట్లు చరిచి, గెంతులాడింది.

## సత్యహరిశ్చంద్రుడు

తల్లి—గూట్లో మూడు కోడిగుడ్లు దాచానుకదా, యిప్పుడు రెండే ఉన్నాయేం?

బాలుడు—అమ్మా, అప్పుడాగూట్లో, చాలాచీకటిగా ఉండేనే! అంచాత, నా కొతక్కిన వుండలు కానరాలేదు.

## ఔను. నిజమే

భార్య—నిన్నటి దగ్గిర్నుంచి చూస్తున్నాను, యెందుకో చాలా చికాకు పడుతున్నారు, నిజమేనా?

భర్త—ఔనే. అప్పులవాళ్లు ప్రాణాలు తీస్తున్నారు.

భార్య—అయితే, ఆచికాకేదో వాళ్లేచేస్తారుకదా, వేరే మీరు చేసుకోవడం యెందుకు?

## వాడిదే తప్పు

తల్లి—చిట్టితల్లీ! ఎందుకమ్మా యేడుస్తున్నావు?

బాలిక—అన్నయ్య......అన్నయ్య......మరి............

తల్లి—ఆవెధవ నిన్నుకాని, కొట్టినాడా యేమిటి?

బాలిక—లేదు......నేనే వాణ్ణినెత్తిమీద కొట్టడానికి పరుగెత్తి, వెళ్లబోతూవుంటే, ......గుమ్మం తగిలి పడిపోయినాను. మోకాలు నొప్పెట్టింది.

## పాటకులు

"ఈ సంగీతగాళ్లకి సాధారణంగా ఉండేవే, యీ రెండు లక్షణాలు కదండీ."

"ఏమిటవి"

"పాట వొచ్చినవాడిని పాడమని యెంత బలవంతం చేసినా, పాడకపోవడం—పాటరానివాడిని ఊరుకోమని యెంత బ్రతిమాలినా వాడు వినిపించుకోక పోవడం!

## వాచీ

కచేరీకి వెళ్లేముందు పంతులు, జేబులోని వాచీతీసి, చూసి, భార్యతో. "టైమ్ ఆగిపోయినట్లుంది వాచీకి యీవాళ 'కీ' యివ్వలేదు కాబోలు." అన్నాడు.

దగ్గరనున్న ఐదేళ్లయీడు బాలుడు, "లేకేం, నాన్నా? ప్రొద్దున్న నేనూ, చెల్లీ, యిద్దరం వాచీకి చాలాసేపు కీ తిప్పి, టిక్కు టిక్కు లాడించాం!" అని సమాధానం చెప్పాడు.

## స్కూలువిద్య

ఐదేళ్లు నిండకుండానే, చూడమ్మని స్కూల్లో వేశారు.

ఒకనాడు మాస్టరు, "అమ్మాయీ, నిన్నబడికి రాలేదేమి?" అని అడిగినాడు.

"నిన్న మా అమ్మ పురుడయింది. నాకో చిన్నతమ్ముడు పుట్టినాడు" అని ఆమె నిజంచెప్పింది.

మాస్టరాసమాధానానికి తృప్తిపొంది, పిల్లను కోపగించక, కూచోమన్నాడు.

మరోపదిరోజుల పిమ్మట, పిల్ల మళ్లీ స్కూలుకు రానందున, మాస్టరు కారణం అడిగినాడు.

శిక్ష తప్పించుకునందుకు, చూడమ్మ తణుకూ బెణుకూ లేకుండా బొంకింది: "మా అమ్మ మళ్లీ పురుడయింది—యీమాటు నాకు చెల్లి!"

## న్యాయస్థానము

ముద్దాయి—న్యాయం, యిప్పించండి మహారాజా! నిజంవిచారించి, న్యాయం సెలవియ్యండి బాబయ్యా!

మ్యాజిస్ట్రేటు—నోరుముయ్యి! ఏవిటా అరుపు. కోర్టువారియెదట వున్నావన్న సంగతి జ్ఞాపకం వుందా?

## ఉద్యోగము

"మా వాడికి యేదైనా నౌఖరీ యిప్పించమని మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను."

"......సరేకాని, అతడేంపని చెయ్యగలడో, చెప్పండి."

"ఏపనైనా చేసుకోగల సామర్థ్యం వాడిలో వుంటే, వేరే నౌఖరీకోసం దేవులాడడ మెందుకు?"

## ముఖ్యప్రయోజనము

బాలకవి—శారదాబిల్లు పాస్అయింది గనుక, మరి యిబ్బంది లేదండి. ఇక మన తెలుగులోకూడా మంచి మంచి సాంఘికనవలలు, నాటకాలు, కథలు, పాటలు, పద్యాలు—అన్నీ రాయడానికి కవులకు అవకాశం కలిగింది."

పెద్దమనిషి—అంటే?......యేవిటి మీ అభిప్రాయం?

బాలకవి—మనలో బాల్యవివాహాచారం ఉన్నన్నాళ్లూ, కవులకు కథలు కల్పించుకోవడం కష్టంగా ఉండేది. కథ, సరసంగా ఉండాలంటే యుక్తవయస్సులో వున్న నాయకిఉండాలి. ఎంతసేపూ, మనవాళ్లు బాలవిధవల్నీ, బ్రహ్మసమాజంలో వున్న స్త్రీలనీ, మొగనాలుల్నీ—వీళ్లనే నాయికలనుచేసి, కథలో శృంగారం యిమిడ్చేసారు. ఇప్పుడు మరి, అట్టియిబ్బంది లేదు. ఇంగ్లీషు నవలలలోవలె, మనదేశంలోకూడా యెదిగిన పడుచుపిల్లలు, లవ్ మేకింగూ, అన్నీ వుంటాయి.

# ఆంధ్రవనితామణులు

శ్రీమతి పి. అప్పలనరసమ్మగారు

భారతనారీమణుల చరితము
మాలగా మా తెనుగువారికి
గ్రుచ్చియిచ్చిన తల్లివో బం
డారు అచ్చమ్మా!

నన్ను మరచిన గాని మీ దే
శమ్ము మాత్రము మరువలదని
స్వర్గమునకే వెడలితమ్మా
అన్నపూర్ణమ్మా!

నాటి నాయకురాలి పౌరుష
పటిమ నీలో నవతరించెను
ధన్యమయ్యెను తెలుగు దేశము
లక్ష్మిబాయమ్మా!

నాయకోత్తమ వీరులకావం
తయును కాంతలు తీసిపోరని
చాటి చెప్పితివమ్మ భళి దు
వ్వూరి సుబ్బమ్మా!

స్వకులదుస్థితి గాంచి మదిలో
జాలిగొని నీ సర్వస్వమ్మును
ధారపోసితివహహ యామిని
పూర్ణతిలకమ్మా!

మొల్లయును మా ముద్దు పళని ని
బోలె కవితల నల్లి ఖ్యాతిని
గాంచి వెలసితివీవు కాంచన
పల్లి కనకమ్మా।

# స్త్రీవిద్య

శ్రీమతి లేళ్ల నాగభూషణమ్మగారు

మన దేశమున స్త్రీవిద్య లేనందున భారతభూమి ఇతరదేశములకన్న గౌరవమునందును తదితర విషయములందును చాల తక్కువగానున్నదని చెప్పుటకు చాల విచారముగనున్నది. ఇతర దేశము లనగా యూరోపు మొదలైనటువంటి దేశములందు పురుషులతో సమానముగా స్త్రీలను విద్యచెప్పించి పదవులిచ్చి గౌరవముగా చూచుట ఆచారమైయున్నది. హిందూస్త్రీలకు ఏవిధమైనటువంటి విషయములందు జోక్యముకలుగజేసికొననీయక పోవుటయేగాక వారికివిద్యయైననుసరిగా చెప్పింపరు. ఇది హిందూస్త్రీల గ్రహచారకర్మఫలమని నాతలంపు. విద్య అనగా మనవాండ్లకు ఉద్యోగము కొఱకనిగాని లోకజ్ఞానము కొఱకనిగాదు.



లేళ్ల నాగభూషణమ్మగారు

“ఏమండీ! మీఅమ్మాయి బడికివెళ్లుతూవుందా?” అని అడిగితే “లేదండీ! చదువు చాలించాము. అమ్మాయి పెద్దది కావస్తూవుంది. పెద్దపిల్లను బడికి పంపుట మనలో ఆచారము కాదు కదా! చదివిన మట్టుకుచాల్లెండి. వాళ్లుయేలనా? వుద్యోగాలు చేయటానికా?” అని అంటూ వుంటారు. ఇది ప్రతివారికి సహజమైన ఆచారమైనది. “విద్యావిహీనపశుః” అని సాధారణముగా ఈసామెత చదువురాని మగవాళ్లపట్ల ఉపయోగించుచుందురు. కాని చదువురాని స్త్రీలపట్లకూడ ఈసామెత వర్తించును. కొంతమందికి బుద్ధిపోక కొందఱు స్త్రీలగౌరవము చూడలేక కొందఱు స్త్రీలకు విద్య చెప్పించిన తమకన్న గౌరవము వృద్ధియౌనని “స్త్రీవిద్య ప్రళయాంతకః” అని లేనిపోని తప్పుడు శ్లోకములు కల్పించి చెప్పించ నిచ్ఛగలవారికి సహితము విరక్తి భావము కలుగునట్లు చేయు

చున్నారు. అదే సత్యమైనయెడల యూరోపు మొదలగు దేశములందు ఉన్నతవిద్యవలన గౌరవముగానుండిన స్త్రీలవలన ఆదేశమునకు ప్రళయము కాలేదేమి?

పురుషునియొక్క కీర్తికిని, గౌరవమునకును, గృహ యాజమాన్యమునకును మంచి లోకజ్ఞానమును, విద్యాశక్తియుగల స్త్రీ ముఖ్యావసరము. ప్రతి స్త్రీకిని వివేచనాజ్ఞానమును, సత్ప్రవర్తనయు, ప్రాపంచికవిషయములకు త్రోవయు పరిపూర్ణవిద్యాలాభము వలన కలుగును. ప్రతిస్త్రీయును గృహ పరిశ్రమయందుగాక తక్కినవిషయములందు అనగా రాచకీయవిషయములందును విద్యావిషయిక వ్యవహారములందును పురుషునకు చేయూత యొసగవచ్చును. ప్రతివిషయమునందును పురుషునకు స్త్రీసహాయముండిన యెట్టి కష్టతరమైన పనులైనను సులభసాధ్యములగును. స్త్రీ శక్తిస్వరూపిణియు, కామదేవతయు కాబట్టి దేశసేవ, సంఘసంస్కరణము మొదలగు గొప్ప గొప్ప విషయములందు స్త్రీలను పాల్గొలుపుకొన్నయెడల సులభములో పూర్తిగాగలవు. పూర్వమునందు ఏవిదుషీమణియైనను తనయశఃకాంతులను ఈవిశాలప్రపంచమున ప్రసరింపజేసెననుటకు విద్యయే ముఖ్యకారణము. ఇహపరసౌఖ్యసాధనమును, సర్వజనహృదయరంజకమును, భక్తిప్రాధాన్యమును అగునటుల కులాలకులాలంకారిణియైన మొల్ల రామాయణమను ఉద్గ్రంథము రచించి రాజులచేతను మహాకవులచేతను పామరులచేతను పొగడబడుటకు ఆమెయొక్క అసమానపాండిత్యపటిమయే కారణము. వేదకాలమునందు స్త్రీలు తమ విధ్యుక్తకర్మలనుసక్రమముగానిర్వర్తించుకొనిరనుటకు వారికిశాస్త్రపురాణములు కరతలామలక మగుటయేకారణము. ప్రస్తుతకాలమున దేశముకొరకు అష్టకష్టములుపడుచు దిగంతవిశ్రాంతకీర్తిని విరాజిల్లుచున్న శ్రీమతి సరోజినీదేవియే మనకు ప్రబలనిదర్శనము. ఈమె విద్యావ్యాసంగముచేతను వాగ్నిపుణతచేతను ఇతరదేశములను సహితము మెప్పించి యశము గాంచుచున్నది. శ్రీమతి మాగంటి బాపినీడుగారి భార్య కీ. శే. అన్నపూర్ణాదేవి చిరస్మరణీయ యైనది.వీటికన్నిటికిని కారణము విద్యవలనలభించిన లోకజ్ఞానమే. స్త్రీలుయేవిషయమునందైనను పురుషులకు తెలివితేటలందు తీసిపోరు. సృష్టిలో తమకు తుల్యులమైనట్టి మాస్త్రీజాతికి విద్యాబుద్ధులుచెప్పించుచు తమతో సమానమైన పదవులను గౌరవములను యెప్పుడు పురుషులుయివ్వగలుగుదురో అప్పుడు సంఘమునకు జాతికి అత్యున్నతమైనట్టి గౌరవము కలిగి దేశము మహోన్నతదశయందుండగలదు. అంతదనుక ఈదేశమునకు గౌరవము మొదలైనవి అంటవు. ఇది ముమ్మాటికినిశ్చయము.

# ఇటలీదేశపు స్త్రీలు

జరుగుమిల్లి సాంబశివరావుగారు బి. యె.,

ముస్సోలినీగారు ప్రవేశపెట్టిన 'ఫ్యాసిజము' పద్ధతిక్రింద ఇటలీస్త్రీలకు విమోచన మున్నదా యని పలు పురు ప్రశ్నించుచున్నారు. అన్ని తరగతుల పనివాండ్ర నిమిత్తము గావించిన శాసనము లెట్లు వారి కుపకరించు చున్నవనిగూడ దెలియగోరుచున్నారు.

పనివాండ్ర శాసనము లెంతమాత్రము స్త్రీలకు ప్రతికూలముగ లేవని రోమునగరమందున్న అబ్జర్వరు పత్రికా విలేఖరి తెలుపుచున్నాడు. పురుషులతో సంపూర్ణమైన సమానాధికారములను, సౌకర్యములను, స్త్రీలు అనుభవించుచున్నారు. రోమునగరమును జూడబోయిన అమెరికా స్త్రీలతో ఇటలీ కార్పొరేషను సహాయ మంత్రి, సీనీరు బిహాటయి గారిట్లు తెలుపుచున్నారు:- ప్రజలందరును, స్త్రీపురుషులు సమానార్థిక సంపదతో వెలదూగుటకు స్త్రీలు ప్రారంభించిన యుద్యమ మెంతయు బాగున్నది. ఇటలీలో పురుషులందరును వారి ప్రయత్నములను గొనియాడుచున్నారు.

కర్మాగారములందుగాని, ఇతర దుకాణములందుగాని పనిచేయు స్త్రీలు ఆ కర్మాగారములందు, ఇతర కర్మాగారములందు పనిచేయు పురుషులకున్న సత్వములను, సౌకర్యములను సమానముగనే యనుభవించుచున్నారు. ఏదో వృత్తియందు పట్టమును బొందినట్టియు, కర్మాగారములందు పనిచేయునట్టి స్త్రీలను సిండికేటులలో సభ్యురాండ్రుగ జేర్చుకొనుచున్నారు. సిండికేటు అనగా పనివాండ్ర సౌకర్యములను గాపాడుటకేర్పడిన సంఘము. ఈ సంఘమువారు స్త్రీలపట్ల ఉదాశీనతను జూపక పురుషులను సంరక్షించునటులే స్త్రీలనుగూడ గాపాడుచున్నారు.

## గర్భిణీస్త్రీలు—సౌకర్యములు

కర్మాగారములందుగాని మరితర కర్మాలయములందుగాని పనిచేయుస్త్రీలు గర్భవతులుగ నుండి యెప్పుడు ప్రసవించుటకు ఒకనెల యున్నదనగానే పనిలోనుండి తొలగవలెను; అనగా ఒకనెల సెలవిచ్చెదరు. ప్రసవమునకు ముందు ఒకనెలయే గాక ప్రసవించిన పిదపగూడ పూర్తిగ ఒకమాసముఅగువరకు వారల పనిలోనికి పోకూడదు. అంతవరకు మొత్తము రెండునెలలు అట్టిస్త్రీలకు యజమానులు సౌకర్యము లేర్పాటు జేయునటుల శాసనము లేర్పడినవి. ఈ రెండుమాసములుగూడ ఈ స్త్రీల స్థానే యజమానులు మరొకరిని నియమింపరాదు. వారి స్థానములను ఖాళీగానే యుంచవలెను. రెండునెలలు అయినపిదప వారే వారల తమపనులలో ప్రవేశించెదరు. ఈ రెండునెలలు వీరికి పనియుండదుగాన జీవనోపాధికి భంగము కలుగకుండ గర్భిణీస్త్రీల లాభము నిమిత్తము ఏర్పరిచినభీమా మొత్తమునుండి వీరికి ఆ రెండునెలల వరకు సరి

పోవు డబ్బునిచ్చెదరు. ఈ పద్ధతినే కష్టమగు వ్యవసాయపు పనులలో పనిచేయు స్త్రీలకుగూడ వర్తింప జేయవలెనని సూచించిరి. అదియు కార్యరూపమును దాల్చును. కాని ప్రసవించిన నెలకే మరల పనిలో ప్రవేశించుట ఆరోగ్యమునకు భంగకరమని భయపడుచున్నారు. రష్యాదేశములో ఇందుకనే గాబోలు గర్భిణీ స్త్రీలకు ప్రసవించుటకు ముందు మూడు నెలలు ప్రసవించిన పిదప మూడు నెలలు జీతముమీద సెలవిచ్చెదరు.

## ఇండ్లలో పనిచేయు స్త్రీలు

ఇండ్లలో నౌఖరులుగ పనిచేయు స్త్రీలను యజమానులు బాధించకుండ శక్తికిమించిన పనినిచేయించకుండ కష్టసాధ్యమగు పనులను గల్పించకుండ వారిని బాధించకుండ దయతో గౌరవముతో జూచుటకు ఏర్పాటులు జేయబడినవి. అందులో ముఖ్యముగ యువతులగు పనివాండ్ర విషయమై వారినెంతమాత్రము యజమానులు బాధించి అగౌరవముగ జూడకుండ స్త్రీలను పరిశీలనాధికారిణులుగ నియమించిరి. వీరినే 'ప్యాసీ‌ఫెమనిల్లీ' యనెదరు. ఇండ్లలో పనిచేయు పనికత్తెలను సుశీలలనియు ఆరోగ్యవతు లనియు విశ్వాశనీయలనియు సత్ప్రవర్తనపరలనియు పనిపాటలు చేయగల సామర్థ్యమున్న వారనియు ప్రభుత్వమువారు యోగ్యతాపత్రముల నిచ్చెదరు. అట్టివారినే పనికత్తెలుగ నియమింపవలెను.

## స్త్రీలకు రాజకీయములందు జోటులేదు

ఇటలీలో రాజకీయములందు స్త్రీలకు నియోజకాధికారము లేదు. కాని 1925 లో మునిసిపలు ఎన్నికలలో మాత్రము పురుషులతో బాటు సమానముగ ఓటుచేయవచ్చునని స్త్రీలకు అధికారము నిచ్చిరిగాని "ఇచ్చితినమ్మా వాయనము పుచ్చుకొంటినమ్మా యన్నటుల" ఈ యధికారమును వెంటనేతీసివేసిరి. సాధారణముగ స్త్రీలు మునిసిపలు ఓటింగులో శ్రద్ధను, ఆసక్తిని జూపక ఉదాసీనతను జూపిరట. ఎవరో కొద్దిమంది విద్యాధికురాండ్రగు స్త్రీలు మాత్రమే ఓటుకొఱకు ప్రాకులాడిరి, కాని దరహాము మీద స్త్రీలు విస్తారముగ ఈ విషయమై నిర్లక్ష్యముగ నుండుటచేఇచ్చిన ఓటును తీసివేసిరని తెలియుచున్నది.

## నూతనోత్తేజము

నేడు వారిలో బయలుదేరినది. ముఖ్యముగ ఉత్తర, మధ్య, ఇటలీలో ఉన్న నేటిస్త్రీలకును 20, 30, సంవత్సరముల నాటిస్త్రీలకును సహస్రాంశము వారయున్నది. వారు నేడు ఉదారభావోపేతలై స్వాతంత్ర్య వాతావరణమును బీల్చుచున్నారు. వారిట్లు దేశాభ్యుదయకరమగు భావములను గల్గియుండుటకు 'ప్యాసిజము' తోడ్పడలేదు. యుద్ధముధర్మమా యని వారు నూతనధర్మముల నవలంబించిరి. మొదట సంకటపడుచు తమ విధులను నిర్వహించినను క్రమేణా సంతోషముతోనే పనిచేయుట సాగించిరి.

బ్యాంకులు, కచేరీలు, కంపెనీలయందు పనిచేయుచున్నారు. ఇదివరలో వీరికట్టి యవకాశములే లేవు. గత ఐరోపామహాసంగ్రామము పుణ్యమాయని ఇట్టియవకాశము లభించెను. దీనితోబాటు వారి అవలోకనము గూడ యభివృద్ధినిగాంచెను. స్వాతంత్ర్యముగు రెత్తిరింగిరి. దానినిగడించి వివాహితలుగను అవివాహితలుగను సౌఖ్యముగ జీవితమును గడుపనేర్చిరి. మధ్యతరగతి స్త్రీలు, బాలికలు పనిచేయుట న్యూనతయని సోమరి

తనముగ ఇండ్లలోనే యుండి భర్తదొరుకునాయని పరితపించు రోజులుగతించినవి. యౌవనమునంతను భర్తలు దొరకక అడవిగాసిన వెన్నెలపాలగుట అంతరించెను. చురుకైన బాలికలు, మేధావతులగు స్త్రీలు ఏదోఒక వృత్తిలో ప్రవేశించుచున్నారు. వారుగడించు సంపాదన కుటుంబముయొక్క ఖర్చుకు తోడ్పడుచున్నది.

## జీవితవ్యయము

విస్తారముగనుండుటచే స్త్రీలు డబ్బు చాలకపోవుటవలన వివాహానంతరముగూడ పనిచేయవలసి వచ్చుచున్నదేయని సినోరుముస్సోలినీగారు చింతించుచున్నారు. కాని ప్రస్తుత పరిస్థితులందిట్లు చేయవలసినదే యని అతడు గుర్తెరింగి యూరకున్నాడు.

## స్త్రీవిద్య

ప్రభుత్వ సంబంధమైనదిగాదు. కుటుంబములోనే జూచుకొనవలెనని మతగురువగు "పోపు" దెలుపు అయ్యాదితప్పనియు పొట్టకేగడవనపుడు చదువునుగూడ ఎట్లు నేర్పించెదరుగాన అయ్యది ప్రభుత్వవిధియని సినోరు ముస్సోలినిగారు 1929-వ సంవత్సరము మే 23-వ తేది యుపన్యాసమున దెలిపిరి. ప్రభుత్వపుకొలువులో ఉన్న పనివాండ్రకు అనగా వివాహితులైన పురుషులకు సంసారములతో పనిచేయుచున్న పనివాండ్రకు వారి భార్యలు ఇండ్లలోనే యుండుటకు అనగా జీవనోపాధికి బయటకుపోయి పనిచేయకుండనటుల అదనపు జీతములను ప్రభుత్వము వారీయుచున్నారని ఆయన దెలిపెను. ఎంతటి నిరంకుశమూర్తియనిపించుకొన్నను ఇట్టి మహత్కార్యములను చేయువాడతడు. భారతదేశ పరిస్థితులెటులున్నవో దెలుప నక్కరలేదు. నేదెలుపకనే తమకు దెలియును.

## స్త్రీలు—ఉద్యోగములు

ఇటలీదేశపుస్త్రీలు సాధారణముగ ఉపాధ్యాయినిలుగనున్నారు. ఈ వృత్తియందు వారికి అసాధారణ ప్రజ్ఞాతిశయములుగలవు. న్యాయవాదినిలుగను, వైద్యురాండ్రుగనుగూడ పనిచేయుచున్నారు.

సాధారణముగ వారుచేయు ఉద్యోగములివే. శిశురోగచికిత్సకు స్త్రీలు వైద్యురాండ్రుగ ఎక్కువగా తయారగుచున్నారు. కొద్దిగానున్న స్త్రీన్యాయవాదినిలుగూడ తమ ధర్మములను గౌరవముగ సామర్థ్యముతో నిర్వహించుచున్నారు.

## స్త్రీలు—పత్రికాసంపాదకురాండ్రు

ఇపుడు స్త్రీలుగూడ పత్రికాసంపాదకత్వమును వహించుచున్నారు. అయితే ఇది తాత్కాలికముగనే యున్నది. వ్యాపారములనుగూడ జేయుచున్నారు.

కాని దాదులుగ ఎవరునుముందడుగిడుట లేదు. ఇదే చాలయవసరముగ నున్నదనివిందుము. ఇటలీరాణి ఎంతయు ఈ వృత్తిని ప్రోత్సహించుచున్నను చాలమంది ముందుకు వచ్చుటలేదు. ఈ వృత్తికింకను ఇటలీలో మంచితరగతిస్త్రీలు ముందంజవేయుట లేదని తెలియుచున్నది.

# చిత్ర ప్రశ్నలు

## ౩

అ డ పా సూ ర్యా రా వు గా రు

1. అంగవికలులకు, అన్నాతురులకు దిక్కగు మంచివాడెవరు?
2. ప్రాణి వశించు ఇంటి నేమనియెదరు?
3. సముద్రతీరమున మనమెల్లప్పుడు వేనిని చూచుచుందుము?
4. లోభివాడెవ్వరి నారాధించుచుండును?

వీటికి మూడేసి అక్షరములు గల సమాధానములను వ్రాసి అందలి నడిమి అక్షరములు నాల్గింటిని వరుసగ చేర్చినయెడల ఒక పత్రికారాజముయొక్క పేరగును.

ఆ పే రే మి ?



రాయప్రోలు భవానమ్మగారు

## ౪

శ్రీ మ తి రా య ప్రో లు భ వా న మ్మ గా రు

1. నేనొక గొప్పస్త్రీని.
2. నా పేరు నాల్గక్షరములది.
3. నానామములోని మొదటి అక్షరము చివరి అక్షరము చేర్చినచో నేను స్త్రీల పాలిటి యొక వరప్రసాదిని నగుదును.
4. నడిమి అక్షరములు రెండును చేర్చినచో నేనొక సరీసృపము నగుదును.
5. చివరి రెండక్షరములును చేర్చినచో ఆఫీసులందు ముఖ్యముగానుండు వస్తువు నగుదును.

నా పే రే మి ?

☞ ఇట్టి వానియందు రుచిగల 'గృహలక్ష్మి' పాఠకులు ఈప్రశ్నకు జబాబు ఆలోచించి మాకు 1930–జనవరి 15-వ తేదీలోపున లేఖాముఖమున తెలుపుదురుగాక !

# స్త్రీసాముద్రికము

వా. విలికొలను వేంకటరమణరావుగారు బి. యె; బి. యల్.

[ అవయవలక్షణములనుబట్టి ఒకవ్యక్తి భాగ్యాభాగ్యములను నిరూపించి చెప్పెడు శాస్త్రము సాముద్రికము. భారతదేశము స్వాతంత్ర్య మనుభవించిన పుణ్యకాలమునందీశాస్త్రము మంచిప్రచారమున నుండినది. స్వాతంత్ర్యము పోయినది. ఇట్టి శాస్త్రములపై అభిమానమును భారతీయులకు పోయినది. ప్రస్తుతము పాశ్చాత్యులీ శాస్త్రమునందు అనంతకృషి సల్పుచున్నారు. భారతీయుల దృష్టు లిప్పుడు పశ్చిమాభిముఖములైయున్నవి. కావున ఆవెలుగు వీరికిగూడ అగుపించుచున్నది. తిరిగి సాముద్రిక శాస్త్రచర్చ భారతదేశమున పరకపాటుగనే యగుగాక ప్రారంభమైనది. తత్పరిపోషణమునకై సాముద్రిక శాస్త్రమున స్త్రీలకు సంబంధించిన విషయములుగల ఈవ్యాసమును ప్రచురింపుచున్నాము.] —సంపాదకుడు.

## అరకాళ్లు

1. అరకాళ్లు పద్మమువంటి వర్ణముతో ప్రకాశింపుచుండిన స్త్రీ రాజభార్యయై అనంతమైన ఐశ్వర్యమునుభవించును.

2. తెలుపు, పసుపు ఈరంగులు గలిగియుండు అరకాళ్లు గలిగిన స్త్రీ ధనికుని చెట్టబట్టి సకలసుఖములనందును.

3. ఆకుపచ్చ వర్ణముతోనుండు అరకాళ్లుగల అతివ క్రూరస్వభావ, లోకకంటకురాలు నగును.

4. నల్లనిరంగుతో ఎవతె అరకాళ్లుండునో ఆమె అతిదుఃఖితురాలగును.

5. అరకాళ్లు మెత్తగనున్న స్త్రీ భాగ్యవంతురాలును లోకపూజ్యురాలును నగును.

6. చెమటపట్టుచుండు అరకాళ్లు గలిగిన కాంత దరిలేని శోకసాగరమున కొట్టుకొనుచు దరిద్రమనుభవించును.

7. ఎవతె అరకాళ్లు మందముగ నుండునో ఆమె నిర్భాగ్యురాలగును.

8. అరిగినట్టున్న అరకాళ్లుగల అంగన పేదతనమున ప్రెస్సకాలము ఇడుముల బడును.

9. ఎవతె అరకాళ్లు లోతుగనుండునో ఆమె దుస్వభావయగును.

10. అరకాలియందు పద్మరేఖ గలిగియుండు పడతి భోగభాగ్యములు గలిగి చిరకాలము సుఖమనుభవించును.

11. అరకాలియందు మత్స్యరేఖ గలిగియుండు కాంత సిరిసంపదలతో తులదూగును.

12. ఏస్త్రీయొక్క అరకాలు ఎండియున్నట్లు కనిపించునో ఆమె ఎప్పుడును ధనధాన్యములకు కొదువలేక యుండును.

## కాలి వేళ్లు

1. ఎవతె కాలివ్రేళ్లు వంకరగనుండునో ఆమెకు సంతానప్రాప్తియుండదు. విధవయు నగును.

2. ఒకదాని కొకటి కదిసి యెడము కనిపింపకుండు కాలివ్రేళ్లుగల అంగన అతిశయభోగముల ననుభవించును.

3. బొట్టనవ్రేలికంటె దానితరువాతి వ్రేలు పెద్దదిగనుండు ఉవిద కటికగుండె గలదియు, చెడ్డనడత గలదియు నగును.

4. బొట్టనవ్రేలును, దాని తరువాతి వ్రేలును సమమైన పొడుగుగనున్నచో ఆస్త్రీ చిరకాలము పెనిమిటితోగూడి సకల సుఖముల ననుభవించును.

5. రెండు చిటికెన వ్రేళ్లును నడుచునప్పుడు నేలమీద ఆనకయుండు అతివ వైధవ్యము దారిద్ర్యము పొంది దుఃఖమునమ్రగ్గును.

## కాలి వేళ్ల గోళ్లు

1. కాలివేళ్లగోళ్లు ఒకదానికొకటి చేరికగనుండు స్త్రీ రాజభార్యయగును. లేదా ఒక కోటీశ్వరుని చేపట్టును.

2. ఎవతె కాలివ్రేళ్లగోళ్లు చక్కగ మెరయుచుండునో ఆమెకు అంతులేని సంపత్తు కలుగును.

3. పుప్పిపట్టిపోయిన గోళ్లుగల స్త్రీ దరిద్రురాలును లోభియు నగును.

4. గోరుయొక్క చివరలు కాంతి గలిగి మణిగిపోవక ఎత్తుగ పెరుగుచు పలచగను ఎఱ్ఱగను నుండు కాంత రాజభార్యయగును.

5. ఎవతె గోరుయొక్క కొనలు పచ్చగనుండునో ఆమె క్రూరురాలగును.

6. గోరుయొక్క కొనలు ఎవతెకు నల్లగనుండునో ఆమె దుఃఖియగును.

7. తెలుపువన్నముతోనుండు గోటికొనలుగలిగియుండు స్త్రీ సామాన్యజీవనము మాత్రము చేయగలిగిన సంపదతోనుండును.

8. వంగిపోయిన గోటికొనలు గల వనిత దరిద్రురాలగును.

—మిగిలియున్నది.

# ప్రణయబంధము

పెమ్మరాజు రాజగోపాలము గారు బి. యె., సారస్వత సమాజము

౧

సూర్యుడస్తమించేడు. కాని యింకా చీకటిపడలేదు. సంజచాయలు వినీలాకాశము మీద మెఱసిపోతున్నవి. చల్లని మందమారుతం విసరుతోంది.

ఆ మనోహరసమయాన ఒక యువకుడూ ఒక యువతీ నరసాపురమునకూ రుస్తుంబాదాకీ మధ్యనున్న ఒక మామిడితోటలో కూర్చున్నారు. అక్కడ మనుష్యసంచారమేమీ లేదు.

ఆ యువకుడికి పదహారేళ్లు వుంటాయి. శ్యామసుందరమైన దాతని శరీరకాంతి. విశాలమైన వక్షస్థలమూ, సన్ననినడుమూ, బలిష్టములై వర్తులములైన చేతులూ, కాళ్లూ, చూడడానికే అతి డొకవ్యాయామకర్కశగాత్రుడని ప్రకటిస్తాయి.

దగ్గరికి పోయిచూస్తే మొగముకూడా అందమైనదనే తెలుస్తుంది. అన్నిటికన్న బాగా ఆకర్షించే వాతని విశాలనేత్రాలు. ఆతని పెద్దకన్నులలోనుండి ప్రశాంత ప్రేమ తొల్కాడుతూ వుంటుంది. ఎప్పుడూ చిరునవ్వు వెన్నెలకాస్తూ వుంటుందాతనిగులాబీ పెదవులమీద. ఆతన్ని చూస్తే మళ్లీ చూడాలనీ, అతనితో మాట్లాడితే మళ్లీ మాట్లాడాలనీ అతనిదగ్గిర కూర్చుంటే ఎప్పుడూ కూర్చోవాలనీ వుంటుంది.

అతని కెదురుగుండా కూర్చున్న ఆ యువతికి కూడా అంతే వయస్సుంటుంది. ఆమె ఒక పైట పరికిణీ నల్లయిమిటేషను సిల్కుది కట్టుకుంది. లేసుకుట్టిన జాకెట్టు తొడిగింది. మేజోడు, నల్లరంగు లేడీబూట్సూ తొడుక్కుంది. పొడుగాటి కృష్ణవేణి వెనుక జీరాడుతోంది. మెడలోని చంద్రహారమూ, మధ్య మిలమిల లాడుతోవున్న చమ్కీబెల్టు ఆమెకు క్రొత్తఅందం తీసికొని వచ్చినవి.

ఆమె శిరీషకుసుమకోమలనవకాంచనగాత్ర మతినాజూకైనది. ఆ సన్నని సుందరశరీరం లతవలె కంపించి పోతూవుంటుంది. ఆమె సోగకన్నులు ప్రణయరసపరి

పూర్ణాలు. ఆ ముగ్ధమోహనకల్యాణరమణీయాకృతి దర్శనీయమైనదని చెప్పితీరాలి. అప్పుడా యువకుడు "రత్నం! వెడదామా? కాస్సేపు కూర్చుందామా?" అన్నాడు. దానికి

కమలరత్నము

కాస్సేపు కూర్చుందూ. ఆనందం! అప్పుడే వెళ్లిపోవాలేమిటీ ?

ఆనందరావు

నాకేం? నే నెంతసేపైనా కూర్చుంటా? నిన్ను మీవాళ్లేమైనా అంటారేమో అని అన్నాను అంతే.

కమలరత్నము

ఔను లే నీమాటా నిజమే? ముందు మా నాళ్ల మాటెల్లావున్నా చీకట్లో వెళ్ల డము నాకే భయం.

ఆనందరావు

సరే, అందుకనే పెందరాళే వెడతాము. రేపింతకంటె ముందుగావచ్చి కూర్చుం దాము. కాని ఆరోజుకంటె ఆరోజు మనస్నేహ మెక్కువైపోతోంది. రుస్తుంబాదా వెడ తానా—మళ్లీవచ్చి ఎప్పుడు నీదగ్గిర వాల్దామా అనిపిస్తుంటుంది. ఇక నిన్నువిడిచి వుండ లేను సుమీ? కమలం!

కమలరత్నము

మగవాడవు నీకే ఆల్లాగువుంటే ఇంక నామాట చెప్పాలా? నువ్వు స్కూలు పైనలు ప్యాసైయ్యాక కాలేజీకి వెడితే యెల్లాగో?

ఆనందరావు

నువ్వుమాత్రము ప్యాసవ్వవూ? ఇద్దరం వెడదాము కాలేజికి.

కమలరత్నము

అప్పుడిద్దర మిల్లా కలుసుకునేందుకు వీలవుతుందా?

ఆనందరావు

సరే లే అప్పటిమాట చూసుకుందాము? ఇక లే చీకటిపడుతోంది. మీయింటి దాకావచ్చి నిన్ను దిగబెట్టి నేను వెడతాను.

అన్నాడు. ఇద్దరూ పుస్తకాలు పట్టుకొని బయలుదేరారు. ఆసమీపాన్నే వున్న ప్రాకారావృతమైన యింటిదొడ్డి గుమ్మము దగ్గిర ఆమెను దిగబెట్టి ఆనందరావు రుస్తుంబాదావైపు వెళ్లిపోయాడు.

౨

ఆనందరావు రుస్తుంబాదాకు చెందిన సంపన్న గృహస్థుడగు నొక బ్రాహ్మణునికి కుమారుడు. ఆబ్రాహ్మనునిపేరు కామయ్య. ఆయన గొప్ప యీనాందారు. ఆనందరావొక్కడే ఆయనకు కొడుకు అందుచేత నతన్ని అల్లారుముద్దుగా పెంచేడు. ఆంగ్లవిద్యాభ్యాసంకూడా చేయిస్తున్నాడు. అతడిప్పుడు స్కూలుఫయినలు చదువుతూవున్నట్లు మనకు తెలిసిన విషయమే.

కమలరత్నం ఒక క్రైస్తవ యువతి. ఆమె తండ్రిపేరు జ్ఞానప్రకాశం. అతడు లేసు వర్తకమువల్ల చాలాధనం గడించేడు. రుస్తుంబాదాకి నరసాపురానికి మధ్యనున్న ఒక తోటలో అతడు చక్కని బంగాళా కట్టేడు అతని కిరువురు తనయులూ ఒక చిన్నపిల్లవాడూ సంతతి. ఉన్నవారందరిలో కమలరత్నమే పెద్దది. సంస్కరణాభిలాషి కనుక జ్ఞానప్రకాశము కమలాన్ని యింగ్లీషుబడికి పంపించేడు. ఆమెకూడా చాలా చురుకైంది. అచదువు బాగా వస్తోంది. ఆనందరావుతో సమానంగా స్కూలుఫైనలులోకివచ్చింది. చిన్నప్పటినుంచీ ఆనందరావూ కమలమూ ఒక్క డివిజనులోనే పడుతూవచ్చేరు. క్లాసులో మేష్టరు కొకవైపున కమలం మరొకవైపున ఆనందం కూర్చునేవారు. రుస్తుంబాదానుంచి ఆనందం సరిగ్గా వాళ్లయింటిదగ్గరకు వచ్చేసరికి కమలరత్నంకూడా గుమ్మందిగి వచ్చి కలుసుకొనేది. ఇద్దరూ కలిసి కబుర్లు చెప్పుకుంటూ స్కూలుకి వెళ్లేవారు. వచ్చేటప్పుడుకూడా అలాగే జోడుగావచ్చేవారు. ఒకప్పుడు స్కూలునుంచి మామూలు కంటె ముందుగావస్తే యిద్దరూకలిసివచ్చి యేతోట్లోనో కూర్చునేవారు.

ఆనందరావు చాలా తెలివైనవాడు. ఎప్పుడూ క్లాసులో ఫస్టుమార్కువచ్చేది. అందుచేత కమలానికి అతనంటే ప్రేమతోపాటు గౌరవముకూడా యెక్కువైంది. ప్రతిరోజూ ఆనందరావుచేత పాఠాలు చెప్పించుకొనేది.

వాళ్లిద్దరినీచూస్తే జ్ఞానప్రకాశానికి చాలా సంతోషంగా వుండేది. ఆనందరావుని చూచి "నువ్వుకూడా క్రిష్టియానిటి పుచ్చుకోవయ్యా! మాఅమ్మాయిని పెళ్లాడుదువుగాని" అనేవాడు. దానికి ఆనందం నవ్వుతూ "నే నొక్కనాటికి పుచ్చుకోను" అనేవాడు.

ఆనందరావు కిరస్తానీవాళ్ల పిల్లతో స్నేహంచేస్తున్నాడనీ వాళ్లింటికి వెళుతున్నాడనీ కామయ్య విన్నాడు. ఆమాట వినగానే ఆయనవొళ్లు మండిపోయింది. కొడుకుని పిలిచి "ఏమిరా! నువ్వుకూడా కిరస్తానీ వెధవవైపోతావా? యీమాటుదానితో మాట్లాడినా దానింటికి వెళ్లినా" నిన్ను చావకొట్టి యింట్లోనుంచి వెళ్లకొడ్తాను. జాగ్రత్త" అని చెప్పి, జ్ఞానప్రకాశము దగ్గరకువెళ్లి "నువ్వు మావాణ్ని మతంచెడకొట్టడానికి నీయింటికి రప్పిస్తున్నావు. ఇది మొదలుకొని వాణ్ని నీయింటికి రానిచ్చినట్లు తెలిస్తే నీమీద చార్జీయిస్తా" నని గట్టిగా చెప్పేడు. అది మొదలుకొని జ్ఞానప్రకాశము ఆనందరావుని తనయింటికి రావద్దని చెప్పేడు.

అదిగాక కమలరత్నం ఆనందంకూడా యుక్తవయస్సులోకి వచ్చేరు. అందుచే వాళ్లే లోకానికి వెఱచి బాహాటముగా కలిసి తిరుగడం మానేసారు. అందుచేతనే వాళ్లిద్దరూ మనకథాకాలమునాటికి ప్రతిరోజూవచ్చి, ఆమామిడితోటలో కలిసికొనేవారు. క్రమ క్రమంగా వారిస్నేహమల్లా ప్రేమగామారింది. ఆప్రేమకూడా ప్రణయవేషంలోకి దిగేలావుంది.

## 3

"నువ్వు నాతో యెప్పుడూ చెప్పేవుకాదీసంగతి" అన్నాడు ఆనందరావు.

కమలరత్నము

ఔను. చెప్పలేను. ఆసందర్భము వచ్చినప్పుడు చెప్పవచ్చునుకదా అని చెప్పలేదు ఇప్పుడైతేనేం?

ఆనందరావు

ఏసందర్భం? (అనినవ్వేడు.)

కమలరత్నము

నానోటమ్మట చెప్పిద్దామని కాబోలు యీరాకడ? (అనిచిరునవ్వునవ్వింది.)

ఆనందరావూ, కమలరత్నమూ యిద్దరూకూడా స్కూలు ఫయినలు ప్యాసయిన తర్వాత రాజమండ్రీ ఆర్ట్సు కాలేజీలో యింటరుమీడియట్టు తరగతిలో చేరారు. ఇప్పుడు బియ్యే చదువుచున్నారు.

వారిద్దరికీ ఒకరంటె ఒకరికిఅపరిమితమైన ప్రేమకుదిరింది. ఇద్దరూ ప్రతిరోజూ కలుసుకొనేవారు. సినీమాలో కిద్దరూకలసి వెళ్లేవారు. ఎడబాటు దుస్సహముగావుండేది. ప్రపంచమంతా ముంచెత్తుచున్న నవీనవాఙ్మయములో పాండిత్యంగడించేరు. ఇద్దరి హృద

యాలలో కూడా సుకుమారుభావబీజాలు మొలక లెత్తేయి. జాతి మత విభేదాల నతి క్రమించి, ప్రేమప్రవాహములో పవిత్రస్నానముచేసి, ప్రణయబంధంచేత కట్టుపడి, ఆజన్మం సుఖిద్దామనే తలంపు దృఢపడిపోయింది.

నాడావిషయమే వారు ప్రసంగిస్తూవున్నారు. ఆవేళ శనివారం. మనోహరమైన ప్రభాత సమయం. ప్రపంచకానికి లోకబాంధవుడు నూతనసందేశ మందిస్తున్నాడు. పిల్లగాలి మెల్లగా శరీరాలకి సోకి ప్రేమపులికితగాత్రులని చేస్తోంది. అప్పుడు ఇల్లీ ప్రసంగ మందుకొని

ఆనందరావు

మీతాతగారు బ్రాహ్మడన్నమాట. మరి క్రిష్టియానిటి ఎందుకు పుచ్చుకొన్నాడు?

కమలరత్నము

మానాన్నగారికి చిన్నతనంలో చాలాజబ్బుచేసిందట ఎన్నిమందులు వేసినా కుదరలేదట. అప్పుడు మనవూళ్లో ఒక దొరసానివుండేది. అది మంచివైద్యురాలు. ఆవిడదగ్గిరకు తీసికొని వెడితే "యీజబ్బు నేను కుదురుస్తాను. మీరు క్రైస్తవమతము పుచ్చుకొంటారా" అందిట. మనస్సువైకల్యం పొందివున్న ఆసమయంలో మా తాతగారు మానాన్నగారల్లా అంటె బతుకుతారేమో అని చెప్పి క్రిష్టియను మతము పుచ్చుకొన్నారు. మతాతగారుపోగానే బ్రాహ్మలంతా కలిసి మావాళ్లను వెలి వేసేరు. బంధువు లంతా వెలివేసేరు. అందుచేత వచ్చి వూరుబయట యిల్లు కట్టుకున్నారు.

ఆనందరావు

మీతాతగారికి హిందూమతంమీద ఎక్కువ అభిమానమా? క్రిష్టియను మతం మీద ఎక్కువ అభిమానమా?

కమలరత్నము

మాతాతగారికి హిందూమతమందే ఎక్కువ అభిమానముట. క్రిష్టియనులైకూడా హిందూఆచారాలే చేసేవారట. వీలైతే ప్రాయిశ్చిత్తంచేసుకొని హిందూమతంలో కలుద్దామని చూసారుట. కాని పూర్వాచారపరాయణులు సాగనిచ్చారుకారట.

ఆనందరావు

అది చాలా అన్యాయం సుమీ, కమలం! ఇతర మతాలన్నీ మతాంతరులనిక్కూడా వాళ్లమతాల్లో కలిపికొని వాళ్ల వాళ్ల మతాలు వ్యాప్తిపొందేలాగు చేసుకొంటూా

వుండగా మావాళ్లు మనోదౌర్బల్యంచేత ఎవళ్లేనా ఒక్కమాటు పొరబడితే వాళ్లకిక నిష్కృతి లేకుండా చేసేరు. ఇది చాలాఘోరం, మా మతం మా వాళ్ల మీాదే తలు పులు బిగించుకు కూర్చుంది. ఇంతకి మీానాన్న వుద్దేశ్యం ఏమిటి? నీకేమతంయిష్టం?

కమలరత్నము

(ఉద్వేగంతో) ఆనందం నువ్విల్లా అడిగితే నేనేమిచెప్పను? మాతండ్రికి మాత్రం హిందూమతంమీాద కాక యితరమతాలమీాద ఎందుకువుంటుంది? మేముమాత్రం హిందు వులం కామా?—మాజన్మభూమిమాత్రం భారతదేశంకాదు? మేమున్నదిమాత్రం హిందూ వాతావరణంకాదు? మేము తాగేజలం, పీల్చేగాలి, తినేతిండీ, కట్టేబట్ట, ఉండేతీరు అంతా హిందూదేశసంబంధంకాదు? విత్తొకటినాటితే చెట్టొకటి మొలుస్తుందా? హిందువుల పండుగులే మాపండుగులు. వాళ్ల స్వాతంత్ర్యమే మాది కాని ఏంచెయ్యం? ఆనందం! మీావాళ్లు మమ్మల్ని యింకరానివ్వరు. వారలకిమాత్రం మామీాద నిజమైన గౌరవం వుందా? మమ్మల్ని తక్కువగా చూస్తారు. మేము పొందే బాధ నీకేమి తెలుస్తుంది?

అల్లా ఉద్రిక్తురాలై చెప్పుచున్న కమలరత్నాన్ని చూస్తే ఆనందరావుకి హాశ్చర్యం కలిగింది. ఆమెకన్నులు తేజస్సురితములై అభిమానంతో మెఱిసిపోతూన్నవి. జేవురించిన ముద్దు మొగం కెంజాయతో వింత చెలువం తీసికొనివచ్చింది. శరీరమంతా ప్రస్వేదాంకు రాలు క్రమ్ముకొన్నవి. అధరస్పందన మవుతోంది. ఒక్కసారి ప్రేమరస మొలికేలాగు ఆనందరావుకేసి దీనంగాచూచి, చిగురువ్రేళ్లతో మొగంమీాద ఘర్మకణాలు తుడిచి వేసుకుంది.

అప్పుడు అనందరావానందోద్రిక్తుడై పోయాడు. ఒక్కమారు విస్ఫారిత నేత్రాలతో ఆమెసౌందర్యసుధ గ్రోలుకొని, ఆమె మృదుహస్తం తనచేతితో పట్టుకొని కళ్లుమూసేడు. కమలానికి కూడా నేత్రనిమీలన మయింది. మళ్లీ కళ్లువిప్పి

ఆనందరావు

కమలమూ! అల్లా అధైర్యపడకు. ఈ సంఘం ఎవ్వరూ మనల్నిశాసించేందుకు? భగవంతుడు నిర్మించాడీవిశ్వమంతా. అతని శాసనమే మన శాసనం. బ్రాహ్మణసంఘం మిమ్మలని రానియ్యకపోతే మీాలో బ్రహ్మత్వం ఎక్కడికి పోతుంది? ఇకదాచడం ఎందుకు? కమలా! నేను నిన్నే వివాహం చేసుకో తలచేను. ప్రేమసూత్రం నీకిదివరకే కట్టేను. ఇక సంఘమేమి చేసికొన్నాసరే, లోకమేమన్నాసరే, ప్రేమతో ఏకమైపోదాం,

కమలరత్నము

బాగా ఆలోచించుకో.

ఆనందరావు

(చేతిగడియారం చూచుకుంటూ) నాది స్థిరమైన సంకల్పమే. ఇక వెళ్లివస్తాను. పదిగంట లవుతోంది. మనకి తెలియలేదు.

అని లేచేడు. కమలరత్నం సాగనంపింది వీధిగుమ్మముదాకవచ్చి. ఆనందరావు హోటళ్లువేపు వెళ్లిపోయేడు. ఆలోచనాపూరితహృదయంతో కమలరత్నము తిరిగి వచ్చి కుర్చీలో ఆసీన అయింది.

౪

మధ్యాహ్నం పదకొండు గంటలవుతుంది. అప్పుడే కామయ్య నిత్యానుష్ఠాన కర్మలు చేసికొని దేవతార్చన కావించుకొన్నాడు. వీధిఅరుగుమీద కూర్చొనుసరికి తపాలావాడొక వుత్తరం యిచ్చేడు. అది ఆనందరావు వ్రాసినది. అందులో ఈ విధంగావుంది.

రాజమండ్రి.
శనివారము.

"ప్రియమైన తండ్రిగారికి,

నేను మీ రెన్ని సంబంధాలు కుదిర్చినను చేసికోనని చెపుతూవచ్చేను. దానికి కారణం అప్పటిలో మీరడిగినా చెప్పలేదు. ఇప్పుడు చెప్పవలసివచ్చి చెబుతూ వున్నాను. నేనుచిన్నప్పటినుంచీ కమలరత్నాన్ని ప్రేమించేను. కారణాంతరాలచేత వారు క్రైస్తవులైనా ఆదిలో హిందూమతానికి సంబంధించిన బ్రాహ్మలే. కమలరత్నం త్రికరణశుద్ధిగా క్రైస్తవ మతంవదలుకొంది. కనుక యిప్పుడు నాకమలం హిందూమతానికి సంబంధించిన బ్రాహ్మణబాలిక. ఇప్పుడు మాలవ్యా, శ్రద్ధానందా మొదలయిన మహా పురుషులంతాకూడా శుద్ధిమతమవసరమనీ ఇతర మతములలో కలిసినవారందరినీ హిందూ మతము మరల స్వీకరింపవచ్చుననీ చెపుతున్నారు. అందుచేత నేనుకూడా నిరంకుశమైన హిందూ పూర్వాచారసంఘాన్ని అతిక్రమించి, నాకమలాన్ని మరల హిందువుని చేసి కొని అనతికాలంలో పరిణయమాడుతున్నాను. కనుక మీకు తెలియచేయడ మైనది.

ఇట్లు, మీ ప్రియపుత్రుడు
ఆనందరావు

ఆఉత్తరము చదువుకొనుసరికి కామయ్య ఆరక్తనేత్రుడై పోయాడు. ఉద్రేకంతోటి శరీరం కంపించిపోతూంది. లేఖ అడ్డదిడ్డంగా మడిచి యింట్లోకి పోయాడు.

౫

సాయంకాలమయింది. సూర్యకాంతులు నీలాకాశంమీద రక్తవర్ణం చిత్రించినవి. ఆరావములతో పక్షిగుంపులు విస్తృతాకాశంమీద యెగిరిపోతూ వున్నవి.

అప్పుడు పెరటిదొడ్డిలోని పూలతోటలో వున్న రెండు కుర్చీలమీద ఆనందరావూ, కమలరత్నమూ కూర్చున్నారు. ఆనాటిపుదయమే శుద్ధిసంఘంవారిదగ్గరనుండి కమలరత్నాన్ని మరల హిందూమతంలో కలియుట కనుమతించిన తంతివార్త వచ్చింది. ఆరాత్రి వారివివాహం జరుగబోతోంది.

అందుచేత వారిద్దరూ మనోహరమైన పెండ్లిదుస్తులు ధరించివున్నారు. కమలరత్నం కబరీభరమంతా పూలమయం చేసికొంది. ఊదా బనారసుచీరకట్టుకొంది. ఆమె మనోహరాకారము చూచి తీరవలసిందే. లీలామాత్రముగా భూమిమీద క్షణకాలం విహరింపవచ్చిన స్వర్గభువనవాసినివలె వుంది. ఆనందాతిశయముచేత ఆనందరావు వియద్గమనం చేసేవానిలా వున్నాడు.

అంతలో విసవిస వారిచెంతకు కామయ్య చక్కావచ్చేడు. కోపంచేత ఆతని మొగం ఎఱ్ఱబాఱింది. ఒకవిధమైన ప్రబలావేశంవల్ల శరీరం తూగాడుతోంది. అయన్ని చూచేటప్పటికి కమలరత్నమూ ఆనందరావూకూడా కంపించేరు. అప్పుడు

కామయ్య

అబ్బాయీ! మతభ్రష్టుడవు అయ్యావా ?

ఆనందరావు

(నిశ్చలంగా) ఒక్కనాటికి కాలేదు. మీరు మాత్రం మూఢాచారాలంతగా పాటించకండి. ఉత్తరంలో సర్వంకూడా తెలియచేశాను.

కామయ్య

ఓరీ పశువా! నీ ఆంగ్లవిద్యాభ్యాసం యింతవఱకూ వచ్చిందా? పవిత్రమైన పూర్వాచారాలాచరించేవాళ్లంతా నీకు మూఢాచారపరులా? నువ్వీక్రిష్టియనుదాన్ని కట్టుకొని కులభ్రష్టు అవుతావా ?

ఆనందరావు

ఈమె ఇప్పుడు క్రిష్టియనుకాదు. పవిత్రమైన హిందూస్త్రీ. ఈమె తాతగారు బ్రాహ్మణుడు. అదిగాక శుద్ధిసంఘంవారీమెను మళ్లీ హిందూసంఘంలో కలిపేరు.

కామయ్య

మూర్ఖుడా! ఒకమాటు పతితులై హిందూమతంలోనుండి వీడిపోయిన భ్రష్టుల్ని కలుపుకొనేందు కేశాస్త్రం అంగీకరించేయి? అర్థంలేకుండా మాట్లాడకు. ఈ వివాహం మానుకుంటావా? మానవా?

ఆనందరావు

నేనుమానను. ముమ్మాటికి మానను. నా అంతరాత్మ యీమె పవిత్రమైన హిందూ బ్రాహ్మణబాలిక అని చెపుతోంది. సంఘమేమన్నా సరే, మీరేమన్నా సరే, ప్రపంచమంతా నన్ను వెలివేసికొన్నా సరే, నేనీమెను—ప్రేమించాను—పెళ్లిచేసికోక మానను.

కామయ్య

బాగా ఆలోచించుకో. చెడిపోతావు. నాకు మతం ప్రధానముకాని ప్రేమకాదు. జాగ్రత్త ఆస్తిఅంతా నాస్వార్జితం. నీకొక్క గుడ్డిగవ్వ ఇవ్వను. ఇవ్వను. నీమూలాన్ని శిష్టసాంప్రదాయ మనిపించుకొన్న వంశానికి అప్రతిష్ట తేకు. ఆఖరుసారి చెపుతున్నాను. ఆలోచించుకో?

ఆనందరావు

(అతిధైర్యంగా) మీరు తండ్రిగారుకదా అని పూజ్యభావంతో చూస్తున్నాను. మీస్వార్జితపుఆస్తిఅన్న నాకు తృణప్రాయం. ఇట్టి బెదరింపులు కట్టిపెట్టండి. నావల్ల వంశానికి గౌరవము రాకలదేమోకాని అప్రతిష్ట వస్తుందన్నమాట వట్టిది. నేను బాగా ఆలోచించే చెపుతున్నాను. నేనీమెను పెండ్లాడి తీరుతాను.

ఆమాట వినుసరికి కామయ్య శరీరంభగ్గుమంది. ఆగ్రహావేశంచేతరాక్షసుడై పోయాడు. ఒక్కక్షణంలో ముందుకు లంఘించి అక్కడవున్న గెడ్డపారతీసి "ఛండాలుడా! మతభ్రష్టుడా!" అని విసరి కుమారుని కొట్టినాడు.

ఆ వేటుతో ఆనందరావు తల శకలములై పోయింది. చెవ్వున నెత్తురు ప్రాంత మెల్ల చిమ్ముకొంది. ఆనందరావు విలాసదేహం భూగతమైపోయింది. తోడనే పరమ కిరాతుని రాతిగుండెకూడ చీల్చుకొనిపోయెడు దీనారవముతో కమలరత్నము కెవ్వున కేకవైచి ఆనందరావు శరీరంమీద సువ్వోత్తుగా కూలిపోయింది.

ఏమిచేయగలడు కామయ్య. చేయిదాటిపోయింది. ఇరువురిని కదలించిచూచేడు. నిరంకుశసంఘాదికారబంధితమైన యిహలోకంవిడిచి స్వర్గలోకంలో కలియపోయారు.

కామయ్య అక్కడే స్థిరచితుడై నిలబడిపోయాడు.

# తలుపు మూయ్యాలి

శ్రీమతి సి. రుక్మిణీబాయిగారు

అది శ్రావణమాసం. విశ్వవైణికుడు నభోవిపంచిక సైదువేళ్లతో జోరుగా మీటుతున్నాడు. భూనభోంతరాలు ఏకం అయ్యేటట్లు సంతతధారగా వర్షాలు కురుస్తున్నాయి.

రోజూలాగ కాక ఆనాడు మరింత హోరుగాలితో వర్షం కురుస్తూఉంది. జిల్లుమంటూ చలి వొణుకెడుతూంది. వీధివసారాతలుపు బార్లా తీసుంది. వసారాకు ఎదురుగా కూర్చున్న ముసలాతడాగాలిని ఓర్చుకోలేక పోయాడు. వీధరుగుమీద నుంచుని చూరు నీళ్లను దోసిళ్లతోబట్టి ఎగజిమ్ముతూ ఆడుకుంటూన్న తన మనవణ్ణి కేకేసి, 'ఓరే! తలుపుమూయ్యరా యీదురుగాలికి ప్రక్కలీడ్చుకు పోతున్నాయి' అన్నాడు. కుర్రాడు తాత మాట వినిపించుకోనక తన అటసందడిలోనే ఉన్నాడు. తాత మళ్లీ మనవణ్ణిపిల్చి 'ఒరే! తలుపు మూయ్యరా' అన్నాడు. ఇంకా కుర్రాడు ఆట ధ్యానంలోనే ఉన్నాడు. మళ్ల ముసలాయన గట్టిగా అదరించి పిల్చాడు మనవణ్ణి. ఈసారి కుర్రాడి దృష్టి తాతకేసి మరళింది. 'ఒరే! తలుపుమూయ్యమని నీకెన్నిసార్లు చెప్పన్రా! నువ్వెక్కడేదో పడిపోయినట్లు నిల్చిపోయావు. నాకు వళ్లు సుళ్లు తిరిగి పోతూందాగొ! యికనైనా తలుపు మూస్తువా?' అన్నాడు తాత.

మనమడు—తాతయ్యా! నేనేదో ఆటపరాకులో ఉండగా నీవు పిలవడంచేత వినిపించుకోలేదు. అది నాతప్పే. క్షమించు. ఇదిగో మూసివస్తిని. ఇకముందు సరిగానడచుకొంటాను.

తాతయ్య—కుర్రాడా! నేనిప్పుడేదో చెబుతున్నానని నీకు కోపంవద్దు. ఇప్పుడు నేను నీకు చెప్పబోయే మాటలే కొన్ని సద్గుణాల్ని బోధిస్తాయి. నీజీవితకాలంలో యితరుల సౌఖ్యాన్నే గొప్పగా చూస్తూండే అభ్యాసం చేసుకోవాలి. ఇంతేకాదు. ఈచిన్న విషయంలో నీకు చెప్పబోయే మాటలే యింకాయితర గొప్ప విషయాల్లోకూడా నీకక్కర కొస్తాయి. ఈ యింటివాకిటి తలుపేకాకుండా నువ్వు చాలాజాగ్రత్తగా తెరవక మూసియుంచవలసిన తలుపులింకాకొన్ని ఉన్నాయి.

మనమడు—ఇంకా ఏంతలుపులున్నాయి? తాతయ్యా!

తాతయ్య—కుర్రాడా! ఐదునిమిషా లిల్లాకూర్చుంటే విషయాలన్నీ సావధానంగా బోధిస్తాను. తిట్టూ బూతూ మొదలైన చెడ్డమాటలూ చెడ్డపిల్లాళ్ల దురాలోచనలూ వచ్చి నీచెవిలోదూరకుండా వాటితలుపుల్ని జాగ్రత్తగా మూసి ఉంచాలి. లేకపోతే నువ్వు సుఖపడవు. ఎప్పుడైనా పొరబాటున ఆద్వారాల్ని తెరిచి ఉంచావా అవి అందుచొరబడి నిన్ను తిరిగి విడిచిపోవు.

అల్లాగే నీకళ్లద్వారాల్నికూడా నువ్వు జాగ్రత్తగా కాపాడాలి. చెడ్డ కథలన్నీ, చెడువిషయాల్ని ఉపయోగంమాలిన పుస్తకాలిని నువ్వు చదువకూడదు. వాటిని నువ్వు చదువడంమొదలు పెడితే అసలు కావలసిన చదువులయందపేక్ష తగ్గి పాడయిపోతావు. ఇంకా చెడుపదార్థాల్ని చూసి నువ్వు కళ్లుమూసుకోవాలి. లేకపోతే వివేకం చెడి పాడైపోతావు. ఇంకా బజార్లో పంచిపెట్టే వింతవస్తువులమీదకూడ తరుచు నీదృష్టులు పోనీక వాటితలుపులు జాగ్రత్తగా మూసిఉంచు.

ముఖ్యంగా నీనోటిద్వారాన్ని గురించి అన్నిటికన్నా ఎక్కువశ్రద్ధ తీసుకోవాలి. ఏమంటే యీద్వారానికి తనంతట తానే తెరుచుకొనే స్వభావం ఉంది. కనుక నువ్వు దీన్నిగురించి ప్రత్యేక జాగ్రత తీసుకోకపోతే

"తనువున విఱిగిన యలుగులు
ననువున బుచ్చంగవచ్చు నతినిష్ఠురతన్
మనమున నాటిన మాటలు
వినుమెన్ని యుపాయములను వెడలునె? యధిపా!"

అన్నట్లు నీమాటలు చాలమందికి మనస్తాపం కలిగిస్తాయి. చివరికి నీకు చెడుగుపుట్టిస్తాయి. కనుక నీకు కావలసిన జ్ఞానం, చక్కగా మాట్లాడేశక్తి, పూర్తిగా తెలుసుకునేవరకూ దీన్ని తెరతకమూసిపెడితే జ్ఞానం పొందుతావు.

వీటన్నింటికన్నా మరీ ఎక్కువ జాగ్రత్తతో నీవు నిత్యం శ్రద్ధతో కాపాడవలసినద్వారం మరోటుంది. అదే నీమనోద్వారం. అది సంతతం నీహృదయాన్ని తట్టి చలింపజేస్తుంది. దాన్ని జాగ్రత్తగా కాపాడ్డమే కష్టమైనపని. దురాశ మొదలైన దుర్గుణాలు నీ మనస్సులో చొరకుండా ఆతలుపే కాపాడుతుంది. ఆ ద్వారానికి పరిరక్షకుడే నీ మనస్సాక్షి. ఆతడు అప్రమత్తతో యీలాంటి చెడ్డతలంపులు నీలోచొరకుండా మెలకువతో కావలికాస్తాడు. ఆలాంటప్పుడు వాని బలాన్నితృణీకరించే దుర్గుణం ఏదైనా నీమనస్సులో చొరబడేటప్పుడు నీమనస్సాక్షి నీకు తెలియబరుస్తాడు. అతడు తెలియ పరచినాగానీ నువ్వు లక్ష్యంచెయ్యకపోతే వాడు నీమీద కోపగించి నీద్వారపాలనావిధానాన్ని మానేసి నిద్రపోతాడు. అప్పుడు అడ్డులేకపోవడంచేత అనేకవిధములైన దుర్గుణాలు నీలో ప్రవేశించి నిన్ను నాశంచేస్తాయి. కనుక ఎన్నడూ ఆలా తటస్థించకుండా నీద్వారాల్ని నువ్వు శ్రద్ధగా కాపాడుకుంటూ ఉంటే జగదేకవంద్యుడవవుతావు.

మనమడు—అట్లాగే తాతయ్యా! నీవుచెప్పినట్లు తప్పకుండా నడుచుకుంటాను. ఇల్లాంటి విషయాలెన్నడు మాగురువు, తండ్రీ కూడా చెప్పలేదు. ఇవన్నీ నాజీవితంలో ఆదర్శకంగా పెట్టుకుంటాను.

# శాకుంతలములో హిందూలా

వంగోలు వేంకటరంగయ్యగారు బి. యె; బి. యల్.

ఆ బాంధవకృతస్నేహప్రవృత్తిమై తాఁబరిగ్రహించిన స్త్రీని విడనాడిన సంతాపమున దుష్యంతుఁడు గుందుచుండ అమాత్యుఁడంపిన పత్త్రిక నొకదాని ప్రతీహారి దెచ్చి దుష్యంతున కిచ్చెను. దాని జదువ నిటులుండెను :—

(1) సముద్రవ్యవహారీ సార్థవాహో ధనమిత్రో నామ నౌవ్యసనే విపన్నః
అనపత్యశ్చ కిల తపస్వీ రాజగామీ తస్యార్థసంచయః ||

అని—ఈ నివేదనమును దుష్యంతుఁడుఁజూచి

(2) కష్టం ఖల్వనపత్యతా బహుధనత్వాద్బహుపత్నీకేన తత్ర
భవతా భవితవ్యం విచార్యతాం యది కాచిదాపన్నసత్త్వా తస్య భార్యాసు స్యాత్ ||

అని ప్రతీహారితో జెప్పెను.

(3) ప్రతీహారి—

దేవ ఇదానీమేవ సాకేతకశ్రేష్ఠినో దుహితా నిర్వృత్తపుంసవనా జాయాస్య శ్రూయతే ||

(4) రాజు—

ననుగర్భః పిత్ర్యంరిక్థమర్హతి గచ్ఛ ఏవమమాత్యం బ్రూహి ||

పై సంస్కృతవాక్యములకు కీర్తిమూర్తులు కళాప్రపూర్ణ మహామహోపాధ్యాయ బ్రహ్మశ్రీ వేదము వేంకటరాయ శాస్త్రిగారి తెలుగు :—

(1) సముద్రవర్తకుఁడు ధనమిత్రుఁడు ఓడపగిలి కాలము జేసినాఁడఁట! పాపము. సంతతికూడ లేదఁట. అతని ధనరాసులు రాజునకుఁ జేరవలసినవని మంత్రి వ్రాసినాఁడు.

(2) కటకటా! సంతులేమి యెంతకష్టము. వేత్రవతి, మహాధనుడు గావున ఆ వణిక్సత్తమునికి పలువురు భార్యలుందురు. వారిలో నెవ్వతియేని గర్భవతిగ నున్నదేమో విచారింపు మనము.

(3) దేవా! ఈ నపుమనే యతని భార్యలలో సాకేతసెట్టి కుమారితకు పుంసవనము జరిగినదని చెప్పుకొనుచున్నారు.

(4) సరి. పితృధనము గర్భమును జెందవలసినది. పోయి మంత్రితో నట్లు చెప్పుము.

ఈ చిన్నవ్యాసమునకై రాఘవభట్ట వ్యాఖ్యానయుత శాకుంతలమును, వైఖానస వ్యాఖ్యానయుత శాకుంతలమును, కొచ్చిరాజా రామవర్మ వ్యాఖ్యానయుత శాకుంతలమును, ఈ. శ్రీనివాసాచార్య వ్యాఖ్యానయుత శాకుంతలమును, బ్రహ్మశ్రీ వేంకటరాయ శాస్త్రిగారి "ఆంధ్రాభిజ్ఞాన శాకుంతలమును" జూచితిని. శ్రీశాస్త్రిగారి యాంధ్రపాఠమున దప్ప నాలుగు సంస్కృతపాఠములందును పై రెండవ వాక్యమునందలి "యదికాచి దాపన్నసత్వా తస్యభార్యాసుస్యాత్" అను పఙ్క్తియున్నది. కొచ్చి వైఖానస పాఠములలో "ఆపన్న సత్వాపి" అనియు గలదు. పై రెండవ వాక్యపు తెలుగున సంపుటీకృతభాగము శ్రీశాస్త్రిగారిది గాదు.

ఉదాహృత వాక్యములలోని దాయధర్మ (inheritance) విచారమొక్క వ్యాఖ్యాతయు జేసియుండలేదు. ఈ వాక్యములందు గొప్ప ధర్మవిషయమొకటి సూచితమగుచున్నది. ఈ ధర్మము దుష్యంతుని కాలమునాటిదో లేక కాళిదాసుని కాలమునాటిదో నిర్ణయింప వలసుగానున్నది. దుష్యంతునికథగాన కావ్యసంప్రదాయములను బట్టి ఇందలి దాయధర్మము దుష్యంతుని కాలమునాటిదనియె గ్రహింప నర్హమగుచున్నది. దుష్యంతుడు పాండవుల పూర్వికుడు. ఈతనికిని ధర్మరాజునకును నడుమ ఇరువదియొక తరములు గడచినటులున్నది. తరము లేక పురుషాంతరమునకు సాధారణముగ ముప్పది యేండ్లలెఖ్ఖ ప్రకారమున ఈయిద్దరి మధ్యకాల మారునూరేండ్లుండవచ్చును. ధర్మరాజు ద్వాపరాంతము వాడని గ్రహించితిమేని దుష్యంతుడును ద్వాపరయుగములోని వాడే యగును. ద్వాపరమునకు ప్రమాణస్మృతి శంఖలిఖితస్మృతి. యుగమున కిదిస్మృతి అయినను మన్వర్థమునకు విపరీతముగ నుండజాలదుగదా! కావున దుష్యంతుని కాలమునను మనుస్మృతియె పరమప్రమాణముగ నుండినదనవలయు. మనువచనము లెట్లున్నను పైవ్యాఖ్యాతల కాలమునాటికి దాయస్థితులు కొంతమారినవి. ఈ వ్యాఖ్యాతలయినను కాలస్థితి ననుసరించి వ్యాఖ్యానించి యుండవచ్చును. అటుల జేసినవారుగారు.

మనుస్మృతి క్రింద స్త్రీలదశ యెటులుండినదియు ఈధనమిత్రోపాఖ్యానము ప్రకటించుచున్నది. భార్యయుండినను బిడ్డలులేని కారణమున, చనిపోయినవాని ధనము తటాలున రాజునకు చెందునట. (Escheat). * ఆకాలమున వితంతువులను రాజు పోషించుచుండెను కాబోలును! భర్తకు ధనముండి అది రాజునకు చెందినగదా వితంతువును

* 8 మార్చి ఇండియను అప్పీల్లు 500 చూడుము.

పోషింపవలయు బాధ్యత రాజు నాశ్రయింపగలడు? మనుస్మృతి ప్రకారము భార్యయు పుత్రుడును దాసుడును * ఈ ముగ్గురును అధనులు ♦ (ధనములేనివారు).

"భార్యా పుత్రశ్చదాసశ్చ త్రయ ఏవాధనాస్స్మృతాః ।
యత్తె సమధిగచ్ఛంతి యస్య తేతస్య తద్ధనం" ॥

మనుస్మృతి ౮-౪౧౬

ఈ ప్రమాణము ననుసరించి, ఈ ముగ్గురు అధనులగుటయేగాక వీరి కేద్దియైన సంప్రాప్తించినయెడ వీరెవ్వరివారో ఆధనమును అట్టివారిదగును.

"యద్వై కించ మనురవదత్తద్భేషజమ్" అని వేదమే ఘోషించినను హిందూ పుత్రుడు అనేకవిధముల తనస్థితిని చక్కపరచుకొనియున్నాడు. తండ్రి యప్పులవిషయమున మాత్రము కొన్ని సందర్భములలో నింకను పితృఋక్తి హేతువను ధర్మ(pious duty) కల్పన (fiction)క్రింద కొంచెము చిక్కుపడుచున్నాడు. దాసుడనదగువాడు ఇప్పుడు లేనేలేడు— స్త్రీల విషయమున స్మృతికర్తలును న్యాయమూర్తులును కొన్నికొన్ని సంస్కారములజేసిరి. కాని ఈ కాలపు నిరీక్షణలకును వికాసభావములకును అవి చాలియుండలేదు.

ధనమిత్రునివంటివాడు పలువురుభార్యల గట్టుకొనగలడు. ఒక్కపెట్టున వారి నందరిని విధవల సేయుటయేగాక కూటికి గుడ్డకు గతిలేనివారినిగ గూడ జేయగలడు. ఇటులేల యుండవలయుననిన:—

"న స్త్రీస్వాతంత్ర్య మర్హతి" యని తిరుగమనువు నడ్డబెట్టుదురు గాబోలు? ఇప్పటి స్త్రీలకు, దుష్యంతునినాటి అనపత్యతవలని యాపద తొలగిపోయినది. కాని ఉత్తర వారసులనబడు తీర్థకాకముల విషపుచూపుల భీతియొకటి కలదు. మహమ్మదీయ దాయనిర్ణయములోవలె హిందూ స్త్రీలకును విధిగ దాయభాగ మేర్పరచుట ముఖ్యముగ జేయదగిన పునర్నిర్మాణములలో నొకటి కాగలదు. రమారమి మూడునూరేండ్ల క్రింద పాయగుండే లక్ష్మీదేవి*యనునొక మహారాష్ట్ర బ్రాహ్మణస్త్రీ విజ్ఞానేశ్వరీయమునకు "లక్ష్మీవ్యాఖ్యానము" అను నొక వ్యాఖ్యానమును వ్రాసి దానియందు దాయవిషయమున స్త్రీల కనుకూలములగు కొన్నియంశముల నిరూపించినది. 1923 వ ప్రాంతముల న్యాయమూర్తి శేషగిరి అయ్యరుగారు తోబుట్టువులులోనగు కొందరి యాడువారికి దాయ ఫలకమున నున్నతస్థానము నర్పింప జేయుచు అసెంబ్లీలో బిల్లును ప్రవేశబెట్టిరి. కొన

---

* దాసుడు (slave) బానిసవాడు. బ్రిటీషుప్రభుత్వమున ఇండియాలో బానిసతనము నిర్మూలింపబడినది. 1843 సం॥ 5 వ ఆక్టు చూడుము.

♦ అధనుడు అనుటలో దాయరీత్యాధనమును పొంద చాలనివాడు అనియుండును.

* 1929 సం॥ జూన్ మాసపు గృహలక్ష్మి 285—288 పుటల జూడుము.

సాగునంతటి ప్రోత్సాహము సంభవింపక యిది సమసిపోయెను. శేషగిరి అయ్యరుగారి యాశయముల ననుసరించి హరిశంకరగౌరుగారొక బిల్లును ప్రవేశబెట్టిరి. ఇది 1929 సం॥ న 2 రుగ అసెంబ్లిలో శాసనమైనది. మృతుని తండ్రి తండ్రి తరముత్పన్నమై తండ్రితో బుట్టినవాని తరమునకు దాయము సంక్రమించులోపల అట్టిమృతుని కుమారుని కూతురు, ఆమెలేనియెడల కుమారితె కుమారిత, ఆమెయులేనియెడల వానితో బుట్టువు, ఆమెయు లేనియెడల తోబుట్టువుకుమారుడు వీరు ఈవరుసను మృతుని ద్రవ్యమును బొందుదురు. ఇదివరకు సపిండసమానోదకాదుల పిదప దాయమును పొందదగిన స్త్రీలును ఇప్పుడు ఈ క్రొత్తచట్టము క్రింద సమీప వర్తులయిరి. ఇదియొక ఘట్టము గడచుట—ఇంకను అనేకము లున్నవి—స్త్రీలు విద్యాధికురాండ్రయి న్యాయసభలందునియుక్తులుగను (advocates) శాసనసభలందు సభ్యురాండ్రుగను జేరి సంచలనము కల్గించుకొలది వారిస్థితు లింకను చక్కబడగలవు. అన్నిటికిని ముఖ్యసాధనము విద్యావ్యాపనము. విద్యావ్యాపనమున కనుకూలములగు విధానములు పెంపుగావలయును.

# ప్రాక్తనాచారముల కెట్టి పదవిగలిగె

శ్రీ శేషాద్రి రమణకవులు

కన్నుగొల్కులనిండఁ గాటుక సవరించి మేనంటఁ బసుపునఁ దానమాడి
తిలకంబు ముఖమునఁ దీరుగాఁ గైసేసి కురులు నున్నగ దువ్వి కొప్పుబెట్టి
పదములఁ బసుపును బారాణి హత్తించి కుట్టుపూసలరైక గుస్తరించి
దేశీయకుసుమముకై శికంబునఁదాల్చి వడికినక్రొంజాయ వలువగట్టి

ఆంధ్రమాతృపవిత్ర తేజోతిశయము
ప్రతిఫలింపఁగఁ జరియించు భామలిపుడు
పల్లెటూరుటనేని కన్పట్ట రకట!
ప్రాక్తనాచారముల కెట్టి పదవిగలిగె.

# సంక్రాంతిముగ్గులు

చింతా దీక్షితులు, వేదుల సత్యనారాయణశాస్త్రిగార్లు

ఏటి కొకమాఱు సంక్రాంతి యేగుదెంచు,
ఊరివారెల్ల నెలపట్టినారు, బాల!
తెల్లవాఱకముందుగాఁ బిలిచి తెచ్చు
కొనుము, పూవులు పిండిఁ గైకొనుము వేగ.
ఇల్లు కళకళలాడ నీయింటిముందు
లక్ష్మి తాండవమాడ నుల్లాసమొలుక
పిండిముగ్గులు సొంపుగాఁ బెట్టవమ్మ!
చక్రములతోడ రథమును, సారసములు,
వివిధఫలములు, పూలు, తాఁబేళ్లు, తేళ్లు,
నిమ్మగుత్తులు పెట్టుము నేర్పుమెఱయ.

—'గీతామంజరి' 3-వ భాగమునుండి.

# కాటుక

### శ్రీమతి జ. రామాబాయమ్మగారు

"సర్వేంద్రియాణాం నయనం ప్రధానమ్." కన్నులేకున్న కలియుగమే లేదని మన పెద్దలు నుడువుదురు. నిజము పరికించినచో కన్నుకు కన్నే సాటి. శరీరము కంతటికి కన్ను ముఖ్యాధారము. పాశ్చాత్యులవలె యుండగోరి చాలామంది భారతనారీమణులు కాటుక పెట్టుకొనుట మానిరి. కాటుక పెట్టుకొన్నంతమాత్రముననే పాశ్చాత్యులగుదురా మన సాంప్రదాయము మనము విడనాడ దగునా? అందులో దక్షిణదేశమున బొత్తిగా కాటుక పెట్టుకొనరు. దానివలననే కళ్లవ్యాధులు ప్రారంభమగును. ఇప్పుడిప్పుడు మన ఉత్తరదేశపు స్త్రీలుకూడా కాటుకను విడనాడుచున్నారు. కాటుక మనకు జయప్రదము. పసుపు, కుంకుమ, కాటుక, ఈమూడు పుణ్యస్త్రీకి ముఖ్యములని చెప్పబడెను. అవి జయప్రదమేగాక ముఖమునకు ఒక మోస్తరు అందమిచ్చును. అదేగాకుండా కన్నులకున్న మలినము పోగొట్టును. నీరు, పుసి మొదలగునవి యుండనీయదు. అందులో మద్రాసులో చూడండి కన్ను జబ్బులేని మనిషియుండునేమో? రెండేండ్లబిడ్డమొదలు పెద్దలవరకు కళ్ల జబ్బులే.



జ. రామాబాయమ్మగారు

బిడ్డలకు మనపెద్దలు పదకొండవదినము మొదలు కన్నుతెఱచి కాటుక బాగా పెట్టెదరు. ఇప్పుడన్ననో, ఆధునికనాగరికతామహిమచే ఏమికాటుక అసహ్యమని మన సోదరీమణులు బిడ్డలకు కాటుక పెట్టుటయే మానిరి. నవనాగరికమని వారను కొన్నను ముఖ్యముగ వారికంటికి అపాయము తెచ్చినవారగుచున్నారు. పెండ్లికుమార్తెకును, పెండ్లికుమారునకును తప్పక మనవారు కాటుక పెట్టక మానరు. అది శుభచిహ్నమని వారి అభిప్రాయము. ఎన్నినగలు ధరించినను, ముఖమునకు కాటుక లేకున్న వెలవెలబోయి నట్లుండును.

నాస్నేహితురాలొకర్తెయున్నది. ఆమె భర్త బి. యె. ప్యాసైనవాడే. ఈ నవనాగరిక లక్షణములన్న ఇష్టమేగాని (అనగా వాలుజడ మొదలగునవి) భార్య కాటుక పెట్టుకొనకపోయిన ఊరుకొనడు. ఆమెయు కాటుక పెట్టుకొనుట మానదు; గాని రెండు మూడు దినముల కొకసారి పెట్టుకొనును. ఆమె భర్తకు ఆమె నిత్యముకాటుక పెట్టుకొని తీరవలెను. ఎచ్చటకైన బోవుటకు శృంగారము చేసుకొన్న కాటుక పెట్టుకుంటివా? లేదా? యనియు లేకున్న నిన్ను తీసికొని వెళ్లననియు తెల్పును. మనపూర్వులు చెప్పిన వాటిలో కూడ మనము గమనించని వెన్నియో మహత్తరవిషయములున్నవి. చూడుడు? కాటుక యననేమియో? దానివలన చక్షురింద్రియమునకు, ఎంతయో లాభము కనిపించుచున్నది. కన్నునిర్మలముగా ప్రకాశించును. ఈసమస్తచరాచర ప్రపంచమును బాగుగ చూడగల్గుదుము. కాబట్టి కాటుకను బెట్టుకొనిన కళ్లజబ్బులచే బాధపడుటయు, ఎంత దరిద్రులైనను డాక్టర్లకు సొమ్ము యిచ్చుటయు, కంటికి పథ్యముచేసి తిండికి మొగము వాచుటయు కలుగదు. ఇంకను కనుబడకపోయిన సులోచనము జోడుపెట్టుకొని తిరుగవలసి వచ్చును. కొంతమంది యువతులది యొక ప్యాషనని తలచెదరు. ఇప్పుడైనను స్త్రీలు కాటుకయందు విశ్వాసముంచి చక్షురింద్రియములు గాపాడుకొందురుగాక!

# కార్యసిద్ధిక్రమము

శ్రీమతి మదిసనుభద్రమ్మగారు

తెనియుబండకయుండ మునుగోసి భక్షణగావించగా చవిగల్గకుండు
నుత్తమతరమైన విత్తనంబులకును సత్తువదప్పును సనసులముగ
సురుచిరలీలను పరిపక్వమైయున్న ఫలము ఫలంబిచ్చు బంధురముగ
బీజముల్ ధాత్రిని బెంపార హత్తింప వృక్షంబులై సొంపు వెలయుచుండు

కార్యసిద్ధిక్రమం బిది ఘనులకైన
కొన్నిరయమున గావింపదిన్న బడపు
సింహగిరి భూప! నిర్మలాంచితమనీష!
మధురసంభాష! హర్యక్షమనుషవేష!



## గద్వాల సంస్థానము—రాణీగారి పాలనము—

ఈ విషయమును గూర్చి శ్రీమతి మంగళగిరి వీరరాఘవమ్మగారు 'ఆంధ్రపత్రిక'లో వ్రాసిన క్రిందివాక్యములు గమనింపదగియున్నవి:—

" హైదరాబాదు రాష్ట్రమందలి సంస్థానములలో గద్వాల సంస్థానము మిక్కిలి ప్రసిద్ధికెక్కినది. ఆదాయమున నేమి, ఔదార్యమున నేమి, విద్వాంసుల నాదరించుటయందేమి ఈ సంస్థానము పెట్టినది పేరు. బంగారమునకు మెరుగు పెట్టినరీతి ప్రస్తుతము శ్రీరాణివారి పాలనముచే సంస్థానముయొక్క ఘనత, ఔన్నత్యము మరింత వృద్ధియగుచున్నది. పండితసత్కారమునకు నీ సంస్థానముతో వన్నెకెక్కినది వేరొండు లేదని నొక్కి చెప్పవచ్చును. ఒక ఆస్థానకవులేగాక తరచుగా ఆధునికకవులు, పండితులు, గాయకులు, వేదాంతులు మొదలగు సకలకళానిపుణులు నొక్కపర్యాయమే గాక ప్రతియేటను నీ సంస్థానమునుండి విరివిగా బహుమతులు బడయుచున్నారు. ప్రభుత్వపు యుద్యోగులు యుద్యోగనియమిత కాలానంతరము ఉపకారవేతనము బడయు రీతి ఈసంస్థానమునుండి, కవులు, పండితులు, గాయకులు, మొదలగువారు జీవితాంతమువరకు సత్కారములను బహుమానములను పొందుచుండుట సర్వజన విదితము. భాషాభివృద్ధికై, కళాభివృద్ధికై పాటుబడు దానధర్మముల నొసగు సంస్థానము యిదితప్ప మరొకటి లేదని చెప్పవచ్చును. దక్కనులోగల పండితవర్యులకెల్ల నిదియాత్రాస్థలము. ఈసంస్థానపు ఔన్నత్యముగురించి వ్రాయుటసూర్యునిదీపముతో చూపునటు లుండును. పరిపాలనావిధానము మిక్కిలి శ్లాఘాపాత్రమైనది. పూర్వపాలనముకన్న యిప్పటి శ్రీ శ్రీ శ్రీ రాణిగారి పాలనము పూర్వపు పెద్దాపురము రాగమ్మారావుగారి పాలనమును జ్ఞప్తికిదెచ్చుచున్నది. ప్రజానురంజకమగు పరిపాలినమే పాలకుల ముఖ్యకర్తవ్యమని శ్రీ రాణీగారు రూఢిపరచిరి. ఈ విషయమునందిమెకు భారతవర్ష మంతయు జోహారు లిడుచున్నది. ఈ సంస్థానపు పాలకులగు శ్రీ మహారాజ సీతారామ భూపాల్ బహద్దరుగారు స్వర్గస్థులగుటంజేసి ఈ సంస్థానపు గొప్పతనమునకు ప్రతిష్ఠకు ఔన్నత్యమునకు భంగము వాటిల్లకుండునటుల మహాఘనతవహించిన శ్రీ నిజాము ప్రభుత్వమువారు కోర్టు ఆఫ్ వార్డ్సు అను నిబంధనగల ఏలుబడిలో నుంచినను శ్రీరాణీగారి సహనశీలము వివేచనాశక్తి బుద్ధికౌశల్యము గనిపెట్టి తిరిగి ఆమెగారి కప్పగించిరి. ఆసమయమున హిమాలయమునుండి కన్యాకుమారివరకు అన్ని ప్రాంతములనుండి అన్ని

సంస్థలనుండి, అన్ని సంఘములనుండి గొప్ప సభలుజరిగి తిరిగి ఈ సంస్థానము శ్రీ రాణీగారి కప్పగించవలయు నని పంపిన తీర్మానములు, వార్తాపత్రికల యభిప్రాయములు శ్రీ రాణీగారియెడ గల విశ్వాసము, ఆమె గొప్ప తనము ప్రకటించుచున్నవి. కాని తులసివనములో గంజాయి చెట్లున్నట్లు గులాబిచెట్టునకు ముండ్లున్నట్లు పండిత పోషణగల యీ సంస్థానమునందు భాషాభివృద్ధికై ప్రోత్సహించు యీ సంస్థానమునందు ప్రజాద్రోహులు, రాజకీయాందోళనాసాహసులు, పరిపాలనావిఘ్ననిపుణులు, దేశద్రోహులు, కృతఘ్నులు, అవిధేయులు నున్నారు. శ్రీ శ్రీ రాణిగారు ప్రస్తుతస్థితినిబట్టి వర్తమానవాతావరణము ననుసరించి దేశకాలపాత్రలను గమనించి పూర్వమున ఉద్యోగులనేమి దాసీజనంబులనేమి వైద్యులనేమి ఉపాధ్యాయులనేమి నైపుణ్యము గనబడనివారి నందరిని, దేశద్రోహులను, దుర్మార్గులను వారివారి యుద్యోగములనుండి తొలగించి వారి స్థానములందర్హత గలవారిని నియమించిన విషయము సర్వసామాన్యమే. దుష్టస్వభావముల ననుసరించి యొక నియమితమగు పనినుండి తొలగించుటచే, వారి వారి అవకతవక యూహలప్రకారము గొప్పవారిపై నిందల నారోపింపజూచుట సాధారణముగా దుర్జనులకుండు స్వాభావము. అటులనే యీ సంస్థానము వారిపై యిటీవల కొందరు వైరికములో చేరినవారు కొన్ని నిందాసూచకములగు ప్రకటనలు కొన్ని ఉర్దూపత్రికలో గావించియుండిరనుట మిగుల శోచనీయము. అట్టివారు యీ సంస్థానముపై కొన్ని నిరాధారమైన నిందలు మోపి నంతనే యీ సంస్థానమునకు లోటుకలుగునా? దుర్మార్గుల దుష్టప్రవర్తనములచే సన్మార్గములు ఫలించి ద్విగుణీకృతంబు లగునను వాక్యము మరువదగినది గాదు. శ్రీ శ్రీ మహారాణీగారు దుండగీండ్రను తమ సంస్థానమునం దెట్టియాందోళనము గలుగకుండ ముందుగనే గమనించి వారికి తగిన సన్మానము గావించుట అత్యవసరము. విషయముల నన్నిటిని అతిచాకచక్యముతో స్త్రీ యయ్యును శ్రీ రాణీగారు గమనించి యుండుట ఎంతయో ప్రశంసార్హము. ముందిట్టి ద్రోహులను గనిపెట్టి వారి కుయుక్తులకు ప్రచారము కలుగ కుండునటుల కట్టుదిట్టము లొనగూర్ప వలయునని వినయపూర్వకముగా శ్రీ రాణీగారికి దెలుపుటకు సాహసించు చున్నాను. నిందారోపణ వ్యాసములందలి నిజానిజములు గ్రహించి ప్రకటించుట పత్రికాధిపతుల విధియని వేరుగా దెలుపుటనవసరము. వచ్చిన వ్యాసములు జూడకయే ఎట్టి వానినైన ముద్రించుటకు వెనుదీయని పత్రికల కృత్యము గర్హింపదగినదని చదువరులకు తెలియకపోదు. బాధ్యతగల పత్రికాధిపతులు యీ విషయమై యాలోచించెదరు గాత."

శీతాఫలములు:—

నవంబరు మాసపు 'రైతాంగము' పత్రికలో ఆనందకృష్ణ యనువారు శీతాఫల సేద్యమును గూర్చి వ్రాయుచు నిట్లు ముగించుచున్నారు.—

"మనదేశములో కొంతమంది శీతాఫలముల భుజించిన చలిజ్వరములు వచ్చునందురు. కాని యది గొప్పవైద్యులచే మతిచాంచల్యము మొదలైన కొన్నివ్యాధులకు పరమౌషధముగా స్థిరీకరంపబడినది. ఈ పండులోని విత్తనములను పొడిగొట్టి ఆచూర్ణమును బట్టలపెట్టెలో పోసిన నచ్చటికి చిమ్మటలు మొదలైన పురుగులు చేరవు. కావున నీలాటి దివ్యఫలములను మిక్కిలి శ్రద్ధతో తోటలలోను పొలములలోను పండిం చుట మంచిదని కర్షకమహాశయులకెల్ల మనవిచేయుచున్నాను."

చెడిన నెయ్యి:—

అను విషయమునుగూర్చి నవంబరుమాసపు 'సహకారము' ఇట్లు వ్రాయుచున్నది:—

"మన దేశమున నెయ్యి సర్వజనోపకరమైనది. అయినను మనకెట్టి పరిశుద్ధమైనది లభించుచున్నదియు అందరెరిగినదే. అది "హైయ్యంగవీనము" అని అమృతతుల్యముగ పూర్వమెంత శ్లాఘింపబడుచుండెనో యిప్పుడంత మురుగుడుగా నున్నది. నేతిలో లేని కల్మలము ఉండదు. అరటిపళ్లు, బియ్యపుపిండి, గోధుమ పిండి, నువ్వులనూనె, వేరుశనగనూనె, కుసుమనూనె, ప్రత్తిగింజలతైలము, యెద్దుకొవ్వు, పందికొవ్వు యిట్లు నానావిధములుగ భ్రష్టగుచున్నది. ఇట్లు యెంత హేయముగనున్నను ప్రభుత్వమువారు ఈ విషయమై చర్యయేమియు తీసికొనరు. దేశీయులకు అజ్ఞానముచేత నేమి, నిస్సహాయతచేత నేమి అసలే యాప్రసక్తి అక్కరలేదు. విద్యావంతులుగూడ ఉపేక్షాపరులే. విద్యాధికులైనను అధమము శాసనసభ్యులైనను యేదైన శాసనమూలమున యీ విపరీతదౌష్ట్యము చక్కజేయగూడదా? అయితే సభ్యత్వము అబ్బిన తరువాత వెనుకదృష్టి యుండదు. వచ్చే శాసనసభలో సహకారాభిలాషులగు వారుగాని, గ్రామపునర్నిర్మాణ వాదధురీణులుగాని యిందునుగూర్చి చర్యయేమైన తీసికొందురా? చూడవలసి యున్నది. మనదేశమున మాంసాహారులకు సహితము శాకాహారమే ముఖ్యభోజనపదార్థముగ నుండును. శాకముతోకూడ నెయ్యి అత్యవసరమనుట నిస్సంశయము."

వెన్నయొక్క విలువ:—

'నార్తువెస్టుమెడికలు జర్నలు' నందు శ్రీయుత సి. యు. మూరుగారు పైవిషయమునుగూర్చి ఇట్లు ప్రస్తావించుచున్నారు:—

"వెన్నయొక్క విలువ అనంతమైనది. నువ్వులనూనె, కొబ్బరినూనె, ఇప్పనూనె, వేరుశనగనూనె మున్నగు శాఖాసంబంధములగు కొవ్వులలోలేని పుష్టికరమగు పదార్థము వెన్నయందుగలదు. మంచి ఆరోగ్యమును కలిగి శరీరము సరిగా పెరుగుటకు ముఖ్యముగా సేవింపవలసిన పదార్థములలో వెన్నయొకటి. బిడ్డలకు సంపూర్ణమగు ఆరోగ్యమును సమగ్రమగు దార్ఢ్యమును కలుగుటకు వెన్నలేనిచో పాలు, పెరుగు, మజ్జిగ, నెయ్యి, మీగడ మున్నగువానిలో నేదైనను వారికి సంతుష్టిగ పెట్టుచుండవలెను."

ఎండబెట్టిన ద్రాక్షపండ్లు:—

'ఆరోగ్య ప్రకాశిక' పత్రికలో నీవిషయమునుగూర్చి యిట్లు వ్రాయబడియున్నది.

"ఎండబెట్టబడి నిలువచేయబడిన ద్రాక్షపండ్లలో పెద్దద్రాక్ష లేక గింజలుగలద్రాక్ష చిన్నద్రాక్ష లేక గింజలులేనిద్రాక్ష అను రెండుగకములున్నవి. పెద్దద్రాక్షకు అంగూరాద్రాక్షయనియు, చిన్నద్రాక్షకు కిస్మిసిపండు అనియు పేర్లుకలవు. ఈపండ్లలో అద్భుతమైనగుణములు చాలకలవు. కాన ఆహారపదార్థములలో నివి ముఖ్యముగానుండవలెను. వీనిలో ఫలశర్కర మిక్కిలి హెచ్చుగానున్నది. గానశక్తిని ఉద్దీపనము చేయుగుణము కలిగియున్నవి. ఇతరపదార్థములతో నివి బాగుగా మిళితమగును. వీనిలో చక్కెరతోపాటు పొటాషులైము మినరలుసాల్టులుగూడనున్నవి. రక్తములోను శరీరమునందలి టిస్స్యూలలోను పసరు (యాసిడు)

లక్షణములు కలుగకుండ నివి నిరోధించును. ఈపండ్లలోనుండునట్టి మినరలుసాల్టులు చాల శ్రేష్ఠమైనవి, కాన మంచి ఆరోగ్యమును బడయుటకు శరీరమునందిట్టి మినరలు సాల్టులుండుట మిక్కిలి అవసరము."

## శుభ్రమైన నోరు — పటుత్వముగల పండ్లు:—

నవంబరుమాసపు 'రూరలు ఇండియ' పత్రిక ఇట్లు ప్రచురించుచున్నది:—

"మన గ్రామములకు కూడ పంటి బురుసులున్ను, గోందులున్ను, (పేస్టు) పొడులున్ను చేరనవి. గ్రామానికవి మంచివా? అలాగైన యీ నూతన సాధనముల నుపయోగించు పట్టణ వాసులగు జనులు, ఆడవారు సహితము, శుభ్రమైననోళ్లు, బలమైనపండ్లు గలిగియుండవలెను. మరి వారికటులలేవే? ఇండియా దేశస్థులకు నోర్లు ఆరోగ్యముగ నుండుననిన్ని, వారిపండ్లు శ్రేష్టమైన వనిన్ని, యూరోపా దేశస్థులయందుకూడా సాధారణమైన నమ్మికయై యున్నది. హోం, అండు, హోమియోపతి యనుపత్రికలో డాక్టరు చార్లసు జాకసుగారిదియే చెప్పిరి. శతాబ్దములుగ హిందువులు మంచిపండ్లు, ఆరోగ్యమైన నోళ్లు గలిగియుండిరి. దంతవ్యాధుల వారెరుంగరు. నాగరికత ముదిరినకొద్ది చదువుకున్న భారతీయులనేకులు పాశ్చాత్యుల నడవడిక నవలంబించి వారితోపాటు రుచియైన తిండితినుటకును వారి విపరీతవాడుకలకు అలవాటైయున్నారు. కనుక నోటిపండ్లు వీరి తాత ముత్తాతలవలె వీరికుండక యించుమించు పడమటిఖండవాసులవలెనే యుండవలసి వచ్చుచున్నది. ఈ నవనాగరికతలో సొంతముగ చిక్కుబడక సులభమగు ఆరోగ్యకరమైనట్టి తమ పాతవాడుకలతో జీవనములు గడుపు నాటుపురనివాసులు బలమైన పండ్లు రోగములేని నోళ్లుగలిగియున్నామని ప్రజ్ఞలు పలుకవచ్చును. ఎందుకనగ వారు వారి పురాతనాచారములను పోగొట్టుకొనలేదు. మునుపటి ఆర్యుల ద్రావిళ్ల జీవనములలో మంచిపండ్లను శుభ్రమైననోళ్లను కలుగజేసినదేముండనది? డాక్టరు జాకసు యిందు కనేక కారణము లారోపించుచున్నారు, 1. వారిపిల్లలు చంటిపాలతో పెరగిరి. 2. వారుశాఖాభోజనమేగాని మాంసమును భుజించువారుగారు 3. ముఖ్యముగ ముతుకతిండి, కాయగూరలు, పండ్లు వీటినె భక్షించి జీవించిరి. 4. మైదానమందలి వ్యవసాయపు పనులే వారిసాములుగ నుండినవి, 5. వారిచర్యలు సులభములై శాస్త్రవిధుల ననుసరించి యుండె. ప్రాచీనకాలమందు తల్లితనబిడ్డను తనపాలిచ్చి పెంచెను. ఆవుపాలను తన స్తన్యమునకు బదు లుపయోగించలేదు. కఠినశరీరము గలిగిన దానిమూడవకు పచ్చిక గడ్డితోపాటు యుపయోగపడుటకున్ను, ఆపచ్చికను కొరుకునంతటి పుష్టి పండ్లకిచ్చుటకున్ను, ఆవుపాలయందు ఔషధీగుణమున్నది. ఈపాలు మృదువైన నూతనముగ పుట్టిన నాజూకు బిడ్డలకు తగనవికావు. నాగరికత ప్రభావము వల్ల చదువుకొన్న వారు, కలిమిగలవారు పల్లుపుచ్చురోగ పీడితులై యున్నారు. ఆచారము ననుసరించి హిందువు ప్రతిభోజనమునకు ముందు స్నానము చేసి లేదా కాళ్లు చేతులు నోరు శుభ్రముగ నీళ్లతో కడుగుకొనును. నిమ్నజాతులలోనూ భోజనమునకు ముందు వెనుక ముఖముకడిగ నీరుబాగా పుక్కిలించి కడుగువాడుక యున్నది. పుక్కిలించి కడగడము అనగ భోజనానంతరము నోటిలో మురికేమియు లేకుండ చేయడము. భోజనానంతరము పుక్కిలించికడగడమువల్ల నేమియు నోటి పండ్లసందుల నిరుక్కొనియుండదు. నవీనముగ దిగబడియుండు పంటిబురుసులు దంతములకు సంబంధించిన అంటురోగముల నాపుటలో నమ్మతగిన బలమైన సాధనములని ఎంచుట పొరబాటు. డాక్టరు జాకసుగారు ఆబురుసును ప్రతిసారి యుపయోగించుటకుముందు తగు జాగ్రత్తతో ద్రావకముతోగాని లేక కనీసము వేన్నీళ్లతోనైనను శుభ్రపఱచనిదే పసర

ముల నోళ్లలో నుపయోగించుటకైన పనికిరాదనుచున్నారు. అట్లుశుభ్రపఱచని బురుసుల యుపయోగము వల్ల డిప్తీరియా యనురోగము కలుగునని ఏర్పడియున్నది. అందువలన మనపూర్వాచారపద్ధతుల ప్రకారము క్రొత్తగ విరుచుకొనివచ్చిన వేప, మఱ్ఱి మొదలగు పల్లుదోముపుల్లల నుపయోగమే మేలుతరమని చెప్పుట కనుకూలమైన కారణమేర్పడుచున్నది. పల్లుదోముపుల్ల మొనముందరి పండ్లతో కొరకబడి కావలసినంత మెత్తగ నమలపడుటవలన ఉపయోగపరుచు వారికి తగిన బురుసుగ నేర్పడుచున్నది. ప్రతిరోజు నొకతాజాపుల్ల యుపయోగించు విధానము మరికిచేరియుండు బురుసుకంటె చాల మంచిది. అలోపాతిక్ డాక్టరు వేప తుమ్మ మామిడి పళ్లపుల్లల నుపయోగముల కనిపెట్టుటకు చాలా కాలము ముందే వీనిసుగుణముల మన పెద్దలు కనిపెట్టియున్నారు. వేపపుల్ల వాడుకగ నుపయోగించు వారిలో పైరియా మొదలైన పంటి నోటి రోగములు కలిగియుండు నరుని చూడలేదని డాక్టరు జోన్సు గారు యనుభవసిద్ధాంతముగ నుడువుచున్నారు."

## తులసిపూజ — మహాత్ముడు:—

పాశ్చాత్య నాగరికతా వ్యామోహితుడగు నొకడు విద్యావంతులగు సంఘసేవకులయొక్క స్త్రీలుగూడ హైందవ ప్రాక్తనాచారమగు తులసిపూజను చేయుచుందురు టకు చింతించి అట్టిపూజను గూర్చి తమ అభిప్రాయమేమని గాంధిమహాత్ముని అడిగెను. దానికి మహాత్ముడొసగిన క్రింది చక్కని సమాధానమును ప్రాక్తనాచారముల పట్ల గౌరవముగల ప్రాజ్ఞులెల్లరు గమనింపదగి యున్నది:—

"ఈ ప్రశ్నలో విగ్రహారాధనా విషయము గూడ నిమిడియున్నది. నేను విగ్రహారాధన సమర్థకుడను, విరోధిని గూడను. విగ్రహారాధన వలన కలిగినభ్రమను ఖండించితొలగించు టత్యావశ్యకము. కానిఆ వృక్షముల పూజించుటలో నేమియు దోషము లేదని నా అభిప్రాయము. వృక్షపూజ సకల వృక్షజాతి యొక్క పూజ. వనస్పతిలో సౌందర్యమును గాంచుటవలన భగవానుని మహిమ కొంతదృగ్గోచర మగును. వనస్పతిలేని దొక క్షణమైనను జీవింపజాలము. వృక్షములు తక్కువగానున్న దేశములలో చేయు వృక్షపూజ యందు అర్థశాస్త్రముగూడ నిమిడియున్నది. వృక్షపూజచేయు స్త్రీ తాపూజచేయునపు డేతత్వజ్ఞానము నుపయోగింపదు. ఈపూజ నెందుకు చేయుచున్నావని ఆమెను ప్రశ్నించిన నేమియు కారణము చెప్పజాలదు. ఆమె పూజకు భక్తియే కారణము. స్వార్థసిద్ధికొరకు చేయు ప్రార్థనలు దోషపూర్ణములే. కోరిక మాత్రమే దోషమయినది. వృక్షముల స్వార్థసిద్ధికొరకు పూజించు టెంత దోషపూర్ణమో స్వార్థసిద్ధికొఱకు మసీదులలోను, చర్చిలలోను సలుపు ప్రార్థనలు కూడ నంత దోషపూర్ణములే. జనసామాన్యము నీలాటి ప్రార్థనా జాలమునుండి తప్పించుట చాల నవసరమైన పని. ఈ ప్రార్థనలకును విగ్రహారాధనకుగాని వృక్షపూజకుగాని నేమియు ననివార్య సంబంధము లేదు." (ధర్మసాధని)



భర్తకొట్టినను అంగీకారమే:—

ప్యారిసు నగరముల పరిసరములందు. జెస్సీయనువాడు ఒకవంతెనమీద పోవుచుండెను. దిక్కులు పరికింపగా నాతనికి ఒకచోట పురుషుఁ డొకడు ఒకస్త్రీని కొట్టుచుండుట చూచెను. జెస్సీ కరుణార్ద్రహృదయుడు; అగుట నాతడు స్త్రీ నిట్లు పురుషునిచే కొట్టబడుచుండుట చూడలేక ఆకస్మికముగ నచటకు బోయెను. తనశక్తికొలది పురుషుని త్రోసెను. అందుతో నాతడు క్రిందపడెను. ఇంతలో ఆస్త్రీ తన్ను కాపాడవచ్చిన వానికి కృతజ్ఞత తెల్పుటకు బదులుగా నాతనితో కలయబడి 'అతడు నాభర్త. భార్యాభర్తలమగు మాజోలియు పోటీయు పరాయివాడవగు నీకేల?' అని కసరి పలికెను. క్రిందపడిన ఆమెభర్త యింతలో లేచి క్రొత్తవానితో కలయబడెను. ఆస్త్రీకూడ క్రొత్తవానిని కొట్టుచుండెను. వింతవానికి ప్రాణాపాయస్థితి వచ్చెను. స్వప్రాణ రక్షణార్థము అతడు ఆమె భర్తను ముమ్మారు పొడిచెను. ఆదెబ్బలలో నామెభర్త మరణించెను. వింతవానిపై హత్యానేర మారోపింపబడెను. 'స్త్రీ కొట్టబడుచుండుట నేను చూడలేను' అను సాహసత్వమతి యొకటి ఆతడు కోర్టులో చెప్పలేక పోయెను. కొట్టినను తిట్టినను పతికే అనుకూలురాలై యుండుట దేవీస్వరూపిణియగు స్త్రీ నైజగుణము.

మగవాత్రో? మూనో?:—

ఫరీదుపూరు మండలమునకు చేరిన ఒక గ్రామమునందొక యువకుడు తనయొక్క పసిభార్యను రొమ్ము వఱకు 6 గంటలకాలము భూమియందు పాతిపెట్టుటచే ఆ బాలిక చనిపోయెను. భరించువాడగు మగడే చేచేతుల తనవలన భరింపబడవలసిన ఆలి నిట్లుచేయ నిక నామెను కాపాడువా రెవరు?

13 నెలల పెండ్లికూతురు: 26 ఏండ్ల పెండ్లికొడుకు:—

నిజామాబాద జిల్లా కామారెడ్డి తాలూకాయందలి బీబీపేట గ్రామములో నీ మధ్య యొక విచిత్రమైన వివాహము జరిగినది. ఈ జిల్లాలో మాత్రమిది కనివిని యెరుగని వివాహమనుటలో నాశ్చర్యము లేదు. ఈ గ్రామమందలి గంజి నారాయణ సాహుకారిగారు మేనరికము తప్పిపోవునని తన ౧౩ నెలల ప్రాయపు శిశువును ౨౬ వత్సరముల ప్రాయముగల ఆనల వీరయ్యగారికిచ్చి అతివైభవముగా వివాహమహోత్సవము జరిపిరి. ఈవివాహము శ్రీకటుకం వెంకయ్య జనగామ రాజంభొట్లుగారి పౌరోహిత్యము క్రింద నెరవేరినది. ఈవిచిత్రవివాహము గాంచుటకు అనేకులు వచ్చిరి. గ్రామ ప్రముఖులందరు పాల్గొనిరి. కన్యకాపురాణము బ్రహ్మవాక్యమని విశ్వసించు వైశ్యులు, ప్రాచీన సాంప్రదాయమే యత్యవసరమని బోధించు బ్రాహ్మణ దేవతలు ధైర్యసాహసములతో మేనరికమును నిర్వహించి శిశువివాహమొనరించినందులకు ధన్యులు. (గోలకొండ)

# వనితాలోకము

శ్రీమతి పరుచూరి రాజ్యలక్ష్మమ్మగారు:—



పరుచూరి రాజ్యలక్ష్మమ్మగారు

ఈయమ కృష్ణామండలములోని నూజవీడు గ్రామ వాస్తవ్యురాలు. గుంటూరు మండలములోని పెనుమూలి గ్రామాభిజనులును ప్రస్తుతము నూజవీడు గ్రామవాస్తవ్యులును నగు పరుచూరి మంగాచార్యులవారి సతి. వీరు శ్రీవైఖానసులు. గౌతమస గోత్రమువారు. ఈమె తండ్రి నూజవీడు గ్రామ కాపురస్థులగు వేదాంతము సీతారామాచార్యులు గారు; తల్లి నామము రత్తమాంబ. చిన్నటనాటనుండియు నీమెకు పెద్దలయెడ భక్తి, విద్యయందు శ్రద్ధ విశేషముగ నుండెను. కావుననే ఈమె గీర్వాణము, ఆంధ్రము, ఆంగ్లము ఈభాషలు మూటియందును ప్రవేశపరిచయములను పొందినది. దేశభాషాసేవ చేయ మిక్కిలి నభిలషించు అంగనామణులలో నీయమ యొకతె యని నిశ్శంకముగ చెప్పవచ్చును. "వైయాకరణపంచాన"నుని చే సంస్కృతభాష యందు రచియింపబడిన "మదవతి"యను గ్రంథ రాజము నీమె మాతృభాషయగు తెనుగున నిలిపినది. ఈమె సుగుణవతి; దయామయి; విద్యావతి; గృహనీతుల నెఱిగిన ప్రౌఢ.

శ్రీమతి చేపూరి రుక్మిణిఅమ్మాళ్:—

ఈమె బియ్యే పరీక్షనిచ్చిన గొప్ప విదుషి. ఆంధ్ర విశ్వవిద్యాలయము యొక్క సినేటులో సభికురాలు.

శ్రీమతి సుప్రభారే కన్య:—

సుప్రభారే కన్య మిమన్‌సింగుసందలి విద్యామయి బాలికాపాఠశాల యందు చదివి మెట్రిక్యులేషను పరీక్ష యందు జయముగాంచినది. కలకత్తానగరమునందలి డయోసీజను కాలేజీలో ఉన్నత విద్యవడసి బి. యె; బి.టి పట్టముల నొందినది. కళాశాలలో మంచి పేరుగొన్నది. బి.టి పట్టము నొందిన పిమ్మట ప్రభుత్వమువారొసగిన విద్యార్థినీ వేతనము పైని ఇంగ్లండునకు పోయినది. లండను విశ్వవిద్యాలయము వారిచే విద్యలకొఱకైన డిప్లమోనొంది ఈమె ఈ నడుమ భారత దేశమునకు తిరిగి వచ్చియున్నది.



చేపూరి రుక్మిణిఅమ్మాళ్ గారు

హిల్డాలాజరసు కన్య:—



ఆంధ్ర విశ్వవిద్యాలయముయొక్క సినేటులో నియమింపబడిన ఇద్దఱు సభికురాండ్రలో నీమె ఒకతె.

శ్రీమతి యమ్. కన్నిఅమ్మాళ్:—

ఉత్తర ఆర్కాటుజిల్లా బోర్డు సభ్యురాలుగా ప్రభుత్వమువారిచే నియమింపబడినది.

అన్నమ్మాఓమెన్ కన్య:—

మలబారున నెలకొన్న సిరియను క్రిష్టియను జాతి యందు పుట్టి చక్కని గానవైదుష్యమును సంపాదించి సభారంగములందు గానకళను ప్రచురించుచున్న వారిలో తొలుత పేరుగొన్నది. గానకళాపాండిత్యమున కీమె పలు తావుల పెక్కు బహుమానముల పతకముల పొందినది.

హిల్డాలాజరస్ కన్యగారు

శ్రీమతి ఊర్మిళాసింహాసతి:—

ఇప్పుడు కీర్తిశేషులైన గురుదయాళుసింహా అనువారు ముప్పదిసంవత్సరములకు

పూర్వము స్వగ్రామమగు కొమిల్లాయందు (వంగరాష్ట్రమందలిది) 'త్రిపురహితైషి' అను నామమున నొకవారపత్రిక నెలకొల్పినాడు. దాని సక్రమ నిర్వహణము కొఱకు ఆతడొక ముద్రాయంత్రమును 'సింహా ముద్రాణాలయము' అను నామమున స్థాపించి యున్నాడు. ఆతని అనంతరమా అచ్చుకూటమును ఆ పత్రికను ఆతని కుమారుడు కొంత కాలము నిర్వహించి పరమపదించినాడు. అప్పుడాతని భార్య ఊర్మిళ మామయొక్కయు, పతియొక్కయు పవిత్రాత్మలు సంతోషించునట్లు పత్రికాసంపాదకీయభారమును వహించి శ్లాఘనీయముగ నిర్వహించుచున్నది. పత్రికా నిర్వహణము వృత్తిగా బెట్టుకొన్న వంగ రమణులు మిక్కిలి తక్కువగా నున్నారు. అందు ఈయమ గణనీయ.

శ్రీమతి దామెర్ల కమలరత్నముగారు:—



దామెర్ల కమలరత్నముగారు

రాజమహేంద్రవరము నందలి సుప్రసిద్ధమగు యాజ్ఞవల్క్య నియోగిబ్రాహ్మణశాఖకు చెందిన విదుషి. కళాశాలచరిత్రాధ్యాపకులగు శ్రీయుత దామెర్ల వేంకటరావుగారి సతి. రాజమహేంద్రవరమున ఈమె గౌరవన్యాయాధికారిణిగ నియమింపబడినది. ఇట్టి పదవినందుటకు ఆపుర స్త్రీలలో నీమెయె ప్రథమురాలు.

శ్రీమతి రాజబలాదేవి:—

పురూలియా నగరమునుండి ప్రచురితమగుచున్న 'తరుణశక్తి'యను పత్రిక నీమె సంపాదించుచున్నది. బిహారు ఒరిస్సారాష్ట్రమునకు చెందిన మన్భూమి జిల్లాలోని రామచంద్రపుర గ్రామమునందలి ఆశ్రమమునకు ఈమె నియంత్రి. అచ్చటి వనివాండ్ర సంఘమున కీమె అధ్యక్షురాలు. ఈ ఆశ్రమస్థాపకుడు కొద్ది కాలమునకు క్రితము రాజకీయ కారణములచే ప్రభుత్వము వారివలన నిర్బంధమున నంపబడెను. జయిలునకు బోవుచు నాతడు ఆశ్రమమును రాజబలాదేవి చేతులలో పెట్టిపోయెను. అప్పటినుండియు ఈమె ఆగ్రామమందలి బాలికాపాఠశాలను రాత్రిపాఠశాలను నిర్వహించుచు; 'తరుణశక్తి' పత్రికను సంపాదించుచు; ఆశ్రమమునకు సంబంధించిన ఇతర కార్యములనన్నిటిని చక్కబెట్టుచున్నది. ఈ మహాకార్యనిర్వహణమున ఈమెకు కలుగుచున్న కష్టములు పెక్కు. వ్యయములు తాను జీవించుటకగు ఖర్చులు ఆమె కుట్టుపనిచేసియు తన ఉపాధ్యాయినీత్వమువలనను సరిజూచుకొనవలసియున్నది. ప్రజా సేవచేయుటయందలి ఆమె అభిలాష, కష్టపరంపరల కోర్చియుండెడి ఆమె ధైర్యము శ్లాఘనీయములై యున్నవి.



### ముక్కు ఇన్సూరు చేయుట :—

ఫిలరన్సి కాపిట్ అను జపాను దేశీయురాలు వాసనల నెఱుంగుటలో అసమానశక్తి గలది. ఆమె తన ఘ్రాణేంద్రియమును 10,000 పౌనులకు ఇన్సూరు చేసికొన్నది.

### గొప్ప జలాంతర్గామి :—

ఫ్రాంసు దేశమున ప్రపంచములో అన్నిటికంటె గొప్పదగు ఒక జలాంతర్గామిని నిర్మించిరి. ఇందు 3250 టన్నులభారమును, 150 మంది నావికులును 55 అంగుళముల ఫిరంగులు ఒక విమానమును గలవు. ఇది 420 అడుగులలోతుకు పోగలదు. ప్రపంచమున ఇప్పుడున్న జలాంతర్గాములు సాధారణముగ 330 అడుగులలోతుకు మాత్రమే పోగలవు.

### విషముతో టీకాలు విషమునకు మందు :—

ఫిసలిజ్ అను నామముగల ఒక పాశ్చాత్యస్త్రీ చాలసంవత్సరములుగ జంతువుల విషపరీక్షయందు కృషిసల్పుచున్నది. ప్రస్తుతమామె యొక నూతన విషయమును కనుగొన్నది. పిచ్చికుక్క విషద్రవమునకును పాము విషమునకు చిత్రమైన పోలికకలదనియు; కుక్కవిషద్రవమును హెచ్చుపాలుగాను పాము విషము తక్కువపాలుగాను కలిపి టీకాలు వేసిన కుక్కలకు పిచ్చికుక్కలు పాములు కఱచినందువలన అపాయమేమియు కలుగలేదనియు; వేటకుక్కలకు యిట్టి టీకాలు వేయుటవలన వానిని పిచ్చికుక్కలు పాములు వీనినుండి రక్షింపవచ్చుననియు; మనుష్యులకు కూడ నీటీకాలపద్ధతి నవలంబించి వారిని విషజంతువుల బారినుండి కాపాడవచ్చుననియు ఆశాస్త్రవిదుషీమణి ప్యారిసునగరమునందలి శాస్త్రపరిషత్తు వారికి నివేదించియున్నది.

### ఒకేకాన్పున ఆర్గురు బిడ్డలు :—

దక్షిణ ఆఫ్రికాయందలి మాత్మెనుబరి యందు ఒక దొరసానికి ఒకేకాన్పున ఆర్గురు బిడ్డలుపుట్టిరి. ఆబిడ్డలలో ముగ్గురు పుట్టినతోడనే చనిపోయిరి.

### కసవు యొక్క విలువ :—

లండను వీధులలో నూడ్వబడిన కసవువలన సంవత్సరమునకు ఒకకోటి పౌనుల లాభము వచ్చుచున్నదని తెలియుచున్నది.

**భీమబలులు:—**

ఇంగ్లండులో జి. సి. ప్రైస్ అనే ఒక కమ్మరి కుడిచేతితో ౧౭ మణుగుల బరువును ఎడమచేతితో ౧౪ మణుగుల బరువును ఎత్తెను. ఒక పావుటన్ను బరువును రెండుచేతులతో ఎత్తెను. అతడు ఇనుపకడ్డీలను చేతులతో వంచగలడు. కీ. శే. పోల్ అనునతడు చేతితో మేకులను దిగగొట్టెడి బలవంతుడు. అతడు తన శరీరముపై బల్లను పరచి దానిపయి జోరుగా మోటారుసయికిళ్లు పరుగెత్తినను భరించెడువాడు. విలియం బేకర్ అనేస్కాచ్ తనచేతులమీద నలుగురు మనుష్యులెక్కి నిలబడియున్న బల్లనెత్తెడివాడు. అతనితమ్ముడు నోటితో ఇనుమును కొరుకగలడట. కపుర్థాలామహారాజుగారి పరిపాలనా వార్షికోత్సవ సందర్భమున ఒకడు తనవక్షస్థలముపయి ఏనుగును నడిపించెను. హెర్మాన్ గోర్నర్ అనేఒక జర్మనుదేశీయుడు నిలువునా నిలబడి మేడమెట్లను ఆపుచేయగలడు. గుండెమీద ౪ గురుమనుష్యులు సవారీచేసే రంగరాట్నమును ఆపు చేయగలడు. (కాంగ్రెసు)

**ఇంగ్లాండులో వివాహములు:—**

ఇంగ్లాండు రిజిస్ట్రారు జనరల్ గారి 1928-వ సంవత్సరముయొక్క స్టాటిస్టికల్ వివరములో నీక్రింది యాశ్చర్యకరమైన సంగతులున్నవి. 1. ఇంగ్లాండులో ననేకులు మగవాండ్రు తమకన్న పెక్కేండ్లు పెద్ద వారగు స్త్రీలను వివాహమాడినారు. 2. ఇరువదియేండ్ల ప్రాయముగలవారు తమకన్న రెండంతలధికమైన ప్రాయపుస్త్రీలను వివాహమాడినారు. 3. ముప్పదియేండ్లుగాని యంతకు కొంతతగ్గిన యేండ్లుగాని గల భర్తలు 60 యేండ్లుగల స్త్రీలను భార్యలనుగా కొనిరి. 4. 35, మొదలు 50 ఏండ్ల లోపుగానుండు పురుషులు కొందఱు 70 ఏండ్ల ప్రాయపుస్త్రీలను వివాహమాడినట్లు సైతమున్నది. 5. మఱియు 57 బాలికలు 15 ఏండ్ల ప్రాయమున వివాహమాడిరి. 6. 440 మంది బాలికలు 17-వయేట వివాహములాడిరి. 7. ఇంగ్లాండులోను వేల్సులోను 303,000 వివాహములు 1928 లో జరిగినవి.

**చిత్రమైన జబ్బు:—**

బొంబాయిలో ఒక విచిత్రకరమగు జబ్బు వ్యాపించుచున్నదట. ఈజబ్బు తగిలినవారు బొంబాయి యందలి సెంటుజార్జి వైద్యశాలయందు చికిత్స పొందుచున్నారు. ఈజబ్బు వైద్యశాల ఆవరణమునందున్న కాకులకు సోకినది. కాకులు ఒక్కొక్కటి మరణించుచున్నవట. ఈ జబ్బు తగిలిన కాకి మొదట రెక్కల నుపయోగింపజాలకున్నది. పిమ్మట నడవజాలదు. మూడవ అవస్థ మరణము.

**వింతజంతువు పుట్టుక:—**

బళ్లారి పశుచికిత్సాలయమున నొక మేక ఈనెను. పుట్టిన దానిని చూడగా తలనుండి పాదములవరకు ఆడబిడ్డ రూపము గలిగియు, పాదములు మట్టుకు మేకగిట్టలుండి చిత్రముగా నుండెను. ఆవింతజంతువుపుట్టిన కొన్ని నిమిషములకే ప్రాణములు వీడెను. (ఇంద్రావతి.)

# గృహలక్ష్మి

ఏజెంట్లు

తెనాలి: కొమ్మూరి కాశీ విశ్వనాథంగారు, జనరలు మర్చెంటు.

బళ్లారి: వి. రాజమొదలియార్ & సన్సు,
కారుస్ట్రీటు, బ్రూసుపేట.

రాజమండ్రి: ఆంధ్ర రంగారావుగారు, ఉల్లితోట వీధి

కాకినాడ: కే. సర్వేశ్వరరావుగారు, జగన్నాయకపూరు.

నెల్లూరు: ఎం. రామకృష్ణరావుగారు, 1256, ఎం. వి. అగ్రహారం.

బెజవాడ: నామల అంతోని.

ఛత్రపురం: నేమాని వాసుదేవమూర్తి, సెక్రెటరీ, పరమేశ్వరి విలాస్

గుంటూరు: ఏ. ఎల్. నరసింహారావుగారు,
ఫోటోగ్రాఫరు, నేషనల్ స్టూడియో.

మచిలీపట్టణము: కె. బాలకృష్ణ, ఫోటో ఆర్టిస్టు, కొజ్జిల్లిపేట.

తిరుపతి: వై. వి. సుబ్బయ్య & కంపెని. వెంకటేశనివాస్

పిఠాపురం: ఏ. వి. శాస్త్రి, కవితావిలాస్.

హైదరాబాదు: ఎన్. గౌరీ శంకరవర్మగారు 544-566 రెసిడెన్సీ బజారు.
(దక్కను:) (మన ప్రాంత్యపు 1 రూ ఉస్మానియా రూ 1-3-0 అగును)

వాల్టేరు: పి. తారనయ్య, అల్లిపురం, వాల్టేరు.

మదరాసు: జె. కాశిరావుగారు.
మదరాసు న్యూస్ ఏజన్సీ, మౌంటురోడ్డు.

అమలాపురం: కె. వి. కృష్ణరావుగారు, కె. అగ్రహారం.

నిడదవోలు: టి. కుటుంబ శాస్త్రిగారు.

ఏలూరు: బి. హెచ్. శ్రీకృష్ణమూర్తిగారు.

ఇతర చోట్లకు ఏజంట్లు కావలెను. వివరములకు దరఖాస్తు పంపుకొనుడు.

"గృహలక్ష్మి" తపాలపెట్టె నెం. 752. ఎగ్మూరు, మదరాసు.

# మెక్సికో స్త్రీలు

మెక్సికో దేశము ఉత్తరఅమెరికాఖండమున గల దేశములలో నొకటి. జనభా 17, 000,000 మంది. భూమి సారవంతమైనది. మొక్కజొన్నలు, గోధుమలు, ప్రత్తి, కాఫీ, చిక్కుడు ఇవి ఆదేశమునందలి ముఖ్యమైన పంటలు. చమురునూతులు, లోహపు గనులు పెక్కులు గలవు. మెక్సికోస్త్రీలు వికాసవదనలు. స్వదేశముయొక్క వర్తకసరళి యందు వారు బాగుగ పాల్గొనియెదరు. ఇంటియందు సమస్త కృత్యములు నిర్వహించుటకు తోడువారు బయిట గొప్పవ్యాపారము సాగింతురు.



విశ్రాంతికొఱకు

గొడ్డుచర్మముకంటె మోటుదేఱిన పాదములతో కంటక శిలలపై ఎట్టి జంకును లేక నడిచిపోయి రెక్కలు ముక్కలగునట్లు యజమానులకు చాకిరీచేసి కొంచము అవకాశము దొరకగనే నీళ్లకనివచ్చి ప్రకృతికి వేలము పట్టగు ఆకోనేటిచెంత ఒకటి రెండు కోడికునుకులు తీయుదురు.

మెక్సికోదేశీయులు విలాసజీవులు, దయార్ద్రహృదయులు. విశాలరమణీయములగు మైదానములందు, పుష్పోద్యానములందు తఱుచు విహరించుచువారు సుఖింతురు.

నీళ్లలోకలపిన మొక్కజొన్నపిండితో చేయబడిన అట్లు ఆదేశమునందలి పేదవారి ముఖ్యాహారము.

అచ్చటిస్త్రీలు ధరించు శిరోభూషణము నెమలిపురివలె విప్పారి తెల్లరంగున నొప్పును. అచ్చటిపనివాండ్ర ఇండ్లగోడలు వెదురు తడకలు. వానిపైని మట్టిపూత పూయుదురు. పైకప్పుగడ్డి గాదములతో వేయబడును. ఇంట విశేషము సామగ్రి యుండదు. కుంపటిపొయ్యి, కల్వము, రోకలి, కొన్నికుండలు, మూకుళ్లు. మొక్కజొన్నపిండితో చేయబడిన అట్లు అప్పుడప్పుడు కాఫి ఇది వారి ఆహారము.

మెక్సికోదేశీయులు ఇంటియందుకంటె బయటనే దినములో విశేషకాలము గడుపుదురు.

బజారులందు స్త్రీలు తమ తమ అమ్ముడువస్తువులను నేర్పుతోఅయి పచరింతురు. కొన్న వారు వస్తువుల నరయుచు నడచు చుందురు. అప్పుడు ఆస్త్రీలు తమ తమ అమ్ముడు వస్తువుల ప్రాశస్త్యమును ముక్తకంఠముతో ఎత్తి పలుకుచుందురు. ఆబజారు చూచుటకు అతిమనోహరముగనుండును. పాశ్చాత్యుల ఆచారమగు పురుషులు స్త్రీలు కలసి నృత్యము చేయుట మెక్సికోదేశమున గల సనాతనాచారములలో నొకటి.

మెక్సికోదేశమున లక్ష్మీపుత్రులు పేద వారు ఇరుగు పొరుగుననే జీవింతురు. ధనికుని బ్రహ్మాండభవనముయొక్క పార్శ్వముననే పేద వాని పూరిగుడిసెయుండును. అలసి పగలే నిద్రించు మగనిపై ఈగలువాలకుండ విసరు పేదరాలు, పూరిగుడిసె, కడిదిశీతువునందుకూడ బట్ట ఎట్టిదో ఎఱుగని బూడిద బుస్సన్నవలె నుండు పిల్లవాడు కలిగిన ఈదరిద్రమందిరమును ప్రక్కనున్న లక్ష్మి భవనమును చూచువారికి ఒక్కసారిగా జీవితము నందు అంతరములు పొడగట్టక మానవు.



నీళ్లు తోడుట

ఆరాతినూయి ఎన్ని సంవత్సరములుగా ఆగ్రామస్థులకు తీర్థమును ప్రసాదించుచున్నదో! గ్రామస్త్రీలను ఒక్కచో చేర్చుటకు వశ్యవిద్యయైన దీనూయి.

ఆదేశమున మధ్యమతరగతికిచెందిన గృహస్థుల యిండ్లయందుకూడ వంటగదులు చాల అసహ్యముగ నుండును. గచ్చు ఎఱుగనినేల, తడకగోడ, ఇటికె బొంతలతో చేయబడిన పొయ్యినుండి పైకి లేచుచు పోవుటకు మార్గమును గానక యింటి లోని సకల వస్తువులకు రంగు వేయు పొగ వీనితో ఆవంటయిల్లు పెంటయిల్లువలెనుండును.

సంపన్నగృహస్థుని భార్యకు ఆదేశమున ఎట్టి పనిపాటలునులేవు. ఆమె సాధారణముగ బయటికిరాదు. ఆత్మకింపైన శృంగారముచేసికొనుట, చేరవచ్చు బిడ్డల ముద్దులాడుట, పుస్తకమో వార్తాపత్రికయో తిరుగువేయుట, ఇవి ఆమె దినచర్యలు.

ఆదేశమునందలి దాసీవాండ్రు సాధారముగ జుట్టు జడలు అల్లుకొనక శిరోజములను వెన్నుపై వ్రేలాడనిత్తురు. ఒకవేళ జడలు అల్లుకొన్నచో అయిదారు జడలుగ అల్లుకొని వానినికూడ వ్రేలాడనిత్తురు. వారు ఆనందమయులుగా నుందురు. గౌరవముతో

చూతుమేనివారు మనచెప్పిన కార్యములను చేయుటకు ఉఱికలు వేయుదురు.



శిరోభూషణము

మంచుగడ్డవలె ధవళమై, పిండిపెట్టుటచే దళమై, సెమళీపురి ఆకారమున నొప్పుచున్న శిరోభూషణమును ధరించుటకు మెక్సికోస్త్రీలు ప్రియము పడుదురు.

ఆదేశమున కంచరగాడిదలు మిగులపని యగును. మ్రానిపలకలను ఒకచోటనుండి మఱియొకచోటికి గొనిపోవుటకేమి, వీధుల వెంట కూరల మూటలను అమ్మకమునకు తిప్పుటకేమి అవి ఆదేశపువర్తకులకు బాగుగ ఉపకరించును.

ఆదేశపు ప్రజలు మిగుల విశ్వాసపాత్రులు. చదువను వ్రాయను తెలియకపోయినను వారు మిక్కిలి తెలివిగ వర్తింతురు. తనయజమాని లెక్కల నాతడు తనకు చదువురాని కారణమున త్రాటికి ముడివైచి లెక్కించును. జూదము, కోడి పందెములు, త్రాగుడు మొదలగు దురాచారములు వారిని వెన్నంటి వచ్చుచున్నవి.

ఆదేశమున లోహపాత్ర లింకను విశేష ప్రచారములోనికి రాలేదు. ప్రాయికముగా మట్టి కడవలే ఉపయోగింతురు. అగుట ఆదేశమున కుమ్మరావములు తఱచు కానవగును. ఆకుండలు వివిధవర్ణములతోడను, మంచిపనితనముతోడను, ఒప్పుచుండును. మెక్సికోదేశమున పొగాకు పరిశ్రమ బహుళము. చుట్టలు,సిగరెట్లు,పొడుము తయారుచేయు ఫ్యాక్టరీలు 12000 గలవు. తయారైన ఈవస్తువుల విడుదల నిమిత్తము మార్కట్టుల కొఱకు ఎక్కడికో పోనక్కఱలేదు. ఏమనగా మెక్సికోదేశము నందలి స్త్రీపురుషులెల్లరును చుట్టకాల్తురు. కాల్చుటయు పరిమితికి మీరి.

ఆచ్చటి స్త్రీలు బాగుగా కష్టపడు స్వభావము కలవారు. ఎంతభారమైన మోయుదురు. గృహకృత్యములు నిర్వహించుటయందు వ్యగ్రహృదయము కలవారు.

## డిసెంబరు చిత్రప్రశ్నకు సమాధానము

డిసెంబరుమాసపు గృహలక్ష్మియందు శ్రీమతి కె. గంగమ్మగారు వైచిన చిత్ర ప్రశ్నకు సమాధానము 'రామమోహనరాయలు' అని. ఈ సరియైన సమాధానము తెలిపిన వారి సంఖ్య 80. అందు నలుబదిమందికి పైగా స్త్రీలు గలరు.

—సంపాదకుడు.

# గ్రంథస్వీకారము

1. సత్యవ్రతి శతకము—భాగవతుల లక్ష్మీనారాయణశాస్త్రిగారు; 2. మూల విద్యానిరాసః శ్రీశంకర హృదయమ్—మల్లంపల్లి సుబ్రహ్మణ్యశర్మగారు; 3 విజ్ఞాన కందశతకము—మదరాసు రాజారావుగారు; 4. ప్రణయ సౌరభము—కొండపల్లి గోపాలరావుగారు, హరి రామలింగశాస్త్రిగారు; 5. మదవతి—వ. రాజ్యలక్ష్మమ్మ గారు; 6. కలువరేకులు—బి. టి. కె. ఆచార్య; 7. శ్రీతుల సీరామాయణము—కిష్కింధా కాండము—భాగవతుల నృసింహశర్మ; 8. అన్నపూర్ణాదేవి జీవితము; 9. ఆంధ్రదేశ రైతు మహాజనసభ—ప్రొఫెసర్ గోగినేని రంగనాయకులుగారు; 10. శ్రీరాణిరావు జగ్గమాంబ—కూచిమంచి సుబ్బారావుగారు; శ్రీరాణిరావు భానయాంబ—కూచిమంచి సుబ్బారావుగారు; 12. విక్టోరియాక్రాసు—పులవర్తి కమలావతీదేవిగారు; 13 అహల్యా సహస్రాక్షము—కల్లూరి వేంకటనారాయణరావుగారు; అనుగ్రంథములను వందనములతో నందుకొంటిమి. కాలక్రమమున విమర్శింపగలమని మనవి.

—సంపాదకుడు.

# పత్రికాపరిచయము

## వీరశైవప్రచారిణి:—

వీరశైవుల అభివృద్ధికొఱకు గురుదేని సుబ్రహ్మణ్యము దేవరవారిచే నెల్లూరునుండి ప్రచురింపబడుచున్న పక్షపత్రిక. ప్రతిపూర్ణిమాస్యకును వెలువడును. నవంబరు 16 వ తేదీని వెలువడిన మొదటి సంచిక కృతజ్ఞతా పూర్వకముగ నందుకొన్నారము. శివస్తుతి; రాధాకృష్ణ; విన్నపము; ఆంధ్రదేశము; ఆంధ్రజంగమ ప్రబోధము; తమాషాలు మొదలగు వ్యాసములుకలవు. సాలుచందా రెండురూపాయిలు. వలయువారు ముత్తరాజావారి వీధి నెల్లూరుకు సంపాదకునిపేర వ్రాయవలెను.

## హిందూసుందరి:—

కాకినాడ శ్రీవిద్యార్థినీ సమాజముపక్షమున వెలువడు స్త్రీవిషయిక మాసపత్రిక. మాపత్రికాపీఠ మలంకరించుచున్న 1929 డిసంబరు సంచిక ఈ పత్రికయొక్క ఇరువది నాలగవ సంపుటములోని తుదిసంచిక. ఇందు వార్తలు, సమస్యలు, విడికథలు, అధ్యక్షోపన్యాసము, హిందీకుటీరనవవార్షికోత్సవము, ఆశీర్వచనపంచకము అను వ్యాసములు కలవు. పత్రిక డెమ్మీసైజున పుస్తకరూపమున నున్నది. సాలుచందా రెండురూపాయిలు. స్త్రీ విద్యాభిమాను లెల్లరు ఎక్కువగా పోషింపవలసిన పత్రిక.

## 1930 సంవత్సరపు కాక్స్టన్ డైరీ:—

నొక్కుబత్తాముగల అట్టచుట్టు; పెనసలు, రోజునకు ఒకపుట గల 1930-వ సంవత్సరపు కాక్స్టన్ డైరీ వందనములతో నందుకొన్నారము. మద్రాసునందలి సి. కుమారస్వామినాయుడు అండుసన్సు వారిచే ప్రచురింపబడ్డది. కావలసిన సంగతులన్నియు కలవు. మనరాజధానియందు గల అయిదు భాషలకు తోడు ఉర్దూభాషయందు కూడ తేదులు తెలుపబడినవి. తెలుగు, అరవపంచాగములు కూడ గలవు. ముచ్చటగ ముద్రింపబడి మంచికాలికోబైండు చేయబడ్డది. వెలప్రతి ఒక్కంటికి 10 అణాలు మాత్రము.

# గ్రంథవిమర్శనము

విజయః—

గ్రంథకర్త: మహావాది వేంకటరత్నముగారు. 190 పుటలు, సాదాకాగితములు. కాగితపుబైండు. వెల 1-0-0. 1927 వ సంవత్సరము భారతీగ్రంథమండలివారి ప్రథమకుసుమముగా వెలువడినది. ఇది యొక చిన్న చారిత్రకనవల. పల్నాటి వీరచరిత్రకుఁజెందినది. "ఇది నిజముగా చారిత్రకమని చెప్పుట కాధారములు గానరావు. దీని మాతృక అముద్రితమగు ఒకతాళపత్రగ్రంథమందలి కొన్నికథలు." ఈ అముద్రితగ్రంథమును భారతీగ్రంథమండలివారు ప్రచురించినచో ఈ నవలకును ఆ కథలకును గల సామ్యభేదములను సూచింపవచ్చును. త్వరలో నద్దానిని ప్రకటించి విస్మృతిప్రపంచములో బడిపోకుండ రక్షించెదరని కోరుచున్నాను. ఈ గ్రంథమందలి కావ్యవస్తువిషయమటుంచి ఒక విశేషమునుగురించి చెప్పవలసి యున్నది. ప్రతిప్రకరణమునకునుముందు ఒక్కొక్క పద్యము అమర్చబడి యున్నది. ఇవి నీతిపద్యముల తరహాగానున్నవి. ఇట్టి పద్యములు కథావేగమునకును కథాసరణికిని అడ్డుగానున్నవి. ప్రకరణమందలి సారాంశమును ముందుగనే తెల్పి కథయందలి కౌతూహలమును తగ్గించుచున్నవి. ఇవియితర కవులనుండి సమయోచితముగా వాడబడిన కావ్యఖండములుగావు—గ్రంథకర్త రచించినవే—ఒక్క విషయమునే రెండుమార్లు చెప్పుటయగుచున్నది. మఱియు నవచనరచన ప్రబంధములందలి వచనమువలె పద్యములకు దాఁపైయుండునది కాదు. నవ వచనము వచనమే. పద్యము పద్యమే. కావున యిట్టివచనమునకు అట్టి పద్యములకు అతకదు. కావ్యవస్తువునందలి పాటలు సరసముగను, రసవంతముగను ఉన్నవి. గ్రంథనామము కొంతవిలక్షణముగా నున్నది. కొంత ద్వంద్వార్థమిందు స్ఫురించుచున్నది. రామచంద్రవిజయుఁడా లేక విజయుఁడా (శ్రీమతి మారుపేరు) అను సంశయము గలుగుచున్నది. ఏదైనను విజయుడు అని పుంలింగశబ్దముండవలెనుగాని విజయ అను స్త్రీలింగము కూడదని నాతలంపు. దొంగలనాయకుడగు సింహబలునియొక్క యెత్తులకు పైయెత్తులువేసి రామచంద్రవిజయుడు తన సహచరుల సహాయమున వానిని బంధించి స్వాధీనముజేసికొనెను. శ్రీమతియొక్క సాహసమును, నేర్పరితనమును పొగడఁదగి యున్నవి. శైలి—గ్రాంథికము. 75, 76 పుటలందు తప్ప శైలి సాఫుగనే యున్నది. 16-వ ప్రకరణమందలి తారాచంద్రసంవాదముయొక్క అగత్యము నాకు బోధపడలేదు. పల్నాటి వీరవంశజుల శౌర్యము చక్కగా వర్ణింపబడినది. వలయువారు:—భారతీగ్రంథమండలి, సత్తెనపల్లి, అని వ్రాయవలెను.

—టేకుమళ్ల కామేశ్వరరావు బి. యె.

## ముత్యాల సరములు—చిన్ని కథలు:—

గ్రంథకర్త కీ. శే. గురజాడ వేంకట అప్పారావుగారు బి, ఏ, ఎఫ్. ఎమ్. యు. ప్రకాశకులు గురజాడ వేంకట రామదాసుగారు, విజయనగరము. వెల తెలియదు. ఆధునిక వాఙ్మయానికి ఆదర్శకప్రాయులైన శ్రీగురజాడ వేంకట అప్పారావుగారి ప్రతిభ నేడీపుస్తకము ద్వారా యువకవుల అంతరంగాల్లో వేరొక క్రొత్తఆవేశం కలిగిస్తూంది. ప్రతికావ్యంలోనూ ఒక ప్రక్క సంస్కరణాభిలాష, ఒకప్రక్క సారస్వతాభిమానం కలసిఉండే స్వాతంత్ర్యప్రియత్వం వెల్లివిరుస్తూంటుంది. వీరికావ్యాలూ కథలూ పూర్వం ఆంధ్రభారతీ సంచికలో వెలువడినవే అయినా అప్పట్లో పత్రికావ్యాప్తి యిప్పటంతగా లేకపోయినందున కొందరికే యెఱుక పడిన ఆకొఱతను శ్రీరామదాసుగారు తీర్చి యువకవిబృందమునకు మేలుచేశారు. ఇప్పటి శ్రీ శివశంకరశాస్త్రి, కృష్ణశాస్త్రిగార్లు ముత్యాలసరాల్లో క్రొంగొత్త మురువులు చూపించి వ్రాస్తూన్నచో ఏతన్మార్గ దర్శకులైనవారు శ్రీఅప్పారావుగారు.

క్రొత్త పాతల మేలు కలయిక
క్రొమ్మెఱుంగులు చిమ్మగా
కూర్చుకొని తేటైన మాటల
ముత్యాల సరములు గ్రుచ్చిన

వాఙ్మయానికి భూషగా నర్పించారు. 'కన్యక' 'డామన్ పిథియస్' 'లవణరాజుకల' అనే కావ్యాల్లో ప్రతి పాదంలోనూ కదిపి కుదిపే భావాలు కుప్పలు తెప్పలుగా ఉన్నాయి. 'పూర్ణమ్మ' అనే కావ్యంలో నేటి సంస్కార ప్రియత్వం పూర్ణంగా చూపించి జాలిగుండెగల తల్లిదండ్రుల మూఢవిశ్వాసాలని పరివర్తనం కలగజేయడానికి సాధనం అవుతూంది. 'లంగరెత్తుము' 'దించులంగరు' అనే కావ్యాలు ప్రణయ పరివర్తనాలని (Various Stages of Romance) తెలుపుచు కవిగారి స్వీయప్రేమ ప్రతిభల వ్యక్తీకరించుచున్నవి. వీరికవితా ధారళ్యములో రాజభక్తి దేశభక్తి, సంస్కార ప్రియత్వం ఏలా ప్రతిఫలిస్తాయో నిర్వేదము, జీవనచింత ప్రేమరహస్యము అలా మెరుస్తుంటాయి.

'నా నేర్పుకొలదిది
ప్రేమ విద్దెకు వోనమాలివి,
యెదను నిల్పిన మేలు చేసరు
మరులు ప్రేమని మది దలంచకు;
మరులు మరలును వయసు తోడనె;
మాయమర్మము లేని నేస్తము.
మగువలకు మగవారి కొక్కటే
బ్రదుకు సుకముకు రాజమార్గము
ప్రేమనిచ్చిన, ప్రేమవచ్చును
ప్రేమనిలిపిన, ప్రేమనిలుచును,
ఇంతియే,

ఖండ కావ్యాల్లాగే ప్రస్తుతం వ్యాప్తిలో ఉన్న చిన్నకథకీ (Short Story) వీరే మార్గదర్శకులను కుంటూ. ఇందున్న 'గిద్దుబాటు, మీ పేరేమిటి?' అనే రెండు కథల్లోనూ ప్రథానోద్దేశం సంఘ సంస్కరణమైనా, హాస్యవ్యంగ్యకళలుచిత్రితములై చమత్కారమును ప్రదర్శిస్తాంటాయి. కథలో కథకుడి ఆశయం తొలుతనే స్ఫురింపజేస్తూ హాస్యకళామయమైన భాష అనర్గళంగా ప్రవహిస్తూంటుంది. విచిత్రమైన సంభాషణ కల్పించి ముఖ్యంగా పారంపర్యమైన మూఢవిశ్వాసాలని వీరు ఖండిస్తారు. కన్యాశుల్క కావ్యరచయితలైన వీరి కిది ఒకగొప్ప శక్తికాదు. ముందు ముందువీరి చిన్ని కథలూ ఖండకావ్యాలూ యింకా ప్రకటిస్తామన్న రామదాసుగారి వాగ్దానానికి ఆంధ్రకవిబృందం ఎదురు చూస్తూంది.

—పి. అన్నాజీ శర్మ.

## కొండపల్లి ముట్టడి:—

గ్రంథకర్తలు:—శ్రీ శేషాద్రిరమణకవులు. మెరుగు కాగితములు, 100 పేజీలు, కాగితపుబైండు, వెల 0-6-0. 1929 వ సంవత్సరమున ప్రచురితము. ఇది ఒక చిన్న చారిత్రకనవల. కృష్ణరాయల కొండపల్లి విజయమిందు వర్ణింపబడినది. గ్రంథకర్తలు చారిత్రపరిశోధన విశేషముగా నొనర్చినట్లిందు తెల్లమగుచున్నది. ప్రహారేశ్వరపాత్రునిమంత్రిత్వము తిమ్మరుసుముందు వెలవెలబారి ధ్వంసమై పోయినది. గజపతియొక్క కాళికాసేవ నింద్యముగను హేయముగను ఉన్నది. అయ్యలరాజు రామభద్రుడు కేవలము కవిత్వమందేగాక రాజ్యాంగమునందు విస్తారము జ్ఞానముగలవాడని గోచరమగుచున్నది. సుందరి (చిన్నాదేవి) తనధీవిశేషము, సాహసము, నేర్పరితనము, ఇత్యాదిగుణములచేత కృష్ణరాయని మెప్పువడసి రాణియైనది. కథయొక్క అల్లికలో జిగికలదు. శైలిగ్రాంథికము, సాఫుగానున్నది. వలయువారు:—వేంకటరామ్ అండ్ కో, ఏలూరు, అని వ్రాయవలెను.

వేదుమళ్ల కామేశ్వరరావు బి. యె.

## లఘుతాంతమంజరి—

ఇందు మహాభారతము, భాగవతము, భర్తృహరి, భాస్కరశతకము, విజయాశ్వచరితము సుమతీశతకము భాస్కరరామాయణము, అనెడి గ్రంథరాజములనుండి యుద్ధృతములైన పద్యములుగలవు. ఇందుఁగల పద్యము లత్యంతము నీతిమార్గోపదేశకము లగుటంజేసియు, భక్తిబోధకము లగుటంజేసియు విద్యార్థులకు పఠనీయముగ నుంచదగినవని నిరంకుశముగా వక్కాణింపవచ్చును. ఇందు క్రౌనుసైజున 32 పుటలుగలవు; వెల 4. అణాలు మాత్రమే. దీనిని వేపేరి సెంట్ పాలు హైస్కూలు తెనుఁగు పండితులగు, మహారాజశ్రీ. కె. వి. రాధాకృష్ణశాస్త్రి, బి. ఎ. ఎల్. టి. యమ్. ఆర్, ఎ. యస్., గారచ్చొత్తించిరి. వలయువారు, శ్రీవారి వేపేరిట 21 సుందరంపిళ్లైలేన్. పురుసవాకమ్, మెడ్రాస్. అని వ్రాసినఁబడయఁగలరు.

—విద్వాన్, వేదుమళ్ల పాపయ్యశాస్త్రి.

**మాయోపాయమారణము:—**

ప్రథమభాగము క్రౌనుసైజున 35 పుటలు. గ్రంథకర్త బ్రహ్మానంద నాగభూషణముగారు. పీఠికయందు "మాగ్రంథమునుగూర్చి పలువురికభిప్రాయ భేదముండవచ్చును; కాని ముద్రించవలసిన భాగము లింకనుగలవు, కాన సదరు భాగములుకూడా పూర్తియైన వెనుక మాయుద్దేశములను విమర్శించవచ్చునని మనవిచేయుచున్నాడను." అని గ్రంథకర్తగారు వ్రాసికొనిరి. అట్టపైఁ బ్రచురింపబడిన ప్రకటననుబట్టి గ్రంథమంతయు నెనిమిది భాగములనియు, అందింకను యేడుభాగములచ్చునందున్నవనియు తెలియవచ్చుచున్నది. భారతవర్షమునందు జిరకాలమునుండి ప్రశంసాపాత్రములై హైందవజాతియింకను జీవించి యుండుటకు కారణభూతములైన సదాచార పరంపరలీగ్రంథమునఁ దూలనాడ బడినవి. ఇందుఁగల దైవద్వేషమును బ్రాహ్మణదూషణమును పరిమితిని మించియున్నవి. హైందవశాస్త్రములనుగాని, హైందవాచారముల యంతరార్థములనుగాని యేమియుఁ దెలిసికొనకుండ గ్రంథకర్తలు ఇట్లు తలకు మీరిన విషయములగూర్చి వ్రాయుట యెట్టివారికైన హాస్యాస్పదముగ నుండకపోదు. తాము వ్రాయు విషయమైన ఒకనాటకముగనో నవలగనో వ్యాసముగనో పాటగనో వ్రాయక అన్నిపద్ధతులనుకూడ సంకరపఱచి వట్టియపహాసకరమైన ధోరణిని దైవమును దిట్టుటయే ప్రారంభముగా బ్రాహ్మణద్వేషమే యవధిగా ప్రాచీన శాస్త్రనిరాకారమే పరమప్రయోజనముగా మాయోపాయ మారణ మను గొప్పపేరును గ్రంథమునకుంచుకొనిరి. గ్రంథారంభమున గల క్రిందివాక్యములను చిత్తగింపుడు:—

(ప్రవేశము—కాపుసోదరులు)

చి—అన్నా! అదేమి యెత్తు పల్లము చిత్రవిచిత్రము?

పె—తమ్ముడా! అది స్వామిగుడి.?

దేవాలయమును ఎంతచక్కగా వర్ణించిరో! భారతభూమియందు పరస్పరవైషమ్యములు విశేషించి ప్రబలియున్న యిక్కాలమునందు కేవల జాతిద్వేషముల రెచ్చగొట్టు నిట్టిగ్రంథములు దేశీయాభ్యుదయమున కెంతయు ననర్థకారులగుచున్నవని చెప్పుటకెంతయుఁ జింతించుచున్నాము. వలయువారు ఆర్యకోటి రెడ్డివర్మగారు, కఠెవరం తెనాలి తాలూకాయని వ్రాసినఁబడయఁ గలరు.

—దివాకర్ల సోమసుందరకవి.

**దేశిరాజు పెదబాపయ్యగారి జీవనస్మృతి:—**

గ్రంథకర్త:—కామరాజు హనుమంతరావుగారు, 231 పుటలు, మెరుగుకాకితములు; కాగితపు బైండు వెల 1-0-0. 1928-వ సంవత్సరమున ప్రచురితము. జీవితచరిత్రలు వ్రాయుట మనలో చాల అరుదు. పూర్వకాలము నందించుమించుగా లేదనే చెప్పవచ్చును. వ్యక్తితో వానిచరిత్రకూడ అంత మెుందవలసినదే. కాని యిటీవల కొంత కన్నుతెరచి జీవితచరిత్రలయొక్క యుపయోగమును దెలిసికొన్నాము. ఈ గ్రంథకర్తయొక్క అనుగ్రహమువల్ల మనకొక మహావ్యక్తి జీవితచరిత్రలభించినది. ఆంధ్రసంఘమునందు శాశ్వతముగా మార్పులు చేయ ప్రయత్నించిన మహనీయులలో దేశిరాజు పెదబాపయ్యగారొకరు. వీరిచరిత్రమునుండి ప్రతివ్యక్తియు గ్రహింపదగిన విషయములు పెక్కుగలవు. పెదబాపయ్యగారు సంపూర్ణ బ్రహ్మసమాజికులు. పరమ

స్వతంత్రులు. వారుక హిందుమతములోగల దురంతములను నిరూపించుటకును కొంతమట్టుకు విదేశీయ ప్రభుత్వమును సంస్కరించుటకును పూనుకొనిరి. బ్రిటిష్ ప్రభుత్వము మనకు మానసికదాస్యము కలుగజేసినదను చున్నారు. కాని అంతకుముందే హిందూమతము మనకు సంపూర్ణ మనోదాస్యమొనగూర్చి బ్రిటిష్ ప్రభుత్వమునకు దారియేర్పరచెను. మనస్స్వాతంత్ర్యమును హిందూమతమును వ్యక్తిస్వాతంత్ర్యమును బ్రిటిష్ ప్రభుత్వము హరించినవి. ఇట్టియెడ మనకర్తవ్యములు రెండు..మనోదాస్యమునుగూడ నిర్మూలము చేయుట— అనగా, మతమునందు విప్లవమును ప్రభుత్వమునందు సంస్కరణమును గావించుట. ఇట్లు రెండిటియందును విజయముగాంచినగాని మనము సుఖపడము. భగవత్పుత్రులమనిపించికొనము. పెదబాపయ్యగారు తమ పరమావధిసాధనకై పడినకడగండ్లకు మితిలేదు. 26 సంవత్సరముల జీవితం (1881–1908) వారొనర్చిన కార్యములు అద్భుతములు. వారి అకాలమరణము ఆంధ్రదేశముయొక్క దురదృష్టమే. వారినిస్మరించి మనము సంఘమునందును రాచకీయములందును సంస్కరణము గావింపవలసియున్నది. వలయువారు:—కామరాజు హనుమంతరావుగారు, బ్రహ్మధర్మ ప్రచారకుడు, రాజమహేంద్రవరము అనిర్వాయవలెను.

—పేకుమళ్ల కామేశ్వరరావు బి. యె.

బాష్పబిందువు:—

పూజాపుష్పమాల యందలి మూడవపుష్పము. గ్రంథకర్తలు వేంకట కాళిదాస కవులు. ఆంధ్రగీర్వాణ సాహిత్యపరిషత్తు, విజయనగరము. వెల ఒక రూపాయి.

ఇందు వివరించిన రెండు చిన్ని ప్రణయ కథానక కావ్యములూ గన్నులంబ్రామిన బాష్పబిందునికరమ్ములనుండి పతించిన వగుటచేత గ్రంథకర్త లీనామకరణము దీనిక చేసినారు. మొదటి కథలో శైశవ పుష్పవాటికల సౌరభసంపద లాని సమ్మదావేశమునన్ సుఖంబనుభవించిన యొక ప్రణయజీవిని తుదకు భగ్నాశతో 'పెంచిన తీవనే మనసు వీడిన యేకతినంపుఁజేతులో త్రెంచిన వక్కటా! కరకుఁదేరిన పాదము లేవొకాని యాశించిన పూవునే నలిపి చిందర వందర గాఁగ మన్నుఁగా వించిన పంద వీహృదయ వీథికి నూహలఁగాక సౌఖ్యముల్, అని బాష్పబిందు నికరమ్ములఁ జిమ్మ నేడ్పించియు రెండవ కావ్యములో ఒండొరుల భుజంబులపయి నొండొరుల కరంబు లిడుకొని యుప్పొంగు ప్రణయరక్తితో స్వైరవిహారములు సల్పిన నీలాసుందరుల ప్రణయరక్తిమలో కొంతికాలమునకు కుమారెడ్డి మృదుహృదయమున తెగని జీవిత పర్యంత తృష్ణకల్పించియు, శిక్షకకు సార్థకత కల్పించినారు. స్వచ్ఛమైన పరిపాకముఁజెందిన శృంగారమునుండి కరుణము ప్రవహిల్లినది. రెండుకథలలో పాకశుద్ధి, ధారాశుద్ధి అలవరచుకొన్న యీకవిద్వయము వారి పోకడలలో పూర్తిగ నూత్నమర్యాదలు హత్తుకొన్నవని చెప్పుచు ప్రాచీన సంప్రదాయముతెంత మాత్రమును సడలి పోనీయ లేదని చెప్పగల్గుటకు సంతసించు చున్నాను. ఆంధ్రవాఙ్మయ కల్పశాఖకు సంధియుగమైన నీయిరువదియవశతాబ్దిని ఆంధ్రసారస్వతోద్యాన వాటికల యందిట్టి పూజాపుష్పమును వికసించుట భావ్యభివృద్ధికరములని చెప్పుచున్నాను. భక్తిభరితమగు నభినివేశముతో ప్రేమపూరితములగు భావనలతో విలసిల్లు పద్యరత్నము లెన్నియేని నిందుండి ఉదాహరణలీయవచ్చును.

" ఓ సుకృతావలంబన! వయోగురు బోధన సంగ్రహీత శి
క్షాసులభంబు ప్రేమ పరికల్పిత వాఙ్మయ; ముందు నక్షత్రం
భ్యాసమమైన కాని సమయంబునఁ బండిలియంచు నేఁడయో
చేసిన నాపు: సమ్మదముఁ జెందితి బాల్య వినోద వైఖరిన్.
నేనపుడో సఖా! పరిణీతయున్న వాడనుగ లేదు. స్త్రీ
జాతి నియమంబు లెవ్వియు నెఱుంగ నొకింతయు నోర్చు లేమి. పెం
డ్లైనది కాని పెండ్లియన నర్థము గోచరమౌట లేదు, వి
జ్ఞాన వికాసముల్ కలుగ జాలని చిన్నతనంబు గావునన్.
నా చెయి మెల్లనన్ గరమునన్ గొని యా సుకుమారి మూర్తి సి
గ్గా చకితమ్ములైన తలిగన్నుల నన్ను నవేగ నాతనిన్
జూచిన నా యమాయిక పుఁ జూపుల నిప్పటికిన్ స్మరింతునన్
దాటిపోయినయ్యా భద్రముగ: నాకిప జీవిత శాంతి కాలముల్."

ఆధునిక వాఙ్మయానికభిరుచి కలిగించే రసవద్ఘట్టములు వీరు అక్కడక్కడ చిత్రిస్తారు.

' ఈ సుమమ్ములు నీ నవ్వు లేయటంచు
నీ విరులు నీదునునుఁ జెక్కులే యటంచు
నీపువుల్ నీవలపుఁ జూపులే యటంచు
సూనములు గోసె నీలకై సుందగుండు.
కోరికలె యెరుంగని నిర్వ్యాజ కలనఁ
బ్రవిమలమ్మగు దరహాస భాగ్యరేఖ
నవఘరించిన చిరుతప్రాయమ్ము నాఁట
లేయెడంద బ్రహ్మానంద లీనము గద!

క్రొంగ్రొత్త భావాలతో—ప్రణయ జీవితము ప్రేరేచి పులకరింపజేసే భావాలీ గ్రంథకర్తల కలవడి యున్నవి. ముందు ముందు వీరింకను సౌరభ్యముగల పూజాపుష్పముల నెలువరించి ఆంధ్రవాగ్దేవి పూజా పీఠిక నలంకరింప జేతురు గాక.

—పి. అన్నాజీశర్మ.




ఆరెడు దివ్వెకధిక దీప్తి:—

ఆరిపోవుచు గ్రుడ్డిదీపము ఒక్కసారి టప్పునమండును. శారదాశాసనము మూలమున బాల్యవివాహములు ఏప్రియలుమాసమునుండి ఆరిపోనున్నవి. ఆరిపోనున్నవి కావుననే ఈనాలుగైదు మాసములుగా అధికదీప్తితోనున్నవి. భారతవర్షముపుట్టిన తరవాత ఉహుహూయని లోకమువారిని వణికించు ఈశీతకాలమున చలిచే చప్పబడిన మంగళధ్వనులతో, విడువక ఒకదానివెంబడి నొక వివాహము చేయించుటచే మంత్రోచ్చారణకు బొంగురు వడ్డ పురోహితుల కంఠధ్వనులతో ఇన్ని బాల్యవివాహములు జరిగియుండవని నిస్సందేహముగ చెప్పవచ్చును. ఇక ముందుజరుగుటకు అసలే వీలుండదు. కాబట్టి ఈ శుక్లనామసంవత్సరము బాల్యవివాహాచారప్రాబల్యమునకు అంతిమప్రదర్శనము, తుది చీటి. బాల్యవివాహములే సదాచారములని నిష్కల్మషముగ నమ్మినవారిని మేము ప్రశంసింతుము. కాని గవర్నమెంటు వారిచ్చిన గడువును దుర్వినియోగముచేసి ముక్కుపచ్చలారని ముద్దుబాలికలకు ఆదరా బాదరా వివాహములొనర్చు భీరుత్వమును మాత్రము తెగడకుండ నుండజాలము. భీరువులకు ఇక ఉన్నగడువు మూడుమాసములు. ఈమూడు మాసములైన ఇట్టి వివాహములు జరుగకుండ తీవ్రప్రచారము చేయవలయునని కొన్ని పత్రికలు వ్రాయుచున్నవి. అట్టి ప్రచారమునకు అవసరములేదు. తాము పట్టిన కుందేటికి మూడేకాళ్లను పూర్వాచారపరాయణులయొద్ద అది సముద్రమధుబిందువగును. అట్టి ప్రచారమునకు అవకాశమును లేదు. కాడిమేడికట్టుకొని ప్రచారకులు బయలుదేరుసరికి పుణ్యకాలము కాస్తయు అయిపోవును. అయితే ఇక కర్తవ్యమేమి? ఏమియులేదు. ఆరంగల దీపమట్లు మండుచున్న ఈ దురాచారముయొక్క స్మరంతి యెత్తక పల్లకుండుటయే.

## శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారు:—



శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారు

ఆంధ్రుని కీర్తి ఒకప్పుడు ఢిల్లీలో నృత్యము చేసియుండవచ్చును; విజయనగరమున వికసించియుండవచ్చును; తంజ నగరమున తాండవించి యుండవచ్చును. మధురలో మలసియుండవచ్చును. అవి అన్నియు తాతలనాడు జరిగినవిషయములు. ఆధునిక కాలమున ఆతనికి ఉత్సాహమునకు తగిన ప్రతిష్ఠ, ఆచరణకుగల కీర్తి గలుగకున్నవి. నలుబది సంవత్సరములకు పైగా కాంగ్రెసు కూడుచున్నది. జనసంఖ్యయందేమి కార్యశౌర్యమునందేమి ఆంధ్ర జాతికంటె వేయిరీతుల వెనుక బడియున్న జాతులనుండి ఉద్భవిల్లిన మహాపురుషులు జాతీయసభాధిపత్యము వహించినారు. కాంగ్రెసు సభాధిపత్యము ఒక్కసారియైన పొందజాలని ఒచ్చెము ఈవిశాలభారతమునందు ఒక్క ఆంధ్రునకే గల్గినది. ఒక్క జాతీయమహాసభకే కాదు. ఏటేటజరుగు అఖిల భారతవర్షీయములగు ఇతర సభలకుకూడ అధ్యక్షత వహించిన ఆంధ్రులనామములు గోవిందద్వాదశులవలె కొలదిగనున్నవి. ఇది మిక్కిలి శోచనీయమగు విషయము. ఈ శోచనీయ విషయమును తొలగించి ఈసంవత్సరము ఆంధ్రులను ఆనందతరంగితులుగ చేసిన మహనీయురాలి దివ్యచిత్రము నీప్రక్కను ముద్రించుచున్నాము. డిసెంబరు 26, 27, 28 తారీఖులందు లాహోరునగరమునందు జరిగిన అఖిలభారతమహిళాసభకు అధ్యక్షత వహించి శ్రీమతి ఆచంట రుక్మిణమ్మగారు ఆంధ్రకీర్తికి రక్షణదేవతయై వెలయుచున్నది. 1930—వ సంవత్సరము ఈ ఆంధ్రరమణీమణి సీత, దమయంతి, సావిత్రి మొదలగు పౌరాణికవనితారత్నముల సంతతికి జెందిన అఖిలభారతవర్షీయమానినీ మణులకు శాసనకర్త్రియై వెలయగలదని గర్వపడుచున్నాము. ప్యారిసు అంతర్జాతీయ మహాసభకు వహించిన ప్రాతినిధ్యమునకు, కాండీనగరమున కూడిన యువజన మహాసభకు వహించిన అధ్యక్షతకు, చెంగల్పట్టుజిల్లాబోర్డున వహించిన సభ్యత్వమునకు —ఇట్లు ఎన్నని చెప్పగలము?— ఈఅఖిలభారతవర్షీయమహిళాసభకు వహించిన అధ్యక్షత శిఖరప్రతిష్ఠమై గ్రాలుచున్నదని నిరాఘాటముగ చెప్పుచున్నాము.

# గృహలక్ష్మి

ఏజెంట్లు.

తెనాలి: కొమ్మూరి కాశీ విశ్వనాధంగారు, జనరలు మర్చెంటు.

బళ్లారి: వి. రాజు మొదలియార్ & సన్సు, కారుస్ట్రీటు, బ్రూసుపేట.

రాజమండ్రి: ఆండ్ర రంగారావుగారు, ఉల్లితోట వీధి

కాకినాడ: కే. సర్వేశ్వరరావుగారు, జగన్నాయకపూరు.

నెల్లూరు: ఏ. సుబ్రహ్మణ్యం, ఏజెంటు, ట్రంకు రోడ్డు.

బెజవాడ: నామల అంతోని.

ఛత్రపురం: నేమాని వాసుదేవమూర్తి, సెక్రెటరి. పరమేశ్వరి విలాస్.

గుంటూరు: ఏ. ఎల్. నరసింహారావుగారు. ఫోటోగ్రాపరు, నేషనల్ స్టూడియో.

మచిలీపట్టణము: కె. బాలకృష్ణ, ఫోటో ఆర్టిస్టు, కోజ్జిలిపేట.

తిరుపతి; వై. వి. సుబ్బయ్యా & కంపెని. వెంకటేశవిలాస్

పిఠాపురం: ఏ. వి. శాస్త్రి, కవితావిలాస్.

హైదరాబాదు: (దక్కను:) ఏస్. గారీ శంకరవర్మగారు 544-566 రెసిడెన్సీ బజారు. (మన ప్రాంత్యపు 1 రూ ఉస్మానియా రూ 1-3-0 అగును)

వాల్తేరు: పి. తానయ్యా, అల్లిపురం. వాల్తేరు.

ఇతర చోట్లకు ఏజంట్లు కావలెను. వివరములకు ధరఖాస్తు పంపుకోనుడు.

"గృహలక్ష్మి" తపాల పెట్టె. 752, ఎగ్మూరు, మదరాసు.


Lodhra
S.A.S.
CHETTY




సచిత్ర మాసపత్రిక

సంపాదకుఁడు

డాక్టర్. కే. ఎన్. కేసరి

సంపుటము 2.] [సంఖ్య. 12

లోధ్ర ముద్రాలయము, మద్రాసు

1930

THE following Municipalities and Taluk Boards have sanctioned subscription for GRIHALAKSHMI and have introduced the Journal into the Girls' Schools within their provinces. As the Journal is mainly intended for the uplift of women, and is instructive and useful for girls, we invite the other Taluq Board Presidents and Chairmen of Municipalities to extend their patronage by placing this matter before their Councils and introduce the Journal into their Girls' Schools :

## MUNICIPAL COUNCILS.

1 Ongole
2 Cuddapah.
3 Tadpatri.
4 Guntur.
5 Adoni.
6 Hindupur.
7 Tirupati.
8 Nellore.
9 Bezwada.
10 Berhampore.

## TALUK BOARDS.

1 Penukonda.
2 Ramachandrapuram.
3 Vellore.
4 Gooty.
5 Narasarowpet.
6 Berhampore.
7 Madanapalle.
8 Dhone.
9 Koilkuntla.
10 Karvetinagar.
11 Chendragiri.
12 Peddapur.
13 Tadepalligudem.
14 Proddatur.
15 Jammalamadugu.

*Editor,*

# GRIHALAKSHMI.

**Post Box. 752.**

EGMORE, MADRAS.

సం॥ చందా రు. 4. విడిసంచిక అ. 6

# గృహలక్ష్మి

"యత్రనార్యస్తు పూజ్యంతే నందంతే తత్రదేవతాః।
యత్రైతాస్తు నపూజ్యంతే సర్వాస్తత్రాఫలాః క్రియాః॥

సంపుటము 2. ఫిబ్రవరి నెల 1930. సంచిక 12.

## విషయసూచిక.

PRINTED AND PUBLISHED BY
DR. K. N. KESARI AT THE LODHRA PRESS, EGMORE, MADRAS.

# జనవరి చిత్రప్రశ్నలకు సమాధానములు

జనవరిమాసపు గృహలక్ష్మిలోని అడపా సూర్యారావుగారు వైచిన మూడవ నెంబరు చిత్రప్రశ్నకు సమాధానము 'గృహలక్ష్మి' అని. దానివివరములివి:—

1. సు గృ హి
2. దే హ ము
3. అ ల లు
4. ల క్ష్మి ని

మేము కోరినట్లు జనవరి 15-వ తేదీలోపున ఈప్రశ్నకు పూర్తి వివరములతో సరియైన సమాధానము తెల్పిన వారి నామములు వరుసక్రమమున దిగువ పేర్కొనుచున్నాము —

1. చర్ల వేంకటరావుగారు; 2. తాతపూడి భద్రకాళిగారు; (పస్తుఫారముచదువుచున్న బాలిక) 3. కొంగర అన్నపూర్ణమ్మగారు; 4. చేజెర్ల. రాజరత్నమ్మగారు; 5. వేదుల గౌరీసావిత్రమ్మగారు; 6. సామవేదము జానకి రామశర్మగారు (సమాధానము సీసపద్యములో వ్రాసిరి) 7. క్రొత్త రామయ్యశ్రేష్ఠిగారు; 8. యల్. వేంకట శేషశర్మగారు; 9. కె. వీరలక్ష్మమ్మగారు. 10. జి. రామేశ్వరరావుగారు.

ఇక రాయప్రోలు భవానమ్మగారు వైచినప్రశ్నసుగూర్చి. పైదానికికంటె దీనికి విశేషసంఖ్యాకులు సమాధానములు వ్రాసిరి. సమాధానము 'లోపాముద్ర' అని. సరియైన సమాధానము గడువులోపల తెలిపిన వారినామములు వరుస క్రమమున దిగువ పేర్కొనుచున్నాము.—

1. మందపాటి సీతామహాలక్ష్మిగారు; 2. ఊడమాటి సుబ్బారావుగారు; 3. కొత్తపల్లి శారదాబాయిగారు; 4. చట్టి రాధమ్మగారు; 5. సింగంపల్లి వెంకటాద్రిగారు; 6. చుండూరు రామయ్యగారు. 7. కారుమూరి సర్వేశ్వరలింగముగారు; 8. ఒంగోలు సుబ్రహ్మణ్యముగారు బి. యె.; 9. భట్రాజుల వెంకటలక్ష్మమ్మగారు; (సమాధానము పద్యములో వ్రాసిపంపిరి.) 10. తోరాటి సత్యనారాయణమూర్తిగారు; 11. యమ్. బసవయ్యగారు; 12. కొరప్రోలు వెంకటరంగమ్మగారు; 13. సుసర్ల లక్ష్మీనరసమాంబగారు;

14. విద్యాసుందరి బెంగుళూరు నాగరత్నముగారు; 15. గురుకుల్; 16. జి. హనుమంతరావుగారు; 17. నాగలింగము సరళాదేవిగారు; 18. యస్. బి. సమితి; 19. వీరుబొట్ల భాస్కరరావుగారు; 20. కలసిపూడి రామారావుగారు; 21. పి. గోపాలకృష్ణగారు; 22. చల్ల వెంకటరావుగారు; 23. బూదరాజు వెంకటసుబ్బారావుగారు; 24. జామిశెట్టి వెంకటరత్నమ్మగారు; 25. తాతపూడి భద్రకాళిగారు (షష్టఫారము చదువుచున్న బాలిక); 26. కొంగర అన్నపూర్ణమ్మగారు; 27. కె. శ్రీరాములుగారు; 28. కె. వి. గోపాలకృష్ణారావుగారు; 29. దేవరకొండ లక్ష్మీకాంతమ్మగారు; 30. హరి వేంకటరమణమ్మగారు; 31. వై. పార్థసారథి నాయుడుగారు; 32. దేవరాజు సత్యవతిగారు; 33. యస్. సుశీలగారు; 34. ముక్కల మురహరిశెట్టిగారు; 35. కొల్లూరి హనుమంతరావుగారు; 36. చేబ్రోలు రాజరాజేశ్వరమ్మగారు; 37. కిలాంబి వెంకటసీతాదేవిగారు; 38. మొగసాటి అప్పలనరసమ్మగారు (సమాధానము పద్యములలో వ్రాసిపంపిరి.); 39. నాశము లక్ష్మీకాంతముగారు; (పదమూడు వత్సరముల బాలిక) 40. నాశము నాగేశ్వరరావుగారు; (పదనైదేండ్ల బాలుడు) 41. సి. వెంకటసుబ్బరాజు; 42. ముచ్చెర్ల బాపిరాజుగారు; 43. కోదాడ నారాయణగారు; 44. వేదుల గౌరీ సావిత్రమ్మగారు; 45. దేవులపల్లి వెంకటకృష్ణయ్యగారు; 46. కిలారు గోవిందయ్య చౌదరిగారు; 47. బి. జ్ఞానమాంబగారు; 48. బాలకవి నేమాని నారసింహమూర్తిగారు; 49. న్యాపతి జానకవల్లిగారు; 50. చిరుమామిళ్ల శివరామకృష్ణప్రసాద్‌గారు; 51. జన్నలమానక శ్రీరామమూర్తిగారు; 52. బొమ్మిశెట్టి నరసింహముగారు; 53. పొనకా రమణమ్మగారు; 54. వైద్యవిద్వాన్ పి. వెంకటకృష్ణశర్మగారు; 55. పల్లపోతు సూర్యనారాయణరావుగారు; 56. రావులకొల్లు సుబ్బలక్ష్మమ్మాళ్ గారు: 57. యమ్. డి. జ్ఞానమ్మగారు; 58. బుర్రా సూర్యనారాయణశాస్త్రిగారు; 59. డి. యస్. రాజేశ్వరమ్మగారు; 60. వి. యస్. నారాయణిఅమ్మగారు; 61. కొత్తరామయ్య శ్రేష్ఠిగారు; 62. లక్కాకుల కమలమ్మగారు; 63. యస్. వసుంధరాదేవిగారు; 64. శ్రీపాద సూర్యకాంతమ్మగారు; 65. జి. ద్వారకాబాయిగారు; 66. వర్తిపర్తి శకుంతలాదేవిగారు, 67. పెద్దపాలియము వగదరాజు కృష్ణసురాజుగారు; 68. గ. యస్. కోదండరామయ్యగారు; 69. అద్దంకి అనసూయాదేవిగారు; 70. యల్. వెంకటశేషశాస్త్రిగారు; 71. వి. కొణకంచి బ్రహ్మానందముగారు; 72. కె. మీనాక్షమ్మగారు; 73. శ్రీపాద ప్రసన్నమ్మగారు; 74. కామినేని కృపావతి; 75. రామేశ్వరరావుగారు.

# పత్రికా పరిచయము

## స్వధర్మ ప్రకాశిని :—

ఇది మతవిషయకమగు ఉత్తమజాతి మాసపత్రిక. సనాతనాచారములందరి నుండిని ప్రచారముచేసి వానిని సంఘమున నిలువరించుటకు కంకణము కట్టుకొన్నపత్రిక. సుప్రసిద్ధులగు శ్రీయుత కనుపర్తి మార్కండేయ శర్మగారు దీనికి సంపాదకులుగా నున్నారు. సంవత్సరపు చందా రెండురూపాయిలు మాత్రమే. విస్మరింపరాని మతధర్మములను విధ్యుక్తవిధులను నేర్చుకొన తలచువారు ఈ పత్రిక చదివి తీరవలెను. పత్రిక వలయువారు స్వధర్మప్రకాశిని, కిల్పాక్, మద్రాసు అను చిరునామాకు వ్రాయవలయును.

# లోధ్రమహిమ

## స్త్రీరత్నముల అభిప్రాయములు.

### ఆంధ్ర యువతీమణులు

శ్రీమతి కవయిత్రి పులవర్తి కమలావతీదేవిగారు రాజమండ్రినుంచి యిట్లువ్రాయుచున్నారు.—

"నా సోదరి బహిష్టియందు కడుపునొప్పిచే చాల బాధపడుచుండెడిది. తమ "లోధ్రను" మూడు బుడ్లను తెప్పించి యామెకొసంగితిని. నాచెల్లెలు స్వస్థురాలగుటయేగాకుండ నిరువురు బిడ్డలనుకూడ కనినది. తమ లోధ్ర స్త్రీలపాలిటి వరప్రసాదిని యనుటకెట్టి సందియమును లేదు. మాస్త్రీల వ్యాధులకు తమలోధ్ర కల్పతరువువలె కన్పడుచున్నది."

శ్రీమతి ఎన్. కనకమ్మగారు, C/o నరసయ్యగారు, విలేజిమాజస్ట్రీటు, కదిరినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.—

"మీలోధ్ర 4 పెద్దబుడ్లను సేవించినాను. 4 నెలలనుండి కడుపునొప్పి బొత్తిగనిలచిపోయినది."

### కర్ణాటక స్త్రీలు.

శ్రీమతి బి. ఇందిరాకుమారిదేవిగారు మెట్టూరునుంచి ఇట్లువ్రాయుచున్నారు.—

"నేను మీకేసరికుటీరం "లోధ్రను" సేవించుచున్నాను. తత్పూర్వము నాకు బహిష్ఠకాలమందు మిక్కిలి బాధకలుగుచుండెను. ప్రతినెలయును క్రమముదప్పి బహిష్ఠి యిరువది దినములోపుననే యగుచుండెను. రెండు సంవత్సరములవరకు ఆసుపత్రిమందు పుచ్చుకొంటిని గాని గుణము కనుపించలేదు. పిమ్మట వారు ఆపరేషన్ చేసుకొమ్మని చెప్పిరి; నేనిష్టపడలేదు. తమ "లోధ్ర" ప్రభావమువిని రెండుబుడ్లు పుచ్చుకొన్న తర్వాత మామూలుప్రకారము క్రమముగ 28 రోజులకు బహిష్ఠయగుచున్నాను. బాధలన్నియు నివర్తిఅయినవి. మరి రెండుబుడ్లు తమ "లోధ్ర"ను నాకు పంపగోరుచున్నాను."

శ్రీమతి జయలక్ష్మమ్మగారు, కొల్లిగల్ బాలికాపాఠశాల ఉపాధ్యాయిని, ఇట్లు వ్రాయుచున్నారు.—

"గడచిన మూడు సంవత్సరములనుండి, నాకు సరిగా ఋతుస్రావము కాకుండెను. రెండుమూడు నెలలకొకసారి బహిష్టు కలుగుచుండెను. ఇందువలన నడుమునొప్పి, కీళ్ల నొప్పులు, బలహీనము, దేహము బరువుగతోచుట, మొదలగు బాధల ననుభవించుచుంటిని. మీ "లోధ్ర" రెండు సీసాలు తెప్పించి వాడినందలో పైకనిన వ్యాధులన్నియు మాయమైనవి. ఇప్పుడు సకాలమునకు బహిష్టుఅగుచు సుఖముగనున్నాను. మరియు రెండు సీసాలమందును వాడదలచినాను. నావలెనే బాధపడుచున్న స్త్రీలకు లోధ్రను వాడితీరవలెనని ఖండితముగా తెలుపుచున్నాను."

### క్రైస్తవ నారీమణులు

శ్రీమతి అన్నాచాండిగారు, ఎం. ఎ. ఆనర్స 'శ్రీమతి' సంపాదకురాలు, కొట్టయంనుంచి ఇట్లు వ్రాయుచున్నారు.—

# లోధ్ర మహిమ

"మీ 'లోధ్ర'ను వాడినాను. స్త్రీల ఋతుసంబంధమగు జాడ్యములకు సదుపాయమగు అపూర్వమగు ఔషధరాజమని చెప్పగలను. తియ్యనిరుచిగల్గి, పథ్యపానాదుల పాటింపవలసిన అవసరము లేకుండుటచే, యీ మందును సంతోషముగ వాడవచ్చును."

శ్రీమతి డాక్టరు అన్నతామస్ అమ్మగారు, బెంగుళూరు ఆస్పత్రి సూపరింటెండెంటు, ఇట్లు వ్రాయుచున్నారు.

"ఇంగ్లీషు ఔషధములవల్ల గుణము లేనందున తమ "లోధ్ర"ను నా సోదరికి వాడితిని. ఆమెకు ఆశ్చర్యమైన గుణము యిచ్చినందున సంతోషించుచున్నాను. ఇకమీదట ఈ ఔషధమును నా రోగులకు వాడెదను."

శ్రీమతి కె. ఇసయగారు, ఎ.బి. మిషన్, సత్తెనపల్లి, గుంటూరుజిల్లా, ఇట్లు వ్రాయుచున్నారు.

"మీ 'లోధ్ర'వలన నాకు మిక్కిలి ఆరోగ్యము కల్గినది. నాకు వచ్చుచుండిన దగ్గు నయమైనది."

శ్రీమతి మిసర్సు. ఏ. దేవదాసు అమ్మగారు ఇ. డబ్ల్యు. ఎమ్. స్కూలు, సాలిన్, మిర్ బుజిల్లా, ఇట్లు వ్రాయుచున్నారు—

"మీవద్దకొన్న 'లోధ్ర' నాలుగు బుడ్లను, ఋతుస్రావదోషములచే బాధనొందుచున్న స్త్రీల కిచ్చినాను. వాటిని వాడినందున వారి రోగములు కుదిరినవి."

## కేరళ వనితలు

ఎడపిల్లి పార్వతమ్మగారు తిరుచూరునుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"నేను 25 సంవత్సరములు ఋతుసంబంధమగు జాడ్యములతో బాధపడుచుంటిని. ఎన్నియో మందులను వాడినను గుణమగుపడలేదు. తుదకు మీ 'లోధ్ర'ను రొండ్రికాయను మాత్రము వాడగా అత్యద్భుతముగ రోగనివారణ గావించెను."

శ్రీమతి అమ్ముకుట్టియమ్మగారు, సంగీత ఉపాధ్యాయిని, సర్కారుహైస్కూలు, తిరుచూరు, కొచ్చినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"చాలాకాలముగ అనేక విధములైన గర్భాశయ రోగములవల్ల బాధనొందుచుంటిని. అనేక విధములైన చికిత్సలను పొందితిని గాని నివారణము కాలేదు. కడపట నేను "లోధ్ర" సేవించిన వారము రోజులలోనే గారడివిద్యవలెనే మందు పనిచేసెను. దానిప్రభావమును వర్ణింపజాలను."

శ్రీమతి మిస్ గోపాలపణిక్కర్ గారు, శారదావిలాసము, చిత్తూరు, కొచ్చినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"మీవద్దనుండి తెప్పించిన 6 లోధ్రబుడ్లలో 3 నేనును మిక్కిన 3 మా చెల్లెలును సేవించుటచే మాయొక్క ఋతుశూలలు మాయమాయెను."

శ్రీమతి మిసర్సు కర్తగారు, కోరోలి అమ్మనాత్ హౌవుస్, ఇరింజలకుడ, కొచ్చినుంచి ఇట్లు వ్రాయుచున్నారు.

"పది సంవత్సరములుగ ముట్టునొప్పిచే బాధపడుచుంటిని. దానిని మీ లోధ్ర అత్యద్భుతముగ నివారణచేసెను."

---

గృహలక్ష్మి.

## శివాజీ జననము

"జననీ! జనే తో ఏసా జన్ కై సూర్."

"తల్లీ! ప్రసవింపుచో దాతనుగాని శూరునిగాని ప్రసవింపుము."

రాజ్యపదభ్రష్టుడై హుమాయూను తలదాచుకొనుటకు తావులేక గర్భవతియగు భార్య హమిదాతో అడవులు బట్టెను. మతాంతరుడగు రాణాప్రసాదు అను హిందూరాజతనికి అభయమిచ్చి తన నెలవగు ఉమర్‌కోటయందు వారిని నిలుపుకొనెను. అచ్చట 1542–వ సంవత్సరము అక్టోబరు పదునాల్గవ తేదీని హమిదారాణి ప్రసూతయై కుమారుని గనెను. పుత్రోదయమునకు హుమాయూను పుట్టెడు సంతోషము నందెను. ఆ సంతోషమును సూచించుటకుగాను అతడు పదిమందికి ఏదైన పంచిపెట్టవలెనని తలంచెను. పుట్టిన తలపులను ఆరిక్తహస్తుడు కార్యరూపమున బెట్టుట యెట్లు? వెదకగా వెదకగా ఆతనికి పెట్టె అడుగున కొంచెము కస్తూరి కాన్పించెను. అదియే ఆతడు పదివేలుగ భావించి నలుగురికి ఇచ్చెను. అపుడు హమిదారాణి "ఈ కస్తూరి వాసనవలెనే నా పుత్రుని కీర్తి అన్నిదిశలను వ్యాపించునుగాక" అని పలికెను. ఆ తల్లి మాటలు వీర్యవంతములైన ఔషధము లయ్యెను. తలిదండ్రుల అజ్ఞాతవాసమునందు బుట్టిన ఆ పుత్రుడు అనంతరకాలమున అక్బరుడై మొగలుసామ్రాజ్యనియంతయై మిద్దెమీది దివ్వెవలెప్రకాశించెను. తల్లి ఆశీర్వచనములందు అంత మహత్తు ఉన్నది.

ఉన్నది. పరికింపుడు. హిందూదేశచరిత్రమున అక్బరు యశము ఎవని యశము ముందు దివిటీక్రింది దీపమువలె వెలవెలబాఱునో అట్టి శివాజీమహారాజు చరిత్రమును పరికింపుడు. అల్లుడు మామలగు షాజీయును, జాధవుడును వేర్వేఱు ప్రభువుల గొల్చుచుండిరి. ఆ వేర్వేరు ప్రభువులగు అహమ్మదునగరరాజు నిజాముశాహియు, మొగలాయి చక్రవర్తియు సమరమునకు తలపడిరి. ప్రభువులను బట్టి వారిసేవకులగు ఈ అల్లుడు మామలుకూడ ఒండొరులపై కత్తులుదూసిరి. షాజీ దౌలతాబాదుదుర్గముననుండి ఆ కోట ముట్టడి ఆఱుమాసముల వఱకు నిలువరించెను. కాని చిట్టచివరకు ఆ దుర్గము నిక కాపాడుట దుర్ఘటమను విషయము నాతడు గ్రహించెను. పలాయనము చిత్తగించెను. ఒకనా డర్ధరాత్రమున ఆతడు తన కుటుంబముతో కోటనుండి బయలుదేఱి బీజపురము మార్గము పట్టెను. అప్పటికాతనిభార్య జిజాబాయి ఏడుమాసముల చూలాలు. అలస గమనమునకే అలసట చెందెడు స్థితిలోనున్న ఆ అంతర్వత్ని ఆ అర్ధరాత్రమున అశ్వముపై నధిరోహించి ప్రయాణము చేయవలసివచ్చెను. ఎట్లో ఓర్చి ఆమె ఏడుమైళ్లు ప్రయాణము సాగించినది. అచ్చట అవశయై మూర్ఛలో మునిగినది. శీతలోపచారములు చేయగా నామె ఒక్కింత తడవునకు తేరుకొనినది. అప్పుడు ఆమెను చూచి షాజీ "మీ తండ్రి వెనుక తఱుముకొని వచ్చుచుండును. నేనిచ్చట నిలువరాదు. ఆయన గౌరవము తెలిసిన వాడగునేని నీకేమియు హానిచేయడు. కావున నీ విచ్చటనే యుండిపొమ్ము." అని అనునయించి పలికి ఆమె సంరక్షణార్థము కొంతసైన్యము నచట విడిచి బీజపూరు త్రోవ పట్టెను.

ఏడుమాసముల గర్భము. నెత్తిగంపదింపరాని నలసపాటు. ఏనిముషమున శత్రువులు వచ్చితాకుదురో అను బెదురు. హృదయేశ్వరునినుండి ఎడబాటు. చావును రేవును తేలక ఆ ఇల్లాలు ఇట్లు ఉల్లోలమగు దుఃఖసముద్రమున బడి కొట్టుకొని పోవుచుండెను. ఇంతలో అచ్చటికి ఆమె తండ్రి జాధవుడు వచ్చెను. కుమార్తె యున్న దీనావస్థ చూచి నిలువున నీరయ్యెను. కాని ఏమి చేయుటకును ఇతరులకు రెక్కలు అమ్ముకొన్న ఆతడు అశక్తుడాయెను. కడుపున పుట్టిన కండయైన నేమి? ఆమె పరరాజసేవకునిభార్యఅయి నప్పుడు ఆశ్రయమిచ్చుటకు రాజసేవాధర్మము సుతరాము ఒప్పుకొనదు. కావున జాధవుడు కళ్లనీళ్లు కడుపుకు దింపుకొని ఆమెను సురక్షితముగ సమీపముననున్న శివనేరుదుర్గమునకు బంపి తన దారిని తాను పోయెను.

ఇందుతో జిజాబాయికి పరతంత్రజనుల పాలిటి కష్టములు బాగుగా తెలియవచ్చినవి. "పారతంత్ర్యము తొలగిపోవుట ఎన్నడు? భారతభూమిని శాంతిసుఖములు నెల

కొనుట ఎప్పుడు?" అనుభావములే ఆ దినములలో ఆ నిండుచూలాలి మనమున అనుక్షణమును సుడివడుచుండెను. అట్టి స్థితిలో ఆమె పదునాఱువందల ఇరువదియేడవ సంవత్సరము ఏప్రియలు పదియవతేదీని ప్రసూతయై కొమారుని గాంచెను. ఆ బాలు నామె చెలికత్తెలు తోడుసీడలై వెన్నంటిరా ఆ శివనేరుదుర్గమున వెలసియున్న భవానీదేవి ఆలయమునకు గొనిపోయి దేవిపాదములచెంతనుంచి దేవినుద్దేశించి ఇట్లుపలికెను. "శివయను నామమున సర్వలోకముల నియమించు ఓ దేవీ! నీ యనుగ్రహవిశేషమున పుట్టిన ఈముద్దుబిడ్డకు 'శివాజీ' అని నీ పేరే పెట్టెదను. ఇతడు స్వరాజ్యప్రతిష్ఠాపనాశాలి యగు శూరుడగు గాక!" ఇట్లు పలుకుచు ఆమె చెలికత్తెలతో దేవికి సర్వాంగాలింగిత మహీతలమగు నమస్కారము కావించెను.

కోరినది చిరంటి యగు తల్లి; కోరిక తనబిడ్డ తనజాతిజన్మహక్కు అగు స్వరాజ్యమును ప్రతిష్ఠింపజాలు ప్రతాపశాలి కావలయునని; కోరినతావు మనోరథముల పంటపొలమగు దేవియాలయము; కోరిక నెరవేర్చుటకు పూటకత్తె లోకనియంత్రి యగు శివ. అగుటనే శివాజీ పెరిగి పెద్దయై యవ్వనవాహినికి చెలియలికట్టయై, హిందూమతరక్షణమునకు పెట్టని కోటయై, స్వరాజ్యప్రతిష్ఠాపనకు ఆచార్యుడై తన తల్లిని సిద్ధసంకల్పముగా జేసి జగజ్జేగీయమానముగ వెలుగొందెను. తన కడుపున పుట్టిన చిట్టితండ్రి తన సంకల్పములకు సర్వార్థసిద్ధి సమకూర్పగా వీరమాత జిజాబాయి ఎంత ఆనందవిహ్వల యయ్యెనో వివరింప కలమునకు కాంక్షయున్నది గాని వాఙ్మయమునకు శక్తిలేదు.

## నా స్థితి

పెమ్మరాజు రాజగోపాలము గారు బి. యె. సారస్వత సమాజము

మైకమున జొక్కి నామెయి మఱచిపోయి
జీవనిర్జివితాంతరస్థితిని మునిగి
నామనంబుండె; నిదె ఈక్షణంబునందు
నతిమనోహరమైన ఈయఖిలప్రకృతి
ఆయితమునైన యాధర నధిగమించి
యానభోరుకరాళగర్భాంతరమున
కరగి నీరయి తద్వీచి గణముతోడ
లీనమగుచున్న రీతిగా కానబడెడు;
మంచు దుప్పటిపై నావహించినటుల
కన్నుగవకెల్ల వెల్లనై కాన బడెడు
సత్యమో? మిథ్యమో? యేమొ సకలజగము.

# స్త్రీ—లోకము

కొడాలి లక్ష్మీనారాయణగారు

ఈ ప్రపంచము దుఃఖములకు విలాసభూమి. అందు కాంత తనకాంతునికి విశ్రాంతినిగలిగించు పరమపవిత్రమైన పర్ణశాల.

ఈ విశ్వము దుఃఖదావానలనిలయము. అందు పత్ని తనప్రాణనాథునికి హృదయాగ్నిజ్వాలలను జల్లార్చు శీతలాంబుప్రవాహము.

ఈ జగతి క్లేశమందిరము. అందు మానిని తనమనోభవునికి మానరక్షణము చేయుటకును, దుఃఖమును నిర్మూలము చేయుటకును ఉన్న ఉదారహృదయయగు అర్థాంగి.

ఈ విశ్వము రోగములకు విశ్రమస్థలము. అందు వనిత తన వరుని యుద్విగ్నతను వినాశనముజేయు వైద్యవిశారద.

ఈ ప్రపంచము నిష్ఠురతకు-నాగపాశమైయున్నది. దీనియందు నాయిక తన నాయకునికి బంధవిమోచనార్థము నాగారియైయున్నది.

ఈ ప్రపంచము స్వార్థముయొక్క స్వరూపమైయున్నది. దీనియందు స్త్రీ తన స్వామి కామెయొక్క పవిత్రకర్మములచేత వేరుచేసి నిష్కామకర్మల నుపదేశించు మోక్షసాధనామూలమై యున్నది.

ఈ జగతి ఆయా ఆపన్నులకు నిరంతరసంతాపాగ్నిజ్వాల. అందు ప్రాణేశ్వరి తన ప్రాణేశ్వరునకుఁ దనశీతలపరిచర్యలచే సంతాపముల నంతరింపఁజేయు మనోహరమాలతీలతయైయున్నది.

ఈ లోకము దౌష్ట్యములకు నిలయమై యున్నది. దీనియందు హృదయేశ్వరి తన హృదయేశ్వరుని దౌష్ట్యములనుండి తప్పించు దుర్గమమైన గోడయైయున్నది.

ఈ జగత్తు వ్యర్థమై జగడములకు వలయైయున్నది. దీనియందు భార్య ఆ వల త్రాళ్లనుగోసివైచి దానినుండి భర్తను బైటకు రప్పించు వింతఖడ్గమైయున్నది.

ఈ ప్రపంచము క్రూరత్వముచేతఁ గాంతారమై యున్నది. దీనియందు భామినీమణి భ్రాంతచిత్తుఁడగు తనభర్తను దప్పిపోయిన మార్గమునుండి మరలించి సుగంధవిలసితమై యున్న పూలతోఁటలోనికిఁ జేర్చు మార్గప్రదర్శినియై యున్నది.

ఈ జగతి యజ్ఞానాంధకార బంధురమైయున్నది. దీనియందుఁ జంద్రానన తన నాథునికిఁ జారుచంద్రికయై యున్నది.

ఈ ప్రపంచము భయభాండాగారమైయున్నది. దీనియందు భార్య తన భర్త యొక్క భయములను బోఁగొట్టు దుందుభియై యున్నది.

ఈ ప్రపంచము కంటకి కేంద్రమై యున్నది. దీనియందు పత్ని తన పతికిఁ బాదరక్షణముచేయు పదత్రాణమై యున్నది.

ఈ జగతి యవిద్యచేత నంధకారావృతమై యున్నది. దీనియందు స్త్రీ తనస్వామి యొక్క ప్రతిభా విశేషములను బ్రకాశితముజేయు విద్యావిభూషితయైన దీపశిఖయైయున్నది.

ఈ విశ్వము విషవృక్షమైయున్నది. ఈ భయానకవిషమునుండి పతిని దొలఁగించుటకుగాను పత్ని యమృతఫలమైయున్నది.

ఈ జగత్తు ప్రేమకు పాఠశాల. దీనియందు స్త్రీ తన నాథునికిఁ బవిత్రమైన ప్రేమపాఠములను నేర్పు నుపాధ్యాయిని.

ఈ ప్రపంచము రణభూమి. దీనియందు స్త్రీ రథికుఁడైన పతికి రథమును నడపు సారథి.

ఈ విశ్వము నాట్యరంగము. దీనియందు స్త్రీ తన భర్తకు నేత్రోత్సవము జేయు చారులోచన.

ఈ ప్రపంచము గంధవిహీనమైన పంకమైయున్నది. దీనియందు గాంత తన కాంతునికిఁ బరిమళ సౌరభముల వెదఁజల్లు మొగిలిపువ్వు.

ఈ ప్రపంచము సర్వశృంగారనిలయమై యున్నది. దీనియందు వనిత తన నాథునికిఁ గంఠహారమై యున్నది.

—'చాందు' నుండి.

# భరతమాతకొక జాబు

శ్రీమతి ఇల్లిందల సరస్వతీ సీతారామ్ గారు

"భరతమాతకు

అనేకవందనములు. అమ్మా! హిందూ దేశ మెట్టిస్థితిలోనికివచ్చినదో చూచితివా? మనహిందూనారీమణులు విద్యావిహీనలగుటచే మౌఢ్యమును వహించుచున్నారు. వారు మంచిమాటలను చెవినిబెట్టరు. ఎప్పుడును వంటయింటిలో అధికారముచేయు నారీలలామలకు ఉపన్యాసములనిన, చదువులనిన ఏమర్థమగును?

అర్థముకాకపోయినను ఉపన్యాసములకు మాత్రము వచ్చుచుందురు. వచ్చినచో నుపన్యాసముయొక్క సారాంశము గ్రహింతురా? గ్రహించరు. గ్రహించకపోయినను విందురా? వినరు. వినకపోయినను నిశ్శబ్దముగానుందురా? ఉండరు. ఇక వారక్కడకువచ్చి పైటలు సవరించుకొనుట, పైటపిన్నులను చూచుకొనుట, తలలోపువ్వులను బెట్టుకొనుట, రవికెలకు గుండీలుపెట్టుకొనుట, చేతివాచీలను చూచుకొనుట, అనాకారులనుచూచి వెకవెకలాడుట, జారిన ముసుగులను సవరించుకొనుట, నగలనుగురించి ఒకరి నొకరు ప్రశ్నించుకొనుట. ఇవి వారక్కడకువచ్చి చేయు పనులు.

వీరెందులకు వచ్చినట్లు? పరిశుభ్రముగా దుస్తులువేసి తీసికొనివచ్చిన తమబిడ్డలను చూపుటకా? లేక, తమనగలను చూపించుటకా? లేక, తమ విలువగల చీరలు రవికెలు యితరులు చూచుటకా? తమపైటపిన్నులను చూచి యితరులు ఆనందించుటకా? తమ సులోచనములను చూచి యితరులు తమను నాగరికురాండ్రని యనుకొనుటకా? మేము నాగరికముగా ముచ్చెలు వేసుకొంటిమి. మీరందరు వేసుకొనుడని సంబోధించుటకా? ఉపన్యాసమనిన ఏమో గ్రహించనేరని అబలలు ఎందుకువచ్చినట్లు? నెలదినముల బిడ్డలనుకూడ తీసుకొని వచ్చెదరు.

ఓభారతీదేవీ! నీగర్భమున జనించిన బిడ్డలెట్లయిరో చూచితివా? ఉపన్యాసము లోని మాటలెంత మధురములైనను వారిచెవులకు ములుకులై నాటుకొనును.

దేశమిట్లుండిన ఎన్నడు బాగుపడును? హిందూస్త్రీలలో నొక పెద్దలోపమున్నది. మాకునగలున్నవి. నాణెములున్నవి. మేముధనవంతులమనివిఱ్ఱవీగుదురేగాని, అయ్యో! మనకు జ్ఞానమనెడి ధనములేదని చింతింపరు. మాకు నగలుచేయింపుడని భర్తలను పీడింతురేగాని, చదువుచెప్పుమని నోరుతెఱచి యడుగరు. చీరెలురవికెలుతెమ్మని వేధింతురేగాని, పుస్తకములుతెమ్మని ప్రార్థింపరు. పైయాడంబరములను చూచి యానందింతురేగాని, లోపలిసంగతిని గ్రహించి విస్మయమునొందరు.

ఓతల్లీ! నీపుత్రికలలో పుస్తకమనిన ఏవగించుకొనువారు చాలమందియున్నారు.

చదువు నేర్వకపోయినను, గృహకృత్యములను సరిగా నెఱవేర్చి, బిడ్డలను సరిగా పోషణచేయు నారీలలామలున్నారా? భర్తకు సరిగా హితము సెప్పు భాగ్యశాలులున్నారా? సంసారమను బండికి గట్టబడి, భర్తతోవను నడుచుచుండగా, భర్తతో సమానముగా నడుచు భార్య యున్నదా? విద్యనేర్వకపోయినందువలన తాను నష్టపడి యుండునుగదా? ఆనష్టమును తెలిపి తనబిడ్డలకైనను విద్యచెప్పించుమని భర్తను వేడు గృహిణియున్నదా?

జననీ! వీటికన్నిటికి కారణము తెలుపుమందువా? నీకుకోపమునచ్చునేమో! నీపుత్రులే! పురుషులే! ముమ్మాటికి పురుషులే!

పురుషులు తమ సంగతినే చూచుకొందురుగాని స్త్రీలసంగతి యాలోచింపరు. ఏస్త్రీయైన చదువుకొనుచుండినయెడల వీరుచూచి సహించగలరా? సహించలేరు. స్త్రీయెప్పుడైన ఉపన్యాసమిచ్చినయెడల వారిని హేళనచేయుచు జంతువులుకూడ ఉపన్యాసములిచ్చుచున్నవని కథలువ్రాయుదురు. అమ్మా! చూచితివా? పురుషులప్రజ్ఞ.

భగవంతుడగు వైకుంఠవాసుడు లక్ష్మిని గౌరవించి తన వక్షస్థలమునందుంచు కొనినాడు. ఆదేవాదిదేవునికంటె వీరుఘనులా? అటువంటి గౌరవము పొందిన లక్ష్మీదేవి జాతివారలయిన స్త్రీలకెన్నటికైన విలువతగ్గునా?

పురుషులకు స్త్రీలయెడల ఎట్లుప్రవర్తింపవలెనో తెలియదు. తామే యధికారము నంతను వహించవలెనని తలచెదరు. వారి యాధిక్యమేమి? భార్యాభర్తలిరువురు తోడునీడలవలె ప్రవర్తింపవలెనుగాని "ఆడుదానవు. నీకు పురుషులజోక్యమేల?" యను మాటలేమి? కాలమునకు కట్టుబడియుండిరి గాని స్త్రీలు పురుషులతో సమానమైన తెలివితేటలుగలవారు. వీరిప్పుడు మన్నుతో గప్పబడిన వజ్రములవలెనున్నారు.

ఏదేశము చూచినను, యేగృహము పరికించినను, యేపురుషుని మాట్లాడించినను "స్త్రీకి స్వాతంత్ర్యమేమిటి?" అనుప్రశ్నలే!

అమ్మా! వర్షమున కెదురుచూచు చకోరపక్షులవలె మీరందఱు స్వాతంత్రమునకై చుచుండవలెనని నీపుత్రికలకు బోధచేయుము.

ఇట్లు
నీ ప్రియ పుత్రిక"

# భార్య

శ్రీమతి మరువూరు వేంకటసుబ్బమ్మగారు

కష్టములలో దారి తెలియక త్రొక్కులాడు మానవునకు భార్యగదా బంధువు? అతిసున్నితమైన చిన్నచిన్న చెట్లు గొప్పగా పెరిగియున్న చెట్లకొమ్మలచే వచ్చు సుడిగాలి వీచుటచే ఎంత వేడియైనను మొదలు వంచక తమ ప్రాకారములను కాపాడుకొనునట్లే భార్యయు దైవాధీనముగా వచ్చెడు కష్టములకు భర్త మనస్సు చెదరనీక నాథుని ప్రాణములను కాపాడుచున్నది. తనకెన్ని చిక్కులు వచ్చినను తినుటకు లేకపోయినను యీప్రపంచమే విషమించినప్పటికిని భర్త తన గృహమునందు సంతోషముగా భార్య మధురమైనట్టి మాటలు వినుచున్నాడు. భర్తలను ఆనందవీచికలలో నుయ్యాలలూగునట్లు చేయువారు భార్యలేకదా?

గీ. అఖిలదుఃఖరోగార్తునకౌషధంబు
సురుచిరంబుగ భార్యయ చూవె యెందు
నొనగ భార్యాసమేతుఁడైయున్నవాని
కెంతలాపదలయ్యును నెఱుకపడవు.

అని మహాభారతకారుడు సైతము నుగ్గడించియున్నాడు.

# పాణిగృహీతి—పెండ్లము

## శ్రీ రామకృష్ణ కవులు

౧

### వధువు—పెండ్లికూఁతురు

శ్రీలం బొల్చు వివాహవేళ శుభలక్ష్మీవీక్షణాన్యగ్రయై
బాలన్నిల్చిన వేఁటకాఁడు తనయుత్సాహంబు హెచ్చింపఁగా,
గేలుం దమ్ముల కంట వంగు మగనిం గెల్వంగ వేచేఁ దలం
బ్రాలం బోసెడు పెండ్లికూఁతునకు సౌభాగ్యంబు నిండారుతన్.

పేరుల్ చెప్పెడువేళలన్ వరుఁడు "నా పెండ్లాము నే" నంచు సా
ధారణ్యంబుగ బల్కనల్ల నగుచుం దా నట్టులే "నేను మా
వా" రంచున్ గడునుందనంబు వెలయన్ వ్రాక్కుచ్చు దారం గుళా
ధారం బెండ్లికుమారుఁ డాదరము చేతం జూచెడుం గావుతన్.

"ఏఁ గచ్చేరికి నేగఁగావలయు నోసీ! పిల్లనిం బుచ్చుకో
వేగన్ రమ్మని బొమ్మ యొం డిశువధూ విప్రోపదిష్టాగ్రయై
"యేమి గీతంబుల నేర్చికోవలయు నేఁడీ మీ జనా? నెత్తుకో
నీ గారాముటకా?" యటంచుఁ బల్కు వను హెం దిష్టాప్తి రంజిల్లుతన్.

దండాడించు తలిన్ వరుంచు లెసమీఁదన్ గంధునో యంచు బ
గ్గుండన్ మెల్లఁగఁ జల్ల, భర్తనయి నత్యుల్ గాఁడునో యంచు నె

ష్టం డబ్బాటుగఁ బోయి కాయితముగా బుక్కాములం బట్టి మై
నిండం జల్లెదు పెండ్లికూఁతున కగుక్ నిత్యంబుఁ గళ్యాణముల్.

మొఁఱుగుల్ దీరిన మేల్మిబంగరునగల్ మేనం దగక్, జంద్రుని న
క్కఱ వారింపఁగలట్టి సెమ్మొగమునం గళ్యాణపుంబొట్టు చ
క్క రహింపన్, బసపంట నొప్పు మధుపర్కంబెంతో బాగీయఁగా
వరు మెప్పించు నవోఢ బాఢముగ సౌభాగ్యంబునక్ గావుత్క్.

## ౨

## సువాసిని—ఆఁడుపడుచు

త గుచుట్టంబును బంచి నూతనముగాఁ దక్ నూను యేఁడాదిపం
డుగకుక్ బిల్చిన వచ్చినట్టి గుణవంతుం డల్లుఁ డల్లంతనే
యగపడ్డక్ జెలికత్తెలక్ విడిచి యొయ్యక్ లోనికిం బోయి యే
దో గతిం దండ్రి నెదుర్కొనంబనుచు కూఁతుక్ మాత దీవించుతక్.

ఎదో మిత్రమ్మును జూడ భర్త చనుచో సిక్కించి విస్రబ్ధయై
గదిగుమ్మమ్మునయందుఁ బాటలను జక్కం బాడుకొంచుండఁగా
నదిగో! నీమగఁడంచుఁ జెల్లియలు కూఁయక్, లోనికిం బాఱి నె
మ్మదిగా నొరణనుండి తొంగికను లేమక్ బ్రేమముల్ గూడుతక్.

అనుజన్మల్ జనకుండు భర్తయును మధ్యాహ్నంబునందన్నముల్
దినుచోఁ దాఁ బెలనాకులం బిలుక లెంతే నేర్పుగాఁ జుట్టి భో
జన మైనచ్చి మగండు పండుకొను సెజ్జం జెట్టి పోంచుండి యా
తని యాశ్చర్యము హాస్యముం గనెడుకాంతక్ సంతసం బొందెడుక్.

ఎలమిక్ మేలము సేయఁగా మఱఁద "లోయీ! యేదియో సీతలం
జేల" దన్నం, జెయివెట్టి చూచుకొనఁ బోఁగా బావ, యాంవాను న

వ్వాలయం "బెండ్లము నప్పుడే వెదకికొంచున్నాఁడు" నా, నాతఁ "డ
ట్టెలె! తప్పే"నుని యోడఁ; గుల్కుచుఁ జిరంటిన్ స్త్రీలు చేపట్టుతఱిన్.

"రమణం బొంగిన పాల నీరుఁ జలుకన్ రానోల్ల దిన్నాళ్లు మా
యమ, నీవచ్చినగోలె నింటిపని సేయంజొచ్చె నీ కేమి లో
పము గాకుండఁగ"నంచు మాత వచియింపన్, నవ్వ జామాత కో
పముతో "నందులకా?" యటన్న సుత సంపల్లబ్ధి హర్షించుతఱిన్.

తలి నీళ్ళన్నియుఁ దోడి కాఁచి యటుమీఁదన్ గుంకుళుల్ గొట్టి చెం
తలఁ బొంచుండిన కూఁతు నల్లుతల రుద్దన్ బుల్సుఁబైఁబోయునం
దులకున్ రమ్మన, సిగ్గుచేఁగునియఁ "గన్నుల్ మూసికొన్నాఁడు లే
యలు కేలా?" యన, వచ్చు ముగ్ధ పరివశ్యన్ భర్త కీర్తించుతఱిన్.

ఒకసాయమ్మసివారి కేగిన మగం డొక్కింత కేతెంచి పి
ల్వక యే తల్పును దట్టఁగా దయిత "యెవ్వారా?" రనన్ లజ్జ మి
న్నక యుండన్ బతి; "పల్కవే"మని కృతన్యక్కారుఁడై తల్పుఁదీ
సి కడున్ వెల్వెలఁబాఱి పర్విడు మృగాక్షిన్ భర్త మన్నించుతన్.

అయిదార్నాళ్లిటు లుండఁ గట్టనిడి యొయ్యన్ మామగారంపఁగా
బయనంబై పతి గుమ్మముస్ దిగినవెంటన్ మూఁపుపై నీళ్ళబిం
దియతో నవ్వుమొగమ్ముతోడ నెదురై తృష్ణాత్రపార్థస్ఫుర
న్నయనాబ్జంబులఁ జూచు జాయ శకునానందమ్ములం జేయుతఱిన్.

## 3

## మధ్యమ—కొమరాలు

అభిలాషోన్నతిఁ జేసి శోభనదినంబం దింతముక్తారా, వయః
ప్రభవం బయ్యెడు రూపభేదమున భర్తన్ గుర్తుపట్టంగలే
క భయాత్వమ్మున నిల్చి, యవ్వ "దిగినారా?" యంచుఁ బ్రశ్నింపఁ ద
న్నిభృతోక్తిన్ విని శంకమైఁ బఱచు నేణీనేత్ర రాణించుతఱిన్.

స్మరణ మ్రీకృతవ స్రక్తి యయ్యెను బునస్సంధానవకాశమ్ము క్రియా
పరతంత్రుండగు నాథు మోము గనక్రీభ్రాంతిం గటాక్షించుచున్
గురువాక్యమ్మున భర్తకున్ బుడిసిటన్ గొంచెమ్ము నీర్వెట్ట సు
స్థిరణిన్ బైలనె వంచు గోల కగు దీర్ఘాయుష్య సౌభాగ్యముల్.

పౌరోహిత్యమొనర్చు బ్రాహ్మణుడు చెప్పన్ భర్తతోఁ దాను నా
యుద్యారం బార ఫలప్రదానములు సేయన్ బట్టెరం బత్తి త
ద్వారం బేమియు నాత్మనాథునకు దోఁపన్ రానియట్లట్టులో
పోరన్ బ్రేళులు గందఁ బట్టు సఖు తాయు శ్రీలు సేలయ్యెడున్.

అనువాదమ్ములతోఁ బురోహితుఁడు గర్భాధానఖండం బఠిం
చినమీఁదం గులపాలికల్ తమకుఁ బాసెం బేకపాత్రంబులోఁ
దినఁబెట్టన్ బతి గిన్నెలోనఁ దనచేతిం దాకుఁ సారస్యమున్
గని యూపైఁ జెయి నేకదా యిడని ముగ్ధన్ నేత మోహించుతన్.

పొల్లల్ చుట్టినయట్టి మేలిసిగ యూహోదమ్ములం బమ్మి భా
సిల్లన్ గజ్జెలనాగరమ్ము మిగులం జెల్వార దుద్దుల్ విరా
జిల్లన్ గాసుల పేరుఁ గంటెయుఁ బ్రకాశింపన్ సతుల్ పంపఁగా
నల్లన్ గేళిగృహంబు సొచ్చెడు వృషస్యంతిన్ బ్రియుం డేలుతన్.

గురువుల్ దిద్దినయట్లు వేఁడు వనె మేలో, చేరు బోధించిరో?
పరుఁ డింక న్నిదురించుచుండె నను విశ్వాసంబుతో జీవితే
శ్వరుని పాదమ్ములఁ గన్ను లద్దుకొని సెజ్జన్ డిగ్గి వేఁ గేళిమం
దిరమున్ వీడెడు మందయానఁ బతి భృత్యీభూతుఁడై కొల్చుతన్.

౮

## స్నుష—కోడలు

క్రీడాతతిన్ బ్రసన్నేతరానియమవి యూ కేళీవిలాసమ్ము ల
క్షయమై యుండఁగనే మూఁడునిద్దురలు కాఁగా సారెయాంజీరయుక్
గయిశోభం జెట్టులో పుట్టినిల్లు విడి సాక్షాల్లక్ష్మి తా నాఁగ గా
సయి యత్తింటికి వచ్చు క్రొత్తడికిఁ జిత్తాహ్లాద మేపారుతన్.

కడుహర్షమ్మునఁ బ్రాణవల్లభుని యాజ్ఞం జక్కఁగావించు చెం
దడుగుం దాఁటక యత్తమామలకు భక్త్యాయత్తయై లోప మే
ర్పడకుండం బరిచర్య సేయుచును దత్ప్రస్తావముం గాంచి యె
య్యెడలన్ మన్ననలొందు మానవతినూత్నేచ్ఛల్ సుఖంబుండుతన్.

౯

## గుర్విణీ—చూలాలు.

కడు మోదమ్మున నత్త కూర్మినుతు "నింక న్నీవా కేఁడాదికిం
గొడుకుం గాంచెద"వన్న నవ్వకొనుటన్ గూఢమ్ముగాఁజూచి యా
తఁ డొకం డున్నపు "డీర లెంకులకు నిందాక న్నవుఁగొంటి"రం
చడుగంజొచ్చెడునట్టి గుర్విణికిఁ బూర్ణాయుష్య మౌఁగావుతన్.

నెలదప్పం బొరుగింట్లయమాంద్రదు "కడుపా నీదైన గారాబు కో
డలికిన్? జెప్పవు, చిన్ననాఁటనె యదృష్టం" బన్నచో నత్త "యాన్
దల తేర్పాటయి లోకులం బడినఁగాదా?" యన్నఁ, దన్మానుడిం
గలతీ రగ్గెదు గోల నేల నడువంగా నిచ్చునే మెట్టెడున్.

సంతోషార్థము వింతవారు తమకున్ సంతానమా? నావుమన్
సుంతేన్ సిగ్గున "నిప్డు గర్భిణి"యటంచుం బల్కఁ బ్రాణేశు తీ
రంతన్ సోరణనుండి కన్గొనుచు నొయ్యారంబుగా నవ్వకొ
న్నంతర్వత్నికిఁ బత్ని కూడిగము సేయన్ సేగి లే దేమియున్.

వివరింపన్ మొగమోడునేమొ యని వేవిళ్ళప్డు డాయాయి భ
క్ష్యవిశేషంబులఁ దెచ్చి చాటుగ నొసంగన్ వల్లభుం, డందుమం
చివి మీఁకిష్టములం చొకింత గొని యుచ్ఛిష్టంబుఁ దిన్పించు న
న్నవలావణ్యశరణ్యయైన నవల న్మోఘుండు ముద్దాడుతన్.

ఒడ్డుల్ గర్భిణిగాఁ దలంతు రని సిగ్గూహించుచున్ మున్నడల్
పడ్డం బెట్టిన నొక్కలొక్కొకటిగాఁ బొయించుచున్ జాళువా
యొడ్డాణంబిడుచుండ మాను మని యొంతో భర్త బోధింపఁగా
నడ్డాడంజనలేక వల్లె యను చూలాలెందు మేలొందుతన్.

నెల లొక్కొక్కఁడె పండువెన్నెలలటుల్ నిండారుచో, సన్న గా
జులు పెట్టింతుము మా సహోదరి కటంచున్ దన్నుఁ గొంపోవ సం
గుల కేతేరఁ, బ్రహృష్టచిత్తయయి తోడ్తో విప్రయోగవ్యథా
కులయౌనట్టి కులాంగనన్ గన మతింగోల్పోవఁడే యెట్టిఁడున్.

పొలయల్కన్ మగఁడున్న దాఁబురిటికై పుట్టింటికిం బోనఁకన్
దెలవాఱంగఁ బ్రయాణమన్నపుడు వెండిన్ మిమ్ము నేఁ జూడఁగాఁ
గలనో లేనో యటంచు బెగ్గిలి నమస్కారంబుఁ గావించి క
న్నుల నీర్వెట్టెడి యన్ను పుత్త్రవతియై నూఱేండ్లు వర్ధిల్లుతన్.

నవమాసమ్ములు నిండియున్న తనుఁ గాంచన్ వల్లభుం డుగుదే
ర వికాసంబును జెంది "గాజుల యొయారం బేరు వీక్షింపఁ గాం
తు వహింతు న్ననుఁ జూడ నిప్పటికి శక్యంబాయెనే" యంచుఁ గం
దువ నెగ్గాడుచుఁ గుందు వల్లభుఁ సంతోషంబు దీపించుతన్.

నెలలై పుట్టినయింట నున్నతఱిఁ దన్ వీక్షింపఁగా భర్త రాఁ,
నలవోక న్ననుఁ జూడ నిప్పటికి శక్యంబాయెనే యంచు గా
జుల ముంజేతులు చీరచెంగుల నెటో చొప్పింపఁ బో వల్లభుం
డెల నవ్వం, గని సిగ్గుదేఱు సఖిఁ బ్రాణేశుండు భూషించుతన్.

నవమాసంబులు నిండియుండియు మనోనాథుండు విచ్చేయఁగా
భువిఁ గొంగేలు ఘటించి యెట్టులో కృతాభ్యుత్థానయై లేవ "మా
నవుఁగా? యెన్నివిధాలఁ జెప్ప," నని కిన్కన్ భర్త చూడంగ నే
యువిదో సాకులు పన్ని తప్పుకొను నిల్లాలె పెద్ద వర్ధిల్లుతన్.

ఆలోలాలకసుందరాననముతో నా పాండుగండమ్ముతో
స్థూలీభావమనోహరోదరముతో శోభావిశేషమ్ముతోఁ
జాలంజాలఁగఁ బ్రాణవల్లభునకున్ సంతోషముం జేయు చా
లాలిం బ్రేమసుధాప్రణాళి భువనాధ్యక్షుండు రక్షించుతన్.

పసపుందావియు నుల్లివాసనయు నొప్పన్ గాయపుంగంపు ముం
పెసఁగన్ బుక్కిటి తమ్మలంపుసొగ సెంతే నిఁవు పుట్టింపఁగా
వసివాళ్వాఁడిన బాహువల్లికలతో వాల్లభ్యసంపూర్ణయై
పసికూనం బ్రియుఁ డెత్తుకో నొసఁగు లేబాలింత మేలొందుతన్.

## ౬
## కుటుంబిని—ఇల్లాలు

పతి యేదే నొకవృత్తిచే ధనము సంపాదించి యీయన్ సమం
చితరీతిన్ గృహకృత్యమున్ సకలముం జేకూర్చుచున్ బంధుసం
తతి నభ్యాగతపాళి నర్థిజనముం దన్నెంతయో మెచ్చఁగాఁ
జతురత్వంబున నా కుటుంబిని కగున్ శ్వశ్రేయసానందముల్.

ఇంటన్ దన్విడనాడి భర్తపొరుగూరే కార్యముం దీర్పనో
యొంటిం బోవఁగ ముద్దుబిడ్డల కెటో యుల్లాసముం గొల్పు చే
వెంటన్ నాథసమాగమాహమునకై వీక్షించుచుం గుందు వా
ల్గంటిన్ గెంటని ప్రేముడిం బ్రియుఁడు వేగన్ వచ్చి లాలించుతన్.

తానున్ భర్తయు నేకశయ్యపయి నిద్రం గూరియుండన్ నిజ
ప్రాణేశుండు విపన్నుఁడైనటులు దుస్స్వప్న మ్మదో కాంచి తో
డ్తో నాత్మన్ భయమంది మేలుకొని కాంతున్ మెల్లఁగా లేపి దుః
ఖానందంబులఁ గౌఁగిటం బొదువు జాయం బాయరా దెన్నఁడున్.

చెలికారమ్మున నాథు సత్యాదరయౌ యాత్మేశు సమ్మానమ్మున్ గావించి స
ద్వ్యాలయం జేసియు నాతఁ డల్కఁగొనెనే మోమున్ గుంచు వెన్వెంటను
త్తలపాటుం గని చేరవచ్చి యతిబాల్యభ్యముతో "నాథ ప
ల్కులకుం గోపము రాదుగా?" యను మృగీలోలాక్షికిన్ క్షేమమౌఁగా,

ఆయా కార్యములన్ శ్రమమ్మునకు లోనై భర్త యిల్ చేర నా
యాయాసమ్మఖిలమ్ముఁ దవ్వులకుఁ బోయన్ నవ్వునెమ్మోముతో
డాయంగాఁ జనుదెంచి యేదొ పలు కాడం జొచ్చి మెల్తెంతయుం
హాయిం జేసెడి జాయకంటెఁ గలదే యన్యంబు సౌఖ్యం బిలన్?

ఏ కార్యమ్మును గూర్చియో నిజవిభుం డేమో విచారించుచో
నేకాంతంబున నుండవచ్చి యరచేతం జేయి సంధించి "యే
దో కానీ తలపోయుచున్నటులుగా నున్నార లద్దేదియో
నాకుం జెప్పరె?" యన్ పలిక్తి, పతి కానందంబుఁ గల్పించుతన్.

ధనవంతుం డయినన్ దరిద్రుఁ డయినం దారుణ్యసంయుక్తుఁడై
నను వృద్ధుండయినన్ సురూపయుతుఁడైనన్ రూపహీనుండదై
నను దన్నుం గయికొన్న భర్తకు ననూనప్రీతి సంధిల్లఁగా
ననయమ్మున్ వినయమ్ముఁ జూపు గుణధుర్యన్ భాగ్య మున్నింపుఁడా.

ప్రాణేశుం డెటు కోరునట్లు తనయావచ్ఛక్తి వర్తించుచుం
గానం గాఁపురమున్న నద్ది యొక స్వర్గంబట్లు శోభించి య
త్యానందం బొడగూర్చుచుండెడు ద్వితీయం బోలు తీయంబు లో
కానన్ వేఱొకఁ డున్నదంచు నొడువంగా నేర రెవ్వారలున్.

"ఏలా నీకు భయంబుఁ జెందఁ? దలపై నెక్కించుకొందున్ నినున్
బాలా! యత్తయు నాఁడుబిడ్డలును నీ పంతంబుఁ జెల్లింత్రు నా
శ్రీ లన్నింటికి నీవె రాణి" వని పేర్మిం బల్కి పెండ్లాడి య
య్యాలిం గూలిపడంతికై వడిఁ గనం బ్రాణంబు లెట్లొప్పెడిన్?

# శ్రీమతి వి. సరస్వతిగారికి

## శ్రీమతి యస్. కమలావతీదేవిగారు

స్త్రీకి స్వాతంత్ర్య మీయవలయుననుమాట మంచిదే. కాని, స్త్రీస్వాతంత్ర్యమునుగూర్చి చర్చించుట యెంతటి ముఖ్యావసరమో, స్త్రీ కెంతవఱకు స్వాతంత్ర్యము నీయవలయుననెడి విషయమును చర్చించుట సయితము అంతముఖ్యావసరమే. స్త్రీకి విద్యనీయవలయునని వాదించుట యెంతటి ప్రధానాంశమో స్త్రీ కెట్టివిద్య నీయవలయునో, తాను నేర్చినవిద్యకు స్త్రీ ఏయేవిషయముల నెట్లుప్రయోజనము కనఁబఱుపవలెనో ప్రసంగించుటసయితము అంతటి ప్రధానాంశమే. అందుచేత స్త్రీవిద్యాస్వాతంత్ర్యములనుగూర్చి ఆందోళనము సల్పి రెండవవిషయమును విడుచుట పెండ్లియడావుడిలో మంగళసూత్రముమాట మఱచినట్లుండును. దేశము నందలిస్త్రీలు విద్యావిహీనలై యుండుటవలన నెట్టియరిష్టము వాటిల్లునో, దేశమునగల స్త్రీలనెల్లర విద్యావతులను గావించి వారు నేర్చినవిద్యకు సరియైన వినియోగమార్గమును సూచింపకుండుటయు నట్టియరిష్టమునే కలుగఁజేయునని నాయభిప్రాయము. స్వాతంత్ర్యము కావలయునను సమస్య నందించినవెంటనే విద్యావతియగు స్త్రీ తదభివృద్ధిమార్గమునే లక్ష్యముగా నుంచుకొనును గాని, ఇన్నినాళ్లవఱకును తన్నునొక్కిపట్టియుంచినట్లుగా తాను భావించుచున్న పురుషునిపై పగఁదీర్చుకొనుటయే పరమావధిగా నెంచుకొనదు. కార్యవిచక్షణాశీలత గలయాఁడుది పురుషద్వేషము, మానవద్వేషము మున్నగుదుర్భావముల కెన్నడును జోటీయదు. ఒకకుటుంబమున కును వేఱొకకుటుంబమునకును, ఒకదేశస్థులకును వేఱొకదేశస్థులకును, ఒకఖండవాసులకును వేఱొకఖండ వాసులకును యుద్ధము సంప్రాప్తమైనను ప్రపంచము నిలుకడఁగాంచును గాని మగవాడును, ఆఁడుదియును పోరాటమునకుఁగడంగినచో నిక సృష్టిసయితము మాఁగిపోవలసివచ్చుననుమాట నిజము. “భారతపురుషుఁడు స్వార్థపరుఁడు. ...భారతపురుషుఁడేకాదు; ప్రపంచమునందంతటను పురుషుఁడు స్వార్థపరుఁడే. పురుషునికేగాదు. మానవజాతికే స్వార్థపరాయణత మెండు.” అను మీవ్యాసములోని వాక్యములు చదివిన పిమ్మట భగవంతుఁడే స్వార్థపరుఁడు కాఁబోలునని సయితము కలవరపడవలసియున్నది.

“చిన్నతనమున తండ్రి, నడిమికాలమున భర్త, చివరకాలమున పుత్రుఁడు—ఆమెకు రక్షకులు.” ఈవాక్యమువలన “స్త్రీకి ఆజన్మాంతమును తనదేహముపై తనకే స్వాతంత్ర్యములేదు” అని ప్రకటీకృతమగుచున్నట్లు మీరు వాక్రుచ్చినారు. “రక్షకులు” అనెడి పదమునకు సరియైన అర్థము గమనించినచో నిట్టిచిక్కు లెన్నడును రావు. ఝాన్సీలక్ష్మీబాయి, తారాబాయి మున్నగు బలాఢ్యులమాట చెప్పిననేమో కాని సర్వసామాన్యముగ మన మబలలము. అబల లన్నంతమాత్రమున స్త్రీ లిక వట్టిపనికిమాలినవారని భావించుటయు వెంగలితనమే. కావున స్త్రీకి రక్షణ ముఖ్యావసరము. అట్టి రక్షణభారము బలవంతుఁడగు పురుషునిపైఁబెట్టుట కేవలము స్వార్థశూన్యమగుభావమునే వెలువరించునుగాని మీరు తలంచినట్లీవాక్యమున

స్త్రీ పురుషునికి బానిసయనియు, స్త్రీకి తనదేహముపై స్వాతంత్ర్యము లేదనియు, స్త్రీ పనికిమాలినదనియు, పురుషునికి స్త్రీపై సర్వాధికార మున్నదనియు ఏకోశమునను లేదు. వేయేల? స్వాతంత్ర్యవిషయమైన భావ మీవాక్యమున కించిత్తైన లేదు.

పదములయొక్క సరియగునర్థము గ్రహించుటకు యత్నింపకపోవుటవలన సాధారణముగ భావములు తారుమారగుట నిజము. ఇందుకు తార్కాణముగ మీరువ్రాసిన పద్యమును చూడుడు:—

"ధని యధనుఁడు రూపసి యొ
ప్పనివాఁ డవివేకి మూఢఁ బ్రాజ్ఞుఁ డరోగుం
డనుగతరోగుఁ డనక యం
గన పతి భావింపవలయు కామధ్వాఁనసీ!"

ప్రతిమానవవ్యక్తికిని నైసర్గికముగనే భగవంతుడు కొన్నికొఱంతల నిచ్చును. దారిద్ర్యము, కురూపము, రోగము మున్నగునవి ఈ కొఱంతలలోఁ జేర్పబడవలసినవే. జమీందారుఁడు కాఁడని కాని, శృంగార పురుషుఁడు కాఁడని కాని, బలవంతుఁడు కాఁడని కాని మన మేవ్యక్తినైనను తప్పుఁబట్టుట వట్టితెలివి తక్కువపని. అట్టి కొఱంతలనుబట్టి ఏమానవునియందైనను ద్వేషమూనుట కాని భావింపకుండుట కాని దుర్మార్గమేయగును. అందుచేత ఈపద్యభావము "ఎట్టికొఱంతలున్నను భార్య మగనిని భావింప వలయు"నని కాని దుర్గుణము లున్నను సహించితీరవలెనని కాదు. "పతియే దైవము, అతఁ డెంత దుర్మార్గుఁడైనను సతి కొలువవలయును" అని దీని యర్థమైనట్లు మీరు వ్రాసిన వ్రాతలలో సిద్ధాంతీకరింపఁ బడియున్నది. కాని దొంగతనము మున్నగు విలక్షణములు మీరు వ్రాసినట్లు "కొంచెముదుర్గుణములు" అని త్రోసివేయుటకు వీలులేనివని రవంత యాలోచించినచో నాకేగాదు మీకును తెలియఁగలదు. అందుచేత మీరు వ్రాసిన రెండుపద్యముల యర్థములను సరిగా గమనించినచో "ధనము లేదని, అందము లేదని స్త్రీ భర్తనుజూచి ఏవగించుకొనఁగూడదు. దొంగతనము మున్నగునవియున్న స్త్రీ వర్జనీయురాలు" అను భావముల నిచ్చునుకాని మీరెంచినట్లు వెడయర్థము లీయవు. స్త్రీపురుషులిరువురపక్షమునను సమానముగ న్యాయమును జూపింపని భావము లచ్చట మనధర్మశాస్త్రములలో కలవని వాదించువారలలో నే నొకతెను. కాని ఇట్టిసద్భావములుకలపద్యముల నుదాహరణములుగ గైకొని స్త్రీ బానిసగా చేయఁబడినదని నిరూపింపఁజూచుట కేవలము పొరపాటు. ఈతీరుననే అపార్థముచేసికొని ధర్మశాస్త్రములను దూషింపఁగడంగుట కేవలము సాహసకృత్య మనిచెప్పుట కేమైనసందేహమున్నదా?

శ్రీమతి విద్యాసుందరి బెంగుళూరు నాగరత్నముగారికి మీరు వ్రాసిన బహిరంగలేఖలో మీరు స్త్రీ లభివృద్ధినొందుచున్నారని సూచించుచు, "అక్కడక్కడ ఉన్నతోద్యోగములలో కొందఱు స్త్రీలు కనఁబడుచున్నారు." అని సందర్భవశమున వ్రాసినారు. మనము విద్యావతులమై చూపిన అభివృద్ధి, శారదాబిల్లువలన కాంచిన ప్రయోజనమును ఉద్యోగములకై యత్నించుటలో కోల్పోయినామని నిస్సందేహముగఁ జెప్పఁగలను. మన కెవ్వరిమీదనైన యనిష్టముకల్గినచో మొట్టమొదట మనము చేయుపని పండ్లికిలించి నవ్వుట. ఇపుడు మన ముద్యోగములకై యత్నించుట ఈవెక్కిరింపులలో జేర్పవలసినదనియే నాయూహ. కళ్లజోడు, కాళ్లజోడు, చేతిబెత్తము మున్నగునవి ధరించుటలోను; ఇంగ్లీషు చదివి ఉద్యోగములు చేయుటలోను

కొందఱుస్త్రీలకు "ఇవి మనకును అవసరములే. అందుచేత మనముసయితము వీని నవలంబింపవచ్చు" ననెడి భావముకంటె "మగవాఁ డవలంబించుచున్నాడా? లేదా? మనముమాత్ర మేల యవలంబింపఁగూడ" దనెడి యహంభావ మెక్కుడుగా నున్నట్లు నాయల్పజ్ఞానమునకు తోఁచుచున్నది. ఆగొంతెమ్మకోరికలలో ఉద్యోగమునుఁ గావలెననుటయు నొకటిగా గణింపఁదగినదే. భగవత్తత్త్వముతెలిసిన కుశాగ్రబుద్ధులు స్త్రీవ్యక్తిని పురుషవ్యక్తిని వేర్వేఱుగ భావింపక, ఇరువుర నేకత్వము నొందించుమార్గమునే వీక్షింతురు. ప్రతిమానవ వ్యక్తికిని చూచుకొనవలసినవిషయములు రెండు; సంసారము, వ్యవహారము. సంసార మింటిలోనిపని, వ్యవహార మింటివెలుపలిపని. ఇంటిలోనిపని, ఇంటివెలుపలిపని,—ఈరెండుపనుల నొకేవ్యక్తి నిర్వర్తింపఁజూచుట కేవల మసాధ్యమగునా కాదా? అందుచేత కుశాగ్రబుద్ధు లీరెండుపనులను స్త్రీపురుషవ్యక్తులిరువురకును విభజింపఁజూతురు. పురుషుఁ డుద్యోగమున కర్హుఁడని ప్రపంచమంతయు నంగీకరించినవిషయమే. కావున "మనము దక్క దక్కినప్రపంచమంతయు వట్టితెలివితక్కువది" అని భావించిననే గాని పురుషుఁ డుద్యోగమున కనర్హుఁడని యనుకొనుటకు వీలులేదు. ఒకవ్యక్తి యొకపనికి 'బూనుకొన్నచో వేఱొకవ్యక్తి రెండవ పనికి బూనుకొనవలయునని గ్రహింపనగును. కావున, యిల్లాలై యుండవలసినబాధ్యత స్త్రీయందున్నది. కాని, అటుయిటుగాక యిరువురును ఉద్యోగములలోనికే వ్రాలు పని అవకతవకయైనపనియని ఘంటాపథముగా నొక్కిచెప్పగలను. మన యిచ్ఛవచ్చినంతవిద్య నేర్చుకొనవచ్చును. మనమును నాటకములకు సినీమాలకు పోవచ్చును. మనమును పుస్తకభాండాగారములకుపోయి గ్రంథపఠనము చేయవచ్చును. ఉపన్యాసము లీయవచ్చును. పత్రికలు చదువవచ్చును. పునర్వివాహముల కనుజ్ఞనీయుడని యడుగవచ్చును. ఆస్తిలో సమమైనహక్కును కోరవచ్చును. కాని ఇల్లువాసి, శిశుపోషణమునురోసి, సంసారమును వేఱొకని చేతిలోనుంచి మనమును ఉద్యోగములకే పరుగిడితిమా; సోలెడుబియ్యమునకు సోదెకు పోఁగా కుంచెడు బియ్యమును కుక్క దిగమ్రింగినదన్నట్లు మనము పూనుకొన్న కార్యమే మొదలంటచెడు నన్నమాట నిశ్చయము.

"గృహలక్ష్మి" యను పదము "కల్లబొల్లితీపుమాటలవలె" నవీననారీలోకమునకు తోఁచియుండవచ్చును. దానికికారణము "గృహలక్ష్మియన వంటపని, ఇంటిపని చేయునది. వంటపని, ఇంటిపని కడు నీచములు." అనెడు అజ్ఞానజనితభావము. శిశువుల మలమూత్రము లెత్తుచున్నప్పుడు, స్త్రీపాకీపని చేయుచున్నదనిచెప్పవలసినప్పుడు; ఇల్లుసరచూచుకొనుచున్నప్పుడు, దాసీపని చేయుచున్నదని చెప్పవలసివచ్చినప్పుడు; రేయింబవళ్లనక, ఇందుకందుకనక, ఇప్పుడప్పుడనక, కష్టపడి గడించి కుటుంబపోషణమును వహించి పురుషుడు చేయుపనిమాత్రము పాపము బానిసత్వముకాదో? చాకిరీ యనుకొన్నచో అన్నియు చాకిరీలే. మన కోక మనము కట్టుకొనుట, మనముద్ద మనము నోటిలో వేసికొనుట చాకిరీయనుట ఎంతఅసందర్భమో, ఇల్లాలు చేయుగృహకృత్యములను చాకిరీయనుటయు నంతయసందర్భమైనమాటయే యని వేఱచెప్పవలయునా? ఉద్యోగములకై యత్నించుటలో మనదృష్టి పాశ్చాత్యులదృష్టి కన్న మఱిరెండుబారలు దూరముగనే పాఱినది. మననాగరికత వారినాగరికతకన్న మించిపోయినట్లున్నది. ఏలనన వారికింకను ఈఉద్యోగవాంఛ ప్రబలముగా నాటుకొనలేదు. ఈవిషయమున వారికి ముందు మనమే మార్గదర్శకులముగానుండ ఇంకను పాశ్చాత్యసోదరీమణులను మార్గదర్శకులగా నుంచుకొనవలసిన యవసరము మనకేల? కావున సరియైన మార్గమును ద్రొక్కిననే మనము విజయము నొందగలము. లేదా మనకిప్పటిగతియే నిశ్చయము.

## ౨

## శ్రీమతి అద్దంకి అనసూయాదేవిగారు

శ్రీమతి విద్యాసుందరి బెంగుళూరి నాగరత్నముగారికి శ్రీమతి వి. సరస్వతిగారు వ్రాసినసమాధానములో ఆంగ్లనారీమణులను మార్గదర్శకలనుగా నుంచుట మంచిదియని వ్రాసినందుకు నాయొక్కవిన్నపము.

సోదరీ! భారతనారీమణులందరు మనదృష్టికి వెగటైరికాబోలు! త్రిలోకములు అంధకారబంధుర మగునటుల ప్రభాకరుని ఉదయించకుండ శాసించిన నారీరత్నము, త్రిమూర్తులుసయితము ఏమి యీ పతివ్రత మాహాత్మ్యము! అని నివ్వెరబొందునటులచేసిన సుమతీదేవి ఈ ఆంగ్లేయయువతులకు సాటిరారా?

"వత్సరమాత్రమే ఆయుస్సుకలదు. అతనిని విడిచి వేఱొకని వరింపు' మన్న "మనోవాక్కాయముల నతనినే నాప్రాణేశ్వరునిగా భావించితిని, ఇతరుల వరించుట తగ" దని సత్యవంతు నేవరించి అతని మరణ మాసన్న మైనదని గ్రహించి అతడు అడవికి వెళ్లుచుండ కష్టమనుకొనక అతని ననుసరించివెళ్ళి సత్యవంతుని యసువుల గొనిపోవవచ్చిన జముని వెంటనంటి ఆయనచే వరములగొని భర్తను లబ్ధజీవితునిగా చేసినదేగాక ఉభయ వంశములవారికి శుభము నొనగూర్చిన సాధ్వీమతల్లిసావిత్రి యీ ఆంగ్లేయయువతులకు సాటి కాజాలదేమి?

ఇంకను దమయంతి, చంద్రమతి, సీత, అనసూయ, అరుంధతి మొదలగు సత్కాంతలు యీ ఆంగ్లేయ యువతులకు సరికాజాలరుగా! పురాణకాంతలసంగతి అట్లుంచి యీమధ్యకాలమునాటి కాంతామతల్లులు, శౌర్యసంపన్నలు, అభిమానవతులు, స్వదేశాభిమానరతలు నైన సంయుక్త, పద్మిని, దుర్గాదేవి మొదలగు యుత్తమకాంతారత్నములు మార్గదర్శికలుగాక ఆంగ్లయువతులు మార్గదర్శకలగుట ఆశ్చర్యముకదా? ఔరా! అట్టి పతివ్రతామతల్లుల చరితలు నేడు హేయములైనవిగదా?

మనము బిడ్డలకు ఉగ్గుపాలతోనే స్వదేశాభిమానరతి నేర్పవలసిన మాతలము. నేడు ఆంగ్లేయుల నడవడి మెచ్చుకొనుచు, వారివలెనే మనము ప్రవర్తించవలసినదని చెప్పుట చాలాశోచనీయము.

సోదరీ! ఒక్కమాట. ఇటుల మనము ముందువెనుకలుచూడక మనసుతోచినది మనము వ్రాయుట మంచిదిగాదు. ఇట్టిమాటలు వినిన ఏమితెలియనిపిల్లలు నిజమనుకొనరా? మనపిల్లలకు మనము సద్బోధనలు చేయవలెనేగాని, ఇటుల నేర్పిన మనవార లేమగుదురో? యోచింపుము.

## ౩

## ఐ. యస్. పి. శర్మగారు

సోదరీ! నీవు గృహలక్ష్మి అక్టోబరు సంచికలో వ్రాసిన స్త్రీ స్వాతంత్ర్యమను వ్యాసమును గాంచితిని. దాన కొన్నివిషయముల పొరపడి వ్రాసితివని గ్రహించితిని. అందు మొదటిది ధర్మకర్తలు పురుష పక్షావలంబకులు అనునది. ఇది విచారణజేయక వ్రాసినది; ఎందుకనగా

(1) సర్వసంగపరిత్యాగులై వనమునదపమొనర్చు మునులు దేనిని వాంఛించి పురుషపక్షము వహింతురు?

(2) వారు పక్షపాతబుద్ధికలవారైనచో అనసూయ, అరుంధతి, సీతాదిమహాసాధ్వీలలామల చరిత్రముల గ్రంథములువ్రాసి జలజాతాసనవాసవాదులకు న్యూనత గల్పింపరు.

(3) యథాపరాథదండనకై నాతిని రాయిగజేయు ధర్మజ్ఞుడు గౌతముడు, సోదరుని ఫలముల నాజ్ఞ లేకకోసి ఆ పాపము బాయుటకై చేతుల ఖండించుకొను ధర్మస్వరూపి లిఖితుడు వ్రాయు స్మృతులు ధర్మే తరము లెట్లగును?

## గాయనిలు



(బొంబాయియందలి ఆచార్యదియోధరు వారి భారత సంగీత పాఠశాలకు చెందిన బాలగాయకులు వారి వారి సంగీత సాధనములతో ఈ మధ్య విల్సను కాలేజీహాలులో జరిగిన తురీయ వార్షికోత్సవ సందర్భమున తీసికొనిన ఛాయాచిత్రము.)

(4) వ్యాసలిఖితమైన భగవద్గీతలో "స్త్రీషుదుష్టాసు వార్ష్ణేయజాయతేవర్ణసంకరః" అని సంఘాభివృద్ధి స్త్రీకరంబున జెట్టనేల?

(5) ఉపనీతుని పురుషపక్షావలంబకులగు ఋషులు 'భవతీభిక్షాందేహి' యని యాద్యభిక్ష స్త్రీయగు తల్లిచెంత గొనఁజేయనేల?

(6) 'నగాయత్ర్యాఃపరంమంత్ర' మని సర్వద్విజులు స్త్రీయగు గాయత్రి నారాధింపు మని చెప్పనేల?

(7) శిక్షాస్మృతిలో "మాతృదేవోభవ" యని ముందుజెప్పి పిదప "పితృదేవోభవ" యని జెప్పనేల?

(8) దాన మొసంగుటలో భార్య దానోదక మొసంగినగాని ఫలములేదని గ్రంథముల వ్రాయనేల?

(9) బాలునే యుపనీతు జేసి మధూకరవృత్తిచే గురుని గురుభార్యను బూజింపుమని విధింపనేల? బాలికకు మధూకరవృత్తి నెందుకు నియమింపరాదు?

(10) పురుండొనర్చుపాపములు స్త్రీకి చెందవనియు, స్త్రీపాపములు భర్తకు జెందుననియు, స్త్రీసత్కర్మల ఫలము పురుషునకు జెందదనియు, పురుషసంపాదితపుణ్యము స్త్రీ కబ్బుననియు పురుషపక్ష మవలంబించి నచో వ్రాసియుందురా? (వాల్మీకిజీవితము)

(11) వివాహసంబంధమున యరుంధతిదర్శనము జేయుమని వధూవరుల ఋషులు శాసింపనేల?

(12) ఋషులు స్త్రీల ద్వేషించుచో మనసంఘసంస్కర్తలు పల్కునటుల స్త్రీవిధవాపునర్వివాహములకు వారు సమ్మతించి యెట్లుందురు?

ఈ కారణములచే స్మృతికర్తలు ధర్మరతులుగాని ఇరువదియవశతాబ్దపు పాశ్చాత్యభాషామోహితుల వలె పక్షపాతులుగారు. తిరిగి ఒకసారి దీర్ఘముగ నాలోచింప కోరెదను.

# జోలపాట

రంగాజమ్మ

జో జో జో రాజగోపాల! జో జో జో జితశిశుపాల!
జో జో జో గురుశిశుపాల! జో జో జో ......మాపాల
జో జో జో బాణాసురారి! జో జో జో చాణూరవైరి!
జో జో జో వేణుగానానుకారి! జో జో జో శోణపద్మావిహారి!
జో జో జో గోపికాజార! జో జో జో నవనీతచోర!
జో జో జో జగదాధార! జో జో జో నందకుమార!
జో జో జో రమణీయశీల! జో జో జో సత్యభామావిలోల!
జో జో జో యనుపమలీల! జో జో జో యదువంశబాల!
జో జో జో మహితానుభావ! జో జో జో యతులప్రభావ!
జో జో జో సత్త్వగుణస్వభావ! జో జో జో మన్నారుదేవ!

—'మన్నారుదాస విలాసనాటకము' నుండి

# స్త్రీ విద్య

శ్రీమతి కొత్తపల్లి లక్ష్మీకాంతమ్మ గారు

ప్రపంచమున సర్వత్ర పురుషమాత్రులకే విశేషముగా విద్యాప్రభావము తెలియునని ఛాందసమహానుభావులు కొందఱు తమతమ యభిప్రేతములను పత్రములపై పసపసగీచి పత్రికలకు బంపుచుండిరి. అట్టివారికి విద్యాపదమునకు స్పష్టమైన యర్థము తెలియకుండె ననుకొనియెదను. "విత్" ధాతువున కర్థమేమి? జ్ఞానమని కదా? జ్ఞానమొసగునది భగవంతుడు గదా? అతడు స్వీయనిర్మితజీవలోకమును జ్ఞానయోగ్యులనుగాక నజ్ఞానయోగ్యులనుగా నొనర్చునా? నిజముగా నిది పరాత్పరుని యాశయమేనా? పూర్వాచారపిశాచావేశితనిశాచరుల యాశయమా?

పూర్వకాలమున సైతము ప్రసిద్ధివహించి నవీనవిపరీతకాలపరిస్థితులలో సైతము పేరుమాయక నవక మెగజిమ్ము యశముగాంచిన దమయంతి, సీత, ద్రౌపది, అనసూయ—ఇత్యాది పతివ్రతామతల్లుల పవిత్రచరిత్రములు సదాశ్రోత్రములను అనవద్యవిద్యాప్రసాదితపాతివ్రత్యసుధారసమునకు పాత్రములుగా నొనర్చుటలేదా? ప్రాభాతికగీతికలలో నావీరవనితల పునఃపునరాలాపములు సహృదయహృదయానందసంజనకములగుట లేదా?

రుద్రమదేవి, ఝూన్సీమహారాణి మొదలగు వీరవనితాలోకము నొక్కసారి విలోకింపుడు. నిజహృదయమనోజుడు నశించిపోగా నొక ప్రక్కన శాత్రవానీకంబు రాజ్యమును చుట్టుముట్టగా నంతరమున ప్రకృతిలోకమువలన నంతఃకలహము లంతకంతకు మేరమీరుచుండగా జేయునదిలేక విశ్వాసపాత్రులైన వీరులను స్వీకరించి ఖడ్గపాణినియై ఉత్తమతురంగంబు నధిరోహించి కదనసదనమున నృత్యమాడి సమస్తరాజ్యమును సమగ్రముగా జయించి నిర్వహించి వీరాతివీరుడైన ప్రతాపరుద్రమహీపాలదౌహిత్రభుజాకంధరమున నునుపలేదా!

ఝూన్సీమహారాణియో తుదకు తన ప్రాణముల సైతమువదలి చిరస్థాయిగా స్వర్గమలంకరించినది గాని యాలమున వెనుదీసినదియా? శత్రుధాటీనివారణనిపుణత, సమస్తరాజ్యపరిపాలనాపాటవము విద్యలేమి వారికెట్టులలవడును?

సనాతనకాలమున గార్గి, ప్రాతిథేయి, అవంతిసుందరి, గంగాదేవియు మొదలుగాగల కవయిత్రుల రచనాచమత్కారమును, రమణీయపదవిన్యస్తనాతిదీర్ఘసమాసముల సొంపు బెంపును కడుంగడు హృదయంగమములు.

> వాణీపాణి పరామృష్ట వీణానిక్వాణహారిణీం
> భావయంతి కథంవాన్యే భట్టబాణస్య భారతీం
> విహర్ద వ్యక్తసౌరభ్యా భారతీ భారవేఃకవేః
> ధత్తేవకులమాలేవ విదగ్ధానాంచమత్క్రియాం.
>
> —గంగాదేవి.

పాఠకులారా! ఒక్కసారి వీక్షింపుడు. కాంతాలోకమున చిత్రకళ పూర్వ మెటు లుద్దీపించినదియో?

> కలకలనవ్వినట్లు తెలిగన్నుల నిక్కముచూచినట్లతో
> బలుకగడంగినట్లు కడుభావగభీరత లబ్బినట్లు పెం
> పొలయ దనర్చి జీవకళయుట్టిపడన్
>
> —ప్రభావతీప్రద్యుమ్నము.

ఏతాదృశనైపుణి వారికెట్టు లలవడినది? పూర్వాచారము పూర్వాచారమని మాటిమాటికి పలవించినను వారి వాదనలో సార మూరకపోయెను గదా?

నేటి పరిస్థితుల నవలంబించి విద్యయందైన స్త్రీలకు స్వాతంత్ర్య మొసగగూడదా? పతివ్రతామతల్లుల చరిత్రములు, పాకశాస్త్రములు పఠించి సుగుణములు, పాకనైపుణ్యము నేర్చుకొనుట కనుకూలముగనైన విద్యాదాన మొనర్పరాదా?

ఆపన్నసత్వయై యల్లాడునాడు గర్భమునకు హానిరాకుండ గృహకృత్యములెఱిగి నడచుకొను టనవసరమా?

పాఠకులారా? మీరలే యొక్కసారి సర్వమొక్కటని భావించి యూహింపుడు.

విద్య యలవడినకొలది పతియందు భక్తి, సర్వసోదరత్వము సమకూడుచుండునా? వామపథావలంబినులైన స్త్రీలకు విద్యయున్నను లేకున్నను వారు సదాచారమును మరచియేయుందురు; గాని యొకప్పు డట్టివారు సైతము చరిత్రలవలన సుగుణవతులు గావచ్చును. శివాజీ మొదలైన శత్రువీరభయంకరులకు వీరరస మెవ రుగ్గుతోబోసిరి? మాతయే గదా? మన దేశమంతయు పౌరుషప్రధానమై జాతీయతాధ్వజోన్నతమై విమల యశశ్చంద్రిక లాశాంతముల నాశాంతముగ ప్రజ్వలింపజేయవలయుననిన స్త్రీలకు విద్యప్రధానమని గ్రహించునది. గ్రహించియట్లులొనర్చునది; ఒనర్చి వాంఛితఫల మందునది.

# నవ్వులాటలు

## తాత కృష్ణమూర్తిగారు బి. యె; యల్. టి.

### గొడుగు

టౌనుహాలులో నారోజీదాసుగారి హరికథ. ఊరు ఊరంతా వెళ్లినారు. దీపాలుపెట్టే వేళకి హరికథ పూర్తిఅయింది. వర్షం కురుస్తూవుంది. నేను గొడుగు తీసికొనిపోనందున తెలిసిన మిత్రుడెవడైనా కనిపిస్తే వాడి గొడుగులో దూరుదామనుకొని రోడ్డుమీద వడివడిగా నడుస్తున్నాను. ఆకనుచీకట్లో యెవరినీ సరీగా ఆనవాలు పట్టలేకుండా వున్నాను. నాకు పదడుగుల ముందుగా యెవడో యువకుడు మంచిసరిక్రొత్త గొడుగు వేసుకొని చురుకుగా పోతున్నాడు. వాడు మా విశ్వనాథమే కాబోలనుకొని గబగబవెళ్లి భుజంమీదతట్టి "ఏదోయి! గొడుగు ?" అని చనువుగా గొడుగుపట్టుకున్నాను.

"చిత్తం!......తమరిదా, అండి, యీ గొడుగు? పొరపాటయింది. క్షమించండి." అంటూ వాడు గొడుగు నాచేతిలోవదలి వెనక్కితిరిగి ఆ చీకట్లో మాయమైనాడు.

### శారదాబిల్లు

"శాస్త్రుల్లుగారూ! పోనీ యీ బిల్లువలన మీకు కలిగేనష్టం యేమిటో సెలవియ్యండి ?"

"నష్టం, అని మెల్లిగాఅంటారేమిటి? ఇదివరకే మనలో అన్యాయాలు లావయినాయి. పన్నెలుగు, పదిహేను యేళ్లవరకు ఆడపిల్లని యెదగనిస్తే యింకా చెప్పేదేమిటి? నాలాటి వయసుమీరిన వరుడు గతి యేమిటి? పదిపన్నెండేళ్లపిల్లని అడగవెళ్లితేనే అది మూతిముడుచుకుంటూవుంది 'ఛత గాడా, పెళ్లికొడుకు!' అని మనసులో తిట్టుకుంటూను. ఇక బాగాజ్ఞానం, యవ్వనం, వచ్చిన పెళ్లికూతురు. చూస్తూచూస్తూ నాబోటి ముసలివాడిచేత పుస్తె కట్టించుకుంటుందా ?"

### అదృష్టవంతుడు

ఒకానొక లైఫ్ఇన్సూరెన్సుకంపెనీ ఉద్యోగస్థుడు నన్నొకపోలసీ తీసుకోమని ప్రాణాలుతీస్తూవుంటే "అయ్యా! నన్నెందుకు బలవంతంచేస్తావు? నాకు యెప్పుడూ డబ్బుకోసం యెటాముటీగానే వుంటుంది. ఇప్పుడొకవేళ సాహసించి నేనో రెండువేలకి భీమాచేసినా యేనెలలో పైకం వేళకి చెల్లించలేకపోతానో అని యావజ్జీవం భయపడుతూనే వుండాలి. కాబట్టి నన్ను వదలి మా భోగారావును పట్టుకోండి. వాడు చిన్నవాడు, డబ్బుకలవాడు, మంచిప్రయోజకుడున్నూ." అన్నాను.

"అతనిని ఆశ్రయించి లాభం లేదండి. ఆయన లక్ష్మీపుత్రుడు. అదృష్టదేవతకు ముద్దుకొడుకు. ఆయన పట్టినదల్లా బంగారం అవుతుంది. ఇప్పుడతనిచేత పదివేలరూపాయలకు ఇన్సూరుచేయించానంటే, యేంజరుగు

తుందో తెలుసునా, అండి? ఒకయేడో, రెండేళ్లో ప్రీమియములు సరీగా చెల్లిస్తాడు. ఆ వెనక హఠాత్తుగా మరణిస్తాడు. హాయిగా చచ్చికూచుని 'తే, నా పదివేలు అచ్చుకో!' అని యెదురుతిరిగితే కంపెనీకి యెంత నష్టమో ఆలోచించండి.''

## లెక్కల పరీక్ష

మాస్టరు—అబ్బాయీ! పళ్లెంలో మూడు మిఠాయిఉండలు ఉన్నవనుకో. పిల్లివచ్చి ఒకటి యెత్తుకో పోతుంది. ఇంకా యెన్నివుండలు మిగులుతవి?

బాలుడు—అన్నీ మిగులుతాయి.

మాస్టరు—అన్నీ యెందుకుమిగులుతవి? ఒకవుండ పిల్లి యెత్తుకోపోతుందికదూ?

బాలుడు—పిల్లిని నేను పళ్లెందగ్గిరకి రానియ్యను. కర్రతో కొట్టి తోలేస్తాను.

మాస్టరు—నువ్వు అప్పుడు ఇంట్లో లేవనుకో. పిల్లివచ్చి ఒకటి తినేస్తుంది. ఇంకా ఎన్నిమిగులుతవి?

బాలుడు—నేను లేకపోతే నాన్న ఉంటాడు. నౌకర్లు వుంటారు. ఎవరున్నా, లేకపోయినా మా నాయనమ్మ తప్పకుండా సావిట్లో కూచుంటుందికదా, వొచ్చి, పిల్లిమిఠాయివుండలు యెత్తుకోపోతూఉంటే చూస్తూ ఊరుకుంటుందా?

మాస్టరు—(కోపంతో) అబ్బాయీ! ఎవరూ చూడకుండా వచ్చి పిల్లి తినేస్తుందనుకో.

బాలుడు—అయితే, ఒకటీ ఉండదు!

మాస్టరు—ఏమి? మూడుఉండలలోనూ పిల్లి ఒక్కటేగా తింటుంది?

బాలుడు—ఎవరూ చూడకుండా ఉంటే పిల్లి ఒక్కటిమాత్రం తిని వెళ్లిపోతుంది? అన్నీ కాజేస్తుంది.

మాస్టరు—అదికాదు. పిల్లి ఒకటి తినగానే నువ్వు లోపలికి వచ్చావనుకో. మిగతావి పిల్లిని తిననియ్యకుండా తోలేస్తావనుకో. అప్పుడో?

బాలుడు—అప్పుడైనా ఒకటీ మిగలదు. మిగిలిన రెండుఉండలు నేను తినేస్తాను. నాకు మిఠాయివుండలంటే మహా యిష్టం!

## చదువు

''మీ కుమారుడు బి. యే. చదువుకుందుకు చెన్నపట్నం వెళతాడా''?

''అవునండి''

''ఏమిటి తీసుకుంటాడు?''

''మెరకపొలం సిస్తు అంతాను.''

## ముక్కుపొడుము

''డాక్టరుగారూ! పొడుం పీలిస్తే, మెదడు చెడుతుందంటారు కదా నిజమేనా?''

''అబ్బే! అబద్ధం...... మెదడున్నవాడెవడూ పొడుం పీల్చడుగా?''

## దివ్యదృష్టి

ప్లీడరు—చిట్టచీకట్లో అరమైలుదూరంనుంచి, నువ్వు సరీగా చూడగలిగినావా?

సాక్షి—అందులో ఆశ్చర్యం యేమున్నదండి? వందలకొలది మైళ్లదూరం మనం నిత్యం చూస్తూ వుండలేదూ?

ప్లీడరు—అసందర్భం!

సాక్షి—ఏమండి? నక్షత్రాలు మీరెన్నడూ చూసివుండలే? అవి మనకి యెంతదూరంలో ఉన్నాయని మీ అభిప్రాయం?

# సరస్వతి కష్టములు గట్టెక్కుట

శ్రీమతి మాగంటి శకుంతలా దేవిగారు

## ౧

ఒకనాటి సాయంకాలమున రాజేశ్వరరావను నవయువకుడు తనస్వగ్రామమును జేరుటకై గూడూరు స్టేషనుచేరెను. తాను వెడలనున్న ధూమశకటముయొక్క రాకకొక గంట వ్యవధి యుండుటచే నాతడు జనులయొక్క రాకపోకలను పరీక్షించుచూ నిటునటు తిరుగుచుండెను. ఆ సమయమున దుఃఖితవదనయైయున్న యొక యువతిని గాంచి యాపెవృత్తాంత మారయ నుద్యుక్తుడై యడుగ సాహసింపలేక మరల తిరుగ నారంభించెను. ఇంతలో నామెకు దుఃఖ మతిశయించి బాష్పబిందువులు రాల జొచ్చెను. ఆమె దుస్థితిని కనులారగాంచిన రాజేశ్వరరావు సాహసించి ఆమెను సమీపించుచుండగా చాల సేపటి నుండి యామె ఒంటరిగా నుండుటచూచి దురుద్దేశపూరితుడైన, రక్షకభటు డొకడువచ్చి యామె నీక్రింది విధమున ప్రశ్నించుచుండెను.



శ్రీమతి మాగంటి శకుంతలా దేవిగారు

"మీదేయూరు? మీతో నెవ్వరైనగలరా?"

"ఏమి? నేనుగలను" అనిరాజేశ్వరరావు జవాబొసగెను. రక్షకభటుడు తత్తరపాటుతో "స్త్రీలు ఒంటరిగానుండిన ప్రమాదము జరుగునని ప్రశ్నించితి" నని ప్రత్యుత్తర మొసగెను.

తనకును, ఆమెకును సంబంధములేనట్లాయువతి చెప్పునేమో యనెడిభయము రాజేశ్వరరావు మనమున లేకపోలేదు. వెంటనే యారక్షకభటుడు విఫలమనోరథుడై వెడలిపోయెను. రాజేశ్వరరా వామె నీవిధముగ నడుగనారంభించెను. "అమ్మా! నీ విచ్చట నొంటరిగా నుండి దుఃఖించుటకు కారణమేమి? నీకిచ్చట తోడెవరునులేరా?"

యువతి మౌనవతియై యూరకుండెను. అంతటితో రాజేశ్వరరావూరకుండక మరల ఇట్లు పలుకరించెను.

"తల్లీ! మౌనవతివై యుంటివేమి? నీవు విచారహృదయముతో నుండుటజూచి నాచేనైన సహాయమును జేయనెంచి నిన్నిట్లడుగుచుంటిని."

ఆయువతి వెక్కి వెక్కి యేడ్చుచూ "నాకిచ్చట సహాయులెవరూ లే" రనెను.

"అటులైన నీవెట్లువచ్చితివి?"

"నాసోదరునితో వచ్చితిని."

"నీసోదరు డెచ్చట నుండెను?"

"నన్నిచ్చటవిడిచి వెళ్లెను."

(ఆశ్చర్యమగ్నుడై) "ఏమి? నిన్నుఒంటరిగా విడిచి వెళ్లెనా?"

"అవును"

"అటులైన నీవిప్పుడేమి చేయనెంచితివి?"

సరస్వతి మిన్నకుండెను.

"సోదరీ! ప్రస్తుతము మాగ్రామమునకు రమ్ము. అచ్చటినుండి నీవెచ్చటకేగెదవన్న అచ్చటకు బంపెదను."

యువతి అంగీకారసూచన తెల్పెను. ఇంతలో బండికి టైముఅగుటజూచి టిక్కెట్లు తీసికొని బండికిరాగానే ఎవరి నియమితస్థానములయందు వారాసీనులైరి. బండి నడచెను.

రాజేశ్వరరావుగారి స్వగ్రామమైన తెనాలిజేరిరి. అశ్వశకటముపై వీరిరువురును రాజేశ్వరరావుగారి మిత్రులగు మోహనరావుగారింటికి వెళ్లిరి. యువతిని మోహనరావు గారి గృహమునయుంచి రాజేశ్వరరావు తాను స్వగృహమునకేగెను.

౨

శ్రీరాములుగారు సనాతనధర్మపరాయణులు. వీరి కిరువురు కుమారులుగలరు. పెద్దకుమారుడైన రాజేశ్వరరావు సంఘసంస్కర్త. రాజేశ్వరరావు ప్రవర్తన తండ్రికి సరి పడకుండెను. ఇట్లున్నను తన పట్టును వీడక రాజేశ్వరరావు విధవావివాహములయందును అందుకు సంబంధించిన యుపన్యాసములిచ్చుటయందును మిక్కిలి పట్టుదలతో మెలగు చునే యుండెను. ఇందుచేత తనకుటుంబమునకేమైనహాని గల్గునేమోయని తండ్రి మిక్కిలి భయపడుచుండెడి వాడు. తండ్రికి మరింత కష్టము కలుగజేసిన వాడనగుదుననిన్నీ, భార్యయైన వరలక్ష్మమ్మకేమైన సందేహము గలుగునేమో యను తలంపుతోను యువతిని తనమిత్రుడైన మోహనరావుగారింటివద్ద నుంచెను. మోహనరావు స్వతంత్ర గృహస్థుడును, ధనసంపన్నుడును అయి ఉండెను.

సంఘసంస్కరణమునం దతియుత్సాహిమై యనాథల బ్రోచుటయందును, విత్తం తూద్వాహములు జరిపించుటయందును, తన స్వంతద్రవ్యమును వ్యయపరచి శరీరశ్రమ కోర్చుచూ తాను నమ్మిన ప్రతిమంచికార్యములోను మిక్కిలి దీక్షాపరుడై మంచిపేరును గడించెను.

మోహనరావు భార్యయగు సావిత్రిగూడ చాలవివేకవతి. విద్యలయందును గృహ కృత్యములయందును మిగుల నేర్పరియై పతియొనరించు ప్రతికార్యమునందును బహు యుత్సాహముగలదియై శక్తివంచన లేక తోడ్పడుచుండెడిది.

## 3

మరునాడు రాజేశ్వరరావుగారు సాయంకాల మూడుగంటలవేళ మోహన రావును కలుసుకొనెను. వారుభయులు ఆమెయున్న మేడపైగదిలోనికి వెళ్లిరి. వీరి రాకనుజూచి ముసుగుతో పరుండియున్న యాయువతి దిగ్గునలేచి కూర్చుండెను. వారి కోర్కెప్రకారము తన వృత్తాంత మంతయు నీవిధముగ చెప్పదొడంగెను.

"నాజన్మస్థానము బందరు. నేనొక బ్రాహ్మణస్త్రీని. నాపేరు సరస్వతి. నాతండ్రిపేరు రామశాస్త్రిగారు, మాతల్లి లక్ష్మిదేవమ్మ. సోదరుడు గోవిందరావు. మామాతాపితలకు మేమిరువురమే. నా అత్తవారు సికింద్రాబాదు. వివాహమయిన ఆరుమాసములకే నాభర్తగతించెను.

అప్పటినుండియు నేను నాపుట్టింటనే యుంటిని. నా అత్తవారు నాభర్త గతించిన తరువాత నన్నెన్నడును తీసికొని వెళ్లలేదు. నాభర్తగతించి నాలుగువత్సరము లయినది. నేను పుట్టింటనుండుట నాసోదరునకు, నావదినకు చాల కష్టముగా నుండి నన్ను మిక్కిలి దుర్భాషలాడుచుండెడివారు. చాలకాలము సహించి యూరకుంటిని. ప్రాతిఫల మిట్లుండెగదాయని కాలము బ్లిగడపుచుంటిని. వారు పెట్టుబాధలు నానాటికి వృద్ధి యగుచుండెను. నావదినగారి దుర్బోధనల చేతనో, లేక నాసోదరుడు తనదురాలోచన చేతనో తిరుపతియాత్రయను మిషతో నన్ను గూడూరుస్టేషనున దిగవిడిచి తానెటుబోయెనో తిరిగి కానరాడాయెను. సోదరునిచే పరిత్యజింపబడినందునకును, దరిద్రదేవత నన్ను వెంటాడుచున్నందుకును విలపించుచుండగా మహానుభావులగు రాజేశ్వర రావుగారి దయకు పాత్రురాలనైతిని." ఇట్లు చెప్పుచుండ ఆమెకు బాష్పములు రాల జొచ్చెను. దుఃఖ మధికమయ్యెను.

"సోదరీ! దుఃఖింపకుము. గతించినవాటికి వగచిన లాభమేమి? దైవ విధికి పాత్రులముగదా? భవిష్యత్తునుగురించి యాలోచించవలెను. అమ్మా!

మేమడుగు ప్రశ్నలకు జవాబొసంగుము. నీవిప్పుడేమి జేయ నెంచితివి?" అని రాజేశ్వరరా వడిగెను.

"నేనా? నాకేమియు లేదు. నా కాత్మహత్యదక్క వేఱుదారి లేదు. కావున మీరు నన్ను కాపాడకండి. నాత్రోవ నేను జూచుకొనెదను. సెలవొసంగుడు."

"అమ్మాయీ! నీకెన్నికష్టములు సంప్రాప్తమయినను నీవిట్టితలంపు పెట్టుకొనరాదు."

"సోదరికన్నమిన్నగ భావించి నన్నుగాపాడిన యోసహోదరులారా? నన్నీ విధమున మీరెంతకాలము గాపాడెదరు? యిప్పటికే నావల్ల మీకు చాలశ్రమగలిగె"నని యింకేమియో జెప్పబోవుచుండ వారిరువు రిట్లన దొడంగిరి.

"సోదరీ! అట్లనవలదు. మాకిదియొక శ్రమయా? నిన్నింతగ గాపాడుట కూడ నీకష్టములు కడతేర్చి నిన్నొక సంపన్నునకిచ్చి వివాహముజేసి మేము సంతోషించవలయునను కోరిక తోడనే" యని చెప్పి వారిరువురును తమ యావచ్ఛక్తిని వినియోగపఱచి యెట్టకేలకామెను పునర్వివాహమున కొప్పించగల్గిరి.

౪

ఒకనాటి ప్రాతఃకాలమున గోవిందరావుగారు తన స్వగృహములో నొకచిన్న గదిలో కుర్చీపై నాసీనులై వార్తాపత్రిక జదువుచుండ నిరువురు మిత్రులు వచ్చి యిట్లు సంభాషింప దొడంగిరి.

"గోవిందరావుగారూ! మీ రీసాయంకాలము జరుగబోవు సంఘసంస్కరణ సభకు బోదలంచితిరా?"

"ఏమీ? సంఘసంస్కరణసభయా! ఇందుకు సంబంధించిన సభలకు నేబోవ నవసరము లేదు. స్త్రీ పునర్వివాహవిషయమై నన్నొప్పించగలవారెవరును గానరా"రని ఖండితముగ జెప్పుచుండగా నొకజవానువచ్చి గోవిందరావుగారి కొక జాబునిచ్చెను. విప్పిచూచి ఈవిధమున జదువదొడంగెను.

"మహాశయా!

తమరీపురమున పెద్దమనుష్యులగు వారిలో నొకరై యున్నారు. పునర్వివాహ విషయమై తమతో మాట్లాడ కుతూహలపడుచున్నాము. కాన సాయంకాలము మూడు గంటలకు సభ జరుపనిశ్చయించితిమి. మీరీలోపుగనే మమ్ముల నొకసారి కలుసుకొన ప్రార్థించుచుంటిమి.

ఇట్లు

సంఘసంస్కరణాభిలాషి, మోహనరావు."—

"ఏమోయీ! శేషాచలం. సమయమునకే జాబువచ్చెనే? సరే మాత్రము. పోయి మాట్లాడెదను. మీరుకూడపోయి శేషాకమూరు రండు. నేను స్నానపానాదులొనర్చి ప్రచారకుల కలియుదు" నని గోవిందరావు చెప్పెను. గోవిందరావు తన పనుల నెరవేర్చుకొని ఉపన్యాసకుని బసకరిగెను. సంఘసంస్కర్తయగు మోహనరావుగారు వీరి రాకనుజూచి "అయ్యా! రండు. ఇందుపై యాసీనులుగండు" అని యచ్చటనే ద్వారము వద్దనున్న నొకకుర్చీని జూపెను.

అందరు నొకింతసేపు ప్రపంచధర్మమునుగురించి ముచ్చటించినపిదప ప్రచారకు డిట్లనియెను.

"గోవిందరావుగారూ! ఈ పురమందు మేము సభ నేర్పఱచుచున్న కారణము మీరుకూడ నిందు పాల్గొని మాకు తగుసాహాయ్యముచేయుదురని యే. స్త్రీ పునర్వివాహ విషయమై మీ యభిప్రాయమేమి?"

"నా కట్టి వివాహములన్న సరిపడదు."

"ఎందుచేత?"

(ముఖము చిట్లించుకొనుచూ) "స్త్రీ. పునర్వివాహము మనసమ్మతముగ లేదు. దానిని మనధర్మశాస్త్రము లొప్పవు. అదియునుగాక ప్రథమభర్తతో కాపురముచేయు భాగ్యము లేని యువతికి పునర్వివాహమొనర్చినచో నట్టియదృష్టము నిలచునా? మన హిందూ నారీమణులలో భర్తగతించిన తరువాత విధవలుగానుండి భర్తృగాంధ్రయై యుండినచో భర్తయాత్మకు శాంతినొసంగిన వారగుదురు."

"ఆలాగా? విధవల నావిధముగ నాదర్శముగనుంచవలయు ననియేనా మీ యభిమతము? అట్లుండురను గట్టినమ్మకము మీకు కలదా?"

"ఆ! లేకేమి? అట్లుండురనియు, మనవారిలో చాలమంది దట్లుజేయుచుండి రనియే నా దృఢనిశ్చయము."

"మీ యభిప్రాయమును నేను విశ్వసింపజాలను. ఈ యత్యాచారముల వలన కొందరు హిందూయువతీమణులు వ్యభిచారిణులగుటయే గాక ఆత్మహత్యలకుగూడ లోనగుచున్నారు."

"మన హిందూగృహముల యందట్టివిధవలు పూజనీయులై యుండి మాతృ గృహకృత్యములందు సర్వాధికారిణులై మెలంగుట కనులార గాంచుచుంటిమి. కొందరు

స్త్రీలు వ్యర్థురాండ్రగుచున్నారన్న సంగతి వ్యక్తికిజెందిన విషయమేగాని హిందూసంఘమున కేమాత్రమును వర్తించదు.”

“మిమ్ముల నాధారపడి యొకయువతియున్నచో మీరటు లాదర్శముగ నుంచుదురా?”

“ఆహా! సందియమేల? నాకొక విధవసోదరి యుండెడిది. ఆమె కొంతకాలము క్రిందటనే శ్వశురగృహముననే గతించె”నని యింకేమియో జెప్పుచుండ గోవిందరావు ఆసీనుడైయున్న కుర్చీ వెనుక తలుపు తెరువబడి యకస్మాత్తుగ నొకనారీరత్న మిటుల సంభాషింపజొచ్చెను.

“రామశాస్త్రి, లక్ష్మీదేవమ్మగార్ల పుత్రికయైన యభాగినియగు సరస్వతి మరణించె ననుకుంటివా? లేదు సజీవియైయే యున్నది.”

గోవిందరావాశ్చర్యమున ఖిన్నవదనుడై తలక్రిందికి వ్రాల్చెను. మరల సరస్వతి ఇటులని చెప్పసాగెను.

“కొందరు వితంతువులు మాతృగృహమున సర్వాధికారిణులై మెలంగుట కనులార గాంచుచుంటిమని పలుకుచుంటివా? సర్వాధికారిణులన నీసోదరిని నిరాధారముగ గూడూరుస్టేషనున దిగవిడచుటయా? స్త్రీపునర్వివాహములు మన ధర్మశాస్త్రము లొప్పవని చెప్పుచుంటివి. మాయోపాయముపన్ని విధవసోదరిని వెంటనిడికొని ఒంటరిగా విడచిరమ్మని నీ కేహిందూశాస్త్రములు బోధించెను? విధవలు భర్తురాండ్రై మెలంగుదురనుచుంటివి. భర్తురాలనై మెలగుటకేనా తీర్థయాత్రయను మిషచే నట్టేట ముంచితివి? ఓ పూర్వాచారపరాయణులారా! ఇంకెంతకాల మీపట్టుదల. ఈ బాలవితంతువుల శ్రమలు మీకు నేత్రానందముగ నుండెనా? మా కష్టము లెఱింగికూడ నరకకూపమున బడద్రోయుచుంటిరా? ఇకనైనను మీ గట్టినమ్మకములను బారద్రోలి మా సుఖదుఃఖముల నెఱిగియుండుదు గాత. సంఘసంస్కర్తలారా! మీ రిట్టి యుద్యమములందు పాల్గొని ప్రచారముజేసి పునర్వివాహము లొనర్చుటలో వితంతువుల పాలిటి కల్పవృక్షమని వేరుగ జెప్పవలయునా! మన హిందూసంఘమందలి మాలిన్యము బోగొట్టి స్త్రీ పునర్వివాహములుజేయించి పుణ్యమును గట్టుకొనుడు. సోదరీమణుల నధోగతిపాలుచేయు కూరులను సంఘమేల బహిష్కరింపదో గదా? రామమోహనరాయలు మొదలగు పురుషులు జన్మించిన యీ భరతభూమి నేడిట్టి దుష్టుల కాలవాల మయ్యెనా?”

అంతట గోవిందరావు కంపితస్వరముతో "సోదరీ! యిట్టి దూషణవాక్యములచే నన్నేల పాతాళమున కణగద్రొక్కెదవు. ఈయపరాధి నింకను క్షమింపవా? దుర్మదాంధుడనై యట్లొనర్చితిని."

అంతట సరస్వతి మిగుల క్రోధముతో "నీకొక సోదరి గలదా? ఇంత దుర్మార్గ మొనర్చిన నీవు నాకెట్టి సోదరుడవు? ఆనాడు రైలుస్టేషనున దుఃఖించుచుండ నాదుఃఖమే తనదుఃఖముగ భావించి నన్నుగాపాడిన ఈ రాజేశ్వరరావుగారే నా సోదరులు."

"సరస్వతీ! సరస్వతీ! నేనును నీసోదరుడను."

"నీవా? నీవు నాకు సోదరుడవా? నీవు ప్రథమజన్మమున సోదరుడవై నరకమున బడద్రోయగా స్వర్గమునకు దారిజూపి నీ యెదుట గూర్చునియున్న కాంతారావుగారి కిచ్చి పునర్వివాహముగావించిన రాజేశ్వరరావుగారే నా నిజమగు సోదరుడు."

"సోదరీ? నీవేదిచెప్పినను యొనర్ప సంసిద్ధుడనై యున్నాను".

"అట్లైన నీవీదినము మొదలుగా, సంఘసంస్కర్తవై స్త్రీపునర్వివాహము లందు నీయావచ్ఛక్తిని వినియోగించెదనని శపథము చేయుము."

వెంటనే గోవిందరావొక పుస్తకమును చేతనిడికొని చెల్లెలియాజ్ఞప్రకారము, శపథము చేసెను.

# శారదాబిల్లు ప్రశంస

## శ్రీమతి బి. జ్ఞానాంబగారు

భారతీయులు ధర్మంబు బాయలేని తొలగిపోవును వైధవ్యదుఃఖసమితి
వీరనారులు పతిభక్తి విడువలేని బాసిపోవును వరకట్నబాధలింక
సత్యదేవత దేశంబు సడలలేని బీదసాదలు హాయి జీవింపుచుంద్రు
శారదాబిల్లు తీవ్రమైసాగుగాక! విపులసుఖమబ్బు శారదాబిల్లువలన.

# మార్పు

## శ్రీమతి వెంపాటి జానకీదేవిగారు

సాయంత్రము పుష్పలత వంటఇల్లు ఊడ్చి మడికట్టుకోడానికి ప్రయత్నం చేస్తూవున్నది చీకటిపడితే పిల్లలు హడావిడిచేసి ఆకలికి ఏడుస్తారని. ఇది అంతా చూసింది లీలావతి. ఇహ కోపంపట్టలేక పిల్లలమీద పెట్టి ఆరంభించింది. "మీకు ఎంతతిన్నా వంటఇంటిమీదే ఉంటాయి ప్రాణాలు. సాయంత్రం అయిదుగంటలేనా కొట్టనివ్వరు సరిగదా, అన్నం దగ్గరకు రాగానే వాడూమీరు కలిసి పోట్లాడడం. ఏదైనా చెప్పితే తప్పు ఎట్లాగో ఈకాపురం చెయ్యడం. నాకు మీవల్ల చావువచ్చింది." అని బిగ్గరగా ఇంట్లోమొగవాళ్లు వినేటట్టు ప్రారంభించింది సాధింపు. ఇదంతా అర్థంచేసుకుని పుష్పలత ఖిన్నురాలై ఏమీమాట్లాడకుండా తన పని చేసుకుంటూ వున్నది అవతల తనమాట భర్త వింటే ఏమిఅనుకుంటాడోనని. రెండుచేతులు కలిస్తే చప్పట్లుగాని ఒక చెయ్యి ఎంతసేపు కొట్టుకుంటుంది. కొట్టుకుంటే మాత్రం ప్రయోజనంఏమి అన్నట్లు వాగివాగి నోరునొప్పి ఎత్తడం చేతనో, లేక, ఇహా తను మాట్లాడడం నిష్ప్రయోజనమనో సాధింపు ఆపివేసి భర్తరాకకు ఎదురు చూస్తూవున్నది లీలావతి.

సావిట్లో కుర్చీలోకూర్చుని చదువుకుంటూవున్న పుష్పలతభర్త లక్ష్మణరావు వదినెగారి సాధింపు అన్నీవిన్నాడు. తన భార్యనీ, తన పిల్లలనీ ఆవిడపొడిచే ఎత్తిపొడుపులకు దేనికీ తన భార్య జవాబు చెప్పక పోవడానికి తన మనస్సులో చాలా సంతోషించినాడు. కాని అతని మనస్సు విచారంలో మునిగింది. చదివే పుస్తకంమూసి దీర్ఘాలోచన చేశాడు. ఎన్నాళ్లు తనూ, తన పిల్లలూ, భార్య వదినెగారి మాటలు పడుతూ వుండడం. పోనీ ఆవిడ అభిప్రాయాన్ని బట్టి వేరే ఉందామన్నా అన్నగారిని చూసి వూరుకోవడం అవుతోంది. ఈ సంవత్సరమేనా ఏమ్మే ప్యాసయి ఏవూరిలోనేనా హెడ్‌మాస్టరుగా ప్రవేశించితే విడిపడకుండా వేరే వుండడం అవుతుంది. ఎట్లాగైనా ప్యాసుఅవడానికి ప్రయత్నంచేసి చదవాలి. చదువుదామన్నా ఇంట్లో తెల్లవారింది మొదలు ఈ మాటలవల్ల చదువు సాగడంలేదు ఎట్లాగా? అని ఆలోచిస్తూ వున్నాడు. పోనీ విడిగావుండడానికి తన భార్యతో చెప్పితే ఆవిడ ఏమంటుందో ఆవిడ అభిప్రాయం కనుక్కుందామని ఉద్దేశ్యం కలిగింది. వెంటనే కుర్చీలోనుంచి లేచి వంటఇంట్లోకి వెళ్లేడు. పుష్పలత మడికట్టుకుని పొయ్యిమీద బియ్యంపెట్టి చంద్రముఖిని ఎత్తుకుని ఆడిస్తోంది. పుష్పలతకి ఇద్దరు పిల్లలు. పిల్లవాడికి అయిదేండ్లు. పేరు సుందరం. పిల్లకి ఏడాది, ఆ పిల్ల పేరే చంద్రముఖి. పేరుకు తగ్గట్టుగా వుంటుంది. ఆ పిల్ల మొహం, కళ్లు, ముక్కు ఎంత పిల్లలయందు అసహ్యం గలిగిన వారికైనా ఆ పిల్లని చూస్తే ఎత్తుకోనవలెనని బుద్ధిపుడుతుంది. పిల్ల ఏడాదిదైనా తెలివితేటలు అద్భుతంగా వున్నవి. పువ్వుపుట్టగానే పరిమళం యిస్తుంది అన్నట్లు, చిన్నతనంలోనే తెలుస్తాయి తెలివితేటలు. అట్లా లక్ష్మణరావు వంటఇంట్లోకి వెళ్లి భార్యతో—

"పుష్పలతా, ఏంచేస్తున్నావు?" అన్నాడు.

"మడికట్టుకుని వంటచేస్తూన్నాను, మీకు ఏమికావాలి?" అన్నది.

"అబ్బే, ఏమీ వద్దు. కాని నీతో ఒక సంగతి చెపుదామని వచ్చేను."

"ఏమిటా సంగతి?"

"ఏమిటా? ఇందాక మా వదినె అన్నమాటలు అన్నీ విన్నావా?"

"విన్నాను" అన్నది.

"అయితే నీ ఉద్దేశ్యం ఏమిటి?" అన్నాడు.

"ఏమీలేదు. నేను జన్మించిన వేళావిశేషము."

"నీవు జన్మించిన వేళావిశేషం యిట్లావున్నదని అనుకోవడం ఎందుకు? యిటువంటి భర్తని చేసుకోడం వల్లగదా యిట్లా కష్టపడవలసివచ్చింది, వేరే ఎవరినేనా చేసుకుంటే సుఖపడుదువుగదా."

"ఛా, ఏమిమాటలు? నాగీతలో సుఖపడడం లేకపోతే ఎవరు ఏమిచేస్తారు?" అన్నది విచారంతో.

"పోనీ, రేపు మా అన్నగారితో చెప్పి విడిపడదామా?" అన్నాడు మెల్లిగా.

"ఏమని చెపుతారు?"

"ఇంట్లో ఆడవాళ్లకీ ఆడవాళ్లకీ సరిపడడం లేదు. రోజూ వదినె పిల్లిమీద పెట్టి, ఎలుకమీద పెట్టి సాధిస్తోంది గనుక, మేము సర్దుకుంటాము." అని.

"అట్లా మీరు చెపితే మీవదినెగారిమీద నేరంచెప్పినట్టు అవుతుంది. దానిమీద ఆయనకి కోపంవస్తుంది. నా భార్య అంటే నీ భార్య వూరుకుంటా, నీభార్య ఏమిఅంటే నాభార్యఅన్నదో, అంటారుగాని తన భార్య మీద తప్పువున్నదని అనుకోరు. మీరు చెప్పడంవల్ల అల్లరేగాని మరేమీ లేదు. ఎందుకు వచ్చిన అల్లరి యిదం తాను? నలుగురూ వింటే ఫలానాఆయనతమ్ముడు విడిబడ్డాడమ్మా అంటారు. నలుగురి నోళ్లల్లో పడడం ఎందుకు? ఎల్లాగో కొన్నాళ్లు కాలంజరిపితే ఈ లోపున మీరు పరీక్ష ప్యాసయి ఎక్కడేనా ఉద్యోగంలో ప్రవేశించితే ఎట్లాగూ వెళ్లుతాము. ఈలోపల తొందరపడడం ఎందుకని? అన్నిట్లోకి నిదానం మంచిది అంటారు పెద్దలు. పెద్దవాళ్లు మాటమీదే వుందాం కొన్నాళ్లు." అన్నది.

ఏమో ఆలోచిస్తూ సరే అంటూ ఏదో చెప్పబోతున్నాడు. యింతట్లోకే పిల్లలు అన్నానికి రావడం చేత పుష్పలత పిల్లలకి అన్నంపెట్టే ప్రయత్నానికి వెళ్లింది. లక్ష్మణరావుకూడా చదువుకోడానికి సావిట్లోకి వెళ్లినాడు.

ఏడుగంటలకి ఆఫీసునుంచి శివరావు ఇంటికి వచ్చినాడు. శివరావు అంటే లీలావతి భర్త. అతను పగలు పదిగంటలకి ఆఫీసుకు వెళ్లితే రాత్రిఏడుగంటలకి యింటికి వస్తాడు. అంతవరకూ ఆఫీసులో పని సరి పోతూ వుంటుంది. అతను ఎమ్మే ప్యాసయినా ఈ కాలంలో బ్రాహ్మణులకు ఎక్కడా ఉద్యోగాలు దొరక్కపోవడంచేత ఉద్యోగం పురుషలక్షణం అని ఏదో ఆఫీసులో నెలకి నూటయాభై రూపాయలకి ప్రవేశించి నాడు. ఆస్తిమంతులు గనుక ఏమీ యిబ్బందిలేకుండా బండి సాగుతోంది. ఇతనికి ముగ్గురు పిల్లలు. లీలావతి కనీపెంచుతూన్నదే యింకా.

అతను రాగానే స్నానంచేసి అతనూ లక్ష్మణరావు భోజనానికి కూర్చున్నారు. వాళ్లతోపాటే లీలా వతికూడా భోజనంచేసి తిన్న విస్తరేనా ఎత్తకుండా లేచి వెళ్లింది. పశ్చాత్ పుష్పలత భోజనంచేసి అంతా చేసుకుని తలుపులు వేసుకుని పడుకోడానికి వెళ్లింది. లీలావతి గదిలో శివరావుతో ఘోష మొదలుపెట్టింది. ఇంట్లో చాకిరీఅంతా తను చెయ్యలేకుండా వున్నాననీ, ఎంతచేసినా ఇంట్లో ఎవరికీ మెప్పు లేకుండా వున్నదనీ, ఎన్నాళ్లు ఇట్లా తానుమాత్రం చెయ్యగలుగుతాననీ, తోడికోడలు ఆయన వున్నంతసేపు పనిచేసినట్టు నటించి, ఆయన వెళ్లగానే గదిలో ప్రవేశించి సాయంత్రము వరకూ బయటికే రాదనీ ఏమేమో మొదలుపెట్టింది. ఆయన పైకి ఏమీ మాట్లాడలేదుగాని కోపంవచ్చినట్లు తెల్లవారి ధుమధుమను బట్టి స్పష్టమైంది. దానికి తోడు పుష్పలత ఆరోజున నిద్ర లేచేటప్పటికి ప్రొద్దెక్కింది రాత్రి పిల్ల నిద్రపోకుండా ఏడ్వడంచేత, ఈవిధ

ప్రొద్దెక్కి లేవడం చూడగానేతోనే శివరావుకి అగ్నిలో ఆజ్యంపోసినట్టు అయినది. దానితో ఆయన తమ్ముడి దగ్గిరకు వెళ్ళి కాస్సేపు హడావిడి చేసినాడు. అన్న మనసు తెలిసినవాడు గనుక తమ్ముడు మాట్లాడకుండా వూరుకున్నాడు. శివరావుకు కోపంవచ్చినా సంతోషంవచ్చినా వెనకా ముందూ తెలియదు. ఎవరు ఏమి చెప్పినా వినడు. తను ఏది అనుకుంటే అది అని తీరవలసిందే. అటువంటప్పుడు తక్కినవాళ్లు వూరుకోడం వుత్తమం. పుష్పలత ప్రొద్దెక్కి లేచినదన్న మాటేగాని పనిఅంతా తానే చేసుకుంది. లీలావతికి ఆజోక్యం అక్కరలేదు. మాటలు చెప్పేవారు పనిచెయ్యలేరు పనిచేసేవారు మాటలు చెప్పలేరు అన్నసామెత వట్టిదా?

మధ్యాహ్నం లీలావతి సావిట్లో చాపమీద కూర్చుంది. పుష్పలత అప్పుడే ఏదో పనివుండగా గది లోకి వెళ్ళింది. సమయం కనిపెట్టినట్లు అప్పుడే పొరుగు యింటి శాంతమ్మ వచ్చి లీలావతితో లోకాభిరామా యణం మాట్లాడుతోంది. అది అయిన తర్వాత—

“మఱదలా! మీ తోడికోడలు ఎక్కడా బయట కనపడదు సరిగదా, యింటికి వచ్చినా కనపడ దేమమ్మా?” అన్నది.

“పదినా! ఆవిడ గదిలోనుంచి బయటికివస్తేగా? ఎవరికేనా కనపడ్డానికి. అందరి బదులూ నేను కనప డుతూ వున్నాగా. ఆవిడ అట్లా కనపడదు. నీవు చూడవలెనని వుంటే గదిలోకి వెళ్ళిచూడు.” అన్నది.

“సరే వెళ్లిచూస్తా” అంటూ లేవబోతూ వుండగా శాంతమ్మకి ఇంట్లోనుంచి కబురు వచ్చింది ఇంటికి ఎవరో వచ్చునారు త్వరగా రమ్మని.

“సరే, ఇంకోసారి వచ్చి మీ తోడికోడలిని చూస్తాను.” అని శాంతమ్మ ఇంటికి వెళ్లినది.

లక్ష్మణరావు ఎమ్మే ప్యాసయినాడు. వెంటనే ఏలూరు స్కూల్లో ఖాళీవచ్చిందంటే ధరఖాస్తు పెట్టి ప్రవేశించినాడు. నెలకి నూటయాభై యిస్తారు జీతం. మెల్లగా అక్కడ ఇల్లు కుదుర్చుకుని భార్యనీ, పిల్లలనీ పిల్చుకుని వెళ్లి అక్కడ మకాం పెట్టినాడు. అప్పుడు అతని మనస్సుకు నూతనవికాసం కలిగింది. తను అనుకున్నవి అన్నీ సఫలం అయినవి కదా అని సంతోషం. ఎప్పుడేనా పండుగలకి, లేక శెలవులకి ఇంటికి వెళ్లేవారు. ఒకప్పుడు మంచిదిగాని పుష్పలత యిప్పుడు లీలావతికి చాలామంచిదైనది. ఎవరితోనేనా చెప్పే టప్పుడు మా పుష్పలత అంత మంచి మనిషి ఎవ్వరూ లేరని చెపుతుంది. ఏ పండుగవచ్చినా పుష్పలత, లక్ష్మణ రావు ఏలూరునుంచి రావలసినదే. అట్లా అన్యోన్యం కుదిరింది చూశారా చివరకి. బంధువులను దూరంగానూ; నీళ్లను దగ్గరగాను ఉండమంటారు యిందుకే కాబోలు?

చివరచివరకు లీలావతి, శివరావులకు లక్ష్మణరావు, పుష్పలతల సుగుణములు, సౌహార్ద్రత బాగా తెలిసివచ్చినాయి. వారు చేసే ప్రతికార్యంలోనూ వీరి సలహా, సహాయం కోరేవారు. లీలావతి పూర్వ వర్తనంతా మారింది. మఱది, తోడికోడలంటే అమిత ఆనందం, ఆదరణ, గౌరవం. వారు వచ్చి తమ దగ్గిరఉంటే బాగుండును అనుకొంటుంది అప్పుడప్పుడు. కాని అదెట్లా వీలుపడుతుంది యిప్పుడు.

అతడు ఇల్లాలక్ష్మణరావు కాఫీ తాగుతున్నాడు. చంద్రముఖి నవ్వుతూ ప్రక్కన ఆడుకుంటోంది. పుష్పలత వైపు తిరిగిఅన్నాడు—

“చూశావా? హాయిగావుంది. అన్నయ్యాపిల్లలుకూడా వున్నప్పుడు, కొట్లాటలు అవి తప్పేవికావు. ఆ రోజుల్లో ఎంత అవస్థపడ్డాం? తల్చుకుంటే ఒళ్లుజలదరిస్తుంది.”

“పోనీలేస్తురూ. తల్చుకోవడ మెందుకు? పెద్దవాళ్లు ఎప్పుడూ చెడ్డవారు కారు. మనకు ఇప్పుడు కలి గిన కొరత ఏమిటి?...... వెనకటి దినములు జ్ఞాపకంచేసికోనే వద్దు”.......అన్నది పుష్పలత కోమలంగా.




డాక్టరు యస్. శేషగిరిరావు గారు యల్. ఐ. యమ్.

అడ్డసరము పువ్వులు కండ్లకు కట్టిన నేత్రరోగములను పోగొట్టును.

*　　*　　*

నాలుగు, అయిదు తులముల అరటిపువ్వులరసములో రెండుతులములు పెరుగు కలిపి ఇచ్చిన రక్తగ్రహణి, ఋతురక్తస్రావము కట్టును. దినమునకు రెండు లేక మూడు మార్లు ఇయ్యనగును.

*　　*　　*

అవిసెపువ్వుల చూర్ణము నస్యముచేసిన చాతుర్థకజ్వరము పోవును.

*　　*　　*

అవిసెపువ్వులరసమును కండ్లలోపిండిన మసకలు, మందదృష్టి హరించును.

*　　*　　*

గులాబిపువ్వు రేకులు ఒకడ్రాముయెత్తు తినిన విరేచనములగును.

*　　*　　*

గులాబిపువ్వులరసమునుముక్కులోపిండిన తలనొప్పిని, శిరోరోగములనుపోగొట్టును.

*　　*　　*

ఎండబెట్టబడిన గులాబిపువ్వులుగాని, మొగ్గలుగాని నేతిలో దోరగా వేయించి భోజనము చేయునప్పుడు ప్రథమకబళముతో తినిన శీఘ్రముగ సుఖవిరేచనమగును.

*　　*　　*

జబ్బుపడి లేచినవారు గోరింటపువ్వులు వాసనచూచినను నుదుట కట్టుకొనినను మేలు చేయును.

*　　*　　*

గోరింటపువ్వులతో నింపినతలగడ తలక్రిందనుంచుకొని పండుకొన్నచో మంచి నిద్ర తెచ్చును.

గోరింటపువ్వులతో తయారుచేయబడిన తైలము చిన్న చిన్న గాయములనుకుదుర్చును.

*　　　*　　　*

తంగేటిపువ్వు దీనిని నీడను యెండించి చూర్ణముచేసి ఆచూర్ణమునకు సమముగా చీనాపంచదారకలిపి పూటకు పావు లేక అరతులము చొప్పున రెండుపూటలును ఇరువది లేక నలుబది దినములు పుచ్చుకొనిన అతిమూత్రజాడ్యము కట్టును.

*　　　*　　　*

తురకవేపపువ్వులు నూరికట్టిన వ్రణములలోని పురుగులు చచ్చిపడిపోవును.

*　　　*　　　*

దవనచూర్ణము నూనెలో కలిపి స్నానముచేసినపిమ్మట ఒంటికి పూసుకొనిన సువాసనగను, ఆరోగ్యకరముగను ఉండును.

*　　　*　　　*

తురకవేపపువ్వులు ముద్దగనూరి ఒంటికి పట్టించిన పొక్కులు పుట్టెడు చర్మరోగములు నెమ్మదించును.

*　　　*　　　*

దానిమ్మపువ్వుల రసము మూడునాలుగు చుక్కలు ముక్కులో పోసిన ముక్కువెంట రక్తము పడుట కట్టును.

*　　　*　　　*

నందివర్ధనపుష్పములను కండ్లకు అద్దుకొనిన కండ్లకు చలవచేయును.

*　　　*　　　*

పిచ్చిదానిమ్మపూవులు నూరి పండ్లకు పూసిన చిగుళ్లవెంట రక్తము పడుటకట్టును.

*　　　*　　　*

నందివర్ధనము పువ్వుల రసము కండ్లలో వేసిన కండ్లకలకలు, కండ్లు ఎఱ్ఱబడుట, కండ్లమంటలు మొదలగునవి మానును. మేలుచేయును.

*　　　*　　　*

నువ్వుపువ్వురసము కండ్లలోపిండిన నేత్రరోగములు హరించును.

*　　　*　　　*

సీమ అవిసెచెట్టు పువ్వులునూరి ఉడికించి పైకి పూసినను లేక పైనవేసి కట్టినను తామర మొదలగు చర్మరోగములు మానును.

*　　　*　　　*

మునగపువ్వులు పచ్చివి వెచ్చచేసి కట్టిన సమస్తనేత్రరోగములు మానును.

*　　　*　　　*

మొగలిపువ్వురేకులు ఎండించి ఉంచి ఉబ్బసపుదగ్గుచేత విస్తారము బాధగానున్న సమయములందు చుట్టవలెచుట్టి కాల్చిన గొంతుకకు ఎగదాసియున్న శ్లేష్మము వెంటనే తెగిపడిపోవును; బాధతగ్గిపోవును.

# స్త్రీలు—ద్రవ్యార్జనము

## గుండు రాఘవ దీక్షితులుగారు

మన యాంధ్రదేశమునందలి బ్రాహ్మణేతరవర్ణములలోని బీదలు సాధారణముగఁ గుటుంబపోషణమునకు స్త్రీపురుషు లిరువురును గలిసి పాటుపడి పనులు చేసికొని యాకష్టముతో వచ్చిన ద్రవ్యము పెట్టి సౌఖ్యముగఁ గాలక్షేపము చేయుచున్నారు. కమ్మరులు, కంసాలులు, కుమ్మరులు, సాలీలు, వైశ్యులు మొదలగు ననేకవర్ణములలోఁ బురుషులతోఁ బాటు స్త్రీలును గష్టపడి ద్రవ్యార్జనసాధనములగు పనులను జేయుచుందురు. పేదబ్రాహ్మణులలో స్త్రీలు మాత్రము నూటికి తొంబదియైనను యూరక కాలహరణము చేయుచు నేకాదశీవ్రతములతో జీవయాత్రలు చేయుచున్నారు. దీనికిఁ గారణములు రెండు తోఁచుచున్నవి. ఒకకారణము అభిమానము. అనఁగాఁ దాము పాటుపడుచుండుట సాటివారగు ఇతరులు చూచి యాక్షేపించెదరను భయము. తమయింట ముత్తవ మూఁడుతరములనుంచి లేని యాచారము మీనాడెట్లవలంబింపనగునని యనుమానము. ఇటువంటి పనికిమాలినవే మఱికొన్ని నెయ్యియూహలు మనసులలోఁ బెట్టుకొని, తమ తిండికై జరుగుబాటు విధానము నితరులు చెప్పినను గూడ ధైర్యము చేయలేక యాకలికి మలమల మాడు కుటుంబము లెన్నియో కలవు. మడిమాన్యముల మీఁదనో, యుద్యోగముల మీఁదనో వచ్చు స్వల్పాదాయము భుక్తి, ప్రయాణములు, వైద్యోపచారములు, పురుళ్లుపుణ్యాలు, తోరణోత్సవములు, పారిటోత్సవములు, మొదలగు వేలతరబడిగనున్న ఇతర వ్యయములకును జాలక మడులుమాన్యము లప్పులక్రింద నూడ్చికొని పోగా అంచములు మొదలగు దుర్మార్గములకుఁగూడ దిగవలసిన వారగుచున్న వారందరుఁ గలరు.

కలువులలో నధికమాసశ్రాద్ధమునినట్లు బీదవారికే భగవంతుఁడు సంతానవృద్ధి కలుగునట్లాశీర్వదించుచుండును. వీరు చాలక వితంతులతోఁబుట్టువులుకూడఁ గొందరికి దాపురింతురు. ఇటువంటి సందర్భములలో నొక్క పురుషుఁడు స్వల్పాదాయముతో నందఱను బోషించు టెంత కష్టముగ నుండునో యోజింపుఁడు. వితంతువులు మనోవృత్తికొఱకు న్యాయస్థానములలో దావాలు వేసి భగీరథప్రయత్నములు సలిపి తుదకు కొండ త్రవ్వి యెలుకను బట్టినట్లు సంవత్సరమున కేయేఁబదిరూపాయలో తెచ్చుకొనినను ఆద్రవ్యము దీపారాధనమునకుఁ జాలకుండ తిప్పలుపడుచుఁ బుట్టినింటివారిమీఁదనే యాధారపడవలసిన వారగుచున్నారు.

కనుక బీదకుటుంబముల యందలి క్రొద్దిజీతగాండ్ర సంపాదనమునకు స్త్రీలుకూడ తమ కష్టార్జితద్రవ్యము నొకించుక కలిపినచోఁ జాల సౌఖ్యకరముగఁ గుటుంబపోషణము జరుపుకొనవచ్చును.

ఇఁక నభిమానముమాట కూడఁ గొంచెము విచారించిన మీఁదట: గాని విషయప్రవేశమునకు సావకాశము చిక్కదు.

కుటుంబమునందలి జనమెక్కువగ నుండి యాకుటుంబ వ్యయములకుఁ గావలసినంత ద్రవ్యము నార్జించు మార్గము లేక తప్పనిఖర్చులు చేయవలసి వచ్చినపు డప్పులను జేయుచు ఆఋణవిముక్తికై గృహారామ క్షేత్రాదులను గోల్పోయి కాలక్రమమున పరపతికూడఁ గోల్పోవుటకంటె న్యాయమార్గమున స్త్రీలు

ద్రవ్యార్జనము చేయుట ఎక్కువ అవమానకరమగునా? ఒకనియొద్దకువెళ్లి వానిని ఋణమునిమ్మని యతిదీనతతో యాచించి అతఁడడిగినంత వడ్డీ కొప్పుకొని ఆఋణవిముక్తి యగువఱకును వానికి బానిసకంటెను. నీచాతినీచమగు హైన్యస్థితిలోఁ జేతులొగ్గియుండుట అవమానకరము కాదా? అప్పులెక్కువై ఋణములు దీర్పలేని నాఁడు ఋణదాతలు అప్పుకొన్నవారి యిండ్లు, భూములు వేలము వేయించుచుండ గ్రామములోని జనులెల్లరు నాబాలగోపాలముగ నవ్వుచుండ అవమానకరము కాదా? ఒక కుటుంబములోని స్త్రీపురుషులు పాటుపడి ద్రవ్యార్జనము చేసికొని సౌఖ్యముగ జీవనము గడుపుకొనుట అవమానకరమా? ద్రవ్యార్జనమునకు పూర్వీకులనుండి యాచారము కావలెనా? పూర్వులనుండి యనుశ్యూతముగ వచ్చుచుండు పనియేనా ఋణదాతలకిండ్లువాకిండ్లు వశముచేయుట? పరిశ్రమించి స్త్రీలు ద్రవ్యార్జనము చేయఁబూనుట గౌరవనీయమైన పనిగాని అవమానకరమగు విషయము కాదు. పూర్వము వీసెఁడు నెయ్యి పంద్రెండణాల కిచ్చిననాఁడు స్త్రీలు పాటుపడవలసిన యవసరము లేకపోయినది. నేఁటి పరిస్థితులు చాలభిన్నముగ నున్నవి. స్త్రీపురుషులకు నాగరకత బలిసిన కొలఁదిని పరికరములు, వస్త్రవాహనాదులు నెక్కువగఁ గావలసివచ్చుచున్నవి. కనుక పురుషుఁ డెంత సంపాదించినను పొట్టకూటికి సరిపోవుచున్నదే కాని పైఖర్చులకు పైసా మిగులుట దుర్లభమగుచున్నది. కనుక స్త్రీల తోడ్పాటత్యంతావశ్యకమని తోఁచుచున్నది.

స్త్రీలు సగౌరవముగను, న్యాయముగను, తమ తమ కుల గౌరవాదులకును ఆచారములకును భంగము కలుగనివిగను నుండు ద్రవ్యార్జనోపాయములను గొన్నిటి నాలోచింపవలయును. ఇవి తెలియకపోవుటే స్త్రీలు ఊరక కాలహరణము చేయుటకు రెండవకారణము.

స్త్రీలు మనలో వితంతువులు, ఐదువలు అని రెండు విధములుగనున్నారు. ఐదువలకుఁ దఱచుగఁ బురుళ్లుపుణ్యములు సంభవించుచుండుటచే వారిండ్లువిడచి వెళ్లుట కర్హులుకారు. కనుక వారిండ్లయొద్దనే యుండి చేయుపనులను వెదకవలెను. ఇవి గృహపరిశ్రమలనఁబడును.

వితంతువులు చదువునేర్చుకొని తమ కులగౌరవాదులకు హానికరములు కానట్టి కొన్ని యుద్యోగములను జేసి ద్రవ్యార్జనము చేయవచ్చును. వీనిలోఁ గొన్ని పనుల నీక్రిందఁ జెప్పుచున్నాను.

మొట్టమొదటిది బాలికాపాఠశాలలయందు ఉపాధ్యాయినిగఁ బనిచేయుట. ఎలిమెంటరీ హైయర్ గ్రేడు ట్రెయినింగు అయిన ఉపాధ్యాయినికిఁ దెలివితేటలనుబట్టి ఇరువదియైదు మొదలు నలువది రూపాయలవఱకు జీతముగలదు. వితంతువు మనోవృత్తికి నెలకు ముప్పదిరూపాయ లెందఱు తెచ్చుకొనువారుగలరో యోజింపుఁడు.

రెండవది వైద్యవృత్తి. స్త్రీలు మంత్రసానిపని నేర్చుకొనిరేని వారివారి బుద్ధిసూక్ష్మతనుబట్టి యెంతవఱకైనను సంపాదింపవచ్చును. కొన్నితడవలు మంత్రసానులు బాలెంతలకుఁ బ్రాణదానము చేసి కూలనున్న కొంపలు నిలువఁబెట్టి మహాపుణ్యమును గట్టుకొనుచున్నారు. అంతకంటె గౌరవనీయమగు వృత్తికలదా? ప్రాణదానము చేయుటకంటె పుణ్యతరమగు మహోపకారమున్నదా? ప్రాణదాతకుఁ గృతజ్ఞులుగ నుండనివారుందురా? ఈ వృత్తిలోవచ్చు ద్రవ్యమునకంటె నెక్కువ మఱొకవృత్తిలో వచ్చునా? ఆఱుచున్న దీపమును నిలువఁబెట్టిన దన్న అవమానకరమా? ఒకపూట గంజికైనను జాలని మనోవృత్తి పొందుచుండుట ప్రతిష్ఠాకరమా?

మూఁడవది ఫోటోగ్రాపులుతీయువృత్తి. దీనికి విశేషము విద్యకోఁ బనిలేదు. మన దేశములో మహమ్మదీయులు, వెలమవారు, కమ్మవారు మొదలగు ఘోషాస్త్రీలు గల వర్ణము లనేకములున్నవి. వానిలోని స్త్రీలకు ఛాయాపటములు తీయుటకుఁ బురుషులకు వీలుపడదు. అందుచేత స్త్రీలీపని నేర్చుకొని

లేని ఘోషాస్త్రీల కెంతయుపకార మొనర్చిన వారగుదురో తత్ప్రతిఫలముగఁ దమ కెంతటి ద్రవ్యలాభము కలుగ గలదో యోచింపుఁడు.

ఈ ప్రకారముగ నెక్కున తీరికగల వితంతువులు తమపోషణ ఇతరులకు భారముగ నుండకుండునట్లు సాయపడవచ్చును.

ఇఁక నైదువల మాట చూతము. వీరింటినుండి కదలనక్కరలేకుండ నింటిలో నుండియే కొన్ని పనులు చేసి ద్రవ్యార్జనము చేయఁగల వృత్తులు కొన్నిటిని సూచించి యీ వ్యాసము ముగించెదను.

మొదటిది వర్తకము. అనఁగా స్త్రీలకుఁ బనికివచ్చు చీరలు, రవికెలు, మందులు, గాజులు, బొమ్మలు, పటములు, రాతిచిప్పలు, ఇత్తడిసామానులు, పుస్తకములు, వెండిసామానులు మొదలగునవి తెప్పించి స్త్రీలు వర్తక మారంభించినచో ఆయా వస్తువులు కావలసిన స్త్రీలు స్వయముగ వెళ్లి తమకుఁ గావలసిన వానిని స్వయముగఁ దెచ్చుకొనుచుందురు. అందుచేతఁ బురుషుల కాశ్రమ తప్పుటయేకాక స్త్రీలు తమకుఁ గావలసిన వానిని దామే యేరుకొని తమకుఁ దృప్తికరమగు వానినే తెచ్చుకొందురు. కనుక నింటిలో గొణుగుకొనుట సణుగుకొనుట తప్పిపోవును.

రెండవది బట్టలుకుట్టు వృత్తి. ఒక కుట్టుమగ తెప్పించుకొని రవికెలు, జాకెట్లు, లాగులు, చొక్కాలు కుట్టుట ప్రారంభించినచో స్త్రీలకును జిన్నపిల్లలకును గావలసిన యుడుపులన్నియు కొలతలు మొదలగునవి పురుషదర్జీలతో బనిలేకుండ స్త్రీలేచేయవచ్చును. ఈ వృత్తిమీఁద నెలకు ముప్పదినల్బది రూపాయలు సంపాదింపవచ్చును. రవ్వతీయుట, లేసుపనిచేయుట, చంకీపూసలుకుట్టుట మొదలగునవియు, మేజోళ్లు అల్లుట, బనియనులు అల్లుట, నవారునేయుట మొదలగునవన్నియు నిచటనే చేయవచ్చును. అన్నిపనులకు ఇప్పుడు మరలు దొరకుచున్నవి.

మూఁడవది సబ్బులు చేయుట.

నాలుగవది పటములకు, ఫోటోలకు చట్టములు కట్టుట. ఇటువంటి వింకనెన్నియో పనులు స్త్రీలింటిలోఁ గూర్చుండి చేయవచ్చును. మహమ్మదీయులలోని పేదకుటుంబముల యందలి స్త్రీలు పండ్లుతోము కొను కప్పు, గోదుమ పిండితో సేమేలు, తలనూనెలు మొదలగునవి చేయుచుందురు. సాతానులలోని స్త్రీలు శ్రీచూర్ణము, తిరుమణి, పసుపు, కుంకుమ, పూలదండలు మొదలగునవి చేయుచుందురు.

ఏ పనినైనను ప్రారంభింపఁగనే క్రొత్తలోఁ గొందఱు వింతగఁ జెప్పుకొన వచ్చును. కొందఱు మూఢులు హేళన చేయవచ్చును. కాని కాలక్రమమున కొంతద్రవ్య మార్జించినారనుమాట తెలిసికొనియు, సత్ప్రవర్తనమునకు భంగము వాటిల్లుటకు వీలుకాని వృత్తియేకదాయని లోకము కన్నుదెఱచియు తెలిసికొనిననాఁడు మొదట నవ్విన స్త్రీపురుషులెల్లరును పాదాక్రాంతులై తమతమ తెలివితక్కువతనమునకు తామే లజ్జనొంది క్షమార్పణము వేడుకొందురు. ఒకరికి కొంచెము లాభకారిగ నున్నదనినచో నొకరివెంట నొకరాపనిని దామునుకూడఁ జేయ సాగుదురు. కాని యొక్కొక్కరు ఒక్కొక్కవృత్తి నవలంబింపవలయును గాని అందఱు నొక్కవృత్తినే యవలంబింపఁగూడదు. అప్పడములు వత్తుట మొదలు హైకోర్టుజడ్జీపనివఱకు స్త్రీలు ప్రవేశించుచున్న యీ దినములలో నెండ కన్నెఱుఁగకుండ నింటిలోఁ గూర్చుండి తలపూవువాడకుండ న్యాయమార్గమున ద్రవ్యార్జనము చేసికొనుచు సౌఖ్యముగ జీవనము గడుపుకొను వారిని జూచి నవ్వుదురా? ఈశంక కారణము లేని యనుమానము.

# నా జీవ నావ యాత్ర

శ్రీమతి డి. రాజేశ్వరమ్మగారు

ఆహా! పరమాత్మునిచేత లత్యద్భుతములుగదా! మొన్న మొన్నటివరకు సౌఖ్యాంబుధి నోలలాడ నువ్విళ్లూరుచుండ దైవమింతలో నాయాశల కంత రాయమును గల్పించెను? సర్వసుఖముల కునికిపట్టగు ఈ ఎలప్రాయమంతయు బూడిదలో పన్నీరువలె వ్యర్థముకావలసిన దేగదా? స్త్రీ ఎవ్వనిదైవమని భావించునో, ఎవ్వనిగూడి ధర్మార్థకామ మోక్షమార్గములను బడయునో, అట్టి అనుకూలవర్తియు అవిరళమగు దాంపత్యసుఖముల నోలలాడించు పతియులేని సతియొక్క జీవనము—అడవిఁగాచిన వెన్నెలవలె—దివాకరుఁడులేని దినసమువలె—రాజులేని రాజ్యమువలె—వ్యర్థమేగదా?

చదువరీ! నా యీదురంతదుఃఖపూరితమగు జీవచరిత్రమును వ్రాసి మిమ్ము శ్రమపెట్టుచున్నందులకు మన్నింపుడు. మాకాపురస్థలము (అనగా నాజన్మభూమి) మానేపల్లి అగ్రహారమని పూర్వకాలపు టుత్తరప్రత్యుత్తరములనుబట్టి నిర్ధారణచేసితిని. తలిదండ్రులకు దురదృష్టవతినగు నేనేకపుత్రికనగుటఁజేసి చిన్ననాటనుండియు గారాబమున పెరిగితిని. బాల్యావస్థయును అజ్ఞానాంధకారముచే గప్పబడియుండుటచే నాచిన్ననాటి మాస్థితి గతులను వివరించుట నాకసాధ్యము. నాకారేండ్లు రాకపూర్వమే మాతృవియోగము సంభవించినది. నాజనకుఁడు నిర్భరవిచారమునకు లోనయ్యెను. కొలదికాలమైన తరువాత మేమిరువురము మానేపల్లి అగ్రహారమును వీడి తత్సమీపముననుండు మచిలీపట్టణమును జేరితిమి. అదృష్టదేవత మమ్మాదరించెనో యన అచ్చట నాజనకుని కొక చిన్న యుద్యోగము లభించెను...... నెలలు, సంవత్సరములు గడచెను. నాకు వయసుమీరుటచే విద్య మానవలసివచ్చినది—పాఠశాలకేగుట మానితిని—అనంతరము మానాన్నగారు నావివాహమునకై వరాన్వేషణమున నిమగ్నులై మిగుల ప్రయత్నపూర్వకముగ పాటుపడుచుండిరి. అతని ప్రయత్నములన్నియు విఫలములయ్యెను. వరశుల్క-వ్యాఘ్రములు దేశమున

విరివిగ విర్రవీగుచుండుటచే నాజనకుఁడు విఫలమనోరథుడయ్యెను. మాకు దగ్గర బంధువు నాజనకుని కాంతరంగికస్నేహితుడును అగు మాధవరావుగారి పుత్రుడగు రంగారావునకిచ్చి నన్ను పెండ్లిచేయవలెనని నాజనకుని మనోగతము. కాని అది సమకూరు టెట్లు? అందని ద్రాక్షపండ్లకు కర్రలు చాచినట్లు మామనోగతములు మితిమీరియుండెను. రంగారావును, నేనును చిన్ననాటనుండియు మనోభావములందైన నేమి, అన్యోన్యమైత్రియందేమి ఒకరినొకరు వ్యతిరేకించక—ఆశాలతను పెంపొందింప ప్రయత్నించుచుంటిమి—మానాన్న పూర్వాచారపరాయణతకు లోనగుటవలన, నాకెనిమిది తొమ్మిదేండ్లు రాకపూర్వమే పాఠశాలలోని నాచదువును మాన్పుటచేత మాకిరువుర కెడబాటు సంభవించినది. రంగారావు మాతృవియోగమున నున్న నన్నుజూచి చాలజాలిపడుచుండెను. ప్రతిదినమును అధమపక్షము మొక్కసారియైనవచ్చి నన్ను దర్శించుచుండెడివాడు.

మాధవరావునకు మడిమాన్యములు విరివిగనున్నను లోభదేవతకు నాతడు లోనయ్యెను. అప్పటిపరిస్థితులనుబట్టి ధనాశచే పీడింపబడి విలువయగు కట్నమిచ్చిన తన పుత్రునికి వివాహమొనర్తునని ఆతఁడు ప్రకటించుచుండెను. మే మంతధన మొసంగుట కసమర్థులమగుటచే మాయాశలడుగంటెను. రంగారావు రాజమహేంద్రవరమున బి. యె. క్లాసు జదువుచుండెను. ఆతనివయస్సప్పటికి ఇరువదికికంటె మించియుండదు. ఇన్నిఏల? ఆతని లావణ్యరూపవయోవిలాసములు—సిగ్గువీడి జెప్పుచున్నాను—నన్ను మిక్కిలి భ్రమింపజేసినవి. ఒకనాటి సాయంసమయమున నొంటరిగ నాచెంతకేతెంచి ఆతడు నిశ్చేష్టుడై యశ్రువులు జలజలరాల్చెను. నేను ఏమియు నెఱుగమి యాశ్చర్యమున నాతని వంకజూచితిని.

"లక్ష్మి! మనయాశ లడుగంటెను—నన్నిక మరచిపొమ్ము." అన్నాడు. అంతట మాఇంటికెవరో వచ్చుచుండినట్లు చప్పుడు వినబడ వెనుకకు దిరిగి జూచితిని. మానాన్న నన్ను లోపలినుండి బిలచెను—రంగారావు స్వరూప మంధకారమున లీనమయ్యెను. మరి నాకగపడలేదు—అంత నేను లోనికేగితిని—చిట్టచివరకు మూడవపెండ్లి చేసికొననువ్విళ్లూరుచున్న ముదుసలిపెండ్లికొడుకు స్వల్పశుల్కమునకే కుదురుటచే మానాన్నగారు ఆసంబంధమును చేయుట కుద్యుక్తులైరి. నీమనోగతమేమని నన్నడగ నేనపుడు ముగ్ధనై లజ్జచేతాడితనై మౌనముదాల్చి ప్రత్యుత్తరమీయజాలకపోతిని. మౌన మర్ధాంగీకారమని గాబోలు మానాన్న వివాహమునకు నిశ్చయించెను. ఇప్పుడు దురంత

దుఃఖముల పాలుగావలెనని నొసట వ్రాసియుండ అప్పుడేల మనోగతమును వెల్లడింప కుందును? ఆహా! మౌనము ముగ్ధాంధ్ర మనోగతమున కంతరాయము మిక్కిలిగదా గల్పించును? అని దలచుకొని దుఃఖించితిని. నన్ను దుఃఖవార్ధిని బడద్రోసి యౌవన సౌఖ్యమునకు దూరముగ జేయసమకట్టిన వివాహదినమునకు మరి రెండురోజులే గడు వుండెను......రంగారావుపేర రాజమహేంద్రవర మొకజాబును వ్రాసితిని. జవాబు రాలేదు. వివాహమెట్లో సమాప్తినొందినది. నెలరోజులైనది. మాయత్తవారింటినుండి పెండ్లికొడుకు జీవనము నిరాశను సూచించుచు జబ్బుచే బాధపడుచున్నట్లు జాబు వచ్చినది. మరియొక వారము గడచినంత మునసలి వృతినొందెనని మరియొక జాబువచ్చినది. భయంకరమగు వైధవ్యపిశాచము నన్నావరించినది. అయ్యో! మఱ్ఱవాయ చేతులాడకున్నవి. నాయాశాచంద్రు డెంతలో నస్తమించెను! నాసౌభాగ్య మంతయు శూన్యమయ్యెను. వరశుల్కవ్యాఘ్రము నాకుత్తుకబట్టి నొక్కినది. ఈజన్మమున హా! నా కిక విముక్తిలేదు. నాజీవనావ మునుగనున్నది!—మునిగినది—ఓసంఘసంస్కర్త లారా? జాతీయనాయకులారా! చూచుచు నూరకుండెదరేల? ముక్కుపచ్చలారని బాలికలపాలిట బ్రహ్మరాక్షసివలె వేచియున్న వరశుల్కవిపణిని నిర్మూలముచేసి దేశము నుద్ధరింపదలచు ధీరుడేడీ? ......నేనింకను పుష్పవతినిగాకపూర్వము కొందఱు నాదీనావస్థనుజూచి బ్రహ్మసమాజమతమును బురస్కరించుకొని పునర్వివాహము జేసికొన సలహాల నిచ్చిరి. వారికందరకు కృతజ్ఞతాపూర్వకముగ వందనము లర్పించితిని. నాజనకుని హితవాక్యముల ననుసరించుచు పూర్వాచారపరాయణతకు కళంక మాపాదింప నేనించుకైనను నిష్టపడలేదు.

దురదృష్టదేవత ఆవేశించెనో యన నాజనకుడు నావలని మనోవేదనయను దీర్ఘరోగమునకు లోనయ్యెను. దినదినమునకు క్రమమున కృశించుచుండెను. ఆతని క్షేమ మునుగోరుచు దయామయుడగు పరమాత్ముని పరిపరివిధముల బ్రార్థించుచు అబల నైనను ధైర్యము వహించి పురుషత్వమునుబూని రోగమని భావించి వైద్యులచే మందుల నిప్పించితిని గాని ఇంచుకైన లాభము లేకపోయెను. గోరుచుట్టుపై రోకటిపోటు. నాజనకుడు నన్ను దురంతమగు కష్టములపాలుజేసి కీర్తిశేషుడయ్యెను. నాటి నుండియు ఈ మిథ్యాప్రపంచమున—దిక్కుమాలినదానను—ఉండుటకాశ్రయమైనను లేదుగదా! భగవంతుడెన్నడు నావంటి దిక్కుమాలిన ముగ్ధలను అదృష్టహీనలను సృష్టింపకుండుగాక!

నాకు ప్రపంచమంతయు నంధకారముగ దోచెను. పిశాచములు పట్టి పీకుచుండెను. అధైర్యదేవత హృదయమున తాండవమాడుచుండెను. దారిద్ర్యదేవత దర్శనమొసగెను. నాయాశలన్నియు పటాపంచలై పోయినవి.

అయ్యో! ఈప్రపంచమున మఱిజీవించుట కాధారము లేదనుకొంటిని. "బలత్కారప్రాణవిసర్జనమే కర్తవ్యము" అని దలచితిని. అనంతరము జ్ఞానసూర్యు డుదయించెనో యన ఛీ! ఛీ! లోకసౌఖ్య మిట్లంతరించినను పరలోకసౌఖ్యము ప్రాణపరిత్యాగముచేసి పరిత్యజింపదగునా? యనుసంశయము బొడమెను. ధైర్యమును బూనితిని. స్త్రీలకుసహజమగు లజ్జనంతయు నొక్కసారి పాఱద్రోలితిని. కాషాయాంబరముల చేతను, విభూతిచేతను, రుద్రాక్షమాలచేతను నాయీపాపకర్మపుబొందె నలంకరించితిని. ఇహపరములకు మోక్షమార్గదర్శినియగునట్టియు, సర్వపాపహరణమగునట్టియు కాశీక్షేత్రమున కేగితిని. విశ్వనాథుని వినయవిధేయతల వేడుకొంటిని—

"నిరతమునిన్నే నమ్మియుంటిరా—నీలకంఠ! వరద!
యనాథలగు నాబోటియువిదలకు—యాశ్రయమియ్యవె మదనహర!"

అని భక్తిచే కన్నులుమూసి కరములు మోడ్చి కాపాడుమంటిని. కాంతివంతమగు నొక దీపకళిక కన్నులయెదుట మెఱసెను. కన్నులు విప్పిచూడ నాశిరముపై నొక పుష్పము రాలెను. ఆకుసుమము దీసి కన్నుల కద్దుకొంటిని. నాజన్మసాఫల్య మయ్యెననుకొంటిని... పరమేశ్వరునిచెంత కాశీలో దాసినై సర్వకాలవాసినినైతిని.

# ముద్దుకృష్ణ

గంటి లక్ష్మీనారాయణగారు

నెమలిపింఛంబు మౌళిధామమున మెఱయ<br>
ముంగురులు ముద్దుమోమున ముసరియాడ<br>
చిఱునగవు వక్త్రసీమను చిందులాడ<br>
తారహారముల్మేనిని తళుకునింప

గంధవహునితో జేలంబు కలసియాడ<br>
నెమరులన్నాని గోతతి నిలచియుండ<br>
మించువేడుక మురళి వాయించుకృష్ణ<br>
మన్మనోనాథ! నిన్నెట్లు మఱతునోయి.

# నవ్యసాంసారిక నిర్వహణము

## ముద్దా విశ్వనాథము గారు

[ప్రవేశము:—(తల్లి) శారద—(కూతురు) అమ్మాణి.]

అ:—అమ్మా! ఇకకుట్టుట మానివేసెదనే. విసుగుపుట్టుచున్నది.

శా:—తల్లీ! ఒక చెయ్యిమాత్రమే కదా కుట్టితివి. కొద్దిపనికూడ కాలేదే! బోలెడంతయున్నది పూర్తి చేయవలసినది.

అ:—పోనీ, కొంతసేపు ఒరవడివ్రాసికొనెదను; లేదా, "గృహలక్ష్మి" పత్రిక చదివెదను.

శా:—నీయుద్దేశ్యము నాకు బోధపడినది. నే చెప్పినపనితప్ప మరియేదయినను చేసెదవు. కాదూ?

అ:—అది కాదు, అమ్మా! నాకు కుట్టు బాగుగ వచ్చునని నీకే తెలియును. ఇంతకంటె గొప్పసంగతులున్నవికదా నేర్చుకొనుటకు? వారి సరస్వతి చూడుము. నావలె కుట్టుపని సరిగ చేతనేగాదు. సంగీతము నేర్చుకొనుచున్నది. ఈనెలనుండి యామెకు హిందీకూడ చెప్పించుచున్నారట!

శా:—ధోరణి శ్రుతిమించుచున్నదే! కుట్టుపనిలో ఆరితేరితినని గర్వించుచున్నావు నీమాట నిజమైనచో ఈ చిన్నరవికె కుట్టుట యింతసేపా? పిల్లలెపుడేపనిచేయ నిర్ణయింపవలెనో తల్లులకు బాగుగ తెలియునమ్మా!

అ:—ఎప్పటికైన నివియన్నియు నేరువవలసి యున్నదికదా! ముందుగనే నేర్చుకొంటినేని నీవు సంతసింతువని యటులంటిని.

శా:—నిశ్చయమే. కాని అన్నిపనులును ఎల్లరకు నొకేవిధముగ నగత్యము కానేరవుసుమా. ఒకరికి అవసరమైనపని మరియొకరకి నిరుపయోగము కావచ్చును.

అ:—ఎందుచేతనే అమ్మా?

శా:—కన్నతల్లీ! 'విద్య' యనునది వారువారలు గడుపవలసిన జీవితముల కనుగుణముగను, సహకారిగను ఉండదగును. స్త్రీ, పురుషులిరువుర జీవితములలోకూడ విభేదములు స్పష్టముగ గోచరించును గదా!

అ:—అటులనా, అమ్మా! ఎల్లరు నొకేరీతిగనుందురని తలంచుచుంటిని.

శా:—లోకములో తండ్రులు, భర్తలు ఆక్రమించు వెవ్వేరు హోదాలు, ఉద్యోగముల తరగతులను బట్టి స్త్రీల జీవనపథము నిర్ణయింపవలసియుండును.

అ:—అవునవును. వర్తకులు—వైద్యులు—ఉద్యోగస్థులు—పురోహితులు—ఈమాదిరిగ పురుషులు వివిధ వ్యాపారములలో నుంటున్నారు.

శా:—చూచితివా, మణీ? ఇట్టిపురుషుల కూతుళ్లు, భార్యలు ఎల్లరు నొకేవిధముగ కార్యములు నిర్వహింప సాధ్యమగునా? నేనెటుల దినచర్య జరుపుచున్నదియు కనిపెట్టితివా? ఉదయముననే పలయు

బజారుసామగ్రి తెచ్చుటకు పద్దువ్రాసియిచ్చి బాలెయ్యను పంపుదును. పాలేరువానిచే పశుసంరక్షణ జాగ్రత్తగ చేయింతును. తరువాత నీకును అమ్మమ్మకును నీళ్లుపోసి, భోజనముపెట్టి, చక్కనిదుస్తులు తొడిగెదను. పిమ్మట మీనాన్నగారివియు, నావియు విడిచిన బట్టలుదికి ఆరవేసెదను. కొంతసేపు నేను రాట్నము వడకెదను, నీకును అమ్మమ్మకును పాఠములు చెప్పుదును. ఇటువంటి వెన్నియో ఆవశ్యకములగు పనులు సంసారములో కనబడును. ఇవియన్నియు పూర్తిచేసికొని తీరికసమయములలో "గృహలక్ష్మి" పత్రిక విజ్ఞానముకొఱకు వినోదముకొఱకు చదువుదును. ధనలక్ష్మమ్మగారియిల్లు చూచితివిగదా! ఆయింటిలో పిల్లలు, పెద్దలుగూడ ఎట్టిపనియు చేయ నవసరము లేదు. ప్రతిపనికి నౌకరులే. అందుచే అక్కడ రేడియోను గ్రామఫోను, హార్మోనియము మొదలగు వానితో వినోదకాలక్షేపములకు చాల అవకాశమున్నది.

అ:—కాని, కామేశ్వరమ్మగారెప్పుడును ఇంటిపనిలోనే ఈదుకొనుచుండును. భర్తగారు వైద్యులగుటచే పొరుగూర్లు తిరిగి తిరిగి ఏవేళకు భోజనమునకు వత్తురో నియమములేదు. పాపము ఆమె యెల్లప్పుడు నిరీక్షించియే యుండవలెనుగదా!

శా:—ఈమె మాత్రమే కాదు, అమ్మాయీ! పురోహితులు, వ్యాపారస్థుల విషయముకూడ నిటులే. వారునిర్వహింపవలసిన పనుల తీరు అట్టిది. ఎల్లరును సకాలమున ఇంటికిచేరి భార్యలను సుఖపెట్టగల ఉద్యోగస్థులు కాగలరా?

అ:—అయితే నీవలెనే నేనుకూడ ఇంటిపనులు చేయవలసియుండునా? అమ్మా!

శా:—ఏమోతల్లీ! నీభవిష్యజ్జీవనపథ మిప్పుడు నిర్ణయింపగలనా? నీయదృష్టమెటులున్నదో నేకలగంటినా? నేచేయుపనులు నీవుకూడ చేయ నవసరము లేకుండునని మాత్ర మూహింపగలమా?

అ:—కాని, అమ్మా! అమ్మమ్మకు చదువురాదని చెప్పుచుందురే! మనమేల చదువవలెను?

శా:—బిడ్డా! చక్కని ప్రశ్నయే వేసితివి. దేశకాలపాత్రతల ననుసరించి తగుమార్పులతో 'ఏయెండకా గొడుగు' పట్టినగాని జీవయాత్రచేయుట దుష్కరము. మన పెద్దల కిప్పటిమోస్తరు పాశ్చాత్యవిద్యయు ఉద్యోగములును లేవు. ఇప్పటి తరములలో గొప్పమార్పులు జరుగుచున్నవి. వీనిని గురించి మఱొకప్పుడు విస్తరించి చెప్పెదనులే. పురుషుల ననుసరించి వారి కన్నివిధముల స్త్రీ చేదోడుగనున్నగాని "అర్ధాంగి" యనిపించుకొనదు. గ్లాడ్‌స్టనువారి సతీమణి ఆమె భర్త షికారువెళ్లి తిరిగివచ్చుసరికి ఉత్తరములన్నిటికి జవాబులు వ్రాసి సంతకములకు సిద్ధముగ యుంచెడిదని మొన్న నీవు చదివిన సంగతి మఱచిపోతివా? పతిభక్తిని సూచించి భారతస్త్రీల ఔన్నత్యము దెల్పు కథలెన్నియో నీవు పురాణములలో చదివియుంటివిగదా?

అ:—అవునే అమ్మా! నాకయితే, చదువుట వ్రాయుట అగత్యమన్నమాట.

శా:—కాదా, మరి?

అ:—ఇంక నేయేవిషయములు నేను తెలిసికొనవలెనో వివరింపుమమ్మా!

శా:—కుట్టుపనియొక్క ప్రాముఖ్యత నీకు తెలిసియేయున్నది. దసరాపండుగకు కుట్టించిన యుడుపులకై దర్జీవానికి కూలి యెంతయిచ్చితిమో జ్ఞప్తికితెచ్చుకొనుము.

అ:—అబ్బో! ఎనిమిదిరూపాయీల పైచిలుకు.

శా:—ఈసొమ్ము సంసారకృత్యములకెంత యుపయోగపడి యుండునో కొంచెము యోచింపుము.

అ:—ఇకమీదనట్టు పనికై ఒకదమ్మిడియైన వ్యయముకాకుండ చేసెదను.

శా:—సంతోషమే తల్లీ! నీవంటికూతురుండగ నాకేమికొదువ? మరియొకసంగతి. గతలక్ష్మివారము శాస్త్రిగారివారి భార్య ఇక్కడికెందుకు వచ్చినదో జ్ఞాపకమున్నదా?

అ:—లేకేమి? పాపము! నీవు లెక్కసరిగా చూచిపెట్టుకొన్నచో ఆమెను మాయపుచ్చి రూపా యిన్నర దొంగలెక్కచెప్పి పట్టుకొనిపోవ యత్నించిరిగాదా వారిగోడపెట్టినకూలీలు?

శా:—లెక్కలు తెలియనిచో నీపనియు నంతియె. క్రిందటిసారి నేనెంత జాగ్రత్తతో పద్దువేసినను చాకలిది బుకాయించినది కాదా? పద్దు పగకలు ఆధారము లేకున్నచో ఎంత చిక్కగనుండునో ఆలో చింపుము. ఇదిగాక, ఇంటికిసంబంధించిన నెలవారీ జమాఖర్చులు స్త్రీలేచూచుకొనవలెను. ఎన్నియో ముఖ్యమగు వ్యవహారములు నిర్వర్తింపవలసిన పురుషుల నెత్తిపై వంటయింటి చిల్లరభోగట్టాలుకూడ వేసి వారలను విసిగింపకూడదు. ఇట్టివిషయములన్నియు మనమే జాగరూకతతో చక్కబెట్టుకొనవలెను. 'ఆదాయ మును మీఱు నెచ్చ మనర్థకము'ని పెద్దలు చెప్పుదురు. అందుచే లెక్కలు బాగుగ నేర్చుకొనినగాని ఈ యంశములు నెఱవేర్పజాలము.

అ:—సరేకాని, అమ్మా! తమ్ముడు చదువుచున్న 'శారీరశాస్త్రము' కూడ నన్నొకప్పుడు చదువు మంటివే? అదెందులకు ఆడువారికి?

శా:—అమ్మాణీ! లెక్కలకంటెకూడ నిది తెలిసికొనుట అత్యావశ్యకమమ్మా! ఆబల్లమీద 'ఆయుర్వే దాంగ శారీరశాస్త్రసంగ్రహము' అను ఎఱ్ఱఅట్టగల పెద్దపుస్తకమిటు తీసికొనిరమ్ము. చెప్పెదను. (అమ్మాణివెళ్లి తీసికొనివచ్చును.)

శా:—(పుస్తకము తెఱచిచూసి) బిడ్డా! ఇక్కడనుంచి జాగ్రత్తగా చదువుము.

అ:—(ఇట్లుచదువును.) 'భారతదేశమున పురాతనకాలమున స్త్రీపురుషులందఱును విశేషముగ శారీరజ్ఞానముకలిగియుండెననుటకు ప్రమాణములనేకములుగలవు. కర్మకాండమున షోడశకర్మలలో శిశువునకు జాత కర్మ తండ్రి జరుపవలయునని విధింపబడి యుండుటచే గర్భాశయమునకు సంబంధించిన ప్రజననాంగముల విశే షములన్నియు ప్రతిగృహస్థుడును తెలిసికొనియుండవలెనని యేర్పడుచున్నది. గర్భాధానఖండముయొక్క దలి విషయ ముల పరికించినచో కర్మకాండము జరిపింప నేర్పడియుండు ఉపాధ్యాయునకును శారీరజ్ఞానము ండవలసినదిగ తేటపడగలదు. ఔర్ధ్వదైహికకర్మలలో అస్థిసంచయనమున స్త్రీలు ఆయాయంగవిశేషములకు సంబంధించిన అస్థిభాగములను ఏరిసంచయనమునకు సిద్ధముచేసి యుంచవలెనని చెప్పబడి యుండుటచే స్త్రీలకుగూడ శారీర శాస్త్ర జ్ఞానము కలిగియుండవలయుననుట సిద్ధమగుచున్నది.'

శా:—అట్టివారి సంతతివారమగు మనకుకూడ శారీరశాస్త్రవిషయపరిజ్ఞానముండుట మంచిదని నీకు ఇప్పుడైన తెలిసినదా?

అ:—తెలిసినదమ్మా! మొన్నను నాన్నగారికి వచ్చిన అచ్చుఉత్తరములో—'శరీరమర్మశాస్త్ర ములు' ఏవేవియో యితరగహాస్యములు, మొదలైనపేరులతో పెద్దఅక్షరములు, బొమ్మలునుగల జాబితా వచ్చినదికదా! అవన్నియునే నెప్పుడే చదువుట?

శా:—నీకేం జ్ఞాపకమే, కన్నా! ఆపుస్తకముల పేళ్లు నీవు కలనైన స్మరింపగూడదు సుమీ! తెలుగు సొంతులేని ప్రముఖులు ధనార్జనయే ముఖ్యాశయముతో చేయుచున్న దేశద్రోహమిది! ఈగ్రంథములపుట్ట యంతయు శవాలంకృతమనదగు నిస్సారమగు తప్పులతడకలు. అందుచేతనే కదా మీనాన్నగారు అపట్టీని చూచి చూడకయే చించిపారవైచిరి? బాలబాలికలకును, సతీపతులకును శోభగూర్చు చక్కనియంశములు హితచర్యాకుసుమములను పేరుతో సుబోధకముగ శ్రీ వావిలికొలను సుబ్బరావుపంతులుగారు రచించియున్నారు. ఆసంపుటములన్నియు క్రమముగ తెప్పించియున్నానని మీనాన్నగారిని కోరెదను. చదివి మననము చేసికొని యాచరింపదగిన దివ్యబోధలెన్నియో అందున్నవి.

అ:—'భక్తిసంజీవని' పత్రికప్రచురించుచున్న వాసుదేవుడేనా అమ్మా? వారి 'ఆర్యకథానిధి' నాచేత చిన్నప్పుడే చదివించితివి కాదే!

శా:—ఆయనే నమ్మా! ఆమహానుభావుడు రచించిన నీతిగ్రంథములే.

అ:—అమ్మా! అయితే—

శా:—'అయితే కామ. తల్లీ!—ఇప్పటికి విషయములు గ్రహింపుము. మిగతసంగతులు మరొకప్పుడు చెప్పుకొందము. మీనాన్నగారు వచ్చుచున్నారు. దుస్తులందుకొని, పాగాకొయ్యకు తగిల్చి కాళ్లు కడుగుకొనుటకు నీళ్లిమ్మా.

# సరస్వతీస్తవము

శిలిగం జగన్నాథముగారు

వాసవాద్యఖిలగీర్వాణసంచయకిరీటమణిశోభితచరణములు దనర
పాణిపల్లవసీమ వీణామతల్లిక స్వాంగస్తకమునఁబ్రక్వాణమమర
శృత్యర్థసందేహసుస్వరంబు తెలుంగఁ బృచ్ఛసల్పెడి ఋషిబృందమొప్ప
క్షీరనీరంబుల వేఱుసేయఁగజాలు అంచతత్తడి దనపంచనుండఁ

బద్మపీఠాసనస్థయై భద్రమతిని
సుస్వరోక్తిగనామ్నాయసూత్రములను
బలుకు పలుకులవెలఁది మాపాలఁగలిగి
బ్రోచుఁగావుత! విద్యాప్రబోధ మొసఁగి.

# స్త్రీ సాముద్రికము

వానిలికోలను వేంకటరమణరావుగారు బి. యె; బి. యల్.

## పాదములు, వాని యంగములు

1. పాదములు చిన్నవిగానున్న స్త్రీ దరిద్రురాలగును.

2. బొటనవ్రేలిప్రక్కనుండు మిగ్గాళ్లు ఏస్త్రీకిగలవో ఆస్త్రీ తీర్థయాత్రలు సేవించు స్వభావముకలదిగా నుండును.

3. నిలబడియుండునప్పుడు ఎడమకాలు భూమిమీద మోపి కుడికాలు వదులుగ వదిలియుండు కాంత ముత్తయిదువుగానుండినపుడే చనిపోవును.

4. ఎవతెయొక్క మిాగాళ్లు లావుగనుండునో ఆస్త్రీయొక్క మగనికి గండము గలదని ఎఱుంగునది.

5. నిలుచుండియుండు సమయమునందు కుడికాలుభూమిమీద మోపియుంచు స్వభావముగల ఉవిద వైధవ్యము నొందును.

6. ఏస్త్రీయొక్క చీలమండలు రెండును సమముగనుండి వలయముతేరి చూడ నిండుగనుండునో ఆస్త్రీ ధనవంతురాలై సుఖించును.

7. ఏస్త్రీయొక్క మడిమెలు వెనుకప్రక్కను మత్తిపండువంటి ఎఱ్ఱనిరంగుతో నొప్పుచు గుండ్రముగానుండునో ఆమె ధనవంతురాలుఅగును.

## నడక

1. మదపుటేనుగు, రాజహంస వీనినడకవలె మందముగను అందముగను నడచు స్త్రీధనధాన్యసమృద్ధిగల ఇంటికియజమానురాలై పెక్కువర్షములు సుఖము లనుభవించును.

2. ఏస్త్రీ నడచునప్పుడు భూమిఅదరునో ఆస్త్రీ ధనవంతుని చెట్టబట్టినను దరిద్రురాలే యగును.

3. నడచు సమయమునందు ఏస్త్రీయొక్క అరకాలంతయు భూమిమీద ఆనక యుండునో ఆస్త్రీ దరిద్రురాలగును.

4. నడచునపుడు ఏస్త్రీయొక్క కాలిప్రేళ్లలో చిటికెనప్రేలుగాని దానిప్రక్క ప్రేలుగాని భూమికి తగులకయుండునో ఆమె దుష్టస్వభావము కలదియగును.

## పిక్కలు

[illegible]రములుపైకుబుకక రోమములులేకయుండు పిక్కలుగల స్త్రీ భాగ్యవతియు, సుఖి[illegible]యును అగును.

[illegible]సము[illegible]ములు తేలి కనిపించుట, దట్టముగ రోమములుండుట, మిక్కిలి కండబట్టి [illegible]ంతో [illegible]గా కండలేకుండుట ఈలక్షణములలో కొన్నిగాని అన్నిగాని ఉన్న స్త్రీ [illegible] ఆమె [illegible]నయాత్ర నిర్వహించునదియగును.

3. ఎవతె పిక్కలమీద రోమములు విశేషముగనుండునో ఆమె మగనికి గండ మున్నదని తెలియనగును.

4. పిక్కలు గుండ్రముగ లేని స్త్రీ విధవయగును.

5. మిక్కిలి లావుగనుండు పిక్కలుగల స్త్రీ దరిలేని దారిద్ర్యమున ముగ్గుచు దుఃఖదేవతకు గారాపు నెచ్చెలియై నికృష్టపు జీవనమున దినములుపుచ్చును.

6. ఎవతె పిక్కలు పొట్టిగనుండునో ఆమె లోకపూజ్యురాలగును.

7. ఎవతె పిక్కలు పెద్దవియైయుండునో ఆమె దీర్ఘాయురైశ్వర్యములు గలిగి బహుపుత్రవతియై సుఖపారమును గాంచును.

8. ఎవతె పిక్కలు విశాలముగ నుండునో ఆమె మహదైశ్వర్యమును పొంది బహుకాలము బహువిధసుఖము లనుభవించును.

9. ఏస్త్రీయొక్క మోకాటిక్రింద ఉబ్బుగా నుండునో ఆమె మగనికి గండము కలదని యెఱుంగునది.

## తొడలు

1. రోమములు లేక గట్టివియై ఏనుగుతొండమువలె నుండు తొడలుగల స్త్రీ రాజభార్యయగును. ఇం దేలక్షణమైన కొంచము తగ్గియున్నచో సిరిసంపదలతో తులతూగు జీవనమున నుండును.

2. గుండ్రముగనున్న తొడలు గల స్త్రీ అభాగిని, అనాథయగును.

3. ఏ స్త్రీయొక్క తొడలమీద రోమములుండునో ఆస్త్రీ దరిద్రురాలగును; ఆమె మగనికి గండము కలదని తెలిసికొనవలయును.

4. ఏస్త్రీయొక్క తొడలమీద రోమములు సుడిపెరిగియుండునో ఆస్త్రీకి వైధవ్యము ప్రాప్తించును; దరిద్రము కల్గును; దుఃఖముల పాలగును; దుష్టస్వభావయగును. కులభ్రష్ట యగును.

5. ఒకదాని కొకటి ఒరసికొనుచుండు తొడలుగల కాంతయొక్క మగనికి, అత్తమామలకు, బావమఱుదులకు గండముకలదని తెలిసికొనవలయును.

6. ఎవతెతొడలు సన్నముగనుండునో ఆమె దరిద్రురాలగును.

7. ఎవతెతొడలు సన్నముగను, గుండ్రముగను నుండునో ఆమె ఉన్నది పోగొట్టునదియగును.

8. ఎడమతొడయందు నువ్వుగింజలంత లేసి పుట్టుమచ్చలు రెండు ఉన్నచో చెడునడతకలది యగును.

# పశ్చాత్తాపము

చెరుకుపల్లి శివరామయ్యగారు

## ౧

శారదాబిల్లు ప్రవేశించినప్పటినుంచి దేశములో పెళ్లిళ్ల హడావుడులు ప్రారంభించినాయి. ఎక్కడ చూచినా తోరణాలే! ఎక్కడ చూచినా అవ్వాయిచువ్వాయిలే; ఎవరింట్లో విన్నా పెళ్లి సంబంధాలమాటలే; ఈహడావుడు అంతాచూసి రామచంద్రసోమయాజులగారు తనకుమార్తెను వివాహం చేయాలనుకున్నాడు. ఆయన ఆహితాగ్ని. మనిషి కొంచెంధూర్తుడు. పట్టుదలమనిషి కూడాను. ఆయనది బాపట్ల. ఒక్కడే కుమారుడు. యిద్దరు కుమార్తెలు. కొడుకు ఇరవై సంవత్సరములవాడు. ఎఫ్. ఏ. చదువుచున్నాడు. వానిపేరు శంకరం. పెద్దకుమార్తెఅయిన అన్నపూర్ణకు తొమ్మిది సంవత్సరములుంటాయి. ఆపిల్లకు నిరుటిసంవత్సరమే పెళ్లిఅయింది. రెండవకుమార్తెఅయిన విశాలకి పెళ్లికావాలె. ఆపిల్లకు రెండేళ్లు. సోమిదేవమ్మగారు గర్భిణితో ఉన్నది. సోమయాజులగారు యిటువంటిస్థితిలో విశాలకి సంబంధంకుదిర్చేడు. కాని తల్లి కొడుకుల కిష్టంలేదు. సోమయాజులగారొకనాడు రాత్రి భోజనంచేస్తూ “ఒరేయ్! అబ్బాయి! మన విశాలకి కూడా పెళ్లిఅయిందాంటే యిక్కడికి చిక్కు వదలిపోతుందిరా నాయనా! లేకపోతే వర్ణసంకర మవుతుందేమోనని భయ మేస్తున్న” దన్నాడు.

దానితో శంకరంకు కోపంవచ్చి “నాన్నా! నీవు ముందెప్పుడో శారదాబిల్లు వస్తుందని యిప్పుడే విశాల గొంతుకోస్తావాయేమిటి? అది యింకా కన్నుతెరవలేదే; పాపం దానికి సిగ్గుతెలుసునా? మొగుడంటేయేమిటో పెళ్లంటేయేమిటో తెలియని పసిపిల్లకు పెళ్లిచేస్తానంటావే యింతకంటే అన్యాయం యెక్కడయినావుందా? నాన్నా!” అన్నాడు.

“ప్రపంచకములో అంతా పసిపిల్లలకు పెళ్లిళ్లుచేస్తున్నారాయేమిటి? యేదో ఎనిమిదియేళ్లవాళ్లకు తొమ్మిదియేళ్లవాళ్లకు చేస్తున్నారుగాని అయినా పాలుతాగేపిల్లకు పెళ్లేమిటి?” అని సోమిదేవమ్మగారు కొడుకుపక్షం మాట్లాడింది.

దానితో సోమయాజులుగారికి తారామండలమయింది. “ప్రతివిషయంలో తల్లీకొడుకూకలిసి నామాట సాగనివ్వరుగా? వాడంటే యింగ్లీషుచదివి వర్ణసంకరం కావాలెననుకుంటున్నాడు. నీకేమిరోగమే వాడిపక్షం పలుకుతావు. నీవుకూడా వాడితోపాటు వర్ణసంకర మవుతావాయేమిటే? ఈ యింగ్లీషుచదువు వచ్చింది. దాంతో బ్రాహ్మణ్యం నశించచ్చింది. ఈబిల్లుతో సాంతంచచ్చేరోజు వచ్చింది.” అని ఉరిమినాడు.

“ఫోనీ యింగ్లీషు చెప్పించటం మాన్పించకపోయినారూ?”

"అదుగో: అసలే నేనేనా చేసింది? నన్ను వేధించి, నాడుంపతెంపి కొడుకు వేలు సంపాదిస్తాడని పోరుపెట్టి వాడిని యింగ్లీషులోదింపి యిప్పుడు నేరం నామీద వేస్తావుటే? యింతకు నేను జంగమాలు తెంపుకొని యింట్లోనుంచి లేచిపొయ్యేరోజు వచ్చింది. ఇంతకూ పెళ్ళిసంగతి యేమిటే?"

భర్త ధూర్తుడన్న సంగతి తెలుసునుగనుక "నాకేమీ తెలియదు. తండ్రియిష్టం కొడుకిష్టం." అని సోమి దేవమ్మగారు మఱిమాట్లాడలేదు.

"ఏమిరా? శంకరం!". "ఇదుగో నేనొక్క విషయం చెపుతున్నాను. నాకిష్టంలేదు: అమ్మకిష్టంలేదు. ఇటువంటిపిల్లను పెళ్ళి చేశావంటే లోకం నవ్వుతుంది. కాబట్టి యిప్పుడు మానుకో. అంతగా శారదాబిల్లు వస్తే నలుగురితోబాటు మనం."

"సరే; అట్లాగయితే నేనుమాత్రం యింట్లోనుండను. జంగమాలు తెంపుకొని సన్యాసంపుచ్చుకుంటాను. తరువాత మీయిష్టం. వర్ణసంకరమయినాసరే: యేమయినాసరే."

"అయితే నాన్నా! ఒకవేళ మనయింట్లో యింకా రెండుమాసములకు పురుడువస్తుందే అప్పుడాడపిల్ల పుట్టుతుందనుకో యేంచేస్తావు?"

"నాజాతకంలో యికముందు పుట్టేవాళ్ళంతా మొగపిల్లలే గాని ఆడపిల్లలులేరు. రేపుపురుడువచ్చినా మొగపిల్లవాడుకాని ఆడపిల్లకాదు. అదిమట్టుకు నిజం."

"ఒకవేళ పుట్టుతుందనుకో."

"పుట్టదురా: నాకు తెలుసు. నాజాతకచక్రం చాలామందికి చూపించేను. ఎవరుచెప్పినా యిద్దరాడపిల్లలే అని చెప్పేరు. అందుకోసం దీనికిగూడా పెళ్ళిచేస్తే చిక్కువదలిపోతుందని చూస్తూంటే మీరేమో అడ్డుపుల్ల వేస్తారేమిటి?"

"అడ్డుపుల్లాలేదు. ఏమీలేదు. నీ విప్పుడుమానుకో" అన్నాడు శంకరం.

"నేను మొన్న తాంబూలాలుకూడా పుచ్చుకొని వచ్చాను. పుచ్చుకొన్నతర్వాతనుకాదంటే బాగా వుంటుందా?"

"నాకూ అమ్మకూ చెప్పకుండా యెందుకు పుచ్చుకున్నావు?"

"నీకు చెప్పాలాయేం? బోడయ్యకు; నాయిష్టం. ఫో. లోకం నవ్వితే నవ్వింది. చేసితీరాలి." అన్నాడు.

"అష్టవర్షాభవేత్ కన్యా అని నీవే నీతులు చెప్పేవాడివి. యీ విధంగా పిల్లను పెళ్ళిచేస్తే అంతా నవ్వుతూ? నాన్నా! నీవుగనుక పెళ్ళిచేశావంటే నేను మాత్రం పెళ్ళికిరాను. ఎక్కడికో వెళ్ళిపోతా" అన్నాడు.

"ఫోరా! ఫో! ఎక్కడికి వెళ్ళినాసరే: ఎవరువద్దన్నాసరే పెళ్ళి ఈమాసంలో జరుగవలసిందే." అని అన్నాడు.

"సరే. అట్లాగయితే నే నీరాత్రే ప్రయాణం" అని శంకరం మూటముల్లె కట్టి మెయిలురెక్కి పట్నం వెళ్ళిపోయినాడు.

౨

ఇంట్లో తల్లి కొడుకుకోసం రోదన—పెళ్ళివద్దని పోరు. కాని సోమయాజులుగారు వినలేదు. పెళ్ళిప్రయత్నాలు చెయ్యవలసిందని బంధువులో పెళ్ళికొమరుతండ్రి అయిన వెంకటేశ్వరసోమ

యాజులగారి కుత్తరం వ్రాశాడు. పెళ్లికొడుకుపేరు మోహనం. వాడికి అయిదుయేళ్లుంటాయి. శ్రోత్రియ విషయములో వియ్యంకు లిరువురు సమానులే కాబట్టి వెంకటేశ్వర సోమయాజులగారు పెళ్లి కంగీకరించేడు. ముహూర్తమింకా నాలుగురోజులలో ఉంది. ఈవిషయం వూరంతా గప్పుమన్నది. ఇంతవరకు ఇంతటి పసి పిల్లలకు ఎన్నడూ పెళ్లి జరగకపోవటంవల్ల ప్రతివాడికీ ఆశ్చర్యంవేసింది.

ఇరుగు పొరుగు వారంతావచ్చి "ఏమండీ! సోమయాజులగారూ! పదిమందికి బుద్ధిచెప్పవలసినదానికి మీరే యిటువంటిఘోరము చేస్తూంటే యిక మిగతాబ్రాహ్మణులసంగతి యేమిటండీ? పసిపిల్లలకు పెళ్లి యేమిటండీ? రేపు కాపురం చేసేటప్పుడు అనుకూలదాంపత్యంకాకపోతే దాని కుత్తరవాదు లెవరండీ?" అని కాకులు తగులుకున్నట్లు తగులుకున్నారు. దానికంతా యీయన లక్ష్యపెట్టలేదు. చీవాట్లు వచ్చినాసరే పెళ్లి కావటమేదో అది కావలసిందనుకున్నాడు. ఆడవాళ్లంతా ముక్కుమీద వేలువేసుకొని నవ్వటం మొదలు పెట్టేరు. నవీననాగరికులంతా సోమయాజులగారిభార్య గర్భిణితోఉన్నది దైవం రక్షించి తిరిగి ఆడపిల్ల పుట్టిందాంటే సోమయాజులగారి తిమ్మిరి వదలుతుం దనుకుంటున్నారు. ఈ సంగతి వంగోలులోఉన్న సోమయాజులగారి బావమరిదికి తెలిసింది. ఆయన కొంచెంలౌకికుడు. ఆయనపేరు రామకృష్ణశాస్త్రి. ఆయనకు నాలుగుయేళ్ల ఆడపిల్లఉంది; కాని పిల్లకు పెళ్లి చెయ్యట మిష్టంలేక యూరకున్నాడు. ఆయనకూతురికిగూడా సోమయాజులగారు సంబంధం కుదురుస్తా నన్నాడుగాని శాస్త్రిగారు వినలే. దానిమీద బావమరదంటే సోమయాజులగారికి కోపం. ఇటువంటిస్థితిలో పెళ్లి మాన్పించటానికి రామకృష్ణశాస్త్రులుగారు బాపట్ల వచ్చేడు. ఆయన యింట్లోకి వచ్చేసరికి బావగారు యింట్లోలేడు. సోమిదేవమ్మగారు తమ్ముడిని చూసి "నాయనా! కాళ్లు కడుక్కోరా!" అన్నది.

"అక్కయ్యా! కడుక్కుంటానుగాని బావ విశాలకి పెళ్లి చెయ్యాలనుకుంటున్నాడుట. యేమిటి?" అన్నాడు.

"అనుకోవట మేమిటిరా? నాయనా! తాంబూలాలు పుచ్చుకొనివచ్చారు. ఎల్లుండి లగ్నం" అన్నది.

అనేసరికి శాస్త్రులు గారికి కోపంవచ్చి "అక్కయ్యా! బావ చదువుకున్నా డన్నమాటేగాని యేమీ ప్రపంచం తెలియనట్లున్నది. విశాలకి పెళ్లి యేమిటే. రామ! రామ! ఘోరం జరుగుతున్నది. శంకరం ఒప్పుకున్నాడా?" అన్నాడు.

"సరేలే: మొన్నరాత్రి తండ్రీకొడుకులకు రణయుద్ధం. దానిమీద వాడికి కోపంవచ్చి నేను యీపెళ్లికి వుండను అవ్వాళరాత్రే చెన్నపట్నం వెళ్లుతానని వెళ్లేడు."

"సరే: నేనుకూడా వంగోలు సాయంత్రంబండికి వెళ్ళిపోతాను. పెళ్లికి నేనుకూడా రాను. ఎవ్వరూ రాకుండా బావపెళ్లి యెట్లాచేస్తాడోచూస్తా." అనుసరికి సోమయాజులగారు బజారునుంచి యింట్లోకివచ్చి బావమరిదినిచూసి

"ఒరేయి! రామకృష్ణా! ఎప్పుడు వచ్చావురా?" అన్నాడు.

"ఇంతకుముందే వచ్చేను. బావా!"

"అంతా బాగున్నారా?"

"వున్నారు."

"ఒరేయి! కృష్ణా! విశాల పెళ్లి యెల్లుండిముహూర్తం. నీకు యివ్వాళఉత్తరంవ్రాతామనుకొని కార్డు కూడా తీసుకొనివచ్చాను. సరే నీవే వచ్చావు. నీవు పెళ్లి పిల్లలనువాళ్లను తీసుకొని రేపుమధ్యాహ్నానికి ఇక్కడికి రావాలి."

"బావా! విశాలపెళ్లి చేస్తున్నావుగాని అక్కయ్య గర్భిణితోవుందిగదా ఆమెకు ఆడపిల్ల పుట్టుతుందో మొగపిల్ల పుట్టుతుందో తెలియదు; కనుక కడుపులోవున్న పిండానికిగూడా పెళ్లి చేసేవాంటే నీకు చిక్కులు తీరిపోతవి. ఆడపిల్లయివుంటేనే మంచిది. మొగపిల్లవాడవుతే మళ్లా పెళ్లి చెయ్యవచ్చును." అని హేళన చేశాడు.

దానిమీద సోమయాజులగారికి తీవ్రమయిన కోపం వచ్చి "నీబోటి అప్రయోజకులు ఆక్షేపిస్తే మాత్రం నాకు లక్ష్యమనుకున్నావా యేమిరా! నీ కుమార్తెకు సంబంధం కుదిరిస్తే వద్దనిచెప్పి వర్ణసంకరం కావటానికి సిద్ధంగావున్న నీవుకూడా నన్నాక్షేపించటానికి వచ్చావా? ఆ దౌర్భాగ్యుడు నాతో పోట్లాట పెట్టుకొని మొన్ననే యింట్లోనుంచి లేచిపోయినాడు. వాడికి పెళ్లి చేద్దామనుకుంటే వాడికి ఇరవై అయిదుయేళ్లదాకా పెళ్లి వద్దట. నేనున్నాను కాబట్టి వీళ్లకోసం దేవులాడుతాను. నేను హరిఅన్న మర్నాడు వీళ్ల మొఖం యెవడేనా చూస్తాడా?" అని విసుక్కున్నాడు.

"అయితే బావా! యెవ్వరికీ ఇష్టంలేనిదానికి నీవు చెయ్యటమెందుకు?"

"నీకుగూడా యిష్టంలేకపోతే రావటం మానెయ్యి. వాడొకదేశం పోయినాడుగదా నీవుకూడా యింకోదేశం వెళ్లు. తాంబూలాలు పుచ్చుకొని ప్రయత్నాలుజరుగుతూవుంటే యిప్పుడు మానుకోమంటావేమిటోయ్?

"సరే నీయిష్టం." అని రామకృష్ణశాస్త్రుల్లుగారు భోజనంచేసి వెంటనే రైలుకు పోవటానికి సిద్ధమయినాడు.

సోమయాజులగారు "ఏమిరా, కృష్ణా! మరిపిల్లలతో రేపుమధ్యాహ్నం యిక్కడికి వస్తావా?" అని అడిగేడు.

"వీలుగావుంటే వస్తా"నని బయలుదేరేడు.

ఇంతలో వాకిట్లో సోమిదేవమ్మగారు యెదురుగావచ్చి "నాయనా! కృష్ణా! వాడేమో చెన్నపట్నం వెళ్లి నీవేమో రావటంమానేస్తే యిక్కడ దిక్కెవరురా నాయనా! అయిందేమో అయింది. తోడబుట్టినవాడివి నీవైనరాకపోతే యెట్లాగు? రేపు తప్పక పిల్లలతో రావలసిం"దని కళ్లనీళ్లుపెట్టుకున్నది.

రామకృష్ణశాస్త్రుల్లగారికి నిజంగా రావాలినని యిష్టంలేదు. కాని అక్కగారి మాటలు వినేసరికి గుండె నీరైపోయింది. పాపం. ఎదురు చెప్పలేక పోయినాడు.

"అక్కయ్యా! తప్పక రేపువస్తా" నన్నాడు. వెళ్లినాడు.

మరునాడు మధ్యాహ్నానికి రామకృష్ణశాస్త్రుల్లగారు పిల్లలతో సహా బాపట్లలో తయారయినాడు. శంకరంఅడ్రసు తెలియకుండువల్ల ఉత్తరం వ్రాయలేదు. సోమిదేవమ్మగారు కొడుకు రాకపోయెనని చాలా తపించింది. పాపం. యేమిచేస్తుంది? శుభసమయంలో కళ్లనీళ్లుపెట్టగూడదని ఊరుకుంది.

## 3

బాపట్లలో వివాహం. గ్రామస్థులంతా పెళ్లివారినిచూసి బొమ్మలపెళ్లిళ్లని కొందరు, తల్లిదండ్రులకు జ్ఞానములేదని కొందరు గొణుగుకొనటం మొదలు పెట్టేరు. వూరేగింపురోజు వచ్చింది. సదస్యమయిన సాయంత్రం ఊరేగింపు తలపెట్టేరు. వధూవరులను పల్లకీలో కూర్చోపెట్టేరు సోమిదేవమ్మగారు. ముందు బ్యాండు భోగంమేళంతో కోలాహలంగా వూరేగుచున్నారు. రాత్రిసమయం గనుక వధూవరులు కునికిపాట్లలోబడి పల్లకీలోనుంచి యెక్కడ క్రిందబడిపోతారో యని పల్లకీకి ఒకప్రక్క పెళ్లికూతురు తల్లి ఒక

ప్రక్క పెళ్లికొడుకుఅక్క నడవటం ప్రారంభించేరు. పాపం సోమిదేవమ్మగారు గర్భిణీతో ఉన్నప్పటికి కూతురు మీద మమకారంచేత నడవటం ప్రారంభించింది. పల్లకీలో కొబ్బరిబొండాలు ఖర్జూరపుపళ్లు మొదలైనవి తిను బండారాలు పెట్టేరు. ఊరేగింపు ప్రారంభించేసరికి వధూవరులు పల్లకీలోఉన్న పళ్లు మొదలైనవి తినటం ప్రారంభించారు. పెళ్లికొడుకుమాత్రం ఒకటిరెండు ఖర్జూరపుపళ్లు సాధించాడు కాని పెళ్లికూతురుకిమాత్రం అలవికాలేదు! నవలలేకపోయింది పాపం. పెళ్లిపెద్దలంతా యీచిత్రం చూసి నవ్వటం మొదలుపెట్టేరు. బజారులో ఊరేగుతుంటే ప్రతియింటివారు వచ్చి పెళ్లి ముద్దుగా ఉన్నదనియు బొమ్మలపెళ్లిళ్లనియు ముక్కుమీద వేళ్లువేసుకోటం ప్రారంభించేరు. ఈ విధంగా కొంతదూరం వెళ్లేసరికి అక్కడ ఒకమిఠాయిదుకాణం కనిపించింది. అది పెళ్లికొడుకు చూశాడు.

"అక్కయ్యా! నాకు కారప్పూస కొనిబెత్తవే" అని కొలువు సాగించాడు. "ఛీ" తప్పు నాయనా తినగూడ దన్నది అక్క. పెళ్లికొడుకు వింటేగా? కొనిబెట్టిందాకా ఒకటే రోదన. చివరకు పెళ్లివారిలో ఒకడువెళ్లి ఒక అర్ధణాకారప్పూసపొట్లం కొనుక్కొనివచ్చేడు. దానితో యేడుపాగింది. అక్కడినుంచి పెళ్లివారు యింటిదారపట్టేరు. ఇంతలో పెళ్లికూతురికి నిద్రవచ్చిందిగాబోలు. పల్లకీలో పడుకొని నిద్రబోయింది. పెళ్లికొడుకుగూడా కొంతసేపటి కొకమూల కొదిగాడు. బయటనుంచి చూసేవాళ్లకు వుత్తపల్లకి ఊరేగుచున్నట్లు కనిపించింది, ప్రతియింటివాళ్లు చూసి "యేమండీ పెళ్లికొడుకు పెళ్లికూతు రేరండీ" అని అడగటం. పెళ్లివారు "పల్లకీలో పడుకొని నిద్రబోతున్నా" రని చెప్పటం. వాళ్లంతా పల్లకీ దగ్గరకువచ్చి చూడటం. నవ్వేవాళ్లు నవ్వటం. యీవిధంగా వూరేగింపు ముగిసింది. తరువాత నాగవల్లి, మళ్లుతోరణాలు, పదహారు రోజులపండుగకూడా వెళ్లిపోయినయి. చుట్టాలంతా వెళ్లిపోయినారు. రామచంద్రసోమయాజులుగారిక్కి మనస్థిమితం కలిగింది. శారదాబిల్లు మనలనేమి చెయ్యదనుకున్నాడు. మహాసంతోషంలో వున్నాడు. రోజులు గడిచినాయి. సోమిదేవమ్మగారికి ప్రసవించేరోజులు వచ్చినాయి. చెన్నపట్నంనుంచి శంకరం పురుడు సంగతి, విశాలకిపెళ్లి అయినసంగతి వ్రాయవలసిందని వంగోలుకు మేనమామపేర ఉత్తరం వ్రాసినాడు. మేనమామ విశాలకి పెళ్లిఅయిందని పురుడింకారాలేదని ఉత్తరం వ్రాసినాడు.

## ೪

బాపట్లలో యిరుగుపొరుగువారంతా సోమయాజులగారిక్కి కుమార్తె కలుగుతే బాగుండునని తలచేరు. ఒకనాడు సోమిదేవమ్మగారికి నొప్పులుకనిపించినాయి. యిరుగుపొరుగుఅమ్మలక్కలంతా యేశిశువు కలుగుతుందోయని పనులు కూడా చాలించుకొనిచూడటానికి వెళ్లేరు. ఇల్లంతా కిటకిటలాడిపోతున్నది. ఉదయం ఎనిమిదిగంటలయింది. సోమయాజులగారు దొడ్లో ఆరణిసహితంగా సూర్యనమస్కారాలు చెయ్యటం మొదలుపెట్టేడు. ప్రసవించేసమయం కొచ్చింది. మంత్రసాని "యేమిటమ్మా అంతా యింట్లోకివస్తే మనిషి కూపిరాడదమ్మా?" అని ఆడంగులను తరమటం మొదలుపెట్టింది. ఆడవాళ్లంతా యేశిశువు కలుగుతుందో యని ఆదుర్దాలో ఉన్నారు. కొంతసేపటికి లోపలనుంచి "ఆడపిల్ల" అనుధ్వని వినిపించింది. ఇంట్లోవున్నవాళ్లంతా "ఆడపిల్ల, ఆడపిల్ల" అని కోలాహలంచెయ్యటం మొదలుపెట్టేరు. సోమయాజులగారు నిశ్చేష్టుడయినాడు. సూర్యనమస్కారాలు గంగలోకలిసేయి, దిగులుపుట్టింది. తత్క్షణమే వంగోలుకు తంతియిచ్చేడు. రామకృష్ణశాస్త్రుల్లగారు తంతిమాఋకొని చెన్నపట్నములోఉన్న శంకరముకు తంతియిచ్చాడు. మరునాడు మెయిలులో ఉభయులు యింట్లోకిదూకిపడ్డారు. తండ్రి కొడుకుతో మాట్లాడలేదు. కొడుకు తండ్రితో అంతకంటే మాట్లాడ

లేదు. రామకృష్ణశాస్త్రుల్లుగారు బావగారిని చూసి "బావా! ఆడపిల్ల పుట్టింది. దానిబాబిల్లురాకముందే దీనికిగూడా వరుడిని కుదుర్చు" అని హేళనచేశాడు. సోమయాజులుగారికి బావమరిదిని మింగుదామనేంత కోపం వచ్చింది. కాని సమయంకాదని మాట్లాడలేదు. సోమయాజులగారితిమ్మిరి బాగావదలిందని యిరుగు పొరుగువారు పూర్వోవారు అనుకున్నారు. క్రమముగా భారసాల ఇరువైఒక్కటోరోజు వెళ్లింది. సంతోషంతో రెండుమాసాలు గడిచేయి. ఎంతఅసూయ ఉన్నను ఎంతక్రోధమున్ననూ ప్రపంచములో తలిదండ్రులను గర్భవాసముకన్న విలువగలవస్తువ లేదుగదా! కొడుకు మాట్లాడక పోయినప్పటికి తండ్రి కొడుకు చెన్నపట్నంనుంచివచ్చిన మరునటిదినమునుంచే మాట్లాడటం ప్రారంభించేడు. శంకరం యేంచేస్తాడు? తండ్రిమీద కోపంవున్నప్పటికి మాట్లాడకతప్పదు. తల్లి తండ్రి కుమారుల కోపం క్షణికముగదా! కుమార్తె పుట్టిందని తల్లి కొడుకు చాలాసంతోషించేరు. కాని తండ్రి కెంతమాత్రం సంతోషంలేదు.

ఒకరోజున సోమిదేవమ్మగారు ప్రసంగవశములో "బందరునుంచి ఉత్తరంరాలేదు. ఇప్పటికి షుమారు రెండుమాసముఅయింది. యివ్వాళ ఒకఉత్తరమైనా వెయ్యరా. నాయనా" అని కొడుకుని హెచ్చరించింది. శంకరం వ్రాస్తానన్నాడు. తండ్రి స్నానసంధ్యాద్యనుష్టానముఖుదీర్చి వంటయింటిలో అగ్నిహోత్రములు చేసుకొనుచున్నాడు. పదకొండుగంటలయింది. అప్పుడు టెల్గ్రాంజవాను వీరయింటివద్దకువచ్చి వాకిట్లోనిలుచున్న శంకరముకు టెలిగ్రాము యిచ్చివెళ్లేడు. శంకరముకు గుండెపగిలింది. టెలిగ్రాము విచ్చిచూశాడు. అందులో మోహనంకు ప్రాణంమీదికి వచ్చింది. తక్షణమే బయలుదేరమని వ్రాసిఉన్నది. శంకరం కాళ్లు గడగడవణకినాయి. టెలిగ్రాం క్రిందకు వదిలేడు. విశాల గునగనలాడుచు పిల్లలతో బయట ఆడుకుంటున్నది. ఇంతలో తల్లి "అబ్బాయి స్నానంచేసి మడికట్టుకోరా" అంటూ వాకిట్లోకి వచ్చింది. కొడుకు మాట్లాడలేదు. ఏదో కాగితం క్రిందపడియుండటం చూసింది. "అబ్బాయీ! కాగిత మేమిటి నాయనా? బందరునుంచి ఉత్తరం వచ్చిందా?" అన్నది. శంకరం మాట్లాడలేదు. ఆడుచున్నచెల్లెలివంక చూస్తూ నిలబడ్డాడు. కొంచెసేపటికి కళ్లకు నీళ్లుతిరిగినాయి. తల్లికి భయంవేసింది.

"అబ్బాయి! అబ్బాయీ! యేమిటిరా? నాయనా! ఎందుకు యేడుస్తావురా? కొంపమునిగిందా యేమిరా?" అని అరచింది.

ఈ మాట లోపలనుంచి సోమయాజులగారు విని అగ్నిహోత్రాలువదలి బయటికివచ్చి "ఏమిటేసి యేమిటే?" అని ఆతురతతో భార్యనడిగాడు.

"నా కేమి తెలుసు? కాగితం క్రిందపడిఉంది. అడుగుతే వాడు చెప్పటంలేదు."

"అరే అబ్బాయి! యేమిటిరా అది?"

"టెలిగ్రాము."

"ఎక్కడనుంచి?"

"బందరునుంచి"

"ఏమని?"

"మోహనముకు ప్రాణంమీదికి వచ్చిందని."

సోమయాజులుగారికి మనస్సు చివుక్కుమన్నది. సరాసరి దొడ్లోకి వెళ్లి కూర్చున్నాడు. విశాలకి నిష్కారణంగా గొంతుకోశాననుకున్నాడు. చీవాట్లు లోకనింద వస్తుందనుకున్నాడు. కుమార్తె జీవితం అంధకారబంధురమై పోవునా అనుకున్నాడు. పశ్చాత్తాపము చెందుటకు మొదలుపెట్టేడు.

ఇంతలో తల్లి "నాయనా! శంకరం! పెళ్లిగ్రాములో యేముందో బాగాచదివి చెప్పరా?" అన్నది.

శంకరం మాట్లాడలేదు. చెల్లెలికి నిష్కారణముగా ద్రోహముచేసిన తండ్రినిగురించి విచారిస్తున్నాడు. తండ్రితో పోట్లాటపెట్టుకుందామనుకున్నాడు. కాని లాభంలేదనుకున్నాడు.

"అబ్బాయి! మాట్లాడవేమిరా? నాయనా!"

"ఏమున్నదే మోహనముకు ప్రాణంమీదికివచ్చిందని బయలుదేరి రావలసిందని ఉన్న"దన్నాడు.

ఇంతలో ఆడుకొనుచున్న విశాల "అమ్మా!" అని దగ్గఱకు వచ్చింది. తల్లి కూతురినిచేరదీసి ఒక్కపెట్టునయేడవటం మొదలుపెట్టింది. తల్లి యేడవటంతోనే పిల్లయేడవటం ప్రారంభించింది. ఇప్పుడు తల్లి కుమార్తె కేమనిచెపుతుంది? నీమొగుడికి జబ్బుగా వున్నదని చెపుతుందా? నిన్ను చూసిపొమ్మన్నారని చెపుతుందా? పాపం సోమిదేవమ్మగారు తనుయేడ్చిన కుమార్తెయేడుస్తుందని యేడవటంమాని లోలోపల కుళ్లుచూ పిల్లను చేరదీసింది.

వెంటనే సోమిదేవమ్మగారు భర్తదగ్గఱకువెళ్ళి "ముందేమిట"న్నది.

"నన్ను మాట్లాడించకే, నాకు పిచ్చియెత్తినట్లున్నది." అన్నాడు.

ఆడపిల్ల పుట్టినందులకే చాలానిరుత్సాహపడుచున్న సోమయాజులుగారికి ఈవార్త చెవిని బడినంతనే స్తబ్ధుడయినాడు. కొంతసేపటికి తెలివివచ్చింది. జన్మాంతరమందు మహాపాపం చెయ్యడంవల్ల యిటువంటి యిక్కట్లు వచ్చినవని కళ్లనీళ్లుపెట్టుకున్నాడు. నావంటి పరమదుర్మార్గుడు లోకములో లేడనుకున్నాడు. పాపం. సోమిదేవమ్మగారు భర్త చాలా పశ్చాత్తాపపడుచున్నారని గ్రహించింది. ఇంతలో శంకరం దగ్గఱకు వచ్చేడు. తండ్రిని యేమీఅనలేదు.

"నాయనా! లోకమంతా చీవాట్లుపెట్టినప్పటికి స్వతంత్రించి చేసినందులకు భగవంతుడు బాగా ప్రాయశ్చిత్తము చేశాడు. నాయనా! ముందుగతి యేమిటిరా?" అన్నాడు సోమయాజులుగారు.

"ఏమున్నది? ఈ మధ్యాహ్నం నేను బందరు వెళ్లుతాను."

"నాయనా! నీవు వెళ్లుతే నీవు వచ్చేంతవరకు మాకు కాళ్లు భూమిమీద నిలవవు. మేముకూడా వస్తా" మన్నదితల్లి; కుమారు డంగీకరించేడు.

భోజనమునకు కూర్చున్నారు. కాని మెతుకైనా లోపలికి పోలేదు. ఔరా! అయిదేళ్ల కుర్రవాని కోసం యెంత తహతహపడ్డారో భగవంతునికెరుక. దీనికంతకు బాల్యవివాహమేగదా కారణం? అంతా సామాను సద్దుకొని మధ్యాహ్నంబండికి బందరువెళ్లటానికి స్టేషనుకు వెళ్లేరు. దైవ మేమిచెయ్యనున్నాడోగదా?

# సుశీల—పాతివ్రత్యము

## శ్రీమతి వి. సరస్వతిగారు

సుశీల [చూడుః డిసెంబరు గృహలక్ష్మి] ప్రేమను తెగగొట్టి చింతను విసర్జించి భర్త యిష్టానుసారముగ తనబిడ్డలను యమునిసదనమున కనుప నిశ్చయించెను. పతివ్రతలన నిట్టివారేయనియు ప్రేమతత్వ మిట్టిదేయనియు ముద్దా విశ్వనాథముగారు వ్రాసిరి*. సుశీలకును నామె భర్తకును నొండొరులపైగల ప్రేమ తుచ్ఛమైన శరీరసంబంధమైనది కాదని చెప్పనక్కరలేదు. వారిప్రేమ నిర్మలమైనది. దివ్యమైనది. అట్టిప్రేమ అనంతమును నిష్కల్మషమును నైనది. అట్టి ప్రేమచే నొకస్త్రీ తన భర్తనేగాదు, మనుష్యజాతినంతటిని ప్రేమింపవచ్చును. మనుష్యజాతినేగాదు, జంతుజాతినిగూడ ప్రేమింపవచ్చును. ఇందుచే నామె పాతివ్రత్యమునకు భంగముగల్గదు. మరియు దయామయుడగు సర్వేశ్వరుడు జీవరాసుల నన్నిటిని నిట్టి ప్రేమచే ప్రేమించుచున్నాడుగదా!

ఇట్టి ప్రేమయు, దయయు కవలపిల్లలు. వీరొకరిని వదలి యొకరుండలేరు. ఇట్టి దివ్యత్వమును కనుగొనబట్టియేగదా గౌతముడు "అహింసాపరమోధర్మః" యనునీతి వచనమును లోకమంతట చాటెను. ఇట్టి దివ్యత్వమును కనుగొనజాలిన సుశీలయు, నామెభర్తయు ముద్దుపల్కులాడు ముక్కుపచ్చలారని తనూభవులగు కనుగందులను జనాందోళనానివర్తనమునకై జంపింప సేవకుల కప్పగించిరి. ఆహా! భర్తయొకవేళ జనాపవాదభీతిచేత నట్టిపని చేయనుంకించినను, ఫిలిప్పారాణి ఎడ్వర్డును వారించినట్లు సరసవచనములచే భర్తను వారింపవలెనుగాని, ఇదియా పాతివ్రత్యము? ఇదియా దివ్యత్వము? ఇదియా ప్రేమ? స్త్రీరత్నముల ప్రేమ ఇట్టి రూపమునా దాల్చవలెను? ఇదియా ముద్దా విశ్వనాథముగారు స్త్రీలకిచ్చుసలహా? సుశీలకును నామె భర్తకును మనుజునకుండవలసిన ధైర్యస్థైర్యములు చాలవు. రాజు మొదట సుశీలమీాది ప్రేమచే వివాహామే గావించుకొన ననియు, అట్లుచేసికొనిన తన ప్రీతిమేరకే చేసికొనెదననియు పట్టుపట్టెను.

ఎంతటిచిత్తస్థైర్యము? కాని కొన్ని వత్సరములు గడచిన వెనుక యతనిచిత్తస్థైర్య మేమైనది? జనాపనిందకు వెరచి బిడ్డలను చంపనుంకించెను. ఆహా! ఎట్టికార్యము!

---

* శ్రీయుత ముద్దా విశ్వనాథముగారి వ్యాసము స్వామిరామతీర్థగారి వ్యాసమునకు అనువాదమను సంగతి శ్రీమతి వి. సరస్వతిగారు మఱచినట్లున్నారు. —సంపాదకుడు.

ఏలఈతరుణమునగూడ యతడు చిత్తస్థైర్యమును జూపలేదు. అంతస్థితికి వచ్చిన ఎడల ఏల దారపుత్రాదులతో రాజ్యచ్యుతుడై ఐహికాభోగముల తగుల్కొనక కానలకేగ రాదు? రాజ్యాభిలాషచేగదా !

ఇక సుశీలమాట ఆలోచింతము. తండ్రిప్రేమకంటెను తల్లిప్రేమ ఘనము. మాతృప్రేమ వర్ణనాతీతము. ఇట్టిలోకపూజ్యమైన మాతృప్రేమనుగూడ సరకుచేయక, భర్త చేయుకార్యముయొక్క ధర్మాధర్మములను విమర్శింపక ఇట్టి ఘాతకకృత్యమున కొప్పికొనుటయేనా పాతివ్రత్యము? అవును. ఇట్లె మన పురుషులు మనకీవరలో పాతివ్రత్యమను మైకముచే మనవివేచనాశక్తిని నిద్రింపచేసిరి. "రాత్రిమంచిదని తెల్లవార్లు దొంగిలించదగునా" యను సామెత ప్రకార మిక నెంతకాలము వీరిట్లు మన కన్నులను మూసిపెట్టగలరు? భారతవనితాలోకాంబరమందు వివేకభాస్కరు డుదయించుచున్నాడు. ఇకపై మనకు పురుషులు నీతిశాస్త్రము గరుపనవసరములేదు. వారట్లొనరించుట బట్టియే దుర్నీతి నీతియగుచున్నది. భర్తలు సేయు దుష్కార్యముల కొప్పికొనుట పాతివ్రత్యమగుచున్నది.

కాని రాజుబిడ్డలు చావలేదుగదా. వారు బ్రదికి తలిదండ్రులను మరల కనుగొనిరి కదా యని చదువరు లనుకొనవచ్చును. వారు బ్రదుకుట రాజుగాని రాణిగాని యొండొరుల యందు కనుగొనిన దివ్యత్వమువలనగాదు, వీరికంటెను వీరి సేవకులు భూతదయాపరులైనందువలన. నే నీకథవిషయమై ఇంతతీవ్రమైన చర్చచేయలేను. ఈకథ కట్టుకథయనియు, కథకుకాళ్లును ముంతకుచెవులును లేవనియు నే నెఱుగుదును. కాని ముద్దా విశ్వనాథముగారు స్త్రీలందరు ఇట్లే పురుషులదుష్కృతులకు తోడ్పడవలెననియు ఇట్టి దుష్కార్యములను ప్రోత్సహించుటయే పాతివ్రత్యమనియు, దివ్యత్వ మెఱుంగుట యనియు వ్రాయుటజూచి యాశ్చర్యమును బట్టలేక ఈవ్యాసమును వ్రాసితిని.

## అక్షరము

అక్షరంబువలయుఁ గుక్షిజీవనులకు
నక్షరంబు జిహ్వ కిక్షురసము
అక్షరంబు తన్ను రక్షించుఁగావున
నక్షరంబు లోకరక్షితంబు.

అక్షరంబు తల్లి యఖిలవిద్యలకెన్న
నక్షరంబు లోకరక్షణంబు
అక్షరంబులేని యబలునకెందును
బిక్షపుట్టఁబోదు పృథ్విలోన.

# స్త్రీలకు విద్యాస్వాతంత్ర్యముల యావశ్యకత

శ్రీమతి మద్దాలి సీతారామమ్మగారు

సూర్య చంద్ర నక్షత్రములెంతగా బ్రకాశించుచున్నను విద్యయే లేనిచో నీజగత్తు అంధకారమయముగ నుండుననుట సత్యదూరముగాదు. తనప్రియపుత్రుని తల్లియెట్లు పోషించిరక్షించునో యటులే విద్యయు మానవుని రక్షించును. కుమారుడు చెంతనున్నపుడుదప్ప నితరప్రదేశము లందున్నచో దల్లి వానిని రక్షింపజాలదు. మానవు డన్యదేశములందున్నను విద్య వానిని తల్లివలె వెన్నంటి కాపాడును. శరీరమునకుగల నేత్రేంద్రియము కంటె మనమునకు గల విద్యా నేత్రము వేయిమడుంగుల ప్రయోజనకారియై యొప్పుచున్నది. నేత్రములు లేకున్నను విద్యానేత్రముచే లోకరహస్యములను గనిపెట్టి ప్రజోపయుక్తముగ నీతిదాయకములగు సద్గ్రంథములు రచియించిన మహనీయు లెందఱో గలరు. ఇట్టి సర్వఫలప్రదాయి యగు విద్య స్త్రీలకు వలదనియు బ్రయోజనము లేదనియు హానికరమనియు స్త్రీలు గృహకృత్యములు చేసిన జాలుననియు స్త్రీల కేవిషయమునను స్వాతంత్ర్య మీయరాదనియు వాదించుచు దానికుపబలముగ బూర్వశాస్త్రములను సాక్ష్యమునకు బిలుచుకొని వచ్చుచు బ్రవర్తించు వారిప్పటికిని మనదేశమున గొందఱుండుట విచారకరము. అమృతమొకరికి హాయినిచ్చి మఱియొకరికి హానిగూర్చునదిగాదు. దేశముయొక్క భావికాల శుభమంతయు సంతానముమీదను సంతానముయొక్క పురోభివృద్ధియంతయు మాతృవర్గముమీదను నాధారపడి యున్నదనుట శుద్ధసత్యము. తల్లులయొక్క విశాలభావములును, తేజస్సారములును, స్వాతంత్ర్యాకాంక్షలును పిల్లలపై బ్రతిబింబితము లగుచుండును. మాతృలక్షణములు శిశువులకు జన్మముతో సిద్ధించు సొమ్ములు. బిడ్డయొక్క శ్రేయోభివృద్ధికి తల్లియే మార్గదర్శకురాలు. బిడ్డయొక్క క్షేమమంతయు తల్లియందు సురక్షితమై యుండును. ప్రతిజీవియు దేహయాత్రకై స్వశక్తిగలుగు పర్యంతము తల్లిపోషణయందును ఉపదేశమునందును నాధారపడియుండును. అట్టి తల్లులు విద్యావివేకములు గలిగి దేహమనోబలములతో విరాజిల్లిన పిల్లలును నట్లే సత్వస్ఫూర్తితో బ్రకాశింతురు. లేనిచో జీవకళలు దప్పి చల్లారియుందురు.

ప్రతిదేశమందును విద్యావతులగు స్త్రీలు తమ సంతతిని జ్ఞానాభివృద్ధికై ప్రోత్సహించుచు, వారిని గుణవంతులుగను, నారోగ్యవంతులుగను జేయగలుగుచున్నారు. విద్యావిహీనలగు స్త్రీలు తమ సంతతియొక్క క్షేమముపై ధ్యాసమెంతయుంచిన నేమిలాభము? వీరు బిడ్డలను యుక్తమార్గములకు ద్రిప్పజాలరు సరికదా దుర్మార్గములనుండి మరల్పనైన సమర్థలు గాకయున్నారు. “మాతయే దైవము. ఆమె మాటయే మంత్రము.” అని విశ్వసింపజేయు జ్ఞానబలమును స్త్రీలు కోలుపోయిరి—కాదు—దుష్టశాసనములచే బురుషులు కోలుపుచ్చిరనుట సహేతుకము. తల్లి పరదేవతయనియు, నిల్లా లర్ధాంగియనియు, కన్య పుణ్యలోకప్రదాయిని యనియు

గుఱుతించిన భారతపురుషులు వారి విద్యాస్వాతంత్ర్యములచే దమకు సిద్ధించు జయమును సంపూర్ణలాభమును గుర్తింపఁగలైరి గదా? పోనిండు! స్త్రీలు గృహకృత్యములు దీర్చిన జాలునందురేని దానికైనను విద్య గావలయుగాదె? గృహములు పరిశుభ్రముగనుంచు విధ మెఱుంగుటకును, తమయొక్కయు శిశువులయొక్కయు నారోగ్యమును రక్షించునిమిత్తము ఔషధములిచ్చు వైద్యులకొఱకు అమితద్రవ్యములు వెచ్చింపకుండ స్వయముగ వైద్యగ్రంథములంజదివి స్వల్పచికిత్సలచే వ్యాధినివారణోపాయము తెలుంగుటకును విద్య యావశ్యకమే గదా? మఱియు స్త్రీలు రాజకీయోద్యోగములందు బ్రవేశింపకున్నను వారికి గృహమునందే వలసినన్ని యుద్యోగములు గలవు. శిశుపోషణాదికృత్యము లాచరించుటయు, భర్త నుపచరించుటయు, బంధువుల నాదరించుటయు నుద్యోగములుగావా? విద్యాబలములేని యబలలు వీనిని యథాక్రమముగ నిర్వహింప జాలుదురా? కావున విద్యకు రాజకీయోద్యోగము లొనర్చుటయే ఫలముగాదు.

పాశ్చాత్యస్త్రీలు ప్రతివిషయములోను మగవారితో సరిసమానమగు బాధ్యత నవలంబింతురనియు సొంత గొప్పవారైనను కాయకష్టమునకు గాని పరిశ్రమలకు గాని వెనుదీయరనియు వినుచున్నారము. మనలో నించుక త్రాణగలిగెనేని యిక నింటిలోని పనిపాటలయందుపేక్షయు, విదేశీయములగు వస్తువులయందపేక్షయు మెండగును. సోమరితనము మన శ్రీమంతురాండ్రయందు రాణివాస మేర్పఱుచుకొన్నది. పనులుదీర్చుట గౌరవహానియను భ్రాంతి సర్వత్ర ముదిరినది. ఇట్టి నాగరికముచే తాత్కాలికసుఖము లభించినను ముమ్ముందు భుజించుటకు అన్నముగూడ కఱవగునను భయము జనించుచున్నది. ఊలుదుస్తులు ధరించుటయొకటి దక్క పాశ్చాత్యవనితలకుగల హెచ్చరికయు, స్వయంకృషియు, దేశక్షేమాభిలాషయు మనయందు గన్పట్టవు. వారి నాగరికతతోబాటు వారి పరిశ్రమవికాసము గూడ మనయందు నెలకొనినచో నిట్లు మితిమీఱిన ద్రవ్యనష్టముండదు. దేశము దారిద్ర్యపీడితము గాదు. కావున మనము దేశమునందును సంఘమునందును గర్భితమైయున్న లోపములను గనిపెట్టజాలిన విద్యానేత్రమును గడించి తిన్మాలమున దేశాభ్యుదయమునకై పురుషపుంగవులకు దోడ్పడుదుముగాక! స్త్రీలకు విద్యాస్వాతంత్ర్యములు లేకుండుట స్త్రీలకంటె బురుషులకే విశేషహానికరమనియు నయ్యవి వారికుండుట పురుషుల శ్రేయోభివృద్ధికే గాని స్త్రీకి ప్రత్యేకపు మేలుకొఱకు గాదనియు నించుక సూక్ష్మదృష్టిగల ప్రతివారికిని బోధపడక మానదు. ఇప్పుడిప్పుడు ఈ విషయము గ్రహింపబడుచుండుటచే మన దేశమున స్త్రీవిద్య కొంతవఱకు వ్యాపించినది. అయిన నది బాల్యావస్థలో నున్నది. ఇంకను ఎంతయో అభివృద్ధి పొందవలసియున్నది. ఆవశ్యకములగు నిట్టి విషయములు పెంపొందినచో ఈ పతనమిట్లుండదు. ఈ దాస్య మెచటికో పోవును.

# మంగోలియా స్త్రీలు

ఆసియాఖండమునందలి మిక్కిలి విశాలమగు దేశములలో మంగోలియా ఒకటి. మంగోలియాప్రజలు అనాగరికులైనను ధైర్యస్థైర్యములు గలవారు. ఆదేశమున సస్యశ్యామలములగు ప్రదేశములు లేకపోలేదు. కాని కొంచము ప్రపంచభూగోళశాస్త్రమును పరిశీలించినవారికి మంగోలియా నామము కర్ణములయందు బడుటతోడనే సైకతసముద్రమనదగిన గోబి ఎడారి జ్ఞప్తికి వచ్చును. అట్టి నిస్సారపృథ్వియందు ఉసురులు నిలుపుకొనవలసినవారు కావుననే మంగోలియా దేశపు స్త్రీపురుషులు బాగుగ ఒడలు వంచి పాటుబడు స్వభావముకలవారుగానున్నారు.

రవ్వలు తాపి వెండిసరిగె గోటుపెట్టి కుట్టిన శిరోభూషణము వివాహితలగు స్త్రీలందఱును వినియమముగా దాల్తురు. వివాహకాలమున వరుడు వధువున కర్పించు కానుకలలో అట్టి శిరోభూషణము మొదటిదిగానుండుట ఆదేశమున ఆచారము. విశేషము అలంకారములపై మోజుగల స్త్రీలు ఆ శిరోభూషణమునకు వెండితీగె పింజెలు వ్రేలాడగట్టి కొందురు.

ఆదేశమున పాదచారులగు గాయకులు హెచ్చు. అనువ్రతయగు భార్య వెంటరా ఆదేశపుగాయకుడు తన సంగీతసాధనముతో ఊరూరతిరిగి పొట్టపోసికొనును.




మంగోలియా దేశపు రాజకాంత

పూరటిల్లిన బుగ్గలు, పూలరేకులవలె సన్ననైన నేత్రములు మంగోలియాస్త్రీల ముఖ్య లక్షణములు. ఆ లక్షణము లీరాజకాంత ముఖమున విస్పష్టముగ ద్యోతకమగుచున్నవి. ఉగ్రసుందరమగు ఆ శిరోభూషణము ఆమె ఠీవికి అనంతదోహదము చేయుచున్నది. కొంచము కదలినను జలతారుజాలరు ఒకవిధమైన మనోహరధ్వనిని గల్గించి వినువారిని సులభముగ వశీకరింప గల్గియు, ఆమె చెప్పిన మాట నెఱవేర్చునట్లు చేయగలిగియు ఉండును.

మంగోలియా దేశమున స్త్రీల స్థితి దుఃఖభాజనముగానున్నది. సంఘమున వారి కున్న స్థానము ఎన్నదగినదికాదు. ఆమె జీవితము మిక్కిలి కష్టముల కాకరము. కావున మంగోలియాస్త్రీలు పెద్దకాలము యౌవనవతులుగానుండరు. కొలదికాలముననే వారి సౌందర్యము డింపుపాటుపొందును. మంగోలియాపురుషుడు తన ఆయమునకు తగిన వ్యయముచేసి భార్యకు అలంకారములు, వస్త్రములు సమకూర్చుటయందు కించపడడు. మంగోలియాప్రజలు ప్రాయికముగా పేదవారే. జీవితావసరములుతప్ప మిగిలినవి సమకూర్చుకొనుటకు వారికి అవకాశములు తక్కువ. అట్టివారుకూడ భార్యలకు మిగుల వ్యయమూలకమగు శిరోభూషణమును కూర్పకపోరు.



మంగోలియా స్త్రీల వింతదుస్తులు

పాయలు పాయలై శిరోభూషణముల కిరుప్రక్కల వ్రేలాడు వేణికలు—బొంతకుట్టు వలె రాటుదేలి యుండి మోకాళ్లవఱకు వ్రేలాడుచుండు గుడ్డసంచులన దగిన జాకట్టుచేతులు—మన పెద్దాపురపు చెడావు జోళ్లను పరిహసింపగల జోళ్లు కలిగి ఆ దేశపుస్త్రీల ఆకారము మనకు చాల వింతగ గనపడును.

ఈశిరోభూషణము కుడియెడములకు పొడుగై కొమ్ములవలెనుండును. మంగోలియా స్త్రీలు తమ జడను రెండు పాయలుగాచేసి కుడియెడమలుగా పొడుగై యున్న శిరోభూషణము యొక్క కొమ్ముల ద్వారా బయటికి వ్రేలాడునట్లు వైచికొందురు. మనదేశమునందలి పెద్దాపురపు చెడావుజోళ్లను పోలెడు జోళ్లు ఆస్త్రీలు ధరింతురు. అన్నిటికన్న విచిత్రమైనదేమన ఆస్త్రీలు ధరించు జాకట్టుచేతులు మోకాళ్ల క్రిందికి వ్రేలాడుచుండును. జాకట్టుకు ఎంతపొట్టిచేతులున్న అంత అందమని భావించు మన స్త్రీల కీయాచారము మిక్కిలి వింతగా కనిపించును.

మంగోలియాదేశీయులు నడుచుటకు సాధారణముగ కంటగిల్లుదురు. గుఱ్ఱముల మీదనో ఒంటెలమీదనో పోవుదురు. వారు ధరించు భారముగల జోళ్లు గమన సౌకర్యమును నిరోధించునవిగా నున్నవి.

మంగోలియాదేశీయుల ఇండ్లు చుట్టుగుడిసెలు. ఒకపెద్ద గుబ్బగొడుగును పోలి యుండును. కఱ్ఱలతో నిర్మింపబడిన ఒక తలుపు ద్వారబంధము మాత్రముండును. గాలి

గొలుసులోనికి వచ్చుటకును పొగ బయటికి పోవుటకును కప్పుపై కన్నము నుంచబడును. ఇంటినడుమున నొకగాడిపొయ్యి. అందు ఎల్లప్పుడు నిప్పు ఉండును. గోడలమీద వంట సామగ్రి ఉంచబడును. ద్వారమునకు ఎదురుగా కులదేవత నెలకొనియుండును. అది శీతలదేశము గుట ఇంటినిండ రగ్గులు ఉండును. మంగోలియా దేశీయులు స్నేహపిచ్చులు. అగుట ఒకరి యింటి కొకరుపోవుచు వినోదజీవితము చేయుదురు. ఇంటికి బయట పిడకలు ప్రోవులు ప్రోవులై పడియుండును. పిడకలనే వారు ఇంధనములుగ నుపయోగింతురు. పరిసరములందు పశువు లుండును. వీటినన్నిటిని కాచుచు రేచుకుక్కలు ఉండును. క్రొత్తవారు వానిపై నొక కన్నుంచి మఱియు నాయింటిని సమీపింపవలయును.



ధనికకుటుంబమునకు చెందిన విలాసవతి

తాల్చియున్న శిరోభూషణము స్త్రీ పాణిగృహీతి యైనదనుటకు చిహ్నము. ఆమె ప్రాణనాథుడు ఆమె కిచ్చిన ప్రథమబహుమానమా శిరోభూషణమే. శిరోభూషణమునుండి జలతారుజాలరు వ్రేలాడుచుండుట గమనింపదగును. అది ఆమె ధనికకుటుంబమునకు చెందిన వ్యాపనుకత్తె యనుటకు మంచి నిదర్శనము.

పాలుపితుకుట, పెరుగు చిలికి వెన్న చేయుట ఇత్యాదికృత్యములు ప్రత్యేకము స్త్రీలే చేయుదురు. పశువులను మేపుకుతోలుకొని పోవుటలో పురుషునకు స్త్రీ బాగుగ తోడుపడును.

మంగోలియా స్త్రీలు అమాయిక హృదయులు. పిల్లల కన్నులుపీకి వానితో కెమేరా లెన్సులు చేయుదురని ఇప్పటికి గూడ వారు నమ్ముదురు. కావున వారు తమ పిల్లలను ఫోటోగ్రాఫరుల చెంతకు పోకుండ ఆగబట్టుదురు.

మంగోలియాదేశమున ఒకవ్యక్తి తన భార్యకు పెట్టు శిరోభూషణముయొక్క విలువను బట్టి ఆతని సిరిసంపదల నెన్నుదురు. అగుటనే పెండ్లికొడుకులు సాధారణముగ తాము నిలువచేసియున్న ధనము నంతటిని ఆ శిరోభూషణమును చేయుటయందే వెచ్చింతురు. మంగోలియా స్త్రీలు పురుషులకువలెనే గుఱ్ఱముల నెక్కుదురు. స్వారీచేయుదురు. పురుషుడు ఆమెను ప్రేమతోడనే చూచును; కాని స్త్రీ పురుషునకు లొంగు అను అభిప్రాయము మాత్రము వారియందు గాఢముగ నెలకొనియున్నది.



### పంద్రెండేండ్ల బాలిక పత్రికా సంపాదకురాలు :—

అమెరికా సంయుక్తరాష్ట్రములకు చెందిన న్యూయార్కు మహాపట్టణము చెంతగల లాంగు ఐలెండు నందలి ప్రధానపట్టణమగు డౌగ్లాస్టనునందు మార్సియా అనునొక పంద్రెండేండ్ల బాలిక చార్లీబేకను అను పదిసంవత్సరముల వయస్సుగల తన తమ్ముని తోడ్పాటుతో నొక వారపత్రికను నిర్వహించుచున్నది.

### గొప్ప సైకిలిస్టు :—

ఆల్ ఫ్రిడో బిండాగారు యిటలీవాస్తవ్యులు. వీరు ఒకగంట పదినిమిషములలో 50 కిలోమీటరుల దూరము సైకిలు మీద ప్రయాణముచేసిరి. ప్రపంచములో నింతవరకు నింతస్వల్పకాలములో నింతదూర మెవరును ప్రయాణముచేయలేదు.

### అమెరికాలో మోటారుప్రమాదములవలని మరణములు :—

అమెరికాఖండమున మహానగరములలో మాసము ఒక్కంటికి సగటున ఇరువదిమంది మోటారు ప్రమాదములవలన మరణించుచున్నట్లు తెలియుచున్నది.

### కృత్తికానక్షత్రము :—

పెద్దల పాదముల చెంతకూరుచుండి సంవత్సరములు, మాసములు, తిథులు, నక్షత్రములు మొదలగు వాని నామములు వల్లించిన విద్యావతులకు ఆకాశమున పిల్లలకోడివలెనుండు కృత్తికానక్షత్రమును చూచి యుందురు. కృత్తికానక్షత్రము అని ఏకవచనమున పలుకుట వాడుక. కాని నిజముగా అదికొన్ని నక్షత్రములరాశి. సాధారణదృష్టిగల నేత్రములకు ఆరాశిలో ఆఱు చుక్కలు కాననగును. నిశితదృష్టిగల నేత్రములకు ఆగుంపులో ఏడునక్షత్రములు చూపట్టును. తీక్ష్ణనిశితదృష్టిగలవా రానక్షత్రసమూహమున పదునొకండు రిక్కల లెక్కింపగలరు. 1579–వ సంవత్సరమున–దుర్భిణి (Telescope) యంత్రము అప్పటి కింకను కనుగొనబడలేదు–శాస్త్రజ్ఞుడు మెస్లింగు కృత్తికానక్షత్రముయొక్క రూపపటమును ప్రచురించెను. ఆరూపపటమున పదునొకండు రిక్కలుమాత్రమే చూపబడియుండెను. దూరదర్శిని యంత్రము కనుగొనబడిన తరువాత ఆయంత్రసాయమున కృత్తికానక్షత్రరాశియొక్క ఛాయాపటముగైకొని అందలి చుక్కలను లెక్కింపగా రెండువేలఆఱువందలపదహారు ఉండెను.

## జలప్రళయము:—

ప్రపంచమునందలి అన్నిమతగ్రంథములు ఒకప్పుడు ప్రపంచమునకంతకును జలప్రళయము సంభవించిన దనియు, ముందెన్నడో యిట్టిది జరిగి సర్వలోకమును నాశనముచేయుననియు చెప్పుచున్నవి. దక్షిణధృవము చెంత అనంతమైన మంచుకొండలుగలవు. ఈమంచుకొండలు ఒక్కసారి ఉద్బేత్తుగ కరిగిపోవునేని అప్పుడు ఏర్పడిన నీటివలన ప్రపంచమునందలి మహాసముద్రముల నీటి మట్టము ఏబది అడుగులు పైకెక్కునని మదింపు వేయబడినది. కాని ఒక్కసారి ఉద్బేత్తుగ ఆమంచు అంతయు కరగుట అసంభవము. కొంచము కొంచముగా కరగుచున్నది. సముద్రములందలి నీటిమట్టమును కొంచెము కొంచముగా పైకెక్కుచున్నది. అయితే ఇంతట అంతట ప్రమాదము మాత్రము లేదు. ప్రపంచచరిత్రలో మంచుకరిగి జలప్రళయమేర్పడి లోకమును ముంచి ఇప్పటికి దాదాపు ఇరువదివేల సంవత్సరములయి ఉండునని శాస్త్రజ్ఞులు ఊహించుచున్నారు.

## కొత్తమోస్తరు చేతిగడియారములు:—

కొత్తమోస్తరు చేతిగడియారములు కనుగొనబడినవి. వీనికి 'కీ' ఇవ్వనక్కరలేదు. ఇట్లనుటచే గడియారమును నిరంతరము త్రిప్పుచుండగల యంత్రము కనుగొనబడినదని ఊహింపరాదు. ఈకొత్తమోస్తరు చేతిగడియారములు తమ్ముధరించు హస్తములు చలించినపుడెల్ల 'కీ' తిరుగుచుండును.

## అమెరికా సంయుక్తరాష్ట్రమున హత్యలు:—

అమెరికా సంయుక్తరాష్ట్రమునందు సంవత్సరమునకు సగటున 12,000 హత్యలు జరుగుచున్నవి. గ్రేటుబ్రిటనునందు సంవత్సరమునకు సగటున జరుగు హత్యలకు ఇవి ఏబది రెట్లున్నవని తెలియుచున్నది.

## జర్మనీ దేశమున పట్టభద్రులు:—

జర్మనీదేశమున దాదాపు రెండులక్షల ఏబదివేలమంది పట్టభద్రులు పనులు లేక అల్లాడుచున్నారు. విశ్వవిద్యాలయములు ఏటేట వీరి సంఖ్యను వేలకొలదిగా పెంచుచున్నవి.

## 300 వేల సంవత్సరముల నాటి అస్థిపంజరము:—

ఉత్తర ఆఫ్రికాలో డెటుయిన్‌దగ్గర ముప్పది అడుగులపొడుపు ఎనిమిది అడుగుల నెత్తుగలిగిన ఒక జంతువుయొక్క అస్థిపంజరము భూమి త్రవ్వుచుండగా బయలుపడినది. ఇది దాదాపు 300 వేల సంవత్సరముల నాటిదై యుండునని శాస్త్ర పరిశోధకుల అభిప్రాయము.

## సంతానమో, విడాకో?—

ఫిలడెల్ఫియాలో నొక విచిత్రమైన వివాహము జరిగినది. విలియము మోయరు అనువాడు వరుడు. ఆతడును వధువునుకలిసి ఒక దస్తావేజు వ్రాసికొని రిజస్టరు చేయించుకొనిరి. అందు ఈదిగువ షరతు గమనింపదగినది. "మేముగృహస్థాశ్రమమున ప్రవేశించిన రెండుసంవత్సరముల లోపున సంతానమును పొందజాలనిచో ఒకరి నొకరు సంప్రదించుకొనకయే విడాకును గ్రహింపవచ్చును." ఈకంట్రాక్టు పద్ధతిని వివాహము జరిగినపిమ్మట విలియము మోయరు ఇట్లు చెప్పెను. "ఈమావివాహము సంతానోత్పాదనముకొఱకు చేయబడుచున్న ఒక పరీక్ష." వివాహధర్మమనగా పాశ్చాత్యులకెంత తేలికగానున్నదో!

# వనితాలోకము

**శ్రీమతి హరి వేంకటరమణమ్మగారు:—**



హరి వేంకటరమణమ్మ

మద్రాసునందలి సి. కుమారస్వామినాయుడు అండు సన్సు వారిచే ప్రచురింపబడుచున్న 'కుమారబోధిని' అను మాసపత్రికను సమర్థతతో సంపాదించుచున్న శ్రీయుత హరి సుబ్బారావుగారి పుత్రిక. ఈమె 1906—వ సంవత్సరమున సెప్టెంబరు మాసము పదునాఱవ తేదీని జననమొందినది. తెలుగు, ఇంగ్లీషు, సంస్కృతము, హిందీ భాషలయందు ఈమెకు ప్రవేశముగలదు. రాజమహేంద్రవరమున స్కూలుఫైనలు వఱకు చదివినది. చెన్నపురివచ్చి ప్రవేశపరీక్షలో జయముగాంచి ఇంటరుమీడియటు క్లాసులో జేరినది. కాని అనారోగ్యముచే చదువు మానివేయవలసివచ్చినది. ఈమెఇప్పుడు మద్రాసు నగరమున నివసించుచు విశ్రాంతి తీసికొనుచున్నది. టైపు, షార్టుహ్యాండులతోకూడ నీమెకు పరిచయము గలదు.

**శ్రీమతి కొరప్రోలు వేంకటరంగమ్మగారు:—**

ఈయమకాపురము పశ్చిమగోదావరి మండలములోని గోపాదక్షేత్రము. (కొవ్వూరు) సంస్కృతాంధ్రములయందు మంచివిజ్ఞానముగల స్త్రీరత్నము. ఈమెతనకాలమునంతను స్త్రీలకు నీతిబోధ, మతబోధచేయుటయందు వినియోగింపుచు పలువుర మన్ననల నందుచున్నది. శ్రీ శంకరాచార్యులవారిచే సంస్కృతమున రచియింపఁబడిన శివానందలహరిని ఆంధ్రీకరించినది.



కొరప్రోలు వేంకటరంగమ్మ

**శ్రీమతి బి. వి. సుబ్బమ్మగారు:—**

ఈమె నెల్లూరుజిల్లాబోర్డు సభ్యురాలుగా నియమింపబడినది. ఇంతకుముందీమె నెల్లూరుజిల్లా విద్యాసంఘ సభ్యురాలుగ నుండి ప్రజాసేవచేసియున్నది.

ప్రతిమాసేనుకన్య :—

రంగూను నగరములోని వంగపరిషత్తునందలి వంగశాఖకు చెందిన సంగీతపరీక్షలో అత్యద్భుతవిజయముగాంచి బంగారుపతకమును బహుమానము పొందినది.




చిర్రావూరి సుబ్బలక్ష్మమ్మ

చిర్రావూరి సుబ్బలక్ష్మమ్మగారు :—

ఈమె రాజమహేంద్రవరనివాసిని. బియ్యే పరీక్ష ప్యాసుచేసి యల్. టి. పట్టమును పొందినది. ఈమె ప్రస్తుతము మచిలీపట్టణమునందలి స్త్రీల బోధనాభ్యసన పాఠశాలలో ఉపాధ్యాయినిగానున్నది.

ఇందుమతి దివానుసతి :—

ఈమధ్య అహమదాబాదు నగరమున జరిగిన గుజరాతురాష్ట్రీయ మహిళా సభయొక్క నాల్గవ సమావేశమునకు అధ్యక్షురాలుగా నెన్నుకొనబడినది.

శాంతా వాసుదేవ సూక్తంకరు కన్య :—

ఇందూరు సంస్థానములోని పాఠశాలావిద్యా శాఖాధికారియగు డాక్టరు. వి. యె. సూక్తంకరు (పి. హెచ్. డి) గారి కూతురు. ఆగ్రావిశ్వవిద్యాలయమున బియ్యేడిగ్రీపరీక్షలో ప్రథమురాలుగా జయముగాంచినది. ఆపరీక్షలో ఇంగ్లీషున గరిష్ఠ సంఖ్యగల మార్కులు వచ్చినందులకీయబడు జోన్సు మెమోరియలు మెడలు కూడ పొందినది.



శాంతావాసుదేవసూక్తంకరుకన్య

రమణభాయి నీలకంఠసతి :—

ఈమె బియ్యే పరీక్షనిచ్చిన విదుషి. అహమ్మదాబాదు జాతీయ భారతసంఘమునకు 1930—వ సంవత్సరమునందు గౌరవకార్యదర్శినిగ నియమింప బడినది.




## పెండ్లి ఆగినందులకు ఆత్మహత్య :—

పునహా పట్టణమున నివశించుచున్న రాజగోపాలమొదలియారు అను మదరాసీ ఆయుర్వేద వైద్యుడు పదునారు సంవత్సరముల వయస్సుగల తన కుమార్తె వివాహము నిమిత్తము అయిదువందల రూపాయిలు నిలువ చేయలేక లెక్కలేనన్నిసారులు పెండ్లిని ఆపుచేయుచువచ్చెను. తండ్రియొక్క పేదతనము తన వివాహముకొఱకు అతడు పడుచున్న మనోవేదన చూచి విసిగి విచారించి ఆతనికూతురు తల్లిదండ్రు లింటలేని సమయమున ఉరిబోసికొని ఆత్మహత్య గావించుకొనెను. ఇట్టి మరణములు హిందూదేశమునకు క్రొత్తలుగావు. 1913—వ సంవత్సరమున ఇట్టి సందర్భములయందే మరణించిన పదునాలుగు సంవత్సరముల వయస్సుగల వంగ బాలిక స్నేహలతాదేవి చరిత్ర ఇప్పట్టున స్మరణకు వచ్చుచున్నది. చనిపోవుటకు ముందు ఆ బాలిక తన తండ్రికి ఒక లేఖ వ్రాసినది. ఆ లేఖ హృత్పిండమును చిదిపి చిద్రుపలుగా చేయగల కరుణరసముతో నున్నది. దాని నిచ్చో ఉదాహరించుట అప్రస్తుతము కాదు.

"మిక్కిలి పూజ్యమైన తండ్రీ!

మనఇల్లు తాకట్టుపెట్టి నావివాహముచేయ బ్రయత్నించుట నాకు మిక్కిలి కష్టముగానున్నది. ఆ ప్రకారము చేయవలసిన పనిలేదు. రేపు సూర్యోదయములోగా పాపిష్టిముహూర్తమున జన్మించిన నీ ఈ నిర్భాగ్యపు కుమార్తె ఈ లోకము వదలి ఈ కష్టములు, దుఃఖములు లేని పరలోకమున కరిగి యుండును. తండ్రీ! మీరు నన్నెంతయో గారాబముతో చూచుచుంటిరి. రాజకన్యలకంటెను సౌఖ్యమునందోలలాడుచుంటిని. ఇట్టి స్థితియందు నామూలమున ఇంటిలోని వారంతయు నిలుచుండుటకు స్థలమైనను లేక వీధిలోనికి బోవుట యెంత చక్కగ నున్నది! నాయనుంగు తండ్రియగు మీరు యావజ్జీవపర్యంతము దుఃఖమును, దారిద్ర్యమును ననుభవింప దలచుట యెంత కష్టము? నాయనా! మొన్న ప్రొద్దునమొదలు సాయంకాలము వఱకు తిరిగి, తిరిగి అలసిసొలసి కాళ్లు బొబ్బలెక్కి యిల్లుచేరినపుడు మిమ్ములను చూడగా ఎంతయో విచారగ్రస్తమగు మొగముతో నుంటిరి. అట్లు మీవంక జూచుచుండగా 'అంతయు పోయినది' అని మీరు మెల్లగా అనుకొనుట వింటిని. అది మొదలు నేనెంత మఱచిపోవుదమన్నను మీ మొగము మీద విచారము మఱపునకు రాకున్నది. నాడు మీరనుకొనిన మాట లింకను చెవులలో గింగురుమని మ్రోగుచున్నవి. నా వివాహమునకగు ధనమును నెచ్చటనయినను దెచ్చుటకయి విశ్వప్రయత్నము లొనర్చితిరి. ఎంత కష్టపడినను ఫలములేకపోయెను. తుదకు నిరాశయులై వేఱుతెఱువు లేక ఉన్న ఒక్క యింటిని దాకట్టుపెట్టి ఈ ద్రవ్యము నొనగూర్ప బ్రయత్నించుచుంటిరి. ఈ కథయు నేనెఱుగుదును. తండ్రీ! ఈ సంగతి తెలిసి నప్పటినుండియు

నా కెంతయో కష్టముగ నున్నది. నా వివాహము నిమిత్తమే కదా మీ రిన్ని కష్టములు పడుచున్నారు. అది లేనిచో మీ కీ కష్టములుండవు గదా! నా కింతకాలము వివాహము చేయక ఆపియుంచినందునకయి ఎంతయో అపనింద పాలయితిరి. నాకు తగిన సంబంధము కుదుర్చుటకయి ఎన్నిశ్రమలలో పడితిరి. మన పూర్వుల యొక్క ఈ గృహమున నితరులువచ్చి అడుగుపెట్టుట యెన్నడు సంభవింపదు. ఈ వివాహము నిమిత్తమై మీరుకాదు కష్టపడవలసినది. నేనే పోయిన యెడల మీ కష్టములన్నియు తీరునుగదా! నాన్నా! బరద్వాను జిల్లాలో మొన్న వరదలువచ్చి జనులు బాధ పడుచుండగా ఎందరో ఉదారగుణ సంపన్నులు, విద్యాభూషితులును నగు యౌవనులు పరోపకారమునకయి వెళ్లిరని వింటిని. ఆపద్బాంధవులును, దయారస పూరితులును, నగు నీ యౌవనులను భగవంతుడు రక్షించుగాక! ఎచ్చటనో దూరమున దక్షిణాఫ్రికాయందు మన దేశీయులు కష్టపడుచున్నారని విని ఎందరో యోగ్యులగు చిన్నవాండ్రు యిల్లిల్లు తిరిగి బిచ్చమెత్తి ద్రవ్యము పోగుచేసిరని మొన్ననే వింటిని. ఇట్టి దేశహితైషక సేవజేయుచున్న వీరందఱు ధన్యులు. కాని స్వజనుల కష్టములను విచారించు వారెవరు లేరా? నిన్నటిరాత్రి నేనొక కల గంటిని. ఇదివఱ కెన్నడు నట్టి శ్రావ్యమగు గానము విని యుండలేదు. లోకమాతయగు దుర్గ సాక్షాత్కరించి చిరునవ్వు నవ్వుచు నన్ను 'రా! రా!' అని చెప్పినది. అప్పుడు మీరు జ్ఞప్తికి వచ్చితిరి. ప్రియజననియు స్మరణకు వచ్చినది. ఇంటిలోని పిల్లలందఱు కండ్లయెదుట నుండిరి. వీరినా నేను దుఃఖపెట్టునది యని విలపించి, యా మాతయొక్క దయాసంకల్పితమగు నాజ్ఞను శిరసావహించుచు ఆలింగనము చేసితిని. ప్రియమైన తండ్రీ! నేను పోయిన పిమ్మట మీరందఱు నెంతయో ఏడ్చెదరని నే నెఱుగుదును. పోయిన నేను పోయెదను! ఇల్లు మాత్రము మన క్రిందనే యుండును. మీ కష్టములన్నియు తీరును. నిప్పా, నీళ్లా, విషమా? దేని సహాయమున జీవయాత్రను ముగింపవలయునో యని యోచించి తుదకు మొదటిదియే యుక్తమయినదిగ నెంచితిని. ఈ రోజున నేను ముట్టించు నగ్ని దేశమంతయు నలముకొను గాక!

ఇట్లు

మీదుగదృష్టపు కుమారితె, స్నేహలత."

## కోడలి కష్టపాటు:—

ఇది రత్నగిరి జిల్లాలో జరిగిన విషయము. కృష్ణాబాయి అను నామె పదునెనిమిది సంవత్సరముల పడుచు; సుందరవల్లభపా అను వాడామె మామ; అత్తపేరు గంగాబాయి. అత్తమామ లిరువురును కోడలిని అమితమగు కష్టములకు లోను చేయుచుండిరి. అది ఆమెకు ఆదినమున కా దినము దుర్భరమగుచుండెను. ఒకనాడు సుందరవల్లభపా కోడలిపై కోపమువచ్చి ఆమె రెండుచేతులను గట్టిగబట్టుకొని తన భార్యయు, కోడలిని కష్టపెట్టుటలో తన సహధర్మచారిణియునగు గంగాబాయిని పిలిచి కాలీకాలని కొఱవితెచ్చి ఏడ్చుచున్న కోడలినోట బెట్టుమనెను. అత్తగారా కార్యమును అతిశీఘ్రముగ నెఱవేర్చెను. అత్తమామ లింతచేసినను కృష్ణాబాయి ఓర్చియుండెను. మఱియొకనాడు అత్త ఆగ్రహాయత్తయై కోడలిని మొత్తి ఒక చీకటింట పెట్టి తాళము వేసెను. అందామె మూడు రోజులుండెను. ఈ లోపున ఆమెకు ఒక్కసారిమాత్రమే అన్నాహారములు ముట్టెను. మూడవనాటి సాయంకాలము కృష్ణాబాయి పినతండ్రి వచ్చి జరిగిన సంగతినంతను గ్రహించి కేసు చేసెను. కేసు విచారణ జరిగెను. మేజస్ట్రేటుముందల కృష్ణాబాయి ఇట్లుపలికెను. "కాపురమునకు వచ్చినప్పటినుండియు నేను దెబ్బలు తినని రోజులేదు. దూరమున నున్న నూతినుండి నలుబది బింగెలనీళ్లు తెచ్చి దినదినము దొడ్డిలో పోయవలసినదిగా ఆజ్ఞచేసిరి. ఆ నీళ్లు మొక్కలకు మొటికలకుగాదు. అనవసరముగా నాకు పనికల్పించుటకే తెప్పించుచుండిరి. తారుతో కలుపబడిన ఆహారము తఱుచునా కిచ్చుచుండిరి. అది తిననిచో చంపుదుమని భయపెట్టుచుండిరి. ఒకసారి నన్ను ఇనుపమేకులు కొట్టిన కఱ్ఱతో బాదిరి. నేను రాత్రిళ్లు నిద్రించుటకు కూడ వీలు లేకుండెను. రాసులు రాసులుగా నున్న బియ్యము బాగుచేయుట ప్రతిరాత్రియు విధ్యుక్త విధిగానుండెను." కేసు విచారణ ముగించి మేజిస్ట్రేటుగారు సుందరవల్లభపాగారికి తొమ్మిదిమాసముల కఠినశిక్షయు, రెండుపందల రూపాయిల జరిమానాయు విధించిరి.

# గ్రంథవిమర్శనము.

**చంపకమాలిని:—**

ఇదియొక తెలుగునవల. గ్రంథకర్త్రి ఆంధ్రగీర్వాణకర్ణాటభాషలలో ననేక గ్రంథములు వ్రాయుచు భాషాసేవ చేయుచున్న సుప్రసిద్ధ విదుషి శ్రీమతి ఆ. రాజామ్మాళ్. గ్రంథము క్రౌను సైజున 246 పుటలు. ఇరువది ప్రకరణములు. శైలి సులలితమనోహరములగు పదములును, ముద్దులొలుకు చిన్నచిన్న వాక్యములును, అచ్చటచ్చట జనువరుల కుత్సాహము జనింపఁజేయు లోకోక్తులును గలిగి యెంతయు సర్వజనాస్వాదనీయముగా నున్నదని చెప్పుట యర్థవాదము కాదు. ఇతివృత్తము రాజపుత్రస్థానమునకుఁ జేరిన యొక గొప్ప కథ. కరుణారసము ప్రధానమయ్యును, గ్రంథము నవరసభూయిష్టము. గ్రంథము పండితపామరవనితా జనతా హృదయంగమము. కథయొక్క ముఖనిర్వహణాదులు శ్లాఘనీయములు. సర్వగుణవిశిష్టములగు నిట్టి గ్రంథములు అనేకములు వ్రాసి లోకోపకృతికిని భాషాభివృద్ధికిని పాటుపడుచున్న రాజామ్మాళ్ గారికి భగవంతుడు దీర్ఘాయువు నొసంగుత. గ్రంథము వెల రు. 1-0-0. వలయువారు గ్రంథప్రకాశకులగు శివా అండు కో అడయారు మద్రాసుకు వ్రాసినఁ బడయగలరు.

—ఉభయభాషాప్రవీణ బులుసు నరసింహశాస్త్రి.

**బాల్యవివాహతత్త్వసారము:—**

గ్రంథకర్త ఆంధ్రలోకమునకు పరిచితుడగు అచ్యుతుని వేంకటాచలపతిరావు. ఈయన బహుద్రష్టయని వారి వేదభూమి యను గ్రంథమే చెప్పుచున్నది. ఈ గ్రంథము కూడా చాలా పరిశ్రమ చేసి వ్రాసినదియే. దీని ప్రధానోద్దేశ్యము శారదాబిల్లు అనవసరమని యుక్తియుక్తముగా ప్రముఖులగు పాశ్చాత్యుల వ్రాతలను పట్టియే విశదపఱచుట. ఇది నూరుపుటలకు పైబడి, ఆరు అధ్యాయములుగా విభజింపబడినది. ప్రౌఢవివాహములు చేయుచుండుటచే, పాశ్చాత్య సంఘ మెట్టి దుర్దశలకులోనై లోలోన కుమిలి క్రుళ్లి పోవుచున్నదో, అక్కడి మహామహులగు జస్టిస్ లిండ్సే, హేవలక్ ఎల్లిసు, మేరీస్టోప్సు మొదలగు నెందరో ప్రఖ్యాతగ్రంథకర్తల గ్రంథములలోనుండి నిదర్శనములతో ఈ గ్రంథమున జూపబడినది. మరియొక చిత్రమేమన ఇక్కడవారెల్ల రజస్వలానంతరవివాహములు కావలెనని యోచనావిరహితమగు ఘోషచేయుచుండ నెందరో పాశ్చాత్య ప్రముఖులు మన బాల్య వివాహములే చాలా మంచివని యొసంగిన యమూల్యాభిప్రాయము లిందు పొందుపఱుపబడినవి. తీవ్రసంస్కార ప్రభుత్వమున, క్షిప్రధావనమున కాంక్షించు వారి కిది మందగమనము నేర్పి వారిని జిజ్ఞాసువుల జేయగలదు. ప్రవాహగమనమున కొట్టుకొని పోవుచున్న సమాజమున కిది ఆనకట్ట. కాని కొన్నిచోట్ల ఈయన హేతువాదము చాలా నీరసముగా ఉన్నది. పాశ్చాత్యులు

చెప్పినంతమాత్రమున మనకు శిలాక్షరములు కావు. సంపూర్ణవ్యత్యాసము గల మార్పులు మన కవసరము లేకపోయిననూ ప్రస్తుతపరిస్థితులలో నతిబాల్యవివాహములు కూడదని మా తలంపు, దీని వెల ఒకరూపాయి. వలయువారు మేనేజరు, స్వధర్మప్రకాశిని, కీలుపాకు; మదరాసు. అని వ్రాయునది.

—పెమ్మరాజు రాజగోపాలము బి యె.

కలువరేకులు:—

కర్త బి. టి. కె. ఆచార్య (కవిసమార సమితి). ఇది మస్తాదురంత వేదనాదోదూయమానమైన ఈ మహాంధకారదుర్గంధ కలుష సీమల అసిధారావ్రతచర్య సలుపలేనని ఏడ్చిన ఒక కవికుమారుని భావ ప్రపంచ. ఇందు భక్తుని యొక్క భగ్నహృదయము, మానవుని యొక్క మాలిన్యత, పాపియొక్క పశ్చాత్తాపము చిత్రతరముగ చిత్రింపబడినవి. 'ప్రణయ తన్మయత్వమున ప్రాణములు విడువ' నెంచిన యీకవికుమారుని 'యొకమూల కాలుసేతులకు సంకెళ్లువైచి' 'కాలజాలరాసి భూరుహ పంజరాంతరమున ఖడవేయుట' చేత 'గుండెపగులంగ మోది నిగూఢ పతిత మలిన శోణితమెగచిల్చి, జలకమాడి పాడుదేహంబుపై మహాప్రళయ కాళిని వచ్చి తాండవమాడు' మని ప్రేమతో నాహ్వానించుచున్నాడు. తెగని జీవితపర్యంత తృష్ణచేత తుదకు విసిగి వేసారి 'యానంగాచియు నక్కలపాలు చేసిన' భగ్నజీవితముకొరకై పరమేశ్వరు పాదారవింద ధ్యానమున మైమరచి విలపించిన ఘట్టము లద్భుత భయానక శోకరసములు వెల్లివిరియ జేయుచున్నవి. ఇట్లు మానసిక పరిస్థితుల నిజస్థితిని 'హృదయ నిర్గతరుధిరబిందు వర్షమ్ములు' గీతాలు గాగురియింప జేయుటలో 'పాడులోకంబు ననుజూచి పగలబడు' నని అనుమానపడియు ధైర్యముతో చిత్రించిన యీకవికుమారుని స్వాతంత్ర్యేచ్ఛ ప్రశంసనీయమై తుదకంటు నెగ్గింపజేసినదని చెప్పగల్గుటకు సంతసించుచున్నాను. కృష్ణపక్షములోని అంధకారము, మునిమాపులోని ఆవేదన, కన్నీరులోని కాలుష్యము యీతడీ కలువరేకులలో నిమిడ్చి 'సూక్ష్మములో మోక్షము' సంపాదించినాడు. భాష నాతిసులభమై లలితపదభూయిష్టమై యొప్పుచున్నది. పదప్రయోగము, అన్వయలాలిత్యము అచ్చటచ్చట యించుక సొంపుచెడినను మొత్తముమీద యీ ౨౬ పేజీల చిన్నపుస్తకములో ఇన్ని మహత్తరమైన భావవేదన లిమిడ్చి ఆధునికవాఙ్మయమున కలంకారప్రాయమై యొప్పునట్లు చెప్పగల్గుట కెంతేని మోదమందుచున్నాను. దీనికి ప్రఖ్యాతపురుషులైన శ్రీసోమనాథ వెల్లటూరు గారు యింపగు పీఠికను వ్రాసియున్నారు. గ్రంథము వెల నాలుగు అణాలు. వలయువారు త్రిప్లికేను నందలి వనవిహారిప్రచురణాలయమునకు వ్రాసిన బడయగలరు.

—పి. లన్నాజీశర్మ.

ప్రణయసౌరభము:—

ఇది నాలుగు వీచికలుగల యొక యాంధ్రపద్యకావ్యము. ఇందలి పద్యములు రూపకోపమాద్యలంకార సంఘటితములును మృదుమధుర పదసంయోగములును నై యాకర్షించుచుఁ బాఠక మహాశయుల నానందసాగరమగ్నమానసులం జేయుచున్నవని నొక్కిపక్కాణింపవచ్చును. గ్రంథప్రణేతలచే నీగ్రంథ రాజమునందు విప్రలంభ శృంగార మతిమనోహరముగాఁ బరిపోషింపఁబడినది. ఉద్యానవనమునందుఁ బ్రథమమున శ్రీధరుఁడను నాయకునిచేఁ బ్రేమింపఁబడిన నీలయను నాయిక యాతనిం దూలనాడి నిజనివాసమును జేరిన వెనుక యాతనియందనురక్తమానసయై తదీయరూపరేఖావిలాసములనే మాటిమాటికి స్మరిం

చుచుఁ, దన్ను దూషించుకొనును. శ్రీధరుఁడును సుందరాంగియగు నానవలారత్నముయొక్క పొందు తనకు లభింపమింజేసి వెల్లుగఁజింతిల్లును. సుశర్మయను విప్రోత్తముఁడాత్మమిత్రమగు శ్రీధరుని మనోరథమును సిద్ధింపఁజేయఁ దలంచి నీలకడకరిగి తనచెలికాని కాపెయందున్న ప్రేమాధిక్యము నుగ్గడించును. ఆపెయు నతనివాక్కులచేఁ బరమానందభరితచిత్తయై సుశర్మంగూడి శ్రీధరుని నిలయముంజేరును. పిదప మహావైభవముతో నీలాశ్రీధరులకుఁ బాణిగ్రహణము జరుగును. మరియునిందు నాయికానాయకుల ప్రేమసారమును, శ్రీధరుని యందు సుశర్మకుఁగల మైత్రీవాత్సల్యమును వర్ణింపఁబడుటచే "ప్రణయసౌరభము" అను నామధేయ మీచిన్నపొత్తమున కత్యంతము అన్వర్థమై యున్నది.

ఈ గ్రంథమునందలి యుద్యానవన వర్ణనము, వసంతర్తువర్ణనము, జలాశయ వర్ణనము. మొదలగునవి ప్రాచీనమహాకవులకల్పనాసరణులం దులతూగుచున్నవి. కొండపల్లి గోపాలరావు, హరిరామలింగశాస్త్రి గార్లచే నీ గ్రంథము రచింపఁ బడినది. ఇది క్రౌను సైజున 62 పుటలు గలవు. వెల 12 అణాలు. వలయు వారు హరిరామలింగశాస్త్రిగారు, కలవపాముల, కాటూరుపోస్టు, కృష్ణాజిల్లా; అను చిరునామాకు వ్రాసి నచోఁ బడయఁగలరు.

—విద్వాన్ వేటుమళ్ల పాపయ్యశాస్త్రి.

కంసవిజయము :—

బమ్మెర పోతనామాత్యుని భాగవతము నందలి కంసవధను గూర్చిన కథాభాగమును దీసికొని అచ్చ తెనుఁగున రచింపఁబడిన ప్రబంధము. గ్రంథకర్తయగు పాటిబండ పురుషోత్తమ కవి క్రీ. శ. 1810–1882 సంవత్సరముల మధ్య కాలమునందుండిన వాఁడగుటచేత మిగుల నాధునికుఁడు. ఉభయభాషాప్రవీణ మిన్నికంటి గురునాథశర్మగారు 'తెలివిడి' యను శీర్షిక క్రింద కవియొక్క చరిత్రమును కొంత పాఠకలోకమునకుఁ బ్రకటించిరి. కవి యార్వేల నియోగి బ్రాహ్మణుఁడు. గుంటూరు జిల్లా సత్తెనపల్లి తాలూకాలో పాటిబండ యను గ్రామమునందుండిన వాఁడు. ఆయూరి కరణమగు నుత్తరార్యునకుఁ బుత్రుఁడు.

క. ఆయుత్తరునకు నేనును
బాయని తిరయసముగల్గు బలియుఁడు గురుమూ
ర్తి యనగా దగు నతఁడుం
బోయము బుట్టితిమి నల్వతొయ్యలి కూర్మిన్.

అని కవి తన తమ్ముఁడగు గురుమూర్తిని వర్ణించి

చ. అతనికి పెద్దవాఁడ దొలి యయ్యలమేటి పసిండి కొండచే
జతపడియుండు ముక్కనులసామికి బత్తుఁడఁ బాటిబండలో
నతకిన మన్కివాఁడ నరయం బురుషోత్తము పేరివాఁడ మే
ల్కతలతికించి కబ్బములుగా నొనరింపఁగలాఁడ గొబ్బునన్.

అని తన్నుదా గూర్చి చెప్పుకొనెను. సోదరు లిరువురును తమ కాలమున గొంత ప్రసిద్ధి గన్నకవులు. 'తెలివిడి' యందు మిన్నికంటి గురునాథశర్మగారు "మనకవిగారి యన్నగారైన గురుమూర్తిగారు ఋష్యశృంగోపాఖ్యానమను మహాప్రబంధమును రచించిరి." అని వ్రాసిరి. 'అతనికి పెద్దవాఁడ' అని కవియే చెప్పుకొనుటను

బట్టి గురుమూర్తిగారన్నగారిని వ్రాసిన గురునాథశర్మగారి మాట పరిత్యాజ్యము. 'కంసవిజయ' మని గ్రంథమున కీకవి యేల పేరిడెనో తెలియకుండనున్నది. లోకకంటకుండగు కంసహంతకుని సంహార మభివర్ణించు నీ కావ్యమున కీ పేరిడుట సమంజసముగా లేదు. అచ్చతెనుగున కావ్యమొనర్పగలమను నేర్పు చూపించుటకై కొందఱు కవులిట్టి గ్రంథముల వ్రాయుచువచ్చిరి. వారియందు మిశ్రభాషయందలి యందము కాని, పటుత్వముకాని, అనర్గళధారకాని పొసగియుండలేదు. అచ్చతెనుగు పదము లాంధ్రభాషయందు పరిమితిని మించియుండకపోవుటచేత సామాన్య ప్రజ్ఞావంతులగు కవులు కొన్ని శుద్ధాంధ్ర కృతులజేసి కవితాసతిని కుంటికుంటి నడకల నడువ నేర్పిరి.

అచ్చతెనుగు కావ్యములలో దొలుతఁజెప్పఁదగినవి పొన్నికంటి తెలఁగనార్యుని యయాతిచరిత్రమును, కూచిమంచి తిమ్మకవి నీలాసుందరీపరిణయమును. ఈ కంసవిజయమా కావ్యములంత ప్రౌఢముగ గాని, రసవంతముగగాని, మనోజ్ఞముగ గాని లేదు. పోతన చెప్పిన కథాభాగమును శుద్ధాంధ్రముగ వ్రాయుటకు కవి పూనుకొనియు కృతకృత్యుఁడు కాఁజాలకపోయినాడు. ఇందుగతి, సంగతి, రీతి, అప్పుడు, దేవుఁడును, అయావు, సొగసులు, చరించు, ఆచరించి మున్నగు సాంస్కృతికపదప్రయోగము లున్నవి.

పోతన

మ. చెలియల్ గన్నియ ముద్దరా లబల నీసేమంబ చింతించుచు (దశమ. పూర్వ 28)

అని వ్రాసియుండగా నీకవి

మ. చెలియల్ పిన్నది ముద్దరా లెపుడు నీసేమంబులోగుత

అని పోతనామాత్యుని తెలుఁగు నుడికారమునే మక్కికి మక్కిగాఁ బరిగ్రహించినాడు. ఇందు పోతనామాత్యుని పద్యములకుఁ జాల ననుకరణమున్నను కవిత్వము పోతనకవనమంత హృదయంగమముగ లేదు. కొన్ని కొన్ని చోట్ల పండితులనుగూడ నిఘంటుసహాయ మపేక్షింపఁ జేయుచున్నది. గ్రంథము 146 పుటలు. వెల 1 రూపాయి. వలయువారు భారతీగ్రంథమండలి, సత్తెనపల్లి, అని వ్రాసికొనవలెను.

—దివాకర్ల సోమసుందరకవి,

# గ్రంథస్వీకారము

1. కేరళసూత్రములు — 2. కృష్ణశతకము — 3. మంత్రపుష్పత్రయము 4. నారాయణశతకము — 5. తైత్తిరీయస్మార్తబ్రాహ్మణనిత్యకర్మాష్టకము 6. గ్రహస్ఫుటగణితస్వబోధిని — 7. హోరానుభవదర్పణము — 8. ఆబ్దికమంత్రములు — 9. సనాతనధర్మప్రశ్నోత్తరావళి — 10. దాంపత్యము — 11. ఝాన్సీలక్ష్మిబాయి — 12. ఆంధ్రవాఙ్మయసూచిక — 13. జ్యోతి — 14. శ్రీమద్రామాయణతత్త్వజిజ్ఞాస — 15. లలిత — అను గ్రంథములను వందనములతో నందుకొంటిమి. వానిని కాలక్రమమున విమర్శింపగలమని మనవి.

—సంపాదకుడు,



**యువతులకు శరీర పరిశ్రమ:—**

'వెల్తు అండ్ వెల్ ఫేరు' పత్రిక ఇట్లు ప్రచురించుచున్నది:—

"యౌవన ప్రాదుర్భావ కాలమున బాలికల శరీరము పుష్టి నొందించుట చాల ముఖ్యము. యౌవన ప్రాదుర్భావకాలము బాలికలలో బాలురకంటె ముందుగ ప్రాప్తించి కొలదికాలముననే తీరిపోవును. అందుకనే మనవారు ఆడపిల్లను తోటకూర కాడవలె నిట్టె గోముగ నెదిగినదందురు. బాలికయౌవనము పొందుకాలమున ఆమె గుండెలకు, ఊపిరితిత్తులకు విశేషపరిశ్రమ గల్గును. గుండె త్వరగ త్వరగ రక్తమునుశుద్ధిచేసి పుష్టిచేసి దానిని శరీరమున కంతకును సరఫరా చేయవలసియుండును. ఊపిరితిత్తులు విశాలములగును. వాని పెరుగుదలకు ఏ మాత్రము నిరోధము గల్గినను బాలిక క్షయరోగపీడిత యగును. ఈ కారణములచే బాలికలు యౌవనప్రాదుర్భావకాలమున దేహపరిశ్రమ చేసి గుండెకు దార్ఢ్యమును, ఊపిరితిత్తులు విశాలముగ పెరుగుటకు తగిన అవకాశమును కల్గించుకొనవలెను. అయితే బాలికలకు తగిన దేహపరిశ్రమ లేవి అని ప్రశ్నింప వచ్చును. బాలురకు వలె బాలికలకు శరీరపరిశ్రమసాధనముల ఉపయోగము కూడదు. కర్రోడా, బాణా మొదలగునవి వారికి కూడవు. బాలికలు వానిని తేలికగ పట్టి సాము గరిడీలు చేయగల కర్కశగాత్రలు కారు. అదియునుగాక స్త్రీల శరీరమున రక్తము పురుషశరీరముకంటె యెక్కువవేగముగ ప్రవహించుచుండును. కావున వారిద్దఱకు ఒకే మోస్తరు శరీరపరిశ్రమ కూడదు. వారికి పరుగెత్తుట మంచి శరీరసాధనమని డాక్టర్లు పలువురు అభిప్రాయములను తెల్పియున్నారు. 'భారమును త్రోయుట' మొదలగు సాధనములు జబ్బుపుష్టిని తేగలవు. ఈదుట దేహపరిశ్రమలలో నుత్తమమైనది. బాలికలకు గూడ నది తగియుండి సర్వాంగకములకు సంపూర్ణపుష్టిని చేకూర్ప జాలియున్నది."

**జలపానము: దేహశుద్ధి:—**

డిసెంబరు మాసపు 'ఫామిలీ రెవ్యూ' పత్రిక పై విషయమునుగూర్చి ఇట్లు ప్రచురించుచున్నది:—

"చర్మమును తోమి కడిగి నీళ్లుపోసికొనుటవలనిమంచి ఎల్లరకును తెలిసిన విషయమే. దేహము యొక్క బాహ్యాంశుచికి జలము ఎంత అవసరమో లోని భాగములను శుద్ధిచేయుటకు కూడ అది అంత అవసరమే. రాత్రిపరుండబోవునపుడును, పడకనుండి లేచిన తోడను, భోజనమునకు నడుమను ధారాళముగ నీరు త్రాగవలయును. దినదినమును ఆరుగ్లాసులకు తక్కువగాని నీటిని త్రాగవలయును. ఇట్లు త్రాగుచుండుచో మూత్రకృచ్ఛములోని యూరిక్ యాసిడ్డు మొదలగు విషములు కడిగికొని పోవును. రక్తనాళములు సుస్థితియందుండును. మలబద్ధము పోవును. భోజనములకు నడుమ సమృద్ధిగ జలపానము చేయుచో భోజనసమయమున విశేషజలపానము చేసి పదార్థము జీర్ణముకాకుండ చేయు కష్టమునకు దూరులమగుదుము."

## అసమవివాహములు :—

రివరెండు డెజ్మాండు మోర్సు బాయికాట్ దొరవారు 'పియర్సను వీక్లీ' అను పత్రికలోనిట్లు వ్రాయుచున్నారు :—

"ఈ మధ్య వయస్సుచెల్లిన పురుషులు యువతులను పెండ్లియాడుటయు, వయస్సుచెల్లిన స్త్రీలు యువకులను పెండ్లియాడుటయు తఱుచుగ సంభవించుచున్నది. నాయందు బల్లమీదపడియున్న ఒకానొక పత్రికలో షష్టిపూర్తి అయిన పురుషుడొకడు ఇరువదియేండ్లుగల యువతిని వివాహమాడుచున్నట్లు ప్రచురింపబడియున్నది. కొన్ని దినముల క్రిందట ఒక యువకుడు ఏబదిఏండ్లు పైబడిన స్త్రీని పరిణయమాడనున్నట్లు ప్రకటింపబడినది. ఇట్టి అసమవివాహములు వివేకసహితములుగావు. ఇంతటి వయోవ్యత్యాసముగల దంపతులు సుఖజీవనమును పొందగల్గుడురా? వయస్సు గడచిన వారి తలంపులు వేఱు. వయస్సులోనున్న వారి తలంపులు వేఱు. అసమవివాహములు దంపతులను ఆనందదూరులుగా చేయును. నాపరిచితులలో సత్ప్రవర్తనము, ప్రతిష్ఠగల నొక వ్యాపారస్థుడు కలడు. అతడు ముప్పదవపడిలో నుండగా అందకత్తెయగు అరువదియేండ్ల స్త్రీని పెండ్లియాడి బంధుగులకు ఆశ్చర్యము పుట్టించెను. ఆ స్త్రీకి మొదటి మనువువలన తన రెండవ భర్తతో సమవయస్కురాలగు కుమార్తెయుండెను. ఇట్లు అసమవివాహము చేసికొనినను ఆదంపతులు కొంతకాలము సుఖముగనే యుండిరి. ఒండొరుల గాఢముగ ప్రేమించుకొనినట్లుగనే అగుపించిరి. ఆదర్శప్రాయమగు గృహము అనదగినట్లుగానున్న వారి గృహమున వారివారి మిత్రులకు విందులుచేయుచు వచ్చిరి. ఇట్లు కొంతకాలము జరిగెను. కాని అనంతరము ఎందుచేతనో వారికి పొరపొచ్చములు కలిగెను. సాంప్రదాయజీవులగుట వారు విడాకులను పొందలేదు కాని విడిపోయిరి. వారి మనస్సులు పూర్తిగ విరిగిపోయినవి. దీనికి అంతకును పెద్దకారణ మేమియును లేదు. పూర్తి అనుభవము లేమి అతడొకకొంచెము తెలివి మాలెను. వయస్సుగడచిన ఆమెకు అనుమానముగలైను. వారుభయులును సమవయస్కులయి ఉండినచో ఇట్టి వైమనస్యము—ఒకవేళ కలుగుటయే సంభవించినచో—ఇట్లు విడుపాటులో పర్యవసితమైయుండదు. ఒకచిఱుబుస్సు—రూక్షము కాని వాక్కలహము—ఇంతలో అన్యోన్యక్షమా ప్రార్థనము—ఇందుతో యువదంపతుల వైమనస్యము తొలగిపోవును. కాని అసమవివాహములచే బద్ధులైన దంపతుల విషయమట్లు కాదు. ఆవివాహములు అపసవ్యముకొఱకు గావింపబడినవగుట ఆనందమునకు తేజాలవు."

## స్త్రీలు—నాటకరంగము :—

పై విషయమునుగూర్చి జనవరి 23—వ తేదీనాటి 'ఆంధ్రపత్రిక'లో శ్రీయుత వింజమూరి వేంకటలక్ష్మీనరసింహారావుగారిట్లు వ్రాయుచున్నారు :—

"స్త్రీలు నాటకరంగము నెక్కి నాట్యకళను ప్రకటించుట సంఘమునకు దుస్థితియనికొందఱు, ఉన్నతియనికొందఱును జెప్పుచున్నారు. పాశ్చాత్యఖండములో నాటకరంగములందెల్ల స్త్రీలే స్త్రీపాత్రలును, పురుషులే పురుషపాత్రలుగను నుండుచున్నారు. అందు పురుషులు స్త్రీవేషములు వైచుకొనుటయరుదు. ఈన హిందూదేశమందది నిషేధముగాం బరిగణింపంబడుచున్నది. రామాయణములో సీతారాము లొకనాటకప్రదర్శనముం గాంచి నటులును, అందు స్త్రీపాత్రలంగైకొన్న స్త్రీల నైపుణ్యమును గ్రహించి వారు ప్రశంసించినటులును దెలుపంబడియున్నది. హిందూదేశమునం దున్నతస్థితిలో నున్న పార్సీ, మరాటి, బెంగాలీ నాటకసమాజములలో నెక్కుంట స్త్రీలు స్త్రీపాత్రలం గొనుచున్నారు. దానివలన దేశమున కెట్టి చేటును వాటిల్లినట్లు తెలియకున్నది. ఆంధ్రసీమను సురభినాటక సభలుగలవు. అందుభూమికలంగొను స్త్రీలవలనను సంఘమున శీలలోపమును గలుగలేదనియే చెప్పవచ్చునుగదా! ఇటీవల శ్రీమాన్ టి. రాఘవాచార్యులవారు నాటకరంగమున స్త్రీలకుం దావిచ్చుచున్నారు. వారొనర్చుపనింగూర్చి పలువురు పలుతలంపులు వహించుచున్నారు.

నే నీనడుమ ఆచార్యులవారితో సంభాషించుచుండగా మాట్లాడుట తటస్థించినది. అయ్యంశములెల్ల నాటకకళాభి మానుల కందఱకు ముఖ్యములని నాకు దోచుటచే వాని నిందు బొందుపఱచుచున్నాను. మాసంభాషణ మీ క్రిందివిధమున జరిగియున్నది.

నేను—అయ్యా! తాము స్త్రీలే స్త్రీపాత్రములం గైకొన్న గాని, నాటకరంగ మెక్కరాదట. అది నిజమే యగునా?

ఆచార్య—నిజమే. నే నిక నీకృత్రిమ స్త్రీవేషధారుల కృత్రిమ శృంగారమునుజూచి సహింపజాలకున్నాను. నాటక మన్న సంఘస్థితియొక్క యథార్థప్రకటనమేగదా. అట్టి యాదార్థము కృత్రిమవేషధారులచే నెట్లు వెల్లడింపబడగలదు. వెల్లడింపబడకున్న నాటకరంగ మెప్పు డున్నతింగాంచును?

నేను—నిజమే. యథారూపమున నాటక ప్రదర్శనములు గావింపవలయునన్న దను పద్ధతియే యవలం బింపవలయును. కాని యది సాధ్యమా? తమ బోంట్లతో నాటకరంగ మెక్కదగిన స్త్రీలు గుణవతులై యుండ వలయునుగదా. తమకట్టి యుత్తమగుణవతు లెట్లులభింతురు?

ఆచా—గుణవంతురాండ్రు లభింపవలయుననుట ముఖ్యమే. కానియొకతె గుణవతియగునో కాదో తెలిసికొనుట కష్టముగదా! అందుచే కులస్త్రీలు లభించిన జాలునని తలచుచున్నాను.

నేను:—పురుషులలో నీతితప్పి చరించువా రెందఱు ఘనులతోగూడి నాటకరంగముల నలంకరించుట లేదు? వారి నెవ్వరైన నధిక్షేపించిరా? అటులే నీతిరహితలైన స్త్రీలును రంగస్థలమున నేల నిలువరాదు?

ఆచా:—నిలువవచ్చును. పురుషులు పురుషులతోగూడి నాట్యరంగముల నున్నప్పుడందు నీతిదప్పి యున్నవా రున్నను గీడురాదు. స్త్రీలును బురుషులును జేరియుండుసంఘములలో నీతివిరహితలవి ప్రసిద్ధిగన్న వారలున్న సంఘము చెడిపోవును. అక్కారణముననే కులస్త్రీలున్న జాలునంటిని. వారియందును నవినీతి యిమిడియున్న మనము చేయునదిలేదు.

నేను:—సరియే, తమకట్టి కులస్త్రీలు తగినంతమంది లభింతురా?

ఆచా:—ఎందఱు లభించిన నంద ఱుచాలును. నాయాశయము నిర్వహించుకొనుటయే నాతలంపు.

నేను:—కొందఱులభింతురే యనుకొనుడు. వారికేకేట సంతానముగల్గుచున్న మీనాట్యకళాభివృద్ధికి నడ్డంకిగల్గునుగదా అదియెట్లు సాధించుట?

ఆచా:—అదియు నాలోచింపదగినవిషయమే. కేవల విషయసుఖముల కాశింపక నాటకకళనే వృద్ధిపరచు టకుఁబూనుకొని యుండు దంపతులు కొందఱు కావలసియున్నారు. పాశ్చాత్యదేశములలో నట్టి దంపతు లెందఱో యుందురు. వారు పెండ్లియాడునప్పుడే యట్టి యాశయములను వహించియుందురు.

నేను:—మన దేశమున నట్టివారు మీకు మందునకైన దొరకుదురా?

ఆచా:—దొరకకున్న సృష్టింపవలయును. అసంభవ మెద్దియును గాదుగదా?

నేను:—ఎవరోయొకరు ఘనులు ముందుగా నట్టి దాంపత్యమునకు దారిచీసినగదా యితరులు దాని నవలంబించుట?

ఆచా:—ఎవరోయననేల? నేనే యందులకు సిద్ధముగానున్నాను. నాయర్ధాంగి నా కనుమతికూడ నిచ్చి యున్నది. నాట్యకళయం దభిమానముగలిగి కేవలము తత్కళాభివృద్ధియే తన జీవితపరమావధిగ నెంచు వనితా రత్న మెవ్వతియేనియున్న ఆమెను వివాహమాడి నేనే తక్కుంగలయాంధ్రలోకమునకు నాదర్శభూతుఁడనై యుందును.

నేను:—తమపూనిక చాలఁ గొనియాడఁ దగియున్నది. తమ యాశయముల కనువగు వధువుకొఱకుఁ దామేల పత్త్రికలలోఁ బ్రకటనముసల్పరాదు?

ఆచా:—పత్త్రికా ప్రకటనమేల? మీబోంట్లతోఁ జెప్పిన లోకములో వ్యాపింపదా? నా ఆశయము నెఱవేఱదా?

నేను:—తాము సంకల్పసిద్ధులు. తమ యాశయ మతిష్పక నెఱవేఱఁగలదు.

ఆచార్యులవారి యాశయము మిగులఁగొనియాడదగినది. అట్టి యుత్తమాశయము గల్గువారలు కొందఱు మన దేశమున నుందురేని, నాట్యకళ నూత్నాలంకారములతో శోభగాంచఁగలదని దృఢముగా నమ్మవచ్చును. తదాశయము నెఱవేర్పుగాక అని యీశ్వరుం బ్రార్థింతును.”

## 1929–వ సంవత్సరమున ఆంగ్లస్త్రీల అభివృద్ధి:—

‘అమృతబజారుపత్రిక’ ఇట్లు ప్రకటించుచున్నది:—

“1929–వ సంవత్సరమున ఆంగ్లస్త్రీల అభివృద్ధి ప్రోత్సాహకరముగనున్నది. పురుషునితో సమానస్వాతంత్ర్యమును పొందుప్రయత్నములో వారీవత్సరము చెప్పదగినంత అభివృద్ధిఁగాంచిరి. ముందు రాజకీయాభివృద్ధి గమనింతము. అన్ని విషయములకంటెను రాజకీయముగ 1929–వ సంవత్సరమున ఆంగ్లస్త్రీలు ఎక్కువ అభివృద్ధి చూపిరి. మే మాసమున జరిగిన ఎలక్షనులలో పురుషులతోబాటు స్త్రీలుకూడ ఇరువదియొక్క సంవత్సరముల వారును, అంతకు పైబడిన వయస్సుగలవారును మొట్టమొదటిసారి ఓటు వేసిరి. పార్లమెంటు ఎన్నికలకు అరువదియెనమండుగురు స్త్రీ అభ్యర్థినిలు నిలిచిరి. ఇంతమంది ఇదివఱకెన్నడును నిలిచియుండలేదు. ఈ నిలచినవారిలో పదునలుగురు స్త్రీలు జయముగాంచిరి. ఇంతమంది స్త్రీలు ఒక్కసారిగా ఇదివఱకెన్నడును పార్లమెంటున కెన్నుకొనబడలేదు. వీటిఅన్నిటికంటెను ఎన్నతగిన విషయమేమన మార్గరెటుబొండుఫీల్డుకన్య లేబరుమంత్రివర్గమున నొకమంత్రిణిగా నియమింపబడుట. స్త్రీలు కాబినేటులో ప్రవేశించుట కిదియే ప్రారంభము. రాజకీయము వదలి ఇక విమానయాత్రా విషయమునకు వత్తము. బెడ్‌ఫోర్డు జమీందారిణి విమానముమీద లండనునుండి కరాచీకిని, కరాచీనుండి లండనుకును అనగా తొమ్మిదివేలమైళ్లు ఏడున్నరదినములలో ప్రయాణముసల్పె ఇది ఇంతవఱకు జరిగిన విమానయాత్రలలో ఎన్నికగన్నయాత్ర అనిపించుచున్నది. ఇక మోటారు చోదన విషయము పరిశీలింతము. దారుణవేగమున మోటారులు నడుపుటలో కొందఱు పేరుగాంచిరి. వయొలెట్ కార్డ్రకన్య; ఎవిలెన్ కార్డ్రకన్య అను అక్కచెల్లెండ్రు—మోటారుచోదనమున పేరుమోసినవారు—బ్రూక్‌ల్యాండు చుట్టును ముప్పదివేలమైళ్లు ముప్పదివేలనిముషములలో అనగా నిముషమునకు మైలువంతున నడిపిరి. డాక్టరు బ్రూసుగారి సతి అరనిముసమేని విశ్రాంతి తీసికొనక ఇరువదినాలుగు గంటలకాలము తోడు లేక ఏకటానికీ రెండువేలరెండువందల మైళ్ల దూరము మోటారున ప్రయాణముచేసినది. గంటకు తొంబది మైళ్లవంతున ప్రయాణముసల్పిన దన్నమాట. ఇక సారస్వతవిషయమున పరిశీలింతము. ఆక్సుఫర్డు విశ్వవిద్యాలయమువారి యాజమాన్యమున నిర్వహింపబడుచు మంచిపద్యము వ్రాయువారికి ఏటేట ఈయబడు న్యూడిగేటు బహుమానము ఈసంవత్సరము హార్టునాట్ కన్య బడసినది. ఈబహుమానము మూడుసంవత్సరములుగా స్త్రీలకే వచ్చుచున్నది. ఈ సంవత్సరమున స్త్రీలకు క్రొత్త డిపార్టుమెంటులలో ఉద్యోగములు లభించినవి. స్టెల్లాగేలుకన్య—ఇరువదియొక్క సంవత్సరముల యువతి—డివన్‌షైరులోని పెయిటనున హార్బరు అధికారిణిగా నియమింపబడినది. బ్రిటనుదేశమున ఇట్టి విధమగు అధికారమున నున్న స్త్రీ ఈమె ఒక్కతియే. అక్టోబరుమాసమున విల్డాబూత్ సతి మోటారునడిపి జీవితము గడుపుటకు లైసెన్సు పొందినది. ఈ విధమైన లైసెన్సు పొందుటకు ఈమె తొలుతటిది. డి. యూఫరుకన్య స్త్రీ ప్రయాణీకులకు వలయు సౌకర్యములను కల్గించు ఉద్యోగిముగ నియమింపబడినది. ఎంజనీరింగు శాఖయందుకూడ స్త్రీలు ముందుకువచ్చిరి. వినిఫ్రెడు హ్యాకెట్టుకన్య — ఇరువదిమూడువత్సరముల యువతి—బర్మింగుహ్యాం విశ్వవిద్యాలయమున ఎలక్ట్రికల్ ఎంజనీరింగు శాఖలో పురుషులనందఱిని అతిశయించి స్కాలరుషిప్పు నొందినది.”




రాజమహేంద్రవర స్త్రీ సనాతన విద్యాలయము :—

1928—వ సంవత్సరము మే 10—వ తేదీని నెలకొల్పబడినది. ఆంధ్రదేశమున రాజకీయప్రచారమునందు పట్టా పొందిన జాతీయవాదిని దువ్వూరి సుబ్బమ్మగారు నెలకొల్పిరి. ఒక ఉపాధ్యాయుడు; ముగ్గురు విద్యార్థినిలు. అల్పారంభము శుభప్రదము అయినది. ఏడాదికి ఎదురునడచిన బిడ్డవలె ఈ విద్యాలయకిశోరము ఏడాదినాటికి తొంబదిమంది బాలికలతో, అయిదుగురు ఉపాధ్యాయులతో, ఒక ఉపాధ్యాయినితో పుష్టినొందినది. కాని ఆర్థికపుష్టి అంతగా చేకూఱలేదని విందుము. "పురమును గట్టుటకు కురువంశాంకురము శంకుస్థాపనము చేసిన శుభముహూర్త మెట్టిదో? కావ్యనిర్మాణము చేయ రాజరాజనరేంద్రుడు నన్నయమహాకవిని పసుపుం బిళ్లారి పూజించిన సుముహూర్త మెట్టిదో? అప్పటినుండి రాజమహేంద్రవరమున సిరియు వాణియు నెల్లప్పుడు వసించుచుండు"నను కవిలోకగ్రామణి వసురాయని వాక్యములకు విపర్యాసము వాటిల్లరాదు. కావున ఉచితజ్ఞులగు రాజమహేంద్రవరపౌరులును, ఉభయగోదావరీ మండలవాసులును పూనుకొని ఈవిద్యాలయమునకు పుష్కలముగ ధనముచేకూర్చి సిరియు వాణియు నొక్కచో నుండునట్లు చేయగోరెదము. మా కోరిక తప్పక నెఱవేఱగలదని నమ్ముచున్నాము. ఏ మందురా? డిసెంబరు 19—వ తేదీని జరిగిన ఏతద్విద్యాలయ వార్షికోత్సవమునకు అధ్యక్షత వహించి దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు విద్యాలయమును ఆశీర్వదించి అయిదువందల రూప్యములు విరాళమొసంగిరి. విశ్వదాతయొక్క భూరివిరాళమును, విమలాశీర్వాదమును పొందిన ఈ విద్యాలయము లక్ష్మీసరస్వతులకు క్రీడారంగమై వెలయుననుటలో సందియములేదు.

### చల్లపల్లి రాజావారి స్త్రీవిద్యాభిమానము :—

దేవరకోట సంస్థానాధీశులగు శ్రీమంతు రాజా యేర్లగడ్డ శివరామ ప్రసాదు బహద్దరుగారి పరిణయమహోత్సవమును, పట్టాభిషేకమహోత్సవమును గడచిన డిసెంబరుమాసమున చల్లపల్లిలో నితాంతవైభవముతో జరిగినవి. తత్సందర్భమున రాజా వారు కవులను, గాయకులను, పండితులను అపూర్వముగ సన్మానించినారు. అందుకు మేము వారిని మనఃపూర్వకముగ అభినందించుచున్నాము. అయితే గృహలక్ష్మీసంపాదకులమగు మేము ఈ సత్కారావసరమున గమనించిన ముఖ్యవిషయము శ్రీవారి స్త్రీవిద్యాభిమానము. ఏలూరులోని శ్రీమాగంటి అన్నపూర్ణాదేవి విద్యాలయమునకు వేయి న్నూట పదునారు రూపాయిలును; గుంటూరులోని శారదానికేతనమునకు వేయిన్నూట పదారురూపాయిలును; రాజమహేంద్రవరమునందలి దేశబాంధవి దువ్వూరి సుబ్బమ్మ గారి బాలికా విద్యాలయమునకు మూడువందలఅరువది రూపాయిలును; బెజవాడలోని మహిళాసమితికి నాలుగు వందలరూపాయిలును ఇచ్చి శ్రీరాజావారు తమ స్త్రీ విద్యాభిమానమును లోకమునకు ఎఱుకచేసిరి. శ్రీ చల్లపల్లి రాజావారినంటి శ్రీమంతులగు ఉదారులు చేయూత నిచ్చినచో ప్రస్తుతము అడుగున బడియున్న స్త్రీయుద్యమములు అచిరకాలముననే శిఖరావలంబులు కాగలవు. శ్రీరాజావారు చిరకాలము ఆయురారోగ్యైశ్వర్యములతో తులతూగుచు ఆంధ్రస్త్రీల పురోభివృద్ధికి ఎల్లవేళలతోడ్పడుటకు ఈశ్వరశక్తి అనుగ్రహించునుగాక !

### గోహరుజానుకన్య నిర్యాణము :—

నివాసము కలకత్తా నగరముననే. అయినను ఆమెకీర్తి కాశ్మీరము మొదలుకొని కన్యాకుమారివఱకు పరివ్యాప్తమైనది. కారణమేమి? సర్వవశ్యకరమైన సంగీతకళలో ఆమె అందెవేసిన చేయి అగుటయే. లలితకళలను ప్రోత్సహించుటయందు భారతదేశములోని తోటి సంస్థానములకు మార్గదర్శిత్వము వహించుచున్న మైసూరు సంస్థానమునందు రాజభవనమున గాయకురాలుగానుండి ఈమె నెలకు అయిదువందల రూప్యముల వేతనమును గొనుచుండినది. జనవరిమాసము రెండవవారమున నిమోనియా వలన చనిపోయినది. ఆమె మరణమువలన భారతగాయనీలోకమున నొక అనర్ఘరత్నము రాలిపోయిన దనుటలో సందియములేదు. ఆమె పవిత్రాత్మకు శాంతి చేకూఱుగాక !

పాలితప్రతిజ్ఞయగు శాన్నో దేవి:—

"ఏ దేశము ఒక స్త్రీ వ్యక్తిని విద్యకు అధిష్ఠాన దేవతగా నిల్పి సేవించుచు గణనాతీత కాలమునుండియు స్త్రీవిద్యకు అత్యంత ప్రాధాన్యత నిచ్చెనో అట్టి భారతదేశమున గల స్త్రీ విద్యాప్రతిష్ఠాపనములలో పంజాబునందలి జలందరు పట్టణములోని కన్యా మహా విద్యాలయము నాయకరత్నము. శ్రీమతి శాన్నోదేవియను విద్యాధికురాలు ఆసంస్థకు ప్రధానోపాధ్యాయిని. తనవిద్యాలయమునకు ఒక లక్షరూప్యములు వసూలుచేయ నామెసంకల్పించినది. ఇట్టి సంకల్పములు స్త్రీవిద్యాలయ నిర్వాహకురాండ్రకు ఇతరులకుగూడ నుండుటలో విచిత్రమేమియును లేదు. అయితే శాన్నోదేవి సంకల్పములో నొక విశేషము. తాను సంకల్పించిన లకారము చేకూర్చుకొని గాని విద్యాలయముయొక్క గడపత్రొక్కి చూడనని ఆమె శపథము పూనినది."అని 1929 సంవత్సరము జూలై మాసపు గృహలక్ష్మిలో ఆలోచన అను శీర్షిక క్రింద ప్రస్తావించియున్నాము. ఇప్పుడు శాన్నోదేవి తన శపథమును నెఱవేర్చుకొనివచ్చి తన విద్యాలయమున ప్రవేశించినది. ఆమె హిందూదేశమున అరువదిఅయిదు వేలును మిగిలినసొమ్ము ట్యాంగనికా దేశమునను సేకరించుకొని వచ్చినది. చెప్పినంతచేయు ఇట్టి స్థిర ప్రజ్ఞగల స్త్రీరత్నములు భగీరథుడుపుట్టిన ఈ భారతభూమియందుకూడ తక్కువగానే యున్నారు. ప్రజ్ఞావతులగు ఆధునిక భారతస్త్రీలోకమున శాన్నోదేవి నామము శుక్రతారాసదృశముగ వెలయ గలదు.



శాన్నోదేవి

వివేకానందులవారి జన్మదినోత్సవము:—

ఆధునిక కాలమున ఆత్మమతప్రతిభను దిగంతములు మాఱుమ్రోగునట్లు ఊదిన బూరగొమ్మయగు శ్రీస్వామి వివేకానందులవారి అరువదిఎనిమిదవ జన్మదినోత్సవము గడచినమాసము ఇరువది ఒకటవ తేదీని సేతుశీతనగవ్యాప్తమగు భారతవర్షమునయథోచిత వైభవములతో జరుపబడినది. జీవించిన కొద్దిదినములు అతిలోకముగ జీవించిన మహనీయులను స్మరించుట అనగా వారి ఆదర్శములను జ్ఞప్తికెలయించుకొని తదనుసరణమున నడచుట అన్నమాట. 'వివేకానందస్వామి' అనుశబ్దము వీనులపడినతోడనే ఆతడు

భారతస్త్రీజనోద్ధరణకై చేసిన ప్రచారమంతయు ఒకసారి మానసవీధిని పొడగట్టును. ఆతడు ఒకానొక సమయమున పల్కిన ఈవాక్యములు గమనింపుడు. "ఓభారతయువతీ మణులారా! మీరు సీత, సావిత్రి, దమయంతి పుట్టినజాతియందు పుట్టితిమనుసంగతిని విస్మరింపకుడు. కాంక్షయున్నదా మీరుకూడ అంతటివారు కాగలరు. అంతటి మహత్తర కార్యములను చేయగలరు. మీరు వీరమాతలుగండు. భారతదేశముయొక్క భావి మీ మీద ఆధారపడియున్నది." ఆమహనీయుని ఈవాక్యములు తలుచు స్మరించుకొనుచు భారతస్త్రీలు విధ్యుక్తకార్యములయందు వ్యగ్రహృదయ లగుదురుగాక! స్వామివారిపవిత్రాత్మ భారతస్త్రీజనాభివృద్ధి హుటాహుటినడలతో సాగునట్లు దివ్యాశీస్సులవర్షించును గాక!

## అఖిలభారతస్త్రీజనసభ : నాలగవసమావేశము :—

బొంబాయినగరమున జనవరి ఇరువది తేదీ మొదలు ఇరువదియైదవ తేదీవఱకు కూడిన అఖిలభారత స్త్రీజనసభయొక్క చతుర్థసమావేశము అనేకవిషయములచే ప్రాముఖ్యము వహించుచున్నది. ఈసభయొక్క తొలిసమావేశము పూనానగరమునను, రెండవ సమావేశము ఢిల్లీనగరమునను, మూడవసమావేశము పాట్నానగరమునను, జరిగియున్నవి. పీష్వాల రాజధానియగు పునహాపట్టణము—కురురాజుల కొలారమగు ఢిల్లీపట్టణము—పాటలీపుత్రమునకు పర్యాయాభిదానమగు పాట్నాపట్టణము—వీని నామములయందే ప్రాచీనముద్రపడియున్నది. బొంబాయి నిన్న మొన్నటి పట్టణము. ప్రాచ్య పాశ్చాత్యకళాసంఘట్టనకు ఆలయము. నవీన వాతారణమునకు అనువగు సందేశములు పుట్టగల సారభూమి. కావుననే బొంబాయియందు కూడిన ఈసమావేశమున చేయబడిన తీర్మానములు ఆధునికభారతస్త్రీలోకమును కలగుండు వెట్టుచున్న సమస్యల నెన్నిటినో పరిష్కరించినవి. ఇంతమాత్రమకాదు. ఈఅఖిలభారత స్త్రీసభయొక్క ప్రథమ సమావేశము బరోడా మహారాణిగారి అధ్యక్షతక్రిందను, ద్వితీయ సమావేశము భూపాల్ బీగమువారి ఆధిపత్యముక్రిందను, తృతీయ సమావేశము మండిరాణివారి యాజమాన్యము క్రిందను నిర్వహింపబడినవి. ఈమారీసభకు ఒక రాజవంశకాంతగాక సామాన్యసంసార స్త్రీయగు సరోజినిదేవి అధ్యక్షత వహించినది. ఇది భారతస్త్రీలు ఆత్మవిశ్వాసమును గోల్పోనుచున్నారనుటకు ప్రబల నిదర్శనము. సాధాణరముగ సభలనిన ఉపన్యాసము లిచ్చుట, చప్పట్లు చరచుట, చర్చలుచేయుట, తీర్మానములు గావించుట వీనితో సరిపోవుచున్నది. ఈసభ అట్లుగాక కార్యోత్సాహమును ప్రేరేచు క్రమమును నవలంబించినది. ఉదయముపూట సభాసమావేశము. సాయంకాలములయందు స్త్రీవిద్యాసంస్థలకు, సేవాసదనములకు, శిశుసంరక్షణాలయములకుపోయి అచ్చటి మంచి చెడ్డలను విమర్శించి వచ్చుట. కబుర్లు, కార్యము ఇట్లు అర్ధసమాగము నొందినవి.

# విదుషీమణులకు మనవి

అమ్మా!

ఇటీవల మద్రాసులో జరిగిన స్త్రీలసభలోనేమి, లాహోరునగరమున జరిగిన ఆర్యమహిళా సభలోనేమి ప్రస్తుతపరిస్థితులలో భారతదేశమున వివాహావిమోచన (అనగా విడాకు లిచ్చుకొనుట) చట్టము పుట్టవలయునని చర్చలు చేసిరి; తీర్మానములు గావించిరి. ఈ విషయము ముఖ్యముగా స్త్రీలకు సంబంధించినది. దీనినిగూర్చి మంచిసెబ్బరలు బాగుగా ఆలోచించి అట్టి చట్టముయొక్క ఆవశ్యకత అనావశ్యకత చర్చించి తుదినిర్ణయము కావింపవలసినభారము మీపై నున్నది. కావున ఇందునుగూర్చిన మీ అభిప్రాయము పదిపది హేను పంక్తులకు మించకుండవ్రాసి ఫిబ్రవరి 10-వ తేదీలోపున మాకార్యాలయమునకు బంపగోరెదము. వానినెల్ల క్రోడీకరించి మార్చిమాసపు గృహలక్ష్మి సంచికలో ప్రచురింతుము. ఈ మా మనవి ఆంధ్రదేశమునందలి విదుషీమణులెల్ల చిత్తగించి తీర్తురని విశ్వసించుచున్నాము.

ఇట్లు
సంపాదకుడు.

## గృహలక్ష్మికార్యాలయము

పోస్టుబాక్సు నెంబరు, 752
ఎగ్మూరు, మదరాసు.

# గృహలక్ష్మి

ఏజెంట్లు

| | |
|---|---|
| తెనాలి: | కొమ్మూరి కాశి విశ్వనాథంగారు, జనరలు మర్చంటు. |
| బళ్లారి: | వి. రాజు మొదలియార్ & సన్సు, కారుస్ట్రీటు, బ్రూసుపేట. |
| రాజమండ్రి: | ఆంధ్ర రంగారావుగారు, ఉల్లితోట వీధి |
| కాకినాడ: | కే. సర్వేశ్వరరావుగారు, జగన్నాయకపూరు. |
| నెల్లూరు: | ఎం. రామకృష్ణరావుగారు, 1256, ఎం. వి. అగ్రహారం. |
| బెజవాడ: | నామల అంతోని. |
| | దాసు హృషీకేశరావ్, బక్కింగ్‌హాముపేట. |
| ఛత్రపురం: | నేమాని వాసుదేవమూర్తి, సెక్రెటరీ, పరమేశ్వరి విలాస్. |
| గుంటూరు: | సి. వి. సుబ్రహ్మణ్యంగారు, మెంబరు, Dt. ఎడ్యుకేషనల్ కౌన్సిలు. |
| మచిలీపట్టణము: | కె. బాలకృష్ణ, ఫోటో ఆర్టిస్టు, కొజ్జిల్లిపేట. |
| తిరుపతి: | వై. వి. సుబ్బయ్య & కంపెని, వెంకటేశనివాస్. |
| పిఠాపురం: | ఏ. వి. శాస్త్రి, కవితావిలాస్. |
| హైదరాబాదు (దక్కను:) | ఎన్. గౌరీ శంకరవర్మగారు, 566 రెసిడెన్సీ బజారు. (మన ప్రాంత్యపు 1 రూ ఉస్మానియా రూ 1-3-0 అగును) |
| వాల్టేరు: | పి. తారనయ్య, అల్లిపురం, వాల్టేరు. |
| మదరాసు: | జె. కాశిరావుగారు. |
| | మదరాసు న్యూస్ ఏజన్సీ, మౌంటురోడ్డు. |
| అమలాపురం: | కె. వి. కృష్ణరావుగారు, కె. అగ్రహారం. |
| నిడదవోలు: | టి. కుటుంబ శాస్త్రిగారు. |
| ఏలూరు: | బి. హెచ్. శ్రీకృష్ణమూర్తిగారు. |
| చికాకోలు: | తాటిగడప మాణిక్యరావుగారు. |
| కడప: | మిత్రాకంపెని, యాదెల్ల వెంకటాచలం వీధి. |
| పాలకోట. | వేమరాజు నరసింహంగారు, హెడ్మాస్టరు, మట్టపట్టు. |
| ఎలమంచిలి: | మంత్రిప్రెగడ భావనారాయణగారు, కవితాసమితి. |
| కాకరపట్టు: | కే. సత్యనారాయణగారు, సరస్వతిగ్రంథమాల. |

ఇతర చోట్లకు ఏజంట్లు కావలెను. వివరములకు ధరఖాస్తు పంపుకొనుడు.

"గృహలక్ష్మి" తపాలాపెట్టె నెం. 752, ఎగ్మూరు, మదరాసు.

# రజోదర్శిని

తిమ్మసముద్రము

ఆర్యా. 28—5—29

"………మీరు పంపిన 'రజోదర్శిని' మాత్రలు అనుకొనినంత గొప్పపని చేసినవని తెలుపుటకు సంతసించుచున్నాను. 5 సంవత్సరములుగా రజస్వలకానటువంటి స్త్రీ అనేకౌషధములవల్ల నయములేక విసిగి నాతో సంప్రతించగా మీ 'రజోదర్శిని' ఒక బుడ్డి తెప్పించి యిచ్చితిని. ఈ బుడ్డి మాత్రలు పూర్తిగా అయిపోకమునుపే నిన్నటిదినం బయటచేరినది. తిరిగి రెండుబుడ్లు పంపగోరుతాను.

చిత్తగించవలెను

ఎ. పి. శర్మ.

రజోదర్శిని స్త్రీలకు గలుగు రజసంబంధమైన సమస్తవ్యాధులను నివారించును. రజఃకాలమున గలుగు కడుపునొప్పి, రజోదర్శనము కాకుండుట, స్వల్పముగా వెడలుట, మలబద్ధము, కడుపులో పోట్లు, మొదలగు బాధలను పోగొట్టి, గర్భాశయమునకు బలమును గూర్చును—స్త్రీలకు పెన్నిధి వంటిది.

వెల 50 మాత్రలు రు 2.

## ఆర్షరసాయనశాల

(ముక్త్యాల కృష్ణా.)